


Printed and published by Sri C. ANNA RAO, B.A., Executive Officer
under the authority of Board of Trustees
Tirumala-Tirupati Devasthanams, Tirupati.

శ్రీమతే రామానుజాయనమః.

భగవన్నిర్హేతుకజాయమాన కటాక్షలబ్ధ దివ్యజ్ఞానముగల

నమ్మాళ్వార్లు ప్రసాదించిన

# తిరువాయ్మొళి.

అపారకరుణాసాగరులైన పెరియవాచ్చాన్పిళ్ళై మొదలగు

పూర్వాచార్యులు ప్రసాదించిన వ్యాఖ్యానాదుల ననుసరించి

తర్కతీర్థులైన శ్రీమాన్, శిఙ్గప్పెరుమాళ్ కోయిల్

మాడభూషి - రామానుజాచార్యులవారిచే

రచియింపఁబడిన

## ప్రతిపద టీకా తాత్పర్య సహితము.

శ్రీతిరుమల-తిరుపతి దేవస్థానముల కమిటీ అధ్యక్షులగు

శ్రీమాన్ కె. వేంకటస్వామినాయుడు బి.ఏ., బి.ఎల్., యం.యల్.సి.

గారి ప్రోత్సాహముపైన

శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయములో పండితులుగానుండు

శ్రీమాన్ టి. ఏ. కృష్ణమాచార్యులు శిరోమణిగారిచే

పరిశోధింపఁబడి

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల కమిషనరు

శ్రీమాన్ సి. అన్నారావు బి. ఏ. గారిచే

ప్రకటింపబడినది

తిరుపతియందలి

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది

1950

#  సూచన.



⁂ ఈ సఙ్కేతము, ౨ - వ, ఆవృత్తిసేవింపందగిన పాశురములను చూపించును.

* ఈ సఙ్కేతము, అధ్యాపకులు సేవాకాలమందు నిలువతగిన స్థానమును చూపించును.

( ) ఈ సఙ్కేతముయొక్క మధ్యయందు వ్రాసినయర్థము కొన్ని చోట్ల ముందుచెప్పినయర్థమునకు వివరణముగా నుండును; కొన్నిచోట్ల పూర్వోత్తర పదార్థసన్దర్భపూరణార్థమై యుండును.

ఈ గ్రన్థము కావలసినవారు, తిరుమల-తిరుపతి దేవస్థానం కచ్చేరివద్దను, దేవస్థాన ధర్మ సత్రమునందు, దేవాలయములందు నిర్మింపబడిన బుక్‌స్టాలు యందును క్రయమునకు పొందవచ్చును.



పయనన్ఱాగిలుమ్ పాఙ్గలరాగిలుమ్,
శెయల్ నన్ఱాగ త్తిరు త్తిప్పణికొళ్వాన్,
కుయిల్ నిన్ఱార్ పొఴిల్ శూఴ్ కురుగూర్ నమ్బి,
ముయల్గిన్ఱే నున్ఱన్మొయ్కఴఱ్కన్బైయే.

శ్రీ

శ్రీపద్మావతీసమేత శ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రీమతే శఠగోపాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# "ఉపోద్ఘాతము"



శ్రీవేంకటాద్రినిలయః కమలాకాముకః పుమాన్ ।
అభంగురవిభూతిర్నః తరంగయతు మంగళమ్॥
యస్య సారస్వతం స్రోతో వకుళామోదవాసితం ।
శ్రుతీనాం విశ్రమాయాలం శఠారిం తముపాస్మహే ॥

"తొణ్డర్కముతు" "భక్తామృతమ్" అని ప్రసిద్ధిచెందిన శ్రీమచ్ఛఠగోప దివ్యసూరీశ్వరుల వాఙ్మయమగు నీ "తిరువాయ్‌మొழி" (శ్రీసూక్తిసుధ) భగవన్నిర్హేతుక దివ్యకృపాకటాక్ష మథితంబగు శ్రీ జగదాభరణుల దివ్యహృదయమను దుగ్ధార్ణవమునుండి భగవదనుభవ పరీవాహరూపముగ నావిర్భవించినది. ఈ దివ్యప్రబన్ధము ద్రావిడభాషయందేగాక సమస్తవాఙ్మయప్రపంచమునందును నిరుపమాభ్యధికమగు గ్రంథరాజము.

ప్రపన్నజనకూటస్థులగు శ్రీనమ్మాళ్వారులు ప్రసాదించిన నాలుగుదివ్యప్రబంధములును నిత్యనిర్దుష్టములై, అపౌరుషేయములై, స్వతఃప్రమాణభూతములగు ఋగ్యజుస్సామాథర్వణములను సంస్కృతవేదములవలె సర్వోత్కృష్టములై విరాజిల్లుచున్నవి. అందు నూరు పాశురములతో నొప్పారు 'తిరువిరుత్తము' ఋగ్వేదసమమనియు, ఏడుపాశురములతో నలంకృతమగు 'తిరువాశిరియము' యజుర్వేదసమమనియు, ఎనుబదిరెండు పాశురములతోసమ్పన్నంబగు 'పెరియ తిరువన్దాది' అథర్వణవేదసమమనియు, వెయ్యిన్నూటరెండుపాశురములతో విశిష్టమై సకలప్రబన్ధమూర్ధన్యంబై విరాజిల్లు 'తిరువాయ్‌మొழி' సామవేదసదృశంబనియును బాహ్యాభ్యన్తరనిమిత్తములఁబరామర్శించి సహృదయశేల్లజులగు నాచార్యవర్యులు ఉపపాదించియున్నారు.

"వేదానాం సామవేదోఽస్మి" అనునట్లు సంస్కృతవేదములలో భగవత్తాదాత్మ్యాపన్నమైన సామవేద మెట్టుల భగవన్ముఖోల్లాసకరమై సర్వలక్షణసమువేతమై సర్వశ్రేష్ఠమై యలరారుచున్నదో; అట్లే ద్రావిడవేదచతుష్టయమున నీ **తిరువాయ్మొఴి** భగవదత్యన్తముఖోల్లాసకరమై విగతసమానాధిక నిరుపాధిక వైభవోపేతమై విలసిల్లుచున్నది.

సంస్కృతవేదములకు శిక్షావ్యాకరణాదులవలె నీ ద్రావిడవేదములకును ఆఱఙ్గఙ్గూఱియతిరుమంగైయాళ్వార్లు సాదించిన "(౧) పెరియతిరుమొఴి (౨) తిరుక్కుఱున్దాణ్డకము (౩) తిరునెడున్దాణ్డకము (౪) తిరువెఴుకూత్తిరుక్కై (౫) శిఱియతిరుమడల్ (౬) పెరియతిరుమడల్" అను ఆఱంగములును నమరి యున్నవి. మఱియు సంస్కృతవేదములకు మీమాంసాన్యాయ పురాణాదులవలె నీ ద్రావిడవేదములకును తక్కిన యెనమండ్రాళ్వారులు కృపజేసిన దివ్యప్రబన్ధములు ఉపాంగములుగానున్నవి. "ఏతత్సామ గాయన్నాస్తే" అని సామవేదమెట్టుల సంగీతప్రధానమై శ్రవణసుభగమై పరమభోగ్యముగనున్నదో; అట్టులనే "పణ్ణార్ పాడల్" "పణ్పుడై వేదమ్" "ఇశైయొడుంపణ్ణిల్ పాడవల్లారవర్ కేశవర్ తమరే" అని ఈ తిరుమొఴియు దివ్యగానప్రధానమై సర్వప్రాణిహృదయంగమమై పరమశ్రావ్యమై పరమభోగ్యముగ భాసిలుచున్నది. "ఋచస్సామరసః" అనునట్లు ఋగ్వేదము గానరసవిశేషములచేతను "హావ్ హావ్ హావ్" మొదలగు స్తోభములచేతను సామవేదముగనెట్లు విస్తరింపఁబడినదో; అట్టులనే తిరువిరుత్తము "ఇశైకూట్టి" అనురీతిగ దివ్యగానరసవిశేషక్రమములఁజేర్పగా "అమర్ శువైయాయిరమ్" అనునట్లు వేయి పాశురములుగల **తిరువాయ్మొఴి** దివ్యప్రబంధముగా విస్తృతమయ్యెను.

"వేదరూపమిదం కృతమ్" "ద్రామిడీం బ్రహ్మసంహితామ్" "ద్రావిడవేదసూక్తైః" "వేతమ్ తమిఴ్ శెయ్‌త మాఱన్" అనునట్లు ఆళ్వారుల ద్రావిడ దివ్యప్రబంధములు సంస్కృతవేదములతోడను తదుపబృంహణములతోడను సమానములై యుండుటచే నావేదములకు ఉదాత్తానుదాత్త స్వరితప్రచయ స్వరములు, పదక్రమజటాఘనాదులు, ప్రశ్నాష్టకములును, తదుపబృంహణములకు — అంశపర్వస్కంధాదిభేదములు పదవాక్యపాదవృత్తకాండాధ్యాయాదులును నుండునట్లు; వీనికిని ఎఴుత్తు (హ్రస్వదీర్ఘాద్యక్షరములు) అశై (అవ్యయములు) శీర్

( గణములు ) పన్దమ్ ( బంధనములు ) అడి ( పాదవిశేషములు ) తొడై ( పాద సందర్భ విశేషములు ) నిత్తై ( పేర్ నిత్తై మొదలగునవి ) ఓశై ( శెప్పలోశై మొదలగునవి ) తళై ( వేరొన్డాశిరియత్తళై మొదలగునవి ) ఇనమ్ ( తాళిశై మొదలగుఛన్దస్సులు ) యాప్పు ( ప్రబంధరూపముగనుండుట ) పా ( వెణ్బా ఆశిరియప్పా మొదలగు వృత్తవిశేషములు ) పణ్ ( నాటమొదలగు రాగములు ) ఇశై ( నిషాదాదిసప్తస్వరములు ) తాళమ్ ( జంపె గజకర్ణము మొదలగు తాళములు ) పత్తు ( దశకము ) నూఱు ( శతకము ) ఆయిరమ్ ( సహస్రకము ) మొదలగు సర్వాలంకారములును గలవు.

ఈతిరువాయ్‌మొழி జీవపరభేదములను, జీవులకు పరస్పరభేదములను, జీవ ప్రకృతిభేదమును, ప్రకృతీశ్వరభేదమును, ఆత్మ నిత్యత్వాదులను, దేహానిత్యత్వమును, సర్వేశ్వరుని సర్వశరీరిత్వ — సర్వాన్తర్యామిత్వ — సర్వనియన్తృత్వాదులను సౌలభ్య — సౌశీల్య — స్వామిత్వ — వాత్సల్య — కారుణ్య — ఔదార్యాదులను, సర్వసమత్వ — సర్వ విభూతి యోగాదులను విశదీకరించుటయేగాక కర్మజ్ఞాన భక్తిప్రపత్త్యాది యోగములను గూడ నిరూపించుటచే శ్రీమద్భగవద్గీతతో సమానమైయున్నది. “ అమ్బుకవణ్ణ వణక్కు డైత్తవనెఱివథినిన్ఱు ” “ పణ్డై పరమర్ పణిత్త పణివకైయే ” ఇత్యాద్యనేకశ్రీసూక్తులయందు ఆழ்వార్లు భగవద్గీతను ప్రశంసించియున్నారు.

మఱియు నీతిరువాయ్‌మొழிయందు తిరుమన్త్రార్థము, చరమశ్లోకార్థము, తత్త్వత్రయము, అర్థపంచకము, మొదలగు సకలార్థములును విశదీకరింపఁబడియున్నవి. ఐనను ‘ ద్వయ ’ మను మన్త్రరత్నార్థమును ప్రధానముగ వివరించుటచేత నీ ప్రబంధమునకు ‘ దీర్ఘశరణాగతి ’ అని పేరుప్రతిష్ఠలు గలిగినవి.

“ వేదవేద్యే పరే పుంసి అనునట్లు పరాత్పరుఁడగు శ్రీమన్నారాయణుఁడు శ్రీదశరథచక్రవర్తికి కుమారుఁడై యవతరించినప్పుడు తద్వైభవప్రతిపాదకమగు ప్రౌఢగమ్భీర వేదశాస్త్రము లలితలులిత రమణీయ మధుమయ వచన రచనాత్మకంబగు శ్రీమద్రామాయణ రూపముగా నవతరించినట్లు ; ఆసర్వేశ్వరుఁడు సర్వదేశ సర్వకాలసర్వావస్థలయందును సకల ప్రాణులకును నందుబాటులో నుండి సంరక్షించుటకై అర్చారూప దివ్యమంగళవిగ్రహ విశిష్టుఁడై యవతరింపఁ

గనే, ఆ వేదముగూడ భక్తామృతమగు నీ తిరువాయ్‌మొழி స్వరూపమున నవతరిం చెనని సమ్ప్రదాయనిష్ణాతులు అభివర్ణించుచున్నారు.

ఈ దివ్యప్రబన్ధము నిఖిలవేదాన్తార్థముల నెటుల కరబదరీసమ మొనరించు చున్నదో; అటులనే సకల శృంగారరస విలాసములను గూడ నిరూపించుచున్నది. వేదాన్తగ్రంథములలో నెటుల నియ్యది తలమానికమై వెలయుచున్నదో; అటులనే సకల శృంగార కావ్యములయందును నత్యున్నతస్థానమును బొందియున్నది. ఆక్రమ మును శ్రీమాన్ ప్రపన్నవిద్వాన్ T. D. రామస్వామినాయుఁడుగారు తమ "అక ప్పొరుళుం — అరుళిచ్చెయలుం" అను గ్రన్థమున బాగుగా నిరూపించియున్నారు.

ఇట్టి అతివిలక్షణ దివ్యప్రబన్ధమును ప్రసాదించిన శ్రీశఠగోపదివ్యసూరీ శ్వరుల వైభవము వర్ణనాతీతము. వీరి వాచామగోచరమగు దివ్యమహిమను బరికించి యనేకవిధములుగ ప్రామాణికులు ఉల్లేఖించుచున్నారు. సంస్కృత వేదోద్ధరణమునకై సాక్షాత్తుగ శ్రీమన్నారాయణుఁడే శ్రీవ్యాసమహర్షిస్వరూప మున నవతరించినట్లు; ద్రావిడవేదోద్ధరణమునకై ఆ సర్వేశ్వరుఁడే ఈ ఆழ்వార్ల రూపమున నవతరించెనని కొందఱు వర్ణించుచున్నారు. "సేనేశోఽవతరిష్యతి" అని ప్రమాణవచనమున్నందున శ్రీమద్విష్వక్సేనులే వీరని మఱికొందఱు అభిప్రాయ పడుచున్నారు. ఇట్లే లోకోజ్జీవనార్థమవతరించిన నిత్యసూరులలో నొకరనియు, "కర్రై కణ్ణోర్" అనునట్టుల భగవన్నియమనానుసారము లోకోజ్జిజీవిషులై యవత రించిన ముక్తులలో నొకరనియు, శ్వేతద్వీపవాసులలో నొకరై యుందురనియు, జన్మాన్తరసహస్రసంచిత సకలసుకృతపరిపాకఫలముగ బద్ధులలోనే యొకరిట్లవత రించి రనియును బహుముఖముల వితర్కించుచున్నారు. భగవన్నిర్హేతుకజాయ మాన దివ్యకటాక్ష పరీవాహపరిపూరితులగుటచే దివ్యజ్ఞాన వైరాగ్య భక్తి యుక్తులగు మహానుభావులు వీరనుట నిర్వివాదాంశము.

వీరి జన్మదేశకాలాది చరిత్రాంశములును, సకలేతరవిలక్షణవైభవాదులును, వీరి దివ్యప్రబంధముల ప్రకర్షాదులును సమ్ప్రదాయానుసారముగ శ్రీమద్రామా నుజులసమకాలికులగు శ్రీగరుడవాహనపండితులచే విరచితమగు శ్రీదివ్యసూరి చరిత్రమునందును, శ్రీ "నమ్బిళ్లై" స్వామివారిశిష్యరత్నమగు శ్రీపిన్బழగియ పెరుమాళ్ జీయరు సాదించిన గురుపరంపరాప్రభావమునందును "ఆన్బిళ్లై కందాడై యప్పన్" సాదించిన "పెరియతిరుముడియడైవు" నందును, శ్రీమణవాళ

మహామునులు ప్రసాదించిన "ఉపదేశరత్నమాల" యందును, శ్రీమదనన్తాచార్య కృతమగు ప్రపన్నామృతమునందును, ఇంకను అనేక విధములగు గురుపరమ్పరా గ్రన్థముల యందును విశిష్టక్రమముతో నిరూపింపఁబడియున్నవి.

శ్రీ పిళ్ళైలోకాచార్యులవారి యనుజవర్యులగు శ్రీమదఴగియమణవాళ పెరుమాళ్ నాయనార్లు "ఆచార్యహృదయ" మను గ్రంథరత్నమునందు శ్రీ ఆళ్వార్ల వైభవమును వారిదివ్యప్రబంధవైభవమును నత్యద్భుతముగ బహు భంగుల నభివర్ణించి యున్నారు. అది యొక అపూర్వగ్రంథరత్నము. దానికదియే సాటి. అది యట్లుండనిండు.

ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధములలో నీ తిరువాయ్మొழி పరమోత్కృష్టమైయున్నది. ఇందు శ్రీఆళ్వార్ల కరుణార్ద్ర దివ్యహృదయము ప్రత్యక్షరమునను ప్రతిఫలించుచున్నది. శ్రీవైష్ణవలోకము ఈప్రబంధమును పరమపావనముగను సర్వగుహ్యతమముగను నాదరించుచున్నది. నాలాయిర దివ్యప్రబన్ధములలో నితరప్రబంధములు తిరువీధులయం దుత్సవసమయములలో పారాయణము చేయబడుచున్నవి. ఈ తిరువాయ్మొழி మాత్రము అట్లుగాక దేవాలయముల యందు భగవత్సన్నిధానమున ప్రతినియతదేశకాలములయందే సేవింపఁబడుచున్నది. దీనిచే నీగ్రంథప్రాశస్త్యము ప్రస్ఫుటమగుచున్నది.

ఆళ్వారులీ ప్రబంధమున తమ భగవదనుభవప్రకారముల ననేకభంగుల ప్రకటించియున్నారు. కర్మజ్ఞానసాధ్యమై భగవత్ప్రాప్తికి సాధనమైన ఉపాసకుల భక్తికంటెను, సర్వేశ్వరుని యాచించి కైంకర్యార్థము ప్రపన్నులు పొందెడు భక్తికంటెను, వీరిభక్తి పరమవిలక్షణమై యున్నది. సర్వేశ్వరుఁడు తన నిర్హేతుక కృపా కటాక్ష సర్వస్వమును వీరిపై ప్రసరింపఁజేసి, తన సంశ్లేషవిశ్లేషములచే వీరి పరభక్తి పరజ్ఞానాదులను వృద్ధి నొందించుచుండెను. ఆ యనుభవానందరసపరీవాహమే ఈ కమనీయ దివ్యమంగళప్రబంధము. సంశ్లేషమనఁగా—ప్రత్యక్షసమానాకారమగు మానసానుభవము. విశ్లేషమనఁగా—బాహ్యానుభవము లభింపనందునఁ గలఁతఁ జెందిన యంతఃకరణమునకు శైథిల్యావస్థ.

ఇట్లు కలతఁజెందు నవస్థలలో నాళ్వార్లు నాయికావస్థను బొందుచున్నారు. నాయికావస్థయందు వీరికి మూఁడవస్థలుగలవు. (౧) తోழிమార్ (సఖి) అవస్థ

(౨) తాయ్‌మార్ (జనని) అవస్థ (3) మకళ్ (నాయికా) అవస్థ - అని. ఇచ్చట ప్రణవమునందలి అకారవాచ్యుఁడైన యీశ్వరునకును మకారవాచ్యుఁడైన చేతనునకును నుండు అనన్యార్హ సంబంధజ్ఞానమే, వానితో వీనిని జేర్చుచున్నదిగాన సఖిగాఁ జెప్పబడుచున్నది. ఇట్లే " స్వతంత్రించుట స్వరూపవిరుద్ధ " మని యుప దేశించెడి "నమఃపద" ప్రతిపాద్యమైన ఉపాయాధ్యవసాయజ్ఞానమే తల్లిగా నిరూపింపఁబడుచున్నది. "పుంసాం దృష్టిచిత్తాపహారిణం" అనునట్లు పురుషులదృష్టిచిత్తాదుల నపహరించు పురుషోత్తముని దివ్యమంగళవిగ్రహ దివ్యసౌందర్యము ఆళ్వార్లకు స్త్రీత్వభావమునుగలుగఁజేయుటచేతను, "అనన్యార్హత్వ-అనన్యభోగ్యత్వ అనన్య శరణ్యత్వము" లను పతివ్రతకుండు ఆకారత్రయమును వీరికి స్వభావసిద్ధముగ నుండుటచేతను, వీరికి నాయికావస్థ సంప్రతిపన్నము. ఇది సచ్చట సందేశహారకములగు పక్షులెల్ల యథార్థజ్ఞానములగు పక్షులని ... చెప్పఁబడిరి ఖ్యాతులగు నాచార్యవర్యులే. ఇట్టి స్వాపదేశార్థము లన్నియును భగవద్విషయవ్యాఖ్యానాదులయందు దెలిసికొననగును. ఇట్లీ గ్రంథము సవరసభరితమై భక్తి శృంగార వైచిత్ర్యముల వివిధవిధములుగ నిరూపించుచు పరమభోగ్యముగానున్నది.

" విడుమిన్ ముఱ్ఱవుం " అను తిరువాయ్‌మొழிలో సంసారుల యాతనలఁజూచి వారల గరుణించి వారికుపదేశమును జేయుచున్నారు. " కొణ్డాణ్ళై యుళ్మై " " ఒழிవిల్ కాలం " మొదలగు తిరువాయ్‌మొழிలలో సర్వేశ్వరుని సర్వభూతహితతమత్వమును నిరూపించి, అతని దివ్యపాదారవిన్దములయందుజేయు నిరంతరకైంకర్యమే యుజ్జీవన హేతువని పరమప్రీతితో నుపదేశించుచున్నారు. "సోపాధికబంధువుల నందఱిని సవాసనముగఁబరిత్యజించి, నిరుపాధికబంధువగు శ్రియఃపతినే భజింపుఁడు" అని యందఱిని ప్రార్థించుచున్నారు.

వీరిలోకానుభవము, వీరిదివ్యజ్ఞానము, వీరిబోధనాశక్తి, వీరివర్ణనా నైపుణ్యము, వీరిగూర్తి, భగవద్భక్తి, మొదలగు వీనినెల్లగమనించితిమేని వీరు నిస్సమాభ్యధికకవితల్లజులనుటలో సందియమావంతయును లేదు. వీరిశిష్యాగ్రేసరులగు శ్రీ మధురకవులు"కణ్ణినుణ్ శిఱుత్తామ్బు"అను దివ్యప్రబంధమున వీరి వైభవముల నభివర్ణించుచు సదాచార్యనిష్ఠను నిర్వహించిరి. ద్రావిడ కవిచక్రవర్తియగు శ్రీకంబనాట్టాళ్వార్లుగూడ వీరి ప్రభావమునకు ముగ్ధులై వీరికి శిష్యులగుటమాత్రమేకాక "శ్రీశఠగోపనందాది" అను గ్రంథమును రచించి గురుదక్షిణగా వీరికి

సమర్పించిరి. వారొక పాశురమున "ఆళ్వారులపాశురములలో నొకపాదమునకు సరిగాదు నిఖిలసాహిత్యవాఙ్మయము" అని యభినుతించియున్నారు.

భగవంతుని యవతారవిశేషములగు పర, వ్యూహ, విభవ, అన్తర్యామి స్వరూపములు, కాలదేశవిప్రకర్షాదులవలన పరమదుర్లభములై యుండుటచే, ఆశ్రయణసౌకర్యాపాదకములగు సౌలభ్యాదికల్యాణగుణగణములతో సంపన్నంబగు నర్చావతారమే ప్రపత్తికాలంబనమై విలసిల్లుచున్నది. కనుకనే ప్రపన్నజన మార్గదర్శకులగు శ్రీశఠగోపమునిపుంగవులును దివ్యదేశములయందు విరాజిల్లు నర్చావతారములయందే ప్రపత్తినొనరించిరి. అందునను శ్రీవేంకటాచలము నందు వేంచేసియుండు మన "తిరువేంగడముడైయాన్" యందే వీరికి నిరవధికభక్తి ప్రకర్షమున్నది. ఏలననగా:-దీర్ఘశరణాగతిరూపమగు నీ తిరువాయ్మొழிయందు తిరువేంగడముడైయాన్ విషయమున రెండుదశకములను సాదించుటయేగాక "ఉలకముణ్డపెరువాయా" అనుదశకమున "అకలకిల్లేన్" అనుపాశురమున సాంగోపాంగముగ శరణాగతినొనర్చి, "ఒழிవిల్కాలమెల్లాం" అనుదశకమున సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును నిరవధిక కైంకర్యరూపమగు పరమపురుషార్థమును ప్రార్థించిరి. వీరికినత్యన్తాన్తరంగభక్తులగు శ్రీభగవద్రామానుజాచార్యులును మన తిరువేంగడముడైయాన్ దివ్యసన్నిధియందే వేదార్థసంగ్రహమును ఉపన్యసించుటయేగాక శ్రీభాష్యమంగళశ్లోకమునను "బ్రహ్మణిశ్రీనివాసే" అని వీరి పరతత్త్వమును నిష్కర్షించి, వీరిదివ్యపాదారవిన్దములయందే శరణాగతిని జేసిరి. కాబట్టి మన తిరువేంగడముడైయాన్ వైభవప్రతిపాదకమగు నీ "తిరువాయ్ మొழி" దివ్యప్రబంధమును ప్రచురింపవలసిన బాధ్యత ఈ దేవస్థాన నిర్వాహకులపైనున్నది.

ఇట్టి పరమభోగ్యమగు నీ దివ్యమహాప్రబంధము సకలశ్రీవైష్ణవులకును అవశ్యానుసంధేయమైయుండుటచే నాసేతుహిమాచలము నిఖిలభక్తజనులును తమతమ లిపులలో నీ గ్రంథరత్నమును పదిలపఱచుకొని సేవించుచు అమన్దానన్దము ననుభవించుచు తరించుచున్నారు. తెలుగువారికిని తెనుగులిపిలో నీ గ్రంథము లభించుచున్నది. జగద్విఖ్యాతులును అగర్భశ్రీమంతులునునగు "శ్రీచెంగల్వ నాయకరు" మహాశయులు భగవద్విషయము నంతటిని తెలుగులిపియందు అతివిలక్షణముగ ముద్రింపించి భక్తలోకమునకు మహోపకారమొనరించిరి. ఇట్లే

"శ్రీశఠారాతిపాటి ఆళవందారయ్య" మొదలగువారును నీ తిరువాయ్‌మొழி మూలగ్రంథమును, భగవద్విషయమును గూడ తెనుఁగులిపిలో నచ్చొత్తించి తెలుఁగు వారికందఱికిని మహోపకారకులైరి.

కాని అవి యన్నియును ద్రావిడభాషలోనున్నవి. ఆంధ్ర టీకాతాత్పర్యములతో నున్నచో నీగ్రంథము అందఱికినినందుబాటులో నుండి పరమోత్తారక మగునుగదా! వీనినెల్ల యోచించి తత్కాలమున దుర్లభమైయుండు ఒకానొక ప్రాచీన శ్రీకోశప్రతిని ఆధారముగ బెట్టుకొని శ్రీ శ్రీనివాసవిద్యాస్థానపండితుల సాహాయ్యమున నీ గ్రంథమును సర్వాంగసుందరముగ ముద్రింపగలిగితిమి.

శ్రీసూక్తిసుధాసారసంగ్రహము శ్రీవేంకటేశ్వర సంస్కృతకళాశాలలో న్యాయోపాధ్యాయులగు శ్రీ. ఉ. వే. మహావిద్వాన్-దర్శనసార్వభౌమ-శ్రీ సుదర్శనాచార్యస్వామివారిచే "ఈరాయిరప్పడి" వ్యాఖ్యానము నుండి సంకలితమైనది.

ఈ గ్రంథరత్నము ఆంధ్రదేశమున కొక అమూల్యాభరణము. కలియుగ ప్రత్యక్షదైవతమగు శ్రీ శ్రీనివాసభగవానుని దివ్యకృపాకటాక్షతరంగిత మీ దివ్య ప్రబంధము. కనుక భాగవతోత్తము లెల్లఱును ఈ గ్రంథమును స్వీకరించి, సేవించి, అధిగతపరమార్థులై, శ్రీనమ్మాళ్వార్ల యనుగ్రహమునకును, వారి కుపాస్య దైవతమును, శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడును, ఆశ్రితజన కల్పమహీరుహ మెల్లజమును, "శ్రీ అలర్‌మేల్‌మంగై" దివ్యమహిషీసమలంకృత దివ్యవక్షఃస్థలుఁడును నగు శ్రీ తిరువేంగడముడైయాన్ల నిరవద్యహృద్య దివ్య కృపాకటాక్షమునకును పాత్రులగుదురు గాక.

ఈ గ్రంథముద్రణమున సహాకరించిన వారలెల్లఱకును కమిటీవారి ధన్యవాదములు.

ఆళ్వార్, ఎమ్బెరుమానార్, జీయర్, తిరువడిగళే శరణమ్.

ఇట్లు

తిరుపతి.
16-10-50.

కె. వెంకటస్వామినాయుఁడు.
తిరుమల తిరుపతి దేవస్థానముల కమిటీ ప్రెసిడెంటు.



శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్రీమతే వకుళభూషణభాస్కరాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే రమ్యజామాతృమునీన్ద్రాయ నమః

# "శ్రీసూక్తిసుధా (తిరువాయ్ మొఴి) సారసంగ్రహము"



("ఈడుముప్పత్తాఱాయిరప్పడి" అను వ్యాఖ్యానమునుండి సంకలితము)

యద్గోసహస్ర మపహన్తి తమాంసి పుంసామ్
నారాయణో వసతి యత్ర సశంఖచక్రః ।
యన్మండలం శ్రుతిగతం ప్రణమన్తి విప్రాః
తస్మై నమో వకుళభూషణభాస్కరాయ ॥
వకుళాభరణం వన్దే జగదాభరణం మునిమ్ ।
యః శ్రుతేరుత్తరం భాగం చక్రే ద్రావిడభాషయా ॥

ప్రపన్నజన కూటస్థులగు శ్రీనమ్మాళ్వారులు నిరన్తరనిరవధిక దుఃఖసందాయకమగు నీ లీలావిభూతిలో నసంఖ్యాకములగు వివిధజన్మముల నెత్తి దురత్యయ దుర్భర నిస్సీమ సాంసారిక యాతనావివశులై యుండిరి. పరమకారుణికుఁడగు శ్రీమన్నారాయణుఁడు దీనినిఁ జూచి తన నిర్హేతుక నిరవద్యహృద్య కృపాకటాక్షమును వీరిపై ప్రసరింపఁజేసెను. అంత తత్క్షణప్రవృద్ధ నిరవద్య విశదతమ జ్ఞానభక్తి సమ్పన్నులై, ఆశాపాశాదులనెల్ల సవాసనముగ విసర్జించి, పరమపదమునకు విచ్చేసి, అచ్చట శ్రీవైకుంఠనికేతనుని దివ్యవైభవములను దివ్యమంగళగుణ విగ్రహాదులను గండ్లార సేవించి, తదనుభవజనిత ప్రీతికారితాశేష శేషోచిత నిత్యనిరవద్య సర్వవిధ కైంకర్యధురంధరులై యుజ్జీవించిరి. ఈ క్రమముఁజూడ నెట్లున్నది యనఁగా:— గాఢాంధకారబంధురమై నిబిడకంటక తరుగుల్మలతాకీర్ణమైయుండు గహనారణ్యమునఁ ద్రోవదప్పి దిగ్భ్రమం జెందియుండు నొకానొక పురుషుఁడు, పరమకారుణికుఁడగు నొక ధార్మికునివలన దేదీప్యమానంబగు కరదీపిక నొకదానినిఁ బడసి, సత్పథమును గుర్తెఱింగి, అగహనారణ్యసీమను దాటి, సుఖముగ తన గృహమునకు వచ్చి నిర్భరానందకలితుండై జీవయాత్రను గడుపునట్లున్నది.

## అవతరణిక

శ్రియఃపతియును శ్రీవైకుంఠనికేతనుఁడును నిత్యముక్తానుభావ్యుఁడును నిరతిశయానన్దయుక్తుఁడును సమస్తకల్యాణ గుణాత్మకుఁడునైన సర్వేశ్వరుఁడు, "పునరపి జననం పునరపి మరణం పునరపి జననీజఠరే శయనమ్" అనువట్లు చక్రనేమివలె పరివర్తమానంబగు సాంసారిక మాయాచక్రమున బంభ్రమ్యమాను లై, దుర్భరాగాధదుఃఖసాగరమున మునింగియున్న శ్రీనమ్మాళ్వారులను తన నిర్హేతుక దివ్యకటాక్షపాత్రులంజేసిరి. అంత నీయాళ్వార్లు భగవన్నిర్హేతుక నిరవధికకృపానేకప్రభావమున సమధిగత నిత్యానిరవద్యహృద్యవిశదతమ విజ్ఞాన సంపన్నులై భగవదనుభవపరీవాహరూపముగ ద్రావిడవేదసాగరమగు నీ 'తిరువాయ్‌మొళ్ళి' దివ్యప్రబన్ధమును ప్రసాదించిరి.

ఈ ప్రబన్ధము సహస్రశాఖాత్మకమగు సామవేదసారమగుటచే సహస్ర గాథాత్మకమై, దశశతకములను (పదిపత్తులను) శతదశకములను (నూరు తిరువాయ్‌మొళ్ళులను) గలిగియున్నది.

## ప్రథమశతకము (1-పత్తు)

(౧) ఇందు మొదటి "ఉయర్వఱ" అను తిరువాయ్‌మొళ్ళిలో భగవంతుని కల్యాణగుణ విగ్రహనిత్యవిభూతి యోగములను విగ్రహవైలక్షణ్యమును బ్రతిపాదించి, వీని కాశ్రయమగు దివ్యాత్మస్వరూపము నిఖిలచేతనాచేతన విలక్షణమని వ్యక్తీకరించి, నిత్యవిభూతివలె లీలావిభూతియును తదీయత్వాకారముచే నతని కన్తరంగమైన దని యనుభవించి, ఆ లీలావిభూతియొక్క సకల స్వరూప స్థితిప్రవృత్తులును అతని యధీనము లనియును, శరీరశరీరులకుండు లక్షణము జగత్తునకు నీశ్వరునకు నుండుటచే నీ శరీరాత్మభావమే జగద్బ్రహ్మైక్యమునకు నిబన్ధన మనియును సోపపత్తికముగ నిరూపించి, కుదృష్టులను శూన్యవాదులను నిరసించి, వ్యాప్తిసౌకర్యమును స్ఫుటీకరించిరి. ఇట్లు నిరుపాధిక పరత్వమును నిష్కర్షించి యా సర్వేశ్వరుని పదసరసిజముల యందుఁ దమ మనోభ్రమరమును నెలకొల్పిరి.

(౨) ఇఁక "వీడుమిన్ ముఱ్ఱవుమ్" అను రెండవ తిరువాయ్‌మొళ్ళిలోఁ గ్రిందఁ దా మనుభవించిన యభూద్దానన్దము ననుభవించుటకు సహాయు

భూతు లెవ్వారే నను గలరా! అని యాళ్వారులు సంసారిచేతనులను గటాక్షించి, తాము భగవద్విషయప్రవణులై యుండునట్లు, వారలు శబ్దాదివిషయప్రవణులై పడియుండుటను జూచి, వారల యనర్థములను పరిహరింపనిది సహింపలేని వారలై వారలకు "అతిశయవైరాగ్యపూర్వకముగ నేకాన్తికాత్యన్తిక భక్తి యోగనిష్ఠులై భగవంతుని భజింపుఁడు" అని యుపదేశించిరి.

(3) "పత్తుడై యడియవర్" అను మూడవదశకమున — ఈ యుపదేశమును వినిన సంసారిచేతనులు "భజింపుఁడు" అని బహుకాలముగ నానతిచ్చుచున్నారే! మొండిచేతులవానిని మదపుటేనుఁగు నెక్కుమనిన అది యతనికి సాధ్యమా? అట్లే యీక్షుద్రసంసారిచేతనునకు నిరంకుశస్వతంత్రుని భజింపశక్యమా? అని ప్రశ్నింపగా, ఈ సంసారిచేతనుఁడు భజింపఁదగినట్లు ఆ సర్వేశ్వరుఁడు తనను సులభునిగాఁ జేసికొని రామకృష్ణాద్యవతారముల స్వీకరించు నని యుపదేశింపుచు, సౌలభ్యసౌశీల్యములకు సీమాభూమియగు శ్రీకృష్ణుని నవనీతచౌర్య నగరక్షోభాదుల నభివర్ణింప సమకట్టి ఆ సౌలభ్యగుణమునకు ముగ్ధులై ఆళ్వార్లు "ఎత్తిరం" అని యాఱుమాసములు మోహమూర్ఛితులైరి.

(4) ఈ తిరువాయ్మొళిలో సకలలోకములను గొలిచిన త్రివిక్రమస్వామియొక్క శ్రీపాదపద్మములను సేవింపఁ బ్రయత్నించి, అదియొక కాలవిశేషమునం దగుటచే అన్నులై తమస్వరూపమునే విడిచి, యొక నాయికావస్థను బొందినవారలై "ఇరంగుమిడంనెయ్తల్" అని కరుణామృతతరంగిణిమగు సముద్రతీరమునకు విచ్చేసిరి. అచ్చట తమ పరిసరమునసుండు పక్షుల నభివీక్షించి, కామవివశులగుటచేఁ బ్రకృతికృపణులై యాళ్వార్లు "ఈశ్వరుఁడు తన పరత్వమును నానైచ్యమును పరిశీలింపక నాతోడవచ్చి సంశ్లేషించెను. సమీపించినంతనే నాదోషముల సందర్శించి వైముఖ్యమును జూపెను. తనకు 'అపహతపాప్మత్వ' మను నొక దివ్యకల్యాణగుణప్రకర్షమున్నదను విషయము నతఁడు మఱచెను. దాని నతనికి జ్ఞాపకపఱచినచో వెంటనే తప్పక విచ్చేయును" అను ప్రత్యాశచే "అఞ్జిఱైయమడనారా" అను నాల్గవ తిరువాయ్మొళిలో సాపక్షులను దూతలనుగాఁ బంపిరి.

(5) ఈ దూతప్రేషణమువలన నాయకుఁడు తన నాయికయందుఁ

జాలీఁగొని గజేన్ద్రరక్షణ సమయమునందువలె మిక్కిలి సంభ్రమముతో వచ్చి సాక్షాత్కరించెను. అంత వాని వైలక్షణ్యమును తమ స్వరూపమును జూచి "ధార్మికు లేర్పఱచిన పానీయశాలను చెఱచువారివలె నిత్యసూరుల కనుభావ్య మగు పరవస్తువును మనము ప్రవేశించి దూషింపఁజేయుట కూడ దని" ఆళ్వార్లు పరమపురుష చరణారవిన్ద పరిచరణమునుండి నివృత్తులై దూరముగఁ జను చెంచిరి. అంత నీశ్వరుఁడు తనను దూషించుకొనుచు నతిసంభ్రమమున సంశ్లేషోన్ముఖుఁడై వచ్చిచేరెను. ఈక్రమమును "వళవేఱ్ఱులకు" అను నైదవ తిరువాయ్మొழிలో నభివర్ణించిరి. దీనిచే "భగవత్సమాశ్రయణము దుర్లభముగా నుండక సులభముగ నుండుటయే గాక భోగరూపముగను నుండును" అని వాని సౌలభ్యమును దెలిసికొన నవకాశ మేర్పడినది.

(౭) అటుపై "పరివదిలీశనై" అను నాఱవ తిరువాయ్మొழிలో "క్షుద్రదేవతారాధనము దుశ్శకము, మిక్కిలి దుర్లభము" అనియు,

(౮) "పిఱవిత్తుయరఱ" అను నేడవ తిరువాయ్మొழிలో కైవల్యానుభవము దుష్ప్రాప మనియును వ్యక్తీకరించిరి.

(౯) "ఓడుంపుళ్ళేఱి" అను నెనిమిదవ తిరువాయ్మొழிలో వాని యార్జవగుణమునం దత్యన్తప్రవణు లగుచున్నారు.

(౯) "ఇవైయు మవైయుమ్" అను తొమ్మిదవ తిరువాయ్మొழிలో వీరి భక్తికి బరమప్రీతుఁడై నాయకుఁడు వీరితో నేకరసుఁడై యథామనోరథము సర్వేన్ద్రియములచేతను సర్వగాత్రములచేతను వీరిని సంశ్లేషించి యనుభవింపగ ననుభవించి యా యనుభవజనితప్రీతిప్రకర్షము నభివర్ణించిరి.

(౧౦) క్రింద "ఉచ్చియుళ్లే నిఱ్కుమ్" (నాయుత్తమాంగమున నిత్య సన్నిధిఁ జేయుచున్నాఁడు) అని వాని కల్యాణగుణము ననుసంధించిరి. అప్పట ఫలము చాలా గొప్పదిగ నున్నది. ఇది లభించినందులకు కారణమెయ్యది? అని పరిశీలించిరి. అట్టి నిరవధికఫలావాప్తికిఁ దగిన పుణ్యమేదియును తమవద్ద లేకుండినది. అద్వేషము మొదలుకొని పరమభక్తి పర్యన్తము తానే కలుగఁజేసి పరమకరుణాకరుఁడగుటచే నిత్యసూరులకు భోగ్యమైన పరమపదమును అనాది కాలముగ సంసారమునఁబడియుండు మనకనుగ్రహించెను. ఆహా! ఈ సర్వేశ్వ

తని విషయీకారక్రమ మెట్టిది ? అని తమకుఁ గలిగిన సర్వాంగసంశ్లేషరసమును "పొరుమానీళ్‌పడై" అను పదియవ తిరువాయ్‌మొళిలో ననుసంధించి ముగ్ధులైరి.

## ద్వితీయశతకము (2-వ పత్తు)

(౧) క్రింద "మణిప్పై చానవర్ కణ్ణనై తన్నతోరణియై" అని యతని సౌలభ్య, సౌందర్య, సౌభాగ్య, ఔన్నత్యాదులఁ బరమప్రీతితో ననుభవించిరి. అటుపై బాహ్యసంశ్లేషాపేక్ష గలిగి, అయ్యది తత్క్షణమే సిద్ధింపనందున మిక్కిలి యవసాదావిష్టులై, సర్వేశ్వరునితోఁ గలసిమెలసి దౌర్భాగ్యాతిరేకమున నతని నెడబాసి విరహవేదన ననుభవింప నేరక దుఃఖించుచున్న నాయికయొక్క ఆవేదనకుఁ గుఱియైనవారలై, కొంత ఆప్యాయనము గలుగునేమో యని లీలోద్యానమునకు బయలుదేఱిరి. అచ్చటకుఁ జని యచ్చట వర్తించు పదార్థములన్నిఁ బరికించి, అవియన్నియును తమవలె భగవదలాభముచే విషాదము ననుభవించుచున్న వని యెంచి, వానికై తామే శ్రమపడిరి. ఆప్రకారమును "వాయుంతిరై యుకళుమ్" అను మొదటి తిరువాయ్‌మొళిలో నభివర్ణించుచున్నారు.

(౨) క్రింద "మూవాముదల్వా" అని ప్రస్తుతమైన కారణవస్తువును అవతారదశావిశిష్ట మొనరించి "తిణ్ణావీడు" అను రెండవదశకమున పరోప దేశవ్యాజమున ననుభవించిరి.

(౩) ఇఁక "ఊనిల్‌వాళ్" అను మూడవతిరువాయ్‌మొళిలో "వాయుం తిరై యుగళుం" అను దశకమున నార్తితీరునట్లు వచ్చి సంశ్లేషించిన సర్వేశ్వరుని సంశ్లేషమును గీర్తించిరి.

(౪) ఈ తిరువాయ్‌మొళిలో "పరుకికళిత్తేనే" అనినట్లు ఆర్తి మిక్కుటము కాఁగ, భాగవతులతో "బోధయన్తః పరస్పరమ్" అను ప్రక్రియచేఁ గలసి మెలసి ధరింపవలయునని కుతూహలపడి, అది లభ్యముకానందున మిక్కిలి యవసన్నులై తమస్వరూపస్వభావములను విడనాడి నాయికావస్థను బొంది, తమ దశను తామే చెప్పుకొనలేక తమ జననిచేఁ జెప్పింపవలసినట్లు "ఆడియాడి" అను నాల్గవ తిరువాయ్‌మొళిలో విషణ్ణులైరి.

(౫) ఈ తిరువాయ్మొழிలో ఆళ్వార్లు మొరపెట్టుకొను ఆర్తనాదము తన శ్రోత్రపథమునకు గోచరముగాఁగ సర్వేశ్వరుఁడు "మనము జగత్పరిపాలన మతిమందరముగ నిర్వహించుచున్నారమే ! చాలు చాలు" అని నాయికావస్థను దలంచుకొని, దుఃఖలజ్జాభయాదులచే సంభ్రాన్తుఁడై వేవేగ తన దివ్యాయుధాదులతోడనే విచ్చేసి సంశ్లేషించెను. తత్సంశ్లేష జనితహర్షప్రకర్షమునే "అన్దామత్తన్పుశెయ్‌దు" అను నైదవ దశకమున ననుభవించిరి.

(౬) "వైకున్దా మణివణ్ణనే" అను నాఱవ దశకమున — సర్వేశ్వరుఁడు తత్సంశ్లేషము తనకే పరమపురుషార్థమని తోఁచునట్లుగ నత్యన్త సంహృష్టాన్తరంగుఁడై, "అనాదికాలముగ విషయాన్తరప్రవణులై సంభ్రమించుచున్న వీరి ననుభవింప నేటికి భాగ్యము కలిగినది గదా ! మరల వీరు మనలను విడిచిన చేయునదేమి ?" అని అతిశంకాకలంకితుఁడై వ్యసనపడుచుండ, అతని వ్యాకులతను బాపుటకై "దేవరవారు వ్యాకులపడవద్దు" అని యాళ్వార్లు సర్వేశ్వరుని అతిశంకను నివృత్తమొనరించి వానిని యథావస్థితునిఁ జేసిన క్రమ మభివర్ణింపఁబడుచున్నది.

(౭) (౮) ఆళ్వార్లకు గలిగిన నిరవధికప్రేమప్రకర్షము ఆ యాళ్వార్లకొక్కటికే గాక, వారి సంబంధిసంబంధులకును వ్యాపించునట్లు ప్రవహించినది. ఈశ్వరుఁడును తత్సమ్బన్ధిసమ్బన్ధిసమ్బన్ధుల వఱకును నీ ప్రీతిప్రవాహమును సమభివృద్ధమొనరింపఁగ, తత్ప్రీవాహపరీవాహము కూలంకషమగుటయేగాక ప్రపంచము తనంటిని ముంచివైచెను. అట్టితఱి ఆళ్వార్లు "శ్రీమన్నారాయణుఁడే మోక్షప్రదుఁడు, అతనినే శరణువేఁడుఁడు" అని "శెళవన్దమర్" అను నేడవదశకమునను, "అణైవదరవణైమేల్" అను నెనిమిదవ దశకమునను సంసారులకు నుపదేశించిరి.

(౯) అటుపై "ఎమ్మావీడు" అను తొమ్మిదవ దశకమున — వీరికి మోక్షమునందభిరుచి యధికముగ నున్నదని యోచించి సర్వేశ్వరుఁడు ఆళ్వార్లకును తత్సమ్బన్ధిసంబంధులకును మోక్షమును ప్రసాదించునట్లు ఆభిముఖ్యమును జూపఁగ దానిని బరికించి "దేవరవారు నాకు మోక్షమును ప్రసాదింపవలయునని యుద్దేశించుచున్నచో నాప్రయోజనమునకై మీరు మోక్షమును ప్రసాదింపవలదు. 'మీప్రయోజనమునకై నీవు మోక్షమును స్వీకరించితీరవలయును'

అని మీరు దాసుని నియమింపవలసియున్న నియమింపుఁడు " అని సర్వేశ్వరుని వేఁడుచు మోక్షస్వరూపమును విశదీకరించిరి.

(౧౦) కడపట " కెళరొళియిళమై " అను పదియవ దశకమున— ఆళ్వార్లను దాసులనుగఁ జేసికొనుటకు దక్షిణతిరుమల (తిరుమాలిరుంశోలై)లో నేకాన్తముగ వేంచేసి తన స్వరూపమును సాక్షాత్కరింపఁజేయఁగ దాని నభివర్ణించిరి.

## తృతీయ శతకము (3-వ పత్తు)

(౧) ఈరీతి దక్షిణ శ్రీశైలమున ('తిరుమాలిరుంశోలై' క్షేత్రమున) వేంచేసియుండు సుందరబాహు (అళగర్) స్వామియొక్క నిస్సీమసౌందర్యాతిశయముల ననుభవించి, అగురాధికవిషయమున నొక యజ్ఞాన మనువర్తించు చున్నదని " ముడిచ్చోదియాయ్" అను ప్రథమదశకమున దత్ప్రకారము నభివర్ణించిరి.

(౨) అంత " మున్నీర్ ఞాలమ్ " అను రెండవ తిరువాయ్‌మొళిలో— ఆ యజ్ఞానము తమ కరణసంకోచనిబన్ధనమని విశదీకరించిరి.

(3) అటుపై "ఒళివిల్ కాలమ్" అను తిరువాయ్‌మొళిలో " నిలై పెర్ వేఙ్గడత్తు ఎన్ అప్పన్ తాళ్ పెఱ్ఱాల్ ఎన్ఱుమ్ పెఱ్ఱాల్ సీదుమియిర్" అని వానిని సమీపించి స్వరూపానురూపముగ దాస్యమును సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును నిర్వర్తింపవలయునని చాలఁ గుతూహలపడిరి.

(౪) ఈ తిరువాయ్‌మొళిలో తా మాశపడిన క్రమము లన్నింటికిని దగినట్లు ఈశ్వరుఁడు తన సర్వాత్మభావమును బ్రదర్శింపఁగ దాని ననుసంధించి " పుగళ్ నల్లొరువనెన్గో " అను దానిలో వాచికకైంకర్యము ననుష్ఠించిరి.

(౫) దానిచే గలిగిన మైమఱపుచే, " జన్మవృత్తజ్ఞానములలో నేవిధమైన న్యూనతయు లేకున్నను భగవద్గుణగణములలోఁ బ్రవణులై విశ్రుతులు గాని వారలు అపదార్థములు" అని అట్టివారల నిందించి " జన్మవృత్తాదులచే నిహీనులైనను భగవద్గుణగణములయందే ప్రవణులై అత్యన్తద్రవీభూతాన్తఃకరణులగు మహాత్ము లుందురేని వారలకు నేను దాసుఁడను " అని భాగవతోత్తములను " మొయ్‌మ్మాప్పూమ్పొళిల్ " అను నైదవ దశకమున శ్లాఘించిరి.

(౬) "శెయ్యతామరై" అను నాలవతిరువాయ్మొழிలో—భగవద్గుణములయందుఁ బ్రీతిలేనివారలు మొదటనే యజ్ఞానాంధకారముచే దిఙ్మూఢులై మార్గమును దప్పి యనర్థపడుచున్నారు. అధఃపతితులగువారల దండించుట తగదని తమ పరమకృపాతిరేకమున "ఓ మనుజులారా! ఆశ్రయణీయుఁడు, శ్రియఃపతియగు శ్రీమన్నారాయణుఁడే, వేరెవ్వరును కారు" అని వారలకు హితమును ప్రబోధించిరి.

(౭) "తఙ్గమాకియ తన్నై" అని అర్చావతారసౌలభ్యమును సువిశదముగ నుపదేశించినను దానిని పెడచెవినిబెట్టి విషయప్రవణులగు సంసారుల స్వభావము ననుసంధించియు "శేర్ కడవియ పెరుమాళ్ కన్నై కழల్ కాణ్బ తెన్ఱుకొల్ కణ్గళ్" అని సర్వేశ్వరుని శ్రీపాదపద్మముల సందర్శింపలేకయు నాళ్వార్లు అతిమాత్రదుఃఖాక్రాన్తులైరి. ఆదుఃఖమును దీర్చుటకై వీరికి దన శ్రీపాదరేఖాస్వరూపులగు శ్రీవైష్ణవుల సాక్షాత్కరింపఁజేసిరి. ఉపదేశనిరపేక్షముగ, "భగవద్విషయము" అనినచో నత్యన్తప్రావణ్యముగలిగియుండు భాగవతోత్తములగు శ్రీవైష్ణవులను గండ్లార సేవించి, ఆహా! ఇట్టి మహానుభావులును గొందఱు గలరే! అని సంభ్రమాశ్చర్యచకితులై "నేను సర్వేశ్వరునకు దాసుఁడనుగాను, ఈ శ్రీవైష్ణవులకే దాసుఁడను; అందును తద్భక్తభక్తచరమావధిభక్తభక్తుఁడను" అని యధ్యవసించి భాగవతశేషత్వము పరమోద్దేశ్యము కాఁగ వారల నాదరించి "పయిలుంశుడరొళి" అను నేడవదశకమున వారలతో సంశ్లేషించిరి.

(౮) "మొడియానే" అను నెనిమిదవ దశకమున—క్రింద ప్రవృత్తమైన భాగవతసంశ్లేషము "బోధయన్తః పరస్పరం" అను క్రమములో నిలువక భగవద్గుణగణములకు స్మారకమై క్రింద గలిగిన విరహతాపమునకును నుద్బోధకమయ్యెను. దానిచే నభినివేశ మత్యుత్కటమై, సకలేన్ద్రియములతోఁగూడ తాము సకలేన్ద్రియజన్యరసాస్వాదము ననుభవింపవలయునని యాశపడి, క్షామకాలమున బహుసంతతికుఁడగువాఁడెట్లు తన యాఁకలికిని,తన ప్రజల యాఁకలికిని ఓర్వలేక ప్రజల నోటిలోని యాహారమును తననోటిలో వైచికొనియు, తన నోటిలోని యాహారమును వారినోటిలో వైచియు, ఏమియునుదోచక "నాయాఁకలికై యేమి చేయుదును! నాప్రజల యాఁకలికై యేమి చేయుదును!"

అని యత్యన్తవిషణ్ణుఁడై, యమయాతన ననుభవించునో, అట్లే తాము తమ కరణగ్రామముతో శ్రమపడుచు నుచ్చైస్స్వరమున నార్తనాదము జేసిరి.

(౯) ఇట్లు అత్యన్తవ్యసనావిష్టులై సంసారులకై తా మార్తనాదము జేసి, ఇందులకుసహాయభూతు లెవ్వరైనఁ గలరా? అని సంసారులను గటాక్షించిరి. వారలు పరమపురుషార్థమునకు సహాయభూతులుగానట్లే ఈవ్యసనానుభవము నకును సహాయభూతులుగాక శబ్దాదివిషయప్రవణులై వానినే యభివృద్ధి నొందించుచు "పారిలోర్ పఴ్ఱియై నచ్చెవళుం పోయి కళ్ పేశవే" అనునట్లు సకల కల్యాణగుణాకరుఁడై, సకలపురుషార్థప్రదుఁడై, ఉల్లోక కమనీయ దివ్యమంగళ విగ్రహావిశిష్టుఁడై, అభివర్ణనీయుఁడై విరాజిల్లుచుండు సర్వేశ్వరుని విడిచి, గుణ హీనుఁడును, కురూపియును, అజ్ఞుడును, అశక్తుఁడునునగు క్షుద్రుని గుణపూర్ణుని గను, దివ్యసుందర విగ్రహ విశిష్టునిగను, సర్వజ్ఞునిగను, సర్వశక్తియుక్తునిగను నభివర్ణించుచు, అదియే పరమప్రయోజనమని తిరుగుచుండిరి. అంత వారల యనర్థమును జూచి, ఖడ్గాఘాతుని యవస్థ జూడ వృశ్చికదంశవ్యధ పోవునట్లు, తమ వ్యసనమును మఱచి వారల యనర్థమును నివారించుటకై హితోపదేశము జేయఁగ వారలు నత్యల్పవిద్యాలాభజన్య దురహంకార వివశులై దానిని సరకుఁజేయక యథాపూర్వముగనే యుండఁగ వారలను సవాసనముగఁ బరి త్యజించి "వాయ్కొండు మానిడంపాడవన్ద కవియేనల్లేన్" ఇత్యాదిగఁ దమకుఁ గలిగిన వైలక్షణ్యమును "శొన్నాల్ విరోధం" అను తొమ్మిదవ తిరువాయ్మొఴిలో విశదీకరించిరి.

(౧౦) కడపట—"సర్వేశ్వరుఁడు ప్రసాదించిన కరణగ్రామముచే వానినే కీర్తించుచున్న నాకు "నానోర్ కుత్తై విలనే" అనునట్లు ఒక కొఱఁతయును లేదు" అని "శొన్నం పలపల" అను దశమదశకమున నానతిచ్చిరి.

## చతుర్థశతకము (4-వ పత్తు)

(౧) "ఒరునాయకమ్" అను మొదటి తిరువాయ్మొఴిలో—

ఆళ్వార్లు సంసారులను జూచి "మీరితరుల స్తోత్రముజేయుట కొన్నిప్రయో జనముల నుద్దేశించియే గదా! ఐశ్వర్యకైవల్యాదులు అల్పాస్థిరములు; భగవ దనుభవము అనన్తస్థిరము. కనుక నల్పప్రయోజనముల కాసపడక, పరమపదా వాప్తికిఁ బ్రయత్నించువుఁడు" అని పరోపదేశమునఁ బ్రవృత్తులైరి.

(౨) ఇంతవఱకును క్రింది మూడు తిరువాయ్‌మొழிలయందును ఆழ்வార్లు పరోపదేశము జేసినది వారల కుపకరింపకపోయినను, వీరికి భగవద్విషయమున నత్యధికమగు నభిరుచి కలుగుటకు హేతువయ్యెను. దానిచే విరహానలము ప్రజ్వలింపగ తమ స్వరూపస్వభావములను విడనాడి పిరాట్టిదశ (నాయికావస్థ) ను బొంది విరహబాధను తాళఁజాలక మోహమూర్ఛితులైరి. ఆ మెదశను జూచుచున్న ఆమెతిరుత్తాయార్లు (జనని) "దేశకాలదశావిప్రకృష్టములగు నతని క్రమముల నేతద్దేశకాలదశావిశిష్టము లొనరించి, ఇప్పుడె యనుభవించి తీరవలయు నని పట్టుబట్టియున్నది. ఆహా! ఇది యెట్లు సాధ్యమగును?" అని వ్యసనపడెను. ఇట్టి యాழ்வార్లదశావిశేషము "పాలనాయేழ்లకు" అను రెండవ దశకమున నభివర్ణింపఁబడినది.

(3) "కోవై వాయాళ్" అను తృతీయదశకమున సర్వదేశసర్వకాల సర్వావస్థలయందును నతనికిఁ గలిగిన సౌందర్యాదివిశేషములన్నిటిని తత్క్షణమే యనుభవింపవలయునని అత్యన్తోత్కణ్ఠాతరంగితస్వాంతులై, కాలక్షమాసహ్య విరహవన్నులై ఆழ்வార్లు వ్యసనపడుచునుండ "పాషణ్డోపహత జన ప్రచురమగు నీ కలికాలమున నిట్టి భక్తాగ్రేసరులు లభించుటయా!" అని అత్యన్తహృష్టుడై సర్వేశ్వరుఁడు వీరి త్రివిధకరణములనే తనకు ననుభవయోగ్యములగు దివ్యహరిచందనము (తిరుచ్చాత్తుపడి), దివ్యపీతామ్బరము (తిరుప్పరివట్టము), దివ్యప్రసూనమాలికామతల్లిక (తిరుమాలై), దివ్యాభరణజాతము (తిరువాభరణము) మొదలగు భోగ్యోపకరణములుగఁ జేసికొని, వీరి సత్తనే తన కుజ్జీవనముగ నెంచియుండి, తన ప్రణయిత్వగుణమును ప్రదర్శింపగ, సందర్శించి, అత్యన్తసంహృష్టాన్తరంగులై, ఇట్టి ప్రణయిత్వగుణక్రమము నభివర్ణింప నాకు శక్యమా? లేక సర్వేశ్వరునకు శక్యమా? మఱి యితరులకు శక్యమా? అని అత్యన్తోత్సుకితమనస్కులై, ప్రావణ్యము మితిమీఱఁగ, సర్వేశ్వరుని సర్వక్రమములను యథేచ్ఛముగ ననుభవించి వ్యాముగ్ధులైరి.

(౪) ఇట్లీ తిరువాయ్‌మొழிలోఁ గలిగిన నిరవధికప్రీతిప్రవాహము, ఆழ்வార్లకు స్వాధీనత తప్పునట్లు ఉల్లోలకల్లోలసముజ్జ్వలమై ప్రవహింపఁగ సర్వేశ్వరుఁడు దానిని పరికించి "ఇది శుభావహ్యముగ పర్యవసించునేమో?" అని అతిస్నేహమునఁ బొవశంకాకలంకితుఁడై, ఆ యుత్తరంగితానందప్రవాహమును

కొంచెము తగ్గించి వీరికి స్వాధీనత చేకూర్చుటకై కొంచెము తిరోహితుఁడై నిలిచెను. అంత సర్వేశ్వరసంశ్లేషము లేకపోవుటచే మఱల విరహావసన్నులై నాయికావస్థను బొంది "కామీ స్వతాం పశ్యతి", "కామాంధానా మవివేకిత్వం" అనునట్లు, భగవత్సదృశపదార్థములను, తత్సమృద్ధి సంబంధి పదార్థములను జూచి అతఁడే యని భ్రమించి సంశ్లేషప్రవృత్తులై, అధిష్ఠాన యాథాత్మ్య జ్ఞానముచే భ్రమము నివృత్తముకాఁగ, నిరుత్సాహోపహతులై. విరహదుఃఖ-సాగరాన్తర్నిమగ్నులై, అనిర్వచనీయక్లేశము ననుభవించుచుండిరి. ఆ దశావిశేషమును జూచి, తజ్జనని (తిరుత్తాయార్లు) నిర్విణ్ణురాలై "మణ్ణైయిరున్దు" అను నాల్గవ తిరువాయ్మొళిలో నీమె (శఠగోపనాయకి) దశావిశేషముల నభివర్ణించుచున్నది.

(౫) "వీఱ్ తిరున్దేళులకు" అను నైదవ తిరువాయ్మొళిలో - వీరి భ్రమజన్యములగు దుఃఖావసాదములన్నియును దీరునట్లు సర్వేశ్వరుఁడు తన ఉభయవిభూత్యైశ్వర్యమును ఆళ్వార్లకు సాక్షాత్కరింపఁజేయగ వానికి మంగళాశాసనము జేసిరి.

(౬) అట్టుపై క్రింద తా మనుభవించినది కేవలము మానసానుభవాత్మకమై, బాహ్యకరణానుభవయోగ్యము గాకుండుటచే మఱల మోహమున కాస్పదమై మునిగెను. ఆళ్వార్లు మోహమూర్ఛితులు కాఁగ, ఈ గోపనాయకిదశను జూచి, బంధువర్గము భయపడి "ఈ యవస్థ దేవతాన్తర (క్షుద్రదేవతా) ప్రయుక్తమై యుండనోపు" అని యోచించి, దేవతాన్తరోపాసకుల రావించి తత్పరిహారము సాధింపఁ బ్రయత్నించిరి. అంత నీమెస్వభావములను బాగుగఁ గుర్తెఱింగిన సఖీమతల్లిక యొకతె జోక్యముఁ గలుగఁజేసికొని "మీ రూహించినది ఈమెవ్యాధికి పరిహారసాధకము గాకపోవుట యటులుండ, మీఁదుమిక్కిలి వినాశహేతువు. కనుక నా ప్రయత్నమునుండి విరమించి భగవన్నామ సంకీర్తనాదులఁ జేసియు, భాగవతశ్రీపాదరేణ్వాదులఁ జల్లియు పరిహరింపఁ బ్రయత్నింపుఁడు" అని "తీర్పారై యామిని" అను నాఱవదశకమునఁ బ్రబోధించెను.

(౭) "శీలమిల్లాచ్చిఱియన్" అను నేడవదశకమున శ్రీ శఠగోపనాయకి "వణ్ దువరావది మన్ననై యేత్తుమిన్" అనుచోట మృతసంజీవిని

యగు శ్రీ సుందరద్వారకాధిపతి దివ్యమంగళనామధేయమును వినుటచేఁ బ్రబుద్ధయై (మూర్ఛ తేఱి) తమ విశ్లేషమునకు నవధి తెలియనందున, కాలవిలమ్బ మును సహింప నేరక, ఔదాసీన్యస్థితిని విడిచి సర్వేశ్వరుఁడు తత్క్షణమే విచ్చేసి ముఖముఁ జూపింపవలసినట్లును, సముద్రము చేతినెత్తి పిలచునట్లును, వినినవారంద ఱును ద్రవీభూతులగునట్లును, ఉచ్చైస్స్వరమున దీనాతిదీనముగ విలపించిరి.

(౮) ఈరీతి విలపించుచున్నను "సర్వేశ్వరుఁడు మనకు ముఖము నైనను జూపక యుండునది మనయందలి యుపేక్షవలననే నై యుండును" అని యోచించి "వాని కక్కఱలేని నేనును నా సర్వస్వమును నెందులకై యుండ వలయును ?" అని ఆత్మాత్మీయములలో నిస్పృహ జనింపఁ దమ నిస్పృహను అన్యాపదేశముగ నానతిచ్చిరి.

(౯) "వానికి మనయందుఁ గొంచెమైనను యుపేక్ష లేనప్పుఁడు మాకీ శరీరము వద్దు, గిరీరము వద్దు. ప్రాణము వద్దు, గీణము వద్దు." అని వానిపై జుగుప్స యధికము కాఁగ వానిని వదలివేయవలయునని ప్రయత్నించిరి. కాని తాము 'వద్దు' అన్నంతమాత్రమున నవి నశించకుండుటను జూచి, ఒక పురుషార్థ మును బొందుట కెట్లు సర్వేశ్వరుని యనుగ్రహము కావలసియున్నదో, అట్లే శరీ రాదులు నశించుటకును అతని దివ్యసంకల్పము గావలసియుండును గదా ! అని నిశ్చయించి, సర్వేశ్వరునితో "నా ఆత్మాత్మీయములు నశించునట్లు కృపఁ జేయుమా" అని "నణ్ణాతార్ ముఱువలిప్ప" అను తొమ్మిదవ దశకమున మొఱఁబెట్టిరి.

(౧౦) కడపట సంసారుల దుఃఖములఁజూచి, తమ దుఃఖమును మఱచి, వారలను సన్మార్గగాములఁ జేసి వారి వ్యసనములఁ బాపుదమని, అత్యుదారతతోఁ బ్రవర్తించి, వారలు భగవద్విముఖులై యుండ "సర్వస్మాత్పరుఁడై సమస్త కల్యాణగుణాత్మకుఁడగు శ్రీమన్నారాయణుఁడే పరదైవతము, అతఁడే మోక్ష ప్రదుఁడు, అతఁడు సర్వసులభుఁడు, అతని నాశ్రయించి కృతార్థులు గండు" అని "ఒన్ఱుందేవు" అను దశమదశకమునఁ బ్రబోధించిరి.

## పంచమశతకము (౫-వ పత్తు)

(౧) రెండుకిట్టము లొకటిగఁ జేరగ దానిలోనొకటి స్వర్ణమగునట్లు, సంసా రులలో నొకరైన తాము తమ సంబంధముచే వారలను గూడ ముముక్షువులఁ

జేయఁగల తమ పుణ్యమునకుఁ గారణ మెయ్యదియో? అని యోచించి, వేఱెయ్యదియును నగుపడకపోవుటచే "కేవలము భగవన్నిర్హేతుకదివ్యకృపయే యందులకు మూలము" అని "కైయార్ శక్కరం" అను ప్రథమదశకమున నిరూపించిరి.

(౨) తరువాత "పాలిగ పాలిగ" అను ద్వితీయదశకమున—"ఒన్ఱు న్దేవు" అను తిరువాయ్మొழిలోఁ దమచే సమీక్షరింపఁబడిన (తిద్దుపాటుచేయఁబడిన) శ్రీవైష్ణవుల శ్రీపాదపద్మములకుఁ బ్రణమిల్లి, ఉపదేశమును పెడచెవిని బెట్టి కొంచెమైనను మారక సత్పథవిదూరులగువారల నుపేక్షించియు, భగవత్సమృద్ధికి మంగళాశాసనము జేసిరి.

(3) "మాశఱు శోది" అను మూడవ దశకమున— "మయలుం శుడరొళిమూర్త్తి మాయప్పిరాన్ కణ్ణన్ఱన్నై" అని దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును, అసంఖ్యాక కల్యాణ గుణగణములను బహువిధములుగ ననుసంధించి, అతని బాహ్య సంశ్లేషాపేక్ష గలిగి, గాఢాలింగనముఁ జేసికొనఁ గోరి, అతఁడు చేజిక్కకపోఁగా నత్యన్తవ్యాకులితాన్తరంగులై నాయికావస్థను బొంది "మడలెడుక్కై" అను విరహాంగనలు జేయు ప్రతిక్రియ ననుష్ఠించుట కుపక్రమించిరి.

(౪) మడలూరుటకు ముం దభిమతవిషయమును చిత్రమున వ్రాయవలసియున్నది. దాని కవకాశము లేకుండునట్లు దైవయోగముచే నస్తమింపఁగ, మఱియును మధ్యరాత్రముకాఁగ, దోషముల నెంచువారును, హితముపదేశించువారును గూడ నిద్రించుచున్నందున, ఎవరును సహాయమునకు లేకున్నను ప్రళయాపదయందునయితము సర్వరక్షకుఁడై నిత్యసన్నిధానముఁ జేసియుండు సర్వేశ్వరు ననుసంధించి కొంత అప్యాయతను జేకూర్చుకొని "ఊరెల్లాం తుంజి" అను నాల్గవదశకమును గీర్తించిరి.

(౫) ఈ దశలో బంధువులందఱును "నీ విట్టి విషయమున నతిమాత్రప్రవణవై యుండుట నీ కులమునకే యమర్యాదావహము, నీస్త్రీత్వమునకును దగినది కాదు, వాని పరత్వమునకును ననురూపమైనది కాదు." అని హితమును జెప్పి సేదదీర్చుటకుఁ బ్రయత్నింపఁగ, "శ్రీనమ్బియొక్క దేహసౌందర్య సౌకుమార్య లావణ్యాదులు, అవయవముల పొందికపొంకములు, నగల చక్కదనము మొదలగునవియన్నియు నుల్లోకకమనీయములు. వానినెల్ల ననుభవించునపుడు

మీ హితవచనములు నామనస్సున కెక్కవు. కనుక మీ యుపదేశములన్నియును వ్యర్థములు. నేను మిక్కుటమగు బాధ ననుభవించుచున్నాను" అని "ఎజ్ఞ నేఱో" అను నైదవ తిరువాయ్మొఴిలో నానతిచ్చిరి.

(౬) "కడల్ఞానమ్" అను నాఱవ తిరువాయ్మొఴిలో — క్రింది తిరువాయ్మొఴిలోఁ బ్రీత్యప్రీతులు రెండును సమముగా నుండినవి. రెండును జేరి ప్రవహించినచోఁ బ్రీతియే యున్మత్తకమై యుండును. కాని భాగ్యహానిచే నప్రీత్యంశమే యుత్కటమై ప్రవహించినది. అందుచే వీరికిఁ గ్రింద ప్రత్యక్షసమానాకారముగ నతని దేహసౌందర్యాదుల ననుభవించి పొందిన యాప్యాయన విషయముకూడ నివృత్తమై, అలాభజన్యవ్యసనమే యధికమైనది. అంత శరగోపనాయకి, నందవ్రజకుమారికలవలెను, శ్రీప్రహ్లాదాళ్వార్లవలెను, అతని ననుకరించి యుజ్జీవింపఁ బ్రయత్నించెను.

(౭) ఇఁక "నోఱ్ఱనోన్బిలేన్" అను నేడవదశకమున — ఇంతటి దుఃఖవ్యాకులత కలిగినను, అతఁడు ముఖమైనను జూపకుండుటను బరికించి "ఈ విరహము స్వరూపానుబంధి యని తెలిసికొనలేక, యతఁ డుపాయమని యెంచి యుండనోపు" అని నిశ్చయించి తమ యాకించన్యమును విశదపఱచి శిరీవరమంగళనగరిలో వేంచేసియుండు 'వానమామలై' పెరుమాళ్ళ తిరువడిగళ్ళలో (సర్వేశ్వరుని దివ్యపాదారవిందములయందు) ననన్యగతికులై ఛిన్నమూలమగు మహావృక్షమువలె పడి శరణుజొచ్చిరి.

(౮) శరణుజొచ్చినను అభిముఖ్యమును జూపింపక, ఔదాసీన్యము వహించియుండుటను బరికించి, సముద్రమున మునిఁగినవార లచ్చట నేదేని యొక తెప్పకొయ్య యవలంబనముగఁ దొఱకఁగా దానిని పట్టుకొని యుజ్జీవించునట్లు, ఆళ్వార్లును నీస్థితిచే 'ఉపాయాన్తరముచేఁ బ్రయోజనముసిద్ధించు' నని యితరుల నడిపంచలఁ గాచియుండు నా భ్రమమును బోఁగొట్టె" నని నిర్ణయించుకొని యాశ్వాసమును బొందిరి. ఆ యాశ్వాసజనిత ధైర్యసాహసములు వారిని "తిరుక్కుడన్తై" అను దివ్యదేశమువఱకును నడిపించినవి. కాని అచ్చటకుఁ జనినంతనే ధైర్యము సడలి మరల నవసాదము మిక్కుటముకాఁగ "ఇంకను నే నన్ని గడపలఁ గాచి యుండఁగలవాఁడను. ఎన్నిచోట్లని తిరుగుచుండఁగలను." అని తమ యార్తిని "ఆరావముదు" అను నెనిమిదవదశకమునఁ బ్రకటీకరించిరి.

(౯) "మానేయ్‌నోక్కి" అను తొమ్మిదవ తిరువాయ్మొళిలో— ఇచ్చటనుగూడ తమ యభీష్టము నెఱవేరనందున "తిరువల్లవాళ్" అను దివ్యదేశమునకుఁ బోవలయునని ప్రయత్నించిరి. కాని తమ యభిమతము సిద్ధింపక పోవుట యట్లుండ నచ్చటికి వెళ్ళుటకుఁగూడ శక్యముగాకుండెను. అట్లు తమకుఁ గలిగిన యవసాదమును తమ సఖీలలామతోఁ జెప్పునట్లు, క్రమమున నన్యాపదేశముగ నానతిచ్చుచున్నారు.

(౧౦) కడపట "పిఱన్దవాఱుమ్" అను పదియవదశకమున—"తిరువల్లవాళ్" అను దివ్యదేశమునకు వెళ్ళుటకు కాలినడక సాగనందున మధ్యేమార్గమునఁ బడియుండి బహుభంగుల మొఱలిడిరి. ఇంతలోపల "వాని గుణానుభవముఁ జేసియైనను ఉజ్జీవించెదము" అని ప్రయత్నించి, అదియును మోక్షమువలె పరమదుర్లభమై కనుపట్టగ నత్యన్తశిథిలసర్వేన్ద్రియులై, దానిచే శ్రమపడి "సర్వావస్థలయందును నిన్నడఁబాసియున్నను భవత్కల్యాణగుణానుభవమును జేయుచు నుజ్జీవించునట్లు నన్ననుగ్రహింపుమా స్వామీ!" అని సర్వేశ్వరుని శ్రీపాదారవిన్దములలో శరణాగతులైరి.

## షష్ఠశతకము (6-వ పత్తు)

(౧) ఇంతవఱకును భగవదత్యన్తప్రీత్యాస్పదములగు దివ్యదేశములయందు శరణుజొచ్చియు ఫలింపనందున సమాశ్లేషయోగ్యములగు నని విభవావతారముల కాశపడిరి. అయినను అవి కాలాన్తరసంవృత్తములగుటచే దుర్లభములు కాఁగ, మఱల "నిత్యసన్నిధ్యభ్యాసాదులచేఁ బూర్ణమగు నర్చావతారమే మనకు శరణ్యము" అని 'తిరువణ్వణ్డూరి'లోఁ వేంచేసియుండు పెరుమాళ్ళయందు భక్తిని నిలిపిరి. అతఁ డెంతసేపటికిని సాక్షాత్కరింపనందున "అచ్చట నార్తులు పలువు రుండుటచే వారి సంరక్షణవ్యగ్రుఁడై నన్ను విస్మరించినట్లున్నది. మన యార్తిని దెలిపినచోఁ దప్పక విచ్చేయును." అని నిశ్చయించి, "వైగల్ పూఙ్గళివాయ్" అను ప్రథమదశకమున నచ్చటనుండు విహంగముల చరణములకు వందనముల నర్పించి దౌత్యము (రాయబారము) ను నెఱపిరి.

(౨) "మిన్నిడై మడవార్" అను ద్వితీయదశకమున— క్రిందిదశకమునఁ దాము బంపిన దూతలు (సందేశహారకవిహంగములు) అతని సన్నిధికిఁ జని, యతనికి నాయికాపరిస్థితిని దెలుపఁగ, ఆ సర్వేశ్వరుఁడును దయార్ద్రి

హృదయుఁడగుటచేఁ బరమార్తుఁడై, గజేంద్రుని సంరక్షించుటకుఁ జనుదెంచిన విధమున నతిసంభ్రమమున విచ్చేయుచుండెను. అంతవఱకును తాళఁజాలక, అసహ్యవేదనాపరవశురాలై యలమటించి, ప్రణయరోష మున్మస్తకము కాఁగ, "ఇఁక నతఁడు వచ్చినను సంశ్లేషింపము" అని తన సఖీజనులును తాను సంకల్పించుకొని, అతనికిఁ దెలియని యొకానొక స్థలమునకుఁ బోయి యుండ వలయునని యోచించి, ఒక పూఁదోటలోని నిసుకతిప్ప (దిబ్బ) పై, తన్మధ్య మున నతిమనోహరమగు మంటపమున వీరలందఱును సమూహముగఁ జేరి, అతఁడు వచ్చినను వానితోఁ నుత్తరప్రత్యుత్తరములు జరుగుట కవకాశము లేనట్లు, నల్లకాకి, చిలుక, బంతి మొదలైన చేతనాచేతనాత్మకములగు లీలోపకర ణములఁ గావలిబెట్టి, అనాదరమను పాషాణమయ ప్రాకారమును గట్టికొని అతిజాగరూకులై యుండఁగా; ఇతని జీవనాదృష్ట విశేష పరిపాకమున వీరలు మఱచి పడవైచిపోయిన కందుకము (బంతియు), కటకము(అందెయు)ఇతనికాలికిఁ దగులఁగ, వానినెత్తి "మన యదృష్టము పండినది" అని యుప్పొంగుచు సబహు మానముగఁ దన యుత్తమాంగమున నుంచుకొని, నాయకీవిషయమగు తన వ్యామోహము నంతయును వీనియందే కనఁబఱచి, తన సౌందర్య సౌశీల్య సౌభాగ్యములచేతను తన దుస్సహ విరహ యాతనా ప్రకటనాదులచేతను, అను వర్తన, అనునయ, ప్రణిపతనాదులచేతను నాయకియొక్క ప్రణయకోపము ను మాన్పి, ఆమెతో సంశ్లేషించెను. ఆ విధమిందు నభివర్ణింపఁబడినది.

(౩) ప్రణయరోషముచే "అతనితోఁ జేరగూడదు. మనకు మరణమే శరణ్యము" అని నిశ్చయించుకొని మరణింపఁ బ్రయత్నించుచున్న తమను తన శక్తి విశేషముచే నుజ్జీవింపఁజేసిన యతని వాత్సల్య స్వామిత్వ సౌశీల్యాది కల్యాణ గుణగణముల "నల్ కురవు" అను మూఁడవదశకమున ననుసంధించి సంభ్ర మాశ్చర్య ప్రహర్ష పులకిత గాత్రు లగుచున్నారు.

(౪) ఆ యనుసంధానము ప్రాసంగికమై "మాశరు శోది" మొదలగు దశకములలోఁ గలిగిన వ్యసనములన్నియును దీఱునట్లు శ్రీ బృందావనవృత్తాన్త మును బ్రదర్శింపగ సందర్శించి, దానిని వృత్తకథవలెగాక సమకాలికోదన్త ముగ సాక్షాత్కరించికొని "కురవై యాయ్చ్చియర్" అను నాల్గవ తిరు వాయ్మొళిలో ననుభవించిరి.

(౫) ఆ యనుసంధానమే, పానము సేయఁబడు పానీయమే పొర పోయినచో పారవశ్యమును గలుగఁజేయునట్లు, రసాన్తరమునఁ బ్రవేశింపఁజేయఁగ, తమస్వరూపమును మఱచి యొక నాయికావస్థను బొంది, తనకుఁ గలిగిన దశాపరిపాకమును సఖిజనులచేఁ దల్లికిఁ దెలుపుచున్నవారలై, అన్యాపదేశముచే "తువళిల్ మామణి" అను నైదవదశకమున నభివర్ణించిరి.

(౬) ఈమె తనవిరహదశ నానాఁటికిని వృద్ధిఁజెంది వ్యసన మగ్గలము కాఁగ మోహమూర్ఛితురా లాయెను. దానినిఁ జూచి సహింపనేరక ఈమె సఖియును మూర్ఛిల్లెను. అట్టి దురవస్థను జూచియు నీమె నుజ్జీవింపఁజేయు నుపాయమును యోచించుటచే జీవించియుండు ఈమెజనని, ఈమెవలయాదులు జూడఁజూడ శిథిలములగుటఁ జూచి వానినిఁ బ్రత్యేకప్రత్యేకముగఁ జెప్పి పిలుచునట్టి వాక్యసరణితోఁడ నీమెదశను "మాలుక్కువైయుమ్" అను నాఱవ తిరువాయ్మొఴిలో నభివర్ణించిరి.

(౭) మూర్ఛిల్లిన కొమార్తెయొక్క యవసాదమును జూచిన జనని "అది పోయినది, ఇది పోయినది" అని యతని తిరునామములఁ జెప్పుచు నామెయును మోహమూర్ఛితురా లాయెను. అంతఁదిరునామప్రసంగముచేఁ గుమార్తె మేల్కొని లేచి బయలుదేరి 'తిరుక్కోళూరు' నకుఁ జనుదెంచెను. జననియు వాసనచేఁ బ్రబుద్ధురాలై కుమార్తె శయనమును వీక్షింపఁగా నయ్యది శూన్యమైయుండ, "నా గర్భవాసమున జనించినందునను తనస్వభావము ననుసరించియును తిరుక్కోళూరునకుఁ జనుదెంచియుండును" అని నిశ్చయించుకొని, ఈమె "అయ్యో! తనయనుగూడ పోఁగొట్టుకొంటినే" అని యార్తనాదము చేయుచు స్వదశను "ఉణ్ణుంశోఱు" అను నేడవదశకమున నభివర్ణించెను.

(౮) ఈ తిరువాయ్మొఴిలో— జనని "ఎచ్చటఁ బ్రవేశించితివి" అని వ్యసనపడుటయే ఫలించి తనచాపల్యముచే బయలుదేరిన యామె చివరి వఱకును పోఁజాలక తన నగరోపవనమునఁ బడియుండి వ్యసనపడుచుండెను. అప్పటికిని అతనిరాకను గుఱించిన సమాచార మెయ్యదియును తెలియనందున అచ్చట నగుపడిన పక్షులను, ఏకదేశవాసిత్వముచేఁ గలిగిన సంబంధమును బురస్కరించుకొని వాని ఐకరస్యమును శ్లాఘించుచు, "పొన్నులగు" అను నెనిమిదవదశకమున వానిని సందేశహారుల (దూతల) నుగఁ బంపిరి.

(౯) వీరు "ఎఙ్గుంశెన్ఱాపిలుం కణ్డుం" (సర్వదిక్కులకును వెళ్ళియైనను చూచి) అనియు, "వానవర్ కోనైక్ కణ్డు" (దేవాదిదేవుని జూచి) అనియును దార్త్యమును నెఱపుం డని కోరిరి. అవి కదలిపోలేకుండునట్లు తమ యార్త ధ్వనిచేఁ బిలిచిరి. అంతనవి కదలకయున్నందున తమ పరిసరమున కాలినడక నడచిపోవువార లెవ్వరును లేరుగదా! అని యోచించి మన నాదముచే "మరంగళుం మిరంగుం" (వృక్షములు సైతము కరుణజూపును) అని యచే తనములుగూడ కరుణార్ద్రములగుచుండఁగ, పరమచేతనునికి చెప్పవలయునా? అని తమ యార్తనాదాదులచే నతనిని "నీరాయ్ నిలయాయ్" అను తొమ్మి దవదశకమువఁ బిలపించుకొనఁ జూచిరి.

(౧౦) ఈరీతిగ గొప్పయార్తిచేఁ బరమపదమునకు వినఁబడునట్లు విలపించుచుఁ బిలుచుచున్నను, అతఁడు ముఖము సైనను జూపింపకుండెను. అంతట సకలచేతనోద్ధరణార్థము సకలాభీష్టఫలప్రదుఁడై శ్రీవేంకటాచలమున (తిరుమలలో) వేంచేసియుండు తిరువేంగడముడైయాన్ (శ్రీ శ్రీనివాసుని) తిరువడిగళ్ళలో పెరియపిరాట్టియార్లను (శ్రీ లక్ష్మీదేవిని) పురస్కరించుకొని సాంగోపాంగముగ శరణాగతిఁ జేసిరి. ఈ క్రమమును "ఉలకముణ్డపెరువాయా" అను పదియవదశకమున నత్యాశ్చర్యకరముగ నభివర్ణించిరి.

సప్తమశతకము (7-వ పత్తు)

(౧) క్రింద "ఉన్నడిక్కీ ఞ్ అమర్న్దు పుకున్దేన్" అని తమయొక్క ఆంకిచన్యమును విశదపఱచి విజ్ఞాపనముజేసియు నతఁడు తన ముఖమునైనను జూపఁడాయెను. అందుపై "విషయములు నిన్ద్రియములును పరస్పరసంబద్ధములై విరాజిల్లుచుండెడి యీ సంసారమున మనలను బడవైచినవ్వాఁడే, వీనికి మనలను దాసులనుగఁ జేసివైచెను. ఇఁక మనకు వేరుగతి లేదు." అని వినునార లందఱును ద్రవించునట్లు వాపోవుచు "ఉణ్ణిలావియ" అను ప్రథమదశకమున నార్తనాదముఁ జేసిరి.

(౨) ఇట్లు వాపోయినను వాఁ డాభిముఖ్యమునుఁ జూపనందున, తమ స్వరూపమును వీడి యొక నాయికావస్థను బొంది, మోహానమూర్ఛితులైరి. అప్పుడీమెతల్లి (తిరుత్తాయార్లు) కల్యాణమంటపమున శ్రీరంగనాథుని దివ్య పాదారవిందములలోఁ దన కుమార్తె నునిచి "ఈ మెవిషయమున దేవరవార్లు

ఏమి చేయఁదలంచి యున్నారు" అని "కఙ్గులుం పగలుమ్" అను ద్వితీయ దశకమున విలపించెను.

(3) అంత శఠగోపనాయిక మూర్ఛదేఱి "వానిపొందు లభించినగాని జీవించను" అనునట్లుగ విరహావసాదము మిక్కుటము కాఁగ దక్షిణదేశమందుండు మిగుల రమ్యమైన "తిరుప్పేర్" నగరమునకు వెళ్ళవలయునని బయలుదేరఁగ, ఈమెతల్లియు సఖీజనులును దీనిని జూచి ఈమెను బరివేష్టించి నిలచి "నీ కింత యతి మాత్రప్రావణ్యము తగదు" అని మందలించిరి. "మీరు చెప్పి ప్రయోజన మెయ్యదియును లేదు. నామన స్సప్పుడే యచ్చటికి వెళ్లి చేరిపోయినది. కనక లాభములేదు. నేనె వెళ్లుటకుముందు మీరలే తీసికొనిపోయి అచ్చట జేర్చుటకు సిద్ధపడుఁడు." అని సహజములగు లజ్జాసంకోచాదులను వీడి ధైర్యముతో నతిస్పష్టముగ వారలతోఁ జెప్పివైచెను. ఈప్రకారమే "వెళ్లెచ్చ్వరి శెఙ్గు" అను తృతీయ దశకమున నభివర్ణింపఁబడినది.

(౪) ఈ తిరువాయ్మొழிలో "పేర్కిల్ శూழ் కడల్ తెన్ ఇలఙ్గై శెற்ற పిరాన్" అని శ్రీరామావతారమందలి విజయము ప్రస్తుతము కాఁగ, ఇదియే సమయమని, తత్ప్రసంగమున నెల్ల యవతారములయందలి తనవిజయపరంపరలను బహుముఖముగ సర్వేశ్వరుఁడు వీరికి సాక్షాత్కరింపఁజేయఁగ సందర్శించి "ఆழி ఎழ చ్చఙ్గుమ్" అను నాల్గవ తిరువాయ్మొழிలో ననుభవించి సంతుష్టులైరి.

(౫) "అవతారములు స్వాశ్రితభక్తసంతరణోపయికములు. ఇట్లుండునవి కొంచమైనను ప్రయోజనపడనట్లుగ సంసారులు బాహ్యవిషయములలో నత్యంత ప్రవణు లగుచున్నారు. ఆహా! ఇది యేమి దౌర్భాగ్యము?" అని "కణ్ణార్ ఇరామపిరానై" అనునై దవదశకమున నాశ్చర్యచకితులైరి.

(౬) "సంసారులు భగవద్విషయమునం దపేక్ష లేమింజేసి నశించు చున్నారు; అపేక్షగలిగిన మనము నశింపము. కావ మన మతని యవతారములను దివ్యమంగళవిగ్రహ సౌందర్యమును జేర్చి యనుభవింతము" అని కుతూహలపడిరి. కాని అవి దేశకాలవిప్రకృష్టము లగుటచే దగ్గఱకుఁ జని యనుభవించుటకు దుర్లభములగుటవలన మిక్కిలి విషణ్ణులై, సర్వేశ్వరునకు పరమపదమునందును నివాసము మిక్కిలి శ్రమావహమగునట్లు దీనాతిదీనముగ మొఱ పెట్టుకొనిరి. అట్టి మొఱ నాలకించి యౌదాసీన్యమును విడచి యతఁడు తలక్షణమే

వచ్చి ముఖము జూపవలసినట్లును, వినువార లందఱును నిలువున నీరగునట్లును, పెద్ద యార్తవారముతో నార్తనాదమును "పామరు మూవులగుమ్" అను నాఱవ దశకమునఁ జేసిరి.

(౭) వాని దేహసౌందర్యవిషయమైన రసానుభవము మనస్సులో నుద్భవించి, భావనాప్రకర్షముచే బ్రత్యక్షసమానాకార విషయతావైశద్యము గలుగఁగ, అయ్యది ప్రత్యక్షమేయని యధ్యవసించి గాఢాలింగనముఁ జేయఁగోరి చేతులఁ జాచి, అప్పుడే యది సిద్ధింపమిని దమకుఁ గలిగిన యాశాప్రకర్షమును "ఏఴైయరావి" అను నేడవదశకమున సర్వేశ్వరునితోఁ గలసిమెలసి సుఖించి విశ్లేషము నొంది వ్యథపడుచున్న యొకానొక నాయికయొక్క వాక్యసరణిలో నానతిచ్చిరి.

(౮) "మాయావామననే" అను నెనిమిదవ దశకమున — ఆ విశ్లేష వ్యసనమువలన బాధపడిన శ్రీ శఠగోపదివ్యసూరులు "సర్వేశ్వరుఁడు తాను సంకల్పించిన కార్యనిర్వహణకై మనల నిచ్చటనే యుంచును" అను భావము నివృత్తము కాఁగ "నాకీసంసారమునం దనపాయత జనించి, ఇచ్చట నొక క్షణకాలమైనను నుండలేనట్లున్నను నన్నీసంసారముననే పడవైచి లాగుకొనిపోవుచున్న యాశ్చర్యవిషయము నాకానతీయుఁడు" అని మనవిజేయగా "ఇందులకా మీ రాశ్చర్యపడునది? ఇంతమాత్రమే గాక మా యద్భుత జగదాకార స్వరూపము నభివీక్షింపుఁడు." అని తమ విరాట్స్వరూప సందర్శనము ననుగ్రహింపఁగ, తనివిదీర సందర్శించి తదనుస్మరణాదులచే విస్మితులైరి.

(౯) ఈ యనుసంధానము ముగియఁగనే మరల యథాపూర్వముగ మొఱబెట్ట నారంభించిరి. అంతట నతఁడును శ్రీభీష్మాచార్యులవారిద్వారా లోకమునకు విజ్ఞానవిభూతినిఁ బ్రజ్వలింపఁజేసినటుల, "మాకును మాసంబంధులకును సత్కాలక్షేపమునకై కొన్ని దివ్యప్రబంధముల మీచే విరచింపఁజేయఁగ సంకల్పించియున్నారము. అది సమాప్తమగువఱకును మి మ్మిచ్చటనే యుంచెదము" అని సమాధానము ననుగ్రహింపఁగ; వీరును దానిని సహింపనేరక "ఇది యొక కారుణ్యమందు విధమా?" అని యనుసంధించి "ఉదవి క్కైమ్మాఱు ఎన్నుయిర్ ఎన్నవుఱ్ కెణ్ణిల్, అదువుం మఱ్ఱాఙ్గవన్ తన్నదు" అని ప్రత్యుప

కార మేదియును జేయలేకుండుటను "ఎన్నక్కూమెన్నై" అను ...దవ తిరువాయ్మొళిలో నానతిచ్చిరి.

(౧౦) మఱియును ప్రత్యుపకార మేదియును జేయలేక శ్రమపడిన వీరు వాని కొకదానిని సమర్పించుటకును, అతఁడు దానిని స్వీకరించుటకును తగిన వస్తువెయ్యది తమవద్ద కలదా యని యోచించిరి. ఒక యుపాయము స్ఫురించెను. మనము గానముజేసిన తిరువాయ్మొళిని వినుటకై సర్వేశ్వరుఁడు 'తిరువాఱన్విళై' అను దివ్యదేశములో తిరువనన్దాళ్వాన్లకై దేవేరులతోఁగూడ వేరోలగమున్నవాఁడు. కనుక నచ్చటకు వెళ్ళి తిరువాయ్మొళిని వినిపించి దాస్యమును జేయుదము అని "ఇన్బం పయక్క" అను పదియవ తిరువాయ్మొళిలో తీర్మానించుకొనిరి.

## అష్టమశతకము (8-వ పత్తు)

(౧) ఈ యనుభవ మంతయును మానసగోచరమై బాహ్యానుశ్లేషాయోగ్యమై యుండినది. అందుచే యథామనోరథము ఫలము ననుభవింపలేక పోయినందున తమ నసహ్యించుకొని "దుర్భగుఁడనగు నేను జనించినందున సర్వేశ్వరుని కల్యాణగుణగణము లన్నియును మాయములయిపోయినవా యేమి?" అని అతిశంకితులైరి. సర్వేశ్వరుఁడు "మీ రట్టి సందేహము పడవలదు" అని తన విస్రమ్భణీయత్వగుణమును బ్రదర్శించి వీరి యతిశంకను నివర్తింపఁజేసి సమాధానపఱచెను. అంత వీరు సమాహితులై దాని ననుసంధించి "దేవిమారావార్" అను ప్రథమదశకమున ప్రసన్నులైరి.

(౨) ఈ తిరువాయ్మొళిలో- ప్రాసంగికముగ "యానుం నీతానే యావతో మెయ్యే" అని సర్వేశ్వరుఁడే యుపాయమని నిష్కర్షించి అది కార్యకారికానందున నాయికావస్థను బొంది, అతని రాకను ప్రతీక్షింపక తామే యతఁడుండుచోటికి వెళ్ళుటకు నంసిద్ధులైరి. దానిని జూచిన సఖులు "నీ కిది తగను చూడుమా!" అని ప్రతిషేధింపఁజూచిరి. "మీవద్ద మాకు విశ్వాసము లేదు" అని వారికి "నఙ్గళ్ వరివళై" అను రెండవ తిరువాయ్మొళిలో కద్భితముగఁ జెప్పివైచిరి.

(3) ఈతిరువాయ్మొళిలో "ఓర్కోల నీల నన్నెదుంకున్ఱం వరువతొప్పాన్" అని యతని దివ్యమంగళ విగ్రహ సౌందర్యము ననుభవించిరి.

దీనిచే దాము పడినశ్రమము తీరినది. అయినను శరీరముతోఁగూడ శత్రుభూయిష్ఠమైన నాసంసారమున నుండుటకు జుగుప్సపడి అతని మైకాన్త్యమునకు భంగము వాటిల్లునేమోయని భయపడిరి. అంత సర్వేశ్వరుఁడు “మీరు మాకై భయపడవలదు” అని తన సర్వశక్తిసమన్వితత్వమును ప్రదర్శించి, తమ్ము సమాధానపఱచిన క్రమమును “అఙ్గు మిఙ్గుమ్” అను తృతీయదశకమున నభివర్ణించిరి.

(౪) ఇచ్చట సమాహితులై యున్నవారు “సముద్రమును మథించినది దేవయోనిలో జన్మించిగదా! ఇచ్చట నట్లుగాదే” అని మరల వ్యాకులితాన్తఃకరణులు కాఁగ, తన శౌర్యవీర్యాదిగుణగణములఁజూపి, అటుపై “తిరుచ్చెఙ్గున్ఱూ” రిలో ‘తిరుచ్చిట్ఱాఱ్’ అనెడి నదీతీరమున మాకు రక్షకులుగానుండు వారలు మూడువేలమంది బ్రాహ్మణశ్రేష్ఠు లున్నారు. కనుక భయమునకు నాస్కారమే లేదు, అని వారి సందఱిని సేవింపఁజేయఁగ, వారినందఱిని సేవించి సంతుష్టులైన క్రమము “వార్ కడానరుచి” అను చతుర్థదశకమున ననుగ్రహించిరి.

(౫) “మాయక్కూత్తా” అను పంచమదశకమున వానికి రక్షణ యున్నదని భయముతీఱి, యథేష్టముగ దేహసౌందర్యము ననుభవించిరి. ఆ యనుభవప్రకర్షముచే బాహ్యసంశ్లేషాపేక్ష కలిగి అది లభ్యము కానందున దావానలదందహ్యమానులవలె సంతప్తులై, మే మీ క్లేశముతోఁగూడ నశించి పోవలసినదేకదా యని దుఃఖనిర్భరులైరి.

(౬) అంత సీశ్వరుఁడు “వీరివ్యసనమును దీర్పలేకున్నామే” అని పరితప్తహృదయుఁడై వీరిముందఱ వచ్చుటకు సిగ్గుపడి “ఇఁక మనము ముఖము జూపినచో ప్రేమప్రవాహమగ్నులమై దేహమును త్యజింతురు. కనుక ప్రేమప్రకర్షమును కొంచెము తగ్గించి కొంచెముకొంచెముగ నానందము ననుభవింపజేయుచు మనము ఆనందింతము” అని “తిరుక్కట్టిత్తానము” న వేంచేసియుండి వీరియం దధిక వ్యామోహముగలవాఁడై యుండెను. ఆళ్వార్లు దీనినంతయు ననుసంధించి, అత్యంతస్నిగ్ధులై, మృదుమధురముగ “ఎల్లియుం కాలైయుం” అను నాఱవ దశకము నానతిచ్చిరి.

(౭) ఇఁక “ఇరుత్తువియన్దన్ఱు” అను నేడవతిరువాయ్మొళిలో— “మాయక్కూత్తన్” అనుదానిలో తమకు గలిగిన విరహక్లేశము తీఱునట్లు

సంశ్లేషింపఁగ, దానిని వీరికి నుపకరించుటమాత్రమేగాక తనకు పరమప్రయోజనముగ నెంచియుండుటను అనుసంధించి విస్మితులై "అహా! ఇదియేమి ఆశ్రితపారతంత్ర్యము? ఇదియెట్టి సౌలభ్యము!" అని వాని భక్తపరాధీనత ననుసంధించి అత్యంతసంహృష్టాన్తరంగులైరి.

(౭) ఈరీతిగ వీరి విరహతాపము తీరునట్లు సంశ్లేషించి తన విరహతాప ముపశమింపఁగఁ బ్రీతుఁడై యున్న సర్వేశ్వరుఁడు, "వీరు తమ అయోగ్యత ననుసంధించి మెల్లగ జారిపోవుటకు యోచనఁజేయుదురు. కాఁబట్టి వీరిభ్రమను నిశ్శేషముగఁ బోఁగొట్టవలయును" అని తలంచి "ఓభక్తాగ్రేసరా! రండు. మా దివ్యమంగళవిగ్రహసౌందర్య ముండువిధమును సేవింపుఁడు. మమ్ము బాగుగ సేవించితిరేని మా తిరుమేనిలో మిమ్ము గూడ చూడగలుగుదురు" అని వారినిఁబిలచి తనకు హారకేయూరనూపురాదులకంటెను నత్యన్తభోగ్యమగు నాత్మవస్తువుయొక్క స్వరూపమును సాక్షాత్కరింపఁజేయగ, దానిని "కణ్ణాళ్ శివన్దు" అను నష్టమదశకమున ననుభవించిరి.

(౯) ఇట్లు ఆత్మస్వరూపము ననుభవించిన ప్రీతిప్రకర్షముచేఁ దమ స్వరూపమును విడిచి నాయికావస్థను బొంది 'తిరుప్పులియూ' రిలో సర్వేశ్వరునితో యాదృచ్ఛికసంశ్లేషమును బొంది వానిచే నపహృతచిత్తులై యుండు క్రమమును ప్రాణసఖి యొకతె చూచి ఈమె శరీరవర్ణవిపరివర్తనముచేతను, సంభాషణ క్రమవైలక్షణ్యముచేతను 'తిరుప్పులియూర్ నాయనార్ల' తోఁగూడ నీమెకు సంశ్లేషము ప్రవృత్తమైన దని తెలిసికొనెను. ఈవిషయము లేమియును దెలియని మాతాపితృదులు ఈమెకు పతిసంయోగసులభమగు వయఃపరిపాకము సంప్రాప్తమగుటను పరికించి వివాహమును జేయ సమకట్టి స్వయంవరతూర్యముల నగరమున ప్రయోగింపఁజేసిరి. దానిని విని యాం ప్రాణసఖి "మీరు స్వయంవరమును చాటిన దీమె చెవికి సోకినచో నీమె బ్రతుకదు. తిరుప్పులియూర్ నాయనార్ల యందే యీామె అత్యన్తప్రవణయైయున్నది. కాన వారితోఁజేర్పుఁడు" అని ప్రబోధించెను. ఇట్లు అన్యాపదేశముగ తమదశను "కరుమాణిక్కమలై" అను తొమ్మిదవదశకమున నభివర్ణించిరి.

(౧౦) క్రింది రెండుదశకములయందును ఆత్మయొక్క అనన్యార్హశేషత్వస్వరూపము ప్రతిపాదింపఁబడినది గదా! ఆ యనన్యార్హశేషత్వమునకు

పరాకాష్ఠ తదీయ శేషత్వ మగుటచే " త్వదీయ శేషత్వమే కాలత్రయ ముందువారి కును నాకును నాసంబంధిసంబంధులకును లభ్యమైయుండునటుల కృపజేయుము" అని " నెడుమాఱ్కడిమై " అను పదియవదశకమునఁ బ్రార్థించిరి.

## నవమశతకము (9-వ పత్తు)

(౧) " శొన్నాల్ విశ్శేర్ " అను ప్రథమదశకమున— " భాగవత శేషత్వమే పురుషార్థము " అను పరమార్థమును దెలియఁబరచిన సర్వేశ్వరుఁడే నిరుపాధిక బన్ధువు, అతఁడే ప్రాప్యము ప్రాపకమును. " అను విషయమును చేతనుల కుప దేశించి "సోపాధికబంధువుల నందఱిని విడిచిపెట్టి నిరుపాధిక బంధువగు సర్వేశ్వరునే భజింపుఁడు " అని వారలఁ బ్రార్థించిరి.

(౨) ఇట్టి పరమబంధువు పవ్వళించియుండు 'తిరుప్పుళింగుడి'లో సమస్తా నుభవములకు నాశపడి యతిత్వరితగతిని సర్వేశ్వరునిసన్నిధికిఁ జనిరి. అచ్చట భగవంతుఁడు, కుశలప్రశ్న జేయుట, సుభగశీతలముగఁ గటాక్షించుట, సంభాషించుట మొదలగు సంభావనాక్రమములచే వీరిని గౌరవింపక ఉదాసీనుఁడై యుండగా వీరు చాల నిర్విణ్ణులై, సర్వేశ్వరుని స్థితిని జూచి తమస్థితిని మఱచి " ఒడలుతెలియక నొకేరీతిగ నిద్రించుచున్నాఁడే? ఇతని కేమి యపద్యము వాటిల్లునోగదా!" అని భయపడి, " నాయార్తిని తనయార్తినిగూడ తీర్పక యుదాసీనముగ నున్నాఁడు " అని " పణ్డైనాళ్ " అను ద్వితీయ దశకమున నిరుత్సాహపడుచున్నారు.

(3) ఇంతలోపల నీశ్వరుఁడు " మీరు నావద్ద యాచింపవలయు నా? మా శరీరమునందలి వ్యథను మీరు గమనింపలేదా ? నేను నారాయణుఁడను గదా! మీ సర్వాపేక్షితములను పూర్తిజేసెదను. మీరు నిరుత్సాహపడవద్దు" అని సమాధానపఱచగా సమాహితచిత్తులై, "ఓరాయిరం" అను తృతీయదశకమున నతని సౌశీల్యగుణమున నత్యన్తప్రవణులై, అతని శీలగుణప్రాచుర్యము నభివర్ణించుచున్నారు.

(౪) ఈశ్వరస్వాతన్త్ర్యమునకు మూలము ఈశ్వరుఁడే; శీలాదిగుణములకు మూలము శ్రీదేవియే యైయున్నది. కనుకనే మనయాచార్యులందఱును సర్వేశ్వరనిరూపకధర్మములలో 'శ్రియఃపతిత్వ' మును ప్రధానముగ గ్రహించు

చున్నారు. అందుచే నాళ్వార్లు సర్వేశ్వరుని శీలగుణమును శ్రియఃపతిత్వమును గూడ ననుసంధించిరి. అవశ్యలభ్యునీయగుణాధికుఁడగుటచే నతనిని తత్‌క్షణమే పొందవలయునని యాశపడిరి. అట్లు లభింపనందున తాము తమ కరణములతో గూడ విరహక్లేశము ననుభవించిరి. దీనిని పరికించి సర్వేశ్వరుఁడు వెంటనే సాక్షాత్కరించెను. ఇట్టి తమ దశావిశేషమును, తన్నిదానమగు విరహవ్యథను గుర్తెఱిఁగి వెంటనే వచ్చి తన్ను సర్వేశ్వరుఁడు రక్షించిన విధము ననుసంధించి మిగుల సంతోషపులకితగాత్రులై "నేను కృతకృత్యుఁడనైతిని. దాస్యముజేయు భాగ్యము గలిగినది, తరించితిని; ఇతరులనుగూడ శ్రీవైష్ణవుల నొనరించి తరింపఁజేసితిని. అహా! ఇట్టి యభ్యుదయము నెవ్వరైనను పొందగలరా! అని తమకుఁ గలిగిన లాభమును "మైయ్యార్ కరుం కణ్ణి" అను నాల్గవదశకమున నభివర్ణించుచున్నారు.

(౫) ఈతిరువాయ్మొళిలో "దేవతలకందఱికిని యధిపతియగు 'కణ్ణపిరా'న్లను గనుగొంటిని గదా!" అని హర్షప్రకర్షవైశద్యము కలుగఁగనే బాహ్యసంశ్లేషమున నపేక్ష కలిగినది. "వీరి కింకను విరహతాపమును గలుగఁజేసి సేవ సాధించెదము" అని ఈశ్వరుఁ డుదాసీనుఁడై యుండఁగ, ఆళ్వార్లును అత్యంత శిథిలులై "లౌకికపదార్థముల ననుసంధించుచు మనస్సును అన్యపరముగ జేసికొని యుజ్జీవింతము" అని యితరపదార్థములయందు దృష్టిని నిలుపఁగ, అవి యాశాపాశహేతువు లగుటయేగాక ప్రకృతార్థస్మారకములై పీడింప నారంభించెను. వానిచే క్లేశపడుచుండుటచే నాయికావస్థను బొంది యనన్యార్హశేషత్వమును "ఇన్నుయిర్ చ్చేవల్" అను పంచమదశకమున నానతిచ్చిరి.

(౬) ఈదశకమున "ఏళ్లునణ్ణి నాముం నం వాణ నాడనో డెన్తనోమ్" అని తన జీవనమున నాశను వదలుకొని మాటలాడిరి. ఈ యవస్థలో వీ రధికరించిన కైంకర్యమును సమక్షమునఁ బూర్తిఁజేసికొనుటకుఁ దగిన వీరి జీవనాదృష్టము చేతనో, లేక వీరి దీనాలాపములను విని ద్రవీభూతాన్తఃకరణుఁడగు నీశ్వరుని భాగ్యముచేతనో, లేక వీరియుపదేశములను విని భగవద్విషయమం దభిరుచి గలిగియుండు చేతనులయొక్క భాగ్యవిశేషముచేతనో, "ఇఱుత్తుం వియత్తు" అను దశకమునం దనుభవించిన సంశ్లేషము స్మృతివిషయమై వాని శీలగుణానుసంధానముచే "ఉరుకు మాల్" అను నాఱవ దశకమున నత్యన్తశిథిలులైరి.

(౭) "ఎఙ్ఞానలగ ఒక్క-ప్రీవా" అను నేడవ దశకమున - అప్రీతిగర్భ గుణానుసంధానమునందలి యప్రీత్యంశము భాగ్యహానిచే విస్ఫుటముకాఁగ, "సర్వేశ్వరుని బొందినచో జీవించుట, లేకున్న లేకుండుట." అను తమ దశా విశేషమును అన్యాపదేశముచే నానతిచ్చుచున్నారు.

యాదృచ్ఛికసంభోగము ననుభవించి వియుక్తయైన ఒకనాయిక నాయకుని దేహసౌందర్యసౌకుమార్యాదులయం దత్యంతప్రవణయై, తన విరహానలోపశమనార్థము ఉద్యానవనమునకుఁజని, అచ్చటనుండు పక్షులను 'తిరుమూళిక్కళ' మను సుప్రసిద్ధదివ్యక్షేత్రమున తన భక్తుల విడువఁజాలని పరమ కృపామూర్తి వచ్చి నిలచియున్నాఁడు. మీ రచ్చటకుఁ జని "మి మ్మొడబాసిన వారలు జీవింపఁగలరా ? అని ప్రశ్నించి, అతనికి నాస్థితిని దెలిపి రావలయును" అని సవినయముగఁ బ్రార్థించుచున్నట్లు వర్ణించుచున్నారు.

(౮) ఇట్లు తమయార్తిని దెలియఁబఱచినను వెంటనే రానందున అవనన్నులైన ఆళ్వార్లు దూతప్రేషణ గుణానుసంధానాదులచేఁ గలిగిన మనః ప్రసాదముచే "అతఁడు విచ్చేసి మనలను గటాక్షించి, తాము సుఖముగ వేంచేసియుండు 'తిరునావాయ్' క్షేత్రమునకుఁ దీసికొనిపోవుట నిశ్చితమే" అని అధ్యవసించియున్నను, అంతవఱకును విలమ్బమునకు సహింపనేరక విలపించి "అతఁడు వేంచేసియుండు దివ్యదేశమునకు తామే వెళ్లవలయు"నని "అఱుక్కుం విన్నైయాయిన" అను నెనిమిదవదశకమున స్థిరీకరించుకొనిరి.

(౯) "మల్లికై కమழ் తెన్నల్" అను తొమ్మిదవ దశకమున 'తిరునావాయ్' క్షేత్రమునఁ బ్రవేశించి యనుభవించునట్లు మనోరథించిన ఆళ్వార్లు, పాతకవర్గములకు భయపడి, శ్రీనందగోకులమునందలివారలు శ్రీకృష్ణు నెడబాసి యొక సంధ్యలో ననుభవించిన క్లేశమును వీరొక్కరే యనుభవించి మొఱపెట్టిరి.

(౧౦) ఇట్లు దుఃఖసాగర నిమగ్నులగు నాళ్వార్లను జూచి సర్వేశ్వరుఁడు "వీరలో యిట్లు మనోరథించుచున్నారు, మిమ్ము పొందవలయునని కుతూహలపడుచు, అది లభ్యముకానందున క్లేశపడుచున్నది మేముగదా! మీకొక కొఱఁత యును గలదా? మేము పరమపదమును వదలి 'తిరుక్కణ్ణపుర' మున నిత్యసన్నిధిఁ జేయుచున్నదియు తమకై గదా! శరీరావసానమున మీ యపేక్షితమును బూర్తి

జేయఁగలవారము.” అని సమాధానపఱచఁగ, హృష్టులై, సంసారులను జూచి “మీరలు ప్రవృత్తిని జేయుడు. దానికిఁ దగిన యధ్యవసాయములేనివారలు ఈ కైవిష్యను మాత్రమునైనను జేయుఁడు.” అని “మాలై నణ్ణి” అను దశమదశకమున నుపదేశించిరి. క్రింది తిరువాయ్మొళిలో “నాళేలతియే నెనక్కుళ్ళన” అనిరి. “మరణమానాల్” అను దానియందు నా దివసమును నిర్దేశించిరి. ఈశ్వరుఁడు ‘చేసెదము:’ అని తలనాడించినచో, దానిని తాము పొందినట్లే భావించి పై రీతిని నడచుచున్నారు. “కాఁబట్టి అవిద్యాకర్మవాసనారుచిప్రముఖములగు విరోధులను బోఁగొట్టుచు సన్మార్గమున నడపించువాఁడు కాలమేఘస్వరూపుఁడగు భగవంతుఁడే” అని అధ్యవసించి, కాలమేఘస్వరూపుని సన్నిధిలో నాత్మనిక్షేపముజేసి మార్గబంధువుగ నతనినే వరించిరి.

## దశమశతకము (10వ-పత్తు)

(౧) “తాళతామరై” అను ప్రథమదశకమున ‘ఇచ్చటనే తిరువనంతపురము’ సన్నిహితమై యుండఁగ నంతదూరము మనము పోవలసి యుండునా?” అని అధ్యవసించిరి.

(౨) “అస్మత్సంబంధులగు ననుకూలజనులతోఁగూడ నొకటిగాఁ జేరి యచ్చటికి వెళ్లుదము రండు” అని “కెడుమిడరాయ” అను ద్వితీయదశకమున నానతిచ్చిరి.

(3) వీరు కుతూహలపడినట్లు దాస్యము జేయుటకు నవకాశము లభింపనందున తమకుఁ గలిగిన యొక దశావిశేషమును ఒక పిరాట్టిపాశురముగ (నాయికావాక్యసరణితో) “వేయ్మరు తోళిణై” అను తృతీయదశకమున నభివర్ణించిరి.

యాదృచ్ఛికసంభోగము ననుభవించి బహుకాలవిరహావసన్నయగు ఒకనాయిక ఆవాసనచే, శ్రీకృష్ణుఁడు తనతోఁగూడి యుండునప్పుడుగూడ, ఇది వఱకు నితని నెడబాసిన ప్రభాతసమయము నదిూపింప, ఆసమయపు సుభగశీతలమందమారుతములుగూడ వీచుచున్నందున, ‘ఇట్టిసమయమున నతఁడు వెళ్లుట తప్ప’ దని యతని విరహమును నిశ్చయించుకొని “నీవు పశువుల మేపుటకు పోకుండనుండవలయును. ప్రమాదభూయిష్ఠమైన గహనారణ్యసీమలకు నీవు పోయినచో, నీకచ్చట అసురరాక్షసాదులచే నే యవద్యము వాటిల్లునో? అని

భయపడుచున్నాను." అనుచు శ్రమపడుచుండ, వాఁడును దీని ననుసంధించి "నేను నిన్ను విడచి పోనేపోను" అని సుదృఢముగ ప్రతిజ్ఞ చేసి తన గమనాభావమును ఈమె తెలిసికొనునట్లు జేయఁగా మనస్సున నాప్యాయనముఁజెంది యుజ్జీవించెను. ఇట్లు అన్యాపదేశముగఁ దమదశ నభివర్ణించిరి.

(౪) ఇట్లు అంతరంగమున నాప్యాయనముఁజెందిన వీరు "శాశ్వతవనెతిక్కు" అను నాల్గవ దశకమున - మోక్షమునకు హేతుభూతమైన భక్తియోగము స్వసాధ్యఫలమున కనురూపమైయుండుటను వ్యక్తీకరించి, తాము తమయొక్క పురుషార్థమునకు నుపాయముగ మొదటి తిరువాయ్మొళిలో నానతిచ్చిన ప్రవృత్తితో నుపసంహరించుచున్నారు.

(౫) "కణ్ణాకణ్ణలిణై" అను పంచమదశకమున - ఈశ్వరుఁడు తమ్ము తీసికొని పోవుటకై త్వరపడుచున్నదానిని జూచి "మన కిఁక వెళ్ళుట తప్పదు" అని నిశ్చయించి, "ఇఁక సంసారులకు భక్తిమంతుల యనుభవప్రకారములనుపదేశించెదము" అని తా మారంభించిన పరోపదేశమును నిర్వహించిరి,

(౬) ఇట్లుపదేశించి విరమించిన తరువాత తనకై వీరి విరహతాప మభివృద్ధియగుటను జూచి, వీరి కంఠముండే తా నభితప్తుఁడై, వీరిని దీసికొని వెళ్ళుటయందలి త్వర యతిశయింపఁగ, "వీరిని దీసికొనిపోవునపుడు వీరు నియమించినట్లు చేసినవారలము కావలయు" నని 'తిరువాట్టాఱు' అను దివ్యదేశమున పరస్థానము జేసియున్న సర్వేశ్వరుని జూచి, "ఇతనికి పరత్వము ఔపాధికము, ఆశ్రితపారతన్త్ర్యమే స్వరూపము." అను విషయమును "అరుళ్ పెరువార్" అను నాఱవదశకమున నానతిచ్చిరి.

(౭) "శెజ్ఞాల్ కవిగాళ్" అను సప్తమదశకమున — తమతో గలసి మెలసి తమకుఁ బరతన్త్రుఁడై తమ శరీరసంబంధమును వదలఁజాలకయుండు సర్వేశ్వరుని యభినివేశమును జూచి "ఇతని యభినివేశము జూడ నీదేహముతో గూడ మనలను తీసికొనివెళ్ళుటకు సంకల్పించియున్నట్లున్నది. అట్లయినచో మన కీ మలినదేహము నిత్యమైపోవును. కనుక దీని నిప్పుడే పరిత్యజింపవలయును" అని నిశ్చయించుకొని "ఈ శరీర మతిహేయమైనది. ఇది నశించిపోవునట్లు కృపజేయవలయును. దీనియందు దేవరవారు ప్రీతిఁజూపకూడదు" అని

శరణుజొచ్చిరి. అంత సర్వేశ్వరుఁడు "మనకు నీనియందధికాపేక్ష యుండినను గూడ, వీరు విడువుమనిన విడువవలసినదేనా?" అని యోచించి వీరి నడిగెను. దానిని జూచి వీరు ముగ్ధులై "ఆహా! ఇది యొక సౌశీల్యముండు విధమా? ఈవిషయమున నెవ్వరును ప్రీతిని జూపకూడదు. ప్రీతిని జూపి నేను పడిన యగచాట్లు చాలును" అని ప్రీతిప్రకర్షముచే నితరులకును నుపదేశించిరి.

(౮) ఈశ్వరుఁడు తమ్మాత్మలోకమునకుఁ దీసికొనిపోవుటకై ఆవేగపడుటను జూచి, ఇందులకుఁ దమవద్దనుండు విశేష మెయ్యదియా? అని పరికించి చూచిరి. తమయందు దందులకుఁ దగిన హేతు వెయ్యదియును లేకుండెను. అద్వేషమును గలుగఁజేసి విశేషకటాక్షప్రసరణముచే నిచ్ఛాశక్తినిగూడ నను గ్రహించినది పరమకారుణికుఁడగు పరమాత్ముఁడే యైయుండెను. అంత వీరు "ఇట్లుండగా ఇంతకుముందే నన్నెందులకై తీసికొని వెళ్ళకయుంటిరి?" అని సర్వేశ్వరుని ప్రశ్నించిరి. అందుల కాతఁడు నిరుత్తరుఁడై నిలువఁగ "ఆహా! ఇది యొక నిర్హేతుకవిషయీకరణ ముండు క్రమమే!" అని "తిరుమాలిరుంశోలై మలై" అను నష్టమదశకమున ననుసంధించి సంహృష్టులైరి.

(౯) తరువాత "శూழ் విశుం పణిముకిల్" అను నవమదశకమున నర్చిరాదిగతి యభివర్ణింపఁబడినది. మొదటి తిరువాయ్మొழி మొదలుకొని క్రింది తిరువాయ్మొழிవఱకును ఆழ்వార్లకు 'పరభక్తి' కలిగినది. ఈ తిరువాయ్మొழிలో 'పరజ్ఞానావస్థ' కలిగినది. "ఇక్కడనుండి మానసానుభవముచే సాక్షాత్కరించుట చాలదు, సాక్షాత్తుగ పరమపదమునకే వెళ్ళితీరవలయును." అని సుదృఢమగు నధ్యవసాయముతోఁ గుతూహలపడుచున్న వీరిని, వీరికంటెను త్వరార్తుఁడగు సర్వేశ్వరుఁడు మార్గస్థులైన అతివాహికపురుషులుజేయు సత్కార క్రమమును, ప్రవేశింపవలసిన పరమపదవైభవమును, నిత్యసూరు లాదరించు ప్రకారములను, శ్రీదేవి (పెరియపిరాట్టి) యు, శ్రీవైకుంఠనాథుఁడు (పెరియపెరుమాళ్లు) ను ఎదురుగ నేతెంచి యాదరించుసరణిని, పరమప్రాప్యులగు నిత్యసూరులనడుమ తామానందనిర్భరులైయుండు పరిస్థితిని, సర్వమును సాక్షాత్కరింపజేయఁగ సత్యస్త్రప్రీతులై దాని నన్యాపదేశముగ నభివర్ణించుచున్నారు.

(౧౦) "అన్దమిల్ పేరిన్బత్తడియరోడిరున్దమై" అని నిరతిశయానన్ద నిర్భరులై, ఆ సమూహమున నున్న పరిస్థితి, కేవలము జ్ఞానసాక్షాత్కారరూపమై

సౌహార్ద్యానుభవమునకు యోగ్యముగానందున మిక్కిలి యువవన్నులై, దావానలమునఁ దగులుకొన్న మృగశాబకమువలె పరమార్తిఁజెంది, అతిదీనాతిదీనముగ నార్తనాదముఁజేయుచు శరణువేడిరి. అంత పరమదయార్ణవుఁడగు సర్వేశ్వరుఁడు “వీరి నిట్లు క్లేశము ననుభవింపజేసితిమిగదా!” అని వీరికంటెను తాను నిర్విణ్ణుఁడై దేవేరుల (నాయచ్చిమార్ల) తోఁగూడ, శ్రీగరుడవాహ (పెరియతిరువడి) నారూఢులై, వీ రపేక్షించినట్లు విచ్చేసి, సేవసాదించి, వీరి ప్రకృతిసంబంధమును ఛేదించి “అన్నవావఱ చూ్ళ్న్దాయే” “అవావఱ్ఱు వీడుపెఱ్ఱు” అని వీరు తామే చెప్పఁదగినట్లుగ వీరివిరహతాప ముపశమింపఁజేసి, వీరి కంటె నధికమగు తనతాపముగూడ తీరునట్లు సంశ్లేషించెను. ఆ క్రమమును “మునియే నాన్ముకనే” అను దశమదశకమున శ్రీ ‘కురుకూర్’ నగరమున కలంకారభూతులగు ‘శ్రీమచ్ఛఠకోపదివ్యసూరు’ లు తము పరమపదప్రాప్తిక్రమమును సకల చేతనోజ్జీవనార్థము పరమకారుణికులును పరమోదారులునునై యభివర్ణించి, తాము తరించి, సంసారిచేతనుల నందఱిని తరింపఁజేసిరి.

ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వ మివోదితమ్ ।
సహస్రశాఖాం యోఽద్రాక్షీత్ ద్రామిడీం బ్రహ్మసంహితామ్ ॥
శ్రీనగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే ।
శ్రీతింత్రిణీమూలధామ్నే శఠకోపాయ మంగళమ్ ॥

ఆళ్వార్, ఎమ్బెరుమానార్, జీయర్, తిరువడిగళే శరణమ్.

శ్రీసూక్తి సుధా సారసంగ్రహము

సమాప్తము.

శ్రీః

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్

శ్రీమతే రామానుజాయ నమః

# తిరువాయ్మొళి

వకుళాభరణం వన్దే జగదాభరణం మునిమ్ ।
యశ్శ్రుతేరుత్తరం భాగం చక్రే ద్రావిడభాషయా ॥

## ఈ దివ్యప్రబన్ధము భూలోకమం దవతరించిన కారణము:—

మునుపొకకాలమందు కైలాసగిరిలో పార్వతికి వివాహము తటస్థించినది. అప్పుడావివాహమును జూచుటకై సమస్త దేవతలును ఋషులు నచ్చట వచ్చిరి. ఆసమయమందు దక్షిణదేశము పైకెత్తుకొని ఉత్తరదేశము క్రింద వంగిపోయినది. దానిని జూచి రుద్రుండు దీనికేఁగారణమేమని విశ్వకర్మను బిలిచి యడుగగా విశ్వకర్మ లేచి బద్ధాంజలి పుటుండై "ఓస్వామీ! అంగుష్ఠప్రమాణమైన యీయగస్త్యమహాముని యిచ్చట వచ్చియున్నారుగాన ఈభాగమువంగిపోయినది; వీరుదక్షిణదేశమునకు వెళ్ళినయెడల భూమిసమానమగును" అని పరిహాసముగాఁ జెప్పెను. దానికగస్త్యులవారు మిగుల కోపగించి "ఓరి! నన్ను నిష్కారణముగా పరిహాసించితివిగాన నీవంశమందు బుట్టినవారు కర్మభ్రష్టులై యధములై స్వర్ణమును దొంగిలించి జీవించువారై యగుదురుగాక" యనిశపించిరి. ఈమాటను విశ్వకర్మ విని "మీ మాహాత్మ్యమును జెప్పిన నన్ను నిష్కారణముగా శపించిరిగాన మీభాష నీచభాషయైపోవుగాక". యని శపించెను. దానికగస్త్యులు కోపించి "లోకములనిప్పుడే భస్మముగాఁజేసెద" నని హుంకారముజేయగా నప్పుడు బ్రహ్మాదిదేవతలందఱు భయపడి వారివద్దవచ్చి యెంత వరమిచ్చినప్పటికిన్ని వారువినకపోయిరి. ఆసమయమందచ్చట శ్రియఃపతియైన సర్వేశ్వరుఁడు వేంచేయగా వానినిజూచి యగస్త్యులవారు లేచి సాష్టాంగప్రణామముజేసి బద్ధాంజలిపుటులై నిలుచుచుండగా, వారినిజూచి సర్వేశ్వరుఁడు "శ్రీవైకుంఠవాసులైన నిత్యసూరులిహలోకమం దవతరించి వేదాన్తార్థప్రతిపాదకములైన దివ్యప్రబంధములను ద్రావిడభాష యందురచియించి యీభాషను శిష్టులుపరిగ్రహించి సర్వభాషలలోను శ్రేష్ఠమగునట్లుచేసెద" ననియనుగ్రహించి యంతర్ధానమాయెను. దానిని విని యగస్త్యులు ప్రసన్నచిత్తులై దక్షిణదిక్కునకు వచ్చిచేరిరి. తరువాత విష్వక్సేనులు సర్వేశ్వరుని నియమనముచే నమ్మాళ్వారై యవతరించి యీప్రబంధమునుసాదించిరి.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్
శ్రీమతే రామానుజాయ నమః

# నమ్మాళ్వార్ల ప్రభావము

## నమ్మాళ్వార్ల యొక్క తిరువవతార కారణము:—

పాణ్డ్యదేశమందలి తామ్రపర్ణీ తీరమందున్న కురుకాపురియందు కారియార్ అనెడు తిరునామముగల యొక పరమ భాగవతులు వేంచేసి యుండిరి. వారొకప్పుడు తమ దేవులైన ఉడైయనఙ్గైయారుతోఁగూడ తమ శ్వశురగృహమైన తిరువణ్ పరిశారమనెడు దివ్యదేశమునకు వేంచేసి యచ్చట కొంతకాలము నివసించి తరువాత కురుకాపురికి వేంచేయునప్పుడు తిరుక్కుఱుఙ్గుడికివచ్చి నమ్బిని దణ్డమ్సమర్పించి "మాకు సన్తానము కలుగునట్లనుగ్రహింపవలయు" నని ప్రార్థింప నమ్బివిష్వక్సేనులను బిలిచి "మీరు వీరికి కుమారులై యవతరించవలయు" ననియాజ్ఞాపించిరి కారియార్ కురుకాపురికి వచ్చిన తరువాత ఒకసంసారి జీవద్వారా విష్వక్సేనులు ఉడైయనఙ్గై యార్ గర్భమందుప్రవేశించిరి.

## నమ్మాళ్వార్ల యొక్క తిరువవతారము:—

కొంతకాలము గడచినవెనుక ఉడైయనఙ్గైయార్ గర్భమందు, కలియుగాది. ౪౩ - వ దినము, ప్రమాదిసంవత్సరము, వైశాఖమాసము, శుక్లచతుర్దశీ శుక్రవారము విశాఖానక్షత్రము కటకలగ్నమందు నమ్మాళ్వార్లవతరించిరి. అప్పుడు కారియార్ గోదానాదులనిచ్చి మహోత్సవము జేసిరి. ప్రాకృత శిశువలె రోదనాది వికారములును స్తన్యపానాదులును లేక దినేదినే వర్ధిల్లుచు బాలసూర్యునివలె వెలుగుచున్న యాళ్వార్లను తల్లిదండ్రులుజూచి, వీరు ప్రాకృతులు కారని నిశ్చయించి పొలిన్దునిన్ఱపిరాన్ సన్నిధికి దీసికొనిపోయి యచ్చటనుంచుకొని తమబిడ్డయని యాదరముతో గాపాడుచుండిరి. అచ్చట తమకుముందుగానే తమరక్షణార్థము భగవదాజ్ఞచే నవతరించియున్న తిరువనన్తాళ్వాన్‌యొక్క అపరావతారమైన ఉఱఙ్గాప్పుళియను తిరునామముగల తింత్రిణీవృక్షముక్రింద నమ్మాళ్వార్లు ౧౬-సంవత్సరము లన్నపానాదులులేక భగవద్గుణానుసంధానము జేయుచు నేత్రములను మూసుకొని జ్ఞానముద్రగల వారై వేంచేసియుండిరి.

## నమ్మాళ్వార్లను మధురకవు లాశ్రయించినది.

ఒకప్పుడు మధురకవియాళ్వార్లు దివ్యదేశయాత్రజేయుచు తిరువయోధ్యయందు వేంచేసియున్నప్పు డొకరాత్రి దక్షిణమందొక తేజస్సును జూచి ఏదోగ్రామమందునిప్పంటిగిలి మండుచున్నదని దలంచి తిరిగియు ౨-౩-దినములట్లునేజూచి ఇదిమంటకాదు, దివ్యతేజస్సువలెనున్నది, దీనిని బరిశీలించవలయునని యచ్చటనుంచి బయలుదేరి ప్రతి గ్రామములందును బరిశీలించుచు నాతేజస్సునే జూచుచు తిరునగరివఱకువచ్చి యవతల నాతేజస్సునుజూడగ ఇది యీనగరమందేయుండవలయునని నిశ్చయించి, అచ్చటనున్నవారిని, "ఈనగరమందేమైన విశేషము కలదా" యనియడిగిరి. వారుఆళ్వార్లప్రభావమును జెప్పిరి. మధురకవులు ధ్యానయోగమందున్న నమ్మాళ్వార్లను సేవించి వీరికి చెవ్వులు నేత్రములున్నవో లేవోయని సందేహించి పరీక్షార్థమై యొక్క పెద్ద ఱాతినెత్తి యాళ్వార్ల ముందఱపడవేసిరి. ఆగొప్ప ధ్వనినివిని యిదియేమని నేత్రములనుదెఱచి యాళ్వార్లుచూచిరి. తరువాత మధురకవులు వీరికి వాగింద్రియమున్నదోలేదో యని సందేహించి "శెత్తత్తిన్ వయిత్తిల్ శిఱియదుపిఅన్దాల్ ఎత్తై త్తిన్నెజ్ఞే కిడక్కుమ్" అనగా - చచ్చినదానికడుపులో చిన్నది పుట్టినయెడల దేనినిభుజించి యెచ్చటనుండును, అని యడిగిరి. నమ్మాళ్వార్లు "అత్తై త్తిన్నజ్ఞేకిడక్కుమ్" అనగా - దానిని భుజించి యచ్చటనే యుండును అని సాదించిరి. మధురకవులు వీరు మహాప్రాజ్ఞులని నిశ్చయించి వారిని యాశ్రయించి యచ్చటనే కైఙ్కర్యముజేయుచు వేంచేసియుండిరి.



## తిరువాయ్మొళిని సాదించుటకుఁ గారణము,

అప్పుడు సర్వేశ్వరుఁడు శ్రీభూ నీళాసమేతుఁడై సమస్తపరిజనపరివారముతోఁగూడ గరుడవాహనారూఢుఁడై వచ్చి యాళ్వార్లకు సేవసాదించగా నాశ్రియఃపతిని సేవించి వాని యొక్క దివ్యాత్మస్వరూప దివ్యమఙ్గళవిగ్రహ కల్యాణగుణ విభూత్యాది సమస్తవైభవములనున్ను చక్కగా ననుభవించి యాయనుభవము లోపల నణగక శ్రీసూక్తిరూపమై బయలుదేరగా నప్పుడు మొదట ఋగ్వేదసారమైన ౧౦౦ పాశురములుగల తిరువిరుత్తమునున్ను, యజుర్వేదసారమైన ౭-పాశురములుగల తిరువాశిరియమునున్ను, అథర్వణసారమైన ౮౭-పాశురములుగల పెరియతిరువన్దాదినిన్ని ప్రసాదించి, తరు

వాత సామవేదసారమైన ౧౧౦౨-పాశురములుగల తిరువాయ్మొళియనెడు ఈచరమ ప్రబంధమును ప్రసాదించి సకలచేతనోజ్జీవనార్థమై వానిని మధుర కవులద్వారా లోకమందు వ్యాపింపఁజేసిరి. ఈప్రబంధమందు స్వస్వరూప పరస్వరూపోపాయ స్వరూపవిరోధి స్వరూపఫల స్వరూపములనెడి యర్థపంచకములనున్ను నిఖిల వేదవేదాన్తసారార్థమైన ద్వయ మన్త్రార్థమునున్ను ప్రతిపాదించిరి. ఆసమయమందు వీరిమాహాత్మ్యమునువిని శ్రీవైకుణ్ఠవాసులైన నిత్యసూరులును శ్వేతద్వీపవాసులును బ్రహ్మాదులునువచ్చి వారి మాహాత్మ్యమునుజూచి యాశ్చర్యపడి వారివారి స్థానమునుజేరిరి. ౧౦౮, దివ్యదేశములలో ౩౨-దివ్యదేశములందున్న పెరుమాళ్ళు ఆళ్వార్ల శ్రీసూక్తికి పాత్రులమైప్రసిద్ధినిబొందెదమని నిశ్చయించుకొని యాళ్వార్లు వేంచేసియున్న తిరుప్పుళియాళ్వార్ వద్దవచ్చి సేవసాదించి వారిచే మంగళాశాసనము జేయబడినవారై కృతార్థులై వారివారి దివ్యదేశమునకు వేంచేసిరి. ఆళ్వార్లు, ఈవిధంబున యతిమానుషవైభవముగలవారై చేతనులనుజ్జీవింపఁజేయుచు ౩౫-సంవత్సరములు ఈలీలావిభూతియందు వేంచేసియుండి యాచన్ద్రార్కస్థాయిగా తమ యశస్సునున్ను తిరువాయ్మొళినిన్ని యిహలోకమందుంచి తరువాత శ్రీవైకుణ్ఠమునకు వేంచేసిరి.

తరువాత వీరి కన్తరఙ్గ శిష్యులైన మధురకవులు వీరివిషయమై "కణ్ణినుణ్శిఱుత్తామ్బు" అనెడి దివ్యప్రబంధమును సాదించి యాళ్వార్లను అర్చారూపముగా ప్రతిష్ఠజేసి నిత్యోత్సవాదులను జరిపించుకొని వేంచేసియుండిరి.

వీరికి తిరునామములు—నమ్మాళ్వార్లు (మనయాళ్వార్లని పెరుమాళ్ళ యభిమానమునకు విషయభూతులు) వకుళాభరణర్ (పొలిన్దనిన్ఱపిరాన్ సాదించిన బొగడమాలను అలఙ్కారముగా ధరించినవారు) శఠకోపర్ (శఠవాయువును నిరసించినవారు) పరాఙ్కుశర్ (అఙ్కుశమువలె ప్రతివాదుల మదమును బోగొట్టువారు), మాఱన్ (కుదృష్టులను జయించువారు) అని. వీరుయోగాభ్యాసమందు వేంచేసియున్నప్పుడు భగవన్నియమనముచే విష్వక్సేనులు వేంచేసి వీరికి పంచసంస్కారములనుజేసి మన్త్రార్థములను సాదించిరి. వీరుమంగళాశాసనము జేసిన దివ్యదేశములు — (౧) తిరుమాలిరుఞ్జోలై (౨) తిరుమలై, (౩) చోళసింహాపురము, (౪) ఆళ్వార్ తిరునగరి, (తిరుక్కు-

రుకూర్), (౫) తిరుక్కుఱుజ్గుడి, (౬) వానమామలై (౭) తిరుక్కూడల్లై, (కుంభకోణము), (౮) తిరువల్లవాళ్, (౯) తిరువణ్వణ్డూర్, (౧౦) తిరు విణ్ణగర్, (౧౧) తొలైవిల్లిమజ్గలమ్, (మజ్గళపురమ్), (౧౨) తిరుక్కోళూర్ (౧౩) శ్రీరజ్గమ్, (౧౪) తిరుప్పేరై, (౧౫) తిరువాఱన్విళై, (౧౬) తిరు క్కళన్దై (పెరుఙ్గుళమ్), (౧౭) తిరువణ్ పరిశారమ్, (౧౮) తిరుచ్చెఙ్గున్నూర్, (౧౯) తిరుక్కడిత్తానమ్, (౨౦) తిరుప్పులియూర్, (౨౧) తిరుప్పాళిఙ్గుడి, (౨౨) వరగుణమ , (౨౩) శ్రీవైకుణ్ఠమ్, (౨౪) తిరుక్కాట్కరై, (౨౫) తిరుమూళిక్కళమ్, (౨౬) తిరునావాయ్, (౨౭) తిరుక్కణ్ణపురమ్, (౨౮) తిరు మోగూర్, (౨౯) తిరువనన్తపురమ్, (౩౦) తిరువాట్టాఱు, (౩౧) తిరు ప్పేర్నగర్, (౩౨) అప్పక్కుడత్తాన్ ఈ ౩౨-లో, పాణ్డ్యదేశమందు (౧౨) కేరళదేశమందు (౧౩), చోళదేశమందు (౫), తుణ్డీరమందు (౧) ఉత్తరదేశ మందు (౧).

## వీరి తిరునక్షత్ర తనియన్

వృషభే తు విశాఖాయాం కురుకాపురికారిజమ్।
పాణ్డ్యదేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే॥
శ్రీవిజ్ఞానదినోత్తరేఽహాని కలౌ వర్షే ప్రమాథ్యాహ్వయే
మాసే మాధవనామ్ని భార్గవదినే ఋక్షే విశాఖాభిధే।
లగ్నే శుద్ధచతుర్దశీతిథియుతే శ్రీమత్కులీరేఽపి చ
క్షిత్యాం ప్రాదురభూత్పరాఙ్కుశకవిర్భాగ్యోదయేఽస్మాదృశామ్॥

## తనియన్

మాతా పితా యువతయస్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్।
ఆద్యస్య నః కులపతేర్వకుళాభిరామం
శ్రీమత్తదఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా॥

## వాఴ్ త్తిరునామమ్

ఆనతిరువిరుత్తమ్నూఱుమరుళినాన్ వాఴియే
ఆశిరియమేఴు పాట్టళి తపిరాన్ వాఴియే
ఈనమిలన్దాదియెణ్బత్తేఴీన్దాన్ వాఴియే
ఇలగుతిరువాయ్మొఴి యాయిరత్తొరునూఱ్ఱిరణ్డురైత్తాన్ వాఴియే
వానణియుమ్మామాడక్కురుగై మన్నన్ వాఴియే
వైగాశివిశాకత్తిల్ వన్దుదిత్తాన్ వాఴియే
శేనైయర్కోనవతారమ్ శెయ్దవళ్ళల్ వాఴియే
తిరుక్కురుగైచ్చడకోపన్ తిరువడిగళ్ వాఴియే.

మేదినియిల్ వైగాశివిశాగత్తోన్ వాఴియే
వేదత్తైచ్చెన్దమిఴాల్ విరిత్తురైత్తాన్ వాఴియే
ఆదిగురువాయ్ప్పువియిలవతరిత్తాన్ వా యే
అనవరతమ్ శేనైయర్కోనడితొఴువోన్ వాఴియే
నాదనుక్కు నాలాయిరముఱైత్తాన్ వాఴియే
నన్మదురకవివణఙ్గుమ్నావీఱన్ వాఴియే
మాదవన్ పొఱ్పాదుకైయాయ్వళర్న్దరుళ్వోన్ వాఴియే
మగిఴ్మాఱన్ శడకోపన్ వైయగత్తిల్ వాఴియే

నమ్మాఴ్వార్ తిరువడిగళే శరణమ్.

నమ్మాఴ్వార్ వైభవము

సంపూర్ణము.



    

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్

శ్రీమతే రామానుజాయనమః

# తనియన్.

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥

అ॥ శ్రీశైలేశదయాపాత్రమ్ - శ్రీనివాసుని యపరావతారమైన తిరుమలైయాళ్వార్ల యొక్క-కృపకువిషయమైనవారును, ధీభక్త్యాదిగుణార్ణవమ్ - జ్ఞానభక్తిమొదలగు గుణములకు సముద్రమైనవారును, యతీన్ద్రప్రవణమ్ - ఉడైయవర్లయందు మిక్కిలి ప్రావణ్యముగలవారగుటచే యతీన్ద్రప్రవణులని తిరునామముగలవారునైన, రమ్యజామాతరం మునిమ్ - మణవాళమామునులను, వన్దే - సేవించుచున్నాను.

తా॥ తమకాచార్యులైన తిరువాయ్మొళిప్పిళ్ళగారికి పూర్ణకృపాపాత్రులై, జ్ఞానభక్తి వైరాగ్యాదిసమస్తకల్యాణగుణాకరులైన యతీన్ద్రప్రవణులని తిరునామముగల మణవాళమామునులను నేనాశ్రయించుచున్నానని.

లక్ష్మీనాథసమారమ్భాం నాథయామునమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వన్దేగురుపరమ్పరామ్ ॥

అ॥ లక్ష్మీనాథసమారమ్భామ్ - శ్రియఃపతిని మొదలుగాగలదై, నాథయామునమధ్యమామ్- నాథమునులనున్న ఆళవందార్లనున్న మధ్యమందుగలదై, అస్మదాచార్యపర్యన్తామ్-మనయాచార్యులనంతిమందుగలదై, గురుపరమ్పరామ్ - గురుపరమ్పరను, వన్దే - సేవించుచున్నాను.

తా॥ ద్వయమనెడు మహామన్త్రమును మొదట ప్రవర్తింపఁజేసిన ప్రథమాచార్యుఁడై మనకు పరమోపకారకుఁడైన శ్రియఃపతి మొదలు ప్రవర్తించినదై, ఉత్తారకాచార్యులైననాథయామునయతివరులనుమధ్యమందుగలదై, మనయాచార్యులవఱకున్న గురుపరమ్పరను నేనాశ్రయించుచున్నానని.

యో నిత్యమచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ
వ్యామోహతస్తదితరాణి తృణాయ మేనే
అస్మద్గురోర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

అ॥ యః - ఏఉడైయవర్లు, నిత్యమ్ - ప్రతిదినమును, అచ్యుతపదామ్బుజయుగ్మరుక్మవ్యామోహాత్ - స్వర్ణమువలెస్పృహణీయమైన శ్రియఃపతియొక్క శ్రీపాదపద్మములయందు వ్యామో

హముచేత, తదితరాణి - అంతకంటె వేఱువిషయములను, తృణాయ - గడ్డివలెతుచ్ఛములై, మేనే - తలంచిరో, అస్మద్గురోః - మనకాచార్యులై, భగవతః - జ్ఞానపూర్తిగలవారై, దయైకసిన్ధోః - (ఆశ్రితులవిషయమందు) కృపాసముద్రమైన (కృపాపూర్ణులైన), అస్యరామానుజస్య- ఇట్టిప్రభవముగల ఉడైయవర్లయొక్క, చరణౌ - తిరువడికళ్ళను, శరణమ్ - ఉపాయముగా, ప్రపద్యే - పొందుచున్నాను.

తా॥ అసారములైన దేవతాన్తర విషయాన్తరములను వదలి నిరతిశయభోగ్యమైన శ్రియఃపతియొక్క శ్రీపాదముల ననవరతముధ్యానించుచున్న పరమదయాళువైన మహాప్రభావముగల ఉడైయవర్లయొక్క తిరువడికళ్ళనే నేనుసకల పురుషార్థములకు నుపాయముగా నాశ్రయించితినని.

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వంయదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతేర్వకుళాభిరామం
శ్రీమ త్తదఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

అ॥ మాతా - తల్లివలెప్రియమునిచ్చునట్టిదియు, పితా - తండ్రివలెహితమునిచ్చునట్టిదియు, యువతయః - స్త్రీలవలెయానన్దజనకమును, తనయాః - పుత్రులవలెరక్షకమును, విభూతిః - ఐశ్వర్యమువలెవైభవజనకమును, సర్వమ్ - తక్కిన పురుషార్థములన్నియు, నియమేన - సర్వకాలములయందును, మదన్వయానామ్ - మనకులమందు బుట్టినవారికి, యదేవ - ఏనమ్మాళ్వార్లయొక్క శ్రీపాదమైయున్నదో, నః - మనకు, ఆద్యస్య - మొదటినుంచి పరంపరగావచ్చుచున్న, కులపతేః - కులగురువైననమ్మాళ్వార్లయొక్క, వకుళాభిరామమ్-పొగడపుష్పములచేశోభిల్లుచున్న, శ్రీమత్ - అతిసుందరమై, తత్ - అట్టినిరతిశయభోగ్యమైన, అఙ్ఘ్రియుగళమ్ - శ్రీపాదద్వన్ద్వమును, మూర్ధ్నా - శిరస్సుచేత, ప్రణమామి - సేవించుచున్నాను.

తా॥ మనకును మనసంబంధులకును సకలవిధసుఖములనిచ్చుచున్న నమ్మాళ్వార్లయొక్క పరమప్రాప్యమైన తిరువడిని నేనాశ్రయించుచున్నానని.

భూతం సరశ్చ మహదాహ్వయభట్టనాథ
శ్రీభక్తిసారకులశేఖరయోగివాహాన్ ।
భక్తాఙ్ఘ్రిరేణుపరకాలయతీన్ద్రమిశ్రాన్
శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥

అ॥ భూతమ్ - పూదత్తాళ్వార్లనున్ను, సరశ్చ - పొయ్‌గైయాళ్వార్లనున్ను మహదాహ్వయ భట్టనాథశ్రీభక్తిసార కులశేఖరయోగివాహాన్ పేయాళ్వార్లు పెరియాళ్వార్లు తిరుమళిశైయాళ్వార్లు కులశేఖరాళ్వార్లు తిరుప్పాణాళ్వార్లు (వీరినిన్ని), భక్తాఙ్ఘ్రిరేణుపరకాలయతీన్ద్రమిశ్రాన్, తొణ్డరడిప్పొడియాళ్వార్లు తిరుమఙ్గైయాళ్వార్లు పూజ్యులైన ఉడైయవర్లు (వీరినిన్ని), శ్రీమత్పరాఙ్కుశమునిమ్ - కైఙ్కర్యశ్రీగలనమ్మాళ్వార్లనున్ను, నిత్యమ్ - ప్రతిదినమును, ప్రణతః - నమస్కరించినవాడనై, అస్మి - అగుచున్నాను.

తా॥ పొయ్‌గైయార్ పూదత్తార్ పేయార్ తిరుమళిశైప్పిరాన్ కులశేఖరప్పెరుమాళ్ పట్టర్‌పిరాన్ తొణ్డరడిప్పొడి తిరుప్పాణన్ కలియన్ ఉడైయవర్లు వీరిని తమకవయవములుగాగల నమ్మాళ్వార్ల నాశ్రయించుచున్నానని.

శ్రీః

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

శ్రీమతే రామానుజాయ నమః.

# తిరువాయ్మొళి తనియన్

నాథమునులు సాదించినది.

భక్తామృతం విశ్వజనానుమోదనం
సర్వార్థదం శ్రీశఠకోపవాఙ్మయమ్ ।
సహస్రశాఖోపనిషత్సమాగమం
నమామ్యహం ద్రావిడవేదసాగరమ్ ॥

అ॥ భక్తామృతమ్-భక్తులైన శ్రీవైష్ణవులకు (దేవతలకు), అమృతమువలె భోగ్యమైనదియు (అమృతమునిచ్చునట్టిదియు), విశ్వజనానుమోదనమ్-సమస్తజనులకును (శ్రవణముచేత) (దర్శనముచేతను) ఆనన్దజనకమైనదియు, సర్వార్థదమ్-సకలపురుషార్థములను (రత్నాదులను) ఇచ్చునట్టిదియు, సహస్రశాఖోపనిషత్సమాగమమ్ - వెయ్యిశాఖలుగలసామవేదముయొక్క సారమైన ఛాన్దోగ్యోపనిషదర్థమును ప్రతిపాదించునట్టిదియు (అనేకశాఖలుగలచన్దనవృక్షాదులయొక్క ఆగమమును తన సమీపమందుగలదియు)వైన, శ్రీశఠకోపవాఙ్మయమ్ - నమ్మాళ్వార్లయొక్క శ్రీసూక్తిరూపమై, ద్రావిడవేదసాగరమ్-ద్రావిడవేదమైన తిరువాయ్మొళియనెడి సముద్రమును, అహమ్ - నేను, నమామి - నమస్కరించుచున్నాను.

తా॥ భక్తులకు సకలాభీష్టప్రదమై స్వయంభోగ్యమై, వినునప్పుడానన్దజనకమై సామవేదసారార్థప్రతిపాదకమైన తిరువాయ్మొళిని నేను నమస్కరించుచున్నానని.

ఈశ్వరమునులు సాదించినది.

తిరువళుదినాడెన్ఱుమ్ తెన్కురుగూరెన్ఱుమ్*
మరువినియవణ్ పొరునలెన్ఱుమ్*—అరుమఱైగళ్
అన్దాదిశెయ్దానడియిణైయే యెప్పొళుదుమ్*
శిన్దియాయ్ నెఞ్జే తెళిన్దు ॥

అ॥ తిరువళుదినాడెన్ఱుమ్ - తిరువళుదియనెడు దేశమనియు, తెన్కురుగూరెన్ఱుమ్ - స్పృహణీయమైన తిరునగరియనియు, మరువఇనియ - ఆశపడునట్లుభోగ్యమై, వణ్ - సుందరమైన, పొరునలెన్ఱుమ్ - తామ్రపర్ణియనియు, (అనుసంధించి), అరుమఱైగళ్ - దుర్లభమైన వేదార్థములను, అన్దాదిశెయ్దాన్-అన్తాదిగా సాదించిన నమ్మాళ్వార్లయొక్క, అడియిణైయే-శ్రీపాదద్వన్ద్వములనే, ఎప్పొళుదుమ్ - సర్వకాలమును, నెఞ్జే - ఓమనసా ! తెళిన్దు-నిర్మలమైయుండి, శిన్దియాయ్ - ధ్యానించుము.

తా॥ ఓమనసా! తిరువాయ్మొழிని సాదించిన నమ్మాழ்వార్లయొక్క తిరువడికళ్ళనున్న వారితో సంబంధించిన దేశగ్రామనదులనున్ననుసంధించుమాయని.

శొట్టైనమ్బులు సాదించినది.

మనత్తాలుమ్వాయాలుమ్ వణ్కురుగూర్ పేణుమ్*
ఇనత్తారై యల్లాదిఱైఞ్జేన్*—తనత్తాలుమ్
ఏదుమ్కుఱైవిలేనెన్దై శడగోపన్*
పాదఙ్గళ్ యాముడైయ పఱ్ఱు॥

అ॥ మనత్తాలుమ్ - మనస్సుచేతను, వాయాలుమ్ - వాక్కుచేతను, వణ్కురుగూర్ - సుందరమైనతిరునగరిని, పేణుమ్ - ఆశించుచున్న (స్తోత్రముజేయుచున్న) శ్రీవైష్ణవులయొక్క, ఇనత్తారై యల్లాదు - సమూహమందున్న వారినితప్ప, ఇఱైఞ్జేన్ - ఆశ్రయించను తనత్తాలుమ్ - సంపత్తుచేతను, ఏదుమ్కుఱైవు ఇలేన్ - ఏవిధమైన కొఱతియుగలవాఁడనుకాను. ఎన్దై - నాస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లయొక్క, పాదఙ్గళ్ - తిరువడికళు, యాముడైయ - మాయొక్క, పఱ్ఱు - ఆశ్రయము,

తా॥ నమ్మాழ்వార్లు వేంచేసియున్న తిరునగరిని స్తోత్రముజేయనివారిని నేను స్తోత్రము జేయను. నమ్మాழ்వార్ల తిరువడికళ్ళనాశ్రయించిన మనకేవిధకొఱతయు లేదని.

అనన్దాழ்వాను సాదించినది.

ఏయ్న్ద పెరుఙ్కీర్త్తి యిరామానుశమునిదన్*
వాయ్న్దమలర్ప్పాదమ్వణఙ్గుకిన్ఱేన్*—ఆయ్న్దపెరుమ్
శీరార్ శడగోపన్ శెన్దమిழ் వేదమ్తరిక్కుమ్*
పేరాదవుళ్ళమ్పెఱ॥

అ॥ ఆయ్న్ద - దోషరహితమైన, పెరుమ్శీర్ - గొప్పకల్యాణగుణములచే, ఆర్ - పూర్ణులైన, శడగోపన్ - నమ్మాழ்వార్లుప్రసాదించిన, తమిழ் - ద్రావిడరూపమై, శెమ్ - సుందరమైన (సులభమైన), వేదమ్ - తిరువాయ్మొழிయనెడువేదమును, తరిక్కుమ్-ధరించుటకొఱకు, పేరాద - చాంచల్యములేని, ఉళ్ళమ్-మనస్సును, పెఱ - లభించుటకై, ఏయ్న్ద - అనురూపమైన, పెరుమ్కీర్త్తి - గొప్పకీర్తిగల, ఇరామానుశమునిదన్ - ఉడయవర్లయొక్క, వాయ్న్ద - చేరియున్న, మలర్ - పుష్పమువంటి, పాదమ్ - తిరువడికళ్ళను, వణఙ్గుగిన్ఱేన్ - ఆశ్రయించుచున్నాను

తా॥ హేయప్రత్యనీకసకల కల్యాణగుణాకరులైన నమ్మాழ்వార్లు ప్రసాదించిన ద్రావిడవేదమైన తిరువాయ్మొழி నాహృదయమందు స్థిరముగానుండునట్లు, వారికత్యన్తపరతన్త్రులై జగత్ప్రఖ్యాతవైభవముగల ఉడైయవర్లయొక్క శ్రీపాదములనాశ్రయించితినని.

## భట్టరు సాదించినది.

వాన్ తిగழுమ్ శోలై మదిళరఙ్గర్ వణ్ పుగழ் మేల్*
ఆన్ఱతమిழ் మఱైగళాయిరముమ్* — ఈన్ఱ
ముదల్ తాయ్ శడగోపన్ మొయ్మ్బాల్ వళర్త్త*
ఇదత్తాయిరామానుశన్ ॥

అ॥ వాన్ - ఆకాశమందు, తిగழுమ్ - ప్రకాశించుచున్న, శోలై - తోపులనున్న, మదిళ్ - ప్రాకారములనున్నగల, అరఙ్గర్ - శ్రీరఙ్గమందుబవ్వళించినరఙ్గనాథునియొక్క. వణ్ పుగழ் మేల్ - సుందరమైనకల్యాణగుణములమీద, ఆన్ఱ వ్యాపించియున్న, తమిழ் మఱైగళ్ - ద్రావిడవేదములైన, ఆయిరముమ్ - వెయ్యిపాశురములనున్న, ఈన్ఱ - కన్నన, ముదల్ తాయ్ - మొదటితల్లి, శడగోపన్ - నమ్మాళ్వార్లు, మొయ్మ్బాల్ - (తమ) సామర్థ్యముచేత, వళర్త్త - వృద్ధిజేసిన, ఇదత్తాయ్ - హితమైనతల్లి, ఇరామానుశన్ - ఉడయవర్లు.

తా॥ తిరువాయ్మొழிని ప్రసాదించినవారు నమ్మాళ్వార్లు దానిని లోకమందు వ్యాపింపఁజేసివృద్ధిజేసినవారు ఉడయవర్లని.

మిక్క ఇఱై నిలైయుమ్ మెయ్యా ముయిర్ నిలైయుమ్*
తక్క నెఱియుమ్ తడైయాగి — త్తొక్కియలుమ్*
ఊழ் వినైయుమ్ వాழ் వినైయుమ్ ఓదుమ్ కురుగైయర్ కోన్*
యాழினిశై వేదత్తియల్ ॥

అ॥ మిక్క - గొప్పదైన, ఇఱై - సర్వేశ్వరునియొక్క, నిలెయుమ్ - స్థితినిన్ని (పరత్వమునున్న), మెయ్యామ్ - నాశములేని (నిత్యమైన), ఉయిర్ - జీవులయొక్క, నిలైయుమ్ - స్థితినిన్ని (పారతన్త్ర్యమునున్న), తక్క అనురూపమైన, నెఱియుమ్ - ఉపాయమునున్న (శ్రీమన్నారాయణచరణమునున్న), తడైయాగి - ప్రతిబన్ధకమై, తొక్కు - చేరి, ఇయలుమ్ - వర్తించుచున్న, ఊழ் - అనాదియైన, వినైయుమ్ - (అవిద్యాది) కర్మలనున్న, వాழ் వినైయుమ్ - పరమపురుషార్థమైన బ్రహ్మానన్దమునున్న, కురుగైయర్ - కురుకాపురియందున్నవారికి, కోన్ - స్వామియైన నమ్మాళ్వార్లుసాదించినదై, యాழினన్ - వీణయొక్క, ఇశై - గానమువంటి గానముగల, వేదత్తు - సామవేదముయొక్క, ఇయల్ - స్వభావముగల (సామవేదార్థప్రదిపాదకమైన) తిరువాయ్మొழி, ఓదుమ్ - ప్రతిపాదించుచున్నది.

తా॥ ఈ తిరువాయ్మొழிప్రబన్ధమందు, స్వస్వరూపపరస్వరూపోపాయస్వరూపవిరోధిస్వరూపఫలస్వరూపములనెడియర్థపఞ్చకము ప్రతిపాదింపబడుచున్నదని.

## తనియన్ సంపూర్ణము.

పత్యుశ్శ్రియః ప్రసాదేన ప్రాప్తసార్వజ్ఞ్యసంపదమ్ ।
ప్రపన్నజనకూటస్థం ప్రపద్యే శ్రీపరాఙ్కుశమ్ ॥

# తిరువాయ్మొఴి సారసఙ్గ్రహము



అఖిలజగద్ధితానుశాసనమైన వేదమందును, తదుపబృంహణములైన స్మృతీతిహాసపురాణములయందును ప్రసిద్ధమై, శ్రియఃపతియొక్క సర్వస్వమై, చేతనులకావద్ధనమై, ఉపాయోపేయములను ప్రతిపాదించుటచే "ద్వయమ్" అని తిరునామముగలదైన వాక్యద్వయమందుఁ బ్రతిపాదింపఁబడిన పది ౧౦. అర్థములును, అపౌరుషేయోపనిషత్తైన తిరువాయ్మొఴి-పది ౧౦ పత్తులచేఁ బ్రతిపాదింపఁబడుచున్నవని పూర్వాచార్యులు నిర్వహింతురు—అదెట్లనగా—౧ - వ, పత్తులో, "మలర్మగళ్ విరుమ్బుమ్ నమరుమ్ పెఱలడిగళ్" "మలరాళ్ మైన్దన్" "తిరుమామగళార్ తనికేళ్వన్" "తిరువిన్ మణాళన్" "పూమకళార్ తనికేళ్వన్" మైన్దనైమలరాళ్ మణవాళనై" ఇత్యాదివాక్యములచే శ్రియఃపతిత్వమును, ౨ - వ, పత్తులో, "ఎమ్బెరుమానారణఱ్కు" "ఎమ్బిరానెమ్మాన్ నారాయణనాలే" "నారణన్ముఴువేఴులగుక్కుమ్నాదన్" ఇత్యాది వాక్యములచే నారాయణత్వమును, ౩ - వ. పత్తులో, "నాన్మలరామశిత్తామరై" "అఙ్గదిరడియన్" "అవన్పాదపఙ్గయమ్" "తేర్కడవియపెరుమాన్కనైకఴల్" "మూవులగుమ్తొఴుదేత్తుమ్శీరడి" ఇత్యాదివాక్యములచే సర్వలోకశరణ్యమైన చరణారవిన్దమును, ౪-వ, పత్తులో, "వల్వినైతీర్క్కుమ్కణ్ణన్" "తొల్విన్నైతీర" "వెయ్యనోయ్గళ్ముఴుదుమ్ వియన్ఞాలత్తువీయ" "వేట్కైయెల్లామ్విడుత్తు కూట్టరియతిరువడిక్కళ్ కూట్టినై" ఇత్యాదివాక్యములచే అనిష్టనివృత్తిపూర్వకేష్టప్రాప్తి లక్షణమైన ప్రాపకత్వమును, ౫ - వ, పత్తులో, "తమియేనుక్కరుళాయ్" "ఆరెనక్కు నిన్పాదమే శరణాగత్తన్దొఴిన్దాయ్" "ఉన్నాలల్లాల్" "నమ్బెరుమానడి మేల్ శేమఙ్గళ్" "నాడొఱుమేగశిన్దైయనాయ్" ఇత్యాదివాక్యములచే ప్రార్థనా గర్భవిస్రమ్భమును, ౬ - వ, పత్తులో, "అడిమైశెయ్వార్ తిరుమాలుక్కు" "ఒళిన్దవొన్ మలరాళ్ కొఴునన్" "ఎన్తిరుమార్వఱ్కు" "కోలత్తిరుమామగళోడు" ఇత్యాదివాక్యములచే నిత్యసంబన్ధమును, ౭-వ, పత్తులో, "కన్నలేయముదే" "కొడియేన్ పరుగిన్నముదే" "ఇవ్వేఴులగై యిన్బమ్పయక్క" ఇత్యాదివాక్యములచే నిరతిశయ భోగ్యత్వమును, ౮-వ, పత్తులో, "పెరియవమ్మాన్" "విణ్ణవర్కోనే" "మూవులగాళి" "మూవులగుక్కుమ్నాదన్" ఇత్యాదివాక్యములచే స్వామిత్వమును, ౯ - వ, పత్తులో, "నిన్తిరువరుళుమ్ పఙ్గయత్తాళ్ తిరువరుళుమ్ కొణ్డునిన్కోయిల్శీయ్త్తు" "నిన్తీర్త్తవడిమైక్కుఱ్ఱేవల్శెయ్దు" "ఉఱువదిదువెన్రుత్తకొట్పట్టు" "ఆట్కొళ్వానొత్తు" "మిళావడిమైప్పణిశెయ్యప్పుగున్దేన్" ఇత్యాదివాక్యములచే నిత్యకైఙ్కర్యమును, ౧౦ - వ, పత్తులో, "తుయర్కెడుమ్కడిదు" "కెడుమిడరాయవెల్లామ్" "ఎఴుమైయుమేదమ్శారా" "ఇప్పిఱప్పఱుక్కుమ్" "అన్దితొఴుమ్శొల్" "అవావఱ్ఱు వీడుపెఱ్ఱ" ఇత్యాదివాక్యములచే కైఙ్కర్య ప్రతిబన్ధక నిశ్శేష నిబర్హణమును ప్రతిపాదింపఁబడినవి.

ఈపదియర్థములును శ్రీవైష్ణవులకు నిత్యానుసన్ధేయములై యుండును.

తిరువాయ్మొఴి సారసఙ్గ్రహము

సమ్పూర్ణము.



    

శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

ఆఴ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

# తిరువాయ్మొఴి

## ప్రతిపదటీకా తాత్పర్య సహితము.

౧-వ పత్తు, ౧-వ తిరువాయ్మొఴి.

౹౹ ఉయర్వఱ వుయర్ నలముడైయవన్ యవనవన్*
మయర్వఱ మదినలమరుళినన్ యవనవన్*
అయర్వఱుమమరర్గళదిపతి యవనవన్*
తుయరఱుశుడరడి తొఴుదెఴెన్మననే.

అర్థము.—ఉయర్వు *శ్రమము, అఱ - లేకుండునట్లు. ఉయర్ - సర్వోత్కృష్టమైన, నలమ్ - ఆనందము, ఉడైయవన్ - కలవాఁడు, యవన్ - ఎవఁడో? అవన్ - అట్టివాఁడును, మయర్వు - అజ్ఞానము, అఱ - పోవునట్లు, మదినలమ్ - భక్తిరూపజ్ఞానమును, అరుళినన్ - కృపఁ జేసినవాఁడు, యవన్ - ఎవఁడో? అవన్ - అట్టివాఁడును, అయర్వు - మఱపు, అఱుమ్ - లేని, అమరర్గళ్ - నిత్యసూరులకు అదిపతి - స్వామి, యవన్ - ఎవఁడో? అవన్ - అట్టివాఁడునైన సర్వేశ్వరునియొక్క, తుయర్ - (ఆశ్రితుల)దుఃఖమును, అఱు - పోగొట్టెడి, శుడర్ - ఉజ్జ్వలమైన, అడి - శ్రీపాదమును, ఎన్ మననే - నామనసా! తొఴుదు - ఆశ్రయించి, ఎఴు - ఉజ్జీవించుమా.

తాత్పర్యము.—తపస్సు మొదలుగాఁగల శ్రమలేకయే స్వతస్సిద్ధమై తనతో సాటిలేని మితిమించిన ఆనందముగలవాఁడును, నాయొక్క అజ్ఞానాన్యథాజ్ఞానవిపరీతజ్ఞానములు నశించునట్లు తనయందుఁ బ్రీతిరూపమైనభక్తిని నాకు నిర్హేతుకముగాఁ గృపఁజేసినవాఁడును, మఱపులేక నిత్యసిద్ధమైయుండునట్టి పరమాత్మజ్ఞానముగల నిత్యసూరులకు స్వామియునైన శ్రియఃపతియొక్క భక్తుల దుఃఖములను బోగొట్టెడి తేజోరూపములైన శ్రీపాదములను ఓ నామనసా! ఆశ్రయించి ఉజ్జీవించుమా యని.—ఈపాట్టుచే ఆఴ్వార్లు సర్వేశ్వరుని గుణ విభూత్యాదులననుభవించిరి.

---

(అర్థాన్తరము)* ఇతరాతిశయము.

మననగమలమఱ మలర్మిశై యెఴుదరుమ్*
మననుణర్వళవిలన్ పొఱియుణర్వవై యిలన్*
ఇననుణర్ ముఴునలమెదిర్ నిగఴ్ కఴివినుమ్*
ఇననిల నెననుయిర్ మిగునరై యిలనే. ౨

అ॥ మననగమ్ - మనస్సునందలి, మలమ్ - రాగద్వేషాదిదోషములు, అఱ - పోఁగా పోఁగా, మలర్ - వికసించి. మిశై - పైపైన. ఎఴుతరుమ్ - వృద్ధిపొందెడి. మననుణర్వు - మానసజ్ఞానముచేత, అళవిలన్ - పరిచ్ఛేదించుటకసాధ్యుఁడును, పొఱి - చక్షురాదిబాహ్యేంద్రియజన్యంబైన, ఉణర్వు - జ్ఞానముచే, (తెలిసికొనఁదగిన) అవై - అట్టిప్రాకృతపదార్థమువలె, ఇలన్ - కానివాఁడును, ఎదిర్ - భవిష్యత్కాలమందును, నిగఴ్ - వర్తమానకాలమునందును, కఴివినుమ్ - భూతకాలమందును, ఇననిలన్ - తనతోసాటిలేనివాఁడును, మిగునరై యిలన్ - తనకధికుండులేనివాఁడును, ముఴు - సంపూర్ణంబైన, ఉణర్ - జ్ఞానస్వరూపుండును, నలమ్ - ఆనందస్వరూపుండునైన, ఇనన్ - ఇట్టిసర్వేశ్వరుఁడు, ఎనన్ ఉయిర్ - నాకుప్రాణభూతుఁడు.

తా॥ విషయాసక్తిచే గలిగిన మనస్సునందలి రాగద్వేషాదులు యోగాభ్యాసముచే నశించినచోఁ గ్రమముగా వికసించి నిర్మలమై వృద్ధిపొందెడి జ్ఞానముచే తెలిసికొనఁదగిన జీవుఁడు వంటివాఁడుకానివాఁడును, పాషాణాదులవలె చక్షురాదీంద్రియములకగోచరుండును, భూతభవిష్యద్వర్తమానకాలములందును తనకుసమానుండును అధికుండునులేనివాఁడును, పరిపూర్ణజ్ఞానానందస్వరూపుండునైన అట్టిసర్వేశ్వరుఁడే నాకంతరాత్మయని - ఈపాట్టుచే వెనుక అనుసంధించిన గుణాదులకాశ్రయమైన భగవత్స్వరూపమననుభవించిరి. ౨

ఇలసదు వుడై యనిదెన నినై వరియవన్*
నిలనిడై విశుమ్బిడై యురువిన నరువినన్*
పులనొడు పులనల నొఴివిలన్ పరన్ద*
అన్నలనుడై యొరువనై నణుగినమ్ నామే. 3

అ॥ అదు - ఆదూరస్థపదార్థము, ఇలన్ - కలవాఁడుగాఁడు. ఇదు - ఈసన్నిహితపదార్థము, ఉడైయవన్ - కలవాఁడు, ఎన - అని, నినైవరియవన్ - తలంచుటకశక్యుఁడును, నిలనిడై - భూమియందును, విశుమ్బిడై - ఆకసమందును, (ఉన్న), ఉరువినన్ - స్థూలవస్తువుగలవాఁడును, అరువినన్ - సూక్ష్మవస్తువుగలవాఁడును, పులన్ - ప్రత్యక్షవస్తువులయందు, ఒడు - ప్రవేశించియున్నవాఁడును, పులనలన్ - అప్రత్యక్షవస్తువులందలి దోషములేనివాఁడు, ఒఴివిలన్ - ఒకపదార్థమున్ను విడువకుండునట్టు, పరన్ద - వ్యాపించియున్నవాఁడును, అన్నలనుడై - ఆ కల్యాణగుణములుగలవాఁడునైన, ఒరువనై అద్వితీయుఁడైన సర్వేశ్వరుని, నామ్ - మనము, నణుగినమ్ - పొందితిమి,

తా॥ ఒకవస్తువునుద్దేశించి ఈవస్తువు గలవాఁడుగాఁడనియన్నను; మరియొక్కవస్తువుగలవాఁడన్నచోఁ దదితరవస్తువులుగలవాఁడుగాఁడని తోఁచుటచేతనున్ను సర్వేశ్వరునియొక్క సర్వ

శ్వర్యములలో లోపమే లేచుటగాన ఇట్లు తలఁచగ భూమ్యంతరిక్షములందలి సర్వస్థూల సూక్ష్మవస్తువులుగలవాఁడని చెప్పదగినవాఁడై తనచేసృజింపఁబడిన ప్రత్యక్షాదిసర్వవస్తువుల యందుఁబ్రవేశించి అంతటవ్యాపించియున్నవాఁడైనను, అవస్తువులందలి దోషములు అంటని వాఁడై, సమస్తకల్యాణగుణాకరుండై, అద్వితీయుండైన సర్వేశ్వరుని మనము పొందితిమని— ఈపాట్టునందు అట్టి భగవంతుని లీలావిభూతియోగమున ననుభవించిరి. ౩

నామవ నివనువ నవళివ ళువళెవళ్ *
తామవ రివరువ రదువిదు వుదువెదు *
వీమవై యివై యువై యవై నల స్తీజవై *
ఆమవై యా యవై యాయ్ నిన్ఱ వవరే. ౪

అ॥ నామ్ - మనమున్ను, అవన్ - (తమకు) దూరస్థుఁడును, ఇవన్ - సమీపించిన వాఁడును, ఉవన్ - నడుమనున్నవాఁడును, అవళ్ - దూరమందలి స్త్రీయును. ఇవళ్ -సమీప మందలి స్త్రీయును, ఉవళ్ - మధ్యమందలిస్త్రీయును, ఎవళ్ - ఏదియని ప్రశ్నఁజేయఁదగిన స్త్రీయును, తామ్ - పూజ్యులున్ను, అవర్ - (వారిలో) దూరస్థులును, ఇవర్ - సమీపస్థులును, ఉవర్ - మధ్యస్థులును, అదు - నపుంసకమైనదూరస్థవస్తువును, ఇదు-అందలిసమీపస్థవస్తువును, ఉదు - మధ్యస్థవస్తువును, ఎదు - ఏదియని ప్రశ్నఁజేయఁదగినవస్తువును, వీమవై - నశ్వరములై, ఇవై - అందలిసన్నిహితవస్తువులును, ఉవై - మధ్యస్థవస్తువును, అవై-దూరస్థవస్తువులను, నలమ్‌తీఙ్గవై - మంచిచెడ్డవస్తువులను, ఆమవై - పుట్టపోయెడివస్తువులును, ఆయవై - గతించిన వస్తువులును, ఆయ్‌నిన్ఱ - అయియున్నటువంటివారు, అవర్ - అట్టిశ్రియఃపతియే.

తా॥ భూతభవిష్యద్వర్తమానకాలమందలి మంచిచెడ్డవై నిత్యానిత్యములై దూరసమీప మధ్యవర్తులైయున్న ఆయావస్తువులకు వాచకములైన స్త్రీపున్నపుంసకాది సర్వశబ్దములచేతను ప్రతిపాద్యుఁడు అశ్రియఃపతియే యని— ఈపాట్టున ఆలీలావిభూతియొక్క స్వరూపము భగవదధీనమని సాయించుచున్నారు. ౪

అవరవర్ తమదమ దఱివఱి వగై వగై *
అవరవ రిఱైయవ రెనవడి యడైవర్‌గళ్ *
అవరవ రిఱైయవర్ కుఱైవిల రిఱైయవర్ *
అవరవర్ విదివழியడైయ నిన్ఱనరే. ౫

అ॥ అవరవర్ - వారువారు, తమదమదు - తమతమయొక్క, అఱివఱి - జ్ఞానభేదముఁ గలిగిన, వగైవగై - ప్రకారభేదములచేత, అవరవర్ - ఆయాబ్రహ్మాదులు, ఇఱైయవర్-నాథులు, ఎన - అనితలంచి, అడి - (వారి) పాదములను, అడైవర్‌గళ్ - పొందుదురు. అవరవర్ - ఆయా, ఇఱైయవర్ - నాథులుగానెంచఁబడ్డ బ్రహ్మాదులు, కుఱైవిలర్ - భక్తులకభీష్టము లిచ్చుటయందు) తక్కువలేనివారైయున్నారు (దానికికారణము) ఇఱైయవర్-స్వామియైనశ్రియః

పతి అవరవర్ - వారివారి, విదివழி - కర్మానుగుణముగాను, అడైయ-ఫలములనుపొందుటకును, నిన్ఱనర్ - (ఆయాదేవతలకు) అంతర్యామియైయున్నారు.

తా॥ రాజసతామసాదిగుణ ప్రాబల్యముచేఁ దమతమ బుద్ధికితోఁచినట్లు బ్రహ్మను గొందరును, రుద్రుని కొందరు ఇంద్రాదిదేవతులను గొందరును బరదేవతలగా నెంచి వారిపాదముల నాశ్రయించుచున్నారు; ఆయాబ్రహ్మాదిదేవతులును అట్టి తమతమ భక్తులకు సర్వాభీష్టములను బూర్ణముగా నిచ్చుచున్నారు. ఆబ్రహ్మాదులకిట్టిశక్తికి కారణము - సర్వాన్తర్యామియైన శ్రియఃపతి ఆయాచేతనులకు వారివారికర్మానుగుణముగా శాస్త్రోక్తంబులైనయభీష్టఫలములనిచ్చుటకై బ్రహ్మాద్యన్తర్యామిగానుండి యిచ్చుటయేయని — ఈపాట్టున జగత్తుయొక్క స్థితిన్ని యా పరమాత్మాధీనమని సాయించినారు. ౫

నిన్ఱన రిరున్దనర్ కిడన్దనర్ తిరిన్దనర్*
నిన్ఱిల రిరున్దిలర్ కిడన్దిలర్ తిరిన్దిలర్*
ఎన్ఱుమో రియల్వినర్ ఎననినైవరియవర్*
ఎన్ఱుమో రియల్వొడు నిన్ఱవెన్ తిడరే. ౬

అ॥ నిన్ఱనర్ - (లోకమందు సకలప్రాణులున్ను) నిలుచుటకుఁ గారణభూతులును, ఇరున్దనర్ - కూర్చుండుటకుఁగారణభూతులును, కిడన్దనర్ - పండుకొనుటకాధారభూతులును, తిరిన్దనర్ - సంచరించుటకు నిర్వాహకులును, నిన్ఱిలర్ - నిలవకుండుటకాధారభూతులును, ఇరున్దిలర్-కూర్చుకొనకయుండుట కాధారభూతులును, కిడన్దిలర్ - పండుకొనకయుండుటకుఁ గారణభూతులును, తిరిన్దిలర్-సంచారములేకుండుటకుఁ గారణభూతులును, ఎన్ఱుమ్-ఎల్లప్పుడును, ఓరియల్వినరెన - ఒక్కమోస్తరు స్వభావముగలవారని, నినైవరియవర్, తలఁచుటకశక్యులై యున్నవారును, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, ఓరియల్వొడు - (ఈలాటివాఁడని నిర్ణయించుట కశక్యమైన) ఒకస్వభావముతో, నిన్ఱ - కూడుకొనియున్నవారునైన శ్రియఃపతియే, ఎన్ - నాయొక్క, తిడర్ - వేదప్రమాణముచే సిద్ధమైనస్వామి.

తా॥ లోకములందలి సమస్తప్రాణులయొక్క స్థితి గతి శయనాది సకలప్రవృత్తులకున్ను స్థితిగతి శయనాద్యభావరూపములైన సకలనివృత్తులకున్ను గారణభూతుఁడై, ఈలాటి స్వభావము గలవాఁడని తలంచుట కశక్యుండై, మితిమించిన స్వభావముగలవాఁడైయున్న యాశ్రియఃపతియే-నిత్యనిర్దుష్టమై అపౌరుషేయమైన వేదప్రమాణసిద్ధుండైన నాయొక్కస్వామియని — ఈపాట్టుయందు జగతుయొక్క ప్రవృత్తి నివృత్తులకు సర్వేశ్వరుండే కారణభూతుండని చెప్పబడినది. ౬

తిడవిశుమ్బెరివళినీర్ నిలమివైమిశై*
పడర్పొరుళ్ ముழுవదుమాయవై యవైదొఱుమ్*
ఉడన్మిశై యుయిరెనక్కరన్దెఙ్గుమ్పరన్దుళన్*
శుడర్ మిగు శురుదియు ళివై యుణ్డ శురనే.

అ॥ పాருక్ ముழுవతుమ్-వస్తువులన్నిఁటినిన్ని, అయ్-సృజించి, అవైయవైతోఱుమ్,- ఆయావస్తువులన్నిఁటిలో, ఉడన్మిశై - శరీరమందు, ఉయిరెన-జీవునివలె, కరన్దు - మరిగినవాఁడై, ఎఙ్గుమ్పరన్దు, వస్తువులన్నిఁటిలో వ్యాపించినవాఁడై, శుడర్-ప్రకాశమానమై, మిగు-సర్వోత్కృష్టమైన, శురుదియుళ్ - వేదమందు, ఉళన్ - ప్రతిపాద్యుఁడై యున్న శ్రియఃపతి. ఇవై - ఈవస్తువులను, ఉణ్డ - ప్రళయకాలమందారగించిన, అవన్ - దేవత.

తా॥ పృథివ్యాదిపంచభూతములనున్ను, వీనివలనఁబుట్టిన సకలచరాచరములనున్ను సృజించి ఈసమస్తవస్తువుఃయందును వీనికగోచరుండై శరీరములో వ్యాపించిన జీవునివలె వ్యాపించియున్నవాఁడని నిత్యనిర్దుష్టమై ప్రకాశించుచున్న వేదముచేఁబ్రతిపాదింపఁబడ్డ శ్రియఃపతియే ప్రళయకాలమందు సర్వమును దనగర్భమందుంచుకొని రక్షించిన దేవుఁడని—ఈపాట్టుయందు జగత్తు పరమాత్మకు శరీరమనియు, పరమాత్మ శరీరియనియుఁ జెప్పబడినది. ౭



శురరఱివరునిలై విణ్ముదల్ ముழுవదుమ్*
వరన్ముదలాయవై ముழுదుణ్ణ పరపరన్*
పురమొరుమూన్నెరిత్తమరర్క్కు మఱివియన్దు*
అరనయనెన వులగழித్తమైత్తుళనే.

అ॥ శురర్ - బ్రహ్మాదిదేవతలచే, అఱివరుమ్ - తెలిసుకొనుటకశక్యమైన, నిలై-స్వభావముగల, విణ్ముదల్-మూలప్రకృతిమొదలైన, ముழுవదుమ్-సమస్తవస్తువులకును, వరన్ముదలాయ్-శ్రేష్ఠకారణమై, అవై - ఆవస్తువులను, ముழுదు - సంపూర్ణముగా, ఉణ్డ-(ప్రళయకాలమందు) సంహారించిన, పరపరన్ - పరాత్పరుఁడైన, (శ్రియఃపతి), అరనెన-రుద్రుఁడని ప్రసిద్ధియగునట్లు, ఒరు - అద్వితీయమైన, మూన్ఱుపురమ్ - త్రిపురములను, ఎరిత్తు - దహించి, ఉలగు - లోకములను, అழித్తు-సంహరించియు, అయనెన - బ్రహ్మయని ప్రసిద్ధియగునట్లు, అమరర్క్కు - దేవతలకును, అఱివు-జ్ఞానమును, ఇయన్దు - ఇచ్చి, ఉలగు - లోకమును, అమైత్తు - సృష్టించి, ఉళన్ - (ఆబ్రహ్మరుద్రులకు) అంతర్యామియైయున్నాఁడు.

తా॥ సృష్టిసంహారకర్తలగు, బ్రహ్మరుద్రాదులుండఁగా శ్రీమన్నారాయణుఁడే పరాత్పరుఁడనుటకుఁ గారణము—ఈబ్రహ్మాదుల కగోచరమైన మూలప్రకృతిమహదహంకారాది తత్త్వములనున్ను, ఈబ్రహ్మాదులనున్ను స్వయముగా సృజించి ప్రళయమందు సంహరించుటయే. సృష్టిసంహారములను బ్రహ్మరుద్రాదులు చేయుచున్నట్లు ప్రసిద్ధియున్నను, అట్టి సృష్టిసంహారములను, బ్రహ్మకన్తర్యామియై దేవతలకు జ్ఞానోపదేశము చేసినరీతిగా బ్రహ్మాంతర్యామియైయుండియు, రుద్రాంతర్యామియై త్రిపురసంహారముఁ చేసినట్టువలె రుద్రాంతర్యామియైయుండియు తానే చేయుటచేత, అట్టి శ్రియఃపతియే పరాత్పరుఁడనుటయని—ఈపాశురమందు బ్రహ్మరుద్రాదులకుఁ బరత్వమును జెప్పెడి కుదృష్టులను నిరసించిరి. ౮

ఉళనెనిలుళ నవనురువ మివ్వురువుగళ్*
ఉళనలనెని లవనరువ మివ్వురువుగళ్*
ఉళనెన విలనెన వివై కుణముడై మెయిల్*
ఉళనిరు తకైమైయొడొழிవిలన్ పరన్దే. ౯

అ॥ ఉళనెనిల్ - ఉన్నాఁడన్నను, ఉళన్ - ఉన్నాఁడు, (అప్పుడు) ఇవ్వురువుగళ్ - ఈ చిదచిత్తులు, అవనురువమ్ - వానిస్థూలశరీరములై యుండును. ఉళనలనెనిల్ - లేఁడన్నను, ఉళన్ - ఉన్నాఁడు; (అప్పుడు) ఇవ్వురువుగళ్ - ఈవస్తువులు, అవనరువమ్-వానిసూక్ష్మశరీరములై యుండును, ఉళనెన - ఉన్నాఁడనియు, ఇలనెన - లేఁడనియు, (అనెడి), ఇవై - భావాభావరూపములైన యీరెండింటిని, కుణముడైమెయిల్ - గుణములుగాఁగలవాఁడుగనుక, ఇరుతగైమైయొడు - ఈరెండుస్వభావములతోఁగూడ, ఉళన్ - ఉన్నవాఁడై, పరన్దు ఒழிవిలన్ - అంతటవ్యాపించి, పూర్ణుఁడైయున్నాఁడు.

తా॥ ఈ పాట్టుచే "సర్వం శూన్యమ్" అనెడివానికి నుత్తరముఁజెప్పుచున్నారు. అదియెట్లనిన—లోకములలో సర్వపదార్థములున్ను భావరూపములనియు అభావరూపములనియు రెండువిధములైయున్నవి. భావమనగా-ముందుమ్మ పరమాణ్వాది సూక్ష్మావస్థను పొంది ఇప్పుడు దానినివిడిచి ఘటాదిస్థూలావస్థను బొందుట. అభావమనగా-ఇట్టిస్థూలావస్థను బొందినఘటాదులు తిరిగిపరమాణ్వాది సూక్ష్మావస్థను బొందుట. అదిగాక, ఒకపదార్థము లేదన్నచో ఇతరదేశకాలములయందున్న పదార్థము ఈదేశకాలములందు లేదనియర్థముగాని ఎప్పుడు లేదనుటయున్ను లోకసిద్ధముగాదు. ఇప్పుడు ఈశ్వరుఁడు లేడన్నచో ఏదోయొక దేశకాలములయందున్న యీశ్వరుఁడీకాలమందుఁగాని యీదేశమందుఁగాని లేడనియర్థంబగుటచేతనున్ను సర్వశూన్యత్వమునకుహానిసిద్ధము. మఱియొకహేతువు—అట్టియితరకాలదేశమందలి యీశ్వరుఁడీకాలదేశములందు లేడనియన్నను ఈయభావపదార్థము పైఁజెప్పినరీతిగా నీశ్వరపదార్థైకదేశమందున్న నియామ్యవస్తువైన జగత్తు సూక్ష్మావస్థను బొందినదనియే యర్థముగాన నీశ్వరుండు లేడన్న నీవు సూక్ష్మచిదచిద్విశిష్టమైన యీశ్వరుఁడున్నాఁడని చెప్పినట్లగుచున్నది. ఈశ్వరుఁడున్నాడని చెప్పెడి మేముపైఁజెప్పినరీతిగా స్థూలచిదచిద్విశిష్టుడైన యీశ్వరుఁడున్నాడని చెప్పుచున్నారముగాన మనము చెప్పెడు ఈశ్వరుండున్నాడులేడనెడి రెండుమాటలువలన స్థూలసూక్ష్మచిదచిద్విశిష్టమైన పరబ్రహ్మమైన శ్రియఃపతి అంతట యీరెండు రూపములలో వ్యాపించియున్నాఁడనుట యప్రతిహతముగా సిద్ధించినదిగాన నీకు సర్వశూన్యత్వము సిద్ధించదని—ఈపాట్టుచే ఆళ్వార్లు సర్వశూన్యవాదిని నిరసించిరి. ౯

పరన్ద తణ్పరవైయుళ్ నీర్ దొఱుమ్ పరన్దుళన్*
పరన్దవణ్డమిదెన నిలవిశుమ్బొழிవఱ*
కరన్ద శిలిడన్దొఱు మిడన్దిగழ் పొరుడొఱుమ్*
కరన్దెఙ్గుమ్ పరన్దుళ నివైయుణ్డ కరనే. ౧౦

అ॥ ఇవై - ఈపదార్థములను, ఉణ్డ - సంహరించిన, కరన్ - దృఢప్రమాణసిద్ధుండైన పరాత్పరుఁడు, పరన్ద-వ్యాపించియున్న, తణ్ - చల్లనైన, పరవై యుళ్ - సముద్రములోనున్న, నీర్ తొఱుమ్ - జలపరమాణువులన్నిఁటిలోను, పరన్ద-విశాలమైన, అణ్డమిదెన - అండమందువలె పరన్దుళన్ - వ్యాపించియున్నవాఁడును, నిలమ్ - భూమియందును, విశుమ్బు - ఆకసమందును, కరన్ద - అతిసూక్ష్మమైన, శిలిడన్దొఱుమ్ - అల్పశరీరములన్నిఁటిలోను, ఇడమ్ - ఆశరీరములందు తిగழ் ప్రకాశించుచున్న, పొఱుడొఱుమ్ - ఆత్మవస్తువులన్నిఁటిలోను, ఎఙ్గుమ్ - అంతట, ఒழிవఱ - సంపూర్ణమై, కరన్దు-అదృశ్యుండై, పరన్దుళన్ - వ్యాపించియున్నవాఁడును॥

తా॥ జగత్సంహారకర్తయు, వేదప్రమాణసిద్ధుండైన సర్వేశ్వరుండు, అంతములేని సముద్రమునందలి జలకణము లన్నిఁటియందును, భూమ్యంతరిక్షాదిలోకములయందును, అందలి యతిసూక్ష్మములైన యచిద్వస్తువులయందును, అట్టి యచిద్వస్తువులలో వ్యాపించి ప్రకాశించుచున్న జీవాత్మలయందును విశాలమైన బ్రహ్మాండమందున్నట్లువలె శ్రమలేకుండునటుల సంకోచము లేకుండునటులను వ్యాపించి యితరుల కగోచరుండై వేంచేసియున్నాఁడని. ౧౦

‡‡ కరవిశు మ్బెరివళి నీర్ నిల మివైమిశై *
వరనవిల్ తిఱల్ వలి యళిపొఱైయాయ్ నిన్ఱ*
పరనడిమేల్ కురుగూర్ చ్చడగోపన్ శొల్*
నిరనిఱై యాయిరత్తివై పత్తుమ్ వీడే. ౧౧

అ॥ కరమ్ - అతిసూక్ష్మమైన, విశుమ్బు - ఆకసమును, ఎరి అగ్నియును, వళి-వాయువును, నీర్ - జలమును, నిలమ్ - భూమియును, ఇవైమిశై - వీనిపైనున్న, పరన్-శ్రేష్ఠమైన, నవిల్ - శబ్దము, తిఱల్ - దాహకశక్తియును, వలి - బలమును, అళి - శైత్యమును, పొఱై - ఓర్పును, ఆయ్ - తనకుఁ బ్రకారముగాఁగలవాఁడై, నిన్ఱ - వేంచేసియున్న, పరన్-పరాత్పరుఁడైన శ్రియఃపతియొక్క, అడిమేల్ - శ్రీపాదములమీద, నిరల్నిఱై - శబ్దపుష్టియును అర్థపుష్టియునుగల, కురుగూర్ - తిరునగరియే అవతారస్థానముగాఁగల, శడగోపన్-దుష్టులను జయించిన నమ్మాళ్వార్లు, శొల్ - సాయించిన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇవైపత్తు - ఈపది పాశురములును, వీడు - సమర్పింపఁబడినవి.

తా॥ పృథివ్యాది పంచభూతములనున్ను వానిగుణములైన రూపరసాదులనున్ను శరీరముగాఁగలవాఁడైన శ్రియఃపతియొక్క తిరువడికళయందు సమర్పించిన ఆప్తతములైన ఆళ్వార్ సాయించిన శబ్దార్థ శయ్యాసందర్భాదులతో నమరియున్న వెయ్యిపాశురములయందలి యీపది పాశురములు ననుసంధించువారికి పరమపదము సిద్ధము అని — ఈపాశురముచే తిరువాయ్మొழிని యనుసంధించువారికి ఫలము చెప్పఁబడినది. ౧౧

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౨-వ తిరువాయ్‌మొழி.

వీడుమిన్ ముழ్ఱవుమ్* | వీడుశెయ్‌దు* ఉమ్ముయిర్
వీడుడై యానిడై * | విడుశెయ్ మినే. ౧

అ॥ ముழ్ఱుమ్ - ఇతరోధివస్తువులన్నిఁటినిన్ని, వీడుమిన్ - విడువుఁడి, వీడుశెయ్‌దు- విడిచి, ఉమ్ముయిర్ - మీయాత్మలను, వీడుడైయానిడై - ఇల్లుగాఁగలవానియందు, వీడుశెయ్ మిన్ - విడువుఁడి.

తా॥ భగవదితరములైన సమస్తవస్తువులయందును సంగమును విడిచి మీకంతర్యామియైన సర్వేశ్వరునియందు జీవాత్మను సమర్పించుఁడు. అనగా శేషియైన సర్వేశ్వరునికిఁ దనను శేషభూతునిగా నెంచవలయుననుట యని. ౧

మిన్నిన్ నిలై యిల* | మన్నుయి రాక్కైగళ్*
ఎన్నుమిడత్తు*ఇఱై | యున్నుమిన్నీరే. ౨

అ॥ ఉయిర్ - ఆత్మ, మన్ - తనకభిమతముగానెంచిన, ఆక్కైగళ్ - శరీరములు, మిన్నిన్ - మెరుపుకంటెను, నిలైయిల - స్థిరములైనవి కావు; ఎన్నుమిడత్తు - అనువిషయమును, నీర్ - మీరు, ఇఱై - కొంచెము, ఉన్నుమిన్ - అనుసంధింపుఁడి.

తా॥ చిరకాలవాసనాసిద్ధములైన దేహాదివిషయములను మెరుపుకంటెఁ నస్థిరములనియెంచి వానియందు అభిమానమును విడువుండి యని, ౨

నీర్‌నుమ దెన్ఱివై * | వేర్‌ముదల్ మాయ్‌త్తు* ఇఱై
శేర్మిన్* ఉయిర్‌క్కదన | నేర్ నిఱై యిల్లే. ౩

అ॥ నీర్ - మీరు, నుమదు - మీది, ఎన్ఱు - అనెడి, ఇవై - అహంకారమమకారములను, వేర్‌ముదల్ - వేరుతోఁగూడ, మాయ్‌త్తు - ఛేదించి, ఇఱై - సర్వేశ్వరుని, శేర్మిన్ - పొందుఁడి. ఉయిర్‌క్కు - ఆత్మకు, అద నేర్ - దానితోసమానమైన, నిఱై - ఆధిక్యము, ఇల్లే - లేదు.

తా॥ ఆత్మనాశకరంబులైన యహంకార మమకారములను సమూలముగా విడిచి సర్వేశ్వరుని యాశ్రయించుఁడి. ఆత్మకు నాసర్వేశుని యాశ్రయించుటకంటె నధికమించుకంతయు లేదు. ౩

ఇల్లదు ముళ్ళదుమ్ | అల్లదవనురు*
ఎల్లై యిలన్నలమ్* | పుల్‌గు పఱ్ఱఱ్ఱే. ౪

అ॥ ఇల్లదుమ్ - అనిత్యమైన అచేతనమువలెను, ఉళ్ళదుమ్ - నిత్యమైన ఆత్మవలెను, అల్లదు - కానట్టి, ఎల్లైయిల్ - అంతములేని, అన్నలన్ - అట్టి యానందముగలవాడైన, అవన్ - ఆసర్వేశ్వరునియొక్క, ఉరు - స్వరూపమును, పఱ్ఱు - ఇతరసంగములను, అఱ్ఱు-విడిచి, పుల్‌గు - ఆశ్రయించుమా.

తా॥ చేతనాచేతనములకంటె విలక్షణుండై మితిలేని యానందముగలవాఁడైన యా సర్వేశ్వరుని యితరసంగములను విడిచి యాశ్రయించుమాయని. ౪

అఱ్ఱదు పఱ్ఱనిల్* । ఉఱ్ఱదు వీడుయిర్*
శెఱ్ఱదు మన్ను ఱిల్* । అఱ్ఱిఱై పఱ్ఱే. ౫

అ॥ పఱ్ఱు - (జీవునికి) ప్రకృతిసంబంధము, అఱ్ఱదు ఎనిల్ - పోయినదన్నచో, ఉయిర్ - ఆత్మ, వీడు - ఆత్మప్రాప్తిరూపమైన మోక్షమును, ఉఱ్ఱదు - పొందినదియే అదు - ఆయాత్మప్రాప్తిరూపమైన మోక్షమును, శెఱ్ఱు - విడిచి, మన్నుఱిల్ - (నిరతిశయపురుషార్థమును) పొంద తలచినయెడల, అఱ్ఱు - ఇతరములనువిడిచి, ఇఱై - సర్వేశ్వరుని, పఱ్ఱు - ఆశ్రయించు.

తా॥ ప్రకృతిసంబంధముచే తనజ్ఞానానందాదులు ప్రకాశించకుండెడి యాజీవాత్మకు అట్టి ప్రకృతిసంబంధము నివర్తించినచో జ్ఞానానందాది తనస్వరూపము ప్రకాశించినను, అంతమాత్రముతోఁ దృప్తుఁడుగాక నింతకంటె నెక్కువైన యానందము ననుభవించవలయునన్నచో నాప్రకృతిసంబంధముము విడుచునప్పుఁడే శ్రియఃపతియొక్క శ్రీపాదముల నాశ్రయింపవలయునని. ౫

పఱ్ఱిలనీశనుమ్* । ముఱ్ఱవుమ్ నిన్ఱనన్*
పఱ్ఱిలైయాయ్*అవన్ ముఱ్ఱిలడఙ్గే. ౬

అ॥ ఈశనుమ్ - సర్వేశ్వరుఁడును, పఱ్ఱిలన్ - ప్రీతియుక్తుఁడై, ముఱ్ఱవుమ్ - సర్వులకును సమానుఁడై, నిన్ఱనన్ - ఉన్నాఁడు. పఱ్ఱిలైయాయ్ - (నీవును) ప్రీతిగలవాఁడవై, అవన్ - ఆసర్వేశ్వరునియొక్క, ముఱ్ఱిల్ - సర్వవిధకైంకర్యములయందును, అడఙ్గు - అంతర్భవించియుండుమా

తా॥ సర్వేశ్వరుఁడట్టి గొప్పవాఁడైనను భక్తులయందుఁ బ్రీతియుక్తుఁడయ్యేయుండునుగాన మీరున్ను ఆసర్వేశ్వరునియందు భక్తిగలవారై వానికి సర్వవిధకైంకర్యములను జేయుండని. ౬

అడఙ్గెழில్ శమ్బత్తు* । అడఙ్గక్కణ్డు* ఈశన్
అడఙ్గెழிల్ అ(ஃ)దెన్ఱు । అడఙ్గుగ వుళ్ళే. ౭

అ॥ అడఙ్గెழிల్ - అంతటనుశోభనమైన, శమ్బత్తు - సంపత్తును, అడఙ్గ - సంపూర్ణముగాఁ, కణ్డు - అనుసంధించి, అడఙ్గెழிల్ - పూర్ణసుందరమైన, అదు - ఆసంపత్తు, ఈశన్ - మాస్వామిది, ఎన్ఱు - అని యనుసంధించి, ఉళ్ళే - దానిలో, అడఙ్గుగ - అంతర్భవించుము

తా॥ ఉభయవిభూతులనియెడి మహాసంపత్తులుగల నాసర్వేశ్వరుని మనమెట్లుగాఁ బొందెదమని సంకోచించక ఆవిభూతిలోఁ జేరిన తనను గూఁడ నాసర్వేశ్వరుని సంపత్తుగా ననుసంధింపుమని. ౭

ఉళ్ళమురై శెయల్* । ఉళ్ళవిమ్మూన్ఱైయుమ్*
ఉళ్ళిక్కెడుత్తు*ఇఱై । యుళ్ళిలొడుఙ్గే. ౮

అ॥ ఉళ్ళమ్ - మనస్సు, ఉరై - వాక్కు, శెయల్ - శరీరము, ఉళ్ళ - (జీవునికిగాను) ఏర్పడియున్న, ఇమ్మూన్ఱైయుమ్ - ఈమూడింటిని, ఉళ్ళి - (వీనిప్రయోజనమును) ఆలోచించి, కెడుత్తు - (వీనికివిషయాన్తరప్రావణ్యమును) భంగపరచి, ఇఱైయుళ్ళిల్, స్వామివిషయమందు, ఒడుఙ్గే - చేర్చుమా.

తా॥ సర్వేశ్వరుని నేసాధనములచేత నాశ్రయించెదమనినచో, ముందు సర్వేశ్వరునిచే నివ్వఁబడియున్న మనోవాక్కాయములను, సర్వేశ్వరుని ధ్యానముఁ జేయుటకును గుణానుసం

ధానముఁ చేయుటకును కైంకర్యముఁ జేయుటకు నిచ్చినవానినిగా నెంచి వానిని నితరవ్యాపారముల నుండి మఱలించి వీనినే సాధనములుగాఁ జేసికొని భగవంతుని నాశ్రయించమని. ౮

ఒడుఙ్గ వవన్గణ్ * । ఒడుఙ్గలు మెల్లామ్*
విడుమ్ పిన్నుమాక్కై * । విడుమ్పొழுదెణ్ణే. ౯

అ॥ అవన్గణ్ ఆసర్వేశ్వరునియందు, ఒడుఙ్గ - ఇంద్రియములను జేర్పఁగా, ఒడుఙ్గలు మెల్లామ్-జ్ఞానసంకోచకరంబులైన యవిద్యాదులన్నియు, విడుమ్-విడిచిపోవును. పిన్నుమ్-తరువాత, ఆక్కై - శరీరము, విడుమ్పొழுదు-ఆత్మనువిడుచుకాలమును, ఎణ్-ప్రతీక్షించుచునుండుమా.

తా॥ పైచెప్పిన ప్రకారము భగవంతునియందుఁదమ మనోవాక్కాయములను జేర్చినయెడల భగవత్కైంకర్య విరోధులన్నియు నశించును. తరువాత నీశరీరావసాన కాలమందు భగవత్ప్రాప్తి సిద్ధముగనుక నీశరీరావసానమును నిరీక్షించియుండుమా యని. ౯

⁂ ఎణ్పెరుక్కన్నలత్తు* । ఒణ్పొరుళీఱిల*
వణ్పుగழ் నారణన్ * । తిణ్కழల్ శేర్. ౧౦

అ॥ ఎణ్ - సఙ్ఖ్యలను, పెరుక్క - అతిక్రమించియున్నవియు, అన్నలత్తు-అట్టియానంద ముగలవియు, ఒణ్ - తేజోరూపములునైన, పొరుళ్ - గుణములనున్న, ఈఱిల - అవధిలేని, వణ్ - సుందరంబులైన, పొరుళ్ - గుణములనున్నగల, నారణన్ - శ్రీమన్నారాయణుని యొక్క, తిణ్ - దృఢములైన, కழల్ - శ్రీపాదములను, శేర్ - ఆశ్రయించుమా.

తా॥ జ్ఞానానందస్వరూపులైన జీవాత్మలకును, అనంతములైన సకలకల్యాణగుణగణంబులకు నాశ్రయుండైన శ్రీమన్నారాయణుఁడే సమస్తమైన వారికిని నాశ్రయణీయుఁడు గాన, ఆశ్రితులను నెల్లప్పుడు విడువకుండ రక్షించెడి స్వభావముగల యాశ్రీమన్నారాయణునియొక్క శ్రీపాదములు నాశ్రయించుమా యని—ఈపాశురముచే ద్వయమన్త్రముయొక్క అర్థమును పాయించిరి. ౧౦

⁂ శేర్ తడత్తెన్కురు । గూర్చ్చడగోపన్ ్కొల్*
శీర్త్తొడై యాయిరత్తు* । ఒర్త్త విప్పత్తే. ౧౧

అ॥ శేర్ - చేరియున్న, తడమ్ - చెరువుగల, తెన్ - అందమైన, కురుగూర్ - కురుకాపురిని వాసస్థానము గాఁగల, శడగోపన్-నమ్మాழ்వార్లు, శొల్ - పాయించిన, శీర్-(సర్వేశ్వరుని) కల్యాణగుణములను, తొడై-గుచ్చియున్న, ఆయిరత్తు-వెయ్యిపాశురములలో, ఇప్పత్తు-ఈపది పాశురములు, ఒర్త్త - ఆలోచించి పాయింపబడినవి.

తా॥ తటాకములచేనిండి సుందరమైయున్న, కురుకాపురియందు క్షేమంచేసియున్న నమ్మాழ்వార్లు, భగవత్కల్యాణగుణ ప్రతిపాదకములైన యీపదిపాశురములను చేతనుల హితార్థమై పాయించిరి యని. ౧౧

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## 3 - వ తిరువాయ్మొళి.

౹ పత్తుడై యడియవర్క్కెళియవన్ పిఱర్గళుక్కరియ
విత్తగన్ *మలర్మగళ్విరుమ్బుమ్ నమరుమ్పెఱలడిగళ్*
మత్తుఱు కడై వెణ్ణెయ్ కళవినిల్ ఉరవిడై యాప్పుణ్ణు*
ఎత్తిఱమ్ ఉరలినోడిణైన్దిరున్దేఙ్గియ ఎళివే. ౧

అ॥ పత్తుడై - భక్తిగల, అడియవర్క్కు - దాసులకు, ఎళియవన్ - సులభుఁడును, పిఱర్గళుక్కు - భక్తిలేనివారికి, అరియ - (పొందుటకు) దుర్లభుండును, విత్తగన్ - ఆశ్చర్యభూతుండును, మలర్మగళ్ - కమలవాసినియైన శ్రీదేవి, విరుమ్బుమ్ - ఆశపడఁదగినవాఁడును, పెఱల్ - పొందుటకు, అరుమ్ - దుర్లభుండునునైన, నమ్అడిగళ్ - మనస్వామి, మత్తు - కవ్వముచే, ఉఱు - కష్టపడి, కడై - చిలికిన, వెణ్ణెయ్ - వెన్నయొక్క, కళవినిల్ - దొంగతనమునందు, ఉరవిడై - వక్షస్థలమునందు, ఆప్పుణ్ణు - కట్టఁబడినవాఁడై, ఉరలినోడు - రోలులో, ఇణైన్దిరున్దు - చేరియుండి, ఏఙ్గియ - ఎక్కెక్కిదుఃఖించిన, ఎళివు - సౌలభ్యము, ఎత్తిఱమ్ - ఏమాశ్చర్యమో ?

తా॥ సర్వేశ్వరుని సేవించవలయునని యపేక్షగలవారికి సేవించుటకు సులభుండును, అట్టి యపేక్షలేనివారికి సేవించుటకశక్యుఁడునై, ఇట్టి యాశ్చర్యభూతుండై శ్రీమహాలక్ష్మికిఁగూడ యాశపడఁదగినస్వభావముగల మనస్వామియైన సర్వేశ్వరుండు, యశోదాదేవి కష్టపడి చిలికి పెట్టిన వెన్నను దొంగతనముచేనెత్తి యారగింపఁగా, అప్పుడాయశోదాదేవి కోపగించి చిన్న త్రాడుతో రొమ్మును రోలుకుచేర్చికట్టఁగా నప్పుడెక్కెక్కిదుఃఖించిన సౌలభ్యమే మాశ్చర్యమో! యని ఆసౌలభ్యగుణమును నమ్మాళ్వార్లు అనుభవించి పరవశులైరి ౧

మూ:—ఎళివరుమియల్వినన్ నిలైవరమ్బిల పలపిఱప్పాయ్*
ఒళివరుముழునలమ్ ముదలిల కేడిల వీడామ్*
తెళివరు నిలైమైయదొழிవిలన్ముழுవదుమిఱైయోన్*
అళివరుమరుళినోడగత్తనన్ పుఱత్తనన్ అమైన్దే ౨

అ॥ ఇఱైయోన్ స్వామియైన సర్వేశ్వరుఁడు, అళివరుమ్ - చల్లనైన, అరుళినోడు-కృపచేత, అగత్తనన్ - (భక్తులకు) లోపలనుండువాఁడై, పుఱత్తనన్-(అనాశ్రితులకు) దూరముగానుండువాఁడై, అమైన్దు - అమరియుండి, ముదలిల-ఆదిలేనటువంటిన్ని, కేడిల - నాశములేనటువంటిన్ని, ఒళివరుమ్-ప్రకాశించుచున్నటువంటిన్ని, ముழுనలమ్-కల్యాణగుణములన్నిఁటిన్ని, వీడామ్ - మోక్షమనెడి, తెళి - జ్ఞానమును, తరు - ఇచ్చుచున్న, అదు - ఆ, నిలైమై-స్వభావమునున్ను, ముழுవదుమ్ - ఇవియన్నిఁటిని, ఒழிవిలన్-సంపూర్ణముఁగాఁగలవాఁడునై, నిలై-స్థితియందు, వరమ్బిల - హద్దులేని, పలపిఱప్పాయ్-అనేకయవతారములుగలవాఁడునునై, ఎళివరుమ్ - సౌలభ్యమును, ఇయల్వినన్ - స్వభావముగాఁగలవాఁడునునైయున్నాఁడు.

తా॥ అవతారాదులయందు ఉత్కర్షాపకర్షములనుఁజూడకుండ దేవమనుష్యపశ్వాదిజాతులయందవతరించి యాశ్రితులకత్యంతసులభుఁడైన సర్వేశ్వరుఁడు, అయాయవతారములయందుఁగూడ

స్వతస్సిద్ధమైన కల్యాణగుణములను పూర్తిగాగలవాఁడై భక్తులకు తన సేవారూపమైన మోక్షము నిచ్చుచు వారికత్యంతసులభుండును అనాశ్రితులకు దుర్లభుండునైయున్నాడని. ౨

అమైవుడై యఱనెఱి ముழுవదు ముయర్వఱ వుయర్న్దు*
అమైవుడై ముదల్ కెడ లొడివిడై యఱనిల మదువామ్*
అమైవుడై యమరరుమ్ యావై యుమ్ యావరుమ్ తానామ్*
అమైవుడై నారణన్ మాయైయై యఱిబవర్ యారే. 3

అ॥ అమైవుడై - *వ్యవస్థగల, అఱనెఱి - ధర్మమార్గములు, ముழுవదుమ్ - అన్నిఁటిలో, ఉయర్వఱ - తనకంటెనతిశయములేక, ఉయర్న్దు - ఉత్కృష్టమై, అమైవుడై - అమరియున్నటువంటి, ముదల్ - సృష్టి, కెడల్ - సంహారము, ఒడివిడై - అవాంతరసంహారము, (వీనికి) అఱ - మిక్కిలి, నిలమదువామ్ - కారణభూతుఁడైయున్న, అమైవుడై - వ్యవస్థితులైన, అమరరుమ్ - బ్రహ్మాదిదేవతలనున్ను, యావైయుమ్ - అచేతనములన్నిఁటినిన్ని, యావరుమ్ - చేతనులందరినిన్ని, తానామ్ - తనకుశరీరము గాఁగలవాఁడై, అమైవుడై - ఐశ్వర్యపూర్తిగలవాఁడైయున్న, నారణన్ - శ్రీమన్నారాయణునియొక్క, మాయైయై ఆశ్చర్యమైన యవతారరహస్యములను, అఱిబవర్ - తెలిసికొనెడివారు, యార్ - ఎవరు.

తా॥ ఉత్కృష్టమైన తపస్సుచేత సంపాదింపఁబడినవియు, ఇతరఫలము లన్నిఁటిలో మేలైనవియునైన సృష్టిసంహారాదిక్రియలకుకర్తలై సుప్రసిద్ధులైన బ్రహ్మరుద్రాదులకును, చేతనాఽచేతనములకును నాధారభూతుండై సంపూర్ణైశ్వర్యముగలవాఁడైయున్న శ్రీమన్నారాయణుని యొక్క యవతారరహస్యములను దెలిసికొనందగిన వారెవరున్ను లేరని. 3

యారుమోర్ నిలైమైయనెన వఱివరియ వెమ్బెరుమాన్*
యారుమోర్ నిలైమైయనెన వఱివెళియ వెమ్బెరుమాన్*
పేరుమోరాయిరమ్ పిఱపల వుడైయ వెమ్బెరుమాన్*
పేరుమోరురువము ముళదిల్లై యిలదిల్లై పిణక్కే. ౪

అ॥ యారుమ్ - (ప్రతికూలులు) ఎంతజ్ఞానవంతులైనను, ఓర్నిలమైయన్ - (ఇట్టి) ఒక విధమైనస్వభావముగలవాఁడు, ఎన-అని, అఱివరియ - తెలిసికొనుటకసాధ్యుఁడైన, ఎమ్బెరుమాన్ నాస్వామియు, యారుమ్ - (భక్తులు) ఎంతజ్ఞానములేనివారైనను, ఓర్నిలైమైయన్ - ఇట్టి ఒకవిధస్వభావముగలవాఁడు, ఎన-అని, అఱివెళియ-తెలిసికొనుటకునులభుఁడైన, ఎమ్బెరుమాన్-నాస్వామియు, ఓరాయిరమ్-ఒకవెయ్యి, పేరుమ్-తిరునామములనున్ను, పిఱ-తక్కిన, పల - అనేకదివ్యమంగళవిగ్రహములనున్ను, ఉడైయ - కలవాఁడైన, ఎమ్బెరుమాన్-నాస్వామియు నైనవానికి, ఓర్ పేరుమ్, ఒకతిరునామమున్ను, ఓరురువముమ్-ఒకవిగ్రహమున్ను, ఉళదిల్లై - ఉన్నదికాదు, ఇలదిల్లై - లేనిదికాదు, (అని యభక్తులకును భక్తులకును), పిణక్కు - వివాదముగలిగి యుండును.

---

* ధర్మముకు వ్యవస్థయనగా-ఈ ధర్మము ఇదే ఫలమునిచ్చుననుట. జ్యోతిష్టోమ యాగమునకు స్వర్గమే ఫలమగును. అది మఱియొక ఫలమునివ్వదు.

తా॥ ఇట్టిసర్వేశ్వరుని, ఎట్టి జ్ఞానవంతులైనను ప్రతికూలులైనచోఁ దెలిసికొనఁజాలరు ; అనుకూలులెంత జ్ఞానహీనులైనను భక్తరక్షణార్థమై స్వీకరించిన లెక్కలేని దివ్యమంగళవిగ్రహములును తిరునామములునుగలవాఁడని సులభముగాఁ దెలిసికొనఁగలరు. ఇట్టి దివ్యమంగళవిగ్రహ తిరునామాదులలో నొకటియైనను దమకుఁదెలియకఁబోవుటచే నొకరూపమున్ను ఒకనామమున్ను లేదని యభక్తులున్ను, తమకుఁదెలియుటచే యవియున్నవియని భక్తులున్ను వివాదపడుదురని— వెనుక పాట్టులో శ్రీమన్నారాయణుని యవతారరహస్యము లెట్టివారికిని దెలియదన్నచో నిక నెట్టుగాఁదెలుసుననఁగా, భక్తులకు సులభముగా దెలుసుననియును అభక్తులకెంత ప్రయత్నముఁ జేసినను దెలియఁదనియును నీపాట్టుకు ముఖ్యాంశము. ౪

పిణక్కఱ వఱువగై చ్చమయముమ్ నెఱియుళ్ళియురైత్త*
కణక్కఱునలత్తనన్దమిలాదియమ్బగవన్*
వణక్కుడైత్తవనెఱి వழிనిన్ఱు పుఱనెఱికళైకట్టు*
ఉణక్కుమిన్పశైయఱ వవనుడైయుణర్వుకొణ్డుణర్న్దే. ౫

అ॥ అఱువగై - ఆరువిధములైన, శమయముమ్ - మతములకున్ను, పిణక్కు - వివాదము, అఱ - పోవునట్లు, నెఱి - ధర్మమార్గములను, ఉళ్ళి - ఆలోచించి, ఉరైత్త - సాయించిన, కణక్కఱు - సంఖ్యలేని, నలత్తన౯ - కల్యాణగుణములుగలవాఁడై, అన్దమిల్ - నాశములేనివాఁడై, ఆది - సర్వకారణుండై, అమ్ - దోషశూన్యుఁడైన, పగవ౯ - శ్రియఃపతినిగురించి, వణక్కుడై - నమ్రతగల, తవనెఱివழி - భక్తిమార్గమందు, నిన్ఱు - నిలిచి, పుఱనెఱి - బాహ్యవిషయములనెడి, కళై - దుష్టశాఖలను, కట్టు - ఛేదించి, అవనుడై - ఆసర్వేశ్వరుఁడుపదేశించిన, ఉణర్వుకొణ్డు - జ్ఞానమునుఁదీసికొని, ఉణర్న్దు - (సర్వేశ్వరుని) సాక్షాత్కరించి, పశై - వాసనలు అఱ - పోవునట్లు, ఉణక్కుమిన్ - అదుష్టశాఖల నెండపెట్టుఁడి.

తా॥ ఇట్టి వివాదములో యథార్థమును నిర్ణయించువిధమెట్టిదనఁగా, ఆసర్వేశ్వరుఁడే కృష్ణావతారంబెత్తి దుర్మతములను ఖండించి వేదమే ప్రమాణమనియు తద్విరుద్ధములైనవి యప్రమాణంబులనియు, ఆవేదమందు జ్ఞానానందాది సమస్తకల్యాణయుతుండైన తానే ప్రతిపాద్యుండనియు భగవద్గీతయందుఁ జెప్పినాడుఁగనుకఁ గ్రిందిపాట్టులో భక్తులు జెప్పినదియే సత్యము. ఇట్లు తన నిర్హేతుక కృపచేత వేదార్థముల వెలింగించిన సర్వేశ్వరునియందు భక్తిగలిగి వానిస్వరూపగుణ విభూత్యాదులను సాక్షాత్కరించి యితరమైన హేయవిషయములయందు సవాసనముగా సంగమును విడువుండి యని. ౫

ఉణర్న్దుణర్న్దిழிన్దగన్ఱుయర్న్దురు వియన్దవిన్నిలైమై*
ఉణర్న్దుణర్న్దుణరిలుమిఱైనిలై యుణర్వరి దుయిర్గాళ్*
ఉణర్న్దుణర్న్దురైత్తురైత్తరి యయ నరనెన్ను మివరై*
ఉణర్న్దుణర్న్దురైత్తురైత్తిఱైఞ్జుమిన్ మనప్పట్టదొన్ఱే. ౬

అ॥ ఉణర్న్దుణర్న్దు - నిత్యజ్ఞానముకలదై, ఇழிన్దు - క్రిందవ్యాపించి, అగన్ఱు - పక్కలను వ్యాపించి, ఉయర్న్దు - పైనవ్యాపించి, ఉరు - అచేతనములకంటె, వియన్ద - విలక్షణమైయున్న, ఇన్నిలైమై - ఈజీవాత్మస్వభావమును, ఉణర్న్దు - (శాస్త్రములయొక్కవినికిచేత) తెలిసికొని,

ఉణర్న్దు - (వానియొక్క మననముచేత) తెలిసికొని, ఉణరిలుమ్-(యోగాభ్యాసముచేత) సాక్షాత్కరించినను, ఇఱైనిలై-సర్వేశ్వరునిస్వభావమును, ఉణర్వరిదు-తెలిసికొనుటకశక్యము, ఉయిర్గాళ్ - చేతనులారా ! అరి - విష్ణువు, అయన్ - బ్రహ్మ, అరన్ - రుద్రుఁడు, ఎన్నుమ్ - అనెడి, ఇవరై - వీరిని, ఉణర్న్దుణర్న్దు - పలువిధములనాలోచించి, ఉరైత్తురైత్తు- ప్రమాణములనుబలుమారుఁజెప్పి, మనప్పట్టదొన్ఱు - మనస్సులో ఈశ్వరుఁడనిదోఁచిన ఒకవస్తువును, ఉణర్న్దుణర్న్దు - పలుమారుధ్యానించి, ఉరైత్తురైత్తు - వాని మంత్రములను బలుమారుజెప్పి, ఇఱైఞ్జుమిన్ - ఆశ్రయించుఁడి.

తా॥ ఎల్లప్పుడు జ్ఞానముగలవాఁడై తనజ్ఞానముచేతనంతట వ్యాపించువాఁడై, అచేతనములకంటె విలక్షణుఁడైన జీవాత్మయొక్క స్వరూపమును శ్రవణమనననిదిధ్యాసనములచేఁ దెలిసికొనినను ఆశ్రితార్థమై దేవమనుష్యాది రూపములనెత్తిన సర్వేశ్వరుని దెలిసికొనుటకు శక్యంబుగాదు. వానిని దెలిసికొనేయుపాయంబేమనఁగా, హరిహరబ్రహ్మలయొక్క స్వరూప స్వభావంబులనున్ను వానిని బ్రతిపాదించెడి శాస్త్రములనున్ను బలుమారాలోచించినయెడల శ్రియఃపతియే సర్వేశ్వరుఁడనిదోఁచఁబడును. అట్టి శ్రియఃపతిని మనోవాక్కాయములచే నాశ్రయించుఁడని. ౬

ఒన్ఱెన ప్పలవెన వఱివరుమ్ వడివినుళ్ నిన్ఱ*
నన్ఱెழిల్ నారణన్ నాన్ముగనరనెన్నుమివరై *
ఒన్ఱ నుమ్మనత్తువైత్తుళ్ళి నుమ్మిరుపసైయఱుత్తు*
నన్ఱెన నలమ్శెయ్వ దవనిడై నమ్ముడై నాళే. ౭

అ॥ ఒన్ఱెన - ఒకడనియు, పలవెన - అనేకులనియు, అఱివరుమ్ - తెలిసికొనుటకశక్యమయిన, వడివినుళ్ - శరీరములయందు, నిన్ఱ - నివసించియున్న, నన్ఱు - శ్రేష్ఠమయిన, ఎழిల్ - కాన్తిగల, నారణన్ - శ్రీమన్నారాయణుండు, నాన్ముగన్-బ్రహ్మ, అరన్ - రుద్రుఁడు, ఎన్నుమ్-అనెడి, ఇవరై-వీరలను, ఒన్ఱ - పక్షపాతములేక, నుమ్మనత్తు-మీమనస్సులయందు, ఉళ్ళి-ఆలోచించి, నుమ్మిరుపసై - మీకు బ్రహ్మరుద్రులయిన యిరువురులయందుఁగలిగిన ఈశ్వరత్వ బుద్ధిని, అఱుత్తు - ఛేదించి, అవనిడై - ఆశ్రీమన్నారాయణునియందు, నమ్ముడై - మనయొక్క, నాళ్ - ఆయుస్సుయందు, నన్ఱెన - చక్కఁగా, నలమ్ - స్నేహము, శెయ్వదు - చేయఁదగినది.

తా॥ బ్రహ్మ విష్ణు రుద్రులు ముగ్గురుకిని యంతరాత్మయొక్కండా ? లేక ముగ్గురాయని యాలోచించి నిర్ణయించుట సాధారణముగానశక్యంబుగాన, సేవించిన మాత్రములోనే పరత్వమును దెలుపుఁడు జేసెడి గొప్పతేజస్సుగల శ్రీమన్నారాయణుని యొక్కయు, బ్రహ్మరుద్రుల యొక్కయు స్వరూపస్వభావములను శ్రవణమననిదిధ్యాసనములచే నిష్పక్షపాతియై చక్కఁగా నాలోచించిచో శ్రియఃపతికే పరత్వముఁదోచును, పిదప బ్రహ్మరుద్రులయందు పరత్వబుద్ధిని విడిచి మన యావజ్జీవమున్ను ఇతర ప్రయోజనముల నపేక్షించక యాశ్రీమన్నారాయణునికే కైంకర్యముఁ జేయవలయునని. ౭

నాళునిన్ఱడు వమపழமై యఱ్ఱొడునిన్ఱు యుడనే
మాళుమ్*ఓర్కుఱై విల్లై మననగ మలమఱక్కழுవి*

నాళునమ్ తిరువుడై యడిగళ్ దమ్ నలఙ్గழల్వణఙ్గి*
మాళుమోరిడత్తిలుమ్ వణక్కొడు మాళ్వదు వలమే.    ౮

అ॥ మననగమ్ - మనస్సునందలి, మలమ్ - దోషములు, అఱ - పోవునటుల, కழువి - కడిగి, నాళుమ్-ప్రతిదినమందున్ను, తిరువుడై - శ్రీమంతుడైన, నమ్మడిగళ్ - మనస్వామి యొక్క, నలమ్ - భోగ్యమైన, కழల్-తిరువడికళ్లను, వణఙ్గి - ఆశ్రయించినయెడల, నాళుమ్-ప్రతిదినమందున్ను, నిన్ఱు-విడువకుండనిలిచి, అడుమ్ - బాధించుచున్న, నమ-మనయొక్క, పழమై - అనాదియైన, అఙ్కొడువినై - అత్యంతక్రూరపాపములు, ఉడనే-ఆశ్రయించినప్పుడే, మాళుమ్ - నశించును, ఓర్కుఱైవిల్లై-ఒక్కతక్కువయున్ను గలుగదు. మాళుమోరిడత్తిలుమ్ - శరీరావసానకాలమందును, వణక్కొడు-నమ్రతతో, మాళ్వదు - శరీరమునువిడుచుట, నలమ్ - శ్రేష్ఠము.

తా॥ ఇతర దేవతలయందుఁ బరతత్వశంకనువదలి లక్ష్మీభర్తయొక్క శ్రీపాదముల నాశ్రయించినయెడల, వారా శ్రయించినకాలమందే చిరకాలమునుండి చేసియున్న భగవత్కైంకర్య విరోధులైన మనపాపములన్ని నశించును. అటుపైన నేకొరతయులేక మన యిష్టానుసారముగా భగవంతుని యనుభవింపవచ్చును. జీవితకాలమందా శ్రియఃపతిని యాశ్రయించకఁబోయినను, మరణకాలమందైనను సర్వేశ్వరుని యాశ్రయించినయెడల యిదియేసకలము నిచ్చునని.    ౮

వలత్తనన్ తిరిపురమెరిత్తవ నిడమ్పెఱత్తున్ది
త్తలత్తు*ఎழு దిశైముగన్పడైత్త నల్లులగమున్దానుమ్
పులప్పడ*ప్పిన్ను న్దన్నులగత్తి లగత్తనన్ తానే
శొలప్పుగిల్*ఇవైపిన్నుమ్ వయిఱ్ఱుళ వివై యవన్ తుయక్కే.    ౯

అ॥ ఎழு - వృద్ధిఁబొందుచున్న, తిశైముగన్ - బ్రహ్మ, పడైత్త - సృష్టించిన. నల్ - విలక్షణమైన, ఉలగముమ్ - లోకమున్ను, తానుమ్ - ఆబ్రహ్మయున్ను, తున్దిత్తలత్తు - శ్రీనాభియందు, ఇడమ్పెఱ-(విశాలముగా) ఉన్నాడు. తిరిపురమ్-త్రిపురములను, ఎరిత్తవన్ - దహించిన రుద్రుఁడు, వలత్తనన్ - (ఈశ్రియఃపతియొక్క) దక్షిణభాగమందున్నాఁడు. పిన్నుమ్ - మఱియును - పులప్పడ, భక్తులకుసేవసాయించుటకు, తానే - స్వయముగా, తన్నులగత్తిల్ - తనదైన యీలోకమందు. అగత్తనన్ - అవతరించియున్నాఁడు. శొలప్పుగిల్ - వీనిని చెప్పుట కారంభించినయెడల, ఇవై - ఈగుణములు, పిన్నుమ్ - మఱిన్ని, వయిఱ్ఱుళ-లోలోపున నే యుండును. ఇవై - ఇవి, అవన్ - ఆసర్వేశ్వరునియొక్క, తుయక్కు, మోహనవ్యాపారము.

తా॥ బ్రహ్మయొక్కయు, వీనిచే సృజింపఁబడిన లోకములయొక్కయు, రుద్రునియొక్కయు స్వరూపస్థిత్యాదుల కాధారభూతుండై, మఱియును భక్తులయందలి కృపచే వీరికి సేవసాయించెడి నిమిత్తమై యీలోకములయందవతారముల నెత్తినవాఁడైన సర్వేశ్వరుని కల్యాణగుణములు లెక్కించనలవిగానివిగాన ఎంత చెప్పినను తరగవు. ఇట్టి కల్యాణగుణముల నభక్తులెరుంగఁ కుండుటకుఁగారణము, ఈ సర్వేశ్వరుని మాయయేయని.    ౯

తుయక్కఱుమదియిల్ నన్ఞానత్తు ళమరరై త్తుయక్కుమ్*
మయక్కుడై మాయైగళ్ వానిలుమ్బెరియనవల్లన్*
పుయక్కరు నిఱత్తన్ పెరునిలఙ్గడన్ద నల్లడిప్పోదు*
అయర్ప్పిలనల ర్ త్తువన్ తழுవువన్ వణఙ్గువనమర్న్దే. ౧౦

అ॥ తుయక్కు - సంశయము, అఱ - లేని. మదియిల్-మనస్సునందుఁబుట్టిన, నల్-శ్రేష్ఠమైన, ఞానత్తుళ్-జ్ఞానముగల, అమరరై-దేవతలను, తుయక్కుమ్-కలతఁజెందినవారినిగాఁజేసెడి, మయక్కుడై-భ్రమింపఁజేయుశక్తిగల, మాయైగళ్-మాయలను, వానిలుమ్-ఆకసముకంటె, పెరియనవల్లన్ - పెద్దవిగాఁజేయువాఁడును, పుయల్-నల్లనిమేఘమువంటి, కరునిఱత్తన్ - నల్లనితిరుమేనుగలవాఁడునైన, శ్రియఃపతియొక్క. పెరు-విశాలమై, నలమ్-భూమిని, కడన్ద-కొలిచిన, నల్-విలక్షణమైన, అడిప్పోదు - పాదపద్మములను, అమర్న్దు-అమరియుండి, అయర్ప్పిలన్ - మరుపులేనివాఁడనై, అలర్ త్తువన్ - పలికెదను, తழுవువన్ - కౌఁగలించుకొనెదను, వణఙ్గువన్ - నమస్కరించెదను.

తా॥ మనస్సునం దెట్టి సంశయాదులును లేక శ్రేష్ఠజ్ఞానవంతులైన బ్రహ్మాదిదేవతలనుగూడ మోహింపఁజేసెడి మాయగలవాఁడును, నీలమేఘకాంతిగలవాఁడునైన శ్రియఃపతియొక్క సమస్తలోకములనున్ను కొలిచినట్టి పద్మమునుబోలిన శ్రీపాదముల ననన్యప్రయోజనుఁడనై మనోవాక్కాయములచే నాశ్రయించెదనని. ౧౦

అమరర్గళ్ తొழுదెழ అలైకడల్ కడైన్దవన్ఱన్నై*
అమర్పొழிల్ వళఙ్గురుగూర్ చ్చడగోపన్ కుఱ్ఱేవల్గళ్*
అమర్శువైయాయిర త్తవత్తినుళివై పత్తుమ్ వల్లార్*
అమరరో డుయర్విల్ శెన్ఱఱువర్ తమ్బిఱవి యఞ్జిఱైయే. ౧౧

తా॥ అమరర్గళ్ - దేవతలు, తొழுదెழ - ఆశ్రయించి క్షేమపడునట్లు, అలైకడల్-అలలుగొట్టుచున్న సముద్రమును, కడైన్దవన్ఱన్నై-చిలికిన సర్వేశ్వరుని యుద్దేశించిఁజెప్పిన, అమర్-ఒప్పుచున్న, పొழிల్వళమ్ - తోటలసమృద్ధిగల, కురుగూర్-తిరునగరియందు వేంచేసియున్న, శడగోపన్ - నమ్మాழ்వార్లయొక్క, కుఱ్ఱేవల్గళ్ - వాచికకైంకర్యమైన, శువై - శబ్దార్థ రసములు, అమర్ - అమరియున్న, ఆయిరత్తవత్తినుళ్, వెయ్యిపాశురములుగల నీప్రబన్ధమందు, ఇవై పత్తుమ్, ఈపదిపాశురములనున్ను, వల్లార్ - అభ్యసించినవారు, అమరరోడు - నిత్యసూరులతోటి, ఉయర్విల్-ఉన్నతమైన మోక్షమందు, శెన్ఱు - వెళ్ళి, తమ్పిఱవి-తమసంసారరూపమైన - అఞ్శిఱై - క్రూరబంధమును, అఱువర్ - తెంపుకొనుదురు.

తా॥ బ్రహ్మాదిదేవతలయొక్క క్షేమార్థమై పాలసముద్రమును చిలికినట్టి శ్రియఃపతినిగూర్చి సమస్తవిభవములుగల కురుకాపురవాసులైన నమ్మాழ்వార్లుసాయించిన మధురమైన తిరువాయ్మొழிయందలి నీపదిపాశురముల ననుసంధించువారు నిత్యసూరులతోఁగూడ మోక్షమునొంది క్రూరమైన సంసారబంధమును వదలుదురని. ౧౧

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
ఎమ్బెరుమానార్ తిరువడిగళే శరణమ్.

## ౪ - వ తిరువాయ్మొழி.

అవతారిక.— మొదటి తిరువాయ్మొழிలో, శ్రియఃపతియే పరాత్పరుఁడని సాయించిరి రెండవ తిరువాయ్మొழிలో, ఆశ్రియఃపతియందే భక్తిఁజేయవలయునని సాయించిరి, మూడవ తిరువాయ్మొழிలో, అట్టిపరాత్పరుఁడు భక్తులకు మిక్కిలి సులభుండని సాయించిరి. ఈతిరువాయ్మొழிలో, ఆశ్రియఃపతి నెడఁబాసియుండలేక విరహావస్థనొంది తననొక రాట్టివలె, దలంచి తనకంటికగుపడినపక్షులను, ఇవి నామాటల నెఱుఁగవని యాలోచించక, నాకోరికను శ్రియఃపతివద్ద విన్నవింపుమని పంపించుచున్నారు.

ఀ అఞ్జిఱైయ మడనారా యళియత్తాయ్* నీయుమ్నిన్
అఞ్జిఱైయ శేవలుమా యావా వెన్నెనక్కరుళి*
వెఞ్జిఱైప్పుళ్ళుయర్త్తార్క్కె న్విడుతూదాయ్ చ్చెన్ఱక్కాల్*
వన్శిఱైయి లవన్వైక్కిల్ వైప్పుణ్డా లెన్శెయ్యుమో. ౧

అ॥ అళియత్తాయ్ - కనికరించుస్వభావముగల, అమ్శిఱైయ - అందమైన ఱెక్కలుగల. మడనారాయ్ - విధేయమైన ఓసారసపక్షీ ! నీయుమ్ - నీవును, నిన్ - నీయొక్క, అమ్శిఱైయ - అందమయిన ఱెక్కలుగలఁ, శేవలుమాయ్ - మొగపక్షియును, ఆవావెన్ఱు-అయ్యయ్యోయని, ఎనక్కు - మావిషయమై, అరుళి - కృపఁజేసి, వెమ్శిఱై - క్రూరమైనఱెక్కలుగల, పుళ్ - గరుడపక్షిని, ఉయర్త్తార్క్కు - ధ్వజముగానెత్తిన శ్రియఃపతివద్ద, ఎన్ - నాయొక్క, విడుతూదాయ్-విడిచెడిదూతయై, శెన్ఱక్కాల్ - పోయినయెడల, వన్శిఱైయిల్-మాటలాడక పోవుటయనెడి క్రూరమైనచెఱయందు, అవన్ - ఆ సర్వేశ్వరుండు, వైక్కిల్-ఉంచినయెడల, వైప్పుణ్డాల్ - ఉంచబడియున్నచో, ఎన్శెయ్యుమ్ - ఏమిభాధనుజేసును.

తా॥ తలంచినప్పుఁడెల్ల తలంచినచోటునకుఁబోవుటకు సాధనమైన ఱెక్కలుగల విధేయమయిన ఓసారసపక్షీ ! నాదుఃఖమునుజూచి సహింపని నీవు నావిషయమై దయఁజేసి, ఆశ్రితదుఃఖములను బోఁగొట్టెడి గరుడపక్షిని ధ్వజముగాఁగల సర్వేశ్వరునివద్ద వెళ్ళి నాబాధను జెప్పుము. అప్పుడాసర్వేశ్వరుఁడు నీమాటనువినక అవమానముఁజేసినయెడల నంతయవమానమును నాకొఱకై సహింపరాదాయని. ౧

ఎన్శెయ్యతామరైక్కణ్ పెరుమానార్క్కెన్ తూదాయ్*
ఎన్శెయ్యుముఱైత్తక్కా లినక్కుయిల్గాళ్ నీరలిరే*
మున్శెయ్ద ముழவినైయాల் తిరువడిక్కீழ్క్కుఱ్ఱేవల్*
మున్శెయ్య ముయలాదే నగల్వదువో విదియినమే. ౨

అ॥ ఇనక్కుయిల్గాళ్ - గుంపుగానున్న ఓకోకిలములారా ! నీరలిరే - మీరుగదా ? ఎన్ - నాయొక్క, శెయ్య-ఎఱ్ఱనైన, తామరైక్కణ్ - తామరపుష్పమువంటి నేత్రములుగల, పెరుమానార్క్కు - స్వామికి, ఎన్తూదాయ్-నాదూతయై (వెళ్ళి), ఉఱైత్తక్కాల్-చెప్పిన

రొడల, ఎన్ శెయ్యుమ్ - ఏమిచెరువగును, మున్ శెయ్ద - మునుపుచేసిన, ముழுవినైయాల్ - పూర్ణపాపములచేత, తిరువడిక్కీழ் - శ్రీపాదములయందు, కుత్తేవల్ - కైంకర్యము, శెయ్య - చేయుటకు, మున్ - మునుపు, ముయలాదే-యత్నముఁజేయక, ఇని - ఇప్పుడును, అగల్వదువో విది-దూరముగానుండుటయే యేర్పడినదా ?

తా|| ఓ కోకిలపక్షులారా ! మీరు నాయందు మిక్కిలి కనికరముఁగలవారుగదా ? తన యొక్క నేత్రసౌందర్యమును గనుపరచి నన్ను వశపఱచుకొనిన సర్వేశ్వరునివద్ద నాదూతయైవెళ్లి నామాటవినదియని చెప్పినయెడల మీకేమయినా తప్పుఁవచ్చునా ? రాదు ; గనుక మీరువెళ్లి, పూర్వ జన్మపాపముచేత మీ శ్రీపాదములయందుఁ గైంకర్యముఁ జేయుట కేమియుసాధనములేని నేనిఁకనుగూఁడ నిట్లుఁ బోవలసినదేనా యని చెప్పుండని. ౨

విదియినాల్ పెడై మణక్కుమ్ మెన్నడైయ వన్నఙ్గాళ్*
మదియినాల్ కుఱళ్ మాణా యులగిరన్ద కళ్వర్క్కు*
మదియిలేన్ వల్వినైయే మాళాదోవెన్ఱు*ఒరుత్తి
మదియెల్లాముళ్ కలఙ్గి మయఙ్గుమా లెన్నీరే. ౩

అ|| విదియినాల్ - భాగ్యముచేత, పెడై - ఆడపక్షితో, మణక్కుమ్ - కూడియున్న, మెన్నడైయ - మందగమనముగల, అన్నఙ్గాళ్ - హంసపక్షులారా ! మదియినాల్-బుద్ధిచేత, కుఱళ్ మాణాయ్ - పొట్టియయినబ్రహ్మచారియై, ఉలగు - లోకములను, ఇరన్ద-యాచించిన, కళ్వర్క్కు-కపటియైన సర్వేశ్వరునిఁగురించి, మదియిలేన్-బుద్ధిలేనినాయొక్క, వల్వినైయో-క్రూరమైనపాపమా, మాళాదెన్ఱు-నశింపదని, ఒరుత్తి - ఓకతె, మదియెల్లామ్-బుద్ధియంతయు, ఉళ్ కలఙ్గి - లోపలఁగలతనొంది, మయఙ్గుమ్ - మోహించియుండును ; ఎన్నీర్-అనిచెప్పుండు.

తా|| పుణ్యావిశేషములఁజేత దమ యాడపక్షితోఁ జేరియున్న హంసపక్షులారా ! మీరు సర్వేశ్వరునివద్దకివెళ్లి, మీరు వామనావతారమెత్తి లోకములను స్వాధీనపరచుకొనిన మీదివ్య చేష్టితములకు వశబడినయొకతె, ఎంతకాలమనుభవించినను నశింపని నాపాపముబోయి నేను భగవత్కైంకర్యముల నెప్పుడుఁజేసెదనని మోహముఁ జెందియున్నదని చెప్పుండని. ౩

ఎన్నీర్మై కణ్డిరఙ్గి యిదుతగా దెన్నాద*
ఎన్నీలముగిల్వణ్ణర్ క్కెన్ శొల్లి యాన్ శొల్లుగేనో*
నన్నీర్మైయినియవర్‌గణ్ తఙ్గాదెన్ఱొరువాయ్చ్చొల్*
నన్నీల మగన్ఱిల్గాళ్ నల్గుదిరో నల్గీరో. ౪

అ|| ఎన్నీర్మై - నాస్వభావమును, కణ్డు - తెలిసికొని, ఇరఙ్గి - కృపఁజేసి, ఇదుతగా దెన్నాద - (ఈమెకు) ఈయవస్థ తగదనితలపని, ఎన్ - నాయొక్క, నీలముగిల్ వణ్ణర్క్కు - కాలమేఘవర్ణముగల సర్వేశ్వరునికి, యాన్ నేను, ఎన్ శొల్లి - ఏపాశురమునుజెప్పి, శొల్లుగేనో - మాటలాడుదును, నల్ - మంచి, నీర్మై - ప్రాణము, ఇని - ఇంకమీఁద, అవర్‌గణ్ -

వారివద్ద, తక్గాదెన్ఱు - నిలవదని, ఒరువాయ్చ్చొల్ - ఒక్కమాటను, నల్ నీల-మంచినీలవర్ణముఁ గల, మగన్రిల్ గాళ్-క్రౌఞ్చపక్షులారా ! నల్గుదిరో - చెప్పెదరా, నల్గీరో - చెప్పరా.

తా॥ తన నెడఁబాసినయెడల జీవించనని నాస్వభావము నెఱిఁగి దయఁజేసి, ఈమెకిట్టి విరహావస్థ తగదనియెంచని నీలమేఘవర్ణుఁడైన మాస్వామికి నేనేమిచెప్పెదను ; అయినను, ఓ క్రౌంచ పక్షులారా ! ఇఁక నీపెయొక్క ప్రాణము నిలవదనియెడి యొకపలుకు నా సర్వేశ్వరునికిఁ జెప్పరాయని, ౪

నల్గిత్తాఁ తా త్తళిక్కు మ్మూఴిలేழుమ్ విన్నై యేత్కే*
నల్గత్తానాగాదో నారణనై క్కణ్డక్కాల్*
మల్గునీర్ ప్పునల్పడప్పై యిరై తేర్ వణ్ శిఱుకురుగే*
మల్గునీర్క్కణ్ణేఱ్కోర్ వాశగఙ్కొణ్డరుళాయే. ౫

అ॥ పాழிలేழுమ్ - ఏడులోకములనున్న, తాఁ - తానే, నల్గి - ప్రీతిఁజేసి, కాత్తు - అనిష్టములనుబోఁగొట్టి, అళిక్కుమ్ - ఇష్టములిచ్చెడి, నారణనై - శ్రియఃపతిని, కణ్డక్కాల్ - చూచినయెడల, విన్నైయేఱ్కేయో - పాపియైన నన్నునైనా, తాఁ - తాను, నల్గలాగాదు-ప్రీతిం జెందఁగూడదు (అని అతనికిఁ జెప్పి), మల్గు-ప్రవహించుచున్న, నీర్ పునల్-జలప్రదేశములయందున్న, పడప్పై - తోటలయందు, ఇరై - ఆహారమును, తేర్ -వెతుకుచున్న, వణ్ - సుందరమైన, శిఱుకురుగే - ఓచిన్ననీరుకోడీ ! మల్గు - ప్రవహించుచున్న, నీర్ - బాష్పముగల, కణ్ణేఱ్కు-కన్నులుగలనాకు, ఓర్ వాశగమ్-ఒకమాటను, కొణ్డు - తీసికొనివచ్చి, అరుళాయ్ - కృపఁజేయుమా,

తా॥ ఉదకముచే నిండియున్న ప్రదేశమందలి తోటలయందు నాహారమును వెతకెడి ఓ నీరుకోడీ ! సర్వజీవులయొక్క సమస్తాపరాధములను సహించి వారి యనిష్టములనుబోఁగొట్టి రక్షించెడి పరమదయావంతుండైన శ్రీమన్నారాయణుని నీవు చూచినయెడల, అతనితో, పాపియైన, నాయపరాధమును క్షమించరాదాయని చెప్పి యామాటకు నతడిచ్చుబదులుమాటను నీవు నాతోఁ జెప్పవలయునని. ౫

అరుళాద నీరరుళి యవరావి తువరాముఁ*
అరుళాழிప్పుట్కడవీ రవర్ వీది యొరునాళ్ఎన్ఱు*
అరుళాழிయమ్మానై క్కణ్డక్కాలిదు శొల్లి*
అరుళాழிవరివణ్డే యాము మెఞ్పిழைత్తోమే. ౬

అ॥ అழி - గుండ్రమైన, వరివణ్డే - గీఁతలుగల ఓతుమ్మెదా ! అరుళాழி-దయఁగల చక్రముఁగల, అమ్మానై - స్వామిని, కణ్డక్కాల్-చూచినయెడల, అరుళాద-(వారియందు) దయ లేని, నీర్-మీరు, అరుళి-దయఁజేసి, అవర్ - ఆయాழ்వార్లయొక్క, ఆవి-ప్రాణము, తువరాముఁ- పోవుటకుముందే, అరుళాழி - దయాసముద్రుఁడైన, పుళ్-(మీకు వాహనమైన) గరుత్మంతుని, అవర్ వీది - ఆయాழ்వారున్న వీథియందు, ఒరునాళ్-ఒకరోజైనను, కడవీరెన్ఱు -

నడపించురని, ఇదుశొల్లి - ఈమాటనుజెప్పి, అరుళ్ - కనికరింపుము. యాము - మేమున్ను, ఎణ్పిழైత్తోమ్ - ఏమితప్పుఁజేసితిమి.

తా॥ ఓసుందరమైన తుమ్మెదా! నీవువెళ్లి ఆయాழ్వార్లనెడి నాయకినిజూచుటకు మీకిష్టములేకపోయినను మీదయకుఁదక్కవరాకుండ నీనాయకియందుఁగృపఁజేసి యామె జీవితకాలమందే దయావంతుఁడైన గరుత్మంతునిమీద నెక్కి యాశ్రితసంరక్షణార్థముగా నెచ్చటికైనా వేంచేయునప్పుడు ఆగరుత్మంతుని నొకదినమైన నీయాழ్వారున్న వీథికి నడపింతురుగాక యని శ్రియఃపతికి విన్నవించుము. ఆమాటను వినని యెడల, పరమదయఁగలచక్రమును ధరించి సకలజీవులను రక్షించెడి మీవిషయమైయట్టి యపరాధము మేమేమి చేసితిమని నేనుజెప్పినటుల జెప్పుమాయని. ౬

ఎన్ పిழைకోప్పదుపోల ప్పనివాడై యీర్ గిప్ప*
ఎణ్పిழైయే నినైన్దరుళి యరుళాద తిరుమాలార్కు*
ఎణ్పిழைత్తాళ్ తిరువడియీర్ తగవినక్కెన్ఱొరువాయ్చ్చొల్*
ఎన్ పిழைక్కుమిళఙ్గిళియే యాన్వళర్త్త నీయలైయే. ౭

అ॥ ఎన్పిழైక్కుమ్ - ఎముకననెడి, ఇళఙ్గిళియే - ఓబాలచిలుకా! యాన్వళర్త్తనీయలైయే - నేనుపెంచిన నీవేగదా? ఎన్బు-ఎముకలలో, ఇழై-దారమును, కోప్పదుపోల - గ్రుచ్చునటుల, పనివాడై - చల్లనిగాలి, ఈర్గిప్ప-బద్దలుచేయుచున్నది, (ఇంతలో) ఎన్పిழైయే-నాతప్పునే, నినైన్దరుళి-తలంచి, అరుళాద-(నాయందు) కనికరించని, తిరుమాలార్కు-శ్రియఃపతికి, తిరువడియీర్-స్వామియైనమీయొక్క, తగవినక్కు-కృపకు, ఎణ్పిழైత్తాళన్ఱు - ఏమితప్పుఁజేసినదని, ఒరువాయ్ - ఒకమాట, శొల్ - చెప్పుమా.

తా॥ నాచేతఁబోషింపఁబడినదానవైనను ఇట్టి నావిరహదశయందు నాయెముకలు మూర్ణమగునట్లు బాధించుచున్న ఓ బాలచిలుకా! చలనిగాలియును నాయెముకలలో దారమును గ్రుచ్చినట్లు బాధించుచున్నదిగాన నిప్పుడు నాతప్పులనే యెంచుచు కనికరించని శ్రియఃపతిని గూర్చి పరమదయాశాలివియైన నీయొక్కదయకు విషయముకానియపరాధము ఈయాழ్వార్లనెడి నాయకి యేమిచేసినదని ఈయొకమాట నడిగి తెలిసికొనుమా యని, ౭

నీయలైయే శిఱుపూవాయ్ నెడుమాలార్క్కెన్తూదాయ్*
నోయెనదు నువలెన్న నువలాదే యిరున్దొழిన్దాయ్*
శాయలొడు మణిమామై తళర్న్దేన్నాన్*ఇనియునదు
వాయలగిలిన్నడిశిల్ వైప్పారై నాడాయే. ౮

అ॥ శిఱుపూవాయ్-ఓచిన్నచిలుకా! నెడుమాలార్క్కు-ఆశ్రితవ్యామోహముగల సర్వేశ్వరునివద్ద, ఎన్తూదాయ్-నాదూతయైవెళ్లి, ఎనదు-నాయొక్క, నోయ్-విరహబాధను, నువలెన్న-చెప్పుమంటె, నువలాదే-చెప్పకుండ. ఇరున్దొழిన్దాయ్ - ఉండిపోతివి, నీయలైయే-నీవేగదా? నాన్-నేను, శాయలొడు - కాన్తితోఁగూడ, మణి-శ్లాఘ్యమైన, మామై - సౌందర్యమును,

తళర్ న్దేన్ - పోఁగొట్టుకుంటిని ఇని - ఇఁకను, ఉనదు - నీయొక్క, వాయలగిల్ - నోటిలో, ఇన్ - మధురమైన, అడిశిల్-ప్రసాదమును, వైప్పారై - పెట్టువారిని, నాడాయ్ - వెతుకుకొనుమా.

తా॥ ఓచిలుకా! నీచిన్నతనముచేత సర్వేశ్వరుని వద్దకుఁబోయి నాబాధను జెప్పుమంటె చెప్పక ఊరక యుంటివిగదా. ఇఁక నాశరీరము శిథిలమైనది ఇంక నాప్రాణముఁబోయినచో నీ కన్నముఁబెట్టువారిని వెతుకుకొనుమాయని. ౮

నాడాద మలర్ నాడి నాడోఱుమ్ నారణన్ఱన్*
వాడాద మలరడిక్కీழ్ వైక్కవే వగుక్కిన్ఱు*
వీడాడి వీఱ్ఱిరుత్తల్ వినైయఱ్ఱదెన్ శెయ్వదో*
ఊడాడు పనివాడా యురైత్తీరాయెనదుడలే. ౯

అ॥ ఊడు(శ్రీయఃపతికినినాకును) నడుమ, ఆడు-తిరుగుచున్న, పనివాడాయ్-ఓచల్లనిగాలీ! నాడాద - వెతుకుటకశక్యములైన, మలర్ - పుష్పములను, నాడి-వెతకి, నాడోఱుమ్ - ప్రతిదినమును, నారణన్ఱన్ - శ్రీయఃపతియొక్క, వాడాదమలర్-వాడనిపుష్పమువంటి, అడిక్కీழ్-శ్రీపాదములయందు, వైక్కవే - సమర్పించుటకైయే, వగుక్కిన్ఱు - ఈయాత్మయేర్పరచఁబడినది. వీడాడి-(ఇట్లుండఁగా) వానితోవిరహమునొంది, (అనుభవించెడి) వీఱ్ఱిరుత్తల్-గొప్పదైన, వినైయఱ్ఱదు - భాగ్యహీనత్వము, ఎన్ శెయ్వదో-ఏమిచేయఁబోవునో? (అని) ఉరైత్తు-(ఆసర్వేశ్వరునికి) చెప్పి, (వాడువిననియెడల) ఎనదుడల్ - నాశరీరమును, ఈరాయ్-బద్ధలఁజేయుము.

తా॥ నాకున్ను శ్రీయఃపతికిన్ని దూతవై తిరుగుచున్న ఓవాయువా! దుర్లభమైన పుష్పములను వెతకి సర్వేశ్వరుని తిరువడికళ్లమీఁద సమర్పించుటకైయే నేనేర్పరచఁబడితిని. ఇట్లుండఁగా, మిమ్ముల నెడఁబాసి మాదౌర్భాగ్యముచేత నిట్లుబాధపడుటయెందుకని శ్రీయఃపతికి నేనుజెప్పినట్లు చెప్పి దానికిబదులు చెప్పనియెడలఁ దరువాత నన్ను జంపుదువుగాకయని. ౯

ఉడలాழ్ప్పిఱప్పువీడుయిర్ముదలా ముఱ్ఱుమాయ్*
కడలాழ్ నీర్తోఱ్ఱి యదనుళ్ళే కణ్వళరుమ్*
అడలాழి యమ్మానై క్కణ్డక్కాలిదుశొల్లి*
విడలాழி మడనెఞ్జే వినైయోమొన్ఱామళవే. ౧౦

అ॥ ఆழி-గంభీరమైన, మడనెఞ్జే-విధేయమైన ఓమనసా! ఉడల్-శరీరములందు, ఆழி - చక్రాకారమైన, పిఱప్పు-జన్మము, వీడు - మోక్షము, ఉయిర్-ఆత్మ, ముదలాయ్ - ఇవి మొదలుగాఁగల, ముఱ్ఱుమ్-తక్కిన సమస్తవస్తువులు (ఇవియన్నిఁటిని,) ఆయ్-సృజించుఁగొరకై, ఆழிనీర్-గంభీరమైననీరుగల, కడల్ - సముద్రమును, తోఱ్ఱి-సృజించి, అదనుళ్ళే - ఆసముద్రమందు, కణ్వళరుమ్-నిద్రించుచున్న, అడల్ - యుద్ధోన్ముఖమైన, ఆழி-చక్రముగల, అమ్మానై - స్వామిని, కణ్డక్కాల్ - చూచినయెడల, ఇదు - ఈబాధను, శొల్లి - చెప్పి, వినైయోమ్-పాపులైన మేము, ఒన్ఱామళవు - వానితోఁజేరువరకు, విడల్ - విడువకుందుము.

తా॥ నాకుస్వాధీనమైన ఓమనసా ! సకలజగత్తులను సృజించుటకై ముందుగా మహాసముద్రమునుసృజించి, అందుఁ జక్రాది పఞ్చాయుధయుతుండై పవ్వళించియున్న మాస్వామిని సేవించి ఇట్టి నాబాధనుజెప్పి, నేను వానితిరువడికళకుఁ జేరువరకు నీవు వానిని వదలకుమాయని. ౧౦

‡‡ అళవియన్ఱ వేழுలగత్తవర్ పెరుమాన్ కణ్ణనై *
వళవయల్ శూழ் వణ్ కురుగూర్ చ్చడగోపన్ వాయ్న్దురైత్త*
అళవియన్ఱ వన్దాదియాయిరత్తుళివ్వ త్తిన్*
వళవురైయాల్ పెఱలాగుమ్ వానోఙ్గు పెరువళమే. ౧౧

అ॥ అళవియన్ఱ - అవధిలేని మహిమగలవాఁడై, ఏழுలగత్తవర్ పెరుమాన్-సర్వలోకేశ్వరుఁడై, కణ్ణనై - ఆశ్రితసులభుఁడైనకృష్ణుని, వళమ్-సమృద్ధమైన, వయల్-పొలములచే, శూழ் - చుట్టఁబడిన, వణ్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురియందు వేంచేసియుండెడి, శడగోపన్ - నమ్మాழ்వార్లు, వాయ్న్దు - సమీపించి, ఉరైత్త - సాయించిన, అళవియన్ఱ - ఎంచుటకశక్యములైన లక్షణములుఁగల, అన్దాది-వెనుకపాశురముయొక్క యంతపదమే ముందుపాశురమున కాదిగాఁగల, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తిన్ - ఈపదిపాశురములయొక్క, వళవురైయాల్ - మధురోక్తిచే, వాన్-పరమపదమందు, ఓఙ్గు-వృద్ధిఁబొందెడి, పెరువళమ్ - మహాసంపత్తును, పెఱలాగుమ్ - పొందవచ్చును.

తా॥ అపరిచ్ఛేద్య మహిమగలవాఁడై సర్వలోకేశ్వరుండై యాశ్రితసులభుండైయున్న సర్వేశ్వరుని సత్యాదరముచే బ్రతిపాదించెడి సర్వలక్షణములతోఁ గూడుకొనియున్న మధురమైన యీ పది పాశురములననుసంధించువారు మోక్షమునొంది మహానందము ననుభవింతురని. ౧౧

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౫ - వ తిరువాయ్‌మొழி.

అవతారిక.—వెనుక తిరువాయ్‌మొழிలో తాననుభవించిన విరహబాధనుఁజూచి సహింపక శ్రియఃపతి తనవద్దకి వేంచేయఁగా, అప్పుడు వానిమహిమయును తనగుణహీనతయున్ను జూచి, నేనాశ్రయించినయెడల వానిమహిమచెడిపోవునే ; వానిమహిమను చెడగొట్టుటకంటె నేనుచెడిపోవుటయే మేలుగదా ; ఈమాత్రమాలోచించగ వానికైఙ్కర్యము నాశఁబడితినని ఈతిరువాయ్‌మొழிలో ఆழ்వార్లు తనను నిందించుకొనుచున్నారు.

‡‡ వళవేழுలగిన్ముదలాయ వానోరిఱైయై*అరువినైయేన్
కళవేழ் వెణ్ణెయ్ తొడువుణ్డ కళ్వావెన్బన్ పిన్నైయుమ్*
తళవేழ் ముఱువల్ పిన్నైక్కాయ్ వల్లానాయర్ తలైవనాయ్*
ఇళవేఱేழுమ్ తழுవియ వెన్దాయెన్బన్నినైన్దు నైన్దే. ౧

అ॥ వళమ్ - సమృద్ధమైన, ఏழுలగిఱ్-సప్తలోకములకును, ముదలాయ - కారణభూతుండై, వానోర్-నిత్యసూరులకు, ఇఱైయై - స్వామియైన సర్వేశ్వరుని, అరువినైయేన్-క్రూర పాపముగలనేను, నినైన్దు - అనుసంధించి, నైన్దు - మనస్సుకరిగి, కళవు - దొంగతనము, ఏழ் - ప్రసిద్ధమగునట్లు, వెణ్ణెయ్-వెన్నను, తొడువుణ్డ-దొంగలించిన, కళ్వా-ఓదొంగా! ఎన్బన్ - అని చెప్పెదను. పిన్నైయుమ్-మఱియు, కళవు-మొల్లపుష్పము, ఏழ்-తోచునట్లు, (అనగా పుష్పమువంటి) ముఱువల్ - మందహాసముగల, పిన్నైక్కాయ్, నప్పిన్నైప్పిరాట్టికొఱకై, వల్-బలిష్ఠులైన, ఆనాయర్-గొల్లలకు, తలైవనాయ్-నిర్వాహకుండైయుండి, ఇళమ్-లేతయైన, ఏఱు ఏழுమ్-వృషభముల నేడింటిని, తழுవియ - కాగలించుకొనిన, ఎన్తాయ్ - మాస్వామీ! ఎన్బన్ - అనియెదను.

తా॥ సకల జగత్కారణుండై నిత్యసూరులకు నాథుండైన సర్వేశ్వరుని నతిహీనుండనైన నేను, అందరికి తెలిసినటుల నీవుచేసిన నవనీతచౌర్యముయును, సుందరమందహాసముగల నప్పిన్నెప్పిరాట్టికొఱకుబడి గొల్లలకు నాయకుండవై యవతరించి బలిసియున్న వృషభముల నేడింటిని గౌగలించుకొని చంపిన దివ్యచేష్టితయును ననుసంధించి పరవశుండనై చెప్పెదనని ౧

నినైన్దునైన్దుళ్ కరైన్దురుగి యిమైయోర్ పలరుమ్మునివరుమ్*
పునైన్దకణ్ణినీర్ శాన్దమ్ పుగై యోడేన్ది వణఙ్గినాల్*
నినైన్దవెల్లాప్పొరుళ్ కట్కుమ్ విత్తాయ్ ముదలిల్ శిదైయామే*
మనమ్ శెయ్ఞానత్తున్పెరుమై మాశూణాదో మాయోనే. ౨

అ॥ మాయోనే - ఆశ్చర్యభూతుండవైన ఓస్వామీ! పలరుమ్-అనేకులయన, ఇమైయోర్-బ్రహ్మాదిదేవతలును, మునివరుమ్-ఋషులును, నినైన్దు-(మీగుణములను) అనుసంధించి, నైన్దు-(దానివల్ల) శరీరముకరిగి, ఉళ్కరైన్దు - మనస్సుశిథిలమై, ఉరుగి-కరిగి, పునైన్ద - కట్టబడిన, కణ్ణి - తిరుమాలను, నీర్ - జలమును, శాన్దమ్-చన్దనమును, పుగైయోడు-ధూపముతోంగూడ, ఏన్ది - ధరించి, వణఙ్గినాల్ నమస్కరించినను, నినైన్ద - తలంపబడిన, ఎల్లాప్పొరుళ్కట్కుమ్ - అన్నివస్తువులకును, ముదలిల్-స్వస్వరూపమందు, శిదైయామే-వికారములేనటుల, విత్తాయ్ - కారణభూతుండవై, మనమ్శెయ్ - మనస్సునందుంబుట్టిడి, ఞానత్తు - సంకల్పరూపజ్ఞానముగల, ఉన్-నీయొక్క, పెరుమై - మహత్త్వము, మాశూణాదో - మాశిపోదా?

తా॥ జాతిగుణాదులచేత నుత్కృష్టులైన బ్రహ్మాదిదేవతలును సనకాదిఋషులు నత్యంత భక్తియుక్తులై మంచిపుష్పాదులతో నిన్నారాధించినను, తనస్వరూపమందు వికారములేకనే తనసంకల్పముచేత నీజగత్తుకు సృష్టిస్థితిసంహారములను జేయుచున్న పరిశుద్ధుండవైన నీమహత్త్వము మాశిపోదా? అట్లుండంగా నతినీచుడనైన నేను దాస్యముంజేసినయెడల మాశిపోవుననిం జెప్పవలెనాయని. ౨

మాయోనిగళాయ్ నడై శెయ్ద వానోర్ పలరుమ్ మునివరుమ్*
నీయోనిగళై ప్పడై యెన్ఱు నిఱైనాన్ముగనై ప్పడైత్తవన్*

శేయోన్ ఎల్లావఱివుక్కుమ్ తిశైగళెల్లామ్ తిరువడియాల్
తాయోన్ *ఎల్లావెవ్వుయిర్క్కుమ్ తాయోన్ తానోరురువనే. 3

అ॥ మాయోనిగళాయ్ - గొప్పజన్మముగలవారై, నడైక ముఱ్ఱి - సృష్ట్యాదివ్యాపారముల నభ్యసించిన, పలరుమ్ - అనేకవిధములుగానున్న, వానోర్-దేవతలను, మునివరుమ్-ఋషులును, (అయిన) యోనిగళై - జంతువులను, నీపడైయెన్రు - నీవుసృజించుమాయని, నిఱై - జ్ఞానపూర్తి గల, నాన్ముగనై - బ్రహ్మను, పడైత్తవన్ - సృష్టించినవాఁడును, ఎల్లావఱివుక్కుమ్-అన్ని జ్ఞానములకును, శేయోన్-దూరమైయుండువాఁడును, తిశైగళెల్లామ్-దిక్కులన్నిఁటిని, తిరువడియాల్-శ్రీపాదములచేత, తాయోన్ - కొలిచినవాఁడును ఎల్లావెవ్వుయిర్క్కుమ్ - అనేకవిధములయిన సమస్తాత్మలకును, తాయోన్ - తల్లివంటివాఁడునునైన, తాన్ - తాను, ఓరురువన్ - అద్వితీయమైన స్వభావముఁగలవాఁడు.

తా॥ దేవాది సమస్తభూతములకును కారణభూతుండైన బ్రహ్మకును కారణభూతుండై వాఙ్మనసులకును గోచరముగాని మహిమగలవాఁడై ఎచ్చుతగ్గుఁజూడకుండ నందరిని స్నేహముతో రక్షించువాఁడైన యీసర్వేశ్వరుని సౌశీల్యగుణము లపారములై యున్నవని. 3

తానోరురువే తనివిత్తాయ్ త్తన్నిల్ మూవర్ ముదలాయ*
వానోర్ పలరుమ్ మునివరుమ్ మఱ్ఱుమ్ మఱ్ఱుమ్ ముఱ్ఱుమాయ్*
తానోర్ పెరునీర్ తన్నుళ్ళే తోఱ్ఱి యదనుళ్ కణ్వళరుమ్*
వానోర్ పెరుమాన్ మామాయన్ వైగున్దనెమ్బెరుమానే. ౪

అ॥ తాన్ - (జగత్తుకు) ఉపాదానకారణము తానేయయినవాఁడును, ఓర్-సహకార్యంతరములేక ఒక్కఁడైనవాండును, తని-నిమిత్తాంతరములేక వంటరియైనవాఁడును, (ఇట్టి) ఉరు - అందమయిన, విత్తాయ్-కారణమైనవాఁడై, తన్నిల్-తనతోఁగూఁడ, మూవర్-బ్రహ్మ విష్ణు రుద్రులను, ముదలాయ - మొదలుగాఁగల, పలరుమ్ - అనేకులయిన, వానోర్ - దేవతలను, మునివరుమ్ - ఋషులను, మఱ్ఱుమ్ - తక్కినమనుష్యులను, మఱ్ఱుమ్ - తక్కినపశ్వాదులను, ముఱ్ఱుమ్ - ఇవియన్నిటిఁని, ఆయ్ - సృజించుటకై, తాన్ - తాను, తన్నుళ్ళే - తన స్వరూపమందు, ఓర్ - అద్వితీయమైన, పెరునీర్ - మహాజలమును, తోఱ్ఱి-సృజించి, అదనుళ్ - ఆమహాజలమునందు, కణ్వళరుమ్ - నిద్రించువాఁడును, వైగున్దన్ - పరమపదవాసియు, వానోర్ పెరుమాన్ - నిత్యసూరులకు నిర్వాహకుండును, మామాయన్-గొప్పయాశ్చర్యభూతుండునైన సర్వేశ్వరుఁడు, ఎమ్బెరుమాన్ - నాకుస్వామి.

తా॥ జగత్తుకు *నిమిత్తోపాదాన సహకారికారణభూతుఁడై బ్రహ్మాదిస్థావరాంతమయిన యీలీలావిభూతియును భోగోపకరణమయిన నిత్యవిభూతియునుఁగల మాస్వామియొక్క సౌశీల్య గుణములకుఁ దగినట్లు నేనన్నివిధములయిన కైంకర్యములను జేసెదనని ౪

* ఒకవస్తువుకు కారణములు మూడు. ఆకారణములకు ఉపాదానము, నిమిత్తము, సహకారి, అని పేళ్లు. ఘటమునకు, ఉపాదానము మృత్తు; నిమిత్తము కుంభకారుఁడు; సహకారి దణ్డాదులు. ఆదేవిధముగా యీజగత్తుకు, మూలప్రకృతిని శరీరముగాఁగల పరమాత్మ ఉపాదానము, జ్ఞానశక్తి విశిష్టుఁడైన పరమాత్మ నిమిత్తము, కాలశరీరియైన పరమాత్మ సహకారియని.

మానేయ్నోక్కి మడవాళై మార్బిల్ కొణ్డాయ్ మాదవా*
కూనేశిదైయ వుణ్డైవిల్ నిఱత్తిల్ తెఱిత్తాయ్ గోవిన్దా*
వానార్శోది మణివణ్ణా మదుశూదా నీయరుళాయ్*ఉన్
తేనేమలరుమ్ తిరుప్పాదమ్ శేరుమాఱు విన్నైయేనే. ౫

అ॥ మానేయ్ - లేడితోఁబోలిన, నోక్కు - చూపుగల, మడవాళై - యువతియైనపిరాట్టిని, మార్బిల్ - వక్షస్థలమునందు కొణ్డాయ్ - ఉంచుకొనిన, మాదవా - ఓ శ్రియఃపతీ! కూనే - గూను, శిదైయ - పోవునట్లు, ఉణ్డైవిల్ - ఉండయైన ధనస్సుయొక్క, నిఱత్తిల్ - నిధముగా, తెఱిత్తాయ్ - పొడుఁగుగాఁజేసిన, కోవిన్దా - ఓ గోపాలుఁడా! వాన్, ఆకసమునందు, ఆర్ - నిండియున్న, శోది - తేజస్సుగల, మణి - రత్నమువంటి, వణ్ణా - కాన్తిగలవాఁడా! మదుశూదా - మధువనెడి రాక్షసునిజంపిన ఓకృష్ణుఁడా! విన్నైయేన్ - పాపియైననేను, ఉన్ - నీయొక్క, తేనే - తేనెవలెభోగ్యమై, మలరుమ్ - వికసించియున్న, తిరుప్పాదమ్ - శ్రీపాదములను, శేరుమాఱు - పొందునటుల, నీ - నీవు, అరుళాయ్ - కృపఁజేయుము.

తా॥ పిరాట్టి నిత్యవాసముఁజేయుచున్న వక్షస్థలముగల శ్రియఃపతివై, ఆశ్రిత సంరక్షణార్థమై మనుష్యావతారమెత్తి ఆశ్రితదోషములను జూడక వారిని కటాక్షించి పిమ్మట వారిదోషములను వారివిరోధులయందుఁ బోఁగొట్టెడి స్వభావముగలవాఁడవై, అంతట వ్యాపించెడి నిర్మలమై రమణీయమైన దివ్యరూపముగలవాఁడవైన ఓగోపాలా! నీయొక్క శ్రీపాదములను జేరునటుల నన్ననుగ్రహింపుమని. ౫

విన్నైయేన్విన్నై తీర్ మరున్దానాయ్ విణ్ణోర్తల్లైవా కేశవా*
మన్నైశేరాయర్ కులముదలే మామాయనే మాదవా*
శిన్నైయేయ్తణ్ణియ మరామరఙ్గళ్ శెఱ్ఱుమెయ్దాయ్ శిరీదరా*
ఇన్నైయాయిన్నైయ పెయరినా యెన్ఱున్నై వనడియేనే. ౬

అ॥ విన్నైయేన్ - పాపియైన నాయొక్క, విన్నై - పాపములను, తీర్ - పోఁగొట్టెడి, మరున్దానాయ్ - ఔషధమువంటివాఁడా! మన్నై - ఇండ్లయందు, శేర్ - చేరి, ఆయర్ - గొల్లలకు, కులముదలే - కూటస్థుఁడా! మామాయనే - గొప్ప ఆశ్చర్యమైన వ్యాపారముగలవాఁడా! మాదవా - ఓ శ్రియఃపతీ! శిన్నై - కొమ్మలతో, ఏయ్ - చేరియున్న, తణ్ణియ - ఆకులుగల, మరామరఙ్గళ్ శెఱ్ఱుమ్ - సాలవృక్షములేడింటిని, ఎయ్దాయ్ - కొట్టినవాఁడా! శిరీదరా - వీరశ్రీగలవాఁడా! ఇన్నైయాయ్ - ఇట్టిస్వభావముగలవాఁడా! ఇన్నైయ పెయరినాయ్ - ఇటువంటి తిరునామములుగలవాఁడా! ఎన్ఱు - అని యనుసంధించి, అడియేన్ - దాసుఁడనైననేను, నైవన్ - శిథిలాన్తఃకరణుఁడనైయగుచున్నాను.

తా॥ నీసంశ్లేషమునకు విరోధులయిన మాపాపములను బోఁగొట్టిన సౌశీల్యవంతుఁడా! ఉభయ విభూతినాయకుఁడా! ఆశ్రితులున్నచోటికి వచ్చి యవతరించి వారియందతివాత్సల్యముతో వారు

జెప్పెడికార్యములను నెరవేర్చెడి శ్రీయఃపతీ ! ఇట్టి నీస్వభావములనును తిరునామములను ననుసంధించి నామనస్సు గరుగుచున్నదని. ౬

అడియేన్ శిఱియఞానత్త నఱిదలార్కక్కు మరియానై *
కడి శేర్ తణ్ణన్దుழாయ్ క్కణ్ణిపునైన్దాన్ఱన్నై క్కణ్ణనై *
శెడియారాక్కై యడియారై చ్చేర్దల్ తీర్క్కుమ్ తిరుమాలై *
అడియేన్ కాణ్బానలన్ఱుపవ నిదనిల్ మిక్కోరయర్వుణ్డే. ౭

అ॥ శిఱియఞానత్తన్ - అల్పజ్ఞానముగల, అడియేన్ - దాసుఁడనైననేను, అఱిదలార్క్కుమ్ - మిక్కిలిజ్ఞానవంతులకును, అరియానై - తెలిసికొనుటకశక్యుఁడును, కడి - పరిమళము, శేర్ - చేరియున్న, తణ్ - చల్లని, అమ్ - సుందరమైన, తుழాయ్క్కణ్ణి - తిరుత్తుழాయి మాలచే, పునైన్దాన్‌తన్నై - అలంకరింపఁబడినవాఁడును, కణ్ణనై - అతిసులభుఁడును, శెడి - కర్మములనెడి చెట్లచే, ఆర్ - పూర్ణమైన, ఆక్కై - (దేహ)సంబంధమును, అడియారై - దాసులను, శేర్దల్ - చేరుటను, తీర్క్కుమ్ - పోఁగొట్టెడి, తిరుమాలై - శ్రియఃపతియునైన సర్వేశ్వరుని, అడియేన్ - దాసుఁడనైననేను, కాణ్బాన్ - చూఁడవలయునని, అలన్ఱుపన్ - పలికెదను, ఇదనిల్ - ఇంతకంటె, మిక్కు - మేలైన, ఓరయర్వు - ఒకయజ్ఞానము, ఉణ్డే - కలదా?

తా॥ జ్ఞానహీనుఁడనై యతిక్షుద్రుఁడనైననేను, బ్రహ్మాదులవాఙ్మనస్సులకగోచరుండై పరత్వమును దెలిపెడి పరిమళించుచున్నచల్లని తిరుత్తుழాయ్‌మాలగలవాఁడై, భక్తులసంసారబంధమును విడిపించెడిస్వభావముగలవాఁడై, ఇట్టి సర్వోత్కృష్టుండైన శ్రియఃపతిని నేను సేవింపవలయునని యాశపడుటకంటె బుద్ధిలోపంబెయ్యెదిగలదు. ౭

ఉణ్డాయులగేழ் మున్నమే యుమిழ்న్దు మాయైయాలపుక్కు *
ఉణ్డాయ్ వెణ్ణెయ్ శిఱుమనిశరువలై యాక్కై నిలై యెయ్‌ది *
మణ్డాన్ శోర్న్దదుణ్డేలుమ్ మనిశర్క్కాగుమ్ పీర్ * శిఱిదుమ్
అణ్డావణ్ణమ్ మణ్కరైయ నెయ్యూణ్మరున్దో మాయోనే. ౮

అ॥ మాయోనే - ఆశ్చర్యభూతుఁడా! మున్నమే - మునుపు, ఉలగేழ் - లోకముల నేడింటిని, ఉణ్డాయ్ - ఆరగించితివి. ఉమిழ்న్దు - (ఆలోకములను)బయలుపఱచి, శిఱుమనిశర్ - క్షుద్రమనుష్యులయొక్క, ఉవలై - హేయమైన, ఆక్కై - శరీరములయొక్క, నిలై - స్థితిని, ఎయ్‌ది - పొంది, మాయైయాల్ - కపటముచేత, పుక్కు - ప్రవేశించి, వెణ్ణెయ్ - వెన్నను, ఉణ్డాయ్ - ఆరగించితివి. మనిశర్క్కు - మనుష్యులకు, ఆగుమ్ - అయ్యెడి, వెణ్ణెయ్ - వెన్నను, పీర్ శిఱిదుమ్ - కొంచెముగూఁడ, అణ్డావణ్ణమ్ - చేరనట్లు, ఊణ్ - ఆరగించినది, మణ్ తాన్ - మన్ను, శోర్న్దదుణ్డేలుమ్ - మిగిలియున్నను, మణ్ - ఆమన్ను, కరైయ - కరుగుటకు, మరున్దో - మందా?

తా॥ అతిక్షుద్రమైన మనుష్యావతారమెత్తి గోకులమునందు జొచ్చి అచటనున్న వెన్నను కొంచెమైనను మిగలకుండ నారగించితివిగదా; అది, ముందు లోకము నారగించి బయలుపఱచు

నప్పుడు కడుపులో కొంచెము మున్నున్నను, దానిని పోఁగొట్టుటకై ఔషధంబని యారగించితివా యేమని. ౯

మాయోమ్ తీయవలవల్లై ప్పెరుమా వఞ్జప్పేయ్ వీయ*
తూయకుழவియాయ్ విడప్పాలముదావముదు శెయ్‌దిట్ట
మాయన్ *వానోర్ తనిత్తలైవన్ మలరాళ్ మైన్దన్ ఎవ్వుయిర్‌క్కుమ్
తాయోన్ *తమ్మానెన్నమ్మా నమ్మామూర్తియై చ్చార్‌న్దే. ౯.

అ॥ తీయ - చెడ్డయభిప్రాయముగలదియు, అలవల్లై - కూఁతవేయుచున్నదియు, పెరుమా - మితిలేని, మా - గొప్పదైన, వఞ్జమ్ - కపటముగలదియునైన, పేయ్ - పూతన, వీయ - చచ్చునట్లు, తూయ - దోషములేని, కుழవియాయ్ - బిడ్డయై, విడప్పాల్ - విషముగలిసినపాలను, అముదాయ్ - అమృతమువలె, అముదుశెయ్‌దిట్ట - ఆరగించిన, మాయన్ - ఆశ్చర్యస్వభావముగలవాఁడై, వానోర్ - నిత్యసూరులకు, తనిత్తలైవన్ - అద్వితీయ నిర్వాహకుఁడై, మలరాళ్ - కమలవాసినియైన పిరాట్టికి, మైన్దన్ - నాయకుఁడై, ఎవ్వుయిర్‌క్కుమ్ - సమస్తజీవులకును, తాయోన్ - తల్లివంటివాఁడై, తమ్మాన్ - తనకుతానేస్వామియై, ఎన్నమ్మాన్ - మాకుస్వామియై, అమ్మామూర్తియై - దానికిఁదగిన దివ్యశరీరముగలవాఁడైన సర్వేశ్వరుని, శార్‌న్దు - చేరి, మాయోమ్ - చేడము.

తా॥ తన కపటముచే యశోదావేషమెత్తి వచ్చి తనస్తన్యమునిచ్చి నితని చంపఁదలఁచిన పూతనయొక్క స్తన్యమును ద్రాగి దానిని జంపినవాఁడై, సకలలోకేశ్వరుఁడైన మాస్వామి నాశ్రయించినయెడల ఇఁక మన మెట్టిలోపమును బొందమని.

శార్‌న్ద విరువల్వినైగళుమ్ శదిర్‌త్తు మాయప్పఱ్ఱఱుత్తు*
తీర్‌న్దు తన్పాల్ మనమ్‌వైక్క త్తిరుత్తి వీడుతిరుత్తువాన్ *
ఆర్‌న్ద ఞానచ్చుడరాగి యగలుఙ్కీழ్ మేలళవిఱన్దు*
నేర్‌న్దవురువాయరువాగు మివఱ్ఱిన్నుయిరామ్ నెడుమాలే.

అ॥ ఆర్‌న్ద - పూర్ణమైన, ఞానచ్చుడరాగి - స్వయంప్రకాశమైన జ్ఞానస్వరూపుఁడై, అగలుమ్ - చుట్టుపక్కలును, కీழ్ - క్రిందను, మేల్ - పైనను, (ఉన్న) అళవిఱన్దు - సంఖ్యలేని, నేర్‌న్ద - అతిసూక్ష్మమైన, ఉరువాయరువాగుమ్ - చిదచిత్తులైన, ఇవఱ్ఱిన్ - వీనికి, ఉయిరామ్ - అన్తరాత్మఁడైన, నెడుమాల్ - సర్వేశ్వరుఁడు, శార్‌న్ద - నాతోఁజేరిన, ఇరు - పుణ్యపాపములనెడి రెండువిధములైన, వల్ - క్రూరములైన, వినైగళ్ - కర్మములను, శదిర్‌త్తు - పోఁగొట్టి, మాయమ్ - అజ్ఞానముచేఁగలిగిన, పఱ్ఱు - సంసారసంబంధమును, అఱుత్తు - ఛేదించి, తీర్‌న్దు - కృతకృత్యుఁడై, తన్పాల్ - తనయందు, మనమ్ - మనస్సును, వైక్క - ఉంచునటుల, తిరుత్తి - బాగుజేసి, వీడు - మోక్షమును, తిరుత్తువాన్ - బాగుజేయనారంభించినాఁడు.

తా॥ సమస్తచేతనాచేతనముల కంతరాత్మఁడై స్వయంప్రకాశుఁడైన సర్వేశ్వరుఁడు, నాహేయమును జూడకుండ తనసంశ్లేషవిరోధులైన నాపాపములన్నింటెని బోఁగొట్టి యాపాపములచే వచ్చిన సంసారమును విడిపించి తానేప్రాప్యప్రాపకుఁడనేబుద్ధిని నాకుఁగలుగఁజేసి నాకొఱకై మోక్షమును బాగుఁజేయుచున్నాఁడని. ౧౦

‡‡ మాలే మాయప్పెరుమానే మామాయనే యెన్రెన్రు*
మాలేయేఱి మాలరుళాల్ మన్నుకురుగూర్చ్చడగోపన్*
పాలేయ్ తమిళ్ళ రిశై కారర్ పత్తర్ పరవు మాయిరత్తిన్*
పాలేపట్ట విబై పత్తుమ్ వల్లార్క్కిల్లై పరివదే.

అ॥ మాశే - సర్వాధికుడా! మాయప్పెరుమానే - ఆశ్చర్యగుణములుగల స్వామీ! మామాయనే - అపరిచ్ఛిన్నమైన యాశ్చర్యస్వభావముగలవాడా! ఎన్రెన్రు - అనియనుసంధించి, మాలేయేఱి - భ్రమనునొంది, మాల్ - సర్వేశ్వరునియొక్క, అరుళాల్ - కృపచే, మన్ను - స్వస్థచిత్తుడై చేరి, కురుగూర్-కురుకానగరియందు వసించెడి, శడగోపన్-నమ్మాళ్వార్లుసాయించిన, పాలేయ్-పాలువలె భోగ్యమైన, తమిళ్ళర్ - ద్రావిడభాషనెఱిగినవారును, ఇశైకారర్-గానమును దెలిసినవారును, పత్తర్ - భక్తులును, పరవుమ్ - కొనియాడెడి, ఆయిరత్తిన్పాలే-వెయ్యిపాశురములలో లోబడియున్న, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్క్కు - అభ్యసించినవారికి, పరివదు - క్లేశము, ఇల్లై - లేదు

తా॥ సర్వేశ్వరునియొక్క వాత్సల్యసౌశీల్యాదిగుణములను, అత్యద్భుతములైన దివ్యచేష్టితములను ననుభవించి పరవశులైన నమ్మాళ్వార్లుసాయించిన సకలజనానందకరమైన నీపదిపాశురముల ననుసంధించువారు భగవద్విశ్లేషము నెప్పుడును బొందరని. ౧౧

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౬-వ తిరువాయ్మొళ్ళి.

అవతారిక:—ఈ తిరువాయ్మొళ్ళిలో, పరత్వసౌశీల్యసౌలభ్యాది సమస్తగుణయుతుండైన సర్వేశ్వరుఁడవాప్తసమస్తకాముడు గనుక వానినాశ్రయించుట మిక్కిలి సులభమైయుండునని యానతిచ్చుచున్నారు.

‡‡ పరివదిలీశనై ప్పాడి*విరివదు మేవలుఱువీర్*
పిరివగై యిన్ఱి నన్నీర్తూయ్*పురివదువుమ్ పుగై పూవే. ౧

అ॥ పరివదిల్ - క్లేశములేని, ఈశనై - సర్వేశ్వరుని, పాడి - మంగళాశాసనముజేసి, విరివదు - స్వరూపవికాసమును, మేవల్-పొందుటయందు, ఉఱువీర్-అపేక్షగల ఓభక్తులారా! పిరివగై యిన్ఱి-(సర్వేశ్వరుని) ఎడబాయువిధములేక, నల్నీర్-శుద్ధజలమును, తూయ్-సమర్పించి, పురివదువుమ్-(తరువాత)సమర్పింపవలసినదియు, పుగై-ధూపమును, పూవే-పుష్పమును.

తా॥ ఓభక్తులారా! దుఃఖము మొదలగు నేవిధదోషములేని సర్వేశ్వరునికి, మంగళాశాసనముజేయుచు మోక్షసమృద్ధినొందుట కపేక్షగలవారై, అట్టిసర్వేశ్వరునికరామ్యులైన మనమెట్టికైం

కర్యముజేసెదమనే బుద్ధిని వదలి మీచేతికిదొరికిన ఎదోయొక పుష్పము ధూపము, శేవలజలము, వీనిని ప్రేమతోసమర్పించుడి. దానినిగూడ యాసర్వేశ్వరుఁడు తనసౌశీల్యముచే నంగీకరించుననని. ౧

మదువార్ తణ్ణన్దుழாయ్యాన్* ముదు వేదముదల్వనుక్కు*
ఎదువేదెన్పణియెన్నాదు* అదువేయాట్చెయ్యుమీడే. ౨

అ॥ మదువార్ - తేనెతోపూర్ణమైన, తణ్ - చల్లని, అమ్ - సుందరమైన, తుழாయాన్ - తిరుత్తుழாయిమాలగలవాఁడును, ముదు - అనాదియైన, వేదమ్ - వేదములయందు, ముదల్వనుక్కు - ముఖ్యప్రతిపాద్యుండునైన సర్వేశ్వరునికి, ఎదు - తగినకైంకర్యమేది; ఎన్ పణి - నేనుజేయుటకుయోగ్యమైనకైంకర్యము, ఏదు-ఏది, ఎన్నాదదువే - అనిసంశయింపక నాకైంకర్యము నాశబడుటయే, ఆట్చెయ్యుమ్-కైంకర్యముజేయుటకు, ఈడు - తగినది.

తా॥ అపౌరుషేయమైన సకలవేదములచేఁ బ్రతిపాద్యుఁడును, పరత్వమునుదెలిపెడు తిరుత్తుழாయిమాలగలవాఁడునైన యట్టిసర్వేశ్వరునికిఁదగిన కైంకర్యముజేయుటకుగుణహీనుడనైన నాకుయోగ్యతలేదేయని తలఁపవలదు; కైంకర్యమందట్టి యాసక్తియే యోగ్యతను గలుగజేయునని.

ఈడుమెడుప్పుమిలీశన్* మాడువిడాదెన్మననే*
పాడుమెన్నా వవన్పాడల్* ఆడుమెనఙ్గ మణఙ్గే. ౩

అ॥ ఈడుమ్ - (పక్షపాతములచే దుష్టులను) విడువుటయు, ఎడుప్పుమ్ - (సత్పురుషులను) గ్రహించుటయు, ఇల్ - లేని - ఈశన్ - శ్రియఃపతియొక్క, మాడు - పక్కను, ఎన్ మనన్ - నామినస్సు, విడాదు - విడువదు. ఎన్నా - నానాలుక, అవన్ పాడల్ - ఆసర్వేశ్వరుని స్తోత్రములను, పాడుమ్ - పాడును, ఎన్ - నాయొక్క, అఙ్గమ్ - శరీరము, అణఙ్గు - పిశాచము బట్టినట్టుపరవశమై, ఆడుమ్ - నృత్యముఁజేయును,

తా॥ తనకైంకర్యము నపేక్షించువారియొక్క గుణాగుణములనుజూడక యందరికి తనకైంకర్యమునిచ్చెడి సర్వేశ్వరునికి నామనోవాక్కాయము లితరవిషయముల నెఱుంగక కైంకర్యము జేయునని. ౩

అణఙ్గెన వాడుమెనఙ్గమ్* వణఙ్గి వழிపడుమీశన్*
పిణఙ్గియమరర్ పిదற்றுమ్* కుణఙ్గెழு కొళ్గైయినానే. ౪

అ॥ అమరర్ - నిత్యసూరులు, పిణఙ్గి - వివాదపడి, పిదற்றుమ్ - చెప్పుచున్న, కుణమ్ ఎழு - గుణములయొక్కసమృద్ధికి, కొళ్గైయినాన్ - పాత్రమైన, ఈశన్ - సర్వేశ్వరుని, అణఙ్గెన - పిశాచమువలె, ఆడుమ్ - నృత్యముసేయుచున్న, ఎనఙ్గమ్ - నాశరీరము, వణఙ్గి - నమస్కరించి, వழிపడుమ్ - అనువర్తించును.

తా॥ నిత్యసూరులలో నొకరికొకరు తాము తామనుభవించెడి గుణములే శ్రేష్ఠములని వివాదపడుచు స్తోత్రముచేయుచున్న గుణసమృద్ధిగల సర్వేశ్వరుని నాశరీరము పరవశమై యాశ్రయించునని. ౪

కొళ్గై కొళ్ళామై యిలాదాన్* ఎళ్గలిరాగ మిలాదాన్*
విళ్గై విళ్ళామై విరుమ్బి* ఉళ్కలన్దార్కోర్ రముదే. ౫

అ॥ కొళ్గై - స్వీకరించుటయు, కొళ్ళామై - విడచుటయు, ఇలాదాన్ - లేనివాఁడును, ఎళ్గల్ - ఉపేక్షయు, ఇరాగమ్ - ప్రీతియు, ఇలాదాన్ - లేనివాఁడునైన, శ్రియఃపతి (చేతనులయొక్క) విళ్గై - ఎడబాయుటయును, విళ్ళామై-చేరియుండుటయును, విరుమ్బి - చూచి, ఉళ్కలన్దార్క్కు-తనలోఁజేరినవారికి, ఓరముదు-శ్రేష్ఠమైన యమృతమువలె భోగ్యమైయుండును.

తా॥ సర్వేశ్వరుఁడు చేతనులయొక్క గుణాగుణములను జూచి గుణవంతులను ప్రీతితో స్వీకరించి గుణహీనులను యుపేక్షించి విడుచుటయనెడి పక్షపాతములేక నందరికిని తన సకలవిధములైన కైంకర్యములిచ్చును. ఇట్లున్నను వారివారి కోరికప్రకారము తనవద్దికివచ్చి ధనాదిప్రయోజనముల నపేక్షించువారికి ధనాదులనేయిచ్చును; తనకైంకర్యముల నపేక్షించువారికే మోక్షమునిచ్చునని. ౫

అముద మమరర్గట్కీన్ద* నిమిర్శుడరాழி నెడుమాల్*
అముదిలుమాత్తిని నినియన్* నిమిర్తిరై నీళ్కడలానే. ౬

అ॥ అమరర్గట్కు - దేవతలకు, అముదమ్-అమృతమును, ఈన్ద-ఇచ్చినవాఁడై, నిమిర్ - పెరుగుచున్న, శుడర్ - తేజస్సుగల, అழி - చక్రముగలవాఁడై, నిమిర్ - ఎగురుచున్న, తిరై-అలలుగల, నీళ్ - విశాలమైన, కడలాన్-సముద్రమునందు బవ్వళించినవాఁడునైన, నెడుమాల్ - సర్వేశ్వరుఁడు, అముదిలుమ్ - అమృతముకంటె, ఆత్తిని నినియన్ - మిక్కిలిప్రియమైయుండును.

తా॥ తేజోరూపమైన సుదర్శనమును ధరించి సముద్రమునందుఁ బవ్వళించియున్న మిక్కిలి భోగ్యుఁడై యానన్దజనకుండైన సర్వేశ్వరుని వదలి యతిక్షుద్రమైన యమృతమును యాచించిన ఇంద్రాదులయొక్క భాగ్యహీనత నేమనియొదనని. ౬

నీళ్కడల్శూழ் ఇలఙ్గైకోన్* తోళ్గళ్తలై తుణిశెయ్దాన్*
తాళ్గళ్ తలై వణఙ్గి* నాళ్కడలై క్కழிమినే. ౭

అ॥ నీళ్ - పొడవైన, కడల్ - సముద్రముచే, శూழ் - చుట్టబడిన, ఇలఙ్గై - లంకాపురికి, కోన్ - రాజైనరావణునియొక్క, తోళ్గళ్ - భుజములనున్ను, తలై - శిరస్సులనున్ను తుణిశెయ్దాన్-త్రుంచిన చక్రవర్తితిరుమగనార్ యొక్క, తాళ్గళ్-తిరువడికళును, తలై యిల్ వణఙ్గి - శిరస్సుచే నమస్కరించి, నాళ్కడలై - కాలమనెడిసముద్రమును, కழிమిన్ - గడుపుడు.

తా॥ శ్రీరామావతారమెత్తి సర్వేశ్వరుఁడొనర్చిన వీరచరిత్రములననుసంధించి వానితిరువడికళును సేవించి కాలమును గడుపుడని. ౭

కழிమిన్ తొణ్డీర్గళ్ కழிత్తు* తొழுమినవనై తొழுదాల్*
వழிనిన్ఱ వల్వినై మాళ్విత్తు* అழிవిన్ఱి యాక్కమ్ తరుమే. ౮

అ॥ తొణ్డీర్గళ్ - ఓభాగవతులారా! కழிమిన్ - సంసారేచ్ఛమువిడువుఁడి. కழிత్తు-విడిచి, అవనై - ఆశ్రియఃపతిని, తొழுమిన్ - ఆశ్రయించుఁడి. తొழுదాల్ - ఆశ్రయించినయెడ

డల, వల్వినై - మోక్షమార్గమున కడ్డముగానిలిచిన, వల్ - క్రూరమైన, వినై - పాపములను, మాళ్విత్తు - పోఁగొట్టి, అళ్వినై - నాశములేని, ఆక్కమ్ - మోక్షసంపత్తును, తరుమ్ - ఇచ్చును.

తా॥ ఓభాగవతులారా! మీరు ముందు సంసారసంబంధమును విడిచి శ్రియఃపతిని యాశ్రయించినయెడల, ఆభగవంతుడే మోక్షవిరోధులైన మీపాపములను నశింపజేసి నిత్యకైంకర్యముల నిచ్చునని. ౯

తరుమ వరుమ్పయనాయ* తిరుమగళార్ తనిక్కేళ్వన్*
పెరుమైయుడైయ పిరానార్* ఇరుమైవినై కడివారే. ౯

అ॥ తరుమమ్ - ధర్మములకు, అరుమ్పయనాయ - శ్రేష్ఠమైన ఫలభూతమైన, తిరుమగళార్ - పిరాట్టికి, తనిక్కేళ్వన్ - అద్వితీయుఁడైననాయకుఁడై, పెరుమైయుడైయ - అతిశయముగల, పిరానార్ - సర్వేశ్వరుఁడు, ఇరుమై - పుణ్యపాపములనెడి రెండువిధంబులైన, వినై - కర్మములను, కడివార్ - పోఁగొట్టుదురు.

తా॥ శ్రియఃపతియై, సర్వోత్కృష్టుఁడైన సర్వేశ్వరుండు మనపాపములనుబోగొట్టి మనకు మోక్షమునిచ్చునప్పుడు శ్రీమహాలక్ష్మితోఁ జేరియుండియే యిచ్చునని. ౯

కడివార్ తీయవినైగళ్* నొడియారుమళవైక్కణ్*
కొడియా వడుపుళ్ళుయర్త్త* వడివార్ మాదవనారే.

అ॥ అడు - విరోధులనునశింపఁజేసెడి, పుళ్ - గరుత్మంతుని, కొడియా - ధ్వజముగా, ఉయర్త్త - ఎత్తిన, వడివార్ - సుందరమైన విగ్రహముగల, మాదవనార్ - శ్రియఃపతి, తీయవినైగళ్ - మనచెడ్డపాపములను, నొడి - ఒక్కక్షణము, ఆరుమళవైక్కణ్ - పూర్ణమయ్యేమాత్రములోనే, కడివార్ - పోఁగొట్టుదురు.

తా॥ తనకాశ్రిత రక్షణము ప్రసిద్ధమగునటుల గరుడధ్వజంబెత్తిన శ్రియఃపతి భక్తులపాపములన్నిఁటిని యొకక్షణములోనే బోఁగొట్టునని ౧౦

‡‡మాదవన్పాలచ్చడగోపన్* తీదవమిన్ఱి యురైత్త*
ఏదమిలాయిరత్తిప్పత్తు* ఓదవల్లార్ పిఱవారే.

అ॥ శడగోపన్ - నమ్మాళ్వార్లు, మాదవన్పాల్ - శ్రియఃపతియందు, తీదు - ఆశ్రితదోషముల నెంచుటయనెడిదోషమును, అవమ్ - ఆశ్రితుల నుపేక్షించుట యనెడి దోషమును, ఇన్ఱి - లేని దానిని, ఉరైత్త - సాయించిన, ఏదమిల్ - దోషములేని, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తు - ఈపదిపాశురములను, ఓదవల్లార్ - అధ్యయనముజేయువారు, పిఱవార్ - సంసారమునందు జన్మించరు.

తా॥ శ్రియఃపతియైన సర్వేశ్వరుఁడు తన యతిశయమునను, ఆశ్రితులయొక్క దోషములనాలోచించి, వీడు రక్షణకుఁదగినవాఁడుఁగాఁడని యుపేక్షించడని ఈమహాగుణమును ప్రతిపాదించెడి యీపదిపాశురముల నధ్యయనముజేయువారు సంసారము నొందరని. ౧౧

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౭ - వ తిరువాయ్‌మొழி.

అవతారిక:—ఈ తిరువాయ్‌మొழிలో, సర్వేశ్వరుని యాశ్రయించుట అత్యన్తసుఖరూపమైయుండునని ప్రతిపాదించుచున్నారు.

⁂ పిఱవిత్తుయరఱ ఞానత్తుళ్ నిన్ఱు*
తుఱవిచ్చుడర్విళక్కమ్ తలైప్పెయ్‌వార్*
అఱవనై యాழிప్పడై యన్దణనై*
మఱవియై యిన్ఱి మనత్తువైప్పారే. ౧

అ॥ పిఱవిత్తుయర్ - జన్మము మొదలగుదుఃఖములు, అఱ-పోవుటకై, ఞానత్తుళ్ - ఆత్మసాక్షాత్కారమందు, నిన్ఱు - నిలిచి, తుఱవి - ప్రకృతిసంబంధమునువిడిచి, శుడర్ - తేజోరూపమైన యాత్మయొక్క, విళక్కమ్ - ఆవిర్భావమును, తలైప్పెయ్వార్ - పొందువారు, అఱవనై - ధార్మికుండై, ఆழிప్పడై-చక్రాయుధుండై, అన్దణనై-పరమపావనుండైన సర్వేశ్వరుని, మఱవియై యిన్ఱి - మరుపులేక, మనత్తువైప్పార్ - ధ్యానించుదురు

తా॥ జన్మజరామరణాది సాంసారిక దుఃఖమునుండిఁదొలంగి ప్రకృతివినిర్ముక్తులై తేజోరూపమైన యాత్మానుభవము సెడి కైవల్యమునాశించి,చక్రధరుండైన సర్వేశ్వరుని ధ్యానించి, ఆ సౌన్దర్యానుభవమునపేక్షించక *పరమపావనుండనియే యాసర్వేశ్వరునియుపాసనజేసెడి ప్రయోజనాన్తరపరులైన కైవల్యార్థులకున్ను వారుగోరిన ఫలమునిచ్చెడి సర్వేశ్వరుండే పరమధార్మికుడని.

వైప్పామ్ మరున్దామడియరై *వల్వినై
త్తుప్పామ్పులనైన్దుమ్ తుఞ్జక్కొడానవన్*
ఎప్పాల్ యవర్క్కుమ్ నలత్తా లుయర్న్దుయర్న్దు*
అప్పాలవనెఙ్గ ళాయర్ కొழுన్దే. ౨

అ॥ ఎప్పాల్ - సమస్తలోకములలోనున్న, యవర్క్కుమ్ - బ్రహ్మాదిసమస్తచేతనులకంటె నలత్తాల్ - ఆనన్దముచే, ఉయర్న్దుయర్న్దు - మిక్కిలియతిశయించి, అప్పాలవన్-వాఙ్మనస్సులకగోచరుండును, ఎఙ్గళ్ - మాకును, ఆయర్ - గోపులకును, కొழுన్దు - నిర్వాహకుండును, వల్-క్రూరములైన, వినై - పాపకర్మలకుఁగారణంబులైన, తుప్పామ్ - బలిష్ఠములైన, పులనైన్దుమ్ - పఞ్చేన్ద్రియములచే, అడియరై - దాసులను, తుఞ్జక్కొడాన్ - దుఃఖించునటులఁజేయనివాఁడునైన, అవన్ - ఆసర్వేశ్వరుఁడు, వైప్పామ్-నిధివలె పురుషార్థమగును. మరున్దామ్ - ఔషధమువలె దుఃఖమునుబోఁగొట్టును.

---

* కైవల్యమనగా - ప్రకృతిమణ్డలమున కవధియైన విరజానదికి పైభాగమందున్న మోక్షమందొకభాగము. అక్కడనున్నవారికి భగవదనుభవములేదు. వారు స్వయంప్రకాశమైన తనయాత్మస్వరూపము ననుభవింతురు. ఆమోక్షమునకుఁగారణము - శ్రియఃపతియొక్క వాత్సల్యాదిగుణములను వదలి పరమపావనుఁడని యేయుపాసించుటయని.

తా॥ ఆనన్దము మొదలగు సమస్తకల్యాణగుణములచే బ్రహ్మాదులనతిశయించి, వాఙ్మనస్సులకగోచరుండై యున్న సర్వేశ్వరుఁడు తనభక్తులకు పఞ్చేన్ద్రియముల చేఁగలిగెడి పాపకర్మములను దొలగింపఁజేసి సకలపురుషార్థభూతుండై యుండునని. ౨

ఆయర్కొழுన్దా యవరాల్ పుడై యుణ్ణుమ్*
మాయప్పిరానై యెన్మాణిక్కచ్చోదియై*
తూయవముదై ప్పరుగిప్పరుగి*ఎన్
మాయప్పిఱవి మయర్వఱుత్తేనే. 3.

అ॥ ఆయర్ - గొల్లలకు, కొழுన్దాయ్ - ప్రధానుండై, అవరాల్ - ఆగొల్లలచే, పుడై యుణ్ణుమ్-దెబ్బలుబడెడి, మాయప్పిరానై -ఆశ్చర్యభూతుండైనస్వామియై,ఎన్మాణిక్కచ్చోదియై, నా కిన్ద్రనీలమాణిక్యమువలె ప్రకాశించుచున్న కాన్తిగలవాడై, తూయవముదై - దోషములేని యమృతతుల్యుండైన శ్రియఃపతిని, పరుగిప్పరుగి - నిరంతరముగాననుభవించి, ఎన్ - నాయొక్క మాయమ్ - ప్రకృతిసంబంధముచేఁగలిగిన, పిఱవి - జన్మముచేసంపాదింపఁబడిన, మయర్వు - అజ్ఞానమును, అఱుత్తేన్ - ఛేదించితిని. 3

తా॥ భక్తవత్సలుఁడై గోపకులమందవతరించి వెన్నదొంగలించి, అప్పుడాగొల్లలచేఁ దెబ్బలుతినునట్టి సౌశీల్యగుణముగలవాఁడును, అత్యద్భుతసౌన్దర్యము గలవాఁడునైన శ్రియఃపతియొక్క నిరన్తరానుభవముచే నాయజ్ఞానములన్నియు వదలిపోయినవని.

మయర్వఱ వెన్మనత్తే మన్నినాన్ఱన్నై*
ఉయర్విననై యేతరు మొణ్ శుడర్క్కొழ் మూర్త్తియై*
అయర్విలమరర్గళాదికొழுన్దై*ఎన్..
ఇశైవినై యెన్శొల్లియాన్ విడువేనో. ౪.

అ॥ మయర్వు - అజ్ఞానము, అఱ - సమూలముగాబోవునట్లు, ఎన్మనత్తే - నామనస్సునందు, మన్నినాన్ఱన్నై - అమరియుండువాడును, ఉయర్వినై - నాజ్ఞానభక్త్యాదులను, తరుమ్- ఇచ్చువాఁడును, ఒణ్ -విలక్షణమైన, శుడర్క్కొழ் మూర్త్తియై - తోజోరాశిరూపుండును, అయర్వు- మరుపు, ఇల్ లేని, అమరర్గళ్ - నిత్యసూరులకు, ఆదికొழுన్దై - కారణభూతుండును ప్రధానుండును, ఎన్నిశైవినై - నన్నువశ్యునిగాఁజేసుకొనినవాఁడునైన సర్వేశ్వరుని, యాన్ - నేను, ఎన్శొల్లి - ఏమిచెప్పి, విడువేన్ - విడిచెదను.

తా॥ నాయజ్ఞానముబోవునట్లు నామనస్సునందు నిత్యవాసము జేయుచు, తన ప్రకాశమానములైన కల్యాణగుణస్వరూపాదులు నాకువిశదమగునట్లు భక్తినొసంగి, సర్వజ్ఞులైన నిత్యసూరులతోఁజేరియున్న ప్రకారముగా నాతోగూడుకొనియున్న సర్వేశ్వరునియందు నే నేమిదోషముల నారోపించి విడిచెదనని. ౪

విడువేనో వెన్విళక్కై యెన్నావియై*
నడువే వన్దుయ్యక్కొళ్గిన్ఱ నాదనై*
తొడువే శెయ్ దిళవాయ్చ్చియర్ కణ్ణినుళ్*
విడవే శెయ్దు విழிక్కుమ్బిరానైయే. ౫.

అ॥ ఎన్ విళక్కై - నాకుదీపమువంటివాఁడును, ఎన్నావియై - నాప్రాణభూతుండును, నడువేవన్దు - మధ్యయందువచ్చి, ఉయ్యక్కొళ్గిన్ఱ - ఉజ్జీవింపఁజేసుకొనుచున్న, నాదనై - నాయకుండును, తొడువే - కపటవ్యాపారములను, శెయ్దు - చేసి,ఇళవాయ్చ్చియర్ - వయస్సు వాంద్రలైన గొల్లస్త్రీలయొక్క, కణ్ణినుళ్ - నేత్రములలో, విడవేశెయ్దు - విడిచి (అగుబడి), విழிక్కుమ్ - వారినికటాక్షించుచున్న, పిరానై - ఉపకారకుండునైన సర్వేశ్వరుని, విడువేనో - (నేను) విడిచెదనా.

తా॥ గోకులమందలి పురుషులకగుబడక నే త్రైతుక కృపచేత తరుణులైన గోపస్త్రీలకుమాత్రమగుబడి అచ్చట వెన్నదొంగిలించడము మొదలగు కొన్నిదొంగతనములనుజేసి యాగొల్లసతులను గటాక్షించి పరమోపకారమొనర్చిన సర్వేశ్వరుండు, నేనన్యపరుఁడనైనను నాసమయముజూచి నామనస్సునందుఁ బ్రవేశించి నాయజ్ఞానమును దొలఁగజేసి, అహఙ్కారాదులచే నశింపకుండునట్లుజేసి నన్ను బ్రతికించి నాకు నాథుఁడైయున్నప్పుడు వానిని నేనెట్లు విడిచిపోలఁగదని ౫

పిరాన్ పెరునిలఙ్కీణ్డవన్*పిన్నుమ్
విరాయ్ మలర్త్తుழాయ్ వేయ్న్ద ముడియన్*
మరామరమెయ్ద మాయవన్*ఎన్నుళ్
ఇరాననిల్ పిన్నై యానొట్టువేనో. ౬.

అ॥ పిరాన్ - ఉపకారకుండై, పెరునిలమ్-(ప్రళయమందండభిత్తితోనంటుకొనియున్న) గొప్పభూమిని, కీణ్డవన్ - విడదీసినవాఁడును, పిన్నుమ్ - గుచ్చఁబడిన, విరాయ్ - పరిమళము గల, మలర్ - వికసించియున్న, తుழாయ్ - తిరుత్తుழாయిచేతను, వేయ్న్ద - చుట్టఁబడిన, ముడియన్ - శ్రీకిరీటముగలవాడును, మరామరమ్ - సాలవృక్షములను, ఎయ్ద - పడగొట్టిన, మాయవన్ - ఆశ్చర్యభూతుండునైన సర్వేశ్వరుండు, ఎన్-నాయొక్క, ఉళ్ - మనస్సునందు, ఇరాననిల్ - ఉండనన్నచో, పిన్నై - తరువాత, యాన్ - నేను, ఒట్టువేనో - ఒప్పుకుంటునా ?

తా॥ అందముగాగుచ్చబడిన తిరుత్తుழாయి మాలికచే నలంకరింపఁబడియున్న తన దివ్యవిగ్రహసౌన్దర్యమునను, వరాహావతారంబెత్తి భూమినుద్ధరించిన చర్యనును, శ్రీరామావతారమెత్తి యాశ్రితపరతన్త్రుఁడై సాలవృక్షములనేడింటిని బడద్రోసిన దివ్యచేష్టితమునను నాకగుపఱచి నన్ను వశపఱచుకొని, ఇప్పుడు నన్ను విడిచిపోతానన్నచో నేనొప్పెదనా? యని, ౬




యానొట్టి యెన్నుళిరుత్తువ మెన్ఱిలన్*
తానొట్టి వన్దెన్ తనినెఞ్జై వఞ్జిత్తు*
ఊనొట్టి నిన్ఱెన్నుయిరిల్ కలన్దు*ఇయల్
వానొట్టుమో వినియెన్నై నెగిఴ్క్కవే. ౭.

అ॥ యాన్ - నేను, ఒట్టి - అపేక్షించి, ఎన్నుళ్ - నాహృదయమందు, ఇరుత్తువమ్ - (సర్వేశ్వరుని) స్థాపించెదను; ఎన్ఱు - అని, ఇలన్ - నేనుదలఁచియుండలేదు. తాన్ - ఆసర్వేశ్వరుఁడే, ఒట్టివన్దు - ఆశపడివచ్చి, ఎన్ - నాయొక్క, తని - స్వతంత్రమైన, నెఞ్జై - మనస్సును, వఞ్జిత్తు - నాకుఁదెలియక వశపఱచుకొని, ఊన్ - శరీరమునందు, ఒట్టినిన్ఱు - అమరియుండి, ఎన్నుయిరిల్ - నాయాత్మయందు, కలన్దు - కలిసి, ఇయల్వాన్ - ఇట్టిస్వభావముగలవాఁడు, ఇని - ఇఁకమీఁద, ఎన్నై - నన్ను నెగిఴ్క్క - ఉపేక్షించుటకు, ఒట్టుమో - సమ్మతించునా?

తా॥ నాసమ్మతిలేకుండునప్పుడే యాశ్రియఃపతి నామనస్సునపేక్షించివచ్చిప్రవేశించి నన్ను వశపఱచుకొని, ఈహేయశరీరమందలి నాయాత్మతోఁగలసియుండువాఁడు నన్నిఁకవిడిచి పోవు నాయని.

ఎన్నైనెగిఴ్క్కిలు మెన్నుడై నన్నెఞ్జ
న్దన్నై*అగల్విక్క త్తానుమ్ కిల్లానిని*
పిన్నైనెడుమ్పణై త్తోళ్ మగిఴ్ పీడుడై*
మున్నై యమరర్ముఴుముదలానే. ౮.

అ॥ పిన్నై - నప్పిన్నైప్పిరాట్టియొక్క, నెడుమ్-పొడవైన, పణై - మొదలువంటి, తోళ్ - భుజమును, మగిఴ్ - సంతోషించియనుభవించడమనెడి, పీడుడై - ఉత్కర్షముగలవాఁడును, మున్నై - పూర్వికులైన, అమరర్ - నిత్యసూరులయొక్క, ముఴు - సమస్త పురుషార్థములకును, ముదలానే - కారణమైయుండువాడునైనశ్రియఃపతి, ఎన్నై - నన్ను, నెగిఴ్క్కిలుమ్-విడిపించినను, ఎన్నుడై - నాయొక్క, నల్ - విలక్షణమైన, నెఞ్జమ్తన్నై - మనస్సును, అగల్విక్క - విడిపించుటకు, ఇని - ఇక, తానుమ్ - తానును, కిల్లాన్ - సమర్థుఁడుకాడు.

తా॥నప్పిన్నైప్పిరాట్టితో సంశ్లేషించి యానందమననుభవించుచున్న, నిత్యసూరులకు నిర్వాహకుండైన శ్రియఃపతి నన్ను గుణహీనునిగానెంచి తనవద్దనుండి నన్నువిడిపించినను, తనకుశేషబడియున్న నామనస్సును విడిపించుట యాసర్వేశ్వరునికిఁగూడ నశక్యమైయుండునని,

అమరర్ ముఴుముదలాగియ వాదియై*
అమరర్క్కముదీన్ద వాయర్కొఴున్దై*
అమరవఴుమ్బ త్తుఴావి యెన్నావి*
అమర త్తఴువిఱ్ఱిని యగలుమో. ౯.

అ॥ అమరర్ - నిత్యసూరులయొక్క, ముళ్ళు - స్వరూపస్థితిమొదలగున్నింటిని, ముదలాగియ - కారణమైయున్నవాఁడును, ఆదియై - సర్వకారణుండును, అమరర్కు - ఇంద్రాదిదేవతలకు, అముదు - అమృతమును, ఈన్ద - ఇచ్చినవాఁడును, ఆయర్ - గోపలకు, కొళ్ళున్దై - కారణభూతుండునైన శ్రియఃపతిని, ఎన్నావి - నాయాత్మ, అమర - అమరి, అళ్ళున్ను - చేరునట్లు, తుళ్ళావి - వెతకి, అమర - చక్కఁగా, తళ్ళువిళ్ళు - కలిసియుండెను; ఇనియగలుమో-ఇఁక విడుచునా ?

తా॥ నిత్యవిభూతికిని లీలావిభూతికిని కారణమైన పరాత్పరుఁడును, దేవతలపేక్షించిన యమృతమునిచ్చి యర్థికల్పకుండైన సులభుండును, గోపకులమందవతరించిన సుశీలుఁడునైన సర్వేశ్వరునితోఁ జక్కఁగాఁగలిసి గుణానుభవముజేయుచున్న నాయాత్మను, ఇఁక యాశ్రియఃపతివద్ద నుండి విడిపించుట యశక్యమని. ౯

అగలిలగలు మణుగిలణుగుమ్*
పుగలుమరియన్ పొరువల్లనెమ్మాన్*
నిగరిలవన్పుకళ్ పాడియిళైప్పిలమ్*
పగలుమిరవు మ్పడిన్దు కుడైన్దే. ౧౦.

అ॥ అగలిల్ - (ధనాదులనుగోరి తనతోఁ) విశ్లేషించినయెడల, అగలుమ్ - తానువిడుచువాఁడును, అణుగిల్ - (అనన్యప్రయోజనులై) సమీపించినయెడల, అణుగుమ్ - వారిలోఁజేరయుండువాఁడును, పుగలుమ్ - (అభక్తులు) పొందుటకు, అరియన్ - దుర్లభుండును,పొరువలన్- (ఆశ్రితులను) తనసమీపమందుఁజేర్చుకొనువాఁడును, ఎమ్మాన్ - నాకుస్వామియు, నిగరిల్-ఒప్పులేనివాఁడునైన, అవన్ - ఆసర్వేశ్వరునియొక్క, పుగళ్ - గుణములను, పగలుమిరవుమ్-రాత్రింబగళ్ళు, పడిన్దు - అమరియుండి, కుడైన్దు - విమర్శించి, పాడి - గానముజేసి, ఇళైప్పిలమ్-శ్రమలేనివారమై యుందుము.

తా॥ ధనాది యితరప్రయోజనముల నపేక్షించివచ్చి తనవద్దనుండి వారికోరికలను నెరవేర్చుకొనిపొయ్యెడి యభక్తులను వదలి, అనన్యప్రయోజనులైవచ్చిన భక్తులతోఁగలిసి, అభక్తులకు దుర్లభుండై భక్తులకు సులభుండైయున్న మాస్వామియొక్క కల్యాణగుణములను మిక్కిలి విమర్శించి రాత్రింబగళ్ళు పాడియు తృప్తినొందనివాఁడనైతినని. ౧౦

‡‡ కుడైన్దు వణ్డుణ్ణుమ్ తుళ్ళాయ్ ముడియానై*
అడైన్ద తెన్గురుగూర్చ్చడగోపన్*
మిడైన్ద శొల్తొడై యాయిరత్తిప్పత్తు*
ఉడైన్దు నోయ్గళై యోడువిక్కుమే. ౧౧.

అ॥ వణ్డు - తుమ్మెదలు, కుడైన్దు - ప్రవేశించి, ఉణ్ణుమ్ - మధుపానము చేయుచున్న, తుళ్ళాయ్ - తిరుత్తుళ యిమాలను, ముడియానై - శిరస్సునందుగల సర్వేశ్వరుని, అడైన్ద-

ఆశ్రయించిన. శేర్ - సుందరమైన, కురుగూర్ - తిరునగరియందు వేంచేసియున్న, శడగోపన్ - నమ్మాళ్వార్లయొక్క - మిడైన్ద - నిండియున్న, శొల్ తొడై - శ్రీసూక్తిమాలికయైన, ఆయిరత్తిప్పత్తు - వెయ్యిపాశురములలో నీపదిపాశురములు, నోయ్గళై - మహావ్యాధులను, ఉడైన్దు - తునకలగునటులజేసి, ఓడువిక్కుమ్ - పారిపోవునట్లునుజేసును

తా॥ ఆధిరాజ్యసూచకమైన తిరుత్తుழாయిమాలగల సర్వేశ్వరుని యాశ్రయించిన నమ్మాళ్వార్లు సాయించిన మధురములైన పదములచే నమరియున్న నీపదిపాశురములే సమస్తవ్యాధులను బోఁగొట్టునని, ౧౧

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౮ - వ తిరువాయ్మొழி.

అవతారిక - ఈతిరువాయ్మొழிలో, సర్వేశ్వరుఁడకృత్రిముఁడై యాశ్రితులతో సంశ్లేషించునని వానియార్జవగుణమును సాయించుచున్నారు.

‡‡ ఓడుమ్ప్పుళ్ళేఱి* శూడుమ్ తణ్డుழாయ్*
నీడు నిన్ఱవై* ఆడుమమ్మానే. ౧

అ॥ అమ్మాన్ - స్వామియైనశ్రియఃపతి, పుళ్ - పక్షియైన గరుత్మంతుని, ఏఱి - ఎక్కి, ఓడుమ్ - వేంచేయును. తణ్ - చల్లని, తుழாయ్ - తిరుత్తుழாయమాలను, శూడుమ్ - ధరించును. నీడునిన్ఱు - చిరకాలము వసించి, అవై - వారితో, ఆడుమ్ - సంశ్లేషించును.

తా॥ గరుత్మంతుడు భగవంతునికిఁ గైంకర్యముజేయవలయునని తలఁచినప్పు డాకోరికను నెరవేర్చుటకును, అచ్చటచ్చటనున్న నిత్యసూరులకు సేవసాయించుటకును తనవాహనమైన గరుత్మంతునిమీఁద వేంచేసి యచ్చటచ్చట సర్వేశ్వరుడుసంచరించియు, తనవిశ్లేషము సహింపక తిరుత్తుழாయి వాడునప్పుడు దానిప్రీతికొఱకై తా నాతిరుత్తుழாయిని ధరించియు, ఇట్లుభక్తులతో నిత్యసంశ్లేషముగలవాఁడై యుండునని. ౧.

అమ్మానాయ్ ప్పిన్నుమ్* ఎమ్మాణ్బు మానార్*
వెమ్మా వాయ్కీణ్డ* శెమ్మా కణ్ణనే. ౨

అ॥ అమ్మానాయ్ - స్వామియైనవాఁడును. వెమ్ - క్రూరమైన, మా - గుఱ్ఱమైవచ్చిన కేశియనెడి రాక్షసునియొక్క, వాయ్ - నోటిని, కీణ్డ - చీల్చినవాఁడును, శెమ్ - ఎఱ్ఱని, మా - విశాలమైన, కణ్ణన్ - నేత్రములుగలవాఁడునైన సర్వేశ్వరుండు, పిన్నుమ్ - మఱియు, ఎమ్మాణ్బుమ్ - సుందరములైన సమస్తవతారములుగలవాఁడై, ఆనార్ - ఆయెను.

తా॥ ఆస్వామి యాశ్రిత రక్షణార్థమై యతిసుందరములైన యనేకావతారము లెత్తెను; అప్పుడు తనను మ్రింగవచ్చిన కేశియనెడి రాక్షసుని జంపి యాశ్రితవిరోధులను బోఁగొట్టి, ఆప్రీతి చేసెట్టి నేత్రములుగలవాఁడై యుండెనని. ౨

కణ్ణావా నెన్ఱుమ్* మణ్ణోర్ విణ్ణోర్కృ*
తణ్ణార్ వేఙ్గడ* విణ్ణోర్ వెఱ్పనే. ౩

అ॥ మణ్ణోర్ – భూమియందు నివసించెడి మనుష్యులకును, విణ్ణోర్కృ – ఊర్ధ్వలోకములలో వసించెడిదేవతలకును, ఎన్ఱుమ్ – ఎల్లప్పుడును, కణ్ణావాన్ – నేత్రముగానుండెడిసర్వేశ్వరుండు, తణ్ – శైత్యముచే, ఆర్ – పూర్ణమైన, వేఙ్గడమ్ – వేఙ్కటాచలమనెడి, విణ్ణోర్ – నిత్యసూరుః (నిత్యవాసముజేసెడి,) వెఱ్పన్ – పర్వతమునందు వేంచేసియున్నాఁడు.

తా॥ సర్వజ్ఞులై దేవతలకును అజ్ఞులైన మనుష్యులకును, జ్ఞానప్రదానముజేయుచు పరమపదమందువేంచేసి యుండువాఁడు, సంసారులకొఱకై నిత్యసూరి సేవ్యంబైన చల్లని వేఙ్కటాద్రియందు వేంచేసియున్నాఁడని. ౩.

వెఱ్పై యొన్ఱెడుత్తు* ఒఱ్ఱుమిన్ఱియే*
నిఱ్ఱుమమ్మాన్ శీర్* కఱ్పన్ వైగలే. ౪

అ॥ ఒన్ఱు – ఒక, వెఱ్పై – పర్వతమును, ఎడుత్తు – ఎత్తి, ఒఱ్ఱుమ్–ఆయాసము, ఇన్ఱియే – లేకనే, నిఱ్ఱుమ్ – నిలిచెడి, అమ్మాన్ – స్వామియొక్క, శీర్ – కల్యాణగుణములను, వైగల్ – ప్రతిదినమును, కఱ్పన్ – అభ్యసించెదను.

తా॥ దేవేంద్రుండు గోపలమీఁదఁ గోపగించి సప్తరాత్రమును రాళ్లవర్షమునువర్షింపఁగా నప్పుడాగోపలయందుఁగారుణ్యముచే యనాయాసముగా గోవర్ధనపర్వతమునెత్తిరక్షించిన పరమదయాళువైన స్వామియొక్క కల్యాణగుణములను ప్రతిదినమభ్యసించెదనని. ౪.

వైగలుమ్ వెణ్ణెయ్* కైకలన్దుణ్డాన్*
పొయ్కలవాదు* ఎన్ మెయ్కలన్దానే. ౫

అ॥ వైగలుమ్ – ఎల్లప్పుడును, వెణ్ణెయ్ – వెన్నను, కైకలన్దు – చేతులతోఁగలిపి, ఉణ్డాన్ – ఆరగించిన కణ్ణను, పొయ్కలవాదు – అబద్ధములేక, ఎన్ – నాయొక్క, మెయ్ – శరీరమునందు, కలన్దాన్ – కలిపియుండెను.

తా॥ గోపస్త్రీలు దాచి యుంచిన వెన్నను గనిపెట్టి తనరెండుచేతులతోఁగలిపి యారగించిన సర్వేశ్వరుఁడు, వెన్నచేఁబూయబడిన విగ్రహములోనువచ్చి నాశరీరమునందుఁగలిసి వేంచేసియుండెనని, ౫.

కలన్దెన్నావి* నలఙ్గొళ్ నాదన్*
పులన్కొళ్ మాణాయ్* నిలమ్ కొణ్డానే. ౬

అ॥ కలన్దు - కలిసియుండి, ఎన్నావి - నాయాత్మయొక్క, నలమ్ - శేషత్వమనెడి మంచి తనమును, కొళ్ - అంగీకరించిన, నాదన్ - స్వామి, పులన్ - ఇంద్రియములను, కొళ్ - ఆకర్షించెడి, మాణాయ్ - వామనబ్రహ్మచారియై, నిలమ్ - భూమిని, కొణ్డాన్ - స్వాధీనపఱచుకొనెను.

తా॥ సకలజనమనోహరంబైన వామనావతారంబెత్తి మహాబలివద్దనున్న భూమిని తనకువశపఱచుకొనిన నాథుఁడు, ఈదివ్యచేష్టితములను నాకుఁగనుపఱచి నాశరీరమందుండి నన్ను దాసునిగాఁజేసుకొనెనని. ౬

కొణ్డానేழ் విడై * ఉణ్డానేழ் వైయమ్ *
తణ్డామమ్ శెయ్దు * ఎన్ ఎణ్డానానానే. ౭

అ॥ ఏழ் విడై - సప్తవృషభములయొక్క (ప్రాణములను), కొణ్డాన్ - తీసినవాఁడును, ఏழ் వైయమ్ - సప్తలోకములను, ఉణ్డాన్ - ఆరగించినవాఁడునైన శ్రియఃపతి, తణ్ - చల్లని, తామమ్ - పరమపదమందున్న (ప్రీతిని) శెయ్దు - (నాయందు) చేసి, తాన్ - తాను, ఎన్ - నాయొక్క, ఎణ్ - మనోరథప్రకారము, ఆనాన్ - ఆయెను.

తా॥ ప్రళయకాలమునందు సప్తలోకములనారగించుట, నప్పిన్నప్పిరాట్టివివాహముకొఱకై యేడువృషభములను జంపుట, ఇవిమొదలగుదివ్యచేష్టితములను జూచి నేనాభగవంతునికిదాస్యముజేయవలయునని యపేక్షించగా, నామనోరథమును నెఱవేర్చి నాయఁదతిప్రేమజేసెనని, ౭

ఆనానానాయన్ * మీనోడేనముమ్ *
తానానాన్ ఎన్నిల్ * తానాయ శఙ్గే. ౮

అ॥ ఎన్నిల్ - నాయందు, తానాయ - తానుజేసిన, శఙ్గు - సంగముచే, తాన్ - తాను, ఆనాయన్ - గొల్లవాఁడై, ఆనాన్ - అవతరించెను, మీనోడు - మత్స్యావతారముతోఁగూడ, ఏనముమ్ - వరాహమై, ఆనాన్ - అవతరించెను.

తా॥ నాయందున్నప్రీతిచే భోగ్యమైన తనచేష్టితములను నాకనుభవము జేయించుటకై సర్వేశ్వరుండు కృష్ణమత్స్యవరాహావతారములు మొదలగనేకావతారంబులనెత్తెనని. ౮

శఙ్గు శక్కరమ్ * అఙ్గైయిల్ కొణ్డాన్ *
ఎఙ్గుమ్ తానాయ * నఙ్గళ్ నాదనే. ౯

అ॥ ఎఙ్గుమ్ - దేవమనుష్యాది సమస్తజాతులలోను, తానాయ - తానవతరించినవాఁడై, నఙ్గళ్ - మనయొక్క, నాదన్ - స్వామియైన శ్రియఃపతి, అమ్ - సుందరంబులైన, కైయిల్ - శ్రీహస్తములయందు, శఙ్గుశక్కరమ్ - శఙ్ఖచక్రములను, కొణ్డాన్ - ధరించెను.

తా॥ నన్నువశపఱచుకొనుటకై శ్రియఃపతి యవతరించిన దివ్యావతారము లన్నిఁటిలోను శఙ్ఖచక్రాది సమస్తదివ్యాయుధములతో నవతంచెనని. ౯

నాదన్ ఞాలఙ్గొళ్ * పాద నెన్నమ్మాన్ *
ఓదమ్పోల్ కిళర్ * వేద నీరనే. ౧౦

అ॥ నాదన్ - సమస్తములకు స్వామియు, ఞాలమ్ - భూమిని, కొళ్ - ఆక్రమించిన, పాదన్ - తిరువడికళ్లుగలవాఁడును, ఎన్నమ్మాన్ - నాకుస్వామియైనవాఁడునైన శ్రియఃపతి, ఓద మ్మోవల్ - సముద్రమువలె, కిళర్ - పొంగుచున్న, వేదమ్ - వేదములచేఁబ్రతిపాదింపఁబడిన, నీరన్ - ఆర్జవగుణముగలవాఁడు.

తా॥ త్రివిక్రమావతారఁ బెత్తి సమస్తలోకములను గొలిచిన శ్రియఃపతియొక్క నిరవధికమైన కల్యాణగుణములను, సముద్రముప్పొంగునట్లు పై పైవర్ధిల్లుచున్న వేదములే జెప్పవలెనుగాని మఱి యొకరికసాధ్యంబని. ౧౦

‡‡ నీర్ప్పురై వణ్ణన్* శీర్ శడగోపన్ *
నేర్ దలాయిరత్తు* ఓర్ దలివైయే. ౧౧

అ॥ నీర్ప్పురై - జలమువంటి, వణ్ణన్ - స్వభావముగల శ్రియఃపతియొక్క, శీర్ - కల్యాణగుణములను ప్రతిపాదించెడి, శడగోపన్ - నమ్మాళ్వార్లు, నేర్దల్ - సాయించిన, ఆయిరత్తు వెయ్యిపాశురములలో, ఇవై - ఈపదిపాశురములు, ఓర్దల్ - విచారించి సాయింపఁబడినవి.

తా॥ అతిశీతలమై భోగ్యమైన తిరుమేన గల సర్వేశ్వరునియొక్క వాత్సల్యాది మహాగుణముల ననుసంధించి సంసారు లుజ్జీవించుటకై రమకారుణికులైన నమ్మాళ్వార్లు, ఆ గుణముల నీ తిరువాయ్మొழிలో సాయించిరని. ౧౧

ఆ ళ్వా ర్ తి రు ప డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౯-వ తిరువాయ్మొழி.

అవతారిక:—ఈతిరువాయ్మొழிలో, సర్వేశ్వరుఁడాళ్వార్లను సంశ్లేషించుటకై వారి సమీపమందు వేంచేసినప్పుడా సర్వేశ్వరుని యాళ్వార్లు సేవించి తృప్తులై, ఆయనుభవరసమును సాయించుచున్నారు.

‡‡ ఇవైయుమ్ అవైయుమ్ ఉవైయుమ్ ఇవరుమ్ అవరుమ్ ఉవరుమ్*
ఎవైయుమ్ యవరుమ్ తన్నుళ్ళే యాగియుమ్ ఆక్కియుమ్ కాక్కుమ్*
అవైయుళ్ తనిముదలెమ్మాన్ కణ్ణపిరాన్ ఎన్నముదమ్*
శువైయన్ తిరువిన్ మణాళన్ ఎన్నుడైచ్ చూழల్ ఉళానే. ౧

అ॥ ఇవైయుమ్ - సమీపమందున్నవియు, అవైయుమ్ - దూరమందున్నవియు, ఉవైయుమ్ - మధ్యమునందున్నవియునైన అచేతనవస్తువులనును, ఇవరుమ్ - సమీపమందుండువారును, అవరుమ్ - దూరమునందుండువారును, ఉవరుమ్ - మధ్యమందుండు వారునునైన చేతనవస్తువులనును, ఎవైయుమ్యవరుమ్ - సమస్త చేతనాచేతనవస్తువులనును, తన్నుళ్ళే - తనలో, ఆగియుమ్ - చేర్చుకొనియు (అనగా సంహారముజేసియు), ఆక్కియుమ్ - తిరిగిసృష్టించియు, కాక్కుమ్ -

రక్షించువాఁడును, అప్పైయుళ్ - అవస్తువులలో వ్యాపించియుండువాఁడును - శనిముదల్-అద్వతీయుండునైనకారణభూతుండును, ఎమ్మాన్ - నాస్వామియు, కణ్ణపిరాన్ - సులభుండునైన ఉపకారకుండును, ఎన్నముదమ్ - నాకు భోగభూతుండును, శువైయన్ - రసికాగ్రగణ్యుండునైన, తిరువిన్ మణాళన్ - శ్రియఃపతి, ఎన్నుడై - నాయొక్క, శూళ్గలుళాన్ - ఇరుపార్శ్వముల యందున్నాఁడు.

తా॥ చేతనాచేత నాత్మకంబులైన సమస్తలోకంబులను ప్రళయకాలమునందు సంహరించి తనలోనుంచుకొనియు, తిరిగి సృష్టికాలమునందు సృజించియు, అంతర్యామియైయుండియు రక్షించెడి పరమకారణభూతుండును, అతిసులభుండును, నాకుభోగ్యభూతుండును, పరమరసికుండునునైన శ్రియఃపతి నన్ను వశపఱచుకొనుటకై నాయిరుపార్శ్వముల యందు వాసము జేయుచున్నాఁడని. ౧.

శూళ్గల్ పలపల వల్లాన్ తొల్లైయఙ్కాలత్తులగై *
కేళ్గలొన్రాగి యిడన్ద కేశవనెన్నుడై యమ్మాన్ *
వేళ్గమరుప్పై యొశిత్తాన్ విణ్ణవర్ క్కెణ్ణలరియాన్ *
ఆళ్గనెడుఙ్గడల్ శేర్న్దా నవనెన్నరుగ లిలానే. ౨

అ॥ పలపల - అనేకవిధములైన, శూళ్గల్ - అవతారములను, వల్లాన్ - ఎత్తుటకుసమర్థుండును, తొల్లై - ప్రాచీనమైన, అమ్ - అందమైన, కాలత్తు కాలమందు, (అనగానీవరాహకల్పాదియందు) కేళ్గలొన్రాగి - అసదృశమైన వరాహమై, ఉలగై - లోకములను, ఇడన్ద - అణ్డభిత్తిలోనుంచి వేరుపఱచినవాడును, కేశవన్ - ప్రశస్తములైన కేశములుగలవాడును, ఎన్నుడైయమ్మాన్ - నాస్వామియు, వేళ్గమ్ - కువలయాపీడమనెడి యేనుఁగుయొక్క, మరుప్పై - కొమ్ములను, ఒశిత్తాన్ - విఱిచినవాడును, విణ్ణవర్క్కు - దేవతలకుఁగూడ, ఎణ్ణలరియాన్ - తలంచుటకశక్యుఁడును, ఆళ్గ - లోతుగ., నెడుమ్ - విశాలమైన, కడల్ - క్షీరాబ్ధియందు, శేర్న్దాన్ - పవ్వళించినవాఁడునైన, అవన్ - ఆశ్రియఃపతి, ఎన్నరుగలిలాన్- నాసమీపమునందున్నాడు.

తా॥ ఆసర్వేశ్వరుండు, దేవతలకు సేవసాయించుటకై క్షీరాబ్ధికి వేంచేసియు, అచ్చటపోయి సేవించుట కశక్తులైన భక్తులకొఱకై రామకృష్ణాద్యనేకావతారంబులెత్తియు, ఆయా యవతారములయందుఁజేసిన కువలయాపీడమునుసంహరించుట,సముద్రములోమునిగియున్న భూమిని యెత్తుకొనివచ్చుటమొదలగు దివ్యచేష్టితముల నాచరించియు, సర్వజ్ఞులైన దేవతలకుఁగూడ ఇట్టివాడనితలంచుట కశక్యుండై వేంచేసియున్న మాస్వామి యాదివ్యచేష్టితములను నాకుఁగనుపఱచుచు నాసమీపమునందు వేంచేసియున్నాఁడని. ౨

అరుగలిలాయ పెరుమ్శీ రమరర్గ ళాదిముదల్వన్ *
కరుగియనీల నన్మేనివణ్ణన్ శెన్దామరై క్కణ్ణన్ *

పొరుశిఱై ప్పుళ్ళువన్దేఱుమ్ పూమగళార్ తనిక్కేళ్వన్*
ఒరుకదియిన్ శువైతన్దిట్టొழிవిల నెన్నోడుడనే. 3

అ॥ అరుగల్ - వినాశము, ఇల్ - లేనిదియు, ఆయ - నిత్యమైనదియు, పెరుమ్ - మితిలేనిదియునైన, శీర్ - కల్యాణగుణములుగలవాఁడై, అమరర్గళ్ - దేవతలకు, ఆది - కారణభూతుండై, ముదల్వన్ - ప్రధానుండై, కరుగియ - నల్లనైన, నీలమ్ - నీలరత్నమువలె, నల్ - విలక్షణమైన, మేనివణ్ణన్ - తిరుమేనుకాన్తిగలవాఁడై, శెమ్ - ఎఱ్ఱని, తామరై - తామరపువ్వువంటి, కణ్ణన్ - నేత్రములుగలవాఁడై, పొరు - అమరియున్న, శిఱై - ఱెక్కలుగల, పుళ్ - గరుత్మంతునిపైన, ఉవన్దు - ఆశపడి, ఏఱుమ్ - ఎక్కువాఁడై, పూమగళార్ - పుష్పపుత్రికయైన పిరాట్టికి, తనిక్కేళ్వన్ - అద్వితీయనాయకుండైన సర్వేశ్వరుండు, ఎన్నోడుడనే - నాతోఁగూడనేయుండి, ఒరుకదియిన్ - ఒకమార్గముచే, శువై - భోగ్యతను, తన్దిట్టు - ఇచ్చి, ఒழிవిలన్ - విడువకయున్నాడు.

తా॥ దోషరహితంబులై యసంఖ్యేయములైన కల్యాణగుణములుగలవాండును, నిత్యసూరినిర్వాహకుండును, అతిసుందరవిగ్రహముగలవాఁడును, గరుడవాహనుండునైన శ్రియఃపతి నిత్యసూరులందరియందును జేయవలసిన ప్రీతిని నాయొక్కనియందే జేసి యనవరతము రసానుభవమును జేయించుచున్నాఁడని. 3.

ఉడనమర్ కాదల్మగళిర్ తిరుమగళ్ మణ్మగళాయ్*
మడమగళ్*ఎన్ఱివర్మూవరాళు ములగముమ్ మూన్ఱే*
ఉడనవైయొక్క విழுఙ్గి యాలిలై చ్చేర్న్దవనెమ్మాన్*
కడల్మలి మాయప్పెరుమాన్ కణ్ణనెన్నొక్కలైయానే. ౪

అ॥ తిరుమగళ్ - పెరియపిరాట్టియు, మణ్మగళ్ - భూమిప్పిరాట్టియు, ఆయర్మడమగళ్ - నప్పిన్నైప్పిరాట్టియు, ఎన్ఱు - అనిప్రసిద్ధులైన, ఇవర్మూవర్ - ఈముగ్గురును, ఉడన్ - ఎల్లప్పుడును, అమర్ - అమరియున్న, కాదల్ - ఆశగల, మగళిర్ - (సర్వేశ్వరునికి) పత్నులైయుందురు. ఉలగముమ్మూన్ఱు - మూడులోకములును, ఆళుమ్ - (ఆశ్రియఃపతికి) పరిపాలింపఁదగినవైయుండును. అవై - ఆలోకములును, ఉడన్ - ఒకటిన్నివిడువక, ఒక్క, ఒకకాలమునందే, విழுఙ్గి - ఆరంగించి, ఆలిలై - వటపత్రమునందు, శేర్న్దవన్ - పవ్వళించిన, ఎమ్మాన్ - నాస్వామియు, కడల్ - సముద్రముకంటె, మలి - అధికమైన, మాయన్ - ఆశ్చర్యగుణములుగల, పెరుమాన్ - గొప్పవాడునైన, కణ్ణన్ - శ్రీకృష్ణుఁడు, ఎన్నొక్కలైయాన్ - నామధ్యభాగమునందు వేంచేసియున్నాడు.

తా॥ ఆసర్వేశ్వరునికి శ్రీభూనీళాదేవులు దివ్యమహిషులు; పృథివ్యాది సకలలోకములు లీలోపకరణములు; సృష్టిస్థితిసంహారాదులు లీలలు; ఇట్టియనంతములై యాశ్చర్యకరంబులైన కల్యాణగుణంబులుగల శ్రీకృష్ణుఁడు యశోదాదేవి నడుమునందున్నట్లు నానడుమునందు వేంచేసియున్నాడని. ౪.

ఒక్కలై వైత్తు ముల్లై ప్పా లుణ్ణెన్ఱు తన్దిడవాఙ్గి*
శెక్కమ్ శెగ వన్ఱవళ్ పా లుయిర్ శెగ వుణ్డ పెరుమాన్*
నక్కపిరానో డయను మిన్దిరను మ్ముదలాగ*
ఒక్కవుమ్ తోత్తియ ఈశన్ మాయనె న్నెఞ్జినుళానే.

అ॥ నక్కపిరానోడు - రుద్రునితోఁగూడియున్న, అయనుమ్ - బ్రహ్మయు, ఇన్దిరనుమ్ - ఇంద్రుఁడును, ముదలాగవుమ్ - వీరుమొదలైన పదార్థములను, ఒక్క - ఒకకాలమునందే, తోత్తియ - సృజించిన, ఈశన్ - సర్వేశ్వరుఁడును, ఒక్కలై వైత్తు - తననడుమునందుంచుకొని, ముల్లై ప్పాల్ - స్తన్యమును, ఉణ్ణెన్ఱు - త్రాగుమని, తన్దిడ - ఇవ్వఁగా, వాఙ్గి - దానినిస్వీకరించి, శెక్కమ్ శెగ - మిక్కిలినెత్తురైన, (తిరుపథరముగలవాఁడై) అన్ఱు - ఆదశయందు, అవళ్ పాల్ - దానివద్దనున్న, ఉయిర్ - ప్రాణము, శెగ - పోవునట్లు, ఉణ్ణ - ఆరగించిన, పెరుమాన్ - సర్వాధికుండును, మాయన్ - ఆశ్చర్యభూతుండునైన శ్రియఃపతి, ఎన్నెఞ్జినుళ్ళాన్ - నాహృదయమందున్నాఁడు.

తా॥ తనను చంపుటకై వచ్చిన పూతనయనురాక్షసి యశోదాదేవివలే తననునడుమునందెత్తుకొని స్తన్యమును త్రాగమనియివ్వఁగా, ఆమాటనంగీకరించి సుందరవదనుండై దానితోడయందుండి, దానిప్రాణము బోవునట్లు దానిపాలును బీల్చియారగించిన యద్భుతచేష్టితుండును, బ్రహ్మాదిస్థావరాన్తమైన సకల లోకములను సృజించి వానిని పరిపాలించువాఁడునైన శ్రియఃపతి నాహృదయమునందు వాసముజేయుచున్నాఁడని. ౫

మాయనె న్నెఞ్జినుళ్ళాన్ మత్తుమ్ యవర్క్కుమదువే*
కాయముమ్ శీవనున్దానే కాలుమెరియు మవనే*
శేయన ణియన్ యవర్క్కుమ్ శిన్దైక్కుఙ్గోశరమల్లన్*
తూయన్ తుయక్కన్మయక్కన్ ఎన్నుడై త్తోళిణై యానే.

అ॥ కాయముమ్ - దేవాదిశరీరములనును, శీవనుమ్ - అందులోనున్న యాత్మలనును, తానే - తనకుశరీరముగాఁగలవాఁడును, కాలుమ్ - వాయువునున్ను, ఎరియుమ్ - అగ్నినిన్ని, అవనే - అట్లుతనశరీరముగాఁగలవాఁడును, శేయన్ - (అభక్తులకు) దూరముగానుండువాఁడును, అణియన్ - (భక్తులకు) సమీపించియుండువాఁడును, యవర్క్కుమ్ - ఎట్టిజ్ఞానవంతులకును, శిన్దైక్కుమ్ - మనస్సునకును, కోశరమల్లన్ - గోచరముగానివాఁడును, తూయన్ - పరిశుద్ధుండును, తుయక్కన్ - (అనాశ్రితులకు) విపరీతజ్ఞానజనకుఁడును, మయక్కన్ - సంశయజనకుండును, ఎన్నెఞ్జినుళ్ళాన్ - నాహృదయమునందు వాసముజేయువాఁడును, మాయన్ - ఆశ్చర్యభూతుండునైన శ్రియఃపతి, ఎన్నుడై - నాయొక్క, తోళిణైయాన్ - రెండుభుజములమీఁద వేంచేసియున్నాఁడు. మత్తుమ్ యవర్క్కుమ్ - తక్కినయందరికిని, అదువే - అట్లుచేయునా ?

తా॥ దేవాదిసకలశరీరములకును సకలజీవాత్మలకును పృథివ్యాదిపంచభూతములకు నన్తరాత్మయై నిర్దుష్టుండై యాశ్రితులకత్యంతసులభుండై యనాశ్రితులకు బొందుటకును తలంచుటకునుగూడ

నశక్యుండైయుండి వారికియథార్థము దెలియనట్లు సంశయాదులను బుట్టించువాఁడై, ఇట్టియాశ్చర్య భూతుఁడై నాహృదయమునందు వసించెడి సర్వేశ్వరుఁడు గరుత్మంతునిమీఁద వేంచేసియున్నట్టు ఇప్పుడు నారెండుభుజములమీద వేంచేసియున్నాఁడు. ఇట్టియలభ్యలాభము నాకంటెనిఁక నెవరి కైనా గలుగునా? యని.

తోళిణై మేలుమ్ నన్మార్బిన్మేలుమ్ శుడర్ముడిమేలుమ్*
తాళిణై మేలు మ్పునైన్ద తణ్ణన్దుழாయుడై యమ్మాన్*
కేళిణై యొన్ఱుమిలాదాన్ కిళరుమ్ శుడరొళిమూర్త్తి*
నాళ్ణై న్దొన్ఱు మగలా నెన్నుడై నావినుళానే. ౭

అ॥ తోళిణై మేలుమ్ - రెండుభుజములయందును, నల్ - శ్లాఘ్యమైన, మార్బిన్ మేలుమ్, వక్షస్థలమునందును, శుడర్ - ఉజ్వలమైన, ముడిమేలుమ్ - కిరీటమునందును, తాళిణై మేలుమ్ - రెండుశ్రీపాదములయందును, పునైన్ద - సమర్పింపఁబడిన, తణ్ - చల్లని, అమ్ - సుందరమైన, తుழாయుడై - తిరుత్తుழாయిగల, అమ్మాన్ స్వామియు, కేళిణై - తగినఉపమానము, ఒన్ఱుమిలాదాన్ - ఒకటియుఁలేనివాఁడును, కిళరుమ్ - వృద్ధిఁబొందుచున్న, శుడరొళి - మిక్కిలి తేజస్సుగల, మూర్త్తి - విగ్రహంబుగలవాఁడును, నాళ్ - ప్రతిదినమును, అణైన్దు - చేరియుండి, ఒన్ఱుమ్ - ఒకకాలమునందును, అగలాన్ - విడువనివాఁడునైన సర్వేశ్వరుఁడు, ఎన్నుడైనావినుళాన్ - నానాలికయందున్నాఁడు.

తా॥ నిరవధికమై యత్యుజ్వలమై నిరుపమానంబైన దివ్యసౌందర్యముగల సర్వేశ్వరుఁడు తనదివ్యమంగళవిగ్రహమంతట తిరుత్తుழாయిమాలను సమర్పించుకొని యొకక్షణకాలముగూడ నన్నుడబాయనివాఁడై నానాలికయందు వేంచేసియున్నాఁడని. ౭

నావినుళ్ నిన్ఱుమలరుమ్ ఞానక్కలైగళుక్కెల్లామ్*
ఆవియు మాక్కైయుమ్ తానే అழிప్పో డళిప్పవ న్ఱానే*
పూవియల్ నాల్ తడన్దోళన్ పొరుపడై యాழி శఙ్గేన్దుమ్*
కావినన్మేని కమలక్కణ్ణ నెన్కణ్ణినుళానే. ౮

అ॥ నావినుళ్ నిన్ఱు - నాకలోనుండి, మలరుమ్ - వికసించుచున్న, ఞానమ్ - జ్ఞానసాధనములైన, కలైగళుక్కెల్లామ్ - విద్యలన్నిఁటికిని, ఆవియుమ్ - ప్రాణమైనయర్థమును, ఆక్కైయుమ్ - శరీరమైనశబ్దమును, తానే - తానేనిర్వాహకుఁడై, అழிప్పోడు - సంహారములోఁగూడ, అళిప్పవన్ - సృజించువాఁడై, తానే - తానై, పూవియల్ - పుష్పములచేనలంకరింపఁబడిన, నాల్ - నాలుగైన, తడమ్ - విశాలమైన, తోళన్ - భుజములుగలవాఁడై, పొరు - యుద్ధమునకు, పడై - ఆయుధమైన, అழி - చక్రమును, శఙ్గు - శఙ్ఖమును, ఏన్దుమ్ - ధరించువాఁడై, కావి - నల్లకలువవలె, నల్ - సులక్షణమైన, మేని - తిరుమేనును, కమలమ్ - తామరపుష్పమువంటి, కణ్ణన్ - నేత్రములనును గిలవాడైన శ్రియఃపతి, ఎన్ కణ్ణినుళ్ళాన్ - నానేత్రములయందున్నాఁడు

తా॥ సాఙ్గసకలవేదప్రతిపాద్యుండును, ఆవేదములయొక్క స్వరూపస్థిత్యాదులకును సమస్త జగత్తులయొక్క ఉత్పత్తివినాశాదులకును కారణభూతుఁడును, పుష్పమువలె యతిసుకుమారములైన చతుర్భుజములుగలవాఁడును, శఙ్ఖచక్రాదిసకలాయుధధరుండును, నల్లకలువవంటి తిరుమేనుగల వాఁడును, కమలాక్షుండునైన శ్రియఃపతి ఇట్టి తనస్వరూపమును నాకుఁగనుపఱచి నానేత్రములలో వేంచేసియున్నాడని. ౮

కమలక్కణ్ణ నెన్కణ్ణినుళ్ళాన్ కాణ్బనవన్ కణ్గళాలే*
అమలఙ్గళాగ విழிక్కుమ్ ఐమ్బులనుమవన్ మూర్త్తి*
కమలత్తయన్నమ్బితన్నైక్కణ్ణుదలానొడుమ్ తోఱ్ఱి*
అమలత్తెయ్వత్తోడులగమాక్కి యెన్నెఱ్ఱియుళానే. ౯.

అ॥ కమలక్కణ్ణన్ - కమలాక్షుండు, ఎన్కణ్ణినుళ్ళాన్ - నానేత్రములకగుపడెను; కాణ్బన్ (నేనును) సేవించితిని; అవన్ - ఆశ్రియఃపతి, కణ్గళాలే - నేత్రములచే, అమలఙ్గళాగ - నాదోషములుబోవునట్లు, విழிక్కుమ్ - కటాక్షించును; ఐమ్బులనుమ్ - పంచేంద్రియములును, అవన్ మూర్త్తి - వానికిశరీరములవలె విధేయములైయుండును; కమలత్తు - పద్మమందుఁబుట్టిన, అయన్ అజుఁడనెడి పేరుగల, నమ్బితన్నై - జ్ఞానపూర్తిగలబ్రహ్మను, కణ్ణుదలానొడుమ్ - లలాటనేత్రుండైన రుద్రునితోఁగూడ, తోఱ్ఱి - సృజించి, అమలమ్ - సత్త్వగుణముగల, తెయ్వత్తోడు - దేవతలతోఁగూడ, ఉలగమ్ - లోకములను, ఆక్కి - సృజించెడిశ్రియఃపతి, ఎన్నెఱ్ఱియుళాన్ - నాముఖమునందు వేంచేసియున్నాఁడు.

తా॥ బ్రహ్మరుద్రేన్ద్రాది సకలదేవతలతోఁగూడ లోకములను సృజంచిన కమలాక్షుండు నానేత్రములకగుపడి నాయజ్ఞానము మొదలగుదోషములుబోవునట్టు నన్నుకటాక్షించినప్పుడు నేను వానిని సేవించి సకలేన్ద్రియములచే వానిననుభవించితిని. అట్టి సర్వేశ్వరుఁడిప్పుడు నాముఖమునందు వేంచేసియున్నాఁడని.

నెఱ్ఱియుళ్ నిన్ఱెన్నైయాళుమ్ నిఱై మలర్ప్పాదఙ్గళ్ శూడి*
కఱ్ఱైత్తుழாయ్ముడిక్కోల కణ్ణపిరానై త్తొழுవార్*
ఒఱ్ఱైప్పిఱై యణిన్దానుమ్ నాన్ముగను మిన్దిరనుమ్*
మఱ్ఱై యమరరుమెల్లామ్ వన్దెనదుచ్చియుళానే. ౧౦.

అ॥ నెఱ్ఱియుళ్ నిన్ఱు - నాముఖమునందుండి, ఎన్నై - నన్ను, ఆళుమ్ - పరిపాలించువాఁడును, నిఱై - అందమైన, మలర్ - పుష్పమువంటి, పాదఙ్గళ్ - శ్రీపాదములను, శూడి - తమశిరస్సులయందుంచుకొని, కఱ్ఱై - గుచ్ఛబడిన, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడి - కిరీటమునన్దుగలవాఁడును, కోలమ్ - సుందరమైనవిగ్రహముగల, కణ్ణపిరానై - ఉపకారకుండునైన శ్రీకృష్ణుని, ఒఱ్ఱైప్పిఱై - ఒకచన్ద్రికలను, అణిన్దానుమ్ - శిరస్సునందుధరించినరుద్రుడును, నాన్ముగనుమ్ - బ్రహ్మయు, ఇన్దిరనుమ్ - ఇన్ద్రుఁడును, మఱ్ఱై - ఇంకనున్న, అమరరుమెల్లామ్ -

దేవతలందురును, తొళ్షువార్ - ఆశ్రయించుదురు; (అట్టిసర్వేశ్వరుఁడు) వన్దు - వచ్చి, ఎనదుచ్చియుళాన్ - నాశిరస్సునందున్నాడు.

తా॥ బ్రహ్మరుద్రాది సమస్తదేవతలును, నాముఖమునందు వేంచేసియుండి నన్నుదాస్యమలించుకొనిన ఈ శ్రీపాదపద్మములను దమతమ శిరస్సులయందుంచుకొనినవారై తిరుత్తుళాయిమాలనుధరించిన యతి సుందరవిగ్రహుఁడైన కృష్ణుని యాశ్రయించుదురు. అట్టి సర్వేశ్వరుఁడిప్పుడు నాశిరస్సునందు వేంచేసియున్నాడని. ౧౦

‡‡ ఉచ్చియుళ్ళే నిఱ్కుమ్ తేవతేవఱ్కు క్కణ్ణపిరాఱ్కు*
ఇచ్చైయుళ్సెల్లవుణర్ త్తి వణ్కురుగూర్చ్చడకోపన్*
ఇచ్చొన్నవాయిరత్తుళ్ ళివైయుమోర్ప త్తెమ్పిరాఱ్కు*
నిచ్చలుమ్ విణ్ణప్పమ్ శెయ్య నీళ్కళ్షల్ శెన్నిపొరుమే. ౧౧.

అ॥ ఉచ్చియుళ్ళేనిఱ్కుమ్ - నాశిరస్సునందు వేంచేసియున్న, తేవతేవఱ్కు - దేవాధిదేవుండైన, కణ్ణపిరాఱ్కు - శ్రీకృష్ణునికి, ఇచ్చై - తమప్రీతిని, ఉళ్ - (సర్వేశ్వరునియొక్క) హృదయమందు, శెల్ల - తోచునట్లు, ఉణర్ త్తి - తెలియజేసి, వణ్కురుగూర్చ్చడగోపన్ - సుందరమైన కురుకాపురియందు వేంచేసియుండెడి నమ్మాళ్వార్లు, శొన్న - సాయించిన, ఇవ్వాయిరత్తుళ్ - ఈవెయ్యిపాశురములలో, ఓర్ - విలక్షణంబులైన, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములను, ఎమ్పిరాఱ్కు - మాస్వామికి, విణ్ణప్పమ్ శెయ్య - విన్నవించినచో, నీళ్ - దీర్ఘమైన, కళ్షల్ - శ్రీపాదములు, శెన్ని - వారిశిరస్సులయందు, నిచ్చలుమ్ - ఎల్లప్పుడును, పొరుమ్ అమరియుండును,

తా॥ తనశిరస్సులయందు వేంచేసియున్న దేవాధిదేవుఁడైన శ్రియఃపతియందున్న తమభక్తిని వానికగుపఱచి నమ్మాళ్వార్లుసాయించిన యద్వితీయంబులైన నీపదిపాశురములను శ్రియఃపతి వద్దవిన్నవించువారి శిరస్సులయందాసర్వేశ్వరుని శ్రీపాదములెల్లప్పుడు నమరియుండునని.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౧౦ - వ తిరువాయ్మొళ్షి.

—•—

అవతారిక:— ఈతిరువాయ్మొళ్షిలో సర్వేశ్వరుఁడిట్లు నాతో సంశ్లేషించుటకుఁగారణమేమనియాలోచించి, ఏకారణమునుజూడక, ఇది సర్వేశ్వరునియొక్క నిర్హేతుక కటాక్షముచే వచ్చినదని సాయించుచున్నారు.

‡‡ పొరుమానీళ్పడై యా, శజిత్తొదు*
తిరుమానీళ్కళ్షల్ తేళ్షలగున్తొళ్ష*
ఒరుమాణిక్కుఱళాగి నిమిర్న్ద*అ
క్కరుమాణిక్క మెన్కణ్ణుళదాగుమే. ౧.

అ॥ పొరు - యుద్ధోన్ముఖములును, మా - గొప్పవియు, నీళ్ - వృద్ధిఁబొందుచున్నవియు, పడై - ఆయుధములైనవియునైన, ఆழிశజ్గొడు - శజ్ఖచక్రములతోఁగూడ, తిరు - సుందరమైనదియు, మా - పూజ్యంబైనదియు, నీళ్ - పొడవైనదియునైన, కழల్ - తిరువడిని, ఏழులగుమ్ సప్తలోకములలోనున్న వారందరును, తొழ - ఆశ్రయించునటుల, ఒరు - అద్వితీయుండైన, మాణిక్కుఱళాగి - వామనబ్రహ్మచారియై, నిమిర్న్ద - (త్రివిక్రముఁడై) వృద్ధిఁబొందిన, అక్కారుమాణిక్కమ్ - అశ్లాఘ్యమైననీలమాణిక్యమువంటి కాన్తిగల శ్రియఃపతి, ఎన్కణ్ణుళదాగుమే - నా నేత్రములయందగుబడును.

తా॥ నముచిమొదలగు శత్రువులమీద కోపగించి తనవిగ్రహములను గొప్పవిగాఁజేసికొని యుద్ధసన్నద్ధులైయున్న శఙ్ఖచక్రాది దివ్యాయుధములుగల తిరుమేని సౌందర్యమునను, అతిసుందరంబైన శ్రీపాదమునను సర్వజీవాత్మలు నాశ్రయించునటుల వామనావతారమునందు త్రివిక్రముఁడై పెరిగిన ఇన్ద్రనీలశ్యాముడైన శ్రియఃపతి, ఆసౌందర్యముతో నాకు సేవసాయించెనని. ౧

కణ్ణుళ్ళే నిఱ్కుమ్ కాదన్మైయాల్ తొழిల్*
ఎణ్ణిలుమ్ వరు మెన్నిని వేణ్డువమ్*
మణ్ణుమ్నీరు మెరియుమ్ నల్వాయువుమ్*
విణ్ణుమాయ్ విరియు మెమ్బిరానైయే. ౨

అ॥ కాదన్మైయాల్ - భక్తితో, తొழిల్ - ఆశ్రయించినయెడల, మణ్ణుమ్ - భూమికిని, నీరుమ్ - జలమునకును, ఎరియుమ్ - అగ్నికిని, నల్ - శ్రేష్ఠంబైన, వాయువుమ్ - వాయువునకును, విణ్ణుమ్ - ఆకాశమునకును, ఆయ్ - అంతరాత్మయై, విరియుమ్ - వ్యాపించుచున్న, ఎమ్బిరాన్ - నాస్వామి, కణ్ణుళ్ళే - నేత్రములలో, నిఱ్కుమ్ - వసించును, ఎణ్ణిలుమ్ - (ఈశ్వరుఁడొకఁడున్నాఁడని) తలంచినను, వరుమ్ - వచ్చును, ఇని - ఇఁకమీద, ఎన్ - దేనిని, వేణ్డువమ్ - అపేక్షించెదము. (మనకేమివలయుననుట.)

తా॥ సకలజగదీశుఁడైన శ్రియఃపతి, తనయందుభక్తిజేయువారికిని, ఈశ్వరుఁడొకఁడున్నాఁడని తననొప్పుకొనువారికి నత్యంతసులభుండైయుండును; ఇట్లుండగా, ఇఁకమనమపేక్షించవలసినదేమున్నదని, ౨

ఎమ్బిరానై యెన్దైయెన్దైక్కుమ్
తమ్బిరానై*తణ్డామరై క్కణ్ణనై *
కొమ్బరావు నుణ్ణేరిడై మార్వనై *
ఎమ్బిరానై త్తొழాయ్ మడనెఞ్జమే. ౩.

అ॥ మడమ్ - విధేయమైన, నెఞ్జమే-ఓమనసా! ఎమ్బిరానై-నాస్వామియు, ఎన్దైయెన్దైక్కుమ్ - నాతండ్రి తాతముత్తాతమొదలగు నావంశస్థులకందరికిని, తమ్బిరానై - స్వామియు,

కణ్ - చల్లని, తామరైక్కణ్ణనై - పద్మములవంటి నేత్రములుగలవాఁడును, కొప్పు - ప్రబ్బలిచెట్టువలెనున్న, అరావు - సర్పమువలెనున్న, నుణ్ - సూక్ష్మమైన, శేర్ - అనురూపంబైన, ఇడై - నడుముగల శ్రీమహాలక్ష్మిని, మార్వనై - వక్షస్థలమందుఁగలవాఁడునైన, ఎమ్బిరానై-స్వామిని, తొழாయ் - ఆశ్రయించుమా.

తా॥ ఓమనసా! నాకువశ్యమైన నీవు, శ్రీమహాలక్ష్మితోఁగూడి తననేత్రములతో నన్ను చల్లఁగాఁగటాక్షించుచున్న నాకులదేవతయైన నాస్వామిని యాశ్రయించి యుజ్జీవింపుమాయని. 3

నెఞ్జమే నల్లైనల్లై యున్నైప్పెఱ్ఱాల్
ఎన్ శెయ్యోమ్*ఇని యెన్నకుఱైవినమ్*
మైన్దనై మలరాళ్ మణవాళనై*
తుఞ్జుమ్పోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్. ౪

అ॥ నెఞ్జమే - ఓమనసా! నల్లైనల్లై - (నీవుచేసినపని) మంచిదిమంచిదె ఉన్నై - నిన్ను, పెఱ్ఱాల్ - పొందినయెడల, ఎన్ శెయ్యోమ్ - ఏపనిజేయము, ఇని - ఇఁకను, ఎన్నకుఱైవినమ్ - ఎట్టికొఱతగలవారమైతిమి, మైన్దనై - భోగ్యుండై, మలరాళ్ - శ్రీమహాలక్ష్మికి, మణవాళనై - నాయకుండైన సర్వేశ్వరుని, తుఞ్జుమ్పోదుమ్ - నేనెడబాసినను, విడాదు - విడువకుండ, తొడర్ కణ్డాయ్ - అనువర్తింపుమా.

తా॥ ఓమనసా! నీవుమిక్కిలి మంచిపనిఁజేసితివి. నీవున్నప్పుడు నాకేకార్యము నసాధ్యముగాదు. నాకొకకొఱతయులేదు. ఇఁకమీదను నొక్కప్పుడు శ్రియఃపతి నెడబాసియున్నను, నీవెప్పుడును విడువవద్దని. ౪

కణ్డాయే నెఞ్జే కరుమఙ్గళ్ వాయ్క్కిన్ఱు*ఓర్
ఎణ్ణానుమిన్ఱియే వన్దియలుమాఱు*
ఉణ్డానై యులగేழுమ్ ఓర్ మూవడి
కొణ్డానై *కణ్డుకొణ్డనై నీయుమే. ౫

అ॥ నెఞ్జే - ఓమనసా! కరుమఙ్గళ్ - కార్యములు, వాయ్క్కిన్ఱు - ఫలించునప్పుడు, ఓర్ - ఒక, ఎణ్ణానుమ్ - తలంపుగూడ, ఇన్ఱియే - లేకనే, వన్దు - వచ్చి, ఇయలుమాఱు - ఫలించువిధంబును, కణ్డాయే - చూచితివిగదా? ఉలగేழுమ్ - సప్తలోకములను, ఉణ్డానై - ఆరగించినవాఁడును, ఓర్ - ఒక, మూవడి - మూడడుగులచే, కొణ్డానై - (అలోకములను) స్వీకరించినవాఁడునైన సర్వేశ్వరుని, నీయుమ్ - నీవును, కణ్డుకొణ్డనై - చూచితివిగదా?

తా॥ ఓమనసా! ఒకరపేక్షలేకయే సప్తలోకములను ప్రళయకాలమందారగించి త్రివిక్రమావతారమునందా లోకములను తనమూడడుగులచే నాక్రమించి రక్షించిన శ్రియఃపతియొక్క దివ్యచేష్టితములను మనమనుభవించితిమిగదా? అట్లునే, మనకర్మములు ఫలించుకాలము వచ్చినప్పుడు మన తలంపులేకయే ఫలించునని. ౫

నీయుమ్నాను మిన్నేర్ నిఱ్కిల్*మేల్ మ...
నోయుమ్ శారకొడాన్ నెఞ్జమే శొన్నేన్*
తాయు న్దన్దైయుమా యివ్వులగినిల్*
వాయుమీశన్ మణివణ్ణ నెన్దైయే.   ౬.

అ॥ నెఞ్జమే ఓమనసా ! నీయుమ్ - నీవును, నానుమ్ - నేనును, ఇన్నేర్ - ఈ విధముగా, నిఱ్కిల్ - ఉన్నయెడల, తాయుమ్ - తల్లివలెప్రియుఁడును, తన్దైయుమాయ్ - తండ్రివలెహితుఁడునై, ఇవ్వులగినిల్ - ఈలోకమునందు, వాయుమ్ - అవతరించిన, ఈశన్ - స్వామియు, మణివణ్ణన్ - నీలమణివంటికాన్తిగలవాఁడునైన, ఎన్దై - నాస్వామి, మేల్ - ఇఁక మీఁద, మఱ్ఱు - ఎవ్విధంబునైన, ఓర్ నోయుమ్ - ఒక యుపద్రవమున్ను, శారకొడాన్ - పొంద నివ్వఁడు; శొన్నేన్ - (నీకు) చెప్పితిని.

తా॥ ఓమనసా ! మనమిరువురము సర్వేశ్వరుని యెల్లప్పుడును విడువకుండ నాశ్రయించి యున్నయెడల, సర్వప్రాణులనున్ను తల్లితండ్రులవలె పోషించును సర్వస్వామియై యాశ్రితసుల భుఁడైనస్వామి మనకెవ్విధంబులైన భాధలను గలుగఁజేయఁడు; ఈమాటను నమ్మియుండుమని ౬.

ఎన్దైయే యెన్ఱుమ్ ఎమ్పెరుమా నెన్ఱుమ్*
శిన్దైయుళ్ వైప్పన్ శొల్లువన్ పావియేన్*
ఎన్దై యెమ్బెరుమా నెన్ఱు*వానవర్
శిన్దైయుళ్ వైత్తు చ్చొల్లుమ్ శెల్వనై యే.   ౭.

అ॥ వానవర్ - నిత్యసూరులు, ఎన్దై - నాస్థితికారణుండు; ఎమ్పెరుమాన్ - నాకుపరమ శేషి; ఎన్ఱు - అని, శిన్దైయుళ్ వైత్తు - ధ్యానించి, శొల్లుమ్ - స్తోత్రముజేయఁదగిన, శెల్వనై - ఐశ్వర్యముగలశ్రియఃపతిని, పావియేన్ - పాపినైననేను, ఎన్దైయేయెన్ఱుమ్ - నాకు స్థితిహేతుండ నియు, ఎమ్పెరుమానెన్ఱుమ్ - నాకుపరమశేషియనియు, శిన్దైయుళ్ - మనస్సునందు, వైప్పన్ - ఉంచె దను; శొల్లువన్ - చెప్పెదను,

తా॥ మాకుసర్వవిధంబైన బంధువని పరిశుద్ధాన్తఃకరణులైన నిత్యసూరులు ధ్యానించి స్తోత్ర ముజేసెడి, పరిశుద్ధుండైన శ్రియఃపతిని నేను నాకుసర్వవిధమైనబంధువని నాపాపమనస్సుతో స్మరించి, అంతయేగాక అందరెఱుఁగునట్లు గుప్తవాక్కులతోఁ జెప్పిదూషించితి నని   ౭.

శెల్వనారణ నెన్ఱ శొఱ్కేట్టలుమ్*
మల్గుఙ్గణ్ పనినాడువన్ నూయమే*
అల్లునన్పగలు మిడై వీడిన్ఱి*
నల్గి యెన్నై విడాన్ నమ్బినమ్బియే.   ౮.

అ॥ శెల్వనారణన్ - శ్రీమన్నారాయణుఁడు, ఎన్ఱ - అనెడి, శొల్ - తిరునామమును, కేట్టలుమ్ - విన్నప్పుడే, కణ్ - నేత్రములలోనుంచి, పని-ఆనన్దబాష్పములు, మల్‌గుమ్ - స్రవించును. నాడువన్ - నేనువానిదాపునకుజేరుదును మాయమే - ఏమాశ్చర్యమో? నమ్బి-పూర్ణుఁడైనశ్రియఃపతి, నల్ - మించివిర్యైన, అల్లుమ్ - రాత్రియందును, పగలుమ్ - దినమందును, ఇడైవీడిన్ఱి-ఎడతెగకుండ, నల్‌గి - ప్రీతిజేసి, ఎన్నై - నన్ను, నమ్బి-(దాసునిగా) నమ్మి, విడాన్ - విడువడు.

తా॥ శ్రీమన్నారాయణుండనెడి తిరునామమును విన్నప్పుడే నానేత్రములనుండి యానన్దబాష్పము పెరుగును; నేను నాశ్రియఃపతి ఎచ్చటనున్నాఁడని వెతుకుచు వానివద్దకు వెళ్లెదను. సమస్తైశ్వర్యపూర్ణుండైన యాశ్రియఃపతియు నన్ను తన దాసునిగా నమ్మి నాయందతి ప్రేమఁజేసి రేయింబగళ్ళు క్షణమాత్రంబును విడువకయున్నాఁడు. ఇదేమాశ్చర్యమోయని. ౮.

‡ నమ్బియై త్తెన్కుఱుఙ్గుడి నిన్ఱ*అ
చ్చెమ్బొనే తిగழు నిరుమూర్ త్తియై*
ఉమ్బర్ వానవరాది యఞ్జోదియై*
ఎమ్బిరానై యెన్ శొల్లి మఱప్పనో. ౯.

అ॥ తెన్ - దక్షిణమునందున్న, కుఱుఙ్కుడినిన్ఱ - తిరుక్కుఱుఙ్గుడియందు వేంచేసియున్న, నమ్బియై-సమస్తైశ్వర్యపూర్ణుండును, అచ్చెమ్బొనేతిగழுమ్-శ్రేష్ఠమైనపచ్చనిబంగారము వలె ప్రకాశించుచున్న, తిరుమూర్ త్తియై - సుందరమైనదివ్యవిగ్రహముగలవాఁడును, ఉమ్బర్ - మేలైన, వానవర్ - నిత్యసూరులకు, ఆది - కారణభూతుండును, అమ్ - అందమైన, శోదియై - తేజోరూపుండునైన, ఎమ్బిరానై - నాస్వామిని, ఎన్ శొల్లి - ఏమాటనుజెప్పి, మఱప్పనో - మఱచెదను.

తా॥ నిత్యసూరులతోఁగూడ సమస్తైశ్వర్యపూర్ణుండై తిరుక్కుఱుఙ్గుడి యందు వచ్చి వేంచేసియుండి తనదివ్యసౌందర్యమును గనుపఱచి నన్ను వశపఱచుకొనిన నాస్వామిని మఱచుటకేమికారణమున్నదని. ౯.

మఱప్పుమ్ ఞానముమ్ నా నొన్ఱుణర్ న్దిలన్*
మఱక్కుమెన్ఱు శెన్దామరై క్కణ్ణొడు*
మఱప్పఱ వెన్నుళ్ళే మన్నినాన్ఱన్నై*
మఱప్పనోవిని యా నెన్మణియైయే. ౧౦

అ॥ మఱప్పుమ్ - మఱచిపోవుటయనియు, ఞానముమ్-జ్ఞానమనియు, ఒన్ఱు - ఒకటిన్ని, నాన్-నేను, ఉణర్ న్దిలన్-ఎఱుఁగను. (ఇట్టినాయందుజ్ఞానమునుగలుగఁజేసిదానిని)మఱక్కుమెన్ఱు-మఱచెదనని, శెన్దామరైక్కణ్ణొడు-ఎఱ్ఱతామరవంటి నేత్రములతోఁగూడ, మఱప్పఱ-మఱచిపోకుండునట్లు, ఎన్నుళ్ళే-నామనస్సునందు, మన్నినాన్ఱన్నై -అమరియుండువాఁడైన, ఎన్మణియై-నీలరత్నమువంటి నాస్వామిని, ఇని - ఇఁకమీఁద, యాన్ - నేను, మఱప్పనో - మఱచెదనా?

తా॥ అచేతనమువలె జ్ఞానమిట్టిదనియు దానికిమఱుపిట్టిదనియు నెఱుఁగని జ్ఞానశూన్యుఁడనైన నాకు జ్ఞానప్రదానముజేసి, ఆ వచ్చినజ్ఞానము మఱచిపోకుండ తనదివ్యసుందరవిగ్రహముతోఁ గూడ నామనస్సునందు నిత్యవాసముజేసెడి శ్రియఃపతిని నేనేవిధమున మఱచెదనని. ౧౦.

⁂ మణియై వానవర్ కణ్ణనై త్తన్నదో
రణియై* త్తెన్ కురుగూర్ చ్చడగోపన్* శొల్
పణిశెయాయిరత్తు ళ్ళివై పత్తుడన్*
తణివిలర్ కఱ్ఱురేల్ కల్వి వాయుమే. ౧౧.

అ॥ మణియై - రత్నమువంటి కాన్తిగలవాఁడును, వానవర్ - నిత్యసూరులకు, కణ్ణనై - నిర్వాహకుండును, తన్నదోరణియై - తనకుతానే యలంకారభూతుండునైన శ్రియఃపతినుద్దేశించి, తెన్ - సుందరమైన, కురుగూర్ చ్చడగోపన్ - తిరునగరియందు వేంచేసియుండెడి నమ్మాళ్వారు, శొల్ - శ్రీసూక్తులతో, పణిశెయ్ - కైంకర్యముజేసిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవైపత్తు - ఈపదిపాశురములను, ఉడన్ - ప్రీతితోఁగూడినవారై, తణివిలర్ - అశ్రద్ధలేనివారై, కఱ్ఱురేల్ - అభ్యసించిరేని, కల్వి - ఆ విద్య, వాయుమ్ - ఫలప్రదమగును.

తా॥ నిత్యసూరినిర్వాహకుఁడై యద్వితీయుఁడై నాకత్యంతసులభుఁడైన శ్రియఃపతికి నమ్మాళ్వార్లువాచాకైంకర్యముగా పాయించిన ఈపదిపాశురములననుసంధించువారికి, ఈపాశురములే సమస్తఫలములనిచ్చుచున్నవని.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

౧ - వ పది సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్మొழிలు పదింటికి పాశురములు - ౧౧౦.



అవతారిక.—ఈతిరువాయ్మొழிలో, "మణియైవానవర్ కణ్ణనై"యనెడి పాశురములలో మానసికముగా ననుభవించిన సర్వేశ్వరునియొక్క పరత్వసౌలభ్యసౌన్దర్యాదులను ప్రత్యక్షముగా ననుభవింప నిచ్ఛయించి, దానిని లభించక, భగవద్విశ్లేషముచే విరహావస్థనొందిన యొకపిరాట్టి యవస్థను నీనమ్మాழ்వార్లుబొంది, తనకంటికగుబడినవస్తువులనుజూచి, వానియన్నిటినిగూడ తనవలెనే భగవద్విశ్లేషముచే బాధపడునట్లుతలంచి, మీరుగూడ మావలెనే బాధపడుచున్నారే యని యావస్తువులనుగురించి చెప్పుచున్నారు.

‡‡ వాయుమ్తిరై యుగళుమ్ కానల్ మడనారాయ్*
ఆయుమమరులగుమ్ తుఞ్జిలుమ్ నీతుఞ్జాయాల్*
నోయు మ్పయలైమైయుమ్ మీదూర వెమ్మేపోల్*
నీయుమ్ తిరుమాలాల్ నెఞ్జమ్ కోట్పట్టాయే. ౧.

అ॥ వాయుమ్ - సమీపించియున్న, తిరై - అలలు, ఉగళుమ్-పొరలుచున్న, కానల్-సముద్రతీరమందున్న, మడమ్ - బింకముగల, నారాయ్ - ఓసారసపక్షీ ! ఆయుమ్-(నీ)తల్లియు, అమరులగుమ్ - నిత్యసూరివర్గమున్ను, తుఞ్జిలుమ్ - నిద్రించినను, నీ-నీవు, తుఞ్జాయాల్ - నిద్రించవు. నోయుమ్ - మనోవ్యాధియు, పయలైమైయుమ్ - పారిపోవుటయున్ను, మీదూర - హెచ్చుపడునట్లు, ఎమ్మేపోల్ - మావలె, నీయుమ్ - నీవును, తిరుమాలాల్ - శ్రియఃపతిచే, నెఞ్జమ్-మనస్సును, కోట్పట్టాయే-అపహరింపబడినావా?

తా॥ అలలుకొట్టుచున్న సముద్రతీరమందు సంచరించుచున్న ఓసారసపక్షీ! నీతల్లియు నిద్రలేని నిత్యసూరులును నిదురబోయినను నీవు నిదురబోకయున్నావు. నీశరీరమున్ను పాలిపోయిన. నీవును మావలెనే సర్వేశ్వరునియందాశపడి ఈయవస్థనొందితివాయేమని. ౧.

కోట్పట్ట శిన్దైయైయాయ్ కూర్వాయ వన్రిలే*
శేట్పట్ట యామజ్గళ్ శేరా దిరఙ్గుదియాల్*
ఆట్పట్ట వెమ్మేపోల్ నీయు మరవణైయాన్*
తాట్పట్ట తణ్డుழாయ్త్తామమ్ కాముற்றாయే. ౨.

అ॥ కూర్వాయ-క్రూరముగాశబ్దించుచున్న, అన్రిలే-ఓపెన్నడపక్షీ! కోళ్పట్ట - (శ్రియఃపతిచే) అపహరింపఁబడిన, శిన్దైయైయాయ్-మనస్సుగలదానవై, శేట్పట్ట-పొడవైన, యామజ్గళ్ - ఝామములయందు, శేరాదు (పడకయందు)చేరక, ఇరఙ్గుదియాల్-దుఃఖించుచున్నావు ఆట్పట్ట-దాస్యమునొందిన, ఎమ్మేపోల్ - మావలె, నీయుమ్ - నీవును, అరవణైయాన్ - ఆదిశేషునిపడకగాగల సర్వేశ్వరునియొక్క, తాళ్పట్ట - శ్రీపాదములతోసంబంధించిన, తణ్ తుழாయ్-చల్లనితిరుత్తుழாయియొక్క, తామమ్ - తిరుమాలను, కాముற்றாయే - ఆశపడితివా?

తా॥ ఓగోరవంకపక్షీ! రాత్రియంతయునిద్రించక క్రూరముగా శబ్దించుచు దుఃఖపడుచున్న నీవును శేషశాయికి దాసులైన మావలెనే వానియొక్క శ్రీపాదమందలి తులసీమాలనాశపడి, దానిని లభించక యీయవస్థనొందితివా యేమని? ౨

కాముఱ్ఱ కైయఱవో డెల్లే యిరాప్పగల్*
నీముఱ్ఱ కణ్డుయిలాయ్ నెఞ్జురుగి యేఙ్గుదియాల్*
తీముఱ్ఱ త్తెన్నిలఙ్గై యూట్టినాన్ తాళ్ నయన్ద*
యాముఱ్ఱ దుఱ్ఱాయో వాழி కనై కడలే. 3

అ॥ కాముఱ్ఱ - ఆశపడిన, కైయఱవోడు - వస్తువుపోవుటచే, ఇరాప్పగల్ - రాత్రింబగళ్లు, ముఱ్ఱ - అంతయు, నీ - నీవు, కణ్డుయిలాయ్ - నిద్రించవు, నెఞ్జు-మనస్సు, ఉరుగి-కరిగి, ఏఙ్గుదియాల్ - కేకలువేయుచున్నావు, తెన్నిలఙ్గై - దక్షిణమందలి లంకాపట్టణము, ముఱ్ఱ - అంతయు, తీ - అగ్నికి, ఊట్టినాన్ - ఆహారముగానిచ్చిన చక్రవర్తితిరుమగనార్ల యొక్క, తాళ్ - శ్రీపాదమును, నయన్ద - ఆశపడిన, యామ్ - మేము, ఉఱ్ఱదు - పొన్దినదానిని, ఉఱ్ఱాయో - పొందితివా? ఎల్లే - ఏమాశ్చర్యము, కనైకడలే - ధ్వనించుచున్న ఓసముద్రుఁడా! వాழி - సుఖముగానుండుమా.

తా॥ ఓసముద్రుఁడా! రాత్రింబగళ్లు నిద్రలేక వ్యసనముచేనిట్లు కేకలువేయుచున్న నీవు, లంకాపట్టణమును దహించిన శ్రీరామచంద్రునియొక్క శ్రీపాదములను బొందవలయుననియాశపడి, ఆయాశ నెరవేరనందున మావలనే విరహావస్థనొందితివాయేమి. నీయభీష్టము శీఘ్రముగా నెరవేరగలదని. 3.

కడలు మ్మలైయుమ్ విశుమ్బుమ్ తుழாయెమ్మోపోల్*
శుడర్ కొళిరాప్పగల్ తుఞ్జాయాల్ తణ్ వాడాయ్*
అడల్ కొళ్ పడైయాழி యమ్మానై క్కాణ్బాన్ నీ*
ఉడలమ్ నోయుఱ్ఱాయో ఊழிదో ఱూழிయే. ౪.

అ॥ తణ్ - చల్లని, వాడాయ్ - ఓవాయువా! ఎమ్మోపోల్ - నావలె, శుడర్ కొళ్ - చంద్రసూర్యులనెడితేజస్సుగల, ఇరాప్పగల్ - రాత్రింబగళ్లును, తుఞ్జాయాల్ - నిద్రించకయున్నావు. అడల్ కొళ్ - బలముగల, పడైయాழி - ఆయుధమైనచక్రముగల, అమ్మానై - స్వామిని, కాణ్బాన్ - సేవించుటకై, కడలుమ్ - సముద్రమందును, మలైయుమ్ - పర్వతములయందును, విశుమ్బుమ్ - ఆకాశమందును, తుழாయ్ - (ఆసర్వేశ్వరుని)వెతకి, ఊழிదోఱూழி - కాలమంతయు, ఉడలమ్ - శరీరమున్నతిపఱకును, నీ - నీవు, నోయ్ - వ్యాధిని, ఉఱ్ఱాయే - పొందితివా.

తా॥ ఓచల్లనివాయువా! నావలె ఎల్లప్పుడును నిదురలేక యీయవస్థనుబొందిన నీవు, చక్రధరునిసేవించుట కాశపడి సముద్రము మొదలగన్నిస్థలములలోను వెతకి నీమనోరథమును బొందక శరీరబాధనొందితివా యేమని. ౪.

ఊழிదోఱూழி యులగుక్కు- నీర్కొణ్డు*
తోழிయరుమ్ యాముమ్బోల్ నీరాయ్ నెగిழ்కిన్ఱ*
వాழிయ వానమే నీయు మ్మదుశూదర్*
పాழிమైయిల్ పట్టవన్గణ్ పాశత్తాల్ నైవాయే. ౫.

అ॥ ఊழிదోఱూழி - ప్రతికల్పమందును, ఉలగుక్కు- - లోకములన్నిటిని నింపుటకై, నీర్కొణ్డు - నీళ్లనుతీసికొని, తోழிయరుమ్ యాముమ్బోల్ - మాసఖులు మేమువలె, నీరాయ్ - నీరయి, నెగిழ్గిన్ఱ - కరుగుచున్న, వానమే - ఓ మేఘమా! నీయుమ్ - నీవును, మదుశూదన్ - మధువనెడిరక్కసుని జంపిన సర్వేశ్వరునియొక్క, పాழிమైయిల్ - వీర్యగుణమందు, పట్టు-దొరకుకొని, అవన్గణ్ - వానియందు, పాశత్తాల్ - ఆశచే, నైవాయే - దుఃఖమునొందితివాయేమి. వాழிయ - నీకు మఙ్గళమవుగాక.

తా॥ ఓ మేఘమా! లోకమంతయు నిండునట్లు ఒక్క తీరున నీరయి కరుగుచున్న నీ వాసర్వేశ్వరుని దివ్యచేష్టితములలో లోబడి వానియం దతి ప్రేమజేసి వానిని లభించకపోవుటచే మావలె నిట్టియవస్థను బొందితివాయేమని. ౫.

నైవాయ వెమ్మేపోల్ నాణ్మదియే నీయిన్నాళ్*
మైవానిరు ళగఱ్ఱాయ్ మాழ்గాన్దు తేమ్బుదియాల్*
ఐవాయరవణై మే లాழிప్పెరుమానార్*
మెయ్వాశగ ఙ్కేట్టున్ మెయ్నీర్మై తోఱ్ఱాయే. ౬

అ॥ నాణ్మదియే - ఓబాలచంద్రుడా! నీ - నీవు, ఇన్నాళ్ - ఈదినమందు, మై - కాటుకవలె, వాన్ - ఆకసమందున్న, ఇరుళ్ - చీకటిని, అగఱ్ఱాయ్ - పోగొట్టనివాడవైతివి. మాழ்గాన్దు - ప్రకాశములేక, తేమ్బుదియాల్ - క్షీణించిపోవుచున్నావు. నైవాయ-నొచ్చియున్న, ఎమ్మేపోల్ - మావలెనే, ఐవాయ్ - ఐదునోళ్లుగల, అరవణైమేల్ - శేషశయ్యమీదబవ్వళించిన, ఆழி -,చక్రాయుధముగల, పెరుమానార్ - గొప్పవాడైన (శ్రియఃపతియొక్క) మెయ్ - యథార్థమైన, వాశగమ్ - శ్రీసూక్తులను, కేట్టు - విని, ఉన్ - నీయొక్క, మెయ్ - శరీరమందలి, నీర్మై - సౌన్దర్యమును, తోఱ్ఱాయే - పోగొట్టుకుంటివా,

తా॥ ఓబాలచంద్రుడా! ఇప్పుడాకసమునందున్న నల్లనిచీకటిని పోగొట్టక కాన్తిహీనుడవై క్షీణదశను బొందితివి. నీవును మావలెనే, *"ఏతద్వ్రతమ్మమ" అనెడి సర్వేశ్వరునిమాటనువిని శేషశాయియైన చక్రధరుడబద్ధము జెప్పడని నమ్మి నీసౌన్దర్యమును బోగొట్టుకొంటివాయేమని ౬

తోఱ్ఱో మ్మడనెఞ్జ మెమ్బెరుమాన్ నారణఱ్కు*ఎమ్
ఆఱ్ఱామై శొల్లి యழுవోమై నీనడువే*
వేఱ్ఱోర్వగై యిల్ కొడిదా యెనై యూழி*
మాఱ్ఱాదే పాయ్న్దోయ్ మ్మాఱ్ఱాదే నిఱ్ఱియో వాழிకనై యిరుళే. ౭.

*సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే। అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతమ్మమ॥ నన్నుశరణముజొచ్చిన వానిని సమస్తాపత్తులను దొలగించి రక్షించెదనని ఈశ్లోకార్థము.

అ॥ ఎమ్బెరుమాన్ - మాస్వామియైన, నారణఱ్కు - నారాయణునికి, మడనెఞ్జమ్ - (మా) స్వాధీనమందున్న మనస్సును, తోఱ్ఱోమ్ - పోగొట్టుకొనినవారమై, ఎమ్ - మాయొక్క - ఆఱ్ఱామై - విరహదుఃఖమును, శొల్లి - చెప్పుకొని, అழுవోమై - ఏడుచుచున్న మమ్ములనుద్దేశించి, నీ - నీవు, నడువే-నడుమనవచ్చి, వేఱ్ఱోర్వగైయిల్ - శత్రువులు నేసెడివిధములకంటె, కొడిదాయ్ - క్రూరవ్యాపారముగలదానవై, ఎనైయాழி - ఎల్లప్పుడును, మాఱ్ఱాత్రై - హింసచేయుటయందు, నిఱ్ఱి - నిలిచియుంటివి, ఇరుళే - ఓఅంధకారమా! వాழி - సుఖముగానుందువుగాక.

తా॥ ఓచీకటీ! మేము మామనస్సును సర్వేశ్వరునికి దారపోసుకొని ఒకరికొకరు తమతమ దుఃఖమును జెప్పుచు దుఃఖించుచుండగా, నీవిప్పుడు మాలోజొచ్చి ఒకరిముఖమొకరికిఁదెలియకుండునట్లుజేసి బాధించుచున్నావు. నీవేసుఖముగానుండుమాయని. ౩.

ఇరుళిన్ తిణివణ్ణ మామ్నీర్కழிయే పోయ్*
మరుళుఱ్ఱిరాప్పగల్ తుఞ్జిలుమ్ నీతుఞ్జాయాల్*
ఉరుళుమ్శగడ ముదైత్త పెరుమానార్*
అరుళిన్ పెరునశైయా లాழ்న్దు నొన్దాయే. ౪.

అ॥ తిణి - దట్టమైయున్న, ఇరుళిన్ - చీకటియొక్క, వణ్ణమ్ - వర్ణముగల, మా - గొప్ప, నీర్ - జలముగల, కழிయే - ఓఉప్పుకాలవా! పోయ్ - మిక్కిలి, మరుళుఱ్ఱు - అజ్ఞానముగలదానవై, ఇరాప్పగల్ - రేయింబగళ్లు, తుఞ్జిలుమ్ - నిద్రించినను, నీ - నీవు, తుఞ్జాయాల్ - నిద్రించవు. ఉరుళుమ్ - దొర్లుచున్న, శగడమ్ - శకటాసురుని, ఉదైత్త - తన్నిన, పెరుమానార్ - స్వామియొక్క, అరుళిన్ - కృపయందు, పెరునశైయాల్ - మిక్కిలియాశచే, ఆழ்న్దు-మగ్నమై, నొన్దాయే - బాధపడుచున్నావాయేమి.

తా॥ గాఢాన్ధకారమువలె నల్లనివర్ణముగల ఓఉప్పుకాలవా! నీవు శకటాసురుని సంహరించిన శ్రీకృష్ణునియొక్కదయనుగోరి అదిలభించకపోవుటచే మతిపోయినదానవై యెల్లప్పుడున్ను నిద్రించక బాధనొందుచున్నావా యేమిని. ౪

నొన్దారా క్కాదల్నోయ్ మెల్లావి యుళ్ళులర్త్త*
నన్దావిళక్కమే నీయు మళియత్తాయ్*
శెన్దామరై త్తడఙ్గణ్ శెఙ్గనివా యెమ్బెరుమాన్*
అన్దామ త్తణ్డుழா యాశైయాల్ వేవాయే. ౫.

అ॥ నన్దా - ఎడతెగని, విళక్కమే - ఓదీపమా! అళియత్తాయ్ - (ఎల్లరచే)కరుణించదగినదానవైన, నీయుమ్ - నీవును, నొన్దు - బాధపడి, ఆరా - ఆరని, కాదల్ - ఆశయనెడి, నోయ్ - వ్యాధి, మెల్ - మృదువైన, ఆవి - ప్రాణమును, ఉళ్ళులర్త్త - లోపలయెండింపఁజేయునట్లు, శెమ్ - ఎఱ్ఱని, తామరై - తామరపుష్పమువలె, తడమ్ - విశాలమైన, కణ్ - నేత్రములుగలవాఁడును, శెమ్ - ఎఱ్ఱని, కని - పండువలెభోగ్యమైయున్న, వాయ్ - (తిరు) అధరముగలవాఁడును,

ఎమ్బెరుమాళ్ - నాస్వామియునైనవానియొక్క, అమ్ - అందమైన, తణ్ - చల్లని, తుళ్గాయ్ తామమ్ - తిరుత్తుళ్గాయిమాల యందు, ఆశైయాల్ - ఆశచేత, వేవాయే మండుచున్నావాయేమి.

తా॥ ఎల్లప్పుడు నొక్కతీరునవెలుఁగుచున్న ఓదీపమా! ఎంతకాలమనుభవించినను తీరనిదై నీప్రాణమును మిక్కిలిబాధించెడి యాశయనెడివ్యాధిగలదానవైతివి. నీవును, సర్వేశ్వరునియొక్క తామరపూబోలినకళ్లచక్కతనమున్ను, దొండపండునకెనయగధరసౌందర్యమునున్ను, తులసిమాల యొక్క సౌందర్యమునున్ను సేవించుటకాశపడి దానినొందకనిట్లు వెలుఁగుచున్నావాయేమని ౯.

వేవారా వేట్కైనోయ్ మెల్లావి యుళ్ళులర్త్తు*
ఓవాదిరాప్పగ లున్బాలే వీళ్ త్తొళిన్దాయ్*
మావాయ్ పిళన్దు మరుదిడై పోయ్ మణ్ణళన్ద*
మూవా ముదల్వా వినియెమ్మై చ్చోరేలే. ౧౦.

అ॥ వేవారా - మండిచల్లారని, వేట్కైనోయ్ - ఆశయనెడివ్యాధి, మెల్లావి - మృదువైననాప్రాణమును, ఉళ్ళులర్త్త - లోపలయెండిపజేయునట్లు, ఇరాప్పగల్ - రెయింబగళ్లు, ఓవాదు - ఎడబాయక, ఉన్బాలే - నీయందు, వీళ్త్తొళిన్దాయ్ - దొరుకుకొనునట్లుజేసితివి. మా - గుఱ్ఱమైవచ్చిన కేశియనెడి రక్కసునియొక్క, వాయ్ - నోటిని, పిళన్దు - చీల్చినవాడవును, మరుదు - మద్దిచెట్లయొక్క, ఇడై - మధ్యయందు, పోయ్ - వెంచేసినయట్టివాఁడవును, మణ్ - భూమిని, అళన్ద - కొలిచినవాడవును, మూవా - నవయౌవనముగలవాఁడవును, ముదల్వా - కారణభూతుండవునైన ఓశ్రియఃపతీ, ఇని - ఇఁకమీఁద, ఎమ్మై - మమ్ములను, శోరేల్ - విడువకుండుము.

తా॥ జగత్కారణుండవైన ఓశ్రియఃపతీ! నీవు కృష్ణావతారమునందుజేసిన కేశినిసంహరించుట, మద్దివృక్షములను గూల్చుట మొదలగు దివ్యచేష్టితములనున్ను, త్రివిక్రమావతారమునందు నీశ్రీపాదముచే లోకములను కొలుచుట మొదలగు దివ్యచేష్టితములనున్ను, నీదివ్యవిగ్రహసౌందర్యమునున్ను నాకుగనుపఱచి రేయింబగళ్లాశను నీయందు గలుగఁజేసి నీవు లభించకనన్ను బాధపెట్టినావు. ఇకనైనను నన్ను విడువక స్వీకరించుమాయని ౧౦.

‡‡ శోరాద వెప్పొరుట్కుమాదియామ్ శోదిక్కే*
ఆరాద కాదల్ కురుకూర్చ్చడగోపన్*
ఓరాయిరమ్ శొన్న వవత్తుళ్ళివైపత్తుమ్*
శోరార్ విడార్కణ్డీర్ వైగున్దమ్ తిణ్ణనవే. ౧౧.

అ॥ శోరాద - కొదవలేకుండునటుల, ఎప్పొరుట్కుమ్ - అన్నివస్తువులకును, ఆదియామ్ - కారణభూతుండై, శోదిక్కే - పరంజ్యోతిస్వరూపుండైన సర్వేశ్వరునికే, ఆరాద - (ఎంతననుభవించినను) తృప్తితీరనటువంటి, కాదల్ - ఆశగల, కురుగూర్చ్చడగోపన్ - కురుకాపురికధిపతియైననమ్మాళ్వార్లు, ఓరాయిరమ్-ఒకవెయ్యిపాశురములుగా, శొన్న-సాయించిన, అవత్తుళ్ - ఆ తిరువాయ్మొళులయందలి, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములను, శోరార్ - విడువకుండ

ననుసంధించువారు, వైగున్దమ్ - పరమపదమును, విడార్ కణ్డీర్ - విడువరు సుమండీ, తిణ్ణమ్ - ఇది యథార్థము.

తా॥ సకలజగత్కారణుండై పరంజ్యోతి స్వరూపుండైన శ్రియఃపతియందు మిక్కిలి భక్తి గలవారైన నమ్మాழ్వార్లు పాడియించిన ని పదిపాశురములనెల్లప్పుడు ననుసంధించువారు పరమ పదమును తప్పక పొందుదురని. ౧౧.

ఆழ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౨-వ తిరువాయ్మొழి.

అవతారిక — ఈతిరువాయ్మొழிలో, "శోరాద వెప్పొరుట్కుమాదియామ్" అని తాన నుసంధించిన సర్వేశ్వరత్వము నందరెఱుఁగునట్లుపదేశించుచున్నారు.

‡‡ తిణ్ణన్ వీడుముదల్ ముழுదుమాయ్*
ఎణ్ణిన్ మీదియ నెమ్బెరుమాన్*
మణ్ణుమ్విణ్ణు మెల్లా ముడనుణ్డ*న
న్కణ్ణన్ కణ్ణల్ల దిల్లైయోర్ కణ్ణే. ౧.

అ॥ వీడుముదల్ - మోక్షము మొదలగు, ముழுదుమ్ - సకలపురుషార్థములను, ఆయ్ - ఇచ్చువాఁడై, ఎణ్ణిన్ మీదియన్ - అసంఖ్యేయకల్యాణగుణంబులుగలవాఁడై - ఎమ్బెరుమాన్ - మాస్వామియై, మణ్ణుమ్ - భూమినిన్ని, విణ్ణుమ్ - ఆకాశమునున్ను, ఎల్లామ్ - ఇవన్నిఁటిని, ఉడన్ - ఒకకాలమునందే, ఉణ్ణ - అరగించిన, నఙ్కణ్ణన్ - మనశ్రీకృష్ణుఁడు, కణ్ - రక్షకుఁడు, అల్లదు - ఆశ్రీకృష్ణుఁడుగాక, ఓర్ కణ్ - వేరొకరక్షకుఁడు, ఇల్లై - లేడు, తిణ్ణమ్ - ఇదియథార్థము.

తా॥ మోక్షము మొదలగు సకలపురుషార్థములనిచ్చువాఁడును, వాఙ్మనస్సుల కగోచరంబులైన కల్యాణగుణంబులు గలవాఁడును, సర్వరక్షకుండును, నాస్వామియునైనశ్రీకృష్ణుండే జగదీశ్వరుఁడు; మఱియొకఁడుగాఁడు. ఈమాటయందు సందియంబులేదని. ౧.

ఏపావ మ్పరమే యేழுలగుమ్*
ఈపావమ్ శెయ్ దరుళా లళిప్పారార్*
మాపావమ్ విడ వరఱ్కు ప్పిచ్చైపెయ్*
గోపాలకోళరి యేఱన్ఱియే. ౨

అ॥ మాగొప్ప, పావమ్-పాపము, (బ్రహ్మహత్య) విడ-విడిచిపోవునట్లు, అరఱ్కు-రుద్రునికి, పిచ్చై - భిక్షమును, పెయ్-ఇచ్చిన, కోపాలకోళరియేఱు - గోపాలులకు బలముగలసింహ

శ్రేష్ఠమైన శ్రీకృష్ణుఁడు, అన్ఱియే - గాక, ఏழுలగుమ్-సప్తలోకములను, ఈపావమ్ శెయ్దు - నశించినపాపముగలవిగా జేసి, అరుళాల్ - కృపచే, అళిప్పార్ - రక్షించువారు, ఆర్ - ఎవరు? ఏపావమ్ - ఏమిపాపమో? పరమే - ఇట్లుచెప్పుట నాకు భారముగానున్నదే.

తా॥ రుద్రుఁడు తనతండ్రియైన బ్రహ్మయొక్క కపాలమును ఛేదించి యందువలన మహాపాతకియై, తనచేతులోనంటుకొనిన యాకపాలమునందు బిచ్చమెత్తుచు తిరుగుచుండగానప్పుడు తన చెమటనీళ్లబిందువును ఆ కపాలమునందుచిమ్మి యతనికాపాపమును బోగొట్టిన గోపశ్రేష్ఠుండైన శ్రీకృష్ణుఁడుతప్ప సప్తలోకములను పాపరహితంబులుగాజేసి తనకృపచే రక్షించువారెవరు; ఈయర్థమును నేనునిరూపించవలెనా యని. ౨.

ఏఱనై ప్పూవనై ప్పూమగళ్ దన్నై*
వేఱిన్ఱి విణ్తొழ త్తన్నుళ్ వైత్తు*
మేల్దన్నై మీదిడ నిమిర్న్దు మణ్కొణ్డ*
మాల్దనిల్ మిక్కుమోర్ తేవుముళదే. 3.

అ॥ ఏఱనై - వృషభవాహనుఁడైనరుద్రునిని, పూవనై-కమలమునందుబుట్టిన బ్రహ్మనును, పూమగళ్ తన్నై - కమలవాసినియైనశ్రీమహాలక్ష్మినిన్ని, వేఱిన్ఱి-భేదములేక, తన్నుళ్ - తనయందు, వైత్తు - ఉంచి, విణ్ - పరమపదవాసులు, తొழ - ఆశ్రయించునట్లు, మేల్ తన్నై - ఊర్ధ్వలోకమును, మీదిడ - అతిక్రమించునటుల, నిమిర్న్దు - పెరిగి, మణ్-భూమిని, కొణ్డ - కొలిచిన, మాల్ తన్నిల్ - శ్రియఃపతికంటె, మిక్కుమ్ - మేలైన, ఓర్ తేవుమ్ - ఒక దేవతయు, ఉళదే - కలదా?

తా॥ నిత్యసూరులుతనసౌశీల్యమునుజూచి స్తోత్రముజేయునటుల తనకత్యంతప్రియురాలై లోకేశ్వరియైన పిరాట్టితో సమముగా నత్యంతగుణహీనులైన బ్రహ్మ రుద్రాదులనున్ను తనశరీరమందుంచుకొనుటంబట్టియు, సర్వలోకములు తనశ్రీపాదమునన్దణఁగునటుల కొల్చుటంబట్టియు నాశ్రియఃపతియే సర్వేశ్వరుఁడు. మఱియొకఁడు గాఁడని. 3.

తేవు మెప్పొరుళు మ్పడైక్క*
పూవిల్ నాన్ముగనై ప్పడైత్త*
తేవ నెమ్బెరుమాను క్కల్లాల్*
పూవు మ్పూశనైయుమ్ తగుమే. ౪.

అ॥ తేవుమ్ - దేవతలనున్ను, ఎప్పొరుళుమ్ - తక్కినవస్తువులనున్ను, పడైక్క - సృష్టించుటకై, పూవిల్ - నాభికమలమందు, నాన్ముగనై - చతుర్ముఖుని, పడైత్త-సృజించిన, తేవన్ - పరదేవతయైన, ఎమ్బెరుమానుక్కల్లాల్ - నాస్వామికితప్ప, పూవుమ్ - పుష్పమున్ను, పూశనైయుమ్ - పూజయున్ను, తగుమే - (మఱియొకరికి)తగునా?

తా॥ సకలలోక సృష్టికర్తయైనబ్రహ్మను తననాభికమలమందు సృజించి దేవాధిదేవుండైన నాస్వామికంటె పుష్పాదులతున్ను తిరువారాధనముకున్ను దగినవాడు మఱియొకఁడులేడని. ౪.

తగుమ్శీర్ త్తన్తనిముదలి నుళ్ళే*
మిగు త్తేవు మెప్పొరుళుమ్ పడై క్క*
తగుమ్కోల త్తామరై క్కణ్ణ నెమ్మాన్*
మిగుమ్శోది మేలఱివార్ యవరే. ౫.

అ॥ తగుమ్ - ఉచితములైన, శీర్ - కల్యాణగుణంబులుగలవాఁడును, తన్ - తనయొక్క, తని - అద్వితీయంబైన, ముదలినుళ్ళే - సంకల్పమునందు, మిగుమ్ - ఉత్కృష్టులైన, తేవుమ్ - దేవతలనును, ఎప్పొరుళుమ్ - తక్కినసమస్తవస్తువులనును, పడైక్క - సృష్టించుటకు, తగుమ్ - తగిన, కోలమ్ - సుందరమైన, తామరై కణ్ణన్ - తామరపుష్పములవంటి నేత్రములుగలవాఁడునైన, ఎమ్మాన్ - మాస్వామియే, మిగుమ్శోది-పరంజ్యోతిస్వరూపుండు, మేల్-వానికంటె మేలైన వాఁడొకఁడున్నాడని, అఱివార్ - తెలిసికొనదగినవేదార్థవేత్తలు, యవర్ - ఎవరున్నారు.

తా॥ తనస్వరూపమునకుఁ దగినకల్యాణగుణంబులుగలవాండై, తనసంకల్పముచేతనే దేవాది సమస్తలోకములను సృజించువాఁడై, ఈశ్వరత్వమునుదెలుపుడు జేసెడి సుందరంబులైన కమలములవంటి నేత్రంబులుగల మాస్వామియైన శ్రియఃపతియే సకలవేదములయందుఁ బ్రతిపాదింపబడిన పరంజ్యోతి స్వరూపుండు. వీనికంటె మేలైన యీశ్వరుండొకఁడున్నాఁడనే విషయమందు ప్రమాణమేమియు లేదని. ౫.

యవరుమ్ యావైయు మెల్లా ప్పొరుళుమ్*
కవర్విన్ఱి త్తన్నుళ్ ళొడుఙ్గ నిన్ఱ*
పవర్కొళ్ ఞానవెళ్ళచ్చుడర్ మూర్త్తి*
అవరెమ్మాழி యమ్పళ్ళియారే. ౬.

అ॥ యవరుమ్ - సమస్తచేతనులున్ను, యావైయుమ్ - సమస్తములైన వచేతనములున్ను, ఎల్లాప్పొరుళుమ్ - ఈసమస్తపదార్థములున్ను, కవర్విన్ఱి - ఇఱుకులేక, తన్నుళ్ - తనయందు, ఒడుఙ్గ-అణుగునట్లు, నిన్ఱ - నిలిచియున్న, పవర్గొళ్ - విశాలమైన, ఞానవెళ్ళమ్ - జ్ఞాన సమృద్ధినిన్ని, శుడర్ - ఉజ్వలమైన, మూర్త్తి - దివ్యతిరుమేనునుగల, అవర్ - ఆశ్రియఃపతి, ఎమ్-మనకురక్షణహేతువైన, ఆழி - మహాసముద్రమును, అమ్ - సుందరమైన, పళ్ళియార్ - పడకగాగలవారై వేంచేసియున్నారు.

తా॥ చేతనాచేతనాత్మకంబులైన సకలజగత్తులనున్ను తనదివ్యతిరుమేనియందుంచుకొని ప్రళయకాలమందలి మహాసముద్రమునందు బవ్వళించిన సర్వజ్ఞుండైనమాస్వామియే సర్వేశ్వరుఁడని ౬.

పళ్ళియాలిలై యేழுలగుమ్ కొళ్ళుమ్*
వళ్ళల్ వల్వయిఱ్ఱు ప్పెరుమాన్*
ఉళ్ళుళా రఱివా రవన్ఱన్*
కళ్ళమాయ మనక్కరుత్తే. ౭.

అ॥ ఆలిలై - వటపత్రమును, వళ్ళి - పడకగాగలవాఁడై, ఏళ్ళులగుమ్ - సప్తలోకము లును, కొళ్ళుమ్ - అణుగునట్లు, వళ్ళల్ - విశాలమై, వల్ - బలిష్ఠమైన, వయిఱు - ఉదరము గలవాఁడై, పెరుమాన్ - సర్వాధికుండైన, అవన్ తన్ - ఆశ్రితపతియొక్క, కళ్ళుమ్ - కను పడనిదియు, మాయమ్ - ఆశ్చర్యకరమునైన, ఉళ్ళల్ - లోలోపలనుండెడి, మనక్కరుత్తు - సంకల్పమును, అఱివార్ - తెలిసికొనదగినవారు, ఆర్ - ఎవరు.

తా॥ విశాలమైన తనయుదరమునందు సమస్తలోకములనుంచుకొని వటపత్రమునందు బవ్వళిం చిన సర్వేశ్వరునియొక్క యాశ్చర్యకరమై యగాధమైన సంకల్పమిట్టిదని యెవ్వనికిఁదెలియదని ౭.

కరుత్తిల్ తేవు మెల్లాప్పొరుళుమ్*
వరుత్తిత్త మాయప్పిరానై యన్ఱి*ఆరే
తిరుత్తిత్ తిణ్ణిలై మూవులగుమ్*తమ్ముళ్
ఇరుత్తిక్కాక్కు మియల్వినరే ౮.

అ॥ కరుత్తిల్ - సంకల్పముచే, తేవుమ్ దేవతలనున్ను, ఎల్లాప్పొరుళుమ్ - తక్కినసమ స్తవస్తువులనున్ను, వరుత్తిత్త - సృజించిన, మాయమ్ - ఆశ్చర్యశక్తిగల, పిరానైయన్ఱి - సర్వే శ్వరునితప్ప మూవులగుమ్ - మూడులోకములనున్ను, తిణ్ - దృఢమైన, నిలై - స్థితిగలదై యగునట్లు, తిరుత్తి - దిద్ది, తమ్ముళ్ - తమయందు, ఇరుత్తి - ఉంచుకొని, కాక్కుమ్ - రక్షిం చెడి, ఇయల్వినర్ - స్వభావముగలవారు, ఆర్ - ఎవరు.

తా॥ తనసంకల్పముచే దేవాదిసకల పదార్థములను సృజించి యావస్తువులనొకటితో నొకటి కలిసిపోకుండ వ్యవస్థజేసి దనలోనుంచుకొని రక్షించిన విచిత్రశక్తిగల శ్రీమన్నారాయణుండే జగద్రక్షకుండుగాని మఱియొకరుగారని. ౮.

కాక్కు మియల్వినన్ కణ్ణపెరుమాన్*
శేర్కై శెయ్దు తన్నున్దియుళ్ళే*
వాయ్త్త తిశైముగ నిన్దిరన్ వానవర్*
ఆక్కినాన్ తెయ్వవులగుగళే.

అ॥ కాక్కుమ్ - రక్షించుటయే, ఇయల్వినన్ - స్వభావముగాగల, కణ్ణన్ - శ్రీకృష్ణుఁ డైన పెరుమాన్ - సర్వేశ్వరుండు, శేర్కైశెయ్దు-(జగత్తును) సంహరించి, తన్నున్దియుళ్ళే - తననాభియందు, వాయ్త్త - సమర్థుండైన, తిశైముగన్ - బ్రహ్మనున్ను, ఇన్దిరన్-ఇంద్రుణినిన్ని, వానవర్ - దేవతలనున్న, తెయ్వవులగుగళ్ - దేవతులలోకములనున్న, ఆక్కినాన్-సృజించి నాడు.

తా॥ జగద్రక్షణార్థమై శ్రీకృష్ణుండై యవతరించి శ్రీమన్నారాయణుండు జగద్రక్షకుఁడే గాక నీజగత్తును బ్రళయకాలమునందు సంహరించి, మఱియు దేవమనుష్యాదిసమస్తప్రాణులనున్ను, వాండ్లకు వాసస్థానంబులైన లోకంబులనున్ను సృజించువాఁడు గనుక వాఁడేసర్వేశ్వరుఁడని. ౯.

కళ్వా వెమ్మైయు మేழ లగుమ్ నిన్
ఉళ్ళే తోన్ఱియ విఱైవ వెన్ఱు
వెళ్ళేఱన్ నాన్ముగ నిన్దిరన్ వానవర్
పుళ్ళూర్ది కழల్ పణిన్దేత్తువరే. ౧౦.

అ॥ కళ్వా - తనమహిమనుదాచుకొన్నకృత్రిముఁడా! ఎమ్మైయుమ్-మమ్ములనున్ను, ఏழు లగుమ్ - సప్తలోకములనున్ను, నిన్నుళ్ళే - నీసంకల్పముచే, తోన్ఱియ - సృజించిన, ఇఱైవ- ఓస్వామీ! ఎన్ఱు - అనిజెప్పి, వెళ్ - తెల్లని, ఏఱన్ - వృషభముగలరుద్రుఁడును, నాన్ముగన్ - బ్రహ్మయు, ఇన్దిరన్ - ఇంద్రుఁడును, వానవర్ - దేవతలున్ను, పుళ్ - గరుత్మంతుని, ఊర్ది - వాహనముగాగలశ్రియఃపతియొక్క, కழల్ - శ్రీపాదములను, పణిన్దు - ఏత్తువర్ - స్తోత్రము జేసెదరు.

తా॥ శ్రీమన్నారాయణుఁడే బ్రహ్మరుద్రేన్ద్రాది సకలదేవాధిదేవుఁడు, సకలజగత్కారణుఁడు, సర్వేశ్వరుఁడు అనియిట్లుజెప్పుటకు ప్రమాణమేమనిన, ఆ గరుడవాహనుని శ్రీపాదముల నాశ్రయించి స్తోత్రములుజేయుచున్న ఆయాబ్రహ్మరుద్రాది దేవతలయొక్క వాక్యములేయని. ౧౦.

‡ ఏత్త వేழులగుమ్ కొణ్డకోల
క్కూత్తనై క్కురుగూర్చ్చడగోపన్ శొల్
వాయ్త్త వాయిరత్తు ళ్ళివై పత్తుడన్
ఏత్తవల్లవర్క్కిల్లై యొరూనమే. ౧౧.

అ॥ ఏత్త - (దేవతులు) స్తోత్రముజేయఁగా, ఏழులగుమ్ - సప్తలోకములనున్ను, కొణ్డ- కొలుచుగొనిన, కోలమ్ - సుందరమైన, కూత్తనై - వ్యాపారముగలసర్వేశ్వరునియుద్దేశించి, కురుగూర్చ్చడగోపన్-తిరునగరియందువేంచేసియున్న నమ్మాழ్వార్లు-శొల్-సాయించిన, వాయ్త్త- తగిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోజేరిన, ఇవైపత్తు - ఈపదిపాశురములను, ఉడన్ - ప్రీతితోఁగూడ, ఏత్తవల్లవర్క్కు - అనుసంధించువారికి, ఒరూనమ్-ఒకకొరతయు, ఇల్లై - రాదు.

తా॥ సమస్తలోకములను తనశ్రీపాదముచే నాక్రమించిన సర్వేశ్వరుని ప్రతిపాదించెడి ఈ తిరువాయ్మొழிని శ్రద్ధతో ననుసంధించువారికి దేవతాన్తరములయందు పరత్వబుద్ధి నొకప్పుడున్ను గలుగదని. ౧౧.

ఆழ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## 3 - వ తిరువాయ్మొழி.

అవతారిక—ఈ తిరువాయ్మొழிలో, "వాయుమ్తిరైయుగళుమ్" అనెడి తిరువాయ్మొழிలో తామనుభవించిన విరహాబాధశమన మగునటుల సర్వేశ్వరుఁడు తమతోవచ్చి సంశ్లేషించిన విధమును సాయించుచున్నారు.

*** ఊనిల్ వాழுయిరే నల్లైపో వున్నైప్పెత్తు*
వానుళార్ పెరుమాన్ మదుశూద నెన్నమ్మాన్*
తానుమ్ యానుమెల్లామ్ తన్నుళ్ళే కలన్దొழிన్దోమ్*
తేనుమ్పాలుమ్ నెయ్యుమ్ కన్నలు మముదుమొత్తే ౧.

అ॥ ఊనిల్ - శరీరమందు, వాழ் - ఉన్న, ఉయిరే - ఓమనసా! నల్లైపో - మంచిదా నవు మంచిదానవు. (ఎందువలననగా) ఉన్నై - నిన్ను, పెత్తు - పొంది, వానుళార్ - నిత్యసూరులకు, పెరుమాన్ - స్వామియై, మదుశూదన్ - మధువనెడిరక్కసుని సంహరించినవాఁడైన, ఎన్నమ్మాన్ తానుమ్ - మాస్వామియు, యానుమ్ - నేనును, తేనుమ్ - తేనెయు, పాలుమ్ - పాలును, నెయ్యుమ్ - నెయ్యియు, కన్నలుమ్ - శక్కరయు, అముదుమ్ - అమృతమును, ఒత్తు - సమముగాచేరిన, ఎల్లామ్-ఈయన్నిరసములున్ను, తన్నుళ్ళే-తనలోఁగలుగునట్లు, కలన్దొழிన్దోమ్ - కలిసియుంటిమి.

తా॥ ఓమనసా! నేను నీసహాయముచే నిత్యసూరిసేవ్యుఁడై నాస్వామియైన మధుసూదను నితోఁ జేరినమస్తరసములననుభవించితిని. అట్టి రసానుభవమునకు సహాయమైన నీవు మిక్కిలిమంచి దానవని. ౧.

ఒత్తార్ మిక్కారై యిలైయాయ మామాయా*
ఒత్తా యెప్పొరుట్కు ముయిరాయ్*ఎన్నైప్పెత్త
అత్తాయాయ్ తన్దైయా యఱియాదన వఱివిత్త*
అత్తా నీశెయ్‌దన వడియే నఱియేనే. ౨.

అ॥ ఒత్తార్ - తనతోసమానులనున్ను, మిక్కారై - తననుమించినవార్లనున్ను, ఇలైయాయ-గలవాఁడుకానివాఁడవున్ను, మామాయా - మిక్కిలియాశ్చర్యభూతుండవును, ఎప్పొరుట్కుమ్ - మనుష్యాది సమస్తవస్తువులకున్ను, ఒత్తాయ్ - సజాతీయుఁడైయవతరించినవాఁడవును, ఉయిరాయ్ - ప్రాణభూతుండవును, ఎన్నై - నన్ను, పెత్త - సృజించిన, అత్తాయాయ్ - అట్టివిలక్షణమైన తల్లివంటివాఁడవును, తన్దైయాయ్ - తండ్రివంటివాడవును, అఱియాదన - తెలియనివిషయములను, అఱివిత్త - (ఆచార్యునివలె) తెలియఁజేసిన, అత్తా-ఉపకారగుండవున్నైన మాస్వామీ! నీ - నీవు, శెయ్‌దన - చేసినఉపకారములను, అడియేన్ - దాసుఁడనైన నేను, అఱియేన్ - తెలియజాలను

తా॥ తనతో సమానుఁడును తననతిక్రమించినవాఁడును లేని గొప్పవాఁడవు, రామకృష్ణాద్య వతారములనెత్తి నందరిని రక్షించిన సులభుండవు, నాకు తల్లితండ్రులవలె ప్రియహిత పరుండవు, ఆచార్యునివలె జ్ఞానప్రదుండవున్నైన ఓ నాస్వామీ! నీవు నాకు జేసినయుపకారములిన్నియని లెక్కింపటకలవిగాక యున్నవని. ౨.

అఱియా క్కాలత్తుళ్ళే యడిమైక్క ణన్బుశెయ్‌విత్తు*
అఱియా మామాయ త్తడియేనై వైత్తాయాల్*

అఱియాగ్మె కుఱళాయ్ నిలమ్మావలి మూవడియెన్ఱు*
అఱియాగ్మె వఞ్జిత్తా యెనదావి యుళ్ కలన్దే. 3.

అ॥ అఱియామై - ఎవ్వరికిని తెలిసికొనుట కశక్యుండైన, కుఱళాయ్ - వామనుండవై, నిలమ్మావలి మూవడి - నేలమహాబలీమూడడుగు, ఎన్ఱు - అనియొడి*యసందర్భమాటను చెప్పి, అఱియామై - (శుక్రాచార్యులమాటలనుమహాబలి) వినకుండ, వఞ్జిత్తాయ్ - వంచనజేసినవాడవైన ఓస్వామీ! ఎనదావియుళ్ - నామనస్సునందు, కలన్దు - కలిసి, అఱియా - అజ్ఞానహేతువైన, మా - గొప్ప, మాయత్తు - సంసారమందున్న, అడియేనై - దాసుడనైన నన్ను, అఱియా - (నాయందునీ శేషత్వమును) తెలిసికొనుటకయోగ్యమైన, కాలత్తుళ్ళే - కాలమందు, అడిమైక్కణ్ - కైంకర్యమందు, అన్పు - ప్రీతిని, శెయ్విత్తు వైత్తాయాల్ - చేయించియుంచితివి.

తా॥ ఎవ్వరికిని దెలియనట్లు తనస్వరూపమును గప్పుకొని మహాబలిచక్రవర్తివద్దకేగి తన సౌందర్యముతో వానిని మోహింపజేసి వశపఱచుకొని, అచ్చటశుక్రాచార్యులుచెప్పిన మాటలను సాగనివ్వకుండజేసి వానిని మూడడుగులనేలను యాచించిన ఓస్వామీ! మాయామయమయిన సంసారమందున్న అజ్ఞుడనైన నామనస్సునందు ప్రవేశించి నీ కైంకర్యమందు నాకాశను గలుగజేసితివని. 3.

ఎనదావియుళ్ కలన్ద పెరునల్లుదవి క్కైమ్మాఱు*
ఎనదావి తన్దొழிన్దేన్ ఇనిమీళ్వ దెన్పదుణ్డే*
ఎనదావి యావియుమ్ నీ పొழிలేழுముణ్డ వెన్దాయ్*
ఎనదావియార్ యానార్ తన్దనీ కొణ్డాక్కినైయే. ౪.

అ॥ పొழிలేழுమ్ - సప్తలోకములనున్ను, ఉణ్డ - ఆరగించిన, ఎన్దాయ్ - ఓనాస్వామీ, ఎనదావియుళ్ - నాయాత్మయందు, కలన్ద - కలిసియుండడమనెడి, పెరు - గొప్పదైన, నల్ - విలక్షణమైన, ఉదవి - ఉపకారమునకు, క్కైమ్మాఱు - ప్రత్యుపకారముగా, ఎనదావి - నాయాత్మను, తన్దొழிన్దేన్ - సమర్పించితిని. ఇని - ఇకమీఁద, మీళ్వదెన్పదు - తిరుగుటయనుట, ఉణ్డే - కలదా? నీ - నీవు, ఎనదావియుమ్ - నాయాత్మకును, ఆవి - ఆత్మయైనవాడవు. ఎనదావి - నాయాత్మ, యార్ - ఎవరిది! యాన్ - నేను, ఆర్ - ఎవరివాడను తన్ద - (నన్ను) సృజించిన, నీయే - నీవే, కొణ్డాక్కినైయే - స్వీకరించితివి.

తా॥ సర్వలోక సంహారకుండవైన ఓస్వామీ! నీవునాతోగలిసియుండడమనెడి మహోపకారమునకు ప్రత్యుపకారముగా నాయాత్మను మఱియురాకుండునటుల నీకుసమర్పించితిని. ఇప్పుడు విచారించగా, నాకు నీవే యంతరాత్ముఁడవుగనుక నేనును నాదియని తలంచినవస్తువులున్ను నీదిగానే యున్నవి. గనుక నేనిచ్చుటకేవడను. నీవిచ్చినవస్తువులను నీవే స్వీకరించితివని. ౪.

---

*ఒకరిని యాచించునప్పుడు మిక్కిలిస్తోత్రముజేసి మనస్సుకరుగునట్లు చాతుర్యముగమాటలాడవలసియుండగ, అదేమియునులేక మహాబలియని వానిపేరుచెప్పి పిలిచియుక్తిమాటనడిగెనాఁడని.

ఇనియార్ ఞానఙ్గళాల్ ఎడుక్కలరియ్యాద వెన్దాయ్*
కనివార్ వీట్టిన్బమే యెన్కడల్పడా వముదే*
తనియేన్ వాழ்ముదలే పొழிలేழுమ్ ఏనమొన్ఱాయ్*
నునియార్ కోట్టిల్ వైత్తా యునపాదమ్ శేర్న్దేనే. ౫.

అ॥ యార్.ఎట్టిజ్ఞానవంతులయొక్కయు, ఞానఙ్గళాల్-జ్ఞానములచే, ఎడుక్కలరియ్యాద - తెలిసికొనుటకశక్యుండవైన, ఎన్దాయ్-ఓస్వామీ! కనివార్ - భక్తిగలవారికి, వీట్టిన్బమే-మోక్షసుఖస్వరూపుఁడా! ఎన్ - నాకు - కడల్ - సముద్రమునందు, పడా - జన్మించని, అముదే - అమృతమువలెభోగ్యభూతుఁడా! తనియేన్ - సహాయములేని నాయొక్క, వాழ் - సుఖానుభవమునకు, ముదలే - కారణభూతుఁడా! పొழிలేழுమ్ - సప్తలోకములనున్ను, ఒన్ఱు - అద్వితీయమైన, ఏనమాయ్ - వరాహమైయుండి, మునియార్ - కూరుగల, కోట్టిల్-దంతమునందు, వైత్తాయ్-ఉంచినవాఁడా! ఇని - ఇఁకమీద, ఉనపాదమ్ - నీశ్రీపాదములను, శేర్న్దేన్ - చేరితిని.

తా॥ అభక్తు లెట్టి జ్ఞానవంతులైనను వాఙ్మగోచరుఁడవై, భక్తులకుపరమ సులభుండవై భక్తిహీనుండనైన నాకు స్వతస్సిద్ధమైన భోగ్యభూతుఁడవై, నాకుసుఖప్రదుండవై, వరాహావతారమందున తనకొమ్ముమీద సమస్తలోకముల నెత్తుకొనివచ్చిన ఓస్వామీ! నన్ను నీవుద్ధరించినావు గనుక నేను నీశ్రీపాదములను పొందితినియని. ౫.

శేర్న్దార్ తీవినైగట్కరునఞ్జై త్తిణ్మదియై*
తీర్న్దార్ దమ్మనత్తు ప్పిరియా దవరుయిరై*
శోర్న్దే పోగల్కొడా చ్చుడరై యరక్కియై మూ
క్కీర్న్దాయై*అడియే నడైన్దే న్ముదల్ మున్నమే. ౬.

అ॥ శేర్న్దార్ - ఆశ్రితులయొక్క, తీ - క్రూరమైన, వినైగట్కు - పాపములకు, అరు - అపూర్వమయిన, నఞ్జై - విషమువంటివాఁడవును, తిణ్ - దృఢమైన, మదియై - జ్ఞానమునిచ్చువాఁడవును, తీర్న్దార్దమ్ - నిన్ను బొందినవారియొక్క, మనత్తు-మనస్సును, పిరియాదు-విడువక, అవర్-వారికి, ఉయిరై-ఆత్మయైయుండువాఁడవును, శోర్న్దేపోగల్కొడా-కరిగిపోవునట్లు విడువనివాడవును-శుడరై - ఉజ్జ్వలుండైనవాడవును, అరక్కియై-రాక్షసియైన శూర్పణఖయొక్క, మూక్కు-ముక్కును, ఈర్న్దాయై-ఛేదించినవాఁడవునైన నిన్ను, అడియేన్-దాసుండనైననేను, ముదల్ మున్నమే - మొట్టమొదటనే, అడైన్దేన్ - పొందితిని.

తా॥ఆశ్రితులపాపములను బోగొట్టి వారలకుతా నే*"ఉపాయము ఉపేయము" అనెడినిశ్చలమయిన తత్త్వజ్ఞానమునిచ్చి, అట్లు తలఁచిన వారియొక్క మనస్సును విడువకుండయుండి, శూర్పణఖయనురాక్షసిని నశింపజేసినట్లు వారలసర్వదుఃఖములను బోగొట్టి ప్రకాశించుచున్న ఓస్వామీ! నిన్ను నేను మొదటనే యాశ్రయించితినిగదాయని. ౬.

---

* ఉపాయమనఁగా - ఫలమునిచ్చువాఁడు, ఉపేయమనఁగా - ఫలము.

మున్నల్ యాఴ్ పయిల్ నూల్ నరమ్బిన్ ముదిర్ శువైయే*
పన్నలార్ పయిలుమ్ పరనే పవిత్తిరనే*
కన్నలే యముదే కార్ముగిలే యెన్ కణ్ణా*
నిన్నలా లిలేన్గాణ్ ఎన్నై నీ కుఱిక్కొళ్ళే. ౭.

అ॥ మున్ - అనాదియై, నల్ - విలక్షణమై, యాఴ్ - వీణాసంబంధమైన, నరమ్బిన్ - తంత్రియందుబుట్టిన, పయిల్ - అభ్యసింపబడిన, నూల్ - గానశాస్త్రమందు జెప్పినలక్షణముగల, ముదిర్ - పక్వమయిన, శువైయే - రసమువలె భోగ్యభూతుండా! పల్ - అనేకవిధములైన, నలార్ - జ్ఞానములుగలవారు, పయిలుమ్ - (ఎల్లప్పుడు) అనుభవించినను, పరనే - (ఆయనుభవమందణగని) మహిమగలవాఁడా! పవిత్తిరనే - పావనుండా! కన్నలే - చెరుకురసమువంటివాఁడా! అముదే - అమృతమువంటివాఁడా! కార్ముగిలే - వర్షాకాలమందలి మేఘమువంటివాఁడా! ఎన్ కణ్ణా - నాకుస్వామియైనశ్రీకృష్ణుఁడా! నిన్నలాల్ - నిన్నుతప్ప, ఇలేన్గాణ్ - ఉండనునుమా; ఎన్నై - ఇట్టినన్ను, నీ - నీవు, కుఱిక్కొళ్ - కటాక్షింపుము.

తా॥ సర్వేన్ద్రియములవల గలిగెడి యాయా యపారసుఖములను తన భక్తులకిచ్చెడి పరమభోగ్యుండవై, వార్ల పాపములను బోగొట్టెడిస్వభావముగల వాఁడవై, నిరతిశయ సౌందర్యముగల వాఁడవైన ఓ శ్రీకృష్ణుఁడా! నేను నిన్నెడబాసి యొకక్షణముఁడలేను గనుక నన్నంగీకరింపుమని. ౭.

కుఱిక్కొళ్ ఞానఙ్గళా లెనై యూఴి శెయ్తవముమ్*
కిఱిక్కొణ్డిప్పిఱప్పే శిలనాళి లెయ్దినన్ యాన్*
ఉఱిక్కొణ్డ వెణ్ణెయ్పా లొళిత్తుణ్ణు మమ్మాన్ పిన్*
నెఱిక్కొణ్డ నెఞ్జనాయ్ ప్పిఱవిత్తుయర్ కడిన్దే. ౮.

అ॥ ఉఱి - ఉట్టియందు, కొణ్డ - ఉంచబడిన వెణ్ణెయ్ - వెన్ననున్ను, పాల్ - పాలనున్ను, ఒళిత్తు - దాగియుండి, ఉణ్ణుమ్ - ఆరగించెడి, అమ్మాన్ - నాస్వామియైనశ్రీకృష్ణుఁడు, పిన్ - వెనుకసాయించిన*చరమశ్లోకార్థమైన, నెఱి - ప్రపత్తియనెడియుపాయమును, కొణ్డ - స్వీకరించిన, నెఞ్జనాయ్ - మనస్సుగలవాఁడనై, పిఱవిత్తుయర్ - సంసారదుఃఖమును, కడిన్దు - పోఁగొట్టి, కుఱి - ♦ యమనియమాదులచే, కొళ్ - సంపాదింపదగిన, ఞానఙ్గళాల్ - జ్ఞానములచే, ఎనైయూఴి - చిరకాలము, శెయ్ - చేయదగిన, తవముమ్ - తపస్సుయొక్క ఫలములను, కిఱి - భగవదనుగ్రహమును, కొణ్డు - లభించి, ఇప్పిఱప్పే - ఈజన్మమందే, శిలనాళిల్ - స్వల్పకాలములోనే, యాన్ - నేను, ఎయ్దినన్ - పొందితిని.

---

* సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ । అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః ॥ కర్మజ్ఞానాదుల నుపాయముగా నెంచక నీయభీష్టసిద్ధికి నన్నేయుపాయముగా వరియించు నేనే నీపాపములను తొలగింపఁజేసెదను. చింత పడకుమాయని యర్థము.

♦ చక్షురాది జ్ఞానేన్ద్రియములను విషయములయందు సఞ్చరింపకుండ నిగ్రహించుట, మనస్సును నిశ్చలముగాజేయుట, ప్రాణాయామముజేయుట మొదలైనవి.

తా॥ గోకులమందు గోపస్త్రీలు దాచియుంచిన వెన్ననున్ను పాలనున్ను దొంగలించి యారగించిన శ్రీకృష్ణుఁడు, భారతయుద్ధమం దర్జునుని కుపదేశించిన చరమ శ్లోకార్థమైన ప్రప త్తియే మన కుపాయమని తలంచి సంసారదుఃఖములను వదలి చిరకాలము తపస్సు జేసి పొందదగిన పురుషార్థమును నే నీజన్మమందే యల్పకాలములోనే భగవత్కటాక్షముచే లభించితినని. ౮.

కడివార్ తణ్ణన్దుழாయ్ క్కణ్ణ న్విణ్ణవర్ పెరుమాన్*
పడివాన మిలన్ద పరమన్ పవి త్తిరన్ శీర్
శెడియార్ నోయ్గళ్ కెడ ప్పడిన్దు కుడైన్దాడి*
అడియేన్ వాయ్మడుత్తు ప్పరుగి క్కళిత్తే నే. ౯.

అ॥ కడి - తేనె, వార్ - కారుచున్న, తణ్ - చల్లనైన, అమ్ - సుందరమైన, తుழாయ్ - తిరుత్తుழாయిగల వాఁడును, విణ్ణవర్ - నిత్యసూరులకు, పెరుమాన్ - స్వామియు, వానమ్ - పరమపదమందలియు, పడి - సామ్యము, ఇలన్ద - లేని, పరమన్ - సర్వోత్కృష్టుఁడును, పవి త్తిరన్ - పరమపావనుఁడునైన, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, శీర్ - కల్యాణములయందు, శెడియార్ - అజ్ఞానాదులచేనిండిన, నోయ్గళ్ - వ్యాధులు, కెడ - నశించునట్లు, పడిన్దు - సమీపించి, కుడైన్దు - ప్రవేశించి, ఆడి - మునిగి, వాయ్మడుత్తు - మిక్కిలిదాహముతో, పరుగి - పానముజేసి, అడియేన్ - దాసుఁడనైననేను, కళిత్తేన్ - సంతోషించితిని.

తా॥ పరమభోగ్యుఁడును, దేవాధిదేవుండును, పరమపదమందు గూడ తనకు సాటిలేని పరాత్పరుఁడును, పరమపావనుఁడునైన శ్రీకృష్ణుని దివ్యకల్యాణగుణములను బ్రీతితో జక్కగానను భవించి సంతోషించితినని. ౯.

కళిప్పుమ్ కవర్వుమ్ అఱ్ఱు ప్పిఱప్పుప్పిణిమూప్పిఱ ప్పఱ్ఱు*
ఒళికొణ్డ శోదియమా యుడనూడువ దెన్ఱుగొలో*
తుళిక్కిన్ఱ వానిన్నిలమ్ శుడరాழி శఙ్గేన్ది*
అళిక్కిన్ఱ మాయప్పిరా నడియార్గళ్ కుழாఙ్గళై యే. ౧౦.

అ॥ కళిప్పుమ్ - (విషయములయందు) సంతోషమునున్ను, కవర్వుమ్ - దుఃఖమునున్ను, అఱ్ఱు - విడిచి, పిఱప్పు - జన్మమునున్ను, పిణి - వ్యాధినిన్ని, మూప్పు - ముదిమినిన్ని, ఇఱప్పు - మరణమునున్ను, అఱ్ఱు - వదలి, ఒళికొణ్డ - ప్రకాశించుచున్న, శోదియమాయ్ - తేజోరూపమయిన దివ్యశరీరముగలవాఁడనై, తుళిక్కిన్ఱ - వర్షించుచున్న, వాన్ - ఆకసమునున్ను, ఇన్నిలమ్ - ఈభూమినిన్ని, అళిక్కిన్ఱ - రక్షించుచున్న, శుడర్ - ఉజ్జ్వలమైన, ఆழி - సుదర్శనమునున్ను, శఙ్గు - శ్రీపాఞ్చజన్యమునున్ను, ఏన్ది - ధరించిన, మాయప్పిరాన్ - ఆశ్చర్యభూతుఁడైన స్వామియొక్క, అడియార్గళ్ - దాసులయొక్క, కుழாఙ్గళై - సమూహములను, ఉడన్ - ఒద్దికతో, కూడువదు - చేరుట, ఎన్ఱుగొలో - ఎప్పుడో ?

తా॥ సంసారమందలి సుఖదుఃఖములనున్ను జన్మజరామరణాదులనున్ను వదలి దివ్యశరీరము గలవాఁడనై, శంఖచక్రాది దివ్యాయుధములను ధరించిన సకలలోక రక్షకుఁడైన సర్వేశ్వరుని భక్తులయొక్క భాగవతగోష్ఠిలోఁజేరి పరమానందమును నేనెప్పుడు బొందెదనని. ౧౦.

‡‡ కుழாழ్గోళ్ పేరరక్కన్ కులమ్‌వీయ మునిన్దవనై*
కుழாழ్గోళ్ తెన్కురుగూర్ చ్చడగోపన్ తెరిన్దురైత్త*
కుழாழ్గో ళాయిరత్తు ళ్ళివై పత్తు ముడన్పాడి*
కుழாజళా యడియీరుడ న్కూడిని న్దాడుమినే. ౧౧.

అ॥ కుழாழ్గోళ్ - పరివారసమూహముగల, పేర్ - గొప్పవాఁడైన, అరక్కన్ - రావణాసురునియొక్క, కులమ్ - వంశము, వీయ - నశించునట్లు, మునిన్దవనై - కోపగించిన సర్వేశ్వరుని, కుழாழ్గోళ్ - శ్రీవైష్ణవసమూహముగల, తెన్ కురుగూర్ - సుందరమైన తిరునగరికి నిర్వాహకులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, తెరిన్దు - పరిశీలించి, ఉరైత్త - సాయించిన, కుழாழ్గోళ్ - తిరువాయ్‌మొழிలయొక్క సమూహముగల, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, ఉడన్ - భక్తితోఁగూడ, పాడి - గానముజేసి, అడియీర్ - ఓభాగవతులారా! కుழாజళాయ్ - ఏకీభవించినవారై, ఉడన్ - సమరసులై, కూడినిన్దు - కలిసియుండి, ఆడుమిన్ - నృత్యముజేయుఁడు

తా॥ ఓ భాగవతులారా! రావణాసురుని సమూలముగా నాశముజేసిన సర్వేశ్వరుని యొక్క కల్యాణగుణములను బరిశీలించి నమ్మాళ్వార్లు సాయించిన యీపదిపాశురములను గానముజేసి నిత్యసూరులయొక్క సమూహములోఁజేరి యానందించుఁడని. ౧౧,

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౪.వ తిరువాయ్‌మొழி.

అవతారిక.— ఈతిరువాయ్‌మొழிలో, ఆళ్వార్లు, నిత్యసూరులతోఁగూడ గలిసియుండి, శ్రియఃపతిని యనుభవింప యాశపడినవారై యది తత్క్షణమందే లభించకపోవుటచే మిక్కిలి విషాదమునొంది క్షణమాత్రముండలేక తనయవస్థను చెప్పుకొనుటకుఁగూడ సామర్థ్యములేనివారై యుండగానప్పుడు సమీపమందున్న శ్రీవైష్ణవులు వీరియవస్థను సర్వేశ్వరునివద్ద విన్నవించువిధమును † అన్యాపదేశముగ సాయించుచున్నారు.

‡‡ ఆడియాడి యகఙ్కరైన్దు*ఇశై
పాడిప్పాడి క్కణ్ణీర్ మల్గి *ఎఙ్గుమ్
నాడినాడి నరశిఙ్గా వెన్దు*
వాడి వాడు మివ్వాణుదలే. ౧.

† తన నొకపిరాట్టిగాను, తనయవస్థనుజెప్పు వారిని యాపిరాట్టికి సఖులుగాను తలంచి చెప్పుట.

అ॥ వాణుదల్ - సుందరముఖముగలఈమె, ఆడియాడి-నృత్యముజేసి నృత్యముజేసి, అగమ్-మనస్సు కరైన్దు-కరిగి, ఇశై-స్వరముతో, పాడిప్పాడి-గానముజేసి గానముజేసి, కణ్ - నేత్రములయందు, నీర్మల్గి నీళ్లునిండి, ఎఙ్గుమ్ - అన్నిదిక్కులలో, నాడినాడి - వెతకివెతకి, నరశిఙ్గావెన్ఱు - నరసింహాయని (చెప్పి), వాడివాడుమ్ - వాడివాడిపోవును.

తా॥ ఓస్వామీ! ఈసుందరముఖి నిన్నెడబాసి యుండజాలక నీగుణచేష్టితములననుసంధించి నృత్యముజేసియు, తరువాత ఇందుకుశక్తిలేక దుఃఖించుచు నీగుణములను పాటలుగాపాడియు, ఆశ్రితపరతంత్రుఁడవైన నీవెక్కడున్నావోయని బాష్పపూర్ణంబులైన నేత్రంబులచే నన్నిదిక్కులనుజూచియు, నీవెక్కడను గనుబడనందున మిక్కిలి వాడిబోవుచున్నదని. ౧.

వాణుద లిమ్మడవరల్ ఉమ్మై
క్కాణు మాశైయుళ్ నైగిన్ఱాళ్ విఱల్
వాణ నాయిరన్దోళ్ తుణిత్తీర్ ఉమ్మై
క్కాణ నీరిరక్క మిలీరే. ౨.

అ॥ వాళ్ - సుందరమైన, నుదల్ - ముఖముగల, ఇమ్మడవరల్ - ఈమృదుస్వభావముగలబాలిక, ఉమ్మై - మిమ్ములను, కాణుమాశైయుళ్ - సేవింపవలయుననియాశచే, నైగిన్ఱాళ్ - వాడిపోవుచున్నది, విఱల్ - బలిష్ఠుఁడైన, వాణన్ - బాణాసురునియొక్క, ఆయిరన్దోళ్ - వెయ్యిభుజములను, తుణిత్తీర్ - ఛేదించినఓస్వామీ! ఉమ్మై - మిమ్ములను, కాణ - సేవించుటకు, నీర్ - మీరు, ఇరక్కమిలీర్ - దయలేనివారై యున్నారు

తా॥ ఓశ్రియఃపతీ! మీవిరహదుఃఖమును సహించని మృదుస్వభావముగలదై, నామాటను వినని బాలికయైన ఈసుందరముఖి, మీ సేవనుగోరి, అది లభించక దుఃఖించుచున్నది. ఇట్టిభక్తురాలయిన యీమెకు సేవసాయించుటకుఁగూడ బాణారివైన నీకు దయలేకపోయినదని. ౨

ఇరక్కమనత్తోడెరియణై
అరక్కుమెழுగు మొక్కుమివళ్
ఇరక్క మెழீరిదఱ్కెన్ శెయ్గేన్
అరక్కనిలఙ్గై శెఱ్ఱీరుక్కే. ౩.

అ॥ ఇరక్కమ్ - ఛేదించుచున్న, మనత్తోడు - మనస్సుతో, ఇవళ్ - ఈమె, ఎరియణై - అగ్నిసమీపమందున్న, అరక్కుమ్-లక్కతోను, మెழுగుమ్ - మయినముతోను, ఒక్కుమ్-సదృశురాలైయున్నది. ఇరక్కమెழீర్ - మీరుదయనుప్రకాశింపజేయనివారైయున్నారు ఇదఱ్కు - ఇందునిమిత్తమై, అరక్కన్ - రావణాసురునియొక్క, ఇలఙ్గై - లంకాపురిని, శెఱ్ఱీరుక్కు - నశింపజేసినమీకు, ఎన్ శెయ్గేన్ - ఏమిజేసెదను.

తా॥ లంకను సమూలముగా నశింపజేసిన ఓస్వామీ! మిమ్ములనెడబాసిన యీబాలిక, మీవిరహదుఃఖమునుసహించక, అగ్నిసమీపమందున్న లక్కవలెనున్ను మైనమువలెనున్ను కరగిపోవుచున్నను, మీకెంతమాత్ర మీమెయందు దయరాలేదు, దీనికి నేనేమిపాయముబు కల్పింతునదని ౩

ఇలఙ్గై శెత్తవనే యెన్నుమ్*పిన్నుమ్
వలఙ్గొళ్ పుళ్ళుయర్త్తా యెన్నుమ్*ఉళ్ళమ్
మలఙ్గ వెవ్వుయిర్క్కుమ్*కణ్ణీర్ మిగ
క్కలఙ్గి క్కైతొழுమ్ నిన్ఱివళే. ౪.

అ॥ ఇవళ్ - ఈబాలిక, పిన్నుమ్-మఱియు, ఇలఙ్గై - లంకాపురిని, శెత్తవనే - నాశముజేసినవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. వలఙ్గొళ్ - బలిష్ఠుండైన, పుళ్-గరుత్మంతుని, ఉయర్త్తాయ్-ధ్వజముగాసెత్తినవాడా! ఎన్నుమ్ - అనిచెప్పును, ఉళ్ళమ్-మనస్సు, మలఙ్గ - వ్యాకులమగునట్లు, వెమ్-ఉష్ణమైన, ఉయిర్క్కుమ్ - నిట్టూర్పునుఁ విడుచును. కణ్ణీర్ - నేత్రజలము, మిగ-మిక్కిలియగునట్లు, కలఙ్గినిన్ఱు - వ్యాకులపడియుండి, కైతొழுమ్ - సేవించును

తా॥ ఓస్వామీ! ఈబాలిక, లంకాపురిని నశింపజేసినవాఁడా! యనియు, గరుడధ్వజుండా! యనియు నిన్ను పిలిచి, అప్పుడు నీవురాకపోవుటచే వేడివేడిగా నిట్టూర్పులువిడుచుచు నీతిరునామములు చెప్పుటకుఁగూడ శక్తిలేక దుఃఖించుచు నీకు వందనంబులిడుచున్నదని. ౪.

ఇవళిరాప్పగల్ వాయ్వెరీఇ*తన
కువళై యొణ్కణ్ణనీర్ కొణ్డాళ్*వణ్డు
తివళుమ్ తణ్ణన్దుழாయ్ కొడీర్*ఎన
తవళవణ్ణర్ తగవుగళే. ౫.

అ॥ ఇవళ్ - ఈబాలిక, ఇరాప్పగల్ - రాత్రింబగళ్లు, వాయ్వెరీఇ-వాగుచు, తన - తనయొక్క, కువళై - నల్లకలువవలె, ఒణ్ - సుందరంబులైన, కణ్ణ - నేత్రములయందు, నీర్కొణ్డాళ్ - బాష్పముగలదైయైనది, వణ్డు - తుమ్మెదలు, తివళుమ్ - సఞ్చరించుచున్న, తణ్ - చల్లనైన, అమ్ - సుందరమైన, తుழாయ్-తిరుతుழாయిమాలను, కొడీర్ - (మీరు) ఇవ్వరు, తవళవణ్ణర్ - శుద్ధస్వభావముగలమీయొక్క, తగవుగళ్ - కృపమొదలగుస్వభావములు, ఎన-ఎట్టివి?

తా॥ ఓస్వామీ! ఈబాలిక రాత్రింబగళ్లు మీతిరునామములనుచెప్పుచు, మీతిరుమేనియందున్న తిరుత్తుழாయి మాలయందాశపడి యది లభించక మిక్కిలి దుఃఖించుచున్నను, ఆ తిరుత్తుழாయిమాలను మీరివ్వరు. మీదయాగుణంబును నేనేమని వర్ణించెదనని. ౫.

తగవుడైయవనే యెన్నుమ్*పిన్నుమ్
మిగవిరుమ్బుమ్ పిరానెన్నుమ్*ఎన
దగవుయిర్క్కముదే యెన్నుమ్*ఉళ్ళమ్
ఉగవురుగి నిన్ఱుళ్ళుళే. ౬.

అ॥ ఉళ్ళమ్ - మనస్సు, ఉగ-నశించునటుల, ఉరుగినిన్ఱు-కరిగియుండి, తగవుడైయవనే-దయాగుణముగలవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును; పిన్నుమ్ - మఱియు, మిగ-మిక్కిలి, విరుమ్బుమ్ - ఆశపడుచున్న, పిరాన్ - ఉపకారకుండా! ఎన్నుమ్ - అనిచెప్పును, ఎనదు - నాయొ

క్క్, అగవుయిర్‌క్కు - లోపలనుండెడిజీవునికి, అముదే - అమృతమువంటివాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. ఉళ్ళుశోర్ - ఇట్టియవస్థ యీమె కపారమైయుండును.

తా॥ ఓస్వామీ! ఈబాలిక మీవిరహముచే మిక్కిలిదుఃఖించుచు, ఓదయాశీలుఁడా! ఆశ్రితవ్యామోహముగలవాఁడా! నాకుభోగ్యభూతుఁడా! అని యెల్లప్పుడును జెప్పును. ఇదియునుంగాక ఈమెయొక్కయవస్థ వాచామగోచరమైయుండునని. ౬.

ఉళ్ళుళావి యులర్ న్దులర్ న్దు*ఎన
వళ్ళలే కణ్ణనే యెన్నుమ్*పిన్నుమ్
వెళ్ళనీర్ క్కిడన్దా యెన్నుమ్*ఎన
కళ్వి తాన్పట్ట/వఞ్జనై యే. ౭.

ఉళ్ళుళ్ - హృదయములోపలనున్న, ఆవి - ప్రాణము, ఉలర్ న్దులర్ న్దు - మిక్కిలి వాడిపోయినదై, ఎన - నాకు, వళ్ళలే - మహోపకారకుఁడా! కణ్ణనే-శ్రీకృష్ణుఁడా! ఎన్నుమ్- అనిచెప్పును. పిన్నుమ్ - మఱియు, వెళ్ళనీర్ - సముద్రజలమందు, కిడన్దాయ్ - పవ్వళించినవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును, ఎనకళ్వి - నాకుతనస్వభావమునుదాచిన ఈబాలిక, తాన్పట్ట-తాననుభవించిన, వఞ్జనై - కపటము, (ఇట్టిది).

తా॥ నాకు తనదుఃఖమును దెలియజేయకదాచిన యీకుమార్తె, నీయొక్కగుణచేష్టితములచే మోహింపబడి నిన్నులభించక తనలోపలనుండు ప్రాణమెండిపోవునట్లు దుఃఖించుచు, నాస్వామీ! ఉపకారకుఁడా! కృష్ణా! క్షీరాబ్ధినాథా! యని పలుమాఱు నీతిరునామములను జెప్పుచున్నదని. ౭.

వఞ్జనే యెన్నుమ్ కైదొழுమ్*తన
నెఞ్జమ్ వేవ నెడిదుయిర్ క్కుమ్*విఱల్
కఞ్జనై వఞ్జనై శెయ్దీర్*ఉమ్మై
త్తఞ్జమెన్ఱివళ్ పట్టనవే. ౮.

అ॥ వఞ్జనే - వంచకుఁడా! ఎన్నుమ్ - అనిజెప్పును. కైదొழுమ్ - అఞ్జలిచేయును. తననెఞ్జమ్-తనమనస్సు, వేవ - దహించునట్లు, నెడిదుయిర్ క్కుమ్ - నిట్టూర్పువిడుచును. విఱల్ - బలిష్ఠుఁడైన, కఞ్జనై - కంసుని, వఞ్జనై శెయ్దీర్-కపటముచేసంహరించినస్వామీ! ఉమ్మై-మిమ్ము లను, తఞ్జమెన్ఱు-రక్షకులని (నమ్మిన),ఇవళ్ - ఈకుమార్తె, పట్టన-అనుభవించినదుఃఖము, ఏ-ఎట్టిది.

తా॥ కంసుని సంహరించిన ఓస్వామీ! ఈకుమారై, నీగుణంబులచే నన్నువంచనజేసినవాఁడా! యని పిలిచి నీ కఞ్జలిజేసి నిన్ను కళ్ళారగ చూడకుండ మహాదుఃఖమునొంది నిట్టూర్పువిడుచుచున్నది. ఓస్వామీ! నీవే రక్షకుండవని నమ్మిన ఈమె ఇట్టిదుఃఖము ననుభవించవలసినదేవాయని. ౮.

పట్టపోదెழுపో దఱియాళ్*విరై
మట్టలర్ తణ్ణుழாయెన్ను మ్*శుడర్

వట్టవాయ్ నుదినేమియీర్*నుమ
దిట్టమెన్గొ లివ్వేழைక్కే. ౯.

అ॥ వట్టపోదు_అస్తమనకాలమునున్ను, ఎழுపోదు_ఉదయకాలమునున్ను, అఱియాళ్ - ఎఱింగినదిగాదు. విరై - పరిమళమున్ను, మట్టు - తేనెయు, అలర్ - వ్యాపించియున్న, తణ్ - చల్లని, తుழாయ్_తిరుత్తుழாయి, ఎన్నుమ్_అనిజెప్పును. షుడర్_ఉజ్జ్వలమైన, వట్టమ్_గుండ్రమైన, వాయ్_ముఖమునున్ను, నుది - వాడినిన్నిగల, నేమియీర్ - సుదర్శనముగలస్వామీ ! ఇవ్వేழைక్కు_ఈచపలరాలువిషయమై, నుమదు - మీయొక్క, ఇట్టమ్ - తలంపు, ఎన్గొల్ - ఏమి

తా॥ చక్రధరుఁడవైన ఓస్వామీ ! మీసంశ్లేషమునుగోరి యితర విషయములను మఱచి ఉదయాస్తమయములనుగూడ నెఱుఁగక మీతిరుమేనియందున్న భోగ్యమైన తిరుత్తుழாయి మాలనేయనుసంధించుచున్న ఈకుమార్తె విషయమై మీరుతలంచిన తలంపేమియో? దానిని మాకు తెలుపుఁడని ౯.

ఎழைపేదై యిరాప్పగల్*తన

కేழ்ழி లొణ్కణ్ణనీర్ కొణ్డాళ్*కిళర్
వాழ்వై వేవ విలఙ్గై శెఱ్ఱీర్*ఇవళ్
మాழைనో క్కొన్ఱుమ్ వాట్టేన్మినే. ౧౦.

అ॥ ఏழை - చపలురాలైన, పేదై - ఈబాలిక, ఇరాప్పగల్ - రేయింబగళ్ళు, తన_తనయొక్క, కేழ்ழిల్ - ఒప్పులేని, ఒణ్ - అందమైన, కణ్ణ - నేత్రములనుంచి, నీర్ కొణ్డాళ్ - బాష్పంబునుస్రవింపజేయుచున్నది. కిళర్ - వృద్ధిబొందుచున్న, వాழ்వై - ఐశ్వర్యమును, వేవ - నశించునట్లు, ఇలఙ్గై - లంకను, శెఱ్ఱీర్_నశింపజేసినస్వామీ ! ఇవళ్_ఈమెయొక్క, మాழை - జింకనేత్రమువంటి, నోక్కొన్ఱుమ్_దృష్టియొకటియున్ను, వాట్టేన్మిన్_వాడిపోకుండునటులజేయుము.

తా॥ మీకల్యాణగుణములయందు చాపల్యముబడి నామాటను విననియీబాలిక, తననేత్రములనుంచి దుఃఖముచే నీళ్లనుబ్రవహింపజేయుచున్నది. లంకైశ్వర్యమును నశింపజేసిన ఓస్వామీ! ఈమెనేత్రసౌందర్యమును మాత్రము జెరుపకుఁడుఁడుమని. ౧౦.

‡‡ వాట్టమిల్ పుగழ் వామననై*ఇశై
కూట్టి వణ్ శడగోపన్ శొల్*అమై
పాట్టోరాయిర త్తిప్పత్తాల్*అడి
శూట్టలాగు మన్దామమే. ౧౧.

అ॥ వాట్టమిల్ - మాలిన్యములేని, పుగழ் - కల్యాణగుణములుగల, వామననై - వామనుణ్ణియుద్దేశించి, వణ్ - ఉదారులైన_శడగోపన్ - నామ్మాళ్వార్లు, ఇశై - గానముతో, కూట్టి_చేర్చి, శొల్ - సాయించిన, అమై - లక్షణములతోసమరియున్న, ఓర్ - అద్వితీయంబులైన, పాట్టు - పాశురములయొక్క, ఆయిరత్తు - వెయ్యింటిలో, ఇప్పత్తాల్ - ఈపదిపాశురములచే,

అడి - ఆవామనునియొక్క శ్రీపాదములయందు, అమ్ - సుందరమైన, తామమ్ - మాలికను, శూట్టలాగుమ్ - సమర్పించుటకు శక్యమవును.

తా॥ నిర్దుష్టంబులైన కల్యాణగుణంబులుగల శ్రీవామనుని విషయమై నమ్మాழ்వార్లు సాయించిన సమస్తలక్షణయుక్తంబులైన యీపదిపాశురముల ననుసంధించువారికి భగవత్కైంకర్యమనెడిమహాపురుషార్థమతిసులభముగాలభించునని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౫ - వ, తిరువాయ్మొழி.

అవతారిక — ఈతిరువాయ్మొழிలో, సర్వేశ్వరునియొక్క విరహముచే దుఃఖాక్రాన్తులైన యాழ்వార్లార్తనాదముజేయగా, అప్పుడాశబ్దమునువిని, నేను జగద్రక్షకుండైయుండియు వీరిని యీసమయమందు రక్షించకపోతినేయని పశ్చాత్తాపమునొంది యతిత్వరగావచ్చి సర్వేశ్వరుఁడు సేవసాయించఁగా, అప్పుడాసర్వేశ్వరునియొక్క స్వరూపరూపగుణములనున్ను, దివ్యాయుధదివ్యభూషణములనున్ను నుభవించి తాముబొందిన పురుషార్థమును సాయించుచున్నారు.

❋❋ అన్దామ త్తన్బుశెయ్ దెన్నావిశే రమ్మానుక్కు*
అన్దామవాழ் ముడిశజ్గాழிనూ లారముళ*
శెన్దామరై త్తడజ్గణ్ శెజ్గనివాయ్ శెజ్గమలమ్*
శెన్దామరై యడిక్కళ్ శెమ్బొన్ తిరువుడమ్బే. ౧.

అ॥ అమ్ - సుందరమైన, తామత్తు - పరమపదవాసులయందుఁజేయఁదగిన, అన్బు - ప్రీతిని, శెయ్దు - (నాయందు) చేసి, ఎన్ - నాయొక్క, ఆవి - మనస్సునందు, శేర్ - చేరిన, అమ్మానుక్కు—స్వామికి, అమ్—సుందరమైన, తామమ్—తిరుత్తుழாయిమాల, వాழ் -ప్రకాశించుచున్న, ముడి - కిరీటమున్ను, శజ్గు - శ్రీపాఞ్చజన్యమున్ను, ఆழி - సుదర్శనమున్ను, నూల్ - యజ్ఞోపవీతమున్ను, ఆరమ్ - హారమున్ను, ఉళ - ప్రకాశించుచున్నవి. తడమ్ - విశాలమైన, కణ్ - నేత్రములు, శెన్దామరై - ఎఱ్ఱతామరపుష్పమువలెనున్నవి. శెమ్ - ఎఱ్ఱని, కని - ఫలమువలెనున్న, వాయ్—అధరమున్ను, శెజ్గమలమ్ - ఎఱ్ఱతామరవలెనున్నది. అడిగళ్ - శ్రీపాదములున్ను, శెన్దామరై - ఎఱ్ఱతామరవలెనున్నవి. తిరువుడమ్బు - దివ్యవిగ్రహము, శెమ్బొన్ - పచ్చనిబంగారమువలెనున్నది.

తా॥ పరిశుద్ధులైన నిత్యసూరులయందుఁజేసెడి ప్రీతినిగుణహీనుఁడనైన నాయందుఁజేసి, ఆసర్వేశ్వరుఁడు నాహృదయమందుఁ ప్రవేశించగా, వానియొక్కశంఖచక్రాది దివ్యాయుధములున్ను, కిరీటహారములు మొదలగు దివ్యభూషణములున్ను, నేత్రములు మొదలగు దివ్యావయవములున్నుయిప్పుడు మిక్కిలిఁ ప్రకాశించుచున్నవని. ౧.

తిరువుడమ్బు వాన్శుడర్ శెన్దామరై కణ్ కై కమలమ్*
తిరువిడమే మార్వ మయనిడమే కొప్పూழ்.*
ఒరువిడము మెన్దైపెరుమా ఱ్కరనేయో*
ఒరువిడ మొన్ఱిని యెన్నుళ్ కలన్దానుక్కే. ౨.

అ॥ ఒరువిడమొన్ఱిన్ఱి - ఒకయవయవముగూడదప్పక, ఎన్నుళ్ - నాహృదయమందు, కలన్దానుక్కు - కలిసియున్న, ఎన్దైపెరుమాఱ్కు - నాస్వామికి, తిరువుడమ్బు - దివ్యవిగ్రహము. వాన్శుడర్ - మిక్కిలితేజోరూపముగానున్న, కణ్ - నేత్రములు, శెన్దామరై - ఎఱ్ఱతామరవలెనున్న, కై - శ్రీహస్తములు, కమలమ్ - పద్మమువలెనున్న, మార్వమ్ - వక్షస్థలము, తిరువిడమ్ - లక్ష్మీకివాసస్థానముగానున్న, కొప్పూழ் - తిరునాభి, అయనిడమ్ - బ్రహ్మకుస్థానముగానున్న, ఒరువిడమ్ - తక్కినయొకయవయవము, అరన్ - రుద్రునికి స్థానముగానున్న ఉన్నవి.

తా॥ అనన్యప్రయోజనులైన శ్రీమహాలక్ష్మి మొదలయినవారికిన్ని ప్రయోజనాంతరపరులై క్షుద్రులైన బ్రహ్మరుద్రాదులకున్ను వాసస్థానముగానుండెడి సర్వేశ్వరుఁడిప్పుడు నాహృదయమునువాసస్థానముగాస్వీకరించెనని. ౨.

ఎన్నుళ్ కలన్దవన్ శెఙ్గనివాయ్ శెఙ్గమలమ్*
మిన్నుమ్ శుడర్మలైక్కు కణ్పాదమ్ కై కమలమ్*
మన్ను ముழுవేழுలగుమ్ వయిత్ఱినుళ*
తన్నుళ్ కలవాద దెప్పొరుళుమ్తా నిల్లైయే. 3.

అ॥ ఎన్నుళ్ - నాహృదయమందు, కలన్దవన్ - కలిసినవాఁడై, మిన్నుమ్ - ఉజ్జ్వలుఁడైన. శుడర్ - తేజోరూపమైన, మలైక్కు - పర్వతమువంటిస్వామికి, శెమ్ - ఎఱ్ఱని, కని-నునువుగల, వాయ్ - అధరము, శెఙ్గమలమ్ - ఎఱ్ఱతామరవలెనున్నది, కణ్ - నేత్రములున్ను, పాదమ్ - శ్రీపాదములున్ను, కై - శ్రీహస్తములున్ను, కమలమ్ - పద్మములవలెనున్నవి. మన్నుమ్ - ప్రవాహతోస్థిరములై, ముழு-సంపూర్ణములైన, ఏழுలగుమ్-సప్తలోకములున్ను, వయిత్ఱిన్ - ఉదరములో, ఉళ - ఉన్నవి. తన్నుళ్ - తనలో, కలవాదదు - సంబంధించనిది, ఎప్పొరుళుమ్ తాన్ - ఏవస్తువును, ఇల్లై - లేదు.

తా॥ సమస్తలోకములకు నాధారభూతుఁడైన సర్వేశ్వరుఁడు నాహృదయమందుఁ బ్రవేశించి మిక్కిలి దివ్యావయవ సౌందర్యముగలవాఁడై యున్నాఁడని. 3.

ఎప్పొరుళుమ్ తానాయ్ మరదగక్కున్ఱమొక్కుమ్*
అప్పొழுదైత్తామరైప్పూ కణ్పాదమ్ కై కమలమ్*
ఎప్పొழுదుమ్ నాళ్తిఙ్గళ్ ఆణ్డూழி యూழிదోఱుమ్*
అప్పొழுదైక్కప్పొழு దెన్నారా వముదమే. ౪.

అ॥ ఎప్పొழுదుమ్ - సమస్తక్షణములయందును, ఎన్నాళ్ - సకలదినములయందును, ఎత్తిఙ్గళ్ - సమస్తమాసములయందును, ఎవ్వాణ్డు-అన్నిసంవత్సరములయందును, ఎప్పూழிయూழிలో

ఉమ్ - సమస్తకల్పములయందును, అప్పొழுదైక్కప్పొழுదు - అప్పటికప్పుడు, ఎన్ - నాకు ఆరా౽ముదమ్ - తృప్తిలేని యమృతమువంటివాఁడును, ఎప్పొరుళుమ్ - సమస్తవస్తువులనున్ను, తానాయ్ - తనకుశరీరముగాఁగల వాఁడును, మరదగక్కున్ఱమొక్కుమ్ - మరతకపర్వతమును బోలినవాఁడునైనస్వామియొక్క, కణ్ - నేత్రములు, అప్పొழுదైక్కు - అప్పుడువికసించిన, తామరైప్పూ - తామరపుష్పమువలెనున్నవి. పాదమ్ - తిరువడికళున్ను, కై - శ్రీహస్తమున్ను, అప్పొழுదైక్కమలమ్ - అప్పుడువికసించిన పద్మమువలెనున్నవి.

తా॥ సద్యోవికసితమైన తామరపుష్పమువలె నతిసుందరంబులైన హస్తపాదాదిదివ్యావయవములుగల సర్వాన్తరాత్మయైన యాసర్వేశ్వరుఁడు నాకుప్రతిక్షణమున్ను అపూర్వమైనయమృతమువలె భోగ్యభూతుఁడైయున్నాఁడని. ౪.

ఆరావముదనూ యల్లావియుళ్ కలన్ద*
కారార్ కరుముగిల్ పోలెన్నమ్మాన్ కణ్ణనుక్కు*
నేరావాయ్ శెమ్బవళమ్ కణ్పాదమ్ కై కమలమ్*
పేరార నీణ్ముడినాణ్ పిన్నుమ్ మిழை పలవే. ౫.

అ॥ ఆరావముదమాయ్ - తృప్తిలేని యమృతమువలె భోగ్యభూతుఁడై, అల్ - గుణహీనుఁడనైన, (నాయొక్క) ఆవియుళ్ - మనస్సులో, కలన్ద - కలిసియున్నవాఁడై, కార్ - వర్షాకాలమందు, ఆర్ - పూర్ణమైన, కరుముగిల్పోల్ - కాళమేఘమువలెనున్న, ఎన్నమ్మాన్ - నాస్వామియైన, కణ్ణనుక్కు - కృష్ణునియొక్క, వాయ్ - అధరముతో, శెమ్బవళమ్ - ఎఱ్ఱనిపగడము, నేరా - సమానముగాదు. కణ్ - నేత్రములతోను, పాదమ్ - తిరువడికళతోను, కై - శ్రీహస్తములతోను, కమలమ్ - పద్మము, నేరా - సమానముగాదు, పేర్ - పొడవైన, ఆరమ్ - హారమున్ను, నీళ్ - దీర్ఘమైన, ముడి - కిరీటమున్ను, నాణ్ - మొలత్రాడున్ను, పిన్నుమ్ - (ఇవి మొదలైన) ఇంకనున్న, ఇழை - ఆభరణములు, పల - అసంఖ్యేయములైయున్నవి.

తా॥ సాటిలేనిసౌందర్యమున్ను, అనేకదివ్యాభరణములనున్ను గల నీలమేఘశ్యాముఁడైన శ్రీకృష్ణుడు గుణహీనుఁడనైన నాహృదయమందుఁ బ్రవేశించి నేనెంతకాలమనుభవించినను పైపైన తనయనుభవమందాశనుగలుగఁ జేసెడి పరమానందస్వరూపుఁడైయున్నాఁడని. ౫.

పలపలవే యాబరణమ్ పేరుమ్ పలపలవే*
పలపలవే శోదివడివు పణ్బెణ్ణిల్*
పలపల కణ్డుణ్డు కేట్టుత్తుత్తు మోన్దిన్బమ్*
పలపలవే ఞానముమ్ పామ్బణైమే లాఱ్కేయో. ౬.

అ॥ పామ్బణైమేలాఱ్కు - శేషశాయియొక్క, పణ్బు - స్వభావములను, ఎణ్ణిల్ - తలచినయెడల, ఆబరణమ్ - దివ్యాభరణములు, పలపల - అనేకములైయుండును, పేరుమ్ - తిరునామములున్ను, పలపల - అనేకములుగానేయుండును. శోది - తేజోరూపమైన, వడివు - దివ్యవిగ్రహములు, పలపల - అనేకములైయుండును, కణ్డు చూచియు, ఉణ్డు - సాపడియు,

కేట్టు - వినియు, ఉత్ఱు - స్పృశించియు, మోన్దు - ఆఘ్రాణించియుగలిఁగిన, ఇన్బమ్ - సుఖము, పలపల - అనేకములుగా నేయుండును, ఞానమ్ - జ్ఞానములున్ను, పలపల - అనేకములై యుండును.

తా॥ అనంతములైన తిరునామంబులనున్ను, దివ్యభూషణములనున్ను, దివ్యగుణంబులనున్ను దివ్యవిగ్రహములనున్ను, సమస్తేంద్రియముల చేఁగలిగిన జ్ఞానసుఖాదులనున్ను గల ఇట్టిపరిపూర్ణుఁడైన శేషశాయి నామనసునందుఁ బ్రవేశించి మిక్కిలి యాదరముతో వేంచేసియున్నాఁడని. ౬.

పామ్బణై మేల్ పాఱ్కడలుళ్ పళ్ళి యమర్న్దదువుమ్*
కామ్బణై తోళ్ పిన్నైక్కా యేఱుడనేழ் శెత్ఱదువుమ్*
తేమ్బణైయ శోలై మరామరమే ழிయెయ్‌దదువుమ్*
పూమ్బిణైయ తణ్దుழாయ్ ప్పొన్ముడియమ్బోరేఱే. ౭.

అ॥ పూ - అందమైన, పిణైయ - చేరికగల, తణ్ - చల్లని, తుழாయ్-తిరుత్తుழாయి మాలగల, పొన్ - ఉజ్జ్వలమైన, ముడి - కిరీటముగల, అమ్ - సుందరమైన, పోరేఱు - గర్వించి యున్నవృషభమువంటి సర్వేశ్వరుఁడు, పాఱ్కడలుళ్ - పాలసముద్రమందు, పామ్బణై మేల్ - శేషుఁడనెడిపడకమీఁద, పళ్ళియమర్న్దదువుమ్ - పవ్వళించినదియు, కామ్బణై - వెదురుతోఁబోలిన, తోళ్ - భుజములుగల, పిన్నైక్కాయ్ -నప్పిన్నైప్పిరాట్టికొఱకై, ఏఱేழ்-ఏడువృషభములను, ఉడన్ - ఒకప్పుడే, శెత్ఱదువుమ్ - సంహరించినదియు, తేన్ - తేనెనున్ను, పణైయ- శాఖలనున్ను గల, శోలై - తోపులుగానున్న, మరామరమేழ் - సాలవృక్షములేడింటిని, ఎయ్‌దదువుమ్ - కొట్టినదియు, (నానిమిత్తమైయని).

తా॥ పరత్వసూచకమైన తిరుత్తుழாయిమాలతో నలంకరింపఁబడినదివ్యకిరీటముగల సర్వేశ్వరుఁడు, క్షీరాబ్ధియందు శేషశయ్యమీఁద బవ్వళించినదియు, రామకృష్ణాద్యవతారముల యందొనర్చిన దివ్యచేష్టితములున్ను నన్నానందఁబెట్టుటకై య్యే నేసినాఁడని. ౭.

పొన్ముడియమ్బోరేత్ఱై యెమ్మానై నాత్ఱడన్దోళ్*
తన్ముడివొన్ఱిల్లాద తణ్దుழாయ్ మాలైయనై*
ఎన్ముడివు కాణాదే యెన్నుళ్ కలన్దానై*
శొన్ముడివు కాణేన్నాన్ శొల్లువదెన్ శొల్లీరే. ౮.

అ॥ పొన్ముడి - తేజోరూపమైనకిరీటముగల, అమ్ - అందమైన, పోరేత్ఱై - యుద్ధసమర్థుఁడైన, ఎమ్మానై - నాస్వామియు, తడమ్ - గొప్పవైన, నాల్ తోళ్-నాలుగుభుజములుగలవాడును, తన్ - తనమహిమకు, ముడివొన్ఱిల్లాద - ఏవిధమైననాశములేనివాఁడును, తణ్ తుழாయ్ మాలైయనై - చల్లనితిరుత్తుழாయిమాల లవాఁడును, ఎన్ - నాదోషముయొక్క, ముడివు-అంతమును, కాణాదే - చూడక, ఎన్నుళ్ - నాయందు, కలన్దానై - కలిసినవాఁడునైన శ్రియఃపతిని, నాన్ - నేను, శొల్ ముడివు - చెప్పిముగించెడివిధమును, కాణేన్ - ఎఱుఁగనేను, శొల్లువదు - చెప్పెడివిధము, ఎన్ - ఏది, శొల్లీర్ - చెప్పుఁడు.

తా॥ సంపూర్ణముగా చెప్పుటకును తెలఁచుటకు నశక్యంబులైన దివ్యగుణవిగ్రహస్వరూపములుగలవాఁడై, అపరిమితదోషయుక్తుండనైన నాహృదయమందుఁ బ్రవేశించియున్న సర్వేశ్వరునియొక్క సౌశీల్యగుణమును, ఇంతయని సంపూర్ణముగాఁ జెప్పెడివిధము నాకగోచరంబైయున్నది. ఓచేతనులారా! ఆవిధంబు మీకుఁదెలిసియున్నయెడల జెప్పుఁడని, ౮.

శొల్లీ రెన్నమ్మానై యెన్నావి యావిదనై *
ఎల్లైయిల్ శీ రెన్కరుమాణిక్క చ్చుడరై *
నల్లవముదమ్ పెఱఱ్కరియ వీడుమాయ్ *
అల్లిమల ర్విరై యొ త్తాణల్ల న్పెణ్ణల నే. ౯.

అ॥ ఎన్నమ్మానై - నాస్వామియు, ఎన్నావి - నాయాత్మకు, ఆవిదనై - అంతరాత్మయు, ఎల్లైయిల్ - అవధిలేని, శీర్ - కల్యాణగుణములుగలవాఁడును, ఎన్కరుమాణిక్కచ్చుడరై - నాకు నీలమాణిక్యమువలె ప్రకాశించుచున్నజ్యోతిస్వరూపుఁడునైన శ్రియఃపతిని, శొల్లీర్-చెప్పుడు. (ఆసర్వేశ్వరుఁడు) నల్ల - విలక్షణమైన, అముదమ్-అమృతముఁవంటివాఁడును, పెఱఱ్క - పొందుటకు, అరియ - దుర్లభమైన, వీడుమాయ్ - మోక్షమునిచ్చువాఁడును, అల్లిమలర్ - తామరపుష్పమందలి, విరై - పరిమళముతో, ఒత్తు - ఒప్పియున్నవాఁడును, ఆణల్లన్ - ఇతరపురుషులవలెగానివాఁడును, పెణ్ణలన్ - స్త్రీలవలెఁగానివాఁడునైయున్నాఁడు.

తా॥ సర్వేశ్వరుఁడు మోక్షప్రదుఁడై మిక్కిలి భోగ్యభూతుఁడైయున్న వాఁడుఁగనుక వానికీవస్తువును ఉపమానముగాదు. ఓశ్రీవైష్ణవులారా! మాకుస్వామియై నాకంతరాత్మయైనఅట్టి శ్రియఃపతియొక్క మితిలేని కల్యాణగుణంబులను మీరందరు నేకీభవించి స్తోత్రముజేయుఁడని. ౯.

ఆణల్ల న్పెణ్ణల్ల నల్లావలియుమల్లన్ *
కాణలుమాగా నుళనల్ల నిల్లైయల్లన్ *
పేణుఙ్గాల్ పేణు మురువాగు మల్లనుమామ్ *
కోణై పెరిదుడై త్తెమ్బెమ్మానై కూఱుదలే. ౧౦.

అ॥ ఆణల్లన్ - ఇతరపురుషులవలెఁగానివాఁడును, పెణ్ణలన్ - స్త్రీకానివాఁడును, అల్లా- ప్రయోజనమునకుఁదగని, అలియుమల్లన్ - నపుంసకుఁడునుగానివాఁడును, కాణలుమ్ - చూచుటకున్ను, ఆగాన్ - కనుపడనివాఁడును, ఉళనల్లన్ - (శత్రువులకు) ఉన్నవాఁడు గానివాఁడును, ఇల్లైయల్లన్ - (భక్తులకు) లేనివాఁడు గానివాఁడును, పేణుఙ్గాల్ - ఆశ్రితులాశబడినయెడల, పేణుమ్ - (వారు) ఆదరించిన, ఉరువాగుమ్ - విగ్రహముగలవాఁడును, అల్లనుమామ్ - అభక్తులకట్టివాఁడుగానివాఁడునునైన, ఎమ్బెమ్మానై - నాస్వామిని, కూఱుదల్ - చెప్పదలంచినయెడల, పెరిదు - మిక్కిలి, కోణైయుడైత్తు - ప్రయాసముగానుండును.

తా॥ స్త్రీపున్నపుంసకములు మొదలగు సమస్తవస్తువిలక్షణుండును, బాహ్యేంద్రియముల కగోచరుఁడును, భక్తులకతిసులభుండును, అభక్తులకు మిక్కిలి దుర్లభుండును, భక్తులుగోరినయవతారములను బరిగ్రహించువాఁడునైన శ్రియఃపతియొక్క మహిమను జెప్పుట మిక్కిలిప్రయాసకరము.

‡‡ కూఱుదలొన్ఱారా క్కుడక్కూత్త వమ్మానై*
కూఱుదలే మేవి క్కురుగూర్చ్చడగోపన్*
కూఱినవన్దాది యోరాయిరత్తు ళిప్పత్తుమ్*
కూఱుదల్ వల్లా రుళరేల్ కూడువర్ వైగున్దమే. ౧౧.

అ॥ ఒన్ఱు - ఒకగుణమును, కూఱుదల్ - చెప్పినను, ఆరా - సమాప్తముగాని, కుడ కూత్త - కుంభనృత్యము మొదలగుసౌశీల్యాదిగుణములుగలవాఁడైన, అమ్మానై-స్వామిని, కూఱుదల్ - చెప్పుటకై, మేవి - ఉద్యోగించి, కురుగూర్చ్చడగోపన్ - కురుకాపురికధిపతియైన నమ్మాళ్వార్లు, కూఱిన - సాయించిన, అన్దాది - పూర్వపాశురమందంతమందున్న పదమునాదిగాఁగల, ఓర్ - విలక్షణమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములనున్ను, కూఱుదల్ వల్లార్ - అనుసంధించుటకు సమర్థులైనవారు, ఉళరేల్ - ఉన్నయెడల, వైగున్దమ్ - పరమపదమును, కూడువర్ - పొందుదురు.

తా॥ ఎంతకాలమనుసంధించినను సమాప్తముగాని సౌశీల్యాదిగుణములుగల సర్వేశ్వరుని ప్రతిపాదించెడి యీతిరువాయ్మొఴి ననుసంధించువారు మోక్షమునొంది నిత్యసూరులతో సేకి భవించియుందురని ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౬-వ తిరువాయ్మొఴి.

అవతారిక:—ఈతిరువాయ్మొఴిలో, సర్వేశ్వరుఁడు తనతోసంశ్లేషించి యానందించు విధమును సాయించుచున్నారు.

‡‡ వైగున్దామణివణ్ణనే యెన్పొల్లా త్తిరుక్కుఱళా వెన్నుళ్ మన్ని*
వైగుమ్వైగల్దోఱు మముదాయవానేఱే*
శెయ్గున్దావరున్దీమై యున్నడియార్క్కు త్తీర్ త్తసురర్క్కు త్తీమైగళ్
శెయ్కున్దా*ఉన్నైనాన్ పిడిత్తేన్గొళ్ శిక్కనవే. ౧.

అ॥ వైగున్దా - ఓశ్రీవైకుంఠవాసీ! మణివణ్ణనే - మాణిక్యమువంటి చల్లనిస్వభావముగలవాఁడా! ఎన్ - (నాకుసేవసాయించిన) పొల్లా - *అందములేని, తిరుక్కుఱళా-శ్రీవామనుండా! వైగుమ్ - నడుచుచున్న, వైగల్తోఱుమ్ - కాలమంతయు. ఎన్నుళ్ - నాయందు, మన్ని - అమరియుండిన, అముదాయ - అమృతమువంటివాఁడా! వానేఱే - నిత్యసూరినిర్వాహకుఁడా! శెయ్గుమ్ - చేయబడినవియు, తావరుమ్ - విడువుటకశక్యంబులునైన, ఉన్నడియార్క్కు - నీ

*వామనునియొక్కరూపము అందమైనది అన్నయెడల దృష్టిదోషమువచ్చునని అందము లేనిదని సాయించిరి.

దానులయొక్క, తీమై - పాపములను, తీర్త్తు - తీర్చి, తీమైగళ్ - అపావనములను, అశురర్కు - అసురులయందు, శెయ్ - పోవునట్లుచేసిన, శుద్దా - పరిశుద్ధుండా! నాన్ - నేను, ఉన్నై - నిన్ను, శిక్కెన - దృఢముగా, పిడిత్తేన్ - ఆశ్రయించితిని, కొళ్ - అంగీకరించుము.

తా॥ పరమసుందరుఁడవై, మిక్కిలి భోగ్యుఁడవైన ఓ శ్రియఃపతీ! ఆశ్రితులపాపములను పోఁగొట్టెడిస్వభావముగల పరమపావనుఁడా! నిన్నుదృఢముగా నాశ్రయించినానని నమ్మి నన్ను స్వీకరింపుమని. ౧.

శిక్కెన చ్చిఱిదోరిడము మ్పుఱప్పడా త్తన్నుళ్ళే*ఉలగుగళ్
ఒక్కవేవిழுఙ్గి ప్పుగున్దాన్ పుగున్దదత్పిన్*
మిక్కఞానవెళ్ళచ్చుడర్విళక్కాయ్ త్తుళక్కఱ్ఱముదమాయ్*ఎఙ్గుమ్
పక్కనోక్కఱియా నెన్పైన్దామరై క్కణ్ణనే ౨.

అ॥ ఓరిడముమ్ - ఒకదేశమునున్న, శిఱిదు - అల్పమైన, పుఱప్పడా - విడువకుండ, ఉలగుగళ్ - లోకములను, తన్నుళ్ళే - తనలో, ఒక్కవే - ఒక్కప్పుఁడే, విழுఙ్గి - అరగించి,(ఉంచి) శిక్కెన - దృఢముగా, పుగున్దాన్ - (నాలోపల) ప్రవేశించినాఁడు. పుగున్దదత్పిన్ . ప్రవేశించినతరువాత, మిక్క - మిక్కిలి, ఞానవెళ్ళమ్ - జ్ఞానపూర్తియనెడి, శుడర్ - తేజస్సుగల, విళక్కాయ్ - జ్యోతిస్స్వరూపుఁడై, తుళక్కు*(భయజన్యంబైన)కంపము, అఱ్ఱు - లేనివాఁడై, అముదమాయ్ - అమృతమువంటివాఁడై, ఎన్ - నాయందు, (ప్రసరించుచున్న) పైమ్ - సుందరమైన, తామరై - తామరపువ్వులవంటి, కణ్ణన్ - నేత్రములుఁగలసర్వేశ్వరుఁడు, ఎఙ్గుమ్ - ఎక్కడనున్న, పక్కమ్ - పార్శ్వమందు, నోక్కు - చూచుటకు, అఱియాన్ - ఎఱుఁగనివాఁడై యున్నాఁడు.

తా॥ జగద్రక్షణము మొదలగు నితరవ్యాపారములను నొకప్పుఁడే సవరించి పరాకులేక యతిప్రేమచే నాహృదయగతుండైన సర్వేశ్వరుఁడు తనపార్శ్వమందుపచారంబులు సల్పుచున్న శ్రీభూనీళాది దివ్యమహిషులనుగూఁడ కన్నెత్తిఁజూడడని. ౨.

తామరైక్కణ్ణనై విణ్ణోర్పరవుమ్తలైమగనై*తుழாయ్విరై
ప్పూమరువుకణ్ణి యెమ్బిరానై ప్పొన్మలైయై*
నామరువి నన్నేత్తియుళ్ళివణఙ్గి నామగిழ்న్దాడ*నావలర్
పామరువినిఱ్కత్తన్ద పాన్మైయే వళ్ళలే. ౩.

అ॥ తామరైక్కణ్ణనై - కమలనేత్రుఁడును, పరవుమ్ - స్తోత్రముచేసెడి, విణ్ణోర్ - నిత్యసూరులకు, తలైమగనై - నిర్వాహకుఁడును, విరై - పరిమళమున్న, పూ - పుష్పమున్న, మరువు - అమరియున్న, తుழాయ్క్కణ్ణి - తిరుழాత్తుయిమాలగల, ఎమ్బిరానై - మాస్వామియును, పొన్మలైయై - బంగారుకొండవలె పెరిగియు ఉజ్జ్వలుండునై శ్రియఃపతిని, నామ్ - మనము,

*ఆழ்వార్లు తననువిడిచిపోదురోయేమోయని సర్వేశ్వరుఁడు భయపడియుండును. అభయమిప్పుడు లేదనుట.

మరువి - చేరి, నణ్ణు - శక్కఁగా, ఏత్తి - స్తోత్రముచేసి, ఉళ్ళి - ధ్యానించి, వణఙ్గి - సేవించి, నామ్ - మనము, మగిళ్న్దు - ఆనందించి, ఆడ - నృత్యముచేయునట్లు, నా - నాలుకయందు, అలర్ - పరవియున్న, పా - పాటలు, మరువి - (నాయందు) చేరి, నిఱ్క - నిలుచునటుల, తన్ద - కృపచేసెడి, తాన్మై - స్వభావముగల శ్రియఃపతియే, వళ్ళల్ - ఔదార్యగుణముగలవాఁడు.

తా॥ మనోవాక్కాయములచే తనన్నాశ్రయింపఁజేసుకొని మనను సంతోషింపఁజేసిన సర్వేశ్వరుఁడే తనమంగళాశాసనమునకుఁ దగిన కవిత్వమును మనకొసంగిన పరమోదారుఁడని. 3.

వళ్ళలే మదుశూదనా వెన్మరదగమ్మలై యే*ఉన్నై నిన్నై
న్దెల్ గల్ తన్ద వెన్దా యున్నై యెఙ్ఞనమ్ విడుగేఁ*
వెళ్ళమేప్పురై నిన్పుగళ్ కుడైన్దాడిప్పాడి క్కళిత్తుగన్దుగన్దు*
ఉళ్ళనోయ్ గళెల్లామ్తురన్దుయ్న్దుపోన్దిరున్దే. ౪.

అ॥ వళ్ళలే - ఉదారుఁడా! మదుశూదనా - మధువనెడివిరోధిని సంహరించినవాఁడా! ఎన్మరదగమ్మలైయే - మరకతపర్వతమువలె నాకు సేవసాయించినవాఁడా! ఉన్నై - నిన్ను, నినైన్దు - అనుసంధించి, ఎల్ గల్ - ఇతరవిషయములనుత్యజించెడిస్వభావమును, తన్ద - ఇచ్చిన, ఎన్దాయ్ - స్వామీ! వెళ్ళమేప్పురై - సముద్రమువంటి. నిన్ - నీయొక్క, పుగళ్ - గుణములను, కుడైన్దు - ప్రవేశించి, ఆడి - నృత్యముచేసి, పాడి - గానముచేసి, కళిత్తు - సంతోషించి, ఉగన్దుగన్దు - మిక్కిలిప్రీతిగలవాఁడనైయుండి, ఉళ్ళమ్ - మనస్సునందలి, నోయ్ గళెల్లామ్ - వ్యాధులన్నిఁటిని తురన్దు - విడిచి, ఉయ్న్దు - ఉజ్జీవించి, పోన్దు - సంసారులనువదలి, ఇరున్దు - భయములేనివాఁడనైయుండి, ఉన్నై - నిన్ను, ఎఙ్ఞనమ్ - ఎటుల, విడుకేఁ - విడిచెదను.

తా॥ నాకితరవిషయములయందు వైరాగ్యముగలుగఁజేసినయత్యుదారుఁడవైన ఓస్వామీ! నీయొక్కయసంఖ్యేయకల్యాణగుణంబుల ననుభవించి యహంకారమమకారము మొదలగు దోషములనుబరిత్యజించి నిర్భయుండనైయున్న నేనిప్పుఁడు నిన్నెటులవిడిచెదనని. ౪.

ఉయ్న్దుపోన్దెన్నులప్పిలాద వెన్దీవినైగళై నాశమ్ శెయ్దు*ఉన
దన్దమిలడిమై యడైన్దే న్విడువేనో*
ఐన్దుపైన్దలై యాడరవణై మేవి ప్పాఱ్కడల్ యోగనిత్తిరై*
శిన్దై శెయ్దవెన్దా యున్నైచ్చిన్దై శెయ్దు శెయ్దే. ౫.

అ॥ పాఱ్కడల్ - పాలసముద్రమందలి, ఐన్దు - ఐదుప్రకారంబులై, పై - విశాలములైయున్న, తలై - శిరస్సులుగల, ఆడు - ఆడుచున్న, అరవణై - శేషశయ్యమీఁద, మేవి - అమరికతోఁబవ్వళించియుండి, యోగనిత్తిరై - నిద్రయనెడిజగద్రక్షణోపాయమును, శిన్దైశెయ్ద - ధ్యానించుచున్న, ఎన్దాయ్ - నాస్వామీ! ఉన్నై - నిన్ను, శిన్దైశెయ్దుశెయ్దు - ఎల్లప్పుడును ధ్యానించి, ఉయ్న్దు - ఉజ్జీవించి, పోన్దు - సంసారులనువదలి, ఉలప్పిలాద - అంతములేని, వెమ్ - క్రూరమై, తీ - అగ్నివలెజ్వలించుచున్న, ఎన్ - నాయొక్క, వినైగళై - పాపములను, నాశమ్ శెయ్దు-

నశింపఁజేసి, ఉనదు - నీయొక్క, అన్దమిల్-అంతములేని, అడిమై - కైంకర్యములను, అడైన్దేన్ పొందిననేను, విడువేనో - విడుచుదునా ?

తా॥ క్షీరాబ్ధియందు శేషశాయియై జగద్రక్షణవిధంబుల నాలోచించుచున్న ఓ శ్రియః పతీ! నిన్ననవరతముధ్యానించి నాపాపములను బోఁగొట్టుకొని నీయొక్క సర్వవిధకైంకర్యములను జేయుటకు సిద్ధమైయున్న నేను నిన్నిఁక నెటుల విడిచెదనని. ౫.

ఉన్నై చ్చిన్దైశెయ్దుశెయ్దు న్నెడుమామొழி యిశై పాడియాడి*ఎన్
మున్నై త్తీవినైగళ్ ముழு వేరరిన్దనన్ యాన్*
ఉన్నై చ్చిన్దైయినాలిగழ்న్ద విరణియ నగల్ మార్వఁజీణ్ణ*ఎన్
మున్నై కోళరియే ముడియాదదెన్నెనక్కే. ౬.

అ॥ ఉన్నై - నిన్ను, శిన్దైశెయ్దుశెయ్దు - ఎల్లప్పుడును ధ్యానించి, నెడు-గొప్పదై, ఉన్ - నీవిషయమయిన, మొழி - తిరువాయ్మొழிని, మా - శ్లాఘ్యమైన, ఇశై-రాగములో, పాడి పాటలగాపాడి, ఆడి - నృత్యముజేసి, ఎన్ - నాయొక్క, మున్నై-అనాదియైన, తీవినైగళ్-పాప ములను, ముழு - సంపూర్ణముగా, యాన్ - నేను, వేరరిన్దనన్ - సమూలముగాపోఁగొట్టితిని. ఉన్నై - నిన్ను, శిన్దైయినాల్ - మనస్సులో, ఇగழ்న్ద - అనాదరించిన, ఇరణియన్ - హిర ణ్యాసురునియొక్క, అగల్ - విశాలమైన, మార్వమ్ - వక్షస్థలమును, కీణ్ణ-చీల్చినవాఁడవై, ఎన్ నాకు (సమానుఁడైనప్రహ్లాదునియొక్క) మున్నై - ఎదురుగా, (సేవసాయించిన) కోళ్ - తేజస్సు గల, అరియే - ఓనరసింహా! ఎనక్కు - నాకు, ముడియాదదు - అసాధ్యమైనది, ఎన్ - ఎది.

తా॥ నిన్ను మనస్సారనిందించిన హిరణ్యాసురుని సంహరించిన ఓనరసింహస్వామీ! ఆశ్రితపక్షపాతుఁడవైన నిన్నుధ్యానించి మంగళాశాసనముజేసి నాపాపములను సమూలముగా బోఁగొట్టుకున్న నాకసాధ్యమైన దేమున్నదని, ౬.

ముడియాదదెన్నెనక్కేలిని ముழுవేழுలగుమ్ముణ్డాన్*ఉగన్దువ
న్దడియేనుళ్ పుగున్దానగల్వానుమల్లనిని*
శెడియార్ నోయ్గళెల్లామ్ తురన్దెమర్కీழ்మేలెழுపిఱప్పుమ్*
విడియావెన్నరగత్తెన్నుమ్ శేర్దల్ మాఱినరే. ౭.

అ॥ ఏழுలగుమ్ - సప్తలోకములను, ముழு - సంపూర్ణముగా, ఉణ్డాన్ - ఆరగించిన సర్వేశ్వరుఁడు, ఉగన్దు - ప్రీతిగలవాఁడై, అడియేన్ - నాయొక్క, ఉళ్ - మనస్సునందు, వన్దు - వచ్చి, పుగున్దాన్ - ప్రవేశించెను, ఇని - ఇకమీఁద, అగల్వానుమల్లన్ - విడిచిపోవువాఁడునుగాఁడు, కీழ் - క్రిందనున్న, మేల్-పైననున్న, ఎழுపిఱప్పుమ్-ఏడుజన్మములయందుండెడి, ఎమర్ - నాసంబంధులు, శెడియార్ - చెట్లువలెనున్నపాపములచేఁగలిగిన, నోయ్గళెల్లామ్ - దుఃఖములన్నిఁటినిన్ని, తురన్దు - పోగొట్టి, విడియా - అన్తములేని, వెమ్-క్రూరమైన, నరగత్తు - నరకమందు, ఎన్నుమ్ - ఎల్లప్పుఁడును, శేర్దల్ - పొందుటను, మాఱినర్ - తిప్పుకొనిరి, ఇని-ఇక మీఁద, ఎనక్కేల్ - నాకు, ముడియాదదు - అసాధ్యమైనది, ఎన్ - ఏమియున్నది.

తా॥ సర్వేశ్వరుఁడు నన్ను విడువకుండ నాయందుఁ బ్రవేశించియుండి, నాతోఁజేరిన వారిం దరియొక్క యీ దుఃఖములను బోగొట్టి వారినుద్ధరించుచుండగా, ఇక నాకసాధ్యమైన దేమున్నదని

మాఱిమాఱి ప్పలపిఱప్పుమ్పిఱన్దు అడియై యడైన్దు ఉళ్ళమ్ తేఱి*
ఈఱిలిన్బత్తిరువెళ్ళమ్ యాన్మూழ்గినన్ *
పాఱిప్పాఱి యశురర్ దమ్ పల్ కుழாఙ్గళ్ నీఱెழ*పాయ్పఱవై యొ
న్తేఱి వీఱ్ఱిరున్దా యున్నై యెన్నుళ్ నీక్కేలెన్దాయ్. ౮

అ॥ పలపిఱప్పుమ్ - (దేవమనుష్యాది) అనేకజన్మములయందు, మాఱిమాఱిప్పిఱన్దు - మారి మారిపుట్టుచు, అడియై - నీ శ్రీపాదములను, అడైన్దు - పొంది, ఉళ్ళమ్ తేఱి - నిర్మలచిత్తుఁడనై, ఈఱిల్ - అంతములేని, ఇన్బమ్ - ఆనందమనెడి, ఇరువెళ్ళమ్ - పెద్దసముద్రమునందు, యాన్ - నేను, మూழ்గినన్ - మునిగితిని, అశురర్గళ్ - అసురులయొక్క, పల్ - అనేకవిధములైన, కుழாఙ్గళ్ - సమూహములను, పాఱిప్పాఱి - తుండుతుండుగాఁజేసి, నీఱెழ - ధూళియగునటు, పాయ్ - శత్రుసైన్యమందుఁదొరఁడుచున్న, ఒన్ఱు - ఒక్కటియైన, పఱవై - గరుత్మంతునిమీఁద, వీఱు - తనమహిమప్రకాశించునట్లు, ఏఱియిరున్దాయ్ - వేంచేసియున్న, ఎన్దాయ్ - నా స్వామీ! ఉన్నై, నిన్ను, ఎన్నుళ్ - నాహృదయములోనుండి, నీక్కేల్ - తొలగింపఁజేయవలదు,

తా॥ శత్రువులనుసంహరించెడి స్వభావముగల గరుత్మంతునిమీఁద తనపరత్వము దోఁచునటుల వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నేను లెక్కలేనిజన్మములనెత్తిన నరుఁడను. ఈమనుష్యజన్మమునెత్తి నీయొక్క నిర్హేతుకకటాక్షముచే నీతిరువడికళయందుఁజేరి సకలదుఃఖములను విడిచి పరమానంద భరితుఁడనైతినని

ఎన్దాయ్ తణ్ తిరువేఙ్గడత్తుళ్ నిన్ఱాయ్ యిలఙ్గై శెఱ్ఱాయ్*మరామరమ్
పైన్దాళేழ் ఉరువ వోరువాళికోత్త విల్లా*
కొన్దార్ తణ్ణన్దుழாయినాయ్ యముదే యున్నై యెన్నుళ్ళే కుழைత్త వెమ్
మైన్దా*వానేఱే యినియెఙ్గుప్పోగిన్ఱదే. ౯

అ॥ ఎన్దాయ్ - ఓస్వామీ! తణ్ - చల్లని, తిరువేఙ్గడత్తుళ్ - వేంకటాద్రియందు, నిన్ఱాయ్ వేంచేసియున్నవాఁడా! ఇలఙ్గై - లంకాపురిని, శెఱ్ఱాయ్ - నశింపఁజేసినవాఁడా! పై - విశాలమైన, తాళ్ - మొదలుగల, మరామరమ్ - సాలవృక్షములయొక్క, ఏழ் - ఏడింటిని, ఉరువ - రంధ్రముబడునట్లు, ఒరువాళి - ఒకబాణమును, కోత్త - ఎక్కుపెట్టఁబడిన, విల్లా - ధనుస్సుగల ఓదాశరథీ! కొన్దు - కొత్తులచే, ఆర్ - నిండియున్న, తణ్ - చల్లని, అమ్-సుందరమైన, తుழாయినాయ్ - తిరుత్తుழாయిగల శ్రియఃపతీ! అముదే - భోగ్యభూతుండా! ఉన్నై-నిన్ను, ఎన్నుళ్ళే నాలోపల, కుழைత్త - ఏకీభవింపఁజేసిన, ఎమ్మైన్దా - పరమసుందరుఁడా! వానేఱే - నిత్యసూరి నిర్వాహకుఁడా! ఇని - ఇఁకను, ఎఙ్గు - ఎక్కడికి, పోగిన్ఱదు - పోబోవుచున్నావు.

తా॥ తిరుమలయందువచ్చి వేంచేసియుండియు, అనేకదివ్యావతారంబులెత్తియొనర్చిన దివ్య చేష్టితములను నాకనుభవంబుఁజేయించియు, నన్నుదానునిగాఁజేసికొని నాహృదయమందింత పఱకుచలించక వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! ఇక నన్నువిడిచిపోవుట నీకు శక్యంబుకాదని. ౧౦

పోగిన్ఱ కాలఙ్గళ్ పోయకాలఙ్గళ్ పోగుకాలఙ్గళ్*తాయ్‌తన్దైయుయి
రాగిన్ఱా యున్నై నానడైన్దే న్విడువేనో*
పాగిన్ఱతొల్ పుగழ் మూవులగుక్కుమ్ నాదనే పరమా*తణ్వేఙ్గడ
మేగిన్ఱాయ్ తణ్డుழாయ్‌విరై నాఱు కణ్ణియనే. ౧౦

అ॥ పోగిన్ఱ కాలఙ్గళ్ - వర్తమానకాలమందును, పోయకాలఙ్గళ్ - భూతకాలమందును, పోగుకాలఙ్గళ్ - భవిష్యత్కాలమందును, తాయ్‌తన్దైయుయిరాగిన్ఱాయ్ - (నాకు) తల్లితండ్రులవలెనున్ను ఆత్మవలెనున్నున్న ఓస్వామీ! పాగిన్ఱ - వ్యాపించియున్న, తొల్ - అనాదియైన, పుగழ் - కీర్తిగలవాఁడై, మూవులగుక్కుమ్ - మూడులోకములకును, నాదనే - నాథుఁడా! పరమా - మిక్కిలిమహిమగలవాఁడా, తణ్ - చల్లని, తుழாయ్ - తులసియొక్క, విరై - పరిమళము, నాఱు - పరిమళించుచున్న, కణ్ణియనే - తిరుమాలగల శ్రియఃపతీ! ఉన్నై - నిన్ను, అడైన్దేన్ - పొందినవాఁడనైన, నాన్ - నేను, విడువేనో - విడిచెదనా?

తా॥ సర్వకాలములయందును నాకుసర్వవిధబంధుఁడవై వేంకటాచలమునందిప్పుఁడు వేంచేసియున్న సకలలోకేశ్వరుఁడనైన ఓశ్రియఃపతీ! నిన్నాశ్రయించి నీభోగ్యతయందు మగ్నుఁడనై యున్న నేను నిన్నువదలి యుండఁజాలనని. ౧౦.

** కణ్ణిత్తణ్ణన్దుழாయ్‌ముడి క్కమలత్తడమ్పెరుమ్
కణ్ణనై *పుగழ் నణ్ణి త్తెన్‌కురుగూర్ చ్చడగోపన్ మాఱన్‌శొన్న*
ఎణ్ణిల్ శోర్విలన్దాది యాయిరత్తుళ్ళివైయుమోర్ పత్తిశైయొడుమ్*
పణ్ణిల్ పాడవల్లారవర్ కేశవన్ తమరే. ౧౧

అ॥ కణ్ణి - మాలగాఁగట్టఁబడిన, తణ్ - చల్లనైన, అమ్‌తుழாయ్ - సుందరమైనతిరుత్తుழாయిమాలచే నలంకరింపఁబడిన, ముడి - కిరీటము నున్న, కమలమ్ - పద్మమువలె, తడమ్ - విశాలమై, పెరుమ్-పొడవైన, కణ్ణనై-నేత్రముఁ నున్న గల సర్వేశ్వరునియొక్క, పుగழ்-గుణములను నణ్ణి - అనుభవించి, తెన్ - సుందరమైన, కురుగూర్ - తిరునగరికధిపతియైన, మాఱన్ - శత్రువులనునిరసించెడి, శడగోపన్ - నమ్మాழ்వార్లు, ఎణ్ణిల్ - భగవదభిప్రాయమందు, శోర్విల్ - (ఒకటియు) తగ్గక, శొన్న - పాయించిన, అన్దాది - అన్దాదిరూపమైయున్న, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఓర్-అద్వితీయంబైన, ఇవై పత్తుమ్-ఈపదిపాశురములను, ఇశైయొడుమ్ - స్వరములోఁగూడ, పణ్ణిల్ - గానమందు, పాడవల్లారవర్ - పాడెడివారు, కేశవన్ తమర్-సర్వేశ్వరునికి భక్తులగుదురు.

తా॥ సర్వేశ్వరునియొక్క స్వరూపగుణవిభూత్యాదులనుయథావత్తుగా నమ్మాழ்వార్లనుభవించి, తమరనుభవించినవిధముగ పాయించిన ఈతిరువాయ్‌మొழிని స్వరయుక్తంబుగా గానము చేయువారు శ్రియఃపతికి భక్తులగుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౭ - వ తిరువాయ్మొழி.



అవతారిక:—ఈతిరువాయ్మొழிలో, సర్వేశ్వరుఁడు తననుద్ధరించినదియేగాక తనతోఁ జేరినవారందరిన్ని యుద్ధరించఁగా, వానికి తనయందున్నయట్టి ప్రీతినిజూచి సన్తుష్టులై వానియొక్క కేశవాది ద్వాదశనామముల ననుసన్ధించుచున్నారు,

‡‡ కేశవన్ తమర్ కీழ் మేలెమ రేழ்ழுపిఱప్పుమ్*
మాశదిరిదు పెత్తు నమ్ముడై వాழ்వు వాయ్క్కిన్ఱవా*
ఈశనె కరుమాణిక్క మెన్ శెజ్గోలక్కణ్ణన్ విణ్ణోర్
నాయగన్*ఎమ్బిరానెమ్మాన్ నారాయణనాలే. ౧.

అ॥ ఈశన్ - సర్వేశ్వరుఁడై, ఎన్ - నాకు సేవసాయించిన, కరుమాణిక్కమ్ - నీలమాణిక్యమువంటికాన్తిగలవాఁడై, ఎన్ - నన్ను, (వశపఱచుకొనిన,) శెమ్ - ఎఱ్ఱని, కోలమ్ - సుందరమైన, కణ్ణన్ - నేత్రములుగలవాఁడై, విణ్ణోర్ - నిత్యసూరులకు, నాయగన్ - నాథుఁడై, ఎమ్బిరాన్ నాకుపకారకుఁడై, ఎమ్మాన్ - నాస్వామియైన, నారాయణనాలే - శ్రీమన్నారాయణునిచే, కీழ் - క్రిందయు, మేల్ - పైనయు, (ఉన్న) ఏழ்ழுపిఱప్పుమ్-ఏడేడుపురుషులైన, ఎమర్ - నాతోఁజేరినవారు, కేశవన్తమర్ - శ్రియఃపతికి భక్తులయిరి. ఇదు - ఈ, మా - గొప్ప, శదిర్ - అతిశయమును, పెత్తు - పొంది, నమ్ముడై - మనయొక్క, వాழ்వు-శ్రీవైష్ణవసంపత్తు వాయ్క్కిన్ఱ - వృద్ధియయ్యెడిప్రకారము, అ - ఆశ్చర్యము.

తా॥ ఏదోయొకవిధముగా నాతోసంబంధించినవారందరును నిర్హేతుక భగవత్కటాక్షమునొందిభగవద్భక్తులైరి. నాసంబంధులకుఁగూడ నిట్టిమహదైశ్వర్యమునకుఁగారణమైన నాయొక్క శ్రీవైష్ణవసంపత్తు ఇంతయని జెప్పుటకు శక్యంబగునాయని ౧.

నారణన్ ముழுవేழுలగుక్కుమ్ నాదన్ వేదమయన్*
కారణమ్ కిరిశై కరుమ మివై ముదల్వ నెన్దై*
శిరణ్ణమరర్ పిఱర్ పలరుమ్ తొழுదేత్తనిన్ఱ*
వారణత్తై మరుప్పొశిత్త పిరానెన్ మాదవనే. ౨.

అ॥ నారణన్ - నారాయణశబ్దవాచ్యుఁడై, ముழு - సంపూర్ణములైన, ఏழுలగుక్కుమ్ సప్తలోకములకున్ను, నాదన్ - స్వామియై, వేదమయన్ - వేదమందుఁబ్రధానప్రతిపాద్యుఁడై, కారణమ్ - క్రియలకుసాధనంబులును, (అనఁగా సెయ్యిమొదలైనవి) కిరిశై - క్రియలును, (అనఁగాయాగము మొదలైనవి) కరుమమ్ - క్రియలయొక్క ఫలములును, (అనఁగాస్వర్గము మొదలైనవి) ఇవై - వీనికి, ముదల్వన్ - కారణభూతుఁడును, శిర్ - దివ్యగుణములుగల, అణ్ణు - ప్రకృతిసంబంధములేని, అమరర్ - నిత్యసూరులును, పిఱర్ - తక్కినఋషులు మొదలగు, పలరుమ్ - అందరును, తొழுదు - ఆశ్రయించి, ఏత్త - స్తుతించునటుల, నిన్ఱ - ఉండి, వారణత్తై - కువలయాపీడమనెడియేనుఁగుయొక్క, మరుప్పు - దన్తమును, ఒశిత్త - విఱిచిన, పిరాన్ - ఉపకారకుఁడునునైన, ఎన్ - నాయొక్క, మాదవన్ - శ్రియఃపతి, ఎన్దై - నాస్వామి.

తా॥ సకలలోకేశ్వరుఁడై యాగము మొదలగు కార్యములనుఁజేయించువాఁడై, స్వర్గము మొదలగు సమస్తఫలములనిచ్చువాఁడై, ఇట్టిసకలపదార్థములకును నిర్వాహకుఁడై, జ్ఞానానందము మొదలగు సమస్తగుణములుగల నిత్యసూరులచే నాశ్రయింపఁబడినవాఁడై, కృష్ణావతారమెత్తి కువలయాపీడమును సంహరించినవాఁడై, ఇట్లుసకలవేదప్రతిపాద్యుండై, శ్రియఃపతియైన శ్రీమన్నారాయణుఁడే నన్నేలినవాఁడని ౨.

మాదవన్ఱ్ఱెన్ఱదే కొణ్డెన్నై యినియిప్పాల్పట్టదు*
యాదవఙ్గళుమ్ శేర్ కొడేనెన్ఱెన్నుళ్ పుగున్దిరున్దు*
తీదవమ్ కెడుక్కుమముదమ్ శెన్దామరైక్కణ్ కున్ఱమ్*
కోదవమి లెన్కన్నల్కట్టియెమ్మాన్ ఎన్ కోవిన్దనే. ౩

అ॥ ఎన్ - నానిమిత్తమై, కోవిన్దన్ - కృష్ణుడైయవతరించినవాఁడై, ఎమ్మాన్ - నాకుస్వామియైనవాఁడు, మాదవన్ ఎన్ఱదే - మాధవుఁడుఅన్న నామాటనే, కొణ్డు - స్వీకరించి, ఎన్నై - నన్ను, ఇని - ఇకఁను, ఇప్పాల్పట్టదు - ఏ ప్రయోజికాలమంతియు, అవఙ్గళ్ - దోషములు, యాదుమ్- దేనితోనున్ను, శేర్ కొడేన్ - చేరనివ్వను, ఎన్ఱు - అనిసంకల్పించి, ఎన్నుళ్ - నాయందు, పుగున్దు- ప్రవేశించి, ఇరున్దు - ఉండి తీదు - బుద్ధిపూర్వకముగాఁజేసిన పాపములనున్ను, అవమ్ - తనంతట తానేవచ్చినపాపములనున్ను, కెడుక్కుమ్ - పోఁగొట్టెడి, అముదమ్ - భోగ్యభూతుఁడును, శెమ్ - ఎఱ్ఱని, తామరై - పద్మమువంటి, కణ్ - నేత్రములనున్ను, కున్ఱమ్ - పర్వతమువంటి విగ్రహమునున్నుగలవాఁడైన శ్రియఃపతి, కోదు - బుద్ధిపూర్వకదోషమున్ను, అవమ్ - అబుద్ధిపూర్వకదోషమున్ను, ఇల్ - లేనివాఁడై, ఎన్ - నాకు, కన్నల్కట్టి - పటికబెల్లమువలెభోగ్యభూతుఁడైయున్నాఁడు.

తా॥ కృష్ణావతారంబెత్తిన శ్రియఃపతియే నాస్వామియని జెప్పినమాత్రముచేతనే యాశ్రియఃపతి నన్నంగీకరించి నాసమస్తపాపములను బోఁగొట్టి, ఇకమీఁద నెల్లప్పుఁడును నాకేవిధమైన దుఃఖమురాకుండఁ గాపాడుచున్నాఁడని. ౩.

కోవిన్దన్ కుడక్కూత్తన్ కోవలనెన్ఱెన్ఱే కునిత్తు*
తేవుమ్ తన్నైయుమ్ పాడియాడ త్తిరుత్తి*ఎన్నైక్కొణ్డు
పావన్దన్నైయుమ్ పాఱక్కైత్తెమరేழ்ఏழ் పిఱప్పుమ్*
మేవుమ్ తన్మైయ మాక్కినాన్ వల్లనెమ్బిరా నిట్టువే. ౪

అ॥ వల్లన్ - సమర్థుండును, విట్టు - (అంతట) వ్యాపించియుండువాఁడును, ఎమ్బిరాన్- నాస్వామియునైనశ్రియఃపతి, కోవిన్దన్ - ఆవులను రక్షించువాడు, కుడక్కూత్తన్ - కుంభనృత్యముజేయువాఁడు, కోవలన్-గొల్లవాఁడు, ఎన్ఱెన్ఱే-అనిఈతిరునామములను(వేరువేరుగా)చెప్పి కునిత్తు - ప్రీతిచేనృత్యముజేసి, తేవుమ్ - పరత్వమునున్ను, తన్నైయుమ్ - సౌలభ్యమునున్ను, పాడి - గానముజేసి, ఆడ - నృత్యముజేయునట్లు, తిరుత్తి - దిద్ది, ఎన్నై - నన్ను, కొణ్డు - అంగీకరించి, ఎన్ - నాయొక్క, పావన్దన్నైయుమ్ - పాపములనున్ను, పాఱ - తునకలగునటుల,

కాత్తు - పోంగొట్టి, ఎమర్ - నాసంబన్ధులు, ఏழ்ழுకి అప్పుమ్ - సప్తపురుషులనున్ను, మేప్పుమ్ - తననుబొందెడి, తన్మైయమ్ - స్వభావముగలవారగునటుల, ఆక్కినాన్ - చేసెను.

తా॥ ఆసర్వేశ్వరుఁడు, తనయొక్క పరత్వసౌలభ్యాది సమస్తగుణముల ననుసంధించునటుల నన్ను గటాక్షించి నాపాపములను బోఁగొట్టెను. అంతయేగాక నాసంబంధులను గూఁడతననా శ్రయించునటుల కటాక్షించెనని.

విట్టిలఙ్గు శెఞ్జోది త్తామరై పాదమ్ కైగళ్ కణ్గళ్*
విట్టిలఙ్గు కరుఞ్జుడర్ మలైయే తిరువుడమ్బు*
విట్టిలఙ్గుమదియుమ్ శీర్ శఙ్గుశక్కరమ్ పరిది*
విట్టిలఙ్గుముడియమ్మాన్ మదుశూదనన్ తనక్కే. ౫

అ॥ విట్టు - వ్యాపించి, ఇలఙ్గు - ప్రకాశించుచున్న, ముడి - కిరీటముగల, అమ్మాన్ - స్వామియైన, మదుశూదనన్ తనక్కు - మధుసూదనునికి, పాదమ్ - తిరువడికళున్ను, కైగళ్ - శ్రీహస్తములున్ను, కణ్గళ్ - నేత్రములున్ను, విట్టు - వికసించి, ఇలఙ్గు - ప్రకాశించుచున్న, తామరై - పద్మమువలెనున్నవి, తిరువుడమ్బు - తిరుమేను, విట్టు - వ్యాపించి, ఇలఙ్గు - ప్రకాశించుచున్న, కరుమ్ - నల్లనైన, శుడర్ - కాన్తిగల, మలైయే - పర్వతమువలెనున్నది. శీర్ - అందమైన, శఙ్గు - శ్రీపాఞ్చజన్యము, విట్టు - వ్యాపించి, ఇలఙ్గు - ప్రకాశించుచున్న, మదియమ్ - చన్ద్రునివలెనున్నది. శక్కరమ్ - శ్రీసుదర్శనము, పరిది - (ప్రకాశించుచున్న) సూర్యునివలెనున్నది.

తా॥ నాస్వామియైనమధుసూదనుఁడు వికసించినపద్మములవంటి దివ్యావయవములనున్ను, నీలపర్వతమువలెనున్న గంభీరమైనతిరుమేనినిన్ని, చన్ద్రసూర్యులవలెఁ బ్రకాశించుచున్న శఙ్ఖచక్రములనున్ను, తేజోమయమైన దివ్యాభరణములనున్నుగలవాఁడై నాహృదయమందుఁ బ్రవేశించి వేంచేసియున్నాఁడని.

మదుశూదనైయన్ఱి మఱ్ఱిలేన ఎత్తాలుమ్ కరుమమిన్ఱి*
తుదిశూழ்న్ద పాడల్గళ్ పాడియాడని న్ఱూழியూழிతోఱుమ్*
ఎదిర్ శూழ்ల్ పుక్కెనైత్తోర్ పిఱప్పుమ్ ఎనక్కే యరుళ్గళ్ శెయ్య*
విదిశూழ்న్దదాలెనక్కేలమ్మాన్ తిరివిక్కిరమనైయే. ౬

అ॥ మదుశూదనైయన్ఱి - మధుసూదునిదక్క, మఱ్ఱు - వేరొకస్వామిని, ఇలేన్ - ఆశ్రయించినవాఁడనుగాను, ఎన్ఱు - అనితలంచి, ఎత్తాలుమ్ - తక్కినఏపురుషార్థము చేతనున్ను, కరుమమ్ - ప్రయోజనము, ఇన్ఱి - లేక, తుది - స్తోత్రముచే, శూழ்న్ద - వ్యాపించియున్న, పాడల్గళ్ - పాశురములను, నిన్ఱు - స్థిరముగానుండి, పాడి - గానముజేసి, ఆడ - ఆడునటుల, ఊழிయూழிతోఱుమ్ - ప్రతికల్పములయందును అనైత్తు - అనేకములై, ఓర్ - అద్వితీయములైన, పిఱప్పుమ్ - జన్మములయందును, ఎదిర్ - ఎదురుగా, శూழ்ల్ పుక్కు - తిరిగివచ్చి, ఎనక్కే - నానిమిత్తమయ్యే,

అరుళ్ గళ్ - ఉపకారములను, శెయ్య - చేయునటుల, ఎనక్కు - నాకు, అమ్మాన్ - స్వామియైన, తిరివిక్కిరమనై - త్రివిక్రముని, విది - భగవత్కృప, శూழ్ న్దదే - చుట్టుకొనినదియే.

తా॥ మధుసూదనుఁడే పరమప్రాప్యుఁడని నమ్మి యితరసంగములను వదలి యాసర్వేశ్వరునియొక్క గుణానుభవములుఁ జేయునటుల నన్నుదిద్దుటకై యాసర్వేశ్వరుఁడు నేనుజన్మించినప్పుడెల్లను తానున్ను యవతారములనెత్తి యనేకప్రయత్నములుఁజేయఁగా, నిర్హేతుకమైన భగవత్కృపచే త్రివిక్రముండే నాకు ప్రాప్యుండని యిప్పుడు జ్ఞానముగలిగెనని. ౯.

తిరివిక్కిరమన్ శెన్దామరైక్కణ్ ఎమ్మాన్ ఎన్ శెఙ్గనివాయ్*
ఉరువిల్ పొలిన్ద వెళ్ళైప్పళిఙ్గు నిఱత్తన నెన్ఱెన్ఱు*ఉళ్ళి
ప్పరవిప్పణిన్దు పల్లూழிయూழி నిన్ పాదపఙ్గయమే*
మరువిత్తొழுమ్ మనమే తన్దాయ్ వల్లైకాణ్ ఎన్ వామననే. ౭

అ॥ తిరివిక్కిరమన్ - త్రివిక్రముఁడు, శెమ్ - ఎఱ్ఱ, తామరై - కమలమువంటి, కణ్ - నేత్రములచే, ఎమ్మాన్ - నన్నువశపఱచుకొనిన స్వామి, శెమ్ - ఎఱ్ఱని, కని - పండువలెనున్న, వాయ్ - అధరముయొక్క, ఉరువిల్ - సౌందర్యమందు, పొలిన్ద - సమృద్ధమై, (చేరియున్న) వెళ్ళై - పరిశుద్ధమైన, పళిఙ్గు - స్ఫటికమువలెనున్న (దన్తములయొక్క), నిఱత్తన్ - సౌందర్యముగలవాఁడు. ఎన్ఱెన్ఱు - అనిచెప్పి, ఉళ్ళి - ధ్యానించి, పరవి-స్తుతించి, పణిన్దు - నమస్కరించి, పల్ - అనేకవిధములైన, ఊழிయూழி -యుగములయందును, నిన్ - నీయొక్క, పాదపఙ్గయమే - శ్రీపాదపద్మములనే, మరువి - అమరియుండి, తొழுమ్ - ఆశ్రయించెడి,మనమే - మనస్సునే, తన్దాయ్ - ఇచ్చితివి. ఎన్వామననే-ఓనావామనుఁడా! వల్లై కాణ్ - సమర్థుండవు.

తా॥ ఓవామనుఁడా! నీ తిరునామములను నేనెల్లప్పుడు ననుసంధించుచు మనోవాక్కాయములచే నీ శ్రీపాదములయందుఁ గైంకర్యము జేయుటకుఁదగినయాసక్తినిగూఁడ నాకు నీవే గలుగఁజేసితివని, ౭.

వామననే ఎన్ మరదగవణ్ణన్ తామరైక్కణ్ణినన్
కామనైప్పయన్దాయ్* ఎన్ఱెన్ఱున్ కழల్ పాడియే పణిన్దు*
తూమన త్తననాయ్ ప్పిఱవిత్తుழதి నీఙ్గ*ఎన్నై
త్తీమనఙ్గెడుత్తాయ యునక్కెన్ శెయ్ గేన్ ఎన్ శిరీదరనే. ౮

అ॥ వామనన్ - వామనుఁడా! ఎన్ - నాకుసులభుఁడైన, మరదగవణ్ణన్ - మరకతమువంటికాన్తిగలవాఁడా! తామరైక్కణ్ణినన్-పద్మమువంటినేత్రములుగలవాఁడా! కామనై - మన్మథుని, పయన్దాయ్ - పుట్టించినవాఁడా! ఎన్ఱెన్ఱు - అని పలుమారుగాఁజెప్పి, ఉన్ - నీయొక్క, కழల్ - తిరువడికళను, పాడి - గానముజేసి, పణిన్దు - నమస్కరించి, తూ - పరిశుద్ధమైన, మనత్తననాయ్ - మనస్సుగలవాఁడనై, పిఱవి - సంసారసంబంధములైన, తుழதి - దుఃఖములు నీఙ్గ - పోవునట్లు, ఎన్నై - నన్ను, తీమనమ్ - చెడుమనస్సును, కెడుత్తాయ్ - చెడగొట్టిన, ఎన్ - నాయొక్క, శిరీదరనే - శ్రీధరుఁడా! ఉనక్కు - నీకు, ఎన్ - ఏమి, (ఉపకారము) శెయ్ గేన్ - చేసెదను.

తా॥ నామనుడనియు, మన్మథునికంటె సౌందర్యవంతుఁడనియు, పద్మనేత్రుండనియు, ఇవి మొదలగు నీతిరునామముల ననుసంధించుటకు విరోధులైన నానునో దోషములను బోగొట్టిన ఓ శ్రీధరుఁడా! అందుకు నీకు నేనేమి ప్రత్యుపకారము జేసెదనని. ౮

శిరీదరన్ శెయ్యతామరైక్కణ్ణనెన్ఱెన్ఱిరాప్పగల్ వాయ్
వెరీఇ*అలమన్దు కణ్గళ్ నీర్ మల్గి వెవ్వుయిర్త్తుయిర్త్తు*
మరీఇయతీవినై మాళ ఇన్బమ్ వళర వైగల్ వైగల్
ఇరీఇ*ఉన్నై ఎన్నుళ్ వైత్తనై యెన్నిరుడీకేశనే. ౯

అ॥ ఎన్నిరుడీకేశనే - నాహృషీకేశుఁడా! శిరీదరన్ - శ్రీధరుఁడు, శెయ్యతామరైక్కణ్ణన్ - ఎఱ్ఱతామరవంటి నేత్రములుగలవాఁడు, ఎన్ఱెన్ఱు - అనియని, ఇరాప్పగల్ - రేయింబగళ్లు, వాయ్వెరీఇ - బల్పించి, అలమన్దు-నాలుగుదిక్కులలో తిరిగి, కణ్గళ్ - నేత్రములనుండి, నీర్-జలమును, మల్గి - ప్రవహింపఁజేసి, వెవ్వుయిర్త్తుయిర్త్తు - మిక్కిలినిట్టూర్పువిడిచి, మరీఇయ-(ఇట్లు) అమరియున్న, తీవినై - దుఃఖములు, మాళ - పోవునట్లును, ఇన్బమ్ - సుఖము, వళర-వృద్ధిఁబొందునట్లును, వైగల్ వైగల్ - సర్వకాలమందును, ఎన్నుళ్ - నాయందు, ఉన్నై-నిన్ను, ఇరీఇ - స్థాపించి, వైత్తనై - ఉంచితివి

తా॥ ఓ హృషీకేశుఁడా! ఇంతకాలమున్ను "ఆడియాడి" అనెడి తిరువాయ్మొழி యందు నీ విరహము చేసనుభవించిన నానకలదుఃఖమును బోగొట్టి "అన్ఱామత్తు" అనెడి తిరువాయ్మొழிయందనుభవించిన మహాసుఖముననుభవించునట్లు నామనస్సున వేంచేసియున్న నీకు నేనేమి ప్రత్యుపకారము జేసెదనని. ౯.

ఇరుడీకేశనెమ్బిరా నిలఙ్గైయరక్కర్ కులమ్*
మురుడుతీర్త్తపిరానెమ్మా నమరర్ పెమ్మా నెన్ఱెన్ఱు*
తెరుడియాగిల్ నెఞ్జే వణఙ్గు తిణ్ణమఱి యఱిన్దు*
మరుడియేలుమ్ విడేల్ కణ్డాయ్ నమ్బి పఱ్పనాబనై యే. ౧౦

అ॥ నెఞ్జే - ఓమనసా! తెరుడియాగిల్-(నీ) జ్ఞానముగలదానవైతే, ఇరుడీకేశన్ - ఇన్ద్రియములకునాథుండు; ఎమ్బిరాన్ - నాకుపకారకుఁడు, ఇలఙ్గై - లంకయందున్న, అరక్కర్ - రాక్షసులయొక్క, కులమ్ - కులమందలి, మురుడు - క్రూరుఁడైనరావణుని, తీర్త్త - చంపిన, పిరాన్ - లోకోపకారకుండు, ఎమ్మాన్ - నాస్వామి, అమరర్పెమ్మాన్ - నిత్యసూరులకు నాథుఁడు, ఎన్ఱెన్ఱు - అనిపలుమాఱనుసంధించి, వణఙ్గు - ఆశ్రయింపుము, తిణ్ణమ్ - దృఢముగా, అఱి-తెలిసికొనుము. అఱిన్దు - తెలిసికొని, మరుడియేలుమ్ - భ్రమనుబొందిన దానవైనను-నమ్బి-ఉపకారకుండైన, పఱ్పనాబనై యే - పద్మనాభునియే, విడేల్ - విడువకుము.

తా॥ ఓమనసా; హృషీకేశుఁడు, రావణాసురసంహారకుండు, అని ఇవిమొదలగు తిరునామములను జక్కఁగానెఱిఁగి, ఈతిరునామముల ననుసంధించుటకు నేనయోగ్యుండనని భ్రమనొందక యనుసంధించుచు, ఆపద్మనాభుని వదలకుండుమాయని. ౧౦

పఱ్పనాబ నుయర్వఱవుయరుమ్ పెరున్దిఱలోన్*
ఎఱ్పర నెన్నైయాక్కిక్కొణ్డెనక్కే తన్నైత్తన్ద
కఱ్పగమ్*ఎన్నముదమ్ కార్ముగిల్ పోలుమ్ వేఙ్గడనల్
వెఱ్పన్*విశుమ్బోర్ పిరా నెన్దై తామోదరనే. ౧౧

పఱ్పనాబన్ - నాభియందు పద్మముగలవాఁడును, ఉయర్వఱ - తనకంటె నితరవస్తువులకతిశయము లేకుండునట్లు, ఉయరుమ్ - వృద్ధిఁబొందుచున్న, పెరుమ్ - అధికమైన, తిఱలోన్ - బలముగలవాఁడును, ఎఱ్పరన్ - నాయందాసక్తిగలవాఁడును, ఎన్నై - నన్ను, ఆక్కిక్కొణ్డు - దాసునిగాఁజేసుకొని, ఎనక్కే - నాకే, తన్నై - తనను, తన్ద - ఇచ్చిన, కఱ్పగమ్ - కల్పవృక్షమువంటివాఁడును, ఇన్ - మధురమైన, అముదమ్ - అమృతమువంటివాఁడును, కార్ - వర్షాకాలమందున్న, ముగిల్ పోలుమ్ - మేఘమువంటివాఁడును, వేఙ్గడమ్-వేఙ్కటాద్రియనెడి, నల్ - విలక్షణమైన, వెఱ్పన్ - తిరుమలయందు వేంచేసియున్నవాఁడును - విశుమ్బోర్ - పరమపదవాసులకు, పిరాన్ - స్వామియునైన, తామోదరన్ - దామోదరుఁడు, ఎన్దై - నాస్వామి

తా॥ పరమభోగ్యుఁడై, ఆశ్రితపరతంత్రుఁడైన శ్రియఃపతి వేఙ్కటాద్రియందు నిత్యసూరులతోఁగూడ వేంచేసియుండి నన్ను వశపఱచుకొని నాకు సకలవిధకైఙ్కర్యములనిచ్చి నాయందు మిక్కిలి వ్యామోహముగలవాఁడై యున్నాఁడని.

తామోదరనైత్తనిముదల్వనై ఞాలముణ్డవనై*
ఆమో తరమఱియ వొరువర్క్కెన్ఱే తొழுమవర్గళ్*
తామోదరనురువాగియ శివఱ్కుమ్ తిశైముగఱ్కుమ్*
ఆమో తరమఱియ వెమ్మానై యెన్నాழிవణ్ణనై యే. ౧౨

అ॥ తనిముదల్వనై - అద్వితీయకారణమై, ఞాలముణ్డవనై - భూమిని మ్రింగినవాఁడైన, తామోదరనై - దామోదరునియొక్క, తరమ్ - ప్రభావమును, అఱియ - తెలిసికొనుటకు, ఒరువర్క్కు - ఒకరికైనా, ఆమో - సాధ్యంబగునా? ఎన్ఱు - అని, (నిశ్చయించి) తొழுమవర్గళ్ -ఆశ్రయించువారై, తామోదరన్ - దామోదరునికి, ఉరువాగియ - శరీరముగానున్నవారైన, శివఱ్కుమ్ - రుద్రునికిన్ని, తిశైముగఱ్కుమ్ - బ్రహ్మకున్ను, ఎన్ - నాకుసేవసాయించిన, ఆழிవణ్ణన్ - సముద్రమువంటికాన్తిగల, ఎమ్మానై - నాస్వామియొక్క, తరమ్ - మహిమను, అఱియవామో - తెలిసికొనుటసాధ్యంబగునా?

తా॥ జగత్సృష్టిసంహారకారకుఁడైన శ్రియఃపతియొక్క మహిమను మనకంటెఁ దెలిసికొనువారెవరున్నారని యభిమానముగల బ్రహ్మరుద్రులుగూడ యాభగవంతుని మహిమనెఱుఁగరని.

†† వణ్ణమామణిచ్చోదియై యమరర్తలైమగనై*
కణ్ణనై నెడుమాలైత్తెన్కురుగూర్చ్చడగోపన్*
పణ్ణియ తమిழ்మాలై యాయిరత్తుళ్ళివై పన్నిరణ్డుమ్*
పణ్ణిల్ పన్నిరునామప్పాట్టణ్ణల్తా ళణైవిక్కుమే. ౧౩

అ॥ వణ్ణమ్ - కాన్తిగల, మా - గొప్పదైన, మణి - నీలమాణిక్యమువంటి, శోదియై - తేజస్సుగలవాడై. అమరర్ - నిత్యసూరులకు, తలైమగనై - నిర్వాహకుఁడై, కణ్ణనై - ఆశ్రితసులభుఁడై, నెడుమాలై - (ఆశ్రితులయందు) మిక్కిలి వ్యామోహముగలవాఁడైయున్న శ్రియఃపతి విషయమై, తెన్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియై, శడగోపన్-నమ్మాళ్వార్లు, పణ్ణియ - చేసిన, తమిఴ్ మాలై - ద్రావిడశబ్దసందర్భములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, పణ్ణిల్ - గానమందుపాడఁదగిన, పన్నిరునామప్పాట్టు - కేశవాదిద్వాదశనామములననుసరించిసాయించిన పాశురములైన, ఇవై పన్నిరణ్డుమ్-ఈపనిరెండును, అణ్ణల్ -సర్వేశ్వరునియొక్క, తాళ్ - శ్రీపాదంబులను, అణైవిక్కుమ్ - పొందించును

తా॥సర్వేశ్వరునియొక్క కల్యాణగుణములను స్త్రీబాలులుకూఁడననుసంధించి యుజ్జీవింపునటుల పరమదయాళువైన నమ్మాళ్వార్లు ద్రావిడభాషయందు సాయించిన తిరువాయ్మొఴిలో కేశవాదిద్వాదశనామములవిషయమై సాయించిన ఈతిరువాయ్మొఴిని యనుసంధించువారు శ్రియఃపతియొక్క శ్రీపాదములను దప్పకఁబొందుదురని. ౧౩.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౮- వ, తిరువాయ్మొఴి.

---

అవతారిక:—ఈతిరువాయ్మొఴిలో, సర్వేశ్వరునియొక్క మోక్షప్రదత్వమననుభవించి ప్రీతియుక్తులై, ఓచేతనులారా! మీరుకూడ సంసారదుఃఖమును వదలి మోక్షమును బొందవచ్చును. ఈసర్వేశ్వరుని యాశ్రయించుఁడని సంసారులకుపదేశించుచున్నారు.

శ్లో॥ అణైవదరవణైమేల్ పూమ్పావైయాగమ్
పుణర్వదు*ఇరువరవర్ ముదలుమ్ తానే*
ఇణైవనామెప్పొరుట్కుమ్ వీడుముదలామ్*
పుణైవన్ పిఱవిక్కడల్ నీన్దువార్క్కే. ౧

అ॥ అణైవదు - (సర్వేశ్వరుఁడు) చేరుట, అరవు - ఆదిశేషుఁడనెడి, అణైమేల్ - శయ్యమీద, పుణర్వదు - కౌఁగలించుకొనుట, పూ - సుందరియైన, పావై - శ్రీమహాలక్ష్మియొక్క, ఆగమ్-తిరుమేనును, అవర్ - అట్టిప్రసిద్ధులైన, ఇరువర్ - బ్రహ్మరుద్రులిరువరికిని, తానే - స్వయమే, ముదలుమ్ - కారణమైయుండును, ఎప్పొరుట్కుమ్ - సమస్తవస్తువులకును, ఇణైవనామ్ - సజాతీయుఁడైయుండును. వీడు - మోక్షమునకు, ముదలామ్ - హేతువైయుండును, పిఱవి - సంసారమనెడి, కడల్ - సముద్రమును నీన్దువార్క్కు—ఈదిదాటువారికి, పుణైవన్ - తెప్పయైయుండును.

తా॥ సకల జగద్రక్షకుండై శేషశాయియైన శ్రియఃపతియే సంసారదుఃఖములనుబోఁగొట్టి మోక్షమునిచ్చువాఁడుగనుక, ఓభక్తులారా! వానినే యాశ్రయింపుఁడని ౧.

నీన్దుమ్తుయర్ప్పిఱవి యుట్పడ మఱ్ఱెవ్వెవై యుమ్*
నీన్దుమ్ తుయరిల్లా వీడుముదలామ్*
పూన్దణ్ పునల్పొయ్గై యానై యిడర్ కడిన్ద*
పూన్దణ్డుழாయెన్ఱనినాయగన్ పుణర్ప్పే. ౨

అ॥ పూ - పుష్పములనున్ను, తణ్ - చల్లని, పునల్ - జలములనున్ను గల, పొయ్గై - పుష్కరిణియందలి, ఆనై - గజేన్ద్రాళ్వారులయొక్క, ఇడర్ - దుఃఖమును, కడిన్ద - పోఁగొట్టినవాఁడై, పూ - సుందరమైన, తణ్తుழாయ్ - చల్లనితిరుత్తుழாయిమాలగలవాఁడై, ఎన్ - నాకు, తనినాయగన్ - అద్వితీయనాయకుఁడైనశ్రియఃపతియొక్క, పుణర్ప్పు-సంబంధము, నీన్దు - ఈదఁదగిన, తుయర్ - దుఃఖకరమైన, పిఱవియుట్పడ - జన్మము మొదలుగాఁగల, మఱ్ఱు - తక్కిన, నీన్దు - ఈదఁదగిన, ఎవ్వెవై - అనేకవిధములైన, తుయరముమ్-దుఃఖములును, ఇల్లా-లేని, వీడు - మోక్షమునకు, ముదలామ్ - కారణమగును.

తా॥ శ్రియఃపతిని యాశ్రయించినయెడల గజేన్ద్రాళ్వారులయొక్క దుఃఖమునుఁబోఁగొట్టినట్లు మనదుఃఖములనున్ను బోఁగొట్టి ఆశ్రియఃపతియే మోక్షమునొసంగునని. ౨.

పుణర్క్కుమయనా మழிక్కుమరనామ్*
పుణర్ త్తన్నున్దియో డాగత్తుమన్ని*
పుణర్ త్తతిరువాగి త్తన్మార్విల్ తాన్ శేర్*
పుణర్ప్పన్ పెరుమ్పుణర్ ప్పెఙ్గుమ్పులనే. 3

అ॥ తన్ - తనను, పుణర్త్త - సృజించిన, ఉన్దియోడు - నాభితోఁగూడ, ఆగత్తు-తిరుమేనియందు, మన్ని - అమరియుండి, పుణర్క్కుమ్-(లోకములను) సృజించెడి, అయనామ్-బ్రహ్మకంతర్యామియై, అழிక్కుమ్ - సంహారముజేసెడి, అరనామ్ - రుద్రునికంతర్యామియై, తన్మార్విల్ - తనవక్షస్థలమందు, పుణర్త్త - చేరియున్న, తిరువాగి - పిరాట్టిగలవాఁడై, తాన్ శేర్ - తనకుచితమైన, పుణర్ప్పన్-వ్యాపారములుగలసర్వేశ్వరునియొక్క, పెరుమ్పుణర్ప్పు-మహావ్యాపారములు, ఎఙ్గుమ్ - అంతట, పులన్ - ప్రత్యక్షసిద్ధమైయుండును.

తా॥ సృష్టిసంహారకర్తలైన బ్రహ్మరుద్రులకంతర్యామియై శ్రీమహాలక్ష్మికి వల్లభుండైనసర్వేశ్వరుఁడొనర్చిన యతిమానుషచేష్టితంబులంతట ప్రసిద్ధములైయుండునని. 3.

పులనైన్దు మేయుమ్ పొఱియైన్దు నీఙ్గి*
నలమన్దమిల్లదోర్ నాడు పుగువీర్*
అలమన్దు వీయ వశురరై చ్చెయ్దాన్*
పలమున్దుశీరిల్ పడిమినోవాదే. ౪

అ॥పులన్ - ప్రత్యక్షవిషయంబులైనశబ్దస్పర్శరూపరసగంధములు, ఐన్దు - ఐదింటిని, మేయుమ్ - గ్రహించుచున్న, పొఱి - ఇన్ద్రియములైన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులు, ఐన్దు ని -

దింటికి, (స్వాధీనముగాళ) నీఙ్గి - తొలంగి, నలమ్ - ఆనందమునకు, అన్దమ్ - అంతము, ఇల్లదు - లేని, ఓర్ - అద్వితీయమైన, నాడు - పరమపదమును, పుగువీర్ - ప్రవేశింపఁదగినవారా! అల మన్దు - వ్యాకులపడి, వీయ - నశించునటుల, అసురర్క - రాక్షసులను, శెత్త పిరాన్ - సంహరించినవానియొక్క, మున్దు - ఆరంభములోనే, పలమ్ - ఫలమువలెభోగ్యమైయున్న, శీరిల్ - కల్యాణగుణంబులయందు, ఓవాదు - ఎడతెగక, పడిమిన్ - ప్రవేశింపుఁడు,

తా॥ సంసారమునువదలి మోక్షమునిచ్ఛయించెడి ఓశ్రీవైష్ణవులారా! అసురసంహారకుఁడైన శ్రియఃపతియొక్క మధురములైన కల్యాణగుణంబులనెల్లప్పుఁడు ననుసంధింపుఁడని. ౪.

ఓవాత్తుయర్ ప్పిఱవి యుట్పడ మత్తెవ్వెవై యుమ్*
మూవా తనిముదలాయ్ మూవులగుమ్ కావలోన్*
మావాగియామైయాయ్ మీనాగి మానిడమామ్*
తేవాది తేవపెరుమా నెన్తీర్ త్తనే. ౫

అ॥ ఓవా - ఎడతెగని, తుయర్ - దుఃఖములుగల, పిఱవియుట్పడ - జన్మము మొదలైన, మత్తెవ్వెవైయుమ్ - తక్కినయన్నిఁటికిని, మూవా - అలస్యములేని, తనిముదలాయ్-అద్వితీయకారణుండును, మూవులగుమ్ - మూడులోకములకును, కావలోన్ - రక్షకుండును, తేవాది తేవర్-బ్రహ్మరుద్రులకును దేవతలైననిత్యసూరులకు, పెరుమాన్ - స్వామియు, ఎన్ - నాకు, (సంసారమునుబోఁగొట్టిన) తీర్ త్తన్ - పరిశుద్ధుండైన సర్వేశ్వరుఁడు, మావాగి - హయగ్రీవుఁడై, ఆమైయాయ్ - కూర్మమై, మీనాగి - మత్స్యమై, మానిడమామ్-మనుష్యుఁడై, (అవతరించును)

తా॥ ఈసంసారముయొక్క సృష్టిస్థితిసంహారములకుఁగారణుఁడైనశ్రియఃపతి జగద్రక్షణార్థమై మత్స్య కూర్మ వామన రామ కృష్ణ హయగ్రీవాద్యనేకావతారములను బరిగ్రహించునని.

తీర్ త్తనులగళన్ద శేవడిమేల్ పూన్దామమ్*
శేర్ త్తి యవైయే శివన్ముడిమేల్ తాన్కణ్డు*
పార్ త్తన్ తెళిన్దొழిన్ద పైన్దుழாయాన్ పెరుమై*
పేర్ త్తు మొరువరాల్ పేశక్కిడన్దదే. ౬

అ॥ తీర్ త్తన్ - పావనుండైనశ్రీకృష్ణునియొక్క, ఉలగు - లోకములను, అళన్ద - కొలిచిన శే - సుందరమైన, అడిమేల్ - శ్రీపాదములయందు, పూమ్, సుందరంబులైన, తామమ్ - మాలికలను, శేర్ త్తి - సమర్పించి, అవైయే - ఆమాలికలనే, శివన్ - రుద్రునియొక్క, ముడిమేల్-శిరస్సునందు, తాన్కణ్డు - తానుజూచి, పార్ త్తన్ - అర్జునుఁడు, తెళిన్దొழிన్ద - నిశ్చయించిన పైన్దుழாయాన్ - సుందరమైన, తిరుత్తుழாయిమాలగల శ్రియఃపతియొక్క, పెరుమై - మహిమ, పేర్ త్తుమ్ - మఱియు, ఒరువరాల్ - ఒకరిచే, పేశ - నిష్కర్షించునటుల, కిడన్దదే - ఉన్నదా?

తా॥ భారతయుద్ధమందస్త్రముకొఱకై రుద్రునికిఁబూజజేయవలయునని దలఁచిన యర్జునునికి, అపూజను నాశ్రీపాదములయందుఁ జేయమని శ్రీకృష్ణుఁడుపదేశింపఁగా, అదేవిధముగా శ్రీకృష్ణునిశ్రీపాదములను బూజించి యారాత్రియందునిద్రించుచున్న యర్జునుఁడు, కృష్ణుని

శ్రీపాదములమీద సమర్పించిన పుష్పములను స్వప్నమందు రుద్రునిశిరస్సునందుఁజూచి శ్రీకృష్ణుఁడే పరతత్త్వమని నిశ్చయించెనని. ౬.

కిడన్దిరున్దు నిన్ఱళన్దు కేழలాయ్ కీழ్ప్పు
క్కిడన్దిడుమ్* తన్నుళ్ కరక్కుముమిழுమ్*
తడమ్పెరున్దోళార త్తழువుమ్ పారెన్నుమ్
మడన్దైయై* మాల్ శెయ్గిన్ఱ మాలార్ కాణ్బారే. ౭

అ॥ కిడన్దు - (క్షీరాబ్ధియందు) పవ్వళించియు, ఇరున్దు - (పరమపదమందు) వేంచేసియుండియు, నిన్ఱు - (వేఙ్కటాద్రియందు)నిలిచియు, అళన్దు - (త్రివిక్రమావతారమునందు) కొలచియు, కేழలాయ్ - శ్రీవరాహమై, కీழ్ - క్రింద, పుక్కు - ప్రవేశించి, ఇడన్దిడుమ్ - (భూమిని) విడమఱచిచీలిసియు, తన్నుళ్ - తనలోపల, కరక్కుమ్ - దాచియుంచియు, ఉమిழுమ్ - బయలు పఱచియు, తడమ్ - విశాలములై, పెరుమ్ - దీర్ఘములైయున్న, తోళ్ - భుజములు, ఆర - నిండునట్లు, తழువుమ్ - కౌఁగలించుకొనియు, పారెన్నుమ్ - భూమియనెడి, మడన్దైయై - పిరాట్టివిషయమై, మాల్ - సర్వేశ్వరుఁడు, శెయ్గిన్ఱ - చేసిన, మాల్ - వ్యామోహమును, ఆర్ - ఎవరు, కాణ్బార్ - తెలిసికొనెదరు.

తా॥ శ్రీవైకుణ్ఠవాసియైన సర్వేశ్వరుఁడు, ప్రళయకాలమందు మహాసముద్రములో మునిగి యణ్డభిత్తిలో నంటుకొనియున్న నీజగత్తును వరాహావతారంబెత్తి యుద్ధరించి యనేకవిధములుగా సంరక్షించెనుగాన నీజగత్తుకు శ్రియఃపతియే యధిపతియని

కాణ్బారా రెమ్మీశన్ కణ్ణనై యెక్కాణుమాఱు*
ఊణ్ పేశి లెల్లా వులగు మోర్తుఱ్ఱాఱ్ఱా*
శేణ్బాలవీడో వుయిరో మఱ్ఱెప్పొరుట్కుమ్*
ఎణ్బాలుమ్ శోరాన్ పరన్దుళనా మెఙ్గుమే. ౮

అ॥ ఎమ్మీశన్ - నాస్వామియైన, కణ్ణనై - శ్రీకృష్ణుని, కాణ్బార్ - తెలిసికొనదగినవారు, ఆర్ - ఎవరు? కాణుమాఱు - తెలిసికొనువిధము, ఎన్ - ఎట్టిది? ఊణ్ - ఆహారమును, పేశిల్ - చెప్పినయెడల, ఎల్లావులగుమ్ - సమస్తలోకములున్ను, ఓర్ తుఱ్ఱు - ఒకకబళమునకు, ఆఱ్ఱా - చాలదు, శేణ్బాల - శ్రేష్ఠమైన స్వభావముగల వీడు - పరమపదమందును, ఉయిర్ - మోక్షమునొందిన జీవాత్మలయందును, మఱ్ఱు - తక్కిన, ఎప్పొరుట్కుమ్ - సమస్తవస్తువులయందును, శోరాన్ - విడవనివాఁడై, ఎఙ్గుమ్ - అంతట, పరన్దు - వ్యాపించి, ఉళనామ్ - ఉన్నవాఁడైయగును.

తా॥ ప్రళయకాలమందీజగత్తు నొకకబళముగా నెత్తి భక్షించినవాఁడై చేతనాచేతనాత్మకంబులైన సకలపదార్థములయందు వ్యాపించియున్న శ్రియఃపతియొక్క మహిమ నెవ్వరు నెఱుఁగరని. ౮.

‡‡ ఎఙ్గుముళన్ కణ్ణ నెన్ఱ మగనై క్కాయ్న్దు*
ఇఙ్గిల్లైయాలెన్ఱి ఱణియన్ తూణ్ పుడైప్ప*

అజ్గప్పొழுదే యవన్ వీయ తోన్ఱియ* ఎన్
శిజ్గప్పిరాన్ పెరుమై యారాయుమ్ శీర్ మైత్తే. ౯.

అ॥ కణ్ణన్ - సర్వేశ్వరుఁడు, ఎజ్గుమ్ - అంతట, ఉళన్ - ఉన్నాఁడు, ఎన్ఱ - అనిచెప్పిన, మగనై - కుమారుఁడైన ప్రహ్లాదుని, కాయ్న్దు - కోపగించి, ఇజ్గు - ఇక్కడ, ఇల్లైయెన్ఱు - లేఁడనిచెప్పి, తూణ్ - స్తంభమును, ఇరణియన్ - హిరణ్యాసురుఁడు, పుడైప్ప - కొట్టఁగా, అజ్గు - ఆ స్తంభమందు, అప్పొழுదే - ఆక్షణమునందే, అవన్ - ఆహిరణ్యాసురుఁడు, వీయ - నశించునటుల, తోన్ఱియ - అవతరించిన, ఎన్ శిజ్గప్పిరాన్ - నానరసింహస్వామియొక్క, పెరుమై - మహిమ, ఆరాయుమ్ - విచారింపఁదగిన, శీర్మైత్తే - స్వభావముగలదా? అల్ - ఆశ్చర్యము,

తా॥ సర్వేశ్వరుఁ డన్తట వ్యాపించియున్నాఁడని ప్రహ్లాదుఁడుఁ జెప్పఁగా నామాటకు కోపగించిన హిరణ్యాసురుఁడు తానే నిర్మించి పరిశోధించి పెట్టినయీ స్తంభమం దీశ్వరుఁడుండ లేఁడని దలంచి నా స్తంభమును గొట్టఁగా నప్పుఁడే యా స్తంభమందుపవతరించి ఆహిరణ్యాసురుని సంహరించిన నరసింహస్వామియొక్క మహిమను నొప్పుకొననివారు అహిరణ్యాసురుని యవస్థనే బొందుదురని. ౬.

శీర్మైకొళ్ వీడు శువర్క్క నరగీఱా*
ఈర్మైకొళ్ తేవర్ నడువా మఱ్ఱైప్పొరుట్కుమ్*
వేర్ ముదలాయ్ విత్తాయ్ ప్పరన్దుతనినిన్ఱ*
కార్ముగిల్ పోల్ వణ్ణ నెన్ కణ్ణనై నాన్ కణ్డేనే. ౧౦.

అ॥ శీర్మైకొళ్ - మహిమగల, వీడు - మోక్షమునున్ను, శువర్క్కమ్ - స్వర్గమునన్ను, నరగమ్ - నరకమునున్ను, ఈఱా - వీనినియంతిముగాఁగలవియు, ఈర్మైకొళ్ - అర్ద్రితగల తేవర్ - దేవతలను, నడువా - మధ్యమందుఁగలవియునైన, మఱ్ఱైప్పొరుట్కుమ్ - (ఆదియఁదున్న) తక్కినయన్నివస్తువులకును, వేర్ - సహకారి కారణుఁడును, ముదలాయ్ - నిమిత్తకారణుండును, విత్తాయ్ - ఉపాదానకారణుండునునై పరన్దు - వ్యాపించి, తని - విలక్షణుండై, నిన్ఱ - ఉన్నవాఁడును, కార్ - వర్షాకాలమందలి, ముగిల్ పోల్ - మేఘమువంటి, వణ్ణన్ - కాన్తిగలవాఁడునునైన, ఎన్ కణ్ణనై - నాస్వామిని, నాన్ - నేను, కణ్డేన్ - సేవించితిని.

తా॥ స్వర్గాదిసమస్తపురుషార్థములిచ్చువాఁడును, దేవాది సమస్తవస్తువులకు నాధారభూతుఁడును సకలజగత్కారణుండును సర్వవిలక్షణుండును నీలమేఘశ్యాముఁడునునైన యట్టిశ్రియఃపతియొక్క సేవను నేననుభవించితినని. ౧౦.

‡‡ కణ్డలజ్గళ్ శెయ్య కరుమేనియమ్మానై*
వణ్డలమ్బుమ్శోలై వழுది వళనాడన్*
పణ్డలైయిల్ శొన్నతమిழ் ఆయిరత్తిప్పత్తుమ్వల్లార్*
విణ్డలైయిల్ వీఱ్ఱిరున్దాళ్వ రెమ్మావీడే.

అ॥ శెయ్య - సుందరంబులైన, కణ్ తలజ్గళ్ - విశాలములైన నేత్రములనున్న, కరు- నీలమైన, మేని-దివ్యవిగ్రహములనున్నగల, అమ్మానై-స్వామిని, కణ్ణు-తుమ్మెదల, అలమ్బుమ్-సంచరించుచున్న, శోలై - తోఁపులుగల, వழுదివళనాడన్ - వழுదివళనాడనెడి దేశమందువేంచేసి యున్న నమ్మాழ్వార్లు - పణ్ తలైయుల్ - శ్రేష్ఠమైనగానమందు, (ఉంచి) శొన్న - పాయించిన, తమిழ் - ద్రావిడరూపమైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తు - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, విణ్ తలైయిల్ - మేలైనమోక్షముందు, వీఱ్ ఱిరున్దు - విలక్షణులైయుండి, ఎ - సర్వప్రకారముచేతను, మా - గొప్పదైన, వీడు - పరమపదమును, ఆళ్వార్ - అనుభవించుదురు.

తా॥ సుందరవిగ్రహుండైన సర్వేశ్వరుని విషయమై సమస్తవిభవములుగల దేశమందలివేంచేసి యున్న నమ్మాழ్వార్లుపాయించిన ద్రావిడభాషారూపంబులైన నీపదిపాశురముల ననుసంధించువారు నీసంసారమును వదలి మోక్షమునొంది బ్రహ్మానందము ననుభవింతురని. ౧౧.

ఆ ழ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౯- వ తిరువాయ్‌మొழி.

అవతారిక:—ఈతిరువాయ్‌మొழிలో, సర్వేశ్వరుఁడు తనకు మోక్షమివ్వవలయునని తలంచిన తలుంపునుజూచి, ఓస్వామీ! "నాకు" అని నీవు మోక్షము నిచ్చినయెడల యదనాకు మమకారమును గలుగజేయును. అది నాకుపాదేయముగాదు. నేనెచ్చటనున్నను నీకు పరతన్త్రుఁడనై యే యుండవలెను. అట్లు నన్ననుగ్రహింపుమని తనప్రాప్యమును నిష్కర్షించుచున్నారు.

‡‡ ఎమ్మావీట్టు త్తిఱముమ్ శెప్పమ్*నిన్
శెమ్మాపాదపఱ్పు త్తలై శేర్ త్తొల్లై*
కైమ్మాతున్పమ్ కడిన్దపిరానే*
అమ్మావడియేన్ వేణ్డువదీదే ౧.

అ॥ ఎ - సర్వప్రకారముచే, మా - ఉత్కృష్టమైన, వీడు - మోక్షముయొక్క, తిఱముమ్- ప్రకారమునున్న, శెప్పమ్ - చెప్పము, నిన్ - నీయొక్క, శెమ్ - ఎఱ్ఱనైన, మా - శ్రేష్ఠమైన, పాదపఱ్పు - తామరపుష్పమువంటిశ్రీపాదములను, తలై - (నా) శిరస్సుమీద, ఒల్లై - శీఘ్రముగా, శేర్ త్తు - చేర్పుము, కైమ్మా-గజేన్ద్రాழ్వారులయొక్క, తున్పమ్ - దుఃఖమును, కడిన్ద-పోగొట్టిన, పిరాన్ - ఉపకారకుండైన, అమ్మా - ఓస్వామీ! అడియేన్ - దాసుఁడనైననేను, వేణ్డువదు - కోరినది, ఈదే - ఇదియే.

తా॥ గజేన్ద్రాழ్వార్లను రక్షించిన శ్రియఃపతీ! అతిసుందరంబులైన నీశ్రీపాదములను నాశిరస్సునందుంచవలయునని కోరితప్ప అట్టియుత్కృష్టమైన పరమపదమందుఁగూడ కోరను. ౧.

ఈదే యాన్ ఉన్నై క్కొళ్వదెఞ్ఞాన్ఱుమ్* ఎన్
మైతోయ్ శోది మణివణ్ణ ఎన్దాయ్*
ఎయ్దా నిన్ కழల్ యానెయ్ద* ఞాన
క్కై తా కాలక్కழிవు శెయ్యేలే. ౨.

అ॥ ఎన్ - నాకుఁబ్రేమను గలిగించిన, మై - కాటుక, తోయ్ - చేరియున్నట్లున్న, శోది - కాన్తిగల, మణి - మాణిక్యమువంటి, వణ్ణ - సౌన్దర్యముగల, ఎన్దాయ్ - ఓస్వామీ! ఉన్నై - నిన్ను, యాన్ - నేను, ఎఞ్ఞాన్ఱుమ్ - సర్వకాలమందును, కొళ్వదు - ప్రార్థించుచున్నది, ఈదే - ఇదియే (ఎదియనగా) ఎయ్దా - పొందుటకశక్యంబైన, నిన్ - నీయొక్క, కழల్ - తిరువడికళ్ళను, యాన్ - నేను, ఎయ్ద - పొందునట్లుఁజేయుము. ఞానక్కై - జ్ఞానమనెడిహస్తమును, తా - ఇవ్వుము, కాలక్కழிవు - కాలవిలంబము, శెయ్యేల్ - చేయకుము.

తా॥ ఓశ్రియఃపతీ! నేను నీశ్రీపాదంబులను శీఘ్రముగాఁజేరునట్లు నాకు భక్తినిఁ గలుగఁజేయవలయును. ఇదితప్ప నాకేకోరిక యున్నదేదు. ఇందుకు విలంబము జేయవలదని. ౨.

శెయ్యేల్ తీవినై యెన్ఱరుళ్ శెయ్యుమ్* ఎన్
కైయార్ శక్కర క్కణ్ణపిరానే*
ఐయార్ కణ్డమడైక్కిలుమ్ నిన్ కழల్
ఎయ్యాదేత్త* అరుళ్ శెయ్ ఎనక్కే. ౩.

అ॥ తీవినై - పాపములను, శెయ్యేల్ - చేయకుము, ఎన్ఱు - అనిసంకల్పించి, ఎన్ - నాయందు, అరుళ్ - కృపను, శెయ్యుమ్ - చేయువాఁడును, కై - శ్రీహస్తమునందు, ఆర్ - అమరియున్న, శక్కరమ్ - సుదర్శనముగలవాఁడును, కణ్ణన్ - కృష్ణుఁడైయవతరించినవాఁడునైన, పిరానే - ఓఉపకారకుఁడా! ఆర్ - పూర్ణమైన, ఐ - శ్లేష్మము, కణ్డమ్ - కంఠమును, అడైక్కిలుమ్ - అణచినను, నిన్ - నీయొక్క, కழల్ - తిరువడికళ్లను, ఎయ్యాదు - శ్రమలేక, ఏత్త - స్తుతించునటుల, ఎనక్కే - నాకొకనికే, అరుళ్ శెయ్ - కృపఁజేయుము.

తా॥ చక్రధరుఁడవైన ఓశ్రియఃపతీ! నాయందుఁగృపజేసి నీదివ్యసౌందర్యమును నాకుఁ గనుపఱచి యందులోనన్ను మగ్ననిగాఁజేసికొని నాసంసారేచ్ఛను బోఁగొట్టిననీవు నాప్రాణావసానకాలమందుఁగూడ నిన్ను స్తుతించునట్లు నన్ననుగ్రహింపుమాయని. ౩.

ఎనక్కే యాట్చెయ్ ఎక్కాలత్తుమెన్ఱు* ఎన్
మనక్కే వన్దిడైవీడిన్ఱి మన్ని*
తనక్కే యాగ వెనైక్కొళ్ళుమీదే*
ఎనక్కే కణ్ణనై యాన్ కొళ్ శిఱప్పే. ౪.

అ॥ ఎక్కాలత్తుమ్ - సర్వకాలమందును, ఎనక్కే - నాకే, ఆళ్ - కైఙ్కర్యమును, శెయ్ - చేయుము, ఎన్ఱు - అనిసఙ్కల్పించి, ఎన్ - నాయొక్క, మనక్కే - మనస్సులోనే, వన్దు - వచ్చి, ఇడైవీడిన్ఱి - నడుమ విడఁజాయక, మన్ని - అమరియుండి, తనక్కే - తనకే, ఆగ - శేషభూతుం

డగునట్లు, ఎన్నై - నన్ను, కొళ్ళుమ్ - అంగీకరించిన, ఈదే - ఇదియే, ఎనక్కే - నాకుస్వామియైన, కణ్ణనై - శ్రీకృష్ణుని, యాన్ - నేను, కొళ్ - అపేక్షించెడి, శిఱప్పు - ప్రయోజనము.

తా॥ తననిర్హేతుకకృపచే నాహృదయమందుఁ బ్రవేశించి యొకక్షణము గూడ విడువా యక నివసించి నన్ను దాసునిగాఁ జేసికొనిన శ్రియఃపతిని నేను యాచించెడ దేమనఁగా, నీతిరు వడికళ్ళయందు నేనెల్లప్పుడును కైంకర్యముజేయునటుల నన్ననుగ్రహింపుమనియని. ౪.

శిఱప్పిల్వీడు శువర్క్క నరగమ్*
ఇఱప్పిలెయ్దుక వెయ్దఱ్క*యానుమ్
పిఱప్పిల్ పల్పిఱవిప్పెరుమానై *
మఱప్పొన్ఱిన్ఱి యెన్ఱుమ్మగిழ్వేనే. ౫.

అ॥ శిఱప్పిల్ - మహిమయందున్న, (మిక్కిలిమహిమగల) వీడు - మోక్షము, శువర్క్కమ్ - స్వర్గము, వరగమ్ - నరకము, (వీనిని) ఇఱప్పిల్ - మరణదశయందు, ఎయ్దుగ - పొందిననుసరే, ఎయ్దఱ్క - పొందకపోయిననుసరే, పిఱప్పు - జన్మించుటకు హేతువు, ఇల్ - లేకఁబోయినను పల్ - అనేకవిధములైన, పిఱవి - అవతారములుగల, పెరుమానై - సర్వేశ్వరుని, యానుమ్ - నేనును, ఒన్ఱు - ఒకవిధమైన, మఱప్పు - మఱుపును, ఇన్ఱి - లేక, ఎన్ఱుమ్ - ఎల్లప్పుఁడును, మగిழ్వేన్ - అనుభవించెదను.

తా॥ ఓ శ్రియఃపతీ! నేను దేహమైనను దేహముకంటె వ్యతిరిక్తమైన యాత్మనైనను, ఎటు వంటివాఁడైనను, ఎల్లప్పుఁడును నిన్ను నేననుభవించునటుల కటాక్షించుమని. ౫.

మగిழ్కొళ్ తెయ్వ ములోగమలోగమ్*
మగిழ్కొళ్ శోది మలర్న్ద వమ్మానే*
మగిழ్కొళ్ శిన్దై శొల్ శెయ్గై కొణ్డు*ఎన్ఱుమ్
మగిழ్వుఱ్ఱు ఉన్నై వణఙ్గ వారాయే. ౬.

అ॥ మగిழ్కొళ్ - సుఖముగల, తెయ్వమ్ - దేవతులు, ఉలోగమ్ - అచేతనములు, అలోగమ్, చేతనులు, మగిழ్కొళ్ - సంతోషముగల, శోది - జ్యోతిస్స్వరూపులైన చన్ద్రసూర్యులు, (ఈపదార్థములను) మలర్న్ద - సృజించిన, అమ్మానే - ఓస్వామీ! మగిழ్కొళ్ - సంతోషముగల, శిన్దై - తలఁచుటకుసాధనమైన మనస్సునున్ను, శొల్ - చెప్పుటకుసాధనమైన వాక్కున్ను, శెయ్గై - చేయుటకుసాధనమైన శరీరమునున్ను, కొణ్డు - సాధనముగాఁజేసికొని, ఎన్ఱుమ్ - ఎల్లప్పుఁడును, మగిழ్వుఱ్ఱు - ఆనన్దయుతుండనై, ఉన్నై - నిన్ను, వణఙ్గ - ఆశ్రయించునటుల, వారాయ్ - వేంచేయుమా.

తా॥ పరమదయాళువై జగత్తునుసృజించినఓస్వామీ! ఎల్లప్పుడున్ను మనోవాక్కాయములచే నీకుకైంకర్యముజేయునటుల నాముందర వేంచేసి సేవసాయింపుమని ౬.

వారా యున్తిరుప్పాదమలర్క్కీழ్*
పేరాదే యాన్వన్దడైయుమ్పడి

తారాదాయ్*ఉన్నై యెన్నుళ్ళై వ్విప్పిలెత్తుమ్
ఆరాదాయ్*ఎనక్కెన్ఱు మెక్కాలే. ౭.

అ॥ ఉన్నై - నిన్ను, ఎన్నుళ్ - నామనస్సునందు, ఎత్తుమ్ - ఎల్లప్పుడును, వైక్కిల్ - ఉంచినయెడల, ఎనక్కు - నాకు, ఆరాదాయ్ - చాలునని తృప్తిని గలుగఁజేయనివాఁడై, ఎత్తుమ్ - సర్వకాలములయందును, ఎక్కాల్ - ఎల్లప్పుడును, ఉన్ - నీయొక్క, తిరు - సుందరమైన, మలర్ - పుష్పమువంటి, పాదమ్ - తిరువడికళ్ళయొక్క, కీழ్ - అడుగును, పేరాదే - విడువకుండ, యాన్ - నేను, వన్దు - వచ్చి, అడైయుమ్పడి - ఆశ్రయించునటుల, తారాదాయ్ - అవకాశమివ్వనివాఁడా! వారాయ్ - వేంచేయుము.

తా॥ ఓ శ్రియఃపతీ! నీభోగ్యతను నాకుఁగనుపఱచి ఇదివఱకు నన్ననుభవింపఁ జేయకుండెడినీవు సర్వకాలములయందును నీశ్రీపాదములను వదలక నేనాశ్రయించియుండునటుల నాముందర వేంచేసి సేవసాయింపుమాయని. ౭.

ఎక్కాలత్తెన్దైయా యెన్నుళ్ మన్నిల్*మఱ్
ఱెక్కాలత్తిలుమ్ యాదొన్ఱుమ్ వేణ్డేన్*
మిక్కార్వేద విమలర్ విழுங్గుమ్*ఎన్
అక్కారక్కనియే యున్నై యానే. ౮.

అ॥ మిక్కార్ - ఉత్కృష్టులై, వేదమ్ - వేదమందుఁ బ్రతిపాదింపఁబడిన, విమలర్ - పరిశుద్ధులైన నిత్యసూరులచే, విழுங్గుమ్-అనుభవింపఁబడినవాఁడవై, ఎన్-నాకు, అక్కారమ్-శర్కరవంటివాఁడవై, కనియే-ఫలమువంటివాఁడవైన ఓ శ్రియఃపతీ! ఎక్కాలత్తు-సర్వకాలములయందును, ఎన్దైయాయ్ - నాకుస్వామియై, ఎన్నుళ్ - నాహృదయమందును, మన్నిల్-నిత్యవాసముచేసినయెడల, ఎక్కాలత్తిలుమ్ - ఏకాలమందును, మఱ్ఱు - ఇదిఁదప్ప, యాదొన్ఱుమ్ - ఏవస్తువునుగూఁడ, ఉన్నై - నిన్ను, నాన్ - నేను, వేణ్డేన్ - కోరను.

తా॥ సర్వకాలములయందును నాకుస్వామియైన ఓ శ్రియఃపతీ! నిత్యసూరిభోగ్యుండవైన నీవెల్లప్పుడును నామనస్సునందమరికతో వేంచేసియున్నయెడల నింతకంటె నేను గోఁరదగిన ప్రయోజనము లేమి లేవని. ౮.

యానే యెన్నై యఱియగిలాదే*
యానేయెన్దనదే యెన్ఱిరున్దేన్*
యానేనీ యెన్నుడైమైయుమ్ నీయే*
వానేయేత్తు మెమ్వానవరేఱే. ౯.

అ॥ వానే - పరమపదవాసులందరిచే, ఏత్తుమ్ - స్తోత్రముచేయఁబడిన, ఎమ్వానవర్ - మననిత్యసూరులకు, ఏఱే - స్వామియైన ఓ శ్రియఃపతీ! యానే - నేను, ఎన్నై - నన్ను, అఱియగిలాదే - తెలిసికొనక, యానే - నేనుస్వతంత్రుఁడను, ఎన్దనదే - ఇవినావస్తువులు, ఎన్ఱు - అనితలఁచి, ఇరున్దేన్ - (అహంకారమమకారములుఁగలవాఁడనై) ఉంటిని. యానే - నేను, నీ-నీకుఁబరతంత్రుఁడను, ఎన్నుడైమైయుమ్ - నావస్తువులును, నీయే - నీవే.

తా॥ నిత్యసూరిసేవ్యుడవైన ఓ శ్రియఃపతీ! నీ శేషభూతుడనైన నేను స్వాతంత్ర్యమును నింతకాలము దలిర్చి అహంకారమమకారములతో నశించిపోతినని. ౯

ఏఱేழ్ మ్ వెన్ఱేర్కొళిలఙ్గై యై*
నీఱేశెయ్ద నెడుఞ్జుడర్ చ్చోది*
తేఱేలెన్నై యున్పొన్నడి చ్చేర్త్తొల్లై
వేఱేపోగ వెజ్ఞాన్ఱుమ్ విడలే. ౧౦.

అ॥ ఏఱు - వృషభములు, ఏழுమ్ - ఏడింటిని, వెన్ఱు - జయించి, ఏర్కొళ్ - సౌన్దర్యముగల, ఇలఙ్గైయై - లంకాపురిని, నీఱేశెయ్ద, భస్మముగా జేసిన, నెడుఞ్జుడర్ - మిక్కిలి తేజస్సుగల, శోది - ఉజ్జ్వలమైన దివ్యవిగ్రహముగల ఓస్వామీ! ఎన్నై - నన్ను, తేఱేల్ - నన్ను రక్షించుగొనుటకు నేను సమర్థుండనని దలచక, ఉన్ - నీయొక్క, పొన్నడి - సుందరములైన తిరువడికళ్ళయందు, ఒల్లై - శీఘ్రముగా, శేర్త్తు - చేర్చుకొని, వేఱేపోగ - వేరు విషయములను దలచిపోవునట్లు, ఎఞ్ఞాన్ఱుమ్ - ఎల్లప్పుడును, విడల్ - విడువకుము.

తా॥ రామకృష్ణాద్యవతారంబు లెత్తి దుష్టులను సంహరించిన ఓ శ్రియఃపతీ! నీవిచ్చిన జ్ఞానముచే నీడుజ్జీవిందునని దలచి నన్ను విడువక నాకు సంసారేచ్ఛను బోగొట్టి నీ శ్రీపాదములయందుఁ జేర్చుకొని నీకు నిత్యకైఙ్కర్యము జేయునటుల నన్ననుగ్రహింపుమాయని. ౧౦.

✽✽ విడలిల్ శక్కర త్తణ్ణలై మేవల్*
విడలిల్ వణ్ కురుగూర్ చ్చడగోపన్ శొల్*
కెడలిలాయిరత్తుళ్ళివై పత్తుమ్*
కెడలిల్ వీడుశెయ్యుమ్ కిళర్ వార్క్కే. ౧౧

అ॥ విడలిల్ - (ఆశ్రితులను) విడువని, శక్కరత్తు - సుదర్శనముగల అణ్ణలై - స్వామిని, మేవల్ - ఆశ్రయించి, విడలిల్ - విడవకుండుండేడి, వణ్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్ - సాయించిన, కెడలిల్ - (తననను సంధింపువారికి) కీడురాకుండరక్షించెడి, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవ్వపత్తుమ్ - ఈపది పాశురములు, కిళర్వార్క్కు - ఆదరముతో ననుసంధించువారికి, కెడలిల్ - దోషములేని, వీడు - మోక్షమును, శెయ్యుమ్ - ఇచ్చును.

తా॥ చక్రధరుడైన శ్రియఃపతిని దృఢముగానాశ్రయించిన నమ్మాళ్వార్లు, సాయించిన, సకలపాపహరమైన యీతిరువాయ్మొழிననుసంధించువారు నిర్దుష్టమైనమోక్షమును బొందుదురని.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౧౦-వ తిరువాయ్మొழி.

అవతారిక:—ఈతిరువాయ్మొழிలో, ఆழ்వార్లు, ఈశరీరావసానము వఱకుఁ గూడ సహింపకనిప్పుడే కైఙ్కర్యము జేయవలయుననెడి తనకోరికను నెరవేర్చుటకై సర్వేశ్వరుఁడు

వచ్చి తిరుమాలిరుఞ్జోలై యనెడి దివ్యదేశమందు వేంచేసియుండగా నచ్చట నా శ్రియఃపతిన్ని యా పర్వతమును నను భవించుచున్నారు.

‡‡ కిళరొళి యిళమై కెడువదన్ మున్నమ్*
వళరొళి మాయోన్ మరువియ కోయిల్*
వళరిళమ్బొఴిల్ శూఴ్ మాలిరుఞ్జోలై*
తళర్విలరాగిల్ శార్వదు శదిరే. ౧.

అ॥ కిళర్ - వృద్ధిఁబొందుచున్న, ఒళి - తేజస్సుకుఁగారణమైన, ఇళమై - పడుచుతనము, కెడువదన్మున్నమ్ - చెడిపోవుటకుమునుపు, వళర్ - వృద్ధిబొందుచున్న, ఒళి - కాన్తిగల, మాయోన్ - ఆశ్చర్యభూతుఁడైన సర్వేశ్వరుఁడు, మరువియ - అమరివేంచేసియున్న, కోయిల్ - దివ్యస్థానంబై, వళర్ - పెరుగుచున్న, ఇళమ్ - లేతయైన, పొఴిల్ - తోటలచే, శూఴ్ - చుట్టబడిన, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయనెడి దివ్యదేశమును, తళర్వు - ఆయాసము, ఇలరాగి - లేనివారై, శార్వదు - ఆశ్రయించుట, శదిర్ - పురుషార్థము.

తా॥ ఓభక్తులారా! మీశరీరము దృఢముగానున్నప్పుడే, సమస్తకల్యాణగుణాకరుఁడైన శ్రియఃపతికి వాసస్థానమైన తిరుమాలిరుఞ్జోలైయనెడి పర్వతము నాశ్రయించుఁడియని ౧.

శదిరిళమడవార్ తాఴ్చ్చియై మదియాదు*
అదిర్కురల్శఙ్గత్తు అఴగర్తమ్ కోయిల్*
మదితవఴ్ కుడుమి మాలిరుఞ్జోలై
పదియదువేత్తి యెఴువదు పయనే. ౨.

అ॥ శదిర్ - సుందరులైన, ఇళమడవార్ - యౌవనముగలస్త్రీలు, తాఴ్చ్చియై - (మీయందుఁజేసెడి) ప్రావణ్యమును, మదియాదు - తలఁచక, అదిర్ - శబ్దించుచున్న, కురల్ - కంఠముగల, శఙ్గత్తు - శ్రీపాఞ్చజన్యముగల, అఴగర్ - అఴగరనెడి తిరునామముగల శ్రియఃపతికి, తమ్కోయిల్ - అసాధారణమైన వాసస్థానమై, మది - చన్ద్రుఁడు, తవఴ్ - దోఁగాఁడుచు పోవుచున్న, కుడుమి - శిఖరముగల, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలైయనెడి, అదు - ఆ, పది - దివ్యదేశమును, ఏత్తి - స్తుతించి, ఎఴువదే - ఉజ్జీవించుటయే, పయన్ - ప్రయోజనము.

తా॥ స్త్రీలయొక్క సౌన్దర్యములనున్ను చేష్టితములనున్ను జూచి మోహింపక, అత్యున్నతమై అఴగరుకు వాసస్థానంబైయున్న తిరుమాలిరుఞ్జోలయనెడి దివ్యదేశమును మనోవాక్కాయములచే నాశ్రయించి యుజ్జీవించుము. ఇదియేమనకు పరమ ప్రయోజనమని. ౨

పయనల్ల శెయ్దు పయనిల్లై నెఞ్జే*
పుయల్ మఴై వణ్ణర్ పురిన్దుఱై కోయిల్*
మయల్ మిగు పొఴిల్ శూఴ్ మాలిరుఞ్జోలై*
అయన్మలై యడైవ దదుకరుమమే. 3.

అ॥ నెఞ్జే - ఓమనసా! పయనల్ల - ప్రయోజనములేని వ్యాపారములను, శెయ్దు - చేసి, పయనిల్లై - ప్రయోజనములేదు. పుయల్ - వర్షించుచున్న, మఴై - మేఘమువంటి, వణ్ణర్ -

కాన్తినగల శ్రియఃపతి, పురిన్దు - ఆశపడి, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, కోయిల్ - కోవి లయై - మిగు-మిక్కిలి, మయల్ -(చీకటిచే) మోహమును గలుగఁజేయుచున్న, పొழிల్-తోట లచే, శూழ் - వ్యాప్తమైన, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయొక్క, అయల్-పక్కనున్న, మలై - పర్వతముయొక్క, అడైవదువే - ఆశ్రయణమే, కరుమమ్ - చేయఁదగినది,

తా॥ ఓమనసా! సారములేని యర్థకామాదులనువిడిచి, నీలమేఘశ్యాముడైన అழగర నెడి పెరుమాళ్ళకువాసస్థానమై సమృద్ధములైన తోటలుగల తిరుమాలిరుఞ్జోలయొక్క సమీపమందున్న పర్వతము నాశ్రయించుటయే మనకు స్వరూపానురూపమైన వ్యాపారమని తలంపుమాయని. 3.

కరుమవన్ పాశమ్ కழிత్తుழన్ఱుయ్యవే*
పెరుమలై యెడుత్తాన్ పీఱుఱై కోయిల్*
వరుమழைతవழுమ్ మాలిరుఞ్జోలై *
తిరుమలై యదువే యడైవదు తిఱమే. ౪.

అ॥ వన్ - క్రూరములైన, కరుమమ్ - కర్మములనెడి, పాశమ్ - బంధమును, కழிత్తు - పోఁగొట్టి, ఉழన్ఱు - (కైఙ్కర్యార్థమై) సంచరించి, ఉయ్యవే - ఉజ్జీవించుటకరయ్యే, పెరు - గొప్ప, మలై - గోవర్ధనపర్వతమును, ఎడుత్తాన్ - ఎత్తిన శ్రీకృష్ణుఁడు, పీఱు - తనమహిమ, ఉఱై - ప్రకాశించునటుల వాసముజేయుచున్న, కోయిల్ - స్థానమై, వరు - వచ్చుచున్న, మழை - మేఘములు, తవழுమ్ - దోఁగాఁడుచున్న, మాల్ - పెటిగినదియు, ఇరుమ్ - వ్యాపించియున్నదియునైన, - శోలై - తోపులుగల, తిరుమలైయదువే - అతిరుమాలిరుఞ్జోలయనెడి పర్వతమునే, అడైవదువే - ఆశ్రయించుటయే, తిఱమ్ - చేయఁదగినఁ ప్రకారము.

తా॥ మనము సంసారబంధమును వదలి తన నాశ్రయించి కైఙ్కర్యము జేయుటకొఱ కర్యేపరమదయాళువైన శ్రియఃపతి వచ్చి వేంచేసియున్న అత్యున్నతమైన తిరుమాలిరుఞ్జోల యనెడి పర్వతము నాశ్రయించుటయే చేతనులుఁ జేయఁదగినకృత్యమని. ౪.

తిఱముడై వలత్తాల్ తీవినై పెరుక్కాదు*
అఱముయలాழி ప్పడైయవన్ కోయిల్*
మఱుఇల్ వణ్ శునై శూழ் మాలిరుఞ్జోలై *
పుఱమలై శార ప్పోవదు కిఱియే. ౫.

అ॥ తిఱముడై - సమూహముగల, (మిక్కిలి) వలత్తాల్ - బలముచే, తీ - క్రూరమైన, వినై - పాపములను, పెరుక్కాదు, వర్ధింపక, అఱమ్ - (ఆశ్రితరక్షణమనెడి) ధర్మమందు, ముయల్ - ప్రయత్నముజేయుచున్న, ఆழி - చక్రమును, పడైయవన్ - ఆయుధముగాఁగల సర్వే శ్వరునికి, కోయిల్ - వాసస్థానమై, మఱు - (బుఱదమొదలగు) దోషములు, ఇల్ - లేని, వణ్-సుందరమైన, శునై-జలలు, శూழ்-వ్యాపించియున్న, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోల యొక్క, పుఱమలై - బైటపర్వతమును, శార - పొందుటకు, పోవదు - పోవుట, కిఱి - మంచి యుపాయము.

తా॥ సంసారమందాశగలవారై మీసామర్థ్యముచే పాపములనుజేయక, ఆశ్రితరక్షకులైన, సుదర్శనాద్యాయుధములు గాఁగల శ్రియఃపతికి వాసస్థానమై రమణీయములైనకొండ చరియలతో నిండియున్న తిరుమాలిరుఞ్జోలపర్వతముతో సంబంధించిన పర్వతము నాశ్రయించుటయే మనకు స్వరూపానురూపమైన యుపాయమని, ౫.

కిఱియెననిన్నై మిన్ కీழ్మై శెయ్యాదే*
ఉఱియమర్ వెణ్ణె యుణ్డవన్ కోయిల్*
మఱియొడు పిణై శేర్ మాలిరుఞ్జోలై*
నెఱిపడవదువే నినైవదు నలమే. ౬.

అ॥ కీழ్మై - (తుచ్ఛమైన) విషయములయం దాసక్తిని, శెయ్యాదే - చేయక, ఉఱి- ఉట్టియందు, అమర్ - ఉంచియున్న, వెణ్ణెయ్ - వెన్నను, ఉణ్డవన్ - ఆరగించిన కృష్ణునికి, కోయిల్ - స్థానమై, పిణై - జింకలు, మఱియొడు - తనపిల్లలతోఁగూడ, శేర్ - చేరియున్న, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయొక్క, నెఱి - మార్గము, పడ - (మనస్సులో) నిలుచునటుల, అదువే - ఆమార్గమునే, నినైవదు - తలఁచుట, నలమ్ - పురుషార్థము; (దీనిని) కిఱి- మంచియుపాయము, ఎన - అని, నినైమిన్ - తలంచుడి,

తా॥ ఓభక్తులారా! మీరు తుచ్ఛమైన సంసారమందాశనువదలి, నవనీతచోరుఁడైన శ్రీకృష్ణుఁడు వాసముజేయుచున్న తిరుమాలిరుఞ్జోలకు పొయ్యెడిమార్గము నెల్లప్పుడును తలఁచుటయే మనస్వరూపమునకుఁ దగిన యుపాయమని దలంచియుండుడియని. ౬.

నలమెన నినైమిన్ నరగழுన్దాదే*
నిలమునమిడన్దాన్ నీడుఱై కోయిల్*
మలమఱుమది శేర్ మాలిరుఞ్జోలై*
వలముఱై యెయ్‌ది మరువుదల్ వలమే ౭.

అ॥ నరగు - సంసారమనెడి నరకమందు, అழுన్దాదే - మగ్నులైయుండక, నిలమ్ - భూమిని, మునమ్ - మును పు, ఇడన్దాన్ - (వరాహావతారమందు అండభిత్తినుండి) వేరుపఱచి యెత్తిన సర్వేశ్వరుఁడు, నీడుఱై - నిత్యవాసముజేయుచున్న, కోయిల్ - స్థానమై, మలమఱు - కళంకములేని, మది - చంద్రుఁడు, శేర్ -చేరియున్న, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలను, వలమ్ - యోగ్యమైన, (తనస్వరూపానురూపమైన), ముఱై - ప్రకారముచే, ఎయ్‌ది -పొంది, మరువుదల్ - నిత్యవాసముజేయుటయే, వలమ్ - శ్రేష్ఠము; (ఈవిషయమును) నలమెన -పరమప్రయోజనమని, నినైమిన్ - తలఁచుఁడు.

తా॥ ఓభక్తులారా ! మీరు నరకప్రాయమైన సంసారమునువదలి, వరాహావతారంబెత్తి భూమినుద్ధరించిన సర్వేశ్వరుఁడు నిత్యవాసముజేసెడి, చన్ద్రమణ్డలమువఱకుఁ బెఱిగియున్న తిరుమాలిరుఞ్జోలయందు మిక్కిలి యాదరముతో వాసముజేయుటయే యుత్కృష్టమైన పురుషార్థమని తలంచియుండుడియని. ౭.

వలమ్ శెయ్దువైగల్ వలమ్‌కழியాదే*
వలమ్ శెయ్యు మాయమాయవన్ కోయిల్*
వలమ్ శెయ్యుమ్ వానోర్ మాలిరుఞ్జోలై*
వలమ్ శెయ్దునాళుమ్ మరువుదల్ వழక్కే. ౮.

అ॥ వలమ్ - సామర్థ్యమును, శెయ్దు - సంపాదించి, వైగల్ - ఎల్లప్పుడును, వలమ్ - ఆ బలమును, కழியాదే - సంసారమందుఁ బోగొట్టక, వలమ్ శెయ్యుమ్ - (ఆపర్వతమందు) ప్రదక్షిణముగా సఞ్చరించుచున్న, మాయన్ - ఆశ్చర్యభూతుండైన, ఆయవన్ - గోపాలుఁడైన శ్రియఃపతికి, కోయిల్ - స్థానమును, వానోర్ - నిత్యసూరులు, వలమ్ శెయ్యుమ్ - ప్రదక్షిణముజేయుచున్నదియునైన, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలను, నాళుమ్ - ప్రతిదినమును, వలమ్ శెయ్దు - ప్రదక్షిణముజేసి, మరువుదల్ - పొందియుండుటయే, వழக்கு - న్యాయము.

తా॥ ఓ చేతనులారా! భగవత్కైఙ్కర్యముజేయుటకుఁ దగిన శరీరమునెత్తి యాశరీరమును సంసారమందుఁ బాడుజేయక, నిత్యసూరులతోఁగూడ సర్వేశ్వరుఁడు సఞ్చరించుచున్న తిరుమాలిరుఞ్జోలను ప్రదక్షిణము జేయుచుండుటయే మనకు యోగ్యమని దలంచియుండుడియని, ౮.

వழக்కెననినైమిన్ వల్వినై మూழ்గాదు*
అழక్కొడియట్టా నమర్ పెరుఙ్గోయిల్*
మழక్కళిత్తినమ్ శేర్ మాలిరుఞ్జోలై*
తొழக్కరుదువదే తుణివదుశూదే. ౯.

అ॥ వల్ - క్రూరములైన, వినై - పాపములయందు, మూழ்గాదు - మునుగియుండక, అழమ్ - పిశాచియైన, కొడి - పూతనయనెడుస్త్రీని, అట్టాన్ - సంహరించినశ్రీకృష్ణుఁడు, అమర్ - నిత్యవాసముజేయుచున్న, పెరుమ్‌కోయిల్ - గొప్పస్థానమై, మழమ్ - బాల్యావస్థయందున్న, కళిఱు - ఏనుఁగులయొక్క, ఇనమ్ - గుంపులు, శేర్ - చేరియున్న, మాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలను, తొழ - ఆశ్రయింపవలయునని, కరుదువదు - తలంచుటకు, తుణివదే - నిశ్చయించుటయే, శూదు - (సంసారమును) జయించుటకుహేతువు, (ఇదియే) వழக்கு - న్యాయము; ఎన - అని, నినైమిన్ - తలంచుడి.

తా॥ ఓ చేతనులారా! మీదుఃఖములను బోగొట్టుకోవలయునని మీరుదలఁచినయెడల, ఇక మీఁదఁ బాపమునుజేయక, ఏనుఁగులు గుంపులుగుంపులుగా సఞ్చరించుచున్న శ్రియఃపతియొక్క వాసస్థానమైనతిరుమాలిరుఞ్జోలనాశ్రయించుటకాశబడుటయేమంచియుపాయమని తెలిసికొనుఁడని.

శూదెన్ఱుకళవుమ్ శూదుమ్ శెయ్యాదే*
వేదమున్విరిత్తాన్ విరుమ్బియకోయిల్*
మాదుఱుమయిల్ శేర్ మాలిరుఞ్జోలై*
పోదవిழ்మలైయే పుగువదుపొరుళే. ౧౦.

అ॥ కూడెన్ఱు - ధనసంపాదనకిదియేయుపాయమనిదలంచి, కళవుమ్ - దొంగతనమునున్ను, కూదుమ్ - జూదమునున్ను, శెయ్యాదే - చేయక, వేదమ్ - వేదమును, మున్ - మునుపు, విరిత్తాన్ - ప్రకాశింపఁజేసినశ్రియఃపతి, విరుమ్బియ - ఆశబడిన, కోయిల్ - స్థానమై, మాదు - తనవాడపక్షితో, ఉఱు - చేరియున్న, మయిల్ - మయూరములు, శేర్ - సఞ్చరించుచున్న, మాల్ - పెఱిగియు, ఇరుమ్ - నాలుగుపక్కలయందునువ్యాపించియున్న, శోలై - తోటలనున్ను, అవిழ் - వికసించియున్న, పోదు - పుష్పములనున్నుగల, మలైయే - తిరుమాలిరుఞ్జోలయనెడిపర్వతమునే, పుగువదు - ప్రవేశించుట, పొరుళ్ - పురుషార్థము.

తా॥ ఓచేతనులారా! మీరు తుచ్ఛమైన ద్రవ్యముకొఱకై పాపమునుజేయక దానియందు నిరాశజేసి, అనేకవిధంబులైన పక్ష్యాదులతోనిండి ప్రకాశించుచున్న తిరుమాలిరుఞ్జోలయనెడి దివ్యదేశమునందు నివసించుటయే పురుషార్థమనినిశ్చయించుడియని ౧౦.

‡‡ పొరుళెన్ఱివ్వులగమ్ పడైత్తవన్ పుగழ் మేల్ *
మరుళిల్ వణ్ కురుగూర్ వణ్ శడగోపన్ *
తెరుళ్ కొళ్ళచ్చొన్న ఓరాయిరత్తుళిప్పత్తు *
అరుళుడైయవన్ తాళ్ అణైవిక్కుమ్ముడిత్తే. ౧౧

అ॥ పొరుళ్ - (సంసారులనువశపఱచుకొనడమనెడి) ప్రయోజనము, (కలుగును). ఎన్ఱు - అనిదలఁచి, ఇవ్వులగమ్ - ఈలోకమును, పడైత్తవన్ - సృజించిన సర్వేశ్వరునియొక్క, పుగழ் మేల్ - కీర్తివిషయమై, మరుళ్ - అజ్ఞానము, ఇల్ - లేనివారై, వణ్ - సున్దరమైన, కురుగూర్ - తిరునగరికిస్వామియై, వణ్ - ఉదారులైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, తెరుళ్ - తత్త్వజ్ఞానము, కొళ్ళ - (చేతనులకు) కలుగునటుల, శొన్న - సాయించిన, ఓర్ - అద్వితీయంబులైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తు - ఈపదిపాశురములును, ముడిత్తు - సంసారమునుబోగొట్టి, అరుళుడైయవన్ - దయావంతుఁడైనశ్రియఃపతియొక్క, తాళ్ - శ్రీపాదములను, అణైవిక్కుమ్ - చేర్చును.

తా॥ సంసారులకు హస్తపాదాద్యవయవములనిచ్చి వానిచే వారుజేసెడికైఙ్కర్యమును దానఙ్గీకరించి వారికిమోక్షమివ్వవలయునని దలంపుతో నీజగత్తును సృజించినశ్రియఃపతివిషయమై నమ్మాழ்వార్లు సాయించిన యీపదిపాశురముల ననుసన్ధింపువారు సంసారమును గడచిశ్రియఃపతి యొక్కశ్రీపాదములఁ జేరుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౨. వ, పది సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్‌మొழி లిరువదింటికి పాశురములు ౨౨౨

## 3- వ, పత్తు, ౧ - వ, తిరువాయ్మొழி.

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, తిరుమాలిరుఞ్జోల యను దివ్య తిరుమలయందు వేంచేసియున్న సుందరబాహువుయొక్క సర్వావయవసౌన్దర్యముల ననుభవించుచున్నారు.

‡‡ ముడిచ్చోదియా యునదుముగచ్చోది మలర్న్దదువో*
అడిచ్చోది నీనిన్ఱ తామరైయా యలర్న్దదువో*
పడిచ్చోది యాడైయొడుమ్ పల్ కలనాయ్*నిన్ పైమ్బొన్
కడిచ్చోది కలన్దదువో తిరుమాలే కట్టురైయే. ౧.

అ॥ ఉనదు - నీయొక్క, ముగమ్ - ముఖముయొక్క, శోది-కాన్తి, ముడిచ్చోదియాయ్-కిరీటకాన్తిరూపముగా, మలర్న్దదువో - వ్యాపించినదా; అడి - శ్రీపాదములయొక్క, శోది - కాన్తి, నీనిన్ఱ - నీవు వేంచేసియున్న, తామరైయాయ్ - పీఠపద్మమై, అలర్న్దదువో-వ్యాపించినదా; పై - సున్దరమై, పొన్ - స్పృహణీయమైయున్న, నిన్-నీయొక్క, కడి-నడుముయొక్క, శోది - కాన్తి, పడి - స్వభావసిద్ధమైన, శోది - తేజస్సుగల, ఆడైయొడుమ్-పీతామ్బరముతోఁగూడ, పల్ - అనేకవిధములైన, కలనాయ్ - ఆభరణములై, కలన్దదువో - వ్యాపించినదా; తిరుమాలే - ఓశ్రియఃపతీ! కట్టురై - చెప్పుము.

తా॥ ఓశ్రియఃపతీ! నీముఖతేజస్సు ముఖమందుఁగాక పైకిలేచి డాలుకొట్టుచున్న కిరీటరూపమయినట్టును, నీశ్రీపాదముయొక్క కాన్తి నీవువేంచేసియున్న పీఠపద్మరూపమయినట్టును, నీతిరుమేనియొక్క కాన్తి నీవుధరించిన భూషణపీతామ్బరరూపములయినట్టును ప్రకాశించుచున్నవిగాన నీసౌన్దర్యమత్యాశ్చర్యకరమని. ౧.

కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్ పాదమ్ కై యొవ్వా*
శుట్టురైత్త నన్ పొన్ ఉన్ తిరుమేనియొళి యొవ్వాదు*
ఒట్టురైత్తివ్వులగున్నై ప్పుగழ்వెల్లాం పెరుమ్బాలుమ్*
పట్టురైయాయ్ ప్పుత్కున్ఱే కాట్టుమాల్ పరఞ్జోదీ. ౨

అ॥ కట్టురైక్కిల్ - చెప్పినయెడల, తామరై - పద్మము, నిన్-నీయొక్క, కణ్ - నేత్రములతోను, పాదమ్ - శ్రీపాదములతోను, కై - శ్రీహస్తములతోను, ఒవ్వా - సమానముగాదు. శుట్టు - పుటముపేయబడి, ఉరైత్త - ఒరిసిన, నన్ పొన్ - మంచిబంగారము, ఉన్ తిరుమేని - నీదివ్యవిగ్రహముయొక్క, ఒళి - కాన్తితో, ఒవ్వాదు - సమానముగాదు. ఇవ్వులగు - ఈలోకము, ఒట్టు - ఉపమానముగా, ఉరైత్తు - చెప్పి, ఉన్నై-నిన్ను, పుగழ்వు-స్తోత్రముచేయుట, ఎల్లామ్ - అన్నియు, పెరుమ్బాలుమ్ - మిక్కిలి, పట్టురైయాయ్ - తోచినట్లుఁ జెప్పినట్టిదై, పుత్కున్ఱే - దోషము నే, కాట్టుమ్ - చూపును,

తా॥ ఓస్వామీ! లోకమునందత్యుత్కృష్టములైన పద్మము, బంగారము మొదలగన్నివస్తువులునునీయుతిసుందరంబులైన దివ్యావయవములకుపమానములుఁగావు,అవస్తువులను నీకుపమానముగాఁ

జెప్పి లోకులు కేపెడిస్తోత్రమంతయు వారివారికి తోచినట్టు జెప్పుటయే గాక యథార్థముగాదు అదియునుంగాక, అయావస్తువులను నీయతిసుందరమైన విగ్రహమున కుపమానముగాఁ జెప్పుట. నీతిరుమేనును నిందజేయునట్లగుచున్నదని. ౨.

పరఞ్జోదినీ పరమాయ్ నిన్నిగర్ న్దునిల్ *మఱ్ఱోర్
పరఞ్జోది యిన్మైయిల్ పడియోవి నిగర్ గిన్ఱ*
పరఞ్జోదినిన్నుళ్ళే పడరులగమ్ పడైత్త *ఎమ్
పరఞ్జోదిగోవిన్దా పణ్బురైక్క మాట్టేనే. 3.

అ॥ పరమాయ్ - పరాత్పరుఁడవైన, నీ - నీవే, పరఞ్జోది - నిరతిశయతేజోరూపుఁడవు, నిన్నిగర్ న్దునిల్ - నిన్నుదప్ప, మఱ్ఱు, వేఱైన, ఓర్ పరఞ్జోది-ఒక శ్రేష్ఠమైన తేజస్సు, ఇన్మైయిల్ - లేకపోవుటచే, పడియోవి - ఉపమానములేకనే, నిగర్ గిన్ఱ-ఉన్న, పరఞ్జోది-పరఞ్జ్యోతిశ్శబ్దవాచ్యుఁడా! నిన్నుళ్ళే - నీసంకల్పమందు, పడర్ - వ్యాపించియున్న, ఉలగమ్ - లోకములను, పడైత్త-సృజించిన, ఎమ్పరఞ్జోది-నాకుసేవసాయించిన గొప్ప తేజస్సుగలవాఁడా! గోవిన్దా - ఆశ్రితసులభుఁడా! పణ్బు-నీయొక్క-విధమును, ఉరైక్క-చెప్పుటకు, మాట్టేన్ - శక్తుఁడనుగాను.

తా॥ ఓశ్రియఃపతీ ! నీకుపమానమైనవేఱొకవస్తువులేక పోవుటచేతను, నీవు జగత్కారణుండవై మిక్కిలిగొప్పవాఁడవగుటచేతను, ( ఇట్లున్నను ) ఆశ్రితులకు మిక్కిలి సులభుఁడవటుట చేతను, నిన్నిట్టివాఁడవని వర్ణించుట కసమర్థుండనైయున్నానని 3.

మాట్టాదే యాగిలు మిమ్మలర్ తలై మాఞాలమ్*నిన్
మాట్టాయ మలర్పురైయుమ్ తిరువురువమ్మనమ్వైక్క*
మాట్టాద పలశమయ మదికొడుత్తాయ్*మలర్త్తుళాయ్
మాట్టే నీ మనమ్వైత్తాయ్ మాఞాలమ్ వరున్దాదే ౪.

అ॥ మలర్ - నాభికమలమును, తలై - (తనకు) ఉత్పత్తిస్థానముగాఁగల, ఇ - ఈ, మా - గొప్ప, ఞాలమ్ - లోకము, నిన్ - నీయొక్క, మాట్టాయ -నిధివలె (శ్లాఘ్యమై), మలర్పురైయుమ్ - పుష్పమువలె (సుకుమారమై) ఉన్న, తిరువురువమ్ - తిరుమేనును, మనమ్ - మనస్సునందు, వైక్క - ఉంచుటకు, మాట్టాదేయాగిలుమ్-శక్తిలేకుండనున్నప్పుఁడును, మాట్టాద - (నిన్ను నుసంధించుటకు) యోగ్యతలేని, పల - పలువిధములైన, శమయమ్ - మతములయందు, మది - బుద్ధిని, కొడుత్తాయ్ - ఇచ్చితివి, నీ - నీవు, మలర్ - వికసించియున్న, తుళాయ్ మాట్టే - తిరుత్తుళాయియందే, మనమ్ - మనస్సు, వైత్తాయ్ - ఉంచియుంటివి. మా - గొప్ప, ఞాలమ్ - లోకము, వరున్దాదే - కష్టపడదా ?

తా॥ ఓశ్రియఃపతీ ! ఈచేతనులు, అతిభోగ్యంబైన నీతిరుమేను ననుసంధించుటకసమర్థులై యుండఁగా, అటువిమ్మట, నీవనేకమతములనుగల్పించి వారికున్న జ్ఞానమునుగూడఁ జెడఁగొట్టి నీవు తులసియందు మనస్సుంచి ఉపేక్షించుచుంటివి, ఇట్టి చేతనులు నిన్నాశ్రయించుటకు మార్గంబేమి యని

వరున్దాద పరుమ్ తవత్తమలర్ కదిరిఙ్ శుడరుడమ్బాయ్*
వరున్దాద ఞానమాయ్ వరమ్బిన్ఱి ముழுదియన్ఱాయ్*
వరుఙ్గాలమ్ నిగழ் కాలమ్ కழிకాలమాయ్*ఉలగై
ఒరుఙ్గాగ వళిప్పాయ్ శీరెఙ్గులక్కు వోదువనే. ౫.

అ॥ వరున్దాద - శ్రమలేక, పరుమ్ - వచ్చెడి, తవత్త - మిక్కిలి, మలర్ - వికసించుచున్న, కదిరిన్ - కిరణములుగల, శుడర్ - తేజోమయమైన, ఉడమ్బాయ్ - తిరుమేనుగలవాఁడవై, వరున్దాద - శ్రమలేనియే ప్రాప్తమైన, ఞానమాయ్ - జ్ఞానముగలవాఁడవై, వరమ్బు - అవధి, ఇన్ఱి - లేక, ముழுదు - సర్వపదార్థములయందును, ఇయన్ఱాయ్ - వ్యాపించియుండువాఁడవై, వరుఙ్గాలమ్ - భవిష్యత్కాలముకున్ను, నిగழ் కాలమ్-వర్తమానకాలముకున్ను, కழி కాలమాయ్ - భూతకాలముకున్ను నిర్వాహకుఁడవై, ఉలగై - లోకమును, ఒరుఙ్గాగ - ఒకవిధంబుగా, అళిప్పాయ్ - రక్షించువాఁడవైననీయొక్క, శీర్ గుణములను, ఎఙ్గు - ఎక్కడ, ఉలక్క - పూర్ణముగా, ఓదువన్ - చెప్పెదను

తా॥ ఓ శ్రియఃపతీ ! స్వభావసిద్ధమై నిరవధిక తేజోరూపమైన దివ్యవిగ్రహముగలవాఁడవై సర్వజ్ఞుండవై, సర్వకాలములందును సకలలోకములకున్ను రక్షకుండవైన నీయొక్క కల్యాణగుణములను సంపూర్ణముగా స్తుతించుటకు నాకుశక్తిలేదని ౫.

ఓదువారోత్తెల్లా మెవ్వులగత్తెవ్వైయుమ్*
శాదువాయ్నిన్ పుగழ்ిన్ తగైయల్లాల్ పిఱిదిల్లై*
పోదువాழ் పునన్దుழாయ్ ముడియినాయ్*పూవిన్మేల్
మాదువాழ் మార్బినా యెన్ శొల్లి యాన్వాழ்త్తువనే. ౬.

అ॥ ఎవ్వులగత్తు - సమస్తలోకములయందలి, ఎవ్వైయుమ్ - అనేకవిధములైయున్న, ఓదువార్ - అధ్యయనముచేయువారియొక్క, ఓత్తెల్లామ్ - వేదములన్నియు, శాదువాయ్ - మంగళకరంబులై, నిన్ - నీయొక్క, పుగழ்ిన్ - గణములను, తగైయల్లాల్-స్మరించుటయేగాక, పిఱిదు - వేరు, ఇల్లై - లేదు, పోదు - పుష్పములుగల, పునమ్ - తనభూమియందున్నట్టువలె, వాழ் - సుందరములైన, తుழாయ్ - తిరుత్తుழாయిమాలగల, ముడియినాయ్-కిరీటముగలవాఁడవై, పూవిన్మేల్ - పుష్పమందువాసముజేయుచున్న, మాదు - శ్రీమహాలక్ష్మి, వాழ் - నిత్యవాసముజేయుచున్న, మార్బినాయ్-వక్షస్థలముగలవాడవైనఓస్వామీ! యాన్ - నేను, ఎన్ శొల్లి - ఏమిచెప్పి, వాழ்త్తువన్ - స్తోత్రముజేసెదను.

తా॥ సమస్తవేదంబులుగూడ నిన్ను స్తోత్రముజేయుట కారంభించి నీగుణములయందొకభాగమునే స్తోత్రముజేయునుగాని సంపూర్ణముగాస్తోత్రముజేయుట కసమర్థములై యుండును, ఇట్లుండగా, శ్రియఃపతియైన నీయొక్క గుణంబుల నేనెట్లు స్తుతించెదనని. ౬.

వాழ்త్తువార్ పలరాగ నిన్నుళ్ళే నాన్ముగనై*
మూழ்త్త నీ రులగెల్లామ్ పడైయెన్ఱు ముదల్ పడైత్తాయ్*

కేఴ్త్తశీరరన్ముదలా క్కిళర్ తెయ్వమాయ్ క్కిళర్న్దు*
శూఴ్త్తమరర్ తుదిత్తాలున్ తొల్ పుగఴ్ మాశూణాదే. ౭.

అ॥ వాఴ్త్తువార్ - మంగళాశాసనముచేయువారు, పలరాగ - అనేకులుందురుగాక. నిన్నుళ్ళే - నీసంకల్పమందు, నాన్ముగనై - బ్రహ్మను, నీర్ - జలముచే, మూఴ్త్త-చుట్టఁబడిన, ఉలగెల్లామ్ - లోకములన్నింటిని, పడైయెన్ఱు-సృజించమని, ముదల్-ముందు, పడైత్తాయ్ - సృజించితివి కేఴ్త్త - వర్ధిల్లుచున్న, శీర్ - జ్ఞానముగల, అరన్ - రుద్రుడు, ముదలా - మొదలుగాగల, కిళర్ - వర్ధిల్లుచున్న, (శక్తిగల), అమరర్ - చావులేని, తెయ్వమాయ్ - దేవతలందరును, కిళర్న్దు - ఉద్యుక్తులై, శూఴ్త్తు - వ్యాపించి, తుదిత్తాల్ - స్తోత్రముచేసిన యెడల, ఉన్ - నీయొక్క, తొల్ - అనాదులైన, పుగఴ్ - గుణములు, మాశూణాదే - మాసి పోవా !

తా॥ మిక్కిలి జ్ఞానవంతులును సమర్థులునైన రుద్రేంద్రాది సమస్త దేవతలేకీభవించినను, సకలలోకస్రష్టవైన నీ గుణములలో నొకభాగమునుగూడ స్తుతిఁజేయఁజాలరు వారివారిబుద్ధికిఁదగునటుల గొంతమట్టుకు స్తుతించినను వినువార్లకంతమాత్రమే యాగుణములని దోఁచఁబడుటచే మితిలేని నీగుణంబులకు లోపంబుగూడ వచ్చునని. ౭

మాశూణాచ్చుడరుడమ్బాయ్ మలరాదుకువియాదు*
మాశూణాఞానమాయ్ ముఴుదుమాయ్ ముఴుదియన్ఱాయ్*
మాశూణావాన్కోల త్తమరర్కోన్ వఴిప్పట్టాల్*
మాశూణావునపాదమలర్చోది మఴుఙ్గాదే. ౮.

అ॥ మాశూణా - దోషములేని, శుడర్ - తేజోమయమైన, ఉడమ్బాయ్ - దివ్యవిగ్రహముగలవాడవును, మలరాదు - వృద్ధిలేనిదియు, కువియాదు - క్షయములేనిదియు, మాశూణా - సంశయాది దోషములు లేనిదియునైన, ఞానమాయ్ - జ్ఞానముగలవాడవును, ముఴుదుమాయ్ - సమస్తవస్తువులను దనకు శరీరముగాగలవాడవును, ముఴుదు-ఆసమస్తవస్తువులకును, ఇయన్ఱాయ్ - నిర్వాహకుండవునైన ఓస్వామీ ! మాశూణా - మాలిన్యములేని, వాన్-విలక్షణమైన, కోలత్తు-జ్ఞానమనెడి భూషణముగల, అమరర్ కోన్-దేవతలకు స్వామియైన బ్రహ్మ, వఴిప్పట్టాల్-స్తోత్రముచేయుటకు సమ్మతించినయెడల, మాశూణా - దోషరహితంబులైన, ఉన - నీయొక్క, పాదమలర్ - శ్రీపాదపద్మములయొక్క, శోది - తేజస్సు, మఴుఙ్గాదే - మాసిపోదా ?

తా॥ అత్యుజ్జ్వలమైన దివ్యవిగ్రహమును, దివ్యజ్ఞానమును గలవాడవై, సర్వలోక నిర్వాహకుఁడవైన ఓ శ్రియఃపతీ ! మిక్కిలి జ్ఞానాధికుండైన బ్రహ్మగూడ నీగుణంబులను స్తోత్రముచేయుటకుఁజాలడని !

మఴుఙ్గాద వైన్నుదియ శక్కరనల్వలత్తైయాయ్*
తొఴుఙ్గాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్న్దు తోన్ఱినైయే*

మழு ఙ్గాదకూనమే పడైయాగ మలరులగిల్*
తొழுమ్బాయార్క్కళిత్తా లుళ్ళశుడర్ చ్చోది మఱైయాదే, ౯.

అ॥ మழுఙ్గాద - మొఱమబోవనటువంటి, వై - వాడియైన, నుదియ - నేమిగల, శక్క రమ్ - సుదర్శనమును, నల్ - సుందరమైన, వలత్తైయాయ్ - కుడిచేతియందుగలవాడవై, తొழுమ్ - కైంకర్యమునందు, కాదల్ - ఆశగల, కళిఱు - గజేన్ద్రాళ్వార్లను, అళిప్పాన్ - రక్షించుటకై, పుళ్ - గరుత్మంతుని, ఊర్న్దు - నడిపించుకొని, తోన్ఱినైయే - ప్రకాశించితివిగదా? మలర్ - నాభికమలమందున్న, ఉలగిల్ - లోకములో, తొழுమ్బాయార్క్కు - నిన్నాశ్రయించినవారికి, మழுఙ్గాద - మఱుపులేనటువంటి, (అమోఘమైన), ఞానమ్ - సంకల్పరూప జ్ఞానమును, పడైయాగ - సాధనముగాజేసికొని, అళిత్తాల్ - కృపజేసినయెడల, ఉళ్ - నీయొక్క, శుడర్ - ఉజ్జ్వలమైన, శోది - తేజస్సు, మఱైయాదే - మాయదా?

తా॥ ఓశ్రియఃపతీ! నీవున్నచోటనుండియే నీసంకల్పమాత్రముచేతనే నిన్నాశ్రయించిన వారిని రక్షించితివంటే, మునుపాకకాలమందు తనతొండమందు తామరపువ్వుతీసికొని నీకు సమర్పించవలయుననియాశబడిన గజేన్ద్రాళ్వార్లయొక్క దుఃఖమును బోగొట్టుటకై చక్రధరుండవై గరుత్మంతునిమీదనెక్కి అతివేగముగావచ్చి సెవసాయించిన నీకీర్తి మాయదా? యని.

మఱైయాయ నాల్వేదత్తుళ్ నిన్ఱ మలర్చ్చుడరే*
ముఱైయాలివ్వులగెల్లామ్ పడైత్తిడన్దుణ్డుమిழ்న్దళన్దాయ్*
పిఱైయేఱు శడైయానుమ్ నాన్ముగను మిన్దిరనుమ్*
ఇఱైయాదలఱిన్దేత్త వీఱ్ఱిరుత్తలిదు వియప్పే. ౧౦.

అ॥ మఱైయాయ - (అభక్తులకు తనయర్థమును) మఱుగుపఱచెడి, నాల్ - నాలుగువిధములైన, వేదత్తు - వేదములకు, ఉళ్నిన్ఱ - తాత్పర్యార్థమైయున్న, మలర్ - పుష్పమువలెభోగ్యమైయున్న, శుడరే - జ్యోతిస్వరూపుఁడా! ముఱైయాల్ - వంశగుటచేత, ఇవ్వులగెల్లామ్ - ఈలోకమంతయును, పడైత్తు - సృజించి, ఇడన్దు - (అణ్డభిత్తిలోనుండి) విడదీసి, ఉణ్డు - అరగించి, ఉమిழ்న్దు - బయలుపఱచి, అళన్దాయ్ - కొలిచినవాడా! పిఱైయేఱు - చన్ద్రకలనుధరించినవాడును, శడైయానుమ్-జటాధరుఁడు నైనరుద్రుఁడును, నాన్ముగనుమ్-చతుర్ముఖబ్రహ్మయు, ఇన్దిరనుమ్ - ఇన్ద్రుఁడును, ఇఱైయాదల్ - నీస్వామిత్వము, అఱిన్దు - తెలిసికొని, ఏత్త - స్తుతించుటకై, వీఱ్ఱిరుత్తల్ - స్వామిత్వము ప్రకటనమగునట్లు వేంచేసియుండుటయి నెడి, ఇదు-ఇది, వియప్పే - ఆశ్చర్యమా?

తా॥ ఓస్వామీ! నీచే సృజింపఁబడిన బ్రహ్మరుద్రాదిసమస్తదేవతలును, అపౌరుషేయసకల వేద ప్రతిపాద్యుఁడవును, సకలలోకములకు సృష్టిస్థితి సంహారకారకుఁడవునైన నిన్ను స్వామిగా నెఱిఁగి స్తుతించుట యొకయాశ్చర్యముగాదని. ౧౦.

✽✽ వియప్పాయ వియప్పిల్లా మెయ్ఞ్ఞాన వేదియనై*
శయప్పుగழார్ పలర్వాழுమ్ తడఙ్కురుగూర్చ్చడగోపన్*

తుయక్కిన్ఱి త్తొழுదురైత్త వాయిరత్తుళిప్పత్తుమ్*
ఉయక్కొణ్డు పిఱప్పఱుక్కుమ్ మొలిమున్నీర్ ఞాలత్తే ౧౧.

అ॥ వియప్పాయ - (మఱియొకనియందు) ఆశ్చర్యకరంబులును, వియప్పిల్లా - (సర్వేశ్వరునియందు) ఆశ్చర్యకరంబులుగానివియునైన దివ్యచేష్టితంబులుగలవాడై, మెయ్ - యథార్థమైన, ఞానమ్ - జ్ఞానమును, (ప్రతిపాదించెడి), వేదియనై - వేదములచేఁబ్రతిపాదింపఁబడినవాడైన శ్రియఃపతిని, శయమ్ - సంసారమునుజేయించుటచే సంపాదింపఁబడిన, పుగழ் - కీర్తిగల, పలర్ - అనేకశ్రీవైష్ణవులు, వాழுమ్ - సుఖముగా వేంచేసియున్న, తడమ్ - విశాలమైన, కురుగూర్ - కురుకాపురికి నాథులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, తుయక్కిన్ఱి - సంశయాదులులేక, తొழுదు - ఆశ్రయించి, ఉరైత్త - సాయించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, ఒలి - శబ్దించుచున్న, మున్నీర్ - * మూడువిధములైననీళ్లుగల, ఞాలత్తు - భూమియందున్నవారిని, ఉయక్కొణ్డు - ఉజ్జీవింపజేసికొని, పిఱప్పు - జన్మమును, అఱుక్కుమ్ - ఛేదించును.

తా॥ ఆశ్చర్యాశ్చర్యకరంబులైన దివ్యచేష్టితములుగలవాడును, వేదవేద్యుఁడునైన శ్రియఃపతివిషయమై, వీతరాగులైన శ్రీవైష్ణవులునివసించెడి కురుకాపురికధిపతులైన నమ్మాళ్వార్లుసాయించిన యీపదిపాశురములు తన ననుసంధించువారికి సంసారమును దొలగించునని.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౨- వ తిరువాయ్మొழி.

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, సుందరబాహువుయొక్క యపరిచ్ఛిన్నములైన స్వరూపగుణాదులను పరిపూర్ణముగాననుభవింప యాశపడి దానిని లభించక ఆళ్వార్లు మిక్కిలి దుఃఖించుచుండగా నప్పుడు సర్వేశ్వరుఁడువచ్చి మీమనోరథప్రకారము నన్ను వేఙ్కటాద్రియందు వచ్చి యనుభవించుమని యాళ్వార్లకానతిచ్చెను.

మున్నీర్ ఞాలమ్పడైత్త వెమ్ముగిల్వణ్ణనే*
అన్నాళ్ నీతన్దవాక్కైయిన్వழி యుழல్వేన్*
వెన్నాళ్ నోయ్వీయ వినైగళై వేరఱప్పాయ్న్దు*
ఎన్నాళ్ యానున్నై యినివన్దు కూడువనే. ౧.

అ॥ మున్నీర్ - మూడువిధంబులైనజలములుగల, ఞాలమ్ - భూమిని, పడైత్త - సృజించిన, ఎమ్ - మాకుస్వామియైన, ముగిల్వణ్ణనే - మేఘమువంటిస్వభావముగల ఓ శ్రియఃపతీ! అన్నాళ్ - ఆసృష్టికాలమందు, నీ - నీవు, తన్ద - ఇచ్చిన, ఆక్కైయిన్వழி - శరీరముయొక్క దోవలో (పోయి),

* నదీజలము, ఊటజలము, వర్షజలము.

ఉழ్ఱ్ఱేన్ - తిరుగుచున్నాను, వెమ్ - క్రూరమైన, నాళ్ - (ఈ) దినములయందు, నోయ్ - (నీయొక్క) విరహదుఃఖము, వీయ - నశించునటుల, వినైగళై - పాపములను, వేరఱప్పాయ్న్దు - సమూలముగాబోవునట్లుజేసి, యాన్ - నేను, ఉన్నై - నిన్ను, వన్దు - సమీపించి, ఇని - ఇఁక, ఎన్నాళ్ - ఏదినమందు, కూడువన్ - చేరెదను.

తా॥ సకలచేతనులకును కరచరణాద్యవయవములనిచ్చిన పరమోదారుఁడవైన ఓ శ్రియఃపతీ! నీకైంకర్యార్థమై నీవిచ్చిన యీశరీరమును బరిగ్రహించి నేనాకైంకర్యముజేయక ఇన్ద్రియప రాధీనుఁడనై సంసారమందుమునిగి మహాదుఃఖము ననుభవించుచున్నాను. ఇట్టిదుఃఖమునకుఁ గార ణంబైన పాపమును సమూలముగా పోఁగొట్టుకొని ఇఁక నెన్నడు నిన్ను బొందెదనో? తెలియలేదని.

వన్మావైయమళన్ద వెమ్వామనా* నిన్
పన్మామాయ ప్పల్పిఱవియిల్ పడిగిన్ఱయాన్*
తొన్మావల్వినై త్తొడర్గళై ముదలరిన్దు*
నిన్మాతాళ్ శేర్న్దు నిఱ్పదెఞ్ఞాన్ఱుకొలో. ౨.

అ॥ వల్ - కఠినమై, మా - విశాలమైన, వైయమ్ - భూమిని, అళన్ద - కొలిచిన, ఎమ్ వామనా - మావామనుఁడా! నిన్ - నీయొక్క, పల్ - దేవమనుష్యాద్యనేక భేదములుగల, పిఱవియిల్ - జన్మములయందు, పడిగిన్ఱ - అమరియున్న, యాన్ - నేను, తొల్ - అనాదియు, మా - అన్త ములేనివియు, వల్ - విడిపింపుటకు కఠిన్యంబులునైన, వినై - పాపముల కడి, తొడర్గళై - సంకె ళ్లను, ముదలరిన్దు - సమూలముగా ఛేదించి, నిన్ - నీయొక్క, మా - శ్లాఘ్యమైన, తాళ్ - శ్రీపా దములను, శేర్న్దు - చేరి, నిఱ్పదు - ఉండుట, ఎఞ్ఞాన్ఱుకొలో - ఏదినమందో!

తా॥ ఓ శ్రియఃపతీ! సకలచేతనులకు నాశ్రయించుట కత్యన్తసులభుఁడవై నీవు వామనా వతారంబెత్తి లోకములను గొలిచినప్పుడు నేనులేకపోతిని. ఇప్పుడాయవతారములేదు. ఇఁక నేనీ సంసారబన్ధమునువదలి నీశ్రీపాదమునందెన్నడు చేరెదనో? యని. ౨.

కొల్లామాక్కోల్ కొలైశెయ్దు పారదప్పోర్*
ఎల్లాచ్చేనైయు మిరునిల త్తవిత్త వెన్దాయ్*
పొల్లావాక్కైయిన్ పుణర్వినై యఱుక్కలఱా*
శొల్లాయ్ యానున్నై చ్చార్వదోర్ శూழ్చ్చియే 3.

అ॥ కొల్లా - (శత్రువులను) చంపుటకు సాధనముగానిదియు, మా - గుఱ్ఱములనునడిపిం చుటకుసాధనమైనదియునైన, కోల్ - జాటికఱ్ఱను, కొలై శెయ్దు - చంపుటకుసాధనముగా జేసికొని, పారదప్పోర్ - భారతయుద్ధమందు, ఎల్లాచ్చేనైయుమ్ - సమస్తసేనలను, ఇరు - విశాల మైన, నిలత్తు - కురుక్షేత్రమందు, అవిత్త - సంహరించిన, ఎన్దాయ్ - ఓస్వామీ! పొల్లా - క్రూ రమైన, ఆక్కైయిన్ - శరీరముయొక్క, పుణర్వినై - సంబన్ధమును, అఱుక్కల్ - ఛేదించుటకు ద్యోగించినను, అఱా - తెగదు, యాన్ - నేను, ఉన్నై - నిన్ను, శార్వదు - పొందుటకు, ఓర్ శూழ్చ్చి - ఒకయుపాయమును, శొల్లాయ్ - చెప్పుము.

తా॥ ఆయుధమెత్తకుండనే యర్జునినికి సారథ్యముజేయుచు మహాభారత యుద్ధమందు సమస్తసేనలను నశింపజేసిన ఓస్వామీ! నేనుజేసిన పాపములు నాకువిడిపించుట కశక్యములైయున్నవి. ఆపాపములనుండితొలఁగి నిన్నుజేరుట కుపాయము నీవేచెప్పుమాయని. 3.

శూழ்చ్చిఞానచ్చుడరొళియాగి* ఎన్ఱుమ్
ఏழ்చ్చికేడిన్ఱి యెఙ్గణుమ్ నిఱైన్ద వెన్దాయ్*
తాழ்చ్చిమఱ్ఱెఙ్గుమ్ తవిర్న్దు నిన్ తాళిణైక్కీழ்
వాழ்చ్చి* యాన్ శేరుమ్వగై యరుళాయ్ వన్దే. ౪.

అ॥ శూழ்చ్చి-అంతటవ్యాపించి, ఒళి - ప్రకాశించుచున్న, ఞానమ్-జ్ఞానముగలవాడై, శుడరాగి - తేజోరూపుండై, ఎన్ఱుమ్ - ఎప్పుడును, ఏழ்చ్చి - వృద్ధియు, కేడు - క్షయమును- ఇన్ఱి - లేక, ఎఙ్గణుమ్ - అంతట, నిఱైన్ద - నిండియున్న, ఎన్దాయ్ - ఓస్వామీ! మఱ్ఱెఙ్గుమ్ - మఱియొకవిషయమందు, ఎఙ్గుమ్ - ఎక్కడను, తాழ்చ్చి - దైన్యమును, తవిర్న్దు - వదలి, నిన్ - నీయొక్క, తాళిణైక్కీழ் - శ్రీపాదద్వన్ద్వముక్రింద, వాழ்చ్చి-సుఖముగానుండుటను, యాన్ - నేను, శేరుమ్వగై - పొందెడివిధమును, వన్దు - వచ్చి, అరుళాయ్ - కృపజేయుమా.

తా॥ సర్వజ్ఞుఁడవై, సర్వగతుండవై, వృద్ధిక్షయరహితుఁడవై, తేజోరూపుఁడవైన ఓశ్రియఃపతీ! నాకు విషయాన్తరములయందాశనువిడిపించి నీశ్రీపాదములను జేరునట్లు నీవు నాకుఁ గృపజేయుమాయని ౪.

వన్దాయ్పోలే వన్దుమెన్మనత్తినై నీ*
శిన్దామల్ శెయ్యాయిదువే యిదువాగిల్*
కొన్దార్ కాయావిన్ కొழுమలర్ తిరునిఱత్త
వెన్దాయ్* యాను న్నై యెఙ్గువన్దణుగిల్వనే. ౫.

అ॥ వన్దాయ్పోల్ - (శ్రీప్రహ్లాదునికి) వచ్చి సేవసాయించినట్లు, వన్దుమ్ - వచ్చినైయినను, ఎన్ మనత్తినై - నామనస్సును, శిన్దామల్ - చెదరిపోకుఁడ, శెయ్యాయ్ - చేయవు. ఇదువే - ఇట్లుపేక్షించుటయే, ఇదువాగిల్ - స్వభావమైనయెడల, కొన్దు - పూలగొత్తులచే, ఆర్ - పూర్ణమైన, కాయావిన్ - కాశచెట్టుయొక్క, కొழு - వికసంచియున్న, మలర్ - పుష్పముయొక్క, తిరు - సున్దరమైన, నిఱత్త - వర్ణముగల, ఎన్దాయ్ - మాస్వామీ! యాన్ - నేను ఉన్నై - నిన్ను, ఎఙ్గువన్దు - ఎక్కడికివచ్చి, అణుగిల్వన్ - పొన్దెదను.

తా॥ శ్యామసున్దర విగ్రహుఁడవైన ఓశ్రియఃపతీ! ఇదిఁవఱకు నీవు రామకృష్ణాద్యవతారంబులెత్తినప్పుడు నేను లేకపోతిని ఇప్పుడు నానిమిత్తమై యొకయవతారమెత్తి నన్ను స్వీకరించవలెను. మిక్కిలి సావకాశములేకపోయినను నృసింహావతారమెత్తిన ట్లొకక్షణమాత్రమందైనను సేవసాయింపవలెను. నీవుపేక్షించినయెడల నాకేమియు గతిలేదని. ౫.

కిఱ్పన్ కిల్లేన్ఱిలన్ ముననాళాల్*
అఱ్పశార్గళ్ ళవై శువైత్తగన్ఱొழிన్దేన్*

పఱ్పల్లాయిర ముయిర్ శెయ్ద పరమా*నిన్

నఱ్పొఱ్శోదిత్తాళ్ నణుగువ దెన్ఱాన్నే. ౬.

అ॥ కిఱ్పన్ - (సత్కర్మములను) చేసెదను; కిల్లేన్ - (అసత్కర్మము ను) చేయను; ఎన్ఱు - అని, ఇలన్ - చెప్పకపోతిని, ముననాళాల్ - చిరకాలమునుంచి, అఱ్పశారజ్గళ్ - అల్ప సుఖముగల, అవై - శబ్దాదివిషయములను, తుయ్త్తు - అనుభవించి, అగన్ఱొழிన్దేన్ - తొలఁగ పోతిని, పఱ్పల్ - అనేకవిధములై, ఆయిరమ్ - అసఙ్ఖ్యేయములైన, ఉయిర్ - ప్రాణులను, శెయ్ద - సృజించిన, పరమా - సర్వాధికుఁడా! నిన్ - నీయొక్క, నల్ - విలక్షణమై, పొన్ - స్పృహణీయమై, శోది - తేజోమయమైన, తాళ్ - శ్రీపాదమును, నణుగువదు - పొందుట, ఎన్ఱాన్ఱు - ఎప్పుడో?

తా॥ ఓశ్రియఃపతీ! సత్కర్మములనుజేసి యసత్కర్మములనువదలి శాస్త్రవిధి ననుసరించక సంసారమందు మునిగియున్న నాకు కరచరణాద్యవయవములనిచ్చిననీవు నాకిప్పుడు నీశ్రీపాదము లయందు భక్తిగలుగునటుల యంతమాత్రము ప్రయత్నముజేయఁగలయునని ౬.

ఎన్ఱాను నామిరున్దిరున్దిరఙ్గి నెఞ్జే*

మెయ్ఞ్ఞానమిన్ఱి విన్నై యియల్ పిఱప్పழுన్ది*

ఎన్ఱానుమెఙ్గుమొழிవఱ నిఱైన్దునిన్ఱ*

మెయ్ఞ్ఞానచ్చోది క్కణ్ణనై మేవుదుమే. ౭.

అ॥ నెఞ్జే - ఓమనసా! ఎన్ఱాన్ఱుమ్ - ఎల్లప్పుడును, ఇరున్దిరున్దు - ఉణ్ణియుండి, ఇరఙ్గి - ఖేదించి, మెయ్ఞ్ఞానమ్ - తత్త్వజ్ఞానము, ఇన్ఱి - లేక, వినై - పాపములచే, ఇయల్ - ప్రవర్తింపబడిన, పిఱప్పు - జన్మములలో, అழுన్ది - ఇఱుకుపడియున్న, నామ్ - మనము, ఎన్ఱాన్ఱుమ్ - సర్వకాలములయందును, ఎఙ్గుమ్ - సర్వదేశములయందును, ఒழிవఱ - ఒకవస్తువునున్ను విడువక, నిఱైన్దునిన్ఱు - సంపూర్ణముగావ్యాపించియుండి, మెయ్ - సఙ్కోచములేని, ఞానమ్ - జ్ఞానమనెడి, శోది - తేజస్సుగల, కణ్ణనై, శ్రీకృష్ణుని, మేవుదుమే - పొందవచ్చునా?

తా॥ ఓమనసా! తత్త్వజ్ఞానములేక యనాదిపాపములచేసంసారమందు మగ్నులైయున్న మనకు, సర్వదేశసర్వకాలసర్వావస్థలయందును సర్వవ్యాపకుఁడై సర్వజ్ఞుఁడైన శ్రియఃపతినిబొంద డము మిక్కిలి యసాధ్యముగనుక నీవావిషయమందు తొందరపడవలదని. ౭

మేవు తున్బవినైగళై విడుత్తుమిలేన్*

ఓవుదలిన్ఱి యున్కழల్వణఙ్గిற్ఱిలేన్*

పావుతొల్ శీర్కణ్ణా వెన్పరఞ్జుడరే*

కూవుగిన్ఱేన్ కాణ్బా నెఙ్గెయ్దక్కూవువనే. ౮.

అ॥ మేవు - అమరియున్న, తున్బమ్ - దుఃఖములకు హేతువులైన, వినైగళై - పాపములను, విడుత్తుమిలేన్ - పోఁగొట్టుకొనకపోతిని, ఓవుదలిన్ఱి - ఎడతెగక, ఉన్ కழల్ - నీశ్రీపాదములను, వణఙ్గిற్ఱిలేన్ - ఆశ్రయించకపోతిని, పా - ప్రసిద్ధమై, తొల్ -అనాదియై - నశిర

కల్యాణగుణంబులుగల, కణ్ణా - శ్రీకృష్ణుఁడా! ఎఙ్ఙ్ పరఞ్జుడరే - నాపరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! కాణ్బాన్ - నిన్ను సేవించుటకై, కూవుగిన్ఱేన్ - పిలుచుచున్నాను. ఎఙ్గు - ఎచ్చట, ఎయ్ద - పొందుటకు, కూవువన్ - పిలుచుచున్నాను?

తా॥ సర్వలోకవిదితంబులైన కల్యాణగుణంబులుగల ఓస్వామీ! నేనుజేసిన పాపములకుఁ దగినప్రాయశ్చిత్తమున్ను చేసికొనలేదు. నీశ్రీపాదములనున్నాశ్రయించలేదు. ఇట్లుండఁగా సాధనానుష్ఠానముజేసినవారు పిలిచినట్లునిన్ను పిలుచుచున్నాను ఇఁక నెచ్చటనిన్ను బొందెదనని.

కూవిక్కూవి క్కొడువినైత్తొழிల్ ఉழల్ నిన్ఱు*
పావియేన్ పలకాలమ్ వழிదిగైత్తలమరుగిన్ఱేన్*
మేవియన్ఱానిరైకాత్తవ నులగమెల్లామ్
తావియవమ్మానై *ఎఙ్గినిత్తలైప్పెయ్వనే. ౯.

అ॥ కొడు - క్రూరములైన, వినై - పాపములయొక్క, తొழிల్ ఉழల్ - సమూహమనెడి యడవియందు, నిన్ఱు - ఉండి, కూవిక్కూవి - పిలిచిపిలిచి, పలకాలమ్ - అనేకకాలముగా, వழிదిగైత్తు - దోవతప్పి, అలమరుగిన్ఱేన్ - భ్రమించితిరుగుచున్న, పావియేన్ - పాపియైననేను, అన్ఱు - ఆకాలమందు, మేవి - అమరియుండి, ఆనిరై - గోసమూహమును, కాత్తవన్ - రక్షించినవాఁడును, ఉలగమెల్లామ్ - సమస్తలోకములను, తావియ - కొలిచినవాఁడునైన, అమ్మానై - స్వామిని, ఇని - ఇఁకను, ఎఙ్గు - ఎచ్చట (పోయి), తలైప్పెయ్వన్ - పొందెదను.

తా॥ నాపాపముచే సంసారమందు చిరకాలము మునిగియుండి దోవతెలియక తిరుగుచు, త్రివిక్రమావతారము మొదలగనేకావతారములెత్తి నీవు సకలచేతనుల ననుగ్రహించిన సమయమును తప్పిన నేనిప్పుడు నిన్నుబొందుట కుపాయమేమున్నదని. ౯

తలైప్పెయ్కాలమ్ నమన్ తమర్ పాశమ్విట్టాల్*
అలైప్పూణుణ్ణు మవ్వల్లలెల్లా మగల*
కలైప్పల్ ఞానత్తేన్ కణ్ణనైక్కణ్డుకొణ్డు*
నిలైప్పెఱ్ఱెన్నుడైయ్యెప్పెఱ్ఱదు నీడుయిరే. ౧౦

అ॥ నమన్ తమర్ - యమదూతలు, తలైప్పెయ్కాలమ్ - సమీపించినసమయమందు, పాశమ్ - పాశాయుధమును, విట్టాల్ - విశిరివేసినయెడల, అలైప్పూణుణ్ణుమ్ - (అప్పుడువచ్చెడి) మహాదుఃఖమువలెనున్న, అవ్వల్లలెల్లామ్ - ఆభగవద్విశ్లేషజన్యంబైనదుఃఖమంతయు, అగల - పోవునట్లు, పల్ - అనేకవిధములైన, కలై - వేదములచే, ఞానమ్ - తెలిసికొనదగిన ఎన్ - నాయొక్క, కణ్ణనై - శ్రీకృష్ణుని, కణ్డుకొణ్డు - సేవించి, ఎన్నుడైయ్ - నామనస్సు, నిలై పెఱ్ఱు - స్థైర్యమును బొందినది. ఉయిర్ - ఆత్మయు, నీడు - నిత్యత్వమును, పెఱ్ఱదు - పొందినది.

తా॥ ఇట్లుభగవద్విశ్లేషమునుసహింపక ఆழ்వార్లుఖేదించుచుండగా, అప్పుడుసర్వేశ్వరుఁడు వచ్చి వారికి సేవసాయించెను. ఆழ்వార్లప్పుడాసర్వేశ్వరుని సేవించి, ఓస్వామీ! నిన్ను నేనిప్పుఁడు సేవించినతరువాత, మరణకాలమందు యమభటులచేఁబడెడి బాధవలెనతిక్రూరమైన నీవిరహదుఃఖమునువిడిచి నేనును నామనస్సు నొకతీరున బతికితిమని. ౧౦

‡‡ ఉయిర్గళెల్లా వులగుముడై యువనై *
కుయిల్కొళ్ శోలై త్తెన్నురుగూర్చ్చడగోపన్ *
శెయిరిల్ శొల్లిశై మాలై యాయిరత్తుళిప్పత్తుమ్ *
ఉయిరిన్మేలాక్కై యూనిడై యొఴివిక్కుమే. ౧౧

అ॥ ఎల్లామ్ - సమస్తములైన, ఉలగు - లోకములనున్ను, ఉయిర్గళ్ - ప్రాణులనున్ను, ఉడైయవనై - కలవాఁడైన శ్రియఃపతినుద్దేశించి, కుయిల్ కొళ్ - కోకిలలుగల, శోలై - తోపులుగల, తెన్ - సున్దరమైన, కురుగూర్ చ్చడగోపన్ - తిరునగరికిస్వామియైన నమ్మాళ్వార్లు (సాయించిన), శెయిరిల్ - దోషములేని, ఇశై - రాగముతోఁగూడిన, శొల్ మాలై - శబ్దసన్దర్భమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇప్పత్తుమ్ ఈపదిపాశురములున్ను, ఉయిరిన్మేల్ - ఆత్మమీదనున్న, ఊనిడై - మాంసమయమైన, ఆక్కై - శరీరమును, ఒఴివిక్కుమ్ - నశింపఁజేయును.

తా॥ సమస్తచేతనాచేతనాధీశుఁడైన శ్రియఃపతివిషయమై నమ్మాళ్వార్లు సాయించిన యీపదిపాశురముల ననుసన్ధించువారు సంసారమునుఁ డలి సుఖముగానుందురని ౧౧

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## 3-వ తిరువాయ్మొఴి.

అవతారిక:—తిరువాయ్మొఴిలో, వేఙ్కటాద్రియందు వేంచేసియున్న తిరువేఙ్గడముడైయానుయొక్క తిరువడికళ్ళయందుఁ గైంకర్యము చేయవలయునని ప్రార్థించుచున్నారు.

‡‡ ఒఴివిల్ కాలమెల్లా ముడనాయ్మన్ని *
వఴువిలావడిమై శెయ్య వేణ్డుమ్ నామ్ *
తెఴికురలరువి త్తిరువేఙ్గడత్తు *
ఎఴిల్ కొళ్ శోది యెన్దై తన్దై తన్దైక్కే. ౧.

అ॥ తెఴికురల్ - గంభీరముగాశబ్దించుచున్న, అరువి - కొండచరియలుగల, తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రియందు (వేంచేసియున్న), ఎఴిల్ కొళ్ - సౌన్దర్యముగల, శోది - తేజోమయమైన విగ్రహముగల, ఎన్దై తన్దై తన్దైక్కు - నాతండ్రితాతముదలైనవారికిన్ని కారణభూతుఁడైన శ్రీనివాసునికి, నామ్ - మనము, ఒఴివిల్ - ఎడతెగని, కాలమెల్లామ్ - కాలమంతయు, ఉడనాయ్ - సర్వదేశములయందును, మన్ని - అమరియుండి, వఴువిలా - ఒకకైఙ్కర్యమునున్ను విడువక, అడిమై శెయ్య వేణ్డుమ్ - కైఙ్కర్యము చేయవలెను.

తా॥ ఓ శ్రీవైష్ణవులారా! మనము చుట్టును కొండచరియలు పారుచున్న వేఙ్కటాద్రియందు వేంచేసియున్న సున్దరవిగ్రహుఁడైన శ్రీనివాసునికి సర్వదేశసర్వకాల సర్వావస్థలయందును సకల విధకైఙ్కర్యములను చేయవలయునని. ౧

సర్వావయవసౌందర్యసంపదా సర్వచేతసామ్,
సదా సమ్మోహనాయాస్తు వేంకటేశాయ మంగళమ్.



అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే
వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే.
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.

ఎన్దై తన్దై తన్దై తన్దై తన్దై క్కుమ్
మున్దై*వానవర్ వానవర్‌కోనోడుమ్*
శిన్దుపూమగిழுమ్ తిరువేఙ్గడత్తు*
అన్దమిల్ పుగழ் కారెழிలణ్ణలే. ౧.

అ॥ ఎన్దై - నాకును నాతండ్రికిని, తన్దై - నాతాతకును, తన్దై - నాముత్తాతకును, తన్దై - వానితండ్రికిని, తన్దైక్కుమ్ - వానితండ్రికిని, మున్దై - కారణభూతుండైన శ్రియఃపతి, వానవర్ - నిత్యసూరులు, వానవర్‌కోనోడుమ్ - నిత్యసూరులకధిపతియైన విష్వక్సేనులతోంగూడ, శిన్దు - సమర్పించిన, పూ - పుష్పములు, మగిழுమ్ - పరిమళించుచున్న, తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రియందు (వేంచేసియున్న), అన్దమిల్ - అవధిలేని, పుగழ் - గుణములు గలవాండును, కార్ - మేఘమువంటి, ఎழிల్ - వర్ణముగలవాండునైన, అణ్ణల్ - స్వామి.

తా॥ నిత్యసూరులందరున్నుగూండ పరమపదమునుంచివచ్చి వేఙ్కటాద్రియందు వేంచేసియున్న శ్రీనివాసునకే కైఙ్కర్యముజేయుచున్నారుగనుక, సకలజగత్కారణుండైన యావేఙ్కటాచలపతియే మనకుపరమప్రాప్యుండని. ౧

అణ్ణల్మాయ నణికొళ్ శెన్దామరై
క్కణ్ణన్*శెఙ్గనివాయ్ క్కరుమాణిక్కమ్*
తెణ్ణిఱై చ్చునై నీర్ త్తిరువేఙ్గడత్తు*
ఎణ్ణిల్ తొల్ పుగழ் వానవరీశనే. 3

అ॥ అణ్ణల్ - స్వామియు, మాయన్ - ఆశ్చర్యగుణములుగలవాండును, అణికొళ్ - సౌన్దర్యముగల, శెన్దామరైక్కణ్ణన్ - ఎఱ్ఱతామరవంటి నేత్రములుగలవాండును, శెమ్‌కని - ఎఱ్ఱని పండువలెనున్న, వాయ్ - అధరముగలవాండును, కరుమాణిక్కమ్ - నీలమాణిక్యమువంటికాన్తి గలవాండునునైనశ్రియఃపతి, తెళ్ - నిర్మలమై, నిఱై - పూర్ణమైయున్న, శునైనీర్ - చరియల నీళ్ళుగల, తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రియందు (వేంచేసియుండుటచే), ఎణ్ణిల్ - లెక్కలేనిదియు, తొల్ - అనాదియునైన, పుగழ் - కల్యాణగుణంబుగలవాండై, వానవర్ - నిత్యసూరులకు, ఈశన్ - స్వామియైయున్నాండు

తా॥ సర్వేశ్వరుండు, తనస్వామిత్వమును దెలుపెడి దివ్యావయవ సౌన్దర్యముగలవాండై, వేఙ్కటాద్రియందు వేంచేసియుండి పూర్ణులైననిత్యసూరులకుం గూడఁదనకైఙ్కర్యము నిచ్చునప్పుడు దరిద్రులమైన మనకిచ్చుట యొకయాశ్చర్యముగాదని 3

ఈశన్ వానవర్ క్కెన్బనెన్ఱాల్*అదు
తేశమో తిరువేఙ్గడత్తానుక్కు*
నీశనేన్ నిఱైవొన్ఱుమిలేన్*ఎన్గణ్
పాశమ్వైత్త పరఞ్జుడర్‌చ్చోదిక్కే. ౪

అ॥ వానవర్క్కు - నిత్యసూరులకు, ఈశన్ - స్వామి, ఎన్బన్ - అనిచెప్పెదను,, ఎన్రాల్ - అట్లుచెప్పినయెడల, నీశనేన్ - ఈర్ష్యాసూయామొదలగుదుర్గుణములు గలవాఁడును, నిఱై ఒన్ఱుమిలేన్ - భూతదయమొదలగు సద్గుణములులేనివాఁడనునైన, ఎన్గణ్ - నాయందు, పాశమ్ - సఙ్గమును (ప్రీతిని), వైత్త-ఉంచిన, పరఞ్జుడర్-మిక్కిలిప్రకాశించుచున్న, శోదిక్కు - తేజోమయమైన విగ్రహముగల, తిరువేఙ్గడత్తానుక్కు - వేఙ్కటాచలపతికి, అదు - నిత్యసూరులకు స్వామియనుట, తేశమో - మహిమనా ?

తా॥ గుణహీనుఁడనైన నన్నఙ్గీకరించిన వేఙ్కటాచలపతికి మహాత్ములైన నిత్యసూరులనఙ్గీ కరించినాడనుట యొక మహిమకాదని. ౪

శోదియాగి యెల్లావులగున్దొழుమ్*
ఆదిమూర్త్తియెన్రా లళవాగుమో*
వేదియర్ ముழு వేద త్తముద త్తై*
తీదిల్‌శీర్ త్తిరువేఙ్గడత్తానై యే. ౫

అ॥ వేదియర్ - వైదికులధ్యయనము చేయుచున్న, ముழு - సమస్తములైన, వేదత్తు - వేదములయందుఁ బ్రతిపాదింపఁబడిన, అముదత్తై - భోగ్యభూతుఁడును, తీదిల్ - దోషములేని వాఁడునైన, తిరువేఙ్గడత్తానై - వేఙ్కటాచలపతిని, శోదియాగి - తేజోమయవిగ్రహుఁడై, ఎల్లావులగుమ్ - సమస్తలోకములచే, తొழுమ్ - ఆశ్రయింపదగినవాఁడై, ఆదిమూర్త్తి - కారణభూతుఁడైన సర్వేశ్వరుఁడు, ఎన్రాల్ - అనిచెప్పినయెడల, అళవాగుమో-అతిశయమగునా?

తా॥ సకలవేదప్రతిపాద్యుడై, సకలకల్యాణగుణాకరుఁడైన శ్రీనివాసుని, సకలజగత్కారణుడు, సర్వనిర్వాహకుఁడు, అనిచెప్పుట యతనికొక గొప్పతనముగాదని. ౫

వేఙ్గడఙ్గళ్ మెయ్‌మ్మేల్వినై ముఱ్ఱవుమ్*
తాఙ్గళ్‌తఙ్గట్కు నల్లనవే శెయ్‌వార్*
వేఙ్గడత్తుఱైవార్క్కు నమవెన్న
లాఙ్గడమై*అదుశుమన్దార్గట్కే. ౬

అ॥ వేఙ్గడత్తుఱైవార్క్కు - వేఙ్కటాద్రియందు వేంచేసియున్న శ్రియఃపతికి, (అనన్యశేషుఁడను), నమః - (మిరియొకరికిన్ని నాకును శేషభూతుఁడనుగాను అనెడియర్థమునకు వాచకమైన) నమః అనెడిశబ్దమును, ఎన్నలామ్ - చెప్పుటయనెడి, అదు - అ, కడమై-వ్యాపారమును, శుమన్దార్కట్కు - మోసినవారికి, కడఙ్గళ్ - (ముందున్న) పాపములు, వేమ్ - నశించును; మేల్‌వినై - రాబోయ్యేడిపాపములు, ముఱ్ఱవుమ్ - సమస్తమున్ను, వేమ్ - అఁటవు; మెయ్-ఇదియథార్థము. తాఙ్గళ్ - ఇట్లుచెప్పినవారు, తఙ్గట్కు - తమకు, నల్లనవేశెయ్వార్-మంచినే చేసికొనుదురు.

తా॥ వేఙ్కటాచలవాసియైన శ్రియఃపతికి నేను దాసుఁడనుగాని స్వతన్త్రుఁడనుగాను; అనుమాటను నోటాఁజెప్పినవారికి సమస్తపాపములును నశించును వారు తాముకోరిన భగవత్కైఙ్కర్యమునున్ను లభింపదురని. ౬

శుమన్దుమామలర్ నీర్ శుడర్ తూబజ్కొణ్డు*
అమర్న్దువానవర్ వానవర్కోనొడుమ్*
నమన్ఱెழుమ్ తిరువేజ్గడమ్ నజ్గట్కు*
శమన్కొళ్ వీడుతరుమ్ తడజ్కున్ఱమే. ౭.

అ॥ మా - శ్లాఘ్యమైన, మలర్ - పుష్పములనున్ను, నీర్ - జలమునున్ను, శుడర్ - దీపమునున్ను, తూబమ్ - ధూపమునున్ను, శుమన్దుకొణ్డు - ధరించుకొనివచ్చి, అమర్న్దు - అమరికతోనుండి, వానవర్ - నిత్యసూరులు, వానవర్కోనొడుమ్ - విష్వక్సేనులతోఁగూడ, నమన్ఱు - నమస్కరించి, ఎழుమ్ - ఉజ్జీవించుచున్న, తిరువేజ్గడమ్ - వేఙ్కటాద్రియనెడి, తడమ్-విశాలమైన, కున్ఱమ్ - పర్వతము, నజ్గట్కు - మనకు, శమన్కొళ్ - (భగవంతునితో) సామ్యముగల, వీడు - మోక్షమును, తరుమ్ - ఇచ్చును.

తా॥ నిత్యసూరులుగూడ పుష్పధూపదీపాద్యుపకరణములను సంపాదించుకొనివచ్చి భక్తితోనర్చింపఁదగిన వేఙ్కటాద్రియే మనకన్నివిధములైన కైఙ్కర్యముల నిచ్చునని. ౭.

‡‡ కున్ఱమేన్ది కుళిర్మழை కాత్తవన్*
అన్ఱుஞాలమళన్ద పిరాన్*పరన్
శెన్ఱుశేర్ తిరువేజ్గడమామలై *
ఒన్ఱుమేతొழ నమ్వినై యోయుమే. ౮.

అ॥ కున్ఱమ్ - గోవర్ధనపర్వతమును, ఏన్ది - ఎత్తిధరించి, కుళిర్ - చల్లని, మழை - వర్షములోనుండి, కాత్తవన్ - (గోపలను) రక్షించినవాఁడును, అన్ఱు - మహాబలి చేనపహరింపఁబడినప్పుడు, ஞాలమ్ - భూమిని, అళన్ద - కొలిచిన, పిరాన్ - ఉపకారకుండునునైన, పరన్ - సర్వేశ్వరుఁడు, శెన్ఱు - పోయి, శేర్ - చేరియున్న, తిరువేజ్గడమ్ - తిరువేజ్గడమనెడి, మామలైయొన్ఱుమే - గొప్పపర్వతమొకటినే, తొழ - ఆశ్రయించినయెడల, నమ్వినై - మనపాపము, ఓయుమ్ - నశించును.

తా॥ ఇన్ద్రుఁడు గోపలమీఁద గోపించి రాళ్లవర్షమును గురుపింపగా నప్పుడు గోవర్ధనపర్వతమునెత్తి గోపలనురక్షించినవాఁడును, మహాబలివద్దనున్న భూమిని తనవశపఱచుకొనినవాఁడునైన శ్రియఃపతి నిత్యవాసముజేయుచున్న వేఙ్కటాద్రిని యాశ్రయించినయెడల మనపాపములుతొలఁగునని. ౮

ఓయుమూప్పుప్పిఱప్పిఱప్పు*పిణి
వీయుమాఱు శెయ్వాన్ తిరువేజ్గడ
త్తాయన్*నాణ్మలరామ్ అడిత్తామరై *
వాయుళ్ళుమ్ మనత్తుళ్ళుమ్ వైప్పార్గట్కే. ౯.

అ॥ పిణి - (ఆశ్రితుల)వ్యాధులు, వీయుమాఱు - నశించునటుల, శెయ్వాన్ - చేయువాడై, తిరువేజ్గడత్తు - వేఙ్కటాద్రియందువేంచేసియున్న, ఆయన్ - శ్రీకృష్ణునియొక్క, నాణ్మ

లరామ్ - నూతనపుష్పమువలెనున్న, అడిక్కాళై - శ్రీపాదపద్మములను, వాయుళ్ళుమ్ - వాక్కులోను, మనత్తుళ్ళుమ్ - మనస్సులోను, వైప్పార్‌గట్కు - ఉంచుకొనువారికి, యూప్పు-వార్ధకము, పిఱప్పు - జన్మము, ఇఱప్పు - మరణము, (ఇవియన్నియూ), ఓయుమ్ - నశించును.

తా॥ ఆశ్రితుల దుఃఖములను బోగొట్టుటకై వేఙ్కటాద్రియందు వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదముల నాశ్రయించినయెడల మన సాంసారికదుఃఖములన్నియు నశించునని. ౯.

వైత్తనాళ్వరై యెల్లై కుఱుగిచ్చెన్ఱు
ఎయ్‌త్తిళైప్పదన్మున్నమ్ అడైమినో*
పైత్తపామ్బణైయాన్ తిరువేఙ్గడమ్*
మొయ్‌త్తశోలై మొయ్‌పూన్దడన్దాழ்వరే, ౧౦.

అ॥ వైత్త - సర్వేశ్వరుఁడేర్పఱచియుంచిన, నాళ్ - ఆయుస్సుయొక్క, వరై-అన్తమైన, ఎల్లై - అవధి, కుఱుగి - సమీపించి, ఎయ్‌త్తు - శరీరముశిథిలమై, ఇళైప్పదన్మున్నమ్ - మనస్సునొచ్చిపోవుటకుమునుపే, పైత్త - వికసించియున్న, (ఫణములుగల) పామ్బు - ఆదిశేషుని, అణైయాన్-పడకగాగలశ్రియఃపతి నిత్యవాసముజేసెడి, తిరువేఙ్గడమ్-వేఙ్కటాద్రియొక్క, మొయ్‌త్త-నిండియున్న, శోలై-తోపులనున్న, మొయ్-సున్దరమైన, పూ-పుష్పములనున్నగల, తాழ்వరే - క్రిందప్రదేశమునే, శెన్ఱు - పోయి, అడైమినో - ఆశ్రయించుఁడి.

తా॥ ఓచేతనులారా ! మీరు దృఢగాత్రులైయున్నప్పుడేవెళ్ళి, శేషశాయి వేంచేసియున్న సున్దరమైన వేఙ్కటాద్రిని యాశ్రయించుఁడని. ౧౦

‡‡ తాళ్‌పరప్పి మణ్డావియ ఈశనై *
నీళ్‌పొழிల్ కురుగూర్‌చ్చడగోపన్‌శొల్ *
కేழிలాయిరత్తిప్పత్తుమ్‌వల్లవర్ *
వాழ்వర్ వాழ்వెయ్‌ది ఞాలమ్పుగழவే. ౧౧.

అ॥ తాళ్ - శ్రీపాదములను, పరప్పి - విస్తరింపజేసి, మణ్ - భూమిని, తావియ - కొలిచిన, ఈశనై - సర్వేశ్వరునియుద్దేశించి, నీళ్ - పొడవైన, పొழிల్ - తోటలుగల, కురుగూర్ - తిరునగరికిస్వామియైన, శడగోపన్-నమ్మాழ்వార్లు, శొల్-పాయించిన, కేழிల్-ఒప్పులేని, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లవర్ - అభ్యసించువారు, వాழ்వు - కైఙ్కర్యసంపత్తును, ఎయ్‌ది - పొంది, ఞాలమ్ - లోకమంతయు, పుగழ-స్తోత్రముజేయునట్లు, వాழ்వర్ - సుఖబడుదురు

తా॥ త్రివిక్రమావతారంబెత్తిన శ్రియఃపతివిషయమై నమ్మాழ்వార్లుపాయించిన నిరుపమానంబైన యీపదిపాశురముల నభ్యసించువారు లోకోత్తరమైన భగవత్కైఙ్కర్యమునుబొందుదురని.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౪ - వ తిరువాయ్మొழி.



అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, వేఙ్కటాద్రియందు వేంచేసియున్న సర్వేశ్వరునికి సకలవిధకైఙ్కర్యములను జేయవలయునని దలంచి, వ్రజమై దూరాన్యప్యత్ప్రష్టవస్తువులంజూచి వాడు తనచాపల్యముచే నన్నింటినియొకప్పుడే యాశబడునటు యత్యద్భుతంబులైనవానియొక్క స్వరూపరూపగుణవిభూత్యాదులను సాక్షాత్కరించి యాశ్చర్యబడి యేమియుందోచక స్తబ్ధులై దివ్యవిగ్రహ కల్యాణగుణ విభూత్యాదుల నొకప్పుడే యనుభవించుచున్నారు.

‡‡ పుగழு నల్లొరువనెన్గో పొరువిల్ శీర్ప్పూమియెన్గో*
తిగழு మ్ తణ్ పరవైయెన్గో తీయెన్గో వాయువెన్గో*
నిగழு మాకాశమెన్గో నీళ్ శుడరిరణ్డుమెన్గో*
ఇగழ்వ్విలివ్వనైత్తుమెన్గో కణ్ణనై క్కూవుమాఱే. ౧.

అ॥ కణ్ణనై - శ్రీకృష్ణుని, కూవుమాఱు - చెప్పెడివిధము, (చెప్పునప్పుడు) పుగழுమ్ - స్తోత్రముజేయదగిన, నల్ - ఆనన్దగుణములుగల, ఒరువన్ - అద్వితీయుఁడు, ఎన్గో - అనిచెప్పెదనా? పొరువిల్ - ఒప్పులేని, శీర్ - క్షమాగుణముగల, పూమియెన్గో - భూమియనియెదనా? తిగழுమ్ - నిర్మలమై, తణ్ - చల్లనైన, పరవైయెన్గో - జలమనియెదనా? తీయెన్గో - అగ్నియనియెదనా? వాయువెన్గో-వాయువనియెదనా? నిగழுమ్ - (పృథివ్యాదులునశించినప్పుడుగూడ తాను) వర్తించుచున్న, ఆకాశమెన్గో - ఆకసమనియెదనా? నీళ్ శుడర్ - మిక్కిలితేజస్సుగల, ఇరణ్డుమెన్గో - చన్ద్రసూర్యులనియెదనా? ఇగழ்వ్విల్ - ఒకటియుతగ్గక, ఇవ్వనైత్తుమెన్గో - ఇవియన్నియునని యెదనా?—పృథివీజలాదులను సర్వేశ్వరుఁడుతానే నిమిత్తోపాదాన సహకారి కారణములుగానుండి సృజించియు, వానికన్తర్యామియైయుండి పోషించియు, తరువాత సంహరించి తనలోనుంచుకొనియు, తనయిష్టానుసారముగ వానిని తనకు వినియోగపఱచుకొనియు, ఇట్లువానియొక్క సృష్టిస్థితి సంహారాదులకు తానేకారణభూతుండగుటచేతను, ఆవస్తువులన్నియు వీనినిఁబడిచి యొకక్షణమైనను వేరుగానుండుట కయోగ్యంబులగుటచేతనున్ను, ఆవస్తువులన్నియు సర్వేశ్వరునికి శరీరంబులుగానుండును, గనుక, లోకమందుశరీరవాచకంబులైన మనుష్య పశుపక్షి చైత్రమైత్ర గోవ్యాఘ్రాది శబ్దములు ఆశరీరములను నిర్వహించుచు వానిలోపలనున్న యాత్మను బోధించుట యనుభవసిద్ధమైయుండునట్లు పృథివ్యాదిసమస్తశబ్దములును ఆయావస్తువును శరీరముగాగల సర్వేశ్వరునికివాచకంబులగుచున్నవని పృథివ్యాదిశబ్దములచే సర్వేశ్వరుని యనుసన్ధించుచున్నారు.

తా॥ సర్వేశ్వరుఁడు, పృథివీజలతేజోవాయ్వాకాశ చన్ద్రసూర్యస్వరూపుడైయున్నాఁడు. పరమానన్దయుతుఁడైనవానిని యీశబ్దములలోనే నేశబ్దముతో పిలిచెదనని. ౧.

కూవుమాఱఱియమాట్టేన్ కున్ఱఙ్గళనైత్తుమెన్గో*
మేవుశీర్ మారియెన్గో విళఙ్గుతారగైగళెన్గో*

నావియల్ కలైగళెన్గో ఞాననల్లావియెన్గో*
పావుశీర్ క్కణ్ణనెమ్మాన్ పఙ్గయక్కణ్ణనైయే. ౨.

అ॥ కున్ఱజ్గళ్ నైత్తుమ్ - సమస్తకులాచలస్వరూపుఁడు, ఎన్గో - అనిచెప్పెదనా? మేవు - ఎల్లరునాశబడదగిన, శీర్ - శైత్యగుణముగల, మారియెన్గో - మేఘమనియెదనా? విళజ్గు - ప్రకాశించుచున్న, తారగైగళ్గో - నక్షత్రములనియెదనా? నా - నాలికచే, ఇయల్ - చెప్పఁదగిన, కలైగళ్గో - విద్యలనియెదనా? ఞానమ్ - జ్ఞానమునకు, నల్ - విలక్షణమైన, ఆవియెన్గో - శరీరమైనశబ్దమనియెదనా? పా - ప్రసిద్ధమైన, శీర్ - కల్యాణగుణంబులుగలవాఁడై, కణ్ణన్ - పరమసులభుఁడై, ఎమ్మాన్ - మాస్వామియైన, పఙ్గయక్కణ్ణనై - కమలాక్షుని, కూవుమాఱు - పిలిచెడివిధము, అఱియమాట్టేన్ - తెలిసికొనలేను.

తా॥ ప్రసిద్ధంబులైన జ్ఞానానన్దాది కల్యాణగుణంబులుగల మాస్వామియైన కమలాక్షుఁడు వెనుకచెప్పిన పృథివ్యాదుల పరిణామరూపంబులైన పర్వతమేఘనక్షత్ర విద్యాశబ్దములకు నిర్వాహకుండైయున్నాఁడని. ౨.

పఙ్గయక్కణ్ణనెన్గో పవళచ్చెవ్వాయనెన్గో*
అఙ్గదిరడియనెన్గో అఞ్జనవణ్ణనెన్గో*
శెఙ్గదిర్ముడియనెన్గో తిరుమఱుమార్వనెన్గో*
శఙ్గుశక్కరత్తనెన్గో శాదిమాణిక్కత్తైయే. 3.

అ॥ శాది - మంచిజాతియైన, మాణిక్కత్తై - మాణిక్యమువంటికాన్తిగల దివ్యవిగ్రహముగల శ్రియఃపతిని, పఙ్గయక్కణ్ణనెన్గో - కమలాక్షుఁడనియెదనా? పవళమ్ - పగడమువలె, శెమ్ - ఎఱ్ఱనైన, వాయనెన్గో - అధరముగలవాఁడనియెదనా? అమ్ - సున్దరమైన, కదిర్ - కాన్తిగల, అడియనెన్గో - శ్రీపాదముగలవాఁడనియెదనా ? అఞ్జనవణ్ణనెన్గో - కాటుకవలె నీలవర్ణముగలవాఁడనియెదనా? శెమ్ - ఎఱ్ఱనైన, కదిర్ - కిరణములుగల, ముడియనెన్గో - కిరీటముగలవాఁడనియెదనా? తిరు - శ్రీమహాలక్ష్మినిన్ని, మఱు - శ్రీవత్సమనెడి చిహ్నమునున్నగల, మార్వనెన్గో - వక్షస్థలముగలవాఁడనియెదనా? శఙ్గుశక్కరత్తనెన్గో - శఙ్ఖచక్రములుగలవాఁడనియెదనా?

తా॥ అత్యుజ్జ్వలమైన తిరుమేనుగల శ్రియఃపతి, దివ్యావయవములతోనున్న, దివ్యాభరణములతోనున్న, దివ్యాయుధములతోనున్న, దివ్య విగ్రహముతోనున్న, పరమపదమందు వేంచేసియున్నాడు. వానిని నే నేతిరునామముతో పిలిచెదనని. 3.

శాదిమాణిక్కమెన్గో శవికొళ్ పొన్ముత్తమెన్గో*
శాదినల్వయిరమెన్గో తవివిల్ శీర్విళక్కమెన్గో*
ఆదియఞ్జోదియెన్గో ఆదియమ్పురుడనెన్గో*
ఆదుమిల్ కాలత్తెన్దై యచ్చుదనమలనైయే. ౪.

అ॥ ఆదుమిల్ - ఏసహాయములేని, కాలత్తు - ప్రళయకాలమందు, ఎన్దై-నాకుసహాయమై స్వామియైయున్నవాఁడును, అచ్చుదన్ - ఆశ్రితులనువిడువనివాఁడును, అమలనై-బదులుప్రయోజనమునపేక్షించని) పరిశుద్ధుఁడునైనశ్రియఃపతిని, శాదిమాణిక్క-మెన్గో - శ్రేష్టమైనమాణిక్యమని యెదనా? శవికొళ్ - కాన్తిగల, పొన్ - బంగారమనియెదనా? శవికొళ్ - లావణ్యముగల, ముత్తమెన్గో-ముత్యమనియెదనా? శాది - ఆకరమందుబుట్టిశ్రేష్ఠమైన, నల్ - విలక్షణమైన, వయిరమెన్గో - వజ్రమనియెదనా? తవివిల్ - వినాశములేని, శీర్-ప్రకాశముగల-విళక్క-మెన్గో-దీపమని యెదనా? ఆది - పూర్వమునుంచియున్న, అమ్ - సున్దరమైన, శోది - తేజోమయవిగ్రహముగల వాఁడనియెదనా? ఆది - కారణభూతుఁడై, అమ్-ఆసన్ధములుగల, పురుడనెన్గో - పరమపురుషుఁడనియెదనా?

తా॥ ఆశ్రితరక్షకుఁడైన శ్రియఃపతియే తేజోరూపంబులైన దీపవజ్రమౌక్తిక మాణిక్యస్వరూపముగానున్నాఁడు. అప్రాకృత శుద్ధసత్త్వమయ విగ్రహముగల పరమపురుషునియొక్క యీ స్వరూపములలో నే నేస్వరూపము ననుసంధించెదనని. ౪

అచ్చుదనమలనెన్గో అడియవర్వినై కెడుక్కుమ్*
నచ్చుమామరున్దమెన్గో నలఙ్గడలముదమెన్గో*
అచ్చువై కట్టియెన్గో అఱుశువై యడిశిలెన్గో*
నెయ్చ్చువై త్తేఱలెన్గో కనియెన్గో పాలెన్గేనో. ౫.

అ॥ అచ్చుదన్ - అచ్యుతుఁడనియెదనా? అమలనెన్గో - శుద్ధస్వభావుండనియెదనా? అడియవర్ - భక్తులయొక్క, వినై - దుఃఖములను, కెడుక్కుమ్ - పోఁగొట్టదగినదియు, నచ్చు-ఆశపడఁగినదియునైన, మా - శ్లాఘ్యమైన, మరున్దమెన్గో - మందనియెదనా? నలమ్- భోగ్యమైన, కడల్ - సముద్రమందుఁబుట్టిన, అముదమెన్గో - అమృతమనియెదనా? అచ్చువై - అట్టిభోగ్యత గల, కట్టియెన్గో - పడికబెల్లమనియెదనా? అఱుశువై - *షడ్రసములుగల, అడిశిలెన్గో-ప్రసాదమనియెదనా? శువై - రుచిగల, నెయ్ - నెయ్యియనియెదనా? శువై - రుచిగల, తేఱలెన్గో - తేనెయనియెదనా? కనియెన్గో - పక్వమైనఫలమనియెదనా? పాలెన్గేనో - పాలనియెదనా?

తా॥ ఆశ్రితదుఃఖహరుఁడై, అమృతము, తేనె, నెయ్యి, పాలు, శర్కర, షడ్రసోపేతమైన ప్రసాదము మొదలగు రుచిగలపదార్థస్వరూపుఁడైన శ్రియఃపతిని నే నేతిరునామములతో మొదట పిలిచెదనని. ౫

పాలెన్గో నాన్గువేదప్పయనెన్గో*శమయనీది
నూలెన్గో నుడఙ్గుకేళ్వియిశైయెన్గో*ఇవఱ్ఱుళ్ నల్ల
మేలెన్గో వినైయిల్ మిక్కపయనెన్గో*కణ్ణనెన్గో
మాలెన్గో మాయనెన్గో వానవరాదియైయే. ౬.

*తీపు, పులుపు, ఉప్పు, వగరు, కారము, చేదు, ఇవి షడ్రసములు.

అ॥ వానవర్ - బ్రహ్మాదులకు, ఆదియై - కారణభూతుఁడైన శ్రియఃపతిని, పాలెన్గో-పాలు నియొదనా? నాన్గువేదమ్ - నాలుగువేదములనెడి, పయనెన్గో-ప్రయోజన (సార) మనియొదనా? శమయమ్ - సిద్ధాన్తస్థాపకమైన, నీది - న్యాయమును ప్రతిపాదించెడి, నూలెన్గో - శాస్త్రమనియొదనా? సుడఙ్గు - మోహింపఁజేసెడి, కేళ్వి - శ్రవణముగల, ఇశైయెన్గో - గీతమనియొదనా? ఇవఱ్ఱుళ్ - ఇవియన్నిఁటికంటె, నల్ల - విలక్షణమై, మేలెన్గో - మేలైన భోగ్యవస్తువనియొదనా? వినైయిల్ - సాధనముకంటె, మిక్క - అధికమైన, పయనెన్గో-ఫలమనియొదనా? కణ్ణనెన్గో - సులభుఁడైన శ్రీకృష్ణుఁడనియొదనా? మాలెన్గో - (ఆశ్రితులయందు) వ్యామోహము గలవాఁడనియొదనా? మాయనెన్గో - ఆశ్చర్యభూతుఁడనియొదనా?

తా॥ బ్రహ్మాది సకల దేవతులకున్ను నిర్వాహకుఁడైన శ్రియఃపతిని, సకలవేదశాస్త్రప్రతిపాద్యుఁడనియొదనా? శ్రవణానందకరంబైన గానమనియొదనా? ఇంతకంటె మేలైన రసవత్తమవస్తువనియొదనా? సకలపుణ్యఫలమనియొదనా? ఆశ్రితవత్సలుఁడనియొదనా? నే నేతిరునామమును చెప్పియనుసన్ధించెదనని. ౬

వానవరాదియెన్గో వానవర్ తెయ్వమెన్గో*
వానవర్ పోగమెన్గో వానవర్ ముఱ్ఱుమెన్గో*
ఊనమిల్ శెల్వమెన్గో ఊనమిల్ శువర్క్కమెన్గో*
ఊనమిల్ మోక్కమెన్గో ఒళిమణివణ్ణనైయే ౭.

అ॥ ఒళి - ఉజ్జ్వలమైన, మణి - రత్నమువంటి, వణ్ణనై - వర్ణముగలసర్వేశ్వరుని, వానవరాదియెన్గో - నిత్యసూరినిర్వాహకుఁడనియొదనా? వానవర్ తెయ్వమెన్గో - నిత్యసూరులారాధించెడి దేవతయనియొదనా? వానవర్ పోగమెన్గో-నిత్యసూరులనుభవించెడి భోగ్యవస్తువనియొదనా? వానవర్ ముఱ్ఱుమెన్గో- నిత్యసూరులకుతక్కిన సకలవిధబన్ధువనియొదనా? ఊనమిల్ - నాశములేని, శెల్వమెన్గో - ఐశ్వర్యమనియొదనా? ఊనమిల్ - నాశములేని, శువర్క్కమెన్గో - స్వర్గమనియొదనా? ఊనమిల్ - సజ్కోచములేని, మోక్కమెన్గో - మోక్షమనియొదనా?

తా॥ నిత్యసూరులకు నిర్వాహకుఁడై, వారికి దేవతయై, భోగ్యపదార్థమై, సకలవిధబన్ధువై, ఐశ్వర్యస్వర్గమోక్షాది సకలపురుషార్థప్రదుఁడై, ఇన్ద్రనీలశ్యాముడైన శ్రియఃపతిని నే నేగుణమును చెప్పి కొండటవర్ణించెదనని. ౭

ఒళిమణివణ్ణనెన్గో ఒరువనెన్ఱేత్తనిన్ఱ*
నళిర్మదిచ్చడైయనెన్గో నాన్ముగక్కడవుళెన్గో*
అళిమగిழ்న్దులగమెల్లామ్ పడైత్తవైయేత్తనిన్ఱ*
కళిమలర్త్తుళవనెమ్మానై కణ్ణనై మాయనైయే. ౮.

అ॥ అళి - జగద్రక్షణమందు, మగిழ்న్దు - సన్తోషముగలవాఁడును, ఉలగమెల్లామ్-లోకములన్నిఁటిని, పడైత్తు - సృజించి, అవై - ఆలోకములు, ఏత్తనిన్ఱ-స్తోత్రముచేయునట్లుచేసియున్నవాఁడును, కళి - తేనెనున్న, మలర్ - పుష్పములున్నుగల, తుళవమ్ - తులసీమాలిక

గలవాఁడును, ఎమ్మాన్ - నాస్వామియు, మాయనై - అద్భుతచేష్టితములుగలవాఁడునైన, కణ్ణనై - శ్రీకృష్ణుని, మణి - రత్నమువలె, ఒళి - ప్రకాశించుచున్న, వణ్ణనెన్గో - తిరుమేనుగలవాఁడనియెదనా? ఒరువనెన్ఱు - జగత్కారణుఁడని, ఏత్తనిత్త - (అవివేకులు) స్తోత్రముచేయుచున్న వాఁడును, నళిర్ - చల్లనైన, మది - చన్ద్రునిని, శడై యన్ - జటనుగలవాఁడునైనరుద్రుఁడు ఎన్గో - అనియెదనా? నాన్ముగక్కడవుళెన్గో బ్రహ్మదేవుఁడనియెదనా?

తా॥ జగత్సృష్టిరక్షణాదులయందాసక్తుఁడై బ్రహ్మరుద్రాదులనుగూడ విభూతిగా గలవాఁడైన శ్రియఃపతిని నే నేమనివర్ణించెదనని. ౮

కణ్ణనై మాయన్ఱనై క్కడల్కడైన్దముదఙ్గొణ్డ*
అణ్ణలై యచ్చుదనై యనన్దనై యనన్దన్తన్మేల్*
నణ్ణినన్ఱుఱైగిన్ఱానై ఞాలముణ్డుమిழ்న్ద మాలై *
ఎణ్ణుమాఱఱియమాట్టేన్ యావైయుమ్ యవరుమ్దానే. ౯.

అ॥ కణ్ణనై - కృష్ణావతారంబెత్తినవాఁడును, మాయన్ఱన్నై - అద్భుతగుణంబులుగలవాఁడును, కడల్ - సముద్రమును, కడైన్దు - చిలికి - అముదమ్ - అమృతమును, కొణ్డ - తెచ్చియిచ్చిన, అణ్ణలై - స్వామియు- అచ్చుదనై - ఆశ్రితులను విడువనివాఁడును, అనన్దనై - అపరిచ్ఛిన్నవైభవముగలవాఁడును, అనన్దన్తన్ మేల్ - ఆదిశేషునిమీఁద, నణ్ణి - అమరికతోనుండి, నన్గు - చక్కగా, ఉఱైకిన్ఱానై - పవ్వళించినవాఁడును, ఞాలమ్ - భూమిని, ఉణ్డు - ఆరగించి ఉమిழ்న్ద - బయలుపఱచినవాఁడును, మాలై - శ్రియఃపతిని, ఎణ్ణుమాఱు - అనుసన్ధించువిధమును, అఱియమాట్టేన్ - ఎఱుఁగను. యావైయుమ్-సమస్తచేతనములనున్ను, యవరుమ్-సమస్తచేతనులనున్ను, తాన్ - తనకుశరీరముగాగలవాఁడు (అనిమాత్రమెఱుఁగుదును).

తా॥ జగత్సృష్టిసంహారకారకుఁడును, భక్తులయభీష్టమునిచ్చువాఁడును, సకలచేతనాచేతనములకన్తరాత్మయునైన శేషశాయిని యెట్లనుసన్ధింపవలెనో, ఆవిధమునుగూడ నేనెఱుఁగనని.

యావైయుమ్యవరుమ్దానా యవరవర్ శమయన్దోఱుమ్*
తోయ్విలన్పులనైన్దుక్కుమ్ శొలప్పడానుణర్విన్మూర్త్తి*
ఆవిశేరుయిరినుళ్ళా లాదుమోర్పఱ్ఱిలాద*
పావనై యదనైక్కూడి లవనై యుఙ్గూడలామే. ౧౦.

అ॥ యావైయుమ్ - సకలచేతనములకును, యవరుమ్ - సకలచేతనులకును, తానాయ్ - తానన్తర్యామియైయుండువాఁడును, అవరవర్ - ఆదేవమనుష్యాదులయొక్క, శమయన్దోఱుమ్ - *వ్యవస్థలయందు, తోయ్విలన్ - స్పర్శములేనివాఁడును, పులనైన్దుక్కుమ్ - పఞ్చేన్ద్రియములకును, (విషయమని), శొలప్పడాన్ - చెప్పదగినగానివాఁడును, ఉణర్విన్మూర్త్తి - జ్ఞానస్వరూపుండునైయుండును, ఆవిశేర్ - శరీరమందున్న, ఉయిరినుళ్ - జీవాత్మయందు, ఆదుమ్ - (శరీరసంబన్ధమైన బాల్యయౌవనాది) ఏవిధమైనయవస్థయు,ఓర్ - ఒకటియు, పఱ్ఱిలాద-సంబన్ధిం

*అయాజాతులకుదగిన జ్ఞానసఙ్కోచవికాసములు, శరీరానుగుణపరిణామములు, సుఖదుఃఖములు, ఇవిమొదలైనవి.

చని, పావనై యదనై - అభావనను, కూడిల్ - చేరినయెడల, అవనై యుమ్ - ఆ శ్రియఃపతినిన్ని, కూడలామ్ - చేరవచ్చును. ఏ - నిశ్చయము.

తా॥ సకలచేతనాచేతనవస్తువులలో వ్యాపించియున్న ప్పటికిన్ని, ఆయావస్తువులయందున్న సుఖదుఃఖాదులున్ను ఉత్పత్తివినాశాదులున్ను సర్వేశ్వరునికంటవు. వాడుచతురాదిబాహ్యేంద్రియములగుపడడు జ్ఞానస్వరూపుడై యుండును. ఆసర్వేశ్వరుని యిట్టివాఁడని యెట్లునమ్మవచ్చుననగా, ఈశరీరమందు జీవాత్మయున్న ప్పటికిన్ని దానియొక్క ఉత్పత్తి వినాశాదులున్ను బాల్యయౌవనాదులున్ను జీవునికి ఎటులసంభవించవో? అవిధమును చక్కగా నెఱింగినయెడల, వీట్లయందు వ్యాపించియున్న సర్వేశ్వరునికిఁగూడ యాదోషములేమియు లేవనిసులభముగా తెలిసికొనవచ్చునని. ౧౧

౹౹ కూడివణ్డైయుమ్ తణ్డార్ కొణ్డల్ పోల్వణ్ణన్ఱనై*
మాడలర్ పొழிల్ కురుగూర్వణ్ శడగోపన్ శొన్న*
పాడలోరాయిరత్తుళివై యుమొరుపత్తుమ్ వల్లార్*
వీడిలపోగ మెయ్‌ది విరుమ్బువరమరర్ మొయ్‌త్తే. ౧౧.

అ॥ వణ్డు - తుమ్మెదలు, కూడి - గుంపుగాచేరి, అణైయుమ్ - శబ్దించుచున్న, తణ్ - చల్లని, తార్ - తులసీమాలగలవాఁడును, కొణ్డల్ పోల్ - మేఘమువంటి, వణ్ణన్ఱనై - కాన్తి గలవాఁడునైన శ్రియఃపతినిగురించి, మాడు - చుట్టును, అలర్ - వికసించుచున్న (పుష్పములు గల), పొழிల్ - తోటలుగల, కురుగూర్ - కురుకానగరికి (స్వామియైన), వణ్ - ఉదారులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొన్న - సాయించిన, పాడల్ - గానములోఁగూడిన, ఓరాయిరత్తుళ్ - ఒక వెయ్యిపాశురములలో, ఇవైయుమొరుపత్తుమ్ - ఈయొక పదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, వీడిల - అపరిచ్ఛిన్నమైన, పోగమ్ - భగవదనుభవమును, ఎయ్‌ది- పొంది, అమరర్ - నిత్యసూరులచే, మొయ్‌త్తు - చుట్టుకొని, విరుమ్బువర్ - ఆశపడఁదగినవారై యుందురు.

తా॥ భోగ్యమైన తిరుత్తుழாయిమాలగల నీలమేఘశ్యాముఁడైన శ్రియఃపతి విషయమై నమ్మాళ్వార్లు పాడిఁచిన యీపదిపాశురముల ననుసన్ధించువారు నిరన్తర భగవదనుభవముగల వారై నిత్యసూరిగోష్ఠిలోఁజేరుదురని. ౧౧

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౫-వ తిరువాయ్‌మొழி.

అవతారిక:- ఈతిరువాయ్‌మొழிలో, శ్రియఃపతియొక్క వాత్సల్యాదిగుణముల ననుభవించి హృష్టులైన నమ్మాళ్వార్లు, ఆగుణముల ననుసన్ధించనివారొకవస్తువుకాదనియు, అనుసన్ధించువారు పరమోత్కృష్టులనియు వర్ణించుచున్నారు.

‡‡ మొయ్‌మ్మామ్బూమ్బొழிల్ పొయ్‌గై ముదలై చ్చిఱైప్పట్టునిన్ఱ*
కైమ్మావుక్కరుళ్ శెయ్‌ద కార్ముగిల్ పోల్వణ్ణన్ కణ్ణన్*
ఎమ్మానై చ్చొల్లిప్పాడి యెழுన్దుమ్బఱన్దుమ్ తుళ్ళాదార్
తమ్మాల్ కరుమమెన్ శొల్లీర్ తణ్ కడల్ వట్టత్తుళ్ళీరే. ౧

అ॥ మొయ్ - సున్దరమై, మా - విస్తారమైయున్న, పూ - పుష్పములుగల, పొழிల్ - తోఁపులుగల, పొయ్‌గై - మడుగునందు, ముదలై - ముసలిచే, శిఱైప్పట్టునిన్ఱ - గృహింపఁబడియున్న, కైమ్మావుక్కు - ఏనుఁగుకు, అరుళ్ శెయ్‌ద - కృపజేసిన, కార్ - నల్లని, ముగిల్పోల్ - మేఘమువంటి, వణ్ణన్ - కాన్తిగల, కణ్ణన్ - శ్రీకృష్ణుఁడైన, ఎమ్మానై - నాస్వామిని, శొల్లి - స్తోత్రముజేసి, పాడి - గానముజేసి, ఎழுన్దుమ్ - లేచియు, పఱన్దుమ్ - నాలుగుపక్కలతిరిగియు, తుళ్ళాదార్ తమ్మాల్ - నృత్యముజేయనివారిచే, కరుమమెన్ - పనియేమి? తణ్ - చల్లనైన, కడల్ - సముద్రముచే (చుట్టఁబడిన), వట్టత్తు - భూమియందు, ఉళ్ళీర్ - ఉన్నఓభక్తులారా! శొల్లీర్ - చెప్పుఁడు.

తా॥ మునుపొకకాలమందు మొసలిచే బాధబడుచున్న గజేన్ద్రాళ్వార్లని రక్షించిన శ్రియఃపతిని స్తుతించి యున్నచోటనుండక నృత్యముజేయనివారు ఈభూమియందు వ్యర్థమైపుట్టిరని. ౧.

తణ్ కడల్ వట్టత్తుళ్ళారై త్తమక్కిరై యాత్తడిన్దుణ్ణుమ్*
తిణ్ కழల్ కాలశురర్‌క్కు త్తీఙ్గిழைక్కుమ్ తిరుమాలై*
పణ్గళ్ తలైక్కొళ్ళప్పాడిప్పఱన్దుకునిత్తుழలాదార్*
మణ్గొళులగిల్ పిఱప్పార్ వల్వినై మోదమలైన్దే. ౨

అ॥ తణ్ - చల్లని, కడల్ - సముద్రముచే చుట్టబడిన, వట్టత్తు - భూమియందు, ఉళ్ళారై - ఉన్నవారిని, తమక్కు - తమకు, ఇరైయా - ఆహారముగా, తడిన్దు - బాధించి, ఉణ్ణుమ్ - భుజించువారును, తిణ్ - దృఢమైన, కழల్ - నూపురములుగల, కాల్ - కాళ్లుగలవారునైన, అశురర్‌క్కు - అసురులకు, తీఙ్గు - చెరుపును, ఇழைక్కుమ్ - విచారించుచున్న, తిరుమాలై - శ్రియఃపతిని, పణ్గళ్ - గానములు, తలైక్కొళ్ళ - అధికమగునట్లు, పాడి - గానముజేసియు, పఱన్దుమ్ - తిరిగియు, కునిత్తుழలాదార్ - నృత్యముజేయనివారు, మణ్గొళులగిల్ - భూలోకమందు, వల్వినై - పాపములు, మలైన్దు - అధికమై, మోద - అభివృద్ధియగునట్లు, పిఱప్పార్ - జన్మించుదురు.

తా॥ రాక్షసులచే బాధపడుచున్న మనుష్యుల కేవిధదుఃఖములున్ను రాకుండ విచారించి రక్షించుచున్న శ్రియఃపతిని స్తుతించి నృత్యముజేయనివారు నిత్యసంసారులగుదురని. ౨.

మలైయై యెడుత్తుక్కల్ మారికాత్తు ప్పశునిరై తన్నై*
తొలైవువిరుత్తపిరానై చ్చొల్లిచ్చొల్లి నిన్ఱెప్పోదుమ్*
తలైయినోడాదనమ్ తట్ట త్తడుకుట్టమాయ్ ప్పఱవాదార్*
అలైకొళ్ నరగత్తழுన్ది క్కిడన్దుழைక్కిన్ఱ వమ్బరే. 3

అ॥ మలైయై - గోవర్ధనపర్వతమును, ఎడుత్తు - ఎత్తి, కల్ మారి - రాళ్లవర్షమును, కాత్తు - అడ్డగించి, పశునిరైతన్నై - గోసమూహములయొక్క, తొలైవు - వినాశమును, తవిర్త్త - పోగొట్టిన, పిరానై - ఉపకారకుఁడైన శ్రియఃపతిని, ఎప్పోదుమ్ - ఎల్లప్పుడును, శొల్లి చ్చొల్లినిన్ఱు - నిరన్తరముగననుసన్ధించుచుండి, అదనత్తోడు - భూమిలో, తలైతట్ట - తలతగులు నటుల, తడుకుట్టమాయ్ - వంకరగా, పఱవాదార్ - తొందఱపడితిరుగనివారు, అలైకొళ్ - అలలు కొట్టుచున్న (వర్ధిల్లుచున్న), నరగిత్తు - నరకమందు, అళున్దిక్కిడన్దు - చిక్కుబడియుండి, ఉழைక్కిన్ఱ - దుఃఖించుచున్న, వమ్బర్ - వ్యర్థమైనవారు.

తా॥ శ్రీకృష్ణావతారమందు గోవర్ధనపర్వతమునెత్తి గోగోపాలనురక్షించిన శ్రియఃపతిని స్తుతించి పరవశులై తలక్రిందులుగావడి నృత్యముజేయనివారు నరకమునొంది దుఃఖము ననుభవించు దురని. 3.

వమ్బవిழ్ కోదై పొరుట్టా మాల్విడై యేழுమడర్త్త
శెమ్బవళత్తిరళ్వాయన్ శిరీదరన్ తొల్ పుగழ் పాడి*
కుమ్బిడునట్టమిట్టాడి కోకుగట్టుణ్ణులాదార్*
తమ్బిఱప్పాల్ పయనెన్నే శాదుశనఙ్గళిడై యే. ౪

అ॥ వమ్బు - పరిమళముగల, అవిழ் - వికసించియున్న, కోదైపొరుట్టు - మాలికతోనల ఙ్కరింపబడిన కేశపాశముగల నప్పిన్నప్పిరాట్టికొఱకై, మాల్ - గొప్పనైన, విడైయేழுమ్ - వృష భములేడింటిని, అడర్త్త - సంహరించినవాఁడును, శెమ్ - ఎఱ్ఱని, పవళమ్ - పగడము, తిరళ్ - చేరియున్నట్టున్న, వాయన్ - అధరముగలవాఁడునైన, శిరీదరన్ - శ్రీధరునియొక్క, తొల్ - అనాదియైన, పుగழ் - కీర్తిని, పాడి - గానముజేసి, కుమ్బిడు - ప్రణామముజేసి, నట్టమిట్టాడి - నృత్యముజేసి, కోకు - మెయ్మఱచినవ్యాపారములు, ఉగట్టుణ్డు - మించిపోయి, ఉழுలాదార్ దమ్ - తిరగనివారియొక్క, పిఱప్పాల్ - జన్మముచే, శాదుశనఙ్గళ్ - సాత్త్వికపురుషులయొక్క, ఇడైయే - నడుమ, ఎన్ - ఏమి, పయన్ - ప్రయోజనముకలదు.

తా॥ నప్పిన్నప్పిరాట్టికొఱకై యేడువృషభములనుజంపి మందహాసముజేయుచున్న శ్రియః పతియొక్క గుణములననుసన్ధించి పరవశులై నృత్యముజేయనివారు సత్పురుషగోష్ఠిలో నిరర్థకులై యుందురని. ౪.

శాదుశనత్తై నలియుమ్ కఞ్జనై చ్చాదిప్పదఱ్కు*
ఆదియఞ్జోదియురువై యఙ్గువైత్తిఙ్గుప్పిఱన్ద*
వేదముదల్వనై ప్పాడి వీదిగళ్ తోఱుమ్ తుళ్ళాదార్*
ఓదియుణర్న్దవర్ మున్నా ఎన్ శవిప్పార్ మనిశరే. ౫

అ॥ శాదుశనత్తై - సత్పురుషులను, నలియుమ్ - పీడించుచున్న, కఞ్జనై - కంసుని, శాదిప్పదఱ్కు - శిక్షించుటకై, అఙ్గు - అపరమపదమునందున్న, ఆది - ప్రధానమై, అమ్ - అప్రాకృతమై, శోది - తేజోమయమైన, ఉరువై - దివ్యవిగ్రహమును, వైత్తు - ఉంచుకొని, ఇఙ్గు -

ఈభువనమందు, పిఱన్ద - అవతరించిన, వేదముదల్వనై - వేదప్రతిపాద్యుఁడైన శ్రియఃపతిని, పాడి- గానముజేసి, వీదిగళ్ దోఱుమ్ - వీధివీధిగా, తుళ్ళాదార్ - నృత్యము జేయనివారు, ఓది - శాస్త్రా ధ్యయనముజేసి, ఉణర్న్దవర్ - జ్ఞానులైనవారియొక్క, మున్నా-ఎదుట, ఎన్ శవిప్పార్-ఏజపము జేసుదురు. మనిశరే - వారుమనుష్యులా? (కారు).

తా॥ భాగవతాపచారబడిన కంసుని సంహరించుటకై యప్రాకృతదివ్యమఙ్గళవిగ్రహ ముతో నవతరించిన శ్రీకృష్ణునియొక్క గుణముల ననుసన్ధించి పరవశులుగానివారొక ప్రయోజనము నకు నొదగరని. ౫

మనిశరుమ్మఱ్ఱుమ్ముఱ్ఱుమాయ్ మాయప్పిఱవిపిఱన్ద *
తనియన్ పిఱప్పిలితన్నై తడఙ్గడల్ శేర్న్దపిరానై *
కనియైక్కరుమ్బినిన్శాఱ్ఱై క్కట్టియై త్తేనై యముదై *
మునివిన్ఱియేత్తిక్కునిప్పార్ ముழுదుణర్నీర్మైయినారే. ౬.

అ॥ మనిశరుమ్ - మనుష్యులును, మఱ్ఱుమ్ - తక్కినదేవతలును, ముఱ్ఱుమాయ్ - తక్కినపశ్వాదులును, (ఏజన్మముగలవారైనను), మాయమ్ - అద్భుతంబులైన, పిఱవిపిఱన్ద - అవతారములనెత్తినవాడును, తనియన్ - అద్వితీయుండైనవాఁడును, పిఱప్పిలితన్నై - కర్మాధీనమైనజన్మములేనివాఁడును, తడమ్-విశాలమైన, కడల్ -సముద్రమందు, శేర్న్ద-పవ్వళించిన, పిరానై - ఉపకారకుఁడును, కనియై - ఫలమువంటివాఁడును, కరుమ్బినిన్శాఱ్ఱై-చెరుకురసము వంటివాఁడును, కట్టియై - పడికబెల్లమువంటివాఁడును, తేనై - తేనెవంటివాఁడును, అముదై - అమృతమువంటివాఁడునైనశ్రియఃపతిని, మునివు-అసూయ, ఇన్ఱి - లేనివారై, ఏత్తి - స్తుతించి, కునిప్పార్ - నృత్యముజేయువారు, ముழுదు - సకలార్థములను, ఉణర్-ఎఱుఁగిన, నీర్మైయినార్ - స్వభావముగలవారగుదురు.

తా॥ దేవమనుష్య పశుపక్ష్యాది యేజన్మ మెత్తినవారైనను, మధురమై తిప్పిలేనిగడ్డకట్టిన రసస్వరూపంబైన ఫలమువలె నతిభోగ్యుఁడైన క్షీరాబ్ధిశాయియొక్క నృసింహ రామ కృష్ణాద్యవ తారములను అసూయలేనివారై స్తుతించినయెడల వారే సకలార్థవేత్తలగుదురని. ౬.

నీర్మైయిల్ నూఱ్ఱువర్ వీయ ఐవర్క్కరుళ్ శెయ్దునిన్ఱు *
పార్మల్గు శేనైయవిత్త పరఞ్జుడరై నినైన్దాడి *
నీర్మల్గుకణ్ణినరాగి నెఞ్జుకుழைన్దునైయాదే *
ఊన్మల్గిమోదుపరుప్పార్ ఉత్తమర్గట్కెన్ శెయ్వారే. ౭.

అ॥ నీర్మైయిల్ - దయలేని, నూఱ్ఱువర్ - నూఱుగురైన దుర్యోధనాదులు, వీయ - నశించునటుల, ఐవర్క్కు - పాణ్డవులైదుగురికి, అరుళ్ శెయ్దునిన్ఱు - కృపజేసి, పార్ - భూమి యంతయు, మల్గు - నిండియున్న, శేనై - సేనను, అవిత్త - నశింపజేసిన, పరఞ్జుడరై - పరఞ్జ్యోతిస్స్వరూపుఁడైనశ్రియఃపతిని, నినైన్దు-ధ్యానించి, ఆడి-నృత్యముజేసి, నీర్-బాష్పముచే, మల్గు - నిండియున్న, కణ్ణినరాగి - నేత్రములుగలవారై, నెఞ్జమ్ - మనస్సు, కుழைన్దు -

శరిగి, నైయాదే - శిథిలముగాకుండ, ఊన్ మల్గు - మాంసముచేనిండియున్న, మోడు - ఉబ్బుగానున్నయవయవములు, పరుప్పార్ - పెఱిగియుండువారు, ఉత్తమర్గట్కు - సత్పురుషులకు, ఎన్ శెయ్వార్ - ఏప్రయోజనమును జేయుదురు.

తా॥ పాణ్డవులకుపకారముజేసిన దుర్యోధనాదులను సంహరించిన శ్రీకృష్ణునిధ్యానించి యానన్దభరితులై యుండక మాంసమయమైన శరీరమును పోషించువారప్రయోజకులని. ౭.

వార్ పునలన్దణరువి వడతిరువేఙ్గడత్తెన్దై*
పేర్ పలశొల్లిప్పిదర్ట్రి ప్పిత్తరెన్ఱే పిఱర్ కూఱ*
ఊర్ పలపుక్కుమ్పుగాదు ములోగర్ శిరిక్కనిన్ఱాడి*
ఆర్వమ్పెరుగిక్కునిప్పా రమరర్ తొழప్పడువారే. ౮

అ॥ వార్ - కారుచున్న, పునల్ - నీరుగల, అమ్ - సున్దరమై, తణ్ - చల్లనైన, అరువి- కొండచరియలుగల, వడ - ఉత్తరమందున్న, తిరువేఙ్గడత్తు - తిరుమలయందు వేంచేసియున్న, ఎన్దై- స్వామియైనశ్రియఃపతియొక్క, పల - అనేకవిధములైన, పేర్ - తిరునామములను, శొల్లి- చెప్పి, పిదట్రి - జల్పించి, పిఱర్ - అభక్తులు, పిత్తరెన్ఱు - పిచ్చివారని, కూఱ - చెప్పునటుల, పల- అనేకములైన, ఊర్ - మనుష్యులున్నగ్రామములోను, పుగాదుమ్ - మనుష్యులుప్రవేశించనిగ్రామములోను, పుక్కు - ప్రవేశించి, ఉలోగర్ - లౌకికజనులు, శిరిక్క - పరిహాసముజేయునట్లు, నిన్ఱు - నిలిపియుండి, ఆడి - నృత్యముజేసి, ఆర్వమ్ - అభినివేశము, పెరుగి - వర్ధించి, కునిప్పార్- నృత్యముజేయువారు, అమరర్ తొழప్పడువార్ - నిత్యసూరులాదరించునట్లగుదురు.

తా॥ అతిరమణీయమైన వేఙ్కటాద్రియందు వేంచేసియున్న శ్రియఃపతియొక్క తిరునామములను జెప్పి యచ్చటచ్చట పిచ్చివారివలె తిరిగి యందరుపరిహసించునట్లు ప్రేమపరవశులై నృత్యముజేయువారిని నిత్యసూరులు మెచ్చుకొనుదురని. ౮.

అమరర్ తొழప్పడువానై యనైత్తులగుక్కుమ్పిరానై*
అమరమనత్తినుళ్ యోగుపుణర్న్దవన్ తన్నోడొన్ఱాగ*
అమరత్తుణియవల్లార్ గళొழியవల్లాదవరెల్లామ్*
అమరనినైన్దెழున్దాడి యలఱ్ఱువదే కరుమమే. ౯

అ॥ మనత్తినుళ్ - మనస్సులో, అమర - అమరియుండునట్లు, యోగు - యోగాభ్యాసమును, పుణర్న్దు - దృఢముగాజేసి, అవన్ తన్నోడు - ఆసర్వేశ్వరునితో, ఒన్ఱాగ - సమానముగా అమర - అమరియుండునటుల, తుణియవల్లార్గళొழియ - అధ్యవసాయముగలవైవల్యార్థులుతప్ప, అల్లాదవరెల్లామ్ - తక్కినవారందరికిని, అమరర్ - నిత్యసూరులచే, తొழప్పడువానై - ఆశ్రయింపబడినవాడును, అనైత్తులగుక్కుమ్ - సకలలోకములకును, పిరానై, స్వామియునైన సర్వేశ్వరుని, అమర - అమరియుండి, నినైన్దు - ధ్యానించి, ఎழున్దు - లేచి, ఆడి - నృత్యముజేసి, అల ఱ్ఱువదే - స్తుతించుటయే, కరుమమ్ - చేయదగినకృత్యము.

తా॥ భగవన్తునియొక్క సౌశీల్యాదిగుణములనపేక్షించక భగవంతునివలె నజ్ఞానాదిసకల దోషరహితమై జ్ఞానానన్దస్వరూపమైన జీవాత్మయొక్క స్వరూపానుభవముసెడి కైవల్యమునుగోరిన యధములుతప్ప తక్కినవారెవరును, ఉభయవిభూతినాయకుండైన శ్రియఃపతిని ధ్యానించి లేచి నృత్యముజేసి స్తోత్రముజేయుదురు. మీకిదే పరమపురుషార్థమని. ౯.

కరుమముమ్కరుమపలనుమాగియ కారణన్ఱన్నై*
తిరుమణివణ్ణనై చ్చెజ్గణ్మాలినై త్తేవపిరానై *
ఒరుమైమన త్తినుళ్ వైత్తుళ్ళుజ్గుఱ్ఱెழுన్దాడి*
పెరుమైయుమ్నాణుమ్తవిర్న్దు పిదఱ్ఱుమిన్ పేదైమై తీర్న్దే. ౧౦.

అ॥ కరుమముమ్ - పుణ్యపాపములకును, కరుమపలనుమ్ - వానిఫలంబులైన స్వర్గనరకాదులకును, ఆగియ - నియామకుడై, కారణన్ఱన్నై - సకలకారణభూతుడై, తిరు - సున్దరమైన, మణి - రత్నమువంటి, వణ్ణనై - కాన్తిగలవాడై, శెజ్గణ్ - రక్తలోచనుడై, మాలినై - వాత్సల్యగుణముగలవాడై, తేవపిరానై - దేవాధిదేవుడైన శ్రియఃపతిని, ఒరుమై - ఒకవిధమైన (ప్రయోజనాన్తరము నపేక్షించని), మనత్తినుళ్ - మనస్సులో, వైత్తు - ఉంచి, ఉళ్ళమ్ కుழைన్దు - హృదయముకరిగి, ఎழுన్దాడి - లేచి నృత్యముజేసి, పెరుమైయుమ్ - (దురభిమానముచేవచ్చిన) గొప్పతనమును, నాణుమ్ - లజ్జను, తవిర్న్దు - వదలి, పేదైమై - (భగవత్కైఙ్కర్యమును తక్కువగాదలంచడమనెడి) అజ్ఞానమును, తీర్న్దు - పిదఱ్ఱుమిన్ - పరవశులై స్తుతించుడి.

తా॥ ఓ చేతనులారా! సకలఫలప్రదుడును, సకలకారణుడును, సున్దరవిగ్రహుడును, రక్తలోచనుడును, భక్తవత్సలుడును, దేవాధిదేవుడునైన శ్రియఃపతిని యనన్యప్రయోజనులై ధ్యానించి మెయిమఱచి నృత్యముజేసి దురభిమానమును లజ్జను వదలి భగవత్కైఙ్కర్యమును పరమప్రాప్యముగా సెంచియుండుడని. ౧౦

** తీర్న్దవడియవర్దమ్మై త్తిరు త్తిప్పణికొళ్ళవల్ల*
ఆర్న్దపుగழுచ్చుదనై యమరర్పిరానై యమ్మానై *
వాయ్న్దవళవయల్శూழ் తణ్వళ్ళుకురుగూర్చ్చడగోపన్*
నేర్న్దవోరాయిర త్తిప్ప త్తరువినై నీఱుశెయ్యుమే. ౧౧.

అ॥ తీర్న్ద - దృఢాధ్యవసాయముగల, అడియవర్దమ్మై - భాగవతులను, తిరుత్తి - దిద్ది (అజ్ఞానాదులను బోగొట్టి), పణికొళ్ళవల్ల - (వారిచే) కైఙ్కర్యము స్వీకరించ దగినవాడును, ఆర్న్ద - పూర్ణమైన, పుగழ் - కీర్తిగలవాడును, అచ్చుదనై - (భక్తులను) జాఱవిడువనివాడును, అమరర్పిరానై - నిత్యసూరినిర్వాహకుడునైన, ఎమ్మానై - స్వామిని, వాయ్న్ద - సమీపించినవారును, వళమ్ - సమృద్ధమైన, వయల్ - పొలములచే, శూழ் - చుట్టబడిన, తణ్ - చల్లనైన, వళమ్ - సకలసంపత్తుగల, కురుగూర్ - తిరుకురుగూరికి స్వామియునైన శఠగోపన్ -

నమ్మాழ்వార్లు, శేర్న్ద - పాడించిన, ఓరాయిరత్తు-ఒకవెయ్యిపాశురములలో, ఇప్పత్తు-ఈపది పాశురములు, అరువిన్లై - పాపములను, నీఱు శెయ్యుమ్ - భస్మమొనర్చును

తా॥ తననే మహాపారోపేయములుగా నెంచిన భాగవతుల కజ్ఞానాదులను దొలగించి తన కైఙ్కర్యమునిచ్చెడి శ్రియఃపతివిషయమై నమ్మాழ்వార్లుపాడించిన యీపదిపాశురముల ననుసంధిం చువారికిసకలపాపములు నశించునని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౬ - వ తిరువాయ్మొழி.

అవతారిక — ఈతిరువాయ్మొழிలో, భగవచ్ఛేషత్వమందరికి సమానమై యుండగా గొందరు భగవంతునియనాదరించుటకు గారణ మేమని యాలోచించి వారికతనిగుణంబులు తెలియ కపోవుటచేత ననాదరించుచున్నారని నిశ్చయించి యాగుణంబులను వారికుపదేశించుచున్నారు.

శెయ్యతామరైక్కణ్ణనాయులగేழுముణ్డవవక్కణ్డోర్* [మాయ్*
వైయమ్ వానమ్ మనిశర్ తెయ్వమ్ మఱ్ఱుమ్ మఱ్ఱుమ్ మఱ్ఱుమ్ముఱ్ఱు
శెయ్యశూழ் శుడర్ ఞానమాయ్ వెళిప్పట్టివై పడైత్తాన్* పిన్నుమ్
మొయ్కొళ్ శోదియోడాయినా నొరుమూవరాగియమూర్త్తియే. ౧.

అ॥ మొయ్కొళ్ - నిబిడమైయున్న, శోదియోడాయినాన్ - తేజస్సుపొందిలగుకల్యా ణగుణంబులుగలవాఁడును, ఒరు - అద్వితీయుమైనవాఁడును, మూవరాగియ - బ్రహ్మరుద్రేన్ద్రులు ముగ్గురిని తనకు శరీరముగాగలవాఁడును, మూర్త్తి-పరాత్పరుఁడును,పిన్నుమ్-మఱియు, వైయమ్- భూమికిని, వానమ్ - స్వర్గాదిలోకములకును, మనిశర్ - మనుష్యులకును, తెయ్వమ్-దేవతలకును, మఱ్ఱుమ్ - తక్కినపశ్వాదులకును, మఱ్ఱుమ్-తక్కినస్థావరములకును, మఱ్ఱుమ్-తక్కిన పఞ్చభూతములకును, ముఱ్ఱుమ్ - తక్కినమహదహఙ్కారాదులకును, ఆయ్ - ఉపాదానకా రణమైనవాఁడును, వెళిప్పట్టివై - ప్రమాణసిద్ధంబులైనవీనిని, శెయ్య-చక్కగా, శూழ் -వ్యాపిం చియున్న, శుడర్ - ఉజ్జ్వలమైన, ఞానమాయ్ - సఙ్కల్పరూపజ్ఞానముగలవాఁడై (నిమిత్తకా రణమైనవాఁడై), పడైత్తాన్ - సృజించువాఁడును, శెయ్య-సున్దరమైన, తామరైక్కణ్ణనాయ్- పద్మమువంటినేత్రములుగలవాఁడునైన శ్రియఃపతి, ఉలగేழுమ్ - సప్తలోకములను, ఉణ్డవవణ్ణోర్ - మ్రింగినవాఁడునుమండీ.

తా॥ దేవతిర్యఙ్మనుష్యస్థావరాది సమస్తవస్తువులనున్ను తనసఙ్కల్పముచే సృజించి సకలక ల్యాణగుణపూర్ణుఁడై బ్రహ్మాదిసకల దేవనిర్వాహకుఁడైయున్న కమలాక్షుఁడే సకలలోకేశ్వరుఁడు; గనుక వానినే మీరాశ్రయించుఁడని. ౧.

మూవరాగియమూర్త్తియై ముదల్ మూవర్క్కు ముదల్వన్ఱన్నై*
శావముళ్ళననీక్కువానై త్తడఙ్గడల్ కిడన్దాన్ఱన్నై*

తేవతేవనై త్తెన్నిలఙ్గై యెరియెழ చ్చెర్ఱవిల్లియై*
పావనాశనై ప్పఙ్గయ త్తడఙ్గణనై ప్పరవుమినో. ౨

అ॥ మూవరాగియమూర్ త్తియై-ముగ్గురైన బ్రహ్మరుద్రేన్ద్రాదులను శరీరము గాగలవాఁడును, ముదల్ మూవర్ క్కు - ప్రధానులైనయాముగ్గురికిని, ముదల్వన్ తన్నై-కారణభూతుఁడును, ఊళ్ళ నళాపమ్ - వారికున్న*దుఃఖములను, నీక్కు-వానై - పోఁగొట్టినవాఁడును, తడమ్ - విశాలమైన, కడల్ - సముద్రమందు, కిడన్దాన్ తన్నై - పవ్వళించినవాఁడును, తేవతేవనై-దేవాధిదేవుఁడును, తెన్ - సున్దరమైన, ఇలఙ్గై - లఙ్కాపురిని, ఎరియెழ - నిప్పులేచిమండునట్లు, శెర్ఱ - నశింపజేసిన, విల్లియై - ధనుస్సుగలవాఁడును, పావనాశనై - పాపమునునశింపజేయువాఁడును, పఙ్గయమ్ - పద్మమువలె, తడమ్ - విశాలమైన, కణ్ణనై - నేత్రములుగలవాఁడునైన శ్రియఃపతిని, పరవుమినో - స్తోత్రముజేయుండుము

తా॥ బ్రహ్మాదిదేవతలను సృజించి వార్లను బరిపాలించి వారిదుఃఖములను బోఁగొట్టి క్షీరాబ్ధియందుబవ్వళించియుండి, మీబోఁటివారికిసులభముగ నాశ్రయించుటకై రామావతారంబెత్తి లఙ్కనుగాల్చిన కమలాయతాక్షుఁడైన శ్రియఃపతిని యాశ్రయించి యుజ్జీవించుఁడని.

పరవి వానవ రేత్తనిన్ఱ పరమనై ప్పరఞ్జోదియై*
కురవై కోత్తకుழగనై మణివణ్ణనై క్కుడక్కూత్తనై*
అరవమేఱి యలై కడలమరుమ్ తుయిల్ కొణ్డవణ్ణలై*
ఇరవునన్ పగలుమ్ విడాదెన్ఱుమేత్తుదల్మనమ్వైమ్మినో. 3

అ॥ వానవర్ - నిత్యసూరులు, పరవి - చక్కఁగాఁజెప్పి, ఏత్తనిన్ఱ - స్తుతించుచున్నట్లున్న, పరమనై - మహిమగలవాఁడును, పరఞ్జోదియై - పరఞ్జ్యోతిస్స్వరూపుఁడును, కురవై కోత్త - రాసక్రీడచేసిన, కుழగనై - సులభుఁడును - మణివణ్ణనై - రత్నమువంటికాన్తిగలవాఁడును, కుడక్కూత్తనై - కుంభనృత్యముజేసినవాఁడును, అరవమేఱి - ఆదిశేషునిమీఁదవేంచేసియుండి, అలై - అలలుకొట్టుచున్న, కడల్ - క్షీరాబ్ధియందు, అమరుమ్ - అమరియుండి, తుయిల్ కొణ్డ - నిదురపోవుచున్న - అణ్ణలై - స్వామియునైనశ్రియఃపతిని, నల్ - విలక్షణములైన, ఇరవుమ్ పగలుమ్ - రేయింబగళ్లు, విడాదు - విడువక, ఎన్ఱుమ్ - ఎల్లప్పుఁడున్ను, ఏత్తుదల్ - స్తుతించుటయందు, మనమ్వైమ్మిన్ - మనస్సునుంచుఁడు.

తా॥ నిత్యసూరిసంసేవ్యుఁడై, కృష్ణావతారంబెత్తి గోపికలతోఁ గూడరాసక్రీడమొదలగనేక దివ్యచేష్టితంబులొనర్చి, ఆయాయాసములను తీర్చుకొనుటకై వెళ్ళిక్షీరాబ్ధియందు శేషశయ్యమీఁద చక్కఁగాబవ్వళించి నిదురపోవుచున్నశ్రియఃపతిని మీరొకక్షణముగూడ విడువక మనస్సునందుంచి స్తుతించుఁడని. 3.

---

* వేదములుబోఁగొట్టుకొనుట, బ్రహ్మశిరస్సును ఛేదించుటచే సంపాదించుకొనిన బ్రహ్మహత్య, నముచి మొదలైనవారిచే వచ్చిన రాజ్యభ్రంశము, ఇవి మొదలైనవి క్రమముగా బ్రహ్మకును రుద్రునికిని ఇన్ద్రునికిని సంభవించిన దుఃఖములు.

వైమ్మిన్నుమ్మనత్తెన్ఱు యానుఱైక్కిన్ఱ మాయవన్ శీర్మైయై*
ఎమ్మనోర్ గళురైప్పదు అదునిఱ్కనాడోఱుమ్*వానవర్
తమ్మైయాళుమవనుమ్ నాన్ముగనుమ్ శడైముడియణ్ణలుమ్*
శెమ్మైయాలవన్ పాదపఙ్గయమ్ శిన్దిత్తేత్తి తిరివరే. ౪

అ॥ నుమ్మనత్తు - మీమనస్సులో, వైమ్మిన్ - ఉంచుడి, ఎన్ఱు - అని, యాన్ - నేను, ఉరైక్కిన్ఱ - చెప్పుచున్న, మాయవన్ - అద్భుతచేష్టితుఁడైన శ్రియఃపతియొక్క, శీర్మైయై - గుణంబులను, ఎమ్మనోర్ గళ్ - మావంటివారు, ఉరైప్పదు - చెప్పుట, ఎన్ - ఎందుకు? అదునిఱ్క, అదియట్లుండగా, వానవర్ తమ్మై - దేవతలను, ఆళుమవనుమ్ - పరిపాలించెడియిన్ద్రుఁడును- నాన్ముగనుమ్ - బ్రహ్మయు, శడైముడి - శిరస్సునందుజటగల, అణ్ణలుమ్ - ఈశ్వరత్వాభిమానముగలరుద్రుఁడును, శెమ్మైయాల్ - చక్కగా, అవన్ - ఆ శ్రియఃపతియొక్క, పాదపఙ్గయమ్ - శ్రీపాదపద్మములను, నాడోఱుమ్ - ప్రతిదినమున్ను, శిన్దిత్తు - ధ్యానించి, ఏత్తి - స్తుతించి, తిరివర్ - సఞ్చరించుదురు.

తా॥ ఓచేతనులారా! శ్రియఃపతియొక్క మహిమను మేమువర్ణించినయెడల, వీరుభక్తులుగానయిట్లుజెప్పిరి యనియెదరో యేమో? ఇదియట్లుండని బ్రహ్మరుద్రాదులుగూడ నా శ్రియఃపతియొక్క శ్రీపాదములను భజించుచున్నారుగాన దానినైననమ్మి వాఁడేసర్వేశ్వరుఁడని నిశ్చయించి భజంచుడియని.

తిరియుమ్‌కాఱ్ఱోడగల్విశుమ్బు తిణిన్దమణ్ కిడన్దకడల్*
ఎరియుమ్‌తీయోడిరుశుడర్ తెయ్‌వమ్ మఱ్ఱుమ్‌మఱ్ఱుమ్ముఱ్ఱుమాయ్*
కరియమేనియన్ శెయ్యతామరైక్కణ్ణన్ కణ్ణన్ విణ్ణోరిఱై*
శురియుమ్‌పల్‌కరుఙ్గుఞ్జి యెఙ్గళ్ శుడర్ముడియణ్ణల్ తోఱ్ఱమే. ౫

అ॥ కరియ - నీలమైన, మేనియన్ - తిరుమేనుగలవాఁడును, శెయ్య - ఎఱ్ఱనైన, తామరైక్కణ్ణన్ - నేత్రములుగలవాఁడును, కణ్ణన్ - ఆశ్రితసులభుఁడును, విణ్ణోరిఱై - నిత్యసూరినిర్వాహకుఁడును, శురియుమ్ - చుట్టుకొనియున్న, పల్ - అనేకములై, కరుమ్ - నల్లనైన, కుఞ్జి - కేశములుగలవాఁడును, శుడర్ - తేజోమయమైన, ముడి - కిరీటముగలవాఁడునైన, ఎఙ్గళ్ - మాయొక్క, అణ్ణల్ - స్వామియొక్క, తోఱ్ఱమ్ - అవతారములు, తిరియుమ్ - తిరుగుచున్న, కాఱ్ఱోడు - గాలితోఁగూడ, అగల్ - విశాలమైన, విశుమ్బు - ఆకసమును, తిణిన్ద - కఠినమైన, మణ్ - భూమియు, కిడన్ద - (గట్టునతిక్రమించక) ఉన్న, కడల్ - సముద్రమును, ఎరియుమ్ - జ్వలించుచున్న, తీయోడు - అగ్నితోఁగూడ, ఇరు - రెండువిధంబులైన, శుడర్ - తేజోరూపులైనచన్ద్రసూర్యులును, తెయ్‌వమ్ - దేవతలును, మఱ్ఱుమ్ - తక్కినమనుష్యులును, మఱ్ఱుమ్ - తక్కినపశ్వాదులునైన, ముఱ్ఱుమ్ - ఈసకలపదార్థస్వరూపములై, ఆయ్ - అయియుండును, (ఈపదార్థములను శరీరముగాగలవాఁడైయుండును).

తా॥ పృథివ్యప్తేజోవాయ్వాకాశ చన్ద్రసూర్య దేవమనుష్యపశ్వాది సకలపదార్థములక న్త రాత్మయై, నీలమేఘశ్యాముఁడై రాజీవలోచనుఁడై, స్నిగ్ధమైన కేశపాశములుగలవాఁడై, తేజోమయమైనకిరీటముగలవాఁడైన మాస్వామి యాస్వరూపముతోనే యాశ్రితులకత్యన్తసులభుఁడై యుండునని.

తోఱ్ఱక్కేడవై యిల్లవనుడై యా౯ నవనోరుమూర్ త్తియాయ్*
శీఱ్ఱత్తోడరుళ్ పెఱ్ఱవనడిక్కీఴ్ప్పుగనిన్ఱ శెజ్గణ్మాల్ *
నాఱ్ఱత్తోఱ్ఱచ్చువై యొలి యుఱలాగినిన్ఱ * ఎమ్వానవ
రేఱ్ఱైయేయన్ఱి మఱ్ఱొరువరై యానిలేనెఴుమైక్కుమే. ౬.

అ॥ తోఱ్ఱక్కేడవై - ఉత్పత్తివినాశములు, ఇల్లవ౯ - లేనివాఁడును, ఉడైయా౯ - స్వామియు, శీఱ్ఱత్తోడు - (హిరణ్యాసురునిమీఁద) కోపముతోనున్నప్పటికిన్ని, అరుళ్ పెఱ్ఱవ౯ - కృపనుబొందినప్రహ్లాదాళ్వార్లు, అడిక్కీఴ్ - తనశ్రీపాదములకింద, పుగ - చేరునట్లు నిన్ఱ - వేఁ చేసియున్న, అవ౯ - అట్టిప్రసిద్ధుఁడై, ఒరు - అద్వితీయుండైన, మూర్ త్తియాయ్ - నరసింహావతారముగలవాఁడును, నాఱ్ఱమ్ - గన్ధము, తోఱ్ఱమ్ - రూపము, శువై - రసము ఒలి - శబ్దము, ఊఱల్ - స్పర్శము, ఆగినిన్ఱ - (వీనికి) నిర్వాహకుఁడైయున్నవాఁడును, ఎమ్ - మాకును, వానవర్ - నిత్యసూరులకును, ఏఱ్ఱై - స్వామియునైన శ్రియఃపతిని, అన్ఱి - విడిచి యా౯ - నేను, మఱ్ఱొరువరై - ఇంకొకరిని, ఎఴుమైక్కుమ్ - ఎప్పటికిని, ఇలే౯ - ఆశ్రయించను,

తా॥ ఉత్పత్తివినాశాదివికారంబులులేనివాఁడై, నరసింహావతారమెత్తి హిరణ్యాసురుని జంపి శ్రీప్రహ్లాదుని తనశ్రీపాదములయందుఁ జేర్చుకొనిన శ్రియఃపతినితప్ప మఱియొకరిని నే నెప్పటికి నాశ్రయించనని. ౬.

ఎఴుమైక్కుమెనదావిక్కిన్నముదత్తినై *ఎనదారుయిర్
కెఴుమియకదిర్చ్చోదియై మణివణ్ణనై కుడక్కూత్తనై *
విఴుమియవమరర్ మునివర్ విఴుజ్గుమ్ కన్నల్ కనియినై *
తొఴుమి౯ తూయమనత్తరా యిఱైయుమ్నిల్లా తుయరజ్గళే. ౭.

అ॥ ఎఴుమైక్కుమ్ - ఎప్పటికిని, ఎనదావిక్కు - నాయాత్మకు, ఇన్నముదత్తినై - మిక్కిలి భోగ్యమైనవాఁడును, ఎనదు - నాయొక్క, ఉయిర్ - ఆత్మతో, ఆర్ - పూర్ణముగా, కెఴుమియ - చేరియుండి, కదిర్ - ఉజ్జ్వలమైన, శోదియై - తేజస్సుగలవాఁడును, మణివణ్ణనై - మాణిక్యమువంటికాన్తిగలవాఁడును, కుడక్కూత్తనై - కుంభనృత్యముజేసినవాఁడును, విఴుమియ - ఉత్కృష్టులైన, అమరర్ - నిత్యసూరులును, మునివర్ - ఋషులును, విఴుజ్గుమ్ - అనుభవించుచున్న, కన్నల్ - శర్కరతోఁజేరిన, కనియినై - ఫలమువంటివాఁడునైన శ్రియఃపతిని, తూయమనత్తరాయ్ - పరిశుద్ధాన్తఃకరణులై, తొఴుమి౯ - ఆశ్రయించుడి, తుయరజ్గళ్ - దుఃఖములు, ఇఱైయుమ్ - కొంచెమైనను, నిల్లా - నిలువవు.

తా॥ ఎల్లప్పుడును నాహృదయమందుఁ బ్రవేశించి నాకుమిక్కిలి భోగ్యభూతుఁడై, సనకాదిభక్తులకు నిత్యానుభావ్యుఁడైయున్న శ్రియఃపతిని యాశ్రయించుడి. మీపాపమెంతమాత్రము నిలువదని. ౬.

తుయరమే తరు తున్బవిన్బవినైగళా యవై యల్లనాయ్*
ఉయరనిన్ఱదోర్ శోదియా యులగేழுముణ్డుమిழ்న్దానై*
అయరవాఙ్గునమన్ఱమర్ క్కరునఞ్జైనై యచ్చుదన్ఱనై*
తయరదఱ్కుమగన్ఱనై యన్ఱి మత్తొరిలేన్ తఞ్జమాగవే. ౭.

అ॥ తుయరమే - *దుఃఖమునే, తరు - ఇచ్చెడి, తున్బవిన్బవినైగళాయ్-పుణ్యపాపరూపకర్మలకు నిర్వాహకుఁడును, అవై యల్లనాయ్ - ఆకర్మములకు వశ్యుఁడుకానివాఁడును, ఉయరనిన్ఱదు - (సమస్తవస్తువులకును) పైభాగమందున్న, ఓర్ శోదియాయ్ - నిరవధిక తేజోమయవిగ్రహముగలవాఁడును, ఉలగేழுమ్ - సప్తలోకములను, ఉణ్డు - అరగించి, ఉమిழ்న్దాన్ తన్నై - బయలుపఱచినవాఁడును, అయర - మోహించునట్లు, వాఙ్గుమ్ - ప్రాణమునీడుచుదున్న, నమన్ తమర్ క్కు - యమభటులకు, అరు - అపరిహార్యమైన, నఞ్జైనై - విషమువంటివాఁడును, అచ్చుదన్ తన్నై - ఆశ్రితులను, చెయ్పిడుపనివాఁడును, తయరదఱ్కు - దశరథునికి, మగన్ తన్నై - కొమారుఁడునైన శ్రీరాముని, అన్ఱి తప్ప, మత్తొరు - ఇంకొకరిని, తఞ్జమాగ - ఉపాయముగా, ఇలేన్ - తలంచియుండను.

తా॥ పుణ్యపాపములను తనస్వాధీనపఱచుకొని దానికి తగినఫలములను చేతనులకిచ్చువాఁడును, నిరవధిక తేజోమయవిగ్రహయుతుఁడును, సర్వలోకరక్షకుఁడును, ఆశ్రితులను యమభటులుబాధింపకుండునట్లు రక్షించువాఁడునైన చక్రవర్తితిరుమగనార్లనుతప్ప మఱియొకరినే నుపాయముగానెంచనని. ౭.

తఞ్జమాగియ తన్దైతాయొడు తానుమాయవై యల్లనాయ్*
ఎఞ్జలిలమరర్ కులముదల్ మూవర్ తముళ్ళుమాదియై*
అఞ్జిసీరులగిత్తుళ్ళీర్గళ్ శివనివనెన్ఱుకూழுమిన్గళ్*
నెఞ్జినాల్ నినైప్పాన్ యవనవనాగుమ్ నీళ్ కడల్ వణ్ణనే. ౮.

అ॥ తఞ్జమాగియ - ఆపద్బంధువులైన, తన్దైతాయొడు - తల్లితండ్రులతోఁగూడ, (తల్లితండ్రులవంటివాఁడును) తానుమాయ్ - తానైనవాఁడును, (వారువారు తననుపోషించుకొనునట్లు వారినితానేపోషించువాఁడును), అవై యల్లనాయ్ - అంతయేగాక మిక్కిన సకలవిధబన్ధువులవంటివాఁడును, ఎఞ్జలిల్ - (భగవదనుభవమందు) సఙ్కోచములేని, అమరర్ - నిత్యసూరులయొక్క, కులమ్ - సమూహమునకు, ముదల్ - ప్రధానుఁడును, మూవర్ తమ్-బ్రహ్మరుద్రేన్ద్రులు ముగ్గురిచే, ఉళ్ళుమ్ - ధ్యానింపదగిన, ఆదియై - శ్రేష్ఠుడునైనశ్రీరాముని, ఉలగత్తుళ్ళీర్గళ్ - లోకమందున్న

*యాగము మొదలైన పుణ్యకర్మములు మిక్కిలి శ్రమసాధ్యములును మోక్షవిరోధులును గనుక అవికూడ దుఃఖకరంబులని,

నీర్ - మీరు, అఞ్జి - భ్రమించి, అవన్ - వాఁడపరిచ్ఛిన్నుఁడు, ఇవన్ - వీఁడుపరిచ్ఛిన్నుఁడు, ఎన్ఱు - అని, కూఴ్ప్పిక్కిన్ - సంశయపడవలదు. యవన్ - ఎట్టివిగ్రహయుక్తుఁడైనసర్వేశ్వరుఁడు నెఞ్జినాల్ - మనస్సుచే, నినైప్పాన్ - (భక్తునిచే) ధ్యానింపఁబడుచున్నాఁడో? కడల్ - సముద్రమువలె, నీళ్ - అపరిచ్ఛిన్నమైన, వణ్ణన్ - స్వభావముగలసర్వేశ్వరుఁడు, అవనాగుమ్ - అట్టివిగ్రహముగలవాఁడై యగును

తా॥ ఓ చేతనులారా! మనకు సకలవిధబన్ధువై, నిత్యసూరుల కపరిచ్ఛిన్నానన్దప్రదుఁడై, బ్రహ్మాదిసకలదేవతలకు నారాధ్యదేవతయైన సర్వేశ్వరుఁడపరిచ్ఛిన్నమహిమగలవాఁడుగనుక, అన్ని విధములుగా మనకు లోబడియున్న ఈయర్చావతారము నాసర్వేశ్వరుఁడని యెట్లు నమ్మవచ్చునని సందేహింపక, భక్తుడేవిధముగ నుండవలయునని ప్రార్థించునో యదేవిధముగా నాసర్వేశ్వరుఁడుండునని నమ్మి యీయర్చావతారము నాశ్రయించి యుజ్జీవించుఁడియని. ౯.

కడల్వణ్ణన్ కణ్ణన్ విణ్ణవర్ కరుమాణిక్క మెనదారుయిర్*
పడవరవిన్ కణై క్కిడన్ద పరఞ్జుడర్ పణ్డునూత్తువర్*
అడవరుమ్బడై మఙ్గ వైవర్ గట్కాగి వెఞ్జమత్తు*అన్ఱుతేర్
కడవియ పెరుమాన్ కనై కழల్ కాణ్బదెన్ఱుకొల్ కణ్గళే. ౧౦.

అ॥ విణ్ణవర్ - నిత్యసూరులకు, కరుమాణిక్కమ్ - నీలమాణిక్యమువలె భోగ్యభూతుఁడును, పడమ్ - వికసించియున్న, అరవిన్ కణై - సర్పమనెడిశయ్యయందు, కిడన్ద - పవ్వళించిన, పరఞ్జుడర్ - పరఞ్జ్యోతిస్స్వరూపుఁడును, కడల్వణ్ణన్ - సముద్రముపంటికాన్తిగల, కణ్ణన్ - కృష్ణుఁడును, ఎనదు - నాకు, ఆరుయిర్ - పూర్ణధారకుఁడును, పణ్డు - మునుపు, నూత్తువర్ - దుర్యోధనాదులు నూఱుగురియొక్క, అడవరుమ్ - బాధించుటకువచ్చిన, పడై - సేన, మఙ్గ - నశించునటుల, ఐవర్గట్కాగి - పఞ్చపాణ్డవులపక్షమందుఁడి, వెమ్జమత్తు - క్రూరమైనయుద్ధమందు, అన్ఱు అకాలమందు, తేర్ - రథమును, కడవియ - నడిపించినవాఁడునైన, పెరుమాన్ - సర్వేశ్వరుని యొక్క, కనై - ఆభరణధ్వనిగల, కழల్ - శ్రీపాదములను, కణ్గళ్ - నానేత్రములు, కాణ్బదు సేవించుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడో.

తా॥ నిత్యసూరి నిర్వాహకుఁడై యుండి, దేవతలకు సేవసాధించుటకై క్షీరాబ్ధియందును, మానిమిత్తమై యీభూలోకమందును వేంచేసి, భారతయుద్ధమందర్జునునికి సారథియైయున్న నీపాదములను నేనెప్పుడు సేవించెదనోయని. ౧౦.

** కణ్గళ్ కాణ్డఱ్కరియనాయ్ క్కరుత్తుక్కు నన్ఱుమెళియనాయ్*
మణ్గొళ్ ఞాలత్తుయిర్క్కెల్లా మరుళ్ శెయ్యుమ్ వానవరీశనై *
పణ్గొళ్ శోలై వழుది నాడన్ కురుగై క్కోన్ శడగోపన్ శొల్*
పణ్గొళాయిర త్తిప్పత్తాల్ పత్తరాగక్కూడుమ్ పయిలుమినే. ౧౧.

అ॥ కణ్గళ్ - నేత్రములతో, కాణ్డఱ్కు - చూచుటకు, అరియనాయ్ - దుర్లభుఁడును, కరుత్తుక్కు - మనస్సుకు, నన్ఱు - మిక్కిలి, ఎళియనాయ్ - సులభుఁడును, మణ్గొళ్ - మన్ను

గల, ఞాలత్తు - భూమియందలి, ఉయిర్ కెల్లామ్-ప్రాణులందరికిని, అరుళ్ శెయ్యుమ్-కృపజేయు వాఁడును, వానవరీశనై-నిత్యసూరినిర్వాహకుఁడునైనసర్వేశ్వరునియుద్దేశించి, వణ్ కొళ్-(తుమ్మె దలయొక్క) పాటలుగల, శోలై-తోటలలోనిండిన, వழுదినాడన్ వழுదియనెడి దేశమునకుస్వామియు, కురుగూర్ క్కోన్ - తిరునగరికిస్వామియునైన, శడగోపన్-నమ్మాళ్వార్లు, శొల్-సాదించిన, వణ్ కొళ్, గానముతోగూడిన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తాల్-ఈపదిపాశురములచే, పత్తరాగక్కూడుమ్ - భక్తుఁకావచ్చును, పయిలుమిన్ - అభ్యసించుడి.

తా॥ చక్షురాదిబాహ్యేన్ద్రియాగోచరుఁడై, మానసికజ్ఞానగోచరుఁడై, సకలలోకరక్షకుఁడైనశ్రియఃపతివిషయమైన నమ్మాళ్వార్లుసాదించిన యీపదిపాశురముల ననుసంధించువారు భగవద్భక్తులగుదురని. ౧౧.

ఆ ழ ్వ ార ్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

## ౭ - వ తిరువాయ్మొழி.

అవతారిక:—ఈతిరువాయ్మొழிలో, భగవచ్ఛేషత్వముకంటె భాగవతశేషత్వమే పరమప్రాప్యమని సాదించుచున్నారు.

†† పయిలుమ్శుడరొళిమూర్ త్తియై ప్పజ్గయక్కణ్ణనై *
పయిలవినియ నమ్పాఱ్కడల్ శేర్న్ద పరమనై *
పయిలు న్తిరువుడై యార్ యవరేలుమవర్ కణ్డీర్ *
పయిలుమ్పిఱప్పిడై దోఱెమ్మైయాళుమ్ పరమరే. ౧.

అ॥ పయిలుమ్ - వర్ధిల్లుచున్న, శుడరొళి - మిక్కిలితేజస్సుగల, మూర్ త్తియై-తిరుమేను గలవాఁడును, పజ్గయక్కణ్ణనై -పఙ్కజనేత్రుఁడును, పయిల - సహవాసముజేయగా, ఇనియ - భోగ్యభూతుఁడును, నమ్ - మననిమిత్తమై, పాఱ్కడల్ - క్షీరాబ్ధియందు, శేర్న్ద - చేరయున్న, పరమనై - స్వామియైనశ్రియఃపతిని, పయిలుమ్ - అనుభవించడమనెడి, తిరు-సంపత్తును, ఉడైయర్ - కలవారు, యవరేలుమ్ - జాతిగుణాదులలో నెంతతక్కువ వారైనను, అవర్ - వారు, పయిలుమ్ - నిరన్తరముగావచ్చెడి, పిఱప్పు - జన్మములయొక్క, ఇడైదోఱు - మధ్య కాలములన్నిఁటిలోను, ఎమ్మై - మమ్ములను, ఆళుమ్ - పరిపాలించెడి, పరమర్ కణ్డీర్ - ఉత్కృష్టులునుమండీ.

తా॥ తేజోమయమైన దివ్యవిగ్రహముగల క్షీరాబ్ధిశాయియైన కమలాక్షునికి దాసులైన భాగవతశ్రేష్ఠులు జాత్యాదులలో నెంతతక్కువవారైననువారే మనకు సమస్తజన్మములయందును పరమప్రాప్యులని ౧.

ఆళుమ్పరమనై క్కణ్ణనై యాழிప్పిరాన్ఱన్నై *
తోళుమోర్నాన్గుడై త్తూమణివణ్ణనెమ్మాన్ఱన్నై *

తాழుమ్‌తడక్కై ౖయుమ్ కూప్పి ప్పణియుమవర్ కణ్డీర్*
నాழுమ్పిఱప్పిడై దోఱు ఎమ్మై యాళుడై నాదరే. ౨.

అ॥ అళు - మనలనుపరిపాలించెడి, పరమనై - సర్వోత్కృష్టుఁడును, కణ్ణనై - సుల భుఁడును, అழிప్పిరాన్‌తన్నై - చక్రధరుఁడైన ఉపకారకుఁడును, ఓర్ - అద్వితీయంబులైన, నాన్గుతోళుడై - నాలుగుభుజములుగలవాఁడును, తూ - పరిశుద్ధమైన, మణివణ్ణన్ - నీలమాణి క్యమువంటి కాన్తిగలవాఁడునైన శ్రియఃపతి, తాళుమ్ - *పాదములనున్ను, తడమ్ - విశాలము లైన, కైయుమ్ - ♦చేతులనున్ను, కూప్పి - చేర్చి, నాళుమ్ - ప్రతిదినమున్ను, పణియుమవర్ కణ్డీర్ - ఆశ్రయించువారే, పిఱప్పిడైదోఱు - జన్మమరణములకు మధ్యమందున్న సర్వకాలము లయందును, ఎమ్మై - మనలను, ఆళుడై - దాస్యముచేసికొనిన, నాదర్ - నాథులు.

తా॥ నేత్రములు మొదలగు దివ్యావయవసౌన్దర్యముగల చక్రధరుఁడైన శ్రియఃపతిని యనన్యగతికులై సాకించనులై యాశ్రయించెడి శ్రీవైష్ణవులే మనకు సమస్తజన్మములయందును పరమ ప్రాప్యులని. ౨.

నాదనై ఞాలముమ్ వానముమేత్తుమ్ నఱున్దుழாయ్
ప్పోదనై *పొన్నెడుమ్‌శక్కరత్తెన్దైపిరాన్‌తన్నై*
పాదమ్‌పణియవల్లారై ప్పణియుమవర్ కణ్డీర్*
ఓదుమ్‌పిఱప్పిడై దోఱు ఎమ్మై యాళుడైయార్ గళే. ౩.

అ॥ నాదనై - స్వామియు, ఞాలముమ్ - భూలోకమందున్నవారును, వానముమ్ - ఊర్ధ్వలోకములయందున్నవారును, ఏత్తుమ్ - స్తోత్రముజేయదగినవాఁడును, నఱు - పరిమళము గల - తుழாయ్‌ప్పోదనై - తులసీమాలికగలవాఁడును, పొన్ - స్పృహణీయమై, నెడుమ్ - ముక్తిభోగ్యమైన, శక్కరత్తు - సుదర్శనముగల, ఎన్దై - నాస్వామియైన, పిరాన్‌తన్నై - ఉపకారకుఁడునునైన శ్రియఃపతియొక్క, పాదమ్ - శ్రీపాదములను, పణియవల్లారై - ఆశ్ర యించువారిని, పణియుమవర్ కణ్డీర్ - ఆశ్రయించువారే, ఓదుమ్ - శాస్త్రములయందుఁ జెప్పఁబడిన, పిఱప్పిడైదోఱు - జన్మములన్నిఁటిలోను, ఎమ్మై - మనలను, ఆళుడైయార్ గళే- దానులుగాగలవారు.

తా॥ పరిమళముగొట్టుచున్న తిరుత్తుళాయిమాలలనును, అతిసున్దరంబులై నళఙ్ఖచక్రాదిదివ్యా యుధములనును ధరించిన సకలలోకవన్ద్యుఁడైన శ్రియఃపతిని యాశ్రయించిన శ్రీవైష్ణవులనాశ్రయిం చిన భాగవతులే మన కన్ని జన్మములలోను పరమప్రాప్యులని. ౩.

ఉడైయార్‌న్దవాడైయన్ కణ్డిగైయనుడై నాణినన్*
పుడైయార్‌పొన్నూలినన్ పొన్ముడియన్ మఱ్ఱుమ్‌పల్‌కలన్*

---

* పాదములనుచేర్చఁడమనగా—ఇతరదేవతలవద్దకి పోకుండుట.
♦ చేతులనుచేర్చఁడమనగా—సకలోపాయాన్తరములను విడుచుట.

నడై యావుడై త్తిరునారణన్ తొణ్డర్ తొణ్డర్ కణ్డీర్*
ఇడై యార్ పిఱప్పిడై దోఱు ఎమక్కు ఎమ్ పెరుమక్కళే. ౪.

అ॥ ఉడై - నడుమునందు, ఆర్న్ద - చేరియున్న, ఆడైయన్ - పీతామ్బరముగలవాఁడును, కణ్డిగైయన్ - కణ్ఠభూషణముగలవాఁడును, ఉడై - నడుమునఁదున్న, నాణినన్ - కటిసూత్రము గలవాఁడును, పుడై - పక్కయందు, ఆర్ - మిక్కిలిప్రకాశించుచున్న, పూణ్ నూలినన్ - స్వర్ణమయమైనయజ్ఞోపవీతముగలవాఁడును, పాన్ - స్పృహణీయమైన, ముడియన్ - కిరీటము గలవాఁడును, మర్ఱుమ్ - ఇఁకనున్న, పల్ - అనేకవిధములైన, కలన్-దివ్యభూషణములను, నడైయా - నిత్యముగా, ఉడై - కలవాఁడునైన, తిరు - శోభిల్లుచున్న, నారణన్ - శ్రీమన్నారాయణునియొక్క, తొణ్డర్ - దాసులకు, తొణ్డర్కణ్డీర్ - దాసులైనవారే, ఇడై యార్ - ఎడతెగని, పిఱప్పిడైదోఱు - జన్మములయందున్న జీవితకాలమంతయు, ఎమక్కు - మనకు, ఎమ్పెరుమక్కళే - అసాధారణులైన ప్రాప్యులు.

తా॥ పీతామ్బరకణ్ఠాభరణయజ్ఞోపవీతకటిసూత్రకిరీటాద్యనేకదివ్యాభరణములతో శోభిల్లు. చున్న శ్రియఃపతియొక్క దాసదాసులకే మనము సర్వదా దాసభూతులమని. ౪.

పెరుమక్కళుళ్ళవర్ దమ్పెరుమానై *అమరర్గ
ట్కరుమైయొழிయ వన్నారముదూట్టియ వప్పనై *
పెరుమైపిదర్ఱవల్లారై ప్పిదర్ఱుమవర్ కణ్డీర్*
వరుమైయుమిమ్మైయుమ్నమ్మైయళిక్కుమ్పిరాక్కళే. ౫.

అ॥ ఉళ్ళవర్ - నిత్యులైయున్న, పెరుమక్కళ్ - నిత్యసూరులకు, తమ్ - అసాధారణ మైన, పెరుమానై - అధిపతియు, అమరర్గట్కు - ఇన్ద్రాదిదేవతలకు, అరుమై - శ్రమము, ఒழிయ - తొలఁగునటు, అన్ఱు - ఆకాలమందు, ఆర్ - పూర్ణమైన, అముదు - అమృతమును, ఊట్టియ - భుజింపజేసిన, అప్పనై - స్వామియైనశ్రియఃపతియొక్క, పెరుమై - మహిమను, పిదర్ఱవల్లారై - ప్రీతిచేజెప్పఁదగినవారిని, పిదర్ఱుమవర్కణ్డీర్ - ప్రీతిచేజెప్పువారే, వరుమైయుమ్ - పరలోకములయందును, ఇమ్మైయుమ్ - ఇహలోకమునందును, నమ్మై - మనలను, అళిక్కుమ్ - రక్షించెడి, పిరాక్కళ్ - స్వాములు

తా॥ నిత్యసూరిసేవ్యుఁడైన శ్రియఃపతిని యిన్ద్రాదు లమృతమును యాచింప, ప్రయోజ నాన్తరపరులైన వారికిఁగూడనాయభీష్టమును నెరవేర్చినవానియొక్క ఔదార్యగుణమునను సన్ధించువారియొక్కదాసులే మనయభీష్టమునిచ్చి మనలను రక్షించువారని. ౫

అళిక్కుమ్పరమనై క్కణ్ణనై యాழிప్పిరాన్ఱన్నై*
తుళిక్కునఱుఙ్గణ్ణి త్తూమణివణ్ణనెమ్మాన్ఱన్నై*
ఒళిక్కొణ్డశోదియై యుళ్ళత్తుక్కొళ్ళుమవర్ కణ్డీర్*
కలిప్పిఱ్ఱి యాణ్డెమ్మై చ్చన్మశన్మాన్దర క్కాప్పరే. ౬.

అ॥ అళిక్కుమ్ - (చేతనులను) రక్షించెడి, పరమనై - సర్వోత్కృష్టుఁడును, కణ్ణనై - అతిసులభుఁడును, ఆழி - సుదర్శనమును ధరించిన, పిరాన్ తన్నై - ఉపకారకుఁడును, తుళి క్కుమ్ - తేనెకారుచున్న, నఱుమ్ - పరిమళముగల, కణ్ణి - తులసీమాలికచేనలఙ్కరింపఁబడిన వాఁడును, తూ - పరిశుద్ధమైన, మణివణ్ణన్-మాణిక్యమువంటికాన్తిగలవాఁడును ఎమ్మాన్ తన్నై-మాస్వామియు, ఒళిక్కొణ్డ - ప్రకాశించుచున్న, శోదియై - తేజస్సుగలవాఁడునైనశ్రియఃపతిని, ఉళ్ళత్తు - మనస్సులో, కొళ్ళుమవర్ కట్కేర్ - అనుభవించువారు, ఎమ్మై - మనలను, కలిప్పిన్ఱి - చలించకుండ, ఆణ్డు రక్షించి, శన్మశన్మాన్దరమ్ - జన్మపరమ్పరలోనుండి, కాప్పర్ - రక్షించుదురు.

తా॥ సుదర్శనమునున్ను మిక్కిలిభోగ్యమైన తులసీదామమునున్ను ధరించిన యతిసుందర విగ్రహుఁడైన శ్రియఃపతిని మనసార ధ్యానించెడి భాగవతులే మనకర్మకామాదిక్షుద్రముల (యందభి లాషను బోఁగొట్టి మనసంసారమును దొలఁగింతురని

శన్మశన్మాన్దరఙ్కాత్తడియార్ గళై క్కొణ్డుపోయ్*
తన్నై ప్పెఱుత్తి త్తన్ తాళిణైక్కీழ్ క్కొళ్ళు మప్పనై *
తొన్నై ప్పిదఱ్ ఱవల్లారై ప్పిదఱ్ ఱుమవర్ కట్కేర్*
నన్నై ప్పెఱుత్తెమ్మై నాళుయ్యక్కొళ్ గిన్ఱ నమ్బరే. ౭.

అ॥ అడియార్ గళై - దాసులను, శన్మశన్మాన్దరమ్ - జన్మపరమ్పరలోనుండి, కాత్తు - రక్షించి, కొణ్డుపోయ్ - తీసికొనిపోయి, తన్నై స్వస్వరూపపదముయొక్క (అవిర్భావమును), పెఱుత్తి - పుట్టించి, తన్ - తనయొక్క, తాళిణైక్కీழ் - శ్రీపాదద్వన్ద్వములక్రింద, కొళ్ళుమ్, అఙ్గీకరించెడి, అప్పనై - స్వామియైనశ్రియఃపతియొక్క, తొన్నై - స్వాభావికగుణంబులను, పిదఱ్ ఱవల్లారై -ప్రీతితోఁజెప్పువారిని, పిదఱ్ ఱుమవర్ కట్కేర్ - ప్రేమయుక్తులైస్తోత్రముచేయు వారు, నన్నై - భాగవతశేషత్వమనెడిమంచితనమును, పెఱుత్తు - కలుగఁజేసి, నాళ్ - ప్రతిదిన మున్ను, ఉయ్యక్కొళ్ గిన్ఱ - ఉజ్జీవింపఁజేయుచున్న, నమ్బర్ - నమ్మఁదగినపెద్దలు.

తా॥ తనదాసులను సంసారమునుండి విడిపించి మోక్షమునుబొందించి వారికిఁదనకైఙ్కర్య మునిచ్చెడి శ్రియఃపతియొక్క కల్యాణగుణంబులను స్తోత్రముచేయువారి నాశ్రయించిన భాగవతులే మనకు భగవత్కైఙ్కర్యమునిచ్చి రక్షించువారని ౭.

నమ్బనై ఞాలమ్పడైత్తవనై త్తిరుమార్వనై *
ఉమ్బరులగినిల్ యార్క్కు ముణర్వరియాన్ఱన్నై*
కుమ్బినరగర్గళేత్తువరేలు మవర్ కణ్డీర్*
ఎమ్బల్ పిఱప్పిడై దోఱెమ్తొழுకులమ్తాఙ్గళే. ౮.

అ॥ నమ్బనై - రక్షకుండనినమ్మఁదగినవాఁడును ఞాలమ్పడైత్తవనై - లోకములనుసృజించు వాఁడును, తిరుమార్వనై - శ్రీమహాలక్ష్మీనివక్షస్థలమందుగలవాఁడును, ఉమ్బరులగినిల్ - ఊర్ధ్వ లోకములయందున్న, యార్క్కుమ్ - ఎట్టిజ్ఞానవంతులకును, ఉణర్వరియాన్ తన్నై - తెలిసికో

నుటకశక్యుఁడునైన శ్రియఃపతిని, కుమ్బినరకర్ గళ్ - కుమ్భీపాకనరకమందుండువారు, ఏత్తువరేలుమ్ - స్తుతించినను, అవర్ కణ్డీర్ - వారేనుమండీ, ఎమ్ - మనయొక్క, పల్ - అనేకములైన, పిఱప్పిడైతోఱు - జన్మమరణములకు నడుమనున్న సర్వకాలములయందును, ఎమ్ - మనకు, తొழుమ్ - ఆశ్రయింపదగిన, కులమ్ తాఙ్గళ్ - వంశముగలవారగుదురు.

తా॥ ఎట్టిజ్ఞానవంతులకు వలదుగాని మహిమగల సకలలోకస్రష్టయైన లక్ష్మీభర్తనుస్తోత్రము జేయువారెంత పాపాత్ములైనను వారికులమంతయు మనకు పరమప్రాప్యమైయుండునని. ౭.

కులన్దాఙ్గుశాదిగళ్ నాలిలుమ్ కీழிழிన్దు ఎత్తనై
నలన్దానిలాద శణ్డాళశణ్డాళర్ గళాగిలుమ్*
వలన్దాఙ్గుశక్కరత్తణ్ణల్ మణివణ్ణఱ్కాళెన్ఱుళ్
కలన్దార్* అడియార్ తమ్మడియారెమ్మడిగళే. ౮

అ॥ కులమ్ - ఇతరకులములను, తాఙ్గు - ధరించెడి, శాదికళ్ నాలిలుమ్ - నాలుగుజాతులకంటెను, కీழிழிన్దు - హీనమై, ఎత్తనై - ఎంతమాత్రము, నలన్దానిలాద - జ్ఞానములేని, శణ్డాళశణ్డాళర్ గళాగిలుమ్ - చణ్డాలులకంటెమిక్కిలియధములైనను, వలమ్ - దక్షిణభుజమందు, తాఙ్గు - ధరించిన, శక్కరత్తు - సుదర్శనముగల, అణ్ణల్ - స్వామియైన, మణివణ్ణఱ్కు - మాణిక్యమువంటి తిరుమేనుగల శ్రియఃపతికి, ఆళెన్ఱు - దాసుఁడననియెడి, ఉళ్ కలన్దార్ - అభిప్రాయముతోఁగూడుకొనినవారియొక్క, అడియార్ తమ్ - దాసులయొక్క, అడియార్ - దాసులు, ఎమ్మడికళ్ - మనకుస్వాములు.

తా॥ జాతియందెంత నికృష్టులైనను, ఎంతజ్ఞానహీనులైనను, చక్రధరునికి నేనుదాసుఁడని తలంచిన దాసులయొక్క దాసదాసులు మనకు పరమప్రాప్యులని. ౯.

అడియార్న్దవైయము ణ్డాలిలై యన్నవశమ్ శెయ్యుమ్*
పడియాదుమిల్ కుழవి ప్పడియెన్దై పిరాన్ఱనక్కు*
అడియారడియార్ తమ్మడియారడియార్ తమ
క్కడియారడియార్ తమ్* అడియారడియోఙ్గళే. ౧౦.

అ॥ అడియార్న్ద - శ్రీపాదములచేపూర్ణమైన, వైయమ్ - భూమిని, ఉణ్డు - ఆరగించి, ఆలిలై - వటదళమందు, అన్నవశమ్ శెయ్యుమ్ - అన్నముతో సమానముగాజేయువాఁడును, (ఎడమపక్కనుకుడిపక్కను తిరిగితిరిగి పవ్వళించువాఁడును), పడి - ఉపమానము, ఆదుమిల్ - ఏమియు లేని, కుழవిప్పడి - ముగ్ధశిశువిగ్రహముగలవాఁడును, ఎన్దైపిరాన్ తనక్కు - నాకుస్వామియైనఉపకారకుఁడునైనశ్రియఃపతికి, అడియారడియార్ తమ్ అడియారడియార్ తమక్కు అడియారడియార్ దమ్ అడియార్ - దాసదాసులకుదాసదాసులైనవారికి దాసదాసులకు, అడియోఙ్గళ్ - మనము దాసులము.

తా॥ ప్రళయకాలమందు లోకములను తన యుదరములోనుంచుకొని వటపత్రశాయియైన శ్రియఃపతియొక్క దాసపరమ్పరలోచరమావధి దాసులైనవారికి మనము దాసభూతులమని.

‡‡ అడియోఙ్గునూత్తువర్ వీయ వన్దవర్క్కరుళ్ శెయ్‌ద
నెడియోనై *తెన్కురుగూర్చ్చడగోపన్ కుత్తేవల్ గళ్*
అడియార్న్దవాయిరత్తు ళ్ళివై పత్తవన్ తొణ్డర్మేల్
ముడివు*ఆరక్కత్కిల్ శన్మమ్ శెయ్యామైమ్ ముడియుమే. ౧౧.

అ॥ అడియోఙ్గు-వేరుదిగియున్న, (సుప్రతిష్ఠితులైన), నూత్తువర్-దుర్యోధనాదులునూఱుగురు, వీయ - నశించునటుల, ఐవర్క్కు - పఞ్చపాణ్డవులకు, అరుళ్ శెయ్‌ద - కృపజేసిన, నెడియోనై - సర్వాధికుండైన శ్రియఃపతివిషయమై, తెన్ కురుగూర్చ్చడగోపన్ - సున్దరమైనకురుకాపురికధీశులైననమ్మాళ్వార్లయొక్క, కుత్తేవల్ గళ్ - అన్తరఙ్గకైఙ్కర్యరూపమై, అడి-పాదములతో, ఆర్న్ద - పూర్ణమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, అవన్ - ఆశ్రియఃపతియొక్క, తొణ్డర్ మేల్ - దానులమీద, ముడివు - ముగిసిన, ఇవై పత్తు - ఈపదిపాశురములను, ఆర - మనస్సులో పడునట్లు, కత్కిల్ - అభ్యసింపసమర్థులైనయెడల, శన్మమ్ - జన్మము, శెయ్యామై - కలుగకుండ, ముడియుమ్ - ముగుసును.

తా॥ దుర్యోధనాదులను సంహరించి పాణ్డవులను రక్షించిన సర్వేశ్వరునియొక్క భక్తులైన భాగవతులవిషయమై నమ్మాళ్వార్లుపాయించిన యీపదిపాశురముల నభ్యసించువారు సంసారమందు జన్మించరని ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౮-వ తిరువాయ్‌మొழி.



అవతారిక:— ఈతిరువాయ్‌మొழிలో, ముందున్న భగవదనుభవాభిలాష, ఇప్పుడు భాగవతసహవాసముచే మిక్కిలి యధికమై, భగవంతుని సేవించకయుండలేక తనసకలేన్ద్రియములతో నాసర్వేశ్వరుని యనుభవింపగోరి యదిలభించక దుఃఖపడుచున్నారు.

‡‡ ముడియానే మూవులగుమ్ తొழுదేత్తుమ్ శీ
రడియానే *ఆழ்కడలై క్కడైన్దాయ్ పుళ్ళూర్
కొడియానే *కొణ్డల్వణ్ణా వణ్డత్తుమ్బరిల్
నెడియానే *ఎన్నుకిడక్కుమెన్నెఞ్జమే. ౧.

అ॥ ఎన్నెఞ్జమ్ - నామనస్సు, ముడియానే - కిరీటముగలవాడా! మూవులగుమ్-మూడులోకములున్న, తొழுదు - ఆశ్రయించి, ఏత్తుమ్ - స్తోత్రముచేయదగిన, శీర్ - సౌన్దర్యముగల, అడియానే - శ్రీపాదముగలవాడా! ఆழ் - అగాధమైన, కడలై - సముద్రమును, కడైన్దాయ్ - చిలికినవాడా! పుళ్ - గరుత్మంతుని, ఊర్ - వాహనముగానున్న, కొడియానే-ధ్వజముగానున్నగలవాడా! కొణ్డల్ - మేఘమువంటి, వణ్ణా-కాన్తిగలవాడా! అణ్డత్తు-అణ్డములోనున్న,

ఉమ్బరిల్ - బ్రహ్మాదిదేవతలకంటె, శెడియానే - గొప్పవాఁడా! ఎన్ఱు - అనిధ్యానించి, శిద క్కుమ్ - ఉండును

తా॥ ఓ శ్రియఃపతీ! నామనస్సు, నీకిరీటమునున్ను, సకలలోకస్తుత్యంబైన శ్రీపాదముల నున్ను, గరుడధ్వజమునున్ను, మేఘమువంటి నీతిరుమేనునున్ను ఎల్లప్పుడును ధ్యానించుచు నిన్ను సేవింపఁ గోరుచున్నదని. ౧.

నెఞ్జమేనీణగరాగ విరున్దవెన్
తఞ్జనే*తణ్ణిలఙ్గైక్కిఱై యెచ్చెత్త
నఞ్జనే*ఞాలఙ్గొళ్వాన్ కుఱళాగియ
వఞ్జనే*ఎన్ను మెప్పోదుమెన్వాశగమే. ౨.

అ॥ ఎన్ వాశగమ్ - నావాక్కు, ఎప్పోదుమ్ - ఎల్లప్పుడును, నెఞ్జమే - నామనస్సే, నీళ్ - గొప్ప, నగరాగ - పట్టణముగాఁజేసికొని, ఇరున్ద - వేంచేసియున్న, ఎన్ తఞ్జనే - నాయా వత్సఖుఁడా! తణ్ - సున్దరమైన, ఇలఙ్గైక్కు - లఙ్కకు, ఇఱైయై - రాజైనరావణుని, శెత్త - చంపిన, నఞ్జనే - విషమువంటివాఁడా! ఞాలమ్ - భూమిని, కొళ్వాన్ - వశపఱచుకొనుటకై, కుఱళాగియ - వామనుఁడవైన, వఞ్జనే - వఞ్చకుఁడా! ఎన్నుమ్ - అని చెప్పును.

తా॥ ఓ శ్రియఃపతీ! నావాక్కు, రావణాసురసంహారకుఁడవైన నీపరాక్రమమునున్ను వామనుఁడవై భూమిని మహాబలివద్దనుండితీసిన నీయుపాయమునున్ను, నామనస్సునందును యునికినిన్ని యెల్లప్పుడు ననుసంధించుచున్నదని. ౨.

వాశగమేయేత్తవరుళ్ శెయ్యుమ్ వానవర్ దమ్
నాయగనే*నాళిళ ఙ్గిఙ్గళై క్కోళ్విడుత్తు
వేయగమ్బాల్ వెణ్ణెయ్‌తొడువుణ్డ వానాయర్
తాయవనే*ఎన్ఱుతడవుమెన్ కైగళే. 3.

అ॥ వాశగమే - వాగింద్రియమే, ఏత్త - స్తుతించునట్లు, అరుళ్ శెయ్యుమ్ - కృపఁజేసిన, వానవర్ దమ్నాయగనే - నిత్యసూరులకునాథుఁడా! నాళ్ - దినములచే, ఇళమ్ - బాలుఁడైన, తిఙ్గళై - చంద్రునివలె, కోళ్ - తేజస్సును, విడుత్తు - విస్తరింపజేసి, (మందహాసముజేసి), వేయ గమ్ - వెదురుతోఁగట్టినయిళ్లలోనుంచిన, పాల్ - పాలనున్ను, వెణ్ణెయ్ - వెన్ననున్ను, తొడు - దొంగలించి, ఉణ్డ - ఆరగించిన, ఆనాయర్ - గోపలకు, తాయవనే - తల్లివంటివాఁడా! ఎన్ఱు - అని, ఎన్ కైగళ్ - నా చేతులు, తడవుమ్ - వెతుకును.

తా॥ ఓ శ్రియఃపతీ! నిన్ను స్తుతించునట్లు వాగింద్రియమునకుమాత్రము కృపచేసిన నీవు గోప స్త్రీలుదాచినపాలనున్ను వెన్ననున్ను దొంగలించి యారగించి మందస్మితముగల ముఖారవింద ముతో వెచ్చటనున్నావోయని నా చేతులు వెతుకుచున్నవని. 3

కైగళాలార త్తొழுదుతొழுదున్నై*
వైగలుమ్మాత్తిరై ప్పోదు మోర్‌వీడిన్ఱి*

పైకొళ్ పామ్బేఱి యుఱై పరనే*ఉన్నై
మెయ్‌కొళ్ళక్కాణ విరుమ్బుమెన్ కణ్గళే. ౪.

అ॥ పైకొళ్ - విశాలమైనపడములుగల, పామ్బు - ఆదిశేషునిమీద, ఏఱి - ఎక్కి, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, పరనే - సర్వాధికుండా! ఎన్ కణ్గళ్ - నానేత్రములు, కైగళాల్ - చేతులతో, ఆర - సంపూర్ణముగా, ఉన్నై - నిన్ను, తొழுదుతొழுదు - కాగలించుకొని కాగలించుకొని, వైగలుమ్ - ప్రతిదినమున్ను, ఓర్ మాత్తిరైపోదు - ఒకక్షణము గూడ, వీడిన్ఱి - విడువక, ఉన్నై - నిన్ను, మెయ్‌కొళ్ళ - ప్రత్యక్షముగా, కాణ - సేవింమటకు, విరుమ్బుమ్ - ఆశబడును.

తా॥ అనంతశయనుడవైన ఓ శ్రియఃపతీ! నాచేతులతో నిన్ను చక్కగా కాగలించుకొని యొక క్షణముగూడవిడువకుండ నిన్ను సేవించుటకు నానేత్రములాశపడుచున్నవియని. ౪.

కణ్గళాల్ కాణవరుఙ్గొలెన్ఱాశైయాల్*
మణ్‌కొణ్డవామననేఱమగిழ்న్దుశెల్*
పణ్‌కొణ్డపుళ్ళిన్ శిఱగొలిపావిత్తు*
తిణ్‌కొళ్ళవోర్‌క్కుమ్‌కిడన్దెన్ శెవిగళే. ౫.

అ॥ కణ్గళాల్ - నేత్రములచే, కాణ - చూచునట్లు, వరుఙ్గొల్ - (శ్రియఃపతి) వేంచేయునో, ఎన్ఱాశైయాల్ - అనెడియాశచే, మణ్ - భూమిని, కొణ్డ - స్వీకరించిన, వామనన్ - వామనుఁడు, ఏఱ - ఎక్కి వేంచేయుటచే, మగిழ்న్దు - సన్తోషించి, శెల్ - సంచరించుచున్న, పణ్‌కొణ్డ - సామగానముగల, పుళ్ళిన్ - గరుత్మంతునియొక్క, శిఱగు - ఱెక్కలయొక్క, ఒలి - శబ్దమును, పావిత్తు - ధ్యానించుకొని, కిడన్దు-ఉణ్డి, ఎన్ శెవిగళ్ - నాచెవ్వులు, తిణ్గొళ్ళ - దృఢముగా, ఓర్‌క్కుమ్ - గురిపెట్టియాలోచించుచున్నది.

తా॥ ఓ శ్రియఃపతీ! నేనుకళ్లారసేవించునట్లు నీవెచ్చటకైనా వేంచేసెదవో యేమోయని యాశచే నాచెవ్వులు, నీసంశ్లేషముచే మిక్కిలి సంతోషించి సామగానముజేయుచువచ్చుచున్న నీవాహనమైన గరుత్మంతునియొక్క ఱెక్కలశబ్దము లెచ్చట వినవచ్చునోయని యాశబ్దమునువినుటకు జాగ్రతగలవైయున్నవని. ౫.

శెవిగళాలార నిన్ కీర్‌త్తిక్కనియెన్నుమ్
కవిగళే*కాలప్పణ్ తేనుఱైప్పత్తుఱ్ఱు*
పువియిన్మేల్ పొన్నెడుమ్ శక్కరత్తున్నైయే*
అవివిన్ఱియాదరిక్కుమెనదావియే. ౬.

అ॥ నిన్ - నీయొక్క, కీర్‌త్తి - యశస్సును ప్రతిపాదించెడి, కని - ఫలమువలెనతిభోగ్యమైన, కవిగళే - కవిత్వములనే, కాలప్పణ్ - కాలానుకూలరూపమైన రాగమనెడి, తేన్ - తేనెయందు, ఉఱైప్ప-చక్కగాగలిపి, శెవిగళాల్ - చెవ్వులచే, ఆర-పూర్ణముగా, తుఱ్ఱు - అనుభవించి, పువియిన్‌మేల్ - భూలోకమందే, పొన్ - అందమై, నెడుమ్ - మిక్కిలిభోగ్య

తుల, శక్కరత్తు - సుదర్శనముగల, ఉన్నై యే - నిన్నే, ఏనదావి - నాప్రాణము, అవివిన్డి - ఎడతెగక, ఆసరిక్కుమ్ - ఆశపడును.

తా॥ ఓ శ్రియఃపతీ! నీయొక్క మధురంబులైన గుణములను జక్కగావిని చక్రధరుఁడ వైన నిన్నిలోకమంతే సేవింపవలయుననిక్ష నాప్రాణములాశబడుచున్నవని. ౬.

అవియేయారముదే యెన్నై యాళుడై *
తూవియమ్పుళ్ళుడై యాయ్ శుడర్ నేమియాయ్*
పావియేన్నెఞ్జమ్ పులమ్బప్పలకాలుమ్*
కూవియుమ్కాణప్పెతే నునకోలమే. ౭.

అ॥ అవియే - నాప్రాణభూతుఁడా! ఆర్ - పూర్ణమైన, అముదే - అమృతమువలె భోగ్యభూతుఁడా! ఎన్నై - నన్ను, ఆళుడై - దాసునిగాగలవాఁడా! అమ్ - సున్దరమైన, తూవి - ఱెక్కలుగల, పుళ్ - గరుత్మంతుని, ఉడైయాయ్ వాహనముగాగలవాఁడా! శుడర్ - ఉజ్జ్వలమైన, నేమియాయ్ - సుదర్శనముగలవాఁడా! పావియేన్ - పాపియైన నాయొక్క, నెఞ్జమ్ - మనస్సు, పులమ్బ - ఆశబడిపిలువగా, పలకాలుమ్ - చిరకాలము, కూవియుమ్ - పిలిచినను, ఉనకోలమ్ - నీదివ్యవిగ్రహమును, కాణప్పెతేన్ - సేవించకుండనున్నాను.

తా॥ నాప్రాణభూతుఁడును, నిరతిశయభోగ్యుఁడును, చక్రాయుధుఁడై గరుత్మంతునిమీఁదవేంచేసివచ్చి నన్ను సేవబడుచుకొనినవాఁడునైన ఓ శ్రియఃపతీ! నేను సేవింపవలయునని యాశబడి యెంతకాలముబిలిచినను నాకోరికను లభించకయున్నానని. ౭.

కోలమేతామరై క్కణ్ణదోరఞ్జన
నీలమే*నిన్ఱెనదావియైయీర్గిన్ఱ
శీలమే*శెన్ఱుశెల్లాదనమున్నిలామ్
కాలమే*ఉన్నైయెన్నాళ్కణ్డుకొళ్వనే. ౮.

అ॥ కోలమే - పరమసుందరుఁడా! తామరైక్కణ్ణదు - పద్మనేత్రుఁడా! ఓర్ - అద్వితీయమైన, అఞ్జనమ్ - కాటుకవలె, నీలమే-శ్యామమైనతిరుమేనుగలవాఁడా! నిన్ఱు - స్థిరపడియుండి, ఎనదావియై - నాప్రాణమును, ఈర్గిన్ఱ - బద్దలుజేయుచున్న, శీలమే - స్వభావముగలవాఁడా! శెన్ఱు - భూతకాలముకును, శెల్లాదన - భవిష్యత్కాలముకును, మున్నిలామ్కాలమే - ముందున్న వర్తమానకాలముకునునిర్వాహకుఁడా! ఉన్నై - నిన్ను, ఎన్నాళ్ - ఎప్పుడు, కణ్డుకొళ్వన్ - సేవించెదను.

తా॥ సౌందర్యమే శరీరమెత్తివచ్చినట్లున్న పద్మనేత్రమును, అఞ్జనాచలశ్యామమైనతిరుమేనును నాకగుపఱచక నన్నుబాధించుచున్న ఓ శ్రియఃపతీ! నిన్ను నేననుభవించుటకు దగిన కాలమును నీవే నాకు శీఘ్రముగా గల్పించుమాయని. ౮.

కొళ్వన్నాన్మావలి మూవడితావెన్ఱ
కళ్వనే*కఞ్జనై వఞ్జిత్తువాణనై

ఉళ్వన్మైతీర*ఓరాయిరమ్తోళ్ తుణిత్త

పుళ్వల్లాయ్*ఉన్నై యెజ్ఞాన్ను పొరున్దువనే. ౯.

అ॥ మావలి - ఓమహాబలీ, నాళ్ - నేను, మూవడి - మూడడుగులు, కొళ్వాళ్ - తీసికొనె దను, తా - ఇమ్ము, ఎన్ఱ - అనియడిగిన, కళ్వనే-వంచకుఁడా! కఞ్జనై - కంసుని, వఞ్జిత్తు-వంచన జేసియు(చంపియు), వాణనై - బాణాసురునియొక్క, ఉళ్వన్మై - మనోబలము, తీర - పోవు నట్లు, ఓరాయిరమ్ - ఒకవెయ్యి, తోళ్ - భుజములను, తుణిత్త - ఛేదంచిన, పుళ్వల్లాయ్ - గరుడవాహనుఁడా! ఉన్నై - నిన్ను, ఎఞ్ఞాన్ఱు - ఎప్పుడు, పొరున్దువళ్ - పొందెదను.

తా॥ ముగ్ధమాటలచే మహాబలిని మోహింపజేసి వానిని జయించియు, కంసునిసంహరిం చియు, శివభక్తుఁడనైననన్ను శివుఁడు రక్షించునని యభిమానించియున్న బాణాసురునియొక్క వెయ్యి భుజములను ఛేదించియుఇట్లుసకలవిరోధులను బోగొట్టిన ఓ శ్రియఃపతీ! నిన్ను నే నెప్పుడుబొందెదనని.

పొరున్దియమామరుదినిడై పోయ వెమ్

పెరున్దగాయ్*ఉన్కழల్ కాణియ పేదుఱ్ఱు*

వరున్దినాన్ వాశగమాలై కొణ్డు*ఉన్నైయే

ఇరున్దిరున్దెత్తనై కాలమ్ పులమ్బువనే. ౧౦.

అ॥ పొరున్దియ - చేరియున్న, మా - గొప్ప, మరుదిళ్ - మద్దివృక్షములయొక్క, ఇడై- నడుమున, పోయ - వేంచేసిన, ఎమ్ - మాస్వామియైన, పెరుమ్తగాయ్ - మహాప్రభావముగల వాఁడా! ఉన్ - నీయొక్క, కழల్ - శ్రీపాదమును, కాణియ-సేవించవలయునని, పేదుఱ్ఱు - ఆశపడి, వరున్ది - దుఃఖించి, నాన్ - నేను, వాశగమాలైకొణ్డు - శబ్దసందర్భములతో, ఇరున్దిరున్దు-ఉండియుండి, ఉన్నైయే - నిన్నే, ఎత్తనైకాలమ్ - ఎంతకాలము, పులమ్బువనే - పిలిచెదను.

తా॥ మద్దివృక్షములనడుమన జనుదెంచి వానిని బడద్రోసిన బలిష్ఠుఁడా! నీశ్రీపాదమును సేవింపనాశపడి దానిని లభించక దుఃఖించుచు నిన్ను నే నెంతకాలము బిలిచెదనని. ౧౦.

⁑ పులమ్బుశీర్ ప్పూమియళన్దపెరుమానై*

నలఙ్గొళ్శీర్ నన్గురుగూర్చ్చడగోపన్*శొల్

వలఙ్గొణ్డవాయిరత్తుళ్ళివైయుమోర్ప

త్తిలఙ్గువాన్*యావరుమేఱువర్శొన్నాలే. ౧౧.

అ॥ పులమ్బు - స్తోత్రముచేయదగిన, శీర్ - కల్యాణగుణములుగలవాఁడై, పూమి - భూమిని, అళన్ద - కొలిచిన, పెరుమానై - స్వామియైన శ్రియఃపతివిషయమై, నలమ్కొళ్ -భగవ దనుభవాభినివేశమనెడి మంచితనముగల, శీర్ - జ్ఞానముగల, నల్ - విలక్షణులైన, కురుగూర్ చ్చడగోపన్ - తిరునగరిస్వామియైననమ్మాళ్వార్లు, శొల్ - పాయించిన, వలఙ్గొణ్డ - ప్రతి

పాదనసామర్థ్యముగల, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఓర్ - అద్వితీయమైన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, శొన్నాల్ - అనుసంధించినయెడల, యావరుమ్ - ఎట్టివారైనను, ఇలజ్గుం - ప్రకాశించుచున్న, వాన్ పరమపదమును, ఏఱువర్ - పొందుదురు.

తా॥ శ్లాఘ్యములైన కల్యాణగుణంబులుగల శ్రియఃపతివిషయమై నమ్మాழ்వార్లుసాయించినయీపదిపాశురముల ననుసంధించువారు పరమపదమును బొందుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౯ - వ తిరువాయ్‌మొழி.

అవతారిక:—ఈతిరువాయ్‌మొழிలో, సకలేంద్రియములచే భగవంతుని యనుభవించవలయునని యాశించిన తనయాశనెరవేరనందున బాధపడుచు, ఈబాధను జెప్పుకొనుటకుఁదగినవారెవ్వరని పరికించి, సకలమనుజులునన్యాసక్తమనస్కులై భగవద్విముఖులైయుండగాజూచి, తనబాధనుమఱచి వారికి హితంబునుపదేశించుచున్నారు.

‡‡ శొన్నాల్ విరోదమిదు ఆగిలుమ్‌శొల్లువన్ కేణ్మినో*
ఎన్నావిలిన్‌కవి యానొరువర్‌క్కుమ్‌కొడుక్కిలేన్*
తెన్నాతెనావెన్ఱు వణ్డుమురల్ తిరువేఙ్గడత్తు*
ఎన్నానై యెన్నప్పన్ ఎమ్బెరుమానుళనాగవే. ౧.

అ॥ ఇదు - ఈమాటను, శొన్నాల్ - చెప్పినయెడల, విరోదమ్ - మీకువిరోధముగానుండును, ఆగిలుమ్ - అయినను, శొల్లువన్ - చెప్పెదను, కేణ్మిన్ - వినుఁడుము, వణ్డు - తుమ్మెదలు, తెన్నాతెనావెన్ఱు - తెన్నాతెన్నాఅని, మురల్ - శబ్దించుచున్న, తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రియందువేంచేసియున్నవాఁడును, ఎన్నానై - నాకునిర్వాహకుఁడును, ఎన్నప్పన్ - నాకుపకారకుఁడును, ఎమ్బెరుమాన్ - మాస్వామియునైనశ్రియఃపతి, ఉళనాగ - ఉండగా, ఎన్ - నాయొక్క, నావిల్ - నాలికయందున్న, ఇన్ - మధురమైన, కవి - కవిత్వమును, యాన్ - నేను, ఒరువర్‌క్కుమ్ - మఱియొకరికిని, కొడుక్కిలేన్ - ఇవ్వను.

తా॥ ఓచేతనులారా! నేనుచెప్పెడిమాట మీకు విరోధముగా దోచును. అయిననొకమాట చెప్పెద, వినుఁడు అతిరమణీయంబైన వేఙ్కటాద్రియందు వేంచేసియున్న మాస్వామియైన సర్వేశ్వరుఁడుఁడగా వానికితప్ప నేనింకొకనికి కృతిచెప్పనని. ౧.

ఉళనాగవేయెణ్ణి త్తన్నై యొన్ఱాగత్తన్ శెల్వత్తై*
వళనామదిక్కుమిమ్మానిడత్తైక్కవిపాడియెన్*
కుళనార్‌కழனிశూழ் కణ్ణన్‌కుఱుఙ్గుడిమెయ్‌మ్మెయ్యే*
ఉళనాయవెన్దైయై యెన్దైపెమ్మానై యొழிయవే. ౨.

అ॥ కుళళ్ - కొలనలచే, ఆర్ నిండియున్న, కృళని - పొలములచే, శూழ் - చుట్టఁబడిన, కణ్ - విశాలమై, నళ్ - శ్లాఘ్యంబైన, కుఱుజ్గుండి తిరుక్కుఱుంగుడియనెడిదివ్యదేశమందు, మెయ్మ్మెయ్యే - యథార్థముగా, (తనగుణములు ప్రకాశించునటుల), ఉళనాయ - వేంచేసియున్న, ఎన్దైయై-నాకుపకారకుండై, ఎన్దై పెమ్మానై-నాకులనాయకుఁడైన సర్వేశ్వరుని, ఒழிయ-విడాగా, తన్నై - తనను, ఒన్రాగ - ఒకవస్తువుగా, ఉళనాగవే - ఉన్నటులనే, ఎణ్ణి - తలంచి, తిళ్ శెల్వత్తై - తనసంపత్తును, వళనా - అధికముగా, మదిక్కుమ్ - అభిమానించియున్న, మానిడత్తై - మనుష్యజాతిని గురించి, కవిపాడి, కవిత్వముజెప్పి, ఎళ్ - ఏమిప్రయోజనము.

తా॥ అవధిలేని సంపద్యుక్తుండై మాకులదేవతయైన శ్రియఃపతిని వదలి, తనయశ్వైశ్వర్యమును గొప్పదనితలంచిన మనుష్యులకుఁ గృతిజెప్పుటచే మీకెట్టిప్రయోజనమును సిద్ధించదని. ౨.

ఒழிవొన్రిల్లాద పల్లూழிదోఱూழிనిలావప్పోమ్
వழிయై తరుమ్ నఙ్గళ్ వానవరీశనై నిఱ్కప్పోయ్
క్కழிయమిగనల్ల వాన్ కవికొణ్డుపులవీర్గాళ్
ఇழிయక్కరుది యోర్ మానిడమ్పాడలెన్నావదే. 3.

అ॥ ఒన్రు - ఒకవిధమైన, ఒழிవు - విచ్ఛేదమున్న, ఇల్లాద-లేకుండ, పల్-అనేకములైన, ఊழிతోఱూழி - ప్రతికల్పములయందును, (యావత్కాలమును), నిలావ - ఉండునటుల, పోమ్ - పోతగిన, వழிయై - ఉపాయమును, తరుమ్ - ఇచ్చెడి, వానవర్ - నిత్యసూరులకు, ఈశనై - స్వామియైన శ్రియఃపతిని, నిఱ్క - తప్ప, పులవీర్గాళ్ - జ్ఞానవంతులారా! పోయ్-మఱియొకచోటికివెళ్ళి, కழிయమిగు - మిక్కిలియతిశయించిన, నల్ల - శ్రేష్ఠమైన, వాన్కవి కొణ్డు - గొప్పకవిత్వమునుజెప్పి, ఇழிయ - స్వరూపహానిపచ్చునట్లు, కరుది - తలంచి, ఓర్ మానిడమ్ - ఒకమనుష్యుని- పాడల్ - స్తోత్రముజేయుటచే, ఎన్నావదు - ఏప్రయోజనము గలుగును.

తా॥ ఓపణ్డితులారా! మనకవిచ్ఛిన్నమోక్షానుభవోపాయమునిచ్చెడి శ్రియఃపతియుండగా వానినివదలి యొకమనుజానివిషయమై కృతిజెప్పుటచే మీకుస్వరూపహాని వచ్చునే తప్పమఱియొక ప్రయోజనముగలుగదని. 3.

ఎన్నావదెత్తనై నాళైక్కుప్పోదుమ్పులవీర్గాళ్
మన్నావమనిశరై ప్పాడిప్పడైక్కుమ్పెరుమ్పొరుళ్
మిన్నార్ మణిముడి విణ్ణవర్తాదైయైప్పాడినాల్
తన్నాగవేకొణ్డు శన్మమ్ శెయ్యామైయుమ్కొళ్ళుమే. ర.

అ॥ పులవీర్గాళ్ - ఓపండితులారా! మన్నా - అస్థిరులైన, మనిశరై - మనుజులను, పాడి - స్తుతించి, పడైక్కుమ్ - పొందెడి, పెరుమ్ - (మీతలంపుచే) గొప్పదైన, పొరుళ్ - ధనముచే, ఎన్నావదు - ఏప్రయోజనముసిద్ధించును, ఎత్తనైనాళైక్కు - ఎన్నిదినములకుపోదుమ్ - చాలును, మిన్ - కిరణములచే, ఆర్ - పూర్ణమైన, మణిముడి - రత్నకిరీటముగల, విణ్ణవర్ -

గిత్యసూరులకు, తాద్రై - నిర్వాహకుండైనసర్వేశ్వరుని, పాడినాల్ - స్తుతించినయెడల, తన్నాగ వేకొణ్డు - తనతోసమానముగాజేసి, తన్నమ్‌కొయ్యామైయుమ్-జన్మమె త్తకుండునట్లు, కొళ్ళుమ్ - అంగీకరించును.

తా॥ ఓజ్ఞానాథకులారా ! ఒకమనుష్యునిస్తుతించి సంపాదించిన యల్పధనముచే మీ కేకార్యము నెఱవేరును? ఆధనము మీ కెంతకాలమువఱకుండును? మీశరీరపోషణకుఁగూడజాలదు. గనుక వానిని వదలిమోక్షసామ్రాజ్యమునిచ్చెడి నిత్యసూరినిర్వాహకుఁడైన సర్వేశ్వరుని స్తుతింపుఁడని.భ.

కొళ్ళుమ్పయనిల్లై కుప్పైక్కిళర్ త్తన్న శెల్వత్తై*
వళ్ళల్ పుగழ்న్దు నుమ్‌వాయ్‌మైయిழக్కుమ్‌పులవీర్‌గాళ్*
కొళ్ళక్కుఱై విలన్ వేణ్డిఱ్ఱెల్లామ్ తరుమ్‌కోదిల్*ఎన్
వళ్ళల్ మణివణ్ణన్ఱన్నై క్కవిశొల్లవమ్మినో. ౫.

అ॥ కొళ్ళుమ్ - పొందదగిన, పయన్ - ప్రయోజనము, ఇల్లై - లేదు. కుప్పై - కుప్పను, కిళర్ త్తన్న - తప్పుటకుసమానమైన, (అసారమైన), శెల్వత్తై - సంపత్తును, వళ్ళల్ - శ్రేష్ఠముగా, పుగழ்న్దు - కొనియాడి, నుమ్‌వాయ్‌మై - మీనోటిసత్యమును, ఇழக்కుమ్-పోగొట్టుకొనుచున్న, పులవీర్‌గాళ్ - కవిశ్రేష్ఠులారా! కొళ్ళ - అంగీకరించుటకు, కుఱైవిలన్ - కొఱతలేనివాఁడును, (మీవర్ణనకుఁదగిన పూర్తిగలవాఁడును), వేణ్డిఱ్ఱెల్లామ్ - అపేక్షించినవన్నిని, తరుమ్ - ఇచ్చుటకుసమర్థుఁడును, కోదు - ప్రత్యుపకారము నపేక్షించడమనెడిదోషము, ఇల్ - లేనివాఁడును, ఎన్ - నాకు, వళ్ళల్ - మహోపకారకుఁడును, మణివణ్ణన్ఱన్నై - నీలరత్నమువంటితిరుమేనుగలవాఁడునైనశ్రియఃపతివిషయమై, కవిశొల్ల - కవిత్వముచెప్ప, వమ్మిన్ - రండు.

తా॥ ఓకవీశ్వరులారా! మీరు గుణహీనులైన మనుజులవిషయమై లేనిగుణముల నారోపించి స్తుతించినయెడల మీరసత్యవాదులగుదురే గాక మఱియొకప్రయోజనమున్ను సిద్ధించదు. గనుక మీస్తోత్రమునకుఁ దగిన గుణవంతుడును, మీయందేమియుగోరక మీకుసకలాభీష్టములనిచ్చువాఁడునైన శ్రియఃపతివిషయమై కృతిజెప్పుదురు రండుమాయని, ౫

వమ్మిన్‌పులవీర్ నుమ్మెయ్ వరుత్తికై శెయ్‌దుయ్‌మ్మినో*
ఇమ్మన్నులగినిల్ శెల్వరిప్పోదిల్లై నోక్కినోమ్*
నుమ్మిన్‌కవికొణ్డు నుమ్‌నుమిట్టా తెయ్‌వమేత్తినాల్*
శెమ్మిన్‌శుడర్ముడి యెన్‌తిరుమాలుక్కుచ్చేరుమే. ౬.

అ॥ పులవీర్ - ఓకవీశ్వరులాలా! వమ్మిన్ - రండు, నుమ్ - మీయొక్క మెయ్-శరీరమును, వరుత్తి-కష్టపఱచి, కైశెయ్‌దు-చేతులతోపనిచేసి, (కూలిచేసి), ఉయ్‌మ్మిన్-జీవించుఁడు. ఇమ్మన్నులగినిల్ *ప్రవాహతోనిత్యమైన యీలోకమందు, ఇప్పోదు-ఇప్పుడు, శెల్వర్-శ్రీమంతులు, ఇల్లై - లేరు, నోక్కినోమ్-విచారించితిమి, నుమ్-మీయొక్క, ఇన్-మధురమైన, కవికొణ్డు-

* ప్రవాహతోనిత్యమనగా - నదియందొక ప్రవాహము దీసిపోయినను అదేవిధముగా మఱియొక ప్రవాహమువచ్చునట్లు ఒకవస్తువునశించినను మఱియొకటి మ దేవిధముగనుత్పన్నమగునని.

స్తోత్రములచే, నుమ్‌నుమ్ - మీయొక్క, ఇట్టా తెయ్వమ్ - ఇష్టదేవతను, ఏత్తినాల్ - స్తుతించిన యెడల, శెయ్‌మిన్ - చక్కగా ప్రకాశించుచున్న, శుడర్ - తేజోమయమైన, ముడి - కిరీటము గల, ఎన్ తిరుమాలుక్కు - నా శ్రియఃపతికి, శేరుమే - చేరును.

తా॥ ఓ ప్రాజ్ఞులారా! నామాటనువినుఁడు. మీరు శరీరకష్టపడి కూలిరైనచేసి బతుకుఁడు. మీకవిత్వమునకుసంతోషించి మీకుఁదగినసమ్మానముజేయదగిన సంపన్నులెవ్వరున్ను లేరు. శ్రియఃపతికంటె వేరైన మీయిష్టదేవతలను మీరుస్తుతించినను మీరారోపించిచెప్పిన గుణములు వారియందుండవుగనుక యాకవిత్వముగూడ యట్టిగుణంబులగల శ్రియఃపతికే చేరునని. ౬.

శేరుమ్కొడై పుగழ ఎల్లైయిలానై *ఓరాయిరమ్
పేరుముడై యపిరానై యల్లాల్ మఱ్ఱుయాన్ కిలేన్*
మారియనై యకై మాల్వరై యొక్కుమ్‌తిణ్డోళ్ ఎన్ఱు*
పారిలోర్ పఱ్ఱైయై ప్పచ్చైప్పశుమ్పొయ్‌గళ్ పేశవే. ౭.

అ॥ శేరుమ్ - తగిన, కొడై - దానముచేగలిగిన, పుగழ - కీర్తికి, ఎల్లైయిలానై - అవధి లేనివాఁడును, ఓరాయిరమ్ - ఒకవెయ్యి, పేరుమ్ - తిరునామములనున్ను, ఉడైయ - కలవాఁడును పిరానైయల్లాల్ - మహోపకారకుఁడునునైన శ్రియఃపతినితప్ప, పారిల్ - భూమియందున్న, ఓర్ - అప్రయోజకుఁడైన, మఱ్ఱు - వేఱొక, పఱ్ఱైయై - గడ్డిపరెనల్పుడైనపురుషునిగురించి, కై - (మీ) చెయ్యి, మారియనైయ - (ఈవిలో) మేఘముతోసమానమనియు, తిణ్ - దృఢమైన, తోళ్ - భుజములు, మాల్ - గొప్ప, వరై యొడొక్కు మెన్ఱు - పర్వతముతోసమానమనియు, పచ్చై - సత్యవచనముగలియని, పశుమ్‌పొయ్‌గళ్ - నూతనమైన యసత్యవచనములను, పేశ - చెప్పుటకు, యాన్ - నేను, కిలేన్ - సమర్థుఁడనుగాను.

తా॥ అత్యుదారుఁడై ప్రసిద్ధుఁడైన శ్రియఃపతియొక్క సహస్రనామములను సంకీర్తనముజే యవలయుననియున్న నేను వానినివదలి, ఒకక్షుద్రపురుషునిజూచి, నీవేగొప్పవాఁడవనియు, మహోదారుఁడవనియు, ఇట్టియబద్ధము చెప్పుటకు శక్యుఁడనుగానని. ౭.

వేయి న్మలిపురై తోళ్ పిన్నైక్కు మణాళనై *
ఆయ పెరుమ్పుగழ ఎల్లైయిలాదనపాడిప్పోయ్*
కాయమ్‌కழిత్తవన్ తాళిణైక్కీழ్ప్పుగుమ్కాదలన్*
మాయమనిశరై మొన్నొల్లవల్లేన్ వాయ్‌కొణ్డే. ౮.

అ॥ వేయిన్ - వెదురుకంటె, మలి - సుందరములై, పురై - పరస్పరసదృశంబులైన, తోళ్ - భుజములుగల, పిన్నైక్కు - నప్పిన్నపిరాట్టికి, మణాళనై - వల్లభునియొక్క, ఆయ - స్వరూపానురూపంబులై, పెరుమ్ - అపరిచ్ఛిన్నంబులై, ఎల్లైయిలాదన - అసంఖ్యాతంబులైన, పుగழ - గుణంబులను, పాడి - స్తుతించి, పోయ్ - అదేవిధముగానడుచుచు, కాయమ్ - శరీరమును, కழిత్తు - విడిచి, అవన్ - అశ్రియఃపతియొక్క, తాళిణైక్కీழ் - శ్రీపాదద్వన్ద్వములక్రింద, పుగుమ్ - ప్రవే

శించుటయందు, కాదలన్ - ఆశగలనేను, మాయన్ - నశ్వరులైన, మనిశర్ - మనుజులను, ఎన్ వాయ్ కొణ్డు - నావాక్కుతో, ఎన్ కొల్లవల్లేన్ - ఏమని చెప్పెదను.

తా॥ ఓ బుద్ధిమంతులారా! చక్రనిభుజములుగల నప్పిన్నప్పిరాట్టితో సంశ్లేషించుచున్న సకలకల్యాణగుణాకరుఁడైన శ్రియఃపతిని స్తుతించుచు, ఈశరీరావసానమందే వానిశ్రీపాదములను బొందదలంచిన నావాక్కు మతియొకమనుజుని స్తోత్రము జేయదని ౮.

వాయ్ కొణ్డు మానిడమ్ పాడవన్ద కవియేనల్లేన్*
ఆయ్ కొణ్డశీర్వళ్ళలాళిప్పిరానెనక్కేయుళన్*
శాయ్ కొణ్డవిమ్మైయుమ్ శాదిత్తు వానవర్ నాట్టైయుమ్*
నీకణ్డుకొళ్ళెన్ఱు వీడుమ్ తరుమ్ నిన్ఱునిన్ఱే. ౯.

అ॥ వాయ్ కొణ్డు - వాక్కుతో, మానిడమ్ - మనుజులను, పాడవన్ద - కృతిచెప్పవచ్చిన, కవియేనల్లేన్ - కవినిగాను. ఆయ్ కొణ్డ - శోధింపఁబడిన (హేయప్రత్యనీకమైకల్యాణైకతానమైన) శీర్ - గుణంబులుగల, వళ్ళల్ - ఉదారుఁడును, ఆళిప్పిరాన్ - సుదర్శనముగలవాఁడు నైనస్వామి, ఎనక్కేయుళన్ - నాకవిత్వమునకేవిషయమైయున్నాఁడు, శాయ్ కొణ్డ - కాన్తిగల, ఇమ్మైయుమ్ - ఐహికపురుషార్థములనున్ను, శాదిత్తు - (నాకు) సంపాదించియిచ్చి, వానవర్ నాట్టైయుమ్ - నిత్యసూరులయొక్క దేశమైనపరమపదమునున్ను, నీ - నీవు, కణ్డుకొళ్ ఎన్ఱు - చూచుకొమని, నిన్ఱునిన్ఱు - నిదానించినిదానించి, వీడుమ్ - మోక్షమునున్ను, తరుమ్ - ఇచ్చును.

తా॥ సకలకల్యాణగుణాకరుఁడైన సర్వేశ్వరుఁడు నాకిహలోకమందున్న యుత్తమమైన సకలపురుషార్థములనిచ్చి మోక్షమునుగూడ నాయధీనమైజేసి నాకవిత్వమునకు విషయమవుచుండఁగా, నే నితరతుచ్ఛమనుజునికిఁగృతి జెప్పనని. ౯.

నిన్ఱునిన్ఱుపలనాళుయ్ క్కుమివ్వుడల్ నీఙ్గిప్పోయ్*
శెన్ఱుశెన్ఱాగిలుమ్ కణ్డు శన్మమ్ కళిప్పాన్ ఎణ్ణి*
ఒన్ఱియొన్ఱి యులగమ్ పడైత్తాన్ కవియాయినేఱ్కు*
ఎన్ఱుమెన్ఱుమిని మత్తొరువర్ కవి యేత్తుమే. ౧౦.

అ॥ పలనాళ్ - అనేకదినములు, నిన్ఱునిన్ఱు - ఎడతెగకనుండి, ఉయ్ క్కుమ్ - బాధించుచున్న, ఇవ్వుడల్ - ఈశరీరమును, నీఙ్గి - విడిచి, పోయ్ - పోయి, శెన్ఱుశెన్ఱాగిలుమ్ - పోయిపోయైనను (ఏజన్మమందైనను), కణ్డు - నేనుజూచి, శన్మమ్ - నాసంసారమును, కళిప్పాన్ - పోఁగొట్టుటకై, ఎణ్ణి - తలంచి, ఒన్ఱియొన్ఱి - మిక్కిలియమరియుండి, ఉలగమ్ - లోకములను, పడైత్తాన్ - సృజించినసర్వేశ్వరునికి, కవియాయినేఱ్కు - కవియైననాకు, ఇని - ఇఁకమీఁద, ఎన్ఱుమెన్ఱుమ్ - ఏకాలమందును, మత్తొరువర్ - మఱియొకరియొక్క, కవి - కవిత్వము, ఏఱ్కుమే - తగునా?

తా॥ చిరకాలముగా భగవద్జ్ఞానములేక సంసారమందుండి బాధపడుచున్న యీచేతనుఁ డేజన్మమందైనను నన్నుదలంచరా? అప్పుడే వీనికి మోక్షమునిచ్చెదనని దలఁచి తననిర్హేతుకకృపచే జగత్తును సృజించుచున్న పరమదయాళువైన శ్రియఃపతిని స్తోత్రముజేయుచున్న నాకు మఱియొక క్షుద్రమనుజుని స్తోత్రముచేయుట తగునాయని. ౧౦.

‡‡ ఏఱ్కుమ్పెరుమ్పుగళ్ వానవరీశన్ కణ్ణన్ఱనక్కు*
ఏఱ్కుమ్పెరుమ్పుగళ్ వణ్కురుగూర్చ్చడగోపన్శొల్*
ఏఱ్కుమ్పెరుమ్పుగళాయిరత్తుళ్ళివైయుమోర్పత్తు*
ఏఱ్కుమ్పెరుమ్పుగళ్ శొల్లవల్లార్క్కిల్లై శన్మమే. ౧౧.

అ॥ ఏఱ్కుమ్ - తగియున్న, పెరుఱ్ పుగళ్ - మిక్కిలికీర్తిగలవాఁడును, వానవర్-నిత్య సూరులకు, ఈశన్ - స్వామియు, కణ్ణన్ తనక్కు - భక్తులకుసులభుఁడునైన శ్రియఃపతివిషయమై, ఏఱ్కుమ్ - ఒప్పియున్న, పెరుమ్పుగళ్ - అపరిమితకీర్తిగలవారును, వణ్-సుందరమైన, కురుగూర్-కురుకాపురికినిర్వాహకులైన, శడగోపన్-నమ్మాళ్వార్లు, శొల్-సాయించిన, ఏఱ్కుమ్-అనురూపమైన, పెరుమ్పుగళ్-అధికమైనకీర్తిగల, ఆయిరత్తుళ్-వెయ్యిపాశురములలో, ఏఱ్కుమ్-తగుమైన, పెరుమ్పుగళ్ అపరిమితకీర్తిగల, ఓర్ - అద్వితీయంబైన, ఇవైపత్తు - ఈపదిపాశురములను, శొల్లవల్లార్కు - అభ్యసించువారికి, శన్మమ్ - జన్మము, ఇల్లై - లేదు.

తా॥ పరత్వసౌలభ్యాది సకలకల్యాణగుణాకరుఁడైన శ్రియఃపతివిషయమై జ్ఞానవైరాగ్యము మొదలగు సమస్తాత్మగుణపూర్ణులైన నమ్మాళ్వార్లు సాయించిన యఖిలలక్షణయుతంబైన తిరువాయ్మొళిలోఁజేరినవియు, ఇతరస్తోత్రములను నిషేధించి భగవంతునియొక్క స్తోత్రమునే శ్లాఘ్యముగాఁబ్రతిపాదించునట్టివియునైన యీపదిపాశురముల ననుసంధించువారు తిరిగి సంసారమందు జన్మించరని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౧౦- వ తిరువాయ్మొళి.

అవతారిక:— ఈతిరువాయ్మొళిలో, సర్వేశ్వరుని విషయమై కవిత్వముచెప్పుటకుఁదగిన తనభాగ్యమును జూచియానందించుచున్నారు.

‡‡ శన్మమ్పలపలశెయ్దువెళిప్పట్టు చ్చఙ్గొడుశక్కరమ్విల్*
ఒన్మైయుడైయవులక్కైయొళ్వాళ్ తణ్డుకొణ్డుపుళ్ళూర్న్దు*ఉలగిల్
వన్మైయుడైయవరక్కరశురర్ మాళప్పడైపొరుద*
నన్మైయుడైయవన్శీర్పరవప్పెఱ్ఱ నానోర్కుఱ్ఱైవిలనే. ౧.

అ॥ పలపల - అనేకవిధములయిన, శన్మమ్ - అవతారములను, శెయ్దు - చేసి, వెళిప్పట్టు - బైలుపడి, (అందరికిఁబ్రత్యక్షమై) శఙ్గొడు - శ్రీపాఞ్చజన్యములోఁగూడ, శక్కరమ్ - సుదర్శనముసున్ను, విల్ - శార్ఙ్గమనెడిధనుస్సునున్ను, ఒన్మైయుడైయ-జ్ఞానముగల, ఉలక్కై - రోకలినిన్ని, ఒళ్ - ప్రకాశించుచున్న, వాళ్ - నన్దకమనెడికత్తినిన్ని, తణ్డు - కౌమోదకియ

సెడిగదనున్ను, కొణ్డు-స్వీకరించి, పుళ్-గరుత్మంతుని, ఊర్న్దు-నడిపించి, (వాహనముగాజేసి కొని), ఉలగిల్ - లోకమందలి, వన్మైయుడైయ - క్రౌర్యముగల, అరక్కరై - రాక్షసులనున్ను, అసురరై - అసురులనున్ను, మాళ - నశించునట్లు, పడై - ఆయుధములచే, పొరుద - యుద్ధముజేసిన వాడును, నన్మైయుడైయవన్ - శౌర్యాదిగుణంబులుగలవాడునైన శ్రియఃపతియొక్క, శీర్ - కల్యాణగుణంబులను, పరవప్పెత్ఱ - స్తుతించుటకుదగిన భాగ్యముగల, నాన్ - నేను, ఓర్ కుఱైవు - ఒకతక్కువయు, ఇలన్ - కలవాడనుగాను.

తా॥అనన్తములైన యవతారములనెత్తి తనయాశ్రితవిరోధులను, శఙ్ఖచక్రాది దివ్యాయుధములచే నశింపజేసిన శూరుండైనసర్వేశ్వరుని స్తుతింపదగిన పుణ్యముగలనా కేకొఱతయులేదని. ౧.

కుఱైవిల్ తడఙ్గడల్ కోళరవేఱి త్తన్ కోలచ్చెన్దామరైక్కణ్ *
ఉఱైపవన్పోలవోర్ యోగుపుణర్న్ద వొళిమణివణ్ణన్ కణ్ణన్ *
కఱైయణిమూక్కుడై ప్పుళ్ళైక్కడావి యసురర్కుక్కాలయ్న్దవమ్మాన్ *
నిఱైపుగళేత్తియుమ్పాడియుమాడియుమ్ యానోరుముట్టిలనే. ౨.

అ॥ కుఱైవిల్ - తక్కువలేని, తడమ్ - విశాలమైన, కడల్ - సముద్రమందు, కోళ్ - బలిష్ఠుడైన, అరవు - ఆదిశేషునిమీద, ఏఱి - ఎక్కి, తన్ - తనయొక్క, కోలమ్ - సుందరంబులైన, శెమ్తామరై - ఎఱ్ఱతామరబోలిన, కణ్ - నేత్రములను, ఉఱైబవన్పోల - (మూసుకొని) నిదురబోవునటుల, ఓర్యోగు - ఒకయోగనిద్రను, పుణర్న్ద - పొందినవాడును, ఒళి - ప్రకాశించుచున్న, మణివణ్ణన్ - నీలమణివంటివర్ణముగలవాడును, కణ్ణన్ - సులభుడును, కఱై - చిహ్నమును, అణి - అలంకారముగాగల, మూక్కుడై - ముక్కుగల, పుళ్ళై - గరుత్మంతుని, కడావి - నడిపించుకొని, అసురర్కై - అసురులను, కాయ్న్ద-నశింపజేసిన, అమ్మాన్-సర్వాధికుడునైనశ్రియఃపతియొక్క, నిఱై - సంపూర్ణమైన, పుగళ్ - కీర్తిని, ఏత్తియుమ్-స్తుతించియు, పాడియుమ్ - గానముజేసియు, ఆడియుమ్ - నృత్యముజేసియు, (తిరుగుచున్న) యాన్ - నేను, ఒరు - ఒకవిధమైన' ముట్టు - ప్రతిబంధకమును, ఇలన్ - కలవాడనుగాను.

తా॥ జగత్తుయొక్కయోగక్షేమమును విచారించుచు క్షీరాబ్ధియందన న్తశయ్యమీద పవ్వళించియుండి ఆశ్రితులకాపత్తుసంభవించినప్పుడు గరుడవాహనారూఢుడై వేంచేసి విరోధులను బోగొట్టువాడైన సర్వేశ్వరునియొక్క కల్యాణగుణములను స్తుతించిపాడుచు నృత్యముజేయుచున్న నేను, అప్రహతముగా భగవంతుని యనుభవించుచున్నానని ౨.

ముట్టిల్ పల్ పోగత్తోరుతనినాయగన్ మూవులగుక్కురియ *
కట్టియెతేనై యముదై నన్పాలై క్కనియైక్కరుమ్బుదన్నై *
మట్టవిழ் తణ్ణన్దుழாయ్ముడియానై వణఙ్గి యవన్ తిఱత్తు
ప్పట్టపిన్నై *ఇఱై యాగిలుమ్ యానెన్మనత్తుప్పరివిలనే. 3.

అ॥ ముట్టిల్ - ప్రతిబంధకములేని, పల్ పోగత్తు - బహువిధములైనభోగములుగలవాడును, మూవులగుక్కు - మూడులోకములకున్ను, ఉరియ-తగిన, ఒరు-అద్వితీయుడైన, తనినాయగన్-

ముఖ్యకారణభూతుఁడును, నల్ - విలక్షణమైన, కట్టియై - పడికబెల్లమువంటివాఁడును, తేనై - తేనెవంటివాఁడును, అముదై-అమృతమువంటివాఁడును, పాలై-పాలువంటివాఁడును,కనియై-పండు వంటివాండును, కరుమ్బుదనై - చెరుకువంటివాఁడును, మట్టు - తేనెకారుచున్నదియు, అవిழ் - వికసించినదియు, తణ్ -చల్లనైనదియు, అమ్-సుందరమైనదియునైన,తుழாయ్-తిరుత్తుழாయిని, ముడియానై - కిరీటమందుగలవాఁడునైన శ్రియఃపతి, వణఙ్గి - నమస్కరించి, అవన్ తిఱత్తు - వానివిషయమందు, పట్టపిన్నై-దొరుకుకున్నతరువాత, యాన్ - నేను, ఇన్నైయాగిలుమ్-కొంచెమైనను, పరివు - దుఃఖమును, ఎన్మనత్తు - నామనస్సునందు, ఇలన్ - కలవాఁడనుగాను.

తా॥ సకల జగత్కారణుఁడును, సకలభోగనిరతుఁడును, మిక్కిలి భోగ్యభూతుఁడునైన సర్వేశ్వరునియాశ్రయించిన నామనస్సునం దేవిధదుఃఖమును లేదని. 3.

పరివిన్ఱి వాణనై క్కాత్తుమెన్ఱన్ఱు వన్దెదిర్న్ద*
తిరిపురమ్ శెఱ్ఱవనుమ్మగనుమ్ పిన్నుమజ్ఞియుమ్పోర్ తొలైయ*
పొరుశిఱైప్పుళ్ళై క్కడావియ మాయనై యాయనై ప్పొఱ్చక్కర
త్తరియినై *అచ్చుదనై ప్పఱ్ఱి యానిఱై యేనుమిడరిలనే. ౪.

అ॥ పరివు - శ్రమము, ఇన్ఱి - లేక, వాణనై - బాణాసురుని, కాత్తుమ్ - రక్షించెదము, ఎన్ఱు - అనితలంచి, అన్ఱు - ఆకాలమందు, వన్దు - వచ్చి, ఎదిర్న్ద - ఎదిరించిన, తిరిపురమ్శెఱ్ఱవనుమ్ - త్రిపురాసురసంహారకుఁడైనరుద్రుఁడును, మగనుమ్ - వానికొమాఁడైనకుమారస్వామియు, పిన్నుమ్ - మఱియు, అజ్ఞియుమ్ - అగ్నియు, పోర్ - యుద్ధమందు, తొలైయ - ఓడిపోవునట్లు, పొరు - యుద్ధముచేయుచున్న, శిఱై - ఱెక్కలుగల, పుళ్ళై - గరుత్మంతుని, కడావియ-నడిపించిన, మాయనై - ఆశ్చర్యభూతుఁడును, ఆయనై - గొల్లవాఁడును, పొన్ - రమణీయమైన, శక్కరత్తు - చక్రాయుధముగలవాఁడును, అరియినై - శత్రువులనుజయించువాఁడును, అచ్చుదనై - ఆశ్రితులనువిడువనివాఁడునైన శ్రియఃపతిని, పఱ్ఱి - పొంది, యాన్ - నేను, ఇఱైయేనుమ్ - కొంచెమైనను, ఇడర్ - దుఃఖమును, ఇలన్ - కలవాఁడనుగాను.

తా॥ రుద్రుఁడు బాణాసురునికేవిధమైనబాధయురాకుండరక్షించెదనని ప్రతిజ్ఞచేసివినాయకుఁడు కుమారస్వామి మొదలగు తనపరివారముతోగూడవచ్చి తననెదిరించగా నశ్వుడు వారిని యోడింపఁజేసిన శ్రీకృష్ణుని యాశ్రయించిన నాకెంతమాత్రంబు దుఃఖములేదని. ౪.

ఇడరిన్ఱియేయొరునాళొరుపోழ்దిల్ ఎల్లావులగుమ్కழிయ*
పడర్పుగழ்పార్త్తనుమ్వైదిగనుముడనేఱ త్తిణ్దేర్కడవి*
ఉడలొழிయాయ్నిన్ఱ తన్మ్మదై చ్చోదియిల్ వైదిగన్పిళ్ళైగళై *
ఉడలొడుఙ్గొణ్డుకొడుత్తవనై ప్పఱ్ఱి యొన్నుమ్తుయరిలనే. ౫.

అ॥ ఇడర్ - శ్రమము, ఇన్ఱియే - లేకయే, ఒరునాళ్ - ఒకదినము, ఒరుపోழ்దిల్ - ఒకముహూర్తమందు, ఎల్లావులగుమ్-సమస్తలోకములున్ను, కழிయ-వెనుకఁబడునట్లు, పడర్ -

వ్యాపించియున్న, పుగழ் - కీర్తిగల, పార్తనుమ్ - అర్జునుఁడును, వైదిగనుమ్ - వైదిక బ్రాహ్మణుఁడును, ఉడన్ - వెంటనే, ఏఱ - ఎక్కిపోవునటుల, తిణ్ - దృఢమైన, తేర్ - రథమును, కడవి - నడిపించి, శుడర్ - ఉజ్జ్వలమైన, ఒళియాయ్ - తేజోమయమై, నిన్ఱ - ఉన్న, తన్నుడై - తనదైన, శోదియిల్ - పరంజ్యోతిశబ్దవాచ్యమైనపరమపదమందలి, వైదిగన్ పిళ్ళైగళై - వైదికబ్రాహ్మణునియొక్క కొమారులను, ఉడలోడుమ్ - శరీరముతోఁగూడ, కొణ్డు - తెచ్చి, కొడుత్తవనై - ఇచ్చినశ్రీకృష్ణుని, పఱ్ఱి - ఆశ్రయించి, ఒన్ఱుమ్ - ఏప్రకారముచేత నున్ను, తుయర్ - దుఃఖమును, ఇలన్ - పొందనివాఁడనైయున్నాను.

తా॥ శ్రీకృష్ణుని యావిగ్రహముతో సేవింపవలయునని యాశబడి శ్రీదేవి మొదలైనవారు కృష్ణభక్తుఁడైన యొకవైదికబ్రాహ్మణునియొక్క నలుగురుపుత్రులనున్న భూలోకమునుంచి పరమ పదమునుబొందింపగా, అప్పుడాబ్రాహ్మణుఁడు శ్రీకృష్ణునిశరణముజొచ్చి నాకొమారులను దెచ్చి యిమ్మని ప్రార్థింప నప్పుడాబ్రాహ్మణుని వెంటపెట్టుకొని తనస్నేహితుఁడైన యర్జునునితో గూడ పరమపదమునకువెళ్లి నాకొమారులను ముందున్నవయస్సుగలశరీరముతోడనే తెచ్చియిచ్చిన శ్రీకృష్ణుని యాశ్రయించిన నాకేవిధదుఃఖమును లేదని. ౫

తుయరిల్ శుడరొళితన్నుడై చ్చోది నిన్ఱవణ్ణమ్‌నిఱ్కవే*
తుయరిల్మలియుమ్‌మనిశర్ పిఱవియిల్ తోన్ఱి క్కణ్గాణవన్దు*
తుయరఙ్గళ్ శెయ్‌దుతన్ తెయ్‌వనిలై యులగిల్ పుగవుయ్‌క్కుమమ్మాన్*
తుయరమిల్ శీర్‌క్కణ్ణన్ మాయన్‌పుగழ் తుఱ్ఱ యానోర్ తున్బమిలనే. ౬.

అ॥ తుయరిల్ - దోషములేనిదియు, శుడరొళి - మిక్కిలితేజోరూపమైనదియునైన, తన్నుడై - తనయొక్క, శోది - దివ్యవిగ్రహము, నిన్ఱవణ్ణమ్ - ఉన్నప్రకారమే, నిఱ్క - ఉండునట్లు, తుయరిల్ - దుఃఖమందు, మలియుమ్ - అతిశయించిన, (మగ్నులైన), మనిశర్ - మనుజులయొక్క, పిఱవియిల్ - జన్మమందు, కణ్‌కాణ - అందరియొక్క నేత్రములకగుబడునట్లు, వన్దుతోన్ఱి - వచ్చియవతరించి, తుయరఙ్గళ్ శెయ్‌దు - (శత్రువులను) బాధపెట్టి, తన్ - తనయొక్క, తెయ్‌వనిలై - ఈశ్వరత్వమును, ఉలగిల్ - లోకమందు, పుగవుయ్‌క్కుమ్ - ప్రకాశింపఁజేయుచున్న, అమ్మాన్ - స్వామియు, తుయరమిల్ - దోషములేని, శీర్ - కల్యాణగుణములుగల, మాయన్ - ఆశ్చర్యభూతుఁడునైన, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, పుగழ் - గుణములను, తుఱ్ఱ - అనుభవించిన, యాన్ - నేను, ఓర్ - ఒక, తున్బమ్ - దుఃఖమును, ఇలన్ - కలవాఁడనుగాను.

తా॥ అప్రాకృత తేజోమయమయిన పరమపదమందున్న తన దివ్యవిగ్రహముతోడనే అయతిహేయమైన మనుష్యజాతియందవతరించి యాశ్రితులను మోహింపఁజేసియు శత్రువు లను సంహరించియు తనపరత్వము నీలోకమందందరెఱుంగునటుల స్థాపించిన శ్రీకృష్ణుని గుణ ముల ననుభవించుచున్న నా కేవిధదుఃఖమును లేదని. ౭.

తున్బముమిన్బముమాగియ శెయ్‌వినై యాయులగఙ్గళుమాయ్*
ఇన్బమిల్ వెన్నరగాగి యినియనల్వాన్ శువర్‌క్కఙ్గళుమాయ్*

మన్నుపల్లుయిర్ గళుమాగి ప్పలపలమాయమయక్కుక్కళాల్*
ఇన్నుఱువివ్విళై యాట్టుడై యానై ప్పెఱ్ఱు ఏదుమల్లలిలనే. ౭.

అ॥ తున్బముమ్ - దుఃఖమునకున్ను, ఇన్బముమ్ - సుఖమునకున్ను, ఆగియ - కారణమైన వినయుం, శెయ్ - చేయబడినవినయులైన, వినైయాయ్ - పుణ్యపాపములకు నిర్వాహకుఁడును, ఉలగఙ్గళుమాయ్ - లోకములకునిర్వాహకుఁడును, ఇన్బమ్ - సుఖము, ఇల్ - లేని, వెమ్ - ఘోరమైన, నరగాగి - నరకమునకునిర్వాహకుఁడును, ఇనియ - సుఖకరమై, నల్ - విలక్షణమై, వాన్ - శ్రేష్ఠమైయున్న, శువర్ క్కఙ్గళుమాయ్ - స్వర్గలోకములకునిర్వాహకుఁడును, మన్ - నిత్యములై, పల్ - అనేకవిధములైన, ఉయిర్ గళుమాగి - చేతనులకునిర్వాహకుఁడును, పలపల - అనేకవిధములై, మాయమ్ - ప్రకృతిసంబన్ధములైన, మయక్కుక్కళాల్ - భ్రమవికారములచేత, ఇన్బుఱుమ్-సన్తోషమునుగలుగజేసెడి, ఇవ్విళైయాట్టు - ఈలీలను, ఉడైయానై - కలవాఁడునైన సర్వేశ్వరుని, పెఱ్ఱు - పొంది, ఏదుమ్. ఏమియు, అల్లల్-దుఃఖము, ఇలన్-కలవాఁడనుగాను.

తా॥సుఖదుఃఖములకును పుణ్యపాపములకును స్వర్గనరకములకును సకలచేతనాచేతనములకును నిర్వాహకుఁడై, ఈపదార్థములను సృజించి చేతనులను మోహబెట్టి దానినిజూచి తాను సన్తోషించుచున్న సర్వేశ్వరునియాశ్రయించిన నా కేవిధ దుఃఖమును లేదని. ౭.

అల్లలిలిన్బమళవిఱన్దెఙ్గుమ్ అழగమర్ శూழొళియన్*
అల్లిమలర్ మగళ్ పోగమయక్కుక్కళాగియుమ్నిఱ్కుమమ్మాన్*
ఎల్లైయిల్ ఞానత్తన్ ఞానమ్అఃదేకొణ్డెల్లాక్కరుమఙ్గళుమ్ శెయ్*
ఎల్లైయిల్ మాయనై క్కణ్ణనై త్తాళ్ పఱ్ఱియానోర్ తుక్కమిలనే. ౮.

అ॥ అల్లలిల్ - దుఃఖసంబన్ధములేనట్టిదియు, అళవిఱన్ద - అవధిలేనిదియునైన, ఇన్బమ్ - ఆనన్దముగలవాఁడును, ఎఙ్గుమ్ - అంతట, అమర్ - వ్యాపించియున్న, అழగు - అవయవసౌన్దర్యముగలవాఁడును, శూழ్ - అంతటవ్యాపించియున్న, ఒళియన్ - దివ్యవిగ్రహసౌన్దర్యముగలవాఁడును, అల్లిమలర్ - తామరసపుష్పమందు వాసముజేయుచున్న, మగళ్ - పిరాట్టియొక్క, పోగమ్ - సంశ్లేషముచేగలిగిన, మయక్కుక్కళ్ - ఆనన్దములను, ఆగియుమ్ - కలవాఁడునై, నిఱ్కుమ్ - ఉన్న, అమ్మాన్ - స్వామియు, ఎల్లైయిల్ - అవధిలేని, ఞానత్తన్-జ్ఞానముగలవాఁడును, అఃదు - ఆ, ఞానమ్కొణ్డు - జ్ఞానమునుబరిగ్రహించి, ఎల్లాక్కరుమఙ్గళుమ్ - సమస్తజగద్వ్యాపారములను, శెయ్ - చేయువాఁడును, ఎల్లైయిల్ - అవధిలేని, మాయనై - ఆశ్చర్యవ్యాపారముగలవాఁడునైన, కణ్ణనై-శ్రీకృష్ణునియొక్క, తాళ్-శ్రీపాదములను, పఱ్ఱి - ఆశ్రయించి, యాన్ - నేను, ఓర్ తుక్కమ్ - ఒకదుఃఖమును, ఇలన్ - కలవాఁడనుగాను,

తా॥ సకలలోకవ్యాపియై, నిరతిశయదివ్యవిగ్రహసౌన్దర్యముగలవాఁడై, లక్ష్మీసమేతుఁడై, అనన్తబ్రహ్మానన్దముగలవాఁడై, సర్వజ్ఞుఁడై,తనసఙ్కల్పముచేసకలలోకములనుసృజించెడియాశ్చర్యశక్తిగలవాఁడైయున్న సర్వేశ్వరునియాశ్రయించిన నా కొకదుఃఖమును లేదని ౮.

తుక్కమిల్ ఞానచ్చుడరొళిమూర్ త్తి త్తుళాయలఙ్గల్ పెరుమాన్*
మిక్కపన్మాయఙ్గళాల్ విగిర్ దమ్ శెయ్దు వేణ్డురువఙ్గొణ్డు*
నక్కపిరానోడయన్ముదలాగ వెల్లారుమెవై యుమ్*తన్నుళ్
ఒక్కవొడుఙ్గవిళుఙ్గవల్లానై ప్పెత్ ఱొన్ఱుమ్ తళర్విలనే. ౯

అ॥ తుక్కమిల్ - దుఃఖసంబన్ధములేని, ఞానమ్ - జ్ఞానముగలవాఁడును, శుడరొళి - మిక్కిలితేజన్సుగల, మూర్ త్తి - తిరుమేనుగలవాఁడును, తుళాయలఙ్గల్-తులసీమాలిక చేనలంకరింపఁబడినవాఁడును, పెరుమాన్ - మహిమగలవాఁడును, మిక్క - అపరిచ్ఛిన్నములై, పల్ - అనేకవిధములైన, మాయఙ్గళాల్ - ఆశ్చర్యశక్తులచే, వేణ్డురువు-తనకిష్టములైనవిగ్రహంబులను, కొణ్డు - స్వీకరించి, విగిర్ దమ్ - ఆశ్చర్యవ్యాపారములను, శెయ్దు చేసినవాఁడును, నక్కపిరానోడు దిగంబరుఁడైనరుద్రునితోఁగూడ, అయన్ ముదలాగ బ్రహ్మమొదలైన, ఎల్లారుమ్-సకలచేతనులనున్ను, ఎవైయుమ్ - సకలపచేతనములనున్ను, ఒక్క - సమానముగా, తన్నుళ్ - తనలోపల, ఒడుఙ్గ - అణఁగునట్లు, విళుఙ్గవల్లానై- మ్రింగువాఁడునైనసర్వేశ్వరుని, పెత్ఱు - పొంది, ఒన్ఱుమ్ - ఏవిధమైన, తళర్వు - శైథిల్యమును, ఇలన్ - కలవాఁడనుగాను.

తా॥ అపరిమితానన్దమునున్ను, తేజోమయమైన దివ్యవిగ్రహమునున్ను గలవాఁడును, తన సఙ్కల్పముచే ననేకావతారంబెత్తి యాశ్చర్యదివ్యచేష్టితంబులొనర్చినవాఁడును, ప్రళయకాలమందు బ్రహ్మరుద్రాది సకలచేతనా చేతనవస్తువులను తనయుదరములోనుంచుకొని రక్షించినవాఁడునైన శ్రియఃపతిని యాశ్రయించిన నాకేవిధమైన కొఱతయులేదని. ౯.

తళర్విన్ఱియేయెన్ఱుమెఙ్గుమ్పరన్ద తనిముదల్ ఞానమొన్ఱాయ్
అళవుడై యైమ్పులన్గళఱియావగై యా లరువాగినిఱ్కుమ్*
వళరొళియీశనై మూర్ త్తియై ప్పూదఙ్గళైన్దై యిరుశుడరై *
కిళరొళిమాయనై క్కణ్ణనై త్తాళ్పత్ ఱి యానెన్ఱుమ్కేడిలనే. ౧౦.

అ॥ ఎన్ఱుమ్ - సర్వకాలములయందును, ఎఙ్గుమ్ - సర్వదేశములయందును, తళర్విన్ఱియే - శ్రమలేకయే, పరన్ద - వ్యాపించియున్నవాఁడును, తని - అద్వితీయమై, ముదల్ - ప్రధానకారణమైన, ఞానమొన్ఱాయ్ - విలక్షణజ్ఞానముగలవాఁడును, అళవుడై - మితిమైనవిషయములనుపరిగ్రహించెడి, ఐమ్పులన్గళ్ - పఞ్చేంద్రియములకును, అఱియావగై - తెలియకనుండునటుల, అరువాగి - సూక్ష్మమై, నిఱ్కుమ్ - ఉన్నవాఁడును, వళర్ - వర్ధిల్లుచున్న, ఒళి - తేజన్సుగల, ఈశనై - స్వామియు, మూర్ త్తియై - దివ్యవిగ్రహముగలవాఁడును, పూదఙ్గళైన్దై-పఞ్చభూతములనుశరీరముగాగలవాఁడును, ఇరుశుడరై - చన్ద్రసూర్యులనెడి రెండుతేజన్సులను శరీరముగాగలవాఁడును, కిళర్ - వర్ధిల్లుచున్న, ఒళి - ఉజ్జ్వలమైన, మాయనై - ఆశ్చర్యగుణములుగలవాఁడునైన, కణ్ణనై - శ్రీకృష్ణునియొక్క, తాళ్ - శ్రీపాదములను, పత్ ఱి - ఆశ్రయించి, యాన్ - నేను, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, కేడిలన్ - నాశములేనివాఁడనైతిని.

తా॥ ఒకక్రమములేకయే సకలజగత్తుమసృజించి అందులోవ్యాపించి వానిని నిర్వహించుచు చక్షురాదులకవిషయుఁడై నిరవధికతేజోమయమైన దివ్యవిగ్రహముగలవాఁడైన సర్వేశ్వరుని యాశ్రయించిన నాకేకొఱతయులేదని. ౧౦.

¶¶ కేడిల్విழுప్పుగழ్ క్కేశవనై క్కురుగూర్ చ్చడగోపన్ శొన్న*
పాడలోరాయిరత్తు ళివై యుమొరుపత్తుమ్ పయిల్ ఱవల్లార్ గట్కు*అవన్
నాడునగరముమ్ నన్గుడన్ కాణ నలనిడై యూర్ దిపణ్ణి*
వీడుమ్పెఱుత్తి తన్మూవులగుక్కుమ్ తరు మొరునాయగమే. ౧౧.

అ॥ కేడిల్ - దోషములేనివియు, విழுమ్ - కల్యాణకరంబులునైన, పుగழ் - గుణములుగల, కేశవనై - సర్వేశ్వరునివిషయమై, కురుగూర్ చ్చడగోపన్ - తిరునగరికిస్వామియైన నమ్మాళ్వార్లు, శొన్న - సాయించిన, పాడల్ - గానరూపమైన, ఓరాయిరత్తుళ్-అద్వితీయంబులైన వెయ్యిపాశురములలో, ఒరు - విలక్షణంబులైన, ఇవై పత్తుమ్-ఈపదిపాశురములను, పయిల్ ఱవల్లార్ గట్కు - అభ్యసించువారికి, అవన్ - ఆశ్రీకృష్ణుఁడు, నాడుమ్-దేశములయందున్నవారును, నగరముమ్ - పట్టణములయందున్నవారును, నన్గుడన్ - మంచితనముతో, కాణ - చూచునటుల, నలనిడై - శేషత్వమనెడిసంపత్తుయొక్కనడుమ, ఊర్ దిపణ్ణి - నడుచునట్లుచేసి, వీడు - మోక్షమును, పెఱుత్తి - ఇచ్చి, తన్ - తనయొక్క, మూవులగుక్కుమ్-మూడులోకములయొక్క, ఒరు నాయగమ్ - అద్వితీయమైనప్రభుత్వమును, తరుమ్ - ఇచ్చును.

తా॥ నిర్దుష్టమైన కల్యాణగుణములుగల సర్వేశ్వరునివిషయమై నమ్మాళ్వార్లుసాయించిన యీ పదిపాశురముల నభ్యసించువారికి నాసర్వేశ్వరుడే యందరునుజూచి స్తోత్రముజేయునటుల, ఉభయవిభూత్యైశ్వర్యములనిచ్చునని. ౧౧

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

3-వ, పది సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్‌మొழிలు ముప్పదింటికి పాశురములు 33౦.



## ౪ - వ, పత్తు, ౧-వ, తిరువాయ్మొழி.



అవతారిక—సర్వేశ్వరుని యనుభవించి ప్రీతులైన నమ్మాళ్వార్లు, సర్వేశ్వరునివదలి ఐశ్వర్యాదుల నభిలషించిన సంసారులనుగూర్చి ఐశ్వర్యాదులయొక్క అల్పాస్థిరత్వాదిదోషము లను, సర్వేశ్వరుని గుణవైభవాదులను నుపపాదించి అట్టివిషయములనువదలి ఇట్టిసర్వేశ్వరుని మీరాశ్రయించుడియని పాయించుచున్నారు.

‡‡ ఒరునాయగమా యోడవులగుడనాణ్డవర్*
కరునాయ్కవర్న్దకాలర్ శిదైగియపానైయర్*
పెరునాడుకాణ విమ్మైయిలేపిచ్చైతామ్కోళ్వర్*
తిరునారణన్తాళ్ కాలమ్పెఱచ్చిన్దిత్తుయ్మినో. ౧.

అ॥ ఒరువాయగమాయ్ - ఏకాధిపత్యముగలవారై, ఓడ - చిరకాలము, ఉలగు - లోకములను, ఉడన్ - అన్నింటిని, ఆణ్డవర్ - పరిపాలించినమహారాజులు, కరునాయ్ - నల్ల కుక్కచే, కవర్న్ద - కఱవబడిన, కాలర్ - కాళ్లుగలవారై, శిదైగియ - పగిలిన, పానైయర్ కుండలుగలవారై, పెరునాడు - పెద్దలోకమంతయు, కాణ - చూచునట్లు, ఇమ్మైయిలే - ఈ లోకమందే, పిచ్చై - భిక్షను, తామ్ - తాము, కోళ్వర్ - ఎత్తుదురు. (గాన) తిరు - సంప ద్యుక్తుండై, నారణన్ - నిరుపాధికస్వామియైన శ్రీమన్నారాయణునియొక్క, తాళ్ - శ్రీపాద ములను, కాలమ్పెఱ - కాలవిళంబములేక, శిన్దిత్తు - ధ్యానముజేసి, ఉయ్మిన్ ఉజ్జీవించుడి.

తా॥ ఓచేతనులారా! చిరకాలముగా నేకఛత్రాధిపతులైయున్న మహారాజులుగూడ శత్రు వులచే నపహరింపఁబడిన తమరాజ్యములుగలవారై, పిదప భిక్షమెత్తుకొనుటకై, లోకులు చూచు దురని సిగ్గుచే రాత్రిళ్లయందు ఇంళ్లపంచలనీడలయందు బైలుదేరివచ్చెడి సమయంబున యాపం చలయందలి పిల్లలుపెట్టియున్న నల్లనికుక్కను చీకటిలోజూడక త్రొక్కగా యాకుక్కచే కఱవబడిన కాళ్లుగలవారై తమచేతనున్న చట్టిపెంకునుగూడ క్రిందపడవేసికొని బాధచే హటా త్తుగా బొబ్బలిడగా నప్పుడు సమస్తజనులువచ్చిచుచి అయ్యో మనరాజుకింతయవస్థవచ్చెనని చెప్పు కుందురుగాన ఇట్టియస్థిరములైన ఐశ్వర్యములనాశించక కాలమునొక్కింతయైనవ్యర్థబుచ్చక శ్రియఃపతియొక్క శ్రీపాదములను ధ్యానించి యుజ్జీవింపుడియని. ౧.

ఉయ్మిన్ తిఱైకొణర్న్దు ఉలగాణ్డవర్* ఇమ్మైయే
తమ్మిన్ శువైమడవారై ప్పిఱర్కొళ్ళత్తామ్విట్టు*
వెమ్మినొళివెయిల్ కానగమ్పోయ్క్కుమైత్తిన్బర్గళ్*
శెమ్మినుమ్మడి త్తిరుమాలై విరైన్దడిశేర్మినో. ౨.

అ॥ తిఱై - పన్నును, కొణర్న్దు - తిసియిచ్చి, ఉయ్మిన్ - బ్రతుకుండు, ఎన్దు - అని చెప్పి, ఉలగు - లోకములను, ఆణ్డవర్ - పరిపాలించినమహారాజులు, ఇమ్మైయే - ఈజన్మమందే, తమ్ - తమకు, ఇన్ - ప్రియులరాలై, శువై - రసమునుబుట్టించువారైన, మడవారై - స్త్రీలను,

పిఱర్ - శత్రువులు, కొళ్ళ - పరిగ్రహించునట్లు, తామ్ - తమరే, విట్టు - విడిచిపెట్టి, వెమ్ - క్రూరమైన, మిన్నొళి - ఎండమావులుగల, వెయిల్ - ఎండ(కాయుచున్న), కానగమ్-అడవులకు, పోయ్ - వెళ్లి, కుమైతిన్పర్ గళ్ - బాధబడుదురు. (గాన) శెమ్మిన్ - ఎఱ్ఱనికాంతిగల, ముడి - కిరీటముగల, తిరుమాలై - శ్రియఃపతిని, విరైన్దు - శీఘ్రముగా, అడిశేర్మిన్ - పాదములనాశ్రయించిపొందుడి.

తా॥ మాకు పన్నులుకట్టి మీరు (ఒకుడియని ఇతరరాజులనుగూర్చిబలికెడి చక్రవర్తులు గూడ నాజన్మమందే శత్రువులచే జయింపబడి తమకు ప్రాణప్రియురాలైన భార్యలనుగూడ యాశత్రువులకు తాముగానే వొప్పగించి యెండమావులచేనిండియున్న యడవులయందు మంచికొండల యందుతిరుగుచు నలవిలేనిబాధనుబొందుదురుగాన ఓజనులారా అస్థిరములైన యీసమ్పత్తులనాశించక కెంపులు చెక్కియున్న కిరీటముగల శ్రియఃపతియొక్క శ్రీపాదముల నాశ్రయించుడియని ౨.

అడిశేర్ ముడియినరాగి యరశర్ గళ్ తామ్ తొழ*
ఇడిశేర్ మురశఙ్గళ్ ముత్తిరత్తియమ్బవిరున్దవర్*
పొడిశేర్ తుగళాయ్ ప్పోవర్ గళాదలిల్ నొక్కెన*
కడిశేర్ తుழாయ్ ముడి క్కణ్ణన్ కழల్ గళ్ నినైమినో. ౩.

ఆ॥ అడి - తమపాదములలో, శేర్ - చేరియున్న, ముడియినరాగి - కిరీటములుగలవారై, అరశర్ గళ్ - అన్యరాజులు, తామ్ - తమరే, తొழ - ఆశ్రయించునటులను, ఇడిశేర్ - పిడుగుతో సమానమైన, మురశఙ్గళ్ - మద్దెలవాద్యములు, ముత్తిరత్తు-ముంగిళ్లయందు, ఇయమ్బ-ఘోషించునటులను, ఇరున్దవర్ - ఉన్నరాజులు, పొడిశేర్ - ధూళితో సమానముగా, తుగళాయ్ పోవర్ గళ్ - మదింపులేకపోవుదురు; ఆదలిల్ - గనుక, నొక్కెన - శీఘ్రముగా, కడి - పరిమళము, శేర్ - చేరియున్న, తుழாయ్ - తులసీమాలిక చేనలంకరింపబడిన, ముడి-కిరీటముగల, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, కழల్ గళ్ - శ్రీపాదములను, నినైమిన్ - ధ్యానించుడి.

తా॥ ఇతరరాజులు తమకిరీటములను పాదములయందుబడునట్లు వంచినను వారినిలక్ష్యపెట్టకనుండి మద్దెళ్లుపిడుగుతో సమానముగా వెలంగుచున్న తమముంగిలిప్రదేశములలో కూర్చునుండి సుఖమనుభవించిన మహారాజులుగూడ కొంతకాలమునకు భాగ్యభ్రష్టులై ధూళితో సమానముగా మదింపులేనివా రగుదురుగాన మీరు నశ్వరైశ్వర్యములను విడిచి తిరుత్తుழாయిమాలచే బరిమళించుచున్న శ్రీకృష్ణుని శ్రీపాదముల నాశ్రయించుడియని. ౩.

నినైప్పాన్ పుగిల్ కడల్ ఎల్లిలిల్ నుణ్మణలిన్ పలర్*
ఎనైత్తోరుగఙ్గళుమ్ ఇవ్వులగాణ్డు కழிన్దవర్*
మనైప్పాల్ మరుఙ్గఱ మాయ్ దలల్లాల్ మఱ్ఱుక్కణ్డిలమ్*
పనైత్తాళ్ మదకళిఱట్టవన్ పాదమ్ పణిమినో. ౪.

ఆ॥ ఎనైత్తోరుగఙ్గళుమ్ - అనేకయుగములయందును, ఇవ్వులగు - ఈలోకములను, ఆణ్డు - పరిపాలించి, కழிన్దవర్ - గతించిపోయినవారు, నినైప్పాన్-తలంచుటకు, పుగిల్-ఆరం

భించినయెడల, కడల్ - సముద్రతీరమందలి, ఎక్కలిల్ - ఇసుకగుంపునందలి, నుణ్ - సూక్ష్మమైన, మణలిన్ - ఇసుకలకంటె, పలర్ - అధికులై యుందురు, మనైప్పాల్ - ఇంటిచోటును, మరుఙ్గు - పక్కచోటును, అఱ - గురుతు లేకుండునట్లు, మాయ్ందలల్లాల్ - నశించిపోవుటయే గాన, మఱ్ఱు - వేఱు, కణ్డిలమ్ - చూచినవారముగాము, (గాన) పనై - తాటిచెట్టువలెనున్న, తాళ్ - కాళ్లుగల, మదకళిఱు - మత్తగజమైన కువలయాపీడమును, అట్టవన్ - చంపినవాని యొక్క, పాదమ్ - శ్రీపాదములను, పణిమిన్ - ఆశ్రయించుడి.

తా॥ అనేకయుగములలో నీలోకమును బరిపాలించిగడచిపోయిన చక్రవర్తులు సముద్రమందలియిసుకవలె లెక్కలేకయున్నారు అట్టివారున్న స్థలములును ఇరుప్రక్కలనున్న స్థలములునుగూడ గురుతులేకనశించినవి గాన నట్టియస్థిరసంపత్తునాశించక కువలయాపీడమునుసంహరించినశ్రీకృష్ణుని శ్రీపాదములనాశ్రయించుడి యని. ౮.

పణిమిన్ తిరువరుళెన్ను మఞ్జీదప్పైమ్పూమ్పళ్ళి*
అణిమెన్కుழలా రిన్పక్కలవియముదుణ్డార్ *
తుణిమున్బునాల పల్లేழையర్ తామిழிప్పచ్చెల్వర్ *
మణిమిన్ను మేని నమ్మాయవన్పేర్ శొల్లి వాழ்మినో. ౯

అ॥ అమ్ - సుందరంబై, శీదమ్ - చల్లనై, పై - విశాలమైన, పూమ్పళ్ళి - పుష్పశయనమందు, తిరువరుళ్ పణిమిన్ - కృపజేయుండి, ఎన్ను మ్ - అని తమచేప్రార్థింపబడినవారై, అణి - అలఙ్కారముగల, మెన్ - మృదువైన, కుழలార్ - కొప్పులుగలవారైన స్త్రీలయొక్క, ఇన్పక్కలవియముదు - అమృతమువలెభోగ్యంబైనసంశ్లేషరసమును, ఉణ్డార్ - అనుభవించిన చక్రవర్తులు, తుణి - కందువ, మున్బు - ముందుభాగమున, నాల - వ్రేలాడునట్లు (దీనులై), పల్ - అనేకులైన, ఏழையర్ - ముందుతమయందాశగలస్త్రీలు, తామ్ - తమరే, ఇழிప్పు - ఉపేక్షింప, శెల్వర్ - (మఱియు) వారివద్దకేవెళ్ళుదురు. (గాన) మణి - రత్నమువలె, మిన్ను - ప్రకాశించుచున్న, మేని - తిరుమేనిగల, నమ్మాయవన్ - మనసర్వేశ్వరునియొక్క, పేర్ శొల్లి - తిరునామములను జెప్పి, వాழ்మిన్ - సుఖబడుడి.

తా॥ ముందు, అతిసుందరులును అందములైనకొప్పులుగలవారునైనతమస్త్రీలను పుష్పశయ్యమీదికి దయజేయమనిమహారాజులు వేడుకొనినచో ప్రణయకలహమునే జూపుచు ఒకపట్టున శయ్యలమీదకురాక తమప్రియులైన మహారాజుల కతిరసమునుబుట్టించుచు సంభోగసుఖము ననుభవింపజేసిన యాప్రియురాండ్లయిండ్లకు రాజ్యమంతయుపోయినతరువాత చాలిచాలక ముందఱ వ్రేలాడుచున్న బట్టను తాను పైనవేసికొని వీథులయెంబడి దీనులైనడిచిపోగా నప్పుడాస్త్రీలులక్ష్యపెట్టకయున్నను ముందువలెప్రణయకలహమును జూపుచున్నారనేభ్రాంతి చేవారల నే ముఖములవేడుకొనుచునుందురు. గాన ఓ జనులారా! అస్థిరైశ్వర్యములనాశింపక రత్నమువంటికాంతిగల సర్వేశ్వరునియొక్కతిరునామములననుసంధించి సుఖింపుడియని, భట్టరువారుసాయించిన, తా.

ముందతిసుందరులైనస్త్రీలు పుష్పశయ్యలనలంకరించుకొని దయచేయుడిదయచేయుడియని ప్రార్థించినను లక్ష్యపెట్టనిమహారాజులు రాజ్యమునుపోగొట్టుకొని, అట్టిప్రియురాళ్ల యిండ్లకువెళ్లగా నప్పుడువారులక్ష్యపెట్టరుగాన శ్రియఃపతినాశ్రయించుడియని, పూర్వాచార్యులతాత్పర్యము

వాఴ్న్దార్గళ్ వాఴ్న్దదు మామఴై మొక్కుళిన్ మాయ్న్దుమాయ్న్దు*
ఆఴ్న్దారెన్ఱల్లా లన్ఱుముదలిన్ఱఱుదియా*
వాఴ్న్దార్గళ్ వాఴ్న్దేనిఱ్ప రెన్బదిల్లై నిఱ్కుఱిల్*
ఆఴ్న్దార్కడఱ్పళ్ళి యణ్ణలడియవరామినో. ౬.

అ॥ వాఴ్న్దార్గళ్ - సుఖముగాజీవించినవారు, వాఴ్న్దదు - జీవించినప్రకారము, మామఴై - గొప్పవర్షమందలి, మొక్కుళిన్ - బుడ్డలువలె, మాయ్న్దుమాయ్న్దు - నశించినశించి ఆఴ్న్దార్ - అణిగిపోయిరి, ఎన్ఱల్లాల్ - అనియేగాక అన్ఱుముదల్ - పుట్టినదిమొదలు, ఇన్ఱఱుదియా - ఇదివఱకు, వాఴ్న్దార్గళ్ - సుఖముగాజీవించువారు, వాఴ్న్దేనిఱ్పర్ - సుఖపడియేయుందురు, ఎన్బదిల్లై - అనెడిమాటలేదు. నిఱ్కుఱిల్ - సుఖపడఁదలఁచినచో, ఆఴ్న్దు-లోతై, ఆర్ - నిండియున్న, కడల్ - సముద్రమును, పళ్ళి - పడకగాగల, అణ్ణల్ - సర్వేశ్వరునికి, అడియవర్ - దాసులై, ఆమిన్ - అయియుండుడి.

తా॥ సుఖించినవారనుమాట యేదిగలదో, అదినీటిబుడ్డలెట్లు తత్క్షణమున బైలుదేరి నశించునో, అట్టిదియే. ఇట్లుగాక స్థిరముగా సుఖింపవలయుననిచో సర్వేశ్వరుని యాశ్రయించుడియని. ౬

ఆమిన్ శువైయవై యాఱొడడిశిలుణ్డార్న్దపిన్*
తూమెన్మొఴిమడవారిరక్క ప్పిన్నుమ్తుఱ్ఱువార్*
ఈమినెమక్కొరుతుఱ్ఱెన్ఱిడరువరాదలిన్*
కోమిన్తుఴాయ్ముడి యాదియఞ్జోదికుణఙ్గళే. ౭.

అ॥ ఇన్ ఆమ్ - భోగ్యమైయగుచున్న, అవై - అట్టిప్రసిద్ధమైన, అఱుశువైయాఱొడు - షడ్రసములతోగూడిన, అడిశిల్ - అన్నమును, ఉణ్డు - భుజించి, ఆర్న్దపిన్ - పూర్ణులైనతరువాత, తూ - పరిశుద్ధమై, మెన్ - మృదువైన, మొఴి - మాటచే, మడవార్ - స్త్రీలు, ఇరక్క - యాచింప, పిన్నుమ్ - మఱియు, తుఱ్ఱువార్ - భుజించువారు, ఎమక్కు - మాకు, ఒరుతుఱ్ఱు - ఒకపిడికెఁడయన్నమును, ఈమిన్ - ఇవ్వుండి, ఎన్ఱు - అనియపేక్షించి, ఇడరువర్ - తొట్రుపాటుతో తిరుగుదురు, ఆదలిన్ - గాన, తుఴాయ్ముడి - తిరుత్తుఴాయిమాలచేనలంకరింపబడిన కిరీటముగల, ఆది - సర్వకారణమై, అమ్ - సుందరమై, శోది - తేజోమయమైన విగ్రహముగల సర్వేశ్వరునియొక్క, కుణఙ్గళ్ - గుణములను, కోమిన్ - అనుసంధించుడి.

తా॥ మందుషడ్రసోపేతమైన యన్నము నారగించియుండినను, అతిసుందరులైన ప్రియురాళ్లువచ్చి యారగింపమనివేడగా నప్పుడు ముందారగించినదానినిగూడ మఱచి తిరిగియునారగించిన మహాపురుషులు రాజ్యముపోయినవెనుక వీరిగా నాప్రియురాండ్ర యిండ్లకుజని ఒకకబళమన్నము బెట్టుమని వేడుకొనియెదురుగాన నశ్వరైశ్వర్యమునపేక్షించక సర్వేశ్వరుని స్థిరముగానాశ్రయించుడియని. ౭.

కుణఙ్గొళ్ నిఱైపుగఴ్ మన్నర్ కొడైక్కడనాపూణ్డిరున్దు*
ఇణఙ్గియులగుడనాక్కిలుమాఙ్గవనై యిల్లార్*

మణఙ్గొణ్డపోగత్తుమన్నియుమ్ మీళ్వర్ గళ్ మీళ్వి ల్లై*
పణఙ్గొళరవణై యాన్ తిరునామమ్పడిమినో. ౮.

అ॥ కుణఙ్గొళ్ - గుణవంతులై, నిఱైపుగழ் - పూర్ణకీర్తిగలవారైన, మన్నర్ - రాజులు, కొడై - ఇచ్చుటయుసెడి, కడన్ - స్వభావమును, పూణ్డిరున్దు - ధరించియుండి, ఇణఙ్గి - చేరియుండి, ఉలగు - లోకమును, ఉడనాక్కిలుమ్ - తనతో జేరునట్లుచేసికొనినను, అఙ్గు - అర్థైశ్వర్యవిషయమై, అవనై - అసర్వేశ్వరుని, ఇల్లార్ - ఆశ్రయించనివారు, మణమ్కొణ్డ - సుందరమైన, పోగత్తు - భోగమును, మన్నియుమ్ - పొన్దినను, మీళ్వర్ గళ్ - నష్టైశ్వర్యముగలవారగుదురు, (గాన) పణఙ్గొళ్ - పడములుగల, అరవు - ఆదిశేషుని, అణైయాన్ - పడకగాగలసర్వేశ్వరునియొక్క, తిరునామమ్ - శ్రీనామములయందు, పడిమిన్ - ఆసక్తిగలవారై యుండుడి. మీళ్విల్లై - భోగమునకునాశమురాదు.

తా॥ లోకమందు దానదాక్షిణ్యాదిగుణములుగలవారును సమస్తలోకముతో స్నేహముగలవారునైనను మహారాజులు శేషశాయియొక్క గుణములను గానముజేయనియెడలవారిఐశ్వర్యము నశించును గాన స్థిరమైనభోగమును గోరినవారు శ్రియఃపతిగుణములను గానముజేయుడని. ౮.

పడిమన్ను పల్ కలన్ పఱ్ఱోడఱుత్తైమ్పులన్వెన్ఱు*
శెడిమన్ను కాయమ్ శెఱ్ఱార్ గళుమ్ ఆఙ్గవనై యిల్లార్*
కుడిమన్ను మిన్ శువర్ క్కమ్ ఎయ్ధియుమ్ మీళ్వర్ గళ్ మీళ్విల్లై*
కొడిమన్ను పుళ్ళుడై యణ్ణల్ కழల్ గళ్ కుఱుగుమినో. ౯.

అ॥ మన్ను - పరంపరగాసంప్రాప్తమైన, పడి - భూమినిన్ని, పల్ కలన్ - అనేకయలంకారములనున్ను, పఱ్ఱోడు - సవాసనముగా, అఱుత్తు - తెంపి, ఐమ్పులన్ - పంచేన్ద్రియములను, వెన్ఱు - జయించి, శెడిమన్ను - చెటుమొలిచియున్న, కాయమ్ - శరీరమును, శెఱ్ఱార్ గళుమ్ - కష్టపెట్టినవారును, కుడి - కాపురమూలచే, మన్నుమ్ - నిండియు, ఇన్ - భోగ్యమునైన, శువర్ క్కమ్ - స్వర్గమును, ఎయ్దియుమ్ - పొన్దినను, ఆఙ్గు - అచ్చటనుండి, అవనై - అసర్వేశ్వరుని, ఇల్లార్ - ఆశ్రయించనివారు, మీళ్వర్ గళ్ - మఱలిపోవుదురు, (గాన) కొడి - ధ్వజమందు, మన్ను - అమరియున్న, పుళ్ళుడై - గరుత్మంతునిగల, అణ్ణల్ - సర్వేశ్వరునియొక్క, కழల్ గళ్ - శ్రీపాదములను, కుఱుగుమిన్ - ఆశ్రయించుడి, మీళ్విల్లై - (అప్పుడాఫలమునకు) నాశములేదు.

తా॥ సకలభోగములనువిడిచి తమమీద చెట్లుమొలుచునట్లు ఘోరతపస్సుచేసి స్వర్గాదులకు పోయినను శ్రియఃపతినిధ్యానించనియెడల అట్టిస్వర్గఫలమున్ను నశించును. గానస్థిరమైనఐశ్వర్యము గావలసినవారు గరుడధ్వజుని యాశ్రయించుడియని. ౯.

కుఱుగమిగవుణర్వత్తొడునోక్కి యెల్లామ్విట్ట*
ఇఱుగలిఱప్పెన్నుమ్ ఞానిక్కుమ్ అప్పయునిల్లైమేల్*

శిఱుగనిన్దై వదోర్ పాశముణ్డామ్ పిన్నుమ్ వీడిల్లై*
మఱుగలిలీశనై ప్పఱ్ఱి విడావిడిల్ వీడ ౘదే. ౧౦.

అ॥ కుఱుగ - (మనస్సునువిషయములనుండి) మఱలించి, ఉణర్వత్తోడు-జ్ఞానస్వరూపుఁడైన ఆత్మతోఁజేర్చి, మిగనోక్కి - చక్కఁగాననుసంధించి, ఎల్లామ్ విట్ట - సమస్తమునువిడిచి, ఇఱుగల్-స్వల్పమైన ఆత్మానుభవమనెడి యీ కైవల్యమునే, ఇఱప్పెన్నుమ్ - మోక్షమనిదలంచిన, ఞానిక్కుమ్ - జ్ఞానవంతునికిని, అప్పయఱ్ఱ - స్వయంప్రయోజనమైన యాభగవత్సమాశ్రయణము, ఇల్లైయేల్ - లేనియెడల, శిఱుగ - క్షుద్రపురుషార్థములను, నినైవదోర్-తలంచుటకుఁదగిన, పాశమ్-బంధము, ఉణ్డామ్ - కలుగును, పిన్నుమ్ - మఱియు, మఱుగలిల్ - దోషములేని, ఈశనై - సర్వేశ్వరుని, పఱ్ఱి - ఆశ్రయించి, విడావిడిల్ - శరీరము విడువనియెడల, వీడిల్లై - ఆకైవల్య రూపమోక్షమున్ను సిద్ధించదు. (గాన) అర్గదే - అభగవత్కైఙ్కర్యమే, వీడు-పరమపురుషార్థము.

తా॥ కైవల్యార్థి జితేన్ద్రియుండై పరమపురుషార్థభూతుండైనయీశ్వరునిగూడ నాశించక జీవాత్మ స్వరూపమునే తెలిసికొని ఈయల్పవస్తువునే మోక్షముగాదలంచినను సర్వేశ్వరునియాశ్రయించనియెడల అట్టిజీవాత్మోపాసనసిద్ధించదు. అట్టిసర్వేశ్వరుని యాశ్రయించి జీవాత్మనుపాసించినను అన్తిమకాలమందాసర్వేశ్వరునిస్మృతిలేనిచో నాకైవల్యరూపమోక్షమున్ను సిద్ధించదు గాన అల్పమైనయీకైవల్యమునువదలి సర్వేశ్వరుని యాశ్రయించుమడియని. ౧౦.

*॥ అర్గదేయుయ్యప్పుగుమాఱెన్ఱు కణ్ణన్ కழల్ గళ్ మేల్*
కొయ్ప్పూమ్పొழிల్ శూழ் కురుగూర్ చ్చడగోపన్ కుఱ్ఱేవల్ గళ్*
శెయ్ కోలత్తాయిరమ్ శీర్ త్తొడై ప్పాడలివై పత్తుమ్*
అழுకామల్ కఱ్పవ రాழ் తుయర్ పోయుయ్యప్పాలరే. ౧౧.

అ॥ ఉయ్య - ఉజ్జీవించుటకు, పుగుమాఱు - దారైనయుపాయము, అర్గదే - అదియే ఎన్ఱు - అనినిశ్చయించి, కణ్ణన్-శ్రీకృష్ణునియొక్క, కழల్ గళ్ మేల్ - శ్రీపాదములమీద, కొయ్ కొయ్యఁతగిన, పూ - పూవులచేనిండిన, పొழிల్ - తోఁటలుగల, కురుగూర్ - కురుకాపురికినాయకుఁడైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, కుఱ్ఱేవల్ గళ్-అంతరంగకైంకర్యముగా, శెయ్-చేసిన, కోలమ్ - అలంకారములచేపూర్ణమైన, ఆయిరమ్ - వెయ్యిసంఖ్యగల, శీర్ తొడై - భగవద్గుణములనుగుచ్ఛియున్న, పాడల్ - పాశురరూపమైన తిరువాయ్మొழிలో, ఇవై పత్తుమ్ - ఈపది పాశురములను, అழுకామల్ - తప్పక, కఱ్పవర్ - అభ్యసించువారు, ఆழ் - అగాధమైన, తుయర్ - దుఃఖము, పోయ్ - నశించి, ఉయ్యప్పాలర్ - ఉజ్జీవించువిధము గలవారగుదురు.

తా॥ సర్వేశ్వరుని యాశ్రయించుటయే ఉజ్జీవనోపాయమని ప్రతిపాదించెడినమ్మాழ்వార్లు పాయించిన యీపదిపాశురముల ననుసంధించువారు సమస్తదుఃఖములనువదలి మహానుభవమనుభవించి యుజ్జీవించుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౨-వ తిరువాయ్మొழி.

అవతారిక:—ఐశ్వర్యాదులు నశ్వరములనియు హేయములనియు సంసారులకుపదేశించిన ప్రతికిన్ని వారు వినకపోవుటచే వారినివదలి తాము భగవదనుభవమందు మిక్కిలియభినివేశముచే పరవశులై యొక పిరాట్టియవస్థనొందియుండగా నప్పుడు తనయావస్థనుబంధువులు సర్వేశ్వరునివద్ద విన్నవించువిధము సానతిచ్చుచున్నారు.

‡‡ పాలనాయ్ యేழ்ులగుణ్డుపరివిన్ఱి*
ఆలిలై యన్నవశమ్ శెయ్యుమణ్ణలార్*
తాళిణై మేలణి తణ్ణన్దుழாయ్యెన్ఱే
మాలుమాల్ *వల్వినై యేన్ మడవల్లియే. ౧.

వల్ - క్రూరమైన, విసైయేన్ - పాపముగలనాకొమారతెయైన, మడమ్ - బాల్యావస్థయందున్న, వల్లి - తీగవంటిశరీరముగలయీపె, పాలనాయ్ - బాలుడై, ఏழ்ులగు - సప్తలోకములను, ఉణ్డు - ఆరగించి, పరివిన్ఱి - శ్రమలేక, ఆలిలై - వటపత్రమందు, అన్నవశమ్ శెయ్యుమ్-అన్నముజీర్ణమయ్యెడివిధముగాజేయుచున్న, (కుడిపక్కగానుఎడిమపక్కగానుతిరిగితిరిగి పవ్వళించుచున్న), అణ్ణలార్ - స్వామియైనసర్వేశ్వరునియొక్క, తాళిణై మేల్ - శ్రీపాదద్వన్ద్వములమీద, అణి - సమర్పింపఁబడిన, తణ్ - చల్లనైన, అమ్ - సుందరమైన, తుழாయ్యెన్ఱే - తులసీమాలికయనియే, మాలుమ్ - వ్యామోహముగలదై యుండును.

తా॥ ఓస్వామి! ఈబాలికామార్తెవటపత్రశాయివైన నీశ్రీపాదములయందున్న తిరుత్తుழாయినియాశపడి బాధపడుచున్నది. ఈపెకిట్టియవస్థకుఁగారణము నాపాపమేయని. ౧.

వల్లి శేర్ నుణ్ణిడై యాయ్చ్చియర్ తమ్మొడుమ్*
కొల్లమై శెయ్దు కురవై పిణైన్దవర్*
నల్లడిమేలణి నాఱుతుழாయ్యెన్ఱే
శొల్లుమాల్ *శూழ்వినై యాట్టియేన్ పావైయే. ౨.

అ॥ శూழ் - చుట్టఁబడిన, వినైయాట్టియేన్ - పాపముగలనాయొక్క, పావై - కొమార్తెయైనయీపె, వల్లి శేర్ - తీగతోసమానమై, నుణ్ - సూక్ష్మమైన, ఇడై - నడుముగల, ఆయ్చ్చియర్ తమ్మొడుమ్-గోపస్త్రీలతోఁగూడ,కొల్లమై శెయ్దు-వ్యవస్థలేనివ్యాపారములనుజేసి, కురవై - రాసక్రీడయందు, పిణైన్దవర్-వారిచేతులతోఁదనచేతులనుకలుపుకొనినవాడైనసర్వేశ్వరునియొక్క, నల్ - విలక్షణమైన, అడిమేల్ - శ్రీపాదములమీద, అణి - సమర్పింపఁబడిన, నాఱు - పరిమళించుచున్న, తుழ் యెన్ఱే - తిరుత్తుழாయనియే, శొల్లుమ్ - చెప్పును.

తా॥ ఓశ్రియఃపతీ! కృష్ణావతారమందు గోపికలతోఁగూడ రాసక్రీడజేసిన నీశ్రీపాదములమీఁదనున్న తిరుత్తుழாయనే యీబాలిక యెల్లప్పుడు ననుసంధించుచున్నది. ఇట్టిబాధను నాభాగ్యహీనతచే చూచుచున్నాను. ౨.

పావియల్వేద నన్మాలై పలకొణ్డు*
తేవర్గళ్ మామునివ రిఱైఞ్జనిన్ఱ*
శేవడిమేలణి శెమ్బొన్తుழாయ్మెన్ఱే
కూవుమాల్*కోళ్విన యాట్టియేన్కోదైయే.　　3.

అ॥ కోళ్ - బలమైన, విన యాట్టియేన్ - పాపముగలనాయొక్క, కోమార్తయైన, కోదై - మాలికగలయీపె, పా - ఛన్దస్సులతో, ఇయల్ - చెప్పబడుచున్న, (ఛన్దస్సుగల), వేదమ్ - వేదములయందున్న, నల్ - విలక్షణమైన, పల - అనేకవిధంబులైన, మాలై - పురుషసూక్తాదులను, కొణ్డు - అనుసంధించుకొని, తేవర్గళ్ - దేవతలును, మా - పెద్దలైన, మునివర్ - ఋషులును, ఇఱైఞ్జనిన్ఱ - స్తోత్రముచేయునట్లువేంచేసియున్న సర్వేశ్వరునియొక్క, శే - ఎఱ్ఱనైన, అడిమేల్ - శ్రీపాదములమీద, అణి - సమర్పింపబడిన, శెమ్ - సుందరమై, పొన్ - స్పృహణీయమైన, తుழாయ్మెన్ఱే - తిరుత్తుழாయనియే, కూవుమ్ - పిలుచును.

తా॥ ఓస్వామీ ! వేదములయందు సారతమంబులైయున్న పురుషసూక్తాదుల ననుసంధించుచు బ్రహ్మాదులును సనకాదులును స్తుతించుచున్న నీశ్రీపాదములయందున్న తిరుత్తుழாయినే యీపె గొల్లప్పుడును చెప్పుచున్నదని,　　3.

కోదిలవణ్పుగழ் కొణ్డుశమయిగళ్*
పేదఙ్గళ్ శొల్లి ప్పిదఱ్ఱుమ్బిరాన్పరన్*
పాదఙ్గళ్ మేలణి పైమ్బొన్తుழாయ్మెన్ఱే
ఓదుమాల్*ఊழ்వినై యేన్తడన్దోళియే.　　౪.

అ॥ ఊழ் - అనుభవింపదగిన, వినైయేన్ - పాపముగలనాయొక్క, తడమ్ - విశాలమైన, తోళి - భుజములుగలయీపె, కోదిల - దోషములేనిదియు, వణ్ - మంగళకరంబులునైన, పుగழ் - గుణములను, కొణ్డు - అనుసంధించి, శమయిగళ్ - దయాగుణముల నుపాసింపువారు, పేదఙ్గళ్ శొల్లి - ఆయాగుణములకువైలక్షణ్యమును (ఉత్కర్షమును) చెప్పి, పిదఱ్ఱుమ్ - స్తోత్రముచేయబడిన, పిరాన్ - ఉపకారకుడైన, పరన్ - సర్వేశ్వరునియొక్క, పాదఙ్గళ్ మేల్ - శ్రీపాదములమీద, అణి - సమర్పింపబడిన, పై - వికసించియున్న, పొన్ - స్పృహణీయమైన, తు　యెన్ఱే - తిరుత్తుழாయనియే, ఓదుమ్ - చెప్పును.

తా॥ నిర్దుష్టంబులైన నీకల్యాణగుణంబులయం దొకొక గుణము నుపాసించుచు ఆగుణముతే యితరగుణములకంటె శ్రేష్ఠమని చెప్పుచున్న భక్తులచే స్తుతింపబడిన నీశ్రీపాదతులసినే యీపె యూళపడియుండునని.　　౪.

తోళిశేర్పిన్నై పొరుట్టెరుదేழ்తழீஇ
కోழியార్*కోవలనార్ కుడక్కూత్తనార్*

తాళిణై మేలణి తణ్ణన్దుழாయే
నాళునాళ్ నైగిన్ఱదా లెన్ఱన్ మాదరే. ౫.

ఎన్ఱదన్ - నాయొక్క, మాదర్ - పుత్రికయైనయీపె, తోళ్ - శ్లాఘ్యమైన భుజములు గలదై, శేర్ - తనకుసదృశురాలైన, పిన్నై పోరుట్టు - నప్పిన్నప్పిరాట్టికొఱకై, ఎరుదుఏழ் - వృషభములేడింటిని, తழீఇ - కౌగలించుకొనిన, కోళియార్ - బలముగలవాడును, కోవలనార్ - గోపాలుడును, కుడక్కూత్తనార్ - కుంభనృత్యముజేయువాడునైన శ్రియఃపతియొక్క, తాళిణై మేలణి - శ్రీపాదములమీద సమర్పింపబడిన, తణ్ - చల్లనై, అమ్ - సుందరమైన, తుழாయే - తిరుత్తుழாయనియే, నాళునాళ్ - ప్రతిదినమును, నైగిన్ఱదు - శిథిలాన్తఃకరణురాలగుచున్నది.

తా॥ ఓస్వామీ! భుజసౌన్దర్యమందు నీకం టెమించినదియు, తక్కినగుణములలో నీకుసదృశురాలునైన నప్పిన్నప్పిరాట్టికొఱకై పందెయముగా నేర్పఱచినవృషభము లేడింటిని సంహరించిన బలిష్ఠుడవైన నీశ్రీపాదతులసినియాశపడి దానినిలభించక గ్రమముచే గరిగిపోవుచున్నదని, ౫.

మాదర్ మామణ్మడన్దై పొరుట్టేనవాయ్
ఆదియఙ్గాల త్తగలిడఙ్కీణ్డవర్
పాదఙ్గళ్ మేలణి పైమ్బొన్ తుழாయెన్ఱే
ఓదుమాల్ ఎయ్దిన ళెన్ఱన్మడన్దైయే. ౬.

అ॥ ఎన్ఱన్ - నాయొక్క, మడన్దై - కొమార్తె, మాదర్ - స్నేహవముగల, మా - విలక్షణురాలైన, మణ్ మడన్దై పొరుట్టు - భూమిప్పిరాట్టికొఱకై, ఏనమాయ్ - వరాహమై, ఆది - కల్పాదియందలి, అమ్ - సున్దరమైన, కాలత్తు - కాలమందు, అగల్ - విశాలమైన, ఇడమ్ - భూమిని, కీణ్డవర్ - విడతీసినవారియొక్క, పాదఙ్గళ్ మేలణి - శ్రీపాదములమీద సమర్పింపబడిన, పైమ్బొన్ తుழாయెన్ఱే - వికసించి యందమైయున్న తిరుత్తుழாయనియే, ఓదుమ్-చెప్పుచుండగిన, మాల్ - భ్రమమును, ఎయ్దినళ్ - పొందినది

తా॥ నీభక్తురాలైన భూమిప్పిరాట్టికొఱకై మునుపొకకాలమందు వరాహావతారంబెత్తి పాతాళములోనున్న భూమినితీసికొనివచ్చిన నీశ్రీపాదతులసియందే యీపె మగ్నురాలైనదని. ౬.

మడన్దైయై వణ్కమల త్తిరుమాదినై
తడఙ్గొళ్ తార్ మార్బినిల్ వైత్తవర్ తాళిన్మేల్
వడఙ్గొళ్ పూన్దణ్ణన్దుழாయ్ మలర్క్కే యివళ్
మడఙ్గుమాల్ వాణుద లీర్ ఎన్మడక్కొమ్బే. ౭.

అ॥ వాళ్ - కాన్తిగల, నుదలీర్ - ముఖముగలఓస్త్రీలారా! మడన్దైయై - యౌవనవంతురాలును, వణ్ - సుందరమైన, కమలమ్ - పద్మమువాసస్థానముగాగలదియు, తిరు - శ్రీయనితిరునామముగలదియునైన, మాదినై - స్త్రీని, తడఙ్గొళ్ - విశాలమైనదియు, తార్ - మాలగలదియునైన, మార్బినిల్ - వక్షస్థలమందు, వైత్తవర్ - ఉంచుకొనినవారియొక్క, తాళిన్ మేల్ - శ్రీపాదములమీదనున్న, వడఙ్గొళ్ - మాలగాగుచ్ఛపడినదై, పూ - భోగ్యమై,

తణ్ - చల్లనై, అమ్ - సుందరమైన, తుழாయ్మలర్ క్కు - తిరుత్తుழాయిపుష్పమునకే, ఎన్ - నాయొక్క, మడమ్ - భవ్యమైన, కొమ్బు - పెబ్బలిచెట్టువలెనున్న, ఇవళ్ - ఈమె, మడఙ్గుమ్ - చుట్టుకొనిపడియుండును.

తా॥ ఓసున్దరముఖులారా! కమలవాసినియైన శ్రీమహాలక్ష్మిని వక్షస్థలమందుగల సర్వేశ్వరునియొక్క శ్రీపాదములయందున్న తులసీమాలికనాశపడి మతిలేకపడియున్నదని. ౬.

కొమ్బుపోల్ శీదై పొరుట్టిలఙ్గైనగర్*
అమ్బెరియుయ్ త్తవర్ తాళిణై మేలణి*
నమ్బువిర్ తణ్ణన్తుழாయ్మలర్ క్కే యివళ్
నమ్బుమాల్*నానిద ఱ్కెన్ శెయ్ గేన్ నఙ్గైమీర్. ౭.

అ॥ కొమ్బుపోల్ - పెబ్బలిచెట్టువలెనున్న (నమ్రతగల), శీదైపొరుట్టు - సీతాదేవికొఱకై, ఇలఙ్గైనగర్ - లంకాపురియందు, అమ్బెరి - బాణాగ్నిని, ఉయ్ త్తవర్ - ప్రవేశింపఁజేసినవారియొక్క, తాళిణైమేల్ - శ్రీపాదములమీఁద, అణి - సమర్పింపబడిన, నమ్బువిర్ - పరిమళమువిసుచున్న, తణ్ - చల్లనైన, అమ్తుழாయ్మలర్కు - సున్దరమైనతులసీపుష్పమును, ఇవళ్ - ఈమె, నమ్బుమ్ - ఆశపడును, నఙ్గైమీర్ - ఓస్త్రీలారా! ఇదఱ్కు - దీనికి, నాన్ - నేను, ఎన్ శెయ్ గేన్ - ఏమిచేసెదను,

తా॥ ఓస్త్రీలారా! సీతాపిరాట్టినిమిత్తమై లంకను తనబాణాగ్నిచే దహించినవారియొక్క దుర్లభమైన శ్రీపాదతులసీమాలికనాశపడిన యీమెకు నేనేమిచేసెదనని. ౭.

నఙ్గైమీర్ నీరుమోర్ పెణ్బెత్తు నల్ గినీర్*
ఎఙ్ఙనేశొల్లుగేన్ యాన్బెత్త ఏழైయై*
శఙ్గెన్నుమ్ శక్కరమెన్నుమ్ తుழாయెన్నుమ్*
ఇఙ్ఙనేశొల్లుమిరాప్పగలెన్ శెయ్ గేన్. ౮.

అ॥ నఙ్గైమీర్ - ఓస్త్రీలారా! నీరుమ్ - మీరును, ఓర్ పెణ్ - ఒకకొమార్తెను, పెత్తు - కని, నల్ గినీర్ - పెంచితిరిగదా? యాన్ - నేను, పెత్త - కనిన, ఏழైయై - చపలురాలైన యీమెను, ఎఙ్ఙన్ శొల్లుగేన్ - ఎట్లుచెప్పెదను, శఙ్గెన్నుమ్ - శ్రీపాఞ్చజన్యమనిచెప్పును, శక్కరమెన్నుమ్ - సుదర్శనమనిచెప్పును, తుழாయెన్నుమ్ - తిరుత్తుழాయియనిచెప్పును, ఇరాప్పగల్ - రేయింబగళ్ళు, ఇఙ్ఙనేశొల్లుమ్ - ఇట్లనేచెప్పును, ఎన్ శెయ్ గేన్ - ఏమిచేసెదను.

తా॥ ఓస్త్రీలారా! మీరుకూడ పిల్లలను కని పెంచితిరికదా? నాపిల్లమాటను వినుండు. ఈపెంపతిదుర్లభుఁడైన సర్వేశ్వరునియొక్క శఙ్ఖచక్రాదులనాశపడి రేయింబగళ్ళు వానితిరునామములనే చెప్పును, దీనికి నేమిసేసెదనని. ౮.

ఎన్ శెయ్ గేనెన్నుడైప్పేదై యెన్ కోమళమ్*
ఎన్ శొల్లుమ్ మెన్ వశముమల్లళ్ నఙ్గైమీర్*

మిన్ శెయ్పూణ్ మార్బినన్ కణ్ణన్కழల్ తుழாయ్*
పొన్ శెయ్పూణ్ మెన్ములైక్కెన్ఱు మెలియుమే. ౧౦.

అ॥ నల్లీర్ - ఓస్త్రీలారా! ఎన్మడై - నాయొక్క, పేదై - జ్ఞానములేనిబిడ్డయై, ఎన్ కోమళమ్ - మృదుస్వభావముగలదైనయీకొమార్తె, ఎన్ శొల్లుమ్ - ఏమిచెప్పియు, ఎన్వశముమ్ - నాయధీనము గాగూడ, అల్లళ్ - ఉన్నదికాదు, ఎన్ శెయ్ గేన్ - ఏమిచేసెదను, మిన్ శెయ్ - ప్రకాశించుచున్న, పూణ్ - ఆభరణముగల, మార్బినన్ - వక్షస్థలముగల, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, కழల్ - శ్రీపాదమందున్న, తుழாయ్ - తులసీమాలికను, పొన్ - బంగారుముచే, శెయ్ - చేయబడిన, పూణ్ - ఆభరణముగల, మెల్ - మృదువైన, ములైక్కు - స్తనమున కాభరణముగానుంచుకోవలెను, ఎన్ఱు - అనియాశపడి, మెలియుమ్ - వాడిపోవును.

తా॥ ఓస్త్రీలారా! ఈనాకొమార్తె నేనెంత చెప్పినను నామాటనువినక, ప్రకాశించుచున్న తిరువాభరణలచే నలంకరింపబడిన శ్రియఃపతియొక్క శ్రీపాదమందున్న తిరుత్తుழாయిని తన స్తనముమీదనుంచుకోవలయునని గోరుచున్నది. దీనికి నేనేమిచేయవచ్చునని. ౧౦

* మెలియునోయ్ తీర్క్కుమ్ నఙ్కణ్ణన్ కழల్ గళ్ మేల్*
మలిపుగழ్వణ్ కురుగూర్ చ్చడగోపన్ శొల్*
ఒలిపుగழாయిర త్తిప్పత్తుమ్వల్లవర్*
మలిపుగழ్వానవర్ క్కావర్ నఱ్కోవైయే. ౧౧.

తా॥ మెలియుమ్ - వాడిపోవుటకు హేతువైన, నోయ్ - విరహబాధను, తీర్క్కుమ్ - తీర్చెడి, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క - కழల్ గళ్ మేల్ - శ్రీపాదములవిషయమై, మలి - వర్ధిలుచున్న, పుగழ் - కీర్తిగల, వణ్ - సుందరమైన, కురుగూర్ - తిరునగరికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, శొల్ - సాయించిన - పుగழ் - కల్యాణగుణములను, ఒలి - స్పష్టముగప్రతిపాదించుచున్న, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తు - ఈపదిపాశురములను, వల్లవర్ - అభ్యసించతగినవారు, మలి - వృద్ధిబొందుచున్న, పుగழ் - కీర్తిగల, వానవర్క్కు - నిత్యసూరులకు, నల్ కోవై - మంచిసంబంధముగలవారై, ఆవర్ - అగుదురు,

తా॥ తనవిరహముచేగలిగెడి దుఃఖమును బోగొట్టెడిస్వభావముగల శ్రీకృష్ణునియొక్క శ్రీపాదవిషయమై భగవదనుభవముచేవచ్చిన కీర్తిగల నమ్మాழ்వార్లుసాయించిన భగవంతునియొక్క కల్యాణగుణప్రతిపాదకములైన యీ పదిపాశురముల ననుసంధించువారు నిత్యసూరులతోఁజేరియుందురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## 3 - వ తిరువాయ్మొழி.

---

అవతారిక:—ఈవిధంబున నాళ్వార్లనుభవించిన యార్తితీరునటుల సర్వేశ్వరుఁడువచ్చి సంశ్లేషించగా నప్పుడతనియొక్క ప్రణయిత్వగుణము నీతిరువాయ్మొழிలోననుభవించుచున్నారు.

‡‡ కోవై వాయాళ్ పొరుట్టేఱ్ఱిన్ ఎరుత్తమిఱుత్తాయ్* మదిళిలఙ్గై

క్కోవై వీయచ్చిలై కునిత్తాయ్ కులనల్ యానై మరుప్పొశిత్తాయ్*

పూవై వీయానీర్ తూవి ప్పోదాల్ వణఙ్గేనేలుమ్* నిన్

పూవై వీయామేనిక్కు ప్పూశుమ్ శాన్దెన్నెఞ్జమే. ౧.

అ॥ కోవై - దొండపండువలెనున్న, వాయాళ్ పొరుట్టు - అధరముగల నప్పిన్నపిరాట్టి కొఱకై, ఏఱ్ఱిన్ - వృషభములయొక్క, ఎరుత్తమ్ - మూపురములను, ఇఱుత్తాయ్ - విఱిచిన వాఁడును, మదిళ్ - కోటగల, ఇలఙ్గై - లంకకు, కోవై - స్వామియైన రావణుఁడు, వీయ - నశించునటుల, శిలై - బాణమును, కునిత్తాయ్ - ఎక్కుంపఁబెట్టినవాఁడును, కులమ్ - మంచిజాతి యందుఁబుట్టిన, నల్ - విలక్షణమైన, యానై - కువలయాపీడముయొక్క, మరుప్పు - దన్తములను, ఒశిత్తాయ్ - విఱిచినవాఁడునైన ఓశ్రియఃపతీ! పూవై వీయా - పుష్పమునువిడునని, నీర్ - జలమును, తూవి - సమర్పించి, పోదు - సమయములయందు, వణఙ్గేనేలుమ్ - నమస్కరించనివాఁడనైనను, పూవైవీ - రెల్లుపువ్వుతో, ఆమ్ - సమానమైయున్న, నిన్ - నీయొక్క, మేనిక్కు - దివ్యవిగ్రహమునకు, ఎన్నెఞ్జమ్ - నామనస్సు, పూశుమ్ - పూయదగిన, శాన్దు - చన్దనమైయున్నది.

తా॥ నప్పిన్నపిరాట్టికొఱకై ఏడువృషభములను జంపినవాఁడును, కువలయాపీడమునుసంహరించినవాఁడును, రావణాసురసంహారకుఁడునైనఓశ్రియఃపతీ! ఇదివఱకు నిన్ను నేను పుష్పాదులతో నర్చించకపోయినను నాహృదయమునే నీవుభోగ్యముగాస్వీకరించితివని. ౧.

పూశుమ్ శాన్దెన్నెఞ్జమే పునైయుఙ్కణ్ణియెనదుడైయ*

వాశగమ్ శెయ్మాలైయే వాన్పట్టాడైయుమ్ అఃదే*

తేశమాన వణికలను మెన్ కైకూప్పుచ్చెయ్గైయే*

ఈశన్ ఞాలముణ్డుమిழ்న్ద వెన్దై యేగమూర్త్తిక్కే. ౨.

అ॥ ఈశన్ - స్వామియు, ఞాలమ్ - భూమిని, ఉణ్డు - ఆరగించి, ఉమిழ்న్ద - బయిలుపఱచిన, ఎన్దై - నాకుపకారకుఁడును, ఏగమూర్త్తిక్కు - అద్వితీయవిగ్రహుఁడునైన శ్రియఃపతికి, ఎన్నెఞ్జమే - నామనసే, పూశుమ్ శాన్దు - పూయతగినచన్దనముగాను, ఎనదుడైయ - నాయొక్క, వాశగమ్ - వాక్కుచే, శెయ్ - చేయబడిన, మాలైయే - శ్రీసూక్తులే, పునైయుమ్ - కట్టబడిన, కణ్ణి - మాలగాను, అఃదే - ఆశ్రీసూక్తియే, వాన్ - ఉజ్జ్వలమైన, పట్టాడైయుమ్ - పీతాంబరముగాను, ఎన్ - నాయొక్క, కై - చేతులను, కూప్పి - మొగిడ్చి, శెయ్గైయే - అంజలిచేయుటయే, తేశమాన, తేజస్సుగలదై, అణి - అలఙ్కరింపఁదగిన, కలనుమ్ - ఆభరణముగానున్నది,

తా॥ సకల జగత్సృష్టిసంహారకుఁడైన శ్రియఃపతి, నామవస్తువుచన్దనముగాను నాస్తోత్రమును పీతాంబరముగాను మాలికగాను నాయందలిబంధము నాభరణములుగాను స్వీకరించుచున్నాఁడని. ౨.

ఏగమూర్ త్తియిరుమూ త్తి మూన్ఱుమూర్ త్తిపలమూర్ త్తి
యాగి*ఐన్దుపూదమాయిరణ్డుశుడరా యరువాగి*
నాగమేఱినడుక్కడలుళ్ తుయిన్ఱ నారాయణనే*ఉన
ఆగముఱ్ఱుమగత్తడక్కి యావియల్లల్ మాయ్ త్తదే. ౩.

అ॥ ఏగమూర్ త్తి-కారణభూతమైనయొకశరీరముగలవాఁడును, ఇరుమూర్ త్తి-మూలప్రకృతిమహత్తత్త్వములురెండింటిని శరీరముగాగలవాఁడును, మూన్ఱుమూర్ త్తి-సాత్త్విక రాజసతామసముల నెడిమూడువిధములైన యహఙ్కారములను శరీరముగాగలవాఁడును పలమూర్ త్తియాకి - అనేకములైనయిన్ద్రియములను శరీరముగాగలవాఁడును, ఐన్దుపూదమాయ్ - పృథివ్యాది పఞ్చభూతములను శరీరముగాగలవాఁడును, ఇరుశుడరాయ్ - చన్ద్రసూర్యులనెడి రెండు తేజస్సులను శరీరముగాగలవాఁడును, అరువాగి - ఈవస్తువులకన్తర్యామియు, నాగమ్ - ఆదిశేషునిమీఁద, ఏఱి - ఎక్కి, నడుక్కడలుళ్ - సముద్రమధ్యమందు, తుయిన్ఱ - నిదురపోవుచున్నవాఁడునైన, నారాయణనే-శ్రీమన్నారాయణుఁడా! ఉన్-నీయొక్క, ఆగమ్-శరీరమునకుఁగావలసిన, ముఱ్ఱుమ్-సమస్తభోగ్యవస్తువులను, అగత్తు - నాశరీరములోపల, అడక్కి - అణిచి, (ఉండగా), ఆవి నాప్రాణము, అల్లల్ - దుఃఖమును, మాయ్ త్తదు - విడిచినది

తా॥ ప్రకృతి మహదహఙ్కార ఏకాదశేన్ద్రియ పృథివ్యాదిభూతపఞ్చకాదిసమస్తములకును నిర్వాహకుఁడై, క్షీరాబ్ధియందు పవ్వళించిన ఓశ్రియఃపతీ! నామనోవాక్కాయములనే నీవు భోగ్యముగాఁజేసికొని నన్ను కృతార్థునిగా జేసితివని. ౩.

మాయ్ త్తలెణ్ణివాయ్ ములై తన్ద మాయప్పేయుయిర్
మాయ్ త్త*ఆయమాయనే వామననేమాదవా*
పూత్తణ్మాలైకొణ్డున్నైప్పోదాల్ వణఙ్గేనేలుమ్*నిన
పూత్తణ్మాలై నెడుముడిక్కు ప్పునైయుమ్కణ్ణియెనదుయిరే. ౪.

అ॥ మాయ్ త్తల్ - చంపవలయునని, ఎణ్ణి - తలంచి, వాయ్ - నోటిలో, ములై - స్తనమును, తన్ద - ఇచ్చిన, మాయమ్ - కపటముగల, పేయ్ - పూతనయొక్క, ఉయిర్, ప్రాణమును, మాయ్ త్త - నశింపఁజేసిన, ఆయన్-కృష్ణుఁడైయవతరించిన, మాయనే - ఆశ్చర్యభూతుఁడా, వామననే - వామనుఁడా, మాదవా - శ్రియఃపతీ, పూ - సున్దరమైన, తణ్ - చల్లనైన, మాలై కొణ్డు - మాలికనుసంపాదించి, ఉన్నై - నిన్ను, పోదు - సమయమందు, వణఙ్గేనేలుమ్ - నమస్కరించనివాఁడనైనను, పూ - పుష్పములచేఁగట్టఁబడిన, తణ్ - చల్లనైన, మాలై - మాలగల, నెడు - దీర్ఘమైన, ముడిక్కు - కిరీటమునకు, ఎనదుయిర్ - నాప్రాణము, పునైయుమ్ - సమర్పించుటకుతగిన, కణ్ణి - మాలగానుండును.

తా॥ విషముతోకూడిన స్తన్యమునిచ్చి తననుజంపఁదలఁచి వచ్చిన పూతనను సంహరించిన ఓ శ్రియఃపతీ! నేనిదివఱలో నీకుచితకైంకర్యమును జేయకపోయినను నాప్రాణమును నీవు మాలగా ధరించితివని. ౪.

కణ్ణియెనదుయిర్ కాదల్ కనగచ్చోదిముడిముదలా*
ఎణ్ణిల్ పల్ కలన్గళుమ్ మేలుమాడై యుమఙ్గదే*
నణ్ణిమూవులగుమ్ నవిన్ఱేత్తుమ్ కీర్త్తియుమఙ్గదే*
కణ్ణనెమ్బిరానెమ్మాన్ కాలశక్కరత్తానుక్కే. ౫.

అ॥ కణ్ణన్ - కృష్ణుఁడైయవతరించినవాఁడును, ఎమ్బిరాన్ - ఉపకారకుఁడును, ఎమ్మాన్ - మాస్వామియు, కాలమ్ - *కాలమునుసృజించెడి, శక్కరత్తానుక్కు - సుదర్శనమునుధరించినవాఁడునైన శ్రియఃపతికి, ఎనదుయిర్ - నాయాత్మ, కణ్ణి - మాలగాను, కాదల్ - ప్రీతి, కనగమ్ - సువర్ణమయమై, శోది - తేజోమయమైన, ముడిముదలా - కిరీటముమొదలుగాగల, ఎణ్ణిల్ - సంఖ్యలేని, పల్ - అనేకవిధంబులైన, కలన్గళుమ్ - ఆభరణములుగాను, అఙ్గదే - అప్రీతియే, మూవులగుమ్ - మూఁడులోకములున్ను, నణ్ణి - పొంది, నవిన్ఱేత్తుమ్ - స్తోత్రముజేయుచున్న, కీర్త్తియుమ్ - కీర్తిగానున్నవి.

తా॥ చక్రధరుఁడైన శ్రీకృష్ణుఁడు, నాయాత్మనుమాలగాను, నాప్రేమను భూషణాంబరరూపములుగానున్నఁగీకరించెనని. ౫.

కాలశక్కరత్తొడు వెణ్‌శఙ్గమ్‌కైయేన్దినాయ్*
ఞాలముఱ్ఱుముణ్డుమిழ்న్ద నారాయణనేయెన్ఱెన్ఱు*
ఓలమిట్టునానழைత్తాల్ ఒన్ఱుమ్‌వారాయాగిలుమ్*
కోలమామెన్ శెన్నిక్కున్ కమలమన్నకురైకழలే. ౬.

అ॥ కాలమ్ - శత్రువులకు మృత్యువుగానున్న, శక్కరత్తొడు - సుదర్శనముతోఁగూడ, వెణ్ - స్వచ్ఛమైన, శఙ్గమ్ - శ్రీపాఞ్చజన్యమును, కైయేన్దినాయ్ - శ్రీహస్తమునందుధరించినవాఁడవును, ఞాలమ్ - భూమిని, ముఱ్ఱుమ్ - సంపూర్ణముగా, ఉణ్డు - మ్రింగి, ఉమిழ்న్దు - బయిలుపఱచినవాఁడవునైన, నారాయణనే - శ్రీమన్నారాయణుఁడా! ఎన్ఱెన్ఱు - అనిచెప్పి, ఓలమిట్టు - ధ్వనిజేసి, నాన్ - నేను, అழைత్తాల్ - పిలిచితినేని, ఒన్ఱుమ్ - ఒకనిమిషమును, వారాయాగిలుమ్ - రాకపోతివైనను, ఉన్ - నీయొక్క, కురై - ఆభరణధ్వనిగల, కమలమన్న - పద్మమువంటి, కழల్ - శ్రీపాదము, ఎన్ శెన్నిక్కు - నాశిరస్సుకు, కోలమామ్ - అలఙ్కారమైయుండును.

తా॥ శఙ్ఖచక్రాదిదివ్యాయుధధరుఁడా! లోకములను సృష్టిసంహారకుఁడా! యనినేను పలుమాఱుపిలిచినప్పుడు నీవు రాకపోయినను ఇప్పుడు నీ శ్రీపాదపద్మములను నాశిరస్సుమీఁదనుంచి నన్ను ధన్యునిగా జేసితివని. ౬.

---

*భారతయుద్ధమందు సైన్ధవవధమప్పుడు మధ్యాహ్నమునందు శ్రీకృష్ణుఁడు చక్రమును ప్రయోగించి సూర్యుని కప్పుగా నప్పుడాదినము రాత్రివలె నంధకారమయమైనదిగాన చక్రముకాలమును సృజించినదని.

కుఱై కழల్గళ్ నీట్టి మణ్కొణ్డకోలవామనా*
కుఱై కழల్కై కూప్పువార్గళ్ కూడనిన్ఱ మాయనే*
విఱై కొళ్ పూవుమ్‌నీరుమ్‌కొణ్డే త్తమాట్టేనేలుమ్*ఉఱై
ఉఱై కొళ్ శోది త్తిరువురువ మెన్నదావిమేలదే. ౭.

అ॥ కుఱై - శబ్దించుచున్న, కழల్గళ్ - శ్రీపాదములను, నీట్టి - పొడువుగాజేసి మణ్ - భూమిని, కొణ్డ - కొలుచుకొనిన, కోలమ్ - సుందరుడవైన, వామనా - ఓవామనుడా! కుఱై కழల్ - భూషణములతో శబ్దించుచున్న నీశ్రీపాదముల నుద్దేశించి, కైకూప్పువార్గళ్ - నమస్కరించువారు, కూడ - నీతోఁజేరునట్లు, నిన్ఱ - ఉన్న, మాయనే - ఆశ్చర్యభూతుఁడా! విఱైకొళ్ - పరిమళముగల, పూవుమ్ - పుష్పమునున్ను, నీరుమ్ - జలమునున్ను, కొణ్డు - సంపాదించుకొనివచ్చి, ఏత్తమాట్టేనేలుమ్ - స్తుతించనివాఁడనైనను, ఉఱైకొళ్ - శబ్దమునుగ్రహించుచున్న(వాచామగోచరమైన), శోది - తేజస్సుగల, తిరువురువమ్ - దివ్యవిగ్రహము, ఎన్నదావిమేలదే - నాయాత్మమీదనున్నది.

తా॥నీవు వామనావతారంబెత్తి లోకములను గొలిచినప్పుడు నీశ్రీపాదములు నాశ్రయించిన వారిని నీతోఁజేర్చుకొనిన ఓశ్రియఃపతీ! పుష్పాదులతో నిన్ను నేనర్చించఁబోయినను నీయతి సుందరంబైన దివ్యవిగ్రహము నాయాత్మను నవలంబించియున్నదని. ౭.

ఎన్నదావిమేలైయాయ్ ఏర్కొళేழ్ ఉలగముమ్*
తున్ని ముழுదుమాగినిన్ఱ శోదిఞానమూర్ త్తియాయ్*
ఉన్నదెన్నదావియుమ్ ఎన్నదున్నదావియుమ్*
ఇన్నవణ్ణమేనిన్ఱాయ్ ఎన్ఱురైక్కవల్లేనే ౮.

అ॥ ఎన్నదు - నాయొక్క, ఆవి - ఆత్మయొక్క, మేలైయాయ్ - మీఁదనివసించువాఁడవును, ఏర్కొళ్ - ఔజ్జ్వల్యముగల, ఏழ్ఉలగముమ్ - సప్తలోకములనున్ను, తున్ని - వ్యాపించి, ముழுదుమాగినిన్ఱ - సమస్తములకంతరాత్మవైయున్న వాఁడవును, శోది - స్వయంప్రకాశమైన, ఞానమ్ - జ్ఞానమును, మూర్త్తియాయ్ - స్వరూపముగాగలవాఁడవునైన ఓశ్రియఃపతీ, ఎన్నదావి - నాప్రాణము, ఉన్నదుమ్ - నీయధీనముగాను, ఉన్నదావి - నీప్రాణము, ఎన్నదు - నాయధీనముగాను, ఇన్నవణ్ణమేనిన్ఱాయ్ - ఈప్రకారముగానున్నావు, ఎన్ఱు - అని, ఉరైక్కవల్లేనే - చెప్ప శక్తుఁడనా? (కాను).

తా॥సమస్తలోకములయందును వ్యాపించియున్న స్వయంప్రకాశస్వరూపుఁడవైన ఓశ్రియఃపతీ! నన్నువదలి నీవుజీవించలేవు, నిన్నువదలి నేనుజీవించలేను ఇట్టినీస్వభావమును నే నెంతమాత్రమును జెప్పుటకు సమర్థుఁడనుగానని. ౮.

ఉరైక్కవల్లేనల్లేన్ ఉన్నులప్పిల్ కీర్త్తివెళ్ళత్తిన్*
కరైక్కణెన్ఱు శెల్వన్నాన్ కాదల్మైయలేఱినేన్*

పురై ప్పిలాదపరమ్బరనే పొయ్యిలాదపరఞ్జుడరే*
ఇరైత్తునల్లమేన్మక్కళేత్త యానుమేత్తినేన్. ౯.

అ॥ ఉరైక్కవల్లేనల్లేన్ - నీగుణమును జెప్పుటకుసమర్థుఁడనుగాను; ఉన్-నీయొక్క, ఉల ప్పిల్-అంతములేని, కీర్ త్తివెళ్ళత్తిన్-కీర్తియనెడి సముద్రముయొక్క, కరైక్కణ్-గట్టును, నాన్-నేను, ఎన్గుశెల్వేన్ - ఎప్పుడు చేరెదను; కాదల్-ఆశయనెడి, మైయలేఱినేన్-భ్రమనుబొందితిని, పురైప్పు - దోషము, ఇలాద - లేని, పరమ్బరనే - పరాత్పరుఁడా! పొయ్యిలాద - అసత్యము లేని, పరఞ్జుడరే - పరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! నల్ల - విలక్షణులైన, మేల్మక్కళ్ - నిత్య సూరులు, ఇరైత్తు - ధ్వనిజేసి, ఏత్త-స్తుతించునటుల, యానుమ్-నేనును, ఏత్తినేన్-స్తుతించితిని.

తా॥ ఓస్వామీ! నీగుణము కొంతమాత్రముగూడ నేను వర్ణింపఁజాలను. ఇట్లుండగా నీగుణములను నేనెట్లు సంపూర్ణముగా జెప్పెదను. అయినను నీయందలిప్రీతిచే నేనుభ్రమించిపోయి నిత్యసూరులు స్తుతించునటుల నిన్నుస్తుతించుచున్నానని. ౯.

యానుమేత్తి యేழுలగుమ్ముత్ ఱుమేత్తి*పిన్నైయుమ్,
తానుమేత్తిలుమ్ తన్నైయేత్తవేత్తవెజ్ఞెయ్దుమ్*
తేనుమ్పాలుమ్కన్నలుమ్ అముదుమాగిత్తిత్తిప్ప*
యానుమెమ్బిరానైయేయేత్తినేన్ యానుయ్వానే. ౧౦.

అ॥ యానుమ్ - నేనును, ఏత్తి - స్తుతించి, ఏழுలగుమ్ముత్ ఱుమ్-సప్తలోకములన్నియు, ఏత్తి - స్తుతించి, పిన్నైయుమ్ - మఱియు, తానుమ్ - సర్వజ్ఞుఁడైన తానును, ఏత్తియుమ్ - స్తుతించియు, తన్నై - తనను, ఏత్త ఏత్త - స్తుతింప స్తుతింప, ఎఙ్గుమ్ - ఎప్పుడు, ఎయ్దుమ్ - ముగినును. తేనుమ్ - తేనెవలెను, పాలుమ్ - పాలువలెను, కన్నలుమ్ - శర్కరవలెను, అముదుమాగి - అమృతమువలెను భోగ్యభూతుఁడై, తిత్తిప్ప - మధురమైయుండగా, యానుమ్ - నేనును, ఉయ్వాన్ - ఉజ్జీవించుటకై, ఎమ్బిరానైయే-మాస్వామినే, యాన్-నేను, ఏత్తినేన్-స్తుతించితిని.

తా॥ ఓశ్రియఃపతీ! నేనును సమస్తలోకములును సర్వజ్ఞుఁడవైన నీవును ఎల్లరుచేరి నీగుణమును స్తుతించినను దానికంతముగనుపడదు. ఇట్లున్నను నీయొక్క నిరతిశయభోగ్యతనుజూచియుండలేక నాయుజ్జీవనార్థమై నేను నిన్నుస్తుతించితినని. ౧౦.

✻✻ ఉయ్వుపాయమ్మత్ ఱిన్మైతేఱి కణ్ణనొణ్కழల్గళ్మేల్*
శెయ్యతామరై ప్పழన త్తెన్నన్గురుగూర్ చ్చడగోపన్*
పొయ్యిల్పాడలాయిరత్తుళివైయుమ్పత్తుమ్వల్లార్గళ్*
వైయమ్మన్నివీఱ్ఱిరున్దు విణ్ణుమాళ్వర్ మణ్ణూడే. ౧౧.

అ॥ ఉయ్యుపాయమ్ - ఉజ్జీవనోపాయము, మత్ ఱు - వేఱొకటి, ఇన్మై - లేనిదానిని, తేఱి-నిశ్చయించి, కణ్ణన్-శ్రీకృష్ణునియొక్క, ఒణ్కழల్గళ్మేల్-సుందరంబులైన శ్రీపాదముల

విషయమై, శెయ్య-సుందరమైన, తామరై-పద్మములుగల, పழనమ్-జలప్రదేశములచేచుట్టఁబడిన, తెన్-దక్షిణమందున్న, నల్-స్పృహణీయమైన, కురుగూర్-కురుకాపురికిసాధులైన, శడగోపన్-నమ్మాழ్వార్లుప్రసాదించిన, పొయ్యిల్ - అసత్యములేనివియు, పాడల్-గానరూపముగానున్న, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవైయుమ్‌పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్‌గళ్ - అభ్యసించువారు, వైయమ్ - భూమియందలి, మన్ని - అమరియుండి, పీడ్ పెరియన్ - తనమహిమ ప్రకాశించునట్లుండి, మణ్ణాడే - భూలోకముతోగూడ, విణ్ణుమ్ - పరమపదమును, ఆళ్వర్ - పరిపాలించుదురు.

తా॥ శ్రీకృష్ణునియొక్క శ్రీపాదములుతప్ప మఱియొకవుపాయములేదని నిశ్చయించిన నమ్మాழ్వార్లు యథార్థముగాసాదించిన యీపదిపాశురముః ననుసంధించువారు ఉభయవిభూతిని బరిపాలించుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౭-వ తిరువాయ్‌మొழி.

అవతారిక—సర్వేశ్వరుఁడింతకాల మాழ్వార్లతోఁగూడ నుండి రసములననుభవించి కొంచెమవతల వేంచేయగానంతమాత్రముగూడ నతనివిరహమును నమ్మాழ్వార్లుసహింపకతనకంటికి గుబడినవస్తువులలో భగవత్సంబన్ధమునుజూచి యాశపడువిధము నన్యాపదేశముగ సాదించుచున్నారు.

⁂ మణ్ణైయిరున్దుతుழావి వామనన్మణ్ణిదువెన్నుమ్*
విణ్ణైత్తొழுదవన్మేవు వైగున్దమెన్ఱుకై కాట్టుమ్*
కణ్ణైయుణ్ణీర్‌మల్‌గనిన్ఱు కడల్వణ్ణనెన్నుమన్నే*ఎన్
పెణ్ణైపెరుమయల్‌శెయ్‌దార్ క్కెన్ శెయ్‌గేన్ పెయ్‌వళైయీరే. ౧

అ॥ మణ్ణై - భూమిని, ఇరున్దు - ఉండి (పలుమాఱు), తుழావి - వెతకి (స్పృశించి), ఇదు - ఇది, వామనన్ - వామనునియొక్క, మణ్ - భూమి, ఎన్నుమ్ - అనిచెప్పును, విణ్ణై - ఆకసమును, తొழுదు - నమస్కరించి, అవన్ - ఆశ్రియఃపతి, మేవు-నిత్యవాసముజేయుచున్న, వైగున్దమ్ - పరమపదము, ఎన్ఱు - అని, కైకాట్టుమ్ - చెయ్‌చూపును, కణ్ణైయుళ్ - నేత్రములలో, నీర్‌మల్‌గ - నీళ్లుకారునట్లు, నిన్ఱు -ఉండి,కడల్వణ్ణన్ - సముద్రమువంటి మేనుగలవాఁడు, ఎన్నుమ్ - అనిచెప్పును, అన్నే - అమ్మా! ఎన్పెణ్ణై - నాపిల్లను, పెరుమయల్-పెద్దపిచ్చితనము గలదై, శెయ్‌దార్‌క్కు - చేసినశ్రియఃపతికి, పెయ్ - అలఙ్కరించుకొనిన, వళైయీరే - కంకణములుఁగల ఓస్త్రీలారా! ఎన్ శెయ్‌గేన్ - ఏమిసేసెదను.

తా॥ ఓస్త్రీలారా! నాకొమార్తె భూమినిస్పృశించి ఇది వామనుఁడుగొలిచిన భూమిగదా యనిచెప్పును, ఆకాశమునుజూచి నమస్కరించి పరమపదమని పేరుచెప్పశక్తిలేక దానిని తనచే

ళ్లతో జూపుము. వానితిరుమేనును దలంచిబాష్పపూర్ణముఖియై సముద్రమువంటికాన్తిగలవాఁడా యనిపిలుచును. ఇట్లునాపిల్లను భ్రమింపఁజేసిన శ్రియఃపతికి నేనేమి సేసెదనని. ౧.

పెయ్వళై క్కైగళై క్కూప్పి ప్పిరాన్ కిడక్కుమ్ కడలెన్నుమ్*
శెయ్యదోర్ ఞాయిట్రైక్కాట్టి చ్చిరీదరన్మూర్త్తియీదెన్నుమ్*
నైయుమ్కణ్ణీర్మల్గనిన్ఱు నారణనెన్నుమన్నే* ఎన్
తెయ్వవురువిల్ శిఱుమాన్ శెయ్గిన్ఱదొన్ఱఱియేనే. ౨.

అ॥ పెయ్ - అలఙ్కరించుకొఁబడిన, వళై - కంకణములుగల, కైగళై - చేతులను, కూప్పి - మొగిడ్చి, పిరాన్ - ఉపకారకుఁడు, కిడక్కుమ్ - పవ్వళించిన, కడల్ ఎన్నుమ్-సముద్రముఅనిచెప్పును, శెయ్యదు - ఎఱ్ఱనై, ఓర్ - అద్వితీయుఁడైన, ఞాయిట్రై-సూర్యుని, కాట్టి-చూపించి, ఈదు - ఇది, శిరీదరన్ - శ్రీధరునియొక్క, మూర్త్తి - విగ్రహము, ఎన్నుమ్ - అని చెప్పును, నైయుమ్ - శిథిలమనస్కురాలగును, కణ్ణీర్ మల్గ - నేత్రజలముకాఱునట్లు, నిన్ఱు - ఉండి నారణన్ ఎన్నుమ్ - నారాయణుఁడనిచెప్పును. అన్నే-అమ్మా! ఎన్-నాయొక్క, తెయ్వ వురువిల్ - దేవతవలె సుందరవిగ్రహముగలదియు, శిఱుమాన్ - చిన్నలేడివంటినేత్రములుగలదియునైనయీపె, శెయ్గిన్ఱదు - చేయువ్యాపారము, ఒన్ఱు - ఒకటియు, అఱియేన్-ఎఱుఁగను.

తా॥ అమ్మా! నాకొమార్తె, ఈసముద్రమునుజూచియిచ్చట శ్రియఃపతి పవ్వళించుచున్నాఁడుగదాయని నమస్కరించును. సూర్యునిజూచియితండు నారాయణమూర్తిగదాయని చెప్పును. మఱియు నాశ్రియఃపతి మనకుసకలవిధబంధువుగదాయని దలంచి శిథిలాన్తఃకరణురాలైదుఃఖించును. ఈవిధంబున నీనున్దరాఙ్గి చేసెడి వ్యాపారము పలానదని నేనెఱుఁగలేనని. ౨

అఱియుమ్ శెన్తీయై త్తழுవి యచ్చుదనెన్నుమ్ మెయ్ వేవాళ్*
ఎఱియుమ్తణ్గాట్రై త్తழுవి యెన్నుడై క్కోవిన్దనెన్నుమ్*
వెఱికొళ్ తుழாయ్మలర్ నాఱుమ్ వినైయుడై యాట్టియేన్పెట్ర*
శెఱివళై మున్కైచ్చిఱుమాన్ శెయ్గిన్ఱదెన్ కణ్ణుక్కొన్ఱే. 3.

అ॥ అఱియుమ్ - (ఎల్లరచేవేడియని) తెలిసికొనఁదగిన, శెన్తీయై - ఎఱ్ఱని యగ్నిని, తழுవి - కౌగలించుకొని, అచ్చుదనెన్నుమ్ - అచ్యుతుఁడనిచెప్పును. మెయ్వేవాళ్ - శరీరము కాలిపోకుండనుండును, ఎఱియుమ్ - విసిఱికొట్టుచున్న, తణ్ - చల్లని, కాట్రై - గాలిని, తழுవి - కౌగలించుకొని, ఎన్నుడై - నాయొక్క, కోవిన్దన్ - గోవిందుఁడు, ఎన్నుమ్-అనిచెప్పును. వెఱికొళ్ - పరిమళముగల, తుழாయ్మలర్ - తులసియొక్కపుష్పము, నాఱుమ్ - (ఈపెశరీరమందు) పరిమళించును, వినైయుడైయాట్టియేన్ - పాపముగలనేను, పెట్ర-కనినదియు, శెఱి-నిబిడమైన, వళై-కఙ్కణములను, మున్కై-చెయ్యియొక్కఅగ్రభాగమునందుగలదియు, శిఱుమాన్ - చిన్నలేడివంటి చూపుకలదియునైనయీపె, శెయ్గిన్ఱదు - చేసెడివ్యాపారములు, ఎన్ కణ్ణుక్కు - నానేత్రమునకు, ఒన్ఱే-ఒకటిగానున్నది (అసహ్యములని).

తా॥ [అచ్యుతుఁడని చెప్పి] నిప్పును కౌగలించుకొనినను ఈమె కేమియు బాధగలుగదు. మా గోవిన్దుఁడని చెప్పి యతివేగముగా గొట్టుచున్న వాయువును కౌగలించుకొనుచున్నది. ఈమె యొక్క శరీరమందు తులసీవాసన గొట్టుచున్నది. ఈమె సేసెడి వ్యాపారయ యిట్టి యనేకములని.

ఒన్ఱియత్తిజ్గళై క్కాట్టి యొళిమణివణ్ణనే యెన్నుమ్*
నిన్ఱకున్ఱత్తినై నోక్కి నెడుమాలే వా వెన్ఱు కూవుమ్*
నన్ఱుపెయ్యుమ్మழై కాణిల్ నారణన్ వన్దా నెన్ఱాలుమ్*
ఎన్ఱినమైయల్గళ్ శెయ్దా రెన్నుడై క్కోమళత్తైయే. ౪.

అ॥ ఒన్ఱియ - పూర్ణుఁడైన - తిజ్గళై - చన్ద్రుని, కాట్టి - చూపించి, ఒళి - ప్రకాశించు చున్న, మణివణ్ణనే - రత్నమువంటి కాన్తిగలవాఁడా? ఎన్నుమ్ - అనిచెప్పును నిన్ఱ - ఎదురుగ నున్న, కున్ఱత్తినై - పర్వతమును, నోక్కి - చూచి, నెడుమాలే - గొప్ప స్నేహముగలవాఁడా! వా - రమ్ము, ఎన్ఱు కూవుమ్ - అనిపిలుచును, నన్ఱు - ఎక్కువగా, పెయ్యుమ్ - వర్షించుచున్న, మழై - మేఘమును, కాణిల్ - చూచినయెడల, నారణన్ - శ్రీమన్నారాయణుఁడు, వన్దాన్ఎన్ఱు - వచ్చెనని, ఆలుమ్ - నృత్యముజేయును. ఎన్ఱు ఇన - అని చెప్పిన యీవిధంబేగాక, ఎన్నుడై క్కోమళత్తై - నామృదువైనపిల్లకు, మైయల్గళ్ - భ్రమములను, శెయ్దార్ - పుట్టించిరి.

తా॥ పూర్ణచంద్రునిజూచి, వీడు సుందరవిగ్రహుఁడైన శ్రియఃపతియని చెప్పును. చెట్లతో నిండియున్న పర్వతముసజూచి, ఈపెయింతకాలము పిలిచినను రాకపోతి మేయని సిగ్గుచేమునుకు వేసికొని శ్రియఃపతివచ్చి యొకపక్కన దాగుకొనియున్నాడని దలఁచి, ఓసర్వేశ్వరుఁడా! నీవు సిగ్గుబడవలదు, నాయెదుటరమ్మని పిలుచుచున్నది. మేఘములనుజూచి పరోపకారశీలుడైన శ్రియఃపతి వచ్చెనేయని నృత్యముజేయును. ఆశ్రియఃపతి నాపిల్లకిట్లు పిచ్చియెత్తునట్లుచేసెనని.

కోమళవాన్ కన్ఱైప్పుల్గి క్కోవిన్దన్మేయ్త్తన వెన్నుమ్*
పోమిళనాగత్తిన్ పిన్పో యవన్ కిడక్కైయీ దెన్నుమ్*
ఆమళవొన్ఱుమఱియే నరువినైయాట్టియేన్పెత్త*
కోమళవల్లియై మాయోన్ మాల్ శెయ్దు శెయ్గిన్ఱ కూత్తే. ౫.

అ॥ కోమళమ్ - సున్దరమై, వాన్ - బలిసియున్న, కన్ఱై - దూడను, పుల్గి - కౌగలించుకొని, కోవిన్దన్ మేయ్త్తన - దీనిని శ్రీకృష్ణుఁడు మేపినాడు, ఎన్నుమ్ - అనిచెప్పును. పోమ్ - పోవుచున్న, ఇళమ్ - యౌవనముగల, నాగత్తిన్ - పాముయొక్క, పిన్ - వెనుక, పోయ్ - పోయి, అవన్ - ఆశ్రియఃపతికి, ఈదు - అది, కిడక్కై - పడక, ఎన్నుమ్ - అని చెప్పును. అరు - క్రూరమైన, వినై యాట్టియేన్ - పాపముగలనేను, పెత్త - కనిన, కోమళ వల్లియై - సుందరమైన తీగెవంటియీపెను, మాయోన్ - ఆశ్చర్యభూతుడైనశ్రియఃపతి, మాల్ శెయ్దు - భ్రమింపఁజేసి, శెయ్గిన్ఱ - చేయుచున్న, కూత్తు - ఆటలు, ఆమళవు - ఇంతయగు నని, ఒన్ఱుమ్ - ఒకటియు, అఱియేన్ - ఎఱుఁగను

తా॥ సున్దరమైన దూడను కౌగలించుకొని, దీనిని కృష్ణుఁడు మేపినాడుగనుక బలిసియు న్నదనియు, మంచిసర్పమున వెనుకబడి ఇది శ్రియఃపతికి పడకయనియు చెప్పును శ్రీకృష్ణుఁడు నాపిల్లనిట్లు భ్రమింపజేసెను. ఇదినాపాపమా? ఈమెకీపిచ్చితనమలవిగాక యున్నదేయని. ౫

కూత్తర్ కుడమెడుత్తాడిల్ కోవిన్దనామెనావోడుమ్*
వాయ్త్తకుழలోశై కేట్కిల్ మాయవనెన్ఱుమైయాక్కుమ్*
ఆయ్చ్చియర్ వెణ్ణెయ్గళ్ కాణిలవనుణ్డవెణ్ణెయీదెన్నుమ్*
పేయ్చ్చిములై శువైత్తార్క్కెన్పెణ్కొడియేఱియపిత్తే. ౬

అ॥ కూత్తర్ - నృత్యముజేయువారు, కుడమెడుత్తు - కుండలనెత్తి (నెత్తిమీఁదనుంచుకొని), ఆడిల్ - నృత్యముజేసినయెడల, కోవిన్దనామ్ - శ్రీకృష్ణుఁడు గావచ్చును, ఎనా - అని దలంచి, ఓడుమ్ - పఱుగెడును, వాయ్త్త - సుఖకరంబైన, కుழలోశై - వేణునాదము, కేట్కిల్ - వినినగూడ, మాయవన్ - ఆశ్చర్యభూతుఁడైన శ్రీకృష్ణుఁడు (వచ్చినాడు), ఎన్ఱు - అని, మైయాక్కుమ్ - మోహించును, ఆయ్చ్చియర్ - గొల్లలయొక్క, వెణ్ణెయ్గళ్ - వెన్నలను, కాణిల్ - చూచినయెడల, ఈదు - ఇది, అవన్ - ఆశ్రీకృష్ణుఁడు, ఉణ్డ - ఆరగించిన, వెణ్ణెయ్ - వెన్న, ఎన్నుమ్ - అనిచెప్పును. పేయ్చ్చి - పూతనయొక్క, ములై - స్తన్యమును, శువైత్తార్క్కు - ఆరగించినవారివిషయమై, కొడి - తీగవలెనున్న, ఎన్పెణ్ - నాకొమార్తె, ఏఱియ - పొందిన, పిత్తు - పిచ్చితనము (ఉన్నవిధమిట్టిది).

తా॥ ఎవరైనను కుంభనృత్యము జేసినయెడల వాఁడు శ్రీకృష్ణుఁడే కావచ్చునని దలంచి యచ్చటికిఁబఱుగెడును వేణునాదము వినినయెడల శ్రీకృష్ణుఁడువచ్చెనని మోహించును గొల్లలు వెన్నతీసికొనివచ్చినయెడల యిది శ్రీకృష్ణుఁడారగించిన వెన్నగదాయని చెప్పును. ఈవిధంబున నాశ్రీకృష్ణునివిషయమైనాపిల్లకు పిచ్చియెత్తెనని ౬.

ఏఱియపిత్తినోడెల్లావులగు కణ్ణన్పడైప్పెన్నుమ్*
నీఱుశెవ్వేయిడక్కాణిల్ నెడుమాలడియారెన్ఱోడుమ్*
నాఱుతుழాయ్మలర్ కాణిల్ నారణన్కణ్ణియీదెన్నుమ్*
తేఱియుమ్తేఱాదుమాయోన్ తిఱత్తనళేయిత్తిరువే. ౭.

అ॥ ఏఱియ - ఎక్కియున్న, పిత్తినోడు - పిచ్చితనమున్నప్పటికిన్ని, ఎల్లావులగు - సమస్తలోకము, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, పడైప్పు - సృష్టి, ఎన్నుమ్ - అనిచెప్పును, నీఱు - భస్మమైనను, శెవ్వే - చక్కగా (ఊర్ధ్వపుణ్డ్రముగా), ఇడక్కాణిల్ - ధరించుకొనినవారిని జూచినయెడల, నెడుమాలడియార్ - (వారు) శ్రియఃపతికిదాసులు, ఎన్ఱు - అనితలంచి, ఓడుమ్ - పఱుగెడును, నాఱు - పరిమళించుచున్న, తుழాయ్మలర్ - తిరుత్తుழాయియొక్క పుష్పమును, కాణిల్ - చూచినయెడల, ఈదు - ఇది, నారణన్ - శ్రీమన్నారాయణునియొక్క, కణ్ణి - మాలిక, ఎన్నుమ్ - అని చెప్పును. తేఱియుమ్ - తెలివియున్నప్పుడును, తేఱాదుమ్ - తెలివిలేనప్పుడును, ఇత్తిరు - లక్ష్మివంటియీయామె, మాయోన్ తిఱత్తనళ్ - శ్రీకృష్ణునియందే మోహించియున్నది.

తా॥ ఈవిచిత్రతనములోగూడ, ఈజగత్తును శ్రీకృష్ణుడే సృజించినాడని చెప్పును. ఎవరైనను భస్మమును త్రినిడువు గాధరించినయెడల దానిని భస్మమనిగూడ నెంచక, ఊర్ధ్వము గాధరించియున్న దాని నేజూచి వీరు ఊర్ధ్వ పుణ్డ్రధారులైన శ్రీవైష్ణవులని దలంచి వారిని దణ్డమ్ సమర్పించుటకు బయలుగెడును. తులసీమాలిక నుజూచి యిది శ్రీకృష్ణుడు ధరించెడి వనమాలయని చెప్పును. అంతయేగాక సర్వకాలములయందును హరినే ధ్యానించియుండునని. ౭.

తిరువుడై మన్నరై క్కాణిల్ తిరుమాలై క్కణ్డేనేయెన్నుమ్*
ఉరువుడై వణ్ణఙ్గళ్ కాణిల్ ఉలగళన్దానెన్ఱుతుళ్ళుమ్*
కరువుడై త్తేవిల్ గళెల్లామ్ కడల్వణ్ణన్ కోయిలేయెన్నుమ్*
వెరువిలుమ్ వీழ்విలుమోవాళ్ కణ్ణన్ కழల్ గళ్ విరుమ్బుమే. ౮.

అ॥ తిరువుడై - శ్రీమంతులైన, మన్నరై - రాజులను, కాణిల్ - చూచినయెడల, తిరుమాలై - శ్రియఃపతిని, కణ్డేనేయెన్నుమ్ - సేవించితినని చెప్పును, ఉరువుడై - మంచిరూపములు గల, వణ్ణఙ్గళ్ - పదార్థములను, కాణిల్ చూచినయెడల, ఉలగళన్దానెన్ఱు - లోకములను గొలచిన త్రివిక్రముడని, తుళ్ళుమ్ - నృత్యముజేయును, కరువుడై - ప్రతిమగల, తేవిల్ గళెల్లామ్ - దేవాలయమంతయు, కడల్వణ్ణన్ - సముద్రమువంటి మేనుగల శ్రియఃపతియొక్క, కోయిలేయెన్నుమ్ - కోవెలయని చెప్పును. వెరువిలుమ్ - సిగ్గున్నప్పుడును, వీழ்విలుమ్ - మోహించియున్నప్పుడును ఓవాళ్ - విడువనిదై, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, కழల్ గళ్ - తిరువడికళ్ళను, విరుమ్బుమ్ - ఆశపడును.

తా॥ శ్రీమన్తులైన రాజులనుజూచి వీరు శ్రియఃపతి స్వరూపులనియు, అందమైనవస్తువును జూచి ఇది త్రివిక్రమస్వరూపమనియు, ఏదేవాలయమైనను దానిని జూచి యిది శ్రియఃపతియొక్క కోవిలయనియుఁ జెప్పును. ఇంతయేగాక సర్వకాలములయందుగూడ శ్రీకృష్ణునియొక్క శ్రీపాదములనే యాశ్రయించియుండునని. ౮.

విరుమ్బిప్పగవరై క్కాణిల్ వియలిడముణ్డానేయెన్నుమ్*
కరుమ్బెరుమేగఙ్గళ్ కాణిల్ కణ్ణనెన్ఱేఅప్పఱక్కుమ్*
పెరుమ్బులవానిరై కాణిల్ పిరానుళనెన్ఱుపిన్ శెల్లుమ్*
అరుమ్బెఱల్ పెణ్ణినై మాయో నలక్కழியయర్ప్పిక్కిన్ఱానే. ౯.

అ॥ పగవరై - పూజ్యులను, కాణిల్ - చూచినయెడల, విరుమ్బి - ఆశపడి, వియల్ - విశాలమైన, ఇడమ్ - భూమిని, ఉణ్డానేయెన్నుమ్ - అరగించినవాడా! యని చెప్పును, కరుమ్ - నల్లనైన, పెరుమేగఙ్గళ్ - గొప్పమేఘములను, కాణిల్ - చూచినయెడల, కణ్ణనెన్ఱు - శ్రీకృష్ణుడని, ఏఅప్పఱక్కుమ్ - ఎగిరిపడబోగెడును, పెరుమ్ - గొప్పవైన, పులమ్ - సున్దరంబులైన, ఆనిరై కాణిల్ - ఆవులయొక్క గుంపులనుజూచినయెడల, పిరాన్ - ఉపకారకుఁడైన శ్రీకృష్ణుఁడు, ఉళనెన్ఱు - ఉన్నాఁడని, పిన్ శెల్లుమ్ - వెనుకవెళ్లును. పెఱల్ - పొందుటకు, అరుమ్ - దుర్లభమైన, పెణ్ణినై - (నా) పిల్లను, మాయోన్ - ఆశ్చర్యచేష్టితుఁడైన శ్రీకృష్ణుఁడు, అలక్కழி - జల్పించి, అయర్ప్పిక్కిన్ఱాన్ - భ్రమింపఁజేయుచున్నాడు.

తా॥ భాగవతులనుజూచి వీరు సర్వేశ్వరస్వరూపులనియు, నల్లనిమేఘమును జూచియిది శ్యామసుందరుఁడైన కృష్ణునివలెనున్నదనియు, గోసమూహములనుజూచి వీనివెనుక శ్రీకృష్ణుఁడు వచ్చునని దలంచి జల్పించియు మోహించునటుల నా బిడ్డను శ్రీకృష్ణుఁడు నేసెనని. ౯.

అయర్క్కుమ్ శుఱ్ఱుమ్ పఱ్ఱి నోక్కుమ్ అగలవే నీణ్ణోక్కుక్కొళ్ళుమ్*
వియర్క్కుమ్ మఴైక్కణ్ తుళుమ్బ వెవ్వుయిర్క్కొళ్ళుమ్ మెయ్ శోరుమ్*
పెయర్త్తుమ్ కణ్ణావెన్ఱుపేశుమ్ పెరుమానే వావెన్ఱుకూవుమ్*
మయల్ పెరుఙ్గాదలెన్ పేదైక్కెన్ శెయ్ గేన్వల్వినైయేనే. ౧౦.

అ॥ అయర్క్కుమ్ - మోహించును, శుఱ్ఱుమ్ - నాలుగుపక్కలను, పఱ్ఱి - ప్రీతితో, నోక్కుమ్ - చూచును. అగలవే - దూరమందున్నట్లుతలంచి, నీళ్ నోక్కుక్కొళ్ళుమ్ - దూరదృష్టితో జూడును, వియర్క్కుమ్ - చెమట నీళ్ళను బ్రవహింపఁజేయును, మఴై - వర్షమువలె, కణ్ - నేత్రజలము, తుళుమ్బ - కారునట్లు, వెవ్వుయిర్క్కొళ్ళుమ్ - నిట్టూర్పువిడుచును, మెయ్ శోరుమ్ - వాడిపోవును, పెయర్త్తుమ్ - తిరిగియు, కణ్ణావెన్ఱు పేశుమ్ - కృష్ణుఁడా! యనిచెప్పును, పెరుమానే - ఓస్వామీ! వా - రమ్ము, ఎన్ఱుకూవుమ్ - అని పిలుచును, మయల్ - మోహమునుగలుగఁజేసెడి, పెరుమ్కాదల్ - గొప్పయాశగల, ఎన్ పేదైక్కు - నాబిడ్డకు, వల్ వినైయేన్ - పాపముగలనేను, ఎన్ శెయ్ గేన్ - ఏమిచేసెదను.

తా॥ సర్వేశ్వరునియందు ప్రేమనుంచివాఁడెచ్చటనున్నాడోయని యంతటవెతికి వానిని జూడక దుఃఖించుచు నిట్టూర్పువిడుచును. అంతటతో నిరాశజేయక మఱియును వానిపేరుబెట్టి పిలుచును ఇట్టియతిప్రేమతో మోహించుచున్న యీమెకు నేనేమి చేసెదనని. ౧౦

‡‡ వల్వినై తీర్క్కుమ్ కణ్ణనై వణ్కురుగూర్చ్చడగోపన్*
శొల్వినైయాల్ శొన్నపాడ లాయిరత్తుళ్ళివై పత్తుమ్*
నల్వినై యెన్ఱుకఱ్పార్గళ్ నలనుడై వైగున్దమ్నణ్ణి*
తొల్వినై తీరవెల్లారుమ్ తొఴుదెఴువీఱ్ఱిరుప్పారే. ౧౧.

అ॥ వల్ - క్రూరమైన, వినై - పాపమును, (స్వవిరహదుఃఖమును) తీర్క్కుమ్ - పోగొట్టెడి, కణ్ణనై - శ్రీకృష్ణునివిషయమై, వణ్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్వినైయాల్ - వాచికక్రియచే, శొన్న - సాధించిన, పాడల్ - గానముతోగూడిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, నల్వినైయెన్ఱు - మంచికృత్యమని, కఱ్పార్గళ్ - అభ్యసించువారు, నలనుడై - ఆనన్దముగల, వైగున్దమ్ - శ్రీవైకుణ్ఠమును, నణ్ణి - పొంది, తొల్ - అనాదియైన, వినై - పాపము, తీర - పోయి, ఎల్లారుమ్ - ఎల్లరును, తొఴుదు - ఆశ్రయించి, ఎఴు - ఆదరించునట్లు, వీఱ్ఱిరుప్పార్ - తమమహిమప్రకాశించునట్లుందురు.

తా॥ సకలపాపహరుఁడైన శ్రీకృష్ణునివిషయమై నమ్మాళ్వార్లుసాధించిన యీపదిపాశురముల నర్థానుసంధానముతోననుసంధించువారు పాపరహితులై మోక్షమునొంది యచ్చటనున్న నిత్యసూరులు స్తుతించునట్లు గొప్పమహిమగలవారై యుందురని, ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౫ - వ, తిరువాయ్మొழி.



అవతారిక:—ఈవిధంబున నాళ్వార్లు సర్వేశ్వరునియొక్క విరహదుఃఖము ననుభవించుచుండగా నాదుఃఖములన్ని శమనమగునట్లు సర్వేశ్వరుఁడు సమస్తపరివారములతో వచ్చి సేవసాయింప, అప్పుడాసర్వేశ్వరుని సేవించి ప్రీతులై, నాతో సమానులైన ధన్యులెవ్వరు లేరని ప్రసాదించుచున్నారు.

౹౹ వీఱ్ఱిరున్దేழுలగుమ్ తనిక్కోల్ శెల్ల వీవిల్ శీర్ *
ఆఱ్ఱల్ మిక్కాళుమమ్మానై వెమ్మాపిళన్దాన్ఱన్నై *
పోఱ్ఱియెన్ఱేకైగళార తొழுదుశొల్ మాలైగళ్ *
ఏఱ్ఱనోఱ్ఱేఱ్కినియెన్నకుఱై యెழுమైయుమే. ౧.

అ॥ వీఱ్ఱిరున్దు - తనప్రభుత్వముదోచునటుల వేంచేసియుండి, ఏழுలగుమ్-సప్తలోకములయందును, తని - అద్వితీయంబైన, కోల్ - అధికారము, శెల్ల - నడుచునట్లు, వీవిల్-నాశములేని, శీర్ - గుణంబులుగలవాఁడును, ఆఱ్ఱల్ మిక్కు - మిక్కిలిక్షమగలవాఁడై, ఆళుమ్-పరిపాలించువాఁడును, వెమ్ - క్రూరమైన, మా - కేశియనెడిగుఱ్ఱమును, పిళన్దాన్ఱన్నై - చీల్చినవాఁడునైన, ఎమ్మానై - నాస్వామిని, పోఱ్ఱియెన్ఱే-ఎల్లప్పుఁడునుమఙ్గళాశాసనముజేయుచు, కైగళ్ - చేతులు, ఆర - నిండినట్లు, తొழுదు - అంజలిచేసి, శొల్ - శబ్దరూపంబులైన, మాలైగళ్ - మాలికలను, ఏఱ్ఱ - సమర్పించుటకు (తగిన), నోఱ్ఱేఱ్కు - భాగ్యముజేసికొనిననాకు, ఇని - ఇంకమీద, ఎழுమైయుమ్ - అన్నిజన్మములలోను, ఎన్నకుఱై - ఏకొఱతగలదు.

తా॥ ఉభయవిభూతులను తనయాజ్ఞచే బరిపాలించుచున్న సర్వేశ్వరునికి మంగళాశాసనముఁజేసి నమస్కరించి స్తోత్రముజేయదగిన భాగ్యముగల నాకిఁక నేజన్మమందు నొకకొఱతయురాసేరదని. ౧.

మైయకణ్ణాళ్ మలర్మేలుఱైవాళుఱై మార్బినన్ *
శెయ్యకోల త్తడఙ్గణ్ణన్ విణ్ణోర్ పెరుమాన్ఱన్నై *
మొయ్యశొల్లాలిశై మాలైగళేత్తి యుళ్ళప్పెఱ్ఱేన్ *
వెయ్యనోయ్గళ్ ముழுదుమ్ వియన్ఞాలత్తువీయవే ౨.

అ॥ మైయ - నల్లనైన, కణ్ణాళ్ - నేత్రములుగలదియు, మలర్ మేల్ - తామరపువ్వుమీఁద, ఉఱైవాళ్ - నిత్యవాసముజేయునదియునైన శ్రీమహాలక్ష్మి, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, మార్బినన్ - వక్షస్థలముగలవాఁడును, శెయ్య - ఎఱ్ఱనై, కోలమ్ - సుందరమై, తడమ్-విశాలమైన, కణ్ణన్ - నేత్రముగలవాఁడును, విణ్ణోర్ - నిత్యసూరులకు, పెరుమాన్ఱన్నై-స్వామియునైనసర్వేశ్వరుని, మొయ్య - దట్టమైన, శొల్లాల్ - శబ్దములతోజేర్చబడిన, ఇశై - గానముతోగూడిన, మాలైగళ్ - మాలికలచే, వియల్ - విస్తారమైన - ఞాలత్తు-భూమియందు, నోయ్గళ్ ముழுదుమ్ - క్లేశములన్నియు, వీయ - నశించునటుల, ఏత్తి - స్తుతించి, ఉళ్ళ-అనుసంధించుటకు, పెఱ్ఱేన్ - భాగ్యవంతుఁడనైతిని.

తా॥ శ్రీమహాలక్ష్మిని తనవక్షస్థలమందుగలవాడై ఆశ్రితవాత్సల్యముచేత నెట్టనైన నేత్రములుగలవాడైన శ్రియఃపతిని బొందికరైయినశబ్దసందర్భముగల తిరువాయ్మొఴితో స్తుతించి ఇహలోకమందే నాకన్నిదుఃఖములుపోవునట్లు ధ్యానింపదగిన భాగ్యముగల నా కెకొ అతయులేదని. ౨

వీవిలిన్బమ్మిగ వెల్లై నిగఴ్న్ద నమ్మచ్చుదన్*
వీవిల్ శీరన్మలర్క్కణ్ణన్ విణ్ణోర్ పెరుమానై*
వీవిల్ కాలమిశై మాలైగళ్ ఏత్తి మేవప్పెఱ్ఱేన్*
వీవిలిన్బమ్మిగ వెల్లై నిగఴ్న్దనన్మేవియే. ౩

అ॥ వీవిల్ - నాశములేని, ఇన్బమ్ - ఆనన్దముయొక్క, మిగవెల్లై - చరమావధియందు నిగఴ్న్ద - ఉన్న, నమ్ - మనయొక్క, అచ్చుదన్ - అచ్యుతుండును, వీవిల్ - అన్తములేని, శీరన్ - కల్యాణగుణములుగలవాఁడును, మలర్క్కణ్ణన్ - పద్మనేత్రుండును, విణ్ణోర్ - నిత్యసూరులకు, పెరుమానై - స్వామియునైనసర్వేశ్వరుని, వీవిల్ - ఎడతెగని, కాలమ్ - కాలమంతయు, ఇశై - గానముతోఁగూడిన, మాలైగళ్ - శబ్దసన్దర్భములచే, ఏత్తి - స్తుతించి, మేవప్పెఱ్ఱేన్ - అనుభవించెడిభాగ్యమునుజేసితిని, మేవి - అనుభవించి, వీవిల్ - అంతములేని, ఇన్బమ్ - ఆనందముయొక్క, మిగవెల్లై - చరమావధియందు, నిగఴ్న్దనన్ - ఉన్నవాఁడనైతిని.

తా॥ నిరవధికానంతకల్యాణగుణంబులుగల సర్వేశ్వరుని సర్వకాలములయందును స్తుతించి నిరతిశయానందమునమభవించుచున్న నా కెకొ అతయులేదని. ౩.

మేవినిన్ఱుతొఴువార్ వినైపోగమేవుమ్బిరాన్*
తూవియమ్బుళ్ళుడైయాన్ అడలాఴియమ్మానై*
నావియలాలిశై మాలైగళ్ ఏత్తి నణ్ణప్పెఱ్ఱేన్*
ఆవియెన్నావియై యానఱియేన్ శెయ్దవాఱైయే. ౪

అ॥ మేవినిన్ఱు - అనన్యప్రయోజనులైయుండి, తొఴువార్ - ఆశ్రయించువారియొక్క, వినైపోగ - దుఃఖములునశించునట్లు, మేవుమ్ - సంశ్లేషించుచున్న, పిరాన్ - ఉపకారకుండును, తూవి - ఱెక్కలుగల, అమ్ - సుందరమైన, పుళ్ - గరుత్మంతుని, ఉడైయాన్ - వాహనముగాగలవాఁడును, అడల్ - యుద్ధోన్ముఖమైన, ఆఴి - సుదర్శనముగలవాఁడునైన, అమ్మానై - సర్వేశ్వరుని, నావియలాల్ - వాగ్వ్యాపారములచేగలిగిన, ఇశై - గానముతోఁజేరిన, మాలైగళ్ - శబ్దసన్దర్భములచే, ఏత్తి - స్తుతించి, నణ్ణప్పెఱ్ఱేన్ - అనుభవింపదగినభాగ్యముగలవాఁడనైతిని, ఆవి - ప్రాణభూతుఁడైనసర్వేశ్వరుఁడు, ఎన్నావియై - నాయాత్మను, శెయ్దవాఱై - చేసినప్రకారమును, యాన్ - నేను, అఱియేన్ - తెలిసికొనలేను.

తా॥ తనయాశ్రితుల సకలదుఃఖములను బోఁగొట్టువాఁడును గరుడవాహనుండునైన చక్రధరుని నేను తిరువాయ్మొఴిచే స్తోత్రముజేసి బ్రహ్మానందభరితుండనై యీయానందమునుగూడఁ దెలిసికొనజాలనివాఁడనైతినని. ౪

ఆఱ్ఱనల్లవగై కాట్టుమమ్మానై *అమరర్ దమ్
ఏఱ్ఱై యెల్లాప్పొరుళుమ్ విరిత్తానై యెమ్మానన్నై*
మాఱ్ఱమాలై పునైన్దేత్తి నాళుమ్మగిழ్వెయ్దినేన్*
కాఱ్ఱిల్ మున్నమ్ కడుగి వినై నోయ్‌గళ్ కరియవే. ౫

అ॥ ఆఱ్ఱ - సహించునట్లు, నల్ల - సలక్షణంబులైన, వగై - ప్రకారములను, కాట్టుమ్ - చూపించువాఁడును, అమరర్ తమ్ - నిత్యసూరులకు, ఏఱ్ఱై - నిర్వాహకుండును, ఎల్లాప్పొరుళుమ్ - కర్మజ్ఞానాదిసకలార్థములను, విరిత్తానై - విశేషముగానుపదేశించినవాఁడును, ఎమ్మాన్ తన్నై - నాకుపకారకుండునైన, అమ్మానై - స్వామిని, వినై - పాపములను, నోయ్‌గళ్ - వ్యాధులను, కాఱ్ఱిల్ మున్నమ్ - గాలికంటెముందుగా, కడుగి - శీఘ్రముగా, కరియ - కాలునట్లు, మాఱ్ఱమాలై - శబ్దసన్దర్భములను, పునైన్దు - నిర్మించి, ఏత్తి - స్తుతిజేసి, నాళుమ్ - ప్రతిదినమునం, మగిழ్వు - సంతోషమును, ఎయ్దినేన్ - పొందితిని.

తా॥ అర్జునునికి కర్మజ్ఞానభక్తిప్రపత్తులనెడి సకలోపాయములనుపదేశించిన సర్వేశ్వరుని స్తుతించి నాసకలదుఃఖములను బోగొట్టుకొని పరమానన్దమును బొందితినని. ౫

కరియ మేనిమిశై వెళియనీఱుశిఱిదేయిడుమ్*
పెరియకోల త్తడఙ్గణ్ణన్ విణ్ణోర్ పెరుమానన్నై*
ఉరియశొల్లాలిశై మాలైగళేత్తి యుళ్ళప్పెఱ్ఱేఱ్కు*
అరియదుణ్డోవెన క్కినిత్తొట్టుమినియెన్ఱుమే. ౬

అ॥ కరియ - నల్లనైననేత్రములయొక్క, మేనిమిశై - సౌందర్యముమీఁద, వెళియనీఱు - తెల్లచూర్ణము (కర్పూరచూర్ణము), శిఱిదే - చిన్నదిగా, ఇడుమ్ - ఉంచబడినదియు, పెరియ కోలమ్ - గొప్పసౌందర్యముగలదియు, తడమ్ - విశాలమైనదియునైన, కణ్ణన్ - నేత్రముగలవాఁడును, విణ్ణోర్ పెరుమాన్ తన్నై - నిత్యసూరులకు స్వామియునైన శ్రియఃపతిని, ఉరియ - తగుమైన, శొల్లాల్, - శబ్దములచేఁజేర్చబడిన, ఇశై - గానముతోగూడిన, మాలైగళ్ - మాలికలచే, ఏత్తి - స్తుతించి, ఉళ్ళప్పెఱ్ఱేఱ్కు - ధ్యానింపఁదగినపుణ్యముగలవాడనైన, ఎనక్కు - నాకు, ఇన్ఱుతొట్టుమ్ - ఇదిమొదలగు, ఇని - ఇఁకమీఁద, ఎన్ఱుమ్ - ఎప్పుడును, అరియదు - దుర్లభము, ఉణ్డో - కలదా?

తా॥ నేత్రమందున్న నలుపువర్ణముమీద మఙ్గళార్థమైసరించిన తెల్లని కర్పూరచూర్ణముచే నతిసుందరంబై శోభిల్లుచున్న నేత్రముగల సర్వేశ్వరుని స్తోత్రముజేసి ధ్యానింపదగినభాగ్యముగల నాకు నిఁకమీఁద నెదియు నసాధ్యము లేదని. ౬

ఎన్ఱుమొన్ఱాగి యొత్తారుమ్మిక్కార్‌గళుమ్*తన్ఱన
క్కిన్ఱినిన్ఱానై యెల్లావులగుముడైయానన్నై*
కున్ఱమొన్ఱాల్ మழைకాత్తపిరానై చ్చొన్మాలైగళ్*
నన్ఱుశూట్టుమ్‌విదియెయ్దినమ్మెన్నకుఱైనమక్కే. ౭

అ॥ ఎన్డుమ్ - ఎప్పుడును, ఒన్ఱాగి - ఒకవిధముచేతనున్న. తనక్కు - తనకు, ఒత్తారుమ్ - సమానులును, మిక్కార్గళుమ్ - మించినవారును, ఇన్ఱి - లేక, నిన్ఱానై - ఉన్నవాడును, ఎల్లావులగుమ్ - సమస్తలోకములను, ఉడైయాన్ఱన్నై - కలవాడును, కున్ఱమొన్ఱాల్ - ఒకపర్వతముచే, మழை - వానను, కాత్తపిరానై - అడ్డగించిన ఉపకారకుండునైన శ్రియఃపతికి, శొల్మాలైగళ్ - శబ్దసన్దర్భములను, నన్ఱు - చక్కగా, శూట్టుమ్ - సమర్పింపదగిన, విది - భాగ్యమున, ఎయ్దినమ్ - పొందితిమి నమక్కు - మనకు, ఎన్నకుఱై - ఏమికొఱతయున్నది.

తా॥ తనతోసాటి వారును తనకు మించినవారును లేక సద్వితీయుడై గోవర్ధనమునెత్తి వర్షమునడ్డగించి గోవులను రక్షించిన శ్రియఃపతిని తిరువాయ్మొழులచే స్తోత్రముజేయదగిన భాగ్యముగల నాకింక నేకొఱతయు లేదని. ౭

నమక్కుమ్పూవిన్మిశై నఙ్గైక్కు మిన్బనై *ఞాలత్తార్
తమక్కుమ్ వానత్తవర్క్కు మ్పెరుమానై *తణ్డామరై
శుమక్కుమ్ పాదప్పెరుమానై చ్చొల్మాలైగళ్ *శొల్లుమా
అమైక్కవల్లే ఱ్కినియావర్ నిగరగల్వానత్తే. ౮

అ॥ నమక్కుమ్ - మనకును, పూవిన్మిశై - పద్మమందునివసించుచున్న, నఙ్గైక్కుమ్ - శ్రీమహాలక్ష్మికిని, ఇన్బనై - ఆనందకరుడును, ఞాలత్తార్తమక్కుమ్ - లోకమందలిప్రాణులకును, వానత్తవర్క్కుమ్ - నిత్యసూరులకును, పెరుమానై - స్వామియైన, తణ్ - చల్లని, తామరై - పీఠపద్మము, శుమక్కుమ్ - ధరించుచున్న, పాదమ్ - శ్రీపాదముగల, పెరుమానై - సర్వేశ్వరుని విషయమై, శొల్మాలైగళ్ - శబ్దసందర్భములు, శొల్లుమాఱు - చెప్పువిధంబును, అమైక్కవల్లేఱ్కు - ఏర్పఱచదగిననాకు, ఇని - ఇకమీద, అగల్ - విశాలమైన, వానత్తు - పరమపదమందు, నిగర్ - ఒప్పైనవారు, ఆర్ - ఎవరు

తా॥ అత్యన్తహీనుడనైన నాయందును అత్యుత్కృష్టురాలైన శ్రీమహాలక్ష్మియందును సమానముగా ప్రీతిజేయుచున్న సకలలోకేశ్వరుడైన శ్రియఃపతిని స్తుతించునట్లు నమరికతోనున్న నాకు పరమపదమునందునుగూడ సాటియెవరులేరని ౮

వానత్తుమ్వానత్తుళ్ళుమ్బరుమ్ మణ్ణుళ్ళుమ్మణ్ణిన్కీழ్
త్తానత్తుమ్*ఎణ్డిశైయుమ్ తవిరాదునిన్ఱాననై*
కూనల్పిఱైత్తడక్కైయవనై క్కుడమాడియైవాన
క్కోనై*కవిశొల్లవల్లే ఱ్కినిమాఱుణ్డే. ౯

అ॥ వానత్తుమ్ - స్వర్గమందును, వానత్తుళ్ - స్వర్గమునకవతలనున్న, ఉమ్బరుమ్ - ఊర్ధ్వలోకములయందును, మణ్ణుళ్ళుమ్ - భూమియందును, మణ్ణిన్కీழ் - భూమిక్రిందనున్న, తానత్తుమ్ - స్థానములయందును, ఎణ్డిశైయుమ్ - అష్టదిక్కులయందును, తవిరాదు - ఒకటియు తప్పక, నిన్ఱానై - వ్యాపించియున్నవాడును, కూన్ - వరిగినట్టిదియు, (వక్రమైనట్టిదియు)

నల్ - సుందరంబులైన, శఙ్గమ్ - శ్రీపాఞ్చజన్యమును, తడమ్-విశాలమైన, కైయవనై-శ్రీహస్తమందుగలవాఁడును, కుడమాడిరై - కుంభనృత్యముజేసినవాఁడును, వానమ్ - పరమపదవాసులకు, కోనై - స్వామియునైనసర్వేశ్వరునికి, కవిశొల్లవల్లేఱ్కు-కవిత్వముజెప్పదగిననాకు, ఇని - ఇఁక మీఁద, మాఱు - ఎదురు, ఉణ్డే - ఉన్నదా?

తా॥ భూమ్యన్తరిక్షాదిసకలలోకములయందలి సకలపదార్థములయందును వ్యాపించియున్నవాఁడై, సుందరంబైన శ్రీపాఞ్చజన్యధరుఁడైన సర్వేశ్వరుని స్తోత్రముజేయందగిననాకు సమానులెవ్వరు లేరని. ౯.

ఉణ్డుముమిழ்న్దుకడన్దుమిడన్దుమ్ కిడన్దునిన్ఱుమ్*
కొణ్డకోలత్తోడువీఱ్ఱిరున్దుమ్ మణమ్కూడియుమ్*
కణ్డవాఱ్ఱాల్ తనదే యులగెననిన్ఱాన్ఱన్నై*
వణ్డమిழ்నూఱ్కనోఱ్ఱే నడియార్క్కిన్బమారియే. ౧౦.

అ॥ ఉణ్డుమ్ - ఆరగించియు, ఉమిழ்న్దుమ్ - బయలుపఱచియు, కడన్దుమ్ - కొలిచియు, ఇడన్దుమ్ - పెడలీసియు, కిడన్దుమ్ - (సముద్రతీరమందు) పవ్వళించియు, నిన్ఱుమ్ - (రావణునిజంపి) నిలిచియు, కొణ్డకోలత్తోడు - పట్టాభిషేకముజేసికొనిన యలఙ్కారముతో, వీఱ్ఱిరున్దుమ్ - వేంచేసియుండియు, మణమ్కూడియుమ్ - (ఇట్లుభూమిప్పిరాట్టితో) సంశ్లేషించియు, (ఉన్నదానిని), కణ్డవాఱ్ఱాల్ - చూచినప్రకారముచే, ఉలగు - లోకము, తనదేఎన - తనదేయని (తోచునట్లు), నిన్ఱాన్ఱన్నై - ఉన్నసర్వేశ్వరుని విషయమై, వణ్ - యథార్థమును దెలిపెడి, తమిழ் - ద్రావిడరూపమైన ప్రబన్ధమును, నూఱ్క - చేయుటకు, నోఱ్ఱేన్ - పుణ్యముగలవాఁడనైతిని. (ఈప్రబన్ధము), అడియార్క్కు - భాగవతులకు, ఇన్బమారి - అనన్దమునువర్షించుచున్నది.

తా॥ సకలలోకముల నన్నివిధములుగారక్షించుచున్న శ్రియఃపతివిషయమైన యీతిరువాయ్మొழிని జేసి శ్రీవైష్ణవులకు పరమానన్దమును గలుగజేసితినని. ౧౦

‡‡ మారిమాఱాదతణ్ణమ్మలై వేఙ్గడత్తణ్ణలై*
వారిమాఱాదపైమ్పూమ్పొழிల్శూழ் కురుగూర్నగర్*
కారిమాఱన్శడగోపన్ శొల్లాయిరత్తిప్పత్తాల్*
వేరిమాఱాదపూమేలిరుప్పాళ్ వినైతీర్క్కుమే. ౧౧.

అ॥ మారి - వర్షము, మాఱాద - ఎడతెగనిదై, తణ్ - చల్లనిదై, అమ్ - సుందరంబైన, వేఙ్గడమలైక్కు - వేఙ్కటాద్రికి, అణ్ణలై - స్వామియైన శ్రియఃపతివిషయమై, వారి - జలము, మాఱాద - ఎడతెగని, పై - సుందరమైన, పూ - పుష్పముగల, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టబడిన, కురుగూర్నగర్ - కురుకాపురికిస్వామియై, కారి - కారికికొమారుడై, మాఱన్-మాఱనుడనుపేరుగలవాఁడైన, శడగోపన్ - వకుళాభరణస్వామి, శొల్ - పాడించిన, ఆయిరత్తు

పెయ్యుపాశురములలో, ఇప్పత్తాల్ - ఈపదిపాశురములచే, శేరిమాడాద - పరిమళముమాఱిపో కుండుండెడి, పూమేల్ - పుష్పమందు, ఇరుప్పాళ్ - వాసముచేయులక్ష్మీదేవి, వినైతీర్క్కుమ్- పాపములనుదీర్చును,

తా॥ ఎల్లప్పుడును వర్షించుచు చల్లనైయున్న వేఙ్కటాద్రియందు వేంచేసియున్న శ్రియః పతివిషయమై, పుష్పతోటలచే నిండియున్న కురుకాపురాధీశులైన నమ్మాழ்వార్లు ప్రసాదించిన యీపదిపాశురములననుసంధించువారియొక్క సమస్తపాపములను శ్రీమహాలక్ష్మిపోగొట్టునని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౬ - వ తిరువాయ్మొழி.

అవతారిక:__ఈవిధంబుల సర్వేశ్వరుఁడాழ்వార్లకుసేవసాదించిన పిదప యన్తర్ధానమాయెను. అప్పుడాழ்వార్లు సర్వేశ్వరుని సేవింపక దుఃఖితులైమూర్ఛావస్థనొందియుండగా నప్పుడు ప్రక్కనున్న వారుజూచి, వీరికిబాధ దేవతాన్తరములయొక్క దుష్టదృష్టిచేఁగలిగినదనిదలంచి యాయా దేవతలు ప్రసన్నములగునట్లు ఆయాక్షుద్రదేవతలకు పూజచేయయత్నింపఁ, మఱియొకరుఆపూజలనునిషేధించి భగవన్నామస్మరణముజేసిన యెడల నీవ్యాధిశాన్తియగునని వారలకుపదేశింప, ఆమాటవిని వారందఱు భగవన్నామస్మరణజేసిరి, ఆతిరునామముల నాழ்వార్లువిని మూర్ఛను వదలి స్వస్థచిత్తులయిరియని వక్కాణించుచున్నారు.

‡‡ తీర్ప్పారై యామిని యెజ్ఞనమ్నాడుదుమన్నైమీర్*
ఓర్ప్పాలివ్వొణ్ణుద లుఱ్ఱనన్నోయిదు తేఱినోమ్*
పోర్ప్పాగుతాన్శెయ్ దన్ఱైవరై వెల్విత్తమాయప్పోర్*
తేర్ప్పాగనార్క్కివళ్ శిన్దైతుழாయ్ త్తిశైక్కిన్ఱదే. ౧.

అ॥ అన్నైమీర్ - ఓయమ్మలారా! ఇని - ఇఁకమీఁద, తీర్ప్పారై - (ఈవ్యాధిని)పోఁగొట్టువారిని, యామ్ - మనము, ఎజ్ఞనమ్ - ఎచ్చటపోయి, నాడుదుమ్ - వెతుకుదుము? ఇ - ఈ, ఒళ్ - సుందరమైన, నుదల్ - ముఖముగలయీపె, ఉఱ్ఱ - పొందిన, నల్ - విలక్షణమైన, ఇదు - ఈ, నోయ్ - వ్యాధిని, ఓర్ప్పాల్ - నిరూపణచే (విచారించి), తేఱినోమ్ - తెలిసికొంటిమి, పోర్ - యుద్ధమునకు, పాగు - కావలసిన సంవిధానమును, తాన్ శెయ్దు - తానేచేసి, అన్ఱు - అప్పుడు, ఐవరై - పఞ్చపాణ్డవులను, వెల్విత్త - జయింపఁజేసినవాఁడును, మాయమ్ - ఆశ్చర్యమైన, పోర్ - భారతయుద్ధమందు, తేర్ - అర్జునునియొక్క రథమందు, పాగనార్క్కు- సారథిగానున్నవాఁడునైన శ్రీకృష్ణునిబొందుటకై, ఇవళ్ - ఈపెయొక్క, శిన్దై - మనస్సు, తుழாయ్ - భ్రమించి, తిశైక్కిన్ఱదు - కాంక్షించుచున్నది.

తా॥ ఓసఖియలారా! ఈపెరయొక్క వ్యాధినిట్టిదని విచారించి తెలిసికొంటిమి, అదేమనగా భారతయుద్ధమందు పక్షపాండవులు జయించునటుల వారలకు సకలవిధోపాయములను నేర్పించి తానేయర్జునునికి సారథ్యముజేసి జయమునుఁగలుగఁజేసిన శ్రీకృష్ణునిపైయాశపడి యిట్లుమూర్ఛపోయినది. ఇదిపోవుటకు మీ వ్యాపారము ఉపాయముకాదని ౧.

తిశైక్కిన్ఱదేయివళ్నోయిదుమిక్క పెరున్దెయ్వమ్*
ఇశైప్పిన్ఱిసీరణఙ్గాడు మిళన్దెయ్వమన్ఱిదు*
తిశైప్పిన్ఱియే శఙ్గుశక్కరమెన్ఱివళ్కేట్క*నీర్
ఇశైక్కిఱ్పిరాగిల్ నన్ఱేయిల్పెరుమిదుకాణ్మినే. ౨

ఇవళ్ - ఈపెరయొక్క, నోయ్ - వ్యాధిని, తిశైక్కిన్ఱదు - మీరుభ్రమించుచున్నారు, ఇదు - ఈవ్యాధి, మిక్కపెరుమ్తెయ్వమ్ - మిక్కిలిగొప్పదేవుఁడైన శ్రీకృష్ణునిచేవచ్చినది ఇదు - ఈవ్యాధి, ఇశైప్పిన్ఱి - ఒకసఙ్గతియులేక, నీర్ - మీరు, అణఙ్గాడుమ్ - దెయ్యాలాడుచున్న, ఇళమ్తెయ్వమన్ఱు - క్షుద్రదేవతచేవచ్చినదికాదు. తిశైప్పిన్ఱియే - (వారివారిమాటలనువిని) భ్రమించక, శఙ్గుశక్కరమెన్ఱు - శఙ్ఖచక్రములని, ఇవళ్కేట్క - ఈమెవినునట్లు, నీర్ మీరు, ఇశైక్కిఱ్పిరాగిల్ - చెప్పసమర్థులయితిరేని, నన్ఱే - చక్కగా, ఇల్పెఱుమ్ - జీవించును. ఇదుకాణ్మిన్ - దీనిని ప్రత్యక్షముగాఁజూడుఁడు.

తా॥ఓసఖియలారా! ఈపెరయొక్క వ్యాధియొకటియుండఁగా మీరు మఱియొకటిగా భ్రమించుచున్నారు. ఇదశ్రియఃపతిచేవచ్చిన వ్యాధిగాని క్షుద్రదేవతలచేవచ్చినదికాదు. మీరెవ్వరిమాటనువినక, శ్రియఃపతియొక్క దివ్యాయుధములైన శఙ్ఖచక్రాదులయొక్క తిరునామములనీమెవినునట్లు జపించినయెడల యీమెకీవ్యాధియిప్పుడే తొలఁగును, చూడుఁడని. ౨.

ఇదుకాణ్మినన్నైమీర్ ఇక్కట్టువిచ్చిశొల్కొణ్డు*నీర్
ఎదువానుమ్శెయ్ దఙ్గోర్ కళ్ళుమిఱైచ్చియుమ్తూవేన్మిన్*
మదువార్తుழாయ్ముడి మాయప్పిరాన్ కழల్వాழ్త్తినాల్*
అదువేయివళుత్తనోయ్క్కు మరుమరున్దాగుమే. 3

అ॥ అన్నైమీర్ - ఓయమ్మలారా! ఇదు - ఈసామాటను (చేసి), కాణ్మిన్ - చూడుండు, ఇక్కట్టువిచ్చి - ఈకొఱవస్త్రీయొక్క, శొల్కొణ్డు - మాటనఙ్గీకరించి, నీర్ - మీరు, ఎదువానుమ్శెయ్దు - ఏదైననుజేసి, అఙ్గు - అచ్చట, ఓర్ - హేయమైన, కళ్ళుమ్ - కల్లును, ఇఱైచ్చియుమ్ - మాంసమును, తూవేల్మిన్ - ఉంచవలదు, మదు - తేనెచే, ఆర్ - పూర్ణమైన, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడి - కిరీటమందుగలవాఁడును, మాయమ్ - ఆశ్చర్యభూతుఁడును, పిరాన్ - ఉపకారకుఁడునైనశ్రియఃపతియొక్క, కழల్ - తిరువడికళ్ళను, వాழ్త్తినాల్ - మఙ్గళాశాసనముజేసినయెడల, అదువే - అదియే, ఇవళుత్త - ఈపెపొందిన, నోయ్క్కు - వ్యాధికి, అరు - శ్లాఘ్యమైన, మరున్దాగుమ్ - మందగును.

తా॥ ఓసఖియలారా! నామాటనువినుఁడు. ఈకోఁ అవస్త్రీ చెప్పెడిమాటనువిని యాశ్రీవైష్ణవ గృహమును మాంసాదులచే జెఁగొట్టవలదు. ఈమెదగ్గఱశ్రియఃపతిని మఙ్గళాశాసనము జేసిన యెడల యీరోగము సమూలముగా నశించునని. ౩.

మరున్దాగుమెన్ఱు ఓర్ మాయవలవై శొల్కొణ్డు*నీర్
కరుఞ్జోఱుమ్మఱ్ఱై చ్చెఞ్జోఱుమ్ కళనిఴై త్తెన్బయన్*
ఒరుఙ్గాగవేయులగేఴుమ్ విఴుఙ్గియుమిఴ్న్దిట్ట*
పెరున్దేవన్పేర్శొల్లగిఱ్కి లివళై ప్పెఱుదిరే. ౪.

అ॥ మరున్దాగుమెన్ఱు - మందగునని, అఙ్గు - అచ్చటవచ్చిన, ఓర్ - ఒక, మాయమ్ - వంచకిరాలైన, అలవై - తనయిష్టమువచ్చునట్లుచెప్పుచున్నకోఁ అవస్త్రీయొక్క, శొల్కొణ్డు-మాటను విని, నీర్ - మీరు, కరుమ్శోఱుమ్ - నల్లనియన్నమును, మఱ్ఱై - వేఱైన, శెమ్శోఱుమ్ - ఎఱ్ఱనియన్నమును, కళన్ - అక్షుద్రదేవతాస్థానమందు, ఇఴైత్తు - ఉంచి, ఎన్పయన్ - ఏమిప్రయోజనము, ఉలగేఴుమ్ లోకములేడింటెని, ఒరుఙ్గాగవే - ఒకప్పుడే, విఴుఙ్గి - మ్రింగి, ఉమిఴ్న్దిట్ట - బయలుపఱచిన, పెరుమ్తేవన్ పరదేవతయైన సర్వేశ్వరునియొక్క, పేర్ - తిరునామములను, శొల్లకిఱ్కిల్ - చెప్పసమర్థులయితిరేని, ఇవళై - ఈమెను, పెఱుదిర్ - పొందుదురు.

తా॥ ఓసఖియలారా! ఏదోయొకకోఁ అవస్త్రీతననోటికివచ్చిన యొకమాటచెప్పగాదానిని నమ్మినల్లనియు ఎఱ్ఱనియునైన చిత్రాన్నమునుబెట్టి క్షుద్రదేవతకుఁబూజచేయవలదు దానిచే మీయిష్టమును సిద్ధించదు. సకలజగత్సృష్టి సంహారకారకుఁడైన శ్రియఃపతియొక్క తిరునామములను ఈమెకు వినిపించిన యెడల నిప్పుడే యీమెజీవించునని. ౪.

ఇవళై ప్పెఱుమ్బరిశివ్వణఙ్గాడుదలన్ఱన్నో*
కువళై త్తడఙ్గణుమ్ కోవై చ్చెవ్వాయుమ్బయన్దనళ్*
కవళక్కడాక్కళిఱట్టపిరాన్ తిరునామత్తాల్*
తవళప్పొడికొణ్డు నీరిట్టిడుమిన్ తణియుమే. ౫

అ॥ ఇవళై - ఈమెను, పెఱుమ్పరిశు - పొందుటకు ఉపాయము, ఇవ్వణఙ్గాడుదల్ - ఈ దెయ్యాలాడుట, అన్ఱు - కాదు, అన్నో - అయ్యో! కువళై - నల్లకలువవంటిదియు, తడమ్ - విశాలమైనదియునైన, కణ్ణుమ్ - నేత్రమును, కోవై - దొండపండువలె, శెమ్ - ఎఱ్ఱనైన, వాయుమ్ - అధరమును, పయన్దనళ్ - వాడిపోయినవి, కవళమ్ - కబళముగల, కడా - మదించిన, కళిఱు - కువలయాపీడమును, అట్ట - సంహరించిన, పిరాన్ - శ్రీకృష్ణునియొక్క, తిరునామత్తాల్ - తిరునామములచే, తవళమ్ - పరిశుద్ధమైన, పొడి - (శ్రీవైష్ణవులయొక్కశ్రీపాద) ధూళిని, కొణ్డు - తీసికొనివచ్చి, నీర్ - మీరు, ఇట్టిడుమిన్ - ఉంచుఁడీ, తణియుమ్ - ఈవ్యాధితీరును.

తా॥ ఓసఖియలారా! మీరుదెయ్యాలాడుటచే యీమెయొక్క వ్యాధినివర్తింపదు అంతయేగాక ఈమెయొక్క దేహమింతకంటేచెడిపోవును. గనుక దానినివదలి శ్రీకృష్ణునియొక్క తిరునామములనుజపించి శ్రీవైష్ణవులయొక్క శ్రీపాదధూళిని యీమెయొక్క శరీరమందు జల్లిన యెడల తత్క్షణమందే యీరోగము నశించునని. ౫

తణియుమ్బొழுదిల్లై నీరణజ్గాడుదిరన్నైమీర్*
పిణియుమొழிగిన్ఱదిల్లై ప్పెరుగుమిదువల్లాల్*
మణియిలణినిఱమాయన్ తమరడినీఱుకొణ్డు*
అణియమురుయలిన్ మఱ్ఱిల్లై కణ్డీరివ్వణజ్గుక్కే. ౬

అ॥ అన్నైమీర్ - ఓయమ్మలారా! తణియుమ్బొழுదిల్లై - ఒకక్షణముగూడవిరామము లేక, నీర్ - మీరు, అణజ్గాడుదిర్ - దెయ్యాలాడుచున్నారు, ఇదు - ఈ, పిణియుమ్ - వ్యాధియు, పెరుగుమల్లాల్ - పెఱుగుచున్నదేతప్ప, ఒழிగిన్ఱదిల్లై - నివర్తించలేదు, మణియిల్ - రత్నముకంటె, అణి - సుందరమైన, నిఱమ్ - మేనుగల, మాయన్ - ఆశ్చర్యభూతుఁడైన శ్రియఃపతియొక్క, తమర్ - భక్తులైన భాగవతులయొక్క, అడినీఱు - శ్రీపాదధూళిని, కొణ్డు - తీసికొనివచ్చి; అణియ - అలఙ్కరించునటుల, మురుయలిన్ - ఉద్యోగించినయెడల, ఇవ్వణజ్గుక్కు - దేవతాస్త్రీతోఁబోలినయీపెకు, మఱ్ఱు - దీనితోసమానమైన మఱియొకయుపాయము, ఇల్లై కణ్డీర్ - లేదునుమండీ

తా॥ ఓసఖియలారా! మీరుఎల్లప్పుడును దెయ్యాలాడుటచే నీపెకురోగము పెఱుగుచున్నదేగాని తగ్గలేదు. గనుక దానినివిడిచి శ్రీవైష్ణవులయొక్క శ్రీపాదధూళిని యీపె శరీరమందు జల్లుఁడు. ఇంతకంటె మేలైన ఉపాయమేమియుఁ లేదని. ౬.

అణజ్గుక్కరుమరున్దెన్ఱజ్గోరాడుమ్కళ్ళుమ్బరాయ్*
తుణజ్గైయెఱిన్దు నుమ్దోళ్ కులైక్కప్పడుమన్నైమీర్*
ఉణజ్గల్ కెడ క్కழுదైయుదడాట్టమ్కణ్డెన్పయన్*
వణజ్గిర్గళ్ మాయప్పిరాన్ తమర్వేదమ్ వల్లారైయే. ౭

అ॥ అణజ్గుక్కు - దేవతాస్త్రీతోఁబోలినయీపెకు, అరుమరున్దెన్ఱు - దుర్లభమైనమందని దలంచి, అజ్గు - అచ్చట, ఓర్ - నిషిద్ధమైన, ఆడుమ్ - మేకను, కళ్ళుమ్ - కల్లును, (స్వీకరింపుమని), పరాయ్ - (దేవతాన్తరమును) ప్రార్థించి, తుణజ్గైయెఱిన్దు - చేతులతోతాళముకొట్టుచునృత్యముజేసి, నుమ్ - మీయొక్క, తోళ్ - భుజములు, కులైక్క - అదురునటుల, పడుమ్ - నృత్యముజేయుచున్న, అన్నైమీర్ - ఓయమ్మలారా! ఉణజ్గల్ - వేయించినధాన్యము, కెడ - పాడగునటుల, కழுదై - గాడిదెయొక్క, ఉదడు - నోటియొక్క, ఆట్టమ్ - చలనమును, కణ్డు - చూచి, ఎన్పయన్ - ఏమిప్రయోజనము? మాయప్పిరాన్ - ఆశ్చర్యభూతుఁడైన సర్వేశ్వరునియొక్క, తమర్ - భక్తులై, వేదమ్వల్లారై - వేదార్థమెఱింగిన భాగవతులను, వణజ్గిర్గళ్ - ఆశ్రయించుఁడి.

తా॥ ఓసఖియలారా! ఈపెకురోగము నివర్తించుటకై దేవతాన్తరములకు కల్లుమొదలగు నిషిద్ధపదార్థములనిచ్చి పలుమాఱు నమస్కరించి మీచేతులు విఱుగునటులతాళమువేసికొని నృత్యముజేయుటచే నేమియు ప్రయోజనములేదు. ఎండవేసినపండ్లను తినునప్పుడు చలించుచున్న

గాడిదయొక్క నోటినిజూచుచున్న యెడల యెంతప్రయోజనమో? మీరుసేసెడి వ్యాపారములకుఁ గూడ నంతమాత్రమే ప్రయోజనముగాన యీనిరర్థకపనులనువదలి శ్రీవైష్ణవుల నాశ్రయించిన యెడల యీరోగమిప్పుడే నశించునని. ౬.

వేదమ్వల్లార్గళై క్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరు
ప్పాదమ్పణిన్దు* ఇవళ్ నో యిదుతీర్త్తుక్కొళ్ళాదుపోయ్*
ఏదమ్పఱైన్దల్లశెయ్దు కళ్ళూడుకలాయ్త్తూయ్*
కీదమ్ముఴవిట్టు నీరణఙ్గాడుదల్ కీఴ్మైయే. ౭.

అ॥ వేదమ్ వల్లార్గళైక్కొణ్డు - వేదార్థమెఱిఁగిన భాగవతులద్వారా, విణ్ణోర్ పెరుమాన్ - నిత్యసూరినిర్వాహకుఁడైన శ్రియఃపతియొక్క, తిరుప్పాదమ్ - శ్రీపాదములను, పణిన్దు - నమస్కరించి, ఇవళ్ - ఈపెయొక్క, ఇదునోయ్ - ఈవ్యాధిని, తీర్త్తుక్కొళ్ళాదు - పోగొట్టుకొనక, పోయ్ - (దేవతాన్తరములదగ్గర) వెళ్ళి, ఏదమ్ - నీచమాటలను, పఱైన్దు - చెప్పి, అల్లశెయ్దు - నిషిద్ధకృత్యములనుజేసి, ఊడు - నడుమ, కళ్ - కల్లును, కలాయ్ - కలిపి, తూయ్ - ఉంచి, కీదమ్ - పాటను, ముఴవిట్టు - పాడి, నీర్ - మీరు, అణఙ్గాడుదల్ - దెయ్యాలాడుట, కీఴ్మైయే - తక్కువగదా?

తా॥ శ్రీవైష్ణవులనుభజించి యీపెయొక్క రోగమును నివర్తింపక నిషిద్ధాచరణముల ననుష్ఠించి దేవతాన్తరమును భజించుట మీకు యుక్తముకాదని. ౭.

కీఴ్మైయినాలఙ్గోర్ కీఴ్మగనిట్టముఴవిన్కీఴ్*
నాఴ్మైపలశొల్లి నీరణఙ్గాడుమ్పాయ్కాణ్గిలేన్*
ఏఴ్మైప్పిఱప్పుక్కుమ్ శేమ మిన్నోయ్క్కుమీదేమరున్దు*
ఊఴ్మైయిల్ కణ్ణపిరాన్ కఴల్వాఴ్త్తుమినున్నిత్తే. ౮.

అ॥ కీఴ్మైయినాల్ - నీచకృత్యముచే, కీఴ్మగన్ - నీచజాతివాఁడు, ఇట్ట - కొట్టుచున్న, ముఴవిన్కీఴ్ - వాద్యముకింద, పల - అనేకవిధంబులైన, నాఴ్మై - అసత్యవచనములను, శొల్లి - చెప్పి, నీర్ - మీరు, అణఙ్గాడుమ్ - దెయ్యాలాడుచున్న, పాయ్ - నీచకృత్యములను, కాణ్గిలేన్ - చూడను, ఏఴ్మైప్పిఱప్పుక్కుమ్ - సప్తజన్మములకును, శేమమ్ - క్షేమకరమైయుండును. ఇన్నోయ్క్కుమ్ - ఈవ్యాధికిని, మరున్దు - మందు, ఈదే - ఇదియే, ఊఴ్మైయిల్ - స్వరూపానురూపముగా, కణ్ణపిరాన్ - శ్రీకృష్ణునియొక్క, కఴల్ - తిరువడికళ్ళను, ఉన్నిత్తు - ధ్యానించి, వాఴ్త్తుమిన్ - మంగళాశాసనముజేయుండు.

తా॥ ఒకచండాలుఁడు తప్పెటకొట్టగా దానికణిగియుండి, దేవతాన్తరమందు లేనిగుణముల నారోపించి స్తుతించెడి మీనీచకృత్యము నాకుసహింపదు. మనకెల్లప్పుడును రక్షకమై యీరోగమునకుఁగూడ నివర్తకమైన శ్రీకృష్ణునియొక్క శ్రీపాదములకు మంగళాశాసనము జేయుండు. అదియే మనకు స్వరూపానురూపమని. ౮

ఉన్నిత్తుమత్త్ ఱ్ఱోరు తెయ్వన్దొழாళ్ అవనై యల్లాల్*
నుమ్మిచ్చై శొల్లి నుమ్ తోళ్ కులైక్క ప్పడుమన్నైమీర్*
మన్న ప్పడుమఱై వాణనై వణ్డువరాపది
మన్ననై *ఏత్తుమినేత్తుదలుమ్ తొழுదాడుమే. ౧౦.

అ॥ అవనైయల్లాల్ - శ్రీకృష్ణునితప్ప, మత్త్ ఱ్ఱోరుతెయ్వమ్ - వేఱొక దేవతను, ఉన్నిత్తు - ధ్యానించి, తొழாళ్ - (ఈమె) ఆశ్రయించదు, నుమ్ - మీయొక్క, ఇచ్చై - ఇష్టమును, శొల్లి - చెప్పి, నుమ్ తోళ్ - మీ భుజములు, కులైక్క - చలించునటుల, పడుమ్ - నృత్యము జేయుచున్న, అన్నైమీర్ - ఓయమ్మలారా! మన్న ప్పడుమ్ - అధ్యయనము జేయబడు చున్న, మఱై - వేదములచే, వాణనై - ప్రతిపాదింపఁబడినవాఁడును, వణ్ - సుందరమైన, తువరాపది - ద్వారకకు, మన్ననై - స్వామియునైన శ్రీకృష్ణుని, ఏత్తుమిన్ - స్తుతించుడు. ఏత్తుదలుమ్ - స్తుతించినవెంటనే, తొழுదు - నమస్కరించి ఆడుమిన్ - నృత్యము జేయుండు.

తా॥ దేవతాన్తరమువద్ద మీకోరికను జెప్పుకొని ప్రార్థించుచున్న ఓసఖియలారా! ఈమె శ్రీకృష్ణునితప్ప మఱియొక దేవతనాశ్రయించదు, గనుక సకలవేదప్రతిపాద్యుఁడై ద్వారకాధీశుఁడైన శ్రీకృష్ణుని స్తుతించి యాశ్రయింపుఁడని. ౧౦.

‡‡ తొழுదాడిత్తూమణివణ్ణనుక్కాట్చెయ్దు నోయ్తీర్న్ద*
వழுవాదతొల్ పుగழ் వణ్ కురుగూర్ చ్చడగోపన్ *శొల్
వழுవాదవాయిరత్తుళ్ ఇవై పత్తు వెఱిగళుమ్*
తొழுదాడిప్పాడవల్లార్ తుక్కశీలమిలర్ గళే. ౧౧.

అ॥ తొழுదు - ఆశ్రయించి, ఆడి - నృత్యము జేసి, తూ - నిర్మలమైన, మణివణ్ణనుక్కు - రత్నమువంటికాన్తిగల శ్రియఃపతికి, ఆళ్ శెయ్దు - కైంకర్యము జేసి, నోయ్తీర్న్ద - వ్యాధితీరినవారును, వழுవాద - నాశములేనిదై, తొల్ - స్వాభావికమైన, పుగழ் - కీర్తిగలవారును, వణ్ - సుందరమైన, కురుగూర్ - తిరునగరికి స్వామియునైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్ - సాధించినదియు, వழுవాద - లక్షణమందు తక్కువలేనిదియునైన, ఆయిరత్తుళ్ - వెయ్యి పాశురములలోఁ జేరినదియు, వెఱిగళ్ - దేవతాన్తరభజనమును నిషేధించుచున్నదియునైన, ఇవై పత్తు - ఈపదిపాశురములను, తొழுదు - (సర్వేశ్వరుని) ఆశ్రయించి, ఆడి - నృత్యము జేసి, పాడవల్లార్ - గానము జేయఁదగినవారు, తుక్కమిల - దుఃఖములేని, శీలర్ గళే - స్వభావముగల వారగుదురు.

తా॥ మనోవాక్కాయములచే శ్రియఃపతిని యాశ్రయించిన గొప్పకీర్తిగల నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల ననుసంధించువారి కేదుఃఖమును సంభవించదని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

## ౭.వ తిరువాయ్మొழி.

అవతారిక:— సర్వేశ్వరునియొక్క తిరునామముల సాన్నిధ్యమువిని మూర్ఛనువదలి స్వస్థచిత్తులై శ్రియఃపతిని ప్రత్యక్షముగా సేవింపవలయుననిదలంచి ప్రార్థించుచున్నారు.

* శీలమిల్లాచ్చిఱియనేలుమ్ శెయ్వినైయో పెరిదాల్*
ఞాలముణ్డాయ్ ఞానమూర్త్తి నారాయణా వెన్ఱెన్ఱు*
కాలన్దోఱుమ్యానిరున్దు కైతలైపూశలిట్టాల్*
కోలమేనికాణవారాయ్ కూవియుఙ్గొళ్ళాయే. ౧.

అ॥ ఞాలమ్ - భూమిని, ఉణ్డాయ్ - మింగినవాఁడా! ఞానమూర్త్తి - జ్ఞానస్వరూపుఁడా! నారాయణా - సకలవిధబంధువైనవాఁడా! ఎన్ఱెన్ఱు - అనిపలుమాఱు చెప్పి, కాలన్దోఱుమ్ - ఎల్లప్పుడును, యాన్ - నేను, ఇరున్దు - స్థిరపడియుండి, కై - చేతులను, తలై - శిరస్సునందు చేర్చి, పూశలిట్టాల్ - నమస్కరించినను, కోలమ్ - సుందరమైన, మేని - నీ వ్యవిగ్రహమును, కాణ - నేను సేవించునట్లు, వారాయ్ - వేంచేయవు, కూవియుమ్ కొళ్ళాయ్ - నన్ను పిలిచుకొనను లేవు, శీలమిల్లా - మంచినడత లేని, శిఱియ నేలుమ్ - క్షుద్రుఁడనైనను, శెయ్ - చేసెడి, వినై - పాపములు, పెరిదు - పెద్దవి, ఓ - అయ్యో! ఆల్ - ఆశ్చర్యము.

తా॥ ఓసర్వరక్షకుఁడా! ఓసర్వజ్ఞుఁడా! ఓఆపద్బాంధవా! అని నేనెంతకాలముపిలిచి నిన్ను నమస్కరించినను నాకు సేవసాదించక పోతివి. నన్నైనను నీవద్గర చేర్చుకొనక పోతివి. నేనంత మాత్రము భాగ్యములేని యధముఁడనైతినని. ౧.

కొళ్ళమాళావిన్బవెళ్ళమ్ కోదిలతన్దిడుమ్*ఎన్
వళ్ళలేయో వైయఙ్గొణ్డ వామనావో వెన్ఱెన్ఱు*
నళ్ళిరావుమ్నన్బగలుమ్ నానిరున్దోలమిట్టాల్*
కళ్ళమాయావున్నై యెన్కణ్గాణవన్దీయాయే. ౨.

అ॥ కొళ్ళ - (ఎంతకాలము) అనుభవించినను, మాళా - అంతములేనిదై, కోదిల - నిర్దుష్టంబైన, ఇన్బవెళ్ళమ్ - ఆనన్దసముద్రమును, ఎన్ - నాకు, తన్దిడుమ్-ఇచ్చుచున్న, వళ్ళలేయో - ఉదారుఁడా! వైయమ్-భూమిని, కొణ్డ-తనయధీనముగా జేసికొనిన, ఓవామనా-ఓవామనుఁడా! ఎన్ఱెన్ఱు - అనిపలుమాఱు చెప్పి, నళ్ళిరావుమ్ - అర్ధరాత్రియందును, నన్ పగలుమ్ - ప్రకాశించుచున్న దినములయందును, నాన్ - నేను, ఇరున్దు - ఉండి, ఓలమిట్టాల్ - అఱచినను, కళ్ళమ్ - వంచకుఁడవై, మాయా - ఆశ్చర్యభూతుఁడవైన ఓస్వామీ! ఉన్నై - నిన్ను, ఎన్ - నాయొక్క, కణ్ - నేత్రములచే, కాణ - సేవించునట్లు, వన్దు - వచ్చి, ఈయాయే - ఇవ్వకుండనున్నావు.

తా॥ నాహృదయమందుండి నాకపరిమితానన్దమునుగలుగజేయుచు నాకంటికగుపడకను న్నఓవంచకుఁడా! రేయింబగళ్లు నేనఱచుచున్నను నాకొకక్షణమైనను సేవసాదించక పోతివని.

ఈనిలాదతీవినైగళ్ ఎత్తనై శెయ్దనన్గొల్*
తావివైయమ్ కొణ్డవెన్దాయ్ తామోదరావెన్ఱెన్ఱు*
కూవికూవినెఞ్జురుగి కణ్పనిశోరనిన్ఱాల్*
పావినీయెన్ఱొన్ఱుశొల్లాయ్ పావియేన్ కాణవన్దే. 3.

అ॥ ఈవిలాద - నాశములేని, తీవినైగళ్ - చెడ్డపాపములను, ఎత్తనై - ఎన్ని, శెయ్దనన్గొల్ - చేసితినో? తావి - కొలిచి, వైయమ్ - భూమిని, కొణ్డ - అఙ్గీకరించిన, ఎన్దాయ్ - నాస్వామీ! తామోదరా - దామోదరుఁడా! ఎన్ఱెన్ఱు - అనిపలుమాఱుచెప్పి, కూవికూవి - పిలిచిపిలిచి, నెఞ్జు - హృదయము, ఉరుగి - కరిగి, కణ్పని - కంటినీళ్ళు, శోర - కారునట్లు, నిన్ఱాల్ - ఉన్నను, పావియేన్ - పాపినైననేను, కాణవన్దు - సేవించునట్లువచ్చి, నీ - నీవు, పావి - పాపి, ఎన్ఱు - అనియైనను, ఒన్ఱు - ఒకమాట, శొల్లాయ్ - చెప్పకపోతివి

తా॥ లోకములనుకొలిచిన ఓత్రివిక్రముఁడా! యశోదాదేవిచే గట్టబడిన శ్రీకృష్ణుఁడా! యని నిన్ను పలుమాఱుపిలిచుచు దుఃఖించుచున్నను "నీవుపాపిగనుక నీకు సేవసాదించను" అనియైనను ఒకమాట చెప్పకపోతివి. అట్టిగొప్పపాపము నేనేమిచేసితినోయని. 3.

కాణవన్దెన్ కణ్ముగప్పే తామరైక్కణ్ పిఱఴ*
ఆణిశెమ్బొన్మేనియెన్దాయ్ నిన్ఱరుళాయెన్ఱెన్ఱు*
నాణమిల్లాచ్చిఱుతగైయేన్ నానిఙ్గలఱ్ఱువదెన్*
పేణివానోర్ కాణమాట్టాప్పీడుడైయప్పనైయే. ౪.

అ॥ ఎన్దాయ్ - ఓనాస్వామీ! వానోర్ - నిత్యసూరులు, పేణి - ఆశపడి, కాణమాట్టా - సేవించుటకుదుర్లభుఁడవైన, పీడుడై - గొప్పమహిమగల, అప్పనై - స్వామియైననిన్ను, నాణమిల్లా - సిగ్గులేని, శిఱుతగైయేన్ - క్షుద్రస్వభావముగల, నాన్ - నేను, ఎన్ కణ్ముగప్పే - నాకంటికెదుట, కాణవన్దు - సేవించునట్లువచ్చి, తామరైక్కణ్ - పద్మనేత్రము, పిఱఴ - వికసించి, ఆణిశెమ్బొన్మేని - మంచిపచ్చనిబంగారమువంటి తిరుమేనుగలవాఁడవై, నిన్ఱరుళాయ్ - వేంచేయుమా, ఎన్ఱెన్ఱు - అనిచెప్పి, ఇఙ్గు - ఇచ్చట, అలఱ్ఱువదెన్ - అఱచుటయేమి ప్రయోజనిము.

తా॥ నిత్యసూరులకుఁకూడ సేవించుటకు దుర్లభుఁడవైన ఓశ్రియఃపతీ! అతిక్షుద్రుఁడనైన నేనుసిగ్గులేక, నాయెదుటవచ్చి సేవసాదింపుమా యనియఱచుటచే నేప్రయోజనము లేదని. ౪.

అప్పనేయడలాழியానే యాழ்కడలై క్కడైన్ద
తుప్పనే*ఉన్ తోళ్గళ్ నాన్గుమ్ కణ్డిడక్కూడుఙ్గొలెన్ఱు*
ఎప్పొழுదుమ్ కణ్ణనీర్ కొణ్డావితువర్న్దువర్న్దు*
ఇప్పొழு దేవన్దిడాయెన్ఱేఙ్గినేనొఱ్ఱైయేనే. ౫.

అ॥ అప్పనే-ఓస్వామీ! అడల్-విరోధులను నశింపఁజేసెడిస్వభావముగల, ఆఴియాన్-సుదర్శనముగలవాఁడా! ఆఴ్-గంభీరమైన, కడలై-సముద్రమును, కడైన్ద-చిలికిన, తుప్పనే-బలిష్ఠుఁడా! ఉన్-నీయొక్క, తోళ్ గళ్ నాన్గుమ్-నాలుగుభుజములను, కణ్డుకొళ్వదెన్ఱుకొలో యెన్ఱు-సేవింపవచ్చునోయని, ఎప్పొழుదుమ్-ఎల్లప్పుడును, కణ్ణనీర్ కొణ్డు-బాష్పమును ప్రవహింపజేయుచు, ఆవి-ప్రాణము, తువర్న్దు తువర్న్దు-మిక్కిలియెండిపోయి, ఇవ్వుయిరేన్-చపలుఁడనైయున్న నేను, ఇప్పొழுదే-ఇప్పుడే, వన్దిడాయెన్ఱు-వచ్చిసేవసాదింపుమాయని అపేక్షించి, నోక్కువన్-చూచుచున్నాను.

తా॥ శత్రువులను నశింపఁజేయుటకై సుదర్శనమును శ్రీహస్తమందుధరించిన ఓశ్రియఃపతీ! సముద్రమథనముజేయుచున్న నీభుజములనిప్పుఁడే సేవింపనాశపడి మిక్కిలి దుఃఖించుచు నాచాపల్యముచే నీవెటుపక్క వచ్చుచున్నావోయని నాలుగు ప్రక్కల చూచుచున్నానని. ౫

నోక్కినోక్కియున్నైక్కాణ్బాన్ యానెనదావియుళ్ళే*
నాక్కునీళ్వన్ ఞానమిల్లై నాడోఱుమెన్నుడైయ*
ఆక్కైయుళ్ళుమావియుళ్ళుమల్లపుఱత్తినుళ్ళుమ్*
నీక్కమిన్ఱియెఙ్గుమ్నిన్ఱాయ్ నిన్నైయఱిన్దఱిన్దే. ౬

అ॥ నాడోఱుమ్-ప్రతిదినమును, ఎన్నుడైయ-నాయొక్క. ఆక్కైయుళ్ళుమ్-శరీరమందును, ఆవియుళ్ళుమ్-ఆత్మయందును, అల్ల-అంతకంటెవేరైన, పుఱత్తినుళ్ళుమ్-ఇన్ద్రియములయందును, నీక్కమిన్ఱి-ఎడతెగక, ఎఙ్గుమ్-అన్నివస్తువులలోను, నిన్ఱాయ్-ఉన్న ఓస్వామీ! నిన్నై-నిన్ను, అఱిన్దఱిన్దు-చక్కగాదెలిసికొని, ఉన్నై-నిన్ను, కాణ్బాన్-చూచుటకై, నోక్కినోక్కి-నాలుగుప్రక్కలజూచి, యాన్-నేను, ఞానమిల్లై-(నీవీకంటికగుపడవని) జ్ఞానములేక, ఎనదావియుళ్ళే-నాయాత్మలోనే, నాక్కునీళ్వన్-ఆశబడుచున్నాను.

తా॥ ఓశ్రియఃపతీ! నాశరీరేన్ద్రియప్రాణాదులలో నంతట వ్యాపించియున్న నిన్ను జ్ఞాననేత్రముచే చక్కగానసుభవించిన నేను నీవీకంటిగగుబడవని దెలిసికొనక ఈనేత్రములతోనే సేవింపవలయునని మిక్కిలి యాశపడుచున్నానని. ౭

అఱిన్దఱిన్దు తేఱిత్తేఱి యానెనదావియుళ్ళే*
నిఱైన్దఞానమూర్త్తియాయై నిన్మలమాగవైత్తు*
పిఱన్దుమ్ శెత్తుమ్నిన్ఱిడరుమ్ పేదైమైతీర్న్దొழிన్దేన్*
నఱున్దుழாయిన్కణ్ణియమ్మా నానున్నైక్కణ్డుకొణ్డే. ౮

అ॥ నఱు-పరిమళించుచున్న, తుழாయిన్ కణ్ణి-తిరుత్తుழాయిమాలికగల, అమ్మా-ఓస్వామీ! నాన్-నేను, ఉన్నై-నిన్ను, కణ్డుకొణ్డు-మనస్సుచేసేవించి, అఱిన్దఱిన్దు-(నీవేప్రాప్యుఁడవు ప్రాపకుఁడవు అని) తెలిసికొని, తేఱిత్తేఱి-స్వస్థచిత్తుఁడనై, యాన్-నేను, నిఱైన్ద-పరిపూర్ణమైన, ఞానమూర్త్తియాయై-జ్ఞానస్వరూపుఁడవైననిన్ను,- ఎనదావియుళ్ళే-నాయాత్మయందు, నిన్మలమాగ-సందియములేక స్వచ్ఛముగా, వైత్తు-ఉంచి, పిఱన్దుమ్-జన్మిం

చియు, శెఱ్ఱుమ్ - మరించియు, నిన్ఱు - ఉండి, ఇడరుమ్ - అల్లాడుచున్న, పేదైమై-అజ్ఞానమును, తీర్న్దొழிన్దేన్ - పోగొట్టుకొంటిని.

తా॥ అతిభోగ్యుండవైన ఓ శ్రియఃపతీ! నీవే నాకు ప్రాప్యుఁడవు ప్రాపకుఁడవు అని నిశ్చయించి జ్ఞానస్వరూపుఁడవైననిన్ను నామనస్సునందు స్థిరపఱచి నాసంసారదుఃఖములను బోగొట్టుకొంటినని. ౬.

> కణ్డుకొణ్డెన్ కైగళార నిన్ తిరుప్పాదఙ్గళ్ మేల్*
> ఎణ్డిశైయుముళ్ళపూక్కొణ్డేత్తి యుగన్దుగన్దు*
> తొణ్డరోఙ్గళ్ పాడియాడ చ్చూழ் కడల్ ఞాలత్తుళ్ళే*
> వణ్డుழாయ్ కణ్ణనే వన్దిడగిల్లాయే. ౭.

అ॥ వణ్ - సుందరంబైన, తుழாయ్ కణ్ణి - తిరుత్తుழாయిమాలగల, వేన్దే-ఓస్వామీ!, కణ్డుకొణ్డు - సేవించి, ఎన్ - నాయొక్క, కైగళ్ - చేతులచే, ఆర - పూర్ణముగా, నిన్ - నీయొక్క, తిరుప్పాదఙ్గళ్ మేల్ - శ్రీపాదములమీఁద, ఎణ్డిశైయుముళ్ళ - అష్టదిక్కులలోనున్న, పూ - పుష్పములను, కొణ్డు - సంపాదించి (సమర్పించి). ఏత్తి - స్తుతించి, ఉగన్దుగన్దు-మిక్కిలి సంతోషించి, తొణ్డరోఙ్గళ్ - దాసులమైనమేము, పాడి - గానముజేసి, ఆడ - నృత్యముజేయు నటుల, కడల్ - సముద్రముచే, శూழ் - చుట్టఁబడిన, ఞాలత్తుళ్ళే - భూలోకమందే, వన్దిడకిల్లాయ్ - వచ్చుచున్నావుకావు.

తా॥ తిరుత్తుழாయిమాలికచే నలంకరింపఁబడిన ఓస్వామీ? నిన్ను ప్రత్యక్షముగా సేవించి మాచేతినిండ పుష్పములను దీసికొనివచ్చి నీశ్రీపాదములమీద సమర్పించిస్తోత్రముజేసి ప్రీతిపగవశులై పాడియాడునటుల ఈలోకమందే భక్తులైన మాముందఱ వేంచేయుమాయని ౭.

> ఇడగిలేన్ ఒన్ఱట్టగిల్లేన్ ఐమ్బులన్ వెల్లగిల్లేన్*
> కడవనాగిక్కాలన్దోఱుమ్ పూప్పఱిత్తేత్తగిల్లేన్*
> మడవన్నెఞ్జమ్ కాదల్ కూర వల్వినైయేనయర్ప్పాయ్*
> తడవుగిన్ఱేన్ ఎఙ్గుక్కాణ్బన్ శక్కరత్తణ్ణలైయే. ౮.

అ॥ ఇడ కిలేన్ - (పేదవార్లకు) విచ్చిమివ్వనివాఁడనైతిని, ఒన్ఱుఅట్ట కిల్లేన్ - (దాహముతోవచ్చినవారికి) నీళ్ళుకూడనివ్వనివాఁడనైతిని, ఐమ్బులన్ - పఞ్చేన్ద్రియములను, వెల్ల కిల్లేన్-జయించనివాఁడనైతిని, కడవనాగి - శాస్త్రవశ్యుఁడనై, కాలన్దోఱుమ్-సర్వకాలములయందును, పూ - పుష్పములను, పఱిత్తు - తీసి, (సమర్పించి), ఏత్త కిల్లేన్ - స్తుతించనివాఁడనైతిని. మడమ్-పట్టుదలగల, ఎన్నెఞ్జమ్ - నామనస్సునందు, కాదల్ - ఆశ, కూర - అధికమవుచుండగా, వల్ వినైయేన్ - క్రూరమైనపాపముగలనేను, అయర్ప్పాయ్-భ్రమించినవాఁడనై, శక్కరత్తు-సుదర్శనముగల, అణ్ణలై - స్వామిని, తడవుగిన్ఱేన్ - వెతుకుచున్నాను, ఎఙ్గు - ఎచ్చటను, కాణ్బన్ - సేవించెదను.

తా॥ కర్మజ్ఞానభక్తు లింతమాత్రముకూడ లేనివాఁడనై సర్వేశ్వరుని సేవింపవలయునని యాశించినవాఁడనైన నాకోరిక నెరవేరువిధంబు తెలియుటలేదని. ౮.

శక్కరత్తణ్ణలేయెన్ఱు తాఴ్న్దుకణ్ణీర్ తదుమ్బ*
పక్కమ్నోక్కినిన్ఱు అలర్న్దేన్ పావియేన్ కాణ్గిన్ఱిలేన్*
మిక్కఞానమూర్త్తియాయ వేదవిళక్కినై *ఎన్
తక్కఞానక్కణ్గళాలే కణ్డుతఴువువనే. ౧౦.

అ॥ మిక్క - అతిశయించిన, ఞానమూర్త్తియాయ - జ్ఞానస్వరూపుఁడును, వేద్ - వేదమును, విళక్కినై - తనకు ప్రకాశకముగాఁగలవాఁడునైన సర్వేశ్వరుని, ఎన్ - నాయొక్క, తక్క - తగియున్న, ఞానక్కణ్గళాలే - జ్ఞానదృష్టిచే, కణ్డు - అనుభవించి, తఴువువన్ - కౌఁగలించుకొనినవాఁడనై, శక్కరత్తణ్ణలేయెన్ఱు - చక్రాయుధముగలస్వామీ! యనిపిలిచి, తాఴ్న్దు - నమస్కరించి, కణ్ణీర్ - భాష్పము, తదుమ్బ - కాఱునట్లు, పక్కమ్నోక్కినిన్ఱు - నాలుగుప్రక్కల చూచుచుండి, అలర్న్దేన్ - భ్రమించితిని, పావియేన్ - పాపిష్ఠుఁడనైననేను, కాణ్గిన్ఱిలేన్ - చూడనివాఁడనైతిని.

తా॥ వేదవేద్యుఁడైన సర్వేశ్వరుని భక్తిచే సాక్షాత్కరించిననేను, ఈనేత్రములచే సేవింపవలయుననిగోరి యెటుప్రక్కవచ్చుచున్నాడోయని తిరిగితిరిగి చూచినను అంతమాత్రముభాగ్యములేని నాకంటికగుపడలేదని. ౧౦

‡‡ తఴువినిన్ఱ కాదల్తన్నాల్ తామరైక్కణ్ణన్ తన్నై*
కుఴువుమాడత్తెన్కురుగూర్ మాఱన్శడగోపన్ *శొల్
వఴువిలాదవొణ్డమిఴ్గళ్ ఆయిరత్తుళిప్పత్తుమ్*
తఴువప్పాడియాడవల్లార్ వైగున్దమేఱువరే. ౧౧.

అ॥ తఴువినిన్ఱ - చేరియున్న, కాదల్తన్నాల్ - ప్రీతిచే, తామరైక్కణ్ణన్ తన్నై - పుణ్డరీకాక్షునివిషయమై, కుఴువుమ్ - నిండియున్న, మాడమ్ - తిరుమాళిగలుగల, తెన్ - సుందరమైన, కురుగూర్ - తిరునగరికిస్వామియైన, మాఱన్ - సంసారమునుజయించిన, శడగోపన్ - నమ్మాఴ్వార్లు, శొల్ - సాదించినదియు, వఴువిలాద - భగవద్గుణములయందొకటియు విడువకుండ ప్రతిపాదించునట్టిదియు, ఒణ్ - అర్థమును సులభముగా తెలియచేయునట్టిదియు, తమిఴ్గళ్ - ద్రావిడరూపమైనదియునైన, ఆయిరత్తుళ్ - వేయిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపది పాశురములను, తఴువ - మనస్సులోధరించునట్లు, పాడి - గానముజేసి, ఆడవల్లార్ - నృత్యము చేయదగినవారు, వైగున్దమ్ - శ్రీవైకుణ్ఠమును, ఏఱువర్ - పొందుదురు

తా॥ అతిసుందరంబైన తిరునగరికి నాథులైన నమ్మాఴ్వార్లు మిక్కిలి ప్రీతిచే శ్రియఃపతివిషయమై సాదించిన యీపదిపాశురములను గానముజేయువారు పరమపదమును జేరుదురని. ౧౧

ఆఴ్వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్.

# ౮ - వ, తిరువాయ్మొళి.

అవతారిక — ఇంతయవస్థలోగూడ సర్వేశ్వరుఁడు రాకపోవుటచే వాఁడు తననుపేక్షించెనని తలంచి, వాఁడుపేక్షించిన వస్తువులు మాకుపాదేయంబులుకావని తనవస్తువులలో నిరాశులై యగుచున్నారు.

‡‡ ఏఱాళుమిఱై యోనుమ్ తిశై ముగనుమ్తిరుమగళుమ్*
కూఱాళుమ్తనియుడమ్బన్ కులమ్కులమావశురర్ గళై *
నీఱాగుమ్పడియాగ నిరుమిత్తుప్పడై తొట్ట*
మాఱాళన్ కవరాద మణిమామైకుఱై విలమే. ౧.

అ॥ ఏఱు - వృషభమును, ఆళుమ్ - వాహనముగాగలవాఁడును, ఇఱైయోనుమ్ - ఈశ్వరాభిమానియునైన రుద్రుఁడును, తిశైముగనుమ్ - చతుర్ముఖబ్రహ్మయు, తిరుమగళుమ్ - శ్రీమహాలక్ష్మియు, కూఱు - భాగముగాఁజేసికొని, ఆళుమ్ - వాసముచేయుచున్న, తని - అద్వితీయమైన, ఉడమ్బన్ - తిరుమేనుగలవాఁడును, అశురర్ గళై - అసురులను, కులమ్కులమా-గుంపుగుంపుగా, నీఱాగుమ్పడియాగ - భస్మమగునట్లు, నిరుమిత్తు - సఙ్కల్పించి, పడైతొట్ట - ఆయుధముధరించినవాఁడును, మాఱాళన్-బలిష్ఠుఁడునైన సర్వేశ్వరుఁడు, కవరాద - ఆశించని, మణి - శ్లాఘ్యమైన, మామై - కాన్తిచే, కుఱై విలమ్ - తక్కువవారముకాము. (ఏమి ప్రయోజనము లేదు)

తా॥ ఉత్కృష్టనికృష్టులందరిని తనశరీరమందుంచుకొనిన వాఁడై, అసురసంహారకుఁడైన శ్రియఃపతి యాదరించని సౌందర్యముతో నాకేమియు ప్రయోజనములేదని. ౧

మణిమామైకుఱై విల్లా మలర్ మాదరుఱై మార్బన్*
అణిమాన తడవరై తోళ్ అడలాழி తడక్కైయన్*
పణిమానమ్పిழையామే యడియేనై ప్పణికొణ్డ*
మణిమాయన్ కవరాద మడనెఞ్జాల్ కుఱై విలమే. ౨.

అ॥ మణిమామై - శ్లాఘ్యమైన సౌందర్యమును, కుఱై విల్లా - తక్కువలేక సంపూర్ణముగాగలదై,మలర్ - పుష్పవాసినియైన, మాదర్ - శ్రీమహాలక్ష్మి, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, మార్బన్ - వక్షస్థ్సముగలవాఁడును, అణి - అలఙ్కారమై, మానమ్-దీర్ఘమ్మై, తడమ్-విశాలమై, వరై - పర్వతమువలెబలిష్ఠమైన, తోళ్ - భుజములుగలవాఁడును, అడల్ - యుద్ధోన్ముఖమైన, ఆழி - సుదర్శనమును, తడమ్ - విశాలమై,కైయన్ - శ్రీహస్తమందుగలవాఁడును, పణి - కైంకర్యమురొుక్క, మానమ్ - సమృద్ధి, పిழையామే - తక్కువకాకుండ, అడియేనై - దాసుఁడనైననన్ను, పణికొణ్డ - కైఙ్కర్యమందుజేర్చుకొనినవాఁడును, మణి - శ్లాఘ్యమైన, మాయన్ - ఆశ్చర్యగుణములుగలవాఁడునైన శ్రియఃపతి, కవరాద - అపేక్షించని, మడమ్ - మదృశైన, నెఞ్జాల్ - మనస్సుచే, కుఱైవిలమ్ - ప్రయోజనము లేనివారము.

తా॥ సుందరియైన శ్రీమహాలక్ష్మినిన్ని అందంబులైన యవయవములనున్ను గలవాఁడై నాకు సకలకైఙ్కర్యములనిచ్చిన శ్రియఃపతియుపేక్షించిన మనస్సుచే నాకేమియుపయోగము లేదని ౨.

మడనెఞ్జాల్ కుఱ్ఱవిల్లా మగళ్ తాయ్ శెయ్దోరు పేయ్చ్చి*
విడనఞ్జములై శువైత్త మిగుఞానచ్చిఱుకుழవి*
పడనాగత్తణైక్కిడన్ద పరువరైత్తోళ్ పరమ్బురుడన్*
నెడుమాయన్ కవరాద నిఱైవినాల్ కుఱైవిలమే. ౩.

అ॥ మడనెఞ్జాల్ - మృదువైనమనస్సుచే, కుఱైవిల్లా - తక్కువలేని, తాయ్మగళ్ - తల్లియైనయశోదయొక్క వేషమును, శెయ్దు - వేసికొనివచ్చిన, ఒరుపేయ్చ్చి - ఒకపిశాచియైన పూతనయొక్క, విడనఞ్జమ్ - గొప్పవిషముగల, ములై - స్తన్యమును, శువైత్త - ఆరగించిన, మిగుఞానమ్ - గొప్పజ్ఞానముగల, శిఱుకుழవి - చిన్నబిడ్డయైనవాఁడును, పడన్ - పడములుగల, నాగమ్ - ఆదిశేషుఁడనెడి, అణైక్కిడన్ద - శయ్యమీఁదబవ్వళించినవాఁడును, పరు - బలిసినదియు, వరై - పర్వతమువంటిదియునైన, తోళ్ - భుజములుగలవాఁడును, పరమ్బురుడన్ - పురుషోత్తముఁడును, నెడుమాయన్ - గొప్ప ఆశ్చర్యభూతుఁడునైన శ్రియఃపతి, కవరాద - అపేక్షించని, నిఱైవినాల్ - (స్త్రీత్వ) పూర్తిచే, కుఱైవిలమ్ - తక్కువవారముకాము.

తా॥ చిన్నబిడ్డయైయున్నప్పుడు యశోదావేషమెత్తివచ్చిన పూతనను సంహరించిన శేషశాయియైన పురుషోత్తముఁడుపేక్షించిన నాగూఢాభిప్రాయ మెంతమాత్రమొదగదని. ౩.

నిఱైవినాల్ కుఱైవిల్లా నెడుమ్బణైత్తోళ్ మడప్పిన్నై*
పొఱైయినాల్ములై యణైవాన్ పొరువిడై యేழడర్త్తుగన్ద*
కఱైయినార్ తువరుడుక్కై కడైయావిన్ కழிకోల్కై*
శిఱైయినార్ కవరాదతళిర్ నిఱత్తాల్ కుఱైవిలమే. ౪.

అ॥ నిఱైవినాల్ - పూర్తిచే, కుఱైవిల్లా - తక్కువలేనిదియు, నెడుమ్ - పొడువై, పణై - బలిసియున్న, తోళ్ - భుజములుగలదియు, మడప్పిన్నై - మృదుప్రకృతియునైన నప్పిన్నపిరాట్టియొక్క, ములై - స్తనమును, అణైవాన్ - ఆలింగనముజేసికొనుటకై, పొఱైయినాల్ - క్షమచేత (క్షమించియుండి), పొరు - యుద్ధమునకువచ్చిన, ఏழ் విడై - ఏడువృషభములను, అడర్త్తు - చంపి, ఉగన్ద - సన్తోషించినవాఁడును, కఱైయిన్ - కఱలచే, ఆర్ - నిండి, తువర్ - ఎఱ్ఱనైన, ఉడుక్కై - వస్త్రముగలవాఁడును, కడైయావిన్ - (పాలుపిండుటకై) వెదురుకోలాయిని, కழிకోల్ - (ఆవులను తోలుటకు) కఱ్ఱనున్న, కై - శ్రీహస్తముందుగలవాఁడును, శిఱైయినార్ - ఘంటను నడుమునకట్టుకొనినవాఁడునైన శ్రియఃపతి, కవరాద - ఆశపడని, తళిర్ నిఱత్తాల్ - చిగురువంటివర్ణముచే, కుఱైవిలమ్ - ప్రయోజనము లేనివారము.

తా॥ నప్పిన్నపిరాట్టితో సంశ్లేషించుటకై ఏడువృషభములుజేసిన బాధలను సహించి దానిని జంపినవాఁడును, అడవియందలి పండ్లయొక్క రసములచే మాసిపోయిన వస్త్రముగలవాఁడును, వెదురుకోలాయిని కఱ్ఱను చేతులలోబట్టుకొనియు నడుమునందు ఘంటకట్టుకొనియు ఆవులముందఱ పోవుచున్నవాఁడునైన గోపాలుఁడుపేక్షించిన నాకాన్తిచే నాకేమి యుపయోగముకలేదని. ౪.

తళిర్ నిఱత్తాల్ కుఱై విల్లా త్తనిచ్చిఱై యిల్ విళప్పుత్ ఱ*
కిళిమొழிయాళ్ కారణమా క్కిళరరక్కన్నగరెరిత్త*
కళిమలర్త్తుழாయలజ్గల్ కమழ் ముడియన్ కడల్ ఞాలత్తు*
అళిమిక్కాన్ కవరాద వఱివినాల్ కుఱైవిలమే. ౫

అ॥ తళిర్ నిఱత్తాల్ - స్నిగ్ధవర్ణముచే, కుఱైవిల్లా - తక్కువలేనిదై, తని - క్రూరమైన, శిఱైయిల్ - చెఱలో (అశోకవనికలో) నున్నప్పుడు, విళప్పుత్ ఱ - ఎల్లరచే బొగడదగినదై, కిళిమొழிయాళ్ - చిలుకవంటిమాటలుగలదైన సీతాపిరాట్టియొక్క, కారణమా - నిమిత్తమై, కిళర్ - వర్ధిల్లుచున్న, అరక్కన్ - రావణాసురునియొక్క, నగర్ - లంకాపట్టణమును, ఎరిత్త- దహించినవాఁడును, కళి-తేనెకారుచున్న, మలర్-పుష్పముగల, తుழாయలజ్గల్-తిరుత్తుழாయి మాలచే, కమழ் - పరిమళించుచున్న, ముడియన్ - కిరీటముగలవాఁడును, కడల్ - సముద్రము చేఁజుట్టబడిన, ఞాలత్తు - భూమియందలిప్రాణులయందు, అళిమిక్కాన్ - మిక్కిలిదయగలవాఁ డునైనశ్రియఃపతి, కవరాద-ఆశపడని, అఱివినాల్ - బుద్ధిచే, కుఱైవిలమ్ - తక్కువవారముకాము.

తా॥ సీతాపిరాట్టినిమిత్తమై రావణుని సమూలముగాజంపినవాఁడును, పరమభోగ్యుఁడును, చేతనులయందు మిక్కిలి కనికరముగలవాఁడునైన శ్రియఃపతియుపేక్షించినబుద్ధిచే నాకేమువ యోగములేదని. ౫.

అఱివినాల్ కుఱైవిల్లా వగల్ ఞాలత్తవరఱియ*
నెఱియెల్లా మెడుత్తురైత్త నిఱైఞానత్తొరుమూర్త్తి*
కుఱియమాణురువాగి క్కొడుజ్గోళాల్ నిలజ్గొణ్డ*
కిఱియమ్మాన్ కవరాద కిళరొళియాల్ కుఱైవిలమే. ౬.

అ॥ అఱివినాల్ బుద్ధిచే, కుఱైవిల్లా - తక్కువలేనివారైన, అగల్ ఞాలత్తవర్ - విశాలమైనభూమియందున్న చేతనులు, అఱియ - తెలిసికొనునట్లు, నెఱియెల్లామ్ - కర్మజ్ఞానాద్యుపాయములన్నిఁటిని, ఎడుత్తురైత్త - ఎత్తియుపదేశించినవాఁడును, నిఱైఞానత్తు - అపరిమితజ్ఞానముగలవాఁడును, ఒరుమూర్త్తి - విలక్షణస్వభావముగలవాఁడును, కుఱియ-పొట్టియైన, మాణురువాగి - బ్రహ్మచారివేషమునుధరించి, కొడు - కృత్రిమమైన, కోళాల్ - పరిగ్రహముచే, నిలమ్ కొణ్డ - భూమినిస్వాధీనపఱచుకొనిన, కిఱి - ఉపాయముగల, అమ్మాన్ - స్వామియునైన శ్రియఃపతి, కవరాద - ఆశించని, కిళర్-వర్ధిల్లుచున్న, ఒళియాల్ - తేజస్సుచే, కుఱైవిలమ్ - ప్రయోజనముగలవారముకాము.

తా॥ కర్మజ్ఞానభక్తిప్రపత్తులనుపదేశించిన జ్ఞానాధికుఁడై, చిన్నవిగ్రహముతోనుండి మూడడుగులుయాచించి గొప్పవిగ్రహముతో భూమినిగొలుచుకొనిన వంచకుఁడైనశ్రియఃపతి యనాదరించిన యీతేజస్సుచే నాకేమియుపయోగములేదని. ౬

కిళరొళియాల్ కుఱైవిల్లా వరియురువాయ్ క్కిళర్న్దెழுన్దు*
కిళరొళియవిరణియన దగల్ మార్బమ్ కీణ్డుగన్ద*

వళరొళియకనలాழி వలమ్బురియన్*మణినీల
వళరొళియాన్కవరాద వరివళై యాల్కుఱైవిలమే. ౭.

అ॥ కిళరొళియాల్ - వర్ధిల్లుచున్న తేజస్సుచే, కుఱైవిల్లా - తక్కువలేని, అరియురువాయ్ - నరసింహరూపియై, కిళర్న్దెழున్దు - ఉప్పొంగిలేచి, కిళరొళియ - వర్ధిల్లుచున్న తేజస్సుగల, ఇరణియనదు - హిరణ్యాసురునియొక్క, అగల్మార్బమ్ - విశాలవక్షస్థలమును, కీణ్డిత్తు - చీల్చి, ఉగన్ద - సన్తోషించినవాఁడును, వళరొళియ - వర్ధిల్లుచున్న తేజస్సుగలదియు, కనల్ - నిప్పులుగ్రక్కుచున్నదియునైన, ఆழி - సుదర్శనమును, వలమ్బురియన్ - శ్రీపాఞ్చజన్యమును గలవాఁడును, మణి - శ్లాఘ్యమైన, నీలమ్ - నీలమణివలె, వళర్ - వర్ధిల్లుచున్న, ఒళియాన్ - కాన్తిగలవాఁడునైన శ్రియఃపతి, కవరాద - అపేక్షించని, వరి - విలక్షణమైన, వళైయాల్ - కంకణములచే, కుఱైవిలమ్ - న్యూనతగలవారముకాము.

తా॥ గొప్పతేజస్సుగల నరసింహమై యవతరించి హిరణ్యాసురుని జీల్చిన శఙ్ఖచక్రధరుఁడైన శ్రియఃపతి యుపేక్షించిన కంకణములతో నాకుప్రయోజనములేదని. ౭.

వరివళై యాల్కుఱైవిల్లా ప్పెరుముழక్కాలడఙ్గారై *
ఎరియழలమ్పుగవూది యిరునిలమున్ తుయర్తవిర్త్త*
తెరివరియశివన్పిరమ నమరర్కోన్పణిన్దేత్తుమ్*
విరిపుగழான్కవరాద మేగలై యాల్కుఱైవిలమే. ౮.

అ॥ అడఙ్గారై - తనకణగనిశత్రువులమనస్సులో, ఎరి - జ్వలించుచున్న, అழలమ్ - భయమనెడినిప్పు, పుగ - ప్రవేశించునట్లు, వరి - గీతలుగల, వళైయాల్ - శఙ్ఖముచేగలిగిన, కుఱైవిల్లా - తక్కువలేని, పెరు - గంభీరమైన, ముழక్కాల్ - శబ్దముచే, ఊది - ఊది, మున్ - పూర్వకాలమందు, ఇరు - విశాలమైన, నిలమ్ - భూమియొక్క, తుయర్ - భారమును, తవిర్త్త - పోఁగొట్టినవాఁడును, తెరివరియ - లోకులకుసుజ్ఞేయుండనని యభిమానించియున్న, శివన్ - రుద్రుఁడును, పిరమన్ - బ్రహ్మయు, అమరర్కోన్ - దేవేన్ద్రుఁడును, పణిన్దు - నమస్కరించి, ఏత్తుమ్ - స్తుతింపఁదగినవాఁడును, విరి - అంతటవ్యాపించియున్న, పుగழాన్ - కీర్తిగలవాఁడునైనశ్రియఃపతి, కవరాద - ఆశబడని, మేగలైయాల్ - మొలనూలుచే, కుఱైవిలమ్ - తక్కువవారముకాము.

తా॥ దుర్యోధనాదులు భయపడి నశించునట్లు శ్రీపాఞ్చజన్యమునూది భూభారమును బోఁగొట్టినవాఁడును, బ్రహ్మరుద్రాదులచేఁబొగడదగిన కల్యాణగుణమునుగలవాఁడునైనశ్రియఃపతి యనాదరించిన మొలనూలు నాకేప్రయోజనమున కొదగదని. ౮.

మేగలై యాల్కుఱైవిల్లా మెలివుర్ఱ ఎగలల్గుల్*
పోగమగళ్పుగழ్త్తన్దై విఱల్వాణన్పుయమ్తుణిత్తు*
నాగమిశై త్తుయిల్వాన్పోల్ ఉలగెల్లామ్నన్గొడుఙ్గ*
యోగణై వాన్కవరాద వుడమ్బినాల్కుఱైవిలమే. ౯.

అ॥ మేగలైయాల్ - మొలనూలచే, కుఱైవిల్లా - తక్కువలేనిదియు, (అలంకరింపబడిన దియు), మెలివుఱ్ఱ - మృదుస్వభావముగలదియు, అగల్-విశాలమైన, అల్ గుల్ - కటిప్రదేశముగలదియు, పోగమ్ - భోగయోగ్యరాలునైన, మగళ్ - ఉషయనెడికన్యకకు, పుగళ్ - కీర్తిగల, తన్దై - తండ్రియు, విఱల్ - బలిష్ఠుడునైన, వాణన్-బాణాసురునియొక్క, పుయమ్- భుజములను, తుణిత్తు - ఛేదించి, నాగమిశై - ఆదిశేషునిమీఁద, తుయిల్వాన్ పోల్ - నిదురపోవునట్లు, ఉలగెల్లామ్ - లోకమంతయు, నన్గు - చక్కఁగా, ఒడుఙ్గ - తనను జేరునట్లు, యోగు - యోగనిద్రను, అణైవాన్ - పొందినవాఁడునైన శ్రియఃపతి, కవరాద ఆశించని, ఉడమ్బినాల్- శరీరముచే, కుఱైవిలమ్ - ప్రయోజనముగలవారముకాము.

తా॥ ఉషకు తండ్రియైన బాణాసురునియొక్క వెయ్యిభుజములను ఛేదించినవాఁడును, శేషశయ్యమీఁద బవ్వళించి జగద్రక్షణోపాయమును యోచించుచున్నవాఁడునైన శ్రియఃపతి సమ్మతించని యీశరీరముతో నాకుపనిలేదని. ౯.

ఉడమ్బినాల్ కుఱైవిల్లా వుయిర్ పిరిన్దమలైత్తుణ్డమ్*
కిడన్దనపోల్ తుణిపలవా వశురర్ కుఴామ్తుణిత్తుగన్ద*
తడమ్బునలశడైముడియన్ తనియొరుకూఱమర్న్దుఱైయుమ్*
ఉడమ్బుడైయాన్ కవరాద వుయిరినాల్ కుఱైవిలమే. ౧౦.

అ॥ ఉయిర్ - ప్రాణముతో, పిరిన్ద - వేఱుపడిన, (చచ్చిన), మలైత్తుణ్డమ్ - పర్వతఖండము, కిడన్దనపోల్ - ఉన్నట్టువలెనున్న, ఉడమ్బినాల్ - శరీరముచే, కుఱైవిల్లా - తక్కువలేనివారైన (గొప్పశరీరముగల), అశురర్ కుఴామ్-అసురులగుంపును, పలతుణి-పలతునుకలుగా, తుణిత్తు - తుండించి, ఉగన్ద - సంతోషించినవాఁడును, తడమ్ - విస్తీర్ణమైన, పునల-జలముగల గంగను, శడై - జటను, ముడియన్ - శిరస్సునందుగల రుద్రుఁడు, తని - వేఱుగా, ఒరుకూఱు- ఒకభాగమునందు, అమర్న్దు - అమరియుండి, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్న, ఉడమ్బుడైయాన్ - శరీరముగలవాఁడునైన శ్రియఃపతి, కవరాద - అపేక్షించని, ఉయిరినాల్-ఆత్మచే, కుఱైవిలమ్ - ప్రయోజనముగలవారముకాము.

తా॥ పర్వతములవంటి రక్కసులను తునకతునకలుగా జేసినవాఁడును. రుద్రుని తనశరీరమందుంచుకొని రక్షించువాఁడునైన శ్రియఃపతి యుపేక్షించిన నాయాత్మతో నేవిధమైన ఉపయోగములేదని. ౧౦.

‡‡ ఉయిరినాల్ కుఱైవిల్లా వులగేழ్ తన్నుళ్ ఒడుక్కి*
తయిర్ వెణ్ణెయుణ్డానై త్తడఙ్గురుగూర్ చ్చడగోపన్*
శెయిరిల్ శొల్లిశై మాలై యాయిరత్తుళిప్పత్తాల్*
వయిరమ్ శేర్ పిఱప్పఱుత్తు వైగున్దమ్ నణ్ణువరే. ౧౧.

అ॥ ఉయిరినాల్ - ప్రాణులచే, కుఱైవిల్లా - తక్కువలేని (సమృద్ధమైన), ఏழులగు - సప్తలోకములను, తన్నుళ్ - తనలో, ఒడుక్కి - [illegible], తయిర్ - పెరుగును,

వణ్డైయ్ - వెన్నమున్న, ఉణ్డాన్ై - ఆరగించువాఁడునైన శ్రియఃపతి విషయమై, శడమ్ - విశాలమైన, కురుగూర్ - తిరునగరికి నాయకులైన, శడగోపన్-నమ్మాழ்వార్లు, శొల్-ప్రసాదించిన వియు, శెయిరిల్ - దోషములేనివియును, ఇశై - గానముతోగూడినవియునైన, మాలై-శబ్దసందర్భరూపములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తాల్ - ఈపదిపాశురములచే, వయిరమ్ శేర్ - దార్ఢ్యముగల, పిఱప్పు - సంసారమును, అఱుత్తు - ఛేదించి, వైగున్దమ్ - శ్రీవైకుణ్ఠమును, నణ్ణువర్ - పొందుదురు.

తా॥ ప్రాణులచే నిండియున్న సప్తలోకములను గాపాడినవాఁడును, గోపికలయొక్క నవనీతాదుల నారగించినవాఁడునైన శ్రియఃపతివిషయమై నమ్మాழ்వార్లుసాదించిన యీపదిపాశురముల నధ్యయనముజేయువారు సంసారమును వదలి పరమపదమును బొందుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౯ - వ తిరువాయ్మొழி.

—∘◊∘—

అవతారిక:—భగవంతుని లభించక దుఃఖించుచున్న నమ్మాழ்వార్లు, భగవద్విముఖులైన సంసారుల సహవాసమును సహింపక, ఓస్వామీ! నీవిశ్లేషమును సహించినను సంసారులసహవాసమసహ్యమైయున్నదిగాన నీవునాశరీరమును శీఘ్రముగాబోగొట్టవలయునని ప్రార్థించుచున్నారు.

⁂ నణ్ణాదార్ ముఱువలిప్ప నల్లుఱ్ఱార్ కరైన్దేఙ్గ*
ఎణ్ణారాత్తుయర్విళైక్కుమ్ ఇవైయెన్న వులగియఱ్కై*
కణ్ణాళా కడల్ కడైన్దాయ్ ఉనకழ்ఱ్కే వరుమ్బరిశు*
తణ్ణావాదడియేనై ప్పణికణ్డాయ్ శామాఱే. ౧

అ॥ నణ్ణాదార్ - శత్రువులు, ముఱువలిప్ప - నవ్వునట్లును, నల్ - అనుకూలులైన, ఉఱ్ఱార్ - బంధువులు, కరైన్దు - మనస్సుకరిగి, ఏఙ్గ - దుఃఖించునట్లును, ఎణ్ణారా - తలంచుటకశక్యమైన, (అవధిలేని) తుయర్ - దుఃఖములను, విళైక్కుమ్ - కలుగజేసెడి, ఉలగు-లోకములయొక్క, ఇవై - ఈ, ఇయఱ్కై - స్వభావము, ఎన్న - ఎట్టిది, కణ్ణాళా - దయావంతుఁడా! కడల్ - సముద్రమును, కడైన్దాయ్ - చిలికినవాఁడా! ఉనకழ்ఱ్కే - నీతిరువడిఁయందే, వరుమ్బరిశు - వచ్చిచేరునట్లు, తణ్ణావాదు - విలంబముజేయక, అడియేనై - దాసుఁడనైననాకు, శామాఱు - మరణముబొందువిధమును, పణికణ్డాయ్ - చెప్పుమా.

తా॥ ఓశ్రియఃపతీ! ఈలోకమందొకని కొకవిపత్తు సంభవించినయెడల వానిని కనికరించక వానిశత్రువులు సన్తోషించుచున్నారు బంధువులు దుఃఖించుచున్నారు ఇట్టి యపారదుఃఖములయందు మునిగియున్న యీసంసారమందునిక నాకసహ్యమైయున్నది. గాన పరమదయాళువైన నీవునాసంసారమును శీఘ్రముగాబోగొట్టి నీశ్రీపాదములయందుఁ జేర్చుకొనవలయును. ౧.

శామాఱుఙ్కెడుమాఱుమ్ తమరుఱ్ఱార్ తలై త్తలై ప్పెయ్దు*
ఏమాఱిక్కిడన్దలఱ్ఱు మివై యెన్న వులగియఱ్కై*
ఆమాఱొన్ఱఱియేన్ నా నరవణై యాయమ్మానే*
కూమాఱేవిరై కణ్డా యడియేనై క్కుఱిక్కొణ్డే. ౨.

అ॥ శామాఱుమ్ - చచ్చువిధమును, కెడుమాఱుమ్ - చెడిపొయ్యెడివిధమును (చూచి), తమర్ - జ్ఞాతులును, ఉఱ్ఱార్ - బంధువులును, తలైత్తలైప్పెయ్దు - పైపైబడి, ఏమాఱి - దుఃఖించి, కిడన్దు - ఉండి, అలఱ్ఱుమ్ - అఱచుచున్న, ఉలగు - లోకముయొక్క, ఇవై - ఈ, ఇయఱ్కై - స్వభావము, ఎన్న - ఎట్టిది ఆమాఱు - ఈదుఃఖముబోగొట్టెడివిధము, ఒన్ఱు - ఒకటిని, నాన్ - నేను, అఱియేన్ - ఎఱుఁగలేను. అరవణైయాయ్ - అనన్తశాయివైన, అమ్మానే - ఓస్వామీ! కుఱిక్కొణ్డు - నాదుఃఖనివృత్తికుపాయమునువిచారించి, అడియేనై - దాసుఁడనైననన్ను, కూమాఱు - నీవద్దకిపిలుచుకొనువిధమందు, విరై కణ్డాయ్ - త్వరపడుమా.

తా॥ ఓఅనన్తశాయీ! ఒకనికి మరణముసంభవించినను, ఐశ్వర్యమునశించినను దానినిజూచి వానిబంధువులందరు మిక్కిలి దుఃఖించుదురు. ఇట్టి దుఃఖాకరమైన సంసారమందు నేనుండలేను గాన శీఘ్రముగనే నన్ను నీవద్ద చేర్చుకొనుమా యని. ౨.

కొణ్డాట్టుఙ్కులమ్బునైవుమ్ తమరుఱ్ఱార్ విழுనిదియుమ్*
వణ్డార్ పూఙ్గుழలాళుమ్ మనై యొழிయవుయిర్మాయ్దల్*
కణ్డాఱ్ఱేనులగియఱ్కై కడల్వణ్ణా* అడియేనై
పణ్డేపోల్ కరుదాదున్నడిక్కే కూయ్ప్పణికొళ్ళే. 3.

అ॥ కొణ్డాట్టుమ్ - శ్లాఘను, కులమ్బునైవుమ్ - అభిజాత్యమును, తమర్ - జ్ఞాతులను, ఉఱ్ఱార్ - బంధువులను, విழு - తానేవచ్చుచున్న, నిదియుమ్ - నిధిని(సమ్పత్తును), వణ్డు - తుమ్మెదలచే, ఆర్ - నిండియున్న, పూ - పుష్పములచేనలఙ్కరింపఁబడిన, కుழలాళుమ్ - కొప్పుగలభార్యను, మనై - గృహమ్మును, ఒழிయ - ఇవన్నిఁటినివదలి, ఉయిర్ మాయ్దల్ - ప్రాణముపోవడమనెడి, ఉలగియఱ్కై - లోకస్వభావమును, కణ్డు - చూచి, ఆఱ్ఱేన్ - సహింపను. కడల్వణ్ణా - సముద్రమువంటివర్ణముగల ఓశ్రియఃపతీ! అడియేన్ - దాసుఁడనైననన్ను, పణ్డేపోల్ - ముఁదువలె, కరుదాదు - ఎంచక, కూవి - పిలుచుకొని, ఉన్నడిక్కే - నీశ్రీపాదముందే, పణికొళ్ - కైఙ్కర్యమును స్వీకరింపుము.

తా॥ ఓశ్రియఃపతీ! భార్యాపుత్రగృహక్షేత్ర ధనాదిసమస్తములను వదలి చచ్చిపోవుచున్న లోకస్వభావమును నేనుజూడలేనుగాన శీఘ్రముగనే నీశ్రీపాదముందుఁ బరిచర్యచేయునటుల నన్నఙ్గీకరింపుమా యని. 3.

కొళ్ళెన్ఱుకిళర్ న్దెழுన్ద పెరుఞ్జెల్వమ్ నెరుప్పాగ*
కొళ్ళెన్ఱుతమమూడుమ్ ఇవై యెన్న వులగియఱ్కై*

వళ్ళలేమణివణ్ణా వునకళ్లిత్కైవరుమ్బరిశు*
వళ్ళల్ శెయ్‌దడియేనై యునదరుళాల్వాఙ్గాయే. ౪.

అ॥ కొళ్ ఎన్ఱు - అజ్గీకరింపుమని, కిళర్న్దు - వృద్ధిబొంది, ఎழுన్ద-వచ్చిన, పెరుమ్ శెల్వమ్-గొప్పఐశ్వర్యము, నెరుప్పాగ - నిప్పువలెబాధకరమైయుండగా, కొళ్ ఎన్ఱు-అజ్గీకరింపుమనియొకడు వేడినయెడల, తమమ్ - అజ్ఞానము, మూడుమ్ - కప్పుచున్న, ఇవై - ఈ, ఉలగియఱ్కై-లోకస్వభావము, ఎన్న - ఎట్టిది? వళ్ళలే - ఉదారుఁడా! మణివణ్ణా - శ్లాఘ్యమైనకాన్తిగలవాఁడా! ఉనకళ్లిత్కై - నీతిగువడియుండే, వరుమ్బరిశు - వచ్చిచేరునట్లు, వళ్ళల్ శెయ్‌దు - ఔదార్యమునుబ్రకటింపఁజేసి, అడియేనై - దాసుఁడనైననన్ను, ఉనదరుళాల్ - నీకృపచే, వాఙ్గాయే - స్వీకరింపుమా.

తా॥ సుందరుఁడవైన ఓ శ్రియఃపతీ! ఎంతగొప్ప ధనమైనను తనంతటతా నేవచ్చినప్పటికిన్ని అది రత్నణయందును సెలవులయందును మిక్కిలిదుఃఖమును గలుగజేయుచున్నదని దెలిసియున్నను అజ్ఞానముచే మఱల దానినేకోరుచున్న లోకస్వభావము నాకుఁబట్టలేదు. గాన నీయౌదార్యగుణముచే నన్ను శీఘ్రముగా స్వీకరింపుమాయని. ౪.

వాఙ్గునీర్ మలరులగిల్ నిఱ్పనవుమ్తిరివనవుమ్*
ఆఙ్గుయిర్ గళ్ పిఱప్పిఱప్పు ప్పిణిమూప్పాల్ తగర్ప్పుణ్ణుమ్*
ఈఙ్గిదన్మేల్ వెన్నరగ మివైయెన్నవులగియఱ్కై*
వాఙ్గెనైనీమణివణ్ణా వడియేనై మఱుక్కేలే. ౫.

అ॥ వాఙ్గు - చుట్టుకొనియున్న, నీర్ - జలముగల, మలర్ - నాభికమలమందుబుట్టిన, ఉలగిల్ - లోకమందలి, నిఱ్పనవుమ్ - స్థావరములును, తిరివనవుమ్ - జంగమములునైన, ఆఙ్గు - ఆవస్తువులలోనున్న, ఉయిర్ గళ్ - ప్రాణులు, ఈఙ్గు - ఈలోకమందు, పిఱప్పు - జన్మము, ఇఱప్పు - మరణము, పిణి - వ్యాధి, మూప్పాల్ - వార్ధకమువీనిచే, తగర్ప్పుణ్ణుమ్ - బాధగడుదురు, ఇదన్మేల్ - దీనితరువాత, వెమ్ - క్రూరమైన, నరగమ్ - నరకమునుబొందుదురు, ఇవై - ఈ, ఉలగియఱ్కై - లోకస్వభావము, ఎన్న - ఎట్టిది. (గాన) మణివణ్ణా - శ్లాఘ్యమైనకాన్తిగలఓస్వామీ! ఎనై - నన్ను, వాఙ్గు - స్వీకరింపుము. అడియేనై - దాసుఁడనైననన్ను, మఱుక్కేలే - మఱచిపోవకు సుమా?

తా॥ ఈలోకమందలిప్రాణులు ఇచ్చటనున్నవఱకు జన్మమరణజరావ్యాధులచే బాధబడియు తరువాత నరకమునుబొందియు ఎప్పుడును దుఃఖితులైయేయుందురు. వీరిని నేను చూడజాలను గాన నన్ను మఱవక స్వీకరింపుమాయని. ౫.

మఱుక్కివల్వలైప్పడుత్తిక్కుమైత్తిట్టుక్కొన్ఱుణ్బర్*
అఱప్పొరుళై యఱిన్దోరారివై యెన్నవులగియఱ్కై*
వెఱిత్తుళవముడియానే వినైయేనై యునక్కడిమై*
అఱక్కొణ్డాయ్*ఇనియెన్నారముదే కూయరుళాయే. ౬.

అ॥ మఱుక్క - భ్రమపఱిచి, వల్ - కఠినమైన, వళై - పాశమందు, పడుత్తి - దొఱుకు కొనునట్లుచేసి, కుమైత్తిట్టు - బాధించి, కొన్ఱు - చంపి, ఉణ్బర్ . వానిసొమ్మనుభుజింతురు. అఱమ్ - ధర్మమైన, పొరుళై - ఉపాయమును, అఱిన్దు - తెలిసికొని, ఓరార్ - అనుసంధించరు. ఇవై - ఈ, ఉలగియఱ్కై - లోకస్వభావము, ఎన్న - ఎట్టిది. (గాన) వెఱి - పరిమళించు చున్న, తుళవమ్ - తులసీమాలను, ముడియానే - కిరీటమందుగలవాఁడా? విసైయేనై - పాపియైననన్ను, ఉనక్కు - నీకు, ఉఱ - పూర్ణముగా, అడిమైకొణ్డాయ్-దాస్యపఱుచుకొంటివి. ఎన్నారముదే - శాకమృతమువలె భోగ్యభూతుఁడా! ఇని - ఇఁకమీద, కూయరుళాయే - పిలుచుకొనుమా.

తా॥ ఒకనికి ధనమున్నయెడల వానివద్దకువెళ్ళి నీయింటికి దొంగలువచ్చుచున్నారని చెప్పి భయపఱిచి వానిని దనయింటికిదీసికొనివచ్చి పలుమాటలచే తనకు వశపఱచుకొని యాధనమును దానుదీసికొని తరువాత దానిని వానికివ్వక బాధబెట్టుచు ధర్మమార్గమునెఱుఁగక కొంతకాలములో వానిని జంపుదురు. ఇట్టియీలోకరీతి నాకురుచించదు గాన ఓస్వామీ! నన్నిదివఱకేదాస్య పఱుచుకొంటివి. ఇఁక నీవద్ద నన్ను పిలుచుకొనుమాయని. ౬.

ఆయేయివ్వులగత్తు నిఱ్పనవుమ్తిరివనవుమ్*
నీయేమత్ త్రొరుపొరుళుమిన్ఱి నీనిఱ్ఱమైయాల్
నోయేమూప్పిఱప్పిఱప్పు ప్పిణియేయెన్ఱివై యొழிయ*
కూయేకొళ్ళడియేనై క్కొడువులగమ్కాట్టేలే. ౭.

అ॥ మత్ త్రొరుపొరుళుమ్-నీకుశరీరముకానియొకవస్తువు, ఇన్ఱియే - లేకనే, ఇవ్వులగత్తు-ఈలోకమందలి, నిఱ్పనవుమ్ - స్థావరమునకును, తిరివనవుమ్ - జఙ్గమమునకును, నీయే - నీవే, ఆయ్ - అన్తరాత్మవై, నిఱ్ఱమైయాల్ - ఉండుట చేతను, నీయే - సమస్తమునకు నిర్వాహకుఁడవైననీవే, నోయ్ - మనోవ్యాధి, మూప్పు - వార్ధకము, పిఱప్పు - జన్మము, ఇఱప్పు-మరణము, పిణి - శరీరవ్యాధి, ఎన్ఱివై - అనెడివీనిని, ఒழிయ - నశింపజేసి, అడియేనై - దాసుని, కూయే కొళ్ - పిలుచుకొనుము, కొడు - క్రూరమైన, ఉలగమ్ - లోకమును, కాట్టేల్ - నాకుచూపించకుండుండుమా.

తా॥ ఓ శ్రియఃపతీ! సకలజగదన్తర్యామియైన నీవునాయొక్క జన్మమరణజరావ్యాధులను బోగొట్టి యీభయఙ్కరమైన లోకమందుంచక నీవద్ద పిలుచుకొనుమాయని. ౭.

కాట్టినీకరన్దుమిழ்మ్ నిలనీర్ తీవిశుమ్బుకాల్*
ఈట్టనీవైత్తమైత్త విమైయోర్వాழ்తనిముట్టై*
కోట్టైయినిల్కழிత్తెన్నై యున్కొழுఞ్జోదియుయరత్తు*
కూట్టరియతిరువడిక్కళెఞ్జాన్ఱుకూట్టుదియే. ౮.

అ॥ నీ - నీవు, కాట్టి - సృజించి చూపించి, కరన్దు - (ప్రళయమందు తనయుదరములో) దాచి, ఉమిழ்మ్ - బయలుపఱుచుచున్న, నిలన్ - భూమి, నీర్ - జలము, తీ - అగ్ని, విశు

మ్బు - ఆకాశము, కాల్ - గాలి, (వీనిని), ఈట్టి - గుంపుగాజేర్చి, నీ - నీవు, వైత్తమైత్త - స్థాపించియుంచినదియు, ఇమైయోర్ - దేవతలు, వాழ் - సుఖముగా వాసముజేయునట్టిదియు నైన, తని - విలక్షణమైన, ముట్టై - అణ్డమనెడి, కోట్టైయినిల్ - కోటనుంచి, కழித్తు - విడిపించి, ఎన్నై - నన్ను, ఉన - నీయొక్క, కొழுஞ్జోది - మిక్కిలితేజోమయమైన, ఉయరత్తు మేలైనపరమపదమందలి, కూట్టరియ - పొందుటకశక్యమైన, తిరువడిక్కీழ் - శ్రీపాదమందు, ఎఞ్ఞాన్ఱు - ఎప్పుడు, కూట్టుది - పిలుచుకొనపోతావు.

తా॥ నీచే రక్షింపబడినదై, పృథివ్యాదిపంచభూతాత్మకమై బ్రహ్మాదులకు వాసస్థానమై యథేచ్ఛగాపోవుటరావుటకునశక్యమై కోటవలెనున్న యీయాండమునుంచి నన్నువిడిపించి యప్రమేయతేజోమయమైన పరమపదమందలి నీశ్రీపాదములక్రింద నెప్పుడుచేర్చుకొనెదవోయని. ౮.

కూట్టుదినిన కురైకழల్గళ్ ఇమైయోరుమ్‌తొழுవగై శెయ్‌దు*
ఆట్టుదినీయరవణైయాయ్ అడియేనుమ్అఃదఱివన*
వేట్కైయెల్లామ్‌విడుత్తెన్నై యున తిరువడియే శుమన్దుழల*
కూట్టరియతిరువడిక్కీழ் కూట్టినై నాన కణ్డేనే. ౯.

అ॥ నిన - నీయొక్క, కురై - (ఆభరణములచే) శబ్దించుచున్న, కழల్గళ్ - తిరువడి కళ్ళయందు, కూట్టుది-(నీకిష్టమువచ్చినవారిని) చేర్చుకొనెదవు. (నీకిష్టములేనివారిని), ఇమైయోరుమ్ - దేవతలైనవారినిగూడ, తొழுవగై శెయ్‌దు - ఆశ్రయించకుండుండునట్లుజేసి, నీ-నీవు, ఆట్టుది-భ్రమింపజేసెదవు. అరవణైయాయ్-ఓఅనన్తశాయీ! అడియేనుమ్-దాసుండనైననేనుగూడ, అఃదు - ఆవిధమును, అఱివన - ఎఱుఁగుదును, వేట్కైయెల్లామ్ - సంసారసంబన్ధమన్నిఁటిని, విడుత్తు - విడిపించి, ఎన్నై - నన్ను, ఉన తిరువడియే - నీశ్రీపాదములనే, శుమన్దు - ధరించి, ఉழల - సంచరించునట్లు, కూట్టరియ - పొందుటకశక్యమైన, తిరువడిక్కీழ் - శ్రీపాదమందు, కూట్టినై - చేర్చుకొంటివి, నాన - నేను, కణ్డేన - సేవించితిని.

తా॥ ఓశ్రియఃపతీ! నీకిష్టమువచ్చినవారిని నీశ్రీపాదమందు జేర్చుకొనెదవనియు, ఇష్టములేనివారినిజేర్చుకొనవనియు నీస్వభావమును నేనెఱుఁగుదును నాసంసారతాపమును బోగొట్టుటకై నాశిరస్సుమీద నీతిరువడికళ్ళనుంచి యప్రాకృతదివ్యవిగ్రహముతో నాకిప్పుడు సేవసాదింపగా నేను సేవించి కృతార్థుఁడనైతినని. ౯.

కణ్డుకేట్టుఱ్ఱుమోన్దుణ్డుழలు మైన్దురువి
కణ్డవిన్బమ్ తెరివరియ వళవిల్లాచ్చిఱ్ఱిన్బమ్*
ఒణ్డొడియాళ్ తిరుమగళుమ్ నీయుమేనిలానిఱ్ప*
కణ్డశదిర్ కణ్డొழிన్దేన్ అడైన్దేనున్ తిరువడియే. ౧౦.

అ॥ ఒణ్ - సుందరమైన, తొడియాళ్ - కంకణముగల, తిరుమగళుమ్-శ్రీదేవియు,నీయుమే-నీవును, నిలానిఱ్ప - వేంచేసియున్నట్లు, కణ్డ - సఙ్కల్పించిన, శదిర్ - చాతుర్యమును, కణ్డు-సేవించి, కణ్డు - చూచియు, కేట్టు - వినియు, ఉఱ్ఱు - స్పృశించియు, మోన్దు - ఆఘ్రాణిం

చియు, ఉణ్ణు - భుజించియు, ఉழలుమ్ - తిరుగుచున్న, ఐమ్కరువి-పఞ్చేన్ద్రియములచే, కణ్డ-అనుభవింపదగిన, ఇన్బమ్-సుఖమునున్ను, తెరివరియ - తెలిసికొనుటకశక్యమైనదియు, అళవిల్లా - అవధిలేనిదియు (సంసారసుఖముకంటెగొప్పదియు), శిఱు - (భగవత్ప్రాప్తికంటె) అల్పమైనది యున్నైన, ఇన్బమ్ - కైవల్యసుఖమునున్ను, ఒழிన్దేన్-వదలితిని. ఉన్-నీయొక్క, తిరువడియై-శ్రీపాదమును, అడైన్దేన్ - పొందితిని.

తా॥ ఓస్వామీ! సకలాభరణభూషితురాలైన పెరియపిరాట్టియు నీవును వేంచేసియున్న యందమునసుభవించి, సమస్తమైన ఐహికసుఖమునున్ను కైవల్యసుఖమునున్ను, తుచ్ఛముగా నెంచి వదలి నీతిరువడికళ్ళయందు వచ్చిచేరితిని. ౧౦.

౹౹ తిరువడియైనారణనై క్కేశవనై ప్పరఞ్జుడరై *
తిరువడిశేర్ వదుకరుది చ్చెழுఙ్కురుగూర్ చ్చడగోపన్ *
తిరువడిమేలురైత్తతమిழ்ాయిరత్తుళిప్పత్తుమ్ *
తిరువడియేయడైవిక్కుమ్ తిరువడిశేర్న్దొన్నుమినే. ౧౧.

అ॥ తిరువడియై - స్వామియు, నారణనై - సకలవిధబంధువును, కేశవనై - కేశియనెడి రాక్షసునిసంహరించినవాడును, పరఞ్జుడరై-పరఞ్జ్యోతిస్స్వరూపుడునైనసర్వేశ్వరునియొక్క, తిరువడిశేర్వదు - శ్రీపాదములనుబొందుటను, కరుది - ఆశపడి, శెழுమ్ - సమృద్ధమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్-నమ్మాழ்వార్లు, తిరువడిమేల్-సర్వేశ్వరునిశ్రీపాదములవిషయమై, ఉరైత్త - సాధించినదియు తమిழ் - ద్రావిడరూపమైనదియునైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, తిరువడియే - శ్రీపాదమునే, అడైవిక్కుమ్ - పొందించును. తిరువడిశేర్న్దు - (మీరును) శ్రీపాదమునుబొంది, ఒన్నుమిన్ - ఏకీభవించుడి.

తా॥ సర్వేశ్వరునియొక్క శ్రీపాదమునుబొందవలయునని ప్రార్థించిన నమ్మాழ்వార్లుసాధించిన యీపదిపాశురములే తననునుసంధింపువారిని సర్వేశ్వరునియొక్క శ్రీపాదములయందు జేర్పునుగాన మీరుదీనిని యనుసంధించి వానిశ్రీపాదమును బొందుడియని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౧౦-వ తిరువాయ్మొழி.

అవతారిక:—దేవతాన్తరపరులై చెడిపోవుచున్న చేతనులయందాழ்వార్ల మిక్కిలియను గ్రహముంచి వారికి, శ్రీమన్నారాయణుడే జగత్కారణుడు పరాత్పరుడునుగాన మీరు దేవతాన్తరములనువదలి శ్రీమన్నారాయణునినే యాశ్రయించుడియని యుపదేశించుచున్నారు.

‡‡ ఒన్రుమ్ తేవుములగుముయిరుమ్మ ర్రుమ్ యాదుమిల్లా
అన్రు*నాన్ముగన్రన్నొడు తేవరులగోడుయిర్ పడైత్తాన్*
కున్రమ్బోల్ మణిమాడనీడు తిరుక్కురుగూరదనుళ్*
నిన్ర వాదిప్పిరాన్ నిఱ్క మర్రైత్తెయ్వమ్నాడుదిరే. ౧.

అ॥ తేవుమ్ - దేవతలును, ఉలగుమ్ - లోకములును, ఉయిరుమ్ - ప్రాణులును, మర్రుమ్ యాదుమ్ - తక్కినవన్నియు, ఒన్రుమ్ - ఒకటియు, ఇల్లా అన్రు - లేనియాకాలమందు, నాన్ముగన్ తన్నొడు - బ్రహ్మతోగూడ, తేవర్ - దేవతలను, ఉయిర్ - ప్రాణులను, ఉలగోడు - లోకములతోఁగూడ, పడైత్తాన్ - సృజించినవాఁడును, కున్రమ్పోల్ - పర్వతమువలెనున్న, మణి-రత్నమయమైన, మాడమ్ - మేడలు, నీడు - ఉన్నతముగాఉన్నటువంటి, తిరుక్కురుగూరదనుళ్ - కురుకాపురియనెడి దివ్యదేశమందు, నిన్ర - వేంచేసియున్నవాఁడును, ఆది - కారణభూతుఁడునైన, పిరాన్ - సర్వేశ్వరుఁడు, నిఱ్క - ఉండగా, మర్రు - వేరైన, ఎత్తెయ్వమ్ - ఏదేవతను, నాడుదిర్ - వెతుకుచున్నారు.

తా॥ దేవాదిప్రాణులును స్వర్గాదిలోకములు నేమియులేని సమయంబున బ్రహ్మాది సమస్త చేతనాచేతనములనుసృజించిన సర్వేశ్వరుఁడైన శ్రీమన్నారాయణుఁడు మీకత్యన్తసులభుఁడై తిరునగరియందువచ్చి వేంచేసియుండగా మీరెందుకు దేవతాన్తరములను భజించుచున్నారని. ౧.

నాడినీర్ వణఙ్గుందెయ్వముమ్ ముమ్మైయుమున్పడైత్తాన్*
వీడిల్ శీర్ పుగழாదిప్పిరా నవన్మేవియురైకోయిల్*
మాడమాళిగై శూழ்న్దழగాయ తిరుక్కురుగూరదనై*
పాడియాడిప్పరవిచ్చెన్మిన్గళ్ పల్లులగీర్ పరన్దే. ౨.

అ॥ నీర్ - మీరు, నాడి - వెతుకుకొనిపోయి, వణఙ్గుమ్ - నమస్కరించుచున్న, తెయ్వముమ్ - దేవతలనున్ను, ఉమ్మైయుమ్ - మిమ్ములనున్ను, మున్ - మునుపు, పడైత్తాన్ - సృజించినవాఁడును, వీడు - అన్తము, ఇల్ - లేని, శీర్ - కల్యాణగుణములను, పుగழ் - కీర్తినిన్నిగలవాఁడును, ఆదిప్పిరానవన్ - జగత్కారణుఁడునైన యాసర్వేశ్వరుఁడు, మేవి - అమరియుండి, ఉరై - నిత్యవాసముజేయుచున్న, కోయిల్ - దివ్యదేశమును, మాడమ్ - మేడలచేతను, మాళిగై - గృహములచేతను, శూழ்న్దు - చుట్టఁబడి, అழగాయ - సుందరంబునైన, తిరుక్కురుగూరదనై - తిరునగరిని, పల్ - అనేకవిధములైన, ఉలగీర్ - చేతనులారా! పరన్దు - అంతటవ్యాపించి, పాడి-గానముజేసి, ఆడి - నృత్యముజేసి, పరవి - స్తుతించి, శెన్మిన్గళ్ - పోవుఁడి

తా॥ ఓ చేతనులారా! మిమ్ములను మీదేవతలనుగూడ సృజించిన సకల కల్యాణగుణాకరుఁడైన శ్రీమన్నారాయణుఁడు వేంచేసియున్న తిరునగరిని స్తుతించిపాడుచు వెళ్ళి యాశ్రయించుడియని. ౨.

పరన్ద తెయ్వముమ్పల్లులగుమ్పడైత్తు అన్రుడనేవిழுఙ్గి*
కరన్దుమిழ்న్దుకడన్దిడన్దదు కణ్డుమ్ తెళియకిల్లీర్*

శిరఙ్గళాలమరర్ వణఙ్గుమ్ తిరుక్కురుగూరదనుళ్*
పరన్ తిఱమన్ఱిప్పల్లులగీర్ తెయ్వమ్ మ~~ఱ్~~ఱిల్లైపేశుమినే. ౩.

అ॥ పన్ద-విస్తీర్ణులైన, తెయ్వముమ్-దేవతలను, పల్-అనేకవిధములైన, ఉలగుమ్-లోకములను, పడైత్తు - సృజించి, అన్ఱు - అప్రళయకాలమందు, ఉడనే - ఒకప్పుడే, విழுఙ్గి - మ్రింగి, కరన్దు - (తనలో) దాచి, ఉమిழ்న్దు - బయలుపఱచి, కడన్దు - కొలిచి, ఇడన్దదు-(పాతాళము లోనుండి) విడతీసినది, (ఇవన్నిఁటిని), కణ్డుమ్ - చూచియూ, తెళియకిల్లీర్ - నిర్మలాన్తఃకరణులై కాకుండనున్నారు, అమరర్ - దేవతలు, శిరఙ్గళాల్ - శిరస్సులచే, వణఙ్గుమ్ - నమస్కరించుచున్న, తిరుక్కురుగూరదనుళ్ - తిరునగరియందు వేంచేసియున్న, పరన్ - పరాత్పరుఁడైన శ్రీమన్నారాయణునికి, తిఱమన్ఱి - శేషముకాకుండ, మఱ్ఱు - స్వతన్త్రమైయున్న, తెయ్వమ్ - దేవత, ఇల్లై - లేదు, పల్ - అనేకవిధులైన, ఉలగీర్ - లోకులారా! పేశుమిన్-(ఉన్నయెడల) చెప్పుఁడు.

తా॥ దేవాదిసకల చరాచరములను సృజించి ప్రళయకాలమందు తనయుదరములోనుంచుకొని రక్షించి వానినితనస్వాధీనపఱచుకొనుచు పరాత్పరుఁడైతిరునగరియందు వేంచేసియున్న శ్రీమన్నారాయణుని వ్యాపారములనుజూచియు వీడే పరదేవతయని తెలిసికొనకనున్నారు. ఇప్పుడునేను చెప్పెద వినుఁడు. మీదేవతలన్నియు వానికే శేషభూతులుగాని స్వతన్త్రులెవ్వరు లేరు, ఉన్నయెడఁ మీరునిరూపించి చెప్పుఁడని. ౩.

పేశనిన్ఱ శివనుక్కుమ్పిరమన్ఱనక్కుమ్ పిఱర్క్కుమ్
నాయగనవనే*కపాలనన్మోక్కత్తుక్కణ్డుకొణ్మిన్*
తేశమామదిళ్ శూழ்న్దழగాయ తిరుక్కురుగూరదనుళ్*
ఈశన్పాలోరవమ్బఱైద లెన్నావదిలిఙ్గియర్క్కే. ౪.

అ॥ పేశనిన్ఱ - (మీరుపరదేవతయని) చెప్పుచున్న, శివనుక్కుమ్ - రుద్రునికిని, పిరమన్ తనక్కుమ్ - బ్రహ్మకును, పిఱర్క్కుమ్ - తక్కినవారికిని, అవనే - ఆశ్రీమన్నారాయణుఁడే, నాయకన్ - స్వామి, కపాలమ్ - బ్రహ్మకపాలముయొక్క, నల్ - విలక్షణమైన, మోక్కత్తు - మోక్షమందు, కణ్డుకొళ్మిన్ - తెలిసికొనుఁడు తేశమ్ - తేజోమయమై, మా - గొప్పదైన, మదిళ్ - ప్రాకారముచే, శూழ்న్దు - చుట్టఁబడి, అழగాయ - అందమైయున్న, తిరుక్కురుగూరదనుళ్ - తిరునగరియందువేంచేసియున్న, ఈశన్పాల్ - సర్వేశ్వరునివిషయమై, ఓరవమ్ - (వీడీశ్వరుఁడుకాఁడనియెడి) ఒకదోషమును, పఱైదల్ - చెప్పుటచే, ఇలిఙ్గియర్క్కు - లింగమును దేవతగాగలమీకు, ఎన్నావదు - ఏమిప్రయోజనమును గలుగజేయును.

తా॥ ఓఅవైష్ణవులారా! మీరీశ్వరుఁడని చెప్పుచున్న రుద్రునికి బ్రహ్మదితక్కిన దేవతలకును శ్రీమన్నారాయణుఁడే నాథుఁడు. అదియెటులనమ్మవచ్చునని సన్దేహింపక, రుద్రుఁడు బ్రహ్మ శిరస్సును ఛేదించినప్పుడు, నిరపరాధనైన నాశిరస్సును ఛేదించితివి గనుక కపాలివై

పోవుదువని శాపమివ్వగా నప్పటినించి తనచేతులోనంటుకొనియున్న బ్రహ్మకపాలమందు భిక్షమెత్తుచు తిరుగుచుండి చిరకాలముగడిచినతరువాత శ్రీమన్నారాయణుని బ్రార్థించి నప్పుడా శ్రీమన్నారాయణుఁడుతనశరీరమును గోరుతోఁజీల్చి రక్తధారనాకపాలమందువిడిచి కపాలముక్రింద బడునట్లుజేసి రుద్రుని శాపమును బోగొట్టినవిధమునననుసంధించి నామాటనే యథార్థమని స్వీకరింపుఁడి. తిరునగరియందు వేంచేసియున్న అట్టిశ్రీమన్నారాయణుని యీశ్వరుఁడుకాడని చెప్పుటచే లిఙ్గధారులైన మీకేమియు లాభము లేదని. ౪.

⁂ ఇలిఙ్గత్తిట్టపురాణత్తీరుమ్ శమణరుమ్శాక్కియరుమ్*
వలిన్దువాదు శెయ్వీర్గళుమ్ మత్తునుమ్ నుమ్ దెయ్వముమాగినిన్ఱాన్*
మలిన్దు శెన్నెల్ కవరివీశుమ్ తిరుక్కురుగూరదనుళ్*
పొలిన్దునిన్ఱపిరాన్ కణ్డీర్ ఒన్ఱుమ్పొయ్యిల్లై పోత్తుమినే. ౫.

అ॥ ఇలిఙ్గత్తు - లింగమునకు స్తోత్రముజేయుటకై, ఇట్ట - చేయుబడిన, పురాణత్తీరుమ్ - పురాణమునునమ్మినమీరును, శమణరుమ్ - జైనులును, శాక్కియరుమ్ - బౌద్ధులును, వలిన్దు - బలాత్కారముగా, వాదుశెయ్వీర్గళుమ్ - వాదముజేయుమీరును, మత్తుమ్ - మతియు, నుమ్ - మీకు, తెయ్వముమ్ - దేవతలును (మీరందరికిని) ఆగినిన్ఱాన్ - అన్తర్యామియైయున్నవాఁడు, మలిన్దు - సమృద్ధమై, శెన్నెల్ - శెన్నెలనెడిసస్యము, కవరి-చామరమువలె, వీశుమ్- వీచుచున్న, తిరుక్కురుగూరదనుళ్ - కురుకాపురియందు, పొలిన్దునిన్ఱ - పూర్ణుఁడైవేంచేసియున్న, పిరాన్కణ్డీర్ - ఉపకారకుఁడేసుమండీ ఒన్ఱుమ్పొయ్యిల్లై - (ఇందులో) ఒకటియున్న బద్ధములేదు. పోత్తుమినే - వానినేస్తుతించుడి

తా॥ లింగమునకు మాహాత్మ్యము బ్రతిపాదించెడి యొకపురాణము జేసియివ్వమనియడగగా, వారికొఱకైనిర్మించిన లింగపురాణమును యథార్థమని నమ్మికొనియున్న మీకును జైనబౌద్ధులకును, శుష్కతర్కముతో వాదముజేయుచున్న తార్కికులుమొదలైనవారికిని, మీరందరును దేవతగా నెంచిన బ్రహ్మాదులకు నన్తరాత్మయైన శ్రీమన్నారాయణుఁడే తిరునగరియందు సర్వానులభుఁడై వేంచేసి యున్నాడనినమ్మి వానినే మీరాశ్రయించుఁడియని. ౫

పోత్తి మత్తోర్ తెయ్వమ్ పేణప్పుఱత్తిట్టు*ఉమ్మైయిన్నే
తేత్తి వైత్తదెల్లీరుమ్ వీడుపెత్తాలులగిల్లైయెన్ఱే*
శేత్తిల్ శెన్నెల్ కమలమోఙ్గు తిరుక్కురుగూరదనుళ్*
ఆత్తవల్లవన్ మాయమ్కణ్డీర్ అదఱిన్దఱిన్దోడుమినే. ౬.

అ॥ మత్తోర్తెయ్వమ్ - మతియొకదేవతను, పోత్తి-స్తుతించి, పేణ-ఆశపడునట్లు, ఉమ్మై - మిమ్ములను, పుఱత్తిట్టు - దేవతాన్తరవిషయమందు బడద్రోసి, ఇన్నే - ఈవిధంబున, తేత్తివైత్తదు - విశ్వాసముబుట్టించినది, ఎల్లీరుమ్ - ఎల్లరు, వీడుపెత్తాల్ - మోక్షమును బొందినయెడల, ఉలగు - ఈలోకము, ఇల్లై-లేకపోవును, ఎన్ఱే-అనియే, శేత్తిల్ - బురదగల

ప్రదేశమందు, శెన్నెల్ - శెన్నెలనెడిధాన్యమును, కమలమ్ - పద్మమును, ఓఙ్గు - వర్ధిల్లుచున్న, తిరుక్కురుగూరదనుళ్ - తిరునగరియందు వేంచేసియున్న, అల్ ప్పకల్లవన్ - గొప్పశక్తిగల శ్రీమన్నారాయణునియొక్క, మాయమ్కణ్డీర్ - మాయనుమండీ. అదఱిన్దు - దానినెఱిఁగికొని, అఱిన్దు - ప్రవర్తిమార్గము నెఱిఁగి, ఓడుమిన్ - శీఘ్రముగా వెళ్ళియాశ్రయించుడి.

తా॥ శ్రీమన్నారాయణుఁడు, సకలచేతనంలకును తనయందు భక్తినిచ్చినయెడల యెల్లరు మోక్షమునొందుదురు. అట్టి లీలావిభూతి నశించుననిదలంచి మీకు దేవతాన్తరములయందు భక్తినిచ్చెను. గాన యివి వానిమాయలనియెఱిఁగి దేవతాన్తరములనువదలి తిరునగరియందు వేంచేసియున్న యాశ్రీమన్నారాయణుని శీఘ్రముగానాశ్రయించుడియని. ౬.

ఓడియోడిప్పలపిఱప్పుమ్పిఱన్దు మత్తోర్ తెయ్వమ్
పాడియాడిప్పణిన్దు * పల్ పడికాల్ వழியేఱికణ్డీర్ *
కూడివానవరేత్తనిన్ఱ తిరుక్కురుగూరదనుళ్ *
ఆడుపుట్కొడియాది మూర్త్తిక్కడిమైపుగువదువే. ౭.

అ॥ ఓడియోడి - తిరిగితిరిగి, పలపిఱప్పుమ్ - అనేకయోనులయందును, పిఱన్దు - జన్మించి, మత్తోర్ తెయ్వమ్ - మఱియొక దేవతను, పాడి - గానముజేసి, ఆడి - నృత్యముజేసి, పణిన్దు - నమస్కరించి, వழியేఱి - వారిమార్గమందునడిచి, పల్ పడికాల్ - అనేకవిధములుగా, కణ్డీర్ - చూచితిరిగదా? వానవర్ - దేవతులు, కూడి - గుంపుగాజేరి, ఏత్త - స్తుతించునట్లు, తిరుక్కురుగూరదనుళ్ - తిరునగరియందు, నిన్ఱ - వేంచేసియున్నవాఁడును, ఆడు - ఆడుచున్న, పుళ్ - గరుత్మంతుని, కొడి - ధ్వజముగాగలవాఁడును, ఆదిమూర్త్తిక్కు - కారణభూతుఁడునైన శ్రీమన్నారాయణునికి, అడిమైపుగువదు - కైఙ్కర్యమ్ముజేయుఁడి.

తా॥ అనేకజన్మములయందు దేవతాన్తరభజనముజేసిన మీకు ఆదేవతలిచ్చు ఫలము తెలిసినదేకదా? వారిని యాశ్రయించినయెడల మీకిసంసారమేగతి గాన వారినివదలి వారుగూడ గుంపుగుంపుగాజేరి స్తోత్రముజేసెడి తిరునగరియందు వేంచేసియున్న గరుడధ్వజుని యాశ్రయించుడియని. ౭.

పుక్కడిమైయినాల్ తన్నైక్కణ్ణ మార్క్కణ్డేయనవనై *
నక్కపిరానుమన్ఱుయ్యక్కొణ్డదు నారాయణనరుళే *
కొక్కలర్ తడన్దాழை వేలి త్తిరుక్కురుగూరదనుళ్ *
మిక్కవాదిప్పిరాన్ నిఱ్క మత్తైత్తెయ్వమ్ విళమ్బువదే. ౮.

అ॥ అడిమైయినాల్ - దాస్యముచే, పుక్కు - ప్రవేశించి, తన్నై - తనను, కణ్ణ - కనుబెట్టిన, మార్కణ్డేయనవనై - మార్కణ్డేయుని, అన్ఱు - అప్పుడు, నక్కపిరానుమ్ - నగ్నదేవతయైనరుద్రుఁడును, ఉయ్యక్కొణ్డదు - ఉజ్జీవింపజేసినది, నారాయణనరుళే - శ్రీమన్నారాయణునియొక్కకృపచేతనే. కొక్కు - కొక్కెరతెల్లనైన, అలర్ - పుష్పముగల, తడమ్ - విశాలమైన,

తాழై - మొగిలిచెట్లను, శెలి - డొంకగాగల, తిరుక్కురుగూరదనుళ్ - కురుకాపురియందు వేంచేసియున్న, మిక్క - సర్వాధికుఁడై, ఆదిప్పిరాన్ - జగత్కారణుఁడైన శ్రీమన్నారాయణుఁడు, నిఱ్క - ఉండగా, మఱ్ఱు - వేఱైన, ఎత్తెయ్వమ్-ఏదేవతను, విళమ్బుదిర్ - చెప్పుచున్నారు.

తా॥ మార్కండేయమహర్షి గూడ మొదట రుద్రుని పరదేవతగా నెంచి యాశ్రయింప, రుద్రుఁడు ఆఋషియందుగృపఁజేసి నేను పరదేవతకాను, శ్రీమన్నారాయణుఁడే పరదేవతయని యుపదేశింపగా నప్పుడు శ్రీమన్నారాయణుని యాశ్రయించి వానికృపచే నుజ్జీవించెను. అట్టి శ్రియఃపతి తిరునగరియందు వేంచేసియుండగా వానినివదలి మీరుదేవతాన్తరమును భజించుట తేలనని. ౯.

విళమ్బుమాఱుశమయము మవైయాగియుమ్మఱ్ఱుమ్తన్పాల్*
అళన్దుకాణ్డఱ్కరియనాగియ వాదిప్పిరానమరుమ్*
వళజ్గొళ్ తణ్పణైశూழ్న్దళగాయ తిరుక్కురుగూరదనై*
ఉళజ్గొళ్ ఞానత్తువైమ్మి నుమ్మైయుయ్యక్కొణ్డుపోగుఱిలే.

అ॥ విళమ్బుమ్ - చెప్పుచున్న (శబ్దమాత్రసారమైన), ఆఱుశమయముమ్ - బౌద్ధచార్వాకగౌతమకైనకాపిలపాతఞ్జలములనెడి యాఱుమతస్థులును, అవైయాగియుమ్ - ఆమతములతో సమానమైన, మఱ్ఱుమ్ - వేఱుకుదృష్టులును, తన్పాల్ - తనయందు, అళన్దుకాణ్డఱ్కు - పరిచ్ఛేదించిచూచుటకు, అరియనాగియ - దుర్లభుఁడైన, ఆదిప్పిరాన్ - కారణభూతుఁడైనసర్వేశ్వరుఁడు, అమరుమ్ - అమరియున్నదియు, వళజ్గొళ్ - సమృద్ధమై, తణ్ - చల్లనైన, పణై - కొలనలచే, శూழ్న్దు - చుట్టఁబడి, అழగాయ - సుందరమైయున్న, తిరుక్కురుగూరదనై-కురుకాపురిని, ఉమ్మై - మిమ్ములను, ఉయ్యక్కొణ్డు - ఉజ్జీవింపజేసికొని, పోగుఱిల్ - పోవలసిన యెడల, ఉళమ్కొళ్ ఞానత్తు - మానసజ్ఞానమందు, వైమ్మిన్ - ఉంచుఁడు.

తా॥ వేదబాహ్యులకును కుదృష్టులకు నలవికాని మహామహిమగల శ్రియఃపతికి వాసస్థానమై సకలసమ్పత్సమృద్ధమైన తిరునగరిని ధ్యానించుటయే మీకుజ్జీవనోపాయమని.

ఉఱువదావదెత్తేవు మెవ్వులగజ్గళుమ్మఱ్ఱుమ్తన్పాల్*
మఱువిల్మూర్త్తియోడొత్తిత్తనైయుమ్ నిన్ఱవణ్ణమ్నిఱ్కవే*
శెఱువిల్ శెన్నెల్కరుమ్బొడోఙ్గు తిరుక్కురుగూరదనుళ్*
కుఱియమాణురువాగియా నీళ్కుడక్కూత్తనుక్కాట్చెయ్వదే. ౧౦.

అ॥ ఎత్తేవుమ్ - సకలదేవతలనున్ను, ఎవ్వులగజ్గళుమ్ - సమస్తలోకములనున్ను, మఱ్ఱుమ్ - ఇంకనున్న చరాచరములనున్ను, ఇత్తనైయుమ్ - ఇవన్నిఁటిని, తన్పాల్ - తనయొక్క, మఱువిల్ - దోషములేని, మూర్త్తియోడొత్తు-దివ్యవిగ్రహముతో సమానముగా తనకు శరీరముగాగలవాఁడును, నిన్ఱవణ్ణమ్ - తనకున్నస్వభావము, నిఱ్కవే - చెడకుండ నేయుండగా, శెఱువిల్ - పొలములయందు, శెన్నెల్ - శెన్నెలనెడిధాన్యము, కరుమ్బొడు - చెరుకుతోసమానముగా, ఓఙ్గుమ్ - పైకిలేచియున్న, తిరుక్కురుగూరదనుళ్ - కురుకాపురియందు వేంచేసియున్న

వాఁడును, కఱియ - పొట్టియైన, మాణురువాగియ - బ్రహ్మచారియైనవాఁడును, నీళ్-మిక్కిలి భోగ్యమైన, కుడక్కూ-త్తనుక్కు - కుంభనృత్యముజేసినవాఁడునైన శ్రియఃపతికి, ఆట్చెయ్యాదే - కైఙ్కర్యముజేయుటయే, ఉఱుపదు - శ్రేష్ఠము. అపదు - సులభము.

తా॥ సకలచరాచరాత్మకుఁడైన సర్వేశ్వరుఁడు తనయొక్క నిరవధికమహిమతోడనే తిరునగరియందు వేంచేసియున్నాఁడు. వానినాశ్రయించుటయే మీకు స్వరూపానురూపంబని. ౧౦

‡‡ ఆట్చెయ్‌దాழ்పిరానైచ్చేర్న్దవన్ వణ్ కురుగూర్‌నగరాన్*
నాట్కమழ் మగిழ் మాలైమార్బినన్ మాఱన్‌శడగోపన్*
వేట్కైయాల్ శొన్న పాడలాయిరత్తుళిప్పత్తుమ్‌వల్లార్*
మీట్చియిన్ఱి వైగున్దమానగర్ మఱ్ఱదుకైయదువే. ౧౧.

అ॥ ఆట్చెయ్‌దు - కైఙ్కర్యముజేసి, ఆழிప్పిరానై - చక్రధరుఁడైనసర్వేశ్వరుని, శేర్న్దవన్ - పొందినవారును, వణ్ - సుందరమైన, కురుగూర్ నగరాన్-తిరునగరికిస్వామియు, నాళ్-ప్రతిదినమును, కమழ் - పరిమళించుచున్న, మగిழ் మాలై-పొగడపూలను, మార్బినన్-వక్షస్థలమందుగలవారును, మాఱన్ - కదృష్టులనునిరసించువారునైన, శడగోపన్ నమ్మాழ்వార్లు, వేట్కైయాల్ - అభినివేశముచే, శొన్న - పాడించిన, పాడల్ - గానరూపమైన, ఆయిరత్తుళ్-వెయ్యి పాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్-అధ్యయనముజేయువారికి,మఱ్ఱదు-ఈతిరువాయ్‌మొழிయొక్క అధ్యయనమనెడి ఫలమేగాక, మీట్చియిన్ఱి - పునరావృత్తిలేని, వైగున్దమానగర్ - శ్రీవైకుణ్ఠమనెడిగొప్పనగరము, కైయదు - చేతులోనుండును.

తా॥ నమ్మాழ்వార్లు పరోపదేశముగా పాడించిన యీతిరువాయ్‌మొழி నభ్యసించువారు శ్రీవైకుణ్ఠమును బొందుదురని. ౧౧.

ఆ ழ்వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౪-వ పది, సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్‌మొழிలు నలుపదింటికి పాశురములు ౪౪౨



## ౫ - పత్తు, ౧ - వ, తిరువాయ్మొழி.

—०००—

అవతారిక:- శ్రీమన్నారాయణునియొక్క గరత్వమును బరులకుపదేశించిన నమ్మాళ్వార్ల సర్వేశ్వరుడు తనపాపములను జూడక తనయందనుగ్రహముచేసి తానే పరమప్రాప్యుఁడనెడి తత్త్వజ్ఞానమునిచ్చి తనతో సంశ్లేషించిన విధమునీతిరువాయ్మొழிలో ప్రసాదించుచున్నారు.

‡‡ కైయార్ శక్కరత్తెన్ కరుమాణిక్కమేయెన్నెన్ఱు*
పొయ్యేకైమ్మైశొల్లి ప్పుఱమేపుఱమేయాడి*
మెయ్యేపెఱ్ఱొழிన్దేన్ విదివాయ్క్కిన్ఱుకాప్పారార్*
ఐయోకణ్ణపిరా నఱైయోవినిప్పోనాలే. ౧.

అ॥ కై - శ్రీహస్తమందు, ఆర్ - పూర్ణమైయున్న, శక్కరమ్ - సుదర్శనముగల, ఎన్ కరుమాణిక్కమే - నాకుసేవసాయించిన నీలమాణిక్యమువంటి తిరుమేనుగలవాఁడా! ఎన్ఱెన్ఱు - అనిపలుమాఱనుసంధించి, పొయ్యేకైమ్మైశొల్లి - గొప్పఅసత్యముచెప్పి, పుఱమేపుఱమే - బాహ్యవిషయములయందు, ఆడి - మునిగి, మెయ్యే - యథార్థముగానునుసంధించినవారియొక్క ఫలమును, పెఱ్ఱొழிన్దేన్ - పొందితిని. విది - భగవత్కృప, వాయ్క్కిన్ఱు - ఫలించునప్పుడు, కాప్పారార్ - అడ్డగించువారెవరు ? కణ్ణపిరాన్ - ఓకృష్ణస్వామీ ! ఇని - ఇఁకమీద, పోనాల్ - నీవుపోతివంటే, అఱైయో - సామర్థ్యమున్నయెడలపోయిచూచెదము, ఐయో - ఆశ్చర్యము.

తా॥ ఓశ్రియఃపతీ! నేను, చక్రధరుఁడా! శ్యామసుందరుఁడాయని మనోభావములేకనే నోటితోమాత్రముచెప్పి శ్రీవైష్ణవునివలె నటింపగా, నీవంతమాత్రమునే స్వీకరించి నన్నుజీవింపచేసితివి. ఇదేమాశ్చర్యము ? ఒకచేతనుని నీవుకటాక్షింపవలయునని దలంచినప్పుడు దానికడ్డమున్నదా ? ఓశ్రీకృష్ణమూర్తీ! ఇఁకనన్ను విడిచిపెట్టిపోఁగలవో చూచెదమని. ౧.

పోనాయ్మామరుదిన్నడువే యెన్పొల్లామణియే*
తేనేయిన్నముదే యెన్ఱెన్ఱేశిలకూత్తుచ్చొల్ల*
తానేలెమ్బెరుమా నవనెన్నాగియొழிన్దాన్*
వానేమానిలమే మఱ్ఱుముఱ్ఱుమెన్నుళ్ళనవే. ౨.

అ॥ మా - గొప్ప, మరుదిన్ నడువే - మద్దివృక్షములయొక్క నడుమన, పోనాయ్ - జనించినవాఁడా! ఎన్ - నాయొక్క, పొల్లామణియే - అందములేని (అతిసుందరంబైన), మణియే - మాణిక్యమువంటివాఁడా! తేనే - తేనెవంటివాఁడా! ఇన్ - భోగ్యమైన, అముదే - అమృతమువంటివాఁడా! ఎన్ఱెన్ఱే - అనియని, శిల - యథార్థముగాఁజెప్పినట్టువలెనున్న, కూత్తు - అసత్యమును, శొల్ల - చెప్పగా, ఎమ్బెరుమాన్ - మాస్వామియైన, అవన్ - శ్రియఃపతి, తానేల్ - తాను చేసినదేమనగా, ఎన్నాగియొழிన్దాన్ - నాకుఁబరతంత్రుఁడైయుండెను, వాన్ - ఆకాశమును, మానిలమ్ - గొప్పభూమియును, మఱ్ఱు - ఇఁకనున్నయండాదులును, ముఱ్ఱుమ్ - నిత్యవిభూ

తిరయు (ఇవన్నిఁటితోఁగూడుకొన్నవాఁడై), ఎన్ - నాయొక్క, ఉళ్ళన - హృదయమునందు వంచేసియున్నాఁడు.

తా॥ యమళార్జునభంజకుఁడా! నీలమేఘశ్యాముఁడా! మిక్కిలిభోగ్యభూతుఁడా! యనికొన్ని భావశూన్యమాటలను జెప్పి నటింపఁగా, ఆమాటలనవలంబించి యాసర్వేశ్వరుఁడు ఉభయ విభూతులతోఁగూడ నాహృదయమందుఁ బ్రవేశించినాఁడని. ౨.

ఉళ్ళనమళ్ ఘుళవా ప్పుఱమేశిలమాయమ్శొల్లి*
వళ్ళల్ మణివణ్ణనే యెన్ఱెన్ఱేయున్నైయుమ్వఞ్జిక్కుమ్*
కళ్ళమనమ్తవిర్న్దే యున్నైక్కణ్డుకొణ్డుయ్న్దొళిన్దేన్*
వెళ్ళత్తణైక్కిడన్దా యినియున్నైవిట్టెన్గొళ్ వనే. ౩.

అ॥ ఉళ్ళన - హృదయమందున్న యభిప్రాయములు, మళ్ ఘుళవా - వేఱొకవిధములుగా నుండగా, పుఱమే-బైట(నోటితో), వళ్ళల్-ఉదారుఁడా! మణివణ్ణనే-మాణిక్యమువంటికాన్తిగల వాఁడా! ఎన్ఱెన్ఱు-అనియని, శిల-కొన్ని, మాయమ్-కపటవచనములను, శొల్లి-చెప్పి, ఉన్నైయు - నిన్నును, వఞ్జిక్కుమ్ - వంచనజేయుచున్న, కళ్ళమనమ్ - కపటహృదయమును, తవిర్న్దు - వదలి, ఉన్నై - నిన్ను, కణ్డుకొణ్డు - సేవించి, ఉయ్న్దొళిన్దేన్ - ఉజ్జీవించితిని, వెళ్ళత్తు - క్షీరాబ్ధి యందు, అణైక్కిడన్దాయ్ - (శేష) శయ్యమీఁద పవ్వళించిన ఓశ్రియఃపతీ! ఇని - ఇఁకమీఁద, ఉన్నైవిట్టు - నిన్నువిడిచి, ఎన్కొళ్వన్ - దేనినిస్వీకరించెదను?

తా॥ ఓక్షీరాబ్ధినాథుఁడా! నేనుమనస్సులోనొకటినుంచుకొని, వీడుభాగవతుఁడని నీవు తలంచునట్లు నీతిరునామములను జెప్పఁగా నాతిరునామ ప్రభావముచే నిర్మలాన్తఃకరణుఁడనై నిన్ను సేవించి యుజ్జీవించితిని. ఇఁక నాకేమి కావలసినదని. ౩.

ఎన్గొళ్వనున్నైవిట్టెన్నుమ్ వాశగఙ్గళ్ శొల్లియుమ్*
వన్గళ్వనేన్ మనత్తైవలిత్తు కణ్ణనీర్ కరన్దు*
నిన్గణ్ణెరుఙ్గవైత్తే ఎనదావియైనీక్కగిల్లేన్*
ఎన్గణ్ మలినమఱుత్తెన్నైక్కూవియరుళాయ్కణ్ణనే. ౪.

అ॥ ఉన్నైవిట్టు - నిన్నువదలి, ఎన్కొళ్వన్ - దేనినిస్వీకరించెదను, ఎన్నుమ్ - అనెడి, వాశగఙ్గళ్ - మాటలను, శొల్లియుమ్ - చెప్పియు, వన్ - క్రూరమైన, కళ్వనేన్ - కృత్రిమము గలనేను, మనత్తై - మనస్సును, వలిత్తు - ఈడిచి, కణ్ణనీర్ - (విషయాలాభముచేగలిగిన) బాష్పమును, కరన్దు - పోగొట్టి, నిన్గణ్ - నీయందు, నెరుఙ్గవైత్తు - చేర్చి, ఎనదావియై - నాయాత్మను, నీక్క కిల్లేన్-సంసారమునుండివేఱుపఱచసమర్థుఁడనుకాను. కణ్ణనే-ఓశ్రీకృష్ణుఁడా! ఎన్గణ్ - నాయందున్న, మలినమ్ - అవిద్యాదులను, అఱుత్తు - ఛేదించి, ఎన్నై - నన్ను, కూవి యరుళాయ్ - పిలుచుకొనుమా.

తా॥ ఓశ్రియఃపతీ! ఆత్మాపహారియైపాపిష్ఠుఁడనైననేను, నీకంటెనాకు రక్షకులెవ్వరులేరని చెప్పినను విషయాసక్తినివదలి మనస్సును మఱలించి నీయందుంచుటకు శక్తుఁడనుగాను, గనుక నీవే నాఘంకారమును బోగొట్టి నీశ్రీపాదమందు చేర్చుకొనుమనాయని. ౪.

కణ్ణపిరానై విణ్ణోర్ కరుమాణిక్కత్తై యముదై *
నణ్ణియుమ్ నణ్ణగిల్లేన్ నడువే యోరుడమ్బిలిట్టు *
త్తిణ్ణమழுన్దక్కట్టి ప్పలశెయ్వినై వన్కయిఱ్ఱాల్ *
పుణ్ణైమఱైయవరిన్దెన్నై ప్పోరవైత్తాయ్ పుఱమే. ౫.

అ॥ విణ్ణోర్ - నిత్యసూరులకు, అముదై - భోగ్యభూతుఁడవై, కరుమాణిక్కత్తై - నీలమాణిక్యమువంటితిరుమేనుగలవాఁడవై, కణ్ణపిరానై - కృష్ణస్వామియైననిన్ను, నణ్ణియుమ్ - పొందియు, నణ్ణగిల్లేన్ - పొందకుండనున్నాను, నడువే - మధ్యకాలమందు, ఓర్ - అతిహేయమైన, ఉడమ్బిల్ - శరీరమందు, ఇట్టు - వేసి, పల - అనేకములై, శెయ్ - చేయఁబడినవైన, వినై - పాపములనెడి, వన్కయిఱ్ఱాల్ - తెంపుటకశక్యమైనత్రాడుచే, తిణ్ణమ్ - దృఢముగా, అழுన్ద - బిగుసునటుల, కట్టి - కట్టి, పుణ్ణై - మాంసమును, మఱైయ - తెలియకుండునట్లు, వరిన్దు - (చర్మముచే)కప్పి, ఎన్నై - నన్ను, పుఱమే - బాహ్యమైనసంసారమందే, పోరవైత్తాయ్ - పోవునట్లునిలిపితివి.

తా॥ నిత్యసూరిభోగ్యుఁడవైనఓస్వామీ ! నీయతిసుందరంబైన దివ్యవిగ్రహమును నేను సేవించినను, నాకర్మానుగుణముగానతిహేయమైన సంసారమందుఁబడద్రోసితివి. దానిని విడిపించుకొనుటకసమర్థుఁడనైయున్నాను. ఈసంసారమునుగూఁడ నీవే పోగొట్టవలయునని. ౫.

పుఱమఱక్కట్టిక్కొణ్డిరువల్వినైయార్ కుమైక్కుమ్ *
ముఱైముఱై యాక్కై పుగలొழிయ క్కణ్డుకొణ్డొழிన్దేన్ *
నిఱముడై నాల్ తడన్దోళ్ శెయ్యవాయ్ శెయ్యతామరైక్కణ్ *
అఱముయలాழிయఙ్గై క్కరుమేనియమ్మాన్ఱన్నైయే. ౬.

అ॥ పుఱమ(కొన)బైటతెలియక, కట్టిక్కొణ్డు - చుట్టుకొని, ఇరు - పుణ్యపాపములనిరెండువిధంబులైన, వినై - కర్మములచే, ఆర్ - పూర్ణులైన సంసారులను, కుమైక్కుమ్ - బాధపెట్టుచున్న, ముఱైముఱై - క్రమముగావచ్చుచున్న, ఆక్కై - శరీరమందు, పుగలొழிయ - ప్రవేశించకుండుండునటుల, నిఱముడై - సౌన్దర్యముగల, తడమ్ - విశాలమైన, నాల్ తోళ్ - నాలుగుభుజములనున్న, శెయ్య - ఎఱ్ఱనైన, వాయ్ - అధరమునున్న, శెయ్య - ఎఱ్ఱనైన, తామరై - తామరపుష్పమువంటి, కణ్ - నేత్రములనున్న, అఱమ్ - ధర్మమార్గమందు, ముయల్ - యత్నముచేయుచున్న, ఆழி - సుదర్శనముగల, అమ్ - సుందరమైన, కై - శ్రీహస్తమునున్న, కరుమేని - శ్యామమైనదివ్యవిగ్రహమునున్నగల, అమ్మాన్ఱన్నై - స్వామియైనశ్రియఃపతిని, కణ్డుకొణ్డొழிన్దేన్ - సాక్షాత్కరించితిని.

తా॥ పుణ్యపాపములచే మిక్కిలిబాధకమైన యీసంసారమందు నికప్రవేశించకుండునట్లు అతిసుందరంబులైన దివ్యావయవములుగల శ్రీమన్నారాయణుని సేవించితినని ౬.

అమ్మానాయ్ప్పిన్నుమ్ ఎమ్మానాయ్ ఆయనార్ *
ఎమ్మాపావియర్క్కుమ్ విదివాయ్క్కిన్ఱువాయ్క్కుమ్ కణ్డీర్ *

కై మ్మాతునోయ్యొழித్తామెన్ను కై తలై పూశలిట్టే*
మెయ్యమ్మాలాయొழிన్దే నెమ్బిరానుమెన్మేలానే. ౭.

అ॥ అమ్మాన్ - స్వామియు, ఆழி - చక్రధరుఁడును, పిరాన్ - సర్వేశ్వరుఁడునైన, అవన్ - ఆశ్రయఃపతి, ఎవ్విడత్తాన్ - ఎచ్చటనున్నాడు? యాన్ - నేను, ఆర్ - ఎట్టివాఁడను? ఎమ్మాపావియర్క్కుమ్ - ఎంతగొప్పపాపాత్ములకును, విధి - భగవత్కృప, వాయ్క్కిన్ఱు - ఫలించుకాలమువచ్చినప్పుడు, వాయ్క్కుమ్కణ్డీర్ - ఫలించుననుమండీ. కైమ్మా - గజేన్ద్రుని, దుయ్యర్గణముక్కు, తున్బు - దుఃఖమును, ఒழித్తాయెన్ను - పోగొట్టినవాఁడా! యనిచెప్పి, కై - చేతులను, తలై - శిరస్సుమీఁద, పూశలిట్టు - మొగిడ్చి, మెయ్ - యథార్థమైన, మాలాయొழி న్దేన్ - భక్తిగలవాఁడనైతిని, ఎమ్బిరానుమ్ - సర్వేశ్వరుఁడును, ఎన్మేలాన్ - నాయందువ్యామోహముకలవాఁడైనాడు.

తా॥ సర్వజ్ఞుఁడై సర్వశక్తుఁడై సకలకల్యాణ గుణాకరుఁడైన సర్వేశ్వరుఁడెక్కడ? అత్యన్తనికృష్టుఁడనైన నేనెక్కడ? ఇట్లున్నను, ఓగజేన్ద్రరక్షకుఁడాయనిచెప్పి నేనంజలిచేసిన వెంటనే నాకుఁబరమభక్తిని గలిగించి నాయందతివ్యామోహముగలవాఁడైయున్నాడు. గానభగవంతుఁడు, ఎంతపాపినిగూడ గటాక్షింపవలయునని దలంచినయెడల కటాక్షించకతప్పదని. ౭.

మేలాత్తేవర్గళుమ్ నిలత్తేవరుమ్మేవిత్తొழுమ్*
మాలార్వన్దిననా ళడియేన్మనత్తేమన్నినార్*
శేలేయ్క్కణ్ణియరుమ్ పెరుఞ్జెల్వముమ్నన్మక్కళుమ్*
మేలాత్తాయ్తన్దైయుమ్ మవరేయినియావారే. ౮.

అ॥ మేలాత్తేవర్గళుమ్-పరమపదవాసులైన నిత్యసూరులును, నిలత్తేవరుమ్-భూమియందలి శ్రీవైష్ణవులును, మేవి - ఆశపడి, తొழுమ్ - ఆశ్రయింపదగిన, మాలార్ - సర్వేశ్వరుఁడు, వన్దు-వచ్చి, ఇన్నాళ్ - ఇప్పుడు, ఎన్మనత్తే-నామనస్సునందు, మన్నినార్-అమరియుండెను. శేలేయ్-మత్స్యముతో సమానమైన, కణ్ణియరుమ్ - నేత్రములుగల స్త్రీలును, పెరుమ్శెల్వముమ్ - మహదైశ్వర్యమును, నల్మక్కళుమ్ - సత్పుత్రులును, మేలా - మిక్కిలిప్రీతిగల, తాయ్తన్దైయుమ్-తల్లితండ్రులును, ఇని - ఇఁకమీఁద, అవరే - ఆసర్వేశ్వరుఁడే, ఆవార్ - అగును.

తా॥ నిత్యసూరులును భూసురులైన శ్రీవైష్ణవులు నత్యాదరముతో గొనియాడదగిన సర్వేశ్వరుఁడిప్పుడు నాహృదయమందు వాసంచేసియున్నాడుగాన నిఁకమీఁద నాకువాఁడే సకలవిధబంధువని నేనునమ్మితినని. ౮.

ఆవారార్ తుణైయెన్ఱలైనీర్క్కడలుళ్ళழுన్దుమ్
నావాయ్పోల్*పిఱవిక్కడలుళ్ నిన్ఱు నాన్ తుళఙ్గ*
తేవార్ కోలత్తొడుమ్ తిరుచ్చక్కరమ్ శఙ్గినొడుమ్*
ఆవా వెన్ఱరుళి అడియేనొడుమానానే. ౯.

తిరునగరిశ్వామియైన్, శడగోపన్ - నమ్మాழ்వార్లు పాడించినవియు, శీర్ - శ్లాఘ్యమైన, వణ్ణమ్ - ప్రకారముగలవియు, ఒణ్ - సుందరములును, తమిழ்గళ్ - ద్రావిడరూపములైన, ఇవై - ఈ, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, అర్వణ్ణత్తాల్ - ఆదరప్రకారముతో (ఆదరముతో), ఉరైప్పార్ - అధ్యయనముచేయువారు, పొలిన్దు - సకలగుణపూర్ణులై, అడిక్కీழ் - సర్వేశ్వరునియొక్క శ్రీపాదములక్రింద, పుగువార్ - ప్రవేశింతురు.

తా॥ కాళమేఘశ్యాముడై పద్మనేత్రుడైన శ్రియఃపతివిషయమై సకలసమృద్ధిగల కురుకాపురాధీశులైన నమ్మాழ்వార్లు పాడించిన సమస్తగుణపూర్ణంబులైన యీపదిపాశురముల నాదరముతో నధ్యయనముచేయువారు శ్రియఃపతియొక్క శ్రీపాదములను జేరుదురని ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౨ - వ తిరువాయ్‌మొழி.

—o—

అవతారిక:— "ఒన్ఱుమ్‌తేవుమ్" అనెడి తిరువాయ్‌మొழிలో భగవత్పరత్వమును చేతనుల కుపదేశించగా నప్పుడు శ్రీవైష్ణవులైనవారియొక్క శ్రీవైష్ణవశ్రీకి మఙ్గళాశాసనము చేయుచున్నారు.

‡‡ పొలిగపొలిగపొలిగ పోయిற்ఱు వల్లుయిర్‌చ్చాపమ్*
నలియుమ్‌నరగముమ్‌నైన్ద నమనుక్కిఙ్గుయాదొన్ఱుమిల్లై*
కలియుమ్‌కెడుమ్‌కణ్డుకొణ్మిన్ కడల్వణ్ణన్ పూదఙ్గళ్ మణ్మేల్*
మలియప్పుగున్దిశైపాడి యాడియుழిதరక్కణ్డోమ్. ౧.

అ॥ కడల్వణ్ణన్ - సముద్రమువంటి (గంభీరమైన) స్వభావముగల శ్రీమన్నారాయణునియొక్క, పూదఙ్గళ్ - దాసులు, మణ్మేల్ - భూమియందు, మలియ - సంపూర్ణముగా. పుగున్దు - ప్రవేశించి, ఇశైపాడి - గానముతో పాడి, ఆడి - నృత్యముచేసి, ఉழிதర - యథేచ్ఛముగాసఞ్చరించునటుల, కణ్డోమ్ - చూచితిమి. ఉయిర్ - చేతనులయొక్క, వల్ - కూరమైన, శాపమ్ - పాపము, పోయిற்ఱు - నశించినది. నలియుమ్ - బాధపెట్టుచున్న, నరగముమ్ - నరకముగూడ, నైన్ద - శిథిలమైనది. ఇఙ్గు - ఈలోకమందు, నమనుక్కు - యమునికి, యాదొన్ఱుమ్ - ఏపనియు, ఇల్లై - లేదు, కలియుమ్ - కలియుగమును, కెడుమ్ - నశించును, కణ్డుకొణ్మిన్ - చూడుడు. పొలిగపొలిగపొలిగ - సమృద్ధికలుగుగాక సమృద్ధికలుగుగాక సమృద్ధికలుగుగాక.

తా॥ ఓచేతనులారా! ఈయాశ్చర్యమును వినుడు. ఈభూలోకమందలి శ్రీవైష్ణవులు భగవద్గుణములను పాడుచు పరవశులై యథేచ్ఛముగా సర్వత్రసంచరించుచున్నారు. గానప్రాణులపాపములు నశించినవి నరకమునకుబోవువారును యమదండనకు లోబడువారెవ్వరులేరు. ఈకలియుగము కృతయుగము గానున్నది. ఈసమృద్ధియెల్లప్పుడు నుండునుగాక యని. ౧.

కణ్డోమ్ కణ్డోమ్ కణ్డోమ్ కణ్ణుక్కినియన కణ్డోమ్*
తొణ్డీరెల్లీరుమ్ వారీర్ తొழுదు తొழுదు నిన్ఱార్ త్తుమ్*
వణ్డార్ తణ్ణన్దుழாయాన్ మాదవన్ పూదఙ్గళ్ మణ్మేల్*
పణ్డాన్ పాడి నిన్ఱాడి ప్పరన్దు తిరిగిన్ఱనవే. ౨.

అ॥ వణ్డు - తుమ్మెదలచే, ఆర్ - పూర్ణమైన, తణ్ - చల్లనైన, అమ్ - సుందరమైన, తుழாయాన్ - తిరుత్తుழாయిమాలచేనలఙ్కరింపఁబడిన, మాదవన్ - శ్రియఃపతియొక్క, పూదఙ్గళ్ - దాసులు, తాన్ - తాము, మణ్ మేల్ - భూలోకమందు, పణ్ పాడి - గానముజేసి, నిన్ఱు - నిలిచియుండి, ఆడి - నృత్యముజేసి, పరన్దు - అంతట వ్యాపించి, తిరిగిన్ఱనర్ - సఞ్చరించుచున్నారు. కణ్డోమ్ కణ్డోమ్ కణ్డోమ్ - చూచితిమి చూచితిమి చూచితిమి. కణ్ణుక్కు - నేత్రములకు, ఇనియన - ప్రియమును, కణ్డోమ్ - చూచితిమి. తొణ్డీర్ - ఓ భాగవతులారా! ఎల్లీరుమ్ - ఎల్లరును, వారీర్ - రండు. తొழுదు తొழுదు - ఆశ్రయించియాశ్రయించి, నిన్ఱు - ఉండి, ఆర్త్తుమ్ - హర్షముతో మంగళాశాసనము జేసెదము

తా॥ ఓ భాగవతులారా! భగవద్గుణములను బాడుచు భూలోకమంతటవ్యాపించి సంచరించుచున్న శ్రీవైష్ణవులనత్యానన్దముతో సేవించితిమి. మనము నాసర్వేశ్వరునికి మంగళాశాసనము జేసెదము రండు యని. ౨.

తిరియుమ్ కలియుగమ్ నీఙ్గి త్తేవర్ గళ్ తాముమ్ పుగున్దు*
పెరియ కిదయుగమ్ పఱ్ఱి ప్పేరిన్బ వెళ్ళమ్ పెరుగ*
కరియ ముగిల్వణ్ణనెమ్మాన్ కడల్వణ్ణన్ పూదఙ్గళ్ మణ్మేల్*
ఇరియ ప్పుగున్దిశై పాడి యెఙ్గుమిడఙ్గొణ్డనవే. 3.

అ॥ తిరియుమ్ - వస్తుస్వభావములను మార్చెడి, కలియుగమ్ - కలియుగము, నీఙ్గి - తొలఁగి, పెరియ - గొప్ప, కిదయుగమ్ - కృతయుగము, పఱ్ఱి - ప్రవేశించి, తేవర్ గళ్ - నిత్యసూరులు, తాముమ్ - స్వయముగానే, పుగున్దు - ప్రవేశించునట్లును, పేర్ - మహత్తైన, ఇన్బ వెళ్ళమ్ - ఆనన్దసాగరము, పెరుగ - వృద్ధిబొందునట్లును, కరియ - నీలమైన, ముగిల్ - మేఘమువంటి, వణ్ణన్ - కాన్తిగల, కడల్వణ్ణన్ - సముద్రమువంటిస్వభావముగల, ఎమ్మాన్ - మనస్వామియొక్క, పూదఙ్గళ్ - భక్తులు, మణ్ మేల్ - భూమియందు, ఇరియ - ఆరవారమగునట్లు, పుగున్దు - ప్రవేశించి, ఇశైపాడి - గానముజేసి, ఎఙ్గుమ్ - సమస్తభూములను, ఇడఙ్గొణ్డనవే - తమకుస్థానములుగా జేసికొనిరిగదా.

తా॥ యీపాపిష్ఠమైన కలియుగము తొలఁగి కృతయుగము ప్రవేశించునట్లును, నిత్యసూరులు పరమపదమునుంచి భూలోకమునకు వచ్చునట్లును, భగవద్గుణానుభవముచే బ్రహ్మానన్ద ప్రవాహమంతటవ్యాపించునట్లును, శ్రీవైష్ణవులంతట వ్యాపించి భగవద్గుణానుభవము జేయుచున్నారని. 3.

ఇడఙ్గొళ్ శమయత్తై యెల్లా మెడుత్తుక్కళైవన పోలే*
తడఙ్గడల్ పళ్ళి ప్పెరుమాన్ తన్నుడై పూదఙ్గళేయాయ్*

కిడన్దుమిరున్దుమెழுన్దుమ్ కీదమ్బలవలపాడి*
నడన్దుమ్పఅన్దుమ్కునిత్తుమ్ నాడగమ్ శెయ్గిన్ఱనవే. ౪.

అ॥ ఇడమ్కొళ్ - వ్యాపించియున్న, శమయత్తై యెల్లామ్ - దుర్మతములన్నిటిని, ఎడుత్తు-తీసి, కళైవనపోలే - సమూలముగానశింపజేయువారువలె, తడమ్ - విశాలమైన, కడల్ - సముద్రమందు, పళ్ళి - పవ్వళించియున్న, పెరుమాన్ తన్నుడై, - సర్వేశ్వరునియొక్క, పూదఙ్గళ్ - భక్తులు, అయ్ - వ్యాపించి, కిడన్దుమ్ - పవ్వళించియుండియు, ఇరున్దుమ్ - కూర్చుండియు, నడన్దుమ్ - నడచియు, పఅన్దుమ్ - పఱుగెత్తియు, కునిత్తుమ్ - నృత్యముజేసియు, నాడగమ్ - నాటకమును, శెయ్గిన్ఱన - చేయుచున్నారు.

తా॥ శ్రీవైష్ణవులు భూలోకమంతట వ్యాపించి, ముందున్న బాహ్యకుదృష్టిమతములను నిరసించి, సర్వేశ్వరునియొక్క గుణములను పాడుచు నృత్యముజేయుచున్నారని. ౪

శెయ్గిన్ఱదెన్ కణ్ణుక్కొన్ఱే యొక్కిన్ఱ దివ్వులగత్తు*
వైగున్దన్ పూదఙ్గళేయాయ్ మాయత్తినాలెఙ్గుమ్మన్ని*
ఐయమొన్ఱిల్లై యరక్కర్ అశురర్ పిఅన్దీరుళ్ళీరేల్*
ఉయ్యుమ్వగై యిన్ఱితొణ్డీర్ ఊழிపెయర్త్తిడుమ్కొన్ఱే. ౫.

అ॥ వైగున్దన్ - శ్రీవైకుంఠనాథునియొక్క, పూదఙ్గళ్ - భక్తులు, అయ్ - వ్యాపించి, మాయత్తినాల్ - తమఇచ్ఛచేత, ఇవ్వులగత్తు - ఈలోకమందు, ఎఙ్గుమ్ - అంతట, మన్ని - అమరియుండి, శెయ్గిన్ఱదు - చేయువ్యాపారము, ఎన్ కణ్ణుక్కు - నానేత్రములకు, ఒన్ఱేయొక్కిన్ఱదు - ఒకవిధముగా దోచుచున్నది. తొణ్డీర్ - ఓచపలులారా! అరక్కర్ అశురర్ - రాక్షసులుగాను అసురులుగాను, పిఅన్దీరుళ్ళీరేల్ - పుట్టియుండిరేని, ఉయ్యుమ్వగై - (మీకు) జీవించువిధము, ఇన్ఱి - లేదు. ఊழி - ఈకలికాలమును, పెయర్త్తు - నశింపజేసి, కొన్ఱిడుమ్-(మిమ్ములను) చంపుదురు, ఐయమ్ - (ఇందులో) ఒకఅబద్ధము, ఇల్లై - లేదు.

తా॥ ఓసంసారులారా! మీరు రాక్షస ప్రకృతులుగాబట్టి భగవద్విముఖులై యుండిరేని, ఇప్పుడీలోకమంతట వ్యాపించియున్న శ్రీవైష్ణవులు మిమ్ములను నిస్సంశయముగా ధ్వంసము జేయుదురుగాన మీదుస్స్వభావములను వదలి వారినాశ్రయించుడియని. ౫.

కొన్ఱుయిరుణ్ణుమ్విశాది పగై పశితీయనవెల్లామ్*
నిన్ఱివ్వులగిల్ కడివాన్ నేమిప్పిరాన్ తమర్ పోన్దార్*
నన్ఱిశైపాడియు న్తుళ్ళియాడియుమ్ ఞాలమ్బరన్దార్*
శెన్ఱుతొழுదుయ్మ్మిన్ తొణ్డీర్ శిన్దైయైచ్చెన్నిఱుత్తియే. ౬.

అ॥ ఉయిర్ - ప్రాణులను, కొన్ఱు - చంపి, ఉణ్ణుమ్ - భక్షించుచున్న, విశాది - వ్యాధియు, పగై - ద్వేషమును, పశి - ఆకలియు, తీయనవెల్లామ్ - (ఇవిమొదలగు) దోషములన్నియు, ఇవ్వులగిల్ నిన్ఱు - ఈలోకమునుండి, కడివాన్ - పోగొట్టుటకై, నేమిప్పిరాన్ - చక్రధరుడైన

సర్వేశ్వరునియొక్క, తమర్ - భక్తులు, పోన్దార్-అవతరించినారు, నన్దు - చక్కగా, ఇశైపాడి యుమ్ - గానముజేసియు, తుళ్ళి - ఎగిరి, ఆడియుమ్ - నృత్యముజేసియు, ఞాలమ్ - భూమి యందు, పరన్దార్ - వ్యాపించిరి. తొణ్డీర్ - ఓచపలులారా! శిన్దైయై - మనస్సును, శెమ్ నిఱుత్తి - చక్కగానిలిపి, శెన్ఱు - వెళ్ళి, తొழுదు - (వారిని) ఆశ్రయించి, ఉయ్మ్మిన్ - ఉజ్జీవింపుడి.

తా॥ ఓసంసారులారా! ఈలోకమందలి సకలదుఃఖములను బోగొట్టుటకై శ్రీవైష్ణవులు వచ్చియవతరించి భగవద్గుణములను మిక్కిలి యాదరముతో ననుభవించుచు నంతట వ్యాపించిరి. మీరును మీమనస్సును సంసారమునుంచి మఱలించి వారిని యాశ్రయించుడియని, ౬.

నిఱుత్తినుమ్ముళ్ళత్తుక్కొళ్ళుమ్ తెయ్వఙ్గళుమ్మైయుయ్యక్కొళ్*
మఱుత్తుమవనోడేకణ్డీర్ మార్క్కణ్డేయనుమ్కరియే*
కఱుత్తమనమొన్ఱుమ్వేణ్డా కణ్ణనల్లాల్ తెయ్వమిల్లై *
ఇఱుప్పదెల్లామవన్మూర్త్తియాయవర్క్కేయిఱుమినే. ౭.

అ॥ నుమ్ముళ్ళత్తు - మీమనస్సునందు, నిఱుత్తిక్కొళ్ళుమ్ - నిలుపుకొనిన, తెయ్వఙ్గళ్ - దేవతలు, ఉమ్మై - మిమ్ములను, ఉయ్యక్కొళ్ - రక్షించునప్పుడు, మఱుత్తుమ్ - తిరిగియు, అవనోడేకణ్డీర్ - ఆసర్వేశ్వరునియొక్క అనుగ్రహము చేతనే సుమండీ. మార్క్కణ్డేయనుమ్-(దీనికి) మార్కణ్డేయఋషి, కరి - సాక్షి. కఱుత్త - (దేవతాన్తరమందు పరత్వబుద్ధియనెడి) మాలిన్యముగల, మనమ్ - మనస్సు, ఒన్ఱుమ్-ఒకటియు, వేణ్డా-వలదు, కణ్ణనల్లాల్ - శ్రీకృష్ణునికంటె, తెయ్వమిల్లై - వేఱుదేవతలేదు, ఇఱుప్పదెల్లామ్ - నిత్యనైమిత్తికకర్మములన్నిఁటిని, అవన్మూర్త్తియాయ్ - (దేవతాన్తరములను) ఆసర్వేశ్వరునికి శరీరములనియెంచి, అవర్క్కే - ఆదేవతలకే, ఇఱుమిన్ - సమర్పించుడి.

తా॥ ఓ అవైష్ణవులారా! మీరు దేవతాన్తరములనుభజించినను ఆదేవతలు మిమ్ములను రక్షించునప్పుడు సర్వేశ్వరుఁడు తమకిచ్చిన ఫలప్రదత్వశక్తిచేతనే రక్షించునుగాని స్వయముగా రక్షించుటకు ఆదేవతలకు శక్తిలేదు. ఇందుకు మార్కణ్డేయుఁడేసాక్షి. గాన మీరు దేవతాన్తరములయందుఁ బరత్వబుద్ధినివదలి శ్రీమన్నారాయణుఁడే పరదేవతయని నమ్ముడి మీరుసేసెడి కర్మములలోనైన ఒకటి దేవతాన్తరవిషయమైయున్నను ఆకర్మములు ఆదేవతకన్తర్యామియైన శ్రీమన్నారాయణునికే జేరునవిదలంచి జేయుఁడియని. ౭.

ఇఱుక్కుమిఱైయిఱుత్తుణ్ణ వెవ్వులగుక్కుమ్తన్మూర్త్తి*
నిఱుత్తినాన్ తెయ్వఙ్గళాగ వత్తెయ్వనాయగన్దానే*
మఱుతిరుమార్వనవన్ఱన్ పూదఙ్గళ్కీదఙ్గళ్పాడి*
వెఱుప్పిన్ఱిఞాలత్తుమిక్కార్ మేవిత్తొழுదుయ్మ్మినీరే. ౮.

అ॥ ఇఱుక్కుమ్ - అనష్ఠింపఁబడగిన, ఇఱై - కర్మములచే, ఇఱుత్తు - ఆరాధించి, ఉణ్ణ - తమతమ యభీష్టములబొందుటకై, ఎవ్వులగుక్కుమ్ - నానారుచిగల సకల చేతనులకొఱకై, తన్

మూర్ త్తి - తనశరీరములైన దేవతాన్తరములను, అత్తెయ్వనాయగన్ తానే - ఆదేవాధిదేవుఁడే, తెయ్వజ్గళాగ - దేవతలగా, నిఱుత్తినాన్ - ఏర్పఱచెను. (గాన). మఱు - శ్రీవత్సమనెడిచిహ్నమును, తిరుమార్బన్ - సుందరమైన వక్షస్థలమందుగల, అవన్ తన్ - ఆశ్రియఃపతియొక్క, పూదజ్గళ్ - భక్తులు, కీదజ్గళ్ పాడి - (భగవద్గుణములను) పాటలగాపాడి, వెఱుప్పిన్ఱి - జిహాసలేక, ఞాలత్తు - భూమియందు, మిక్కార్ - నిండియున్నారు. నీర్ - మీరు, మేవి - (వారిని) సమీపించి, తొழுదు - ఆశ్రయించి, ఉయ్మ్మిన్ - ఉజ్జీవించుడి.

తా॥ బ్రహ్మరుద్రాదులనుగూడ దేవతలగా శాస్త్రమందుఁజెప్పియున్నను, సాత్త్వికులనియు రాజసులనియు తామసులనియు మూడువిధములైన చేతనులు తమతమ యిచ్ఛానుసారముగా తమ తమయొక్క ప్రకృతిగల దేవతల నారాధించి వారివారి కోరికను బొందుటకై తన శరీరభూతులైన బ్రహ్మరుద్రాదులను సర్వేశ్వరుఁడే దేవతలగా నేర్పఱచెనుగాన మీరు వారిని వదలి సత్త్వప్రకృతిగలవారై, శ్రీవత్సాఙ్కునియొక్క గుణానుభవముజేయుచున్న శ్రీవైష్ణవుల నాశ్రయించి యుజ్జీవించుడియని. ౮.

మేవిత్తొழுదుయ్మ్మినీర్ గళ్ వేదప్పునిదవిరుక్కై*
నావిఱ్కొణ్డచ్చుదన్ఱన్నై ఞానవిదిపిழையామే*
పూవిల్ పుగైయుమ్విళక్కుమ్ శాన్దముమ్నీరుమ్మలిన్దు*
మేవిత్తొழுమడియారుమ్ పగవరుమ్మిక్కదులగే. ౯.

అ॥ వేదమ్ - వేదమందు సాభూతమై, పునిదమ్ - పరిశుద్ధమైన, ఇరుక్కై - పురుషసూక్తాది ఋక్కులను, నావిఱ్కొణ్డు - నాలికలోనంచుకొని, (అనుసంధించి) ఞానవిది - భక్తిచే జేయఁదగిన కైఙ్కర్యమందు, పిழையామే - తప్పక, పూవిల్ - పుష్పములతో గూడియున్న, పుగైయుమ్ - ధూపమును, విళక్కుమ్ - దీపమును, శాన్దముమ్ - చన్దనమును, నీరుమ్ - జలమును, మలిన్దు - పూర్ణముగా సంపాదించుకొని, మేవి - సమీపించి, అచ్చుదనై - సర్వేశ్వరుని, తొழுమ్ - ఆశ్రయించుచున్న, అడియారుమ్ - భక్తులచేతను, పగవరుమ్ - ధ్యానముజేయుచున్న ఋషులచేతను, ఉలగు - లోకము, మిక్కదు - పూర్ణమైయున్నది. (గానమీరును), మేవి - సమీపించి, తొழுదు - ఆశ్రయించి, ఉయ్మ్మినీర్ గళ్ - ఉజ్జీవించుడి.

తా॥ ఓసంసారులారా! ఇప్పుడీలోకమంతట, పురుషసూక్తాదులను జెప్పి పుష్పధూపదీపాదులచే భగవత్కైఙ్కర్యమును జేయుచున్న భక్తులచేతను, భగవద్గుణానుసంధానముజేయుచున్న భాగవతులచేతను సర్వత్ర నిండియున్నదిగాన మీరును వానిని యాశ్రయించియుజ్జీవించుడీయని ౯.

మిక్కవులగుగళ్ తోఱుమ్ మేవికణ్ణన్ తిరుమూర్ త్తి*
నక్కపిరానోడయను మిన్దిరనుమ్ముదలాగ*
తొక్కవమరర్ కుழாజ్గళ్ ఎజ్గుమ్పరన్దనతొణ్డీర్*
ఒక్కత్తొழுగిఱ్పిరాగిల్ కలియుగమొన్ఱుమిన్ఱే. ౧౦.

అ॥ నక్క - పిరానోడు - రుద్రునితోఁగూడ, అయనుమ్ - బ్రహ్మయు, ఇన్దిరనుమ్ - ఇంద్రుండును, ముదలాగ - వీరుమొదలు గాఁగల, తొక్క - చేరియున్న, అమరర్ కుழாங్గళ్ - దేవసమూహములు, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, తిరుమూర్త్తి - తిరుమేనును, మేవి-ఆశ్రయించి, మిక్క - సమృద్ధములైన, ఉలగుగళ్ తోఱుమ్ - ప్రతిలోకములయందును, ఎజ్గుమ్ - అంతట, పరన్దన - సమృద్ధమైన సంపత్తుగలవారైరి. తొణ్డీర్ - విషయాన్తరమందాసక్తిగలవారా! ఒక్క - వారితోడ, తొழுదుయ్మిన్ - ఆశ్రయించిరేని, కలియుగమ్ - కలియుగము, ఒన్ఱుమ్ - కొంచెము, ఇల్లై - నిలవదు.

తా॥ ఓసంసారులారా! బ్రహ్మరుద్రేన్ద్రాది సమస్తదేవతలుగూడ శ్రీమన్నారాయణుని యాశ్రయించియే తమతమ యైశ్వర్యమును బొందిరిగాన, మీరును వానినే యాశ్రయించినయెడల క్షేమముపడవచ్చును. మీరందరు శ్రీవైష్ణవులయినచో కలియుగమే నశించునని ౧౦.

** కలియుగమొన్ఱుమిన్ఱిక్కే తన్నడియార్క్కరుళ్ శెయ్యుమ్*
మలియుమ్శుడరొళిమూర్త్తి మాయప్పిరాన్ కణ్ణన్ఱన్నై*
కలివయల్ తెన్నన్ కురుగూర్ క్కారిమాఱన్ శడగోపన్*
ఒలిపుగழ் ఆయిరత్తిప్పత్తు ఉళ్ళత్తై మాశఱుక్కుమే. ౧౧.

అ॥ తన్నడియార్క్కు - తనభక్తులకు, కలియుగమ్ - కలిదోషము, ఒన్ఱుమిన్ఱిక్కే - ఒకటియులేక పోవునట్లు, అరుళ్ శెయ్యుమ్-కృపజేయువాఁడును, మలియుమ్ - వృద్ధిబొందుచున్న, శుడరొళి - మిక్కిలితేజస్సుగల, మూర్త్తి - తిరుమేనుగలవాఁడును, మాయప్పిరాన్ - ఆశ్చర్యగుణచేష్టితములుగలవాఁడునైన, కణ్ణన్ఱన్నై - శ్రీకృష్ణునివిషయమై కలి-సమృద్ధమైన, వయల్ - పొలములుగల, తెన్ - దక్షిణమందున్న, నల్ - సుందరమైన, కురుగూర్-తిరునగరికి స్వామియైన, కారి-కారియనెడురాజుయొక్క నంశమందవతరించిన, మాఱన్ - దుర్దృష్టులను నిరసించువారైన, శడగోపన్-నమ్మాழ்వార్లు ప్రసాదించిన, ఒలి-ప్రసిద్ధమైన, పుగழ் - కీర్తిగల, ఆయిరత్తు-వెయ్యిపాశురములలో, ఇప్పత్తు - ఈపదిపాశురములును, ఉళ్ళత్తై - మనస్సులోనున్న, మాశు - దోషములను, అఱుక్కుమ్ - పోఁగొట్టును.

తా॥ భక్తానుగ్రహ తత్పరుఁడై నిరవధిక తేజోమయవిగ్రహుఁడైన శ్రీకృష్ణుని విషయమై సకలసంపత్సమృద్ధిగల కురుకాపురాధీశులైన నమ్మాழ்వార్లుసాదించిన యీపదిపాశురముల నధ్యయనముజేయువారు దేవతాన్తరమందు పరత్వబుద్ధిని వదలి శ్రీవైష్ణవులగుదురని ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## 3-వ తిరువాయ్మొఴి.

---

అవతారిక — సర్వేశ్వరునియొక్క వాత్సల్య సౌశీల్యసౌందర్యాదికల్యాణగుణములనను భవించిన నమ్మాఴ్వార్లు అట్టిసర్వేశ్వరుని ప్రత్యక్షముగాననుభవింపవలయునని యాశించి యదిలభింపక *"మడలూర్గై" అనెడి వ్యాపారమునుజేసియైనను సర్వేశ్వరుని బొందవలయునని యత్నము జేయుచున్నారు.

‡‡ మాశఱుశోది యెన్ శెయ్యవాయ్మణిక్కున్ఱత్తై*
ఆశఱుశీలనై యాదిమూర్త్తియై నాడియే*
పాశఱవెయ్ది యఱివిఴన్దెనై నాళైయమ్*
ఏశఱుమూరవర్ కవ్వై తోఴీ యెన్ శెయ్యుమే. ౧.

అ॥ మాశు - మాలిన్యము, అఱు - లేని, శోది - తేజస్సుగలవాఁడును, శెయ్య - ఎఱ్ఱనైన, వాయ్ - అధరముగలవాఁడును, ఎన్ - నాకు స్వామియు, మణిక్కున్ఱత్తై - మాణిక్యపర్వతమువలెనున్నవాఁడును, ఆశు - దోషము, అఱు - లేని, శీలనై - స్వభావముగలవాఁడును, ఎయ్ది - పొంది, అఱివు - బుద్ధిని, ఇఴన్దు - పోగొట్టుకొని, ఎనై నాళైయమ్ - ఎన్నిదినములుగానుంటిమి, తోఴీ - ఓసఖీ! ఏశఱుమ్ - నిందించడములోదృఢపడియున్న, ఊరవర్ - ఊరువారియొక్క, కవ్వై - అపవాదము, ఎన్ శెయ్యుమ్ - ఏమి చేయును.

తా॥ చేయఁదగనికృత్యమును జేసినకొమ్మల లోకులు నిందించరాయని సఖియడుగగా, ఓసఖీ! తెలివిగలవారిట్లుజేయఁగూడదు యథార్థమే, సర్వేశ్వరునియొక్క నిర్మలమైన దివ్యావయవసౌందర్యమునున్న సౌశీల్యాది కల్యాణగుణములనున్న జూచి యట్టివానిని పొందక మఱిపోగొట్టుకొని ఖేదించుచున్న మనకు లోకులనింద యేమిజేయునని బదులుచెప్పుచున్నారు ౧.

ఎన్ శెయ్యుమూరవర్ కవ్వై తోఴీయినినమ్మై*
ఎన్ శెయ్యతామరైక్కణ్ణనెన్నై నిఱైకొణ్డాన్*
మున్ శెయ్యమామైయిఴన్దు మేనిమెలివెయ్ది*
ఎన్ శెయ్యవాయుఙ్గరుఙ్గణుమ్ పయప్పూర్న్దవే. ౨.

అ॥ ఎన్ - నాయొక్కస్వామియైన, శెయ్యతామరైక్కణ్ణన్ - ఎఱ్ఱని తామరపువ్వువంటి నేత్రములుగల సర్వేశ్వరుఁడు, ఎన్నై - నాయొక్క, నిఱైకొణ్డాన్ - గుణపూర్తినపహరించెను. మున్ - మునుపున్న, శెయ్యమామై - చక్కనిసౌందర్యమును, ఇఴన్దు - పోగొట్టు

* భర్తదేశాన్తరమందుండి ఋతుకాలమందు రానియెడల వానివిరహమును సహింపజాలక తాటికొమ్మను తీసికొని స్తనాదులను ఛేదించుకొని వివస్త్రయై యాతాటికొమ్మను రెండుతొడల నడుమపెట్టుకొనిసంచరించుచు భార్యచేయు వ్యాపారము—ఇట్టి తనభార్యయొక్క వ్యాపారమునువిని తత్క్షణమందు భర్త వచ్చితీరునుట.

కొని, మేని - శరీరము, మెలివెయ్ది - వాడిపోయి, ఎన్ - నాయొక్క, శెయ్యవాయుమ్ - ఎఱ్ఱనియధరమును, కరుజ్జణ్ణుమ్ - నల్లని నేత్రములును, పయప్పూ - వైవర్ణ్యమును, ఊర్న్ద - పొందినవి. తోழீ - ఓసఖీ! ఇని - ఇఁకమీద, నమ్మై-మమ్ములను, ఊరవర్ కవ్వై - ఊరువారి యపవాదము, ఎన్ శెయ్యుమ్ - ఏమిచేయును.

తా॥ ఓసఖీ! పద్మనేత్రుఁడు తనసౌందర్యమును నాకుఁగనుపఱచి వ్యామోహముగలుగ జేసి నన్ను మానభంగపఱచెను. నాశరీరమందు ముందున్న సౌందర్యమంతయు నశించి మేను తెల్లపడిపోయినది. ఇఁకలోకుల యపవాదముచే మనకేమికావలయునని. ౨.

ఊర్న్దశగడముదై త పాద త్తన్ పేయ్ ములై*
శార్న్దుశువైత్త శెవ్వాయ నెన్నై నిఱై కొణ్డాన్*
పేర్న్దుమ్ పెయర్న్దుమ్ అవనోడల్లా లొన్ శొల్లిలేన్*
తీర్న్దవెన్ తోழீ యెన్ శెయ్యుమూరవర్ కవ్వైయే. ౩.

అ॥ ఊర్న్ద - దొర్లుచుపయికివచ్చిన, శగడమ్ - శకటాసురుని, ఉదైత్త - తన్నిన, పాద త్తన్ - శ్రీపాదముగలవాఁడును, పేయ్ - పూతనయొక్క, ములై - స్తనములను, శార్న్దు - చేరియుండి, శువైత్త - త్రాగిన, శెమ్ - ఎఱ్ఱని, వాయన్ - అధరముగలవాఁడునైన శ్రీకృష్ణుఁడు, ఎన్నై - నాయొక్క, నిఱై - గుణపూర్తిని, కొణ్డాన్ - అపహరించెను, పేర్న్దుమ్ పెయర్న్దుమ్ - పోయివచ్చియు, అవనోడల్లాల్ - ఆసర్వేశ్వరునితోతప్ప, ఒన్ శొల్ ఇలేన్ - ఒకమాటగలవాఁడను కాను, తీర్న్ద - నాకుప్రతికూలురాలై తీరిన, ఎన్ తోழீ - ఓనాసఖీ! ఊరవర్ కవ్వై - ఊరు వారియపవాదము, ఎన్ శెయ్యుమ్ - ఏమిచేయును.

తా॥ పూతనాశకటాసురాది దుష్టులను సంహరించిన శ్రీకృష్ణుఁడు నన్ను మోహపఱచి నామానమునుతీసినను వానినివదలి వేనింకొకమాటచెప్పను. లోకులవలె నాహితంబును యోచించక నాకుపదేశించుచున్న ఓసఖీ! లోకులయపవాదము నన్నేమిచేయునని. ౩.

ఊరవర్ కవ్వై యెరువిట్టన్నై శొల్ నీర్ పడుత్తు*
ఈరనెల్ విత్తిముళైత్త నెఞ్జప్పెరుఞ్జెయ్యుళ్*
పేరమర్ కాదల్ కడల్ పురైయవిళైవిత్త*
కారమర్ మేని నమ్బణ్ణన్ తోழீ కడియనే. ౪.

అ॥ ఊరవర్ - ఊరువారియొక్క, కవ్వై - అపవాదమనెడి, ఎరువిట్టు - ఎరువుబెట్టి, అన్నై - తల్లియొక్క, శొల్ - మాటలనెడి, నీర్ పడుత్తు - నీరుకట్టి, ఈరమ్ - ఆశయనెడి, నెల్ - ధాన్యమును, విత్తి - జల్లి, ముళైత్త - మొలిచిన, నెఞ్జమ్ - మనస్సనెడి, పెరుమ్ - గొప్ప, శెయ్యుళ్ - పొలములో, పేర్ - గొప్పదై, అమర్ - అమరియున్న, కాదల్ - ఆశను, కడల్ పురైయ - సముద్రమువలె(అపరిచ్ఛిన్నముగా), విళైవిత్త - పండించినవాఁడును, కారమర్ - మేఘమువలెనున్న, మేని - తిరుమేనుగలవాఁడునైన, నమ్ కణ్ణన్ - మనశ్రీకృష్ణుఁడు, తోழீ - ఓసఖీ! కడియనే - క్రూరుఁడా ? (కాడు).

తా॥ ఓసఖీ! శ్రీకృష్ణుఁడు నాకంటికగుబడకపోయినను తనయందాశను గలుగఁజేసి లోకుల నిందచేతను తల్లియొక్క మాటలచేతను నాయాశనశించకుండ వృద్ధిబొందునట్లు జేసెనుగాన వానిని కఠినహృదయుండని చెప్పరాదని. ౪.

కడియన్ కొడియన్ నెడియమాలులగఙ్గొణ్డ
అడియన్ *అఱివరుమేనిమాయత్తన్ *ఆగిలుమ్
కొడియవెన్నెఞ్జమవనెన్ఱేకిడక్కుమెల్లే*
తుడికొళిడై మడత్తోழி యన్నైయెన్ శెయ్యుమే. ౫.

అ॥ కడియన్ - తనకార్యమునుశీఘ్రముగానెరవేర్చుకొనువాఁడుచు, కొడియన్ - ఇతరులనుదుఃఖబెట్టువాఁడును, నెడియమాల్ - గొప్పమహిమగలవాఁడును, ఉలగమ్ - లోకములను, కొణ్డ - కొలుచుకొనిన, అడియన్ - శ్రీపాదములుగలవాఁడును, అఱివు - బుద్ధికి, అరి - (తెలిసికొనుటకు) దుర్లభమైన, మేని - తిరుమేనుగలవాఁడును, మాయత్తనాగిలుమ్ - ఆశ్చర్యకరంబులైన గుణచేష్టితంబులుగలవాఁడునైనను, కొడియ - క్రూరమైన (పట్టుదలగల), ఎన్ నెఞ్జమ్ - నా మనస్సు, అవనెన్ఱే - ఆశ్రీకృష్ణుడేయని, కిడక్కుమ్ - (తలఁచి) ఉండును. ఎల్లే - ఏమాశ్చర్యమో? తుడికొళ్ - గుడుగుడుపువలెనున్న, ఇడై - నడుమునున్న, మడమ్-ఆత్మగుణములనుగల, తోழி ఓసఖీ! అన్నై - తల్లి, ఎన్ శెయ్యుమ్ - ఏమిచేయును.

తా॥ ఆశ్రీకృష్ణుఁడు తనకార్యమునేచూచునుగాని యొకరి దుఃఖమునుజూడడు. లోకములనన్నియు గొలిచినగొప్పమహిమగలవాఁడు. వానినిజూచుట మిక్కిలిదుర్లభము. అయినను నా మనస్సు వానిని వదలిమఱియొకటియందు చెళ్ళదు దానికి నాతల్లియేమి చేయవచ్చునని. ౫.

అన్నైయెన్ శెయ్యిలెన్ ఊరెన్ శొల్లిలెన్ తోழிమీర్*
ఎన్నైయినియుమక్కాశైయిల్లై యగప్పట్టేన్*
మున్నైయమరర్ ముదల్వన్ వణ్డువరాపది
మన్నన్ *మణివణ్ణన్ వాశుదేవన్ వలైయుళే. ౬.

అ॥ మున్నైయమరర్ - ప్రాచీనులైననిత్యసూరులకు, ముదల్వన్-నిర్వాహకుఁడును, వణ్ సుందరమైన, తువరాపది - ద్వారకకు, మన్నన్ - రాజువు, మణివణ్ణన్ - మాణిక్యమువంటి కాన్తిగలవాఁడునైన, వాశుదేవన్ - శ్రీకృష్ణునియొక్క, వలైయుళ్ - వలలో, అగప్పట్టేన్ - దొఱుకుకుంటిని. ఇని - ఇఁకమీఁద, ఎన్నై - నావిషయమై, ఉమక్కు - మీకు, ఆశైయిల్లై - ఆశలేదు. అన్నై - తల్లి, ఎన్ శెయ్యిల్ - ఏమిచేసినను, ఎన్ - ఏమిప్రయోజనము ? ఊర్ - లోకులు, ఎన్ శొల్లిల్ - ఏమిచెప్పినను, ఎన్ - ఏమిప్రయోజనము?

తా॥ ఓసఖీ! ద్వారకాధీశుఁడైన శ్రీకృష్ణుని వాశమందు నేనుదొఱుకుకుంటిని. ఇఁకనన్ను మఱలింపమీకాశలేదు. నాతల్లియెంతచేసినను లోకులెంత చెప్పినను ఏమియును ప్రయోగము లేదని. ౬.

వలైయుళగప్పడుత్తెన్నై నన్నెఞ్జఙ్గవర్ న్దెమ్బిరాన్*
అలైకడల్ పళ్ళియమ్మానై యాழிప్పిరాన్దన్నై*

కలై క్కొళగలల్ గుల్ తోழ்హీనమ్కణ్గళాల్ కణ్డు*
తలై యిల్ వణజ్గవుమాజ్గొలో తైయలార్ మున్బే. ౭.

అ॥ ఎన్నై - నన్ను, పలైయుస్ - వలో, అగప్పడుత్తి - దోచుకుకొనునట్లుచేసి, నల్ - అనుకూలమైన, నెజ్జమ్ - (నా) మనస్సును, కూవిక్కొణ్డు - పిలుచుకొని, అలై - అలలుకొట్టుచున్న, కడల్ - సముద్రమందు, పళ్ళి - పవ్వళించిన, అమ్మానై - స్వామియు, ఆழிప్పిరానై - చక్రధరుఁడునైనసర్వేశ్వరుని, కలైకొళ్ - సుందరమైన వస్త్రముగలదియు, అగల్ - విశాలమైన, అల్ గుల్ - నితంబప్రదేశముగలదియునైన, తోழ்హీ-ఓసఖీ! నమ్కణ్గళాల్ - మననేత్రములచే, కణ్డు - సేవించి, తైయలార్ - (నన్నునిందించెడి) స్త్రీలయొక్క, మున్బు - ఎదుట, తలైయిల్ - శిరస్సుచే, వణజ్గవుమాజ్గొలో - నమస్కరించునట్లగునా.

తా॥ ఓసుందరాంగివైనసఖీ! నన్నును నామనస్సును స్వాధీనపఱచుకొనిపోయి క్షీరాబ్ధియందుఁబవ్వళించిన చక్రధరుని, నన్నునిందించుచున్న యీలోకులయెదుటనే సేవించుటెప్పుడు సంభవించునోయని ౭.

పేయ్ములై యుణ్డుశగడమ్పాయ్న్దు మరుదిడై
ప్పోయ్ముదల్ శాయ్త్తు*పుళ్ వాయ్పిళన్దుకళిఱట్ట*
తూముఱువల్ తొణ్డైవాయ్ప్పిరానై యెన్నాళ్ కొలో*
యాముఱుగిన్దదు తోழ்హీ యన్నైయర్ నాణవే. ౮.

అ॥ పేయ్ - పూతనయొక్క, ములై - స్తన్యమును, ఉణ్డు - త్రాగి, శగడమ్ - శకటాసురుని, పాయ్న్దు - తన్ని, మరుదు - మద్దివృక్షముయొక్క, ఇడై - నడుమన, పోయ్ - వెళ్ళి, ముదల్ శాయ్త్తు - సమూలముగాబడద్రోసి, పుళ్ - బకాసురునియొక్క, వాయ్ - నోటిని, పిళన్దు - చీల్చి, కళిఱు - కువలయాపీడమును, అట్ట - చంపిన, తూ - స్వచ్ఛమైన, ముఱువల్ - చిరునవ్వుగల, తొణ్డై - దొండపండువలెనున్న, వాయ్ - అధరముగల, పిరానై - స్వామిని, తోழ்హీ - ఓసఖీ! అన్నైయర్ - తల్లులు, నాణ - సిగ్గుబడునట్లు, యామ్ - మనము, ఉఱుగిన్దదు - పొందుట, ఎన్నాళ్ కొలో - ఏదినమో ?

తా॥ ఓసఖీ! నన్నునిందించుచున్నతల్లి సిగ్గుబడునట్లు పూతనా శకట యమళార్జున బకాసుర కువలయాపీడములు మొదలగు దుష్టులను సంహరించి సుందరమందహాసముగల శ్రీకృష్ణునిమన మెప్పుడు పొందెదమోయని ౮.

నాణుమ్నిఱైయుమ్కవర్న్దెన్నైనన్నెజ్జమ్కూవిక్కొణ్డు*
శేణుయర్ వానత్తిరుక్కుమ్ తేవపిరానై*
ఆణై యెన్తోழ்హీ యులగుతోఱలర్ తూఱ్ఱి*ఆమ్
కోణైగళ్ శెయ్దు కుదిరియాయ్మడలూర్దుమే. ౯.

అ॥ ఎన్నై - నాయొక్క, నాణుమ్ - సిగ్గును, నిఱైయుమ్-స్త్రీగుణములను, కవర్న్దు-పోగొట్టి, నల్ - స్వాధీనమైన, నెజ్జమ్ - మనస్సును, కూవిక్కొణ్డు - పిలుచుకొని, శేణుయర్-

మిక్కిలియున్న తత్ప్రదేశమందున్న, వానత్తు - పరమపదమందు, ఇరుక్కుమ్ - వాసముజేయుచున్న, తేవపిరాన్ తన్నై - నిత్యసూరులకుస్వామియైన సర్వేశ్వరుని, తోழ்ி - ఓసఖీ! ఉలగుతోఱు - లోకమంతట, అలర్ - (వచ్చినన్ను సమాధానముజేయక దుఃఖబెట్టుచున్నాడని) అపవాదమును, తూற்ఱి - ప్రసిద్ధమగునట్లుజేసి, అమ్ - జేయుటకుసాధ్యమైన, కోళ్ళైగళ్ - (వానికినిందాకరములైన) కుటిలవ్యాపారములను, శెయ్దు - చేసి, కుదిరియాయ్ - సిగ్గులేనిదానమై, మడల్ - మడలనెడివ్యాపారమునుజేసి, ఊర్దుమ్ - సఞ్చరించెదను. అన్నైయెన్ - దీనికడ్డమేమి?

తా॥ ఓసఖీ! నన్ను మానభంగపఱచి నాగుణములను జెడగొట్టి నామనస్సు నపహరించుకొనిపోయి పరమపదమందు వేంచేసియున్న సర్వేశ్వరుఁడు నన్ను వచ్చిరక్షించనందున వానినియెల్లరునిందించునట్టుజేసి వానికపవాదమువచ్చునట్లు సంచరించపోతానని. ౯.

యామ్మడలూర్న్దు మెమ్మాழிయకైప్పిరానుడై *
తూమడల్ తణ్ణన్దుழாయ్ మలర్ కొణ్డుశూడువోమ్ *
యామ్మడమిన్ఱి తెరువుతోఱియల్ తైయలార్ *
నామడఙ్గాప్పழிతూற்ఱి నాడుమిరైక్కవే. ౧౦.

అ॥ యామ్ - మనము, మడమిన్ఱి - అణిగియుండక, తెరువుతోఱు - వీథివీథియందును, అయల్ తైయలార్ - వేఱుస్త్రీలయొక్క, నా - నాలికయందు, మడఙ్గా - వెళ్ళని, పழி-అపవాదమును, తూற்ఱి - ప్రసిద్ధపఱచి, నాడుమ్ - దేశమంతయు, ఇరైక్క - భ్రమించిపోవునట్లు అఱచి, యామ్ - మనము, మడలూర్న్దు - మడలూర్గై అనెడి వ్యాపారమునుజేసి, అழி - నదర్శనమును, అమ్ - సుందరమైన, కై - శ్రీహస్తమునందుగల, ఎమ్ - మనయొక్క, పిరానుడై - స్వామియొక్క, తూ - స్వచ్ఛమైన, మడల్ - దళముగల, తణ్-చల్లనైన, అమ్ - సుందరమైన, తుழாయ్ - తిరుత్తుழாయియొక్క, మలర్ - పుష్పములను, కొణ్డు - సంపాదించుకొనివచ్చి, శూడువోమ్ - శిరస్సులోనుంచుకొనెదము.

తా॥ ఓసఖీ! మనము మానమును వదలి లోకులుచెప్పరాని యపవాదములను సర్వేశ్వరుని మీఁదఁజెప్పి వాడు ధరించినతిరుత్తుழாయినిధరించివానికపవాదమువచ్చునట్టుసంచరించెదమని ౧౦.

‡‡ ఇరైక్కుఙ్గరుఙ్గడల్ వణ్ణన్ కణ్ణపిరాన్ఱన్నై *
విరైక్కొళ్ పొழிల్ కురుగూర్చ్చడగోపన్ శొన్న *
నిరైక్కొళన్దాది యోరాయిరత్తుళిప్పత్తుమ్ *
ఉరైక్కవల్లార్కట్కు వైగున్దమాగున్దమ్మూరెల్లామ్. ౧౧.

అ॥ ఇరైక్కుమ్ - ఘోషించుచున్న, కరుమ్ - నల్లనైన, కడల్-సముద్రమువంటి, వణ్ణన్-కాన్తిగల, కణ్ణపిరాన్ తన్నై - శ్రీకృష్ణునివిషయమై, విరైక్కొళ్ - పరిమళముతోపూర్ణమైన, పొழிల్-తోటలుగల, కురుగూర్-కురుకాపురి స్వామియైన, శడగోపన్-నమ్మాழ்వార్లు, శొన్న-పాడించిన, నిరైక్కొళ్-శబ్దార్థములయొక్కపూర్తిగల, అన్దాది-అంత్యపదమునాదిగాగల, ఓర్-అద్వితీయమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, ఉరై

క్కు-వల్లార్కు - అధ్యయనముచేయువారికి, తమ్ - తమయొక్క, ఊర్ఎల్లామ్ - గ్రామము లన్నియు, వైగున్దమాగుమ్ - శ్రీవైకుణ్ఠమగును.

తా॥ సర్వేశ్వరునివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నధ్యయనము చేయువారు ఏదేశమందున్నను శ్రీవైకుణ్ఠమందువలె బ్రహ్మానందము ననుభవింతురని. ౧౧

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౪ - వ తిరువాయ్మొழி.

---

అవతారిక:—ఆళ్వార్లిట్లు “ మడలూర్గై ” అనెడివ్యాపారముచేయుటకు శక్తిలేక దుఃఖించుచుండగా నప్పుడు ప్రవేశించిన కాళరాత్రినిజూచి, ఈరాత్రిలో నాకుప్రియమాటలనుజెప్పి రక్షించువారెవ్వరునులేరే. ఆపద్బాంధవుఁడైన సర్వేశ్వరుఁడుగూడ రాకపోయెనేయని చిన్తాక్రాన్తులైయున్నప్పుడు క్షీరాబ్ధియందు యోగనిద్రజేయుచున్న వాసుదేవునిస్మరించి, వీడు మనలను రక్షించుటకై యుపాయము యోచించుచున్నాడని దలంచి ప్రాణధారణము జేసికొని యున్నారు.

‡‡ ఊరెల్లామ్తుఞ్జి యులగెల్లామ్నళ్ళిరుళాయ్*
నీరెల్లామ్తేఱి యోర్నీళిరవాయ్నీణ్డదాల్*
పారెల్లామ్ఉణ్డ నమ్పామ్బణైయాన్వారానాల్*
ఆరెల్లేవల్వినైయే నావికాప్పారినియే. ౧.

అ॥ ఊరెల్లామ్ - ఊరంతయు, తుఞ్జి - నిదురపోయి, ఉలగెల్లామ్ - లోకమంతయు, నళ్ - నిబిడమైన, ఇరుళాయ్ - చీకటియై, నీరెల్లామ్ - జలమంతయు, తేఱి - నిశ్శబ్దమై, ఓర్ - ఒకటియై, నీళ్ - పొడవైన, ఇరవాయ్ - రాత్రియై, నీణ్డదు - పెరిగినది, పారెల్లామ్ - భూమి యంతను, ఉణ్డ - మ్రింగినవాడును, నమ్ - మనస్వామియు, పామ్బు - ఆదిశేషుని, అణైయాన్ - పడకగాగలవాడునైన సర్వేశ్వరుఁడు, వారాన్ - రాడు, ఎల్లే - ఓసఖీ! వల్ - క్రూరమైన, వినైయేన్ - పాపముగలనాయొక్క, ఆవి - ప్రాణమును, ఇని - ఇఁకమీద, కాప్పారార్ - రక్షించువారెవరు.

తా॥ ఊరంతయు మణిగినది, లోకమంతయు గాఢాంధకారమైనది, ఇట్లు రాత్రి మిక్కిలి వర్ధిల్లుచుండగా నిప్పుడుగూడ నాశ్రియఃపతివచ్చి నన్నురక్షించక పోయెను. ఇఁకరక్షించువారెవరని.

ఆవికాప్పారినియార్ ఆழ்కడల్ మణ్విణ్మూడి*
మావికారమాయ్ ఓర్వల్లిరవాయ్నీణ్డదాల్*
కావిశేర్వణ్ణన్ ఎన్కణ్ణనుమ్వారానాల్*
పావియేన్నెఞ్జమే నీయుమ్పాఙ్గల్లైయే. ౨.

అ॥ ఆழ் - అగాధమైన, కడల్ - సముద్రమును, మణ్ - భూమిని, విణ్ - ఆకాశమును, మూడి - కప్పి, మా - గొప్ప, వికారమాయ్ - వికారముగలదై, వల్ - క్రూరమైన, ఓరిరవాయ్ - ఒకరాత్రిరూపమై, నీణ్డదు - (చీకటి) పెరిగినది. కావి శేర్ - నల్లకలువవంటి, వణ్ణన్ - కాన్తిగల, ఎన్ కణ్ణనుమ్ - నాకృష్ణుఁడును, వారాన్ - రాలేదు, పావియేన్ - పాపినైయినవారొయొక్క, నెఞ్జమే - ఓమనసా! నీయుమ్ - నీవును, పాఙ్గల్లై - అనుకూలముగానుండకపోతివి, ఇని - ఇఁకమీఁద, ఆవి - నాప్రాణమును, కాప్పార్ - రక్షించువారు, ఆర్ - ఎవరు.

తా॥ ఓమనసా! అదిఆకసమనియు ఇదిభూమియనియు సముద్రమనియు దెలియకకప్పి గాఢాంధకారము భయఙ్కరమైనరాత్రిరూపమై పెరుగుచున్నది. ఈసమయమందుగూడ శ్రీకృష్ణుఁడు రాకపోయెను; నీవును నావశంబున లేకపోతివి. ఇఁక నన్ను రక్షించువారెవరని. ౨

నీయుమ్పాఙ్గల్లై కాణ్ నెఞ్జమేనీళిరవుమ్*
ఓయుమ్పొழுదిన్ఱి యూழிయాయ్నీణ్డాల్*
కాయుఙ్కడుఞ్జిలై యెన్ కాకుత్తన్ వారానాల్*
మాయుమ్వగై యఱియేన్ వల్వినైయేన్ పెణ్పిఱన్దే. ౩.

అ॥ నెఞ్జమే - ఓమనసా! నీయుమ్ - నీవును, పాఙ్గల్లైకాణ్ - అనుకూలముగాలేకపోతివి గదా? నీళ్ - పొడుపైన, ఇరవుమ్ - రాత్రియు, ఓయుమ్పొழுదిన్ఱి - ఎడతెగక, ఊழிయాయ్ - యుగమై, నీణ్డదు-పెరిగినది, కాయుమ్ - (శత్రువులను) దహించుచున్న, కడుమ్శిలై - క్రూరమైనబాణముగల, ఎన్ కాకుత్తన్ - నాశ్రీరాఘువుఁడు, వారాన్ - రాడు. వల్వినైయేన్ - క్రూరమైనపాపముగలనేను, పెణ్ పిఱన్దు - స్త్రీయైపుట్టి, మాయుమ్వగై - మరణమునుబొందెడి ప్రకారమును, అఱియేన్ - ఎఱుఁగను.

తా॥ ఓమనసా! నీవా నాస్వాధీనముగాకపోతివి. రాత్రి యుగమువలె పెరుగుచున్నది. శ్రీరాముఁడురాలేదు. ఈబాధనుసహించక ప్రాణమువిడువదలంచినను నేను దానికి యుపాయము తెలియఁగనేరని. ౩.

పెణ్పిఱన్దారెయ్దుమ్ పెరున్దుయర్ కాణ్గిలేనెన్ఱు*
ఒణ్ శుడరోన్ వారాదొళిత్తాన్*ఇమ్మణ్ణళన్ద
కణ్ పెరియ శెవ్వాయ్ యెమ్కారేఱువారానాల్*
ఎణ్ పెరియశిన్దనోయ్ తీర్ప్పారారెన్నైయే. ౪.

అ॥ పెణ్ పిఱన్దార్ - స్త్రీలు, ఎయ్దుమ్ - అనుభవించుచున్న, పెరుమ్తుయర్ - ఈగొప్ప దుఃఖమును, కాణ్గిలేన్ - చూడలేను, ఎన్ఱు - అని, ఒణ్ - సుందరమైన, శుడరోన్ - తేజస్సుగలసూర్యుఁడు, వారాదు, రాక, ఒళిత్తాన్ - దాచుకొనియున్నాఁడు. ఇమ్మణ్ - ఈభూమిని, అళన్ద - కొలిచినవాఁడును, పెరియకణ్ - విశాలమైన నేత్రములుగలవాఁడును, శెమ్ - ఎఱ్ఱని, వాయ్ - అధరముగలవాఁడును, ఎన్ - నాకు (స్వామియు,) కార్ - మేఘమువంటికాన్తిగల వాఁడును, ఏఱు - శ్రేష్ఠుఁడునైన సర్వేశ్వరుఁడు, వారాన్ - రాలేదు. ఎన్నై - నాయొక్క,

ఎణ్ పెరిదు - సంఖ్యలనతిక్రమించిన (అసంఖ్యేయమైన), శిన్దైనోయ్ - మనోవ్యాధిని, తీర్ప్పారార్ - పోగొట్టువారెవరు.

తా॥ ఈస్త్రీలనుభవించెడి ఘోరదుఃఖమును నేను చూడజాలననిదలంచి సూర్యుడుదయముగాకుండ నేయున్నాడు. సుందరాంగుడైన నామనుఁడురాలేదు. ఇంక నాదుఃఖమును దీర్చువారెవరని. ౪.

అరెన్నైయమ్మనైమార్ తోழிయరుమ్*
నీరెన్నే యెన్నాదే నీళిరవుమ్ తుఞ్జువరాల్*
కారన్న మేని నఙ్కణ్ణనుమ్ వారానాల్*
పేరెన్న మాయాదాల్ వల్వినైయేన్ పిన్నిన్ఱే. ౫.

అ॥ అన్నైమారుమ్ - తల్లులును, తోழிయరుమ్ - సఖులును, నీర్ - (నా) స్వభావము, ఎన్నే - ఎట్టిది (అని), ఎన్నాదే - తలఁచక, నీళ్ - పొడవైన, ఇరవుమ్ - రాత్రియంతయు, తుఞ్జువర్ - నిద్రపోవుచున్నారు. కారన్న - మేఘమువంటి, మేని - తిరుమేనుగల, ఎన్ కణ్ణనుమ్ - నాకృష్ణుఁడును, వారాన్ - రాడు, వల్ - క్రూరమైన, వినైయేన్ - పాపముగలనాయొక్క, పిన్ - వెనుక, నిన్ఱు - ఉండి, పేర్ - నాపేరు, ఎన్నై - నన్ను, మాయదు-మాయునట్లు చేయదు. ఎన్నై - నన్ను, ఆరాయ్వార్ - విచారించువారెవరు.

తా॥ నాబంధువులు నాబాధను విచారించక చక్కగానిద్రించుచున్నారు. శ్యామసుందరుఁడైన శ్రీకృష్ణుఁడురాలేదు ఇంక నేను మాయువిధము నాలోచించుచున్నాను. నాపేరుమాత్రమే యుండపోవుచున్నది. ఇప్పుడుకూడ నన్ను రక్షించువా రెవరులేరని. ౫.

పిన్నిన్ఱు కాదల్ నోయ్ నెఞ్జమ్ పెరిదడుమాల్*
మున్నిన్ఱిరావూழி కణ్ పుదైయమూడిర్ఱాల్*
మన్నిన్ఱ శక్కర చ్చెజ్గైయ్యన్ వారానాల్*
ఇన్నిన్ఱనీళావి కాప్పారారివ్విడత్తే. ౬.

అ॥ కాదల్ - ఆశయనెడి, నోయ్ - వ్యాధి, పిన్ నిన్ఱు-వెనుకనుండి, నెఞ్జమ్-మనస్సును, పెరిదు - మిక్కిలి, అడుమ్ - బాధించుచున్నది. ఇరా - రాత్రియనెడి, ఊழி-యుగము, మున్నిన్ఱు - ముందుండి, కణ్ - నేత్రములు, పుదైయ-అణుగునట్లు (కనుపడకుండునట్లు), మూడిర్ఱు-కప్పినది. మన్నిన్ఱ - అమరియున్న, శక్కరమ్ - సుదర్శనముగల, మాయవనుమ్-ఆశ్చర్యచేష్టితుఁడైన సర్వేశ్వరుడు, వారాన్ - రాడు, ఇన్నిన్ఱ - ఈవిధముగానున్న, నీళ్ - నిత్యమైన, ఆవి-ఆత్మను, ఇవ్విడత్తు - ఇచ్చట, కాప్పారార్ - రక్షించువారెవరు.

తా॥ ఆశయొకపక్కను రాత్రియొకపక్కనుండి బాధించుచున్నవి. ఈసమయంబునకూడ చక్రధరుఁడువచ్చి రక్షించకున్నాడు. ఇంకనిచ్చట నన్ను రక్షించువారెవరున్నారని. ౬.

కాప్పారారివ్విడత్తు క్కజ్గిరుళిన్ నుణ్ తుళియాయ్*
శేణ్పాలదూழிయాయ్ చ్చెల్ గిన్ఱ కజ్గుల్ వాయ్*

తూప్పాలవెణ్శఙ్ఖు శక్కరత్తన్ తోన్ఱానాల్*
తీప్పాలవల్వినైయేన్ తెయ్వఙ్గాళ్ శెయ్గేనో. ౭.

అ॥ ఇవ్విడత్తు - ఇచ్చట, కాప్పారార్ - రక్షించువారెవరు? కఙ్గుల్ - చిట్టమైన, ఇరుళ్ - చీకటిని, నుణ్ - సూక్ష్మమైన, తుళి-చినుకులను, ఆయ్-కలదై, నీళ్ పాలదు-దీర్ఘమైనస్వభావముగల, ఊழிయాయ్ - యుగమై, నీణ్గిన్ఱ - నడుచుచున్న, కఙ్గుల్ వాయ్ - రాత్రియందు, తూ - నిర్మలమైన, పాల-స్వభావముగల, వెణ్ - తెల్లని, శఙ్ఖు-శ్రీపాఞ్చజన్యమును, శక్కరత్తన్ - సుదర్శనమునుగలసర్వేశ్వరుఁడు, తోన్ఱాన్ - కనుపడఁడు. తెయ్వఙ్గాళ్ - ఓదేవతలారా! తీప్పాల- అగ్నివలెదహించుచున్న స్వభావముగల, వల్వినైయేన్ - క్రూరమైనపాపముగలనేను, ఎన్ శెయ్గేన్ - ఏమిచేసెదను.

తా॥ పెద్దయుగమువలెనున్న యీరాత్రియందొకప్రక్క-చీకటిని యొకప్రక్క-చినుకులును బాధించుచున్నవి. ఇప్పుడు నన్ను గాపాడువారెవరులేరు. శఙ్ఖచక్రధరుఁడైన సర్వేశ్వరుఁడు వచ్చిగనుపడలేఁడు. ఓదేవతలారా! ఇప్పుడు నేనేమిచేసెదనని ౭.

తెయ్వఙ్గాళ్ శెయ్గే నోరిరవేழூழிయాయ్*
మెయ్వన్దునిన్ఱెనదావిమెలివిక్కుమ్*
కైవన్దశక్కరత్తెన్ కణ్ణనుమ్వారానాల్*
తైవన్దతణ్ తెన్ఱల్ వెஞ்ఞుడరిల్ తానడుమే. ౮.

అ॥ తెయ్వఙ్గాళ్ - ఓదేవతలారా.! ఎన్ శెయ్గేన్ - ఏమిచేసెదను. ఓరిరవు - ఒక రాత్రి, ఏழூழிయాయ్ - ఏడుయుగమై, మెయ్వన్దునిన్ఱు - (నన్నుచంపవలయునని) నిశ్చయించివచ్చి, ఎనదావి - నాయాత్మను, మెలివిక్కుమ్ - బాధించుచున్నది. కైవన్ద - శ్రీహస్తమందమరియున్న, శక్కరమ్ - సుదర్శనముఁగల, ఎన్ కణ్ణనుమ్ - నాకృష్ణుఁడును, వారాన్ - రాడు, తైవన్ద-తై(పుష్య) మాసమందువచ్చెడి, తణ్ - చల్లని, తెన్ఱల్ -మలయమారుతము, వెஞ்ఞుడరిల్ - క్రూరమైనఅగ్నికంటెను, అడుమ్ - (మిక్కిలి) బాధించుచున్నది.

తా॥ ఓదేవతలారా ! ఒకరాత్రి యేడుయుగమై పెరిగి నన్నుచంపవలయునని యుద్దేశించి వచ్చి చల్లనిగాలిని నిప్పువలెవిసురుచు బాధించుచున్న యీసమయమందుగూడ సర్వేశ్వరుఁడువచ్చి రక్షించకపోయెను. ఇప్పుడు నేనేమిచేసెదనని. ౮.

వెஞ்ఞుడరిల్ తానడుమాల్ వీఙ్గిరుళిన్ నుణ్తుళియాయ్*
అஞ்ఞుడరవెయ్యోన్ అణినెడున్దేర్ తోన్ఱాదాల్*
శెஞ்ఞుడర్ త్తామరైక్కణ్ శెల్వనుమ్వారానాల్*
నెஞ்ఞిడర్ తీర్ప్పారినియార్ నిన్ఱురుగుగిన్ఱేనే. ౯.

అ॥ వీఙ్గుమ్ - వర్ధిల్లుచున్న, ఇరుళ్ - చీకటిని, నుణ్ - సూక్ష్మమైన, తుళియాయ్ - చినుకులుగలరాత్రి, తాన్ - తాను, వెஞ்ఞుడరిల్ - వేడియైనయగ్నికంటె, అడుమ్ - (అధికమై) బాధించును. అమ్ - సుందరమైన, ఞుడర - తేజస్సుగల, వెయ్యోన్ - సూర్యునియొక్క, అణి-

సుందరమై, నెడు - గొప్పదైన, శేర్ - రథము, తోన్ఱాదు - కనుపడదు, శెప్పుడగ్ - ఎఱ్ఱ నికాన్తిగల, తామరైక్కణ్ - తామరపువ్వువంటి నేత్రముగల, శెల్వనుమ్ - శ్రీమంతుడును, వారాన్ - రాడు, నిన్ఱు - నిలిచి, ఉరుగుగిన్ఱేన్ - కరుగుచున్నాను, నెఞ్జిడర్ - మనోదుఃఖమును, ఇని - ఇఁక మీద, తీర్ప్పారార్ - పోగొట్టువారెవరు.

తా॥ చల్లని యీ చినుకులు నాకు నిప్పువలెనున్నవి. చీకటిలో నాకేమియు కనుపడలేదు. సూర్యోదయమును కాకుండనున్నది. రాజీవలోచనుఁడైన శ్రియఃపతియు రాలేదు, ఈ దుఃఖముచే గరుగుచున్న నన్నిప్పుడు రక్షించువారెవరును లేరని. ౯

నిన్ఱురుగుగిన్ఱేనేపోల నెడువానమ్*
శెన్ఱురుగినుణ్ తులియాయ్ చ్చెల్గిన్ఱ కఙ్గుల్వాయ్*
అన్ఱొరుకాల్ వైయ మళన్ద పిరాన్ వారానెన్ఱు*
ఒన్ఱొరుకాల్ శొల్లా దులగో వుఱఙ్గుమే. ౧౦.

అ॥ నిన్ఱు - నిలిచి(ఎల్లప్పుఁడును), ఉరుగుగిన్ఱేనేపోల - కరుగుచున్న నావలెనే, నెడు - గొప్ప, వానమ్ - ఆకసమును, శెన్ఱు - దుఃఖపడి, ఉరుగి - కరిగి, నుణ్ - సూక్ష్మమైన, తులియాయ్ - చినుకులుగలదై, శెల్గిన్ఱ - నడుచుచున్న, కఙ్గుల్ వాయ్ - రాత్రియందు, అన్ఱు - అప్పుడు, ఒరుకాల్ - ఒకప్పుడు, వైయమ్ - భూమిని, అళన్ద - కొలిచిన, పిరాన్ - ఉపకారకుఁడైన సర్వేశ్వరుఁడు, వారాన్ - రాడు, ఎన్ఱు - అనియైనను, ఒన్ఱు - ఒకమాటను, ఒరుకాల్ - ఒకప్పుడు, శొల్లాదు - చెప్పక, ఉలగు - లోకము, ఉఱఙ్గుమ్ - నిదురపోవుచున్నది. ఓ - ఆశ్చర్యము,

తా॥ చినుకులు వేయుచున్న యీ రాత్రియందు నేనవస్థపడుచుండగా, ఆ త్రివిక్రముఁడిచ్చటికి రాడనియైనను వచ్చుననియైననొకమాట నాకుఁ జెప్పకుండ లోకమంతయు నిద్రించుచున్నదే ? ఇదే మాశ్చర్యమని. ౧౦

‡‡ ఉఱఙ్గువాన్పోల్ యోగు శెయ్ద పెరుమానై*
శిఱన్దపొழிల్ శూழ் కురుగూర్చ్చడగోపన్ శొల్*
నిఱఙ్గిళర్న్ద వన్దాది యాయిరత్తిప్పత్తాల్*
ఇఱన్దుపోయ్ వైగున్దమ్ శేరావాఱెఙ్గనేయో. ౧౧.

అ॥ ఉఱఙ్గువాన్ పోల్ - నిదురపోవునట్లు నవ్యాభించి, యోగు శెయ్ద - జగద్రక్షణోపాయమును యోచించుచున్న, పెరుమానై - సర్వేశ్వరునివిషయమై, శిఱన్ద - శ్లాఘ్యమైన, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టబడిన, కురుగూర్ - కురుకాపురియందు వసించియున్న, శడగోపన్ - నమ్మాళ్వారులు, శొల్ - ప్రసాదించిన, నిఱమ్ - గానముచే, కిళర్న్ద - అధికమైయున్న, అన్దాది - అన్తాదిరూపమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాసురములలో, ఇప్పత్తాల్ - ఈపదిపాసురములచే (పాసురముల నధ్యయనముచేయువారు), ఇఱన్దుపోయ్ - మరణమునుబొందినతరువాత, వైగున్దమ్ శేరావాఱు - శ్రీవైకుంఠమునుబొందనివిధము, ఎఙ్గనేయో - ఏవిధము?

తా॥ జగత్తును గక్షించువిధమును రోచించుచు క్షీరాబ్ధియందుఁ బవ్వళించియున్న శ్రియఃపతిమహయత్తై, సమృద్ధమైనతోటలుగల కురుకాపురాధీశులైన నమ్మాళ్వార్ల ప్రసాదించిన యీగది పాశురముల నభ్యసించువారు శ్రీవైకుణ్ఠమును దప్పక బొందురని. ౧౧

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౫ - పత్తు, ౫ - వ, తిరువాయ్మొழி.

అవతారిక — ఆళ్వార్లు నెడిసాయకి యీవిధంబున రాత్రియంతయు భగవద్విశ్లేషముచే బాధననుభవించి సూర్యోదయమైనతరువాత మూర్ఛవదలి స్వస్థచిత్తులై తిరుక్కుఱుఙ్గుడినమ్బి యొక్క సౌన్దర్య సౌగన్ధ్యాది సమస్తకల్యాణగుణంబులనుదలంచి యాగుణముల ననుభవింపవలయునని యత్యభినివేశముతోనుండగా, బంధువులుచూచి నీకింత యభినివేశమేలనని యాక్షేపవచనములను జెప్పగా నామాటలనువిని, ఓబంధువులారా! భగవద్గుణములనెఱుఁగని మీరెంత చెప్పినను నామన స్సాభగవంతునియందే లీనమగుచున్నది, నేనేమిసేసెదను; మీరు మామీద కోపగింపవలదు అని వక్కాణించుచున్నారు

‡‡ ఎఙ్గనేయో వన్నైమీర్ గాళ్ ఎన్నై మునివదు నీర్ *
నఙ్గళ్ కోల త్తిరుక్కుఱుఙ్గుడినమ్బియై నాన్ కణ్డపిన్ *
శఙ్గినోడుమ్ నేమియోడుమ్ తామరైక్కణ్గళోడుమ్ *
శెఙ్గనివాయొన్ఱినోడుమ్ శెల్గిన్ఱదెన్నెఞ్జమే. ౧.

అ॥ అన్నైమీర్గాళ్ - ఓయమ్మలారా! నీర్ - మీరు, ఎన్నై - నన్ను, మునివదు - కోపగించుట, ఎఙ్గనేయో - ఎటులో? నఙ్గళ్ - మనయొక్క, కోలమ్ - అతిసుందరమైన, తిరుక్కుఱుఙ్గుడినమ్బియై - తిరుక్కుఱుఙ్గుడియందు వేంచేసియున్న నమ్బిని, నాన్ - నేను, కణ్డపిన్ - సేవించినతరువాత, శఙ్గినోడుమ్ - శ్రీపాఞ్చజన్యముతోడను, నేమియోడుమ్ - సుదర్శనముతోడను, తామరైక్కణ్గళోడుమ్ - పద్మమువంటి నేత్రములతోడను, శెమ్ - ఎఱ్ఱని, కని - పండువలెనున్న, ఒన్ఱు - అద్వితీయంబైన, వాయోడుమ్ - అధరముతోడను, ఎన్నెఞ్జమ్ - నామనస్సు, శెల్గిన్ఱదు - సంచరించుచున్నది.

తా॥ ఓసఖియలారా! భగవద్గుణముల మాధుర్యము నెఱుఁగక మీరు నామీద కేలకోపపడుచున్నారు? తిరుక్కుఱుఙ్గుడినమ్బిని నేను సేవించినప్పుడె నామనస్సు నాకుస్వాధీనము లేక నాతనియొక్క శఙ్ఖచక్రాదులయందును నేత్రాది దివ్యావయవములయందును మగ్నమైపోయినదని.

ఎన్నెఞ్జినాల్ నోక్కిక్కాణీర్ ఎన్నై మునియాదే *
తెన్నన్ కోలై త్తిరుక్కుఱుఙ్గుడినమ్బియై నాన్ కణ్డపిన్ *

మిన్ను నూలుమ్ కుణ్డలముమ్ మార్విల్ తిరుమఱువుమ్*
మన్ను పూణుమ్ నాన్గుతోళుమ్ వన్దెఴుమ్ నిన్ఱిడుమే. ౨.

అ॥ ఎన్నై - నన్ను, మునియాదే - కోపగించక, ఎన్నెఞ్జినాల్ - నామనస్సుచేత, (భక్తిగలనావంటిమనస్సుగలవారై), నోక్కి కాణీర్ - చూడుడు, తెన్ - దక్షిణమందున్న, నల్ - శ్లాఘ్యమైన, శోలై - తోపులుగల, తిరుక్కుఱుఙ్గుడినమ్బియై - తిరుక్కుఱుంగుడియందు వేంచేసియున్ననమ్బిని, నాన్ - నేను, కణ్డపిన్ - సేవించినతరువాత, మిన్ను - ప్రకాశించుచున్న, నూలుమ్ - యజ్ఞోపవీతమును, కుణ్డలముమ్ - కుండలమును, మార్విల్ - వక్షస్థలమందలి, తిరుమఱువుమ్ - శ్రీవత్సమును, మన్ను - అమరియున్న, పూణుమ్ - ఆభరణమును, నాన్గుతోళుమ్ - నాలుగుభుజములును, ఎఴుమ్ - ఎచ్చటపోయినను, వన్దు - (నాయెదుట) వచ్చి, నిన్ఱిడుమ్ - నిలుచుచున్నవి.

తా॥ ఓసఖియలారా! నేను నమ్బిని సేవించినప్పటినుంచి వానియొక్క కుణ్డలయజ్ఞోపవీతాదిసమస్తాభరణములును సకలదివ్యావయవములును నాకంటిముందఱనే యున్నవి. అవియన్నియు భక్తిలేని మీకంటికగుపడవు గాన నావలె భక్తిగలవారై సేవించుడియని. ౨.

నిన్ఱిడుమ్ తిశైక్కుమ్ నైయుమె న్ఱన్నైయరుమ్ మునిదిర్*
కున్ఱమాడ త్తిరుక్కుఱుఙ్గుడినమ్బియై నాన్ కణ్డపిన్*
వెన్ఱి విల్లుమ్ తణ్డుమ్ వాళుమ్ శక్కరముమ్ శఙ్గముమ్*
నిన్ఱుతోన్ఱి క్కణ్ణుళ్ నీఙ్గా నెఞ్జుళ్ళుమ్ నీఙ్గావే. 3.

అ॥ నిన్ఱిడుమ్ - ఏపనియు చేయకనుండును, తిశైక్కుమ్ - భ్రమపడియుండును, నైయుమ్ - శిథిలాన్తఃకరణురాలైయుండును, ఎన్ఱు - అని, అన్నైయరుమ్ - తల్లులైనమీరుగూడ, మునిదిర్ - కోపగించుచున్నారు. కున్ఱమ్ - పర్వతమువలెనున్న, మాడమ్ - మేడలచేనిండియున్న, తిరుక్కుఱుఙ్గుడినమ్బియై - తిరుక్కుఱుంగుడియందు వేంచేసియున్ననమ్బిని, నాన్ కణ్డపిన్ - నేను సేవించినతరువాత, వెన్ఱి - జయమునిచ్చెడి, విల్లుమ్ - శార్ఙ్గమును, తణ్డుమ్ - కౌమోదకిని, వాళుమ్ - నన్దకమును, శక్కరముమ్ - చక్రమును, శఙ్గముమ్ - శ్రీపాఞ్చజన్యమును, కణ్ణుళ్ - నేత్రములో, తోన్ఱి నిన్ఱు - కనుపడియుండి, నీఙ్గా - ఎడబాయవు. నెఞ్జుళ్ళుమ్ - నామనస్సులోనుండియు, నీఙ్గావే - ఎడబాయవు.

తా॥ ఓసఖియలారా! మీరు, తనమతినిబోగొట్టుకొని దుఃఖించుచు ఏపనియు చేయక నున్నదని నన్ను నిందించుచున్నారు. నేనునమ్బిని సేవించినప్పటినుంచి వాని పఞ్చాయుధములును నాకంటిలోనున్నది. నేనెటులమతిచెడనని 3

నీఙ్గనిల్లాక్కణ్ణనీర్గళె న్ఱన్నైయరుమ్ మునిదిర్*
తేన్గొళ్ శోలై త్తిరుక్కుఱుఙ్గుడినమ్బియై నాన్ కణ్డపిన్*
పూన్దణ్మాలై త్తణ్డుఴాయుమ్ పొన్ముడియుమ్ వడివుమ్*
పాఙ్గుతోన్ఱుమ్ పట్టుమ్ నాణుమ్ పావియేన్ పక్కత్తవే ౪.

అ॥ కణ్ణనీర్ గళ్ - భాష్పములు, నిల్లా - ఎడతెగ్గవు, ఎన్ఱు అన్నైయరుమ్ - అనితల్లులైన మీరును, మునిదిర్ - కోపగించుచున్నారు, తేశ కోళ్ - తేజస్సుగల, తోళ్ - తోపులచేనిండి యున్న, తిరుక్కుఱుజ్గుడినమ్బియై - తిరుక్కుఱుజ్గుడియందు వేంచేసియున్న నమ్బిని, నాన్ కణ్డపిన్ - నేను సేవించిన తరువాత, తణ్ - చల్లనైన, పూమాలై - పుష్పమాలికయు, తణ్ - చల్లనైన, తుళ్ఱాయుమ్ - తిరుత్తుళాయిను, పొన్ - స్వర్ణమయమైన, ముడియుమ్ - కిరీటమును, వడివుమ్ - తిరుమేనియు, పాఙ్గు - తగుమైనదిగా, తోన్ఱుమ్ - ప్రకాశించుచున్న, పట్టుమ్ - పీతామ్బరమును, నాణుమ్ - మొలత్రాడును, పావియేన్ - పాపిష్ఠియైన నాయొక్క, పక్కత్తవే - ప్రక్కయందే నున్నవి

తా॥ నాకంటిలో నీళ్ళెప్పుడును కారుచున్నవని మీరు నన్ను కోపగించుచున్నారు, తిరుక్కుఱుజ్గుడినమ్బియొక్క దివ్యాభరణపీతామ్బరాదులెప్పుడు నా ప్రక్కనే కనుపడుచున్నవి, వానినియనుభవించుటకు నాకు భాగ్యము లేదే, ఏమిచేసెదనని. ౪.

పక్కమ్నోక్కినిఱ్కుమ్నైయుమెన్ఱన్నైయరుమ్మునిదిర్*
తక్కకీర్త్తి త్తిరుక్కుఱుజ్గుడినమ్బియై నాన్కణ్డపిన్*
తొక్కశోదిత్తొణ్డైవాయుమ్ నీణ్డపురువఙ్గళుమ్*
తక్కతామరైక్కణ్ణుమ్ పావియేనావియున్మేలనవే ౫.

అ॥ పక్కమ్నోక్కినిఱ్కుమ్ - ప్రక్కయందు చూచుచుండును, నైయుమ్ - దుఃఖించును, ఎన్ఱు - అని, అన్నైయరుమ్ - తల్లులైన మీరును, మునిదిర్ - కోపగించుచున్నారు. తక్క - తగుమైన, కీర్త్తి - కీర్తిగల, తిరుక్కుఱుజ్గుడినమ్బియై - తిరుక్కుఱుజ్గుడియందు వేంచేసియున్న నమ్బిని, నాన్ - నేను, కణ్డపిన్ - సేవించిన తరువాత, తొక్క - చేరియున్న, శోది - తేజస్సుగలదియు, తొణ్డై - దొండపండువలెనున్నదియునైన, వాయుమ్ - అధరమును, నీణ్డ - దీర్ఘమైన, పురువఙ్గళుమ్ - కనుబొమ్మలును, తక్క - తగుమైన, తామరైక్కణ్ణుమ్ - పద్మమువంటి నేత్రమును, పావియేన్ - పాపిష్ఠియైన నాయొక్క, ఆవియిన్ మేలనవే - ఆత్మమీద నేయున్నవి.

తా॥ ఈ పెరుమాళ్ వేంచేసియుండు ప్రక్కచూచుచు దుఃఖించుచుండునని నన్ను మీరుగూడ ఎందుకు నిందించుచున్నారు. నమ్బియొక్క తేజోరాశివలెనున్న తిరువధరమును పద్మమువంటి నేత్రమును దీర్ఘములైన భ్రూలతలును ఎప్పుడును నాయాత్మమీద నేయున్నవి. అయినను నాభాగ్యహీనతచే సేవనుభవించక యున్నానని. ౫

మేలుమ్వన్పళివఙ్గుడిక్కివళెన్ఱన్నైకాణకొణ్డాళ్*
కోలై శూళ్తణ్ తిరుక్కుఱుజ్గుడినమ్బియై నాన్కణ్డపిన్*
కోలనీళ్కొడిమూక్కుమ్ తామరైక్కణ్ణుఙ్గనివాయుమ్*
నీలమేనియుమ్నాన్గుతోళుమ్ ఎన్నెఞ్జమ్నిఱైన్దనవే. ౬.

అ॥ ఇవళ్ - ఈమె, వన్కుడిక్కు - శ్లాఘ్యమైనమనవంశమునకు, మేలుమ్ - ఇకనెల్లప్పుడును, వన్పళి - చెడ్డఅపవాదమునకు కారణమైయున్నది, ఎన్ఱు - అనితలంచి, అన్నై - తల్లి, కాణకొడాళ్ - చూడనివ్వదు, శోలైశూళ్ - తోటలచే జుట్టబడిన, తణ్ - చల్లనైయున్న,

తిరుక్కుఱుங్గుడినమ్బియై - తిరుక్కుఱుఙ్గుడియందు వేంచేసియున్న నమ్బిని, నాన్ - నేను, కణ్డపిన్ - సేవించినతరువాత, కోలమ్ - సుందరమై, నీళ్ - దీర్ఘమైయున్న, కొడి - తీగవలెనున్న, మూక్కుమ్ - నాసికను, తామరైక్కణ్ణుమ్ - పద్మమువంటినేత్రమును, కనివాయుయ్ - దొండపండువలెనున్న అధరమును, నీలమేనియుమ్ - శ్యామవిగ్రహమును, నాన్గుతోళుమ్ - నాలుగుభుజములును, ఎన్నెఞ్జమ్ - నామనస్సునందు, నిఱైన్దన - నిండియున్నవి.

తా॥ ఈపె సిగ్గులేక నమ్బిని యాశపడుచున్నదిగాన మనకులమున గొప్పకీర్తిని గలుగ జేయుననని నాతల్లి నమ్బినిచూడనివ్వకపోయినను, నమ్బిని సేవించినప్పటినుంచి, వానియొక్క అతి సుందరంబులైన నేత్ర నాసికాధరములును తిరుమేనును నాహృదయమందే యెప్పుడునున్నవని.

నిఱైన్దవన్పழிనమ్కుడిక్కివళెన్ఱన్నై కాణకొడాళ్*
శిఱన్దకీర్త్తిత్తిరుక్కుఱుఙ్గుడినమ్బియై నాన్కణ్డపిన్*
నిఱైన్దశోదివెళ్ళమ్శూழ்న్ద నీణ్డపొన్మేనియొడుమ్*
నిఱైన్దెన్నుళ్ళేనిన్ఱొழிన్దాన్ నేమియఙ్గైయుళదే. ౭.

అ॥ ఇవళ్ - ఈపె, నమ్కుడిక్కు - మనకులమునకు, నిఱైన్ద - పరిపూర్ణమైన, వన్పழி - క్రూరమైనయపవాదమునకుఁగారణము, ఎన్ఱు - అనితలంచి, అన్నై - తల్లి, కాణకొడాళ్ - చూడనివ్వదు. శిఱన్ద - శ్లాఘ్యమైన, కీర్త్తి - యశస్సుగల, తిరుక్కుఱుఙ్గుడినమ్బియై - తిరుక్కుఱుఙ్గుడియందు వేంచేసియున్న నమ్బిని, నాన్ - నేను, కణ్డపిన్ - సేవించినతరువాత, నిఱైన్ద - పూర్ణమైన, శోదివెళ్ళమ్ - కాన్తియొక్క ప్రవాహముచే, శూழ్న్ద - చుట్టబడిన, నీణ్డ - శ్రేష్ఠమైన, పొన్ - స్పృహణీయమైన, మేనియొడుమ్ - దివ్యవిగ్రహముతోగూడ, ఎన్నుళ్ళే - నాహృదయమందు, నిఱైన్దు - నిండి, నిన్ఱొழிన్దాన్ - వేంచేసియుండెను. నేమి - సుదర్శనము, అమ్ - సుందరమైన, కై - శ్రీహస్తమునందు, ఉళదు - ఉన్నది.

తా॥ స్వప్రయత్నమును వదలి సర్వేశ్వరునియందే సకలభారమునుంచి వాడెప్పుడు కటాక్షించునోయని నిరీక్షించియున్న మనకులమందు బుట్టిన యీపె సర్వేశ్వరుని బొందుటకు స్వరూపవిరుద్ధమైన స్వప్రయత్నముజేయుచున్నదిగాన యీపె మనకులమునకు గొప్పకీర్తినిగలుగజేయుచున్నదియని దలంచి నాతల్లి నమ్బిని చూడనివ్వక పోయినను సౌన్దర్యము మూర్తీకరించినట్టువలెనున్న తిరుమేనుగలనమ్బి సుదర్శనహస్తముతోఁగూడ నాహృదయమందే నిత్యవాసము జేయుచున్నాడని. ౭.

కైయుళ్ నన్ముగమ్వైక్కుమ్నైయుమెన్ఱన్నైయరుమ్మునివర్*
మైకొళ్మాడత్తిరుక్కుఱుఙ్గుడినమ్బియై నాన్కణ్డపిన్*
శెయ్యతామరైక్కణ్ణుమల్గులుమ్ శిఱ్ఱిడైయుమ్వడివుమ్*
మొయ్యనీళ్ కుழల్తాழ்న్దతోళ్గళుమ్ పావియేన్ మున్నిఱ్కుమే. ౮.

అ॥ కైయుళ్ - చేతులమీద, నల్ - సుందరమైన, ముగమ్ - ముఖమును, వైక్కుమ్ - ఉంచుకొనియుండుదును, నైయుమ్ - శిథిలమనస్కురాలగుదును, ఎన్ఱు - అని, అన్నైయరుమ్ -

తల్లులైనమీరును, మునిదిర్ - కోపగించుచున్నారు. మైక్కోళ్ - నల్లనివర్ణముగల, మాడమ్ - మేడలుగల, తిరుక్కుఱుజ్గుడినమ్బిరై - తిరుక్కుఱుజ్గుడిలో వేంచేసియున్ననమ్బిని, నాన్ - నేను, కణ్డపిన్ - సేవించినతరువాత, శెయ్య - ఎఱ్ఱనైన, తామరై - కమలమువంటి, కణ్ణుమ్ - నేత్రములును - అల్గులుమ్ - నితమ్బప్రదేశమును, శిఱు - సూక్ష్మమైన, ఇడైయుమ్ - నడుమును, వడివుమ్ - తిరుమేనియును, మొయ్య - సుందరమై, నీళ్ - పొడువైన, కుఴల్ - కేశపాశములు, తాఴ్న్ద - వ్రేలాడుచున్న, తోళ్గళుమ్ - భుజములును, పావియేన్ - పాపిరైన నాయొక్క, మున్ - ఎదుట, నిఱ్కుమ్ - నిలుచును.

తా॥ ఓసఖియలారా! తన సుందరముఖారవిందమును చేతులమీదనుంచుకొని దుఃఖించుచున్నదని మీరు నన్ను కోపగించుచున్నను, తిరుక్కుఱుజ్గుడియంతయు వ్యాపించునట్టు డాలు కొట్టుచున్న తిరుమేను సౌందర్యముగల నమ్బిని సేవించినప్పటినుంచి, వానియొక్క కమలనేత్రము పిటెగడి నడుము మొదలగు దివ్యావయవములు నాకంటిముందర నేయున్నవని. ౮.

మున్నిన్ఱాయెఱ్ఱుతోఴిమార్గళు మన్నైయరుమ్మునిదిర్*
మన్ను మాడత్తిరుక్కుఱుజ్గుడినమ్బియై నాన్కణ్డపిన్*
శెన్నినీణ్ముడియాదియాయ ఉలప్పిలణికలత్తన్*
కన్నల్పాలముదాగివన్దెన్నెఞ్జమ్ కఴియానే. ౯.

అ॥ మున్నిన్ఱాయెఱ్ఱు - (ఎల్లరయొక్క) ముందునిలిచితివని, తోఴిమార్గళుమ్ - సఖియలును, అన్నైయరుమ్ - తల్లులును, మునిదిర్ - కోపగించుచున్నారు. మన్ను - స్థిరములై యున్న, మాడమ్ - మేడలుగల, తిరుక్కుఱుజ్గుడి - తిరుక్కుఱుజ్గుడియందు వేంచేసియున్న, నమ్బియై - నమ్బిని, నాన్ - నేను, కణ్డపిన్ - సేవించినతరువాత, శెన్ని - శిరస్సునందలి, నీళ్ - దీర్ఘమైన, ముడి - కిరీటము, ఆదియాయ - మొదలుగాగల, ఉలప్పిల్ - అసఖ్యేయములై, అణి - అలంకరించుకొనియున్న, కలత్తన్ - తిరువాభరణములుగలవాఁడును, కన్నల్ - శర్కరవలెను, పాల్ - పాలువలెను, అముదాగి - అమృతమువలెను భోగ్యభూతుఁడునైన నమ్బి, ఎన్ నెఞ్జమ్ - నామనస్సునందు, వన్దు - వచ్చి, కఴియాన్ - విడిచిపోడు.

తా॥ ఎవ్వరికంటికగుపడనట్లు అంతఃపురమందు నివసించుచున్న యీమె యిప్పుడందరు చూచునట్లు వీధిలోవచ్చి నిలబడుచున్నదని మీరునన్ను తిట్టినను నేనేమినేసెదను? కిరీటము మొదలగుసమస్తదివ్యాభరణభూషితుఁడై మిక్కిలి భోగ్యభూతుఁడైన నమ్బి నామనస్సులోనే వేంచేసియుండి నన్ని విధంబున చేయించుచున్నాడని. ౯.

కఴియమిక్కదోర్కాదలళివళెన్ఱన్నైకాణకొడాళ్*
వఴువిల్కీర్త్తిత్తిరుక్కుఱుజ్గుడినమ్బియై నాన్కణ్డపిన్*
కుఴుమిత్తేవర్కుఴాజ్గళ్కైతొఴచ్చోదివెళ్ళత్తినుళ్ళే*
ఎఴువదోరురువెన్నెఞ్జుళ్ళెఴుమ్ మార్క్కుమఱివరిదే. ౧౦.

అ॥ ఇవళ్ - ఈమె, ఓర్ - అద్వితీయమై, కఴియమిక్కాదు - మిక్కిలియతిశయించియున్న, కాదలళ్ - ఆశగలది, ఎన్ఱు - అని, అన్నై - తల్లి, కాణకొడాళ్ - చూడనివ్వదు. వఴువిల్ - నాశములేని,కీర్త్తి-కీర్తిగల, తిరుక్కుఱుంగుడినమ్బియై-తిరుక్కుఱుంగుడినమ్బిని,నాళ్-నేను, కణ్డపిఱ్ - సేవించినతరువాత, తేవర్ - నిత్యసూరులయొక్క, కుఴాఙ్గళ్ - సమూహములు, కుఴుమి - గుంపుగాచేరి, కైతొఴ - ఆశ్రయించునటుల, శోదివెళ్ళత్తినుళ్ - కాన్తిప్రవాహముయొక్క మధ్యమందు, ఎఴువదు - ఉజ్జ్వలమైప్రకాశించుచున్న, ఓర్ - విలక్షణమైన, ఉరు - తిరుమేను, ఎన్నెఞ్జుళ్ - నామనస్సునందు, ఎఴుమ్ - ప్రకాశించుచున్నది, ఆర్క్కుమ్ - భక్తిలేనివారెవ్వరికిని, అఱివరిదు - తెలిసికొనుటకశక్యము.

తా॥ ఈమె నమ్బిపైన మిక్కిలియాశగలది గాన దీనిని వీథిలో పంపించగూడదని నన్ను లోపలనేయుంచియున్నను, నిత్యసూరులు గుంపులుగుంపులుగా చేరి స్తోత్రముజేయుచున్న వాఁడై, కాన్తియనెడి ప్రవాహమందు మూర్తీకరించి లేచినసౌన్దర్యమువలె నత్యుజ్జ్వలమైయున్న నమ్బియొక్క తిరుమేని నామనస్సులోనే యనవరతముప్రకాశించుచున్నది. అదిభక్తిలేనిమీకుగనుపడదని.

౹౹ అఱివరియపిరానై యాఴియఙ్గైయనై యేయలత్తి*
నఱియనన్మలర్నాడి నన్కురుగూర్చ్చడగోపన్ శొన్న*
కుఱిక్కొళాయిత్తుళ్ళివై పత్తుమ్ తిరుక్కుఱుఙ్గుడియదన్మేల్*
అఱియక్కఱ్ఱువల్లార్ వైట్టణవ రాఴ్కడల్ ఞాలత్తుళ్ళే. ౧౧.

అ॥ అఱివరియ - తెలిసికొనుటకశక్యమైనవాడును, పిరానై - స్వామియు, ఆఴి - సుదర్శనమును, అమ్కైయనై - సుందరమైనశ్రీహస్తమందుగలవాఁడునునైన తిరుక్కుఱుంగుడినమ్బి విషయమై, అలత్తి - ప్రేమచేయతిచి, నఱియ - పరిమళించుచున్న, నల్ - సుందరమైన, మలర్ - పుష్పమును, నాడి - వెతకిసంపాదించి, నన్కురుగూర్ - సుందరమైనకురుకాపురికి స్వామియైన, శడగోపన్ - నమ్మాఴ్వార్లు, శొన్న - పాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, కుఱికొళ్ - నమ్బియొక్కదివ్యాభరణదివ్యావయవాది చిహ్నములను ప్రతిపాదించుచున్న, తిరుక్కుఱుఙ్గుడియదన్మేల్ - తురుక్కుఱుంగుడియనెడుదివ్యదేశవిషయమైన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, కఱ్ఱఱియవల్లార్ - అభ్యసించితెలిసికొనఁదగినవారు, ఆఴ్ - అగాధమైన, కడల్ - సముద్రముచేజుట్టపడిన, ఞాలత్తుళ్ళే - భూమియందే, వైట్టణవర్ - భగవంతునియనుభవించుచున్న భాగవతులైయగుదురు.

తా॥ తిరుక్కుఱుంగుడినమ్బివిషయమై ప్రేమపరవశులైన నమ్మాఴ్వార్లుప్రసాదించిన యీపది పాశురముల నభ్యసించెడి శ్రీవైష్ణవులు ఈలోకమందే సర్వేశ్వరుని యనుభవింతురని. ౧౧.

ఆ ఴ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౬ - వ తిరువాయ్మొழி.

అవతారిక.—నందగోకులమందు కృష్ణవిశ్లేషాసహిష్ణువులైన గోపికలు కృష్ణచేష్టితములను తామాచరించి ధరించియున్నటుల, ఈయాழ்వార్లనెడు నాయకి భగవద్విశ్లేషమును సహింపక సర్వేశ్వరుఁడు చెప్పెడుమాటలను తాను చెప్పుచుండగా నావూరులోనున్నవారు జూచి యీనాయకి యొక్క తల్లిదగ్గఱవచ్చి మీపిల్లచెప్పెడు మాటలీవిధంబులై యుండుటకుఁ గారణమేమి! దాని యర్థమేమి!మాకుచెప్పుమనియడగగా నప్పుడాతల్లియాழ்వార్లభిప్రాయము నెఱుంగక, నాపిల్లమీద భగవదావేశమువచ్చెనని చెప్పినవిధమును ప్రసాదించుచున్నారు.

‡‡ కడల్ ఞాలమ్ శెయ్ దేనుమ్ యానేయెన్నుమ్
కడల్ ఞాలమావేనుమ్ యానేయెన్నుమ్*
కడల్ ఞాలఙ్కొణ్డేనుమ్ యానేయెన్నుమ్
కడల్ ఞాలఙ్కీణ్డేనుమ్ యానేయెన్నుమ్*
కడల్ ఞాలముణ్డేనుమ్ యానేయెన్నుమ్
కడల్ ఞాలత్తీశన్ వన్దేఱక్కొలో*
కడల్ ఞాలత్తీర్ క్కివై యెన్ శొల్లుగేన్
కడల్ ఞాలత్తెన్ మగళ్ కత్కిన్ఱవే. ౧.

అ॥ కడల్ - సముద్రముచేజుట్టబడిన, ఞాలమ్ - భూమిని, శెయ్ దేనుమ్ - సృష్టించినవాఁడును, యానే - నేనే, ఎన్నుమ్ - అనిచెప్పును, కడల్ ఞాలమ్ - సముద్రముచేజుట్టబడిన భూమికి, ఆవేనుమ్ - అన్తర్యామియైనవాడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కడల్ ఞాలమ్ - సముద్రముచేజుట్టబడినభూమిని, కొణ్డేనుమ్ - (మహాబలివద్దనుండి) తీసినవాఁడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కడల్ ఞాలమ్ - సముద్రముచేజుట్టబడినభూమని, కీణ్డేనుమ్-(పాతాళమునుండి) విడతీసినవాడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కడల్ ఞాలమ్-సముద్రముచేజుట్టబడినభూమిని, ఉణ్డేనుమ్ - (ప్రళయకాలమందు) మ్రింగివాఁడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కడల్ ఞాలత్తు - సముద్రముచేజుట్టబడినభూమికి, ఈశన్ - స్వామియైనశ్రియఃపతి, వన్దు - వచ్చి, ఏఱక్కొలో - ఆవేశించెనో? కడల్ ఞాలత్తు - సముద్రముచేజుట్టబడిన భూలోకమందున్న, ఎన్ మగళ్ - నాకొమార్తె, కత్కిన్ఱ - చెప్పుచున్న, ఇవై - ఈమాటలను, కడల్ ఞాలత్తీర్ క్కు - సముద్రముచేజుట్టబడినభూలోకమందున్నమీకు, ఎన్ శొల్లుగేన్ - ఏమనిచెప్పెదను.

తా॥ ఓస్త్రీలారా! ఈజగత్తును సృజించినవాఁడును రక్షించువాఁడును కొలిచినవాఁడును ఉద్ధరించినవాఁడును మ్రింగినవాఁడును నేనేయని యీపె చెప్పుడమును జూడగా ఈపె యందు సర్వేశ్వరుఁ డావేశించినాడని తోఁచుచున్నది. దీనినినేనేమని చెప్పెదనని. ౧

కఱ్కుమ్కల్వి క్కెల్లైయిలనే యెన్నుమ్
కఱ్కుమ్కల్వియావేనుమ్ యానేయెన్నుమ్*
కఱ్కుమ్కల్వి శెయ్వేనుమ్ యానేయెన్నుమ్
కఱ్కుమ్కల్వితీర్ ప్పేనుమ్ యానేయెన్నుమ్*
కఱ్కుమ్కల్విచ్చారముమ్ యానేయెన్నుమ్
కఱ్కుమ్కల్వినాదన్ వన్దేఱక్కొలో*
కఱ్కుమ్కల్వియీర్క్కివై యెన్శొల్లుగేన్
కఱ్కుమ్కల్వియెన్మగళ్ కాణ్గిన్ఱవే. ౧.

అ॥ కఱ్కుమ్ - అధ్యయనము జేయదగిన, కల్విక్కు - వేదవిద్యకు, ఎల్లై - అవధియైనఉప నిషత్తును, ఇలన్ - వాసస్థానముగాగలవాఁడను, ఎన్నుమ్ - అనిచెప్పును. కఱ్కుమ్కల్వి - అభ్యసింపదగినవిద్యకు, ఆవేనుమ్ - నిర్వాహకుఁడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కఱ్కుమ్ కల్వి - అభ్యసింపదగినవిద్యను, శెయ్వేనుమ్ - చేయువాఁడును, యానేయెన్నుమ్ - నేనేయని చెప్పును. కఱ్కుమ్కల్వి-అభ్యసింపదగినవిద్యకు, తీర్ప్పేనుమ్ - తాత్పర్యనిర్ణయముజేయువాఁడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కఱ్కుమ్కల్వి- అభ్యసింపదగినవిద్యయొక్క, శారముమ్-ఫలమును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కఱ్కుమ్కల్వి - అభ్యసింపదగినవిద్యయందుప్రతిపాదింపబడిన, నాదన్ - సర్వేశ్వరుఁడు, వన్దు - వచ్చి, ఏఱక్కొలో - ఆవేశించెనో? కఱ్కుమ్కల్వియీర్క్కు - అభ్యసింపదగినవిద్యగలమీకు, కఱ్కుమ్కల్వి-విద్యాభ్యాసయోగ్యమైనవయస్సుగల, ఎన్మగళ్ - నాపుత్రిక, కాణ్గిన్ఱ - అనుసంధించుచున్న, ఇవై - ఈమాటలను, ఎన్శొల్లుగేన్ - ఏమిచెప్పెదను

తా॥ నాకొమార్తె, వేదాన్తవేద్యుఁడును, వేదమునకునిర్వాహకుండును, ప్రవర్తకుఁడును, తాత్పర్యనిర్ణాయకుఁడును ఫలభూతుఁడును నేనేయనిచెప్పుచున్నది దీనినిజూడగా సర్వేశ్వరుఁడీపెయందావేశించెనోయనితోఁచుచున్నది. ఈచిన్నవయస్సులో నీపెనేర్చినమాటలను విద్యాధ్యయనముజేయని మీకేమని చెప్పెదనని. ౧.

కాణ్గిన్ఱనిలమెల్లామ్ యానేయెన్నుమ్
కాణ్గిన్ఱవిశుమ్బెల్లామ్ యానేయెన్నుమ్*
కాణ్గిన్ఱవెన్దీయెల్లామ్ యానేయెన్నుమ్
కాణ్గిన్ఱవిక్కాత్తెల్లామ్ యానేయెన్నుమ్*
కాణ్గిన్ఱకడలెల్లామ్ యానేయెన్నుమ్
కాణ్గిన్ఱకడల్వణ్ణ నేఱక్కొలో*
కాణ్గిన్ఱవులగత్తీర్ క్కెన్శొల్లుగేన్
కాణ్గిన్ఱవెన్కారిగై శెయ్గిన్ఱవే. 3.

అ॥ కాణ్గిన్ఱ - చూడబడుచున్న, నిలమెల్లామ్ - భూమియంతయు, యానేయెన్నుమ్ - నేనే యనిచెప్పును. కాణ్గిన్ఱ - చూడబడుచున్న, విశుమ్బెల్లామ్ - ఆకసమంతయు, యానేయెన్నుమ్ - నేనే యనిచెప్పును. కాణ్గిన్ఱ - చూడబడుచున్న, వెమ్ - ఉష్ణమైన, తీయెల్లామ్ - అగ్నియంతయు, యానేయెన్నుమ్ - నే నేయనిచెప్పును. కాణ్గిన్ఱ - చూడబడుచున్న, ఇక్కాఱ్ఱెల్లామ్ - ఈవాయువంతయు, యానేయెన్నుమ్ - నేనే యనిచెప్పును. కాణ్గిన్ఱ - చూడబడుచున్న, కడలెల్లామ్ - సముద్రమంతయు, యానేయెన్నుమ్ - నేనే యనిచెప్పును. కాణ్గిన్ఱ - చూడబడుచున్న, కడల్ - సముద్రమువంటి, వణ్ణన్ - కాన్తిగలసర్వేశ్వరుఁడు, ఏఱుక్కొలో - ఆవేశించెనో? కాణ్గిన్ఱ - చూడబడుచున్న, ఉలగత్తీర్కు - లోకమందున్న మీకు, కాణ్గిన్ఱ - సకలపదార్థములను సాక్షాత్కరించుచున్న, ఎన్ కాదిగళ్ - నాకొమార్తె, శెయ్గిన్ఱ - చేయుచున్న వ్యాపారములను, ఎన్ శొల్లుగేన్ - ఏమిచెప్పెదను.

తా॥ ప్రత్యక్షసిద్ధంబులైన పృథివ్యప్తేజోవాయ్వాకాశ సముద్రములన్నింటికిని నిర్వాహకుండైనసర్వేశ్వరుఁడు నేనేయనియీపెచెప్పుటచే నీపెయందుసర్వేశ్వరుఁడావేశించినాడనినాకు తోఁచుచున్నది. సకలవస్తువులను సాక్షాత్కరించిన నాకొమార్తెచేయు వ్యాపారమును మీకు నేనేమని చెప్పెదనని 3.

శెయ్గిన్ఱకిదియెల్లామ్ యానేయెన్నుమ్
శెయ్వానిన్ఱనగళుమ్ యానేయెన్నుమ్*
శెయ్దుమున్నిఱన్దవుమ్ యానేయెన్నుమ్
శెయ్గైప్పయనుణ్బేనుమ్ యానేయెన్నుమ్*
శెయ్వార్గళైచ్చెయ్వేనుమ్ యానేయెన్నుమ్
శెయ్యకమలక్కణ్ణ నేఱుక్కొలో*
శెయ్యవులగత్తీర్క్కివై యెన్ శొల్లుగేన్
శెయ్యకనివా యిళమాన్ తిఱత్తే. ౪.

అ॥ శెయ్గిన్ఱ - చేయబడుచున్న, కిదియెల్లామ్ - యాగాదిక్రియలన్నియు, యానేయెన్నుమ్ - నేనే యనిచెప్పును. శెయ్వాన్ - ఇకఁమీఁద చేయఁదగినవై, నిన్ఱనగళుమ్ - ఉన్నవియు, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. మున్ - మునుపు, శెయ్దు - చేసి, ఇఱన్దవుమ్ - పోయినవియు, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. శెయ్గై - కర్మములయొక్క, పయన్ - ఫలమును, ఉణ్బేనుమ్ - భుజించువాఁడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. శెయ్వార్గళై - కర్మలననుష్ఠించువారిని, శెయ్వేనుమ్ - ప్రేరణచేయువాడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును, శెయ్య - ఎఱ్ఱనైన, కమలక్కణ్ణన్ - పద్మమువంటినేత్రములుగల సర్వేశ్వరుఁడు, ఏఱుక్కొలో - ఆవేశించెనో? శెయ్య - ఋజుస్వభావముగల( చెప్పినమాటనుబరిశీలించక చెప్పినట్లే తెలిసికొనువారైన), ఉలగత్తీర్కు - లోకమందున్న మీకు, శెయ్య - ఎఱ్ఱనైన, కని - పండువలెనున్న, వాయ్ - అధరముగలదియు, ఇళమాన్ - చిన్న లేడివంటి మాపుగలదియునైనయీపెయొక్క తిఱత్తు - వ్యాపారములయందు, ఇవై - ఈవ్యాపారములను, ఎన్ శొల్లుగేన్ - ఏమనిచెప్పెదను

తా॥ భూతభవిష్యద్వర్తమానకాలములయందును జేయదగినక్రియలను నెరవేర్చువాఁడును వానిఫలమును భుజించువాఁడును, చేయువారిని ప్రేరణచేయువాఁడును నేనేయని యీపెచెప్పుచున్నది. ఈపెయందు సర్వేశ్వరుఁడావేశించి యుండవచ్చును. ఈబాలిక చెప్పెడుమాటలను బరిశీలించని మీకు నేనేమి చెప్పెదనని. ౪.

తిఱమ్బామల్ మణ్కాక్కిన్ఱేన్ యానేయెన్నుమ్
తిఱమ్బామల్ మలై యెడుత్తేనే యెన్నుమ్*
తిఱమ్బామలశురరైక్కొన్ఱేనే యెన్నుమ్
తిఱన్గాట్టియన్ఱైవరైక్కాత్తేనే యెన్నుమ్*
తిఱమ్బామల్ కడల్ కడైన్దేనే యెన్నుమ్
తిఱమ్బాదకడల్వణ్ణ నేఱక్కొలో*
తిఱమ్బాదవులగత్తీర్క్కెన్ శొల్లుగేన్
తిఱమ్బాదెన్ తిరుమగళ్ ఎయ్దినవే. ౫.

అ॥ తిఱమ్బామల్ - తనయాజ్ఞకుఅడ్డులేకుండ, యానే - నేనే, మణ్ - భూమిని, కాక్కిన్ఱేన్ - రక్షించుచున్నాను, ఎన్నుమ్ - అనిచెప్పును. తిఱమ్బామల్ - చలింపక, మలై - గోవర్ధనగిరిని, ఎడుత్తేనేయెన్నుమ్ - ఎత్తినాననిచెప్పును తిఱమ్బామల్ - తప్పక, అశురరై - అసురులను, కొన్ఱేనేయెన్నుమ్ - చంపినాననిచెప్పును. తిఱమ్కాట్టి - ఉపాయములనుచెప్పించి, అన్ఱు - భారతయుద్ధమందు, ఐవరై - పఞ్చపాణ్డవులను, కాత్తేనేయెన్నుమ్ - రక్షించితినని చెప్పును. తిఱమ్బామల్ - సఙ్కల్పించినవిధముతప్పక, కడల్ కడైన్దేనేయెన్నుమ్ - సముద్రమునుచిలికినానని చెప్పును తిఱమ్బాద - ఆశ్రితరక్షణమందుచలించని, కడల్వణ్ణన్ - సముద్రమువంటికాన్తిగలసర్వేశ్వరుడు, ఏఱక్కొలో - ఆవేశించెనో? తిఱమ్బాద - (ఈమాటనువినవలయునని యభిప్రాయమందు) చలింపని, ఉలగత్తీర్క్కు - లౌకికులైనమీకు, ఎన్ - నాయొక్క, తిరు - లక్ష్మీదేవితోసమానురాలైన, మగళ్ - కొమార్తె-తిఱమ్బాదు - తప్పక, ఎయ్దిన - పొందినవ్యాపారములను, ఎన్ శొల్లుగేన్ - ఏమిచెప్పెదను.

తా॥ జగత్తును రక్షించినవాఁడును, గోవర్ధనగిరినెత్తినవాఁడును, అసురులను సంహరించినవాఁడును, పాండవులనురక్షించినవాఁడును, సముద్రమును జిలికినవాఁడును నేనేయని యీపెమాటనువినగా సర్వేశ్వరుఁడావేశించియున్నాఁడని తలంచుచున్నాను. పిడివాదముగల మీకు నేనేమనిచెప్పెదనని. ౫.

ఇనవేయ్మలై యేన్దినేన్ యానేయెన్నుమ్
ఇనవేఱుగళ్ శెఱ్ఱేనుమ్ యానేయెన్నుమ్*
ఇనవాన్కన్ఱుమేయ్త్తేనుమ్ యానేయెన్నుమ్
ఇనవానిరై కాత్తేనుమ్ యానేయెన్నుమ్*

ఇనవాయర్ తలైవనుమ్ యానేయెన్నుమ్
ఇన త్తేవర్ తలైవర్ వన్దేఱక్కొలో*
ఇనవేల్కణ్ నల్లీర్క్కివై యొన్ఱుశొల్లుగేన్
ఇనవేల్కణ్ణియెన్ మగళ్ ఉత్తనవే. ౫.

అ॥ ఇనమ్ - గుంపులుగానున్న, వేయ్ - వెదురులుగల, మలై - గోవర్ధనగిరిని, యాన్ - నేను, ఏన్దినేనెన్నుమ్ - ఎత్తిధరించినానని చెప్పును యానే - నేనే, ఇనమ్ - గుంపులుగానున్న, ఏఱుగళ్ - వృషభములను, శెత్తేనుమ్ - చంపినవాఁడవును, ఎన్నుమ్ - అనిచెప్పును. ఇనమ్ - గుంపుగానున్న, వాన్ కన్ఱు - పెద్దదూడలను, యానే - నేనే, మేయ్త్తేనేయెన్నుమ్ - మేపినా వనిచెప్పును. ఇనమ్ - గుంపుగానున్న, ఆనిరై - గోసమూహములను, యానే - నేనే, కాత్తేనే రెుున్నుమ్ - రక్షించితినని చెప్పును, ఇనమ్ - గుంపుగానున్న, ఆయర్ - గొల్లలకు, యానే - నేనే, తలైవనేయెన్నుమ్ - ప్రధానుఁడనని చెప్పును. ఇనమ్ - సంఘమైయున్న, తేవర్ - నిత్యసూరులకు, తలైవర్ వన్దు - ప్రధానుఁడైనసర్వేశ్వరుఁడువచ్చి, ఏఱక్కొలో - ఆవేశించినాడో? ఇనమ్ - పరస్పరసమానములై, వేల్ - ధనస్సువలెనున్న, కణ్ - నేత్రములుగల, నల్లీర్క్కు - విలక్షణురాలైనమీకు, వేల్ - ధనుస్సుతో, ఇనమ్ - సమానమైన, కణ్ణి - నేత్రములుగల, ఎన్ మగళ్ - నాకొమార్తె, ఉత్తన - పొందిన, ఇవై - ఈస్వభావములను, ఎన్ శొల్లుగేన్ - ఏమి చెప్పెదను.

తా॥ గోవర్ధనము నెత్తి గోగోపలను రక్షించినవాఁడును, నప్పిన్నపిరాట్టికై పందయమై పెట్టిన సప్తవృషభములను జంపినవాఁడును, నేనేయని నాపిల్ల సర్వేశ్వరావేశముచే చెప్పుచున్నది. ఈ పె స్వభావములను మీకు నేనేమని చెప్పెదనని. ౫.

ఉత్తార్గళెనక్కిల్లై యారుమెన్నుమ్
ఉత్తార్గళెనక్కిఙ్గెల్లారుమెన్నుమ్*
ఉత్తార్గళై చ్చెయ్వేనుమ్ యానేయెన్నుమ్
ఉత్తార్గళై యళిప్పేనుమ్ యానేయెన్నుమ్*
ఉత్తార్గళుక్కుత్తేనుమ్ యానేయెన్నుమ్
ఉత్తారిలిమాయన్ వన్దేఱక్కొలో*
ఉత్తీర్గట్కు ఎన్ శొల్లిచ్చొల్లుగేన్ యాన్
ఉత్తెన్నుడై ప్పేదై యురైక్కిన్ఱవే. ౬.

అ॥ ఎనక్కు - నాకు, యారుమ్ - ఎవ్వరును, ఉత్తారిల్లై - సోపాధికబంధువులులేరు, ఎన్నుమ్ - అనిచెప్పును. ఎనక్కు - నాకు, ఇఙ్గు - ఇచ్చట, ఎల్లారుమ్ - ఎల్లరును, ఉత్తార్గళ్ - నిరుపాధికబంధువులు, ఎన్నుమ్ - అనిచెప్పును. యానే - నేనే, ఉత్తార్గళై - బంధువులను (బంధువులగునట్లు), శెయ్వేనుమ్ - చేయువాఁడును, ఎన్నుమ్ - అనిచెప్పును. యానే - నేనే, ఉత్తార్గళై - (ప్రయోజనాన్తరమునుగోరి నన్ను) పొందినవారిని, అళిప్పేనుమ్ - సంహా

రమందుపడ(ద్రోయుచున్నాను, ఎన్నుమ్ - అనిచెప్పును. యానే - నేనే, ఉన్ గ్గార్ గట్కు - (అనన్యప్రయోజనులై) నన్ను జేరినవారికి, ఉఱ్ఱేనుమ్ - బంధువయినవాఁడను, ఎన్నుమ్ - అని చెప్పును. ఉఱ్ఱార్ -(తనతో) సమానులు, ఇలి - లేని, మాయన్ - ఆశ్చర్యభూతుఁడైన సర్వేశ్వరుఁడు, వన్దు - వచ్చి, ఏఱక్కొల్లో - ఆవేశించెనో? ఉఱ్ఱార్ గట్కు - బంధువులైన మీకు, ఎన్నుడై - నాయొక్క, పేదై - పిల్ల, ఉఱ్ఱు - బాధనుపొంది, ఉరైక్కిన్ఱ - చెప్పు చున్నమాటలను, ఎన్ శొల్లి శొల్లుగేన్ - ఏమనిచెప్పెదను.

తా॥ లోకరీతిగా నాకెవరు బంధువులు లేరు, శాస్త్రరీతిగా నాకందరుబంధువులే, నే నే యెల్లలను బంధువులుగాజేసికొంటిని ధనాదులనుగోరువారిని నేను దగ్గఱచేర్చను, అనన్యప్రయో జనులై వచ్చినవారితో నేనుజేరియుందును, అని యీమాటలను నా పిల్ల సర్వేశ్వరావేశముకలిగి చెప్పుచుండవచ్చును. ఇట్టి నాబాధను మీ కేమని చెప్పెదనని. ౭.

ఉరైక్కిన్ఱ ముక్కట్పిరాన్ యానేయెన్నుమ్
ఉరైక్కిన్ఱ తిరుమగన్ యానేయెన్నుమ్*
ఉరైక్కిన్ఱ వమరరుమ్ యానేయెన్నుమ్
ఉరైక్కిన్ఱ వమరర్ కోన్ యానేయెన్నుమ్*
ఉరైక్కిన్ఱ మునివరుమ్ యానేయెన్నుమ్
ఉరైక్కిన్ఱ ముగిల్వణ్ణ నేఱక్కొల్లో*
ఉరైక్కిన్ఱ వులగత్తీర్ క్కెన్ శొల్లుగేన్
ఉరైక్కిన్ఱ వె న్కోమళవొణ్కొడిక్కే. ౮

అ॥ ఉరైక్కిన్ఱ - (సర్వేశ్వరునికి శరీరముగా) చెప్పఁబడిన, ముక్కణ్పిరాన్ - త్రినే త్రుఁడైన రుద్రుఁడు, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. ఉరైక్కిన్ఱ - (అరుద్రునితండ్రి యని) చెప్పఁబడిన, తిరుమగన్ - చతుర్ముఖుఁడు, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. ఉరైక్కిన్ఱ - (బ్రహ్మచేసృజింపఁబడినవారని) చెప్పఁబడిన, అమరరుమ్ - దక్షాదులును, యానే యెన్నుమ్ - నేనేయని చెప్పును. ఉరైక్కిన్ఱ-(దేవతలలో శ్రేష్ఠుఁడని) చెప్పఁబడిన, అమరర్ కోన్- దేవేన్ద్రుఁడు, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును ఉరైక్కిన్ఱ - (వేదార్థములనులోకులకు) ఉపదేశించెడి, మునివరుమ్ - మన్వాదులును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. ఉరైక్కిన్ఱ- (కాళమేఘమువంటివాఁడని) చెప్పఁబడుచున్న, ముగిల్ వణ్ణన్ - మేఘమువంటిమేనుగలసర్వేశ్వ రుఁడు, ఏఱక్కొల్లో-ఆవేశించియుండునో? ఉరైక్కిన్ఱ-చెప్పుమనిచెప్పుచున్న, ఉలగత్తీర్కట్కు- లౌకికులైనమీకు, ఉరైక్కిన్ఱ -(ఉల్లోకముగా) చెప్పుచున్న, ఎన్ - నాకొమార్తెయై, కోమళమ్- సుకుమారియై, ఒణ్ - సుందరియై, కొడిక్కు - తీగెవలెనున్న యీపెయొక్క, ఇవై-ఈస్వభావ ములను. ఎన్ శొల్లుగేన్ - ఏమిచెప్పెదను.

తా॥ బ్రహ్మరుద్రేన్ద్రాది సకలదేవతలును, దక్షాదిప్రజాపతులును, మన్వాదులును నే నే యని చెప్పుచున్న నాపిల్లమీదనావేశించి సర్వేశ్వరుఁడు చెప్పించుచున్నాఁడని తలఁచుచున్నాను. చెప్పుచెప్పుమని నిర్బంధించుచున్న మీకునేనేమి చెప్పెదనని. ౮.

కొడియవినై యాదుమిలనే యెన్నుమ్
కొడియవినై యావేనుమ్ యానేయెన్నుమ్*
కొడియవినై శెయ్వేనుమ్ యానేయెన్నుమ్
కొడియవినై తీర్ప్పేనుమ్యానే యెన్నుమ్*
కొడియానిలఙ్గై శెఱ్ఱేనేయెన్నుమ్
కొడియపుళ్ళుడై యవ నేఱుక్కొలో*
కొడియవులగత్తీర్ క్కెవ్వై యెన్ శొల్లుగేన్
కొడియేన్ కొడియెన్మగళ్ కోలఙ్గళే. ౯

అ॥ కొడియ - బాధపెట్టుచున్న, వినై - పాపము, యాదుమ్ - ఏమియు, ఇలన్ - కలవాఁడనుకాను, ఎన్నుమ్ - అనిచెప్పును. కొడియవినై క్రూరమైనపాపములకు, ఆవేనుమ్ - నిర్వాహకుఁడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. కొడియవినై - చెడ్డపాపములను, శెయ్వేనుమ్ - (ప్రతికూలులకు) చేయించువాఁడును, యానేయెన్నుమ్ - నేనేయనిచెప్పును. యానే - నేనే, కొడియవినై - (భక్తులయొక్క) క్రూరపాపములను, తీర్ప్పేనుమ్ - తీర్చువాఁడను, ఎన్నుమ్ - అనిచెప్పును. కొడియాన్ - క్రూరుఁడైనరావణునియొక్క, ఇలఙ్గై - లంకను, శెఱ్ఱేన్ - నశింపఁజేసితిని. ఎన్నుమ్ - అనిచెప్పును. కొడియ - (శత్రువులమీద) క్రూరస్వభావముగల, పుళ్ - గరుత్మంతుని, ఉడైయవన్ - వాహనముగాగలసర్వేశ్వరుఁడు, ఏఱుక్కొలో - ఆవేశించినందువలెనుండునో ? కొడియ - క్రూరమైన (నిర్బంధపెట్టెడు) స్వభావముగల, ఉలగత్తీర్క్కు - లౌకికులైనమీకు, కొడి - తీగవలెనున్నదియు, కొడియేన్ - పాపినైన, ఎన్ - నాయొక్క, మగళ్ - కొమార్తెయునైన యీపెరొయొక్క, కోలఙ్గళ్ - సుందరంబులైన, ఇవై - ఈవ్యాపారములను, ఎన్ శొల్లుగేన్ - ఏమిచెప్పెదను.

తా॥ నాకేవిధమైనపాపమును సంభవించదు. పాపమనగా నాకోపమేగాని వేఱుకాదు. ప్రతికూలులకు పాపమును జేయించువాఁడును, భక్తులపాపమును పోగొట్టువాఁడును నేనే. రావణుని నేనేజంపితిని యని గరుడవాహనుఁడైన సర్వేశ్వరుఁడు నాపిల్లమీదనావేశించి చెప్పుచున్న దానిని మీకేమని చెప్పెదనని. ౯.

కోలఙ్గొళ్ శువర్క్కముమ్ యానేయెన్నుమ్
కోలమిల్ నరగముమ్ యానేయెన్నుమ్*
కోలమ్తిగழ్ మోక్కముమ్ యానేయెన్నుమ్
కోలఙ్గొళుయిర్గళుమ్ యానేయెన్నుమ్*
కోలఙ్గొళ్ తనిముదల్ యానేయెన్నుమ్
కోలఙ్గొళ్ ముగిల్వణ్ణ నేఱుక్కొలో*
కోలఙ్గొళులగత్తీర్ క్కెన్ శొల్లుగేన్
కోలన్దిగழ్ కోదై యెన్ కూన్దలుక్కే. ౧౦.

అ॥ కోలఙ్కొళ్ - అందము (సుఖము) గల, శువర్క్కముమ్ - స్వర్గమునకును, యానే యెన్నుమ్ - నేనే నిర్వాహకుఁడనని చెప్పును. యానే - నేనే, కోలమిల్ - సుఖములేని, నరకముమ్ - నరకమునకును నిర్వాహకుఁడను, ఎన్నుమ్ - అని చెప్పును. యానే - నేనే, కోలఙ్కొళ్ - (అపరిచ్ఛిన్న) సుఖముగల, మోక్కముమ్ - మోక్షమునకు నిర్వాహకుఁడను, ఎన్నుమ్ - అని చెప్పును. కోలఙ్కొళ్ - జ్ఞానానన్దస్వరూపులైన, ఉయిర్గళుమ్ - జీవాత్మలకును, యానే - నేనే నిర్వాహకుఁడను, ఎన్నుమ్ - అని చెప్పును కోలఙ్కొళ్ - విచిత్రస్వభావముగలదై, తనిమ్ - అద్వితీయమైన, ముదల్ - కారణమైనమూలప్రకృతికిని, యానే - నేనే నిర్వాహకుఁడను, ఎన్నుమ్ - అని చెప్పును. కోలఙ్కొళ్ - (ఇన్ద్రధనుస్సు మొదలగు) వైచిత్ర్యముగల, ముగిల్ - మేఘమువంటి, వణ్ణన్ - కాన్తిగలసర్వేశ్వరుఁడు, ఏఱక్కొలో - ఆవేశించియున్నాఁడో? కోలఙ్కొళ్ - సుందరులై, ఉలగత్తీర్క్కు - లౌకికులైనమీకు, కోలమ్ - సౌన్దర్యము, తిగழ் - ప్రకాశించుచున్న, కోదై - మాలికచేనలంకరింపఁబడిన, ఎన్ - నాకొమార్తెయైన, కూన్దలుక్కు - చక్కనికొప్పుగలయామెకు, ఎన్ - ఏవిధముగానున్నదని, శొల్లుగేన్ - చెప్పెదను.

తా॥ సర్వేశ్వరావేశముగలిగిన నాపిల్ల స్వర్గ నరక మోక్షములకును, చేతనాచేతనములకును నేనే స్వామియని చెప్పుచున్నమాటను మీకు నేనేమని చెప్పెదనని. ౧౦

౹౹ కూన్దల్ మలర్ మఙ్గైక్కుమ్ మణ్మడన్దైక్కుమ్
కులవాయర్ కొழున్దుక్కుమ్ కేళ్వన్ఱన్నై*
వాయ్న్దవழுదివళనాడన్ మన్ను
కురుగూర్ చ్చడగోపన్ కుఱ్ఱేవల్ శెయ్దు*
ఆయ్న్దతమిழ் మాలై యాయిరత్తుళ్
ఇవైయుమోర్ పత్తుమ్వల్లార్*ఉలగిల్
ఏన్దుపెరుఞ్జెల్వత్తరాయ్ త్తిరుమా
లడియార్గళై ప్పూశిక్కనోఱ్ఱార్గళే. ౧౧.

అ॥ కూన్దల్ - శ్లాఘ్యమైనకొప్పుగల, మలర్మఙ్గైక్కుమ్ - కమలవాసినియైన శ్రీదేవికిని, మణ్మడన్దైక్కుమ్ - భూమిప్పిరాట్టికిని, ఆయర్ - గోపలయొక్క, కులమ్ - వంశమందు, కొழுన్దుక్కుమ్ - చిగురువలెనున్న నప్పిన్నపిరాట్టికిని, కేళ్వన్ఱన్నై - నాయకుఁడైన సర్వేశ్వరునియుద్దేశించి, వాయ్న్ద - (భావనచేసర్వేశ్వరుని) సమీపించినవారై, వழுదివళనాడన్ - వழுదివళనాడు అనెడిదేశమందు, మన్ను - అమరికతోవాసంచేసియున్న వారునైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, కుఱ్ఱేవల్ - అన్తరఙ్గకైఙ్కర్యముగా, శెయ్దు - అనుష్ఠించి, ఆయ్న్ద - వేదార్థమునుబరిశీలించిసాధించిన, తమిழ் మాలై - ద్రావిడశబ్దసన్దర్భరూపములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవైయుమోర్పత్తుమ్ - విలక్షణములైనఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, ఉలగిల్ - లోకమందు, ఏన్దు - పొగడఁదగిన, పెరుఞ్జెల్వత్తరాయ్ - గొప్పశ్రీవైష్ణవ

నమ్పత్తుగలవారై, తిరుమాల్ - శ్రియఃపతియొక్క, అడియార్గళై - దాసులను, పూశిక్క - ఆరాధించుటకు (దగిన), నోత్ఱార్గళ్ - భాగ్యముగలవారగుదురు

తా॥ శ్రీభూనీళాదేవులకువల్లభుఁడైన సర్వేశ్వరుని విషయమై వానిచేష్టాదులను భావించి నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు ఈలోకమందు శ్రీవైష్ణవుల నారాధించుచు గొప్పకీర్తి గలవారైయుందురని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౭ - వ, తిరువాయ్మొఴి.

---

అవతారిక:—ఈవిధంబున సర్వేశ్వరుని యనుకరించినను వాఁడు వేంచేయనందున, దీనికిఁ గారణమేమని యాలోచించి, తనయందు నాకుగలిగినభక్తి నేనుస్వరూపమునిదలంచక తనప్రాప్తి కుపాయముగా తలంచియున్నాననియు, ఆ యుపాయము నెరవేరినప్పుడు తనదగ్గఱవచ్చి చేరెదననియు దలంచి నన్ను ఉపేక్షించియున్నాడో యేమోయని యాలోచించి నాయందట్టియేవిధమైన యుపాయమును లేదనివిన్నవించి వానమామలయందు వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదములయందు ప్రపత్తి చేయుచున్నారు.

‡‡ నోత్ఱనోన్బిలేన్ నుణ్ణఱివిలే నాగిలుమినియున్నైవిట్టు *ఒన్ఱుమ్
ఆత్ఱగిత్కిన్ఱిలే నరవినణైయమ్మానే*
శేత్ఱుత్తామరై శెన్నెలూడుమలర్ శిరీవరమఙ్గలనగర్ *
వీత్ఱిరున్ద వెన్దా యునక్కుమిగై యల్లేనఙ్గే. ౧

అ॥ నోత్ఱ - (ఫలమునుగోరి) చేసిన, నోన్బు ఇలేన్ - వ్రతము (కర్మయోగము) గలవాఁడనుకాను. నుణ్ - సూక్ష్మమైన (స్వస్వరూపజ్ఞానపూర్వకమైన), అఱివు - జ్ఞానము, ఇలేన్ - కలవాఁడనుకాను ఆగిలుమ్ - అయినను, ఇని - ఇఁకమీఁద, ఉన్నైవిట్టు - నిన్నువిడిచి, ఆత్ఱ - ఆఁతియుండుటకు, కిత్కిన్ఱిలేన్ - సమర్థుఁడనుకాను, అరవు - ఆదిశేషుని, అణై - పడకగాగల, అమ్మానే - ఓస్వామీ! శేఱు - బురదప్రదేశమందు మొలిచిన, తామరై - పద్మములు, శెన్నెలూడు - శెన్నెలనెడిఎఱ్ఱధాన్యముతోఁగూడ, మలర్ - వికసించియున్న, శిరీవరమఙ్గలనగర్ - శిరీవరమంగలనగరమనెడి వానమామలలో, వీత్ఱిరున్ద - నీమహిమప్రకాశించునట్లు వేంచేసియున్న, ఎన్దాయ్ - ఓస్వామీ! అఙ్గు - ఆదివ్యదేశములో వేంచేసియున్న, ఉనక్కు - నీకు, మిగై యల్లేన్ - (నీరక్ష్యవర్గములో) వెలిపడినవాఁడనుకాను.

తా॥ అనంతశాయివైన ఓ శ్రియఃపతీ! నేను కర్మయోగము నెఱుఁగను, జ్ఞానమును నెఱుఁగను. క్షణమాత్రముగూడ నిన్ను వదలియుండలేక నీయందుమిక్కిలి భక్తిగలవాఁడనైయున్నాను. ఆభక్తిగూడ నాకు స్వరూపానురూపమైనదేగాని సాధనముకాదు. ఆశ్రితులను రక్షించుటకై పరమపదమునుండి వానమామలలో వేంచేసియున్న నీకు ఆశ్రితకోటిలో చేరిన నన్ను రక్షించుట తప్పదని. ౧.

అజ్గుత్ తేనల్లేనిజ్గుత్ తేనల్లే నున్నైక్కాణుమవావిల్ వీళ్న్దునాన్*
ఎజ్గుత్ తేనుమల్లే నిలజ్గై శెర్ ఱవమ్మానే*
తిజ్గళ్ శేర్ మణిమాడనీడు శిరీవరమజ్గలనగరుఱై *
శజ్గుశక్కరత్తాయ్ తమియేనుక్కు-రుళాయే. ౨.

అ॥ అజ్గుత్ తేనల్లేన్ - పరమపదములోనున్నవాఁడనుకాను. ఇజ్గుత్ తేనల్లేన్-ఇచ్చట సంసారులతో జేరియున్నవాఁడనుకాను. ఉన్నై - నిన్ను, కాణుమ్ - సేవింపవలయునని, అవావిల్ - ఆశయందు, వీళ్న్దు - పడి, నాన్ - నేను, ఎజ్గుత్ తేనుమల్లేన్ - ఎచ్చటనున్న వారితోనున్నవాఁడనుకాను. ఇలజ్గై - లంకను, శెర్ఱ - నశింపఁజేసిన, అమ్మానే - ఓస్వామీ! తిజ్గళ్ - చంద్రమండలమును, శేర్ - చేరియున్న, మణి - రత్నమయమైన, మాడజ్గళ్ - మేడలచే, నీడు - పెరిగియున్న, శిరీవరమజ్గలనగర్ - వానమామలయందు, ఉఱై - నిత్యవాసము జేయుచున్నవాఁడవును, శజ్గుశక్కరత్తాయ్ - శఙ్ఖచక్రధరుఁడవున్నైన ఓస్వామీ ! తమియేనుక్కు - ఒంటివాఁడనైయున్న నాయందు, అరుళాయ్ - కృపచేయుము.

తా॥ చంద్రమండలమువఱకు పెరిగియున్న మేడలుగల వానమామలలో వేంచేసియున్న ఓశ్రియఃపతీ! నిన్ను నేను సేవింపవలయునని యాశబడి దానిని లభింపక నిత్యసూరులపాటియు సంసారులపాటియు కాకపోతిని. నామనస్సు నెచ్చటయు అమరియుండదు గాన శీఘ్రముగా నన్ననుగ్రహింపుమాయని. ౨

కరుళప్పుట్కొడిశక్కరప్పడై వాననాడవెజ్కార్ ముగిల్ వణ్ణా*
పొరుళల్లాదవెన్నైప్పొరుళాక్కి యడిమైకొణ్డాయ్*
తెరుళ్ కొళ్ నాన్మఱైవల్లవర్ పలర్ వాళ్ శిరీవరమజ్గలనగర్క్కు*
అరుళ్ శెయ్దజ్గిరున్దాయ్ అఱియేనొరుకైమ్మాఱే. 3.

అ॥ కరుళ - (శత్రువులమీద) కోపగించుచున్న, పుళ్ - గరుత్మంతుని, కొడి - ధ్వజముగాను, శక్కరమ్ - సుదర్శనమును, పడై - ఆయుధముగాను, వానమ్ - పరమపదమును, నాడ-వాసస్థానముగానుగలవాఁడవై, ఎన్ - నాకుస్వామియైన, కార్ - వర్షాకాలమందలి, ముగిల్ - మేఘమువంటి, వణ్ణా - (ఔదార్య) స్వభావముగలవాఁడా ! పొరుళల్లా - వస్తువుకాని (జ్ఞానములేని) ఎన్నై - నన్ను, పొరుళాక్కి - వస్తువుగాజేసి, (నాకుజ్ఞానమునుగలుగజేసి) అడిమైకొణ్డాయ్-దాసునిగాజేసికొంటివి; తెరుళ్ కొళ్ - (ప్రాప్య ప్రాపక) జ్ఞానముగలవారును, నాన్మఱై - నాలుగువేదములను, వల్లవర్ - అభ్యసించినవారునైన, పలర్ - అనేకశ్రీవైష్ణవులు, వాళ్ - నిత్యవాసముచేయుచున్న, శిరీవరమజ్గలనగర్క్కు - వానమామలలోనివసించుచున్నవారికి, అరుళ్ శెయ్దు - కృపజేసి, అజ్గు - (నన్ననుగ్రహించుటకై) ఆవానమామలలో, ఇరున్దాయ్ - వేంచేసియున్నస్వామీ ! ఒరుకైమ్మాఱు - (దానికి) ఒక ప్రత్యుపకారము, అఱియేన్ - ఎఱుఁగను.

తా॥ ఓగరుడధ్వజుఁడా ! చక్రాయుధుఁడవై పరమపదమునందు వేంచేసియున్న నీవు, జ్ఞానాధికులైన యనేక శ్రీవైష్ణవులు వేంచేసియున్న వానమామలకువేంచేసి జ్ఞానహీనుఁడనైయున్న నాకు జ్ఞానమునుగలుగజేసి నన్ను కృతార్థునిగాజేసిన నీకు నేనేమి ప్రత్యుపకారము జేయఁగలను.

మాఱుశేర్ పడై నూற்ఱువర్ మజ్గ వోరై వర్‌క్కా-యన్ఱుమాయప్పోర్
పణ్ణి నీఱుశెయ్‌ద వెన్దాయ్ నిలక్కీణ్డవమ్మానే*
తేఱుఞానత్తర్ వేదవేళ్వియఱా చ్చిరీవరమజ్గలనగర్ *
ఏఱివీற்‌ఱిరున్దా యున్నైయెజ్గెయ్‌దక్కూ-వువనే. ౪.

అ॥ మాఱుశేర్ - శత్రువులైవచ్చిన, పడై - ఆయుధములుగల, నూற్ఱువర్ - దుర్యోధనాదులు నూఱుగురును, మజ్గ - నశించునట్లు, ఓర్ - సహాయములేనివారైన, ఐవర్‌క్కు - పఞ్చపాణ్డవులవిషయమై, ఆయ్ - ప్రీతిగలవాఁడవై, అన్ఱు - అప్పుడు, మాయ - కృత్రిమమైన, పోర్ - యుద్ధమును, పణ్ణి - చేసి, నీఱుశెయ్‌ద - భస్మముగాఁజేసిన, ఎన్దాయ్ - ఓస్వామీ! నిలమ్‌కీణ్డ - (పాతాళములోనుండి) భూమినివిడఁదీసిన, అమ్మానే - ఓస్వామీ! తేఱు - నిర్మలమైన, ఞానత్తర్ - జ్ఞానముగలవారియొక్క, వేదమ్ - వేదమునందుఁజెప్పఁబడిన, వేళ్వి - భగవదారాధనము, అఱా - ఎడతెగకనడుచుచున్న, శిరీవరమజ్గలనగర్ - వానమామలను, ఏఱి - ఎక్కి, వీற்ఱిరున్దాయ్-తనమహిమప్రకాశించునట్లు వేంచేసియున్నవాఁడా! ఉన్నై-నిన్ను, ఎజ్గు - ఎచ్చట, ఎయ్‌ద - పొందుటకు, కూవువన్ - పిలిచెదను.

తా॥ దుర్యోధనాదులను జంపి పఞ్చపాండవులను రక్షించినస్వామీ! జ్ఞానాధికులెల్లప్పుడును తిరువారాధనముఁజేయుచున్న వానమామలయందు వేంచేసియున్న నిన్నుఁబొందుటకు నేనేమియుపాయము జేసెదనని. ౪.

ఎయ్‌దక్కూ-వుదలావదే యెనక్కెవ్వతెవ్వత్తుళాయుమాయ్‌నిన్ఱు*
కైదవజ్గళ్ శెయ్యుమ్ కరుమేనియమ్మానే*
శెయ్‌దవేళ్వియర్ వైయత్తేవరఱా చ్చిరీవరమజ్గలనగర్*
కైతొழవిరున్దా యదునానుమ్‌కణ్డేనే. ౫.

అ॥ ఎనక్కు - నాయొక్క, ఎయ్‌ద - పురుషార్థప్రాప్తికి సాధనముగా, కూవుదల్ - (నిన్ను) పిలుచుట (అపేక్షించుట), ఆవదే - స్వరూపానురూపమగునా? ఎవ్వ - ఎంత అసాధ్యు అయిన, తెవ్వత్తుళ్ - శత్రువులయందుగూడ, ఆయుమాయ్‌నిన్ఱు - ప్రవేశించియుండి, కైదవజ్గళ్ - కృత్రిమములను (నాస్తికమతమునుపదేశించుట), శెయ్యుమ్ - చేయుచున్న, కరుమేని - శ్యామమైన తిరుమేనుగల, అమ్మానే - ఓస్వామీ! శెయ్‌ద - చేయఁబడిన, వేళ్వియర్ - భగవదారాధనముగలవారై, వైయమ్ - భూలోకమందున్న, తేవర్ - శ్రీవైష్ణవులు, అఱా - నిరన్తరముగా వాసముఁజేయుచున్న, శిరీవరమజ్గలనగర్-వానమామలయందు వాసముఁజేయుచున్నవారు, కైతొழ-ఆశ్రయించునట్లు, ఇరున్దాయ్ - వేంచేసియుంటివి, అదు - దానిని, నానుమ్ - నేనును, కణ్డేన్ - చూచితిని.

తా॥ ఓస్వామీ! శత్రువులెంతబుద్ధిమంతులైనను వారిగుంపులో ప్రవేశించి తన సుందరవిగ్రహముచే మోహపెట్టి వారిని జైనబౌద్ధాది బాహ్యమతములయందు ప్రవేశింపజేసి, నిన్నాశ్రయించి కృతకృత్యులైయున్న శ్రీవైష్ణవులాశ్రయించునట్లు వానమామలయందు వేంచేసియున్న నిన్ను నేనొకఫలమును గోరుచు పిలుచుట నాకు స్వరూపము కాదని. ౫.

‡‡ ఏనమాయ్‌నిలఙ్గీణ్డవెన్నప్పనేకణ్ణా ఎన్ఱుమెన్నై యాళుడై*
వాననాయగనే మణిమాణిక్కచ్చుడరే*
తేనమామ్పొழిల్ తణ్ శిరీవరమఙ్గలత్తవర్ కై తొழువుఱై*
వానమామలైయే యడియేన్ తొழవన్దరుళే. ౧.

అ॥ ఏనమాయ్ - వరాహమై, నిలమ్ - భూమిని, కీణ్డ-(పాతాళములోనుండి) విడతీసిన, ఎన్నప్పనే - నాస్వామీ! కణ్ణా - శ్రీకృష్ణుఁడా! వానమ్ - పరమపదవాసులకు, నాయగనే - నాథుఁడా! ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, ఎన్నై-నన్ను, ఆళుడై-దానునిగాజేసికొనినవాఁడా! మణి-శ్లాఘ్యమైన, మాణిక్కమ్ - రత్నమువంటి, శుడరే-తేజస్సుగలవాఁడా! తేన-తేనెచేనిండియున్న, మామ్పొழిల్ - మామిడితోటలుగల, తణ్-చల్లనైన, శిరీవరమఙ్గలత్తవర్ - వానమామలయందున్న వారు, కైతొழ - ఆశ్రయించునటుల, ఉఱై - నిత్యవాసముజేయుచున్నవాఁడవై, వానమ్ - పరమపదమందు, మా - గొప్ప, మలైయే - పర్వతమువలెవేంచేసియున్నవాఁడా! అడియేన్ - దాసుఁడనైననేను, తొழ - ఆశ్రయించునటుల, వన్దరుళ్ - వేంచెసికృపజేయుము.

తా॥ వరాహావతారమందు భూమినుద్ధరించి, నిరతిశయభోగ్యమైన వానమామలయందున్న వారందరు నాశ్రయించి యుజ్జీవించునటుల వానమామలయందిప్పుడు వేంచేసియుండి నిత్యసూరులతో పాటినన్ను దానునిగాజేసికొనిన ఓశ్రియఃపతీ! నేను ప్రత్యక్షముగా సేవించునట్లు నాయందనుగ్రహజేసి వేంచేయుమాయని. ౧.

వన్దరుళియెన్నైయిడఙ్గొణ్డ వానవర్‌కొழున్దే*ఉలగుక్కోర్
మున్దైత్తాయ్‌తన్దైయే ముழువేழులగుముణ్డాయ్*
శెన్దొழిలవర్ వేదవేళ్వియఱా చ్చిరీవరమఙ్గలనగర్*
అన్దమిల్ పుగழా యడియేనై యగఱ్ఱలే. ౨.

అ॥ వన్దరుళి - (పరమపదమునుండి) వేంచేసి, ఎన్నైయు - నామనన్నును, ఇడమ్‌కొణ్డ - వాసస్థానముగాజేసికొనినవాఁడవై, వానవర్-నిత్యసూరులకు, కొழున్దు - చిగురువంటివాఁడవై, (నిర్వాహకుఁడవై) ఉలగుక్కు - లోకములకు, ఓర్ - విలక్షణుఁడవై, మున్దై - అనాదియైన, తాయ్‌తన్దైయే - తల్లిగాను తండ్రిగానున్నవాఁడవై, ముழు - సంపూర్ణమైన, ఏழులగుమ్ - సప్తలోకములను, ఉణ్డాయ్ - మ్రింగినవాడవై, శెమ్ - సుందరమైన (అనన్యప్రయోజనమైన), తొழిలవర్ - వృత్తిగల శ్రీవైష్ణవులయొక్క, వేదమ్ - వైదికమైన, వేళ్వి - భగవదారాధనము, అఱా - ఎడతెగకనడుచుచున్న, శిరీవరమఙ్గలనగర్ - వానమామలలో, అన్దమిల్ - అవధిలేని, పుగழాయ్ - కీర్తిగలవాఁడవై వేంచేసియున్నవాఁడా! అడియేనై - దాసుఁడనైననన్ను, అగఱ్ఱలే - విడువకుమా.

తా॥ సమస్తచేతనులకును సకలవిధబంధువై వారియాపత్తును బోగొట్టిరక్షించి, నామనన్ను నందు నిత్యవాసముజేయుచు, అనన్యప్రయోజనులైన శ్రీవైష్ణవులు నిత్యకైంకర్యము జేయునట్లు వానమామలయందు వేంచెసియున్న ఓస్వామీ! నన్నుపేక్షించక యంగీకరింపుమాయని. ౨.

అగల్ ద్దిసీవై త్తమాయవల్లైమ్బుల న్గళామవై నన్గఱిన్దనన్*
అగల్ ద్దియెన్నై యుమ్ నీ యఱుమ్ శేర్ త్తిల్ పీళ్ త్తి క్కన్దాయ్*
పగల్ కదిర్ మణిమాడనీడు శిరీవరమఙ్గైవాణనే*ఎన్ఱుమ్
పుగల్ క్కియవెన్దాయ్ పుళ్ళిన్ వాయ్‌పిళన్దానే. ౮.

అ॥ పగల్ కదిర్ - మిక్కిలి ప్రకాశించుచున్న, మణి - రత్నమయమైన, మాడఙ్గళ్ - మేడలచే, నీడు - పెరిగియున్న, శిరీవరమఙ్గై - వానమామలకు, వాణనే - నిర్వాహకుఁడా! ఎన్ఱుమ్- ఎప్పుడును, పుగఱ్కు - (అభక్తులు) ప్రవేశించుటకు, అరియ - దుర్లభుఁడైన, ఎన్దాయ్ - ఓస్వామీ! పుళ్ళిన్ - బకాసురునియొక్క, వాయ్ - నోటిని, పిళన్దానే - చీల్చినవాఁడా! అగల్ ద్ది - (అభక్తులను) దూరముగావిడుచుటకై, నీ - నీవు, వైత్త - ఏర్పఱచిన, మాయమ్ - ఆశ్చర్యమైన, వల్ - అతిక్రూరమైన, ఐమ్బులన్గళామవై - పఞ్చేన్ద్రియములను, నన్గు - చక్కగా, అఱిన్దనన్ - ఎఱుఁగితిని. ఎన్నైయుమ్ - నన్నును, నీ నీవు, అగల్ ద్ది - నిన్ను చేరనట్లుచేసి, అరు - తప్పించుకొనుట కశక్యమైన, శేర్ త్తిల్ - విషయములనెడి బురదయందు, పీళ్ త్తి క్కన్దాయ్ - పడద్రోసితివి.

తా॥ అభక్తుల కత్యన్తదుర్లభుఁడవై వానమామలయందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నీ ప్రతికూలులు నిన్ను బొందక సంసారమందుమునుగునట్లు పఞ్చేంద్రియములను సృజించితివి. నన్నుగూడ ఈసంసారమందు పడద్రోసెదవోయని భయపడుచున్న నాయొక్క పాపములను బకాసురుని చంపినట్లు నశింపజేయుమాయని ౮.

పుళ్ళిన్ వాయ్‌పిళన్దాయ్‌మరుదిడై పోయినా యెరుదేళ్ ఱడర్ త్త*ఎన్
కళ్ళమాయవనే కరుమాణిక్కచ్చుడరే*
తెళ్ళియార్ తిరునాన్మఱైగళ్ వల్లార్ మలితణ్ శిరీవరమఙ్గై*
ఉళ్ళిరున్దవెన్దా యరుళాయుయ్యుమారెనక్కే. ౯.

అ॥ పుళ్ళిన్ - బకాసురునియొక్క, వాయ్ - నోటిని, పిళన్దాయ్ - చీల్చినవాఁడా! మరుదు - మద్దివృక్షముయొక్క, ఇడై - నడుమన, పోయినాయ్ - పోయినవాఁడా! ఎరుదుఏళ్ - వృషభముల నేడింటిని, అడర్ త్త-సంహరించిన, కళ్ళమ్ - వంచకుఁడవైన, ఎన్ మాయవనే - నాయాశ్చర్యభూతుఁడా! కరు - నీలమైన, మాణిక్కమ్ - రత్నమువంటి, శుడరే - తేజస్సుగలవాఁడా! తెళ్ళియార్ - నిర్మలమైనజ్ఞానముగలవారై, తిరు - (భగవత్స్వరూపమును ప్రతిపాదించుటచే శోభిల్లుచున్న), నాన్మఱైగళ్ - నాలుగువేదములను, వల్లార్ - అభ్యసించిన శ్రీవైష్ణవులు, మలి- సంపూర్ణముగా నివసించుచున్న, తణ్ - చల్లనైన, శిరీవరమఙ్గై - వానమామలయొక్క, ఉళ్ - లోపల, ఇరున్ద - వేంచేసియున్న, ఎన్దాయ్ - ఓస్వామీ! ఎనక్కు - నాకు, ఉయ్యుమాఱు - ఉజ్జీవించువిధమును, అరుళాయ్ - కృపజేయుమా.

తా॥ బకాసురుఁడుమొదలగు సమస్తశత్రువులను నిరసించి వైదికులైన శ్రీవైష్ణవులచే నిండియున్న వానమామలలో నిరవధికతేజోయుతుఁడవై వేంచేసియున్న ఓస్వామీ! నేను జీవించునట్లు నాకుఁ గృపచేయుమాయని. ౯.

అఱియెనక్కునిన్పాదమే శరణాగత్తన్దొழிన్దాయ్ * ఉనక్కోర్ కై
మ్మాఱునానొన్ఱిలేన్ ఎనదావియుమునదే *
శేఱుకొళ్ కరుమ్బుమ్ పెరుఞ్ శెన్నెలుమ్ మలితణ్ శిరీవరమఙ్గై *
నాఱుపూన్దణ్డుழாయ్ ముడియాయ్ తెయ్వనాయగనే. ౧౦.

అ॥ శేఱుకొళ్ - బురదగలప్రదేశమందు, కరుమ్బుమ్ - చెరకును, పెరుఞ్ శెన్నెలుమ్ - గొప్పరొట్టధాన్యమును, మలి - నిండి, తణ్ - చల్లనైన, శిరీవరమఙ్గై - వానమామలలో వేంచేసి యున్న, నాఱు - పరిమళించుచున్న, పూ - సుందరమైన, తణ్ - చల్లనైన, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడియాయ్ - కిరీటమందుగలవాడా! తెయ్వనాయగనే - నిత్యసూరినాథుఁడా! ఎనక్కు - నాకు, అఱి - ఉపాయమునిచ్చునపుడు, నిన్ పాదమే - నీతిరువడికళ్ళనే, శరణాగ - ఉపాయముగా, తన్దొழிన్దాయ్ - ఇచ్చితివి. ఉనక్కు - నీకు, నాన్ - నేను, ఓర్ కైమ్మాఱు - ఒకయుపకారమును, ఒన్ఱు - ఒకవిధముచేతను, ఇలేన్ - చేయుటకుశక్తుండనుకాను, ఎనదు - నాయొక్క, ఆవియుమ్ - ఆత్మయు, ఉనదే - నీదియె.

తా॥ నిరతిశయభోగ్యమైన వానమామలయందు వేంచేసియున్న ఓ తెయ్వనాయక స్వామీ! ఏ విధమైన ఉపాయమునులేని నాకు నీతిరువడికళ్ళనే ఉజ్జీవనోపాయముగా నిచ్చితివి దానికి ప్రత్యుపకారముగా నేనేమియుపకరించెదను? నాయాత్మగూడ నీదేగనుక దానినిగూడ సమర్పించుటకు నాకధికారము లేదని. ౧౦.

‡‡ తెయ్వనాయగన్ నారణన్ తిరివిక్కిరమనడియిణైమిశై *
కొయ్కొళ్ పూమ్పొழிల్ శూழ் కురుగూర్చ్చడగోపన్ *
శెయ్దవాయిరత్తుళ్ళివై తణ్ శిరీవరమఙ్గై మేయపత్తుడన్ *
వైగల్ పాడవల్లార్ వానోర్క్కారావముదే. ౧౧

అ॥ తెయ్వనాయగన్ - నిత్యసూరినిర్వాహకుఁడును, నారణన్ - సకలవిధబంధువు, తిరివిక్కిరమన్ - త్రివిక్రమావతారమెత్తినవాఁడునైన సర్వేశ్వరునియొక్క, అడియిణైమిశై - శ్రీపాదద్వన్ద్వములమీద, కొయ్కొళ్ - కోయఁదగిన, పూ - పుష్పములుగల, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టఁబడిన, కురుగూర్ - తిరునగరియందువేంచేసియున్న, శడగోపన్ - నమ్మాழ்వార్లు, శెయ్ద - పాడించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, తణ్ - చల్లనైన, శిరీవరమఙ్గై - వానమామలను, మేయ - ప్రతిపాదించిన, ఇవైపత్తు - ఈపదిపాశురములను, ఉడన్ - భక్తితోగూడినవారై, పాడవల్లార్ - గానముజేయసమర్థులయినవారు, వానోర్క్కు - నిత్యసూరులకు, వైగల్ - ప్రతిదినమును, ఆరా - తృప్తిపెనయాశలుగలుగజేసెడి, అముదు - అమృతమువలె భోగ్యభూతులై యుందురు.

తా॥ పుష్పతోటలచే నిండియున్న తిరునగరికి స్వామియైన నమ్మాழ்వార్లు వానమామలవిషయమై పాడించిన యీపదిపాశురములను భక్తితో గానముజేసినవారిని నిత్యసూరులు మెచ్చుకొనుదురని.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౮-వ తిరువాయ్మొఴి.

అవతారిక—వానమామలలో తనకోరిక నెరవేరనందున దుఃఖితులైన నమ్మాళ్వార్లు, "నాకు ప్రాప్యమును ప్రాపకమును సర్వేశ్వరుఁడేయనెడి జ్ఞానముసిద్ధించనే" యని యింతమాత్రమునకు సన్తోషించి తిరుక్కుడన్దకువెళ్ళి ఆరావముదాళ్వార్లనుసేవించి అచ్చటగూడ తన మనోరథము పూర్త్తికానందున మిక్కిలి ఖేదించుచున్నారు.

‡‡ ఆరావముదే యడియేనుడలమ్ నిన్బాలన్బాయే*
నీరాయలైన్దు కరైయవురుక్కుగిన్ఱ నెడుమాలే*
శీరార్ శెన్నెల్ కవరివీశుమ్ శెఴునీర్ తిరుక్కుడన్దై*
ఏరార్ కోలమ్ తిగఴక్కిడన్దాయ్ కణ్డేనెమ్మానే. ౧.

అ॥ ఎమ్మానే - ఓస్వామీ! ఆరా - (చాలునని) తృప్తిపొందించని, అముదే - అమృతమువలె భోగ్యభూతుఁడా! అడియేన్ దాసుఁడనైన నాయొక్క, ఉడలమ్ - శరీరము, నిన్బాల్ - నీవిషయమైన, అన్బాయ్ - ప్రీతిస్వరూపమై, నీరాయ్ - (అప్రీతి) నీరై కఁగి, అలైన్దు - ఉన్న చోటులోనుండక తిరిగి, కరైయ - మిక్కిలి శిథిలమగునట్లు, ఉరుక్కుగిన్ఱ - కరిగించుచున్న, నెడుమాలే - సర్వేశ్వరుఁడా! శీర్ - సౌందర్యముచే, ఆర్ - పూర్ణమైన, శెన్నెల్ - శెన్నెల్ధాన్యము, కవరి - చామరమువలె, వీశుమ్ - వీచుచున్న, శెఴునీర్ - సమృద్ధమైనజలముగల, తిరుక్కుడన్దై - తిరుక్కుడందయనెడి దివ్యదేశమందు, ఏరార్ - సౌందర్యముచేపూర్ణమైన, కోలమ్ - అలఙ్కారము, తిగఴ - ప్రకాశించునట్లు, కిడన్దాయ్ - పవ్వళించితివి, కణ్డేన్ - (నేను) సేవించితిని.

తా॥ ఓఆరావముదా! నాతో మాటలాడకుండ తిరుక్కుడందయందు పవ్వళించియున్న నిన్ను సేవించిన నాశరీరము నీయందలిప్రేమచే శిథిలమగునట్లు చేసితివని. ౧.

ఎమ్మానే యెన్ వెళ్ళైమూర్త్తి యెన్నైయాళ్వానే*
ఎమ్మావురువుమ్ వేణ్డుమాఱ్ఱాలావాయెఴిలేఱే*
శెమ్మాకమలమ్ శెఴునీర్ మిశైక్కణ్ మలరుమ్ తిరుక్కుడన్దై*
అమ్మామలర్క్కణ్ వళర్గిన్ఱానే యెన్నాన్ శెయ్గేనే. ౨.

అ॥ ఎమ్మానే - ఓనాస్వామీ! ఎన్ - నావిషయమందు, వెళ్ళైమూర్త్తి - పరిశుద్ధమైనస్వభావముగలవాఁడా! ఎన్నై - నన్ను, ఆళ్వానే - పరిపాలించువాఁడా! మా - శ్లాఘ్యములై, ఎవ్వురువమ్ - (మత్స్యాది) ఏయవతారములనుగూడ, వేణ్డుమాఱ్ఱాల్ - ఇచ్ఛానుసారముగా, ఆవాయ్ - పరిగ్రహించువాఁడా! ఎఴిల్ - గొప్పకాన్తిగలవాడవై, ఏఱే - వృషభమువలెమదించియున్నవాఁడా! శెమ్ - ఎఱ్ఱనై, మా - శ్లాఘ్యమైన, కమలమ్ - పద్మము, శెఴునీర్ మిశైక్కణ్ - సమృద్ధమైనజలముపైన, మలరుమ్ - వికసించుచున్న, తిరుక్కుడన్దై - తిరుక్కుడన్దయందు, మా - విలక్షణమైన, అమ్మలర్ - ఆపద్మమువలెనున్న, కణ్ - నేత్రములను, వళర్గిన్ఱానే - మూసుకొని నిద్రించువాఁడా! నాన్ - నేను, ఎన్ శెయ్గేన్ - ఏమిచేసెదను,

తా॥ నాయజ్ఞానాదులను బోగొట్టి నన్నుసాత్వికునిగాజేసి నాతోసంశ్లేషించుచు నన్నువశపఱచుకొనుటకై మత్స్యాద్యనేకావతారము లెత్తిన ఓస్వామీ! ఇప్పుడు తిరుక్కుడన్దయందు నాతోమాటలాడక నిద్రించుచున్నావు. నిన్ను బొందుటకై నేనేసాధనమును జేసెదనని. ౨.

ఎన్నాన్ శెయ్గేన్ యారేకళై కణ్ ఎన్నై యెన్ శెయ్గిన్ఱాయ్*
ఉన్నాలల్లాల్ యావరాలు మొన్ఱుమ్కుఱై వేణ్డేన్*
కన్నార్ మదిళ్ శూழ్ కుడన్దైక్కిడన్దా యడియేనరువాణాళ్*
శెన్నాళెన్నాళన్నా ళునతాళ్ పిడిత్తే శెలక్కాణే. 3

అ॥ నాన్ - నేను, ఎన్ శెయ్గేన్ - ఏమిచేసెదను? కళైకణ్ - (నాకు) రక్షకులు, యారే - (నీకంటె) ఎవరగుదురు? ఎన్నై - నన్ను, ఎన్ శెయ్గిన్ఱాయ్ - ఏమిచేయుచున్నావు? ఉన్నాలల్లాల్ - నిన్నుతప్ప, యావరాలుమ్-ఎవ్వరిచేతను, ఒన్ఱు - ఒకవిధమైన, కుఱైయుమ్ - కొఱతను, వేణ్డేన్ - (పూర్తిచేసియివ్వమని) యాచించను. కన్ఆర్ - తామ్రముచేపూర్ణమైన (తామ్రమయమైన), మదిళ్ - ప్రాకారములచే, శూழ் - చుట్టబడిన, కుడన్దై - తిరుక్కుడన్దయందు, కిడన్దాయ్ - పవ్వళించినవాడా! అడియేన్ - దాసునియొక్క, అరు - ఆత్మ, వాழ் నాళ్ - ఉజ్జీవించుదినముగా, శెల్ నాళ్ - జరిగెడిదినము, ఎన్నాళ్ - ఎదియో? అన్నాళ్ - అదినమువఱకు, ఉనతాళ్ - నీశ్రీపాదములను, పిడిత్తే - ఆశ్రయించియే, శెల - గడచునటుల, కాణ్ - కటాక్షించుము.

తా॥ తిరుక్కుడన్దయందు బవ్వళించి నాతోమాటలాడకనున్న ఓస్వామీ! నీవుతప్ప నాకొకసాధనములేదు, వేఱురక్షకుడునులేదు; మఱియొకనివద్దవెళ్ళి నాయభీష్టమును యాచించను. ఇట్లున్న నావిషయమై నీవేమితలంచియున్నావో తెలియలేదు. నిన్నుపొందవలయునను నాయభీష్టమును నీవిప్పుడు నెరవేర్పక పోయినను అదివఱకు నీశ్రీపాదములనే నేను భజించియుండునట్లు కటాక్షింపుమాయని. 3.

శెలక్కాణ్గిఱ్పార్ కాణుమళవుమ్ శెల్లుక్కీర్త్తియాయ్*
ఉలప్పిలానే యెల్లావులగుముడైయవొరుమూర్త్తి*
నలత్తాల్ మిక్కార్ కుడన్దైక్కిడన్దా యున్నైక్కాణ్బాన్నాన్
అలప్పాయ్*ఆకాశత్తైనోక్కి యழுవన్తొழுవనే. ౪

అ॥ శెల - పైపైనపోవుటకు (తెలిసికొనుటకు), కాణ్గిఱ్పార్ - తగినజ్ఞానసంపాదనయందు శక్తిగలవారు, కాణుమళవుమ్ - కనిపెట్టినయవధికంటె, శెల్లుమ్ - పైనపోయియున్న, (అధికమైయున్న), కీర్త్తియాయ్ - కీర్తిగలవాడా! ఉలప్పు - (నీగుణాదులకు) నాశము, ఇలానే-లేనివాడా! ఎల్లావులగుమ్ - సమస్తలోకములను, ఉడైయ - తనకుశేషముగాగల, ఒరు - అద్వితీయుడవైన, మూర్త్తి - సర్వేశ్వరుడా! నలత్తాల్ - నీయందుప్రేమచే, మిక్కార్ - అధికమైన శ్రీవైష్ణవులు నివసించుచున్న, కుడన్దై - తిరుక్కుడన్దయందు, కిడన్దాయ్ - పవ్వళించినవాడా! నాన్ - నేను, ఉన్నై - నిన్ను, కాణ్బాన్ - సేవించుటకై, అలప్పాయ్ - మతికలంగినవాడనై, ఆకాశత్తై-ఆకసమును, నోక్కి-చూచి, అழுవన్ - ఏడిచెదను; తొழுవన్ - నమస్కరించెదను.

తా॥ ఎంతగొప్ప జ్ఞానవంతులకు నగోచరంబులైన స్వరూపగుణాదులుగల వాఁడవై, సర్వలోకేశ్వరుఁడవై, భక్తిమంతులైన శ్రీవైష్ణవులు నివసించియున్న తిరుక్కుడన్దయందు బవ్వళించియున్న నిన్ను సేవింపవలయునని మిక్కిలి యాశగలవాఁడనై నీవుపరమపదమునుంచి యిచ్చటికి వేంచేయుమార్గమైన యాకాశమును జూచి నమస్కరించుచున్నానని. ౪.

అழுవన్ తొழுవనాడిక్కాణ్బన్ పాడియలఱ్ఱువన్*
తழுవల్వినై యాల్ పక్కమ్నోక్కి నాణిక్కవిழ்న్దిరుప్పన్*
శెழுవొణ్పழுనఱ్కుడన్దైక్కిడన్దాయ్ శెన్దామరైక్కణ్ణా*
తొழுవనేనై యునతాళ్ శేరుమ్వగైయేశూழ்కణ్డాయ్. ౫.

అ॥ అழுవన్ - ఏడిచెదను, తొழுవన్ - నమస్కరించెదను, ఆడి - నర్తనముజేసి, కాణ్బన్ - చూచెదను, పాడి - గానముజేసి, అలఱ్ఱువన్ - అఱచెదను, తழு - కౌఁగలించుకొనియున్న, వల్ - క్రూరమైన, వినై యాల్ - (నీయందు భక్తియనెడి) పాపముచే, పక్కమ్నోక్కి - (శ్రియఃపతివచ్చుచున్నాఁడోయని) నాలుగు ప్రక్కలఁజూచి, నాణి - (వాఁడురాకపోవుటచే) సిగ్గుపడి, కవిழ்న్దిరుప్పన్ - తలవంచుకొనియుందును, శెழு - సమృద్ధమై, ఒణ్ - సుందరమైన, పழனమ్ - జలప్రదేశముచేనిండియున్న, కుడన్దై - తిరుక్కుడన్దయందు, కిడన్దాయ్ - పవ్వళించినవాఁడా! శెమ్ - ఎఱ్ఱని, తామరై - పద్మమువంటి, కణ్ణా - నేత్రముగలవాడా, తొழுవనేనై - నీచుఁడనైననన్ను, ఉనతాళ్ - నీశ్రీపాదములయందు, శేరుమ్వగై - చేరుప్రకారము, శూழ்కణ్డాయ్ - ఉపాయమును యోచించుము.

తా॥ తిరుక్కుడన్దయందు బవ్వళించిన ఓశ్రియఃపతీ! నిన్ను బొందవలయునని యాశచే దుఃఖపడుచు నమస్కరించి నీగుణములను పాడిపరవశుఁడనై యాడి నాలుగుప్రక్కలఁజూచుచున్న నన్ను నీశ్రీపాదమందు జేరునటుల కటాక్షించుమాయని. ౫.

శూழ்కణ్డాయెన్ఱొల్లైవినైయై యఱుత్తున్నడి శేరుమ
ఊழ்కణ్డిరున్దే*తూరాక్కుழிతూర్త్తెనై నాళగన్ఱిరుప్పన్*
వాழ்తొల్ పుగழ்ழார్ కుడన్దైక్కిడన్దాయ్ వానోర్కోమానే*
యాழிనిశైయే యముదే యఱివిన్పయనేయరియేఱే. ౬.

అ॥ వాழ் - భగవద్గుణానుసంధానముఁజేసి యుజ్జీవించుటచేవచ్చిన, తొల్ - అనాదియైన, పుగழ்ழార్ - కీర్తిగల శ్రీవైష్ణవులు నివసించియున్న, కుడన్దై - తిరుక్కుడన్దయందు, కిడన్దాయ్, పవ్వళించినవాఁడా! వానోర్ - నిత్యసూరులకు, కోమానే - నిర్వాహకుఁడా! యాழிన్ - వీణయొక్క, ఇశైయే - గానమువలెభోగ్యుఁడా! అరియేఱే - పురుషశ్రేష్ఠుఁడా! అఱివిన్పయనే - జ్ఞానముయొక్క ఫలమైనసుఖస్వరూపుఁడా! ఉన్ - నీయొక్క, అడి - తిరువడికళ్ళను, శేరుమ్ - చేరుటకుదగిన, ఊழ் - శేషశేషిభావమనెడిసంబన్ధమును, కణ్డిరున్దే - తెలిసికొనియుండి, తూరా - పూర్తికానటివంటి (ఎంత అనుభవించినను తృప్తిపొందనటివంటి), కుழி - ఇన్ద్రియములను, తూర్త్తు - (విషయానుభవములచే) నిండించి, ఎననాళ్ - ఎన్నిదినములు, అగన్ఱిరుప్పన్ - ఎడబాసియుందును?

ఎన్ - నాయొక్క, తొల్లై - అనాదియైన, వినైయై - పాపములను, అఱుత్తు - ఛేదించి, ఉన్ - నీయొక్క, అడి-తిరువడికళ్ళను, శేరుమ్-చేరునట్లు, కూర్గ్ కణ్ణాయ్-ఉపాయమునాలోచింపుమా.

తా॥ శ్రీవైష్ణవసమృద్ధిగల తిరుక్కుడన్దయందు నిత్యసూరిసేవ్యుఁడవై వేంచేసియున్న ఓ శ్రియఃపతీ ! నేను సంసారులవలెకాకుండ నీకే శేషభూతుఁడనని యెఱిఁగినతరువాత యెంత కాల మీ సంసారమందుండి యిన్ద్రియపరవశుఁడనై నిన్ను వదలియుందును ? శీఘ్రములోనే నా పాపములను దొలఁగించి నీ శ్రీపాదములయందుఁ జేర్చుకొనుమా యని.

అరియేఱే యెన్నమ్బొఱ్చుడరే శెఙ్గట్కరుముగిలే*
ఎరియేపవళక్కున్రే నాల్ త్తోళెన్దాయున్దరుళే*
పిరియావడిమై యెన్నైక్కొణ్డాయ్ కుడన్దైత్తిరుమాలే*
తరియేనినియున్ శరణమ్ తన్దెన్ శన్మఙ్గళైయేనాయే. ౭.

అ॥ అరియేఱే - పురుషశ్రేష్ఠుఁడా! అమ్ - స్పృహణీయమైన, పొన్ - బంగారము వంటి, శుడర్ - కాన్తిగలవాఁడవై, ఎన్ - నాకు సేవసాధించినవాఁడా! శెమ్ - ఎఱ్ఱని, కణ్ - నేత్రముగలవాఁడా ! కరుముగిలే - నీలమేఘమువంటివాఁడా ! ఎరియే - అగ్నితోఁబోలిన, పవళక్కున్రే - పగడకొండవలెనున్నవాఁడా ! నాల్ తోళ్ - నాలుగు భుజములుగల, ఎన్ తాయ్ - నా స్వామీ ! ఉనదు - నీయొక్క, అరుళ్ - కృపచేత, ఎన్నై - నన్ను (నా చేత), పిరియా - ఎడతెగని, అడిమై - కైఙ్కర్యములను, కొణ్డాయ్ - స్వీకరించినవాఁడా ! కుడన్దై - తిరుక్కుడన్దయందు వేంచేసియున్న, తిరుమాలే - ఓ శ్రియఃపతీ ! ఇని - ఇఁకమీద, తరియేన్ - సహింపను, ఉన్ శరణమ్ - నీ తిరువడికళ్ళను, తన్దు - ఇచ్చి, ఎన్ శన్మమ్ - నాజన్మమును, కళైయాయే - సమూలముగా పోఁగొట్టుమా !

తా॥ సుందరుండవై, స్పృహణీయుఁడవై, గంభీరుఁడవై, అప్రకంప్యుఁడవై నన్ననుగ్రహించి దాస్యమిచ్చికొని తిరుక్కుడన్దయందు బ్వేంచియున్న ఓ శ్రియఃపతీ ! ఇఁక నిన్నువదలి నేనొకక్షణము గూడనుండలేను- గాన శీఘ్రములోనే నీ శ్రీపాదములనిచ్చి నా సంసారమును దొలగింపుమాయని. ౮.

⁂ కళైవాయ్ తున్బమ్ కళైయాదొழிవాయ్ కళైకణ్ మఱ్ఱిలేన్*
వళైవాయ్ నేమిప్పడైయాయ్ కుడన్దైక్కిడన్దమామాయా*
తళరావుడలమెనదావి శరిన్దుపోమ్బోదు*
ఇళైయాదునతాళ్ ఒరుఙ్గప్పిడిత్తుప్పోదవిశైనీయే. ౯.

అ॥ వళై - చుట్టునున్న, వాయ్ - ముఖములుగల, నేమి - సుదర్శనమును, పడైయాయ్ - ఆయుధముగాగలవాఁడా! తున్బమ్ - నాదుఃఖమును, కళైవాయ్ - (నీవు) పోఁగొట్టినను సరె, కళైయాదొழிవాయ్ - పోఁగొట్టక పోయినను సరె, మఱ్ఱు - వేఱు, కళైకణ్ - రక్షకుని, ఇలేన్ - కలవాఁడనుకాను. కుడన్దై - తిరుక్కుడన్దయందు, కిడన్ద - పవ్వళించిన, మా - శ్లాఘ్యమైన,

మాయా - సౌందర్యముగలవాఁడా! ఎనదు - నాయొక్క, ఉడలమ్ - శరీరము, తళరా - శిథిలమై, ఆవి - ప్రాణము, శరిన్దుపోమ్పోదు - శిథిలమై పోవునప్పుడు, ఇళై యాదు - దౌర్బల్యమును బొందక, ఉన తాళ్ - నీ శ్రీపాదములనే, ఒరుజ్గ-ఒకవిధముగా (ఉపాయోపేయములుగా), పిడిత్తుప్పోద - ఆశ్రయించునటుల, నీ - నీవు, ఇశై - సంకల్పించుమా.

తా॥ తిరుక్కుడన్దయందు బవ్వళించిన ఓ శ్రియఃపతీ ! ఆశ్రితవిరోధులను నశింపజేయుటకై సర్వతోముఖమైన శ్రీ సుదర్శనమును శ్రీహస్తమునందు ధరించిన నీవు నిన్నుతప్ప వేఱొకవుపాయములేని నాదుఃఖములను పోఁగొట్టినను పోఁగొట్టకపోయినను నీయిష్టమువచ్చినట్లు ఎట్లుచేసినను నా శరీరమును ఇంద్రియములును శిథిలమై ప్రాణముపోవుటకు సిద్ధమైయున్న యీ సమయమందు నిర్మలాంతఃకరణుఁడనై నిన్ను ధ్యానించునట్లు మాత్రమైనను సఙ్కల్పింపుమాయని. ౮.

ఇశై విత్తెన్నై యున్ఱాళిణైక్కీழ్ ఇరుత్తుమమ్మానే*
అశై విలమరర్ తలై వర్ తలై వా ఆదిప్పెరుమూర్ త్తి*
తిశై విల్ వీశుమ్ శెழுమామణిగళ్ శేరుమ్ తిరుక్కుడన్దై*
అశై విలులగమ్పరవక్కిడన్దాయ్ కాణవారాయే. ౯.

అ॥ ఎన్నై - నన్ను, ఇశైవిత్తు - స్వాధీనపఱచుకొని, ఉన్ఱాళిణైక్కీழ் - నీశ్రీపాదద్వన్ద్వములక్రింద, ఇరుత్తుమ్ - స్థాపించియుంచిన, అమ్మానే - ఓ స్వామీ ! అశైవు - నాశము, ఇల్ - ని, అమరర్ - నిత్యసూరులకు, తలైవర్ - ప్రధానులైన అనన్తగరుడవిష్వక్సేనాదులకు, తలైవా - ప్రధానుఁడా! ఆది - సర్వకారణమై, పెరు-సర్వాధికుఁడవైన, మూర్త్తి-సర్వేశ్వరుఁడా! తిశై - దిక్కులయందు, విల్ - తేజస్సు, వీశుమ్ - వీనుచున్న, శెழு - సమృద్ధములై, మా - శ్లాఘ్యములైన, మణిగళ్ - రత్నములు, శేరుమ్-చేరియున్న, తిరుక్కుడన్దై-తిరుక్కుడన్దయందు, ఉలగమ్-లోకములు, అశైవు - శ్రమము, ఇల్ - లేక, పరవ - స్తుతించునట్లు (ఆశ్రయించునట్లు), కిడన్దాయ్ - పవ్వళించినవాఁడా ! కాణ - నేను సేవించునట్లు, వారాయ్ - వేంచేయవలెను.

తా॥ సంసారమందు దాసక్తిగలనాకు వైరాగ్యమును గలిగించి నీయందతిప్రేమను గలుగజేసి కొని దాస్యపఱచుకొనిన ఓ దేవాధిదేవుఁడా ! అనేకవిధంబులైన రత్నములు డాలుకొట్టుచు గుంపులుగుంపులుగా జేరియున్న తిరుక్కుడన్దయందు బవ్వళించిన నీ సౌందర్యమును సేవించి కృతార్థుఁడనై యుగునట్లు నాముందఱ వేంచేసి సేవసాదింపుమాయని. ౯.

వారావరువాయ్ వరుమెన్ మాయా మాయామూర్ త్తియాయ్*
ఆరావముదా యడియేనావియగమే తిత్తిప్పాయ్*
తీరావిన్నైగళ్ తీరవెన్నై యాణ్డాయ్ తిరుక్కుడన్దై
యూరాయ్*ఉనక్కాట్పట్టు మడియేనిన్నముழల్వేనో. ౧౦.

అ॥ వారా - (నాకు సేవసాదించుటకై) వేంచేయని, అరువాయ్ - రూపములేనినూక్ష్మద్రవ్యముయినవాఁడా ! ఎన్ - నామనస్సులో, వరుమ్ - వచ్చిసేవసాదించుచున్న, మాయా- ఆశ్చర్య

భూతుఁడా! మాయా - జన్మమరణములు మొదలగుదోషములులేని, మూర్ త్తియాయ్ - దివ్యమంగళ విగ్రహముగలవాఁడా! ఆరావముదాయ్ - (చాలునని) తృప్తినిబొందించని యమృతమువలెమిక్కిలి భోగ్యభూతుఁడవై, అడియేన్ - నాయొక్క, అవి - ప్రాణము నివసించెడి, అగమే - హృదయమందు, తిత్తిప్పాయ్ - తీయగానున్నవాఁడా! తీరా - నశించని, వినైగళ్ - పాపములు, తీర - నశించునట్లు, ఎన్నై - నన్ను, ఆణ్డాయ్ - పరిపాలించువాఁడా! తిరుక్కుడన్దై - తిరుక్కుడన్దనందు, ఊరాయ్ - వాసస్థానముగాగలవాఁడా! ఉనక్కు - నీకు, ఆళ్ పట్టుమ్ - దాసుండనైగూడ, ఇన్నుమ్ - ఇఁకను, అడియేన్ - దాసుఁడనైననేను, ఉழల్వేనో - తిరుగుదునా? (తిరుగుటయుక్తముకాదు).

తా॥ అప్రాకృతదివ్యమంగళ విగ్రహముతో నాయెదుట వేంచేసి సేవసాదింపక నామన స్సులో నత్యాశ్చర్యకరంబుగా సేవసాయించి నాకు బ్రహ్మానన్దమును గలుగఁజేసి నాపాపములనుబో గొట్టి రక్షించి యిప్పుడు నాతో మాటలాడక తిరుక్కుడన్దయందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నిన్నాశ్రయించి నామనోరథమును లభించకయుండుట యుక్తముకాదని. ౧౦.

౹౹ ఉழలై యెన్బిన్ పేయ్చ్చిములై యూడవళై యుయిరుణ్డాన్*
కழల్గళవై యేశరణాగక్కొణ్డ కురుగూర్చ్చడగోపన్*
కుழలిల్ మలియచ్చొన్న వోరాయిరత్తుళిప్పత్తుమ్*
మழలై తీరవల్లార్ కామర్మానేయ్నోక్కియర్క్కే. ౧౧.

అ॥ ఉழలై - అడ్డుకట్టవలెనున్న, ఎన్బిన్ - ఎముకలుగల, పేయ్చ్చి - పూతనయొక్క, ములైయూడు - స్తనద్వారా, అవళై - అపూతనయొక్క, ఉయిర్ - ప్రాణమును, ఉణ్డాన్ - నశింపఁజేసిన శ్రీకృష్ణునియొక్క, అవై - అట్టిప్రసిద్ధములైన, కழల్గళ్ - తిరువడికళ్ళనే, శరణాగ - ఉపాయముగా, కొణ్డ - నిశ్చయించిన, కురుగూర్చ్చడగోపన్ - తిరునగరికిస్వామియైన నమ్మాழ்వార్లు, కుழలిల్ - వేణుగానముకంటె, మలియ - మిక్కిలిమధురముగా, శొన్న - పాడించిన, ఓరాయిరత్తుళ్ - ఒకవెయ్యిపాశురములలోఁజేరిన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, మழలై - ఔదాసీన్యమును, తీర - విడిచి, వల్లార్ - అనుసంధింపశక్తులైనవారు, మానేయ్ - లేడిలోఁబోలిన, నోక్కియర్క్కు - చూపుగలస్త్రీలకు, కామర్ - మన్మథునివలె శ్రీవైష్ణవులకు మిక్కిలి భోగ్యభూతులై యుందురు.

తా॥ శ్రియఃపతియొక్క శ్రీపాదములనే యుపాయముగానమ్మిన నమ్మాழ்వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నాలస్యమునువదలి యభ్యసింపువారు భగవద్భాగవతులకు భోగ్యభూతులై యుందురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౯ - వ తిరువాయ్మొఴి.

—∘∘—

అవతారిక.- తిరుక్కుడన్దలోఁగూడ తనయభీష్టమునుబొందక దుఃఖించుచున్న నమ్మాళ్వార్లు, తిరువల్లవాఴ్ అనెడి దివ్యదేశమునకు వెళ్ళినయెడల యచ్చట మనయభీష్టము సిద్ధించునని తలంచి యచ్చటికిపోయి చేరుటకుఁగూడ శక్తిలేనివారై యాదివ్యదేశమునకు సమీపమందుండి తనయవస్థను అన్యాపదేశముచే ప్రసాదించుచున్నారు.

‡‡ మానేయ్నోక్కునల్లీర్ వైగలుమ్వినైయేన్మెలియ*
వానార్వణ్కముగుమ్ మదుమల్లిగైకమఴుమ్*
తేనార్శోలైగళ్శూఴ్ తిరువల్లవాఴురైయుమ్
కోనారై*అడియేనడికూడువ దెన్ఱుకొలో*. ౧.

అ॥ మానేయ్ - లేడితోఁబోలిన, నోక్కు - చూపుగల, నల్లీర్ - ఓసుందరులారా! వినైయేన్ - పాపిష్ఠుడైననేను, వైగలుమ్ - ప్రతిదినమును, మెలియ - బాధపడునట్లు, వాన్ - ఆకసమువఱకు (పెరిగి), ఆర్ - పూర్ణమైయున్న, వణ్ - సుందరమైన, కముగుమ్ - పోఁకచెట్లును, మదు - తేనెకారుచున్న, మల్లిగై - మల్లిపుష్పమును, కమఴుమ్ - పరిమళించుచున్నదియు, తేన్ - తేనెచే, ఆర్ - పూర్ణమైన, శోలైగళ్ - తోఁటలచే, శూఴ్ - చుట్టఁబడినదియునైన, తిరువల్లవాఴ్ - తిరువల్లవాఴ్లో, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్న, కోనారై - స్వామియైనశ్రియఃపతియొక్క, అడి - శ్రీపాదములను, అడియేన్ - దాసుఁడనైననేను, కూడువదు - పొందుట, ఎన్ఱుకొలో - ఎప్పుడో?

తా॥ ఓ సఖియలారా! తిరువల్లవాఴునందలి తోఁటలోనున్న పుష్పాదులమీద పడివచ్చుచున్న గాలి పరిమళమును తీసికొనివచ్చి విసురుచున్నది. శ్రియఃపతిని యెడబాసియున్న నాకు ఆపరిమళము మిక్కిలి యసహ్యమైన బాధనుగలుఁగజేయుచున్నదిగాన మనమెప్పుడు తిరువల్లవాఴునందలి శ్రియఃపతియొక్క శ్రీపాదములను సేవించెదము? చెప్పుఁడని. ౧.

ఎన్ఱుకొల్తోఴిమీర్గాళ్ ఎమ్మైనీర్ నలిన్దెన్ శెయ్దీరో*
పొన్తిగఴ్పున్నైమగిఴ్ పుదుమాదవిమీదణవి*
తెన్ఱల్మణఙ్గమఴుమ్ తిరువల్లవాఴ్నగరుళ్
నిన్ఱపిరాన్*అడినీఱడియోఙ్గణ్డుకొండువదే. ౨.

అ॥ తోఴిమీర్గాళ్ - ఓసఖియలారా! నీర్ - మీరు, ఎమ్మై - మమ్ములను, నలిన్దు - బాధించి, ఎన్ శెయ్దీర్ - ఏమిచేయుచున్నారు? పొన్ - బంగారమువలె, తిగఴ్ - ప్రకాశించుచున్న కింజల్కములుగల, పున్నై - పున్నపుష్పము, మగిఴ్ - పొగడపుష్పము, పుదు - అప్పుడు వికసించియున్న, మాదవి - మల్లెపుష్పము, (వీనియొక్క) మీదు - మీద, అణవి - స్పృశించివచ్చుచున్న, తెన్ఱల్ - మలయమారుతము, మణమ్కమఴుమ్ - మిక్కిలి పరిమళించుచున్న, తిరువల్లవాఴ్ - తిరువల్లవాఴనెడి, నగరుళ్ - పట్టణమందు, నిన్ఱ - నెలకొనియున్న, పిరాన్ - సర్వే

శ్వరునియొక్క, అడినీఱు - శ్రీపాదధూళిని, కొణ్డు - తీసికొనివచ్చి, అడియోమ్ - దాసులము, శూడువదు - శిరస్సుమీదధరించుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడు?

తా॥ ఓసఖియలారా! మీరును దుఃఖము శాన్తియగునట్లు నాకు సమాధానముజెప్పక, నీవచ్చటికి వెళ్ళవద్దని నిషేధించి నన్ను బాధపెట్టుట మీకుచితముకాదు. గాన మీరీమాటను వదలి యనేక పుష్పములచే బరిమళించుచున్న తిరువల్లవాఴ్ లో వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదధూళిని దీసికొనివచ్చి నాబాధతొలఁగునట్లు నామీదజల్లుఁడని. ౨.

కూడుమలర్ కుఴలీర్ తుయరాట్టియేనై మెలియ*
పాడునల్వేదవొలి పరవైతిరై పోల్ ముఴఙ్గ*
మాడుయర్న్దోమప్పుకై కమఴుమ్ తణ్ తిరువల్లవాఴ్*
నీడురైగిన్ఱ పిరాన్ కఴల్ కాణ్డుఙ్గొల్ నిచ్చలుమే. 3.

అ॥ కూడు-ధరింపబడిన, మలర్ - పుష్పములచేనలఙ్కరింపబడిన, కుఴలీర్ - కొప్పులుగల ఓసఖియలారా! తుయరాట్టియేనై - పాపిరాలైననన్ను, మెలియ-బాధించుటకై, పాడు - గానము జేయుచున్న, నల్ - వేదములలో శ్రేష్ఠమైన, వేదమ్ - సామవేదముయొక్క, ఒలి-ధ్వని, పరవై-సముద్రముయొక్క, తిరైపోల్ - అలలువలె, ముఴఙ్గ - ఘోషించగా, మాడు-సమీపమందు, ఉయర్న్దు - పైకిలేచి, ఓమప్పుగై - హోమధూమము, కమఴుమ్ - పరిమళించుచున్న, తణ్ - చల్లనైన, తిరువల్లవాఴ్ - తిరువల్లవాఴ్ లో, నీడురైగిన్ఱ - నిరన్తరముగావాసముజేయుచున్న, పిరాన్ - సర్వేశ్వరునియొక్క, కఴల్ - శ్రీపాదములను, నిచ్చలుమ్ కాణ్డుఙ్గొల్ - నిత్యముగా సేవింపవచ్చునా?

తా॥ ఓసఖియలారా! తిరువల్లవాఴ్ లో అగ్నిహోత్రులయొక్క సామవేదధ్వనియు, హవిస్సుయొక్క పరిమళమును శ్రియఃపతినియెడబాసియున్న నన్ను మిక్కిలి బాధించుచున్నవి గాన మనము శీఘ్రముగా వెళ్ళి తిరువల్లవాఴ్ లో వేంచేసియున్న నీడురైగిన్ఱపిరానుయొక్క శ్రీపాదములను నిరంతరముగా సేవించెదమని. 3.

నిచ్చలుమ్ తోఴిమీర్గాళ్ ఎమ్మైనీర్ నలిన్దెన్ శెయ్దీరో*
పచ్చిలై నీళ్ కముగుమ్ పలవుమ్ తెఙ్గుమ్ వాఴైగళుమ్*
మచ్చణిమాడఙ్గళ్ మీదణవుమ్ తణ్ తిరువల్లవాఴ్*
నచ్చరవిన్నణై మేల్ నమ్బిరానదు నన్నలమే. ౪.

అ॥ తోఴిమీర్గాళ్ - ఓసఖియలారా! నీర్-మీరు, ఎమ్మై - మమ్ములను, నిచ్చలుమ్-ఎల్లప్పుడును, నలిన్దు - బాధించి, ఎన్ శెయ్దీర్ - ఏమిచేయుచున్నారు? నల్ - విలక్షణమైన, నలమ్ - (వారియొక్క) ఆత్మ, పశు - పచ్చనివర్ణముగల, ఇలై- ఆకులుగలదియు, నీళ్ - పొడువైనదియునైన, కముగుమ్ - పోకచెట్లును, పలవుమ్ - పనసచెట్లును, తెఙ్గుమ్ - కొబ్బరచెట్లును, వాఴైగళుమ్ - అరటిచెట్లును, మచ్చు - పైమేడలచే, అణి-అలఙ్కరింపబడిన, మాడఙ్గళ్ -గృహములయొక్క, మీదు - పైభాగమందు, అణవుమ్ - కప్పుకొనియున్న, తణ్ - చల్లనైన, తిరువల్ల

వాழ் - తిరువల్లవాழ్ లో, నచ్చు - (శత్రువులమీద) విషమునుగ్రక్కుచున్న, అరవిన్ అణై మేల్ - శేషశయ్యమీఁద పవ్వళించిన, నమ్బి రానదు - స్వామియొక్క స్వాధీనమైయున్నది

తా॥ ఓసఖియలారా! పోఁకచెట్లు, పనసచెట్లు, కొబ్బెరచెట్లు మొదలైనవి పైమేఘములవఱకు పెరిగియుండుటచే నంతటనీడగలిగి చల్లనైయున్న తిరువల్లవాழ்ందలి యన్తర్యామియైన సర్వేశ్వరునికి నాయాత్మ యధీనమైపోయినది. ఇఁక నాకు మీరు చెప్పెడిమాటలు ఫలించవు. ఎందుకు వ్యర్థముగా మాటలాడుచున్నారని. ౪

నన్నలత్తోழிమీర్ గాళ్ నల్ల న్దణర్ వేళ్విప్పుగై *
మైన్నలజ్ఞ్కొణ్డుయర్ విణ్ మఱైక్కుమ్ తణ్ తిరువల్లవాழ் *
కన్నలఙ్కట్టి తన్నై క్కనియై యిన్న ముదన్దన్నై *
ఎన్నలఙ్గొళ్ శుడరై యెన్ఱుకొల్ కణ్గళ్ కాణ్బదువే. ౫

అ॥ నన్నలమ్ - (నాయందు) మంచిస్నేహముగల, తోழிమీర్ గాళ్ - ఓసఖియలారా! నల్ల - అనన్యప్రయోజనులైన, అన్దణర్ - వైదికులయొక్క, వేళ్వి - యాగమునుంచిబయలుదేరిన, పుగై - ధూమము, మై - కాటుకయొక్క, నలఙ్కొణ్డు - వర్ణమైననలుపుగలదై, ఉయర్ - పైకిలేచి, విణ్ - ఆకసమును, మఱైక్కుమ్ - కప్పుచున్న, తణ్ - చల్లనైన, తిరువల్లవాழ் - తిరువల్లవాழ் లో వేంచేసియున్నవాఁడును, కన్నల్ - చెరుకురసముయొక్క, అమ్ - పిప్పిలేని, కట్టి తన్నై - గడ్డవలెనున్నవాఁడును, కనియై - పండువంటివాఁడును, ఇన్ - భోగ్యమైన, అముదన్దన్నై - అమృతమువంటివాఁడును, ఎన్ - నాయొక్క, నలమ్ - సౌన్దర్యాదిగుణములను, కొళ్ - అపహరించిన, శుడరై - తేజోమయవిగ్రహుఁడునైన శ్రియఃపతిని, కణ్గళ్ - (నా) నేత్రములు, కాణ్బదు - మాచుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడో?

తా॥ ఓసఖియలారా! శ్రీవైష్ణవులు భగవత్కైఙ్కర్యార్థమై చేయుచున్న హోమధూమము పైకిలేచి యాకసమంతయువ్యాపించియున్న తిరువల్లవాழ் లో వతిభోగ్యుడై వేంచేసియున్న శ్రియఃపతిని నేనెన్నఁడు సేవించెదనోయని. ౫

కాణ్బదెఞ్ఞాన్ఱుకొలో విన్నై యేఁకనివాయ్ మడవీర్ *
పాణ్కురల్ వణ్డినొడు పశుమ్ తెన్ఱలుమాగి యెఙ్గుమ్ *
శేణ్ శినై యోఙ్గుమరచ్ చెழுఙ్గానల్ తిరువల్లవాழ் *
మాణ్ కుఱళ్ కోలప్పిరాఁ మలర్ త్తామరై ప్పాదఙ్గళే. ౬.

అ॥ కని - దొండపండువలెనున్న, వాయ్ - అధరముగల, మడవీర్ - ఓసఖియలారా! పాణ్ - గానరూపమైయున్న, కురల్ - కంఠధ్వనిగల, వణ్డినొడు - తుమ్మెదలతోఁగూడ, ఎఙ్గుమ్ - అంతట, పశుమ్ తెన్ఱలుమాగి, కొత్తమలయమారుతముగలదై, శేణ్ - పెరిగియున్న, శినై - కొమ్మలుగలవై, ఓఙ్గు - ఉన్నతములైయున్న, మరమ్ - వృక్షములుగల, శెழுమ్ - సుందరమైన, కానల్ - సముద్రతీరమందున్నతోఁపులుగల, తిరువల్లవాழ் - తిరువల్లవాழ் లో వేంచేసియున్న, మాణ్ - బ్రహ్మచారివేషముగల, కుఱళ్ - పొట్టియైు, కోలమ్ - అందమైనతిరుమేనుగల, పిరాఁ -

సర్వేశ్వరునియొక్క, మలర్ - వికసించియున్న, తామరై - పద్మమువంటి, పాదఙ్గళ్ - శ్రీపాదములను, వినైయేన్ - పాపిరైన నేను, కాణ్బదు - సేవించుట, ఎఙ్ఞాన్ఱుకొలో - ఎప్పుడో?

తా॥ ఓసుందరవదనులారా! తుమ్మెదలు శ్రవణానన్దకరంబుగా ఝూంకరించుచు మంద మారుతము మెల్లమెల్లగా వీచుచున్న గొప్పవృక్షములుగల తోపులచేనతిరమణీయంబైన తిరువల్లవాళ్ లో వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క శ్రీపాదముల నేనెప్పుడు సేవించెదనోయని ౬.

పాదఙ్గళ్ మేలణి పూన్దొழுదుమ్ తొழுదుఙ్గొల్ పావైనల్లీర్*
ఓదనెడున్దడత్తు ళుయర్ తామరై శెఙ్గழுనీర్*
మాదర్ గళ్వాణ్ముగముమ్ కణ్ణుమేన్దుమ్ తిరువల్లవాழ்*
నాదనిఞాలముణ్డ నమ్బిరాన్ఱన్నై నాడొఱుమే. ౭

అ॥ పావైనల్లీర్ - నాయందుస్నేహముగలఓసఖియలారా, ఓదమ్ - సముద్రమువలె, నెడు - గొప్పవైన, తడత్తుళ్ - తటాకములయందు, ఉయర్ - వృద్ధిబొందియున్న, తామరై - తామరస పుష్పములును, శెఙ్గழுనీర్ - ఎఱ్ఱకలువలును, మాదర్ గళ్ - స్త్రీలయొక్క, వాళ్ - సుందరంబులైన, ముగమమ్ - ముఖములతోను, కణ్ణుమ్ - నేత్రములతోను, ఏన్దుమ్ - ఒప్పియున్న, తిరువల్లవాழ் - తిరువల్లవాழ் లో వేంచేసియున్న, నాదన్ - స్వామియు, ఇఞాలమ్ - ఈభూమిని, ఉణ్డ - మ్రింగిన, నమ్బిరాన్ఱన్నై - మనకుపకారకుఁడునైనశ్రియఃపతిని, నాడొఱుమ్ - ప్రతిదినమును, పాదఙ్గళ్ మేల్ - తిరువడికళ్ళమీఁద, పూ - పుష్పములను, అణి - సమర్పించి, తొழுదుమ్ తొழுదుఙ్గొల్ - ఆశ్రయింపవచ్చునా?

తా॥ ఆదివ్యదేశమందు నివసించెడి స్త్రీలయొక్క ముఖములవంటి తామరస పుష్పములను, వారి నేత్రములతో సమానంబులైన ఎఱ్ఱకలువలనుగల గొప్ప చెరువులచే నిండియున్న తిరువల్లవాழ் లో వేంచెసియున్న మనస్వామియొక్క శ్రీపాదములమీఁద పుష్పములను సమర్పించి యెప్పుడాశ్రయించెదమోయని. ౭.

నాడొఱుమ్ వీడిన్ఱియే తొழுదుఙ్గొల్ నన్నుదలీర్*
ఆడుఱుతీఙ్కరుమ్బుమ్ విళైశెన్నెలుమాగియెఙ్గుమ్*
మాడుఱుపూన్దడమ్ శేర్ వయల్ శూழ் తణ్ తిరువల్లవాழ்*
నీడుఱైగిన్ఱపిరాన్ నిలన్దావియనీళ్ కழలే.

అ॥ నల్ - సుందరములైన, నుదలీర్ - ముఖముగలఓసఖియలారా! ఎఙ్గుమ్ - అంతట, ఆడు - అలయాడుటకు, ఉఱు - తగునైన, తీ - తీయనైన, కరుమ్బుమ్ - చెరుకును, విళై - పండియున్న, శెన్నెలుమ్ - శెన్నెల్ ధాన్యములను, ఆగి - కలిగినదియు, మాడు - ప్రక్కప్రదేశములయందు, ఉఱు - చేరియున్న, పూ - పుష్పములుగల, తడమ్ - చెరువులతో, శేర్ - చేరియున్న, వయల్ - పొలములచే, శూழ் - చుట్టబడి, తణ్ - చల్లనైనదియునైన, తిరువల్లవాழ் - తిరువల్లవాழ் లో, నీడు ఉఱైగిన్ఱపిరాన్ - నిత్యవాసముచేయుచున్న ఉపకారకుడైన నీడుఱైగిన్ఱపిరాన్ యొక్క, నిలమ్ తావియ - భూమినికొలిచిన, నీళ్ - పొడుగైన, కழల్ - శ్రీపాదమును, నాడొఱుమ్ - ప్రతిదినమును, వీడిన్ఱియే - ఎడతెగక, తొழுదుఙ్గొల్ - ఆశ్రయింపవచ్చునా?

తా॥ చెరకుతోటలతోను శెన్నెల్ ధాన్యములతోను నిండియున్న పొలములు చెరువులు మొదలగు సకల సమృద్ధిగల తిరువల్లవాఴ్ లో వేంచేసియున్న శ్రీమన్నారాయణునియొక్క శ్రీపాదములను మనము ప్రతిదినమాశ్రయించి యుజ్జీవించుటకుఁదగిన కాలమెప్పుడు సంభవించును? ఓసఖియలారా! మీరు దానిని విచారించి చెప్పుఁడని. ౮.

కఴల్వళై పూరిప్పయామ్ కణ్డు కైతొఴుకూడుఙ్గొలో*
కుఴలెన్న యాఴుమెన్న కుయిల్ శోలై యుళ్ తేనరున్ది*
మఴలై వరివణ్డుగళిశై పాడుమ్ తిరువల్లవాఴ్*
శుఴలిన్మలిశక్కరప్పెరుమానదు తొల్లరుళే. ౯

అ॥ కుళిర్ - చల్లనైన, శోలై యుళ్ - తోటలలోనున్న, తేన్ - తేనెను, అరున్ది - పానముచేసి, మఴలై - ముగ్ధస్వభావముగలవై, వరి - సుందరంబులైయున్న, వణ్డుగళ్ - తుమ్మెదలు, కుఴలెన్న - వేణునాదమనునట్లును, యాఴెన్నవుమ్ - వీణాధ్వనియనునట్లును, ఇశై - స్వరములోగూడ, పాడుమ్ - గానముచేయుచున్న, తిరువల్లవాఴ్ - తిరువల్లవాఴ్ లో వేంచేసియున్న, శుఴలిల్ - భ్రమణముచే, మలి - అధికమైన, శక్కరమ్ - సుదర్శనముగల, పెరుమానదు - సర్వేశ్వరుని యొక్క, తొల్ - స్వాభావికమైన, అరుళ్ - కృపచేత, కఴల్ - (మనువు) జారిపోయియున్న, వళై - కంకణములు, పూరిప్ప - (చేతులలో) పూర్ణమగునట్లు, యామ్ - మనము, కణ్డు - సేవించి, కైతొఴ - నమస్కరింప, కూడుఙ్గొల్ - సాధ్యమగునా?

తా॥ మిక్కిలి మధురంబులైన తేనెలను త్రాగి యతిసుందరముగా తుమ్మెదలు గానముచేయుచున్న తోటలచే పూర్ణమైన తిరువల్లవాఴ్ లో వేంచేసియున్న సర్వేశ్వరుడు సన్తోషముచే నాశరీరముబ్బి వానిని సేవాశ్రయించునట్లు ఎప్పుడుకటాక్షించునోయని. ౯

తొల్లరుళ్ నల్వినైయాల్ శొలకూడుఙ్గొల్ తోఴిమీర్గాళ్*
తొల్లరుళ్ మణ్ణుమ్ విణ్ణుమ్ తొఴునిన్ఱ తిరునగరమ్*
నల్లరుళాయిరవర్ నలనేన్దుమ్ తిరువల్లవాఴ్*
నల్లరుళ్ నమ్బిరుమాన్ నారాయణన్ నామఙ్గళే. ౧౦

అ॥ తోఴిమీర్గాళ్ - ఓసఖియలారా! తొల్ - స్వతస్సిద్ధమైన, అరుళ్ - కృపను, మణ్ణుమ్ - భూలోకమందున్నవారును, విణ్ణుమ్ - పరమపదమందున్నవారును, తొఴ - ఆశ్రయించునట్లు, నిన్ఱ - (శ్రియఃపతి) వేంచేసియున్న, తిరు - శ్రీమత్తైన, నగరమ్ - పట్టణమును, నల్ - ఉత్తమమైన, అరుళ్ - కృపగల, ఆయిరవర్ - వెయ్యిశ్రీవైష్ణవులు, నలన్ - భగవద్గుణములను, ఏన్దుమ్ - స్తోత్రముచేయుచున్నదియునైన, తిరువల్లవాఴ్ - తిరువల్లవాఴ్ లో వేంచేసియున్నవాఁడును, నల్ - శ్లాఘ్యమైన, అరుళ్ - దయాగుణముగలవాఁడును, నమ్బిరుమాన్ - ప్రసిద్ధుఁడైనసర్వేశ్వరుఁడునైన, నారాయణన్ - శ్రీమన్నారాయణునియొక్క, నామఙ్గళ్ - తిరునామములను, తొల్ - అనాదియైన, అరుళ్ - భగవదనుగ్రహముచేగలిగిన, నల్వినైయాల్ - మంచి సుకృతముచే, శొలకూడుఙ్గొల్ - చెప్పవచ్చునా?

తా॥ నిత్యసూరులును భూసురులైన శ్రీవైష్ణవులును వచ్చి యాశ్రయించి స్తోత్రము చేయు చున్న తిరువల్లవాழ్ లో వేంచేసియున్న పరమదయాళువైన శ్రీమన్నారాయణునియొక్క తిరునామములను వానికృపచే నేనెప్పుడనుసంధించెదనోయని. ౧౦

⁂ నామఙ్గళాయిరముడైయ నమ్బెరుమానడిమేల్*
శేమఙ్గొళ్ తెన్కురుకూర్ చ్చడగోపన్ తెరిన్దురైత్త*
నామఙ్గళాయిరత్తుళ్ళివై పత్తుమ్ తిరువల్లవాழ்*
శేమఙ్గొళ్ తెన్నగర్ మేల్ శెప్పువార్ శిఱన్దార్ పిఱన్దే. ౧౧.

అ॥ ఆయిరమ్నామఙ్గళ్ ఉడైయ - వెయ్యితిరునామములుగల, నమ్బెరుమాన్ - మన సర్వేశ్వరునియొక్క, అడిమేల్ - శ్రీపాదములమీఁద, శేమమ్కొళ్ - క్షేమకరత్వబుద్ధిని స్వీకరించిన, తెన్కురుకూర్ చ్చడగోపన్ - సుందరంబైన తిరునగరికి స్వామియైన నమ్మాழ்వార్లు, తెరిన్దు - విచారించి, ఉరైత్త - పాడించిన, నామఙ్గళ్ - తిరునామములతో సమానంబులైన (తిరునామములవలె భగవద్గుణ ప్రకాశకంబులైన), ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, తిరువల్లవాழ் - తిరువల్లవాழ் యెడి తిరునామముగలదియు, శేమమ్కొళ్ - ప్రాకారములుగలదియునైన, తెన్ నగర్ మేల్ - సుందరమైన దివ్యదేశవిషయమైన, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, శెప్పువార్ - అనుసంధింపువారు, పిఱన్దు - జన్మించి, శిఱన్దార్ - ఉత్కృష్టులగుదురు.

తా॥ శ్రియఃపతియొక్క శ్రీపాదములనే యుపాయముగానమ్మిన నమ్మాழ்వార్లు తిరువల్లవాழ் యెడి దివ్యదేశవిషయమై ప్రసాదించిన యీపదిపాశురముల ననుసంధించువారు కృతార్థులగుదురని.

ఆ ழ் వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్ ౧౧
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౧౦ - వ, తిరువాయ్మొழி.

---

అవతారిక:—తిరువల్లవాழ் యెడి దివ్యదేశమును జేరి సర్వేశ్వరుని యనుభవించుటకు శక్తిలేనివారైన నమ్మాழ்వార్లు భగవద్గుణానుభవము చేయుటకుఁగూడ శక్తిలేనివారై, గుణానుభవము చేయునట్లు నన్ననుగ్రహింపుమాయని ప్రార్థించుచున్నారు.

⁂ పిఱన్దవాఱుమ్ వళర్న్దవాఱుమ్ పెరియ పారదమ్ కైశెయ్దు* ఐవర్క్కు
త్తిఱఙ్గళ్ కాట్టియిట్టు చ్చెయ్దుపోన మాయఙ్గళుమ్*
నిఱన్దనూడుపుక్కు ఎనదావియై నిన్ఱునిన్ఱురుక్కియుణ్ణిన్ఱ*ఇ
చ్చిఱన్దవాన్ శుడరే యున్నై యెన్ఱుకొల్ శేర్వదువే. ౧.

అ॥ పిఱన్దవాఱుమ్ - అవతరించిన ప్రకారమును, వళర్న్దవాఱుమ్ - పెరిగిన ప్రకారమును, పెరియ - గొప్ప, పారదమ్ - భారతయుద్ధమందు, కైశెయ్దు - (సేనలను) వ్యూహముగా నేర్పఱచి, ఐవర్క్కు - పఞ్చపాణ్డవులకు, తిఱఙ్గళ్ - ఉపాయములను, కాట్టియిట్టు - నేర్పించి,

శెయ్దు - (ఈవిధంబున) ఆచరించి, పోన - (పరమపదమునకు) వేంచేసిన, మాయజ్గళుమ్ - ఆశ్చర్యచేష్టితములును, నిఱన్దు - మగ్నమైన (నాహృదయముయొక్క), ఊడుపుక్కు, లోపల ప్రవేశించి, ఎనదావియై - నాయాత్మను, విన్ఱు విన్ఱు - విడువకుండనుంచి, ఉరుక్కి - కరిగించి, ఉణ్ణిన్ఱ - నశింపఁజేయుచున్నవి. ఇచ్చిఅన్ద - ఇట్టిశ్లాఘ్యమైన, వాళ్ - అపరిచ్ఛిన్నమైన, శుడరే - తేజోమయస్వరూపుఁడా! ఉన్నై - నిన్ను, శేర్వదు - చేరుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడో!

తా॥ ఓ శ్రియఃపతీ! ఈలోకమందు జన్మించుటకుఁ గారణమైన పుణ్యపాపములేమియు లేని నీవు తనసఙ్కల్పముచే నప్రాకృతదివ్యమఙ్గళవిగ్రహముతోఁగూడ ఆశ్రితసంరక్షణార్థమై యవతరించినవిధంబును, తరువాత పూతనా శకటాసురుఁడు మొదలగు లెక్కలేనిశత్రువుల నడుమనుండి యశోదాదులయొక్క పాలునెయ్యి మొదలగు పదార్థముల నారగించి పెరిగినవిధంబును, భారతయుద్ధమందు భీష్మ ద్రోణ కర్ణ దుర్యోధనాదులు నశించుటకుఁ దగిన ఉపాయములను నేర్పించిన విధంబులును, వెనుక శ్రీవైకుణ్ఠమునకు వేంచేసిన విధంబును నాహృదయమం దెల్లప్పుడునుండి నన్ను శిథిలపఱచుచున్నవి, ఈవ్యసనముతీరునట్లు అపరిమిత జ్యోతిస్స్వరూపుండవైననిన్ను నేనే కాలమందు పొంది సుఖపడుదునోయని ౧

వదువై వార్త్తైయుళేఱుపాయ్న్దదుమ్ మాయమావినైవాయ్పిళన్దదుమ్*
మదువైవార్కుழలార్ కురవై పిణైన్దకుழగుమ్*అదువిదు
ఉదువెన్నలావనవల్ల వున్నుయ్ర్ శెయ్గై నైవిక్కుమ్*
ముదువై యముదల్వా వున్నై యెన్ఱుతలై ప్పెయ్వనే. ౨.

అ॥ వదువై - వివాహముయొక్క, వార్త్తైయుళ్ - ప్రసఙ్గమందు, ఏఱు - వృషభములను, పాయ్న్దదుమ్ - మీదపడి చంపినదియు, మాయమ్ - కృత్రిముండైన, మావినై - కేశియనెడి గుఱ్ఱముయొక్క, వాయ్ - నోటిని, పిళన్దదుమ్ - చీల్చినదియు, మదువై - తేనెను, వార్ - ప్రవహింపఁజేయుచున్న, కుழలార్ - కొప్పులుగల గోపికలయొక్క, కురవై - రాసక్రీడలో, పిణైన్ద - చేతులనుజేర్చుకొనిన, కుழగుమ్ - సామర్థ్యమును, (వీనిలో), అదు - అది, ఇదు - ఇది, ఉదు - మధ్యస్థమైనది, ఎన్నలావన - అనుచెప్పదగినవి, అల్ల - లేకుండునటుల, ఉన్ శెయ్గై - నీచేష్టితములన్నియు, ఎన్నై - నన్ను, నైవిక్కుమ్ - బాధించును. వైయమ్ - జగత్తుకు, ముదుముదల్వా - ప్రథమకారణభూతుఁడా! ఉన్నై - నిన్ను, ఎన్ఱు - ఎప్పుడు, తలైప్పెయ్వన్ - పొందెదను.

తా॥ నప్పిన్నపిరాట్టియొక్క వివాహముకొఱకై వృషభములనుజంపినదియు, గుఱ్ఱమైనన్ను మ్రింగవచ్చిన కేశిని సంహరించినదియు, గోపికలతో రాసక్రీడ చేసినదియు, ఇవిమొదలగు నీచేష్టితములన్ని నామనస్సునుగరగించుచున్నవిగాన అక్లేశముతీరునట్లు నిన్నెప్పుడు పొందెదనోయని ౨.

పెయ్యుమ్పూఙ్గుழల్ పేయ్ములైయుణ్డ పిళ్ళైత్తేఱ్ఱముమ్*పేర్న్దోర్ శాడిఱ
చ్చెయ్యపాదమొన్ఱాల్ శెయ్ద నిన్ శిఱుచ్చేవగముమ్*
నెయ్యుణ్ వార్త్తైయుళ్ అన్నై కోల్ కొళ్ళ నీయున్ తామరైక్కణ్గళ్ నీర్మల్గ*
పైయవే నిలైయుమ్ వన్దెన్నెఞ్జై యురుక్కుఙ్గళే. 3

అ॥ పెయ్యుమ్ - ఉంచబడిన, పూ - పుష్పములచేనలంకరింపబడిన, కుழల్ - కొప్పు గల, పేయ్ - పిశాచిరైన పూతనయొక్క, ములై - స్తన్యమును, ఉణ్డ - ఆరగించిన, పిళ్ళై - చిన్నతనమందుగలిగిన, తేర్ట్రముమ్ - తెలివియు, ఓర్ - ఒక, శాడు - శకటాసురుని, పేర్న్దు - ఎగిరిపడి, ఇఱ - చచ్చునట్లు, శెయ్య - ఎఱ్ఱనైన, పాదమొన్ఱాల్ - ఒకశ్రీపాదముచేతనే, శెయ్ద - చేసిన, నిన్ - నీయొక్క, శిఱుచ్చేవగముమ్ - చిన్నతనమందుగలిగిన శౌర్యమును, నెయ్ - నేతిని, ఉణ్ - (దొంగలించి) ఆరగించినాడని (గోపికలుచెప్పిన), వాన్త్తైయుళ్ - మాటవచ్చినప్పుడు, అన్నై - నీతల్లియైన యశోదాదేవి, కోల్కొళ్ళ - (నిన్నుకొట్టుటకు) కఱ్ఱ సెత్తగా, నీ - నీవు, ఉన్ - నీయొక్క, తామరైక్కణ్గళ్ - పద్మనేత్రములలో, నీర్మల్గ - నీళ్ళు కారునట్లు, పైయ - భయపడినిలిచిన, నిలైయుమ్ - ఉనికియు, వన్దు - వచ్చి, ఎన్ నెఞ్జై - నామనస్సును, ఉరుక్కుజ్గళ్ - కరిగించుచున్నవి.

తా॥ నీవు పూతనా శకటాసురాది శత్రువులను చిన్నతనమందు చంపిన సామర్థ్యమును, కృష్ణుఁడువచ్చి నాయింటిలో వెన్నదొంగలించినాడని గోపికలు చెప్పగా నప్పుడు నీయందు ప్రీతిచే యశోదాదేవి యొక చిన్నకఱ్ఱను తీసికొని కొట్టవచ్చినప్పుడు దానికి భయపడి యేడుచుచు వోక మూలలోదాచుకొనియున్న యునికియు నామనస్సును గరిగించుచున్నవియని. ౩.

కళ్ళవేడత్తైక్కొణ్డుపోయ్ ప్పురమ్పుక్కవాఱుమ్*కలన్దశురర్గై
ఉళ్ళమ్ పేదమ్ శెయ్దిట్టుయిరుణ్డవుపాయజ్గళుమ్*
వెళ్ళనీర్చ్చడైయానుమ్ నిన్నిడై వేఱలామైవిళజ్గనిన్ఱదుమ్*
ఉళ్ళముళ్ కుడైన్దెన్నుయిరై యురుక్కియుణ్ణుమే. ౪.

అ॥ కళ్ళవేడత్తై - కపటవేషమును, కొణ్డుపోయ్ - తీసికొనిపోయి, పురమ్ - త్రిపురములను, పుక్కవాఱుమ్ - ప్రవేశించిన విధమును, కలన్దు - (వారితో) కలిసియుండి, అశురర్గై - అసురులయొక్క, ఉళ్ళమ్ - మనస్సులో, పేదమ్శెయ్దిట్టు - భేదమునుగలుగజేసి (వైదికశ్రద్ధను బోగొట్టి), ఉయిరుణ్డ - (వారి) ప్రాణములను దీసిన, ఉపాయజ్గళ్ - ఉపాయములును, నీర్ - గఙ్గాజలముయొక్క, వెళ్ళమ్ - ప్రవాహముగల, శడైయానుమ్ - జటనుధరించిన రుద్రుఁడును, నిన్నిడై - నీయందు, వేఱలామై - వేఱుకాకుండ నీకు శరీరముగానుండి, విళజ్గనిన్ఱదుమ్ - ప్రకాశించుచున్నదియు, ఉళ్ళమ్ - హృదయముయొక్క, ఉళ్ - లోపల, కుడైన్దు - ప్రవేశించి, ఎన్నుయిరై - నాయాత్మను, ఉరుక్కి, కరిగించి, ఉణ్ణుమ్ - నశింపజేయును.

తా॥ త్రిపురములయందున్న బ్రాహ్మణులు వేదోక్తకర్మముల ననుష్ఠించుచు సత్పురుషులను మిక్కిలి బాధించుచుండగా వారిని జంపినయెడల బ్రహ్మహత్యవచ్చునని యోచించి, వేదమార్గప్రవర్తకుఁడవైన నీవు వేదవిరుద్ధమైన బుద్ధవేషమువేసికొని యాపట్టణములకువెళ్ళి వంచనచే వారిని మోహపఱచి నాస్తికమతములనుపదేశించి వైదికశ్రద్ధను బోగొట్టి తరువాత వారిని జంపిన నీచేష్టితమునున్ను, గఙ్గాధరుడైన రుద్రునికంతర్యామియైయుండి వానిని రక్షించుచున్న విధమునున్ను తలంచినప్పుడు నాయాత్మకరిగిపోవుచున్నదని. ౪.

ఉణ్ణవానవర్కోను క్కాయరొరుప్పడుత్త వడిశిలుణ్ణదుమ్*
వణ్ణమాల్ వరైయెయెడుత్తు మళైకాత్తదుమ్*
మణ్ణై మున్పడైత్తుణ్ణుమిళ్న్దు కడన్దిడన్దు మణన్దమాయఙ్గళ్*
ఎణ్ణున్దోఱుమెన్నెఞ్జెరివాయ్మెళుగొక్కుమ్నిన్నే. ౫.

అ॥ వానవర్కోనుక్కు - దేవేంద్రునికి, ఉణ్ణ - భుజించుటకై, ఆయర్ - గోపలు, ఒరుప్పడుత్త - కుంమరించిన, అడిశిల్ - ప్రసాదమును, ఉణ్డదుమ్ - ఆరగించినదియు, వణ్ణమ్ - నానావర్ణము గల, మాల్ - గొప్ప, వరైయై - గోవర్ధనగిరిని, ఎడుత్తు - ఎత్తి, మళై - వర్షమును, కాత్తదుమ్ - అడ్డగించినదియు, మున్ - మునుపు, మణ్ణై - భూమిని, పడైత్తు - సృష్టించిన, ఉణ్డు - (ప్రళయకాలమందు) మ్రింగి, ఉమిళ్న్దు - బయలుపఱచి, కడన్దు - కొలిచి, ఇడన్దు - విడతీసి, మణన్ద - (భూమిదేవితో) సంశ్లేషించిన, మాయఙ్గళుమ్ - ఆశ్చర్యచేష్టితములున్ను, (ఇవన్నియు) నిన్ఱు - ఉండి, ఎణ్ణున్దోఱుమ్ - తలంచినప్పుడంత, ఎన్నెఞ్జు - నామనస్సు, ఎరివాయ్ - నిప్పులోపడిన, మెళుగు - మైనముతో, ఒక్కుమ్ - సమానమగును.

తా॥ ప్రతిమాసములలోను వర్షమునుగురుపింపవలయునని ప్రార్థించి దేవేంద్రునికి పూజను జేయుచున్న గోపలనుగురించి, మీరు ఈపనిని మీయావులకు గడ్డినిన్ని నీళ్ళనున్నిచ్చుచున్న యీగో వర్ధనపర్వతమునకు ఉంచుడియని యుపదేశించి బలిపెట్టించి ఆపర్వతములోనుండి తానుభక్షింప, దానిని దేవేన్ద్రుడువిని తనకుబలియివ్వనందున కోపగించి యఖండవర్షమునుగురిపింపగా నప్పుడు గోవర్ధనగిరినెత్తి గోగోపలనురక్షించిన దివ్యచేష్టితమునున్ను భూమినిరక్షించినవిధమునున్ను దలంచి నామనస్సు కరుగుచున్నదని. ౫.

నిన్ఱవాఱుమిరున్దవాఱుమ్ కిడన్దవాఱుమ్నినైప్పరియన*
ఒన్ఱలావురువా యరువాయ నిన్మాయఙ్గళ్*
నిన్ఱునిన్ఱునినైక్కిన్ఱేనున్నై యెఙ్ఙనమ్నినైక్కిఱ్పన్*పావియేన్
ఉన్ఱునున్నన్గురైయాయ్ యులగముణ్డవొణ్శుడరే. ౬.

అ॥ నిన్ఱవాఱుమ్ - నిలిచినవిధమును, ఇరున్దవాఱుమ్ - కూర్చున్నవిధమును, కిడన్దవాఱుమ్ - పవ్వళించినవిధమును, నినైప్పరియన - తలంచుటకశక్యంబులైయున్నవి ఒన్ఱలా - ఒకటి కాని (అనేకములైన), ఉరువాయ్ - ప్రకారములుగలవియు, అరువాయ - నేత్రములకగోచరంబులునైన, నిన్మాయఙ్గళ్ - నీయాశ్చర్యచేష్టితములను, నిన్ఱునిన్ఱు - కష్టపడి, నినైక్కిన్ఱేన్ - ధ్యానించుచున్నాను ; ఉన్నై - నిన్ను, ఎఙ్ఙనమ్ - ఏవిధంబున, నినైక్కిఱ్పన్ - ధ్యానించెదను ? ఉలగమ్ - లోకములను, ఉణ్డ - ఆరగించిన, ఒణ్శుడరే - అత్యుజ్జ్వలుఁడా ! పావియేఱ్కు - పాపిష్ఠుడైననాకు, ఒరునన్గు - ఒకమంచియుపాయమును, ఉరైయాయ్ - చెప్పుమా.

తా॥ యశోదాదేవి గృహమందున్నపుడు పవ్వళించియుండి, ఆమె వీథిలోవెళ్ళినప్పుడు లేచితిరిగియు, ఆమెవచ్చుచున్న చప్పుడువినఁబడునప్పుడు కూర్చుండియు, దగ్గఱవచ్చినప్పుడు పవ్వళించియు నీవు చేసినయీవ్యాపారములు నాకుదలంచుటకుమిక్కిలి యాశ్చర్యకరంబులై యున్నవి. ౬.

నాబుద్ధికగోచరంబులై యనన్తములైన నీయాశ్చర్యచేష్టితములను నేను తెలిసికొనునట్లు ఒకఉపాయమును నాకు నేర్పించుమాయని ౬.

ఒణ్ శుడరోడిరుళుమాయ్ నిన్ఱవాఱుముణ్మైయోడిన్మైయాయ్వన్దు*ఎన్
కణ్ణాళావగై నీ కరన్దెన్నై చ్చెయ్గిన్ఱన*
ఎణ్ణాల్ శిన్దైయుళ్ నైగిన్ఱేన్ కరియమాణిక్కమే* ఎన్కణ్గట్కు-
త్తిణ్ణాళ్ళవారునా శరుళాయున్ తిరువురువే. ౭.

అ॥ ఉణ్మైయోడు - (ఆశ్రితులకు) యథార్థమైనవాఁడవై, ఒణ్ శుడరోడు - సుందరమైన కాన్తితో (ప్రకాశించి,) నిన్ఱవాఱుమ్ - ఉన్న విధమును, ఇన్మైయాయ్ - (అనాశ్రితులకు) లేనివాఁడవై, ఇరుళుమాయ్ - చీకటివలె అప్రకాశకుఁడవై, నిన్ఱవాఱుమ్ - ఉన్నవిధమును, వన్దు-(నాహృదయమందు) వచ్చి, ఎన్ - నాయొక్క, కణ్ - నేత్రములకు, కొళావగై - తెలియకుండునట్లు, కరన్దు - మఱిగియుండి, నీ - నీవు, ఎన్నై - నన్ను, శెయ్గిన్ఱన - చేయుచున్న వ్యాపారములను, ఎణ్ కొళ్ - ధ్యానించుచున్న, శిన్దైయుళ్ - మనస్సులో, నైగిన్ఱేన్ - శిథిలుఁడనై యగుచున్నాను. ఎన్ - నాయొక్క, కరియమాణిక్కమే - నీలరత్నమువంటి కాన్తిగలవాఁడా! ఎన్కణ్గట్కు - నా నేత్రములకు, ఉన్ తిరువురువు - నీతిరుమేను, తిణ్ కొళ్ళ - చక్కగా గనుపడునట్లు, ఒరునాళ్ - ఒకదినము, అరుళాయ్ - కృపఁజేయుమా

తా॥ ఓ శ్రియఃపతీ! నీవుభక్తులకతినులభుఁడవై సేవసాదించియు, అభక్తులునీవొకఁడులేఁడని చెప్పునట్లు వారికెల్లప్పుడును కనుపడకయున్నన్న విధమును, నాకంటికగుపడక నామనస్సులోనుండి నన్నెల్లప్పుడును బాధించువిధమును దలఁచి శిథిలాంతఃకరణుఁడనైయగుచున్నాను గాన నీతిరుమేనును నేను సేవించునట్లు నన్ననుగ్రహింపుమాయని. ౭.

తిరువురువుకిడన్దవాఱుమ్కొప్పూళ్ చ్చెన్దామరై మేల్*తిశైముగన్
కరువుళ్ వీఱ్ఱిరున్దు పడైత్తిట్టకరుమఙ్గళుమ్*
పొరువిలున్ తనినాయగమవై కేట్కున్దోఱుమెన్నెఞ్జమ్ నిన్ఱునెక్కు*
అరువిశోరుఙ్కణ్ణీరెన్ శెయ్గేనడియేనే. ౮.

అ॥ తిరు - అందమైన, ఉరువు - తిరుమేనుతోఁగూడ, కిడన్దవాఱుమ్ - (సముద్రమందు) పవ్వళించినవిధమును, కొప్పూళ్ - నాభియందున్న, శెమ్ తామరై మేల్ - ఎఱ్ఱతామరపుష్పము మీదనున్న, తిశైముగన్ - బ్రహ్మయొనడి, కరువుళ్ - స్థానమందు, వీఱ్ఱిరున్దు - పేంచేసియుండి, పడైత్తిట్ట - సృజించిన, కరుమఙ్గళుమ్ - వ్యాపారములను, పొరువిల్ - ఒప్పులేని, ఉన్ - నీయొక్క, తనినాయగమ్ - ఏకాధిపత్యమునుదెలిపెడి, అవై - ఆవ్యాపారములను, కేట్కున్దోఱుమ్ - వినునప్పుడెల్ల, ఎన్నెఞ్జమ్ - నామనస్సు, నిన్ఱు - ఉండి, నెక్కు - శిధిలమై, కణ్ణీర్ - కణ్ణీళ్ళు, అరువి - ప్రవాహమువలె, శోరుమ్ - కారుచున్నవి, అడియేన్ - దాసుండనైననేను, ఎన్ శెయ్గేన్ - ఏమిచేసెదను?

తా॥ ఓ శ్రియఃపతీ! నీవు ప్రళయకాలమందు మహాసముద్రమందు బవ్వళించియు, బ్రహ్మ కర్త్రర్యామిత్రైయుండియీజగత్తును సృజించియు చేసిన వ్యాపారములను విని నామనస్సు కరుగుచున్నదని. ౮.

అడిమైమూన్ఱైయిరన్దవాఱు మజ్గేనిన్ఱాళ్ కడలుమ్మణ్ణుమ్విణ్ణుమ్
ముడియ*ఈరడియాల్ ముడిత్తుక్కొణ్డముక్కియముమ్*
నొడియుమూఱవై కేట్కున్దోఱుమెన్నెఞ్జమ్ నిన్దనక్కేకరైన్దుగుమ్*
కొడియవల్వినైయేనునైన్ఱెన్ఱుకొల్ కూడువదే. ౯.

అ॥ మూన్ఱుఅడిగై - మూడడుగులను, ఇరన్దవాఱుమ్ - యాచించినవిధమును, అజ్గు నిన్ఱు - అచ్చటనుండి, ఆళ్ కడలుమ్ - అగాధమైనసముద్రమును, మణ్ణుమ్ - భూమియు, విణ్ణుమ్- ఆకాశమును, ఈరడియాల్ - రెండడుగులచే, ముడియ - అణుగునట్లు, ముడిత్తుక్కొణ్డ - నెరవేర్చుకొనిన, ముక్కియముమ్ - మహిమయు, అవై - ఆవ్యాపారములను, నొడియుమూఱు- చెప్పువిధమును, కేట్కున్దోఱుమ్ - వినునప్పుడెల్ల, ఎన్నెఞ్జమ్ - నామనస్సు, నిన్దనక్కే - నీవిషయమందే, కరైన్దు - కరగి, ఉగుమ్ - శిథిలముగుచున్నది. వల్ కొడియ - మిక్కిలిక్రూరమైన, వినైయేన్ - పాపముగలనేను, ఉనైన్ఱై - నిన్ను, కూడువదు - పొందుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడో?

తా॥ నీవుమహాబలివద్ద మూడడుగులుయాచించి రెండడుగులచే సకలజగత్తును కొలిచిన మహిమనువినునప్పుడు నామనస్సుకరుగుచున్నది. ఇట్టిమహిమగలనిన్ను నేనెప్పుడుపొందెదనోయని.

కూడినీరైక్కడైన్దవాఱు మముదమ్ తేవరుణ్ణ*అశురరై
వీడుమ్వణ్ణజ్గళే శెయ్దుపోనవిత్తగముమ్*
ఊడుపుక్కెనదావియైయురుక్కియుణ్డిడుగిన్ఱ*నిన్దన్నై
నాడుమ్వణ్ణమ్శొల్లాయ్ నచ్చునాగణైయానే. ౧౦.

అ॥ కూడి - దేవాసురులతోఁజేరియుండి, నీరై - సముద్రమును, కడైన్దవాఱుమ్ - చిలికినవిధమును, తేవర్ - దేవతలు, అముదమ్ - అమృతమును, ఉణ్ణ - భుజించునట్లు, అశురరై - అసురులను, వీడుమ్ - విడిపించిన, వణ్ణజ్గళ్ - ప్రకారములను, శెయ్దుపోన-చేసిన, విత్తగముమ్- ఆశ్చర్యవ్యాపారములును, ఊడుపుక్కు - లోపలప్రవేశించి, ఎనదావియై - నాయాత్మను, ఉరుక్కి - కరిగించి, ఉణ్డిడుగిన్ఱ - చంపుచున్నవి. నచ్చు - (విరోధులమీద) విషముగ్రక్కుచున్న, నాగు - ఆదిశేషుని, అణైయానే - పడకగాగలవాఁడా! నిన్దన్నై - నిన్ను, నాడుమ్- వణ్ణమ్ - పొందువిధమును, శొల్లాయ్ - (నాకు) చెప్పుమా.

తా॥ క్షీరాబ్ధినిజిలికి యమృతమునెత్తి దేవతులకు భుజింపఁజేయునప్పుడు, అసురులు మా భాగమైనయమృతమును మాకిప్పుమనియడగగా నప్పుడు మోహనావతారమెత్తి యసురులను మోహింపఁజేసిన దివ్యచేష్టితములనుదలంచి కరుగుచున్న నేను నిన్ను బొందునట్లు ఉపాయము చెప్పుమాయని. ౧౦.

⁂ నాగణైమిశై నమ్బిరాన్ శరణేశరణ్ నమక్కెన్ఱు* నాడొఱుమ్
ఏగశిన్దైయనాయ్ క్కురుగూర్ చ్చడగోపన్ మాఱన్*
ఆగనూల్ శెయ్ద వన్దాది యాయిరత్తుళ్ళివైయుమోర్ పత్తుమ్వల్లార్*
మాగవైగున్దత్తు మగిழ்వెయ్దువర్ వైగలుమే. ౧౧.

అ॥ నాగణైమిశై - శేషశయ్యమీదపవ్వళించియున్న, నమ్బిరాన్ - మనస్వామియొక్క, శరణే - శ్రీపాదంబే, నమక్కు - మనకు, శరణ్ ఎన్ఱు - ఉపాయమని, నాడొఱుమ్ - ప్రతిదినమును, ఏగశిన్దైయనాయ్ - ఒకవిధంబైనధ్యానముగలవారై, కురుగూర్ - తిరునగరికిస్వామియైన, మాఱన్ - మాఱనెనెడివంశనామముగల, శడగోపన్ - నమ్మాళ్వార్లు, ఆగ - తాముజీవించునట్లు, నూల్ శెయ్ద - ప్రసాదించిన, అన్దాది - అందాదియైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోజేరిన, ఓర్ - అద్వితీయములైన, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ - అధ్యయనముఁజేయువారు, మాగమ్ - పరమాకాశంబనెడి, వైగున్దత్తు - శ్రీవైకుంఠమందు, వైగలుమ్ - ఎల్లప్పుడును, మగిழ் వెయ్దువర్ - ఆనన్దమునుపొందుదురు.

తా॥ అనన్తశాయియైన శ్రియఃపతియొక్క శ్రీపాదంబులే మనకు సకలవిధోపాయంబులని నమ్మిననమ్మాళ్వార్లుసాదించిన నీపదిపాశురంబుల నభ్యసించువారు శ్రీవైకుంఠమును బొంది నిత్యానన్దభరితులైయుందురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౫ - పది సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్మొழிలు యేబదియింటికి పాశురములు, ౫౫౨.



## ౬-పత్తు, ౧-వ తిరువాయ్మొழி



అవతారిక:—ఆళ్వార్లిట్లనేక విధంబున ప్రార్థించియు తనయభీష్టమునొందక దీనికేమి కారణమని యాలోచించి, సర్వేశ్వరుఁడు తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్నాడనియు అచ్చట నున్న భోగ్యతావిశేషమందు మగ్నుఁడై తనను మఱచినాఁడనియు నిశ్చయించి మిక్కిలి విరహబాధననుభవించుచు సముద్రతీరమందు సంచరించుచుండఁగా నచ్చట కొన్ని పక్షులనుజూచి, ఓపక్షులారా! మీరువెళ్ళి తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న శ్రియఃపతివద్ద నాబాధను విన్నవించుడియని ప్రార్థించుచున్నారు.

⁂ వైగల్ పూఙ్గழிవాయ్ వన్దుమేయుమ్కురుగినఙ్గాళ్*
శెయ్కొళ్ శెన్నెలుయర్ తిరువణ్వణ్డూరుఱై యుమ్*
కైకొళ్ శక్కరత్తెన్ కనివాయ్ప్పెరుమానైక్కణ్డు*
కైగళ్ కూప్పిచ్చొల్లీర్ వినైయాట్టియేన్ కాదన్మైయే. ౧.

అ॥ పూ - సుందరమైన, కழிవాయ్ - ఉప్పుకాలవయందు, వైగల్ - ప్రతిదినమును, వన్దు - వచ్చి, మేయుమ్ - మేయుచున్న, కురుగినఙ్గాళ్ - గుంపుగానున్న ఓసారసపక్షులారా! శెయ్ - పొలములను, కొళ్ - ఆక్రమించుచున్న, శెన్నెల్ - ఎఱ్ఱధాన్యము, ఉయర్ - పెరిగియున్న, తిరువణ్ వణ్డూర్ - తిరువణ్ వణ్డూరనెడి దివ్యదేశమందు, ఉఱైయుమ్ - నిత్యవాసము చేయువాఁడును, కైకొళ్ - శ్రీహస్తములో స్వీకరింపఁబడిన, శక్కరమ్ - సుదర్శనముగలవాఁడును, ఎన్ - నాస్వామియు, కని - దొండపండువలెనున్న, వాయ్ - అధరముగలవాఁడునైన, పెరుమానై - సర్వేశ్వరుని, కణ్డు - చూచి, కైగళ్ - చేతులను, కూప్పి - మొగిడ్చి, వినైయాట్టియేన్ - పాపిష్ఠురాలైన నాయొక్క, కాదన్మై - అభినివేశమును, శొల్లీర్ - చెప్పుఁడు.

తా॥ ఓ సారసపక్షులారా! మీరు తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న సర్వేశ్వరునివద్ద కెళ్ళి నాబాధను వాఁడు వినునట్లు నమ్రులైయుండి విన్నవించుడియని. ౧.

కాదల్ మెన్ పెడైయోడుడన్ మేయుమ్కరునారాయ్*
వేదవేళ్వియొలిముழఙ్గుమ్ తణ్ తిరువణ్వణ్డూర్*
నాదన్ ఞాలమెల్లాముణ్డ నమ్పెరుమానైక్కణ్డు*
పాదమ్కైతொழுదుపణియీర్ అడియేన్ తిఱమే. ౨.

అ॥ కాదల్ - ప్రేమముగలదియు, మెన్ - మృదుస్వభావముగలదియునైన, పెడైయోడు - ఆడుపక్షితో, ఉడన్ - కూడ, మేయుమ్ - మేయుచున్న, కరు - శ్యామవర్ణముగల, నారాయ్ - ఓ నారపక్షీ, వేదమ్ - వేదములయొక్కయు, వేళ్వి - యాగములయొక్కయు, ఒలి - శబ్దము, ముழఙ్గుమ్ - ఘోషించుచున్న, తణ్ - చల్లనైన, తిరువణ్ వణ్డూర్ - తిరువణ్ వణ్డూరికి, నాదన్ - స్వామియు, ఞాలమెల్లామ్ - సకలజగత్తులను, ఉణ్డ - మ్రింగినవాఁడునైన, నమ్పెరుమానై - మనస్వామిని, కణ్డు - చూచి, పాదమ్ - తిరువడికళ్ళయందు, కైతொழுదు - అంజలిచేసి, అడియేన్ - నాయొక్క, తిఱమ్ - విధమును, పణియీర్ - చెప్పుఁడు.

తా॥ ఓహారపక్షి! నీవు తిరువణ్ వణ్డూరికివెళ్ళి యచ్చట వేదఘోషములయందు మగ్నుఁడై యానందించుచున్న సర్వేశ్వరునికి నమస్కరించి నాదుఃఖమును జెప్పుమాయని ౨.

తిఱఙ్గళాగియెఙ్గుమ్ శెయ్గళూడుழల్ పుళ్ళినఙ్గాళ్*
శిఱన్ద శెల్వమ్మల్గు తిరువణ్వణ్డూరుఱైయుమ్*
కఱఙ్గుశక్కరక్కై క్కనివాయ్ప్పెరుమానై క్కణ్డు*
ఇఱఙ్గినీర్ తొழுదుపణియీ రడియేనిడరే. 3.

అ॥ ఎఙ్గుమ్ - అన్ని దేశములయందలి, శెయ్గళూడు - పొలములనడుమ, తిఱఙ్గళాగి - గుంపులుగాచేరి, உழల్ - సంచరించుచున్న, పుళ్ళినఙ్గాళ్ - పక్షిసమూహములారా! శిఱన్ద - శ్లాఘ్యమైన, శెల్వమ్ - సమ్పత్తు - మల్గు - వర్ధిల్లుచున్న, తిరువణ్వణ్డూర్ - తిరువణ్వణ్డూరులో, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయువాఁడును, కఱఙ్గు - చుట్టుతిరుగుచున్న, శక్కరమ్ - సుదర్శనమును, కై - శ్రీహస్తమందుగలవాఁడును, కనివాయ్ - దొండపండువంటియధరముగలవాఁడునైన, పెరుమానై - స్వామిని, కణ్డు - చూచి, నీర్ - మీరు, ఇఱఙ్గి - వంగి, తొழுదు - ఆశ్రయించి, అడియేన్ - నాయొక్క, ఇడర్ - దుఃఖమును, పణియీర్ - చెప్పుఁడు

తా॥ గుంపుగాపొలములలో సంచరించుచున్న ఓపక్షులారా! మీరుతిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న చక్రధరునిజూచి నమ్రులైయుండి నామాటను విన్నవించుడియని. ౩.

ఇడరిల్ పోగమ్మూழ்గి యిణైన్దాడుమ్మడవన్నఙ్గాళ్*
విడలిల్ వేదవొలిముழఙ్గుమ్ తణ్ తిరువణ్వణ్డూర్*
కడల్ మేనిప్పిరాన్ కణ్ణనై నెడుమాలై క్కణ్డు*
ఉడలమ్ నైన్దొరుత్తి యురుగుమెన్నుణర్ త్తుమినే. ౪.

అ॥ ఇడర్ - విశ్లేషదుఃఖము, ఇల్ - లేని, పోగమ్ - సంభోగసుఖమందు, మూழ்గి - మునిగి, ఇణైన్దు - చేరియుండి, మడమ్ - విధేయములై, ఆడుమ్ - సంచరించుచున్న, అన్నఙ్గాళ్ - ఓహంసపక్షులారా! విడలిల్ - విచ్ఛేదములేక, వేదవొలి - వేదధ్వని, ముழఙ్గుమ్ - ఘోషించుచున్న, తణ్ - చల్లనైన, తిరువణ్వణ్డూర్ - తిరువణ్వణ్డూరులో వేంచేసియున్నవాఁడును, కడల్ మేని - సముద్రమువంటికాన్తిగలవాఁడును, పిరాన్ - ఉపకారకుఁడును, కణ్ణన్ - ఆశ్రితసులభుఁడును, నెడుమాలై - ఆశ్రితులయందు మిక్కిలివ్యామోహముగలవాఁడునైనసర్వేశ్వరుని, కణ్డు - చూచి, ఒరుత్తి - ఒకతె, ఉడలమ్ - శరీరము, నైన్దు - శిథిలమై, ఉరుగుమ్ - కరుగుచున్నది; ఎన్ఱు - అని, ఉణర్ త్తుమిన్ - తెలియచేయుఁడు.

తా॥ ఆడుపక్షితోఁజేరి యెల్లప్పుడును సుఖించుచున్న ఓ హంసపక్షులారా! తిరువణ్ వణ్డూరులో వేదఘోషమునువినియానందించుచున్న యతిసులభుడైన సర్వేశ్వరునివద్ద వెళ్ళి ఒకస్త్రీ నీయందాశచేగరుగుచున్నదని వానిచెవ్వులోపడవేయుఁడని. ౪.

ఉణర్ త్తలూడలుణర్ న్దుడన్ మేయుమ్మడవన్నఙ్గాళ్*
తిణర్ త్తవణ్డల్గళ్ మేల్ శఙ్గుశేరుమ్తిరువణ్వణ్డూర్*

పుణర్ త్తపూన్దణ్ణుళ్ణాయ్ముడి నమ్బెరుమానై క్కణ్డు*
పుణర్ త్తకై యినరా యడియేనుక్కుమ్ పోర్ ఱుమినే. ౫.

అ॥ ఊడల్ - (అడుపక్షి నెడబాసినయెడల యడితనమీద చేయుచున్న) ప్రణయకలహమును, ఉణర్ త్తల్ - (దానికాకోపము శాన్తియగునట్లుపలువిధములుగా జెప్పవలసిన) సమాధానమాటలను, ఉణర్ న్దు - (నే నెడబాసిన యెడల యాకష్టములు సంభవించునని) తెలిసికొని, ఉడన్ - కూడనుండి, మేయుమ్ - మేయుచున్న, పడమ్ - విధేయములైన, అన్నఙ్గాళ్ - ఓహంసపక్షులారా! తిణర్ త్త - దట్టమైయున్న, వణల్ గళ్ మేల్ - ఎండినబురదలమీద, శఙ్గు - శంఖములు, శేరుమ్ - చేరియున్న, తిరువణ్ వణ్డూర్ - తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్నవాడును, పుణర్ త్త-కట్టబడిన, పూ-అందమైన, తుళ్ణాయ్ - తులసీమాలికలను, ముడి-కిరీటమందు గలవాడునైన, నమ్ పెరుమానై - మనస్వామిని, కణ్డు - చూచి- పుణర్ త్త - మొగిడ్చిన, కైయినరాయ్ - చేతులుగలవారై, అడియేనుక్కుమ్ - నాకొఱకై కూడ, పోర్ ఱుమిన్ - మంచిమాటలాడిస్తోత్రముజేయుఁడి.

తా॥ ఓహంసపక్షులారా! మీరుతిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న సర్వేశ్వరుని వద్ద నన్ను నుగ్రహించునట్లు ప్రార్థించుడి యని. ౫.

పోర్ ఱియానిరన్దేన్ పున్నైమేలుఱై పూఙ్గుయిల్ గాళ్*
శేర్ ఱిల్ వాళై తుళ్ళుమ్ తిరువణ్వణ్డూరుఱైయుమ్*
ఆర్ ఱలాழியఙ్గై యమరర్ పెరుమానై క్కణ్డు*
మార్ ఱమ్ గొణ్డరుళీర్ మైయల్ తీర్వదొరువణ్ణమే. ౬.

అ॥ పున్నై మేల్ - పున్నచెట్టుమీద, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, పూ - సుందరమైన, కుయిల్ గాళ్ - ఓకోకిలములారా! పోర్ ఱి - (మి త్రులను) స్తుతించి, యాన్-నేను, ఇరన్దేన్ - యాచించితిని, (అదేమనగా), శేర్ ఱిల్ - బురదప్రదేశములో, వాళై - మత్స్యములు, తుళ్ళుమ్ - ఎగురుచున్న, తిరువణ్ వణ్డూర్ - తిరువణ్ వణ్డూరులో, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్నవాఁడును, ఆర్ ఱల్ - దయగల, ఆழி - సుదర్శనమును, అఙ్గై - సుందరహస్తమందుగలవాఁడును, అమరర్ - నిత్యసూరులకు, పెరుమానై - స్వామియునైన సర్వేశ్వరుని, కణ్డు - చూచి, మైయల్ - (నా) భ్రమము, తీర్వదు - తీరునటుల, ఒరువణ్ణమ్ - ఓకప్రకారమైన, మార్ ఱమ్ - బదులుమాటను, కొణ్డు - తీసికొనివచ్చి, ఉరైయార్ - చెప్పుడు.

తా॥ ఓకోకిలములారా! మీరు తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న దయావంతుఁడైన సర్వేశ్వరునికి నామాటనుజెప్పి దానికివాఁడు చెప్పెడు బదులుమాటను దీసికొనివచ్చి నాకుజెప్పి నన్ను బ్రతికింపుఁడుమా యని. ౬.

ఒరువణ్ణమ్ శెన్ఱుపుక్కు ఎనక్కొన్ఱురై యొణ్ కిళియే*
శెరువొణ్ పూమ్బొழிల్ శూழ் శెక్కర్ వేలై తిరువణ్వణ్డూర్*
కరువణ్ణమ్ శెయ్యవాయ్ శెయ్యకణ్ శెయ్యకై శెయ్యకాల్*
శెరువొణ్ శక్కరమ్ శఙ్గడై యాళమ్ తిరున్దక్కణ్డే. ౭.

అ॥ ఒణ్ - సుందరమైన, కిళియే - ఓచిలుకా! శెరు (పుష్పములుకోయ్యువారిలోనొకరి కొకరికినేనెత్తెదను నేనెత్తెదనని) కలహమును బుట్టించునట్టిదియు, ఒణ్ - సుందరంబునైన, పూ - పుష్పముగల, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టబడినదియు, శెక్కర్ - (పుష్పముల యొక్క-ధూళిచేత) ఎఱ్ఱనైన, వేలై - సముద్రముయొక్క-గట్టుగలదియునైన, తిరువణ్వణ్డూర్ - తిరువణ్వణ్డూరులో, ఒరువణ్ణమ్ - ఒకవిధముగా, శెన్ఱుపుక్కు - పోయిప్రవేశించి, కరువణ్ణమ్ - నీలవర్ణమునున్ను, శెయ్యవాయ్ - ఎఱ్ఱనియధరమునున్ను, శెయ్యకణ్ - రక్తలోచనమునున్ను, శెయ్యకై - ఎఱ్ఱనిహస్తమునున్ను, శెయ్యకాల్ - ఎఱ్ఱనిశ్రీపాదములనున్ను, శెరు - యుద్ధోన్ముఖమై, ఒణ్ - సుందరమైన, శక్కరమ్ - సుదర్శనమునున్ను, శఙ్గు - శ్రీపాఞ్చజన్యమునున్ను, అడైయాళమ్ - (వానికి) చిహ్నములైనవీనిని, తిరుந்దక్కణ్డు - స్పష్టముగాజూచి, ఎనక్కు - నాకొఱకై, ఒన్ఱురై - ఒకమాటచెప్పుమా.

తా॥ ఓచిలుకా! తోటలచేనతిరమణీయంబైన తిరువణ్వణ్డూరికివెళ్ళి యతిసుందరంబులైన వాని దివ్యావయవములను జక్కగా జూచి యచ్చట నామాటను విన్నవింపుమాయని. ౭.

తిరుந்దక్కణ్డెనక్కొన్ఱురైయా యొణ్శిఱుపూవాయ్*
శెరున్దిఞాழల్ మగిழ் పున్నైశూழ் తణ్ తిరువణ్వణ్డూర్*
పెరున్దణ్డామరైక్కణ్ పెరునీణ్ముడినాల్ తడన్దోళ్*
కరున్దణ్మాముగిల్ పోల్ తిరుమేనియడిగళై యే. ౮.

అ॥ ఒణ్ - అందమైన, శిఱుపూవాయ్ - ఓచిన్నచిలకా! శెరున్ది - శెరుందివృక్షములచేతను, ఞాழల్ - ఇరువిడివృక్షములచేతను, మగిழ் - పొగడవృక్షములచేతను, పున్నై - పున్నవృక్షముల చేతను, శూழ் - చుట్టబడిన, తణ్ - చల్లనైన, తిరువణ్వణ్డూర్ - తిరువణ్వణ్డూరులోవేంచేసి యున్న, పెరు - విశాలమై, తణ్ - చల్లనైన, తామరై - తామరపుష్పమువంటి, కణ్ - నేత్రములనూ, పెరునీళ్ - మిక్కిలిదీర్ఘమైన, ముడి - కిరీటమును, తడమ్ - విశాలములైన, నాల్ తోళ్ - నాల్గుభుజములను, కరు - శ్యామమై, తణ్ - చల్లనైన, మాముగిల్ పోల్ - గొప్పమేఘము వంటి, తిరుమేని - దివ్యవిగ్రహమునుగల, అడిగళై - స్వామిని, తిరుந்దక్కణ్డు - చక్కగా జూచి, ఎనక్కు - నావిషయమై, ఒన్ఱురైయాయ్ - ఒకమాటచెప్పుము.

తా॥ ఓబాలచిలకా! నీవతిభోగ్యమైన తిరువణ్వణ్డూరికివెళ్ళి అచ్చట చతుర్భుజుఁడై కాళమేఘశ్యాముఁడై దీర్ఘములైన నేత్రకిరీటాదులను గలవాఁడై వేంచేసియున్న సర్వేశ్వరుని జూచి నాబాధను జెప్పుమాయని ౮,

అడిగళ్ కైతొழுదలర్మేలసైయుమన్నఙ్గాళ్*
విడివై శఙ్గొలిక్కుమ్ తిరువణ్వణ్డూరుఱైయుమ్*
కడియమాయన్ఱన్నై క్కణ్ణనై నెడుమాలైక్కణ్డు*
కొడియవల్వినైయేన్ తిఱమ్ కూఱుమిన్ వేఱుకొణ్డే. ౯.

అ॥ అలర్ మేల్ - పుష్పములమీద, అశైయుమ్ - సంచరించుచున్న, అన్నఙ్గాళ్ - ఓహంసపక్షులారా! విడివై - ఉదయకాలమునకుసూచకమైన, శఙ్గు - శంఖము, ఒలిక్కుమ్ - ఘోషించుచున్న, తిరువణ్ వణ్డూర్ - తిరువణ్ వణ్డూరులో, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్న, కడియ - (నన్నెడబాసిన) క్రూరుఁడై, మాయన్ తన్నై - వంచకుఁడై, కణ్ణనై - కృష్ణుఁడైయవతరించినవాఁడై, నెడుమాలై - గొప్పమహిమగలవాఁడైన సర్వేశ్వరుని, కణ్డు - చూచి, అడిగళ్ - శ్రీపాదములమీద, కైతొழுదు - అంజలిజేసి, కొడియవల్ - మిక్కిలిక్రూరమైన, వినైయేన్ - పాపముగలనాయొక్క, తిఱమ్ - ప్రకారమును, కేழுకొణ్డు - ఏకాంతమందు, కూఱుమిన్ - చెప్పుఁడు.

తా॥ ఓహంసపక్షులారా! నన్నెడబాసిబాధపెట్టుచు తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న కఠినహృదయముగల వంచకుఁడైన సర్వేశ్వరుని శ్రీపాదములను బట్టుకొని ఏకాంతమందు తీసికొనిపోయి నాదుఃఖమును విన్నవించి ప్రార్థించుఁడియని. ౯.

వేழுకొణ్డు మైయానిరన్దేన్ వెఱికమழ் ణ్ వణ్డినఙ్గాళ్ *
తేఱునీర్ ప్పమ్బై వడపాలై త్తిరువణ్వణ్డూర్ *
మాఱిల్ పోరరక్కన్ మదిళ్ నీఱెழ ச்చెఱ్ఱుగన్ద *
ఏఱుశేవగనార్క్కెన్నైయుముళళెన్మిన్గళే. ౧౦.

అ॥ వెఱి - పరిమళించుచున్న, వణ్డినఙ్గాళ్ - గుంపుగానున్న ఓతుమ్మెదలారా! యాన్ - నేను, ఉమ్మై - మిమ్ములను, వేழுకొణ్డు - విలక్షణములుగానెంచి, ఇరన్దేన్ - యాచించితిని, తేఱు - నిర్మలమైన, నీర్ - జలముగల, పమ్బై - పంపానదియొక్క, వడపాలై - ఉత్తరతీరమందున్న, తిరువణ్ వణ్డూర్ - తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్నవాఁడును, మాఱిల్ - ఒప్పులేని, పోర్ - యుద్ధముగల, అరక్కన్ - రావణాసురునియొక్క, మదిళ్ - కోటను, నీఱెழ - భస్మమగునట్లు, శెఱ్ఱు - నశింపజేసి, ఉగన్ద - సన్తోషించినవాఁడును, ఏఱు - వర్ధిల్లుచున్న శేవగనార్క్కు - శౌర్యముగలవాఁడునైన సర్వేశ్వరునికి, ఎన్నైయుమ్ - నన్నును, ఉళళ్ - (నీరత్న్యకోటియందు ఈపెకూడయొకతె) ఉన్నది, ఎన్మిన్గళ్, అనివిన్నవించుఁడి.

తా॥ ఓతుమ్మెదలారా! మీతోజెప్పినయెడల నాకార్యము శీఘ్రముగాసిద్ధించునని మిమ్ములనువేడుకుంటున్నాను, మీరువెళ్ళి పంపానదికుత్తరమందున్న తిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న గొప్పపరాక్రమవంతుడైన సర్వేశ్వరునివద్ద, నీరత్న్యకోటిలోజేరిన యీపె యిట్లువస్థపడుచున్నదని నన్ను విన్నవించుఁడియని. ౧౦.

‡‡ మిన్నొళ్ శేర్ పురినూల్ కుఱళా యగల్ ஞాలఙ్కొణ్డ *
వన్కళ్వనడిమేల్ కురుగూర్ చ్చడగోపన్ శొన్న *
పణ్ణోళాయిరత్తుళ్ళివై పత్తుమ్ తిరువణ్వణ్డూర్క్కు *
ఇన్నొళ్ పాడల్ వల్లార్ మదనర్ మిన్నిడైయవర్క్కే. ౧౧.

అ॥ మిన్ కొళ్ - కాన్తిగలదై, శేర్ - తిరుమేనుతోఁజేరియున్న, పురినూల్ - యజ్ఞోపవీతముగల, కుఱళాయ్ - వామనబ్రహ్మచారియై, అగల్ - విశాలమైన, ఞాలమ్ - భూమిని, కొణ్డ - స్వీకరించిన, వఞ్జకళ్వన్ - మహావంచకుఁడైన సర్వేశ్వరునియొక్క, అడిమేల్ - శ్రీపాదములవిషయమై, కురుగూర్చ్చడగోపన్ - కురుకాపురాధీశులైననమ్మాఴ్వార్లు, శొన్న - ప్రసాదించిన, పణ్ కొళ్ - గానముగల, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, తిరువణ్వణ్డూర్క్కు - తిరువణ్వణ్డూర్విషయమై, ఇన్ కొళ్ - మధురమై, పాడల్ - పాశురరూపములైన, ఇవైపత్తుమ్ - ఈపదిగాథలను, వల్లార్ - అభ్యసించువారు, మిన్ - మెఱుపువలెప్రకాశించుచున్న, ఇడైయవర్క్కు - నడుముగల స్త్రీలకు, మదనన్ - మన్మథుఁడువలె శ్రీవైష్ణవులకు భోగ్యభూతులై యుందురు.

తా॥ వామనావతారంబెత్తి మహాబలివద్దనుండి భూమిని స్వాధీనపఱచుకొనిన సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరువణ్వణ్డూర్విషయమై నమ్మాఴ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురములనభ్యసించువారు శ్రీవైష్ణవుల కానందమును గలుగజేయుదురని. ౧౧.

ఆ ఴ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్. ౧౧

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౭ - వ, తిరువాయ్మొఴి.

అవతారిక:— ఆఴ్వార్లుపంపిన పక్షులుపోయి సర్వేశ్వరునికి విన్నవించినతరువాత యాసర్వేశ్వరుఁడు కొంచెము విలంబించివచ్చెను. అంతమాత్రము విరహమునుసహింపని యాఴ్వార్లనెడి నాయకి తనవద్దవచ్చిన సర్వేశ్వరునిమీఁద ప్రణయరోషముజేసి, నీవిచ్చటరావలదు ; మీకిష్టమైన స్త్రీలవద్ద వెళ్ళవచ్చునని తిరస్కరింప నప్పుడాసర్వేశ్వరుఁడు వీరిని మంచిమాటలాడుచున్నాఁడని సాదించుచున్నారు.

⁑ మిన్నిడై మడవార్గళ్ నిన్నరుళ్ శూడువార్ మున్బునానదఞ్జువన్*
మన్నుడై యిలఙ్గై యరణ్ కాయ్న్దమాయవనే*
ఉన్నుడై యశుణ్డాయమ్నానఱివ నినియదుకొణ్డు శెయ్వదెన్*
ఎన్నుడై యపన్దుమ్కఴలుమ్తన్దు పోగునమ్బీ. ౧.

అ॥ మిన్ - మెఱుపువలెప్రకాశించుచున్న, ఇడై - నడుముగలవారై, మడవార్గళ్ - వినయసంపన్నులై, నిన్ - నీయొక్క, అరుళ్ - దయను, శూడువార్ - ధరించువారైన (నీప్రీతివిషయులైన) స్త్రీలయొక్క, మున్బు - మందఱ, (నాబంతిని తీసికొనుటమంచిదికాదు), (అట్లుచేసినయెడల వారు నిన్నుతిరస్కారముజేయుదురు), అదు - వారుచేసెడి నీతిరస్కారమును (చూచి), నాన్ - నేను, అఞ్జువన్ - భయపడుదును, మన్నుడై - సమర్థుఁడైనరాజుచేఁ బరిపాలింపఁబడిన, ఇలఙ్గై - లంకయొక్క, అరణ్ - కోటను, కాయ్న్ద - నశింపఁజేసిన, మాయ

వశే - వంచకుఁడా ? ఉన్నుడైయ - నీయొక్క, కళ్లాయమ్-వంచనను, నాన్ - నేను, అఱివన్ - ఎఱుఁగుదును. ఇని - ఇకమీఁద, అదుకొణ్డు - ఆకపటమును, (నాయందు) ప్రకటనజేసి, శెయ్యవదెన్ - చేయఁదగినదేమున్నది ! నమ్బీ - పూర్ణుఁడా ! ఎన్నుడైయ - నాయొక్క, పన్దుమ్ - బంతిని, కழలుమ్ - గచ్చకాయలనిన్ని, తన్దు - ఇచ్చి, పోగు - పో.

తా॥ సర్వేశ్వరుఁడువచ్చినప్పుడు అళ్వార్లనెడి నాయకి మాటలాడక వానిమీఁద కోపగించియున్నప్పుడు వాడు వీరియొక్క బంతిని తీసికొనెను. వానినిజూచి, ఓయి ! నీవిదేమి చేయుచున్నావు, నీకిష్టురాలైన స్త్రీలు దీనిని జూచినయెడల నాయందు నీవు వ్యామోహపడియున్నావని తలఁచి నీతో వారుసంశ్లేషించరు. అప్పుడు నీవనుభవించెడిదుఃఖమునుజూచి నేనుసహింపఁజాలను. ఏకదారవ్రతుఁడనైన నాకు నిన్నుద్రగ్గ వేఱుస్త్రీకలదాయని యావంచనమాటలు నాతోఁజెప్పవలదు. ఆవ్రతముగూడ స్త్రీలకు నీయందు నమ్మకముబుట్టించుకొని పిమ్మట వారిని స్వాధీనపఱచుకొనుటకై యే చేసితివిఁగాని యథార్థముగాజేయలేదు. నీకపటము నాకు తెలుసునుగాన నావద్ద నీ కౌటిల్యమేమియు ఫలించదు. నాబంతినియిచ్చి నీకిష్టమైనవారివద్ద వెళ్ళవచ్చునని. ౧.

పోగునమ్బీయున్ తామరై పురై కణ్ణిణై యుమ్ శెవ్వాయ్ముఱువలుమ్*
ఆగులజ్గళ్ శెయ్య వழிదక్కు నోన్బోమేయామ్*
తోగై మామయిలార్ గళ్ నిన్నరుళ్ శూడువార్ శెవియోశై వైత్తెழ*
ఆగళ్ పోగవిట్టు కుழలూదుపోయిరున్దే. ౨.

అ॥ నమ్బీ - పూర్ణుఁడా ! పోగు - పో ; ఉన్ - నీయొక్క, తామరైపురై - పద్మముతోఁబోలిన, కణ్ణిణైయుమ్ - నేత్రములును, శెమ్ - ఎఱ్ఱనైన, వాయ్ - అధరమందువిలసిల్లుచున్న, ముఱువలుమ్-చిఱునవ్వును, ఆగులజ్గళ్ శెయ్య (మమ్ములను) వ్యాకులపఱచగా, యామ్ - మేము, అழிదక్కు - నశించుటకైయ్యే, నోన్బోమ్ - తపంబుజేసినవారమైతిమి. తోగై - నెమలి పింఛమువలె, మా - శ్లాఘ్యమైన, మయిలార్ గళ్ - కేశపాశముగలస్త్రీలు, నిన్ అరుళ్ - నీదయను, శూడువార్ - ధరించుదురు, (నీదయకువిషయమగుదురు), (వారు), ఓశై - (వేణు) నాదమును, శెవివైత్తు - చెవ్వులోవిని, ఎழ - లేచివచ్చునట్లు, పోయ్ - (నీవు) వెళ్ళి, ఇరున్దు - (వారిసమీపమందు) ఉండి, ఆగళ్ - గోవులను, పోగవిట్టు - దూరముగాపోనిచ్చి, కుழల్ - వేణువును, ఊదు - ఊదుము.

తా॥ ఓయి ! నీయొక్క పద్మనేత్రమును ఎఱ్ఱని యధరముమీఁద ప్రసరించుచున్న తెల్లని మందహాసమును భాగ్యహీనురాలైన నన్ను మిక్కిలి బాధించుచున్నవిగాన నాకంటిముందఱనుండి యవతల వెళ్ళుమాయని చెప్పి ముఖమును వెనుకతిప్పుకొనిరి. అప్పుడు సర్వేశ్వరుఁడుచూచి నీకొప్పుమిక్కిలి సుందరమైయున్నదని చెప్పగా, ఓయి ! నీ వెవరికొప్పులనిదలంచి మోహించితివోయది నాదిది. నీవచ్చటికే వెళ్ళుము. అని యాళ్వార్లు చెప్పినమాటనువిని, వాడు, వారెచ్చటనున్నారని యడిగెను, దానికి అళ్వార్లు, నీవు దూరముగాపోవుచున్న యావులనుబిలుచునట్లు వేణునాదము జేసినయెడల దానినివిని వారేనీదగ్గఱవచ్చి చేరుదురని చెప్పుచున్నారని. ౨.

పోయిరున్దునిన్ పుళ్ళువమఱియాదవర్ క్కురైనమ్బీ* నిన్ శెయ్య
వాయిరుఙ్కనియుఙ్కణ్గళుమ్ విపరీతమిన్నాళ్*
వేయిరున్దడన్దోళినా రిత్తిరువరుళ్ పెఱువార్ యవర్ కొల్*
మాయిరుఙ్కడలైక్కడైన్ద పెరుమానాలే. 3.

అ॥ నమ్బీ - ఓపూర్ణుఁడా! మా - అగాధమై, ఇరు-విశాలమైన, కడలై - సముద్రమును, కడైన్ద - చిలికిన, పెరుమానాలే - గొప్పవాఁడవైననీచేత, ఇత్తిరు - ఇట్టిశ్లాఘ్యమైన, అరుళ్ - దయను, పెఱువార్ - పొందదగినవారై, వేయ్ - వెదురువలె, ఇరు - బలిసియు, తడమ్ - పొడుపుగానున్న, తోళినార్ - భుజములుగలవారైన స్త్రీలు, యవర్ కొల్ - ఎవరో? పోయ్ - (వారున్నచోటికి) పోయి, ఇరున్దు - ఉండి, నిన్ - నీయొక్క, పుళ్ళువమ్ - కపటమును, అఱియాదవర్క్కు - ఎఱుఁగనియా స్త్రీలకు, ఉరై - (నాతోఁజెప్పెడిమాటను) చెప్పుము, నిన్ - నీయొక్క, శెయ్య - ఎఱ్ఱనైన, వాయ్ - అధరమనెడి, ఇరు - పక్వమైన, కనియుమ్ - పండును, కణ్గళుమ్, నేత్రములును, ఇన్నాళ్ - ఈదినములలో, విపరీతమ్ - విజాతీయములై యున్నవి.

తా॥ నేను వేణునాదముజేయుట స్వాభావికమేగాని స్త్రీలను బిలుచుటకై చెయనని సర్వేశ్వరుఁడుచెప్పఁగా, ఓయి! నీకపటస్వభావము నెఱుఁగనివారివద్ద ఈమాటచెప్పితివంటె వారు నమ్ముదురుగాని నేనీమాటనునమ్మను. నీవెవరిమీద మోహపడి నీశరీరమిట్లెండిపోవుచున్నదో? అట్టి భాగ్యవంతులైన సుందరాంగులెవరో తెలియలేరని చెప్పుచున్నారని. 3.

ఆలినీళిలై యేழுలగము ముణ్డనీకిడన్దాయ్* ఉన్ మాయఙ్గళ్
మేలై వానవరుమఱియా రినియెమ్బరమే*
వేలినేర్ తడఙ్గణ్ణార్ విళైయాడుశూழలైచ్చూழవేనిన్ఱు*
కాలిమేయ్క్కవల్లా యెమ్మైనీకழఱేలే. ౪.

అ॥ అన్ఱు - ఆప్రళయకాలమందు, ఏழுలగమ్ - సప్తలోకములను, ఉణ్డు - మ్రింగి, ఆలిన్ - మఱ్ఱిచెట్టుయొక్క, నీళ్ - పొడువైన, ఇలై - ఆకుమీఁద, నీ - నీవు, కిడన్దాయ్ - పవ్వళించితివి, ఉన్ మాయఙ్గళ్ - నీయాశ్చర్యచేష్టితములను, మేలైవానవరుమ్ - నిత్యసూరులును, అఱియార్ - తెలిసికొనఁజాలరు, ఇని - ఇఁకమీద, ఎమ్బరమే - నాకుతెలిసికొనుటకు సాధ్యమగునా? వేలినేర్ - ధనుస్సుతోసమానమై, తడమ్ - విశాలమైన, కణ్ణార్ - నేత్రముగలస్త్రీలు, విళైయాడు - క్రీడించుచున్న, శూழలై - ఇసుకగుంపును, శూழవే - చుట్టుకొనియే, నిన్ఱు - ఉండి, కాలి - ఆవులను, మేయ్క్కవల్లాయ్ - మేపఁవాఁడా! నీ-నీవు, ఎమ్మై-మమ్ములను, కழఱేల్ - క్రూరమాటలను జెప్పవలదు.

తా॥ నేను తల్లితండ్రులమాటలనువిని యావులనుమేపుటకువచ్చితిని గాని స్త్రీలకొఱకైరా లేదని సర్వేశ్వరుఁడనగా; ఓయి! సప్తలోకములనారగించి యొకచిన్న వటదళమందుఁ బవ్వళించి యఘటితఘటనాసమర్థుఁడవైన నీమాయలుసర్వజ్ఞులైన నిత్యసూరులకుఁగూడ నెఱుఁగసాధ్యములు కావు, అట్టిదానిని అజ్ఞుఁడనైన నేనెఱుఁగుదునా? నీవావులనుమేపుటకు వచ్చినయెడల స్త్రీలు

క్రీడించుచున్నచోటుదగ్గ నీకు వేరెచ్చటను చోటు దిక్కు లేదా ? గాన యిట్టియబద్ధమాటలను జెప్పి మమ్ములను బాధపెట్టవలదు వెళ్ళుమాయని చెప్పుచున్నారని. ౪.

కళ్ళ వేల్ నమ్బీ యునక్కు ఉర్ దవమ్ మణ్ణుమ్ విణ్ణుమ్ నన్గఱియుమ్* తిణ్ శక్కర
నిళ్ళుఱుతొల్ పడైయాయ్ యునక్కొన్ఱు ఉణర్త్తువన్ నాన్ *
మళ్ళుఱు తేన్మొழియార్ గళ్ నిన్నరుళ్ శూడువార్ మనమ్ వాడినిఱ్క* ఎమ్
కుళ్ళుఱు పూవై యొడుమ్ కిళియోడుమ్ కుళ్ళగేలే. ౫.

అ॥ నమ్బీ - ఓపూర్ణుడా! కళ్ళ వేల్ - అసత్యమాటలతో నన్ను బాధింపవలదు, ఉన్ ఉర్ దవమ్ - నీకృత్రిమమును, మణ్ణుమ్ - భూలోకమందుండువారును, విణ్ణుమ్-ఊర్ధ్వలోకములయందుండువారును, నన్గు - చక్కగా, అఱియుమ్ - ఎఱుంగుదురు, తిణ్ - దృఢమైన, శక్కరమ్ - సుదర్శనమనెడి, నిళ్ళుఱు - (నీప్రతిజ్ఞను యథార్థమగునట్లు) నడిపించుచున్న, (నీయిష్టానుసారియైన), తొల్ - అనాదియైన, పడైయాయ్ - ఆయుధముగలవాడా! ఉనక్కు-నీకు, నాన్ - నేను, ఒన్ఱు - ఒకమాట, ఉణర్త్తువన్ - బోధించెదను (వినుము). మళ్ళుఱు-నవీనమైన, తేన్ - తేనెవలెభోగ్యమైన, మొழியార్ గళ్ - మాటలుగలవారై, నిన్-నీయొక్క, అరుళ్ - దయను, శూడువార్ - ధరించువారైన స్త్రీలు, మనమ్ వాడినిఱ్క-హృదయము శిథిలమైయుండగా, ఎమ్ - మా యొక్క, కుళ్ళుఱు - అక్షరము తెలియకుండ మాటలాడుచున్న, పూవైయొడుమ్ - చిన్నచిలకతోను, కిళియోడుమ్ - పెద్దచిలకతోను, కుళ్ళగేల్ - క్రీడించకుమా?

తా॥ ఓయి! నేను సత్యసంధుఁడని యసత్యమాటలను జెప్పి నన్ను బాధపెట్టవలదు. నీకపటము నెల్లరు నెఱుఁగుదురు. దానికి దినమును రాత్రిగాజేసిననీసుదర్శనమేసాక్షి. నీకొకమాటచెప్పెదనువినుము. నీకు ప్రియురాళ్ళైన స్త్రీలు చూచుచుండగా నాచిలకతో మాటలాడితివంటె వారు నొచ్చుకొనుదురుగాన నిప్పుడు నాచిలకనువిడిచిపెట్టి వెళ్ళుమని. ౫.

కుళ్ళగియెళ్ళల్ కుళ్ళమణన్ కొణ్డు కోయిన్మై శెయ్దు కన్మమొన్ఱిల్లై*
పళ్ళగియామిరుప్పోమ్ పరమేయిత్తిరువరుళ్ గళ్*
అళ్ళగియారివ్వులగుమూన్ఱుక్కుమ్ తేవిమైతగువార్ పలరుళర్*
కళ్ళగమేతేల్ నమ్బీ యునక్కుమిళ్ళై దేకన్మమే. ౬.

అ॥ కుళ్ళగి - శృఙ్గారవిలాసమునుజేసికొనిపోయి, ఎళ్ళల్ - మాయొక్క, కుళ్ళమణన్ - బొమ్మను, కొణ్డు - తీసికొనివచ్చి, కోయిన్మై శెయ్దు - అక్రమవ్యాపారములనుజేసి, ఒన్ఱుకన్మమ్ - ఒకప్రయోజనమును, ఇల్లై - లేదు, యామ్ - మేము, పళ్ళగియిరుప్పోమ్ - (నీతో) సహవాసముజేసియున్నాము, ఇత్తిరు - ఇట్టివిలక్షణములైన, అరుళ్ గళ్ - (నీ) కృపావ్యాపారములకు, పరమే - (మేము) విషయభూతులమా ? ఇవ్వులగు మూన్ఱుక్కుమ్ - ఈలోకములుమూడింటికిని, తేవిమై - పట్టమహిషిస్థానమునకు, తగువార్ - యోగ్యురాళ్ళైన, అళ్ళగియార్ -సుందరులు, పలర్ - అనేకులు, ఉళర్ - ఉన్నారు. నమ్బీ - ఓపూర్ణుడా ! కళ్ళగమ్ - (మా)సమూహమందు,

ఏఱేల్ - ఎక్కి ప్రవేశింపవలదు. ఉనక్కుమ్ - నీకును, కన్మమ్ - ఈవ్యాపారము, ఇశ్శైదు - పిల్లచేష్టలై యుండును.

తా॥ ఓయి! మందహాసాదులచే మమ్ములను మోహపెట్టి మాబొమ్మను దీసికొనుటచే నీకేమి యుప్రయోజనములేదు నీసంగతి యిదివఱకే మాకు తెలుసును. ఈపరిహాసములు నీపట్టమహిషుల తోఁజేయఁదగినవిగాని మాతోఁజేయరాదు. మాగుంపులోఁబ్రవేశించుట మీకుయుక్తముకాదు వెళ్ళుమ యని. ౬

కన్మమన్ఱెజ్గళ్ కైయిల్ పావై పఱిప్పదు కడల్ ఞాలముణ్డిట్ట*
నిన్మలా నెడియాయ్ యునక్కేలుమ్ పిழ்పిழைయే*
వన్మమే శొల్లి యెమ్మై నీవిశ్శైయాడుది యదుకేట్కిలెన్నైమార్ *
తన్మపావ మెన్నార్ ఒరునాళ్ తడిపిణక్కే. ౭.

అ॥ ఎజ్గళ్ - మాయొక్క, కైయిల్ - చేతులోనున్న, పావై - చిత్రమును, పఱిప్పదు - అపహరించుట, కన్మమన్ఱు - మంచిపనికాదు, కడల్ - సముద్రముచేజుట్టబడిన, ఞాలమ్-భూమిని, ఉణ్డిట్ట - ఆరగించిన, నిన్మలా - పరిశుద్ధుఁడా! నెడియాయ్ - గొప్పవాఁడా! ఉనక్కేలుమ్- నీకును, పిழ் - తప్పు, పిழைయే - తప్పే. వన్మమ్ - మర్మములను, శొల్లి - చెప్పి, ఎమ్మై - మమ్ములనుద్దేశించి, విశ్శైయాడుది - ఆశుమన్నావు. ఎన్నైమార్ - నాసహోదరులు, అదు - ఆమాటను, కేట్కిల్ - వినినయెడల, తన్మమ్పావమ్ - ధర్మముపాపము, ఎన్నార్ - అనివిచారించరు. ఒరునాళ్ - ఒకదినము, తడి - కఱ్ఱనెత్తుకొని, పిణక్కు - కలహించునట్లగును.

తా॥ ఓయి! మాచేతులోనున్న చిత్రమును దీసికొనుట మీకుయుక్తముకాదు. నీవెంత గొప్పవాఁడవైనను నీవుచేసెడి యీయన్యాయము లెన్నటికి న్యాయములుకానేరవు. మారహస్యమాటలను నీవుచెప్పుచుండగా మాయన్నతమ్ములు వినినయెడల యేమియువిచారించక కఱ్ఱనుదీసికొని తన్నుదురని. ౭.

పిణక్కియావైయుమ్ యావరుమ్ పిழைయామల్ పేదిత్తుమ్ పేదియాదదోర్*
కణక్కిల్ కీర్త్తి వెళ్ళక్కదిర్ ఞానమూర్త్తియినాయ్*
ఇణక్కియెమ్మైయెమ్తోழிమార్ విశ్శైయాడప్పోదుమినెన్నప్పోన్దోమై*
ఉణక్కినీవల్లైత్తా లెశొల్లారుగవాదవరే. ౮.

అ॥ యావైయుమ్ - సమస్తాచేతనములనున్ను, యావరుమ్ - సకలచేతనులనున్ను, పిణక్కి - (ప్రళయకాలమందు) తనయందు చేర్చుకొని, పిழைయామల్ - ఒకరికర్మఫలము మఱి యొకరికిమాఱిపోకుండ, పేదిత్తుమ్ - (వారివారికర్మానుగుణముగా) సృజించియు, పేదియాదదు - ఆకర్మములచే నివసంస్పృష్టుడవైయుండి, ఓర్ - అద్వితీయమై, కణక్కిల్ - అసంఖ్యేయమైన, కీర్త్తివెళ్ళమ్ - కీర్తిసముద్రముగలవాఁడవై (అపరిచ్ఛిన్నకీర్తిగలవాఁడవై,) కదిర్ - ప్రకాశించుచున్న, ఞానమూర్త్తియినాయ్ - జ్ఞానమునుస్వరూపముగాగలవాఁడా! ఎమ్మై - మమ్ములను, ఎమ్తోழிమార్ - మాసఖియలు, ఇణక్కి - (మాకు) వనవిహారమందాశనుగలుగజేసి, విశ్శైయాడ

పోప్పదుమున్ - విహరించెదమురమ్మ, ఎన - అనిచెప్పుటచే, పోన్దోమై - వచ్చినమమ్మలను, నీ - నీవు, ఉణక్కి - నిర్బంధపఱచి, వళైత్తాల్ - అడ్డగించితివేని, ఉగవాదవర్ - దీనిసహించని వారు, ఎన్ శొల్లార్ - ఏమియపవాదమును జెప్పరు.

తా॥ సకలచేతనాచేతనములకును సృష్టిసంహారకర్తయని కీర్తిగలవాఁడవై నిర్మలజ్ఞానస్వరూపుఁడవైన నీవిప్పుడు మమ్మలను దోవలోనడ్డగించుచున్నావుగదా. దీనినీ స్త్రీలు చూచినయెడల నీయందు దోషముల నారోపించి నీకీర్తిని నశింప జేయుదురని. ౮.

ఉగవైయాల్ నెఞ్జముళ్ళురుగి యున్ తామరైత్తడఙ్గణ్విళిగళిన్*
అగవలైప్పడుప్పా నళిత్తాయున్ తిరువడియాల్*
తగవుశెయ్దిలై యెఙ్గళ్ శిఱ్ఱిలుమ్యామడు శిఱుశోఱుఙ్గణ్డు*నిన్
ముగవొళితిగళ ముఱువల్ శెయ్దునిన్ఱిలై నమ్బీ. ౯.

అ॥ ఉగవైయాల్ - ప్రీతిచే, నెఞ్జమ్ - హృదయము, ఉళ్ళురుగి - కరిగి, ఉన్ - నీయొక్క, తామరై - తామరపువ్వువలె, తడమ్ - విశాలమైన, కణ్ - నేత్రములయొక్క, విళిగళ్ చూపులనెడి, వలైయిన్ - వలయందు, అగప్పడుప్పాన్ - గొలుకించుకొనుటకై, ఎఙ్గళ్ - మాయొక్క, శిఱ్ఱిలుమ్ - (ఇసుకతో విహారార్థమై చేసిన) చిన్నగృహమును, యామ్ - మేము, అడు - తళిక చేసిన, శిఱుశోఱుమ్ - చిన్నప్రసాదమును, కణ్డు - చూచి, నిన్ ముగమ్ - నీముఖమందు, ఒళి తిగళ - కాన్తిప్రకాశించునట్లు, ముఱువల్ శెయ్దు - మందహాసముజేసి, నిన్ఱిలై - నిలువక, ఉన్ తిరువడియాల్ - నీశ్రీపాదములచే, అళిత్తాయ్ - చెడకొట్టితివి. తగవుశెయ్దిలై - దయచేయకపోతివి.

తా॥ ఓయి! మేమునిన్ను చూచునట్లును, అప్పుడునీకటాక్షముచే మమ్మలను వశపఱచుకొనుటకును, దానిచే మేముసంతోషించునట్లును ఉపాయమేమని యోచించి, ఇసుకలనుపోగుచేసి మేమాడుకున్న యాటలను జూచిసంతోషించక నిర్దయుండవై చెడకొట్టితివి; ఇది నీకుమంచిది కాదని. ౯.

నిన్ఱిలఙ్గుముడియినా యిరుపత్తోర్ కాలరశుకళైకట్ట*
వెన్ఱినీణ్మళువా వియన్ ఞాలమున్పడైత్తాయ్*
ఇన్ఱివ్వాయర్ కులత్తై వీడుయ్యత్తోన్ఱియకరుమాణిక్కచ్చుడర్*
నిన్ఱన్నాల్ నలివేపడువోమెన్ఱు మాయ్చ్చియోమే. ౧౦.

అ॥ నిన్ఱు - నిలిచి, ఇలఙ్గు - ప్రకాశించుచున్న, ముడియినాయ్ - కిరీటముగలవాఁడా! ఇరుపత్తోర్ కాల్ - ఇరువదియొకవిధముగా, అరశు - రాజులను, కళైకట్ట - నిర్మూలముగాజేసిన, వెన్ఱి - జయముగల, నీళ్ - పొడవైన, మళువా - గొడ్డలిగలవాఁడా! వియల్ - విశాలమైన, ఞాలమ్ - భూమిని, మున్ - మునుపు, పడైత్తాయ్ - సృజించినవాఁడా! ఇన్ఱు - ఇప్పుడు, ఇవ్వాయర్ కులత్తై - ఈగోపకులమును, వీడుయ్య - ఉజ్జీవింపించుటకై, తోన్ఱియ - అవతరించిన, కరుమాణిక్కచ్చుడర్ - నీలమాణిక్యమువంటికాన్తిగలవాఁడా! నిన్ఱన్నాల్ - నీచేత, ఆయ్చ్చియోమ్ - గోపికలైనమేము, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, నలివే - ఉపద్రవమునే, పడువోమ్ - పొందుచున్నాము.

తా॥ ఈవిధంబుగ నీశౌర్యకారుణ్య వాత్సల్యాదిగుణములచే మమ్ములను వశపఱచుకొని వెనుక మాతో విశ్లేషించి ఈవిశ్లేషదుఃఖమెఱుఁగక నీవెల్లప్పుఁడును బాధపెట్టుచున్నావని. ౧౦.

‡‡ ఆయ్చ్చియాగియవన్నైయా లన్ఱువెణ్ణెయ్వార్ త్తెయుల్ * శీఱ్ఱమున్డు

కూత్తవప్పన్ఱన్నై క్కురుగూర్చ్చడగోపన్ *

ఏత్తియతమిழ்మాలై యాయిరత్తుళ్ళివై యుమోర్పత్తిశై యొడుమ్ *

నాత్తన్నాల్నవిలవుఱైప్పార్క్కిల్లై నల్గురవే. ౧౧.

అ॥ ఆయ్చ్చియాగియ - గోపికయైన, అన్నైయాల్ - తల్లియైనయశోదాదేవిచే, అన్ఱు - అప్పుడు, వెణ్ణెయ్వార్ త్తెయుల్ - వీడునవనీతమును దొంగలించెననిమాటవచ్చినప్పుడు, శీఱ్ఱమున్డు - కోపగింపఁబడి, అழுకూత్త - ఏడుచుచునృత్యము జేయునట్లాడుచున్న, అప్పన్ తన్నై - స్వామియైన శ్రీకృష్ణునివిషయమై, కురుగూర్చ్చడగోపన్ - కురుకాపురికి స్వామియైననమ్మాழ்వార్లు, ఏత్తియ - స్తోత్రముజేసిన, తమిழ்మాలై - ద్రావిడశబ్దసందర్భరూపములైన, ఆయిరత్తుళ్ - వెయ్యి పాశురములలో, ఓర్ - అద్వితీయములైన, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, ఇశైయొడు - స్వరముతోగూడ, నాత్తన్నాల్ - నాలికచే, నవిల - ఆదరముతోగూడ, ఉఱైప్పార్క్కు - అనుసంధించువారికి, నల్గురవు - భగవదలాభమనెడి దారిద్ర్యము, ఇల్లై - రానేరదు.

తా॥ ఆశ్రితసులభుఁడైన శ్రీకృష్ణునివిషయమై నమ్మాழ்వార్లుప్రసాదించిన యీపదిపాశురముల నాదరముతో ననుసంధించువారు భగవద్గుణములను నిరంతరముగా ననుభవింతురని. ౧౧.

ఆ ழ்వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

3 - వ తిరువాయ్మొழి.

---

అవతారిక:— ఇట్లువిరహబాధ ననుభవించుచున్న నమ్మాழ்వార్లకు సేవసాదించుటకై తిరువిణ్ణగర్లోవచ్చి వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క గుణములననుభవించి యాగుణముల నుపపాదించుచున్నారు.

‡‡ నల్గురవుమ్శెల్వుమ్ నరగుమ్శువర్క్కముమాయ్ *

వెల్పగైయుమ్నట్పుమ్ విడముమముదముమాయ్ *

పల్వగైయుమ్పరన్ద పెరుమానెన్నైయాళ్వానై *

శెల్వమ్మల్గుకుడ తిరువిణ్ణగర్క్కణ్డేనే. ౧.

అ॥ నల్గురవుమ్ - దారిద్ర్యమును, శెల్వుమ్ - సంపత్తును, నరగుమ్ - నరకమును, శువర్క్కముమ్ - స్వర్గమును, ఆయ్ - వీనినివిభూతిగాగలవాఁడై, వెల్ - జయించుచున్న, పగైయుమ్ - ద్వేషమును, నట్పుమ్ - స్నేహమును, విడముమ్ - విషమును, అముదముమ్ - అమృతమును, ఆయ్ - వీనిని విభూతిగాగలఁవాడై, పల్వగైయుమ్ (విభూతిద్వారా ఇట్లు) అనేకవిధములుగా, పరన్ద-

వ్యాపించియున్న, పెరుమాన్ - స్వామియై, ఎన్నై - నన్ను, ఆళ్వానై - దాసునిగాఁజేసికొనిన సర్వేశ్వరుని, శెల్వమ్ - సంపత్తు, మల్గు - అతిశయించియున్న, కుడి - కుటుంబముగల, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగరనెడి దివ్యదేశమందు, కణ్డేనే - సేవించితిని.

తా॥ దారిద్ర్యము మొదలగు చెడ్డవస్తువులను, సంపత్తు మొదలగు మంచివస్తువులను విభూతిగాగల సర్వేశ్వరుని తిరువిణ్ణగర్‌లో ననుభవించితినని. ౧.

కణ్డవిన్బమ్‌తున్బమ్ కలక్కఙ్గళుమ్‌తేఱ్ఱముమాయ్*
తణ్డముమ్‌తణ్మైయుమ్ తழలుమ్‌నిழలుమాయ్*
కణ్డుకొళ్ దఱ్కరియ పెరుమానెన్నైయాళ్వానూర్*
తెణ్డిరై ప్పునల్‌శూழ్ తిరువిణ్ణగర్‌నన్నగరే. ౨.

అ॥ కణ్డ - ప్రత్యక్షసిద్ధమైన, ఇన్బమ్ - సుఖమును, తున్బమ్ - దుఃఖమును, కలక్కఙ్గళుమ్ - (ఇష్టములభించక పోవుటచేగలిగిన) మనోవికారమును, తేఱ్ఱముమ్ - (అవిలభించుటచేత గలిగిన) మనోనైర్మల్యమును, ఆయ్ - వీనిని విభూతిగాగలవాఁడును, తణ్డముమ్ - కోపమును, తణ్మైయుమ్ - అనుగ్రహమును, తழలుమ్ - (ఉష్ణమైన) అగ్నియు, నిழలుమ్-(చల్లనైన) నీడను, ఆయ్ - వీనిని విభూతిగాగలవాఁడును, కణ్డుకొళ్ దఱ్కు - తెలిసికొనుటకు, అరియ - దుర్లభుఁడును, పెరుమాన్ - సర్వాధికుఁడును, ఎన్నై - నన్ను, ఆళ్వాన్-దాసునిగాజేసికొనినవాఁడునైన సర్వేశ్వరునికి, తెణ్ - నిర్మలమై, తిరై - అలలుకొట్టుచున్న, ప్పునల్ - జలముచే, శూழ్ - చుట్టబడిన, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగరనెడి, నల్‌నగర్ - శ్లాఘ్యమైనపట్టణము, ఊర్ - వాసస్థానముగానున్నది.

తా॥ సుఖదుఃఖాదులను తత్కార్యంబులైన కోపానుగ్రహాదులను విభూతిగాగల సర్వేశ్వరుఁడు నానిమిత్తమై తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్నాఁడని. ౨.

నగరముమ్‌నాడుగళుమ్ ఞానముమ్‌మూడముమాయ్*
నిగరిల్‌శూழ్‌శుడరాయిరుళాయ్ నిలనాయ్‌విశుమ్బాయ్*
శిగరమాడఙ్గళ్‌శూழ్ తిరువిణ్ణగర్ చ్చేర్‌న్దపిరాన్*
పుగర్‌కొళ్‌కీర్‌త్తియల్లాలిల్లై యావర్‌క్కుమ్‌పుణ్ణియమే. 3.

అ॥ నగరముమ్ - పట్టణమును, నాడుగళుమ్ - దేశములును, ఞానముమ్ - జ్ఞానమును మూడముమ్ - అజ్ఞానమును, ఆయ్-వీనిని విభూతిగాగలవాఁడై, నిగరిల్ - ఒప్పులేనిదై, శూழ్ - వ్యాపించియున్న, శుడరాయ్ - ప్రకాశమును విభూతిగాగలవాఁడై, నిలనాయ్ - భూమిని విభూతిగాగలవాఁడై, విశుమ్బాయ్ - ఆకాశమును విభూతిగాగలవాఁడై, శిగరమ్- పర్వతశిఖరమువలెనున్న, మాడఙ్గళ్ - గృహములచే, శూழ్ - వ్యాప్తమైయున్న, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగర్‌లో, శేర్‌న్ద - అమరి వేంచెసియున్నవాఁడైన, పిరాన్ - సర్వేశ్వరునియొక్క, పుగర్‌కొళ్ - ఉజ్జ్వలమైన, కీర్‌త్తియల్లాల్ - కీర్తితప్ప, యావర్‌క్కుమ్ - సమస్తచేతనులకును, పుణ్ణియమ్ - ఉజ్జీవన హేతువు, ఇల్లై - లేదు.

తా॥ జ్ఞానాజ్ఞానములను ప్రకాశాప్రకాశములను భూమ్యన్తరిక్షములను విభూతిగాఁగల వాఁడై తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న శ్రియఃపతియొక్క గుణానుసంధానమే సమస్తప్రాణులకు నుజ్జీవనహేతువని. 3.

పుణ్ణియమ్‌పావమ్ పుణర్‌చ్చిపిరివెన్ఱివైయాయ్*
ఎణ్ణమాయ్‌మఱప్పాయుణ్మైయాయిన్మైయాయల్లనాయ్*
తిణ్ణమాడజ్గళ్‌శూழ் తిరువిణ్ణగర్‌చ్చేర్న్దపిరాన్*
కణ్ణనిన్నరుళే కణ్డుకొణ్మిన్గళ్ కైదవమే. ౪.

అ॥ పుణ్ణియమ్‌పావమ్ - పుణ్యపాపములు, పుణర్‌చ్చిపిరివు - సంశ్లేషవిశ్లేషములు, ఎన్ఱు ఇవై - అనెడివీనిని, ఆయ్ - విభూతిగాఁగలవాఁడును, ఎణ్ణమాయ్ - (అనుకూల) స్మరణమును విభూతిగాఁగలవాఁడును, మఱప్పాయ్ - (ప్రతికూల) విస్మరణమును విభూతిగాఁగలవాఁడును, ఉణ్మైయాయ్ ఇన్మైయాయ్ - సదసత్పదార్థములను విభూతిగాఁగలవాఁడును, అల్లనాయ్ - తద్దోషరహితుఁడును, తిణ్ణమ్ - దృఢములైన, మాడజ్గళ్ - మేడలచే, శూழ் - చుట్టబడిన, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగర్‌లో, శేర్న్దపిరాన్ - నిత్యవాసము జేయుచున్న ఉపకారకుఁడునైన, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, ఇన్ - భోగ్యమైన, అరుళే - (నిర్హేతుక) కృపయే, (చేతనోజ్జీవన కారణము). కణ్డుకొళ్మిన్గళ్ - (శాస్త్రమందు) చూడుఁడు, కైదవమే - ఇదియబద్ధమగునా ? (కాదు).

తా॥ పుణ్యపాపములను, తత్కార్యంబులైన అనుకూలసంశ్లేష ప్రతికూలవిశ్లేషములను, తదధీన అనుకూలస్మరణ ప్రతికూలవిస్మరణములను, సకలచేతనాచేతనములను విభూతిగాఁగలవాఁడై దోషగంధరహితుఁడై, అతిరమణీయంబైన తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న శ్రియఃపతియొక్క నిర్హేతుకకృపయే యందఱికి నుజ్జీవనకారణము. ఇందులో సందేహము లేదు. ఈమాటను శాస్త్రమందు విచారించుడియని. ౪.

కైదవమ్‌శెమ్మైకరుమై వెళుమైయుమాయ్*
మెయ్‌పొయ్యిళమైమ్ముదుమైపుదుమైపழமైయుమాయ్*
శెయ్‌దతిణ్‌మదిళ్‌శూழ் తిరువిణ్ణగర్‌చ్చేర్న్దపిరాన్*
పెయ్‌దకావుకణ్డీర్ పెరున్దేవుడైమూవులగే. ౫.

అ॥ పెరుమ్‌తేవుడై - బ్రహ్మాది గొప్పదేవతలుగల, మూవులగు - మూఁడులోకములును, కైదవమ్ - కపటమును, శెమ్మై - ఆర్జవమును, కరుమై - నలుపును, వెళుమైయుమ్ - తెలుపును, ఆయ్ - విభూతిగాఁగలవాఁడై, మెయ్‌పొయ్ - సత్యాసత్యములను, ఇళమై ముదుమై - బాల్యవార్ధకములను, పుదుమై పழమైయుమ్ - నవీన ప్రాచీనములను, ఆయ్ - విభూతిగాఁగలవాఁడై, శెయ్‌ద - నిర్మింపఁబడిన, తిణ్ - దృఢమైన, మదిళ్ - ప్రాకారముచే, శూழ் - ఆవరింపఁబడిన, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగరిలో, శేర్న్ద - చేరియున్న, పిరాన్ - సర్వేశ్వరుఁడు, పెయ్‌ద - వేసిన, కావుకణ్డీర్ - తోటనుమండీ,

తా॥ మనోవాక్కాయములయొక్క ఉత్కృష్టనికృష్ట రూపములైన స్వభావము లన్నిఁటిని విభూతిగాఁగలవాఁడై తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న సర్వేశ్వరునికి యీచరాచరాత్మకంబులైన లోకములు లీలార్థమై నిర్మింపఁబడినవని. ౫.

మూవులగఙ్గళుమాయ్ యల్లనాయుగప్పాయ్మునివాయ్*
పూవిల్వాఴ్ మగళాయ్ త్తవ్వైయాయ్ప్పుగఴాయ్ప్ప యాయ్*
తేవర్ మేవిత్తొఴుమ్ తిరువిణ్ణగర్ చ్చేర్న్దపిరాన్*
పావియేన్ మనత్తేయుఱైగిన్ఱ పరఞ్జుడరే. ౬.

అ॥ మూవులగఙ్గళుమాయ్ - మూఁడులోకములను విభూతిగాఁగలవాఁడును, అల్లనాయ్ - అంతకంటె వేఱైన నిత్యవిభూతిని విభూతిగాఁగలవాఁడును, ఉగప్పాయ్ - అనుగ్రహమును విభూతిగాఁగలవాఁడును, మునివాయ్ - నిగ్రహమును విభూతిగాఁగలవాఁడును, పూవిల్ - తామరసపుష్పమందు, వాఴ్ - నిత్యవాసముజేయుచున్న, మగళాయ్ - శ్రీమహాలక్ష్మిని విభూతిగాఁగలవాఁడును, తవ్వైయాయ్ - జ్యేష్ఠాదేవిని విభూతిగాఁగలవాఁడును, పుగఴాయ్ - కీర్తిని విభూతిగాఁగలవాఁడును, పఴియాయ్ - అపవాదమును విభూతిగాఁగలవాఁడును, తేవర్ - నిత్యసూరులు, మేవి - వచ్చి, తొఴుమ్ - ఆశ్రయించుచున్న, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగరిలో, శేర్న్ద - వాసముజేయుచున్నవాఁడునైన, పిరాన్ - సర్వేశ్వరుఁడు, పావియేన్ - పాపియైననాయొక్క, మనత్తు - మనస్సులో, ఉఱైగిన్ఱ - అమరి వేంచేసియున్న, పరఞ్జుడర్ - పరఞ్జ్యోతిస్స్వరూపుఁడు.

తా॥ ఉభయవిభూతిని నిగ్రహానుగ్రహములను శ్రీమహాలక్ష్మిని పెద్దమ్మను స్తుతినిందలను విభూతిగాఁగలవాఁడై, నిత్యసూరిసంసేవ్యుఁడై తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న శ్రియఃపతి నామనస్సులో వేంచేసియుండి విలసిల్లుచున్నాఁడని. ౬.

పరఞ్జుడరుడమ్బాయ్ యఴుక్కుప్పదిత్తపుడమ్బాయ్*
కరన్దుమ్తోన్ఱియుమ్నిన్ఱుమ్ కైదవఙ్గళ్ శెయ్దుమ్*విణ్ణోర్
శిరఙ్గళాల్ వణఙ్గుమ్ తిరువిణ్ణగర్చ్చేర్న్దపిరాన్*
వరఙ్గొళ్ పాదమల్లాలిల్లై యావర్క్కుమ్వన్ శరణే. ౭.

అ॥ పరఞ్జుడర్ - మిక్కిలి తేజోరూపమైన, ఉడమ్బాయ్ - అప్రాకృత దివ్యవిగ్రహము గలవాఁడును, అఴుక్కు - దోషములచే, పదిత్త - పూర్ణమైన, ఉడమ్బాయ్ - లీలావిభూతిని శరీరము గాఁగలవాఁడును, కరన్దుమ్ - అన్తర్యామియై మఱిఁగియుండియు, తోన్ఱియుమ్ - రామకృష్ణాది రూపముగా నవతరించియు, నిన్ఱుమ్ - (ఈలోకమందు) నివసించియు, కైదవఙ్గళ్ శెయ్దుమ్ - కపట వ్యాపారములను జేసియు, విణ్ణోర్ - నిత్యసూరులు, శిరఙ్గళాల్ - శిరస్సులచే, వణఙ్గుమ్ - నమస్కరించుచున్న, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగరిలో, శేర్న్ద - వచ్చి వేంచేసియున్నవాఁడునైన, పిరాన్ - సర్వేశ్వరునియొక్క, వరమ్కొళ్ - శ్రేష్ఠమైన, పాదమల్లాల్ - శ్రీపాదములుతప్ప, యావర్క్కుమ్ - సమస్తచేతనులకును, వన్ శరణ్ - దృఢమైన ఉపాయము, ఇల్లై - లేదు. ౭.

తా॥ సమస్త ప్రాణులకు నన్తర్యామియైయుండియు రామకృష్ణాద్యవతారముల నెత్తియు రక్షించుచు ఆశ్రితులకు సులభుడై యనాశ్రితులకు దుర్లభుడై తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదమే చేతను లుజ్జీవించుటకు శ్రేష్ఠమైన ఉపాయంబని. ౭.

వన్ శరణ్ శురర్ కాక్కు యశురర్‌క్కు వెమ్ కూర్ ఱ్ముమాయ్*
తన్ శరణ్ నిழ்ఱ్కీழ் ఉలగమ్ వైత్తుమ్ వైయాదుమ్*
తెన్ శరణ్ తిశైక్కు తిరువిణ్ణగర్ చ్చేర్‌న్దపిరాన్*
ఎన్ శరణ్ ఎన్ కణ్ణన్ ఎన్నైయాళుడై యెన్నప్పనే. ౮.

అ॥ శురర్‌క్కు - దేవతలకు, వన్ - దృఢమైన, శరణాయ్ - రక్షకుడై, అశురర్‌క్కు - అసురులకు, వెమ్ - క్రూరమైన, కూర్ ఱ్ముమాయ్ - మృత్యువై, ఉలగమ్ - ఆశ్రితులను, తన్ - తనయొక్క, శరణ్ - శ్రీపాదముయొక్క, నిழ்ఱ్కీழ் - నీడక్రింద, వైత్తుమ్ - ఉంచియు, వైయాదుమ్ - (అభక్తులను తనశ్రీపాదఛాయయందు) ఉంచనివాడును, తెన్ తిశైక్కు - దక్షిణ దిక్కునకు, శరణ్ - రక్షయైయున్న, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగర్‌లో, శేర్‌న్ద - చేరియున్న, పిరాన్ - ఉపకారకుడును, ఎన్ కణ్ణన్ - నాకత్యన్తసులభుడును, ఎన్నైయాళుడై - నన్ను దానునిగాగలవాడునైన, ఎన్నప్పన్ - నాస్వామి, ఎన్ శరణ్ - నాకురక్షకుడు.

తా॥ భక్తులను తనశ్రీపాదములక్రిందనుంచుకొని రక్షించువాడును, అభక్తులను నశింపఁజేయువాడును, నాకత్యన్తసులభుడునై తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న సర్వేశ్వరుడే నాకు రక్షకుడని. ౮.

ఎన్నప్పనెనక్కాయిగుళాయ్ యెన్నైప్పెఱ్ ఱవళాయ్*
పొన్నప్పన్ మణియప్పన్ ముత్తప్పనెన్నప్పనుమాయ్*
మిన్నప్పొన్మదిళ్ శూழ் తిరువిణ్ణగర్ చ్చేర్‌న్దవప్పన్*
తన్నొప్పారిల్లప్పన్ తన్దనన్ తనతాళ్ నిழలే. ౯.

అ॥ ఎనక్కు - నాకసాధారణుడైన, ఎన్ అప్పన్ ఆయ్ - నాతండ్రియై, ఇగుళాయ్ - సఖియై, ఎన్నై - నన్ను, పెఱ్ ఱవళాయ్ - కన్నతల్లియై, పొన్నప్పన్ - బంగారమువంటివాడై, మణియప్పన్ - రత్నమువంటివాడై, ముత్తప్పన్ - ముత్యమువంటివాడై, ఎన్నప్పనుమాయ్ - నాస్వామియునై, మిన్న - మెఱుపువలెప్రకాశించుచున్న, పొన్ మదిళ్ - స్వర్ణప్రాకారముచే, శూழ் - చుట్టబడిన, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగర్‌లో, శేర్‌న్ద అప్పన్ - నిత్యవాసము జేయుచున్న సర్వస్వామియై, తన్ - తనతో, ఒప్పారిల్ - సాటిలేని, అప్పన్ - ఉపకారకుడైనశ్రియఃపతి, తనతాళ్ - తనశ్రీపాదముయొక్క, నిழల్ - ఛాయను, తన్దనన్ - (నాకు) ఇచ్చెను.

తా॥ నాకుసకలవిధబంధువై యత్యంతభోగ్యభూతుడై, అతిరమణీయమైన తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న అసదృశుడైన శ్రియఃపతినన్ను తనశ్రీపాదములక్రింద చేర్చుకొనెనని. ౯.

నిఴల్ వెయ్యిల్ శిఱుమై పెరుమై కుఱుమై నెడుమైయుమాయ్*
శుఴల్వననిఱ్పన మఱ్ఱుమాయవై యల్లనుమాయ్*
మఴలై వాయ్వణ్డువాఴ్ తిరువిణ్ణగర్ మన్ను పిరాన్*
కఴల్గళన్ఱి మఱ్ఱోర్ కళైగణిలమ్ కాణ్మిన్గళే. ౧౦.

అ॥ నిఴల్ - ఛాయాస్వరూపుఁడై, వెయ్యిల్ - ఆతపస్వరూపుఁడై, శిఱుమై - అణుస్వరూపుఁడై, పెరుమై - మహత్స్వరూపుఁడై, కుఱుమై - హ్రస్వరూపుఁడై, నెడుమైయుమాయ్ - దీర్ఘరూపుఁడై, శుఴల్వన - జంగమస్వరూపుఁడై, నిఱ్పన - స్థావరస్వరూపుఁడై, మఱ్ఱుమాయ్ - తక్కినపదార్థస్వరూపుఁడై, అవైయల్లనుమాయ్ - ఆపదార్థములయొక్క స్వభావము లేనివాఁడై, మఴలై వాయ్ - ముద్దుమాటలుగల, వణ్డు - తుమ్మెదలు, వాఴ్ - సంచరించుచున్న, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగర్‌లో, మన్ను పిరాన్ - నిత్యవాసముజేయుచున్న సర్వేశ్వరునియొక్క, కఴల్గళన్ఱి - శ్రీపాదములుతప్ప, మఱ్ఱోర్ కళైగణ్ - వేఱొక రక్షకుఁడను, ఇలమ్ - కలవాఁడను కాను; కాణ్మిన్గళ్ - విచారించుడి.

తా॥ అణుబృహత్ హ్రస్వదీర్ఘ ఛాయాతప చరాచరాది సకల పదార్థములను విభూతిగాఁగలవాఁడై తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదములకంటె మనకు వేఱు రక్షకములేదని. ౧౦.

** కాణ్మిన్గళులగీరెన్ఱు కణ్ముగప్పేనిమిర్న్ద*
తాళినైయన్ఱన్నైక్కురుగూర్చ్చడగోపన్ శొన్న*
ఆణైయాయిరత్తు త్తిరువిణ్ణగర్ప్పత్తుమ్వల్లార్*
కోణైయిన్ఱి విణ్ణోర్క్కెన్ఱుమావర్ కురవర్గళే. ౧౧.

అ॥ ఉలగీర్ - ఓలోకులారా! కాణ్మిన్గళ్ - చూడుఁడు, ఎన్ఱు - అని చెప్పి, కణ్ముగప్పే - వారికంటిముందఱనే, నిమిర్న్ద - పొడుగైన, తాళినైయన్ఱన్నై - శ్రీపాదద్వన్ద్వముగల శ్రియఃపతివిషయమై, కురుగూర్చ్చడగోపన్ - తిరునగరికి స్వామియైననమ్మాళ్వార్లు, శొన్న - సాధించిన, ఆణై - భగవదాజ్ఞారూపములైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, తిరువిణ్ణగర్ - తిరువిణ్ణగరనెడి దివ్యదేశవిషయమైన, పత్తుమ్ - పదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, కోణైయిన్ఱి - సంశయములేక, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, విణ్ణోర్క్కు, నిత్యసూరులకు, కురవరావర్ - పూజ్యులగుదురు

తా॥ తిరువిణ్ణగర్‌లో వేంచేసియున్న శ్రియఃపతివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన ఈ పదిపాశురముల నభ్యసించువారిని నిత్యసూరులు పూజింతురు; ఇందుకు సందేహములేదని. ౧౧.

ఆ ఴ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

—◆—

## ౪-వ తిరువాయ్మొఴి.

అవతారిక:—ఇట్లు తనతో సంశ్లేషించిన శ్రియఃపతియొక్క సకల కల్యాణగుణముల ననుభవించుచున్నారు.

‡‡ కురవై యాయ్చ్చియరోడుకో త్తదుమ్ కున్ఱమొన్ఱేన్దియదుమ్*
ఉరవునీర్ప్పొయ్గై నాగమ్కాయ్న్దదు ముట్పడమఱ్ఱుమ్పల*
అరవిల్పళ్ళిప్పిరాన్ఱన్ మాయవినైగళై యేయలఱ్ఱి*
ఇరవునన్పగలుమ్ తవిర్గిలమెన్నకుఱైనమక్కే. ౧.

అ॥ కురవై - రాసక్రీడయందు, ఆయ్చ్చియరోడు - గోపికలతోఁగూడ, కోత్తదుమ్ - (చేతులను) జోడించికొనినదియు, ఒన్ఱు - ఒక, కున్ఱమ్ - (గోవర్ధన) పర్వతమును, ఏన్దియదుమ్ - ధరించినదియు, ఉరవు - విషముతోఁగూడుకొనిన, నీర్ - జలముగల, పొయ్గై - మడుగునందున్న, నాగమ్ - కాళింగుని, కాయ్న్దదుమ్ - కోపగించినదియు, ఉట్పడ - ఇవిమొదలుగా, మఱ్ఱుమ్-ఇంకను, పల - అనేకములై, అరవిల్ - ఆదిశేషునిమీఁద, పళ్ళి - పవ్వళించియున్న, పిరాన్ఱన్ - సర్వేశ్వరునియొక్క, మాయమ్ - ఆశ్చర్యకరంబులైన, వినైగళై - చేష్టితంబులను, అలఱ్ఱి - సన్తోషముతోఁజెప్పి, నల్ - భగవద్గుణానుభవయోగ్యమైన, ఇరవుమ్-రాత్రియందును, పగలుమ్ - దినమందును, తవిర్గిలమ్ - ఎడతెగక ననుసంధించుచున్నాము నమక్కు - మనకు, ఎన్నకుఱై - ఏమికొఱత (ఉన్నది).

తా॥ శ్రీకృష్ణునియొక్క రాసక్రీడా గోవర్ధనోద్ధరణ కాళియమర్దనాద్యత్యాశ్చర్య చేష్టితములను రేయింబగళ్ళనుసంధించుచున్న మనకేఁక నేవిధకొఱతయు లేదని. ౧.

కేయత్తీఙ్కుఴలూదిఱ్ఱుమ్ నిరై మేయ్త్తదుమ్ కెణ్డైయొణ్ కణ్*
వాశప్పూఙ్గుఴల్ పిన్నైతోళ్గళ్ మణన్దదుమ్ మఱ్ఱుమ్పల*
మాయక్కోలప్పిరాన్ఱన్ శెయ్గై నినైన్దు మనమ్కుఴైన్దు*
నేయత్తోడుకఴిన్దపోదెనక్కెవ్వులగమ్నికరే. ౨.

అ॥ కేయమ్ - గానముచే, తీ - సుఖకరమైన, కుఴల్ - వేణువును, ఊదిఱ్ఱుమ్ - ఊదినదియు, నిరై - గోసమూహమును, మేయ్త్తదుమ్ - మేపినదియు, కెణ్డై - మత్స్యమువలె, ఒణ్ - సుందరమైన, కణ్ - నేత్రముగలదియు, వాశమ్ - పరిమళించుచున్న, పూ - పుష్పముగల, కుఴల్ - కొప్పుగలదియునైన, పిన్నై - నప్పిన్నపిరాట్టియొక్క, తోళ్గళ్-భుజములతో, మణన్దదుమ్ - సంశ్లేషించినదియు, (ఇవిమొదలై), మఱ్ఱుమ్పల-ఇఁకననేకవిధములైన, మాయక్కోలమ్ - ఆశ్చర్యరూపముగల, పిరాన్ఱన్ - శ్రీకృష్ణునియొక్క, శెయ్గై - చేష్టితములను, నినైన్దు - తలంచి, మనమ్కుఴైన్దు - మనస్సుకరిగి, నేయత్తోడు - ప్రీతితో, పోదు - కాలము, కఴిన్ద - గడుచుచున్నది. ఎనక్కు - నాకు, ఎవ్వులగమ్ - ఏలోకమందైనను, నికరే - ఒకసైన వాఁడు కలఁడా?

తా॥ వేణువాదము జేయుచు నావులను మేపినను, నప్పిన్నపిరాట్టితో సంశ్లేషించినది మొద లగు శ్రీకృష్ణచేష్టితముల ననుసంధించి యెల్లప్పుడు నానందించుచున్న నాకొప్పైనవారెవరులేరని.

నిగరిల్ మల్లరై చ్చెత్తదుమ్ నిరై మేయ్ త్తదుమ్ నీణెడుఙ్గై*
శిగరమాకళిఱట్టదు మివై పోల్వనవుమ్ పిఱవుమ్*
పుగర్ కొళ్ శోది ప్పిరాన్ఱన శెయ్ గై నినైన్దు మ్పులమ్బి* ఎన్ఱుమ్
నుగరవైగల్ వైగప్పెత్త్ఱేన్ ఎనక్కిన్నినినోవదువే. ౩.

అ॥ నిగరిల్ - సాటిలేని (యుద్ధమందు అసదృశులైన), మల్లరై - చాణూరముష్టికుల నెడి మల్లులను, శెత్తదుమ్ - చంపినదియు, నిరై - ఆవులను, మేయ్ త్తదుమ్ - మేపినదియు, నీళ్ నెడుమ్ - మిక్కిలిదీర్ఘమైన, కై - తొండముగల, శిగరమ్ - పర్వతశిఖరమువలెనున్న, మా - గొప్ప, కళిఱు - కువలయాపీడమును, అట్టదుమ్ - సంహరించేసినదియు, ఇవై పోల్వనవుమ్ - వీని తో సమానములైన, పిఱవుమ్ - తక్కినవియునైన, పుగర్ కొళ్ - అగ్నిజ్వాలమైన, శోది - తేజస్సుగల, పిరాన్ ఱన - శ్రీకృష్ణునియొక్క, శెయ్ గై - చేష్టితములను, నినైన్దు - ధ్యానించి, పులమ్బి - చెప్పెడువిధమునుతెప్పి యనుసంధించి, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, నుగర - ఆ యనుభవము తోడనే, వైగల్ - కాలమంతయు, వైగ - గడుమన, పెత్త్ఱేన్ - లభించితిని. ఇని - ఇక మీద, ఎనక్కు - నాకు, ఎన్ - దేనినిగురించి, నోవదు - దుఃఖపడవలసినది?

తా॥ మల్లయుద్ధము, కువలయాపీడసంహారము మొదలగు శ్రీకృష్ణునిదివ్యచేష్టితముల నెల్లప్పుడు ననుసంధించునట్లు భాగ్యముగల నేనిక చిన్తింపవగిన దేమియులేదని. ౩.

నోవవాయ్చ్చియురలోడార్క్క ఇరఙ్గిట్టుమ్* వఞ్జప్పెణ్ణై
చ్చావప్పాలుణ్ణను మూర్ శగడమిఱచ్చాడియదుమ్*
తేవర్కోలప్పిరాన్ఱన శెయ్ గై నినైన్దుమనమ్ కరైన్దు*
మేవక్కాలఙ్గళ్ కూడినేన్ ఎనక్కిన్నినివేణ్డువదే. ౪.

అ॥ నోవ - నొచ్చునట్లు, అయ్చ్చి-యశోదాదేవి, ఉరలోడు-రోలుతోజేర్చి, ఆర్క్క - కట్టగా, ఇరఙ్గిట్టుమ్ - (దానికి) భయపడియుండినదియు, వఞ్జమ్ - వంచకియైన, పెణ్ణై - పూతనయొక్క, పాల్ - స్తన్యమును, శావ - (అది) చచ్చునట్లు, ఉణ్డదుమ్ - త్రాగినదియు, ఊర్ - పైకిపొర్లివచ్చిన, శగడమ్ - శకటాసురుని, ఇఱ - నశించునట్లు, శాడియదుమ్ - తన్నినదియునైన, తేవర్కోలమ్ - అప్రాకృతదివ్యవిగ్రహముగల, పిరాన్ ఱన - శ్రీకృష్ణునియొక్క, శెయ్ గై - చేష్టిత ములను, నినైన్దు - ధ్యానించి, మనమ్ కరైన్దు - హృదయముకరిగి, మేవ -(ఈ చేష్టితములలో మనస్సు) చేరునట్లు, కాలఙ్గళ్ - కాలములతో, కూడినేన్ - చేరియుండునట్లులభించితిని. ఇని - ఇకమీద, ఎనక్కు - నాకు, ఎన్ వేణ్డువదు. ఏమికావలసినది?

తా॥ యశోదాదేవి రోలుతోజేర్చికట్టినప్పుడు దానికిలోబడి యశక్తునివలెభయపడినది, పూతనాశకటాసురులను సంహరించినది మొదలగు శ్రీకృష్ణునివ్యాపారములను ధ్యానించుటకుదగిన భాగ్యముగల నాకిక నేమియు కొఱతలేదని. ౪.

వేణ్డి త్తేవరిరక్క వన్దుపిఱన్దదుమ్ వీఙ్గిరుళ్ వాయ్*
పూణ్డన్నై పులమ్బప్పోయ్ యఙ్గాయర్కులమ్పుక్కదుమ్*
కాణ్డలిన్ఱి వళర్న్దు కఞ్జనై తుఞ్జవఞ్జమ్ శెయ్దదుమ్*
ఈణ్డునానలర్ప్పెఱ్ఱేన్ ఎనక్కెన్న ఇగలుళదే. ౫.

అ॥ తేవర్ - దేవతలు, ఇరక్క - ప్రార్థింప, వేణ్డి - (అప్పుడుతన) ఇచ్ఛచే, వన్దు - వచ్చి, పిఱన్దదుమ్ - అవతరించినదియు, అన్ఱు - అప్పుడు, అన్నై - తల్లియైన దేవకీదేవి, పూణ్డు - (తిరువడికళ్ళను) కట్టుకొని, పులమ్బ - (నాయాఱు పుత్రులను జంపినదుష్టకంసుఁడు వీనినైనను జేయునోయని) ఏడవగా, వీఙ్గు - వర్ధిల్లుచున్న, ఇరుళ్వాయ్ - చీకటియందు, పోయ్ - (గోకులమునకు) వెళ్ళి, అఙ్గు - అచ్చట, ఓర్ - అద్వితీయమైన, ఆయ్కులమ్ - గొల్లకులమందు, పుక్కదుమ్ - ప్రవేశించినదియు, కాణ్డలిన్ఱి - (కంసునికి) తెలియక, వళర్న్దు - పెరిగి, కఞ్జనై - కంసుని, తుఞ్జ - నశించునట్లు, వఞ్జమ్ శెయ్దదుమ్ - వంచన చేసినదియు, (ఈ చేష్టితములను), ఈణ్డు - ఇచ్చటనున్న, నాన్ - నేను, అలర్ప్పెఱ్ఱేన్ - అనుసంధింపలభించితిని, ఎనక్కు - నాకు, ఎన్న ఇగల్ - ఏమిదుఃఖము, ఉళదు - కలదు.

తా॥ బ్రహ్మాదుల ప్రార్థనల నంగీకరించి దేవకీగర్భమందవతరించి అచ్చట కంసునికిభయబడిన దేవకీమనోరథ ప్రకారముగా గోకులమునకువెళ్ళి నందగోపగృహమందు పెరిగి, పిమ్మట కంసుని సంహరించిన శ్రీకృష్ణుని దివ్యచేష్టితముల ననుసంధించుచున్న నాకేవిధ దుఃఖమును లేదని. ౫.

ఇగల్కొళ్ పుళ్ పిళన్దదు మిమిలేఱుగళ్ శెఱ్ఱదువుమ్*
ఉయర్కొళ్ శోలైక్కురున్దొశిత్తదుమ్ ఉట్పడమఱ్ఱెణ్ణిప్పల*
అగల్కొళ్ వైయమళన్దమాయ ఎన్నప్పన్ఱన్ మాయఙ్గళే*
పగలిరాప్పరవప్పెఱ్ఱేన్ ఎనక్కెన్న మనప్పరిప్పే. ౬.

అ॥ ఇగల్కొళ్ - యుద్ధమునకువచ్చిన, పుళ్ - బకాసురుని, పిళన్దదుమ్ - చీల్చినదియు, ఇమిల్ - మూపురముగల, ఏఱుగళ్ - వృషభములను, శెఱ్ఱదువుమ్ - చంపినదియు, ఉయర్కొళ్ - ఉన్నతమై, శోలై - శాఖాదులచే సమృద్ధమైయున్న, కురున్దు - బండిగురుగింజ వృక్షమును, ఒశిత్తదుమ్ - విఱిచినదియు, ఉట్పడ - ఇవి మొదలుగాగల, మఱ్ఱుమ్ - ఇంకను, పల - అనేకములై, అగల్కొళ్ - విశాలమైన, వైయమ్ - భూమిని, అళన్ద - కొలిచిన, మాయన్ - ఆశ్చర్యభూతుఁడైన, ఎన్ అప్పన్ఱన్ - నాస్వామియొక్క, మాయఙ్గళ్ - ఆశ్చర్యాకారంబులైన చేష్టితములను, పగల్ - దినమందును, ఇరా - రాత్రియందును, పరవ - స్తుతించునట్లు, పెఱ్ఱేన్ - లభించితిని. ఎనక్కు - నాకు, ఎన్న మనప్పరిప్పు - మనోదుఃఖముకలదు?

తా॥ బకాసురునినిన్ని ఏడువృషభములనున్ను జంపుట, కురున్దవృక్షమును బడద్రోయుట ఇవి మొదలగు శ్రీకృష్ణచరిత్రముల నెల్లప్పుడనుసంధించుచున్న నాకేవిధ మనోదుఃఖమును లేదని. ౬.

మనప్పరిప్పోడళుక్కుమానిడశాదియిల్ తాన్పిఱన్దు*
తనక్కువేణ్డురుక్కొణ్డు తాన్ఱనశీర్ప్పిఱ్ఱినై ముడిక్కుమ్*

పునత్తుழாయ్ముడిమాలై మార్బ నెన్నప్పన్తన్ మాయజ్గళే*
నినైక్కుమ్నెఞ్జుడైయే నెనక్కినియార్ నిగర్ నీణిలత్తే. ౭.

అ॥ మనప్పడిప్పోదు - (భక్తులుకష్టముననుభవించుచున్నారని) మనః క్లేశముతోఁగూడ, అழுక్కు - హేయమైన, మానిడశాదియిల్ - మనుష్యజాతియందు, తాన్ - తాను, తనక్కు - తనను, వేణ్డు - అభిమతమైన, ఉరు - అప్రాకృతవిగ్రహమును, కొణ్డు - స్వీకరించి, పిఱన్దు - అవతరించి, తాన్ - తానే, తనశిఱ్ఱత్తినై - తనకోపమును, ముడిక్కుమ్-తీర్చుకొనినవాఁడును, పునమ్ - తనస్థానమందున్నట్టువలె (సుందరమై) ఉన్న, తుழாయ్మాలై - తులసీమాలికలను, ముడి - కిరీటమందు, మార్బన్ - వక్షస్థలమందును గలవాఁడును, ఎన్నప్పన్తన్ - నాస్వామియైన, శ్రీకృష్ణునియొక్క, మాయజ్గళ్ - ఆశ్చర్యచేష్టితములను, నినైక్కుమ్-ధ్యానింపఁదగిన, నెఞ్జుడైయేన్ - మనస్సుకలవాఁడనైతిని. ఇని - ఇఁక మీఁద, ఏనక్కు - నాకు, నీళ్ నిలత్తు - విశాలమైన భూమియందు, నిగర్ - ఒప్పైనవారు, ఆర్ - ఎవరు?

తా॥ భక్తులయొక్క దుఃఖమును సహింపక అతిహేయమైన మనుష్యయోనిలో నవతరించి శత్రువులను సంహరించిన శ్రీకృష్ణచరిత్రములను ధ్యానించుచున్న నాకెవ్వరును సమానులుకారని. ౭.

నీణిలత్తొడువాన్ వియప్ప నిఱైపెరుమ్పోర్ గళ్ శెయ్దు*
వాణనాయిరమ్తోళ్ తుణిత్తదుముట్పడ మఱ్ఱుమ్పల*
మాణియాయ్నిలమ్కొణ్డమాయ నెన్నప్పన్తన్మాయజ్గళే*
కాణుమ్నెఞ్జుడైయే నెనక్కినియెన్నకలక్కముణ్డే. ౮.

అ॥ నీళ్ నిలత్తొడు - విశాలమైనభూమియందున్నవారితోఁగూడ, వాన్ - దేవలోకమందున్నవారు, వియప్ప - ఆశ్చర్యపడునట్లు, నిఱై - (సేనలతో) నిండియున్న, పెరుమ్పోర్గళ్ - గొప్పయుద్ధములను, శెయ్దు - చేసి, వాణన్ - బాణాసురునియొక్క, ఆయిరమ్తోళ్ - వెయ్యిభుజములను, తుణిత్తదుముట్పడ - ఛేదించినది మొదలైన, మఱ్ఱుమ్ పల, ఇఁక ననేకవిధములై, మాణియాయ్ - బ్రహ్మచారియై, నిలమ్కొణ్డ - భూమిని స్వీకరించిన, మాయన్ - కృత్రిముఁడైన, ఎన్నప్పన్తన్-నాస్వామియొక్క, మాయజ్గళ్ - ఆశ్చర్యకరంబులైన చేష్టితములను, కాణుమ్ - అనుభవింపఁదగిన, నెఞ్జుడైయేన్ - మనస్సుకలవాఁడనైతిని. ఎనక్కు - నాకు, ఎన్న - ఏమి, కలక్కమ్ - అజ్ఞానము, ఉణ్డు - కలదు?

తా॥ దేవమనుష్యాదులందఱు నాశ్చర్యపడునట్లు బాణాసురునియొక్క వెయ్యిభుజములను ఛేదించిన శ్రీకృష్ణునియొక్క దివ్యచరిత్రముల ననుభవించుచున్న నాకొక యజ్ఞానమును లేదని. ౮.

కలక్కవేழ்కడలేழ் మలైయుల గేழுమ్కழிయక్కడాయ్*
ఉలక్కత్తేర్కొడుశెన్ఱమాయము ముట్పడమఱ్ఱుమ్పల*
వలక్కైయాழிయిడక్కైచ్చజ్గ మిఱైయుమ్మాల్వణ్ణనై*
మలక్కునావుడైయేఱ్కు మాఞాలత్తోవిమ్మణ్ణిల్ మిక్కైయే. ౯.

అ॥ ఏழ் కడల్ - సప్తసముద్రములును, ఏழ் మలై - సప్తకులాచలమును, ఏழுలగు - సప్తలోకములును, కలక్క - ఒకతిరున, కழிయ - వెనుకపడునట్లు, కడాయ్ - నడిపించి, తేర్

కొడు - రథముతోఁగూడ, ఉలక్కు - సొంతముగా, శెన్ఱ - పోయిన, మాయమ్ - ఆశ్చర్యమును, ఉట్పడ - ఇది మొదలుగాగల, మఱ్ఱుమ్ ఎప్పల - ఇంకననేకవిధములైన వ్యాపారమునున్ను, వలక్కై - కుడిచేతులో, ఆழி - సుదర్శనమునున్ను, ఇడక్కై - ఎడమచేతులో, శజ్గమ్ - శ్రీపాంచజన్యమునున్ను, ఇవైయుడై - వీనినిగల, మాల్ - శ్యామమైన, వణ్ణనై - కాన్తిగల శ్రీకృష్ణుని, మలక్కు - ఆనందింపించుచున్న, నావుడైయేఱ్కు - నాలిక (స్తోత్రము) గలనాకు, ఇమ్మణ్మిశై - ఈభూలోకమందు, మాఱు - ఎదురైనవారు, ఉళరో - ఉన్నారా?

తా॥ వైదికబ్రాహ్మణునికొఱకై తేరుమీదనెక్కుకొనియీ లీలావిభూతి దాటిపోయిపరమపదమునందున యాబ్రాహ్మణపుత్రులను దెచ్చిన శ్రీకృష్ణుని స్తుతించుచున్న నాకుసమానులెవరులేరని.

మణ్మిశై ప్పెరుమ్పారమ్నీజ్గ వోర్ పారదమాపెరుమ్పోర్
పణ్ణి*మాయజ్గళ్ శెయ్దు శేనైయైప్పాழ్పడ నూழ்ఱిట్టుప్పోయ్*
విణ్మిశై త్తనతామమేపుగ మేవియశోదితన్ తాళ్*
నణ్ణినాన్ వణజ్గప్పెఱ్ఱేనెనక్కార్ పిఱర్నాయగరే. ౧౦

అ॥ మణ్మిశై - భూమియందలి, పెరుమ్పారమ్ - గొప్పభారము, నీజ్గ - తొలఁగునట్లు, ఓర్ - అద్వితీయమైన, పారదమా - భారతమనెడి, పెరుమ్పోర్ - గొప్పయుద్ధమును, పణ్ణి - చేసి, మాయజ్గళ్ శెయ్దు - కృత్రిమములనుజేసి, శేనైయై - సేనలను, పాழ్పడ - నశించునట్లు, నూழ్ఱిట్టు - యోచించి, (తరువాత), విణ్మిశై - పరమపదమందు, పోయ్ - వేంచేసి, తనతామమ్ - తనదివ్యతేజస్సునందు, పుగ - ప్రవేశించునట్లు, మేవియ - చేసిన, శోదితన్ - తేజోరూపుఁడైన శ్రీకృష్ణునియొక్క, తాళ్ - శ్రీపాదములను, నణ్ణి - పొంది, నాన్ - నేను, వణజ్గప్పెఱ్ఱేన్ - ఆశ్రయింపదగిన భాగ్యమును లభించితిని. ఎనక్కు - నాకు, పిఱరార్ - వేఱెవరు, నాయగర్ - నియామకు లగుదురు?

తా॥ ఆసురప్రకృతులైన రాజులచేనిండియున్న భూమియొక్క భారమును బోగొట్టుటకై యవతరించి యారాజులను నశింపఁజేసి తిరిగి పరమపదమునకు వేంచేసిన శ్రీకృష్ణుని శ్రీపాదము నాశ్రయించిన నాకు మఱియొకరు నియామకులుకారని. ౧౦

⁂ నాయగన్ ముழுవేழுలగుక్కుమాయ్ ముழுవేழுలగుమ్*తన్
వాయగమ్పుగవైత్తుమిழ்న్దవైయా యవైయల్లనుమాయ్*
కేశవనడియిణైమిశై క్కురుగూర్చ్చడగోపన్ శొన్న*
తూయవాయిరత్తిప్పత్తాల్ పత్తరావర్తువళ్విన్ఱియే. ౧౧.

అ॥ ముழுవేழுలగుక్కుమ్ - సంపూర్ణమైన సప్తలోకములకును, నాయగనాయ్ - స్వామియై, ముழுవేழுలగుమ్ - సంపూర్ణమైన సప్తలోకములను, తన్ వాయగమ్ - తననోటిలో, పుగవైత్తు - ప్రవేశింపఁజేసి (మ్రింగి), ఉమిழ்న్దు - బయలుపఱచి, అవైయాయ్ - ఆలోకముల కన్తర్యామియై, అవైయల్లనుమాయ్ - వానియొక్కదోషములులేనివాడునైన, కేశవన్ - కేశవునియొక్క, అడియిణైమిశై - శ్రీపాదద్వన్ద్వములమీద, కురుగూర్ చ్చడగోపన్ - కురుకాపురా

ధీశులైనవమ్మాழ்వార్లు, శొన్న-పాడించిన, తూయ - నిర్దుష్టంబులైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తాల్ - ఈపదిపాశురములచే, తువళిల్ - దోషములేనివారై, పత్తరావర్-భక్తులగుదురు.

తా॥ శ్రీకృష్ణవిషయమైన యీపదిపాశురముల నభ్యసించువారు శ్రీకృష్ణునియందు మిక్కిలి భక్తిగలవారగుదురని. ౧౧

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్

జీయర్ తిరువడిగళేశరణమ్

## ౫_వ, తిరువాయ్మొழி

అవతారిక—ఆళ్వార్లిదువఱలో మానసికముగా ననుభవించిన భగవద్గుణములను బ్రత్యక్షముగా ననుభవింప యాశించి యొకనాయికావస్థనుబొంది తొలైవిల్లిమఙ్గలమందు వేంచేసియున్న శ్రియఃపతివిషయమై యతిప్రావణ్యము గలవారై యుండగా నప్పుడానాయికియొక్క తల్లులువచ్చి యింతయాశనీకుఁగూడదని కోపగింపగా, ఆనాయికయొక్క సఖియలు ఆతల్లులనుజూచి, ఈమెకీ యాశనివర్తించదు, మీరీమెయందాశను వదలుకొనుఁడని చెప్పినమాటలను పాడించుచున్నారు.

౹౹ తువళిల్ మామణిమాడమోఙ్గు తొలైవిల్లిమఙ్గలమ్తొழுదు
ఇవళై *నీరినియన్నైమీర్ ఉమక్కాశైయిల్లైవిడుమినో*
తవళవొణ్ శఙ్గుశక్కరమెన్ఱుమ్ తామరైత్తడఙ్గణెన్ఱుమ్*
కువళై యొణ్ మలర్క్కణ్ణాల్ నీర్మల్గ నిన్ఱునిన్ఱుకుముఱుమే. ౧.

అ॥ అన్నైమీర్ - ఓయమ్మలారా! తువళిల్-నిర్దుష్టంబులై, మా - శ్లాఘ్యములైన, మణి రత్నములచేనిర్మింపఁబడిన, మాడమ్ - గృహములు, ఓఙ్గు - పైకి పెరుగుచున్న, తొలైవిల్లిమఙ్గలమ్ - తొలైవిల్లిమఙ్గలమనెడు దివ్యదేశమును, తొழுదు - ఆశ్రయించుచున్న, ఇవళై - ఈపెను, (మఱలించుటనెడి), ఆశై - ఆశ, ఇని - ఇఁకమీద, ఉమక్కు - మీకు, ఇల్లై - లేదు, విడుమినో - (ఈపెను) విడువుడి. తవళమ్ - తెల్లనై, ఒణ్ - సుందరమైన, శఙ్గు - శ్రీపాంచజన్యము, శక్కరమ్ - సుదర్శనము, ఎన్ఱుమ్ - అనియు, తామరై - పద్మమువంటి, తడమ్ - విశాలమైన, కణ్ - నేత్రము, ఎన్ఱుమ్ - అనియు, (చెప్పి), కువళై - నల్లకలువయొక్క, ఒణ్ - అందమైన, మలర్ - పుష్పములవంటి, కణ్ణాల్ - నేత్రములచేతను, నీర్మల్గ - నీళ్ళునిండునట్లు, నిన్ఱునిన్ఱు-నిరంతరముగానుండి, కుముఱుమ్ - లోపలనే తడమాఱుచున్నది.

తా॥ ఓతల్లులారా! తొలైవిల్లిమంగలము నాశ్రయించి, యచ్చటవేంచేసియున్న శ్రియఃపతియొక్క దివ్యసౌందర్యము ననుభవించి బాష్పముఖియై తనస్వాధీనములేక తడమాఱుచున్న యీపెను మీరిఁకమీద స్వాధీనపఱచుకొనుట యసాధ్యము; గాన ఆయాశను వదలుఁడని. ౧.

కుముఱుమోశై విழவొలి తొలైవిల్లిమఙ్గలమ్కొణ్డుపుక్కు*
అముదమెన్మొழிయాళై నీరుమక్కాశై యిన్ఱియగత్తిరీర్*

తిమిర్ కొణ్డాలొత్తునిఱ్కుమ్ మఱ్ఱివళ్ తేవతేవపిరానెన్ఱే*
నిమియుమ్వాయొడుకణ్గళ్ నీర్ మల్గ నెక్కొశిన్దుకరైయుమే. ౨.

అ॥ కుముఱుమ్ - ఒకటికొకటి భేదము తెలియకుండ వర్ధిల్లుచున్న, ఓశై - వేదాధ్యయన నృత్తగీతాదుల) ఘోషములుగల, విழవు - ఉత్సవమందలి, ఒలి - కోలాహలధ్వనిగల, తొలైవిల్లి మఙ్గలమ్ - తొలైవిల్లిమఙ్గలమునకు, కొణ్డు - తీసికొనిపోయి, పుక్కు - ప్రవేశించి, అముదమ్ - అమృతమువలె, ఇన్ - భోగ్యమైన, మొழியాళై - మాటగలయీపెను, ఉమక్కు - మీకు, ఆశైయిన్ఱి - (ఈపెయొక్క మధురాలాపము వినుటకు) ఆశలేకపోవుటచేత, నీర్ - మీరు, అగఱ్ఱినీర్ - విడిచితిరి (అస్వాధీనురాలైచేసికొనిరి). ఇవళ్ - ఈపె, తిమిర్కొణ్డాలొత్తు - స్తబ్ధురాలయినట్లు, నిఱ్కుమ్ - (నిశ్చేష్టురాలై) ఉండును మఱ్ఱు - మఱియు, తేవతేవర్ - నిత్యసూరులకు దేవతలైన విష్వక్సేనాదులకు, పిరాన్ - స్వామి, ఎన్ఱే - అనియే, నిమిరుమ్ - (చెప్పుటకుశక్తిలేక) చలించుచున్న, వాయొడు - అధరముతోఁగూడ, కణ్గళ్ - నేత్రములలో, నీర్ మల్గ - నీళ్ళునిండునట్లు, నెక్కు - శిథిలురాలై, ఒశిన్దు - పరవశయై, కరైయుమ్ - కరుగుచున్నది.

తా॥ ఒతల్లులారా! మీరు తొలైవిల్లిమంగలమందు మహోత్సవమున కీపెను గొనికొనివెళ్ళగా నచ్చటనున్న కోలాహలమునువిని నది మొదలగు ఈపె ఇతర వ్యాపారములను వదలి నిశ్చలముగానుండి భగవద్గుణములను స్మరించి కరుగుచున్నది. ఈపెయొక్క మధురాలాపమును వినుటకుఁ గూడ ప్రాప్తిలేకుండునట్లు ఈయనర్థమును మీరే చేసికొంటిరియని. ౨.

కరైకొళ్ పైమ్పొழிల్ తణ్పణై త్తొలైవిల్లిమఙ్గలమ్ కొణ్డుపుక్కు*
ఉరైకొళ్ ఇన్మొழியాళై నీరుమక్కాశైయిన్ఱియగఱ్ఱినీర్*
తిరైకొళ్ పౌవత్తుచ్చేర్న్దదుమ్ తిశైయిఞాలమ్ తావియళన్దదుమ్*
నిరైగళ్ మేయ్త్తదుమే పిదఱ్ఱి నెడుఙ్గణ్ణీర్ మల్గనిఱ్కుమే. 3.

అ॥ కరైకొళ్ - నదీతీరమును కబళీకరించుచున్న (వ్యాపించియున్న), పై - విశాలమైన, పొழிల్ - తోటలును, తణ్ - చల్లనైన, పణై - కొలనులనుగల, తొలైవిల్లిమఙ్గలమ్ - తొలైవిల్లిమఙ్గలమునకు, కొణ్డుపుక్కు - తీసికొనిప్రవేశించి, ఉరైకొళ్ - స్తోత్రములుకొనియాడతగిన, ఇన్ - మధురమైన, మొழியాళై - మాటలుగలయీపెను, ఉమక్కు - మీకు. ఆశైయిన్ఱి - ఆశలేకనే, నీర్ - మీరు, అగఱ్ఱినీర్ - దూరముగాఁజేసికొనిరి - తిరైకొళ్ - అలలుగల, పౌవత్తు - సముద్రమును, శేర్న్దదుమ్ - చేరినదానినియు, తిశై - దిక్కులతోఁజేరిన, ఞాలమ్ - భూమిని, తావి - క్రమముగా పెరిగి, అళన్దదుమ్ - కొలిచినదానినియు, నిరైగళ్ - ఆవులను, మేయ్త్తదుమే - మేపినదానినియునే, పిదఱ్ఱి - జల్పించి, నెడుమ్కణ్ - విశాలనేత్రమందు, నీర్ మల్గ - నీళ్ళునిండునట్లు, నిఱ్కుమ్ - (ఈపె స్తబ్ధురాలై) ఉన్నది.

తా॥ తోటలచేతను తటాకములచేతనునిండి రమణీయమైయున్న తొలైవిల్లిమంగలమునకు మీరు తీసికొనివెళ్ళగా, ఈపె యచ్చటవేంచేసియున్న శ్రియఃపతియొక్క దివ్యగుణములయందు మగ్నురాలై మీకు స్వాధీనముకాకపోయినది. ఈయనర్థమును మీరే తెచ్చుకొంటిరియని 3.

నిఱ్కుమ్నాన్మఱై వాణర్ వాழ் తొలైవిల్లిమఙ్గలమ్కణ్డపిన్*
అఱ్కుమొన్ఱుమఱిహి లాళ్ మరియాదైక్కణ్డీర్ ఇవళన్నైమీర్*
కఱ్కుమ్ కల్వియెల్లామ్ కరుఙ్కడల్ వణ్ణన్ కణ్ణపిరానెన్ఱే*
ఒఱ్కమొన్ఱుమిలళుగన్దుగన్దుమగిழ்న్దు కుழైయుమే. ౪.

అ॥ నిఱ్కుమ్ - నిత్యమైయున్న, నాన్మఱై - నాలుగువేదములుగల, వాణర్ - బ్రాహ్మణులు, వాழ் - వాసముచేయుచున్న, తొలైవిల్లిమఙ్గలమ్ - తొలైవిల్లిమఙ్గలమును, కణ్డపిన్ - చూచినతరువాత, ఒన్ఱుమ్ - ఒకవిధమైనను, అఱ్కుమ్ - స్త్రీత్వమర్యాదను (పెద్దలవలనుపదేశింపబడినను), అఱి - కొంచెమైనను, ఉళాళ్ - పొందకుండనున్నది, అన్నైమీర్ - ఓతల్లులారా! ఇవళ్ - ఈమె, మరియాదై కణ్డీర్ - మర్యాదనతిక్రమించినదిచూచితిరా. కఱ్కుమ్ - అభ్యసించుచున్న, కల్వియెల్లామ్ - మాటలన్నియు, కరు - శ్యామమైన, కడల్వణ్ణన్ - సముద్రముబంటికాంతిగల, కణ్ణపిరాన్ - శ్రీకృష్ణస్వామి, ఎన్ఱే - అనియే, (చెప్పును), ఒఱ్కమ్ - సిగ్గు, ఒన్ఱుమ్ - కొంచెమైనను, ఇలళ్ - లేనిదై, ఉగన్దుగన్దు - మిక్కిలిసన్తోషించి, ఉళ్ - హృదయమందు, మగిழ்న్దు - ప్రీతురాలై కుழైయుమ్ - శిథిలురాలగుచున్నది

తా॥ ఓతల్లులారా! ఈమె తొలైవిల్లిమఙ్గలమును చూచినప్పటినుంచి మీమాటలనువినక స్వతన్త్రురాలై శ్రియఃపతియొక్క తిరునామములనే యెల్లప్పుడు ననుసంధించుచు మిక్కిలి సన్తోషమునొంది మీరున్నారనికూడ జూడక సిగ్గులేని వ్యాపారములను జేయుచున్నదని ౪.

కుழைయుమ్వాళ్ ముగత్తేழைయై త్తొలైవిల్లిమఙ్గలమ్కొణ్డుపుక్కు*
ఇழైకొళ్ శోదిచ్చెన్దామరైక్కణ్ పిరానిరున్దమై కాట్టినీర్*
మழைపెయ్‌దాలొక్కుమ్ కణ్ణనీరినొడన్ఱుతొట్టుమ్ మైయాన్దు*ఇవళ్
నుழైయుమ్ శిన్దైయళన్నైమీర్ తొழுమత్తిశై యుత్తు నోక్కియే. ౫.

అ॥ కుழைయుమ్ - (తనమృదుస్వభావముచే) శిథిలురాలైన, వాళ్ ముగత్తు - సుందరముఖముగల, ఏழைయై - (భగవద్గుణమందు) అతిచపలురాలైన యీమెను, తొలైవిల్లి మఙ్గలమ్ - తొలైవిల్లి మఙ్గలమును, కొణ్డుపుక్కు - తీసికొనిపోయి ప్రవేశించి, ఇழைకొళ్ - ఆభరణములచేఁగలిగిన, శోది - తేజస్సును, శెమ్‌తామరై - ఎఱ్ఱతామరవంటి, కణ్ - నేత్రములనుగల, పిరాన్ - స్వామి, ఇరున్దమై - వేంచేసియున్న విధమును, కాట్టినీర్ - చూపిరి. అన్నైమీర్ - ఓతల్లులారా! అన్ఱుతొట్టుమ్ - అదిమొదలగు, ఇవళ్ - ఈమె, మழைపెయ్‌దాలొక్కుమ్ - వర్షధారతో సమానమైన, కణ్ణనీరినొడు - కంటినీళ్ళతో, మైయాన్దు - భ్రమించి, నుழைయుమ్ - (భగవద్గుణముల యందు) అవగాహించుచున్న, శిన్దైయళ్ - మనస్సుకలదై, అత్తిశై - ఆదిక్కును, ఉత్తు - ఏకాగ్రముగా, నోక్కి - చూచి, తొழுమ్ - అంజలిచేయును.

తా॥ ఓతల్లులారా! మీరీమెను దీసికొనిపోయి తొలైవిల్లిమంగలమందు వేంచేసియున్న శ్రియఃపతిని చూపించినప్పటినుంచి వానిగుణములయందేమునుగ్నురాలై యాదిక్కునుజూచి దండమ్ సమర్పించుచున్నదని. ౫.

నోక్కుమ్పక్కమెల్లామ్ కరుమ్బొడు శెన్నెల్ ఓఙ్గు శెన్దామరై *
వాయ్క్కుమ్తణ్ పొరునల్ వడకరై వణ్ తొలైవిల్లిమఙ్గలమ్*
నోక్కుమేల్ అత్తిశైయల్లాల్ మఱునోక్కిలళ్ వైగల్ నాడొఱుమ్*
వాయ్కొళ్ వాశగముమ్ మణివణ్ణన్ నామమేయివళ్ అన్నైమీర్. ౬.

అ॥ నోక్కుమ్పక్కమెల్లామ్ - చూచినచోటంతయు, కరుమ్బొడు - చెరుకుతోఁగూడ, శెన్నెల్ - ఎఱ్ఱధాన్యమును, ఓఙ్గు - ఉన్నతమైయున్న, శెన్దామరై - ఎఱ్ఱతామరయు, వాయ్క్కుమ్ - సమృద్ధమైయున్న, తణ్ - చల్లనైన, పొరునల్ - తామ్రపర్ణియొక్క, వడకరై - ఉత్తరతీరమందున్న, వణ్ - సుందరమైన, తొలైవిల్లిమఙ్గలమ్ - తొలైవిల్లిమంగలమును, నోక్కుమేల్ - చూచినయెడల, అత్తిశైయల్లాల్ - ఆదిక్కుతప్ప, మఱునోక్కిలళ్ - మఱియొక వస్తువునుజూడదు. అన్నైమీర్ - ఓతల్లులారా! వైగల్ నాడొఱుమ్ - గడుచుచున్న దినమంతయు, ఇవళ్ - ఈపెయొక్క, వాయ్కొళ్ - నోటితో జెప్పుచున్న, వాశగముమ్ - మాటలును, మణి - నీలరత్నమువంటి, వణ్ణన్ - కాన్తిగల శ్రియఃపతియొక్క, నామమే - తిరునామములైయే యుండును.

తా॥ ఓతల్లులారా! చెరుకుతోటలచేతను, ధాన్యముపండియున్న పొలములచేతను, తామర చెరువులచేతను నిండి యతిరమణీయమైన, తిరుపొరునల్ నదికి యుత్తరగట్టునందున్న తొలైవిల్లి మంగలమునువదలి యీపె మఱియొకదానిని జూడదు. ఆశ్రియఃపతియొక్క తిరునామములుతప్ప మఱియొకమాటను జెప్పదని ౬.

అన్నైమీర్ అణిమామయిల్ శిఱుమానివళ్ నమ్మైక్కైవలిన్దు*
ఎన్నవార్త్తైయుమ్ కేట్కుఱాళ్ తొలైవిల్లిమఙ్గలమెన్నల్లాల్ *
మున్నమ్ నోఱ్ఱవిదికొలో ముగిల్ వణ్ణన్ మాయఙ్గొలో*అవన్
శిన్నముమ్ తిరునామముమ్ ఇవళ్ వాయనగళ్ తిరున్దవే. ౭.

అ॥ అన్నైమీర్ - ఓతల్లులారా! అణి - అందమైన, మా - కాన్తిగల, మయిల్ - నెమలి వలెనున్న, శిఱుమాన్ - చిన్నలేడివలెనున్నున్న, ఇవళ్ - ఈపె, నమ్మై - మనలను, క్కైవలిన్దు - అతిక్రమించి, తొలైవిల్లిమఙ్గలమ్ ఎన్నల్లాల్ - తొలైవిల్లిమఙ్గలమనెడిమాటతప్ప, ఎన్నవార్త్తైయుమ్ - ఏమాటలను, కేట్కుఱాళ్ - వినదు. మున్నమ్ - జన్మాన్తరమందు, నోఱ్ఱ - చేసిన, విదికొలో - భాగ్యమో? ముగిల్ వణ్ణన్ - మేఘమువంటికాన్తిగల శ్రీకృష్ణునియొక్క, మాయఙ్గొలో - ఆశ్చర్య చేష్టితమో? అవన్ - ఆశ్రియఃపతియొక్క, శిన్నముమ్ - చిహ్నములును, తిరునామముమ్ - తిరునామములును, తిరున్ద - స్వచ్ఛముగుటకై, ఇవళ్ - ఈపెయొక్క, వాయనగళ్ - నోటిలోనున్నవి.

తా॥ ఓతల్లులారా! ఈపె తొలైవిల్లిమంగలమనెడి మాటతప్ప మనమాటలను వినదు. ఇది యీపెయొక్క జన్మాన్తరమందుజేసిన పుణ్యమో? నిర్హేతుక భగవత్కృపయో తెలియుటలేదని ౭.

తిరున్దువేదముమ్ వేళ్వియుమ్ తిరుమామగళిరున్దామ్*మలి
న్దిరున్దువాழ் పొరునల్ వడకరై వణ్ తొలైవిల్లిమఙ్గలమ్*

కరున్దడఙ్కణ్ణికై తొழுద వన్నాళ్ తొడఙ్గియిన్నాళ్ తొఱుమ్* ఇరు
న్దిరున్దరవిన్దలోచన వెన్ఱెన్ఱే నైన్దిరఙ్గుమే. ౮.

అ॥ తిరున్దు - సుశిక్షితమైన, వేదముమ్ - వేదమును, వేళ్వియుమ్ - యాగమును, మా - శ్లాఘ్య మైన, తిరుమగళిరుమ్ - శ్రీమహాలక్ష్మియు, తామ్ - తాము, మలిన్దిరున్దు - సమృద్ధమైయుండి, వాழ் - శోభిల్లుచున్న, పొరునల్ వడకరై - తిరుప్పొరునల్ నదియొక్క ఉత్తరగట్టునందున్న, వణ్ - సుందరమైన, తొలైవిల్లిమఙ్గలమ్ - తొలైవిల్లిమఙ్గలమును, కరు - నల్లనైన, తడమ్ - విశాలమైన, కణ్ణి - నేత్రములుగలయీమె, కైతొழுద - చేతులచే సేవించిన, అన్నాళ్ తొడఙ్గి - అనాటిమొదలుగు, ఇన్నాళ్ తొఱుమ్ - ఇదివఱకు, ఇరున్దిరున్దు - చిరకాలముండి, అరవిన్దలోచన - అరవిందలోచనుడా! ఎన్ఱెన్ఱే - అనిపలుమాఱు అనుసంధించి, నైన్దు - శిథిలురాలై, ఇరఙ్గుమ్ - బాధపడుచున్నది.

తా॥ ఓతల్లులారా! ఈమె తొలైవిల్లిమఙ్గలము నాశ్రయించి నప్పటినుంచి శ్రియఃపతి యొక్క తిరునామములనే జెప్పుచు ఖేదించుచున్నదని ౮.

ఇరఙ్గినాళ్ తొఱుమ్ వాయ్ వెరీఇ యివళ్ కణ్ణనీర్ గళలమర*
మరఙ్గళుమిరఙ్గుమ్ వగై మణివణ్ణవో వెన్ఱుకూవుమాల్*
తురఙ్గమ్ వాయ్ పిళన్దాన్ ఉఱై తొలైవిల్లిమఙ్గలమెన్ఱు* తన్
కరఙ్గళ్ కూప్పిత్తొழுమ్ అవ్వూర్ త్తిరునామమ్ కఱ్ఱదఱ్పిన్నైయే. ౯.

అ॥ ఇవళ్ - ఈమె, నాళ్ తొఱుమ్ - ప్రతిదినమును, ఇరఙ్గి - బాధపడుచు, వాయ్ వెరీఇ - జల్పించి, కణ్ణనీర్ గళ్ - కంటినీళ్ళు, అలమర - కారుచుండగా, మరఙ్గళుమ్ - వృక్షములుగూడ, ఇరఙ్గుమ్ వగై - దయచేయునట్లు, మణి - రత్నమువంటి, వణ్ణవో - కాంతిగలవాడా! ఎన్ఱు - అని, కూవుమ్ - అతిచిపిలుచుచున్నది. తురఙ్గమ్ - గుఱ్ఱమైవచ్చినకేశియొక్క, వాయ్ - నోటిని, పిళన్దాన్ - చీల్చినశ్రీకృష్ణుడు, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, తొలైవిల్లిమఙ్గలమ్ ఎన్ఱు - తొలైవిల్లిమఙ్గలము అని, అవ్వూర్ తిరునామమ్ - ఆదివ్యదేశముయొక్క తిరునామమును, కఱ్ఱదఱ్పిన్నై - చెప్పినతరువాత, తన్ కరఙ్గళ్ - తన చేతులను, కూప్పి - జోడించి, తొழுమ్ - ఆశ్రయించును.

తా॥ ఈమె నేత్రములలోనుంచి నీళ్ళను ప్రవహింపజేయుచు శ్రియఃపతియొక్క తిరునామములనే చెప్పును. ఆ దివ్యదేశముయొక్క తిరునామములను జెప్పి నమస్కరించుననె. ౯.

పిన్నైకొల్ నిలమామగళ్ కొల్ తిరుమగళ్ కొల్ పిఱన్దిట్టాళ్*
ఎన్నమాయఙ్గొలో ఇవళ్ నెడుమాలెన్ఱే నిన్ఱుకూవుమాల్*
మున్నివన్దవన్నిన్ఱిరున్దుఱైయుమ్ తొలైవిల్లిమఙ్గలమ్
సెన్నియాల్ వణఙ్గుమ్* అవ్వూర్ త్తిరునామఙ్గేట్పదు శిన్దైయే. ౧౦.

అ॥ పిన్నైకొల్ - నప్పిన్నపిరాట్టియో? నిలమ్ - భూమికి నిర్వాహకురాలై, మా - శ్లాఘ్యురాలైన, మగళ్ కొల్ - భూమిప్పిరాట్టియో? తిరుమగళ్ కొల్ - శ్రీమహాలక్ష్మియో? పిఱన్దిట్టాళ్ - అవతరించెను. ఎన్న మాయఙ్గొలో - ఏమాశ్చర్యమో? ఇవళ్ - ఈమె, నెడుమాలెన్ఱే - ఆశ్రితవ్యామోహుడనియో, నిన్ఱు - ఏకాగ్రముగానుండి, కూవుమ్ - అతిచిపిలుచును. అవన్ - ఆసర్వేశ్వ

రుఁడు, మున్నివన్దు - మునుపువచ్చి, నిన్ఱు - ఉండి, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్న, తొలైవిల్లి మఙ్గలమ్ - తొలైవిల్లిమఙ్గలమును, శెన్నియాల్ - శిరస్సుచే, వణఙ్గుమ్ - నమస్కరించును. అవ్వూర్ తిరునామమ్ - ఆ దివ్యదేశముయొక్క తిరునామమును, కేట్పదు - వినుటయందు, శిన్దై - మనస్సుకలదై యుండును.

తా॥ ఈపెయొక్క భగవద్గుణానుభవమందభినివేశమును జూచినయెడల శ్రీభూనీళాదేవులలో నొకరియొక్క యవతారమైయుండవచ్చునని తోచుచున్నది. ఆ దివ్యదేశముయొక్క తిరునామమును వినుటయందే యీపె యాసక్తురాలై యుండునని. ౧౦.

౹౹ శిన్దైయాలుమ్శొల్లాలుమ్ శెయ్గైయినాలుమ్తేవపిరానైయే*
తన్దైతాయెన్ఱడైన్ద వణ్కురుగూరవర్ శడగోపన్*
మున్దైయాయిరత్తుళ్ళివై తొలైవిల్లిమఙ్గలత్తైచ్చొన్న*
శెన్దమిழ் పత్తుమ్వల్లార్ అడిమైశెయ్వార్ తిరుమాలుక్కే. ౧౧.

అ॥ తేవపిరానైయే - దేవదేవుఁడైన శ్రియఃపతినే, తన్దై తాయెన్ఱు - తండ్రి తల్లి అని, శిన్దైయాలుమ్ - మనస్సుచేతను, శొల్లాలుమ్ - వాక్కుచేతను, శెయ్గైయినాలుమ్ - కాయముచేతను, అడైన్ద - పొందినవారై, వణ్ - సుందరమైన, కురుగూరవర్ - కురుకాపురికిస్వామియునైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, తొలైవిల్లిమఙ్గలత్తై - తొలైవిల్లిమఙ్గలవిషయమై, శొన్న - ప్రసాదించిన, మున్దై - అనాదియైనవేదార్థమును బ్రతిపాదించెడి, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో జేరిన, శెన్దమిழ் - సుందరమైన, (సుఖముగా అర్థమునుబోధించుచున్న) ద్రావిడరూపమైన, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, తిరుమాలుక్కు - శ్రియఃపతికి, అడిమైశెయ్వార్ - కైఙ్కర్యముజేయుదురు

తా॥ శ్రియఃపతినే సకలవిధబంధువని మనోవాక్కాయములచే నాశ్రయించిన నమ్మాழ்వార్లు ప్రసాదించిన తొలైవిల్లిమఙ్గలవిషయమైన యీ పదిపాశురముల నభ్యసించువారు భగవత్కైంకర్యమును లభించుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౭ - ౪, తిరువాయ్మొழி.

---

అవతారిక:— ఇంత వ్యామోహముకలిగినప్పటికిన్ని భగవదనుభవము సిద్ధించకపోవుటచే తిరుమేనుకృశించి ఆభరణాదులు జారిపోయినవని ప్రతిపాదించుచున్నారు

౹౹ మాలుక్కు వైయమళన్ద మణాళర్కు*
నీలక్కరునిఱ మేగనియాయఱ్కు*
కోలచ్చెన్దామరైక్కణ్ణఱ్కు* ఎన్ కొఙ్గలర్
ఏలక్కుழలి యిழన్దదు శఙ్గే. ౧.

అ॥ మాలుక్కు - ఆశ్రితవ్యామోహముగలవాఁడై, వైయమ్ - భూమిని, అళన్ద-కొలిచిన, మణాళఱుక్కు - నాయకుఁడై, నీలమ్ - స్నిగ్ధమై, కరు - శ్యామమైన, నిఱమ్ -వర్ణముగల, మేగమ్- మేఘముయొక్క, నియాయఱుక్కు - ప్రకారముగల (మేఘములో సమానుఁడైన) వాఁడై, కోలమ్- అందమై, శెమ్ - ఎఱ్ఱనైన, తామరై - పద్మమువంటి, కణ్ణఱుక్కు - నేత్రముగలవాఁడైన, శ్రియఃపతిని యాశపడి, ఎన్ - నాకొమార్తెయై, కొఙ్గు - తేనెగల, అలర్ - పుష్పములచేనలంకరింపఁబడిన ఏలమ్ - ఏలమువలె పరిమళించుచున్న, కుఴలి - కొప్పుగలయీపె, శఙ్గు - కంకణమును, ఇఴన్దదు - పోగొట్టుకొనినది.

తా॥ త్రివిక్రమావతారంబెత్తి యాచరించిన దివ్యచేష్టితములను, తిరుమేనుసౌందర్యమును సేవింపనాశపడి కృశించిపోయిన యీపెయొక్క హస్తమందున్న కంకణములు జారిపోయినవని.

శఙ్గువిల్ వాళ్ తణ్డు శక్కరక్కైయఱుక్కు*
శెఙ్గనివాయ్చ్చెయ్య తామరైక్కణ్ణఱుక్కు*
కొఙ్గలర్ తణ్ణన్దుఴాయ్ ముడియానుక్కు*ఎన్
మఙ్గైయిఴన్దదు మామైనిఱమే. ౨.

అ॥ శఙ్గు - శ్రీపాఞ్చజన్యమునున్ను, విల్ - శార్ఙ్గమునున్ను, వాళ్ - నన్దకమునున్ను, తణ్డు - కౌమోదకినిన్ని, శక్కరమ్ - సుదర్శనమునున్ను, కైయఱుక్కు - శ్రీహస్తమందుఁగలవాఁడును, శెమ్ - ఎఱ్ఱనైన, కని - దొండపండువలెనున్న, వాయ్ - అధరమునున్ను, శెయ్య - ఎఱ్ఱనైన, తామరై - పద్మమువంటి, కణ్ణఱుక్కు - నేత్రమునున్నుగలవాఁడును, కొఙ్గు - తేనె, అలర్- వ్యాపించియున్న, తణ్ - చల్లనైన, అమ్ - అందమైన, తుఴాయ్ - తిరుత్తుఴాయిమాలగల- ముడియానుక్కు - కిరీటముగలవాఁడునైన శ్రియఃపతినియాశపడి, ఎన్ మఙ్గై - నాకొమార్తె, మామై - సుందరమైన, నిఱమ్ - కాన్తిని, ఇఴన్దదు - పోగొట్టుకొనినది.

తా॥ శ్రియఃపతియొక్క పఞ్చాయుధములనున్న, కిరీటము మొదలగు దివ్యాభరణములనున్న, అతిసుందరంబులైన నేత్రము మొదలగు దివ్యావయవములనున్న సేవింప నాశపడిన యీపెయొక్క శరీరము తెల్లపడిపోయినదని. ౨.

నిఱఙ్గరియానుక్కు నీడులగుణ్డ*
తిఱమ్కిళర్ వాయ్ చ్చిఱుక్కళ్వరవఱుక్కు*
కఱఙ్గియశక్కరక్కైయవనుక్కు*ఎన్
పిఱఙ్గిరుఙ్గూన్దలిఴన్దదు పీడే. 3.

అ॥ నిఱమ్కరియానుక్కు - శ్యామవర్ణముగలవాఁడును, నీడు - విశాలమైన, ఉలగు - లోకములను, ఉణ్డ - ఆరగించిన, తిఱమ్ - విధమును, కిళర్ - చెప్పుచున్న, (సూచనజేయుచున్న) వాయ్ - అధరముగల, శిఱు - బాలుఁడైన, కళ్వరవఱుక్కు - అపరిచ్ఛిన్నమహిమగలవాఁడును, కఱఙ్గియ - తిరుగుచున్న, శక్కరమ్ - సుదర్శనమును, కైయవనుక్కు - శ్రీహస్తమందుగలవాఁడునైన, శ్రియఃపతినియాశించి, ఎన్ - నాకొమార్తెయై, పిఱఙ్గు - నిబిడమై, ఇరు - దీర్ఘమైయున్న, కూన్దల్ - కేశపాశముగలయీపె, పీడు - మహిమను, ఇఴన్దదు - పోగొట్టుకొనినది.

తా॥ సకలలోకముల నారగించి వటపత్రమందు బవ్వళించియున్న శ్యామసుందరుఁడైన శ్రియఃపతిని సేవింపనాశపడి ఈపె తనమదింపును బోగొట్టుకొనెను. ౩

పీడుడై నాన్ముగనై ప్పడై త్తానుక్కు*
మాడుడై వైయమళన్ద మణాళఱ్కు*
నాడుడై మన్నర్క్కు త్తూదుశెల్ నమ్బిక్కు*ఎన్
పాడుడై యల్గుల్ ళిழన్దదుపణ్బే. ౪

అ॥ పీడుడై - మహాత్మ్యముగల, (జ్ఞానాదిపూర్ణుఁడైన) నాన్ముగనై - చతుర్ముఖుని, పడై త్తానుక్కు - సృజించినవాడును, మాడుడై - ధనముగల, వైయమ్ - భూమిని, అళన్ద - కొలిచిన, మణాళఱ్కు - నాయకుఁడును, నాడుడై - దేశముగల, మన్నర్క్కు - రాజులైనపఞ్చ పాణ్డవులకు, తూదుశెల్ - దూతయైవెళ్ళిన, నమ్బిక్కు - పూర్ణుఁడునైనశ్రియఃపతినియాశించి, ఎన్ - నాకొమార్తెయై, పాడుడై - విశాలమైన, అల్గుల్ - జఘనప్రదేశముగలయీపె, పణ్బు - (తన) స్వభావమును, ఇழన్దదు - పోగొట్టుకొనినది.

తా॥ చతుర్దశభువనములకు స్రష్టయైన బ్రహ్మనుసృజించిన గొప్పవాఁడైనను ఆశ్రితార్థమైదౌత్యము జేసినయతిసులభుఁడైనశ్రియఃపతినిసేవింపనాశించి యీపెతనస్వభావమునుబోగొట్టుకొనెనని.

పణ్బుడై వేదమ్పయన్ద పరనుక్కు*
మణ్పురై వైయమిడన్ద వరాగఱ్కు*
తెణ్పునల్ పళ్ళి యెమ్ తేవపిరానుక్కు*ఎన్
కణ్పునై కోదై యిழన్దదుకర్పే. ౫

అ॥ పణ్బుడై - (తత్త్వప్రతిపాదన) స్వభావముగల, వేదమ్ - వేదమును, పయన్ద - ఉపదేశించిన, పరనుక్కు - పరాత్పరుఁడును, మణ్పురై - మృత్తుచేతనధికమైన (కఠినమైన), వైయమ్ - భూమిని, ఇడన్ద - పెడలీసిన, వరాగఱ్కు - శ్రీవరాహావతారమెత్తినవాఁడును, తెణ్ - నిర్మలమైన, పునల్ - మహాజలమును, పళ్ళి - పడకగాగల, ఎమ్ తేవపిరానుక్కు - మనదేవనాథుఁడునైన, శ్రియఃపతినియాశపడి, ఎన్ - నాకొమార్తెయై, కణ్ - (చూచినవారియొక్క) నేత్రములను, పునై - కప్పుచున్న (సౌందర్యముచేనాకర్షించుచున్న), కోదై - మాలగలయీపె, కఱ్పు - జ్ఞానమును, ఇழన్దదు - పోగొట్టుకొనెను.

తా॥ మహాసముద్రమందు మునిగియున్న భూమిని వరాహావతారంబెత్తి యుద్ధరించియు, వేదములనుపదేశించియు చేతనులను మిక్కిలియుపకారకుఁడైన శ్రియఃపతిని సేవింపనాశపడి యీపెయేమియు తోచక భ్రమించిపోయినదని. ౫

కఱ్పుగకాఱ్ఱవన నఱ్పలతోళఱ్కు*
పొఱ్పుడైదర్క్కున్నన్న పూన్దణ్మడియఱ్కు*
నఱ్పలతామరై నాణ్మలర్ కైయఱ్కు*ఎన్
విఱ్పురువక్కొడి తోఱ్ఱదుమెయ్యే. ౬

అ॥ కఱ్పగక్కావన - కల్పకవృక్షములయొక్క తోపువలెనున్న, నల్ - విలక్షణములై, పల - అనేకములైన, తోళ్గళుక్కు - భుజములుగలవాఁడును, శుడర్ - ఉజ్జ్వలమైన, పొఱ్ఱుక్కుణ్ణ - స్వర్ణపర్వతమువలెనున్న, పూ - సుందరమైన, తణ్ - అనుకూలమైన, ముడియుక్కు - కిరీటముగలవాఁడును, నల్ - అందములైన, పల - అనేకములైన, తామరై - తామరయొక్క, నాళ్ - అభినవములైన, మలర్ - పుష్పములవంటి, కైగళుక్కు - చేతులుగలవాఁడునైన శ్రియఃపతివిషయమై, ఎన్ - నాకొమార్తెయై, విల్ - ధనస్సువలెనున్న, పురువమ్ - కనుబొమలుగలదై, కొడి - తీఁగెవలెనున్నయీపె, మెయ్ - శరీరము, తోఱ్ఱదు - పోఁగొట్టుకొనినది.

తా॥ శ్రియఃపతియొక్క బంగారుకొండవలె నత్యుజ్జ్వలమైనకిరీటమునున్ను, తామరపుష్పములవంటి హస్తములనున్ను, కల్పవృక్షములవంటి భుజములనున్ను సేవింపనాశపడిన యీపెకు శరీరముశిథిలమయినదని. ౯

మెయ్యమర్ పల్కలన్ నన్గణిన్దానుక్కు*
పైయరవిన్నణై ప్పళ్ళియినానుక్కు*
కైయొడుకాల్ శెయ్య కణ్ణపిరానుక్కు*ఎన్
తైయల్ ఇழన్దదు తన్నుడైచ్చాయే. ౧

అ॥ మెయ్ - తిరుమేనుయందు, అమర్ - అమరియున్న, పల్ - అనేకవిధములైన, కలన్ - తిరువాభరణములను, నన్గు-అందముగా, అణిన్దానుక్కు - అలంకరించుకొనిన వాఁడును, పై - విశాలమైనపడముగల, అరవిన్నణై - ఆదిశేషుఁడనెడిశయ్యమీఁద, పళ్ళియినానుక్కు - పవ్వళించినవాఁడును, శెయ్య - ఎఱ్ఱనైన, కైయొడు - శ్రీహస్తముతోఁగూడ, కాల్ - శ్రీపాదముగల, కణ్ణపిరానుక్కు - ఉపకారకుఁడునైన శ్రీకృష్ణునివిషయమై, ఎన్ తైయల్ - నాకొల్ల, తన్నుడై - తనయొక్క, శాయ్ - లావణ్యమును, ఇழన్దదు - పోఁగొట్టుకొనినది.

తా॥ సకలదివ్యాభరణభూషితుఁడై క్షీరాబ్ధియందుఁ బవ్వళించియున్న శ్రియఃపతియొక్క దివ్యావయవములను స్మరించి యీపె తనశరీరలావణ్యమును దారపోసుకొనెనని. ౭

శాయకక్కురున్దమొశిత్త తమియఱ్కు*
మాయచ్చగడముదైత్త మణాళఱ్కు*
పేయెమ్పిణమ్పడ ప్పాలుణ్ పిరానుక్కు*ఎన్
వాశక్కుழలి యిழన్దదుమాణ్బే. ౮

అ॥ కురున్దమ్ - అసురరూపియైన బత్తిగురిగింజవృక్షమును, శాయ-క్రిందఁ డునట్లు, ఒశిత్త - పడద్రోసిన, తమియఱ్కు - అసహాయవీరుఁడును, శగడమ్ - శకటాసురుఁడు, మాయ - మాయనట్లు, ఉదైత్త - తన్నిన, మణాళఱ్కు - నాయకుఁడును, పేయై - పూతనను, పిణమ్-శవమై, పడ - పడునట్లు, పాల్ - దాని స్తన్యమును, ఉణ్ - అరగించిన, పిరానుక్కు - ఉపకారకుఁడునైనశ్రియఃపతినియాశపడి, ఎన్ - నాకొమార్తెయై, వాశమ్ - పరిమళించుచున్న, కుழలి-కొప్పుగలదైనయీపె, మాణ్బు - సౌందర్యమును, ఇழన్దదు - పోఁగొట్టుకొనినది.

తా॥ శ్రీకృష్ణునియొక్క పూతనాశకటాసుర వధాదిదివ్య చేష్టితముల ననుసంధించి యీపె తన స్త్రీత్వధర్మము దారపోసుకొనినదని. ౮

మాణ్బమైకోలత్తె మ్మాయక్కళఱ్కు*
శేణ్శుడర్కున్ఱన్న శెఞ్జుడర్ మూర్ త్తిక్కు*
కాణ్బెరునోఱ్ఱ త్తెజ్ఞ్గు త్తనమ్బిక్కు*ఎన్
పూణ్పునై మెన్ములై తోఱ్ఱదు పొఱ్పే. ౯

అ॥ మాణ్బు-సౌందర్యము, అమై - అమరియున్న, కోలమ్ - అలఙ్కారముగల, మాయన్-ఆశ్చర్యదివ్యచేష్టితుఁడైన, ఎమ్కుఱళుక్కు - మనవామనుఁడును, శేణ్-ఉన్నతమై, శుడర్ - తేజోమయమైన, కున్ఱన్న-పర్వతమువలె, శెమ్శుడర్ - ఎఱ్ఱనికాన్తిగల, మూర్త్తిక్కు - విగ్రహముగలవాఁడును, కాణ్ - ఎల్లరచేచూడతగినదై, పెరుమ్ - అపరిచ్ఛిన్నమైన, తోఱ్ఱమ్-అవతారమహిమగల, ఎన్కాగుత్తనమ్బిక్కు - నాచక్రవర్తితిరుమగనారునైన శ్రియఃపతినియాశపడి, ఎన్ - నాకొమార్తెయై, పూణ్-ఆభరణములచేనలంకరింపఁబడిన, మెన్ములై - మృదువైనస్తనముగలయీపె, పొఱ్పు - (ఆభరణ) శోభను, తోఱ్ఱదు - పోగొట్టుకొనినది.

తా॥ ఈపెవామనావతారముయొక్క రూపచేష్టితములనున్ను శ్రీరామావతారమహిమను స్ననుసంధించి తనరూపమును బోగొట్టుకొనెనని. ౯

పొఱ్పమైనీళ్ ముడి ప్పూన్దణ్దుழాయుక్కు*
మఱ్పొరుతోళుడై మాయప్పిరానుక్కు*
నిఱ్పనపల్లురువాయ్ నిఱ్కుమాయర్కు*ఎన్
కఱ్పుడై యాట్టి యిழన్దదు కట్టే. ౧౦

అ॥ పొఱ్పు - సౌన్దర్యము, అమై - అమరియున్న, నీళ్-దీర్ఘమైన, ముడి-కిరీటమునున్ను, పూ - స్పృహణీయమై, తణ్ - చల్లనైన, తుழాయుక్కు - తిరుతుழాయిమాలనున్ను గలవాఁడును, మల్ - మల్లులతో, పొరు-యుద్ధము జేసిన, తోళుడై - భుజములుగల, మాయమ్ - ఆశ్చర్యభూతుఁడును, పిరానుక్కు - ఉపకారకుఁడును, నిఱ్పన - జంగమస్థావరరూపములైయున్న, పల్ఉరు - అనేకవిధవస్తువులకు, ఆయ్ - అన్తర్యామియైయున్నవాఁడును, నిఱ్కుమ్-వానియొక్కదోషములచేతనస్పృష్టుఁడైన, మాయఱ్కు - ఆశ్చర్యభూతుఁడునైన శ్రియఃపతినియాశపడి, ఎన్ - నాకొమార్తెయైన, కఱ్పుడైయాట్టి - బుద్ధిమంతురాలైనయీపె, కట్టు - లోకమర్యాదను, ఇழన్దదు - పోగొట్టుకొనినది.

తా॥ శ్రీకృష్ణునియొక్క మల్లయుద్ధముజేసిన భుజములనున్ను ఆధిరాజ్యసూచకమైన తులసీమాలికనున్ను సర్వాంతరాత్మత్వమునున్ను ధ్యానించి స్త్రీలుండవలసిన లోకరీతిని వదలి స్వతంత్రురాలైనదని. ౧౦

‡‡ కట్టెழిల్శోలై నల్ వేఙ్గడవాణనై*
కట్టెழిల్తెన్కురుగూర్ చ్చడగోపన్ శొల్*

కట్టెఴిలాయిర త్తిప్పత్తుమ్వల్లవర్*
కట్టెఴిల్ వానవర్ పోగముణ్బారే. ౧౧

అ॥ కట్టు - పరిమళముగల, ఎఴిల్ - సుందరమైన, శోలై - తోపులుగల, నల్ - విలక్షణమైన, వేఙ్గడమ్ - వేఙ్కటాద్రికి, వాణనై-స్వామియైన శ్రియఃపతివిషయమై, కట్టు - ప్రాకారముచే, ఎఴిల్ - అందమై, తెణ్ - స్పృహణీయమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపణ్ - నమ్మాఴ్వార్లు, శొల్ - ప్రసాదించిన, కట్టెఴిల్ - మంచిశబ్దసందర్భముగల, ఆయిరత్తు - వెయ్యిపాశురములలోజేరిన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లవర్ - అభ్యసించువారు, కట్టెఴిల్ - సంపూర్ణముగానందమైయున్న, (అప్రతిహతమైన) వానవర్ - నిత్యసూరులయొక్క, పోగమ్ - భోగమును, ఉణ్బార్ - అనుభవింతురు.

తా॥ అతిరమణీయమైన వేఙ్కటాద్రియందు వేంచేసియున్న శ్రియఃపతివిషయమై నమ్మాఴ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల ననుసంధించువారు నిత్యసూరులువలె మోక్షమందు నిరతిశయానందము ననుభవింతురని. ౧౧

ఆఴ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

౭ - వ తిరువాయ్మొఴి.

---

అవతారిక:— ఆఴ్వార్లనెడు పిరాట్టి మూర్ఛపోయియుండగా వారియవస్థనుజూడలేక బంధువులు భగవంతునిచిత్రచరిత్రములీవిధంబులనిజెప్పి తరువాత వారునుమూర్ఛపోయిన సమయంబున ఆఴ్వార్లు అభగవన్నామములను వినిమూర్ఛనువదలిలేచి తిరుక్కోళూరనెడిదివ్య దేశమునకు వేంచేసిరి. కొంతకాలమునకు తల్లులులేచి పడకయందు ఆఴ్వార్లనుజూడక, ఆహా! ఇదివఱలో వారితిరుమేను వాడిపోయినదని దుఃఖపడితిమి; ఇప్పుడు వారుతిరుక్కోళూరు వేంచేసినందున వారినిగూడ జూచుటకు ప్రాప్తిలేకపోతిమేయని బంధువులు చెప్పుచున్నారు.

‡‡ ఉణ్ణుమ్శోఱుపరుగునీర్ తిన్నుమ్వెత్తిలైయుమెల్లామ్*
కణ్ణనెమ్బెరుమానెన్ఱెన్ఱే కణ్గళ్నీర్మల్గి*
మణ్ణినుళ్ అవన్శీర్ వళమ్మిక్కవనూర్వినవి*
తిణ్ణమెన్నిళమాన్ పుగుమూర్ తిరుక్కోళూరే. ౧

అ॥ ఉణ్ణుమ్ - సాపడుచున్న, శోఱు - ప్రసాదమును, పరుగు - పానముజేయుచున్న, నీర్ - జలము, తిన్నుమ్ - నమిలుచున్న, వెత్తిలైయుమ్ - తామ్బూలమును, ఎల్లామ్ - ఇవన్నియు, ఎమ్బెరుమాన్ - మనస్వామియైన, కణ్ణన్ - శ్రీకృష్ణుండే, ఎన్ఱెన్ఱే - అనిచెప్పుచు, కణ్గళ్ - నేత్రములలో, నీర్ - జలమును, మల్గి - ప్రవహింపజేయుచు, మణ్ణినుళ్ - భూమియందు, అవన్ - ఆశ్రియఃపతియొక్క, శీర్ - కల్యాణగుణములను, వళమ్మిక్క అవన్ - సంపత్తుచేపూర్ణమైనవానియొక్క

ఊర్ - దివ్యదేశమును, వినవి - అడుగుచు, ఎన్ ఇళమాన్ - నాచిన్నది, పుగుమ్ - ప్రవేశించెడి, ఊర్ - దివ్యదేశము, తిరుక్కోళూరే - తిరుక్కోళూరే, తిణ్ణమ్ - (ఇది) నిశ్చయము

తా॥ శ్రియఃపతినే ధారకపోషకభోగ్యములు గానెంచి, మార్గమందుఁగనుబడువారినిజూచి తిరుక్కోళూరికి మార్గమేది! అచ్చటవేంచేసియున్న శ్రియఃపతియొక్క గుణంబులెట్టివి! అని యడుగుచు నాపిల్ల తిరుక్కోళూరికే వెళ్ళినది. ఇందుకుసందియంబులేదని. ౧.

ఊరుమ్నాడు ములగముమ్తన్నైప్పోల్*అవనుడైయ
పేరుమ్తార్గళుమేపిదఱ్ఱక్కట్టువానిడఱి*
శేరునల్వళమ్శేర్ పழனత్తిరుక్కోళూర్క్కే*
పోరుజ్గొలురైయీర్ కోడియేన్కొడిప్పూవైగళే. ౨

అ॥ ఊరుమ్ - ఊరులోనున్నవారినిన్ని, నాడుమ్ - దేశమందున్నవారినిన్ని, ఉలగముమ్- లోకమందున్నవారినిన్ని, తన్నైప్పోల్ - తనవలనే, అవనుడైయ - ఆ శ్రియఃపతియొక్క, పేరుమ్ - తిరునామములను, తార్గళుమ్ - తిరుమాలలను, పిదఱ్ఱ - జల్పించునట్లుచేసి, వాన్ - అతిక్రమించుటకశక్యమైన, కట్టు - లోకమర్యాదను, ఇడఱి - అతిక్రమించి, నల్ - విలక్షణమైన, వళమ్ - సంపత్తు, శేర్ - చేరియున్న, పழనమ్ - కొలనలుగల, తిరుక్కోళూర్క్కే - తిరుక్కోళూరికే, శేరున్ - పోయిచేరినదియు, కోడియేన్ - పాపిష్ఠురాలైన నాయొక్క కొమార్తెయు, కొడి - తీగవలెనున్నదియునైనయీపె, పోరుజ్గోల్ - తిరిగివచ్చునా? పూవైగళే - ఓచిలుక లారా! ఉరైయీర్ - చెప్పుఁడు.

తా॥ ఓచిలుకలారా! లోకమంతయు భగవన్నామముల ననుసంధించునట్లుచేయుచు తిరుక్కోళూరికి పోయిననాకొమార్తె తిరిగి వచ్చునా రాదా? చూచి చెప్పుఁడని. ౨.

పూవైపైఙ్గిళిగళ్ పన్దుతూదై పూమ్పుట్టిల్గళ్*
యావైయున్తిరుమాల్ తిరునామఙ్గళేకూవియెழுమ్*ఎన్
పావైపోయినిత్తణ్ పழనత్తిరుక్కోళూర్క్కే*
కోవైవాయ్తుడిప్ప మழైక్కణ్ణొడెన్ శెయ్యుఙ్గొలో. ౩

అ॥ పూవై - నానావర్ణమైనచిలకలు, పైమ్కిళిగళ్ - పచ్చనిచిలకలు, పన్దు - బంతి, తూదై - చిన్నపాత్రము, పూమ్పుట్టిల్గళ్ - పువ్వులుంచుకొనదగిన పుటికలు, యావైయుమ్ - ఇవన్నియు, తిరుమాల్ - శ్రియఃపతియొక్క, తిరునామఙ్గళే - తిరునామములే (యగునట్లు), కూవి - ఉచ్చరించి, ఎழுమ్ - ఉజ్జీవించుచున్న, ఎన్పావై - నాకొమార్తె, ఇని - దీనిపైన, తణ్ - చల్లనైన, పழనమ్ - పొలముగల, తిరుక్కోళూర్క్కే - తిరుక్కోళూరికే, పోయ్ - పోయి, కోవై - దొండపంతువలెనున్న, వాయ్ - అధరము, తుడిప్ప - స్ఫురించునట్లు, మழைక్కణ్ణొడు - వర్షమువలెధారధారగా ప్రవహించుచున్న జలముతోనిండిన నేత్రములతోనిలిచి, ఎన్ శెయ్యుఙ్గోల్ - ఏమిచేయుచున్నదో?

తా॥ తనవిహారములనన్నింటిని వదలి శ్రియఃపతియొక్క తిరునామముల ననుసంధించుచున్న నాకొమార్తె తిరుక్కోళూరికి వెళ్ళి అచ్చటతనమనోరథమును పొందినదో? లేక పొందకయేడుచుచున్నదో? తెలియలేదని. 3.

కో ల్లైయెన్బర్ కొలో కుణమ్మిక్కన ళెన్బర్ కొలో*
శీ ల్లైవాయ్ప్పెణ్డుగళ్ అయలశ్చేరియుళ్ళారు మెన్ లే*
శెల్వమ్మల్‌గి యవన్ కిడన్ద తిరుక్కోళూర్కే*
మెల్లిడై నుడఙ్గ ఇళమాన్ శెల్ల మేవినళే. ౪

అ॥ శెల్వమ్ - ఐశ్వర్యము, మల్‌గి - సంపూర్ణమైయున్న, అవన్ కిడన్ద - ఆసర్వేశ్వరుఁడు పవ్వళించిన, తిరుక్కోళూర్కే - తిరుక్కోళూరికే, మెల్ - మృదువైన, ఇడై - నడుము, నుడఙ్గ - వణుగునట్లు, ఇళమాన్ - (నా) బాలిక, శెల్ల - పోవుటకు, మేవినళ్ - నిశ్చయించినది. శిల్లై - జగడము వేయుచున్న, వాయ్ - నోరుగల, పెణ్డుగళ్ - (ఈవూరులోనున్న) స్త్రీలును, అయల్ శేరి - ప్రక్కవూరులో, ఉళ్ళారుమ్ - ఉన్న స్త్రీలును, కొల్లైయెన్బర్ కొలో - గుణహీనురాలనియెదురా? కుణమ్మిక్కనళ్ ఎన్బర్ కొలో - గుణవతి యనియెదురా? ఎన్లే - ఏమాశ్చర్యము!

తా॥ ఓచెలులారా! తిరుక్కోళూరికి వెళ్ళిననాపిల్లవిషయమై స్త్రీలేమిచెప్పుచున్నారు? ఇదిసిగ్గులేక లోకమర్యాదనతిక్రమించి వెళ్ళినదని చెప్పుచున్నారా! లేక, ఈపెయొక్క గుణములనెఱిఁగి మంచిగుణవంతురాలని చెప్పుచున్నారాయని. ౪.

మేవినన్ నున్ అవిళ్ యాడలుఱా ళెన్ శిఱు
త్తేవిపోయ్*ఇనిత్తన్ తిరుమాల్ తిరుక్కోళూరిల్*
పూవియల్ పొழிలుమ్ తడముమవన్ కోయిలుఙ్గణ్డు*
ఆవియుళ్ కుళిర ఎఙ్ఙనేయుగక్కుఙ్గొలిన్నే. ౫

అః మేవి - (శ్రియఃపతియొక్క తిరుకల్యాణగుణములయందు) అవగాహించి, నైన్ద నైన్ద - మిక్కిలిశిథిలాన్తఃకరణురాలై, విళైయాడల్ - విహరించుటకు, ఉఱాళ్ - అశించదు, ఎన్ - నాయొక్క, శిఱు తేవి - శ్రీమహాలక్ష్మివలెనున్నచిన్నది. ఇని - దీనిపైన, తన్ - తనకు స్వామియైన, తిరుమాల్ - శ్రియఃపతియొక్క, తిరుక్కోళూరిల్ - తిరుక్కోళూరికి, పోయ్ - వెళ్ళి, పూవియల్ - పుష్పించడమను స్వభావముగాగల, పొழிలుమ్ - తోటలనున్ను, తడముమ్ - తటాకములనున్ను, అవన్ కోయిలుమ్ - ఆ శ్రియఃపతియొక్క కోవెలనున్ను, కణ్డు - చూచి, ఆవి - హృదయము, ఉళ్ కుళిర - లోపలచల్లపడునట్లు, ఇన్ను - ఇప్పుడు, ఎఙ్ఙనే - ఏవిధముగా, ఉగక్కుమ్‌కొల్ - సంతోషించునో?

తా॥ తనవిహారములను వదలిభగవద్గుణముల ననుసంధించుచున్న నాచిన్నది ఇప్పుడు తిరుక్కోళూరికి వెళ్ళి అచ్చటనున్న సకలసమృద్ధినిజూచి యెటులసన్తోషించుచున్నదోయని. ౫.

ఇన్ననక్కుదవాదగన్ఱ ఇళమానినిప్పోయ్*
తెన్‌తిశైత్తిలదమన్న తిరుక్కోళూర్కే

శెన్రు*తన్ తిరుమాల్ తిరుక్కణ్ణుమ్ శెవ్వాయుమ్‌కణ్డు*
నిన్రునిన్రు నైయుమ్ నెడుఙ్గణ్గళ్ పనిమల్గవే ౬

అ॥ ఎనక్కు - నాకు, ఇన్రు - ఇప్పుడు, ఉదవాదు - సహాయముగాలేక, అగన్ఱ - విడిచి పోయిన, ఇళమాన్ - చిన్నది, తెన్‌తిశై - దక్షిణదిక్కుకు, తిలదమనైయ - తిలకముచంటియున్న, తిరుక్కోళూర్‌క్కే - తిరుక్కోళూరికే, పోయ్ - వెళ్ళి, శెన్రు - ప్రవేశించి, ఇని - దీనితరువాత, తన్ - తనయొక్క, తిరుమాల్ - శ్రియఃపతియొక్క, తిరుక్కణ్ణుమ్ - సుందరనేత్రముల నున్ను, శెవ్వాయుమ్ - ఎఱ్ఱనియధరమునున్ను, కణ్డు - చూచి, నెడుమ్ - విశాలమైన, కణ్గళ్ - నేత్రములలో, పని - నీరు, మల్గ - నిండునట్లు, నిన్రునిన్రు - ఉండియుండి, నైయుమ్ - శిథిలురాలగుచున్నది.

తా॥ నాచిన్నది నన్నిచ్చట నొంటరిగా విడిచిపెట్టి తానుతిరుక్కోళూరికివెళ్ళి శ్రియఃపతి యొక్క నతిసుందరంబులైన దివ్యావయవములనుసేవించి యానందబాష్పమును బ్రవహింపఁ జేయుచు ఇప్పుడు మిక్కిలి సంతోషించుచుండునని ౬.

మల్గునీర్ క్కణ్ణొడు మైయలుత్ఱు మనత్తనళాయ్*
అల్లుమ్ పగలుమ్ నెడుమాలెన్రు అழைత్తినిప్పోయ్*
శెల్వమ్మల్గి యవన్ కిడన్దతిరుక్కోళూర్‌క్కే*
ఒల్గియొల్గినడన్దెఙ్గనే పుగుఙ్గొలో॥ శినే. ౭

అ॥ మల్గు - నిండియున్న, నీర్ - నీళ్ళుగల, కణ్ణొడు - నేత్రములతోఁగూడ, మైయలుత్ఱు - భ్రమనొందిన, మనత్తనళాయ్ - మనస్సుగలదై, నల్ - అనుకూలమైన, అల్లుమ్‌పగలుమ్ - రేయింబగళ్ళును, నెడుమాలెన్రు - (ఆశ్రితులయందు) మిక్కిలి వ్యామోహముగలవాఁడా! యని, అழைత్తు - పిలిచి, ఇని - దీనిపైన, ఒశిన్దు - శిథిలురాలై, ఒల్గిఒల్గి - ఆడియాడి, (మెల్లమెల్లగా), నడన్దుపోయ్ - నడచివెళ్ళి, శెల్వమ్‌మల్గి - సంపత్తునిండియున్న, అవన్‌కిడన్ద - ఆ శ్రియఃపతిపవ్వళించిన, తిరుక్కోళూర్‌క్కే - తిరుక్కోళూరికే, ఎఙ్గనే - ఏవిధంబున, పుగుఙ్గొల్ - ప్రవేశించునో?

తా॥ శ్రియఃపతియందు మిక్కిలి వ్యామోహపడి వానినే పిలుచుచున్న నా బాలిక, ఆశ్రియఃపతిపవ్వళించియున్న తిరుక్కోళూరికి శక్తిలేక మెల్లమెల్లగానడచివెళ్ళి ఎట్లుచేరినదో? యని. ౭.

ఒశిన్దనుణ్ణిడై మేల్ కైయెవైత్తునొన్దునొన్దు*
కశిన్దనెఞ్జినళాయ్ క్కణ్ణనీర్ తుళుమ్బచ్చెల్లుఙ్గొల్*
ఒశిన్దవొణ్ మలరాళ్ కొழுనన్ తిరుక్కోళూర్‌క్కే*
కశిన్దనెఞ్జినళా యెమ్మైనీత్తు ఎమ్‌కారిగైయే. ౮

అ॥ ఒశిన్ద - వంగియున్న, నుణ్ - సూక్ష్మమైన, ఇడైమేల్ - నడుముమీఁద, కైయెవైత్తు - చేతులనుంచుకొని, నొన్దునొన్దు - మిక్కిలికష్టపడి, కశిన్ద - (భక్తిచే) ఆర్ద్రమైన, నెఞ్జినళాయ్ - మనస్సుగలదై, ఎమ్మై - మనలను, నీత్తు - విడిచిపోయిన, ఎమ్‌కారిగై - నా బాలిక, ఒశిన్ద - (సంశ్లేషముచే) వాడియున్న, ఒణ్ - అందమైన, మలరాళ్ - పుష్పవాసినియైనపిరాట్టికి,

కొణ్డనన్ - వల్లభుండైన శ్రియఃపతి (వర్వళించిన), తిరుక్కోళూర్ క్కే - తిరుక్కోళూరికే, కశిన్దనెఞ్జినళాయ్ - (ప్రేమచే) ఆర్ద్రచిత్తురాలై, కణ్ణనీర్ - కంటినీళ్ళు, తుళుమ్బ - నిండునట్లు, శెల్లుమ్కొల్ - చేరునా ?

తా॥ తిరుక్కోళూరులో బవ్వళించియున్న శ్రియఃపతియందు మిక్కిలి వ్యామోహము గలదై నన్నిచ్చట విడిచిపెట్టిపోయిన నాబాలిక కేవలి సహాయముగాజేసికొని ఇంత గొప్పదూరమువెళ్ళినదని యాలోచించగా, ఆభక్తినే సహాయముగాజేసికొని వెళ్ళినదని తోచుచున్నదని.ఛా.

కారియమ్నల్లనగళ్ వై కాణిలెన్ కణ్ణనుక్కెన్ఱు*
ఈరియాయిరుప్పాళ్ ఇదెల్లామ్ కిడక్కవినిప్పోయ్*
శేరిపల్ పழிతూవి యిరైప్ప త్తిరుక్కోళూర్ క్కే*
నేరిழைనడన్దాళ్ ఎమ్మైయొన్ఱుమ్ నినైత్తిలళే. ౯

అ॥ నల్లన - మంచివైన, కారియజ్గళ్ - చేయుబడిన, అవై - అచందనకుసుమాదులను, కాణిల్ - చూచినయెడల, ఎన్ కణ్ణనుక్కెన్ఱు - నాకృష్ణునికియని, ఈరియాయ్ - ఆర్ద్రచిత్తురాలై, ఇరుప్పాళ్ - ఉన్న, నేరిழை - సుందరంబులైన దివ్యాభరణములుగలయీపె, ఇదెల్లామ్ కిడక్క - ఈవస్తువులన్నియుండగా, ఇనిప్పోయ్ - దీనితరువాతవెళ్ళి, శేరి - గ్రామములోనున్నవారు, పల్ పழி - అనేకదోషములను, తూవి - చెప్పి, ఇరైప్ప - ఘోషించునట్లు, తిరుక్కోళూర్ క్కే - తిరుక్కోళూరికే, నడన్దాళ్ - వెళ్ళెను, ఎమ్మై - మనలను, ఒన్ఱుమ్ - కొంచెముగూడ, నినైత్తిలళ్ - తలంచినదికాదు.

తా॥ ఒకమంచివస్తువును జూచినయెడల మన శ్రీకృష్ణునికి దీనిని సమర్పింపవలయునని చెప్పుచున్న నాబాలిక ఇప్పుడుఅవియన్నింటినివదలి తిరుక్కోళూరికివెళ్ళినది. లోకులనిందను లక్ష్యపెట్టలేదు. నన్నుతలంచనుగూడలేదని. ౯.

నినైక్కిలేన్ తెయ్వజ్గాళ్ నెడుజ్గణిళమానినిప్పోయ్*
అనైత్తులగుముడైయ అరవిన్దలోచననై*
తినైత్తనైయుమ్ విడాళ్ అవన్ శేర్ తిరుక్కోళూర్ క్కే*
మనైక్కువాన్ పழியుమ్ నినైయాళ్ శెల్లవైత్తనళే. ౧౦

అ॥ తెయ్వజ్గాళ్ - ఓదేవతలారా ! నినైక్కిలేన్ - (ఈదుఃఖమును) నేనుస్మరించను. నెడుమ్కణ్ - విశాలమైననేత్రముగల, ఇళమాన్ - బాలిక, ఇని - ఈయవస్థకంటెపైన, పోయ్ - వెళ్ళి, అనైత్తులగుముడైయ - సకలలోకములనుగల, అరవిన్దలోచననై - కమలాక్షుని, తినైత్తనైయుమ్ - ఒకక్షణముగూడ, విడాళ్ - విడువదు. అవన్ - ఆశ్రియఃపతి, శేర్ - చేరియున్న, తిరుక్కోళూర్ క్కే - తిరుకోళూరికే, శెల్లవైత్తనళ్ - వెళ్ళతలంచినది, మనైక్కు - కులమునకు (వచ్చెడి), వాన్ - గొప్ప, పழியుమ్ - అపవాదమును, నినైయాళ్ - లక్ష్యపెట్టదు.

తా॥ ఓ దేవతలారా! ఈ బాలిక మనకులమునకు సంభవించెడి లోకాపవాదమునుగూడ లక్ష్యపెట్టక తిరుక్కోళూరికివెళ్ళి ఒకక్షణముగూడవిడువక శ్రియఃపతిని యనుభవించుచున్నది. నన్ను విడిచిపోయిన యీదుఃఖమును నేనుసహింపలేనని. ౧౦

⁂ వైత్త మానిదియామ్ మదుసూదనై యేయలత్తి*
కొత్తలర్ పొழிల్ శూழ் కురుకూర్చ్చటకోపన్ శొన్న*
పత్తునూర్ట్రుళ్ ఇప్పత్తు అవన్ శేర్ తిరుక్కోళూర్క్కే*
శిత్తమ్ వైత్తురైప్పార్ తిగழ் పొన్నులగాళ్ వారే. ౧౧.

అ॥ వైత్త - సాపించిన, మా - శ్లాఘ్యమైన, నిదియామ్ - నిధివలెనున్న, మదుసూదనై యే - మధుసూదనునే, అలత్తి - ఆర్తిచేజెప్పించి, కొత్తు - పూలగుత్తు, అలర్ - వికసించియున్న, పొழிల్ - తోటలుగల, కురుకూర్ - కురుకాపురికిస్వామియైన, శటగోపన్ - నమ్మాழ்వార్, శొన్న - ప్రసాదించిన, పత్తునూర్ట్రుళ్ - పదినూఱు (వెయ్యి) తిరువాయ్మొழிలో, ఇప్పత్తు - ఈ పది పాశురములను, అవన్ - ఆ శ్రియఃపతి, శేర్ - నిత్యవాసముజేయుచున్న, తిరుక్కోళూర్క్కే - తిరుక్కోళూరియందే, శిత్తమ్ - మనస్సు, వైత్తు - ఉంచి, ఉరైప్పార్ - అధ్యయనముజేయువారు, తిగழ் - ప్రకాశించుచున్న, పొన్ - శ్లాఘ్యమైన, ఉలగు - పరపదమందు, ఆళ్వార్ - (భగవద్గుణములను) అనుభవింతురు.

తా॥ నమ్మాழ்వారు ప్రసాదించిన యీతిరువాయ్మొழிని తిరుక్కోళూరనెడి దివ్యదేశమందు భక్తిగలవారై యనుసంధించువారు శ్రీవైకుంఠమందువెళ్ళి నిత్యానందము ననుభవింతురని.

ఆ ழ் వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

౮ .వ తిరువాయ్మొழி.

అవతారిక:— నమ్మాழ்వారనెడి పిరాట్టి తిరుక్కోళూరికి వెంచేయుచున్నప్పుడు శక్తిలేక మధ్యమార్గమందొక ఉద్యానవనములోనుండి అచ్చటనున్న పక్షులను శ్రియఃపతివద్దకి దూతలై పంపించుచున్నారు.

⁂ పొన్నులగాళీరో పువనిముழுదాళీరో*
నన్నలప్పుళ్ళినఙ్గాళ్ వినైయాట్టియేన్ నానిరన్దేన్*
మున్నులగఙ్గళెల్లామ్ పడైత్త ముగిల్ వణ్ణన్ కణ్ణన్*
ఎన్నలఙ్గొణ్డపిరాన్ తన క్కెన్ నిలై యురైత్తే. ౧.

అ॥ నల్ నలమ్ - (వాయంచు) మిక్కిలి స్నేహముగల, పుళ్ళినఙ్గాళ్ - ఓపక్షిసమూహములారా! వినైయాట్టియేన్ - పాపముజేసిన, నాన్ - నేను, ఇరన్దేన్ - (మిమ్ములను) యాచించితిని. మున్ - మునుపు, ఉలగఙ్గళెల్లామ్ - లోకములనన్నింటిని, పడైత్త - సృష్టించిన, ముగిల్ వణ్ణన్ - మేఘమువంటికాన్తిగల, కణ్ణన్ - శ్రీకృష్ణుడైన, ఎన్ నలమ్ కొణ్డపిరాన్ తనక్కు - నా గు

గములనపహరించినస్వామికి, ఎన్నిలైమై - నాస్థితిని, ఉరైత్తు - చెప్పి, పొన్ - స్పృహణీయ మైన, ఉలగు - శ్రీవైకుంఠలోకమును, ఆళీర్ - అనుభవించుండి, పువనిముళుదు - లీలావిభూతి నన్నింటిని, ఆళీర్ - అనుభవించుండి.

తా॥ ఓపక్షులారా! మీరు వెళ్ళి నన్నీకష్టంబునబాధపెట్టుచున్న జగత్స్రష్టయైన శ్రియః పతికి నాయవస్థను జెప్పినయెడల మీకు నేను సత్యవిభూతిని లీలావిభూతినియిచ్చెదను. మీరను భవింపవచ్చునని. ౧.

మైయమర్ వాళ్ నెడుఙ్గణ్ మఙ్గైమార్ మున్బెన్
కైయిరున్దు*నెయ్యమరిన్నడిశిల్ నిచ్చల్ పాలోడుమేవీరో*
కైయమర్ శక్కరత్తెన్ కనివాయ్ప్పెరుమానైక్కణ్డు*
మెయ్యమర్ కాదల్ శొల్లి క్కిళిగాళ్ విరైన్దోడివన్దే. ౨.

అ॥ కిళిగాళ్ - ఓచిలకలారా! కై - శ్రీహస్తమందు, అమర్ - అమరియున్న, శక్కరమ్ - సుదర్శనముగలవాఁడును, కనివాయ్ - దొండపండువలెనున్న తిరుపవళముగలవాఁడునైన, ఎన్ పెరుమానై - నాస్వామిని, కణ్డు - చూచి, మెయ్ - వానితిరుమేనును (సంశ్లేషింపవలయు నని), అమర్ - చేరియున్న, కాదల్ - (నా) ఆశను, శొల్లి - చెప్పి, విరైన్దు - శీఘ్రముగా, ఓడివన్దు - పఱుగెత్తివచ్చి, మై - కాటుక, అమర్ - చేరియున్న, వాళ్ - సుందరమైన, నెడుమ్ - విశాల మైన, కణ్ - నేత్రములుగల, మఙ్గైమార్ మున్బు - సఖియలైనస్త్రీలముందఱ, ఎన్ కై - నాచేతి మీద, ఇరున్దు - ఉండి, నెయ్ - నెయ్యితో, అమర్ - పూర్ణమైన, ఇన్ అడిశిల్ - భోగ్యమై నప్రసాదమును, పాలోడు - పాలుతోఁగూడ, నిచ్చల్ - ప్రతిదినమును, మేవీర్ - భుజించుడి.

తా॥ ఓచిలకలారా! మీరు శ్రియఃపతివద్దకేళ్ళి, నిన్ను సంశ్లేషింప నేనాశపడుచున్నానని నేను చెప్పినట్లు చెప్పి తిరిగివచ్చితిరేని మిమ్ములను నాచేతిమీఁదనుంచుకొని నెయ్యిపాలుతోఁగూడ మధురమైన ప్రసాదమునిచ్చెదను, మీరారగింపవచ్చునని. ౨.

ఓడివన్దెన్ కుழల్ మేల్ ఒళిమామలర్ ఊదీరో*
కూడియవణ్డినఙ్గాళ్ కురునాడుడై ఐవర్ గట్కాయ్*
ఆడియమానెడున్దేర్ పడై నీఱెழ శెற்றపిరాన్*
శూడియతణ్డుழాయ్ ముణ్డ తూమదువాయ్ గళ్ కొణ్డే. ౩.

అ॥ కూడియ - గుంపుగాజేరియున్న, వణ్డినఙ్గాళ్ - ఓతుమ్మెదసమూహములారా! కురు నాడుడై - కురుదేశమునకురాజులైన, ఐవర్ గట్కాయ్ - పంచపాణ్డవులకొఱకై, ఆడియ - అంద ముగాసంచరించుచున్న, మా - గుఱ్ఱములుజోడించిన, నెడుమ్ తేర్ - గొప్పరథమును (సాధనము గాజేసికొని), పడై - సేనలను, నీఱెழ - భస్మమగునట్లు, శెற్ற - చంపిన, పిరాన్ - శ్రీకృ ష్ణుఁడు, శూడియ - అలఙ్కరించుకొనిన, తణ్ - చల్లనైన, తుழాయ్ - తులసీమాలికలోనున్న తేనెను, ఉణ్డ - భుజించిన, తూ - పరిశుద్ధమైన, మదు - తేనెగల, వాయ్ గళ్ కొణ్డు - నోఁరు గలవారై, ఓడివన్దు - పఱుగెత్తివచ్చి, ఎన్ కుழల్ మేల్ - నాకొప్పుమీదనున్న, ఒళి - ప్రకా

రించుచున్న, మా - శ్లాఘ్యమైన, మలర్ - పుష్పములమీఁదనున్న మకరందమును, ఊదీర్ - పానముజేయుండు.

తా॥ ఓతుమ్మెదలారా! పాండవులకు సాహాయ్యముజేసి దుర్యోధనాదులను జంపిన శ్రీకృష్ణుని వనమాలమీఁదనున్న మకరందమును ద్రాగి వానికి నామాటలను జెప్పివచ్చితిరేని వానిపూవుమీఁదనున్న మధురమైన పుష్పమకరందమును పానముజేయవచ్చునని. ౩.

తూమనువాయ్‌గళ్ కొణ్డు వన్దెన్ ముల్లైగళ్ మేల్ తుమ్బిగాళ్*
పూమదువుణ్ణచ్చెల్లిల్ వినైయేనై ప్పొయ్ శెయ్‌దగన్ఱ*
మామదువార్ తణ్డుழாయ్‌ముడి వానవర్ కోనైక్కణ్డు*
యామిదువో తక్కవా ఱెన్న వేణ్డుఙ్గణ్డీర్ నుఙ్గట్కే. ౪.

అ॥ ఎన్ ముల్లైగళ్ మేల్ - నాముల్లపుష్పముమీఁద సంచరించుచున్న; తుమ్బిగాళ్ - ఓతుమ్మెదలారా! తూ - పరిశుద్ధమై, మను - మనురమైన, వాయ్‌గళ్ కొణ్డు - మాటలను జెప్పుకొని, వన్దు - వెళ్ళి, పూమదు - పుష్పాలమీఁదనున్న తేనెను, ఉణ్ణ - భుజించుటకు, శెల్లిల్ - వెళ్ళితిరేని, వినైయేనై - పాపముగలనన్ను, పొయ్ శెయ్‌దు - కృత్రిమముగా (స్వప్నమువలెక్షణకాలము) సంశ్లేషించి, అగన్ఱ - విడిచిపోయినవాఁడై, మా - శ్లాఘ్యమైన, మదు - తేనె, వార్ - కారుచున్న, తణ్ - చల్లనైన, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడి - కిరీటమందుగల, వానవర్ కోనై - నిత్యసూరులకుస్వామియైన శ్రియఃపతిని, కణ్డు - చూచి, యామ్ - మేము, నుఙ్గట్కు - మీయొక్క, తక్కవాఱు - దయకుపాత్రమైనవిధము, ఇదువో - ఇదియో? ఎన్న వేణ్డుమ్ కణ్డీర్ - అని చెప్పవలయును సుమండీ.

తా॥ ఓతుమ్మెదలారా! మీరు మధుపానముజేయ వెళ్ళినప్పుడు, నన్ను క్షణమాత్రము సంశ్లేషించి విడిచిపెట్టిపోయిన శ్రియఃపతినిజూచి, నీవు స్త్రీలను బాధపెట్టుటయేనా స్వభావము అని భయపడకనుండి చెప్పుఁడని. ౪.

నుఙ్గట్కు యానొన్ఱురైక్కేన్ నమ్మిన్ యాన్ వళర్త్త కిళిగాళ్*
వెఙ్గణ్ పుళ్ళూర్న్దువన్దు వినైయేనై నెఞ్జఙ్గవర్న్ద*
శెఙ్గణ్ కరుముగిలై చ్చెయ్యవాయ్ చ్చెழுఙ్గఱ్పగత్తై*
ఎఙ్గుచ్చెన్ఱాగిలుఙ్గణ్డిదువో తక్కవాఱెన్మినే. ౫.

అ॥ యాన్ - నేను, వళర్త్త - పెంచిన, కిళిగాళ్ - ఓచిలకలారా! యాన్ - నేను, నుఙ్గట్కు - మీకు, ఒన్ఱురైక్కేన్ - (ఒకపని) చెప్పుచున్నాను, నమ్మిన్ - రండు. వెమ్ - (విరోధులమీఁదకోపముచే) ఎఱ్ఱనైన, కణ్ - నేత్రములుగల, పుళ్ - గరుత్మంతుని, ఊర్న్దు - నడిపించుకొని, వన్దు - వచ్చి, వినైయేనై - భాగ్యహీనురాలైననాయొక్క, నెఞ్జమ్ - మనస్సును, కవర్న్ద - అపహరించినవాఁడును, శెఙ్గణ్ - ఎఱ్ఱనినేత్రములుగలవాఁడును, కరుముగిలై - నల్లని మేఘమువంటి కాన్తిగలవాఁడును, శెయ్యవాయ్ - ఎఱ్ఱనిముఖముగలవాఁడును, శెழுమ్ కఱ్పగత్తై - సుందరమైన కల్పవృక్షమువంటివాఁడునైన శ్రియఃపతిని, ఎఙ్గాగిలుమ్ - ఎచ్చటనైనను, శెన్ఱు - వెళ్ళి, కణ్డు - చూచి, ఇదువో తక్కవాఱు - ఇదియానీదయ, ఎన్మిన్ - అని చెప్పుండి.

తా॥ ఓచిలకలారా ! మీకొకపని చెప్పెదనురండు. గరుత్మంతునిమీఁదనెక్కి వేంచేసివచ్చి యతి సుందరంబులైన దివ్యావయవములచే నన్ను మోహపఱచి పోయిన శ్రియఃపతిని వెదకిగనిపెట్టి స్త్రీలను బాధించుటయే నాసీదయ ? అని యడుగుఁడని. ౫.

ఎన్నిన్ను నూల్ మార్వ నెన్కరు మ్మేని నెన్కణ్ణర్ తర్
మన్నుశీళ్ కழల్ మేల్ తణ్ణు ழாయ్ నమక్కన్ఱి నల్ గార్
కన్నినన్ఱు మ్మొయార్ కఱ్పియానైత్త మాత్ ఱమ్ కొణ్డి
శెన్నిఙ్గళ్ తీవినై యేన్ వళర్త్త శిఱుపూవైగళే. ౬.

అ॥ తీ - క్రూరమైన, విసైయేన్ - పాపముగలనేను, వళర్త్త - పెంచిన, శిఱుపూవైగళే - ఓ చిన్న చిలకలారా ! ఎన్ మిన్ను నూల్ మార్వన్ - ప్రకాశించుచున్న యజ్ఞోపవీతముచేనల ఙ్కరింపఁబడినవక్షస్థలముగలవాఁడై నాకు సేవసాదించినవాఁడును, ఎన్ కరుమ్మేనియమ్మాన్ - నాకు సేవసాదించినశ్యామ విగ్రహముగలస్వామియు, ఎన్ - నాక, కణ్ణన్ - తప్పుఁడునైన శ్రీకృష్ణుఁడు, తన్ - తనయొక్క, శీళ్ - పాదునైన, కழల్ మేల్ - తిరువడికళ్ళమీఁద, మన్ను - అనురి యున్న, తణ్ - చల్లనైన, తుழாయ్ - తిరుత్తుழாయిని, నమక్కన్ఱి - మనలనుతప్పనుతియొకరికి, నల్ గార్ - ప్రీతితో నివ్వడు. కన్నినన్ఱ - అభ్యసించుడియని, ఉమ్మై - మిమ్ములను, యాన్ - నేను, కఱ్పియానైత్త - చెప్పించిన, మాత్ ఱమ్ - మాటలను, కొణ్డి - చెప్పి, శెన్నిఙ్గళ్ - పల్కుఁడి.

ఓచిలకలారా ! ఇదివఱలో నాకత్యంతభవ్యుఁడై చక్కగా సేవసాదించుచు తానుస మర్పించుకొనియున్న తిరుత్తుழாయిని నాకు ప్రసాదముగానిచ్చి నామనోరథమును బూర్తిజేయుము శ్రియఃపతినిజూచి, ఇప్పుడునన్నిడబాసియిట్లు బాధబెట్టవచ్చునాయని నేను చెప్పినట్లు అడుగుఁడని.

పూవైగళ్ పోల్ నిఱత్తన్ పుణ్డరీగఙ్గళ్ పోలుమ్ కణ్ణన్
యావైయుమ్ యావరుమాయ్ నిన్ఱమాయనెన్నాழிప్పిరాన్
మావైవల్ వాయ్ పిళన్ద మదుశూదఱ్కెన్ మాత్ ఱమ్ కొణ్డి
పావైగళ్ తీర్క్కిఱ్ఱిరే వినైయాట్టియేన్ పాశఱవే. ౭.

అ॥ పావైగళ్ - ఓబొమ్మలారా ! పూవైగళ్ పోల్ - కల్లుపువ్వువంటి, నిఱత్తన్ - కాన్తి గలవాఁడును, పుణ్డరీగఙ్గళ్ పోలుమ్ - పద్మములతో సమానమైన, కణ్ణన్ - నేత్రముగలవాఁడును, యావైయుమ్ - సమస్తచేతనములకును, యావరుమ్ - సకలచేతనులకును, ఆయ్ - అన్తర్యామియై, నిన్ఱ - ఉన్నవాఁడును, మాయన్ - (వానిదోషములుతగలని) ఐశ్వర్యశక్తిగలవాఁడును, ఎన్ - నాకుస్వామియు, ఆழிప్పిరాన్ - చక్రాయుధుఁడైనఉపకారకుఁడును, మావై - గుఱ్ఱమై వచ్చినకేశియొక్క, వల్ - క్రూరమైన, వాయ్ - నోటిని, పిళన్ద - చీల్చినవాఁడునైన, మదుశూ దఱ్కు - మధుసూదనునికి, ఎన్ మాత్ ఱమ్ - నామాటను, కొణ్డి - చెప్పి, వినైయాట్టియేన్ - పాపముగలవారియొక్క, పాశఱవు - దుఃఖమును, తీర్క్కిఱ్ఱిరే - తీర్చుదురా ?

తా॥ ఓబొమ్మలారా ! పరమసుందరుఁడై, సకలాన్తర్యామియై, సమస్తశత్రుసంహారకుఁ డైన శ్రియఃపతికి నామాటను జెప్పి మీరు నాదుఃఖమును బోగొట్టవలయునని. ౭.

పాశఱకైయ్దియిన్నే వినైయేనైయెన్నైయూழிనైవేన్*
ఆశఱుతూవివెళ్ళైక్కురుగే అరుళ్ శెయ్దొరునాళ్*
మాశఱునీలచ్చుడరుముడి వానవర్కోనైక్కణ్డు*
ఏశఱుమ్నుమ్మైయల్లాల్ మఱునోక్కిలేన్ పేర్త్తుమఱ్ఱే. ౮

అ॥ ఆశు - దోషము, అఱు - లేని, తూవి - ఱెక్కలుగల, వెళ్ళై - తెల్లనివర్ణముగల, కురుగే - ఓకొంగా! వినైయేన్ - పాపియైననేను, పాశఱవు - దైన్యము, ఎయ్ది - పొంది, ఇన్నే - ఈవిధముగా, ఎనైయూழி - ఎంతకాలము, నైవేన్ - బాధపడుదును? ఒరునాళ్ - ఒకదినము, అరుళ్ శెయ్దు - కృపజేసి, మాశఱు - దోషములేని, నీలచ్చుడర్ - శ్యామమైనకాంతి గల, ముడి - కేశపాశముగల, వానవర్ కోనై - నిత్యసూరులకు స్వామియైన శ్రియఃపతిని, కణ్డు - చూచి, ఏశఱు - దోషములేని, నుమ్మైయల్లాల్ - మిమ్ములను తప్ప, పేర్త్తు - మఱియు, మఱ్ఱు - ఇంకొకరిని, మఱునోక్కిలన్ - తిరిగిచూడను. (అని చెప్పుము).

తా॥ ఓకొంగా! నేనెంతకాలమిట్లు బాధపడుదును? గాన నీవు నాయందనుగ్రహజేసి శ్రియఃపతికడకేగి, మఱియొకరినిజూడక నిన్నునే నమ్మికొనియున్న వీని నీవిట్లు పేక్షింపవచ్చునా? కటాక్షింపరాదాయని చెప్పుమనుయని. ౮.

పేర్త్తుమఱ్ఱోర్ కళైకణ్ వినైయాట్టియేన్ నానొన్ఱిలేన్*
నీర్త్తిరైమేలులవి యిరైతేరుమ్పుదావినఙ్గాళ్*
కార్త్తిరళ్ మాముగిల్ పోల్ కణ్ణన్ విణ్ణవర్కోనైక్కణ్డు*
వార్త్తైగళ్ కొణ్డరుళియురైయీర్ వైగల్ వన్దిరున్దే. ౯

అ॥ నీర్ - జలములయొక్క, తిరైమేల్ - అలలుమీద, ఉలవి - సంచరించి, ఇరై - ఆహారమును, తేరుమ్ - వెదుకుచున్న, పుదావినఙ్గాళ్ - పెద్దకొంగపక్షి సమూహములారా! వినైయాట్టియేన్ - పాపిష్ఠురాలైన, నాన్ - నేను, పేర్త్తు - మఱియు, మఱ్ఱు - ఇంకొక, ఓర్ - అద్వితీయుండైన, కళైకణ్ - ఒకరక్షకుని, ఒన్ఱిలేన్ - కలవాడనుగాను. కార్ - వర్షాకాలమందు, తిరళ్ - చేరియున్న, మా - గొప్ప, ముగిల్ పోల్ - మేఘమువంటి (కాన్తిగల), కణ్ణన్ - ఆశ్రితసులభుడైన, విణ్ణవర్ కోనై - నిత్యసూరులకుస్వామియైన శ్రియఃపతిని, కణ్డు - చూచి, వార్త్తైగళ్ కొణ్డు - (వాడు చెప్పెడు) మాటలను దీసికొనివచ్చి, అరుళి - (నాయందు) కృపజేసి, వైగల్ - ప్రతిదినమును, ఇరున్దు - ప్రీతిగలవారై యుండి, ఉరైయీర్ - చెప్పుడు.

తా॥ ఓ పెద్దకొంగపక్షులారా! మీకంటె నన్నిప్పుడు రక్షించువారెవ్వరులేరు గాన మీరువెళ్ళి శ్రియఃపతికి నామాటనుజెప్పి వాడుచెప్పెడు బదులుమాటలను తిరిగి నాకువచ్చిచెప్పి నన్ను జీవింపించుండు. ౯.

వన్దిరున్దుమ్ముడైయ మణిచ్చేవలుమ్నీరుమెల్లామ్*
అన్దిమొழுదిదన్ఱియలర్ మేలసైయుమన్నఙ్గాళ్*
ఎన్ తిరుమార్వఱ్కెన్నై యిన్నవాఱివళ్ కాణ్మిన్ఎన్ఱు*
మన్దిరత్తొన్ఱుణర్త్తియురైయీర్ మఱుమాఱ్ఱఙ్గళే. ౧౦.

అ॥ ఉమ్మాడై యు - మీ యొక్క, మణి - శ్లాఘ్యమైన, శేవలుమ్ - మొగపక్షియు, నీరుమ్ - మీరును, ఎల్లామ్ - మీ బంధువులందరును, వన్దిరున్దు - వచ్చియుండి, ఒన్ఱు అర్దమున్ - ఒక బాధయు, ఇన్ఱి - లేక, అలర్మేల్ - పుష్పముమీద, అశైయుమ్ - సంచరించుచున్న, అన్నఙ్గాళ్ - ఓ హంస పక్షులారా! ఎన్ - నా స్వామినియైన, తిరు ప్పిరాట్టిని, మార్విల్ - వక్షస్థలమందుగల శ్రియః పతికి, ఇవళ్ - ఈమె, ఇన్నవాఱు - ఈ విధము గానున్నది; కాణ్మిన్ - చూడుము; ఎన్ఱు - అని, మన్దిరత్తు - ఏకాంతమందు, ఎన్నై - నన్నుద్దేశించి, ఒన్ఱు - ఒకమాటను, ఉణర్త్తి - భోధించి, ఉఱుమాఱ్ఱమ్ - బదులుమాటను, ఉరైయీర్ - చెప్పుడు.

తా॥ సపరివారముగా పుష్పముమీదసంచరించుచున్న ఓ హంసపక్షులారా! మీరు శ్రియః పతివద్దకేగి, ఇట్లు బాధపడుచున్న యీ పెను గటాక్షింపరాదాయని చెప్పి దానికి వాఁడేమిబదులు చెప్పునో దానిని నాకువచ్చి చెప్పుఁడని. ౧౦,

‡‡ మాఱ్ఱఙ్గళాయ్న్దుకొణ్డు మదుసూదపిరానడిమేల్*
నాఱ్ఱఙ్గొళ్ పూమ్పొழிల్శూழ் కురుగూర్చ్చడగోపన్శొన్న*
తోఱ్ఱఙ్గళాయిరత్తుళ్ ఇవైయుమొరుపత్తుమ్వల్లార్*
ఊఱ్ఱిన్కణ్ నుణ్మణల్ పోలురుగానిఱ్పర్ నీరాయే. ౧౧.

అ॥ మాఱ్ఱఙ్గళ్ - మంచిశబ్దములను, ఆయ్న్దుకొణ్డు - పరిశీలించుకొని, మదుసూద పిరాన్ - మధుసూదనునియొక్క, అడిమేల్ - శ్రీపాదములవిషయమై, నాఱ్ఱమ్కొళ్ - పరిమళ ముగల, పూ - పుష్పములుగల, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టఁబడిన, కురుగూర్ - తిరు నగరికి స్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వారు, శొన్న - ప్రసాదించిన, తోఱ్ఱఙ్గళ్ - అవతారరూపములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఒరు - అద్వితీయములైన, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, ఊఱ్ఱిన్కణ్ - చెలమయందున్న, నుణ్ - సూక్ష్మమైన, మణల్ పోల్ - ఇసుకవలె, నీరాయ్ - జలమై, ఉరుగానిఱ్పర్ - కరుగుదురు.

తా॥ శ్రియఃపతివిషయమై యనాదిగాయున్న ద్రావిడవేదరూపమైన తిరువాయ్మొழிని సాక్షాత్కరించి నమ్మాళ్వార్లుసాదించిన వెయ్యిపాశురములలో జేరిన యీపదిపాశురముల నభ్యసించువారు నమ్మాళ్వార్లవలెనే మిక్కిలిభక్తిచే గరుగుదురని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౯ - వ, తిరువాయ్మొழி.

అవతారిక:—ఈ తిరువాయ్మొழிలో, శ్రియఃపతివద్ద దూతనుబంపినను వాఁడురానందున భగవత్పదమునందు నేంచేసియున్న వానికివినునట్లు శానే గొప్పధ్వనితో పిలుచుచున్నారు.

‡‡ నీరాయ్నిలనాయ్ త్తీయాయ్క్కాలాయ్ నెడువానాయ్*
శీరాఞ్చుడర్గళిరణ్డాయ్ చ్చివనాయయనానాయ్*

కూరారాழிవెణ్ శఙ్గేన్ది కొడియేన్పాల్
వారాయ్*ఒరునాళ్ మణ్ణుమ్విణ్ణుమ్ మగిழవే. ౧.

అ॥ నీరాయ్ - జలస్వరూపుఁడై, నిలనాయ్ - భూమియై, తీయాయ్ - అగ్నియై, కాలాయ్ - గాలియై, నెడు - విశాలమైన, వానాయ్ - ఆకాశమై, (సకలకారణస్వరూపుఁడై ఈపదార్థములను సృజించి వీనికన్తర్యామియై), శీరార్ - ప్రకాశముతోఁ బూర్ణులై, శుడర్గళ్ - తేజోరూపులైన (చన్ద్రసూర్యులకెడి), ఇరణ్డాయ్ - ఇద్దఱికిని అన్తర్యామియై, శివనాయ్ - రుద్రాన్తర్యామియై, అయనానాయ్ - బ్రహ్మాన్తర్యామియైయున్న ఓ శ్రియఃపతీ! కూర్ - వాడిచే, ఆర్ - పూర్ణమైన, ఆழி - సుదర్శనమును, వెణ్ - తెల్లనైన, శఙ్గు - శ్రీపాఞ్చజన్యమును, ఏన్ది - ధరించి, ఒరునాళ్ - ఒకదినము, మణ్ణుమ్ - లీలావిభూతియు, విణ్ణుమ్ - నిత్యవిభూతియు, మగిழ - సన్తోషించునట్లు, కొడియేన్పాల్ - పాపినైయైన నావద్ద, వారాయ్ - రాం చేయుమా ?

తా॥ సకలకార్యకారణస్వరూపుఁడవైన ఓ శ్రియఃపతీ ! నిన్ను సేవింపక నార్తుఁడనై నేను ఘోషింపగా నాఘోషము చేనుభయవిభూతియు నడరుచున్నవి. అట్లడరకుండ సుఖపడునట్లు నీవు శఙ్ఖచక్రధరుఁడవై నాముందఱ వేంచేసి సేవసాదింపుమాయని. ౧.

మణ్ణుమ్విణ్ణుమ్మగిழ కుఱళాయ్వలఙ్కాట్టి*
మణ్ణుమ్విణ్ణుమ్కొణ్డ మాయవమ్మానే*
నణ్ణియునైనాన్ కణ్డుగన్దుకూత్తాడ*
నణ్ణియొరునాళ్ ఞాలత్తూడేనడవాయే. ౨.

అ॥ మణ్ణుమ్ - భూలోకమును, విణ్ణుమ్ - స్వర్గాదులును, మగిழ - ఆనందించునట్లు, కుఱళాయ్ - వామనబ్రహ్మచారియై, వలమ్ - సౌందర్యమనెడుబలమును, కాట్టి - (మహాబలికి) చూపించి, మణ్ణుమ్ - భూలోకమునున్ను, విణ్ణుమ్ - ఊర్ధ్వలోకములనున్ను, కొణ్డ - స్వీకరించిన, మాయమ్ - ఆశ్చర్యభూతుఁడవైన, అమ్మానే - ఓస్వామీ! నాన్ - నేను, ఉనై - నిన్ను, నణ్ణి - సమీపించి, కణ్డు - సేవించి, ఉగన్దు - సన్తోషించి, కూత్తాడ - నర్తనముచేయునట్లు, ఒరునాళ్ - ఒకదినము, నణ్ణి - (నన్ను) సమీపించి, ఞాలత్తూడే - భూమియందు, నడవాయ్ - సంచరించుమా.

తా॥ సకలలోకమును సేవించి యానందించునట్లు అతిసుందరమైన వామనావతారంబెత్తి తనసౌందర్యముచే మహాబలిని మోహపెట్టి సమస్తలోకముల నాక్రమించిన ఓస్వామీ ! అప్పుడు వారికిసేవసాదించినట్లు నాకిప్పుడు సేవసాదించినన్ను సంతోషపెట్టుమాయని. ౨.

ఞాలత్తూడేనడన్దుమ్నిన్ఱుమ్ కిడన్దిరున్దుమ్*
శాలప్పలనాళ్ ఉగన్దోఱుయిర్గళ్ కాప్పానే*
కోలత్తిరుమామగళోడు ఉన్నైక్కూడాదే*
శాలప్పలనాళ్ అడియేనిన్నుమ్తళర్వేనో. ౩.

అ॥ ఞాలత్తూడే - భూమియందు, నడన్దుమ్ - (దణ్డకావనమందు) సంచరించియు, నిన్ఱుమ్ - (రావణవధానంతరము) నిలిచియు, కిడన్దుమ్ - (సముద్రతీరమందు) పవ్వళించియు, ఇరున్దుమ్ -

(సీతాపిరాట్టితో(గూడ) సేంచేసియుండిరియు, ఊగన్గోలు - (పతియుగములయందును, కాలప్పల వాళ్ - చిరకాలము, ఉయిర్‌గళ్ - (ప్రాణులను, కాప్పానే - రక్షించువాడా! కోలమ్ - సౌందర్యముగల, తిరుమామగళోడు - పెరియపిరాట్టితో(గూడ, ఉన్నై - నిన్ను, కూడాదే - పొందక, అడియేన్ - దాసుడనైననేను, ఇన్నుమ్ - ఇంకను, కాలప్పలవాళ్ - చిరకాలము, తళర్వేనో - శిథిలుడనైయుండుదునా?

తా॥ ఓ(శియఃపతీ! రామావతారమందు భూలోకమందు చిరకాలము సేంచేసియుండిలోకు లకు పలువిధములుగా సేవసాదించి రక్షించిన నీవు పెరియపిరాట్టితో గూడ సేంచేసియున్నప్పుడు ఆకీర్తి నిసేవింపక నేనింక నెంతకాలమిట్లు బాధపడవలెనోయని. ౩.

తళర్‌న్దుమ్ముఱిన్దుమ్ శగడవశురరుడల్ వేఱా*
పిళన్దువీయ త్తిరుక్కాలాణ్డపెరుమానే*
కిళర్‌న్దుపిరమన్ శివ నిన్దిరన్ విణ్ణవర్ శూழ*
విళఙ్గవొరునాళ్ కాణవారాయ్‌విణ్మీదే. ౪.

అ॥ శగడవశురర్ - శకటాసురుడు, తళర్‌న్దుమ్ - శిథిలుడై, ముఱిన్దుమ్ - విఱిగియు, ఉడల్ - అవయవము, వేఱా - వేఱువేఱుగా, పిళన్దు - బద్దలై, వీయ - నశించునట్లు, తిరుక్కాల్ - (శ్రీపాదమును, ఆణ్డ - ప్రయోగించిన, పెరుమానే - ఓస్వామీ! కిళర్‌న్దు - (నిన్ను సేవింపవలయు నని) ఉద్యోగించి, పిరమన్ - బ్రహ్మయు, శివన్ - రుద్రుడును, ఇన్దిరన్ - ఇంద్రుడును, విణ్ణవర్ - దేవతలును, శూழ - చుట్టుకొనిస్తుతింపగా, విళఙ్గ - (ఆకాశమంత) (ప్రకాశించునట్లు, ఒరునాళ్ - ఒకదినము, విణ్‌మీదు - ఆకాశమందు, కాణ - (నేను) సేవించునట్లు, వారాయ్ - సేంచేయుము?

తా॥ ఓస్వామీ! నీవుశకటాసురుని (శ్రీపాదముతో దన్నిస హరించినప్పుడాయాశ్చర్యమును జూచి దేవతలుగుంపుగావాకాశమందు నిలిచి స్తుతించునట్లు వారికి సేవసాదించిన విధంబున, నాకిప్పు డొకదినము సేవసాందింపుమాయని. ౪.

విణ్మీదిరుప్పాయ్‌మలై మేల్‌నిఱ్పాయ్ కడల్ శేర్‌ప్పాయ్*
మణ్మీదుழల్‌వా యివత్ తుళెఙ్గుమ్మఱైన్దుఱైవాయ్*
ఎణ్మీదియన్ఱ పుఱవణ్డత్తాయెనదావి*
ఉణ్మీదాడి యురుక్కాట్టాదేయొళిప్పాయో. ౫.

అ॥ విణ్ మీదు - పరమ పదమందు, ఇరుప్పాయ్ - సేంచేసియున్నవాడవై, మలై మేల్ - తిరువేంకటాద్రియందు, నిఱ్పాయ్ - నిలిచినవాడవై, కడల్ - క్షీరాబ్ధియందు, శేర్‌ప్పాయ్ - పవ్వళించినవాడవై, మణ్ మీదు - భూలోకమందు, ఉழల్వాయ్ - సంచరించువాడవై, ఇవత్తుళ్ - ఈపదార్థములయందు, ఎఙ్గుమ్ - అంతటను, మఱైన్దు - మఱిగియుండి, ఉఱైవాయ్ - వాసముచేయువాడవై, ఎణ్ - సంఖ్యలను, మీదు - పైన, ఇయన్ఱ - ఉన్న (అసంఖ్యేయము లైన), పుఱమ్ - బైటనున్న, అణ్డత్తాయ్ - అండములలోనున్నవాడవైననీవు, ఎనదు - నా యొక్క, ఆవి - ఆత్మకు, ఉళ్ మీదు - లోపలనున్నుబైటనున్ను, ఆడి-సంచరించి, ఉరుక్కాట్టాదే - (నీ) తిరుమేనుమగనుపుంచక నే, ఒళిప్పాయో - దాగుకొనెదవా?

తా॥ సమస్తవస్తువులయందును వ్యాపించియున్న నీవు నాలోచలనుండియు నాకుఁగనుబడకపోతివంటె దానిని నేనెట్లుసహించెదనని. ౫.

పాయోరడివైత్తదన్కీழ్ప్పరవై నిలమెల్లామ్
తాయ్*ఓరడియా లెల్లావులగుమ్తడవన్ద
మాయోన్ *ఉన్నై క్కాణ్బాన్ వరున్దియెనైనాళుమ్*
తీయోడుడన్ శేర్ మెழுగా యులగిల్తిరివేనో. ౬.

అ॥ ఓరడి - ఒక శ్రీపాదమును, పాయ్ - అంతటవ్యాపించునట్లు, వైత్తు - ఉంచి, అదన్కీழ் - అతిరువడిక్రిందనున్న, పరవై - సముద్రముచేఁజుట్టబడిన, నిలమెల్లామ్ - భూమియంతను, తాయ్ - కొలిచి, ఓరడియాల్ - మఱియొకతిరువడిచేత, ఎల్లావులగుమ్ - ఊర్ధ్వలోకములన్నింటిని, తడవన్ద - స్పర్శించిన, మాయోన్ - ఆశ్చర్యభూతుఁడా! ఉన్నై - నిన్ను, కాణ్బాన్ - సేవించుటకై, ఎనైనాళుమ్ - ఎల్లప్పుడును, తీయోడు - అగ్నితో, ఉడన్ - కూడ, శేర్ - చేరిన, మెழுగాయ్ - మైనమువలె, వరున్ది - బాధపడి, ఉలగిల్ - లోకమందు, తిరివేనో - తిరుగుదునా?

తా॥ ఓ శ్రియఃపతీ! సకలలోకములనుగొలిచి యోగ్యులనియు అయోగ్యులనియు జూడక సమస్తప్రాణులను నీతిరువడికళ్ళచే స్పృశించి యుజ్జీవింపఁజేసిన నీయపారకారుణ్యమును దలచి నిన్ను సేవింపనాశపడి నశింపకుండను బ్రదుకకుండను నిట్లు బాధపడుచున్నానని. ౬.

ఉలగిల్తిరియుఙ్కరుమకదియా యులగమాయ్*
ఉలగుక్కే యోరుయిరుమానాయ్ పుఱవణ్డత్తు*
అలగిల్పొలిన్ద తిశైపత్తాయవరువేయో*
అలగిల్పొలిన్ద అఱివిలేనుక్కరుళాయే. ౭.

అ॥ ఉలగిల్ - లోకమందు, తిరియుమ్ - నడుచుచున్న (చేయుచున్న), కరుమమ్ - పుణ్యపాపరూపములైనకర్మములనెడి, కది - ఉపాయములకు, ఆయ్ - ఫలప్రదుఁడవై, ఉలగమ్ - ఆకర్మములననుష్ఠించుచున్న అధికారులకు, ఆయ్ - ప్రవర్తకుఁడవై, ఉలగుక్కు - లోకములకు, ఓరుయిరామ్ - ఒకయాత్మయై, ఆనాయ్ - ఉన్నవాఁడవై, పుఱవణ్డత్తు - అండమునకవతల, అలగిల్ - సంఖ్యయందు, పొలిన్ద - పూర్ణులై, (అసంఖ్యేయులై), తిశైపత్తు - పదిదిక్కులయందును, ఆయ - వ్యాప్తులైయున్న, అరువే - ఆత్మలకనిర్వాహకుఁడవైయున్న, ఓ శ్రియఃపతీ! అలగిల్పొలిన్ద - అసంఖ్యేయములైన, అఱివిలేనుక్కు, - అజ్ఞానముగలనాకు, అరుళాయ్ - కృపజేయుమా; ఓ అని ఆర్తధ్వని.

తా॥ పుణ్యపాపములకును, సకలప్రాణులకును నీవేనిర్వాహకుఁడవైయుండగా నిన్నతిక్రమించి నేనే సాధనమనుష్ఠించి నిన్నుబొందెదనని. ౭.

అఱివిలేనుక్కరుళా యఱివారుయిరానాయ్*
వెఱికొళ్శోదిమూర్త్తి యడియేన్నెడుమాలే*

కిఱిశెయ్దెన్నై ప్పులత్తిట్టిన్నమ్ కెడుప్పాయో*
పిఱిదొన్ఱఱియా వడియేనావితిగైక్కవే. ౮.

అ॥ అఱివార్ - జ్ఞానవంతులను, ఉయిరానాయ్ - నీకాత్మగాగలవాఁడవై, వెఱికొళ్ - పరిమళించుచున్న, శోది - తేజోమయమైన, మూర్త్తి - విగ్రహముగలవాఁడవై, అడియేన్ - దాసునియందు, నెడుమాలే - మిక్కిలివ్యామోహముగలవాఁడవైయున్న ఓస్వామీ! అఱివిలే నుక్కు - బుద్ధిహీనుఁడనైననాకు, అరుళాయ్ - కృపజేయుమా, పిఱిదు - నిన్నుదక్కవేఱైన, ఒన్ఱు - ఒకఉపాయమును, అఱియా - ఎఱుఁగని, అడియేన్ - దాసునియొక్క, ఆవి - మనసు, తిగైక్క - భ్రమించునట్లు, కిఱిశెయ్దు - ఏదోయొకవుపాయముజేసి, ఎన్నై - నన్ను, పులత్తిట్టు - బాహ్యవిషయ(సంసార)మందుబడద్రోసి, ఇన్నమ్ - ఇంకను, కెడుప్పాయో - చెడఁగొట్టెదవో?

తా॥ ఓశ్రియఃపతీ! నీవింతకాలమువఱకు నన్నుబరిగ్రహించనందున ఏదోయొకవుపాయముచే నన్నిఁకను సంసారమందు బడద్రోసెదవో యేమోయని భయపడుచున్నానని. ౮.

ఆవితిగైక్క ఐవర్కుమైక్కుమ్శిఱ్ఱిన్బమ్*
పావియేనైప్పలనీకాట్టిప్పడుప్పాయో*
తావివైయమ్కొణ్డ తడన్తామరైగట్కే*
కూవిక్కొళ్ళుమ్కాల మిన్నఙ్కుఱుగాదో. ౯.

అ॥ ఆవి - మనస్సు, తిగైక్క - అల్లాడునట్లును, ఐవర్ - పంచేంద్రియములు, కుమైక్కుమ్ - బాధించునట్లును, శిఱు - అల్పములై, పల - అనేకములైన, ఇన్బమ్ - సుఖములను, నీ - నీవు, కాట్టి - చూపించి, పావియేనై - పాపిష్ఠుఁడనైననన్ను, పడుప్పాయో - బాధించెదవా? వైయమ్ - భూమిని, తావి - కొలిచి, కొణ్డ - స్వీకరించిన, తడమ్ - విశాలములైన, తామరైగట్కు - శ్రీపాదపద్మములయందు, కూవిక్కొళ్ళుమ్ - పిలుచుకొనఁదగిన, కాలమ్ - కాలము, ఇన్నమ్ - ఇఁకను, కుఱుగాదో - సమీపించదా?

తా॥ ఎంతగొప్పజితేంద్రియునికూడ వ్యాకులపఱచి చెడఁగొట్టదగినక్షుద్రసుఖములుగల యీసంసారమందు నన్నిదివఱకునుంచి మిక్కిలిబాధపెట్టితివి. నీతిరువడిగళ్ళయందు నన్ను జేర్పుకొనఁదగినకాలమెప్పుడు దగ్గఱవచ్చునో తెలియలేదని. ౯.

కుఱుగామీళా విఱుదికుడా ఎన్నైయూழி*
శిఱుగా పెరుగా అళవిలిన్బమ్ శేర్న్దాలుమ్*
మఱుకాలిన్ఱి మాయోయ్ ఉనక్కేయాళాగుమ్*
శిఱుకాలత్తైయుఱుమో అన్దో తెరియిలే. ౧౦.

అ॥ కుఱుగా - హ్రస్వముకానిదియు, నీళా - దీర్ఘముకానిదియు, ఇఱుది - నాశము, కూడా - లేనిదియు, ఎన్నైయూழி - ఎల్లప్పుఁడును, శిఱుగా - కృశింపనదియు, పెరుగా - స్థూలముకానిదియు, అళవిల్ - అవధిలేనిదియునైన, ఇన్బమ్ - ఆత్మానుభవసుఖమును, శేర్న్దాలుమ్ - పొందినను, మాయోయ్ - ఆశ్చర్యభూతుఁడా! తెరియిల్ - విచారించినయెడల, మఱు

కాలిన్ఱి - మఱియొకప్పుడులేకనే, శిఱుకాలత్తై - ఒకతుఃణకాలము, ఉనక్కే - నీకే, ఆళాగుమ్ - దాసుఁడై చేసెడికైఙ్కర్యసుఖమునకు, ఉఱుమో - ఒప్పగునా ? అన్దో - అయ్యో ?

తా॥ వృద్ధిక్షయాదిదోషములేమియులేని యాత్మానుభవమునెడికైవల్యసుఖమును బొందినను, ఆసుఖము, నీకైఙ్కర్యసుఖముతో నెంతమాత్రము నొప్పదని.　　　　౧౦.

‡‡ తెరిదల్నినైద లెణ్ణలాగా త్తిరుమాలుక్కు*
ఉరియతొణ్డర్తొణ్డర్ తొణ్డన్ శడగోపన్*
తెరియచ్చొన్న ఓరాయిరత్తుళిప్పత్తుమ్*
ఉరియతొణ్డరాక్కుమ్ ఉలగముణ్డాఱ్కే.　　　　౧౧.

అ॥ తెరిదల్ - శాస్త్రజ్ఞానముచేతను, నినైదల్ - మననముచేతను, ఎణ్ణల్ - ధ్యానముచేతను, ఆగా - పరిచ్ఛేదించుటకశక్యుఁడైన, తిరుమాలుక్కు - శ్రియఃపతికి, ఉరియ - అసాధారణులైన, తొణ్డర్ - దాసులైనవారికి, తొణ్డర్ - దాసభూతులైనవారికి, తొణ్డన్ - దాసులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, తెరియ - (భగవద్గుణములు) విశదములగునట్లు, శొన్న - సాదించిన, ఓరాయిరత్తుళ్ - అద్వితీయములైన వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, (అనుసంధించువారిని), ఉలగముణ్డాఱ్కు - జగద్రక్షకుఁడైన శ్రియఃపతికి, ఉరియతొణ్డరాక్కుమ్ - అనన్యశేషులై చేయును.

తా॥ శ్రవణమననాదులచే దెలిసికొనుటకశక్యుఁడైన శ్రియఃపతికి చరమావధిదాసులైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు భగవంతుని కనన్యభక్తులగుదురని.　　　　౧౨.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౧౦ - వ తిరువాయ్మొழி.

అవతారిక:— ఈవిధంబున పరమపదమందు వినునట్లు శవశాధను ఘోషించిచెప్పినను శ్రియఃపతిరానందున దీనికి ప్రపత్తితప్ప మఱియొకుపాయములేదని నిశ్చయించి తిరువేఙ్గడముడైయాన్ తిరువడికళ్ళలో పిరాట్టిని పురుషకారముగాజేసికొని ప్రపత్తిచేయుచున్నారు.

‡‡ ఉలగముణ్డపెరువాయా ఉలప్పిల్కీర్త్తియమ్మానే*
నిలవుమ్శుడర్శూழ்ఒళిమూర్త్తి నెడియాయడియేనారుయిరే*
తిలదములగుక్కాయ్నిన్ఱ తిరువేఙ్గడత్తెమ్బెరుమానే*
కులతొల్లడియేనునపాదమ్ కూడుమాఱుకూఱాయే.　　　　౧.

అ॥ ఉలగమ్ - లోకములను, ఉణ్డ - ఆరగించిన, పెరువాయా - పెద్దనోఱుగలవాఁడా ! ఉలప్పిల్ - అవధిలేని, కీర్త్తి - యశస్సుగల, అమ్మానే - ఓస్వామీ ! నిలవుమ్-నిత్యమై, శుడర్-తేజస్సుచేత, శూழ் - వ్యాప్తమై, ఒళి-తేజోమయమైన, మూర్త్తి - దివ్యవిగ్రహముగలవాఁడా!

నెడియాయ్ - గొప్పమహిమగలవాఁడా! అడియేన్ - దాసుఁడనైనవాకు, ఆర్ - పూర్ణమైన, ఉయిరే - ప్రాణభూతుఁడా! ఉలగుక్కు - లోకములకు, తిలదమాయ్ - తిలకస్వరూపమై, నిన్ఱు - ఉన్న, తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రిలో వేంచేసియున్న, ఎమ్బెరుమానే - నాస్వామీ ! కులమ్ - కులక్రమాగతమై, తొల్ - అనాదియైన, అడియేన్ - దాస్యముగలనేను, ఉన - నీయొక్క, పాదమ్ - తిరువడికళ్ళను, కూడుమాఱు - చేరువిధమును, కూఱాయ్ - చెప్పుమా.

తా॥ నిరవధిక తేజోమయవిగ్రహుఁడవై, అనన్తకల్యాణగుణాకరుఁడవై, సకల జగద్రక్షకుఁడవై, భూలోకమున కలఙ్కారభూతమైన తిరుమలయందు వేంచేసియున్న ఓస్వామీ! నీతిరువడికళ్ళను నే నేవిధము చేరఁగలెదనో ? ఆవుపాయమును నాకు జెప్పుమాయని. ౧

కూఱాయ్నీఱాయ్నిలనాగి క్కొడువల్లశురర్ కులమెల్లామ్*
శీఱావెరియుమ్తిరునేమివలవా తెయ్వక్కోమానే*
శేఱార్శునై త్తామరై శెన్దీమలరుమ్ తిరువేఙ్గడత్తానే*
ఆఱావన్బిలడియేనున్నడిశేర్ వణ్ణమరుళాయే. ౨

అ॥ కొడు - క్రూరులై, వల్ - బలిష్ఠులైన, అశురర్ - అసురులయొక్క, కులమెల్లామ్ - వంశమంతయు, కూఱాయ్ - తునకలై, నీఱాయ్ - భస్మమై, నిలనాగి - నేలలై (మన్ను - నిశ్శేషమై) పోవునట్లు శీఱా - కోపగించి, ఎరియుమ్ - జ్వలించుచున్న, తిరునేమి - సుదర్శనమును, వలవా - దక్షిణహస్తమందుగలవాఁడా ! తెయ్వమ్ - నిత్యసూరులకు, కోమానే - నాయకుఁడా! శేఱు - బురదచే, ఆర్ - పూర్ణమైన, శునై - చెలమనీళ్ళయందలి, తామరై - తామరసపుష్పము, శెమ్ - ఎఱ్ఱని, తీ - నిప్పువలె (కాన్తిగలదై), మలరుమ్ - వికసించుచున్న, తిరువేఙ్గడత్తానే - వేఙ్కటాచలమునకుస్వామియైనవాఁడా ! ఆఱా - అపరిచ్ఛిన్నమైన, అన్బిల్ - (నీవిషయమైన) స్నేహములోనున్న, (స్నేహముగల), అడియేన్ - దాసుండనైననేను, ఉన్నడి - నీశ్రీపాదమ్ములను, శేర్వణ్ణమ్ - చేరువిధమును, అరుళాయ్ - కృపజేయుమా ?

తా॥ శత్రుసంహారకులైనసుదర్శనాళ్వార్లను శ్రీహస్తమందుధరించి, అతిరమణీయమైన వేంకటాద్రియందు వేంచేసియున్న ఓశ్రియఃపతీ! నాపాపములనుబోగొట్టి నీభక్తుఁడనైననన్ను నీతిరువడికళ్ళయందు జేర్చుకొనుమాయని. ౨

వణ్ణమరుళ్కొళ్అణిమేగవణ్ణా మాయవమ్మానే*
ఎణ్ణమ్పుగున్దుతిత్తిక్కుమముదే యిమైయోరదిపతియే*
తెణ్ణలరువిమణిపొన్ముత్తలైక్కుమ్ తిరువేఙ్గడత్తానే*
అణ్ణలేయున్నడిశేర అడియేనాకావాఴెన్నాయే. ౩

అ॥ వణ్ణమ్ - కాన్తిచేత, మరుళ్కొళ్ - మోహింపఁజేసెడి, అణి - శ్లాఘ్యమైన, మేగమ్ - మేఘమువంటి, వణ్ణా - కాన్తిగలవాఁడా ! మాయమ్ - ఆశ్చర్యచేష్టితములుగలవాఁడవై, అమ్మానే - నాకుస్వామియైనవాఁడా! ఎణ్ణమ్ - (నా) మనస్సులో, పుగున్దు - ప్రవేశించి, తిత్తిక్కుమ్ - తీయగానున్న, అముదే - అమృతమువంటివాఁడా! ఇమైయోర్ - నిత్యసూరులకు, అదిపతియే - స్వామి

యైనవాఁడా! తెళ్ - నిర్మలమై, నల్ - శ్లాఘ్యమైన, అరువి - కొండకాలువలు, మణి - రత్నములనున్ను, పొన్ - బంగారమునున్ను, ముత్తు - ముత్యములనున్ను, అలైక్కుమ్ - తీరమందు గుంపుగాజేర్చుచున్న, తిరువేఙ్గడత్తానే - వేఙ్కటాద్రియందు వేంచేసియున్న, అణ్ణలే - ఓ స్వామీ! ఉన్ అడిశేర - నీ శ్రీపాదమును బొందునట్లు, అడియేఱ్కు - దాసునికి, అ అ ఎన్నాయే - అయ్యో అయ్యో అని కనికరింపుమా.

తా॥ నిత్యసూరిసేవ్యుండవై యతిసుందరంబులైన దివ్యరూపచేష్టితములుగలవాఁడవై తిరుమలయందు వేంచేసి నన్ను దాసునిగాజేసికొని నాహృదయమందుఁ బ్రవేశించియున్న ఓ శ్రియఃపతీ! ఈ సంసారమందుండి బాధపడుచున్న నన్ననుగ్రహించి నీ శ్రీపాదములయందుఁ జేర్చుకొనుమా యని. ౩.

ఆవావెన్నాదులగత్తైయలైక్కుమసురర్ వాణాళ్మేల్*
తీవాయ్వాళిమళైపొழிన్దశిలైయా తిరుమామగళ్ కేళ్వా
తేవా* శురర్గళ్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే*
పూవార్కழల్గళరువినైయేన్ పొరున్దుమాఱుపుణరాయే. ౪.

అ॥ ఆవావెన్నాదు - అయ్యో అయ్యో అని కరికరించక, ఉలగత్తై - లోకములను, అలైక్కుమ్ - బాధించుచున్న, అశురర్ - అసురులయొక్క, వాழ்నాళ్మేల్ - జీవితకాలముమీద, తీవాయ్ - నిప్పును ముఖమందుగల, వాళి - బాణములయొక్క, మழై - వర్షమును, పొழிన్ద - కురుయించుచున్న, శిలైయా - ధనుస్సుగలవాఁడా! తిరుమామగళ్ - పెరియపిరాట్టికి, కేళ్వా - వల్లభుఁడా! తేవా - ఉజ్జ్వలస్వరూపుఁడా! శురర్గళ్ - దేవతలును, మునిక్కణఙ్గళ్ - ఋషులసమూహములును, వణఙ్గుమ్ - నమస్కరించుచున్న, తిరువేఙ్గడత్తానే - ఓ వేఙ్కటాచలపతీ! పూ - పుష్పములతో, ఆర్ - సమానములైన, కழల్గళ్ - (నీ) శ్రీపాదములను, అరు - క్రూరమైన, వినైయేన్ - పాపముగలనేను, పొరున్దుమాఱు - బొందెడివిధమును, పుణరాయ్ - సఙ్కల్పించుమా ?

తా॥ విరోధులనుసంహరించుచేసిభక్తజనులాశ్రయించునట్లు వేంకటాద్రియందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నాపాపములనుబోగొట్టి నీపాదములయందుఁ జేరునట్లు సఙ్కల్పించుమా యని. ౪.

పుణరానిన్ఱమరమేழுమెయ్దవొరువిల్ వలవావో*
పుణరేయ్నిన్ఱమరమిరణ్డిన్ నడువేపోనముదల్వావో*
తిణరార్ మేగమెనక్కళిఱుశేరుమ్ తిరువేఙ్గడత్తానే*
తిణరార్ శార్ఙ్గత్తునపాదమ్ శేర్వదడియేనెన్నాళే. ౫.

అ॥ పుణరానిన్ఱ - గుంపుగాజేరియున్న, మరమేழுమ్ - సప్తసాలవృక్షములను, అన్ఱు - అప్పుడు, ఎయ్ద - కొట్టిన, ఒరువిల్ వలవా - అద్వితీయుఁడవైన ధనుర్ధరుఁడా! పుణర్ - చేరికను, ఏయ్ - పొంది, నిన్ఱ - ఉన్న, మరమిరణ్డిన్ - మద్దివృక్షములరెండిటియొక్క, నడువే - నడుమను, పోన - వెళ్ళిన, ముదల్వా - జగత్కారణుఁడా! తిణరార్ - దట్టమై యున్న, మేగమెన - మేఘము వలెనున్న, కళిఱు - ఏనుఁగు, శేరుమ్ - చేరియున్న, తిరువేఙ్గడత్తానే - వేఙ్కటాచలమునందు

స్వామీ! తిణరార్ - బలముచేపూర్ణమైన, శార్ఙ్గన్-ధనుస్సుగల, ఉన - నీయొక్క, పాదమ్ - తిరువడిగళ్ళను, అడియేన్ - దాసుడనైననేను, శేర్వదు - పొందుట, ఎన్నాళ్ - ఎప్పుడు?

తా॥ ఒకవఱుసగా లేకుండ గుండ్రముగా చుట్టునున్న సాలవృక్షములేడింటిని యొకబాణముచేఁగొట్టిన శూరుఁడవైన ఓవేఙ్కటాచలపతీ! ఈసంసారదుఃఖమునువదలి నీతిరువడికళ్ళనెప్పుడు చేరెదనోయని. ౫.

ఎన్నాళే నామ్మణ్ణళన్ద ఇణై త్తామరైగళ్ కాణ్బదఱ్కెన్ఱు*
ఎన్నాళుమ్నిన్ఱిమైయోర్గళేత్తి యిఱైఞ్జియినమినమాయ్*
మెయ్నావుమనత్తాల్ వழிపాడు శెయ్యుమ్ తిరువేఙ్గడత్తానే*
మెయ్న్నానెయ్దియెన్నాళ్ ఉన్నడిక్కళడియేన్ మేవువదే. ౬.

అ॥ మణ్ - భూమిని, అళన్ద - కొలిచిన, ఇణై - చేరియున్న, తామరైగళ్ - శ్రీపాద పద్మములను, నామ్ - మనము, కాణ్బదఱ్కు - సేవించుటకు, ఎన్నాళే-ఏదినముసమ్భవించునో? ఎన్ఱు - అని, ఇమైయోర్గళ్ - నిత్యసూరులు, ఎన్నాళుమ్ - ఎల్లప్పుడును, ఇనమినమాయ్ - గుంపుగుంపుగా, నిన్ఱు - చేరియుండి, ఏత్తి - స్తుతించి, ఇఱైఞ్జి - ఆశ్రయించి, మెయ్ - శరీరము చేతను, నా - వాక్కు చేతను, మనత్తాల్ - మనస్సుచేతను, వழிపాడు-కైఙ్కర్యము, శెయ్యుమ్-చేయుచున్న, తిరువేఙ్గడత్తానే - ఓవేఙ్కటాచలపతీ! అడియేన్ - దాసుడనైన, నాన్ - నేను, మెయ్ - యథార్థముగా (ప్రత్యక్షముగా), ఎయ్ది - పొంది, ఉన్నడిక్కళ్ - నీశ్రీపాదములను, మేవువదు - అమరికతో బొందుట, ఎన్నాళ్ - ఎప్పుడో?

తా॥ త్రివిక్రమావతారమందు లోకములను కొలిచిన నీశ్రీపాదములనుసేవింపవాళపడి నిత్యసూరులువచ్చి మనోవాక్కాయములచేఁ కైఙ్కర్యముచేయుచున్నట్లు వేఙ్కటాద్రియందు వేంచేసియున్న ఓశ్రియఃపతీ! నీశ్రీపాదములను నేనెప్పుడు ప్రత్యక్షముగానేవించెదనో యని. ౬.

అడియేన్మేవియమర్గిన్ఱ వముదే యిమైయోరదిపతియే*
కొడియావడుపుళ్ళుడైయానే కోలక్కనివాయ్ప్పెరుమానే*
శెడియార్విన్నైగళ్ తీర్మరున్దే తిరువేఙ్గడత్తెమ్బెరుమానే*
నొడియార్పొழுదుమునపాదమ్ కాణనోలాదాఱ్ఱేనే. ౭.

అ॥ అడియేన్ - దాసుడనైననేను, మేవి - సమీపించి, అమర్గిన్ఱ - నిరన్తరానుభవము చేయుచున్న, అముదే - అమృతమువలె భోగ్యభూతుఁడా! ఇమైయోర్ -నిత్యసూరులకు, అదిపతియే - నిర్వాహకుఁడా! అడు - (శత్రువులను) నశింపఁజేయుచున్న, పుళ్-గరుత్మంతుని, కొడియా - ధ్వజముగా, ఉడైయానే - కలవాఁడా, కోలమ్ - సుందరమై, కని - పండువలెనున్న, వాయ్ - అధరముగల, పెరుమానే - గొప్పవాఁడా! శెడి - పాపములచే, ఆర్-కలిగిన, విన్నైగళ్ - దుఃఖములను, తీర్ - తీర్చెడి, మరున్దే - ఔషధమువంటివాఁడా! తిరువేఙ్గడత్తు - వేఙ్కటాద్రియందు వేంచేసియున్న, ఎమ్పెరుమానే - మాస్వామీ! ఉనపాదమ్ - నీతిరువడి కళ్ళను, కాణ - సేవించుటకుఁదగిన, నోలాదు - పుణ్యముజేయక (ఉండినను), నొడియార్పొழுదుమ్ - క్షణమాత్రమును, ఆఱ్ఱేన్ - (నిన్ను విడువక) సహించియుండలేను.

తా॥ నిత్యసూరి నిర్వాహకుఁడవై, సకల శత్రువులనున్ను ఆశ్రితపాపములనున్ను నశింపఁ జేయువాఁడవై, వేఙ్కటాద్రియందు వేంచేసియుండి నాకు పరమభోగ్యుండవై యున్న ఓ శ్రియఃపతీ! నిన్ను బొందుటకు నేనొకసాధనము జేయకపోయినను, సాధనానుష్ఠానము జేసినవారివలె నిన్ను సేవింప మిక్కిలి త్వరపడుచున్నానని. ౭.

నోలాదాఱ్ఱేన్ ఉనపాదమ్ కాణవెన్ఱు నుణ్ణుణర్విన్*
నీలార్‌కణ్డత్తమ్మానుమ్ నిఱైనాన్ముగనుమిన్దిరనుమ్*
శేలేఙ్కణ్ణార్ పలర్ శూழ్‌విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే*
మాలాయ్ మయక్కియడియేన్పాల్ వన్దాయ్‌పోలే వారాయే. ౮.

అ॥ ఉనపాదమ్ - నీశ్రీపాదములను, కాణ - సేవించుటకు, నోలాదు - భాగ్యముజేయక నుండియు, ఆఱ్ఱేన్ - నిన్నువదిలియుండలేను; ఎన్ఱు - అనిచెప్పి, నుణ్ - సూక్ష్మమైన, ఉణర్విన్ - బుద్ధిగల, నీలార్ - నీలవర్ణముచేపూర్ణమైన, కణ్డమ్ - కణ్ఠముగల, అమ్మానుమ్ - రుద్రుఁడైనరుద్రుఁడును, నిఱై - జ్ఞానపూర్తిగల, నాన్ముగనుమ్ - చతుర్ముఖుఁడును, ఇన్దిరనుమ్ - ఇంద్రుఁడును, శేలేయ్ - మత్స్యముతో బోలిన, కణ్ణార్ - నేత్రములుగల, పలర్ - (సరస్వతి పార్వతిమొదలగు) అనేకస్త్రీలతోఁగూడ, శూழ் - చుట్టబడినవారై, విరుమ్బుమ్ - ప్రీతితో నాశ్రయించుచున్న, తిరువేఙ్గడత్తానే - ఓవేఙ్కటాద్రినాథుఁడా! మాలాయ్ - శ్యామవర్ణముగల కృష్ణుఁడై, మయక్కి - మోహపఱచి, వన్దాయ్‌పోలే - (వసుదేవాదులముందఱ) వేంచేసినట్లు, వారాయ్ - (నాముందఱ) వేంచేయుమా.

తా॥ ఓ శ్రియఃపతీ! సాధనానుష్ఠానముజేయని నేనుమాత్రమేగాక సాధనాంతరపరులై జ్ఞానవంతులై సమర్థులైయున్న బ్రహ్మరుద్రేంద్రాదులుగూడ నైచ్యానుసంధానముజేయుచు తమతమ స్త్రీలతోఁగూడవచ్చి యాశ్రయించునట్లు వేంకటాద్రియందు వేంచేసియున్న నీవు, కృష్ణావతారమందు వసుదేవాదులకువచ్చి సేవసాదించినట్లు నాముందఱవేంచేసి సేవసాదింపుమాయని. ౮.

వన్దాయ్‌పోలేవారాదాయ్ వారాదాయ్‌పోల్ వరువానే*
శెన్దామరైక్కణ్ శెఙ్గనివాయ్ నాల్‌దోళముదే యెనదుయిరే*
శిన్దామణిగళ్ పగరల్లైప్పగల్ శెయ్ తిరువేఙ్గడత్తానే*
అన్దోవడియేనునపాదమ్ అగలకిల్లేనిఱైయుమే. ౯.

అ॥ వన్దాయ్‌పోలే - (అభక్తులకు) వచ్చినవాఁడవు (సులభుఁడు)వలెనుండి, వారాదాయ్ - రానివాఁడును (దుర్లభుఁడును), వారాదాయ్‌పోల్ - (భక్తులకు) రానివాఁడవు (అసులభుఁడు) వలెనుండి, వరువానే - వచ్చుచున్నవాఁడవును (సులభుఁడును), శెమ్ - ఎఱ్ఱని, తామరై - పద్మము వలెనున్న, కణ్ - నేత్రములనున్ను, శెమ్ - ఎఱ్ఱని, కని - దొండపండువలెనున్న, వాయ్ - అధరమునున్ను, నాల్ తోళ్ - నాలుగుభుజములనున్నుగల, అముదే - భోగ్యభూతుఁడా! ఎనదు - నాకు, ఉయిరే - ప్రాణభూతుఁడా! శిన్దామణిగళ్ - చిన్తామణులయొక్క, పగర్ - కాన్తి, అల్లై - రాత్రిని, పగల్ శెయ్ - దినమువలెచేయుచున్న, తిరువేఙ్గడత్తానే - తిరుమలయందు వేంచేసి

యున్న ఓశ్రియఃపతీ! ఉనపాదమ్ - నీశ్రీపాదములను, అడియేన్ - దాసుఁడనైననేను, ఇఱైయుమ్ - క్షణమాత్రముగూడ, అగల - ఎడబాసి, కిల్లేన్ - ఉండలేను.

తా॥ భక్తులకుసులభుఁడవై యభక్తులకుదుర్లభుఁడవై యతిరమణీయంబులైన దివ్యావయవములు గలవాఁడవై, రాత్రిగూడదినమువలె ప్రకాశించునట్లు మంచితేజస్సుగలరత్నములచే నిండియున్న వేంకటాద్రియందు వేంచేసియున్న ఓస్వామీ! నీశ్రీపాదములనువదలి నేనొక క్షణముగూడ నుండలేనని.

౹౹ అగలకిల్లేనిఱైయుమెన్ఱలర్ మేల్ మఙ్గైయుఱైమార్బా*
నిగరిల్ పుగழாయులగమూన్ఱుడైయాయెన్నైయాళ్వానే*
నిగరిలమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే*
పుగలొన్ఱిల్లావడియే నున్నడిక్కీழமర్న్దుపుగున్దేనే. ౧౦.

అ॥ ఇఱైయుమ్ - ఒకక్షణముగూడ, అగల - విశ్లేషించియుండుటకు, కిల్లేన్ - సమర్థురాలుకాను, ఎన్ఱు - అని, అలర్ మేల్ - పుష్పముమీదవాసముజేయుచున్న (నిరతిశయభోగ్యురాలైన), మఙ్గై - పెరియపిరాట్టి, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, మార్బా - వక్షస్థలముగలవాఁడవై, నిగరిల్ - ఒప్పులేని, పుగழாయ్ - యశస్సుగలవాఁడవై, ఉలగమ్మూన్ఱు - మూడులోకములను, ఉడైయాయ్ - (తనకురత్న్యములై) కలవాఁడవై, ఎన్నై - నన్ను, ఆళ్వానే - పరిపాలించువాఁడవై, నిగరిల్ - ఒప్పులేని, అమరర్ - నిత్యసూరులును, మునిక్కణఙ్గళ్ - ఋషిసమూహములును, విరుమ్బుమ్ - ఆశపడియాశ్రయించుచున్న, తిరువేఙ్గడత్తానే - తిరుమలయందు వేంచేసియున్న ఓస్వామీ! పుగల్ - ఉపాయము, ఒన్ఱు - ఒకటియు, ఇల్లా - లేని, అడియేన్ - దాసుఁడనైననేను, ఉన్నడిక్కీழ் - నీశ్రీపాదములక్రింద, అమర్న్దు - అమరియున్నవాఁడనై, పుగున్దేన్ - ప్రవేశించితిని.

తా॥ సౌన్దర్యసౌగన్ధ్యమార్దవాదిగుణములచే నిరతిశయభోగ్యురాలైన పెరియపిరాట్టికూడ క్షణకాలము విశ్లేషించియుండలేక నెల్లప్పుడును నీవక్షస్థలమందు నిత్యవాసముజేయునట్లు నిరతిశయభోగ్యభూతుఁడవై, నిరుపమానంబులైన వాత్సల్యాదికల్యాణగుణములుగలవాఁడవై, సకలజగద్రక్షకుఁడవై, నిత్యసూరిసేవ్యుఁడవై, వేంకటాద్రియందత్యన్తసులభుఁడవైవేంచేసియున్న ఓశ్రీమన్నారాయణుఁడా! నేనుసకలోపాయములను వదలి నీతిరువడికళ్ళనే యుపాయముగానమ్మి యాశ్రయించితినని - ఈపాశురముద్వయార్థప్రతిపాదకమని పూర్వాచార్యులు నిర్వహించుదురు. ౧౦.

౹౹ అడిక్కీழమర్న్దుపుగున్దడియీర్ వాழ్మినెన్ఱెన్ఱరుళ్ కొడుక్కుమ్*
పడిక్కేழிల్లాప్పెరుమానై ప్పழనక్కురుగూర్చ్చడగోపన్*
ముడిప్పానశొన్నవాయిరత్తు త్తిరువేఙ్గడత్తుక్కివై పత్తుమ్*
పిడిత్తార్పిడిత్తార్వీఱ్ఱిరున్దు పెరియవానుళ్ నిలావువరే. ౧౧

అ॥ అడియార్ - ఓభక్తులారా! అడిక్కీழ் - (నా) శ్రీపాదములక్రింద, అమర్న్దు - (అనన్యప్రయోజనులై) అమరియుండి, పుగున్దు - ప్రవేశించి, వాழ் మిన్ - ఉజ్జీవించుడి; ఎన్ఱెన్ఱు - అనియుపదేశించి, అరుళ్ కొడుక్కుమ్ - కృపజేయుచున్న, పడి - విధమునకు, కేழ్ ఇల్లా - ఒప్పులేని, పెరుమానై - సర్వేశ్వరునియుద్దేశించి, పழనమ్ - పొలములచేసమృద్ధమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, ముడిప్పాన్ - తనుదుఃఖమునునశింపఁజేయుటకై, శొన్న - ప్రసాదించిన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలోఁజేరిన, తిరువేఙ్గడత్తుక్కు - తిరుమలకుప్రతిపాదకమైన, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములను, పిడిత్తార్ - ఆశ్రయించినవారిని (అభ్యసించినవారిని), పిడిత్తార్ - ఆశ్రయించినవారు, పెరియ - గొప్పమహిమగల, వానుళ్ - పరమపదమందు, వీఱ్ ఱిరున్దు - తను మహిమప్రకాశించునట్లుండి, నీలావువర్ - నిత్యానుభవము చేయుదురు.

తా॥ ఓభక్తులారా! మీరు మాయొక్క యీతిరువడికళ్ళనాశ్రయించి యుజ్జీవింపుడియని తనశ్రీహస్తముచే తిరువడికళ్ళను చూపుచు ఉపదేశించుచున్న నిరవధికదయావంతులైన తిరువేఙ్గడముడైయాన్ విషయమై నమ్మాழ்వార్లుప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారును, వారినాశ్రయించువారును శ్రీవైకుణ్ఠమందు వెళ్ళి నిత్యానన్దమునునుభవింతురని. ౧౧,

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౬—పది, సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్మొழிలు అఱుపదింటికి పాశురములు ౬౬౦



## ౭- పత్తు, ౧-వ తిరువాయ్మొழி.

అవతారిక :— పెరియపిరాట్టిని పురుషకారముగాజేసికొని ప్రపత్తిచేసినప్పటికిన్ని వీరి మూలముగా ఈతిరువాయ్మొழிయనెడి మహాప్రబన్ధమును సమాప్తిచేయింపదలంచి వీరిని సర్వేశ్వరుఁడు స్వీకరించనందున, ఆழ்వార్లు మిక్కిలిదుఃఖార్తులై నన్ను స్వీకరింపక ఇన్ద్రియములనడుమ పడద్రోసి బాధించుటచే నీకేమిప్రయోజనమని ఘోషించుచున్నారు.

¶¶ ఉణ్ణిలావియవైవరాల్ కుమైత్తీర్త్తి యెన్నైయున్ పాదపఙ్గయమ్*
నణ్ణిలావగైయే నలివానిన్నమెణ్ణుగిన్రాయ్*
ఎణ్ణిలాప్పెరుమాయనే యిమైయోర్గళేత్తుమ్ ఉలగమ్మూన్రుడైయాయ్ *
అణ్ణలేయముదేయప్పనే యెన్నైయాళ్వానే. ౧.

అ॥ ఎణ్ణిలా - అసఙ్ఖ్యేయమై, పెరు - అపరిచ్ఛిన్నమైన, మాయనే-ఆశ్చర్యవ్యాపారము గల ప్రకృతినిసాధనముగాగలవాఁడా ! ఇమైయోర్గళ్ - నిత్యసూరులచే, ఏత్తుమ్ - స్తుతింపఁబడినవాఁడవై, ఉలగమ్మూన్రు - లోకములుమూడింటిని, ఉడై-తనకుశేషముగా గలవాఁడవైన, అణ్ణలే - ఓస్వామీ! అముదే - ఓభోగ్యభూతుఁడా! అప్పనే - ఉపకారకుఁడా! ఎన్నై-నన్ను, ఆళ్వానే - (ఇదివఱలో) నిర్వహించినవాఁడా! ఉళ్ - లోపల, నిలావియ - ఉన్న, ఐవరాల్-పంచేన్ద్రియములచే, కుమైత్తీర్త్తి - బాధపెట్టి, ఎన్నై - నన్ను, ఉన్ - నీయొక్క, పాదపఙ్గయమ్ - శ్రీపాదపద్మములను, నణ్ణిలావగై - సమీపించకుండునట్లు, ఇన్నమ్ - ఇఁకను, నలివాన్-బాధించుటకై, ఎణ్ణుగిన్రాయ్ - తలఁచుచున్నావు.

తా॥ ఓశ్రియఃపతీ ! ఇదివఱలో నాకు నీవేగతియఁడవని జ్ఞానమును గలిగించి రక్షించిన నీవిప్పుడు, నేను ప్రపత్తిచేసినప్పటికిన్ని, నన్ను నీతిరువడికళ్ళను బొందనివ్వక పంచేంద్రియముల నడుమ బడద్రోసిబాధించుచున్నావు. ఇదినీకు యుక్తముకాదని. ౧.

ఎన్నైయాళుమ్వన్గోవోరైన్దివైపెయ్దిరాప్పగల్మోదువిత్తు*
ఉన్నైనానణుగావగై శెయ్దుపోదికణ్డాయ్*
కన్నలేయముదేకార్ముగిల్వణ్ణనే కడల్ఞాలమ్కాక్కిన్ర*
మిన్నునేమియినాయ్ వినైయేనుడై వేదియనే. ౨.

అ॥ కన్నలే - పడికబెల్లమువంటివాఁడా ! అముదే - అమృతమువంటివాఁడా! కార్ - వర్షాకాలమందలి, ముగిల్ - మేఘమువంటి, వణ్ణనే - కాన్తిగలవాఁడా ! కడల్ - సముద్రముచే చుట్టఁబడిన, ఞాలమ్ - భూమిని, కాక్కిన్ర - రక్షించుచున్న, మిన్ను - ఉజ్జ్వలమైన, నేమియినాయ్ - సుదర్శనముఁగలవాఁడా ! వినైయేనుడై - పాపముగల నాకు, (ప్రత్యక్షముగా సేవసాదించక), వేదియనే - వేదములచేదెలిసికొనఁదగినవాఁడా! ఎన్నై - నన్ను, ఆళుమ్ - వశపఱచుకొనినవై, వన్ - క్రూరములై, కో - నన్నునియమించుచున్నవై, ఓర్ - అద్వితీయములైన, ఇవై, - ఈ, ఐన్దు - పంచేంద్రియములను, పెయ్దు - సృజించియుంచి, ఇరాప్పగల్ - రేయింబ

గళ్లు, మోదువిత్తిట్టు - పీడించునట్లుజేసి, ఉన్నై - నిన్ను, నాన్ - నేను, అణుగావణ్ణం - చేరకుండు విధమును, శెయ్దు పోదికణ్డాయ్ - చేసిపోతివినుమా.

తా॥ నిరతిశయభోగ్యుఁడవై జగద్రక్షకుఁడవైన ఓ శ్రియఃపతీ! నన్ను పంచేంద్రియముల నడుమ పడద్రోసి వానికి నన్ను స్వాధీనపఱచి బాధించి నీతిరువడికళ్ళను బొందని వ్వకుండ చేసితివని. ౨.

వేదియానిఱ్ఱుమైవరాల్ విన్నైయేన్నై మోదవిత్తు *ఉన్ తిరువడి
చ్చాదియావణ్ణం నీతడుత్తెన్ పెఱుదియన్దో*
ఆదియాగియగలిడమ్పడైత్తు ఉణ్డుమిழ్న్దుకడన్దిడన్దిట్ట*
శోదినీళ్ ముడియాయ్ తొణ్డనేన్ మదుశూదననే. ౩.

అ॥ ఆదియాగి - జగత్కారణుఁడవై, అగల్ - విశాలమైన, ఇడమ్ - భూమిని, పడైత్తు - సృజించి, ఉణ్డు - మ్రింగి, ఉమిழ్న్దు - బయలుపఱచి, కడన్దు - కొలిచి, ఇడన్దిట్ట - (పాతాళము లోనుండి) వెడలితీసినవాఁడవై, శోది - ప్రకాశించుచున్న, నీళ్ - దీర్ఘమైన, ముడియాయ్ - కిరీటముగలవాఁడా! తొణ్డనేన్ - చపలుఁడనైననాయొక్క (పాపములను), మదుశూదననే - మధువనెడి రాక్షసునిజంపినట్లు నశింపఁజేసినవాఁడా! వేదియానిఱ్ఱుమ్ - బాధించుచున్న, ఐవరాల్ - పంచేంద్రియములచే, విన్నైయేన్నై - పాపముగలనన్ను, మోదువిత్తు - బాధపెట్టి, ఉన్ తిరువడి - నీ శ్రీపాదమును, శాదియావణ్ణం - పొందకుండునట్లు, తడుత్తు - అడ్డగించి, నీ - నీవు, ఎన్ పెఱుది - ఏఫలమునుబొందెదవు? అన్దో - అనివిషాదోక్తి.

తా॥ జగత్తును సృజించి సకలవిధములచే రక్షించిన ఓస్వామీ! ఇదివఱలో నాపాపములను బోఁగొట్టి రక్షించిన నీవిప్పుడు నన్ను పంచేంద్రియములచే పీడించి నీ శ్రీపాదమును బొందకుండచేసి నందున నీకేమియు లాభములేదని. ౩.

శూదునానఱియావణ్ణం శుழల్విత్తియోరైవరైక్కాట్టి*ఉన్నడి
ప్పోదునానణుగావణ్ణం శెయ్దుపోదికణ్డాయ్*
యాదుమ్యావరుమిన్ఱి నిన్నగమ్పాల్ ఒడుక్కి*ఓరాలిలినీళిలై
మీదు శేర్ కుழవి విన్నైయేన్నై తీర్ మరున్దే. ౪.

అ॥ యాదుమ్ - సకలఅచేతనములనున్ను, యావరుమ్ - సకలచేతనులనున్ను, ఇన్ఱి - ఒకటియును ద్రక్కక, నిన్నగమ్పాల్ - నీయుదరమందు, ఒడుక్కి - అణచి, ఓర్ - ఒక, ఆలిన్ - మఱ్ఱిచెట్టుయొక్క, నీళ్ - పొడువైన, ఇలైమీదు - దళముమీద, శేర్ - పవ్వళించిన, కుழవి - బాలుఁడవై, విన్నైయేన్ - పాపియైననాయొక్క, విన్నై - పాపములను, తీర్ - పోఁగొట్టెడి, మరున్దే - ఔషదమువంటివాఁడా! ఓర్ - క్రూరములైన, ఐవరై - పంచేంద్రియములను, కాట్టి - చూపించి, నాన్ - నేను, శూదు - చేయదగినకృత్యమును, అఱియావణ్ణం - ఎఱుంగకుండునట్లు, శుழల్విత్తి - భ్రమింపఁజేసి, ఉన్నడిప్పోదు - నీ శ్రీపాదపద్మములను, నాన్ - నేను, అణుగావణ్ణం - పొందకుండునట్లు, శెయ్దుపోదికణ్డాయ్ - చేసిపోతివినుమా.

తా॥ ప్రళయకాలమందు సకలజగత్తును దన యుదరములోనుంచుకొని వటదళమందు బవ్వళించిన అపద్బాంధవుఁడైన శ్రియఃపతీ! నన్ను కృత్యాకృత్యజ్ఞానములేకుఁడ భ్రమింపజేసి ఇంద్రియపరవశుఁడనై నీతిరువడికళ్ళను బొందకుండునట్లుచేసినందున నీకేమిపురుషార్థ? మని. ౪.

తీర్ మరున్దిన్ఱి యైవరెన్ననోయడుమ్ శెక్కిలిట్టుత్తిరిక్కుమైవరై*
నేర్ మరుఙ్గుడైత్తా వడైత్తు నెగిళ్ప్పానొక్కిన్ఱాయ్*
ఆర్ మరున్దినియాగువార్ అడలాழி యేన్దియశురర్ వన్గులమ్*
వేర్ మరుఙ్గఱుత్తాయ్ విణ్ణుళార్ పెరుమానేయో. ౫.

అ॥ అడల్ - యుద్ధోన్ముఖమైన, ఆழி - సుదర్శనమును, ఏన్ది - ధరించి, అశురర్ - అసురులయొక్క, వన్ - క్రూరమైన, కులమ్ - వంశమును, మరుఙ్గువేర్ - ప్రక్కవేరుతోఁగూడ సమూలముగా, అఱుత్తాయ్ - ఛేదించినవాఁడా! విణ్ణుళార్ - పరమపదవాసులకు, పెరుమానే - నిర్వాహకుఁడా! తీర్ - తీర్చదగిన, మరున్దు - మందు (ప్రతిక్రియ), ఇన్ఱి - లేక, ఐవర్ - అయిదు విషయములనెడి, నోయ్ - వ్యాధులచే, అడుమ్ - బాధించుచున్న, శెక్కిల్ - శరీరమనెడి యంత్రమందు, ఇట్టు - వేసి, తిరిక్కుమ్ - త్రిప్పుచున్న, ఐవరై - పంచేంద్రియములను, నేర్ - ఎదుటనున్న, మరుఙ్గు - ప్రక్కలయందును, ఉడైత్తా - ఉండునట్లు, అడైత్తు - ఉంచి, నెగిళ్ప్పాన్ - తమవద్దనుండి త్రోయువారికి, ఒక్కిన్ఱాయ్ - సమానుఁడవైయున్నావు; ఇని - ఇఁక మీఁద, మరున్దాగువార్ - (ఈవ్యాధిని) ఔషదమువలె తీర్చువారు, ఆర్ - ఎవరగుదురు?

తా॥ ఆశ్రితవిరోధులను సమూలముగా నశింపఁజేసిన ఓస్వామీ! నన్ను శరీరమందుంచి యింద్రియములను చుట్టుగోడవలెపెట్ట కదలుటకుఁగూడ దోవలేకుఁడజేసి శబ్దాదివిషయములను నాముందట సృజించి నన్ను బాధించుట నీకుచితముకాదని. ౫.

విణ్ణుళార్ పెరుమాఱ్కడిమైశెయ్వారైయుమ్ శెఱుమైమ్బులనిపై*
మణ్ణుళెన్నైప్పెఱ్ఱాల్ ఎన్ శెయ్యా మఱ్ఱు నీయుమ్ విట్టాల్*
పణ్ణుళాయ్ కవితన్నుళాయ్ పత్తియినుళ్ళాయ్ పరమీశనే* వన్దు
ఎన్ కణ్ణుళాయ్ నెఞ్జుళాయ్ శొల్లుళాయొన్ఱు శొల్లాయే. ౬.

అ॥ విణ్ణుళార్ - పరమపదమందున్నవారై, పెరుమాఱ్కు - సర్వేశ్వరుఁడవైననీకు, అడిమై శెయ్వారైయుమ్ - కైంకర్యముజేయువారినిగూడ, శెఱుమ్ - బాధించుచున్న, ఇపై ఐమ్బులన్ - ఈపంచేంద్రియములు, మణ్ణుళ్ - భూలోకమందు, ఎన్నై - నన్ను, పెఱ్ఱాల్ - పొందినయెడల, మఱ్ఱు - మఱియు, నీయుమ్ - నీవును, విట్టాల్ - విడిచినయెడల, ఎన్ శెయ్యా - ఏమిచేయవు? పణ్ - నాయార్త్ధ్వనియందు, ఉళాయ్ - ఉన్నవాఁడవై, కవితన్నుళాయ్ - కావ్యములయందున్నవాఁడవై - పత్తియినుళ్ళాయ్ - నాభక్తియందున్నవాఁడవై, కణ్ణుళాయ్ - నేత్రములోనున్నవాఁడవై, నెఞ్జుళాయ్ - మనస్సునందున్నవాఁడవై, శొల్లుళాయ్ - నావాక్కునందున్నవాఁడవై, పరమ్ - సర్వాధికుఁడవైన, ఈశనే - నియామకుఁడా! వన్దు - వచ్చి, ఒన్ఱు - ఒకమాట, శొల్లాయ్ - చెప్పుమా.

తా॥ నిర్వికారమైన పరమపదమందు నివసించెడి గరుడప్రభృతి నిత్యసూరులనుగూడ భ్రమింపఁజేయుచున్న పంచేంద్రియములు భూలోకమందున్న నన్నేమిచేయవు? నాసకలావయవములయందు నివసించుచు నాదుఃఖములను దొలగింప సమర్థుఁడవైననీవు నాయార్త్ధ్వనినివినియైనను వచ్చి నాకుపాయము చెప్పుమాయని. 1.

ఒన్ఱుశొల్లిఒరుత్తినిల్‌నిఱ్కాద వోరైవర్ వన్‌కయవరై*
ఎన్ఱుయాన్ వెల్‌గిఱ్పు నున్ తిరువరుళిల్లైయేల్*
అన్ఱుతేవరశురర్ వాఙ్గ అలై కడలరవమళావి*ఓర్
కున్ఱమ్వైత్త ఎన్దాయ్ కొడియేన్ పరుగిన్నముదే. 2.

అ॥ అన్ఱు - అప్పుడు, తేవర్ - దేవతలును, అశురర్ - అసురులును, వాఙ్గ - మథనముచేయగా, అలై - అలలుకొట్టుచున్న. కడల్ - సముద్రమందు, అరవమ్ - వాసుకిని, అళావి - చుట్టి, ఓర్ - ఒక, కున్ఱమ్ - మందరపర్వతమును, వైత్త - (చలించకుండ) నిలిపిన, ఎన్దాయ్ - ఓ నాస్వామీ! కొడియేన్ - పాపియైననేను, పరుగు - పానముచేయుటకు, ఇన్ - భోగ్యమైన, అముదే - అమృతమువంటివాఁడా! ఉన్ - నీయొక్క, తిరువరుళ్ - నిరవధికమైనకృప, ఇల్లైయేల్ - లేకపోయినయెడల, ఒన్ఱుశొల్లి - ఒకమాటచెప్పి, ఒరుత్తినిల్ - ఒకవిధముగా, నిఱ్కాద - నిలువని, ఓర్ - క్రూరులైన, ఐవర్ - అయిదువిధులై, వన్ - బలిష్ఠులైన, కయవరై - ఇంద్రియములనెడిదుష్టులను, యాన్ - నేను, ఎన్ఱు - ఎప్పుడు, వెల్‌కిఱ్పన్ - జయించెదను?

తా॥ క్షీరాబ్ధియందు మందరపర్వతమునువేసి వాసుకినిత్రాడుగాజుట్టి చిలికి యమృతమును దేవతలకిచ్చిన ఉదారుఁడా! నీవుకటాక్షించనియెడల నేనింద్రియములను జయింపఁజాలనని. 2.

ఇన్నముదెనత్తోన్ఱి యోరైవర్ యావరైయుమ్మయక్క*నీవైత్త
మున్నమాయమెల్లామ్ ముఴువేరరిన్దు*ఎన్నైయున్
శిన్నముమ్‌తిరుమూర్త్తియుమ్ శిన్దిత్తేత్తికైతొழు వేయరుళెనక్కు*
ఎన్నమ్మా ఎన్ కణ్ణా ఇమైయోర్ దమ్‌కులముదలే. 3.

అ॥ ఎన్నమ్మా - నాకుతల్లివంటివాఁడా! ఎన్ కణ్ణా - నాకుభవ్యమైనవాఁడా! ఇమైయోర్‌తమ్ కులమ్ - నిత్యసూరులసమూహమునకు, ముదలే - నిర్వాహకుఁడా! ఓర్ - విలక్షణములైన, ఐవర్ - శబ్దస్పర్శరూపరసగన్ధములనెడి అయిదువిషయములు, ఇన్ అముదు - నిరతిశయభోగ్యములు, ఎన - అని, తోన్ఱి - తోఁచి, యావరైయుమ్ - ఎట్టివారినిగూడ, మయక్క - భ్రమింపఁజేయుటకై, నీ - నీవు, వైత్త - ఉంచిన, మున్నమ్ - అనాదియైన, మాయమెల్లామ్ - సంసారమన్నింటిని, ముఴు - సమ్పూర్ణముగా, వేర్ - మూలమును, అరిన్దు - ఛేదించి, ఎన్నై - నన్ను, ఉన్ - నీయొక్క, శిన్నముమ్ - శఙ్ఖచక్రాది చిహ్నములనున్ను, తిరుమూర్త్తియుమ్ - దివ్యవిగ్రహమునున్ను, శిన్దిత్తు - ధ్యానించి, ఏత్తి - స్తుతించి, కైతొழு - అంజలిచేయునట్లు, ఎనక్కు - నాకు, అరుళ్ - కృపఁజేయుము.

తా॥ నాయందు దతివాత్సల్యముగల ఓ స్వామీ! చూచునప్పుడే సుఖకరంబులని తోచి బ్రహ్మాదులనుగూడ భ్రమింపఁజేయుచున్న శబ్దాదివిషయములు నన్ను బాధింపకుండునట్లు వానినిసమూలముగా భేదించి, నీదివ్యావయవాదులను ధ్యానించి స్తుతించునట్లు నాయందనుగ్రహముఁజేయుమూయని.

కులముదలడుమ్ తీవినైకొ్కొడువన్ కుழియినిల్ వీழ్క్కుమైవర్గై *
వలముదల్ కెడుక్కుమ్ వరమేతన్దరుళ్ కణ్డాయ్ *
నిలముదలినియెవ్వులగుక్కుమ్ నిఱ్పన శెల్వనవెన *పొరుళ్
పలముదల్ పడైత్తాయ్ ఎన్ కణ్ణా ఎన్ పరఞ్జుడరే. ౯.

అ॥ నిలమ్ముదల్ - భూమి మొదలైన, ఇని - ఇఁకనున్న, ఎవ్వులగుక్కుమ్ - సమస్తలోకములయందును, నిఱ్పన శెల్వనవైన - స్థావరజంగమములనెడి, పలపొరుళ్ - అనేక వస్తువులను, ముదల్ - సృష్టికాలమందు, పడైత్తాయ్ - సృజించినవాఁడా! ఎన్ కణ్ణా - నాకుభవ్యమైనవాఁడా! ఎన్ - నాకుసేవసాదించిన, పరఞ్జుడరే - పరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! కులమ్ - వంశమును, ముదల్ - సమూలముగా, అడుమ్ - నశింపఁజేయుచున్న, తీవినై - పాపములకుఁగారణమై, కొడు - క్రూరమై, వన్ - దుస్తరమైన, కుழియినిల్ - సంసారమనెడుపల్లమందు, వీழ్క్కుమ్ - పడద్రోయుచున్న, ఐవరై - పంచేంద్రియములయొక్క, వలమ్ - బలమును, ముదల్ - సమూలముగా, కెడుక్కుమ్ - నశింపఁజేయుచున్న, వరమే అనుగ్రహమును, తన్దరుళ్ కణ్డాయ్ - ఇవ్వవూ.

తా॥ సకలజగత్స్రష్టయైన ఓపరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! వంశనాశకరంబులై సంసారమనెడి నరకమునకు హేతువైనపంచేంద్రియములు నన్ను బాధించకుండనశించునట్లుఅనుగ్రహింపుమాయని ౯.

ఎన్ పరఞ్జుడరేయెన్నునున్నై యలఱ్ఱి యున్నిణైత్తామరైగట్కు*
అన్బురుగినిఱ్క మదునిఱ్కచ్చుమదుతన్దాయ్*
వన్ పరఙ్గళెదుత్తైవర్ తిశై తిశై వలిత్తెఱ్ఱుగిన్ఱనర్ *
మున్ పరవైకడైన్దముదఙ్కొణ్డమూర్త్తియో. ౧౦

అ॥ మున్ - మునుపు, పరవై - సముద్రమును, కడైన్దు - చిలికి, అముదమ్ - అమృతమును, కొణ్డ - తీసిన, మూర్త్తి - ఓసర్వేశ్వరుఁడా! ఎన్ పరమ్జుడరేఎన్ఱు - నాపరఞ్జ్యోతిస్స్వరూపుఁడా! యని, ఉన్నై - నిన్ను, అలఱ్ఱి-ఘోషించిచెప్పి, ఉన్ - నీయొక్క, ఇణై - చేరియున్న, తామరైగట్కు - శ్రీపాదపద్మములవిషయమైన, అన్బు - ప్రీతిచే, ఉరుగి - కరిగి, నిఱ్కుమ్ - ఉండదగిన, అదు - ఆభాగ్యము, నిఱ్క - ఉండగా, (దానినివ్వక), ఉమదు-శరీరమనెడిభారమును, తన్దాయ్ - ఇచ్చితివి. వన్ - క్రూరములైన, పరఙ్గళ్ - విషయములనెడిభారములను, ఎదుత్తు - మోయించి, ఐవర్ - పంచేంద్రియములు, తిశైతిశై - ప్రతిదిక్కులయందును, వలిత్తు - ఈడిచి, ఎఱ్ఱుగిన్ఱనర్ - బాధించుచున్నవి.

తా॥ ఓస్వామీ! నాకుస్వరూపానురూపముగా నీతిరువామానుసన్ధానము చేయదగిన భాగ్యమునివ్వక ఇంద్రియములచే బాధపడునట్లు నన్నుసంసారమందు బడద్రోసి శరీరమనెడిమహాభారమును నాశిరమ్మునమోఁదమంచితివని. ౧౦.

** కొణ్డమూర్ త్తియోర్ మూవరాయ్ క్కుణజ్గళ్ పడైత్తళిత్తుక్కెడుక్కుమ్*
అప్పుణ్డరీగక్కొప్పూழ் ప్పునల్ప్పళ్ళియప్పనుక్కే*తొణ్డర్
తొణ్డర్ తొణ్డర్ తొణ్డన్ శడగోపన్ శొల్లాయిరత్తుళిప్పత్తుమ్*
కణ్డుపాడవల్లార్ విన్పోమ్ కజ్గులుమ్బగలే. ౧౧.

అ॥ కుణజ్గళ్ - సత్వరజస్తమోగుణములచే, కొణ్డ - స్వీకరింపఁబడిన, మూర్త్తి - శరీరము గల, ఓర్ - విలక్షణులైన, మూవరాయ్ - బ్రహ్మవిష్ణురుద్రులనెడిముగురిస్వరూపమై, పడైత్తు - సృజించి, అళిత్తు - రక్షించి, కెడుక్కుమ్ - సంహరించుచున్నవాఁడై, అప్పుణ్డరీగమ్ - అట్టి (జగత్కారణమైన) పద్మమును, కొప్పూழ் - తిరునాభియందుగలవాఁడై, పునల్ - మహాజలమును, పళ్ళి - పడకగాగలవాఁడైన, అప్పనుక్కే - స్వామికే, తొణ్డర్ - దాసులైనవారికి, తొణ్డర్ - దాసభూతులకు, తొణ్డర్ - భక్తులైనవారికి, తొణ్డన్ - దాసులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్ - ప్రసాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇప్పత్తుమ్-ఈపది పాశురములను, కణ్డు - (మనకురక్షకమని) అనుసంధించి, పాడవల్లార్ - గానముచేయువారికి, కజ్గులుమ్బగలుమ్ - రాత్రింబగళ్లు, విన్పోమ్ - పాపములునశించును.

తా॥ రజస్తమస్స్వరూపులైన బ్రహ్మరుద్రులకన్తర్యామియైయుండి సృష్టిసంహారములను జేసి, తానుసత్వస్వరూపమైనవిష్ణ్వవతారమెత్తి రక్షించుచున్న శ్రీమన్నారాయణునికి చరమావధి దాసులైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు ఇంద్రియములచే నెప్పుడును బాధపడరని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్

జీయర్ తిరువడిగళేశరణమ్

## ౨-వ, తిరువాయ్ మొழ்ழி

అవతారిక:— ఈతిరువాయ్ మొழ்ழిలో, నమ్మాళ్వార్లు భగవద్విశ్లేషమును సహింపక పెరియ పెరుమాళ్ తిరువడికళ్ళలో ప్రపత్తిచేసి అచ్చటకూడ తనమనోరథమును లభించక దుఃఖపరవశులై ఒకపిరాట్టియవస్థను బొందియుండగా, అప్పుడాపిరాట్టియొక్కతల్లి, వాళామారైవిషయమై నీవేమిసంకల్పించియున్నావని పెరియపెరుమాళ్ సంనిధిలో విన్నవించునూక్తులను సాదించుచున్నారు.

** కజ్గులుమ్బగలుమ్ కణ్డుయిలఱియాళ్ కణ్ణనీర్ కైగళాలిఱైక్కుమ్*
శజ్గుశక్కరజ్గళెన్ఱు కైకూప్పుమ్ తామరైక్కణ్ణనేలశరుమ్*
ఎజ్గనేతరిక్కేనున్నై విట్టెన్నుమ్ ఇరునిలమ్ కైత్తుழாవిరుక్కుమ్*
శెజ్గయల్ పాయ్ నీర్ త్తిరువరజ్గత్తాయ్ ఇవళ్ తిఱత్తెన్ శెయ్ గిన్ఱాయే. ౧.

అ॥ కజ్గులుమ్ - రాత్రియందును, పగలుమ్ - దినమందును, కణ్ - నేత్రములయొక్క, తుయిల్ - నిదురను, అఱియాళ్ - ఎఱుఁగదు. కణ్ణనీర్ - కన్నీళ్ళను, కైగళాల్ - చేతులచేత, ఇఱైక్కుమ్ - జల్లును. శజ్గుశక్కరజ్గళెన్ఱు - శఙ్ఖచక్రములనిచెప్పి, కైకూప్పుమ్ - అంజలిచే

యును. తామరైక్కణ్ ఎన్ఱు - పద్మమువంటి నేత్రములని చెప్పి, తళరుమ్ - శిథిలమవన్ను రాలగును, ఉన్నై విట్టు - నిన్ను వదలి, ఎఙ్ఙనే తరిక్కేన్ - ఎట్లు జీవించెదను, ఎన్నుమ్ - అని చెప్పును. ఇరు - విశాలమైన, నిలమ్ - భూమిని, కై - చేతులచే, తుழாவ - తడవుచు, ఇరుక్కుమ్ - ఉండును, శెమ్ - సుందరమైన, కయల్ - మత్స్యములు, పాయ్ - ఎగురుచున్న, నీర్ - జలములచే జుట్టబడిన, తిరువరఙ్గత్తాయ్ - శ్రీరఙ్గమందు బవ్వళించిన ఓ స్వామీ! ఇవళ్ తిఱత్తు - ఈ పెనివిషయమై, ఎన్ శెయ్‌గిన్ఱాయ్ - ఏమి చేయుతలంచినావు.

తా॥ ఓ శ్రీరంగనాథస్వామీ! ఈ తరూట్టూర్వార్ల నెడినాయకి నిన్ను విశ్లేషించియుండలేక రేయింబగళ్ళు నిద్రించక దుఃఖించుచు నీయొక్క దివ్యావయవ దివ్యాయుధముల ననుసంధింప నారంభించి దానికి తాళలేక చేతుల నెత్తి నమస్కరించుచున్నది. ఈ పెను నీవేమి చేయుతలంచినావో తెలియుటలేదని.

ఎన్ శెయ్‌గిన్ఱాయ్ తామరైక్కణ్ణా ఎన్నుమ్ కణ్ణీర్ మల్గవిరుక్కుమ్*
ఎన్ శెయ్‌గేనెఱిసీర్ తిరువరఙ్గత్తాయెన్నుమ్ వెవ్వుయిర్త్తుయిర్త్తురుగుమ్*
మున్ శెయ్‌దవినైయే ముగప్పడాయెన్నుమ్ ముగిల్ వణ్ణా తగవిదో వెన్నుమ్*
మున్ శెయ్‌దిఉవ్వులగముణ్డుమిழ்న్దళన్దాయెన్గొలో ముడిగిన్ఱదివళుక్కే. ౨.

అ॥ ఎన్ - నన్ను (వశపఱచుకొనిన) తామరైక్కణ్ణా - పద్మమువంటి నేత్రముగలవాఁడా! ఎన్ శెయ్‌గిన్ఱాయ్ - ఏమి చేయుచున్నావు, ఎన్నుమ్ - అని చెప్పును. కణ్ - నేత్రములయందు, నీర్ మల్గ - నీళ్లు నిండునట్లు, ఇరుక్కుమ్ - ఉండును. ఎఱి - అలలుకొట్టుచున్న, నీర్ - జలముగల, తిరువరఙ్గత్తాయ్ - శ్రీరంగమునకునాథుఁడా! ఎన్ శెయ్‌గేన్ - ఏమి చేసెదను, ఎన్నుమ్ - అని చెప్పును. వెమ్ - వేడిగా, ఉయిర్త్తుయిర్త్తు - నిట్టూర్పులువిడిచివిడిచి, ఉరుగుమ్ - కరుగును. మున్ - జన్మాంతరమందు, శెయ్‌ద - చేసిన, వినైయే - ఓపాపమా! ముగప్పడాయ్ - నా ముందఱరమ్మా, ఎన్నుమ్ - అని చెప్పును. ముగిల్ వణ్ణా - మేఘమువంటి వర్ణముగలవాఁడా! తగవిదో - (నీకిది) తగుమైనదా? ఎన్నుమ్ - అని చెప్పును. ఇవ్వులగమ్ - ఈలోకములను, మున్ శెయ్‌దు - మునుపుసృజించి, ఉణ్డు - మ్రింగి, ఉమిழ்న్దు - క్రక్కి, అళన్దాయ్ - కొలిచినవాఁడా! ఇవళ్ తనక్కు - ఈ పెకు, ముడివు - పర్యవసానము, ఎన్గొలో - ఎట్టిదో?

తా॥ జగద్రక్షకుఁడవైన ఓ శ్రీరంగనాథుఁడా! ఈ పె "ఓస్వామీ! నన్నెందుకిట్లు బాధించుచున్నావు? నేనీబాధను సహింపలేను. ఇది నాపాపమా? ఓరంగనాథా! నీవిట్లు బాధపెట్టుట మంచిదికాదు" అనిచెప్పుచున్నదే, ఈమెకేమిగతి చెప్పుమాయని. ౨.

వట్కిలళిలైయుమ్మణివణ్ణా వెన్నుమ్ వానమే నోక్కుమ్మైయాక్కుమ్*
ఉట్కుడై యశురరుయిరెల్లామున్డ వొరువనేయెన్నుముళ్ళురుగుమ్*
కట్కిలీయునైక్కాణుమారురుళాయ్ కాగుత్తాకణ్ణనేయెన్నుమ్*
తిట్కొడిమదిళ్ శూழ் తిరువరఙ్గత్తా యివళ్ తిఱత్తెన్ శెయ్‌దిట్టాయే. ౩.

అ॥ ఇలైయుమ్ - కొంచమైనను, వట్కు - లజ్జను, ఇలళ్ - కలదికాదు, మణివణ్ణా - నీలమణివర్ణమువంటి మేనుగలవాఁడా! ఎన్నుమ్ - అని చెప్పును. వానమే - (నీవు పరమపదమునుంచి

వచ్చుటకుమార్గమైన) ఆకాశమునే, నోక్కుమ్ - చూడును. మైయాక్కుమ్ - భ్రమించును. ఉట్కుడై - బలముగల, అశురర్ - అసురులయొక్క, ఉయిరెల్లామ్ - ప్రాణములనన్నింటిని, ఉణ్ణ - నశింపఁజేసిన, ఒరువనే - అద్వితీయుఁడా! ఎన్నుమ్ - అని చెప్పును. ఉళ్ళురుగుమ్ - మనస్సులోకరుగును. కట్కు - నేత్రములకు, ఇలీ - విషయముకానివాఁడా! ఉన్నై - నిన్ను, కాణుమాఱు - సేవించునట్లు, అరుళాయ్ - కృపఁజేయుము, కాగుత్తా - ఓ శ్రీరాముఁడా! ఎన్నుమ్ - అని చెప్పును. తిణ్ - దృఢమైనదియు, కొడి - ధ్వజముగలదియునైన, మదిళ్ - ప్రాకారములచే, శూழ் - చుట్టబడిన, తిరువరఙ్గత్తాయ్ - శ్రీరంగమందువేంచేసిన ఓస్వామీ! ఇవళ్ తిఱత్తు - ఈపెవిషయమై, ఎన్ శెయ్దిట్టాయే - ఏమిచేసితివి.

తా॥ ఓ శ్రీరంగనాథుఁడా! ఈనాయకి నిర్లజ్జురాలై నీవు పరమపదమునుంచి వచ్చుచున్నావో యేమోయని యాకసమునుజూచుచు నిలుచుచున్నది. నీవు గానంమున "ఓస్వామీ! సాధనాంతరపరులకు నీవగోచరుఁడవైనను నీయొక్క నిర్హేతుక కటాక్షమును బొందినవారికి రామకృష్ణాద్యవతారములయందు సేవసాదించినట్లు నాకును సేవసాదించరాదా" యని చెప్పును. ఈపె విషయమందు నీవేమి నిర్ణయించితివో తెలియలేదని. ౩.

ఇట్టకాల్ కట్టకైయళాయిరుక్కు మెழுన్దులాయ్మయఙ్గుమ్ కైకూప్పుమ్*
కట్టమేకాదలెన్ఱుమూర్ చ్చిక్కుమ్ కడల్ వణ్ణాకడియైకాణెన్నుమ్*
వట్టవాయ్నేమివలఙ్గైయావెన్నుమ్ వన్దిడాయెన్ఱెన్ఱే మయఙ్గుమ్*
శిట్టనే శెழுనీర్ త్తిరువరఙ్గత్తా యివళ్ తిఱత్తెన్ శిన్దిత్తాయే. ౪.

అ॥ ఇట్టకాల్-సఖియలచేనుంచబడిన కాళ్లుకలదియు, ఇట్టకై యళాయ్-సఖియలచేనుంచబడిన చేతులుకలదియునై, ఇరుక్కుమ్ - (స్మృతిలేకపరవశయై) ఉండును. ఎழுన్దు - (మూర్ఛను వదలి) లేచి, ఉలాయ్ - సంచరించి, మయఙ్గుమ్ - (తరువాత) మోహించును. కైకూప్పుమ్ - చేతులనుజోడించును. కాదల్ - ఆశ, కట్టమేయెన్ఱు - చెడ్డదియని, మూర్ చ్చిక్కుమ్ - మూర్ఛించును. కడల్ వణ్ణా - సముద్రమువంటి కాన్తిగలవాఁడా! కడియైకాణ్ - నీవుమిక్కిలి క్రూరుఁడవునుమా! ఎన్నుమ్ - అని చెప్పును. వట్టమ్ - మొనను, వాయ్ - ముఖముగల, నేమి - సుదర్శనమును, వలమ్ కైయా - దక్షిణహస్తమందు ధరించినవాఁడా! ఎన్నుమ్ - అని చెప్పును వన్దిడాయ్ - వచ్చిసేవసాదింపవా, ఎన్ఱెన్ఱే - అనిపలుమాఱుచెప్పి, మయఙ్గుమ్ - మోహించును. శిట్టనే - ఓ భాగ్యుడా! శెழு - సమృద్ధమైన, నీర్ - జలముగల, తిరువరఙ్గత్తాయ్ - శ్రీరంగమందు వేంచేసియున్నవాఁడా! ఇవళ్ తిఱత్తు - ఈపెవిషయమై, ఎన్ శిన్దిత్తాయ్-ఏమితలంచితివి.

తా॥ ఓ శ్రీరంగనాథా! ఈనాయకి కొంతకాలము స్మృతిలేక మోహించియు, కొంతకాలమునకు తటాలునలేచి తిరిగినీకంజలిచేసి, "ఓనందనుఁడా! నన్ను కనికరించక మిక్కిలిక్రూరుఁడవైతివిసుమీ; నీయందాశ మిక్కిలి చెడ్డది, ఆయాశచేత నేకదా నేనింత బాధపడుచున్నాను" అని చెప్పియు, నీసుదర్శనహస్తముతో నాకొకమాట సేవసాదింపుమనియు ప్రతిక్షణమును మోహించుచుండును. ఇట్లు శ్రమపడుచున్న ఓభాగ్యుడా! నీవీపెనేమిచేయతలంచితివని. ౪

శిన్దిక్కుమ్ తిశైక్కుమ్ తేఱుమ్ కైకూప్పుమ్ తిరువరఙ్గత్తుళ్ళాయెన్నుమ్
వన్దిక్కుమ్*ఆఙ్గేమழைక్కణ్ణీర్ మల్గ వన్దిడాయెన్ఱెన్ఱే మయఙ్గుమ్*

అన్ఱిప్పోదవుణనుడలిడన్దానే యలై కడల్ కడైన్దవారముదే*
శన్దిత్తున్ శరణమ్ శార్వదేవలిత్తతై యలై మైయల్ శెయ్దానే. ౫.

అ॥ అన్ఱిప్పోదు - సంధ్యాకాలమందు, అవుణన్ - హిరణ్యాసురునియొక్క, ఉడల్ - శరీరమును, ఇడన్దానే - చీల్చినవాఁడును, అలై - అలలుకొట్టుచున్న, కడల్ - సముద్రమును, కడైన్ద - చిలికిన, ఆరముదే - నిరతిశయభోగ్యభూతుఁడును, శన్దిత్తు - (నిన్ను) సమీపించి, ఉన్ శరణమ్ - నీతిరువడికళ్ళను, శార్వదు - పొందవలయునని, వలిత్త - పట్టుదలగల, తైయలై - ఈ నాయకిని, మైయల్ శెయ్దానే - భ్రమింపఁజేసినవాఁడవైన ఓ శ్రీరంగనాథా! శిన్దిక్కుమ్ - (నీసౌన్దర్యాదులను) ధ్యానించును. తిశైక్కుమ్ - మోహించును. తేఱుమ్ - తెలివిగలదై యుండును. కైకూప్పుమ్ - చేతులనుజోడించును. తిరువరఙ్గత్తుళ్ళాయ్ - శ్రీరంగమందు వేంచేసియున్న ఓస్వామీ! ఎన్నుమ్ - అనిచెప్పును. వన్దిక్కుమ్ - నమస్కరించును. ఆఙ్గే - అచ్చటనుండి, మఴై - చల్లనైన, కణ్ణీర్ - బాష్పము, మల్గ - నిండునట్లు, వన్దిడాయ్ - వేంచేయుమా, ఎన్ఱెన్ఱే - అనిపలుమాఱుచెప్పి, మయఙ్గుమ్ - మోహించును.

తా॥ ఓ శ్రీరంగనాథా! ఈనాయకి నీసౌందర్యాదులను దలంచి వ్యామోహపడి పలుమాఱు మోహించును. అందరికతిశంకతోఁ మనట్లు మధ్యమధ్య లేచి మంచి తెలివితోనుండి నీ తిరునామములను జెప్పి పిలిచి యంజలిజేసి ప్రణామముసమర్పించి దుఃఖించును. "ఓస్వామీ! నాకు సేవ సాదింపుమా" యని ప్రార్థించును. ఓ హిరణ్యాసురసంహారకుఁడా! నిన్ను బొందవలయునని యాశించిన యీ నాయకిని నీవిట్లు మోహపెట్టితివని. ౫

మైయల్ శెయ్దెన్నై మనమ్ కవర్న్దానేయెన్నుమ్ మామాయనేయెన్నుమ్*
శెయ్యవాయ్ మణియేయెన్నుమ్ తణ్ పునల్ శూழ் తిరువరఙ్గత్తుళ్ళాయెన్నుమ్*
వెయ్యవాళ్ తణ్డుశఙ్గుశక్కరమ్ విల్లేన్దుమ్ విణ్ణోర్ ముదలెన్నుమ్*
పైకొళ్ పామ్బణైయాయివళ్ తిఱత్తరుళాయ్ పావియేన్ శెయఱ్పాలదువే. ౬.

అ॥ ఎన్నై - నన్ను, మైయల్ శెయ్దు - మోహింపఁజేసి, మనమ్ - మనస్సును, కవర్న్దానే - అపహరించినవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. మామాయనే - గొప్ప ఆశ్చర్యకరములైన వ్యాపారములవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. శెయ్య - ఎఱ్ఱనైన, వాయ్ - అధరము గలవాఁడై, మణియే - రత్నమువలె ప్రకాశించువాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. తణ్ - చల్లనైన, పునల్ - జలముచే, శూழ் - చుట్టఁబడిన, తిరువరఙ్గత్తు - శ్రీరంగమందు, ఉళ్ళాయ్ - వేంచేసియున్నవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును వెయ్య - (విరోధులయందు) క్రూరములైన, వాళ్ - నందకమును, తణ్డు - కౌమోదకిని, శఙ్గుశక్కరమ్ - శంఖచక్రములను, విల్ - శార్ఙ్గమును, ఏన్దుమ్ - ధరించుచున్న, విణ్ణోర్ ముదల్ - నిత్యసూరినిర్వాహకుఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. పైకొళ్ - విశాలములైన ఫణములుగల, పామ్బు - ఆదిశేషుని, అణైయాయ్ - శయ్యగాగలవాఁడా! ఇవళ్ తిఱత్తు - ఈమెవిషయమై, అరుళాయ్ - కృపజేయుము, (అది) పావియేన్ - పాపముగల నాయొక్క, శెయఱ్పాలదు - పొందవలసినది.

తా॥ అనన్తశాయుయైన ఓ శ్రీరఙ్గనాథా? ఈనాయకి, "నీసౌందర్యాదులనున్ను పంచాయుధములనున్ను నాకుంగనుపఱచి నన్ను మోహపెట్టి నామనస్సు నపహరించుకొనిపోయి అతి రమణీయంబైన శ్రీరంగమందు బవ్వళించిన ఓస్వామి!" యని పలుమాఱు చెప్పి మోహించుచున్నను ఈపెను నీవు గటాక్షించకపోయినది నీదోషముకాదు. అది నాపాపమేయని. ౬

పాలతున్పజ్గళిన్బజ్గళ్ పడైత్తాయ్ పఱ్ఱిలార్ పఱ్ఱనిన్ఱానే*
కాలశక్కరత్తాయ్కడలిడఙ్గొణ్డ కడల్వణ్ణాకణ్ణనేయెన్నుమ్*
శేల్కొళ్ తణ్పునల్శూழ் తిరువరఙ్గత్తాయెన్ను మెన్తీర్త్తనేయెన్నుమ్*
కోలమామழைక్కణ్ పనిమల్గవిరుక్కు మెన్నుడై కోమళక్కొழுన్దే ౭.

అ॥ ఎన్నుడై - నాయొక్క, కోమళమ్ - మృదువైన, కొழுన్దు - చిగురువలెనున్నయీపె, పాల - (అయా) స్థలములయందు, తున్పజ్గళ్ - దుఃఖములనున్ను, ఇన్బజ్గళ్ - సుఖములనున్ను, పడైత్తాయ్ - సృజించినవాఁడా! పఱ్ఱు - సాధనాంతరము, ఇలార్ - లేనివారు, పఱ్ఱ - ఆశ్రయించునట్లు, నిన్ఱానే - వేంచేసియున్నవాఁడా! కాలమ్ - కాలములనుసృజించెడి, శక్కరత్తాయ్ - సుదర్శనముగలవాఁడా! కడల్ - సముద్రములో, ఇడఙ్కొణ్డ - నిద్రించుచున్న, కడల్వణ్ణా - సముద్రమువంటితిరుమేనుగలవాఁడా! కణ్ణనే - శ్రీకృష్ణుఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. శేల్కొళ్ - మత్స్యములుగల, తణ్ - చల్లనైన, పునల్ - జలముచే, శూழ் - చుట్టఁబడిన, తిరువరఙ్గత్తాయ్ - శ్రీరంగమందు వేంచేసియున్నవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును ఎన్తీర్త్తనే ఎన్నుమ్ - నన్ను పరిశుద్ధురాలైచేసినవాఁడాయని చెప్పును. కోలమ్ - సుందరమై, మా - గొప్పదై, మழை - చల్లనైన, పని - నీరు, కణ్ - నేత్రములయందు, మల్గ - నిండునట్లు, ఇరుక్కుమ్ - (స్తబ్ధురాలై) ఉండును.

తా॥ ఓ శ్రీరంగనాథస్వామీ! మృదుస్వభావముగల యీనాయకి "విరోధులకు దుఃఖములను భక్తులకు సుఖములనునిచ్చువాఁడై, అనన్యగతికులకు రక్షకుఁడై, ఆశ్రితులకొఱకు పరమపదమునుంచి వచ్చి వ్యూహవిభవార్చావతారరూపములుగా నవతరించినవాఁడవైన ఓ శ్రీరంగనాథా!" యనిచెప్పి నేత్రములయందునీళ్ళను ప్రవహింపఁజేయుచు నేమియుదోఁచక స్తబ్ధురాలైయున్నదని.

కొழுన్దువానవర్గట్కెన్నుమ్ కున్ఱెన్దికో నిరైకాత్తవనెన్నుమ్*
అழுన్దొழுమావియనలవెవ్వుయిర్క్కు మఞ్జనవణ్ణనేయెన్నుమ్*
ఎழுన్దుమేల్నోక్కియిమైప్పిలళిరుక్కు మెఙ్ఙనేనోక్కుగేనెన్నుమ్*
శెழுన్దడమ్పునల్శూழ் తిరువరఙ్గత్తాయ్ ఎన్ శెయ్గేనెన్ తిరుమగట్కే. ౮.

వానవర్గట్కు - నిత్యసూరులకు, కొழுన్దు - నిర్వాహకుఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. కున్ఱు ఏన్ది - గోవర్ధనపర్వతమునెత్తి, కోనిరై - గోసమూహములను, కాత్తవనే - రక్షించినవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. అழுమ్ - ఏడుచును. తొழுమ్ - నమస్కరించును. ఆవి - ఆత్మ, అనల - దగ్ధమగునట్లు, వెవ్వుయిర్క్కుమ్ - వేడివేడిగానిట్టూర్పువిడుచును. అఞ్జనవణ్ణనే - శ్యామవిగ్రహుఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. ఎழுన్దు - లేచి, మేల్నోక్కి - పైనచూచి, ఇమైప్పిలళ్ ఇరుక్కుమ్ - ఱెప్పకొట్టకుండనుండును. ఎఙ్ఙనే - ఏవిధముగా, నోక్కుగేన్ - (నిన్ను) సేవించెదను, ఎన్నుమ్ - అనిచెప్పును. శెழுమ్ - సమృద్ధమై, తడమ్ - వ్యాపించియున్న,

పునల్ - జలముచే, శూழ் - చుట్టబడిన, తిరువరఙ్గత్తాయ్ - శ్రీరంగమందు బవ్వళించినవాఁడా! ఎన్ - నాయొక్క, తిరుమాట్కు - శ్రీమహాలక్ష్మితో సమానురాలైన యీపెను, ఎన్ శెయ్ గేన్ - ఏమిచేసెదను?

తా॥ ఓశ్రీరంగనాథస్వామీ? ఈనాయకి, "ఓదేవాధిదేవుఁడా! ఓగోవర్ధనధారీ! ఓశ్యామసుందరుఁడా!? అని నీతిరునామములను జెప్పి పిలిచి వేడివేడిగా నిట్టూర్పువిడుచుచు దుఃఖించి నిన్ను నమస్కరించుచు తటాలునలేచి పైనచూచి, నీవురానందున, "ఓస్వామీ! నిన్ను సేవించుట కుపాయమెఱుఁగక యున్నానని" చెప్పి మోహించుచున్నది. ఈపెను నేనేమియుపాయము చేసెదనని. ౮.

‡‡ ఎన్ తిరుమగళ్ శేర్ మార్వనేయెన్నుమ్ ఎన్నుడై యావియేయెన్నుమ్*
నిన్ తిరువెయిற்ఱాలిడన్దునీకొణ్డ నిలమగళ్ కేళ్వనేయెన్నుమ్*
అన్ఱురువేழுమ్ తழுవినీకొణ్డ ఆయ్మగళన్బనేయెన్నుమ్*
తెన్ తిరువరఙ్గమ్ కోయిల్ కొణ్డానే తెళిగిలేన్ ముడివివళ్ తనక్కే. ౯.

అ॥ ఎన్ - నాకుపురుషకారభూతయైన, తిరుమగళ్ - పెరియపిరాట్టి, శేర - నిత్యవాసము జేయుచున్న, మార్వనే - వక్షస్థలముగలవాఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. ఎన్నుడై - నాయొక్క, ఆవియే - ప్రాణభూతుఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. నీ - నీవు, నిన్ తిరువెయిற்ఱాల్ - నీయొక్కసుందరమైన దంతముచే, ఇడన్దుకొణ్డు - విడతీసికొనివచ్చిన, నిలమగళ్ - భూమిప్పిరాట్టికి, కేళ్వనే - వల్లభుఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. అన్ఱు - అప్పుడు, ఉరు - పిడుగువలె (గర్జించుచున్న), ఏழுమ్ - సప్తవృషభములను, తழுవి - కౌగలించుకొని, నీ - నీవు, కొణ్డ - స్వీకరించిన, ఆయ్మగళ్ - నప్పిన్నపిరాట్టికి, అన్బనే - ప్రీతివిషయుఁడా! ఎన్నుమ్ - అనిచెప్పును. తెన్ - దక్షిణమందున్న, తిరువరఙ్గమ్ - శ్రీరంగమును, కోయిల్ కొణ్డానే - వాసస్థానముగా స్వీకరించినవాఁడా! ఇవళ్ తనక్కు - ఈపెకు, ముడివు - దుఃఖావసానమును, తెళికిలేన్ - నిశ్చయించలేను.

తా॥ ఓశ్రీరంగనాథా? ఈనాయిక, "శ్రీభూనీళాదేవులకును నాకును ప్రాణనాథుఁడా!" అని నిన్నెల్లప్పుడు ననుసంధించుచు ఖేదించుచున్నది ఈక్లేశమెప్పుడుతీరునో తెలియలేదని. ౯.

ముఁడివివళ్ తనక్కొన్ఱఱిగిలేనెన్నుమ్ మూవులగాళియేయెన్నుమ్*
కడికమழ్ కొన్ఱైచ్చడైయనేయెన్నుమ్ నాన్ముగక్కడవుళేయెన్నుమ్*
వడివుడై వానోర్ తలైవనేయెన్నుమ్ వణ్ తిరువరఙ్గనేయెన్నుమ్*
అడియడైయాదాళ్ పోలివళణుగియడైన్దనళ్ ముగిల్వణ్ణనడియే. ౧౦.

తా॥ ఇవళ్ - ఈనాయిక, తనక్కు - తనకు, ముడివు - దుఃఖనాశనమునకుపాయము, ఒన్ఱు - ఒకటియు, అఱికిలేన్ - తెలిసికొనలేను, ఎన్నుమ్ - అనిచెప్పును. మూవులగు - మూడులోకములకును, ఆళియేయెన్నుమ్ - నిర్వాహకుఁడాయనిచెప్పును. కడికమழ் - మిక్కిలి పరిమళించుచున్న, కొన్ఱై - కొన్ఱైయనెడిపుష్పమును, శడైయనేయెన్నుమ్ - జటయందు ధరించిన రుద్రునికి

నిర్వాహకుఁడా! యని చెప్పును. నాన్ముగక్కడవుళ్ ఎన్నుమ్-చతుర్ముఖబ్రహ్మకు నిర్వాహకుఁడా! యని చెప్పును. వడివుడై - (తనతో సమానమైన) దివ్యదేహముగల, వానోర్ - నిత్యసూరులకు, తలైవనే - నిర్వాహకుఁడా! ఎన్నుమ్ - అని చెప్పును, వణ్ - ఉదారమైన, తిరువరఙ్గనే ఎన్నుమ్ - శ్రీరంగమందు వేంచేసియున్న స్వామీ! యని చెప్పును అడి - (నీ) శ్రీపాదములను, అడైయాదాళ్ పోల్ - పొందనిదానివలెనుండి, ఇవళ్ - ఈమె, ముగిల్ వణ్ణన్ - మేఘమువంటి కాన్తిగల నీయొక్క, అడి - శ్రీపాదములను, అణుగి - సమీపించి, అడైన్దనళ్ - పొందినది.

తా॥ ఓ శ్రీరంగనాథా! ఈ నాయిక, "సమస్తలోకములకును, బ్రహ్మరుద్రాదులకును నిత్యసూరులకును నిర్వాహకుఁడైయుండియు సంసారులకుఁగూడ సేవసాధించుటకై శ్రీరంగమందు బవ్వళించిన ఓ శ్రీరంగనాథుఁడా! నిన్ను సేవింపక నేననుభవించుచున్న యీ బాధ నాకెప్పుడుతీరునో తెలియులే" దని చెప్పుచున్నది. ఈమెయొక్క బాధనుజూడఁగా నీతిరువడిగళ్ళనింత శీఘ్రములో బొందదని తలంచియుంటిమి, అట్లుగాక నీ శ్రీపాదముల నిప్పుడే చేరి యానందించుచున్నదని. ౧౦.

‡‡ ముగిల్వణ్ణనడియైయడైన్దరుళ్ శూడియుయ్న్దవన్ మొయ్ప్పునల్ పొరునల్*
తుగిల్ వణ్ణత్తూనీర్ చ్చేర్ప్పన్ వణ్పొழிల్ శూழ் వణ్ కురుకూర్ చ్చడగోపన్*
ముగిల్ వణ్ణనడిమేల్ శొన్నశొల్ మాలై యాయిరత్తిప్పత్తుమ్వల్లార్*
ముగిల్ వణ్ణవానత్తిమైయవర్ శూழவిరుప్పర్ పేరిన్బవెళ్ళత్తే. ౧౧.

అ॥ ముగిల్ వణ్ణన్ - మేఘమువంటికాన్తిగల శ్రీరంగనాథునియొక్క, అడియై - శ్రీపాదములను, అడైన్దు - పొంది, అరుళ్ శూడి - (వాని) కృపనుధరించి, ఉయ్న్దవన్ - ఉజ్జీవించినవారును, మొయ్ - సమృద్ధమైన, పునల్ - జలముగల, పొరునల్ - తామ్రపర్ణియొక్క, తుగిల్ - ధౌతవస్త్రమువలె, తూ - నిర్మలమైన, నీర్ - జలముయొక్క, (ప్రక్కప్రదేశమందు), శేర్ప్పన్ - వేంచేసియుండువారును, వణ్ - సుందరంబులైన, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టబడిన, వణ్ - సంపద్యుక్తమైన, కురుగూర్ - కురుకాపురికి స్వామియునైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, ముగిల్ వణ్ణనడిమేల్ - మేఘమువంటికాన్తిగల శ్రీరంగనాథుని శ్రీపాదముల విషయమై, శొన్న - ప్రసాదించిన, శొల్మాలై - శబ్దసందర్భములైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈ పదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, ముగిల్ - మేఘమువంటి, వణ్ణమ్ - వర్ణముగల, వానత్తు - పరమపదమందలి, ఇమైయవర్ - నిత్యసూరులు, శూழ - చుట్టుకొనియుండఁగా, పేర్ - గొప్ప, ఇన్బవెళ్ళత్తు - ఆనన్దసాగరమందు, ఇరుప్పర్ - (అవగాహించి) ఉందురు.

తా॥ శ్రీరంగనాథునివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు శ్రీవైకుణ్ఠమందు అపరిచ్ఛిన్నానన్దము ననుభవింతురని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.



## ౩ - వ తిరువాయ్మొழி.

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, తల్లి చెప్పుచున్న తిరునామము వినిన యాழ்వార్ల నెడునాయకి స్వస్థచిత్తురాలై తిరుప్పేరెయనెడుదివ్యదేశమునకు వెళ్ళవలెనని యుద్యోగింప, దానిని తల్లి నిషేధింప, మీరు నిషేధించినను వెళ్ళెదనని ప్రతిపాదించుచున్నారు.

** వెళ్ళైచ్చురిశఙ్గొడాழிయేన్ది త్తామరైక్కణ్ణనెన్నెఞ్జినూడే*
పుళ్ళైక్కడాగిన్ఱవాழ் వైక్కాణీర్ ఎన్ శొల్లిచ్చొల్లుగేనన్నైమీర్ గాళ్ *
వెళ్ళచ్చుగమవన్ వీత్తిరున్ద వేదవొలియుమ్ విழாవొలియుమ్*
పిళ్ళైక్కుழாవిళైయాట్టొలియుమఱా త్తిరుప్పేరెయిల్ శేర్వన్నానే. ౧.

అ॥ అన్నైమీర్ గాళ్ - ఓతల్లులారా! వెళ్ళై - తెలుపువర్ణమునున్న, శురి - సుడి నిన్నిగల, శఙ్గొడు - శ్రీపాంచజన్యముతోఁగూడ, ఆழி - సుదర్శనమును, ఏన్ది - ధరించి, తామరైక్కణ్ణన్ - పద్మనేత్రుఁడైనసర్వేశ్వరుఁడు, ఎన్ నెఞ్జినూడే - నామనస్సులో, పుళ్ళై - గరుత్మంతుని, కడాగిన్ఱ - నడిపించుచున్న, అవ్వాழ்వై - సిద్ధమును, కాణీర్ - (మీరు) చూడకుండను న్నారు. ఎన్ శొల్లిచ్చొల్లుగేన్ - (మీకు) ఏమనిఏమనితోసమాధానము చెప్పెదను. వెళ్ళచ్చుగమవన్ - అపరిమితసుఖముగల ఆసర్వేశ్వరుఁడు, వీత్తిరున్ద - వేంచేసియున్నదియు, వేదవొలియుమ్ - వేదఘోషమున్ను, విழாవొలియుమ్ - ఉత్సవఘోషమున్ను, పిళ్ళై - బాలులయొక్క, కుழா - సమూహముయొక్క, విళైయాట్టొలియుమ్ - ఆటలఘోషమున్ను, అఱా - ఎడతెగకనున్నదియునైన, తిరుప్పేరెయిల్ - తిరుప్పేరెయనెడిదివ్యదేశమును, నాన్ - నేను, శేర్వన్ - పొందెదను

తా॥ ఓతల్లులారా! శంఖచక్రధరుఁడై గరుడవాహనారూఢుఁడై నామనస్సులో వేంచేసియున్న పద్మనేత్రుని సేవించియారసము నెఱుఁగకనన్ను నిషేధించుచున్న మీకు నేనేమని సమాధానము చెప్పెదను? ఆరసము నెఱుఁగినయెడలమీరునన్ను నిషేధించరు. గాన, అట్టినిరతిశయానన్దముగలసర్వేశ్వరునియొక్క నిత్యోత్సవములయందలి వేదపారాయణములు ఘోషించుచున్న తిరుప్పేరకు నేనువెళ్ళకతప్ప నని. ౧.

నానక్కరుఙ్గుழల్ తోழிమీర్ గాళ్ అన్నైయర్ గాళయల్ శేరియీర్ గాళ్*
నాన్ తనినెఞ్జమ్ కాక్కమాట్టేన్ ఎన్వశమన్ఱిదిరాప్పగల్ పోయ్*
తేన్ మొయ్త్తపూమ్పొழிల్ తణ్పణై శూழ் తెన్ తిరుప్పేరెయిల్ వీత్తిరున్ద*
వానప్పిరాన్ మణివణ్ణన్ కణ్ణన్ శెఙ్గనివాయిన్ తిఱత్తనువే. ౨.

అ॥ నాన - పరిమళించుచున్న, కరుమ్ - నల్లనైన, కుழల్ - కొప్పులుగల, తోழிమీర్ గాళ్ - ఓసఖియలారా! అన్నైయర్ గాళ్ - ఓతల్లులారా! అయల్ శేరియీర్ గాళ్ - ప్రక్కవూరులలోనున్న స్త్రీలారా! నాన్ - నేను, తని - అద్వితీయమైన (సర్వేశ్వరునియందు ప్రవణమైన), ఇన్నెఞ్జమ్ - ఈమనస్సును, కాక్కమాట్టేన్ - రక్షింప (నిషేధింప) జాలను. ఇదు - ఈమనస్సు, ఎన్ వశమన్ఱు - నాస్వాధీనమందుగూడలేదు. ఇరాప్పగల్ - రేయింబగళ్ళు,

పోయ్ - పోయి, తేన్ - తుమ్మెదలచే, మొయ్త్త - పూర్ణమైన, పూమ్పొఴిల్ - పుష్పతోటలచేతను, తణ్ - చల్లనైన, పణై - జలప్రదేశములచేతను, శూழ் - చుట్టబడిన, తెన్ - స్పృహణీయమైన, తిరుప్పేరైయిల్ - తిరుప్పేరైయందు, వీఱ్ఱిరున్ద - తనమహిమప్రకాశించునట్లు వేంచేసియున్న, వానప్పిరాన్ - అపరిచ్ఛిన్నమహిమగలవాఁడును, మణివణ్ణన్ - రత్నమువంటికాన్తిగలవాఁడునైన, కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, శెమ్ - ఎఱ్ఱనై, కని - పండువలె, ఇన్ - భోగ్యమైన, వాయ్ - అధరమందు, తిఱత్తదు - మగ్నమైనది.

తా॥ సుందరులైన ఓ సఖియలారా! ఓతల్లులారా! ఇఁకనున్న ఓస్త్రీలారా! మీరు నన్ను నిషేధించినను, నామనస్సు నిరతిశయభోగ్యమైన తిరుప్పేరైయందు వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క దివ్యావయవసౌందర్యమందు మగ్నమై నాకుస్వాధీనము కాకపోయినది. దానిని నేనునిషేధింపఁజాలను. నేనేమిచేసెదనని. ౨.

శెఙ్గనివాయిన్ తిఱత్తదాయుమ్ శెఞ్జుడర్ నీళ్ ముడితాఴ్న్దదాయుమ్*
శఙ్గొడుశక్కరమ్కణ్డుగన్దుమ్ తామరైక్కణ్గళుక్కఱ్ఱుత్తీర్న్దుమ్*
తిఙ్గళుమ్నాళుమ్విழாవఱాద తెన్ తిరుప్పేరైయిల్ వీఱ్ఱిరున్ద*
నఙ్గళ్ పిరానుక్కెన్నెఞ్జమ్ తోழீ నాణునిఱైయుమిఴన్దదువే. ౩.

అ॥ తోழீ - ఓసఖీ! ఎన్ నెఞ్జమ్ - నామనస్సు, శెమ్కని - పండినపండువలె, ఇన్ - భోగ్యమైన, వాయ్ - అధరముయొక్క, తిఱత్తదాయుమ్ - ప్రకారమునకువశపడినదియు, శెమ్ శుడర్ - ఎఱ్ఱనితేజస్సుగల, నీళ్ - పెరిగియున్న, ముడి - కిరీటమునకు, తాఴ్న్దదాయుమ్ - లోపడినదియు, శఙ్గొడు - శ్రీపాఞ్చజన్యముతోఁగూడ, శక్కరమ్ - సుదర్శనమును, కణ్డు - సేవించి, ఉగన్దుమ్ - సన్తోషించియు, తామరైక్కణ్గళుక్కు - పద్మనేత్రములయందు, అఱ్ఱు - ఇతరవిషయములనువిడిచి, తీర్న్దుమ్ - ప్రవణమైనదియునై, తిఙ్గళుమ్ - ప్రతిమాసములయందును, నాళుమ్ - ప్రతిదినములయందును, విழா - ఉత్సవము, అఱాద - ఎడతెగని, తెన్ - భోగ్యమైన, తిరుప్పేరైయిల్ - తిరుప్పేరైయందు, వీఱ్ఱిరున్ద - వేంచేసియున్న; నఙ్గళ్ పిరానుక్కు - మననిమిత్తమై (అర్చావతారమెత్తిన) ఉపకారకునికి, నాణుమ్ - లజ్జనున్ను, నిఱైయుమ్ - గుణపూర్తినిన్ని, ఇఴన్దదు - పోఁగొట్టుకొనినది.

తా॥ ఓసఖీ! నామనస్సు నిత్యోత్సవముగానున్న తిరుప్పేరయందు వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క దివ్యావయవదివ్యాభరణములను సేవించియాభోగ్యతయందు మగ్నమై, లజ్జమొదలగుతనసుగుణములను బోఁగొట్టుకొనినది. ఇఁకమీయుపదేశము నాయందేమియు నుపయోగించదని.

ఇఴన్ద వెమ్మామైత్తిఱత్తుప్పోన వెన్నెఞ్జినారుమఙ్గే
ఒழிన్దార్*ఉழన్దినియారైక్కొణ్డెన్నుశాగో ఓదక్కడలొలిపోల*ఎఙ్గుమ్
ఎழున్దనల్ వేదత్తొలినిన్ఱోఙ్గు తెన్ తిరుప్పేరైయిల్ వీఱ్ఱిరున్ద*
ముఴుఙ్గుశఙ్గక్కైయన్ మాయత్తాఴ్న్దేన్ అన్నైయర్గాళ్ ఎన్నైయెన్మునిన్దే. ౪

అ॥ ఇఴన్ద - పోఁగొట్టుకొనిన, ఎమ్ - మాయొక్క, మామైత్తిఱత్తు - సౌందర్యమును (విడిపించుకొనుటకు) కొఱకై, పోన - పోయిన, ఎన్ నెఞ్జినారుమ్ - నామనస్సును, అఙ్గే - అచ్చటనే,

ఒఴిన్దార్ - నిలిచిపోయినది. ఇని - ఇకమీఁద, ఉழన్దు - శ్రమపడి, ఆరై - ఎవరిని, కొణ్డు - సహాయముగాఁజేసికొని, ఎన్ - ఏమాటను, ఉళాగో - చెప్పెదను? ఓదమ్ - అలలుగల, కడల్ - సముద్రముయొక్క. ఒలిపోల - ఘోషమువలె, ఎఙ్గుమ్ - అంతట, ఎழున్ద - వర్ధిల్లుచున్న, నల్ వేదత్తొలి - శ్రేష్ఠమైనసామవేదముయొక్క ఘోషము, నిన్ఱు - ఎల్లప్పుడునుండి, ఓఙ్గుమ్ - వర్ధిల్లుచున్న, తెన్ - సుందరమైన, తిరుప్పేరై యిల్ - తిరుప్పేరయందు, శేర్ న్దిరున్ద - వేంచేసియున్నవాఁడును, ముழఙ్గు - ఘోషించుచున్న, శఙ్గమ్ - శ్రీపాఞ్చజన్యమును, కైయన్ - శ్రీహస్తమందుగలవాఁడునైన సర్వేశ్వరునియొక్క, మాయత్తు - ఆశ్చర్యచేష్టితములయందు, ఆழ్న్దేన్ - అవగాహించితిని. అన్నైయర్ గాళ్ - ఓతల్లులారా! ఎన్నై - నన్ను, మునిన్దు - కోపగించి, ఎన్ - ఏమిప్రయోజనము?

తా॥ ఓతల్లులారా! సర్వేశ్వరుఁడపహరించుకొనిపోయిన నాసౌందర్యమును దీసికొనివచ్చె దననిపోయిన నామనస్సుగూడ మఱలక నాసర్వేశ్వరునియందే మగ్నమైపోయినది. ఇఁక మఱియె వరును నాకు సహాయమున్ లేనందున, శ్రీవైష్ణవులు గుంపుగుంపుగానిలిచి సామగానముజేయుచున్న తిరుప్పేరయందు వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క మందహాసాది దివ్యచేష్టితములయందే నేను గూడ మగ్నుఁడనైతిని. ఇఁకనన్ను గోపకించుటచే నేమియు ప్రయోజనము లేదని. ౪.

మునిన్దుశగడముదైత్తు మాయప్పేయ్ ములై యుణ్డుమరుదిడై పోయ్*
కనిన్ద విళవుక్కెఱిన్ద కణ్ణపిరానుక్కెన్ పెణ్మైతోఱ్ఱేన్*
మునిన్దినియెన్ శెయ్దీరన్నైమీర్ గాళ్ మున్నియవన్వన్దిఱైయిరున్ద*
కనిన్దపొழిల్ తిరుప్పేరై యిఱ్కే కాలమ్బెఱ వెన్నైక్కాట్టుమినే. ౫.

అ॥ మునిన్దు - కోపగించి, శగడమ్ - శకటాసురుని, ఉదైత్తు - తన్ని, మాయమ్ - వంచకిరాలైన, పేయ్ - పిశాచియొక్క, ములై - స్తన్యమును, ఉణ్డు - త్రాగి, మరుదు - మద్దివృక్షముయొక్క, ఇడై - నడుమ, పోయ్ - వెళ్ళి, కనిన్ద - పండియున్న, విళవుక్కు - (అసురరూపియైన) వెలగపండునుగుఱించి, కన్ఱు - (అసురరూపియైన) దూడను, ఎఱిన్ద - విసిరికొట్టిన, కణ్ణపిరానుక్కు - శ్రీకృష్ణునివిషయమై, ఎన్ పెణ్మై - నాస్త్రీత్వమును (లజ్జాభయాదులను), తోఱ్ఱేన్ - పోఁగొట్టుకొంటిని, అన్నైమీర్ గాళ్ - ఓతల్లులారా! ఇని - ఇఁకమీఁద, మునిన్దు - కోపగించి, ఎన్ శెయ్దీర్ - ఏమిచేయుదలఁచితిరి? అవన్ - ఆసర్వేశ్వరుఁడు, మున్నివన్దు - ముందుగానే వచ్చి, ఇఱై యిరున్ద - వేంచేసియున్నదియు, కనిన్ద - ఫలములతోఁబూర్ణమైన, పొழిల్ - తోటలు గలదియునైన, తిరుప్పేరైయిఱ్కే - తిరుప్పేరై యనెడి దివ్యదేశమునకే (తీసికొనివెళ్ళి), కాలమ్బెఱ - శీఘ్రముగా, ఎన్నై - నాకు, కాట్టుమిన్గళ్ - (ఆసర్వేశ్వరుని) సేవింపఁజేయుఁడి.

తా॥ ఓతల్లులారా! పూతనాశకటవత్స కపిత్థాసురాదులనుజంపిన శ్రీకృష్ణునియొక్క దివ్యచేష్టితములను సేవించి లజ్జాదులనువదలి నేను వానియందే మగ్నుఁడనైతిని. ఇఁకనన్ను కోపగించి మీకేమి యుపయోగమున్నది? గాన ఆసర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరుప్పేరకే నన్ను దీసికొనిపోయి విడువుఁడియని. ౬.

కాలమ్బెఱ వెన్నైక్కాట్టుమిన్గళ్ కాదల్ కడలిన్ మిగప్పెరిదాల్*
నీలముగిల్ వణ్ణత్తెమ్బెరుమాన్ నిన్ఱిఙ్గు మున్నే వన్దెయ్ దక్కిల్లాన్*

ఞాలత్తవ఩్ వన్దువీ఩్ఱిరున్ద నా఩్మఱైయాళరమ్ వేళ్వియోవా*
కోలచ్చెన్నెల్ గళ్ కవరివీశుమ కూడుపు఩ల్ తిరుప్పేరై యిత్కే. ౬.

నీలముగిల్ - నీలమేఘమువంటి, వణ్ణమ్ - కాన్తిగల, ఎమ్పెరుమా఩్ - మనస్వామి ము఩్నేవన్దు - ముందఱవచ్చి, నిఱ్కుమ్ - నిలుచుచున్నాఁడు. ఎ఩్ కైక్కుమ్ - నా చేతులకును, ఎయ్దా఩్ - అందడు. కాదల్ - (నాకువానివిషయమై) ఆశ, కడలిల్ - సముద్రముకంటె, మిగప్పెరిదు - మిక్కిలిగొప్పది గానున్నది. ఞాలత్తు - భూలోకమందు, అవ఩్ - ఆసర్వేశ్వరుఁడు, వన్దు - వచ్చి, వీ఩్ఱిరున్ద - వేంచేసియున్నదియు, నా఩్మఱైయాళర్ - నాలుగువేదములువచ్చిన శ్రీవైష్ణవులయొక్క, వేళ్వియుమ్ - భగవదారాధనమును, ఓవా - విడువకుండజరుగునట్టిదియు, కోలమ్ - సుందరంబులైన, శెన్నెల్ గళ్ - ఎఱ్ఱధాన్యములు, కవరి - చామరమువలె, వీశుమ్ - వీనుచునట్టిదియు, కూడు - చేరియున్న, పు఩ల్ - జలముగలదియునైన, తిరుప్పేరైయిల్కే - తిరుప్పేరయనెడిదివ్యదేశమందు, ఎన్నై - నాకు, కాలమ్బెఱ - శీఘ్రముగా, కాట్టుమిన్గళ్ - (సర్వేశ్వరుని) సేవింపఁజేయుఁడి.

తా॥ ఓతల్లులారా ! నీలమేఘశ్యాముఁడైన సర్వేశ్వరుఁడు నాముందఱవేంచేసి నిలిచియున్నను నాతోమాటలాడక నాచేతికందకనేయున్నాఁడు గాన నాకువానియందాశపరిల్లుచున్నది. నన్ను శీఘ్రముగాదీసికొనివెళ్ళి తిరుప్పేరలోవేంచేసియున్న సర్వేశ్వరుని సేవింపఁజేయుఁడియని

పేరెయిల్ శూళ్ కడల్ తెన్నిలఙ్గై శెఱ్ఱపిరా఩్ వన్దువీ఩్ఱిరున్ద*
పేరైయిత్కేపుక్కెన్నెఞ్జమ్నాడి ప్పేర్త్తువరవెఙ్గుమ్కాణమాట్టే఩్*
ఆరైయినియిఙ్గుడైయమ్తోళీ యెన్నెఞ్జమ్ కూవవల్లారుమిల్లై*
ఆరైయినికొణ్డెన్ శాదిక్కిత్త దెన్నెఞ్జమ్కణ్డదువేకణ్డే఩్. ౭.

అ॥ పేర్ - పెద్ద, ఎయిల్ - ప్రాకారములచే, శూళ్ - చుట్టఁబడినదియు, కడల్ - సముద్రముచే చుట్టఁబడినదియునైన, తె఩్ - సుందరమైన, ఇలఙ్గై - లంకాపురిని, శెఱ్ఱ - నశింపఁజేసిన, పిరా఩్ - ఉపకారకుఁడైనసర్వేశ్వరుఁడు, వన్దు - వచ్చి, వీ఩్ఱిరున్ద - తనమహిమ ప్రకాశించునట్లు వేంచేసియున్న, పేరైయిల్కే - తిరుప్పేరకే, పుక్కు - ప్రవేశించి, ఎ఩్ నెఞ్జమ్ - నామనస్సు, నాడి (వానిని) వెదకి, పేర్త్తు - తిరిగియు, వర - వచ్చునట్లు, ఎఙ్గుమ్ - ఎచ్చటను, కాణమాట్టే఩్ - చూడకయున్నాను. తోళీ - ఓసఖీ ! ఇని - ఇఁకమీఁద, ఇఙ్గు - ఇచ్చట, ఆరై - ఎవరిని, ఉడైయమ్ - (సహాయముగా) కలవారమగుదుము ? ఎ఩్ నెఞ్జమ్ - నామనస్సును, కూవవల్లారుమ్ - పిలుచుకొనివచ్చి నావద్దచేర్చువారును, ఇల్లై - లేరు. ఇని - ఇఁకమీఁద, ఆరైక్కొణ్డు - ఎవరినిసహాయముగాజేసికొని, ఎ఩్ శాదిక్కిత్తదు - ఏపురుషార్థముసాధింపవచ్చును, ఎ఩్ నెఞ్జమ్ - నామనస్సు, కణ్డదువే - చూచినవిషయమునే, కణ్డే఩్ - చూచితిని.

తా॥ ఓసఖీ ! నామనస్సు సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరుప్పేరకువెళ్ళిపోయినది. తిరిగియువచ్చునో యేమోయని చూచుచున్నాను. నాకెక్కడను గనుపడలేదు. అచ్చటికివెళ్ళి దానినిపిలువువారు నెవ్వరులేరు. అదిలేనందున నాకెవరిసహాయముచే నేకార్యము సిద్ధించును ? గాన నేనుగూడ ఆమనస్సుపోయిన స్థానమునకే వెళ్ళుచున్నానని. ౭.

కణ్డదువేకొణ్డెల్లారుమ్కూడి క్కార్క్కడల్ వణ్ణనోడెన్ తిఱత్తు
క్కొణ్డు*అలర్ తూత్తిట్టదుముదలాక్కొణ్డవెన్ కాదలురైక్కిల్ తోழி*
మణ్ తిణిఞాలముమేழ்కడలుమ్ నీళ్ విశుమ్బుమ్కழிయప్పెరిదాల్*
తెణ్డిరైశూழ்న్దవన్ వీత్తిరున్ద తెన్ తిరుప్పేరైయిల్ శేర్వన్ శెన్ఱే. ౮.

అ॥ తోழி - ఓసఖీ! కణ్డదువేకొణ్డు - (నేను చేసినతిరునామసఙ్కీర్తనాదులను) చూచి దానినే యవలంబించుకొని, ఎల్లారుమ్కూడి - ఎల్లరును చేరి, కార్ - నల్లని, కడల్ - సముద్రమువంటి, వణ్ణనోడు - కాన్తిగల సర్వేశ్వరునితోఁగూడ, ఎన్ తిఱత్తు - నాకున్న స్నేహమును, కొణ్డు - అవలబించుకొని, అలర్ - (ఈమె సర్వేశ్వరునియందాసక్తురాలైనదని) అపవాదమును, తూత్తిట్టదుముదలా - (మీరు) చెప్పినది మొదలగు, కొణ్డ - ప్రవృత్తమైన, ఎన్ కాదల్ - నా స్నేహమును, ఉరైక్కిల్ - చెప్పినయెడల, మణ్ - మృత్తుచేత, తిణి - దట్టమైయున్న, ఞాలముమ్ - భూమియు, ఏழ் కడలుమ్ - సప్తసాగరములును, నీళ్ - విశాలమైన, విశుమ్బుమ్ - ఆకసమును, కழிయ - వెనుకపడునట్లు, పెరిదు - (ఇవన్నిటికంటె) పెద్దదైయున్నది. తెళ్ - నిర్మలమైన, తిరై - (తామ్రపర్ణియొక్క) అలలచే, శూழ்న్దు-చుట్టబడి, అవన్-ఆసర్వేశ్వరుఁడు, వీత్తిరున్ద - వేంచేసియున్న, తెన్ - సుందరమైన, తిరుప్పేరైయిల్ - తిరుప్పేరకు, శెన్ఱు - పోయి, శేర్వన్ - చేరెదను

తా॥ ఓసఖీ! ఈమె సర్వేశ్వరునియందు మిక్కిలి ప్రీతిజేయుచున్నదని యపవాదముగా మీరు చెప్పినది మొదలుగా నాయాశ మిక్కిలి పెరిగి సప్తసాగరములున్ను మహాపృథ్వియు, ఆకాశమున్నుకూడ తనలో నణుగునట్లు హెచ్చిపోయినది. గాననే నాసర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరుప్పేరయనెడు దివ్యదేశమునకే పోయిచేరెదనని. ౮.

శేర్వన్ శెన్ఱెన్నుడైత్తోழிమీర్గాళ్ అన్నైయర్గాళెన్నై త్తేత్తవేణ్డా*
నీర్గళురైక్కిన్ఱదెన్నిదఱ్కు నెఞ్జునిఱైవుమెనక్కిఙ్గిల్లై*
కార్వణ్ణన్ కార్క్కడల్ ఞాలముణ్డ కణ్ణపిరాన్ వన్దువీత్తిరున్ద*
ఏర్వళవొణ్ కழనిప్పழన తెన్ తిరుప్పేరైయిల్ మానగరే. ౯.

అ॥ ఎన్నుడై - నాయొక్క, తోழிమీర్గాళ్ - ఓసఖియలారా! అన్నైయర్గాళ్ - ఓతల్లులారా! ఎన్నై - నాకు, తేత్తవేణ్డా - ధైర్యముచెప్పవలదు నీర్గళ్ - మీరు, ఇదఱ్కు - ఈయవస్థకు, ఎన్ - ఏమాటలు, ఉరైక్కిన్ఱదు - చెప్పుచున్నారు? ఎనక్కు - నాకు, నెఞ్జుమ్ - మనస్సును, నిఱైవుమ్ - గాంభీర్యమును, ఇఙ్గిల్లై - ఇచ్చటలేదు. కార్ - శ్యామమైన, వణ్ణన్ - కాన్తిగలవాఁడును, కార్ - నల్లనైన, కడల్ - సముద్రముచే జుట్టబడిన, ఞాలమ్ - భూమిని, ఉణ్డ - ఆరగించినవాఁడునైన, కణ్ణపిరాన్ - శ్రీకృష్ణస్వామి, వన్దు - వచ్చి, వీత్తిరున్ద-వేంచేసియున్నదియు, ఏర్ - చెరువులయొక్క, వళమ్ - సమృద్ధిగలదియు, ఒణ్ - సుందరమైన, కழని - పొలములను, పழనమ్ - కొలనలనుగలదియునైన, తెన్ - స్పృహణీయమైన, తిరుప్పేరైయిల్ - తిరుప్పేరైయనెడి, మానగర్ - మహానగరమును, శెన్ఱు - పోయి, శేర్వన్-చేరెదను.

తా॥ ఓసఖియలారా ! నాకుమీరేమియుధైర్యము చెప్పవలదు. నాప్రకృతి నెఱు గనిమీమాటలు ప్రకృతమునకేమియు సంబధించదు. నామనస్సును నాధైర్యమునుగూడ మీమాటవినుట కిచ్చటలేకపోయినవి. జగద్రక్షకుఁడైయతిసుందరుఁడైన సర్వేశ్వరుఁడు వేంచేసియున్న సకలసంపత్సమృద్ధమైన తిరుప్పేరనునెడు దివ్యదేశమును నేనుపోయి చేరకమాననని ౯.

నగరముమ్నాడుమ్పిఱవుమ్తేర్వేన్ నాణెనక్కిల్లై యెన్దోழிమీర్గాళ్*
శిగరమణినెడుమాడనీడు తేన్తిరుప్పేరెయిల్వీర్ఱిరున్ద*
మగరనెడుఙ్గుழைక్కాదన్మాయన్ నూర్ఱువరై యన్ఱుమఙ్గనూర్ర*
నిగరిల్ముగిల్వణ్ణన్నేమియాన్ నెన్నెఞ్జమ్ కవర్న్దెనై యూழிయానే. ౧౦.

అ॥ ఎన్దోழிమీర్గాళ్ - ఓనాసఖియలారా ! శిగరమ్ - పర్వతశిఖరమువలెనున్నవియు, మణి - రత్నమయములైనవియు, నెడు - ఉన్నతములునైన, మాడమ్ - గృహములుగల, నీడు - గొప్పదైన, తేన్ - సుందరమైన, తిరుప్పేరెయిల్ - తిరుప్పేరయందు, వీర్ఱిరున్ద - వేంచేసియున్నవాఁడును, మగరమ్ - మకరాకారమై, నెడు - దీర్ఘమైన, కుழை - ఆభరణము గల, కాదన్ - చెవ్వుగలవాఁడును, మాయన్ - ఆశ్చర్యచేష్టితుఁడును, నూర్ఱువరై - దుర్యోధనాదులునూఱుగురును, అన్ఱు - అప్పుడు, మఙ్గ - నశించునట్లు, నూర్ర - సంకల్పించినవాఁడును, నిగరిల్ - ఒప్పులేనివాఁడును, ముగిల్వణ్ణన్ - మేఘమువంటికాన్తిగల వాఁడును, నేమియాన్ - సుదర్శనముగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, ఎన్నెఞ్జమ్ - నామనస్సును, కవర్న్దు - అపహరించి, ఎనైయూழிయాన్ - ఎన్ని (అనేక) కాలములుగలవాఁడై యున్నాఁడు. నగరముమ్ - పట్టణములయందును, నాడుమ్ - దేశములయందును, పిఱవుమ్ - తక్కినగ్రామాదులయందును, తేర్వేన్ - (ఆసర్వేశ్వరుని) వెదకెదను ఎనక్కు - నాకు, నాణ్ - సిగ్గు, ఇల్లై - లేదు.

తా॥ ఓసఖియలారా ! రత్నమయమై పర్వతమువలె నత్యున్నతమైన మేడలచే నిండియున్న తిరుప్పేరలో వేంచేసియున్న, మగరనెడుఙ్గుழைక్కాదన నెడు తిరునామముగల సర్వేశ్వరుఁడు నామనస్సు నపహరించుకొనిపోయినాడు. గాన వానినియచ్చటచ్చటపోయి సిగ్గులేక వెదకెదనని.

ఊழிదోఱూழிయురువుమ్పేరుమ్శెయ్గై యుమ్ వేఱువర్ వైయమ్కాక్కు-
ఆழிనీర్వణ్ణనై యచ్చుదనై యణికురుగూర్ చ్చడగోపన్‌శొన్న* [మ్*
కేழிలన్దాదియోరాయిరత్తుళ్ళివై తిరుప్పేరెయిల్ మేయపత్తుమ్*
ఆழிయఙ్గైయనై యేత్తవల్లా రవగడిమై ఱేజిల్లార్గళ్యానే. ౧౧.

అ॥ ఊழிదోఱూழி - ప్రతికల్పములయందును, ఉరువుమ్ - రూపములనున్ను, పేరుమ్ - తిరునామములనున్ను, శెయ్గైయుమ్ - వ్యాపారములనున్ను, వేఱువర్ - వేఱువేఱుగాగలవాఁడై, వైయమ్ - భూమిని, కాక్కుమ్ - రక్షించువాఁడును, ఆழிనీర్వణ్ణనై - సముద్రజలమువంటి కాన్తిగలవాఁడునునైన, అచ్చుదనై - అచ్యుతునివిషయమై, అణి - (భూమికి) అలఙ్కారమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, శొన్న - ప్రసాదించినదియు, కేழிల్ - ఒప్పులేనదియు, అన్దాది - అన్దాదియు, ఓర్ - అద్వితీయములునైన,

ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, తిరుప్పేరై యిల్ - తిరిప్పేరైయనెడు విషయమై, మేయ సకలలక్షణపూర్ణములైన, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములచే, ఆழி - సుదర్శనమును, అమ్ - సుందరమైన, కైయనై - శ్రీహస్తమందుధరించిన సర్వేశ్వరుని, ఏత్తవల్లారవర్ - స్తుతింపఁదగినవారు, అడిమైత్తిఱత్తు - కైఙ్కర్యమునందు, ఆழియార్ - సుదర్శనాழ்వార్లవలె మిక్కిలి ప్రీతిగలవారై యుందురు.

తా॥ ప్రతియుగమునందును వేలువేలు నామరూపవ్యాపారములను స్వీకరించి జగద్రక్షణముచేయుచున్న సర్వేశ్వరునివిషయమై నమ్మాழ்వార్లు ప్రసాదించిన వెయ్యిపాశురములలో తిరుప్పేరై విషయమైన యీపదిపాశురముల ననుసంధించువారు భగవత్కైఙ్కర్యమందు మిక్కిలి ప్రీతికలవారగుదురని. ౧౧.

ఆ ழ் వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౮ - వ, తిరువాయ్మొழி.

అవతారిక:—ఆழ்వార్లిట్లు విశ్లేషాసహిష్ణువైయుండగా సర్వేశ్వరుఁడు వీరివ్యసనము నివర్తించునట్లు తనవిజయములను ప్రకాశింపఁజేయ వానిని యీతిరువాయ్మొழிలో ననుసంధించుచున్నారు.

॥॥ ఆழிయెழ చ్చఙ్గుమ్విల్లుమెழ*తిశై
వాழிయెழ త్తణ్డుమ్వాళుమెழ*అణ్డమ్
మోழைయెழముడిపాదమెழ*అప్పన్
ఊழிయెழ వులగఙ్గొణ్డవాఱే. ౧.

అ॥ ఆழி-సుదర్శనము, ఎழ - (యుద్ధోన్ముఖమై) వృద్ధిఁబొందియుండగా, శఙ్గుమ్ - శ్రీపాంచజన్యమును, విల్లుమ్ - శార్ఙ్గమును, ఎழ - వృద్ధిఁబొందియుండగా, తణ్డుమ్ - కౌమోదకియు, వాళుమ్ - నన్దకమును, ఎழ - వర్ధింప, తిశై - దిక్కులయందు, వాழி - మంగళాశాసనధ్వని, ఎழ - వృద్ధిబొందునట్లును, అణ్డమ్ - అండభిత్తి, మోழைయెழ - (పగిలి) ఆవరణజలము లోపలప్రవేశించునట్లు, ముడి - కిరీటమున్ను, పాదమ్ - తిరువడికళును, ఎழ - పెరుగునట్లును, ఊழிయెழ - మంచికాలముకలుగునట్లును, అప్పన్ - సర్వేశ్వరుఁడు, ఉలగమ్ - లోకములను, కొణ్డ - స్వీకరించిన, ఆఱు - ప్రకారము, ఏ ఏ-మాశ్చర్యము ?

తా॥ త్రివిక్రమావతారమందు లోకములనుగొలిచినప్పుడు, వీరికేమి యవద్యమువచ్చునో యని యతిశంకచేసి పంచాయుధములును యుద్ధసన్నద్ధములై తమవిగ్రహములను పెంచుచుండెను. బ్రహ్మాదులును సనకాదులును మంగళాశాసనముజేసిరి. వీరికిరీటము అండభిత్తిపైనను శ్రీపాదము అండభిత్తిక్రిందను వ్యాపించినందున అండముపగిలి మహాజలము లోపలవచ్చునో యేమోయని యతిశంకజేయునట్లుండెను. ఇది మిక్కిలి యాశ్చర్యకరమైయున్నదని. ౧.

ఆఱుమలై క్కెదిర్న్దోడుమొలి*అర
వూఱుశులాయ్ మలై తేయ్క్కుమొలి*కడల్
మాఱుశుழన్ఱ ழైక్కున్ఱవొలి*అప్పన్
శాఱుపడ వముదఙ్గొణ్డనాన్ఱే. ౧.

అ॥ అప్పన్ - సర్వేశ్వరుఁడు, శాఱుపడ - (దేవతలకు) మహోత్సవముకలుగునట్లు, అముదమ్ - అమృతమును, కొణ్డ - ఎత్తిన, నాన్ఱు - దినమందు, ఆఱు - నదులు, మలైక్కు - (తమ-కుత్పత్తిస్థానములైన) పర్వతములకు, ఎదిర్న్దు - ఎదురుగాతిరిగి, ఓడుమ్ - పఱుగెత్తుచున్న, ఒలి - శబ్దమును, అరవు - వాసుకియనెడిసర్పముయొక్క, ఊఱు - శరీరమును, శులాయ్ - చుట్టి, మలై - మందరపర్వతమునందు, తేయ్క్కుమ్ - ఒఱుచుచున్న, ఒలి - శబ్దమును, కడల్ - సముద్రము, మాఱు - సవ్యాపసవ్యములుగా, శుழన్ఱు - తిరిగి, అழైక్కిన్ఱ - ఘోషించుచున్న, ఒలి - శబ్దమును, (కలిగినవి).

తా॥ సర్వేశ్వరుఁడు సముద్రమథనముఁజేయుకాలమందు ఎదుఱలలు కొట్టుటచే సముద్రమందు బడుచున్న నదులన్నియు వెనుకతిరిగి ఘోషించుచుపఱుగెడెను. మందరపర్వతమునందు వాసుకిని జుట్టి యీడవగా దానిశరీరము రాళ్ళయందొఱసి కలిగిన "శరశర" అనెడిశబ్దమును, సముద్రక్షోభచేగలిగిన శబ్దమును మిక్కిలివర్ధిల్లుచుండెనని. ౧.

నాన్ఱిలవేழ్ మణ్ణుమ్తాన త్తవే*పిన్నుమ్
నాన్ఱిలవేழ్ మలై తాన త్తవే*పిన్నుమ్
నాన్ఱిలవేழ్ కడల్ తాన త్తవే*అప్పన్
ఊన్ఱియిడ న్దెయిఱ్ఱిల్ కొణ్డనాళే. ౨.

అ॥ అప్పన్ - సర్వేశ్వరుఁడు, ఊన్ఱి - (భూమిని) పెళ్ళగించి, ఇడన్దు - విడదీసి, ఎయిఱ్ఱిల్ - తనదంతముమీద, కొణ్డ - ఎత్తుకొనివచ్చిన, నాళ్ - దినమందు, ఏழ్ - సప్తద్వీపములతోఁజేరిన, మణ్ణుమ్ - భూమియు, నాన్ఱిల - చలనములేక, తానత్త - తనస్థానమందుండెను. పిన్నుమ్ - మఱియు, ఏழ్ మలై - సప్తకులాచలములును, నాన్ఱిల - చలనములేక, తానత్త - స్వస్థానములందుండెను. పిన్నుమ్ - మఱియు, ఏழ్ కడల్ - ఏడుసముద్రములును, నాన్ఱిల - చలింపక, తానత్త - స్వస్థానములందుండెను.

తా॥ సర్వేశ్వరుఁడు వరాహావతారంబెత్తి పాతాళమందంటుగొనియున్న భూమినితనకొమ్ములచే పెళ్ళగించి విడదీసి యెత్తుకొనివచ్చినప్పుడు సప్తద్వీపములును సప్తసాగరములును సప్తకులాచలములును కొంచెముకూడ తమతమస్థానమునుండి చలింపకనుండునట్లు అనాయాసముగా తీసికొని వచ్చెనని. ౨.

నాళుమెழ నిలనీరుమెழ*విణ్ణుమ్
కోళుమెழ ఎరికాలుమెழ*మలై
తాళుమెழ చ్చుడర్తానుమెழ*అప్పన్
ఊళియెழ వులగముణ్డవూణే. ౪.

అ॥ నాళుమ్ - కాలమును, ఎழ - నశించునట్లును, నిలమ్నీరుమ్ - పృథివీజలములును, ఎழ - నశించునట్లును, విణ్ణుమ్ - ఆకాశమును, కోళుమ్ - సూర్యచన్ద్రాదిగ్రహములును, ఎழ -

నశించునట్లును, ఎరికాలుమ్ - అగ్నియువాయువును, ఎழு - నశించునట్లును, మలై - పర్వతములు, తాళ్ ఎழு వుమ్-సమూలముగానశించునట్లును, శుడర్ తానుమ్-తేజోమయమైననక్షత్రాదులును, ఎழு-నశించునట్లును, అప్పన్ - సర్వేశ్వరుఁడు, ఊழி (లోకములనారగించినప్పుడు చేసిన) ఆస్వాదనధ్వని, ఎழு - వ్యాప్తమగునట్లును, ఉలగమ్ - లోకములను, ఉణ్డ - అరగించిన, ఊణ్ - ఆరగింపు, ఏ - ఆశ్చర్యముగానుండెను.

తా॥ సర్వేశ్వరుఁడు ప్రళయకాలమందు, పృథివ్యాదిపంచభూతములును చన్ద్రసూర్యనక్షత్రాదులును పర్వతాదులును కాలమును లీనమగునట్లు అస్వాదనముచేసి యారగించెనని. ౪.

ఊణుడై మల్లర్ తిదర్న్దవొలి*మన్నర్
ఆణుడైచ్చేనై నడుఙ్గుమొలి*విణ్ణుళ్
ఏణుడైత్తేవర్ వెళిప్పట్టవొలి*అప్పన్
కాణుడైప్పారదమ్ కైయఱైపోழ்దే. ౫.

అ॥ అప్పన్ - సర్వేశ్వరుఁడు, కాణుడై - దర్శనీయమైన, పారదమ్ - భారతయుద్ధము, కైయఱైపోழ்దు - ఆరంభించినసమయమందు, ఊణుడై - ఆహారముగలవారై, మల్లర్ - బలిష్ఠులైనజట్టిలు, తిదర్న్ద - చూర్ణమయిన, ఒలి - శబ్దమును, మన్నర్ - రాజులయొక్క, ఆణుడై - పౌరుషముగల, శేనై - సేనలోనున్నవారు, నడుఙ్గుమ్ - (భయపడి) వణుకుచున్న, ఒలి - శబ్దమును, విణ్ణుళ్ - ఆకాశమందు, ఏణుడై - ఉన్నతస్థానమందున్న, తేవర్ - దేవతలు, వెళిప్పట్ట - (యుద్ధమునుజూచుటకు) బయలదేరిన, ఒలి - శబ్దమును, (కలిగినవి).

తా॥ శ్రీకృష్ణావతారమందు భారతయుద్ధమందు నిలిచినసేనలను ఏర్పాడుచేయుచున్నప్పుడు, సర్వేశ్వరుఁడేసాక్షాత్ యుద్ధమునకువచ్చెనని భయపడి భీష్మద్రోణాదులు వణికిరి. బలిష్ఠులైన శూరులంత చచ్చిరి. ఈయాశ్చర్యమును జూడదేవతలు ఆకసమునందు వచ్చినిలిచిరని. ౫.

‡‡ పోழ்దుమెలిన్ద పున్ శెక్కరిల్* వాన్ తిశై
శూழுమెழுమ్ ఉదిరప్పునలా*మలై
కీழ்దుపిళన్ద శిఙ్గమొత్తదాల్*అప్పన్
ఆழ்తుయర్ శెయ్ దశురరై క్కొల్లుమాఱే. ౬.

అ॥ పోழ்దుమెలిన్ద - పొద్దుపోయిన, పున్ శెక్కరిల్ - సన్ధ్యాకాలమందు, శూழுమ్ - వ్యాపించియున్న, వాన్ - ఆకాశమందును, తిశై - దిక్కులయందును, ఎழுన్దు - వ్యాపించి, ఉదిరప్పునల్ ఆ - రక్తప్రవాహముగునట్లు, అప్పన్ - నరసింహస్వామి, ఆழ் తుయర్ - (శత్రువులకు) గొప్పదుఃఖమును, శెయ్దు - కలుగజేసి, అశురరై - అసురులను, కొల్లుమాఱు - చంపినప్రకారము, మలై - పర్వతమును, కీழ்దు - చీల్చి, పిళన్ద - బద్దలుచేసిన, శిఙ్గమొత్తదు - సింహముతో సమానముగానుండెను, ఆల్ - ఆశ్చర్యము.

తా॥ నరసింహావతారమెత్తి సంధ్యాకాలమందు సర్వదేశములయందును రక్తముప్రవహించునట్లు అసురులను సంహరించినది, ఒకసింహము పర్వతమును బద్దలుచేసినట్లు ఆశ్యాశ్చర్యకరంబైయుండెనని. ౬.

మాఱునిరై త్తిరెక్కుమ్‌శరజ్గళ్ *ఇన
నూఱుపిణమ్ మలై పోల్ పురళ *కడల్
ఆఱుమడు త్తుదిరప్పునలా *అప్పన్
నీఱుపడ విలజ్గై శెత్తనేరే. ౭.

అ॥ మాఱు - ఎదురుపడి, నిరైత్తు - ఒఱుచుకొని, ఇరైక్కుమ్ - ఘోషించుచున్న, శరజ్గళ్ - బాణములచే, ఇనమ్‌నూఱు - అనేకగుంపులుగా, పిణమ్ - శవములు, మలైపోల్ - పర్వతమువలె, పురళ - దొర్లునట్లును, కడల్ - సముద్రము, ఉదిరప్పునలా - రక్తప్రవాహముచే నిండి, ఆఱు - నదులయందు, మడుత్తు - (రక్తమును) ప్రవహింపజేయునట్లును, అప్పన్ - సర్వేశ్వరుడు, ఇలజ్గై - లంకను, నీఱుపడ - భస్మమగునట్లు, శెత్త - నశింపజేసిన, నేర్ - ధర్మయుద్ధము.

తా॥ రామావతారమందు లంకయందు రాక్షసులను జంపునప్పుడు బాణములు ఒకటిమీదనొకటిరొయుచుకొనిపోయి అనేకరాక్షసులను జంపగా వారక్తము సముద్రమును నదులును నింపునట్లు ప్రవహించెనని. ౭.

నేర్‌శరిన్దాన్ కొడిక్కోళి కొణ్డాన్ *పిన్నుమ్
నేర్‌శరిన్దా నెరియుమనలోన్ *పిన్నుమ్
నేర్‌శరిన్దాన్ ముక్కణ్‌మూర్ త్తికణ్డీర్ *అప్పన్
నేర్‌శరివాణన్ తిణ్డోళ్ కొణ్డవన్నే. ౮.

అ॥ అప్పన్ - సర్వేశ్వరుడు, నేర్‌శరి - ప్రధానుడైన, వాణన్ - బాణాసురుని యొక్క, తిణ్ - బలిష్ఠములైన, తోళ్ - భుజములను, కొణ్డవన్ను - ఛేదించినప్పుడు, కోళి - నెమలిని, కొడికొణ్డాన్ - ధ్వజమందుగలకుమారస్వామి, నేర్‌శరిన్దాన్ - ఆరంభమందేఓడిపోయెను. పిన్నుమ్ - మఱియు, ఎరియుమ్ - జ్వలించుచున్న, అనలోన్ - అగ్ని, నేర్‌శరిన్దాన్ - ప్రారంభమందే ఓడిపోయెను. పిన్నుమ్-మఱియు, ముక్కణ్‌మూర్త్తి - త్రినేత్రుడైనరుద్రుడు, నేర్‌శరిన్దాన్‌కణ్డీర్ - వీపుత్రిప్పుకొనెను సుమీ.

తా॥ కృష్ణావతారమందు బాణాసురునితో యుద్ధముజేసి వానిభుజములను తుండించినప్పుడు కుమారస్వామియు, అగ్నులును, త్రినేత్రుడును వాణాసురునికి సహాయముగావచ్చి శ్రీకృష్ణునిముందఱ నిలవలేక ఓడిపోయిరని. ౮.

అన్ఱుమణ్ణీరెరి కాల్ విణ్‌మలై ముదల్ *
అన్ఱుశుడ రిరణ్డుపిఱవుమ్ పిన్నుమ్ *
అన్ఱు మళైయుయిర్ తేవుమ్‌మత్తుమ్ *అప్పన్
అన్ఱుముద లులగమ్ శెయ్‌దదుమే. ౯.

అ॥ అప్పన్ - సర్వేశ్వరుడు, మణ్ - భూమినిన్ని, నీర్ - జలమునున్ను, ఎరి - అగ్నినిన్ని, కాల్ - వాయువునున్ను, విణ్ - ఆకాశమునున్ను, మలై - పర్వతమునున్ను, ముదల్ - ఇవిమొదలుగాగల తక్కినపదార్థములనున్ను, అన్ఱు - అప్పుడు సృజించెను. ఇరణ్డుశుడర్ -

చన్ద్రసూర్యులనెడి రెండుతేజస్సులనున్ను, పిఱవుమ్ - తక్కినవనక్షత్రాదులనున్ను, అన్ఱు - అప్పుడు సృజించెను పిన్నుమ్ - మఱియూ, మழை - వర్షమునున్ను, ఉయిర్ - ప్రాణులనున్ను, తేవుమ్ - దేవతలనున్ను, మత్తుమ్ - తక్కినవన్నింటినిన్ని, అన్ఱు - అప్పుడు సృజించెను. అన్ఱు - అసృష్టికాలమందు, ముదల్ - మొదట, ఉలగమ్ - లోకములను, శెయ్దదు - సృష్టించెను.

తా॥ సర్వేశ్వరుఁడు సృష్టికాలమందు పృథివ్యాదిపంచభూతములనున్ను, పర్వతాదులనున్ను, దేవాది సకలప్రాణులనున్ను సృష్టించెనని. ౯.

మేయ్నిరై కీழ் పుగ మాపురళ* శునై
వాయ్నిఱై నీర్ పిళిఱిచ్చొరియ* ఇన
ఆనిరై పాడి యఙ్గేయొడుఙ్గ* అప్పన్
తీమழை కాత్తు కున్ఱమెడుత్తానే. ౧౦.

అ॥ మేయ్ - మేయుచున్న, నిరై - గోసమూహములు, కీழ் - క్రింద, పుగ - ప్రవేశించునట్లును, మా - మృగములు, పురళ - దొల్లిపడునట్లును, శునైవాయ్ - జలలయందు, నిఱై-నిండియున్న, నీర్ - జలము, పిళిఱి - ఘోషించుచు, శొరియ - క్రిందజారిపడునట్లును, ఇనమ్-గుంపులుగానున్న, ఆనిరై - గోసమూహమును, పాడి - గోకులమును, ఉళ్ళే - లోపల, ఒడుఙ్గ -అణగునట్లును, అప్పన్ - శ్రీకృష్ణమూర్తి, తీమழை - చెడ్డవర్షమును, కాత్తు - అడ్డగించి రక్షించుటకై, కున్ఱమ్ - గోవర్ధనగిరిని, ఎడుత్తానే - ఎత్తెను.

తా॥ ఒకప్పుడు ఇన్ద్రుఁడు అఖండాకారముగా వర్షమునుకురిపింప, అప్పుడు గోగోపలను రక్షించుటకై గోవర్ధనగిరిని తల్లకిందగానెత్తినప్పుడు ఆపర్వతమందున్న మృగములున్ను జలలనీరును జారి క్రిందపడెనని. ౧౦.

‡‡ కున్ఱమెడుత్తపిరా నడియారొడుమ్*
ఒన్ఱినిన్ఱ శడగోపనురై శెయల్*
నన్ఱిపునైన్ద ఓరాయిరత్తుళ్ళివై*
వెన్ఱితరుమ్పత్తుమ్ మేవిక్కత్తార్క్కే. ౧౧.

అ॥ కున్ఱమెడుత్త - గోవర్ధనగిరినెత్తిన, పిరాన్ - శ్రీకృష్ణునియొక్క, అడియారొడుమ్ - భక్తులతోఁగూడ, ఒన్ఱినిన్ఱ - ఏకీభవించియున్న, శడగోపన్ - నమ్మాழ்వార్లయొక్క, ఉరై శెయల్ - వాచికవృత్తియైన, నన్ఱిపునైన్ద - లక్షణములుగల (భగవద్గుణప్రతిపాదకములైన), ఓర్, అద్వితీయములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములును, మేవి - ఆదరముతో, కత్తార్క్కు అభ్యసించువారికి, వెన్ఱితరుమ్ - జయమునిచ్చును.

తా॥ భాగవతప్రియులైన నమ్మాழ்వార్లు ప్రసాదించిన ఈపదిపాశురముల నభ్యసించువారు సంసారమనెడి శత్రువులను జయింతురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

# ౫ - వ, తిరువాయ్‌మొழி.

అవతారిక:—ఈతిరువాయ్‌మొழிలో, సమస్తకల్యాణగుణపూర్ణమైన రామకృష్ణాద్యవతారములుండగా చేతనులు దేవతాంతరముల నాశ్రయించి చెడిపోవుచున్నారేయని యాశ్చర్యపడి తాము ఆగుణముల ననుభవించుచున్నారు.

‡‡ కత్పారిరామపిరానై యల్లాల్ మత్ఱుమ్‌కత్పరో*
పుత్పాముదలా ప్పుల్లెఱుమ్పాదియొన్ఱిన్ఱియే*
నత్పాలయోత్తియిల్‌వాழுమ్ శరాశరమ్‌ముత్ఱవుమ్*
నత్పాలుక్కుయ్‌త్తనన్ నాన్ముగనార్‌పెత్ఱనాట్టుళే. ౧.

అ॥ నత్పాల్ - విలక్షణదేశమైన, అయోత్తియిల్ - అయోధ్యానగరమందు, వాழுమ్‌- వాసముజేయుచున్న, పుల్‌ముదలా - గడ్డిమొదలైన, పా - వస్తువును, పుల్ - అల్పమైన, ఎఱుమ్పు ఆది - చీమలుమొదలగు ప్రాణులునైన, శరాశరమ్ ముత్ఱవుమ్ - జంగమస్థావరములన్నింటిని, నాన్ముగనార్ - చతుర్ముఖబ్రహ్మ, పెత్ఱ -సృష్టించిన, నాట్టుళ్ - దేశమందు, ఒన్ఱుఇన్ఱియే - ఒకసాధనములేకనే, నల్‌పాలుక్కు - మోక్షమందు, ఉయ్‌త్తనన్ - పొందించెను. కత్పార్ - (ప్రియహితములను) అభ్యసించువారు, ఇరామపిరానైయల్లాల్ - చక్రవర్తితిరుమగనారునుతప్ప, మత్ఱుమ్ - వేఱొకదానిని, కత్పరో - అధ్యయనముజేయుదురా ?

తా॥ తనకు తిరువవతారదివ్యదేశమైన అయోధ్యానగరమందున్న సకలచరాచరములన్నింటికిని పరమపదమిచ్చిన చక్రవర్తితిరుమగనారును వదలి మఱియొకవస్తువును తమకు క్షేమమును గోరువారాశ్రయించరని. ౧.

నాట్టిల్‌పిఱన్దవర్ నారణత్కాళన్ఱియావరో*
నాట్టిల్‌పిఱన్దు పడాదనపట్టుమనిశర్‌క్కా*
నాట్టైనలియుమరక్కరై నాడిత్తడిన్దిట్టు*
నాట్టైయళిత్తుయ్యచ్చెయ్‌దు నడన్దమై కేట్టుమే. ౨.

అ॥ నాట్టిల్ - భూలోకమందు, పిఱన్దు - అవతరించి, పడాదన - పడరానిబాధను, పట్టు - అనుభవించి, మనిశర్‌క్కా - (కృతఘ్నులైన) మనుష్యులకొఱకై, నాట్టై - లోకమందున్న వారిని, నలియుమ్ - బాధించుచున్న, అరక్కరై - రాక్షసులను, నాడి - వారున్నచోటికి వెదకుకొనివెళ్ళి, తడిన్దిట్టు - చంపి, నాట్టై - లోకమును, అళిత్తు - అనుగ్రహించి, ఉయ్యచ్చెయ్‌దు - ఉజ్జీవింపజేసి, నడన్దమై - పరమపదమునకు వేంచేసిన వృత్తాంతములను, కేట్టుమ్ - వినియు, నాట్టిల్ పిఱన్దవర్ - లీలావిభూతియందు జన్మించినవారు, నారణత్కు - శ్రీమన్నారాయణునికి, ఆళన్ఱి - దాసులుగాక, ఆవరో - మఱియొకరికి దాసులగుదురా ?

తా॥ లోకములను బాధించుచున్న దుష్టులను సంహరించుటకై తానతిహేయమైన యీ భూలోకమందవతరించి సీతావియోగము మొదలగు పడరాని వ్యసనముల ననుభవించి రాక్షసులను జంపి కృతజ్ఞతలేని మనుష్యులను రక్షించి వీరికి పరమపదమునిచ్చి శ్రీవైకుంఠమునకు వేంచేసిన చక్ర

వ త్తితిరుమగనారుయొక్క దివ్య చేష్టితములను విని కూడ, భూలోకమందు బుట్టినవారు వారికి దాసులుగాక మఱియొకరికగుదురాయని. ౨.

కేట్పార్ గళ్ కేశవన్ కీర్ త్తియల్లాల్ మఱ్ఱుమ్ కేట్పరో*
కేట్పార్ శెవిశుడు కీళ్ మైవశవుగళ్ వై యుమ్*
శేట్పాల్ పళ్ళమ్ పగైవన్ శిశుపాలన్* తిరువడి
తాట్పాలడైన్ద తన్మైయఱివారై యఱిన్దుమే. 3.

అ॥ కేట్పార్ - (శ్రీకృష్ణనిందను) వినవలయునని యున్నవారియొక్క, శెవి - చెవ్వుకూడ, శుడుమ్ - దగ్ధమగునట్లు, కీళ్మై - నీచములైన, వశవుగళ్ - నిందోక్తులచే, వైయుమ్ - నిందించుచున్నవాఁడును, శేణ్ పాల్ - చిరకాలముగా, పళ్ళమ్ - అనాదియైన, పగైవన్ - ద్వేషముగలవాఁడునైన, శిశుపాలన్ - శిశుపాలుఁడు, తిరువడి - స్వామియైన శ్రీకృష్ణునియొక్క, తాళ్ పాల్ - శ్రీపాదములక్రింద, అడైన్ద - చేరిన, తన్మై - స్వభావమును, అఱివారై - ఎఱుఁగినవారిని, అఱిన్దుమ్ - ఎఱుంగియు, కేట్పార్ గళ్ - (తమకుజ్జీవనోపాయమును) వినువారు, కేశవన్ - కేశినిసంహరించిన శ్రీకృష్ణునియొక్క, కీర్ త్తియల్లాల్ - కీర్తినితప్ప, మఱ్ఱుమ్ - మఱియొకదానిని, కేట్పరో - వినుదురా ?

తా॥ ఎంతద్వేషులకుఁగూడ సహింపరానిమాటలచే నిందించిన శిశుపాలుని తన శ్రీపాదములక్రిందఁజేర్చుకొనిన శ్రీకృష్ణుని కల్యాణగుణములనుతప్ప, బుద్ధిమంతులు మఱియొకమాటనువినరని.

తన్మైయఱిబవర్ తామవఱ్కన్ఱి యావరో*
వన్మైయుడైయ పొరుళాదుమిల్ పాళ్ నెడుఙ్గాలత్తు*
నన్మైప్పునల్ పణ్ణి నాన్ముగనై ప్పణ్ణిత్తన్నుళ్ళే*
తొన్మైమయక్కియ తోఱ్ఱియ శూళ్గల్ గళ్ శిన్దిత్తే. ౪.

అ॥ వన్మై - (దేవమనుష్యాది) అనేకాకారములుగా, పడర్ - వ్యాపించియున్న, పొరుళ్ - వస్తువులు, ఆదుమ్ - ఏదియు, ఇల్ - లేని, పాళ్ - శూన్యమైన, నెడుమ్ కాలత్తు - ద్విపరార్థమైన గొప్పప్రళయకాలమందు, నన్మై - మంచిదైన, (సృష్టికిఁగారణమైన), పునల్ - జలమును, పణ్ణి - సృష్టించి, తన్నుళ్ళే - తనసఙ్కల్పముచే, నాన్ముగనై - చతుర్ముఖబ్రహ్మను, పణ్ణి - సృష్టించి, తొన్మై - మునుపు, మయక్కియ - సంహరించిన పదార్థములను, తోఱ్ఱియ - సృజించిన, శూళ్గల్ గళ్ - ఉపాయములను, శిన్దిత్తు - అనుసన్ధించి, తన్మైయఱిబవర్ - తత్త్వముతెఱుఁగినవారు, తామ్ - తాము, అవఱ్కు - జగత్కారణుఁడైన యాశ్రియఃపతికి, అన్ఱి - దాసులుగాక, ఆవరో - మఱియొకరికగుదురా ?

తా॥ తత్త్వస్థితినెఱుఁగినవారు, మొదట మహాజలమునున్ను బ్రహ్మనున్ను సృజించిన శ్రీమన్నారాయణునితప్ప మఱియొకరిని జగత్కారణముగా దలంచి ధ్యానించరని. ౪.

శూఴల్ గళ్ శిన్దిక్కిల్ మాయఱ్ కఴలన్ఱి చ్చూఴ్వరో*
ఆఴప్పెరుమ్బునల్ తన్నుళ్ ళఴున్దియ ఞాలత్తై*
తాఴప్పడామల్ తన్పాలొరు కోట్టిడై త్తాన్ కొణ్డ*
కేఴల్ తిరువురువాయిఱ్ఱు క్కేట్టుముణర్న్దుమే. ౫.

అ॥ ఆఴమ్ - అగాధమై, పెరుమ్ - విశాలమైన, పునల్ తన్నుళ్ - మహాజలమందు, అఴున్దియ-మునిగియున్న, ఞాలత్తై - భూమిని, తాఴప్పడామల్ - కరిగిపోకుండ, తన్పాల్ - తనయొక్క, ఒరుకోట్టిడై - ఒకదంతమందు, తాన్ - తాను, కొణ్డ - ఎత్తుకొనివచ్చిన, తిరు - సుందరమైన, కేఴలురువాయిఱ్ఱు - వరాహావతారమెత్తిన విధమును, కేట్టుమ్ - వినియు, ఉణర్న్దవర్ - మననముజేసినవారు, శూఴల్ గళ్ - తమకుజ్జీవనోపాయములను, శిన్దిక్కిల్ - విచారించినయెడల, మాయన్ - ఆశ్చర్య చేష్టితుఁడైన శ్రియఃపతియొక్క, కఴలన్ఱి - శ్రీపాదములనుతప్ప, శూఴ్వరో - ఆశ్రయించుదురా ?

తా॥ ప్రళయార్ణవమందు మగ్నమైయున్న భూమిని వరాహావతారమెత్తి యుద్ధరించిన శ్రియఃపతినితప్ప నుఱియొకరిని యుజ్జీవనోపాయముగా బుద్ధిమంతులాశ్రయించరని. ౫.

కేట్టుముణర్న్దవర్ కేశవఱ్కాళన్ఱి యావరో*
వాట్టమిలా వణ్కై మావలివాదిక్క వాదిప్పుణ్డు*
ఈట్టఙ్గొళ్ తేవర్ గళ్ శెన్ఱిరన్దార్ క్కిడర్ నీక్కియ*
కోట్టఙ్గై వామననాయ్ చ్చెయ్ద కూత్తుక్కళ్ కణ్డుమే. ౬.

అ॥ వాట్టమిలా - ఎడతెగని (నిరన్తరమైన) వణ్ - ఔదార్యముగల, కై - హస్తముగల, మావలి - బలిచక్రవర్తి, వాదిక్క - బాధించగా, వాదిప్పుణ్డు-బాధపడి, ఈట్టమ్కొళ్ - గుంపుగాజేరి, శెన్ఱు - వెళ్ళి, ఇరన్దార్ - ప్రార్థించిన, తేవర్ గట్కు-దేవతలకు, ఇడర్ - దుఃఖమును, నీక్కియ - పోఁగొట్టినవాఁడును, కోడు - (దానజలపరిగ్రహార్థమై) చేరియున్న, అమ్ - సున్దరమైన, కై - శ్రీహస్తముగల, వామననాయ్ - వామనుఁడై, శెయ్ద - చేసిన, కూత్తుక్కళ్ - విలాసములను, కణ్డుమ్ - చూచియు, కేట్టుమ్ - వినియు, ఉణర్న్దవర్ - మననముజేసినవారు, కేశవఱ్కు - కేశవునికి, ఆళన్ఱి - దాసులుగాక, ఆవరో - మఱియొకరిగగుదురా ?

తా॥ మహాబలిచే బాధింపఁబడిన దేవతలు తనవద్దవచ్చి ప్రార్థింప. అప్పుడు వామనావతారంబెత్తి, వానికున్న ఔదార్యగుణమునుజూచి వానినిజంపక యుక్తిచే భూమినిమాత్రము బరిగ్రహించి దేవతలకిచ్చి వారిదుఃఖమును బోఁగొట్టిన సర్వేశ్వరుని దివ్యచేష్టితములనువిని జక్కగా బరిశీలించినవారు మఱియొకరి నాశ్రయించరని. ౬.

కణ్డుమ్ తెళిన్దుమ్ కఱ్ఱార్ కణ్ణఱ్కాళన్ఱి యావరో*
వణ్డుణ్ మలర్ త్తొఙ్గల్ మార్ క్కణ్డేయనుక్కు వాఴునాళ్*
ఇణ్డైచ్చడై ముడి యీశనుడన్ కొణ్డు శాచ్చెల్ల*
కొణ్డఙ్గు త్తన్నొడుమ్ కొణ్డుడన్ శెన్ఱదుణర్న్దుమే.

అ॥ వణ్డు - గుమ్మెదలు, ఉణ్ - మధుపానముఁజేయుచున్న, మలర్ - పుష్పముల యొక్క, తొఙ్గల్ - మాలనుధరించిన, మార్క్కణ్డేయనుక్కు - మార్కణ్డేయునికి, వాழ்నాళ్ - ఆయుష్యముకొఅక్కై, ఇణ్డై - మాలను, శడై - జటను, ముడి - కిరీటమునుగల, ఈశన్ - రుద్రుఁడు, ఉడన్కొణ్డు - వెంటతీసికొని, ఉశా - భగవద్గుణములనుజెప్పుచు, శెల్ల - శ్రియఃపతివద్ద కెళ్ళగా, అఙ్గు - ఆదశయందు, కొణ్డు - (మార్కణ్డేయుని) స్వీకరించి, తన్నొడుమ్ - తనతో, కొణ్డు - చేర్చుకొని, ఉడన్ శెన్ఱదు - ఎడబాయకనున్నదానిని, ఉణర్న్దుమ్ - (పురాణాదులచే) తెలిసికొనియు, కల్ప్రుమ్ - చదివియు, కేట్కుమ్ - మననముజేసియు, కణ్డార్ - చూచినవారు, కణ్ణఱ్కు - శ్రీకృష్ణునికి, ఆళన్ఱి - దాసులుగాక, ఆవరో - మఱియొకరికగుదురా ?

తా॥ మార్కణ్డేయుఁడు చిన్నతనములో నాడుకొని యున్నప్పుడు "నీవల్పాయుష్యముగల వాఁడ" వని యశరీరివాణినివిని తనకుదీర్ఘాయుష్యము సంపాదించుకొనవలయునని రుద్రునిగురించి తపస్సుజేయగా చిరకాలమునకు రుద్రుఁడు ప్రత్యక్షమై "ఓమార్కణ్డేయుఁడా ! నీవలనే నేను తపస్సుజేయుచున్నాను, నాజటనుజూడుము, నీకీవరమిచ్చుటకు నేనుసమర్థుఁడనుకాను, శ్రియఃపతి వద్దకెళ్ళుదమురమ్ము" అని వెంటపెట్టుకొనిపోయి శ్రియఃపతివద్దచేర్చగా నప్పుడు వీడుదేవతాన్తర భక్తుఁడనిగూడఁ జూడకమార్కణ్డేయుని తనవద్దనుంచుకొని రక్షించిన సర్వేశ్వరుని చక్కగా శ్రవణ మనననిదిధ్యాసనములచే దెలిసికొనినవారు మఱియొకరినాశ్రయించరని. ౭.

ఞ్ఞ శెల్లవుణర్న్దవర్ శెల్వన్ఱన్ శీరన్ఱి కఱ్పరో*
ఎల్లైయిలాద పెరున్దవత్తాల్ పలశెయ్మిఱై*
అల్లలమరరైచ్చెయ్యు మిరణియనాగత్తై*
మల్లలరియురువాయ్ చ్చెయ్దమాయమఱిన్దుమే. ౮.

అ॥ ఎల్లైయిలాద - అవధిలేని, పెరుమ్తవత్తాల్ - గొప్పతపస్సుచే, అమరరై - దేవతలను, పల - అనేకవిధములైన! మిఱై - బాధలను, శెయ్ - చేసి, అల్లల్ - దుఃఖములను, శెయ్యుమ్ - చేయుచున్న, ఇరణియన్ - హిరణ్యాసురునియొక్క, ఆగత్తై - శరీరమును, మల్లల్ - గొప్ప, అరియురువాయ్ - సింహరూపియై, శెయ్ద - (బద్దలు) చేసిన, మాయమ్-ఆశ్చర్యచేష్టితములను, అఱిన్దుమ్ - తెలిసికొనియు, శెల్ల - శ్రీవైకుణ్ఠమునకుపోయిచేరుటకు, ఉణర్న్దవర్ - అధ్యవ సించినవారు, శెల్వన్ఱన్ - శ్రీమంతుఁడైన నరసింహునియొక్క, శీరన్ఱి - కల్యాణగుణములను తప్ప, కఱ్పరో - మఱియొకదానినియభ్యసించుదురా ?

తా॥ గొప్పతపస్సుజేసి తనకుచావులేదని వరమునొంది దేవతలనుబాధించుచున్న హిరణ్యు విజంపిన నరసింహునియొక్క కల్యాణగుణములనువదలి మోక్షార్థులు మఱియొకదానినిజెప్పరని. ౮.

మాయమఱిబవర్ మాయవఱ్కాళన్ఱియావరో*
తాయమ్శెఱుమొరునూఱ్ఱువర్ మఙ్గవోరైవర్క్కాయ్*
తేశమఱియవోర్ శారదియాయ్చ్చెన్ఱు శేనైయై
నాశమ్శెయ్దిట్టు*నడన్దనల్ వార్త్తైయఱిన్దుమే. ౯.

అ॥ తాయమ్ - (పాండవుల) దాయభాగమును, శెఱుమ్ - చెడగొట్టిన, ఒరు - ఒక, నూర్ట్రువర్ - నూఱుగురైన దుర్యోధనాదులు, మఙ్గ - నశించునట్లు, ఓర్ - సహాయములేని, ఐవర్కాయ్ - పంచపాణ్డవులపక్షమందుజేరి, తేశమఱియ - దేశమంత నెఱుఁగునట్లు, ఓర్ శారదియాయ్ - అద్వితీయమైనసారథియై, శెన్ఱు - యుద్ధమందువెళ్ళి, శేనైయై - సేనలను, నాశమ్ శెయ్దిట్టు - నశింపజేసి, నడన్ద - పరమపదమునకువేంచేసిన, నల్వార్త్తై - మహాభారతమనెడి శ్లాఘ్యమైనసూక్తిని, . అఱిన్దుమ్ - ఎఱుఁగియు, మాయమ్ - (ఆశ్రితపారతన్త్ర్యమనెడి) వాని యాశ్చర్యచేష్టితమును, అఱిబవర్ - పరిశీలించినవారు, మాయవఱ్కు - ఆశ్రితసులభుఁడైన శ్రీకృష్ణునికి, ఆళన్ఱి - దాసులుగాక, ఆవరో - మఱియొకరికగుదురా ?

తా॥ తనభక్తులైన పాణ్డవులకుభాగమివ్వక మోసముఁజేసిన దుర్యోధనాదులనుజంపి అర్జునునికి సారథ్యముజేసిన యాశ్రితభవ్యుఁడైన శ్రీకృష్ణుని దివ్యచరిత్రములనువిని బుద్ధిమంతులు వానిని వదలి మఱియొకరికి దాసులుకారని. ౯.

‡‡ వార్త్తైయఱిబవర్ మాయవఱ్కాళన్ఱియావరో*
పోర్త్తపిఱప్పొడు నోయొడుమూప్పొడిఱప్పివై
పేర్త్తు*పెరున్దున్బమ్ వేరఱనీక్కి త్తన్ తాళిన్కీழ்
చ్చేర్త్తు*అవన్ శెయ్యుమ్ శేమత్తైయెణ్ణిత్తెళివుర్ట్రే. ౧౦.

అ॥ వార్త్తై - చరమశ్లోకమును, అఱిబవర్ - ఎఱుఁగినవారు, పోర్త్త - ఆత్మను బాధించుచున్న, పిఱప్పొడు - జన్మముతోను, నోయొడు - వ్యాధితోను, మూప్పొడు - వార్ధకముతోను (కూడుకొనియున్న), ఇఱప్పు - మరణము, ఇవై - వీనిని, పేర్త్తు - నశింపఁజేసి, పెరుమ్తున్బమ్ - (కైవల్యమనెడి) మహాదుఃఖములను, వేరఱ - సమూలముగానశించునట్లు, నీక్కి - పోగొట్టి, తన్ తాళిన్కీழ் - తనశ్రీపాదములక్రింద, శేర్త్తు - చేర్చుకొని, అవన్ - ఆశ్రియఃపతి, శెయ్యుమ్ - చేయుచున్న, శేమత్తై - క్షేమకార్యములను, ఎణ్ణి - తలఁచి, తెళివుర్ట్రు - నిర్మలజ్ఞానముగలవారై, మాయవఱ్కు - ఆశ్రితసులభుఁడైన శ్రీకృష్ణునికి, ఆళన్ఱి - దాసులుగాక, ఆవరో - మఱియొకరికగుదురా ?

తా॥ జన్మజరామరణాది సకల దుఃఖములనుబోగొట్టి తన శ్రీపాదములయందుఁ జేర్చుకొని రక్షించెడి శ్రీకృష్ణుఁడుప్రసాదించిన చరమశ్లోకార్థము నెఱుఁగినవారు ఆశ్రియఃపతికే దాసులగుదురని. ౧౦.

‡‡ తెళివుర్ట్రువీవిన్ఱినిన్ఱవర్క్కిన్బక్కదిశెయ్యుమ్*
తెళివుర్ట్రకణ్ణనైత్తెన్కురుగూర్చ్చడగోపన్శొల్*
తెళివుర్ట్రవాయిరత్తుళ్ళివైపత్తుమ్వల్లారవర్*
తెళివుర్ట్రశిన్దైయర్ పామరుమూవులగత్తుళ్ళే. ౧౧.

అ॥ తెళివు - శ్రియఃపతియే ఉపాయము ఉపేయము అనెడుజ్ఞానమును, ఉర్ట్రు - పొంది, వీవు - (కుదృష్టులసహవాసముచే ఈ జ్ఞానమునకు) విచ్ఛేదము, ఇన్ఱి - లేనివారై, నిన్ఱవర్క్కు - స్థిరముగానున్నవారికి, ఇన్బమ్ - ఆనన్దరూపమైన, కది - మోక్షమును, శెయ్యుమ్ - కలుగఁజేయువాఁడును, తెళివుర్ట్ర - సర్వజ్ఞుఁడునైన, కణ్ణనై - శ్రీకృష్ణునివిషయమై, తెన్ - దర్శ

నీయమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, శొల్ - సాధించినవియు, తెళివుర్ఱ - జ్ఞానప్రదములునైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోచేరిన, ఇవై పత్తుమ్ - ఈ పదిపాశురములను, వల్లారవర్ - అభ్యసించువారు, పా - పాపములచే, మరు - పూర్ణమైన, మూవులగత్తుళ్ళే - మూడులోకములయందున్నప్పుడే, తెళివుర్ఱ - జ్ఞానవైశద్యము గల, శిన్దైయర్ - మనస్సుగలవారై యగుదురు.

తా॥ తననే యుపాయోపేయములుగా నమ్మినభక్తులకు మోక్షప్రదుడైన శ్రియఃపతి విషయమైన ఈపదిపాశురముల నభ్యసించువారు ఈసంసారమందున్నప్పుడే తత్వము నెఱుంగుదురని

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్

## ౯-వ, తిరువాయ్మొழி

అవతారిక :—"ఆழிయొழு" మొదల గనుబంధించిన భగవద్గుణములను ప్రత్యక్షముగా ననుభవింపయత్నించిన నమ్మాழ்వార్లు వానిగన్గొనలభించక ఆర్తులై పరమపదమునందు వేంచేసియున్న సర్వేశ్వరునికివినునట్లు వానియొక్క ప్రాప్యత్వప్రాపకత్వాది గుణములనుజెప్పి ఘోషించుచున్నారు.

‡‡ పామరుమూవులగుమ్పడైత్త పఱ్పనాబావో*
పామరుమూవులగుమళన్ద పఱ్పపాదావో*
తామరైక్కణ్ణావో తనియేన్ తనియాళావో*
తామరైక్కైయావో ఉన్నై యెన్ఱుకొల్ శేర్వదువే. ౧.

అ॥ పా - (స్థావరజఙ్గమ) వస్తువులచే, మరు - నిండియున్న, మూవులగుమ్ - మూడులోకములను, అళన్ద - కొలిచిన, పఱ్పనాబా - పద్మనాభుడా! పామరు - వస్తువులచే నిండిన, మూవులగుమ్ - మూడులోకములను, అళన్ద - కొలిచిన, పఱ్పపాదా - శ్రీపాద పద్మము గలవాడా! తామరైక్కణ్ణా - ఓ పద్మనేత్రుడా! తామరైక్కైయా - పద్మమువంటి శ్రీహస్తము గలవాడా! తనియేన్ - బద్ధముక్తులలోకాని యొంటరియైననన్ను, తనిఆళా - చక్కగాపరిపాలించుచున్న ఓ స్వామీ! ఉన్నై - నిన్ను, ఎన్ఱుకొల్ - ఎప్పుడు, శేర్వదు - పొందెదనో ?

తా॥ సకలజగత్కారణుడవైన ఓ స్వామీ! నిరతిశయ సుందరంబులైన నీ దివ్యావయవములతో వేంచేసియున్న నిన్ను నేనెప్పుడు చేరెదనోయని. ౧.

ఎన్ఱుకొల్ శేర్వదన్దో అరనాన్ముగనేత్తుమ్* శెయ్య
నిన్ తిరుప్పాదత్తైయాన్ నిలనీరెరికాల్*విణ్ణుయిర్
ఎన్ఱివైతాన్ ముదలాముழுదుమాయ్ నిన్ఱ వెన్దాయో*
కున్ఱెడుత్తానిరైమేయ్ త్తవైకాత్తవెఱ్ఱాకాత్తావో. ౨.

అ॥ నిలమ్ - పృథివి, నీర్ - జలము, ఎరి - అగ్ని, కాల్ - వాయు, విణ్ - ఆకాశము, ఉయిర్ - ప్రాణులు, ఎన్ఱివైతాన్ - అనెడివీనిని, ముదలా - మొదలుగాగల, ముழுదుమ్,

సమస్తములకును, ఆయ్ - అన్తరాత్మవై, నిన్ఱ - ఉన్న, ఎన్దాయ్ - ఓ నాస్వామీ ! ఆనిరై - గోసమూహములను, మేయ్త్తు - మేపి, కున్ఱుఎడుత్తు - గోవర్ధనము నెత్తి, అవై - ఆ గోగోపలను, కాత్త - రక్షించిన, ఎన్ కూత్తా - నాకు మనోహరంబులైన దివ్యచేష్టితముగలవాఁడా! అరన్ - రుద్రుఁడును, నాన్ముగన్ - బ్రహ్మయూ, ఏత్తుమ్ - స్తుతించుచున్న, శెయ్య - సుందరమైన, నిన్ తిరుప్పాదత్తై - నీ శ్రీపాదమును, యాన్ - నేను, శేర్వదు - పొందుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడో? అన్దో - అయ్యో ?

తా॥ సమస్త చరాచరములకు నంతర్యామివై రక్షించుచున్న ఓ స్వామీ ! బ్రహ్మాదిసేవ్యఁ డైన నీ శ్రీపాదమును నేనెప్పుడు చేరదనోయని. ౨.

కాత్తవెమ్కూత్తా వో మలై యేన్దికల్ మారిదన్నై*
పూత్తణ్ తుళాయ్ముడియాయ్ పునైకొన్ఱైయఞ్జెఞ్జడై యాయ్*
వాయ్త్తవెన్నాన్ముగనే వన్దెన్నారుయిర్ నీయానాల్*
ఏత్తరుమ్ కీర్త్తియినా యున్నై యెఙ్గుత్తలై ప్పెయ్వనే. ౩.

అ॥ మలైయేన్ది - గోవర్ధనము నెత్తి, కల్ మారిదన్నై - రాళ్ళవర్షమును, కాత్త - అడ్డగించిన, ఎమ్కూత్తా - మాకు దర్శనీయంబులైన దివ్యచేష్టితములుగలవాఁడా! పూ - పుష్పముగల, తణ్ - చల్లనైన, తుళాయ్ - తిరుత్తుళాయిని, ముడియాయ్ - కిరీటమందు గలవాఁడా! పునై - గుచ్ఛబడిన, కొన్ఱై - కొన్ఱైపుష్పముగలదై, అమ్ - సుందరమై, శెమ్ - ఎఱ్ఱనైన, శడైయాయ్ - జటగలరుద్రునికి నిర్వాహకుఁడా ! వాయ్త్త - జ్ఞానపూర్తిగల, ఎన్ నాన్ముగనే - బ్రహ్మకు నిర్వాహకుఁడైన ఓ స్వామీ ! వన్దు - వచ్చి, ఎన్ - నాకు, నీ - నీవు, ఆరుయిర్ - పరిపూర్ణ ప్రాణమువంటివాఁడా ! ఏత్తు - సంపూర్ణముగా స్తుతించుటకు, అరుమ్ - అశక్యమైన, కీర్త్తియినాయ్ - కీర్తిగలవాఁడా! ఉన్నై - నిన్ను, ఎఙ్గు - ఎచ్చట, తలైప్పెయ్వన్ - పొందెదను ?

తా॥ బ్రహ్మరుద్రాదులకును గారణభూతుఁడవైన ఓ స్వామీ ! నీవు నిర్హేతుక కటాక్షముచే నాకిదివఱలో ప్రాణమువలె ధారకుండవై యుంటివి. ఇఁకమీదగూడ నీతిరువడి ప్రాప్తికొఱకు చేయవలసినదానిని నీవేచేసి నెరవేర్చుకొనుమాయని. ౩.

ఎఙ్గుత్తలై ప్పెయ్వన్ నెళిల్ మూవులగుమ్ నీయే*
అఙ్గుయర్ ముక్కణ్ పిరాన్ పిరమపెరుమానవన్నీ*
వెఙ్గదిర్ వచ్చిరక్కై యిన్దిరన్ ముదలాత్తెయ్వమ్ నీ*
కొఙ్గలర్ తణ్ణన్తుళాయ్ముడి యెన్నుడై కోవలనే. ౪.

అ॥ కొఙ్గు - తేనెగలదై, అలర్ - వికసించియున్న, తణ్ - చల్లనై, అమ్ - సుందరమైన, తుళాయ్ - తిరుత్తుళాయిని, ముడి - కిరీటమందుగల, ఎన్నుడై - నాకు భవ్యుఁడైన, కోవలనే - గోపాలుఁడా ! ఎళిల్ - సుందరములైన, మూవులగుమ్ - మూడులోకముల యతిశయము, నీయే - నీ యధీనమైయే యున్నది. అఙ్గు - ఆలోకమందు, ఉయర్ - గొప్పవాఁడైన, ముక్కణ్ పిరాన్ - త్రినేత్రునియొక్కయు, పిరమపెరుమానవన్ - బ్రహ్మదేవుని యొక్కయు, (అతిశయము), నీ - నీ యధీనమే, వెమ్కదిర్ - క్రూరమైన తేజస్సుగల, వచ్చిరమ్-

వజ్రాయుధమును, కై - హస్తమందుగల, ఇన్దిరన్ ముదలా - ఇన్ద్రుడు మొదలగు, తెయ్వమ్ - దేవతలయొక్క (అతిశయమును), నీ - నీయధీనమే. (ఇంతగొప్పవాడవైననిన్ను), నాన్ - నేను, ఎఙ్ఙు - ఎచ్చట, తలైప్పెయ్‌వన్ - పొందెదను ?

తా॥ అధిరాజ్యసూచకమైన తులసీమాలికను కిరీటమందు ధరించిన ఓస్వామీ! బ్రహ్మరుద్రేన్ద్రాది సకలదేవతల ప్రభావములకుఁ గారణమైన నిన్ను నేనుపొందెడి ఉపాయమును నీవే యోచించుమాయని. ४.

ఎన్నుడైక్కోవలనే యెన్బాల్లా క్కరుమాణిక్కమే*
ఉన్నుడై యున్దిమల రులగమవై మూన్రుమ్బరన్దు*
ఉన్నుడై చ్చోదివెళ్ళత్తగమ్బాలున్నైక్కణ్డుకొణ్డిట్టు*
ఎన్నుడై యారుయిరా రెఙ్ఙనేకొల్ వన్దెయ్‌దువరే. ५.

అ॥ ఎన్నుడైక్కోవలనే - నాకు విధేయుడవైన గోపాలుడా! పొల్లా - ద్వారములేని, (అనుభవించని), ఎన్ కరుమాణిక్కమే - నీలమాణిక్యమువంటి కాన్తిగల ఓ నా స్వామీ! ఉన్నుడై - నీయొక్క, ఉన్ది - నాభియందు, మలర్ - ఉత్పన్నమైన, మూన్రులగమవై - మూడులోకములయందున్న ఆయా విషయములయందు, అర్ పరన్దు - మిక్కిలి యాసక్తిగలదై యున్న, ఎన్నుడై - నాయొక్క, ఉయిరార్ - ఆత్మ, ఉన్నుడై - నీయొక్క, శోదివెళ్ళమ్ - తేజస్సు ప్రవహించుచున్న శ్రీవైకుణ్ఠముయొక్క, అగమ్బాల్ - లోపల, ఉన్నై - నిన్ను, కణ్డుకొణ్డిట్టు - సేవించి, వన్దు - సమీపించి, ఎఙ్ఙన్ - ఏవిధంబున, ఎయ్‌దువర్ - పొందునో ?

తా॥ ఓ శ్రియఃపతీ! నీవు సృజించియుంచిన శబ్దాది విషయములయందు ప్రవణమైయున్న నా యాత్మ వానినివదలి, అప్రాకృతదివ్యతేజోమయమైన శ్రీవైకుణ్ఠమందు వేంచేసియున్న నిన్ను బొందుటకు సమర్థముకాదు. గాన నాకార్యమును నీవే నెరవేర్చుమని. ५.

వన్దెయ్‌దుమాఱఱియేన్ మల్ గునీలచ్చుడర్ తழைప్ప*
శెఙ్ఙుడర్ చ్చోదిగళ్ పూత్తొరుమాణిక్కమ్ శేర్ వదుపోల్*
అన్దరమేల్ శెమ్బట్టో డడియున్దికై మార్వుకణ్ వాయ్*
శెఙ్ఙుడర్ చ్చోదివిడవుఱై యెన్ తిరుమార్బనైయే. ६.

అ॥ మల్ గు - వర్ధిల్లుచున్న, నీలచ్చుడర్ - నీలమైన తేజస్సు, తழைప్ప - సమృద్ధమైయుండగా (దానిపైన), అన్దరమేల్ - మధ్యప్రదేశముమీదనున్న, శెమ్బట్టోడు - పీతామ్బరముతోఁగూడ, అడి - శ్రీపాదము, ఉన్ది - తిరునాభి, కై - శ్రీహస్తము, మార్వు - వక్షస్థలము, కణ్ - నేత్రము, వాయ్ - తిరువధరము (ఇవి), శెమ్‌శుడర్ - ఎఱ్ఱనై వెలుగుచున్న, శోది - తేజస్సును, విడ - వ్యాపింపఁజేయు, శెమ్ - ఎఱ్ఱని, శుడర్ - కాన్తిగల, శోదిగళ్ - రత్నపుష్పములను, పూత్తు - వికసింపఁజేసికొని, ఒరు - ఒక, మాణిక్కమ్ - నీలరత్నము, శేర్వదుపోల్ - అమరియుండునట్లు, ఉఱై - వర్ధిల్లించియున్న, ఎన్ - నాకు, స్వామినియైన, తిరుమార్వాకాలనై - వీరాట్టిని వక్షస్థలమందుగల శ్రియఃపతిని, వన్దు - సమీపించి, ఎయ్‌దుమాఱు - పొందెడివిధమును, అఱియేన్ - ఎఱుఁగను.

తా॥ ఒక నీలమాణిక్యమువీఁద ఎఱ్ఱమాణిక్యములు పుష్పించినట్లు శ్యామమైన తిరుమేను మీఁద ఎఱ్ఱని కరచరణాది దివ్యావయవములు ప్రకాశింప, దానిమీఁద పెరియపిరాట్టి వేంచేసి యున్న వక్షస్థలముగల ఓ శ్రియఃపతీ! నిన్ను పొందుటకు నే నేక్షీణమైన ఉపాయము నెఱుఁగనని.

ఎన్ తిరుమార్ బన్ఱన్నై ఎన్మలైమగళ్ కూఱన్ఱన్నై*
ఎన్ఱుమెన్నామగళై యగమ్బాల్ కొణ్డనాన్ముగనై*
నిన్ఱ శశిపతియై నిలఙ్కీణ్డెయిల్ మూన్ఱెరిత్త*
వెన్ఱుపులన్ఱురన్ద విశుమ్బాళియైక్కాణేనో. ౨.

అ॥ ఎన్ - నాకు స్వామినియైన, తిరు - పిరాట్టిని, మార్బన్ఱన్నై - వక్షస్థలమందు ధరించినవాఁడును, ఎన్మలైమగళ్ కూఱన్ఱన్నై - పర్వతపుత్రియైన పార్వతిని పార్శ్వమందు గల రుద్రుని కర్తృస్వామియైన నాస్వామియు, నామగళై - వాగ్దేవియైన సరస్వతిని, ఎన్ఱుమ్ - ఎల్ల ప్పుడును, అగమ్బాల్ కొణ్డ - ముఖప్రదేశమందుగల, ఎన్ నాన్ముగనై - బ్రహ్మకర్తృస్వామియైన నాస్వామియు, నిన్ఱ - వీరిద్దరితో సమానుఁడైయున్న, శశిపతియై - ఇన్ద్రుని కర్తృస్వామియు, నిలమ్ - భూమిని, కీణ్డ - విడతీసినవాఁడును, మూన్ఱెయిల్ - త్రిపురములను, ఎరిత్త - దహించిన వాఁడును, పులమ్ - ఇన్ద్రియములను, వెన్ఱు - జయించి, తురన్ద - ఓడకొట్టినవాఁడును, విశుమ్బు - స్వర్గమును, ఆళియై - పరిపాలించువాఁడునైన సర్వేశ్వరుని, కాణేనో - చూడనా?

తా॥ సకల చరాచర నిర్వాహకుఁడైన శ్రియఃపతి ఫలప్రదానమునకుఁదగిన పూర్తిగలవాఁ డైయున్నను, నేను సాధనాన్తరములను వదలి వానికే పరతన్త్రుఁడనైయున్నను, ఇదివఱకు నాకు ఫలమివ్వనందున ఇఁక నాఫలములు నాకు లభించవో యేమోయని భయపడుచున్నానని. ౩.

ఆళియైక్కాణ్ పరియాయ్ అరికాణ్ నరియాయ్*అరక్కర్
ఊళై యిట్టన్ఱిలఙ్గైకడన్దు పిలమ్బుక్కొళిప్ప*
మీళియమ్బుళ్ళైక్కడాయ్ విఱల్ మాలియైక్కొన్ఱు*పిన్నుమ్
ఆళుయర్కున్ఱఙ్గళ్ శెయ్ దడర్త్తానైయుమ్ కాణ్డుఙ్గొలో. ౪.

అ॥ ఆళియై - యాళిని, కాణ్ - చూచిన, పరియాయ్ - గుఱ్ఱమువలెను, అరి - సింహ మును, కాణ్ - చూచిన, నరియాయ్ - నక్కవలెను, అరక్కర్ - రాక్షసులు, అన్ఱు - అప్పుడు, ఊళైయిట్టు - కూతవేయుచు, ఇలఙ్గై - లంకను, కడన్దు - వదలి, పిలమ్ - బిలమును, పుక్కు - ప్రవేశించి, ఒళిప్ప - దాచుకొనియుండగా, మీళి - బలముగల, అమ్ - సున్దరమైన, పుళ్ళై - గరుత్మంతుని, కడాయ్ - నడిపించుకొనిపోయి, విఱల్ - బలిష్ఠుఁడైన, మాలియై - మాలియనెడి రాక్షసుని, కొన్ఱు - చంపి, పిన్నుమ్ - మఱియు, ఆళ్ - పరిజనములను, ఉయర్ - ఉన్నతమైన, కున్ఱఙ్గళ్ - పర్వతములువలె, శెయ్దు - చేసి, అడర్త్తానైయుమ్ - నశింపఁజేసిన ఉపేన్ద్రునిని, కాణ్డుఙ్గొలో - సేవింపవచ్చునా?

తా॥ మాలి సుమాలి మొదలగు రాక్షసులు ఉపేంద్రునిజూచి భయపడి సింహమునుజూచిన నక్కవలె కూతవేయుచు లంకనువదలి పాతాళలోకమునకు వెళ్ళగా, గరుడవాహనారూఢుఁడై అచ్చటికి వేంచేసి వారినిజంపిన ఉపేంద్రుని నేనెప్పుడు సేవించెదనోయని. ౫.

కాణ్డుజ్గొలో నెఞ్జమే కడియవినై యేముయలుమ్*
ఆణ్డెఅల్ మిగాళి మెయ్మ్బి నరక్కర్ కులత్తై త్తడిన్దు*
మీణ్డుమవర్ తమ్బిక్కే విరినీరిలజ్గైయరుళి*
ఆణ్డుతన్ శోదిపుక్క వమరరరియేఱ్ఱినై యే. ౯.

అ॥ నెఞ్జమే - ఓమనసా! కడియ - క్రూరమైన, వినైయే - కర్మములనే, ముయలుమ్ - చేయుచున్నవాఁడును, ఆణ్ - పౌరుషమందు, ఆఅల్ - గొప్పశక్తిగలవాఁడును, మీళి - యమునితో సమానమైన, మెయ్మ్బిన్ - బలముగలవాఁడునైన, అరక్కర్ - రావణాసురునియొక్క, కులత్తై - వంశమును, తడిన్దు - చంపి, మీణ్డుమ్ - తిరిగియు, అవర్తమ్బిక్కే - వానితమ్ముఁడైన విభీషణునికే, విరి - విశాలమైన, నీర్ - జలముగల, ఇలజ్గై - లంకను, అరుళి - కృపఁజేసి, ఆణ్డు - (తనదేశమును) పరిపాలించి, తన్ శోది - తన దివ్యతేజస్సులో, పుక్క - ప్రవేశించి, అమరర్ - నిత్యసూరులకు, అరిఏఱ్ఱినై - మిక్కిలి గొప్పవాఁడైయున్న సర్వేశ్వరుని, కాణ్డుజ్గొలో - సేవింపవచ్చునా ?

తా॥ దుష్టుఁడై బలిష్ఠుడైన రావణాసురుని సంహరించి వాని రాజ్యమును వానితమ్ముఁడైన విభీషణునికిచ్చి కౌసల్యాభరతాదుల సన్తోషార్థమై తమ ఇక్ష్వాకు రాజ్యమును పరిపాలించి శ్రీ వైకుణ్ఠమునకు వేంచేసిన శ్రియఃపతిని ఓమనసా! మనమెప్పుడు సేవించెదమని. ౯.

ఏఱ్ఱరుమ్వైగున్దత్తైయరుళుమ్ నమక్కు*ఆయర్కులత్తు
ఈఱ్ఱిళమ్బిళ్ళై యొన్రాయ్ప్పుక్కుమాయజ్గళేయియఱ్ఱి*
కూఱ్ఱియల్కఞ్జనై క్కొన్రైవర్క్కాయ్క్కొడుమ్ శేనై తడిన్దు*
ఆఱ్ఱల్ మిక్కాన్ పెరియపరఞ్జోదిపుక్కవరియే. ౧౦.

అ॥ ఒన్రాయ్ - ఏకీభవించి, పుక్కు - (వివాహమునకు) వెళ్ళి, మాయజ్గళ్ - ఆశ్చర్య చేష్టితములను, ఇయఱ్ఱి - చేసి, కూఱ్ఱు - యమునియొక్క, ఇయల్ - స్వభావముగల, కఞ్జనై - కంసుని, కొన్రు - జంపి, ఐవర్క్కాయ్ - పంచపాండవులకై, కొడుమ్ - క్రూరమైన శేనై - (దుర్యోధనాది) సైన్యమును, తడిన్దు - చంపి, ఆఱ్ఱల్ మిక్కాన్ - గొప్ప బలిష్ఠుఁడై, పెరియ - గొప్ప, పరఞ్జోది - పరఞ్జ్యోతి స్వరూపమును, పుక్క - ప్రవేశించిన, అరి - శ్రేష్ఠుఁడై, ఆయర్కులత్తు - గోపకులమందవతరించిన, ఈఱు - అవధియైన, ఇళమ్ - బాల్యముగల (మిక్కిలి బాలుఁడైన), పిళ్ళై - శ్రీకృష్ణుఁడు, ఏఱ్ఱ - స్తుతించుటకు, అరుమ్ - అశక్యమైన, వైగున్దత్తై - పరమపదమును, నమక్కు - మనకు, అరుళుమ్ - కృపఁజేయును.

తా॥ కంసుడు తనయింటికి వివాహముకొఱకై మేనల్లుఁడైన శ్రీకృష్ణుని పిలవగా నప్పుడచ్చటికి వేంచేసి కువలయాపీడాదులనున్ను కంసునిన్ని జంపి దుష్టులను నిరసించి ఆశ్రితులైన పంచపాండవులను రక్షించిన శ్రీకృష్ణుఁడు మనకు నిశ్చయముగా మోక్షమిచ్చునని. ౧౦

‡‡ పుక్కవరియురువా యవుణనుడల్కీణ్డుగన్ద*
శక్కరచ్చెల్వన్నైత్తెన్ కురుగూర్చ్చడగోపన్ శొన్న*

మిక్క-వోరాయిరత్తు ళ్ళివైపత్తుమ్‌వల్లారవర్గై *
తొక్క-ప్పల్లాణ్డిశైత్తు క్క-వరిశెయ్‌వరేణ్డియరే. ౧౧.

అ॥ అరియురువాయ్ - నరసింహరూపిగ్గా, పుక్కు - అవతరించి, అవుణ౯ - హిరణ్యా సురునియొక్క, ఉడల్ - శరీరమును, కీణ్డు - చీల్చి, ఉగన్ద - సన్తోషించిన, శక్క-రచ్చెల్వ౯ తన్నై - చక్రధరుఁడైన శ్రీమంతుని విషయమై, కురుగూర్చ్చడగోప౯ - తిరునగరికి స్వామియైన నమ్మాళ్వార్లు, శొన్న - పాడించిన, మిక్క - భగవద్గుణములను మిక్కిలి ప్రతిపాదించుచున్న, ఓర్ - విలక్షణమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇవైపత్తుమ్ - ఈ పదిపాశురములను, వల్లారవర్గై - అధ్యసించినవారికి, ఏణ్డియర్ - భాగవతకైఙ్క-ర్యమందు చపలురాశ్యై శ్రీవైకుణ్ఠవాసులైన స్త్రీలు, తొక్కు - గుంపుగాఁజేరి, పల్లాణ్డిశైత్తు - మంగళా శాసనముజేసి, కవరిశెయ్వర్ - చామరకైంకర్యమును జేయుదురు.

తా॥ నరసింహావతారమెత్తి హిరణ్యునిజంపిన శ్రియఃపతి విషయమై నమ్మాళ్వార్లు పాడించిన ఈ పదిపాశురముల నభ్యసించువారికి శ్రీవైకుంఠవాసులు కైఙ్క-ర్యముజేయుదురని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౭ . వ తిరువాయ్‌మొழி.

అవతారిక :—కింద తిరువాయ్‌మొழிలో ననుసంధించిన భగవద్గుణములు మనస్సులోనే యుండి వీరికి ఉద్దీపనముజేయగా వానిని ప్రత్యక్షముగా ననుభవింప నాశపడి దానిని లభించక ఈగుణములు తమకు బాధకరంబులై యున్నవని పాడించుచున్నారు.

‡‡ ఏణ్డియరావియుణ్ణు మిణ్డైకూ్క-న్ ఱద్గొలోవతియే౯ *
ఆఙ్ఞియమ్కణ్ణపిరా౯ తిరుక్కణ్గళ్కొలోవతియే౯ *
శూழ்వుమ్‌తామరై నాళ్ మలర్‌పోల్ వన్దుతోన్ఱుమ్‌కణ్డీర్ *
తోழிయర్‌గాళన్నైమీర్ ఎ౯శెయ్‌గేఁతుయరాట్టియేనే. ౧.

అ॥ ఏణ్డియర్ - చపలుశాశ్యైన స్త్రీలయొక్క, ఆవి - ప్రాణయును, ఉణ్ణుమ్ - భక్షించు -చున్న, ఇణ్డైకూన్ ఱద్గొలో - ఇద్దరు మృత్యువులో! అతియే౯ - ఎఱుఁగను. ఆఙ్ఞి - సము ద్రముతంటి చల్లనిస్వభావముగల, అమ్ - సుందరుఁడైన, కణ్ణపిరా౯ - శ్రీకృష్ణస్వామియొక్క, తిరు క్కణ్గళ్కొలో - శ్రీనేత్రములో! అతియే౯ - ఎఱుఁగను. నాళ్ - అప్పుడువికసించిన, తామరై మలర్‌పోల్ - తామరస పుష్పమువలె, శూழ்వుమ్ - చుట్టును, వన్దు - వచ్చి, తోన్ఱుమ్ కణ్డీర్ - కనుపడుచున్నవినుమీ. తోழிయర్‌గాళ్ - ఓసఖియలారా! అన్నైమీర్ - ఓతల్లులారా! [illegible] - [illegible] ఎ౯ [illegible] - ఏమిచేశెదను.

తా॥ ఓ నాబంధువులారా! సద్యోవికసితమైన తామరస పుష్పములవలె నున్న రెండు నేను చూచినప్రక్కనంతయు కనుపడుచు నన్ను బాధించుచున్నవి. అవి నాప్రాణహరములైన మృత్యువులో! లేక శ్రీకృష్ణునియొక్క నేత్రములో! పలానదని తెలిసికొనలేదని. ౧.

ఆట్టియుమ్‌తూఱ్ఱియుమ్‌నిన్ఱన్నై మీరెన్నైనీర్ నలిన్దెన్*
మాట్టుయర్ కఱ్పగత్తిన్ వల్లియో కొழுన్దో వఱియేన్*
ఈట్టియవెణ్ణెయుణ్డాన్ తిరుమూక్కెనదావియుళ్ళే*
మాట్టియవల్ విళక్కిన్ శుడరాయ్‌నిఱ్కుమ్‌వాలియదే. ౨.

అ॥ అన్నైమీర్ - ఓతల్లులారా! నీర్ - మీరు, ఎన్నై - నన్ను, ఆట్టియుమ్ - (నాకుహితమువలె చెప్పి) అల్లాడించియు, తూఱ్ఱియుమ్ - నిందించియు, నిన్ఱు -ఉండి, నలిన్దు- బాధించి, ఎన్ - ఏమిప్రయోజనము! మాడు - ప్రక్కలయందు, ఉయర్ - వర్ధిల్లుచున్న, కఱ్పగత్తిన్‌వల్లియో - కల్పలతనో! కొழுన్దో - (దాని) చిగురో! అఱియేన్ - ఎఱుగలేను. ఈట్టియ - చిలికియెత్తిన, వెణ్ణెయ్ - వెన్నను, ఉణ్డాన్ - ఆరగించిన శ్రీకృష్ణునియొక్క, తిరుమూక్కు - సుందరమైనముక్కు, ఎనదు - నాయొక్క, ఆవియుళ్ళే - మనస్సులోపల, మాట్టియ- పైకెత్తబడి, వాలియదు - పెద్దదై, వల్ - స్థిరమైయున్న, విళక్కిన్ - దీపమువంటి, శుడరాయ్ - తేజస్సుగలదై, నిఱ్కుమ్ - (బాధించుచు) ఉన్నది.

తా॥ ఓ తల్లులారా! శ్రీకృష్ణునియొక్కనాసిక నామనస్సులోనుండి, ఇది కల్పకతీగనో లేక దానిచిగురోయని, నాకుసందేహమును, గలుగఁజేయుచు గొప్పదీపజ్వాలవలె నన్నుదహించుచున్నది. ఇఁకమీఁదమీరునన్ను మాటలచేనిర్బంధపఱచి యేమియు నుపయోగములేదని. ౨.

వాలియదోర్ కనికొల్ వినైయాట్టియేన్ వల్వినై కొల్*
కోలన్దిగழ் పవళక్కొழுన్దుణుక్కోలో వఱియేన్*
నీలనెడుముగిల్‌పోల్ తిరుమేనియమ్మాన్ తొణ్డైవాయ్*
ఏలుమ్‌తిశైయుళెల్లామ్ వన్దుతోన్ఱుమెన్నిన్నుయిర్క్కే. ౩.

అ॥ వాలియదు - విలక్షణమైన, ఓర్ కనికొల్ - ఒకపండో! వినైయాట్టియేన్ - పాపముగల నాయొక్క, వల్ - క్రూరమైన, వినైకొల్ - పాపమో! కోలమ్ - సౌందర్యము, తిగழ் - చేరియున్న, పవళమ్ - పగడముయొక్క, కొழுమ్ - స్నిగ్ధమైన, తుణుక్కోలో - తునకనో! అఱియేన్ - ఎఱుగను. నీలమ్ - నల్లనై, నెడుమ్ - గొప్పదైన, ముగిల్‌పోల్ - మేఘమువలె నున్న, తిరుమేని - తిరుమేనుగల, అమ్మాన్ - స్వామియొక్క, తొణ్డై - దొండపండువలెనున్న, వాయ్ - తిరువధరము, ఏలుమ్ - చూచిన, తిశైయుళెల్లామ్ - దిక్కులన్నింటిలోను, ఎన్ - నాయొక్క, ఇన్ - మంచిదైన, ఉయిర్క్కు - ప్రాణము నపహరించుటకై, వన్దు - వచ్చి, తోన్ఱుమ్ - కనుపడుచున్నది.

తా॥ ఓ తల్లులారా! ఒక గొప్పపండో? నన్ను బాధించేడిపాపమో? అతిసుందరమైన పగడమో? లేక, శ్యామసుందర విగ్రహుఁడైన శ్రియఃపతియొక్క అధరమో? నేను దీనిని పలానిదని తెలిసికొనలేను. ఇది నా ప్రాణములతీయుటకై నా కెచ్చటచూచినను కనుపడుచున్నది. ౩.

ఇన్నుయిర్ క్కేழைయర్ మేల్ వళై యుమిణై నీలవిల్ కొల్*
మన్నియశీర్ మదనన్ కరుప్పుచ్చిలై కొల్*మదన
న్ఱన్నుయిర్ త్తాదై కణ్ణపెరుమాన్ పురువమవై యే*
ఎన్నుయిర్ మేలనవా యడుగిన్ఱన వెన్ఱుమిన్ఱే ౪.

అ॥ ఇన్ ఉయిర్ క్కు - మంచిప్రాణమునపహరించుటకై, ఏழைయర్ మేల్ - దుర్బలుల మీఁద, వళైయుమ్ - వంగుచున్న, నీలమ్ - నీలవర్ణముగల, ఇణై విల్గోల్ - రెండుధనుస్సులో? శీర్ మన్నియ - సౌందర్యపూర్ణుఁడైన, మదనన్ - మన్మథునియొక్క, కరుప్పుచ్చిలై కోల్ - ఇక్షుదండరూపమైనధనుస్సో? మదనన్ఱన్ - మన్మథునియొక్క, ఉయిర్ - ప్రాణభూతుఁడై, త్తాదై - తండ్రియైన, కణ్ణపెరుమాన్ - శ్రీకృష్ణస్వామియొక్క, పురువమవైయే - కనుబొమలో? ఎన్ - నాయొక్క, ఉయిర్ మేలనవాయ్ - ప్రాణమునెనెరించి, ఎన్ఱుమ్ - ఎప్పుడును, నిన్ఱు - ఉండి, అడుగిన్ఱన - బాధించుచున్నవి.

తా॥ నన్ను చంపుటకై నామీఁదఁ దిరగపడియున్న ఇవి దుర్బలులనుజంపుటకై వంచిన ధనుస్సులో? మన్మథధనుస్సో? లేక శ్రీకృష్ణుని కనుబొమ్మలో? తెలియఁలేదని. ౪.

ఎన్ఱునిన్ఱే తిగழுమ్ శెయ్యవీన్ శుడర్ వెణ్ మిన్నుక్కొల్*
అన్ఱియెన్నావియడు మణిముత్తక్కొలోవఱియేన్*
కున్ఱమెడుత్తపిరాన్ ముఱువలెనదావియడుమ్*
ఒన్ఱుమఱిగిన్ఱిలే నన్నైమీరెనక్కుయ్విడమే. ౫.

అ॥ ఎన్ఱుమ్ - ఎల్లప్పుఁడును, నిన్ఱు - స్థిరముగానుండి, తిగழுమ్ - ప్రకాశించుచున్న, శెయ్య - ఎఱ్ఱనైన, శుడర్ - తేజస్సును, ఈన్ - పుట్టించుచున్న, వెణ్ - తెల్లనైన, మిన్నుక్కొల్ - మెఱుపో? అన్ఱి - అదిగాక, ఎన్ ఆవి - నాప్రాణమును, అడుమ్ - బాధించుచున్న, అణి - అందమైన, ముత్తక్కొలో - ముత్యములో? అఱియేన్ - ఎఱుఁగలేను. కున్ఱమ్ - గోవర్ధనగిరిని, ఎడుత్త - ఎత్తిన, పిరాన్ - ఉపకారకుఁడైన శ్రీకృష్ణునియొక్క, ముఱువల్ - చిఱునవ్వు, ఎనదావి - నాప్రాణమున, అడుమ్ - బాధించుచున్నది. అన్నైమీర్ - ఓతల్లులారా! ఎనక్కు - నాకు, ఉయ్విడమ్-జీవించువిధమును, ఒన్ఱుమ్ - ఒకటిన్ని, అఱిగిన్ఱిలేన్ - ఎఱుఁగలేను.

తా॥ ఓతల్లులారా! శ్రీకృష్ణునియొక్క ఎఱ్ఱనియధరముమీఁద ప్రసరించుచున్న తెల్లనిమన్దహాసము, ఎఱ్ఱనికాన్తినీనుఱుచున్న తెల్లనిమెఱుపువలెనున్ను సుందరంబులైన ముత్యములవలెనున్ను మిక్కిలి మనోహరమై నాప్రాణమును బోగొట్టుచున్నది. దీనిని వదలుకొనుట కుపాయమేమియు నెఱుఁగలేనని. ౫.

ఉయ్విడమేழைయర్ క్కు మశురర్ క్కుమరక్కర్ గట్కుమ్*
ఎవ్విడమెన్ఱిలఙ్గి మగరమ్తழைక్కుమ్తళిర్ కొల్*
పైవిడప్పామ్బణైయాన్ తిరుక్కుణ్డలక్కాదుగళే*
కైవిడలొన్ఱుమిన్ఱి యడుగిన్ఱన కాణ్మిన్ఙళే. ౬.

అ॥ ఏఴైయర్‌క్కుమ్ - దుర్బలులకును, అశురర్‌క్కుమ్ - అసురులకును, అరక్కర్‌గట్కుమ్ - రాక్షసులకును, ఉయ్విడమ్ - బ్రతికెడిస్థానము, ఎవ్విడమ్ - ఏదేశము, ఎన్ఱు - అని, ఇలఙ్గి - ప్రకాశించుచు, మగరమ్ - మకరకుణ్డలాకారముగా, తళైక్కుమ్ - వ్రేలాడుచున్న, తళిర్‌కొల్ - చిగురో? పై - విశాలమైన ఫణముగల, విడమ్ - విషమును గ్రక్కుచున్న, పామ్బు - ఆదిశేషుని, అణైయాన్ - పడకగాగల శ్రియఃపతియొక్క, తిరు - సుందరమైన, కుణ్డలమ్ - మకరకుండలములుగల, కాదుగళ్ - చెవ్వులు, ఒన్ఱుమ్ - ఏవిధము చేతను, కై విడలిన్ఱి - విడువకుండనుండి, అడుగిన్ఱన - బాధించుచున్నవి. కాణ్మిన్‌గళ్ - చూడుఁడు

తా॥ శ్రియఃపతియొక్క చిగురువలె నతిసుందరమైయున్న శ్రోత్రములు రెండును ధైర్యము లేని స్త్రీ లెచ్చటనున్నారో యని వెదకికొనివచ్చి వస్నెల్లప్పుఁడును బాధించుచున్నవి. చూడుఁడని. అసురులును రాక్షసులును చెవ్వులసౌంద్యమునుజూచి సహింపక నసూయచే బాధపడుచున్నారు. స్త్రీలు దాని ననుభవింప వలయునని బాధపడుచున్నారని తాత్పర్యము. ౬.

కాణ్మిన్‌గళ్ అన్నైయర్‌గాళ్ ఎన్ఱు కాట్టుమ్వగై యఱియేన్*
నాళ్ మన్ను వెణ్డిఙ్గళ్ కొల్ నయన్దార్‌గట్కు నచ్చిలైకొల్*
శేణ్ మన్ను నాల్ తడన్దోళ్ పెరుమాన్ తన్ తిరుముదలే*
కోళ్ మన్ని యావియడుమ్ కొడియేనుయిర్ కోళ్ ఇఴైత్తే. ౭.

అ॥ అన్నైయర్‌గాళ్ - ఓతల్లులారా! కాణ్మిన్‌గళ్ - చూడుఁడు, ఎన్ఱు - అని, కాట్టుమ్‌వగై - చూపించువిధమును, అఱియేన్ - ఎఱుఁగను. నాళ్ - శుక్లపక్షాష్టమితో, మన్ను - చేరియున్న, వెణ్ - తెల్లని, తిఙ్గళ్‌కొల్ - చంద్రుడో? నయన్దార్‌గట్కు - ఆశపడుచున్నవారికి, నచ్చిలైకొల్ - విషమూలికనో? శేణ్ మన్ను - వృద్ధికలదై, తడమ్ - విశాలమైన, నాల్ తోళ్ - నాలుగుభుజములుగల, పెరుమాన్ తన్ - సర్వేశ్వరునియొక్క, తిరు - అందమైన, ముదల్ - ముఖము, కొడియేన్ - పాపినైయైననాయొక్క, ఉయిర్ - ప్రాణముయొక్క, కోళ్ - అందమును, ఇఴైత్తుక్కోళ్ - నశింపఁజేయుటయందు, మన్ని - అమరికకలదై, ఆవి - ప్రాణమును, అడుమ్ - బాధించుచున్నది.

తా॥ ఓతల్లులారా! సర్వేశ్వరునియొక్క ముఖము శుక్లపక్షాష్టమియందలి చంద్రునివంటి యాకారముగలదై ప్రకాశించుచు నన్ను బాధించుచున్నది. ఈబాధను నేను మీకుచెప్పఁజాలనని.

కోళిఴైత్తామరై యుమ్ కొడియుమ్ పవళముమ్ విల్లుమ్*
కోళిఴై త్తణ్ ముత్తముమ్ తళిరుమ్ కుళిర్ వాన్ పిఱై యుమ్*
కోళిఴై యావుడై య కొழுమ్ శోదివట్టఙ్గొల్* కణ్ణన్
కోళిఴై వాళ్ ముగమాయ్ కొడియేనుయిర్ కోళ్ గిన్ఱదే. ౮.

అ॥ కోళ్ - తనసౌందర్యమును, ఇఴై - తనకాభరణముగాగల, తామరైయుమ్ - నేత్రమువంటి తామరపుష్పమును, కొడియుమ్ - నాసికయువంటితీగను, పవళముమ్ - అధరమువంటిపగడమును, విల్లుమ్ - కనుబొమలవంటి ధనుస్సును, కోళ్ - తనసౌందర్యమును, ఇఴై - తనకాభర

లయముగాగల, తణ్ - చల్లని, ముత్తముమ్ - మందహాస మనెడి ముత్యమును, తళిరుమ్-చెవ్వులనెడి చిగురును, కుళిర్ - చల్లనై, వాళ్ - గొప్పదైయున్న, పిత్తైయుమ్ - ముఖమనెడి చంద్రుఁడును, (వీనిని), కోళ్ - అలఙ్కరించుకొనఁదగిన, ఇత్తైయాఉడైయ - ఆభరణములుగాగల, కొళ్ళుమ్ - పూర్ణమైన, కోదివట్టమ్కొల్ - జ్యోతిర్మండలమో ? కోళ్ - తనప్రకాశమునే, ఇత్తైయాఉడైయ- అభరణముగాగల, వాళ్ - ఉజ్జ్వలమైన, కణ్ణణ్ - శ్రీకృష్ణునియొక్క, ముగమాయ్కొణ్డు - ముఖస్వరూపమై, కొడియేణ్ - పాపినైన నాయొక్క, ఉయిర్ - ప్రాణమును, కొళ్గిన్రదు- అపహరించుచున్నది.

తా॥ పగడము ముత్యము మొదలగు నానావస్తువుల నలఙ్కారముగాగల తేజోరాశివలె నున్న శ్రీకృష్ణుని ముఖారవిందము నన్ను మిక్కిలి బాధించుచున్నదని. ౮.

కొళ్గిన్ర కోళిరుళై చ్చుగిర్ న్దిట్ట కొళ్ళుఙ్గురుళిన్*
ఉళ్కొణ్డనీలననూల్ తత్తైకొలన్రుమాయన్ కుళ్ళల్*
విళ్గిన్ర పూన్తణ్ తుళ్ళాయ్ విరై నాఱ వన్దెన్నుయిరై*
కళ్గిన్ర వాఱఱియీర్ అన్నైమీర్ కళ్ళఱానిన్ఱీరే. ౯.

అ॥ కొళ్గిన్ర - లోకములనుగ్రసించుచున్న, (కప్పుచున్న), కోళ్ - బలముగల, ఇరుళై - అంధకారముయొక్క, శుగిర్న్దిట్ట - సైభాగమును తీసివేసిన, కొళ్ళుమ్ - సుందరమైన, కురుళిన్- ఉండయొక్క, ఉళ్ - లోపలనున్న సారాంశమును, కొణ్డ - కలదై, నీలమ్ - నల్లనై, నల్ - విలక్షణమైన, నూల్ తత్తైకొల్ - దారములసమూహమో ? అన్రు - కాదు. మాయన్ - శ్రీకృష్ణుని యొక్క, కుళ్ళల్ - కేశములు, విళ్గిన్ర - వికసించుచున్న, పూ - పుష్పముగల, తణ్ - చల్లనైన, తుళ్ళాయ్ - తిరుత్తుళ్ళాయియొక్క, విరై - పరిమళము, నాఱ - పరిమళించునట్లు, వన్దు - వచ్చి, ఎన్ ఉయిరై - నాప్రాణమును, కళ్గిన్ర వాఱు - అపహరించుచున్న విధమును, అఱియీర్ - మీరు తెలిసికొనలేరు. అన్నైమీర్ - ఓతల్లులారా ! కళ్ళఱానిన్ఱీర్ - పరుషోక్తులచే బాధించుచున్నారు.

తా॥ ఓతల్లులారా ! దీనిని మంచిచీకటియుండలోనుండి తీసిన దారములని మీరు భ్రమింపవలదు. ఇది శ్రీకృష్ణునియొక్క కేశపాశములు. ఇందులోనుంచి తిరుత్తుళ్ళాయియొక్క పరిమళ మొట్టుచున్నప్పటికిన్ని మీరు తెలిసికొనక యున్నారని. ౯.

నిన్ఱిమున్ఱత్తు నిన్రు నెరిత్తకైయరాయ్*ఎన్నైనీర్
కున్ఱియుమ్కూఱ్ఱమ్ పైదిర్ శుడర్ చ్చోదిమణినిఱమాయ్*
మున్ఱవిమూన్ఱువులగుమ్ విరిగిన్ర శుడర్ ముడిక్కే*
ఒన్ఱుమైకొణ్డదుళ్ళమ్ అన్నైమీర్ నశైయెన్నుఙ్గళ్కే. ౧౦.

అ॥ మున్ఱత్తుళ్ - అంకణమందు, నిన్ఱి - నిలిచితివి, ఎన్రు - అని, నెరిత్త - తర్జనముచేయుచున్న, కైయరాయ్ - చేతులుగలవారై, నీర్ - మీరు, ఎన్నై - నన్ను, కున్ఱియుమ్ - అవతలికిపోనివ్వకూడదని విచారించితయు, కూఱ్ఱమ్ - మట్టుకొనియుండియు, పైదిర్-

నిందించుచున్నారు. శుడర్చ్చోది - మిక్కిలి తేజస్సుగల, మణి - మాణిక్యమునంటి, నిఱమాయ్ - కాన్తికలదై, ఇమ్మూవులగుమ్ముழுదుమ్ - ఈమూడులోకములయందంతట, విరిగిన్ఱ - వ్యాపించి యున్న, శుడర్ - తేజస్సుగల, ముడిక్కే - కిరీటమునకే, ఎన్నుళ్ళమ్ - నామనస్సు, ఓழிవు ముమైకొణ్డదు - అధీనమైనది అన్నైమీర్ - ఓతల్లులారా! నుజ్గట్కు - మీకు, నశైయెన్ - ఆశయెందుకు?

తా॥ ఓతల్లులారా! నేనందటి సేత్రముల కగుపడునట్లువచ్చి నిలిచితినని నన్ను మీరుభయపడ నచియెచ్చటికిఁబోనియ్యక చుట్టుకొని రక్షించుచున్నారు. నామనస్సు లోకమంతటవ్యాపించియున్న తేజస్సుగల శ్రీకృష్ణుని కిరీటమందు లయించిపోయినది. ఇఁక నాయాశమీకెందుకని. ౧౦

‡‡ కట్కరియపిరమన్ శివ నిన్దిరన్ ఎన్ఱివర్క్కుమ్*
కట్కరియకణ్ణనై క్కురుగూర్చ్చడగోపన్ శొన్న*
ఉట్కుడై యాయిరత్తు ళివై యుమొరుపత్తుమ్వల్లార్*
ఉట్కుడై వానవరో డుడనాయెన్ఱుమ్మాయారే. ౧౧.

అ॥ కట్కు - సేత్రములకు, అరియ - తెలియని, పిరమన్ - బ్రహ్మ, శివన్ - రుద్రుఁడు, ఇన్దిరన్ - ఇంద్రుఁడు, ఎన్ఱు - అని, ఇవర్ - వీరియొక్క, కట్కున్ - సేత్రములకును, అరియ - తెలియని, కణ్ణనై - శ్రీకృష్ణునివిషయమై, కురుగూర్చ్చడగోపన్ - కురుకాపురాధీశులైన నమ్మాழ்వార్లు, శొన్న - సాధించిన, ఉట్కుడై - ప్రతిపాదన సామర్థ్యముగల, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఒరు - ఒక, ఇవైపత్తుమ్-ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించినవారు, ఉట్కుడై - (భగవదనుభవ) శక్తిగల, వానవరోడు - నిత్యసూరులతో, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, ఉడనాయ్ - కూడ సేరియున్నవారై, మాయార్ - విశ్లేషించరు.

• తా॥ బ్రహ్మాదులకు నగోచరుఁడైన శ్రియఃపతివిషయమై నమ్మాழ்వార్లు ప్రసాదించిన యీపది పాశురముల నభ్యసించువారు నిత్యసూరులతోఁ జేరి యెల్లప్పుడును భగవద్గుణముల ననుభవింతురని.

ఆ ழ்వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౮ - వ, తిరువాయ్మొழி.

---

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, నేనింతయార్తుఁడనైయున్నప్పటికిన్ని నన్ను జీవదశలోనుంచిననీయొక్క గొప్పశక్తియెంత ఆశ్చర్యమోయని ఆழ்వార్లు సర్వేశ్వరునితో విన్నవింప, అప్పుడు సర్వేశ్వరుఁడు నాకింకనున్న ఆశ్చర్యశక్తులనుజూడమని ఆழ்వార్లకు జూపింపగా వానిని జూచి యాశ్చర్య పడుచున్నారు.

‡† మాయావామననే మదుశూదానీయరుళాయ్*
తీయాయ్నీరాయ్నిలనాయ్ విశుమ్బాయ్కాలాయ్*
తాయాయ్ త్తన్దైయాయ్ మక్కళాయ్మత్తుమాయ్ముత్తుమాయ్*
నీయాయ్నీనిన్ఱవా ఱివై యెన్ననియాయఙ్గళే. ౧.

అ॥ మాయా - ఆశ్చర్యశక్తిగలవాఁడా! వామననే - శ్రీవామనుఁడా! మధుసూదా - మధువనెడి రాక్షసునిజంపినవాఁడా! నీ - నీవు, అరుళాయ్ - (నాయందు) దయచేయుమా. తీయాయ్ - అగ్నిని శరీరముగాగలవాఁడా! నీరాయ్ - జలమును శరీరముగాగలవాఁడా! నిల వాయ్ - భూమిని శరీరముగాగలవాఁడా! విసుమ్బాయ్ - ఆకాశమును శరీరముగాగలవాఁడా! కాలాయ్ - వాయువును శరీరముగాగలవాఁడా! తాయాయ్ - (ప్రాణులకు) తల్లియైనవాఁడా! తన్దైయాయ్ - తండ్రియైనవాఁడా! మక్కళాయ్ - పుత్రులైనవాఁడా! మత్తెల్లామాయ్ - తక్కిన బంధువైనవాఁడా! ముత్తుమాయ్ - తక్కిన సమస్తపదార్థములకు నిర్వాహకుఁడా! నీయాయ్ - నీ కసాధారణమైన దివ్యవిగ్రహముగలవాఁడా! నీ - నీవు, నిన్త ఇవ్వాఱు - ఈపదార్థములకును నిర్వాహకుఁడైయున్న ఈప్రకారములు, ఎన్ననియాయజ్గళ్ - ఏమియుపపత్తులుకలవి?

తా॥ పరస్పరము మిక్కిలి విజాతీయములైన పృథివ్యాది సమస్తపదార్థములకును నిర్వాహకుఁడవై ప్రాణులకు సకలవిధబంధువైన నీయొక్క ఆశ్చర్యచేష్టితములను నాకుఁ దెలుపుమాయని.

అజ్గణ్మలర్ త్తణ్డుழாయ్ముడి యచ్చుదనేయరుళాయ్*
తిజ్గళుమ్ఞాయిఱుమాయ్ చ్చెழுమ్బల్ శుడరాయిరుళాయ్*
పొజ్గుపొழிమழைయాయ్ ప్పుగழாయ్ప్పழிయాయ్ప్పిన్నుమ్నీ*
వెజ్గణ్ వెజ్గూత్తుమామాయ యివై యెన్నవిశిత్తిరమే. ౨.

అ॥ అమ్ - విలక్షణమైన, కళ్ - తేనెగల, మలర్ - పుష్పములతోఁ గూడుకొనిన, తణ్ - చల్లనైన, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడి - కిరీటమందుగల, అచ్చుదనే - అచ్యుతుఁడా! అరుళాయ్ - కృపజేయుమా. తిజ్గళుమ్ - చంద్రునికి, ఞాయిఱుమ్ - సూర్యునికి, ఆయ్ - అంతరాత్మవై, శెழுమ్ - చేతనులకు లాభాలాభములను దెలుపుచున్న సంచారముగల, పల్ - అనేకవిధములైన, శుడరాయ్ - నక్షత్రాది తేజస్సులకంతరాత్మవై, ఇరుళాయ్ - చీకటి కంతరాత్మవై, పొజ్గు - వర్ధిల్లుచు, పొழி - వర్షించుచున్న, మழைయాయ్ - వర్షమునకు నిర్వాహకుఁడవై, పుగழாయ్ - కీర్తికిఁ గారణభూతుఁడవై, పழிయాయ్ - అపకీర్తికిఁ గారణభూతుఁడవై, పిన్నుమ్ - మఱియు, నీ - నీవు, వెమ్కణ్ - క్రూరనేత్రుఁడైనరుద్రునికంతర్యామివై, వెమ్కూత్తుమ మాయ్ - క్రూరమైన మృత్యువునకు నంతర్యామివైయున్న, ఇవై - ఇవి, ఎన్నవిశిత్తిరమే - ఏమాశ్చర్యము.

తా॥ శీతకిరణముగల చంద్రునికిని, ఉష్ణకిరణముగల సూర్యునికిని, సుఖదుఃఖముల నిచ్చుచున్న అఙ్గారకాది గ్రహములకును, అంధకారమునకును, వర్షమునకును, కీర్త్యపకీర్తులకును, జగత్సంహారకులైన రుద్రాదులకును, ఇట్టి పరస్పరవిరుద్ధములైయున్న సకలపదార్థములకు నంతరాత్మవై యుండి యాయా కార్యములను నడిపించుచున్న ఓస్వామీ! నీచేష్టితము లత్యాశ్చర్యములని.

శిత్తిర త్తేర్ వలవా తిరుచ్చక్కరత్తాయరుళాయ్*
ఎత్తనై యోరుగము మవై యాయవన్ ఱళ్ళియులుమ్*
ఒత్తవొణ్ పల్ పొరుళ్గళ్ ఉలప్పిలన[illegible]య్వియవాయ్*
విత్తగత్తాయ్నిన్ఱనీ యివై యెన్నవిడమ్బగళే. ౩.

అ॥ తేర్ - రథమును, శిత్తిగమ్ - విచిత్రముగా, వలవా - (భారతయుద్ధమునందు) నడిపించినవాఁడా! తిరుచ్చక్కరత్తాయ్ - శ్రీసుదర్శనముగలవాఁడా! అరుళాయ్ - కృపజేయుమా. ఎత్తనై - అనేకవిధములై, ఓర్ - విలక్షణములైయున్న, ఉగముమ్ అవైయాయ్ - (కృతత్రేతాది) యుగములకు నిర్వాహకుఁడా! అవత్తుళ్ - ఆకాలములలో, ఇయలుమ్ - నడుచుచున్నవియు, ఒత్త - (జ్ఞానాకారములతోను దేవమనుష్యాద్యాకారములతోను) సమానములైనవియు, వియవు - (ఆయావ్యక్తిస్వరూపములతో) వేఱువేఱుగా నున్నవియు, ఒణ్ - విలక్షణములైనవియు, ఉలప్పిలనవాయ్ - లెక్కలేనివియునైయున్న, పల్పొరుళాయ్ - అనేకములైన ఆత్మవస్తువులకు నిర్వాహకుఁడా! విత్తగత్తాయ్ - ఇట్టియాశ్చర్య స్వరూపముగలవాఁడవై, నీ - నీవు, నిన్ఱ్ - నిలిచితివి. ఇవై - ఇవి, ఎన్నవిడమజ్గళ్ - ఏమివిషమములు (ఏమాశ్చర్యములు)!

తా॥ అనేకకాలములయందున్న అనేక విధములైన జీవాత్మలకు నిర్వాహకుఁడైయున్న ఓస్వామీ! నీయాశ్చర్యచేష్టితములను నేను యథార్థముగా నెఱుంగునట్లు నన్ననుగ్రహింపుమా యని. 3.

కళ్ళవిழ் తామరైక్కణ్ కణ్ణనేయెనక్కొన్ఱరుళాయ్*
ఉళ్ళదుమిల్లదుమా యులప్పిలనవాయ్వియవాయ్*
వెళ్ళత్తడజ్గడలుళ్ విడనాగణై మేల్ మరువి*
ఉళ్ళప్పల్ యోగు శెయ్ది యివై యెన్నవుపాయజ్గళే. ౪.

అ॥ కళ్ - తేనెకలదై, అవిழ் - వికసించియున్న, తామరై - తామరసపుష్పమువంటి, కణ్ - నేత్రములుగల, కణ్ణా - శ్రీకృష్ణుఁడా! ఎనక్కు - నాకు, ఒన్ఱు - ఒకమాట, అరుళాయ్ - చెప్పవలెను. ఉలప్పిలనవాయ్ - నాశములేనివై, ఉళ్ళదుమాయ్ - నిత్యములైయున్న చేతనులకు నిర్వాహకుఁడా! వియవాయ్ - నశ్వరములై, ఇల్లదుమాయ్ - అనిత్యములైన అచేతనములకు నిర్వాహకుఁడా! వెళ్ళమ్ - జలముచేనిండియున్న, తడమ్ - విశాలమైన, కడలుళ్ - క్షీరసముద్రమందు, విడమ్ - (శత్రువులమీద) విషమును గ్రక్కుచున్న, నాగుఅణై మేల్ - ఆదిశేషుఁడనెడి శయ్యమీఁద, మరువి - పవ్వళించియుండి, ఉళ్ళమ్ - మనస్సులో, పల్ - అనేకవిధములైన, యోగు - రక్షణోపాయచింతను, శెయ్ది - చేసితివి. ఇవై - ఇవి, ఎన్న ఉపాయజ్గళ్ - ఏమియుపాయములు!

తా॥ నిత్యానిత్యములైన సకలచేతనాచేతనములకు నిర్వాహకుఁడవై క్షీరాబ్ధియందు శేషశయ్యమీఁదఁ బవ్వళించిఁ లోకముల యోగక్షేమములను యోచించుచున్న ఓస్వామీ! నీయుపాయములను నాకుఁ జెప్పవలయునని. ౪.

పాశజ్గళ్ నీక్కి యెన్నై యునక్కేయఱక్కొణ్డిట్టునీ*
వాశమలర్ తణ్డుழாయ్ముడి మాయవనేయరుళాయ్*
కాయముమ్శీవనుమాయ్ క్కழிవాయ్ప్పిఱప్పాయ్ప్పిన్నుమ్నీ*
మాయజ్గళ్ శెయ్దువైత్తి యివై యెన్నమయక్కక్కళే. ౫.

అ॥ పాశజ్గళ్ - అవిద్యాది బంధములను, నీక్కి - పోఁగొట్టి, ఎన్నై - నన్ను, ఉనక్కే యఱ - నీకేయధీనముగా, కొణ్డిట్టు - స్వీకరించి, వాశమ్ - పరిమళించుచున్న, మలర్ - పుష్పము

గల, తణ్ - చల్లనైన, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడి - కిరీటమందుగల, మాయవనే - ఆశ్చర్యభూతుఁడా! నీ - నీవు, కాయముమ్ - శరీరమునకును, శీవనుమ్ - శివులకును, ఆయ్ - నియామకుఁడవై, కழிవాయ్ - నాశమునకుని యామకుఁడవై, పిఱప్పాయ్ - ఉత్పత్తికినియామకుఁడవై, పిన్నుమ్ - మఱియు, మాయజ్గళ్ -(జ్ఞానులనుగూడ సంసారమందుంచుటకు నెడి) ఆశ్చర్యములను, శెయ్దువైత్తి - చేసియుంచితివి. ఇవై - ఈ వ్యాపారములు, ఎన్న మయక్కుక్కళ్ - ఎమిదుర్జ్ఞేయ వ్యాపారములు? అరుళాయ్ - చెప్పుమా.

తా॥ ఓ శ్రియఃపతీ! చేతనాచేతనములను జన్మజరామరణాదులకును నీవు నియామకుఁడవై యుండి నాయజ్ఞానాదులను బోఁగొట్టి నీ శ్రీపాదములయందుఁ జేర్చుకొనినప్పటికిన్ని ఇఁకను సంసారమందే యుంచియున్నావు. ఇదేమాశ్చర్యమని. ౫.

మయక్కా వామననే మదియామ్ వణ్ణమొన్ఱరుళాయ్*
అయర్ప్పాయ్ త్తేఱ్ఱముమా య్యழலాయ్ క్కుళిరాయ్ వియవాయ్*
వియప్పాయ్ వెన్ఱిగళాయ్ వినైయాయ్ ప్పయనాయ్ ప్పిన్నుమ్ నీ*
తుయక్కాయ్ నీనిన్ఱవా ఱివై యెన్న తుయరజ్గళే. ౬.

అ॥ మయక్కా - (మహాబలిని) భ్రమింపఁజేసిన, వామననే - వామనుఁడా! మదియామ్ వణ్ణమ్ - (నిన్ను) తెలిసికొనెడి విధము, ఒన్ఱు - ఒకటి, అరుళాయ్ - చెప్పుము. అయర్ప్పాయ్ - మఱుపునకు నిర్వాహకుఁడవును, తేఱ్ఱముమాయ్ - తెలివికిని నిర్వాహకుండవును, అழలాయ్ - తాపమునకు నిర్వాహకుఁడవును, కుళిరాయ్ - శీతమునకు నిర్వాహకుఁడవును, వియవాయ్ - ఆశ్చర్యకరంబులైన పదార్థములకు నిర్వాహకుండవును, వియప్పాయ్ - ఆశ్చర్యమునకు నిర్వాహకుఁడవును, వెన్ఱిగళాయ్ - జయములకు నిర్వాహకుఁడవును, వినైయాయ్ - పుణ్యపాపములకు నిర్వాహకుండవును, పయనాయ్ - వానియొక్క ఫలమునకు నిర్వాహకుఁడవును, పిన్నుమ్ - మఱియు, తుయక్కాయ్ - దుఃఖమునకు నిర్వాహకుఁడవునై, నీ - నీవు, నిన్ఱవాఱు - ఉన్న ప్రకారములైన, ఇవై - ఇవి, ఎన్న తుయరజ్గళ్ - ఏమి దుఃఖకరములైన వ్యాపారములు?

తా॥ ఓస్వామీ! పుణ్యపాపములకును, సుఖదుఃఖములకును, స్మరణ విస్మరణములకును, శీతోష్ణములకును, జయాపజయములకును, ఇవి మొదలగు ద్వన్ద్వములకు నిర్వాహకుఁడవై యున్న నీ స్వభావములను దెలిసికొనునట్లు నాయందుఁ గృపజేయుమా యని. ౬.

తుయరజ్గళ్ శెయ్యుజ్గణ్ణా శుడర్ నీళ్ ముడియాయరుళాయ్*
తుయరమ్ శెయ్ మానజ్గళాయ్ మదనాగియుగవైగళాయ్*
తుయరమ్ శెయ్ కామజ్గళాయ్ త్తులైయాయ్ నిలైయాయ్ నడైయాయ్*
తుయరజ్గళ్ శెయ్దువైత్తి యివై యెన్న శుణ్డాయజ్గళే. ౭.

అ॥ శుడర్ - ఉజ్జ్వలమై, నీళ్ - పొడువైన, ముడియాయ్ - కిరీటముగలవాఁడవును, తుయరజ్గళ్ శెయ్యుమ్ - (నీ కిరీటసౌన్దర్యమును సేవించువారికి) దుఃఖమును గలుగఁజేయువాఁడవునైన, కణ్ణా - ఓ శ్రీకృష్ణుఁడా! తుయరమ్ శెయ్ - దుఃఖములనుబుట్టించుచున్న, మానజ్గళాయ్ -

(సేఱు సాడి అ సెడు) దురభిమానములకు నిర్వాహకుఁడవును, మదవాగి - గర్వములకు నిర్వాహకుఁడవును, ఉగప్పైగళాయ్ - సన్తోషములకు నిర్వాహకుఁడవును, తుయరమ్ శెయ్ - దుఃఖములను గలుగఁజేయుచున్న, కామత్తిళాయ్ - శబ్దాదివిషయములకు నిర్వాహకుఁడవును, తుణైయాయ్ - ప్రమాణములకు నిర్వాహకుఁడవును, నిలైయాయ్ - స్థితికి నిర్వాహకుఁడవును, నడైయాయ్ - గమనమునకు నిర్వాహకుఁడవును నైన నీవు, తుయరఙ్గళ్ - దుఃఖములను, శెయ్దువైత్తి - చేసిపెట్టితివి. ఇవై - ఇవి, ఎన్న శుణ్ణాయఙ్గళ్ - ఏమిలీలలు? అరుళాయ్ - చెప్పుము.

తా॥ ఓ శ్రియఃపతీ! అహఙ్కారమమకారగర్వతృష్ణాదులను గలిగించి జీవులనుబాధపెట్టుట నీకేమిలీలయో నాకుఁ జెప్పుమాయని. ౭.

ఎన్న శుణ్ణాయఙ్గళాల్ నిన్ఱిట్టాయెన్ఱు ఉళ్ళమ్ కణ్ణా*
ఇన్నదోర్ తన్మైయె యెన్ఱునిన్నై యావర్క్కుమ్ తేఱ్ఱరియై*
మున్నియ మూవులగుమ్ పడైత్తాయ్ అవట్రైప్పడైత్తు*
పిన్నుమ్ ఉళ్ళాయ్ పుఱత్తాయ్ ఇవై యెన్న ఇయల్వుగళే. ౮.

అ॥ ఎన్నైయాళుమ్ - నన్నేలిన, కణ్ణా - శ్రీకృష్ణుడా! ఎన్న శుణ్ణాయఙ్గళాల్ - ఎట్టి లీలకలవాఁడవై, నిన్ఱిట్టాయ్ - ఉన్నావు? ఇన్నదోర్ తన్మైయై - ఇట్టి యొకవిధస్వభావముగలవాఁడవు, ఎన్ఱు - అని, ఉన్నై - నిన్ను, యావర్క్కుమ్ - ఎట్టివారికిని, తేఱ్ఱ - నిశ్చయించ, అరియై - అశక్యముగునట్లు, మున్నియ - అనాదియైన, మూవులగుమ్ - మూడులోకములకును, అడైయాయ్ - నిర్వాహకుఁడవై, అవట్రై - ఆలోకములను, పడైత్తు - సృజించి, పిన్నుమ్ - మఱియును, ఉళ్ళాయ్ - లోపలవ్యాపించియున్న వాఁడవై, పుఱత్తాయ్ - బాహ్యమందున్న వాఁడవైయున్నావు. ఇవై - ఇవి, ఎన్న ఇయల్వుగళ్ - ఏమి స్వభావములు.

తా॥ ఓస్వామీ! సమస్తలోకములను సృజించి వానిని సకలవిధంబులుగా రక్షించుచున్న నీస్వభావమిట్టిదని యెవ్వారికిని దెలియకుండునట్లున్న నీవిధమేమియో? అది నాకుఁ జెప్పుమాయని.

ఎన్న ఇయల్వుగళా లెవ్వాఱు నిన్ఱిట్టాయ్ కణ్ణా*
తున్ను కరశరణమ్ ముదలాగ వెల్లావుఱుప్పుమ్*
ఉన్ను శువై యొళి యూఱొలి నాట్రముమ్ తామ్ నీయే*
ఉన్నై ఉణరవుఱిల్ ఉలప్పిల్లై నుణుక్కఙ్గళే. ౯.

అ॥ ఎన్ కణ్ణా - నాశ్రీకృష్ణుడా! ఎన్న ఇయల్వుగళాల్ - ఎట్టిస్వభావముగలవాఁడవై, ఎవ్వాఱు నిన్ఱిట్టాయ్ - ఏప్రకారముగానున్నావు. తున్ను - దట్టమైయున్న, కరశరణమ్ ముదలాగ - హస్తపాదాదులైన, ఎల్లావుఱుప్పుమ్ - సకలావయవములకును, (సకలేన్ద్రియములకును), ఉన్ను - అనుభవింపఁదగిన, శువై - రసము, ఒళి - రూపము, ఊఱు - స్పర్శము, ఒలి-శబ్దము, నాట్రముమ్ - గంధముఅయిన యీవిషయములకు, నీయే - నీవేనిర్వాహకుఁడవైయున్నావు. ఉన్నై - నిన్ను, ఉణరవుఱిల్ - చక్కఁగాఁదెలిసికొనుటకు యత్నించినయెడల, నుణుక్కఙ్గళ్ - నీయొక్క సూక్ష్మత్వము మొదలైలక్షణ్యములకు, ఉలప్పు - అంతము, ఇల్లై - లేదు.

తా॥ ఓ శ్రియఃపతీ! వాక్పాదపాణిపాయూపస్థములనెడి కర్మేంద్రియములచేతను, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనెడి జ్ఞానేంద్రియములచేతను ననుభవింపబడుచున్న శబ్దాదివిషయములకునిర్వాహకుఁడవైన నీకంటెనూక్ష్మమైన మఱియొకవస్తువులేదని. ౯.

ఇల్లై నుణుక్కమ్ ఇదనిల్ పిఱిదెన్నుమ్ వణ్ణమ్*
తొల్లై నన్నూలిల్ శొన్న వురువుమరువుమ్ నీయే*
అల్లిత్తుழாయలఙ్గలణిమార్బ ఎన్నచ్చుదనే*
వల్లదోర్ వణ్ణమ్ శొన్నా లదువేయునక్కామ్ వణ్ణమే. ౧౦.

అ॥ అల్లి - తామరసపుష్పములచేఁగట్టబడిన, తుழாయలఙ్గల్ - తులసీమాలికచే, అణి - అలఙ్కరింపఁబడిన, మార్బ - వక్షస్థలముగలవాఁడా! ఎన్ అచ్చుదనే - నాయచ్యుతుఁడా! ఇదనిల్ - ఇంతకంటె, పిఱిదు - వేఱొకపదార్థము, నుణుక్కమ్ - సూక్ష్మమైనది, ఇల్లై - లేదు, ఎన్నుమ్ వణ్ణమ్ - అని చెప్పఁబడువిధముగా, తొల్లై - అనాదియై, నల్ - శ్రేష్ఠమైన, నూలిల్ - వేదమందు, శొన్న - చెప్పఁబడిన, ఉరువుమ్ - స్థూలమైనఅచేతనమునకును, అరువుమ్ - సూక్ష్మమైన జీవాత్మకును, నీయే - నీవేయంతర్యామియైయున్నావు. వల్లదోర్ వణ్ణమ్ - తనకుసాధ్యమైన వఱకు నీయొక్కప్రకారమును, శొన్నాల్ - చెప్పినయెడల, అదువే - అదియే, ఉనక్కు - నీకు, వణ్ణమామే - స్వభావమగునా?

తా॥ ఓస్వామీ! స్థూలసూక్ష్మాకారమైన యీజగత్తునకునీవే యంతర్యామివనియు, నీకు మఱియొక అంతర్యామిలేదనియు వేదమందుఁ జెప్పుచున్న నీమహిమను ఎంతగొప్పవారైనను కొంచెమే చెప్పగలరు గాని సంపూర్ణముగాఁ జెప్పఁజాలరని. ౧౦.

⁂ అమ్వణ్ణమిన్నదొన్ఱెన్ఱఱివదరియవరియై*
అమ్వణ్ణత్తాల్ కురుకూర్చ్చడగోపనఱిన్దురైత్త*
అమ్వణ్ణవొణ్డమిழ்గళివైయాయిరత్తుళిప్పత్తుమ్*
అమ్వణ్ణత్తాలురైప్పా రమైన్దార్ తమక్కెన్ఱైక్కుమే. ౧౧.

అ॥ ఇన్నదొన్ఱువణ్ణమ్అమ్ - ఈవిధమైనఒకస్వభావముగలవాఁడు, ఎన్ఱు - అని, అఱివదుఅరియ - తెలిసికొనుటకశక్యమైన, అరియై - సర్వేశ్వరుని, అమ్వణ్ణత్తాల్ యథార్థముగా, కురుకూర్చ్చడగోపన్ - తిరునగరియందు వేంచేసియున్న నమ్మాழ்వార్లు, అఱిన్దు - తెలిసికొని, ఉరైత్త - సాధించిన, వణ్అమ్ - ఛన్దస్సులుగల, ఒణ్ - సుందరంబులై, తమిழ்గళ్ - ద్రావిడరూపములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, అమ్వణ్ణత్తాల్ - తమశక్త్యనుసారముగా, ఉరైప్పార్ - అభ్యసించువారు, తమక్కు - తమకు, ఎన్ఱైక్కుమ్ - ఎప్పటికిని, అమైన్దార్ - అమరియుందురు (కృతకృత్యులైయుందురు).

తా॥ అపరిచ్ఛిన్నమహిమగల సర్వేశ్వరునివిషయమై నమ్మాழ்వార్లుప్రసాదించిన యీపది పాశురముల ననుసంధించువారు కృతార్థులగుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౯ - వ, తిరువాయ్మొழி.

అవతారిక:— నీయందింత భక్తిగలిగిన నన్నుఁగూడ నీసంసారమందుంచుటకుఁ గారణ మేమని నమ్మాళ్వార్లు సర్వేశ్వరుని యడగగా, ఈతిరువాయ్మొழிయనెడి మహాప్రబంధమును మీచేతనే పూర్తిచేయింపఁ దలచియున్నాము. అవలకు మీరీలోకమందే వేంచేసియుండవలయు నని సర్వేశ్వరుఁడుసాదించిన శ్రీసూక్తిసవిని, వ్యాసాదిప్రాజ్ఞులుండగా జ్ఞానహీనుఁడనైన నాచేత నీగొప్పకార్యము చేయించుటకుఁదగిన ప్రత్యుపకారము నే నేమిచేసెదనని సాదించుచున్నారు.

‡‡ ఎన్జైక్కుమెన్నై యుయ్యక్కొణ్డుపోగియ*
అన్జైక్కన్నెన్నైత్తన్నాక్కి యెన్నాల్తన్నై*
ఇన్ తమిழ் పాడియఈశనై యాదియాయ్
నిన్ఱ వెన్ శోదియై*ఎన్ శొల్లినిఱ్పనో. ౧.

అ॥ ఎన్జైక్కుమ్ - (ఒకప్పుడు స్వీకరించినదానిని స్మరించినను) ఎల్లప్పుడును (ఉజ్జీవించునట్లు), పోగియ - నడుచుచున్న, అన్జైక్కన్ - ఆయాకాలములయందు, ఎన్నై - నన్ను, ఉయ్యక్కొణ్డు - ఉజ్జీవింపఁజేసికొని, ఎన్నై - నన్ను, తన్నాక్కి - తనవాఁడైజ్ఞానవంతుఁడనై చేసికొని, ఎన్నాల్ - నాచేత, తన్నై - తనవిషయముగా, ఇన్ - మధురమైన, తమిழ் - ద్రావిడరూపమైన తిరువాయ్మొழிని, పాడియ - ప్రతిపాదింపఁజేసికొనిన ఈశనై - సర్వేశ్వరుఁడును, ఆదియాయ్నిన్ఱ (నాకవిత్వమునకు) కారణభూతుఁడును, ఎన్ శోదియై - నాకుసేవసాదించిన తేజోమయవిగ్రహుఁడునైన శ్రియఃపతిని, ఎన్ శొల్లినిఱ్పన్ - ఏమిప్రత్యుపకారమునుజెప్పి ధరించెదను ?

తా॥ ఓసర్వేశ్వరుఁడా ! జ్ఞానహీనుఁడనైన నన్నుగటాక్షించి జ్ఞానవంతునిగాఁజేసి నాచేత తనవిషయమైన తిరువాయ్మొழிని చేయించుచున్న నీకు నేనేమియు ప్రత్యుపకారము చేయఁజాలనని. ౧.

ఎన్ శొల్లినిఱ్ప నెన్నిన్నుయిరిన్ఱొన్ఱాయ్*
ఎన్ శొల్లాల్ యాన్ శొన్న వின் కవియెన్బిత్తు*
తన్ శొల్లాల్ తాన్ తన్నైక్కీర్త్తిత్తమాయన్ *ఎన్
మున్ శొల్లుమ్ మూవురువామ ముదల్వనే. ౨.

అ॥ ఎన్నిన్నుయిర్ - నాయొక్కమందియాత్మ, ఇన్ఱు - ఇప్పుడు, ఒన్ఱాయ్ - ఒకవస్తువై, ఎన్ శొల్లాల్ - నావాక్కుచేత, యాన్ - నేను, శొన్న - చెప్పిన, ఇన్ కవి - మధురమైనకృతి, ఎన్బిత్తు - అని ప్రసిద్ధిచేయించి, తన్ శొల్లాల్ - తనసూక్తిచేత, తాన్ - తాను, తన్నై - తనను, కీర్త్తిత్త - ప్రతిపాదించిన, మాయన్ - ఆశ్చర్య భూతుఁడును, ఎన్ - నాకు, మున్ శొల్లుమ్ - ముందఱ సంతచెప్పించువాఁడును, మూవురువా - బ్రహ్మరుద్రాదుల కంతర్యామియైయున్నవాఁడై, ముదల్వన్ - (వారుచేసెడి వ్యాపారములకు) కారణభూతుఁడునైన సర్వేశ్వరునికి, ఎన్ శొల్లినిఱ్పన్ - ఏమిచెప్పి ధరించెదను ?

తా॥ తనకటాక్షముచే నాయాత్మను నొకవస్తువుగాజేసి, బ్రహ్మాదులక న్తర్యామియైయుండి సృష్ట్యాదులనుజేసి ఆవ్యాపారములు వారుచేసిరని ప్రసిద్ధిచేయించినట్లు నాకు ముందఱ సంతిచెప్పించి తానేచేసిన యీతిరువాయ్మొழிని నేను చేసినట్లు లోకమందు ప్రసిద్ధిచేయించిన మహోపకారకునికీఁదగిన ప్రత్యుపకారము చేయఁజాలనని　　౨.

ఆముదల్వనివనెన్ఱు తర్ తేర్ త్తి* ఎన్
నాముదల్వన్దు పుగున్దునల్ ఇన్ కవి*
తూముదల్ పత్తర్ క్కు త్తాన్ తన్నై చ్చొన్న* ఎన్
వాయ్ముదలప్పనై యెన్ఱుమఱప్పనో.　　3.

అ॥ ఇవన్ - ఈశ్రీయఃపతియే, ముదల్వనామ్ - జగత్కారణుఁడైనవాఁడు, ఎన్ఱు - అని, తన్ - తనవిషయమైన, తేర్ త్తి - తెలివిని (నాకు) ఇచ్చి, ఎన్ - నాయొక్క, నా - నాలికయందు, ముదల్ - ముందఱ, వన్దు - వచ్చి, పుగున్దు - ప్రవేశించి, నల్ - సర్వలక్షణయుతంబై, ఇన్ - మధురమైన, కవి - కృతిని (తిరువాయ్మొழிని), తూ - పరిశుద్ధులై, ముదల్ - ప్రధానులైన, పత్తర్ క్కు - భక్తులకు (భోగ్యముగునట్లు) తాన్ - తాను, తన్నై - తనను, శొన్న - ప్రతిపాదించినవాఁడును, ఎన్ వాయ్ - నాకృతికి, ముదల్ - కారణభూతుఁడునైన, అప్పనై - స్వామిని, ఎన్ఱు - (ఇఁక) ఎప్పుడు, మఱప్పన్ - మఱచెదను ?

తా॥ తానే నానాలికయందువచ్చి ప్రవేశించి, భక్తశిరోమణులు గానముఁజేసియానన్దించునట్లు తిరువాయ్మొழிని ప్రసాదించి, ఇవన్నిఁటికిని తానేకారణుఁడనెడి తెలివిని నాకిచ్చినమహోపకారకుని ఇఁక నేనెప్పుడును మఱచియుండనని.　　3.

అప్పనై యెన్ఱు మఱప్పనెన్నాగియే*
తప్పుదలిన్ఱి త్తనై క్కవితాన్ శొల్లి*
ఒప్పిలా త్తీవినై యేనై యుయ్యక్కొణ్డు*
శెప్పమే శెయ్దు తిరిగిన్ఱ శీర్ కణ్డే.　　౪.

అ॥ ఎన్నాగియే - నన్ను పకరణముగాఁచేసికొని, తప్పుదల్ - దోషము, ఇన్ఱి - లేకనే, తన్నై - తనవిషయమై, కవి - కవిత్వమును, తాన్ - తానే, శొల్లి - చెప్పి, ఒప్పిలా - సాటిలేని, తీవినైయేనై - చెడ్డపాపముగలనన్ను, ఉయ్యక్కొణ్డు - ఉజ్జీవింపఁజేసి, శెప్పమ్ శెయ్దు - రక్షించి, తిరిగిన్ఱ - ఉన్న, శీర్ - స్వభావమును, కణ్డు - తెలిసికొని, అప్పనై - స్వామిని, ఎన్ఱు - ఎప్పుడు, మఱప్పన్ - మఱచెదను.

తా॥ అతినీచుఁడనైన నన్ను సాధనముగాఁజేసికొని తానే తిరువాయ్మొழிని ప్రసాదించి నన్ను కృతార్థునిగాఁజేసిన సర్వేశ్వరుని నేనెన్నఁడును మఱవనని.　　౪.

శీర్ కణ్డుకొణ్డు తిరున్దునల్ ఇన్ కవి*
నేర్ పడయాన్ శొల్లుమ్ నీర్ మైయిలా మైయిల్*
ఏర్ విలావెన్నై త్తన్నాక్కి యెన్నాల్ తన్నై*
పార్ పరవిన్ కవి పాడుమ్పరమరే.　　౫.

అ॥ శీర్ - కల్యాణగుణములను, కణ్డుకొణ్డు - తెలిసికొని, తిరున్దు - శిక్షితమై, నల్ లక్షణయుతంబై, ఇన్ - మధురమై, కవి - కవిత్వమును, నేర్పడ - తగునట్లు, శొల్లుమ్ - చెప్పుటకు (తగిన), నీర్మైయిలామైయిల్ - జ్ఞానాది గుణములు లేనందున, ఏర్వుఇలా - అందములేని, ఎన్నై - నన్ను, (అసర్వేశ్వరుఁడు), తన్నాక్కి - తనతో సమానముగాఁ జేసికొని, ఎన్నాల్ - నాచేత, తన్నై - తనవిషయమై, ఇన్ - మధురమైన, కవి - కవిత్వమును, పార్ - భూలోకమంత, పరిపు - వ్యాపించునట్లు, పాడుమ్-చెప్పించుకొనిన, పరమర్ -సర్వోత్కృష్టుఁడు.

తా॥ భగవద్గుణముల నెఱుఁగి వానికిఁదగినట్లు కృతిచెప్పఁదగిన జ్ఞానములేని నాకు జ్ఞానము గలుగఁజేసి నాచేత నీతిరువాయ్మొழிని జేయించి ప్రసిద్ధిపఱచిన సర్వేశ్వరుని మహిమయపారమైయున్నదని. ౫

ఇన్కవిపాడుమ్ పరమకవిగళాల్*
తన్కవితాన్ తన్నైప్పాడువియాదు*ఇన్ఱు
నన్గువన్దెన్నుడనాక్కి యెన్నాల్ తన్నై*
వన్కవిపాడు మెన్వైగున్దనాదనే. ౬

అ॥ ఇన్ - మధురమైన, కవి - కవిత్వమును, పాడుమ్ - చెప్పుచున్న, పరమకవిగళాల్ - గొప్ప (వ్యాసాది) కవీశ్వరులచేత, తాన్ - తాను, తన్కవి - తనవిషయమైన కవిత్వముచే, తన్నై - తనను, పాడువియాదు - ప్రతిపాదించుకొనక, ఇన్ఱు - ఇప్పుడు, నన్గువన్దు - మంచి సంతోషముగలవాఁడైవచ్చి, ఎన్ఉడనాక్కి - నన్నెల్లప్పుడును విడువకుండ సాధనముగాఁ జేసికొని, ఎన్వైగున్దనాదన్ - నాపరమపదనాథుఁడు, ఎన్నాల్ - నాచేతనే, తన్నై - తనవిషయమై, వన్ - గొప్ప, కవి - (తిరువాయ్మొழிయనెడు) కవిత్వమును, పాడుమ్ - చేయించుచున్నాడు.

తా॥ మంచివాక్కుగల వ్యాసాదిమహనీయులుండగా వారిచేత నీప్రబంధమునుజేయించక నాచేత రచియించి తననుగృతార్థుని గాఁదలంచిన సర్వేశ్వరుని సౌశీల్యము వాచామగోచరమని, ౬.

వైగున్దనాద నెనవల్విని మాయ్న్దఱ*
శెయ్కున్దన్ తన్నై యెన్నాక్కి యెన్నాల్ తన్నై*
వైగున్దనాగప్పుగழ வణ్డీన్ఱవి*
శెయ్కున్దన్ తన్నై యెన్నాళ్ శిన్దిత్తార్వనో. ౭

అ॥ వైగున్దనాదన్ - శ్రీవైకుణ్ఠనాథుఁడైయుండి, ఎనవల్విని - నాచెడ్డపాపములను, మాయ్న్దఱచ్చెయ్ - నశింపఁజేయుచున్న, కున్దన్ - పరిశుద్ధస్వభావముగలవాఁడై, ఎన్నై తన్నాక్కి - నన్ను తనతోసమానముగాఁజేసికొని, వైగున్దనాగ - (తాను) శ్రీవైకుణ్ఠనాథుఁడగునట్లు, పుగழ - (నేను) స్తోత్రముఁజేయునట్లు, ఎన్నాల్ - నాచేత, తన్నై - తనవిషయమై, వణ్ - ఉదారమై, తీఙ్కవి - సుందరమైన కవిత్వమును, శెయ్ - చేయించిన, కున్దన్ తన్నై - పరిశుద్ధస్వభావముగల సర్వేశ్వరుని, ఎన్నాళ్ - ఎన్నిదినములు, శిన్దిత్తు - ధ్యానించి, ఆర్వన్ - తృప్తిబొందెదను ?

తా॥ నావంగశాశాసనము చేతనే తన సమస్తైశ్వర్యమును సఫలమనిదలంచి నాపాపము లనుబోఁగొట్టి నాచేత నీతిరువాయ్మొழిని జేయించిన శ్రీవైకుణ్ఠనాథునినే నెంతకాలము స్తోత్రముఁజేసినను వానియుపకారమునకుఁదగిన ప్రత్యుపకారముకాదని. ౭.

ఆర్వనోవాழியజ్గై యెమ్బిరాన్పుగழ்*
పార్విణ్ణీర్ముழுమ్ కలన్దుపరుగిలుమ్*
పర్విలావైన్నై త్తన్నాక్కియెన్నాల్తన్నై
శీర్ పెఱవిన్కవి శొన్నతిఱత్తుక్కే. ౮.

అ॥ ఏర్విఇలా - (తనవిషయమై కవిత్వముచెప్పుటకు) యోగ్యతలేని, ఎన్నై - నన్ను, తన్నాక్కి - తనతోసమానముగాజేసి, ఎన్నాల్ - నాచేత, శీర్ పెఱ - సౌశీల్యమునుబొందుటకు, తన్నై - తమవిషయమై, ఇన్ కవి - మధురమైనకవిత్వమును, శొన్న - చెప్పించుకొనిన, తిఱత్తుక్కు - విధమునకు, అழி - సుదర్శనముగల, అమ్ - సుందరమైన, కై - శ్రీహస్తముగల, ఎమ్బిరాన్ - సర్వేశ్వరునియొక్క, పుగழ் - కీర్తిని, పార్ - భూలోకమందున్న వారియొక్కయు, విణ్ - ఊర్ధ్వలోకమందున్నవారియొక్కయు, నీర్ ముழுమ్ - స్వభావమంతయు, కలన్దు - కలిసి (కలవాఁడనై), పరుగిలుమ్ - అనుసంధించినను, ఆర్వనో - తృప్తుఁడనగుదునా ?

తా॥ నాచేత తనను పొండించుకొని దానిచేతానుసుశీలుఁడగుటకొఱకై, జ్ఞానహీనుఁడనైన నాకు జ్ఞానమునుగలుగజేసి తిరువాయ్మొழி చేయించిన సర్వేశ్వరుని సౌశీల్యమునకు నేను సమస్తభాగవతులయొక్క శక్తిగలవాఁడనై వారిని సహాయముగాజేసికొని స్తోత్రముఁజేసినను ఆసౌశీల్యమునకుఁజాలదని. ౮.

తిఱత్తుక్కేతుప్పరవామ్ తిరుమాలిన్శీర్*
ఇఱప్పెదిర్కాలమ్ పరుగిలుమార్వనో*
మఱప్పిలావైన్నై త్తన్నాక్కియెన్నాల్తన్నై*
ఉఱప్పలవిన్కవి శొన్నవుదవిక్కే. ౯.

అ॥ మఱప్పిఇలా - (జ్ఞానపూర్వకమైన) మఱుపులేని, (జ్ఞానములేని), ఎన్నై - నన్ను, తన్నాక్కి - తనతోసమానముగాఁజేసి, ఎన్నాల్ - నాచేత, తన్నై - తనవిషయముగా, ఉఱ - తగునట్లు, పల - అనేకములై, ఇన్ - మధురములైన, కవి - పాశురములను, శొన్న - చెప్పించిన, ఉదవిక్కు - ఉపాకారమునకు, తిఱత్తుక్కు - ఆరంభించిన కార్యమునకుఁదగిన, తుప్పర వామ్ - సామర్థ్యముగల, తిరుమాలిన్ - శ్రియఃపతియొక్క, శీర్ - కల్యాణగుణములను, ఇఱప్పు - భూతకాలములయందును, ఎదిర్ కాలమ్ - భవిష్యత్కాలములయందును, పరుగిలుమ్ - అనుసంధించినను, ఆర్వనో - తృప్తిపొందెదనా !

అ॥ జ్ఞానహీనుఁడనైన నాకు జ్ఞానమునుగలుగఁజేసి తనవిషయమై నాచేత వెయ్యిపాశురములను జెప్పించిన శ్రియఃపతికి ప్రత్యుపకారముగా వాని కల్యాణగుణముల నెల్లకాలములయందనుసంధించినను ఆయుపకారమునకుఁదగదని.

ఉదవిక్కై మ్మాఱ్ఱెన్ను యిరెన్నవుళ్ నోక్కిల్*
అదువుమఱ్ఱాఙ్గవన్ఱన్న దెన్నాల్ తన్నై*
పదవియవిన్ కవి పాడియవప్పనుక్కు*
ఎదువుమొన్ఱుమిల్లై శెయ్వదిఙ్గుమఙ్గే.     ౧౦.

అ॥ ఉదవి - (సర్వేశ్వరుఁడుచేసిన) ఉపకారమునకు, కైమ్మాఱు - ప్రత్యుపకారము, ఎన్ ఉయిర్ - నాయాత్మ, ఎన్ను - అనియాలోచించిచూచి, ఉళ్ నోక్కిల్ - (దాసస్వరూపమును) పరిశీలించిచూచినయెడల, అఙ్గు - అప్పుడు, అదువుమ్ - ఆయాత్మయు, మఱ్ఱు - (నాదియనితలంచిన) తక్కినవస్తువును, అవన్ తన్నదు - వానిదైయ్యేయుండెను. ఎన్నాల్ - నాచేత, తన్నై - తనవిషయమై, పదవియ - మృదువై, ఇన్ - మధురమైన, కవి - పాశురములను, పాడియ - ప్రతిపాదింపఁజేసిన, అప్పనుక్కు - స్వామికి, శెయ్వదు - (ప్రత్యుపకారముగా), చేయఁదగినది, ఇఙ్గుమ్ - ఈలోకమందును, అఙ్గుమ్ - పరమపదమందును, ఎదువుమ్ - ఎంతమాత్రమైనను, ఒన్ఱుమ్ - ఒకటియు, ఇల్లై - లేదు.

తా॥ సర్వేశ్వరుఁడు చేసిన ఉపకారమునకుఁదగిన ప్రత్యుపకారముగా జ్ఞానానన్దస్వరూపమై స్వయంప్రకాశమైవిలక్షణమైన నాయాత్మనుసమర్పించెదనని విచారించిన యెడల అదియును వానిదిగానేనుండెను. దానికిఁదగిన వస్తువిచ్చుటను నేమియుఁదొఱకలేదని.     ౧౦.

‡‡ ఇఙ్గుమఙ్గుమ్ తిరుమాలన్ఱి యిన్మైకణ్డు*
అఙ్గనేవణ్ కురుగూర్ చ్చడగోపన్*
ఇఙ్గనేశొన్న ఓరాయిరత్తిప్పత్తుమ్*
ఎఙ్గనేశొల్లిలుమిన్బమ్పయక్కుమే.     ౧౧.

అ॥ ఇఙ్గుమ్ - ఈలోకమందును, అఙ్గుమ్ - పరలోకమందును, తిరుమాల్ అన్ఱి - శ్రియఃపతితప్ప, ఇన్మై - (వేఱొకఉపాయము) లేనిదానిని, కణ్డు - అనుసంధించి, అఙ్గనే - ఆదేవిధమైనఅనుసన్ధానముగలవారై, వణ్ - ఉదారులైన, కురుగూర్చ్చడగోపన్ - కురుకాపురాధీశులైన నమ్మాళ్వార్లు, ఇఙ్గనే - ఈయభిసన్ధితోఁగూడ, శొన్న - సాధించిన, ఓరాయిరత్తు - ఒకవెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, ఎఙ్గనేశొల్లిలుమ్-ఎట్లనుసన్ధించినను, ఇన్బమ్ - మోక్షసుఖమును, పయక్కుమ్ - కలుగఁజేయును.

తా॥ ప్రాప్యప్రాపకములన్నియు శ్రియఃపతియేయని యెల్లప్పుడు ననుసంధించుచున్న నమ్మాళ్వార్లుప్రపాదించిన యీపదిపాశురములను నేవిధముగా ననుసంధించినను వారుబ్రహ్మానందము ననుభవింతురని.     ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్

# ౧౦ - వ, తిరువాయ్మొழి.

---

అవతారిక:— ఈతిరువాయ్మొழిలో, సర్వేశ్వరుఁడు నాచేతఁజేయించిన తిరువాయ్మొழిని తిరువాఱన్విళైయనెడి దివ్యదేశమందు వేంచేసియున్న ఆసర్వేశ్వరునికి విన్నవించి వాచాకైంకర్యముఁజేయవలయునని మనోరథించుచున్నారు.

ఀ ఇన్బమ్పయక్క వెழிల్మలర్మాదరుమ్తానుమివ్వేழுలగై *
ఇన్బమ్పయక్కవినిదుడనీఱ్ఱిరున్దాళ్గిన్ఱ వెజ్గళ్పిరాన్ *
అన్బుఱ్ఱమర్న్దుఱైగిన్ఱ వణిపొழிల్శూழ் తిరువాఱన్విళై *
అన్బుఱ్ఱమర్న్దువలమ్శెయ్దు కైతొழுమ్నాళ్గళుమాగుఙ్గొలో. ౧.

అ॥ ఎழிల్ - సౌందర్యముగల, మలర్మాదరున్ - శ్రీదేవియు, తానుమ్ - తానును, ఇన్బమ్పయక్క - (పరస్పరానుభవజన్యంబైన) సుఖముకలుగునట్లును, ఇవ్వేழுలగై - ఈస ప్తలోకములకును, ఇన్బమ్పయక్క - సుఖముకలుగునట్లును, ఇనిదుడన్ - ప్రీతితో, వీఱ్ఱిరున్దు - వేంచేసియుండి, ఆళ్గిన్ఱ (ఆలోకములను) పరిపాలించుచున్న, ఎజ్గళ్పిరాన్ - మాస్వామియైన సర్వేశ్వరుఁడు, అన్బుఱ్ఱు - ప్రీతిగలవాఁడై, అమర్న్దు - అనురక్తితో, ఉఱైగిన్ఱ - నిత్యవాసముఁజేయుచున్నదియు, అణి - అందమైన, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టఁబడినదియునైన, తిరువాఱన్విళై - తిరువాఱన్విళైయనెడిదివ్యదేశమును, అన్బుఱ్ఱు - స్నేహించి, అమర్న్దు - అమరియుండి, వలమ్శెయ్దు - ప్రదక్షిణముజేసి, కైతొழுమ్ - చేతులతో సేవింపఁదగిన, నాళ్గళుమ్ - దినములును, ఆగుఙ్గొల్ - సంభవించునా ?

తా॥ సమస్తలోకములను బరిపాలించుచు శ్రీదేవితోఁగూడ సుఖముగా వేంచేసియున్న సర్వేశ్వరుఁడు ఇప్పుడు నాతిరువాయ్మొழிని వినుటకై వచ్చివేంచేసియున్న తిరువాఱన్విళైయనెడి దివ్యదేశమును నేనెప్పుడు ప్రదక్షిణముజేసి దణ్ణమ్ సమర్పించెదనోయని. ౧.

ఆగుఙ్గొలైయమొన్ఱిన్ఱి యగలిడముఱ్ఱవుమ్*ఈరడియే
ఆగుమ్పరిశునిమిర్న్ద తిరుక్కుఱళప్పనమర్న్దుఱైయుమ్*
మాగమ్తిగழ்కొడిమాడఙ్గళ్నీడు మదిళ్ తిరువాఱన్విళై *
మాకన్దనీర్కొణ్డుతూవివలమ్శెయ్దు కైతొழுక్కూడుఙ్గొలో. ౨.

అ॥ ఒన్ఱుఐయమ్ - ఒకసంశయమును, ఇన్ఱి - లేక, ఆగుఙ్గొల్ - (ఇదిమాకు) సంభవించునా ? అగల్ - విశాలమైన, ఇడమ్ముఱ్ఱవుమ్ - లోకములన్నియు, ఈరడియే - రెండడుగులే, ఆగుమ్పరిశు - అయ్యెడివిధముగా, నిమిర్న్ద - పెరిగిన, తిరుక్కుఱళ్అప్పన్ - శ్రీవామనుఁడైనస్వామి, అమర్న్దు - అమరి, ఉఱైయుమ్ - వాసముఁజేయుచున్నదియు, మా - విశాలమై, కమ్ - ఆకాశమందు, తిగழ் - ప్రకాశించుచున్న, కొడి - ధ్వజములుగల, నీడు - ఉన్నతములైన, మాడఙ్గళ్ - మేడలను, నీడు - పెరిగియున్న, మదిళ్ - ప్రాకారమునుగలదియునైన, తిరువాఱన్విళై - తిరువాఱన్విళైను, మా - శ్లాఘ్యమైన, కన్దమ్ - పరిమళముగల, నీర్ - జలమును, కొణ్డు - తీసికొనిపోయి, తూవి - జల్లి, వలమ్శెయ్దు - ప్రదక్షిణమ్ముఁజేసి, కైతొழ - ఆశ్రయింప, కూడుఙ్గొలో - సంభవించునా ?

తా॥ సకలలోకములను రెండడుగులచే గొలిచిన వామనుఁడు వచ్చివేంచేసియున్న గృహ ప్రాకారాదులచే పూర్ణమైన తిరువాఱన్ విళైను నే నెప్పుడుమంచి సుగంధతీర్థమును జల్లి ప్రదక్షిణముఁజేసి నిస్సందేహముగా నాశ్రయించెదనోయని ౨.

కూడుఙ్గొల్ వైగలుమ్ కోవిన్దనై మదుశూదనై క్కోళరియై*
ఆడుమ్పఱవై మిశై క్కణ్డు కై తొழுద న్ఱియవను త్తైయుమ్*
పాడుమ్ పెరుమ్బుగழ் నాన్మఱై వేళ్వి యైన్దాఱఙ్గమ్పయిన్ఱవర్ వాழ்*
నీడుపొழిల్ తిరువాఱన్విళై తొழ వాయ్క్కుఙ్గొల్ నిచ్చలుమే. 3.

అ॥ వైగలుమ్ - ఎల్లప్పుఁడును, కూడుఙ్గొల్ - (ఇటులనే) సంభవించునా ? కోవిన్దనై - ఆశ్రితసులభుఁడైన శ్రీకృష్ణుఁడును, మదుశూదనై - మధువనెడి రాక్షసునిజంపినవాఁడును, కోళరియై - తేజస్సుగల సింహమువంటివాఁడునైన సర్వేశ్వరుని, ఆడుమ్ - సొగసుగానడుచుచున్న, పఱవై మిశై - గరుత్మంతునిమీఁద, కణ్డు - కాంచి, కైతొழுదు - అఞ్జలిచేసి, అన్ఱి - అంతమాత్రమే గాక, అవన్ ఉఱైయుమ్ - ఆసర్వేశ్వరుఁడు నిత్యవాసముఁజేయుచుండినదియు, పెరుమ్ పుగழ் -(వానియొక్క) గొప్పకల్యాణగుణములను, పాడుమ్ - ప్రతిపాదించుచున్న, నాల్మఱై - నాల్గువేదములనున్ను, ఐన్దువేళ్వి - పఞ్చమహాయజ్ఞములనున్ను, ఆఱఙ్గమ్ - షడఙ్గములనున్ను, పయిన్ఱవర్ - అభ్యసించువారు, వాழ் - వేంచేసియున్న, నీడుపొழిల్ - గొప్పతోటలుకలదియునైన, తిరువాఱన్ విళై - తిరువాఱన్ విళైను, తొழ - ఆశ్రయించునట్లు, నిచ్చలుమ్ - ప్రతిదినమును, వాయ్క్కుఙ్గొల్ - సంభవించునా ?

తా॥ గరుడవాహనారూఢుఁడైన సర్వేశ్వరునికిన్ని, వేదవేదాఙ్గాదులనభ్యసనముఁజేయుచున్న శ్రీవైష్ణవులకున్ను వాసస్థానమైన తిరువాఱన్ విళైను మనమెప్పుడు సేవించి కృతార్థులమగుదుమోయని. 3.

వాయ్క్కుఙ్గొల్ నిచ్చలు మెప్పొழுదుమ్మన త్తీణ్డిరుక్క ప్పుఱు*
వాయ్క్కుమ్ కరుమ్బుమ్ పెరుమ్ శెన్నెలుమ్ వయల్ శూழ் తిరువాఱన్విళై*
వాయ్క్కుమ్ పెరుమ్పుగழ் మూవులగీశన్ వడమదురై ప్పిఱన్ద*
వాయ్క్కుమ్మణినిఱక్కణ్ణపిరాన్ఱన్ మలరడిప్పోదుగళే. ౪.

అ॥ వాయ్క్కుమ్ - సంపూర్ణమై, కరుమ్బుమ్ - చెరకులను, పెరుమ్ శెన్నెలుమ్ - గొప్ప ఎఱ్ఱ ధాన్యములనుగల, వయల్ - పొలములచే, శూழ் - చుట్టఁబడిన, తిరువాఱన్ విళై - తిరువాఱన్ విళైయందు (వేంచేసియున్నవాఁడును), వాయ్క్కుమ్ - తగునై, పెరుమ్పుగழ் - గొప్పకీర్తిగలవాఁడును, మూవులగుఈశన్ - మూడులోకములకుస్వామియు, వడమదురై - ఉత్తరమందున్న మధురానగరమందు, పిఱన్దాన్ - అవతరించినవాఁడును, వాయ్క్కుమ్ - (ఆశ్రితులకనుభవింప) యోగ్యమైన, మణినిఱమ్ - నీలమణివంటికాన్తిగలవాఁడునైన, కణ్ణపిరాన్ ఱన్ - శ్రీకృష్ణునియొక్క, మలర్ - వికసించియున్న, అడిప్పోదుగళ్ - శ్రీపాదపద్మములను, ఈఙ్గు - ఇచ్చటనుండియే, మనత్తు - మనస్సులో, నిచ్చలుమ్ - ప్రతిదినమును, ఎప్పొழுదుమ్ - ఎల్లప్పుడు, ఇరుక్కప్పుఱు - ధ్యానింప, వాయ్క్కుఙ్గొల్ - సంభవించునా ?

తా॥ చెరుకుతోటలచేతను పొలములచేతను సమృద్ధమైయున్న తిరువాఙన్విళైయందు వేంచేసియున్న త్రిలోకాధీశుఁడైన సర్వేశ్వరుని మనమిచ్చటనుండియే సర్వకాలము సెప్పుడును భజించెదమోయని. ౪.

మలరడిప్పోదుగళెన్నెఞ్జత్తెప్పొழுదు మిరుత్తివణఙ్గ*
పలరడియార్ మున్బరుళియ పామ్బణైయప్పనమర్ న్దుఱైయుమ్*
మలరిల్ మణినెడుమాడఙ్గళ్ నీడు మదిళ్ తిరువాఙ్విళై *
ఉలగమలిపుగழ் పాడ నమ్మేల్వినై యొన్ఱునిల్లాకెడుమే. ౫.

అ॥ మలర్ - వికసించియున్న, అడిప్పోదుగళ్ - శ్రీపాదపద్మములను, ఎన్ నెఞ్జత్తు - నా మనస్సునందు, ఎప్పొழுదుమ్ - ఎప్పుఁడును, ఇరుత్తి - స్థాపించి, వణఙ్గ - ఆశ్రయించునట్లు, పలర్ అడియార్ మున్బు - అనేకశ్రీవైష్ణవులముందఱ, అరుళియ - కృపజేసిన, పామ్బుఅణై - ఆదిశేషునిపడక గాగల, అప్పన్ - స్వామి, అమర్న్దు - అమరికతో, ఉఱైయుమ్ - నిత్యవాసముఁ జేయుచున్నదియు, మలరిల్ - పవ్వులుగలదియు, మణి - రత్నమయమై, నెడు - ఉన్నతమైన, మాడఙ్గళ్ - మేడలనున్ను, నీడు - గొప్ప, మదిళ్ - ప్రాకారములనున్ను గలదియునైన, తిరువాఙన్విళై - తిరువాఙ్విళైయనెడి దివ్యదేశమందు వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క, ఉలగమ్ - లోకములయందు, మలి - నిండియున్న, పుగழ் - కల్యాణగుణములను, పాడ - గానముజేయుగా, నమ్మేల్ - మనమీఁదనున్న, వినై - పాపములు, ఒన్ఱు - ఒకటియు, నిల్లా - నిలువక, కెడుమ్ - నశించును.

తా॥ తనశ్రీపాదముల నెల్లప్పుడును ధ్యానించునట్లు నన్ననుగ్రహించి ఇప్పుడు మణిమయ ప్రాకారాదులచే నతిమనోహరంబైన తిరువాఙన్విళైయందు వేంచేసియున్న శ్రియఃపతియొక్క కల్యాణగుణముల ననుసంధించినయెడల మనకేవిధ పాపముండదని. ౫.

ఒన్ఱునిల్లాకెడుమ్ముఱ్ఱవుమ్తీవినై యుళ్ళిత్తొழுమిన్ తొణ్డీర్*
అన్ఱఙ్గమర్ వెన్ఱురుప్పిణినఙ్గై యణినెడున్దోళ్ పుణర్న్దాన్*
ఎన్ఱుమెప్పోదుమెన్నెఞ్జమ్తుదిప్ప వుళ్ళేయిరుక్కిన్ఱపిరాన్*
నిన్ఱ వణితిరువాఙ్విళై యెన్నుమ్ నీణగరమదువే. ౬.

అ॥ అన్ఱు - శిశుపాలుఁడుస్వయంవరమును బోడించినప్పుడు, అఙ్గు - అచ్చట, అమర్ - యుద్ధమందు, వెన్ఱు - (రుక్మిని) జయించి, ఉరుప్పిణినఙ్గై - రుక్మిణిపిరాట్టియొక్క, అణి - సుందరమై, నెడుమ్ - దీర్ఘమైన, తోళ్ - భుజములను, పుణర్న్దాన్ - సంశ్లేషించినవాఁడును, ఎన్ఱుమ్ - ప్రతిదినమును, ఎప్పోదుమ్ - సర్వకాలమందున్న, ఎన్ నెఞ్జమ్ - నామనస్సు, తుదిప్ప - స్తోత్రముఁజేయునట్లు, ఉళ్ళే - నాహృదయమందు, ఇరుక్కిన్ఱ - నిత్యవాసముఁజేయుచున్న, పిరాన్ - ఉపకారకుఁడునైన సర్వేశ్వరుఁడు, నిన్ఱ - వేంచేసియున్న, అణి - అందమైన, తిరువాఙ్విళై ఎన్నుమ్ - తిరువాఙ్విళైయనెడి, నీళ్ నగరమదు - మహానగరమును, తొణ్డీర్ - ఓభక్తులారా! ఉళ్ళి - ధ్యానించి, తొழுమిన్ - ఆశ్రయించుఁడి. తీవినై ఒన్ఱుమ్ - చెడ్డపాప మొకటియును, నిల్లా - నిలువదు. ముఱ్ఱవుమ్ కెడుమ్ - అన్నియునశించును.

తా॥ ఓ భాగవతులారా! స్వయంవరమునకు వెళ్ళి యచ్చటయుద్ధమందు రుక్మిని జయించి రుక్మిణిపిరాట్టిని వివాహముచేసికొని వచ్చి యాహృదయమందల్లప్పుడును వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క తిరువాఱన్విళైయనెడుమహానగరము నాశ్రయించినయెడల సమస్తపాపములును తొలంగును, గనుక ఆశ్రయించుడియని. ౬.

నీణగరమదువే మలర్చ్చోలైగళ్ శూழ் తిరువాఱన్విళై *
నీణగరత్తుఱైగిన్ఱ పిరాన్ నెడుమాల్ కణ్ణన్ విణ్ణవర్ కోన్ *
వాణపురమ్పుక్కు ముక్కణ్ పిరానై త్తొలైయ వెమ్పోర్గళ్ శెయ్దు *
వాణనై యాయిరన్దోళ్ తుణిత్తాన్ శరణన్ఱి మఱ్ఱొన్ఱిలమే. ౭.

అ॥ నీళ్ నగరమ్ - మహానగరమని చెప్పబడుచున్న శ్రీవైకుంఠము, అదువే - ఆతిరువాఱన్విళైయే. మలర్ - పుష్పములుగల, శోలైగళ్ - తోటలచే, శూழ் - చుట్టఁబడిన, తిరువాఱన్విళై - తిరువాఱన్విళైయనెడి, నీళ్ నగరత్తు - మహానగరమందు, ఉఱైగిన్ఱ - నిత్యవాసముఁజేయుచున్న, పిరాన్ - ఉపకారకుఁడును, నెడుమాల్ - (ఆశ్రితులయందు) గొప్పవ్యామోహముగలవాఁడును, కణ్ణన్ - కృష్ణుఁడైయవతరించినవాఁడును, విణ్ణవర్ కోన్ - నిత్యసూరులకుస్వామియు, వాణపురమ్ - బాణాసురునిపట్టణమును, పుక్కు - ప్రవేశించి, ముక్కణ్ పిరానై - ఈశ్వరాభిమానియైన త్రినేత్రుఁడు, తొలైయ - ఓడునట్లు, వెమ్పోర్గళ్ - క్రూరయుద్ధములను, శెయ్దు - చేసి, వాణనై - బాణాసురునియొక్క, ఆయిరమ్ తోళ్ - వెయ్యిభుజములను, తుణిత్తాన్ - ఛేదించినవాఁడునైన సర్వేశ్వరుఁడు, శరణ్ - ఉపాయభూతుఁడు. అన్ఱి - వానినితప్ప, మఱ్ఱొన్ఱు - వేఱొకయుపాయమును, ఇలమ్ - కలవారముకాము.

తా॥ దానునిక ప్రాప్యమైన శ్రీవైకుంఠమును తిరువాఱన్విళైయే. దానికి ప్రాపకుఁడును అచ్చట వేంచేసియున్న బాణారియైన శ్రీకృష్ణుఁడే. ఇదితప్ప మాకు వేఱొక ఉపాయములేదని. ౭

అన్ఱి మఱ్ఱొన్ఱిలమ్ నిన్ శరణే యెన్ఱగలిరుమ్ పొయ్గైయిన్ వాయ్ *
నిన్ఱుతన్నీళ్ కழల్ ఏత్తియ వానై యిన్నెఞ్జిడర్ తీర్త్త పిరాన్ *
శెన్ఱఙ్గినిదుఱైగిన్ఱ శెழுమ్పొழிల్ శూழ் తిరువాఱన్విళై *
ఒన్ఱివలమ్ శెయ్య వొన్ఱుమో తీవినై యుళ్ళత్తిన్ శార్వల్లవే. ౮.

అ॥ నిన్ శరణ్ అన్ఱి - నీతిరువడికళ్ళుతప్ప, మఱ్ఱొన్ఱు - వేఱొకఉపాయము, ఇలమ్ - కలవారముకాము, ఎన్ఱు - అని, అగల్ - విశాలమై, ఇరుమ్ - అగాధమైన, పొయ్గైయిన్వాయ్ - మడుగునందు, నిన్ఱు - ఉండి, తన్ - తనయొక్క, నీళ్ కழల్ - దీర్ఘమైనతిరువడికళ్ళను, ఏత్తి - స్తోత్రముఁజేసిన, ఆనైయిన్ - శ్రీగజేన్ద్రాళ్వార్లయొక్క, నెఞ్జిడర్ - మనోదుఃఖమును, తీర్త్త - పోఁగొట్టిన, పిరాన్ - సర్వేశ్వరుఁడు, శెన్ఱు - వెళ్ళి, అఙ్గు - ఆదివ్యదేశమందు, ఇనిదు - ప్రీతితో, ఉఱైగిన్ఱ - నిత్యవాసముచేయుచున్నదియు, శెழுమ్పొழிల్ - సమృద్ధమైనతోటలచే, శూழ் - చుట్టబడినదియునైన, తిరువాఱన్విళై - తిరువాఱన్విళను, ఒన్ఱి - పొంది, వలమ్ శెయ్య - ప్రదక్షిణముచేయ, ఒన్ఱుమో - సంభవించునా? తీవినై - చెడ్డపాపము, ఉళ్ళత్తిన్ - మనస్సునందు, శార్వు - సంబంధమును, అల్లవే - కలదికాదుకదా.

తా॥ మడుగునందు మొసలి తనకాళ్ళను పట్టుకొనినప్పుడు శ్రీగజేన్ద్రాళ్వార్లు నీతిరువడి గళే యుపాయమని చెప్పగా నప్పుడు వారిదుఃఖమును బోగొట్టినసర్వేశ్వరుఁడువచ్చి వేంచేసి యున్న తిరువాఱన్విళను బ్రదక్షిణముఁజేయు సంభవించినయెడల వారికేవిధదుఃఖమును రానేరదని.

తీవినై యుళ్ళత్తిన్ శార్వల్లవాగి త్తెళివిశుమ్బేఱలుఱ్ఱాల్*
నావినుళ్ళుముళ్ళత్తుళ్ళు మమైన్ద తొழிలినుళ్ళుమ్నవిన్ఱు*
యావరుమ్వన్దువణఙ్గుమ్బొழிల్ తిరువాఱన్విళై యదనై*
మేవివలమ్ శెయ్దుకై తొழுక్కూడుఙ్గొ లెన్ను మెన్శిన్దనైయే. ౯.

అ॥ తీవినై - చెడ్డపాపము, ఉళ్ళత్తిన్ - మనస్సునందు, శార్వల్లవాగి-సంబన్ధమునువదలి, తెళి - నిర్మలమైనజ్ఞానమునిచ్చు, విశుమ్బు - పరమపదమును, ఏఱలుఱ్ఱాల్ - పోయిచేరు నట్లు సంభవించినయెడల, ఎన్శిన్దనై - నామనస్సు, యావరుమ్వన్దు - అందఱునువచ్చి, నావినుళ్ళుమ్ - నాలికచేతను, ఉళ్ళత్తినుళ్ళుమ్ - మనస్సుచేతను, అమైన్ద - దానికిఁదగునట్టిన, తొழிలినుళ్ళుమ్ - వ్యాపారములచేతను, నవిన్ఱు - పొంది (స్తోత్రముజేసి), వణఙ్గుమ్ - నమస్కరించుచున్న దియు, పొழிల్ - తోటలుగలదియునైన, తిరువాఱన్విళైయదనై - తిరువాఱన్విళయనెడి దివ్యదేశమును, మేవి - అమరియుండి, వలమ్ శెయ్దు - ప్రదక్షిణముఁజేసి, కైతొழு-ఆశ్రయించు, కూడుఙ్గొల్ - సంభవించునా? ఎన్నుమ్ - అనిచింతించును.

తా॥ నిత్యసూరులుకూడవచ్చి మనోవాక్కాయములచే స్తోత్రముజేయుచున్న తిరువాఱన్విళై, సమస్తపాపములునశించినతరువాత పొందదగినయప్రాకృతమైన పరమపదము ఇవిరెండును నాకు సంభవించినయెడల అప్పుడు నామనస్సు పరమపదమునువదలి తిరువాఱన్విళైయనెడి దివ్యదేశమునే యాశించి యుండునని. ౯

శిన్దైమత్తొన్ఱిన్ తిఱత్తదల్లాత్తన్మై తేవపిరానఱియుమ్*
శిన్దైయినాల్ శెయ్వతానఱియాదన మాయఙ్గళొన్ఱుమిల్లై*
శిన్దైయినాల్ శొల్లినాల్ శెయ్గైయాల్ నిలత్తేవర్కుழுవణఙ్గుమ్*
శిన్దైమగిழ் తిరువాఱన్విళై యుఱై తీర్త్తనుక్కఱ్ఱపిన్నే. ౧౦.

అ॥ శిన్దైయినాల్ శొల్లినాల్ శెయ్గైయాల్ - మనోవాక్కాయములచే, నిలత్తేవర్ - భూసురులైన భాగవతులయొక్క, కుழு - సమూహము, వణఙ్గుమ్ - ఆశ్రయింపఁదగినదియు, శిన్దై - మనస్సును, మగిழ் - సంతోషింపఁజేయునదియునైన, తిరువాఱన్విళై - తిరువాఱన్విళై యందు, ఉఱై - నిత్యవాసముజేయుచున్న, తీర్త్తనుక్కు-పరిశుద్ధుఁడైనసర్వేశ్వరునికి, అఱ్ఱపిన్ - శేషమైనతరువాత, శిన్దై - (నా) మనస్సుయొక్క, మత్తొన్ఱిన్ - మఱియొకపదార్థ మందు, తిఱత్తదల్లా - ఉద్దేశ్యబుద్ధిలేని, తన్మై - స్వభావమును, తేవపిరాన్ - సర్వేశ్వరుఁడు, అఱియుమ్ - ఎఱుఁగును. శిన్దైయినాల్ - మనస్సుచే, శెయ్వ - చేయబడిన, మాయఙ్గళ్-వంచక వ్యాపారములు, తాన్ - ఆసర్వేశ్వరుఁడు, అఱియాదన - తెలిసికొననవి, ఒన్ఱుమ్ - ఒకటియు, ఇల్లై - లేదు.

తా॥ శ్రీవైష్ణవులు గుంపుగాఁజేరి మనోవాక్కాయములచే కైంకర్యముజేయుచున్న తిరువాఱన్విళయనెడి దివ్యదేశమునకే నామనస్సు శేషపడినది. మఱియొకదానినితలవదు. ఈసంగతి సర్వజ్ఞుఁడైన సర్వేశ్వరునికిఁగూడ తెలుసును. నేనుప్రార్థింపని పరమపదమును వాడు నాకివ్వడని.

॥॥ తీర్ త్తనుక్కఱ్ఱపిన్ మత్తోర్ శరణిల్లై యెన్రెణ్ణి*
తీర్ త్తనుక్కే తీర్ త్తమన త్తననాగి చ్చెழும் కురుగూర్ చ్చటగోపన్ శొన్న*
తీర్ త్తజ్గళాయిరత్తుళ్ ఇవైపత్తుమ్వల్లార్ గళై *తేవర్ వైగల్
తీర్ త్తజ్గళేయెన్రుపూశిత్తునల్ గియురైప్పర్ తమ్ తేవియర్ క్కే. ౧౧.

అ॥ తీర్త్తనుక్కు - పావనుఁడైనసర్వేశ్వరునికి, అఱ్ఱపిన్ - శేషపడినతరువాత, మత్తోర్ శరణ్ - వేఱొకఉపాయము, ఇల్లై యెన్రెణ్ణి - లేదనితలంచి, తీర్ త్తనుక్కే - ఆపావనునికే, తీర్ త్త - అధీనముగాజేసిన, మనత్తననాగి మనస్సుగలవారై, శెழுమ్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొన్న - సాదించిన, తీర్ త్తజ్గళ్ - తీర్థస్వరూపములైన (పరిశుద్ధములైన), ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవై పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ గళై - అభ్యసించినవారిని, తేవర్ - నిత్యసూరులు, వైగల్ - ప్రతిదినమును, తీర్ త్తజ్గళేయెన్రు - (వీరు) పావనులని, పూశిత్తు - కొనియాడి, నల్ గి - స్నేహముతో, తమ్ తేవియర్ క్కు - తమదేవులకు, ఉరైప్పర్ - ఉపదేశింతురు.

తా॥ సర్వేశ్వరునితప్ప మఱియొకరక్షకుఁడు లేదని యధ్యవసించిన నమ్మాళ్వార్లుసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారిని నిత్యసూరులు మిక్కిలి కొనియాడుదురని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

౭-పత్తు, సంపూర్ణము.

ఇదివఱకు తిరువాయ్మొழிలు డబ్బదియింటికి పాశురములు ౭౭౦



## ౮ - పత్తు, ౧-వ, తిరువాయ్మొఴి.

---

అవతారిక :— ఈతిరువాయ్మొఴిలో, నమ్మాళ్వార్లు శ్రియఃపతియొక్క సర్వేశ్వరత్వమునున్ను ఆశ్రితపారతన్త్ర్యమునున్ను జూచి యితఁడుతమను రక్షించునని నమ్మి ఇంతకాలమాశించి యుండియు తమనురక్షించనందున ఆరెండుగుణములున్ను సర్వేశ్వరునికి లేదని సంశయింప, అప్పుడు సర్వేశ్వరుఁడు తనయందు వీరికివిశ్వాసముకలుగునట్లు కొన్నినిదర్శనములను ప్రదర్శింప, అప్పుడు తమసన్దేహమునువదలియాగుణముల ననుసంధించుచున్నారు.

‡‡ తేవిమారావార్ తిరుమగళ్ పూమి యేవమఱ్ఱమరరాట్చెయ్వార్*
మేవియవులగమ్ మూన్ఱవై యాట్చి వేణ్డువేణ్డురువమ్నిన్నురువమ్*
పావియేన్ఱన్నైయడుగిన్ఱ కమలక్కణ్ణదోర్ పవళవాయ్మణియే*
ఆవియేయముదే యలైకడల్ కడైన్దవప్పనే కాణుమాఱరుళాయ్. ౧.

అ॥ తేవిమారావార్ - నీకుపట్టమహిషులు, తిరుమగళ్ - శ్రీదేవియును, పూమి - భూదేవియును. ఏవ - (నీవు) నియమించగా, ఆళ్ శెయ్వార్ - (నీకు) కైంకర్యముచేయువారు; మఱ్ఱు - వారితో సమానులైన, అమరర్ - నిత్యసూరులు. మేవియ - అమరియున్న, మూన్ఱవైయులగమ్ - మూడులోకములును, ఆట్చి - (నీచే) పరిపాలింపఁదగినవి. వేణ్డువేణ్డురువమ్ - ఆయాసమయములకుఁదగినరూపములు, నిన్నురువమ్ - నీతిరుమేనులు. పావియేన్ఱన్నై - పాపియైననన్ను, అడుగిన్ఱ - బాధించుచున్న, కమలక్కణ్ణదు - పద్మమువంటినేత్రముగలవాఁడును, ఓర్ పవళమ్ - సుందరమైనపగడమువంటి, వాయ్ - అధరముగలవాఁడునైన, మణియే - నీలరత్నమువంటితిరుమేను గలవాఁడా! ఆవియే - (నా) ప్రాణభూతుఁడా! అముదే - భోగ్యభూతుఁడా! అలైకడల్ - అలలుకొట్టుచున్న సముద్రమును, కడైన్ద - చిలికిన, అప్పనే - ఓస్వామీ! కాణుమాఱు - (నేను) సేవించునట్లు, అరుళాయ్ - కృపఁజేయుమా.

తా॥ నన్నుమోహపెట్టుచున్న దివ్యావయవసౌన్దర్యముగల ఓశ్రియఃపతీ! సాకల్యస్తభోగ్యుఁడవైననీవు, పురుషకారభూతులైన శ్రీభూనీళాదేవులతోను నిత్యసూరులతోను కూడియున్నను నన్నిదివఱకురక్షించకయున్నావు. నేనిఁకమీదనైనను నిన్ను సేవించునట్లు నన్ననుగ్రహింపుమాయని. ౧.

కాణుమాఱరుళాయెన్ఱెన్ఱేకలఙ్గి కణ్ణనీరలమర*వినైయేన్*
పేణుమాఱెల్లామ్పేణి నిన్పెయరేపిదఱ్ఱుమాఱరుళెనక్కన్దో*
కాణుమాఱరుళాయ్కాగుత్తాకణ్ణా తొణ్డనేన్ కఱ్పగక్కనియే*
పేణువారముదే పెరియతణ్పునల్ శూழ் పెరునిలమెడుత్తపేరాళా. ౨.

అ॥ కాణుమాఱు - సేవించునట్లు, అరుళాయ్ - కృపఁజేయుమా, ఎన్ఱెన్ఱే - అనిపలుమాఱుచెప్పి, కలఙ్గి - వ్యాకులపడి, కణ్ణనీర్ - కన్నీళ్ళు, అలమర - ప్రవహించునట్లు, వినైయేన్ - పాపియైననేను, పేణుమాఱెల్లామ్ - ఆశపడతగిన అన్నివిధములచేతను, పేణి - ఆశపడి, నిన్పెయరే - నీతిరునామములనే, పిదఱ్ఱుమాఱు - జల్పించునట్లు, ఎనక్కు - నాకు (నీవు

చేసిన), అరుళ్ - అనుగ్రహము, అన్దో - అయ్యో ? కాగుత్తా-శ్రీరాముఁడా ! కణ్ణా - ఓకృష్ణుడా! తొణ్డనేన్ - చపలుఁడనైననాకు, కఱ్పగక్కనియే-కల్పవృక్షముయొక్క ఫలమువంటివాఁడా ! పేణువార్ - ఆశించువారికి, అముదే - అమృతమువలెభోగ్యభూతుఁడా ! పెరియ - గొప్పదై - తణ్ - చల్లనైన, పునల్ - జలముచే, శూழ் - చుట్టఁబడిన (జలమందుమునిగియున్న), పెరు నిలమ్ - గొప్పభూమిని, ఎడుత్త - ఎత్తుకొనివచ్చిన, పేరాళా - మహాపురుషుఁడా ! కాణు మాఱు - సేవించునట్లు, అరుళాయ్ - కృపఁజేయుమా.

తా॥ ఓసర్వేశ్వరుఁడా ! నేనిదివఱలోనిన్ను సేవింపవలయునని యెన్నివిధములుగానాశించి నను నీతిరునామములను జెప్పుచుకణ్ణీళ్ళుప్రవహింపఁజేసికొని మోహించునట్లుచేసితివి. ఇదియే నీవునాయందుఁజేసినయనుగ్రహము. ఇఁకమీఁదనైనను నేను సేవించునట్లనుగ్రహింపుమాయని. ౨.

ఎడుత్తపేరాళన్ నన్దగోపన్ తన్నుయిర్ చ్చిఱువనే*అశోదైక్కడుత్తపేరిన్బక్కులవిళఙ్గళిత్తే యడియనేన్ పెరియవమ్మానే*
కడుత్తపోరవుణనుడలిరుపిళవా కైయ్యుగిరాణ్డవెఙ్గడలే*
అడుత్తదోరురువాయిన్ఱునీవారా యెఙ్గనమ్ తేఱువరుమరే. ౩.

అ॥ ఎడుత్త - (నిన్ను) ఎత్తుకొనిన, పేరాళన్ - భాగ్యవంతుఁడైన, నన్దగోపన్ తన్ - నన్దగోపునియొక్క, ఇన్ ఉయిర్ - మంచిప్రాణభూతుఁడైన, శిఱువనే - చిన్నవాఁడా ! అశోదైక్కు - యశోదాదేవికి, అడుత్త - (పుట్టకుండ) సమీపించివచ్చిన, పేరిన్బమ్ - గొప్పయానన్దమునిచ్చువాఁడా! అడియనేన్ - దాసునికి, పెరియ - పొందుటకశక్యమైన, అమ్మానే - ఓస్వామీ! పోర్ - యుద్ధమందు, కడుత్త - దుఃఖదగల, అవుణన్ - హిరణ్యాసురునియొక్క, ఉడల్ - శరీరమును, ఇరుపిళవా - రెండుబద్దలగునట్లు, కైఉగిర్ - శ్రీహస్తమందున్నగోళ్ళను- ఆణ్డ - రక్షించిన, (కల) ఎఙ్గడలే - నాసముద్రమా ! ఇన్ఱు - ఇప్పుడు, అడుత్తదు - అనురూపమైన, ఓర్ఉరువాయ్ - ఒకతిరుమేనుగలవాఁడవై, నీ - నీవు, వారాయ్ - వేంచేయకనున్నావు. ఉమర్ - నీభక్తులు, ఎఙ్గనమ్ - ఎటుల, తేఱువర్ - విశ్వసింతురు.

తా॥ యశోదానందగోపాదులకు మిక్కిలి సులభుఁడవైయుండియు ఆశ్రితుల విరోధియైన హిరణ్యాసురుని జంపియుభక్తపరాధీనుఁడవైన నీవునాకందకుండ యున్నయెడల తక్కినభక్తులు నిన్నెట్లునమ్ముదురని. ౩.

ఉమరుగన్దుగన్దవురువమ్నిన్నురువమాగి యున్ఱునక్కన్బరానా
ఉవర్*రగన్దమర్న్దశెయ్గై యున్మాయై యఱివొన్ఱుమ్శఙ్గిప్పన్వినైయేన్*
అమరదుపణ్ణియగలిడమ్పుడై శూழ்ఢుపడై యవిత్తవమ్మానే*
అమరర్దమముదేయశురర్గళ్ నఞ్జే యెన్నదై యారుయిరేయో. ౪.

అ॥ అదు - అట్టిప్రసిద్ధమైన, అమర్ - యుద్ధమును, పణ్ణి - చేసి, అగల్ - విశాలమైన, ఇడమ్పుడై - భూమియంతయు, శూழ் - వ్యాపించియున్నదియు, అడు - బాధించునట్టిది యునైన, పడై - సేనను, అవిత్త - నశింపఁజేసిన, అమ్మానే - ఓస్వామీ ! అమరర్తమ్ - దేవత

లకు, అముదే - జీవనహేతువైనఅమృతమువంటివాఁడా ! అశురర్‌గళ్ - అసురులకు, నఞ్జే - విషమువంటివాఁడా ! ఎన్నుడై - నాయొక్క, ఆరుయిరేయో - పూర్ణప్రాణభూతుఁడా ! ఉమర్ - నీభక్తులు, ఉగన్దుగన్ద - మిక్కిలియాదరించిన, ఉరువమ్ - రూపము, నిన్ ఉరువమాగి - నీకుతిరుమేనియై, ఉన్ తనక్కు - నీయందు, అన్బరానారవర్ - ప్రీతిగలవారు, ఉగన్దు - సన్తోషించి, అమర్‌న్ద - అనన్యప్రయోజనములై, శెయ్‌గై - చేయదగిన, ఉన్‌మాయై - నీయొక్క ఆశ్చర్యచేష్టితములవిషయమై, అఱివు ఒన్ఱుమ్ - జ్ఞానమొకటినే, వినైయేన్ - పాపముగలనేను, శఙ్గిప్పన్ - సన్దేహించుచున్నాను.

తా॥ ఆశ్రితులవిరోధులను బోఁగొట్టి వారిని రక్షించి నాకుధారకుఁడవైయున్న నీయొక్క రూపచేష్టితములన్నియు ఆశ్రితపరతన్త్రములని యిదివఱకు నెంచియున్న నేనిప్పుడు నాపాపముచే వాద్యఃఖమునుబోఁగొట్టనందున ఆశ్రితపారతన్త్ర్యమనెడిగుణము నీకిప్పుడున్నదో లేదోయని సందేహించుచున్నానని. ౪.

అరుయిరేయోవగలిడముழுదుమ్ పడైత్తిడన్దుణ్డుమిழ்న్దళన్ద*
పేరుయిరేయోపెరియనీర్‌పడైత్తఱ్ఱుత్తెన్దుకడైన్దడైత్తుడైత్త*
శీరియరేయోమనిశర్‌క్కుత్తేవర్‌పోలత్తేవర్‌క్కుమ్‌తేవావో*
ఓరుయిరేయోవులగఙ్గట్కెల్లామున్నైనానెఙ్గువన్దుఱుగో. ౫.

అ॥ ఆరుయిరేయో - సంపూర్ణప్రాణభూతుఁడా ! అగల్ - విశాలమైన, ఇడమ్‌ముழுదుమ్ - భూమియంతను, పడైత్తు - సృజించి, ఇడన్దు - విడదీసి, ఉణ్డు - మ్రింగి, ఉమిழ்న్దు - బయలుపఱచి, అళన్ద - కొలిచిన, పేరుయిరే - గొప్పవాఁడా ! పెరియనీర్ - మహాజలమును, పడైత్తు - సృజించి, అఙ్గు - ఆజలమందు, ఉఱైన్దు - పవ్వళించి, అదు - ఆసముద్రమువంటి సముద్రమును, కడైన్దు - చిలికి, అడైత్తు - సేతువునుకట్టి, ఉడైత్త - (ఆసేతువును) తెగకొట్టిన, శీరియరే - ఆశ్రితరక్షణోపయోగియైనకల్యాణగుణములుగలవాఁడా ! మనిశర్‌క్కు - మనుష్యులకు, తేవర్‌పోల - దేవతలువలె, తేవర్‌క్కుమ్ - దేవతలకును, తేవా - దేవతయైనవాఁడా ! ఉలగఙ్గట్కెల్లామ్ - లోకములన్నింటికిని, ఓరుయిరే - ఒకయాత్మయైనవాఁడా ! ఉన్నై - నిన్ను, నాన్ - నేను, ఎఙ్గువన్దు - ఎచ్చటవచ్చి, ఉఱుగో - పొందెదను ?

తా॥ నాప్రాణనాథుఁడా ! సకలజగత్తును సృజించియు, పాతాళమందున్న భూమినివిడదీసియు, ప్రళయకాలమందు తనగర్భమందుంచుకొని రక్షించియు, సృష్టికాలమందు బయలుపఱచియు, వామనావతారమందు కొలిచియు, ఇట్లనేకవిధములుగా ప్రాణులనురక్షించియు, క్షీరాబ్ధినిజిలికి దేవతలకమృతమునిచ్చి వారిమనోరథమునుపూరించియు, సీతాపిరాట్టికొఱకై సేతుకట్టి పిరాట్టినితీసికొనివచ్చియు, ఆమార్గముగా రాక్షసులివతలికిరాకుండ ఆసేతువునుపడకొట్టియు, ఇట్లుసకలమైన ఆశ్రితులనురక్షించియుందఱికి నంతరాత్మయైయున్నవాఁడా ! ఐశ్వర్యసౌందర్యబుద్ధిబలములు మొదలగువానిచే మనుష్యులకంటె దేవతలుగొప్పవారయినట్లు సమస్తదేవతలకంటె మిక్కిలి గొప్పవాఁడా ! ఇటువంటి నిన్ను నేను వెదకికొనివచ్చి పొందుట యసాధ్యముగనుక నీవే వచ్చి నన్ను రక్షింపుమాయని. ౫.

ఎఙ్గువన్దుఱుగోవన్నై యాళ్వానే యేழులగఙ్గళుమ్నీయే*
అఙ్గవర్క్కమైత్త తెయ్వముమ్నీయే యవఱ్ఱువై కరుమముమ్నీయే*
పొఙ్గియపుఱమ్బాల్ పొరుళుళవేలు మవ్వైయుమోనీయిన్నే యానాల్*
మఙ్గియవరువామ్నేర్ప్పముమ్నీయే వాన్ పులనిఱన్దదుమ్నీయే. ౬.

అ॥ ఎన్నై యాళ్వానే - నన్నేలినవాఁడా! ఏழులగఙ్గళుమ్ - సప్తలోకములకును, నీయే - నీవేనిర్వాహకుఁడవైనవాఁడా! అఙ్గు - ఆలోకములయందు, అవర్క్కు - ఆప్రాణులకు (ఐశ్వర్యములనిచ్చుటకై), అమైత్త - ఏర్పఱచిన, తెయ్వముమ్ - దేవతలకును, నీయే - నీవేనిర్వాహకుఁడవైనవాఁడా! పొఙ్గియ - వృద్ధిపొంది, పుఱమ్బాల్ - (అణ్డముకంటె) బైటనున్న, పొరుళ్ - మహదాదితత్త్వములు, ఉళవేలుమ్ - ఉన్నను, అవ్వైయుమ్ - ఆవస్తువులకును, నీ - నీవేనిర్వాహకుఁడవైనవాఁడా! మఙ్గియ - (ఈజగత్తు) నశించిన (తరువాతనున్న), అరువామ్ - సూక్ష్మమైన, నేర్ప్పముమ్ - అవ్యక్తతత్త్వమునకును, నీయే - నీవేనిర్వాహకుఁడవైనవాఁడా! వాన్ - (తనజ్ఞానముచే) వ్యాపించియున్న, పులనిఱన్దదుమ్ - చక్షురాదీన్ద్రియముల కవిషయమైనజీవులకును, నీయే - నీవే నిర్వాహకుఁడవైనవాఁడా! ఇన్నే యానాల్ - (నీవు) ఇట్లయినయెడల, నాన్ - నేను, ఉన్నై - నిన్ను, ఎఙ్గువన్దు - ఎచ్చటవచ్చి, ఉఱుగో - పొందెదను?

తా॥ సమస్తమైన లోకములకును దేవతలకును తత్త్వములకును జీవులకును నిర్వాహకుఁడవైన ఓగొప్పవాఁడా! నాయత్నముచే నిన్ను నేనుపొందఁజాలనని. ౬

ఇఱన్దదుమ్నీయేయెదిర్న్దదుమ్నీయే నిగழ్వదోనీయిన్నే యానాల్*
శిఱన్దనిన్ తన్మైయదువిదువుదువెన్ఱు ఉన్నైత్తెళిక్కిల్లేన్ యాన్*
కఱన్దపాల్ నెయ్యే నెయ్యినిన్ శువైయే కడలినుళముదమే *అముదిల్
పిఱన్దవిన్ శువైయే శువైయదుపయనే పిన్నైతోళ్ మణన్దపేరాయా. ౭.

అ॥ కఱన్ద - (అప్పుడు) పిండిన, పాల్ - పాలువంటివాఁడా! నెయ్యే - నెయ్యివంటివాఁడా! నెయ్యిన్ - నేతిలోనున్న, ఇన్ - భోగ్యమైన, శువైయే - రసస్వరూపుఁడా! కడలినుళ్ - సముద్రమందుబుట్టిన, అముదమే - అమృతమువంటివాఁడా! అముదిల్ - అమృతమందు, పిఱన్ద - పుట్టిన, ఇన్ శువైయే - శ్రేష్ఠమైనరసస్వరూపుఁడా! శువైయదు - ఆయారసముచే గలిగిన, పయనే - పురుషార్థస్వరూపుఁడా! పిన్నై - నప్పిన్నపిరాట్టియొక్క, తోళ్ - భుజములతో, మణన్ద - సంశ్లేషించిన, పేరాయా - గొప్పవాఁడా! ఇఱన్దదుమ్ - భూతకాలమందున్న పదార్థములును, నీయే - నీప్రకారములే. ఎదిర్న్దదుమ్ - భవిష్యత్కాలమందున్న వస్తువులును, నీయే - నీశరీరములే. నిగழ్వదు - వర్తమానకాలమందున్నవియు, నీయే - నీశేషములే. ఇన్నే యాల్ - ఇట్లయినయెడల, అదు - దూరస్థములును, ఇదు - సమీపస్థములును, ఉదు - మధ్యస్థములును, శిఱన్ద - శ్లాఘ్యమైన, నిన్ తన్మై - నీస్వభావములు (నీయధీనములు), ఎన్ఱు - అనియెడి, ఉన్నైత్తెళిక్కిల్ - తత్త్వజ్ఞానమును, [illegible] - [illegible], [illegible] - [illegible]

తా॥ ఓ స్వామీ! నీవుసకలచరాచరములకును శేషియనితలంచి నేనిదివఱలో జీవించితిని. నీవిప్పుడు నన్ను రక్షించనందున నీవు సర్వశేషియవునో కాదోయని సన్దేహించుచున్నానని. ౭.

మణాన్దపేరాయామాయత్తాల్ ముళ్ళుదుమ్ వల్వినైయేనై యీర్ గిన్ఱ*
కుణఙ్గళైయుడై యాయశురర్ వన్గైయర్ కూత్తామే కొడియవుళ్ళుయర్ త్తాయ్*
పణఙ్గళాయిరముడైయప్పైన్నాగప్పళ్ళియాయ్ పాఱ్కడల్ శేర్ప్పా*
పణఙ్గుమాఱఱియేన్ మనముమ్ వాశగముమ్ శెయ్గైయుమ్ యానునీతానే. ౮.

అ॥ మాయత్తాల్ - అభినివేశముచే, మణాన్ద - (నప్పిన్నపిరాట్టితో) సంశ్లేషించిన, పేరాయా - గోవ్వగొల్లవాఁడా! వల్ వినైయేనై - క్రూరమైనపాపముగలనన్ను, ఈర్ గిన్ఱ - బద్ధులుచేయు చున్న, ముళ్ళుదుమ్ - సంపూర్ణములైన, కుణఙ్గళై ఉడైయాయ్ - కల్యాణగుణములుగలవాఁడా! వన్ కైయర్ - బలిష్ఠమైనచేతులుగల, అసురర్ - అసురులకు, కూత్తామే - మృత్యువైనవాఁడా! కొడియ - (విరోధులయెడ) క్రూరుఁడైన, పుళ్ - గురుత్మంతుని, ఉయర్ త్తాయ్ - ధ్వజముగా నెత్తినవాఁడా! పైం - విశాలములైన, ఆయిరమ్ పణఙ్గళ్ ఉడైయ - వెయ్యిఫణములుగల, నాగమ్ - ఆదిశేషుని, పళ్ళియాయ్ - పడకగాగలవాఁడా! పాఱ్కడల్ - క్షీరాబ్ధియందు, శేర్ప్పా - పవ్వళించినవాఁడా! మనముమ్ - మనస్సును, వాశగముమ్ - వాక్కును, శెయ్గైయుమ్ - వ్యాపారముజేయుచున్నశరీరమును, యానుమ్ - నేనును, నీతానే - (వీనికి) నీవే నిర్వాహకుఁడవైన వాఁడా! పణఙ్గుమాఱు - నిన్నాశ్రయించుటకుపాయమును, అఱియేన్ - ఎఱుఁగకయున్నాను.

తా॥ శత్రుసంహారకుఁడవై యాశ్రితరక్షకుఁడవై క్షీరాబ్ధియందు శేషశయ్యమీఁద పవ్వళించిన ఓ స్వామీ! నేనున్ను నామనోవాక్కాయములున్ను నీయధీనములుగానుండగా నేను స్వతన్త్రించి నిన్నెట్టుల నాశ్రయించెదనని. ౮.

యానునీతానేయావదో మెయ్యే యరునరగవైయుమ్ నీయానాల్*
వానుయరిన్బమెయ్దిలెన్ మత్తైనరగమేయెయ్దిలెననిలుమ్*
యానునీతానాయ్ త్తెళిదోఱుమ్ నన్నుమజ్ఞువన్ నరగమ్నానడైదల్*
వానుయరిన్బమ్మన్నివీత్తిరున్దా యరుళునిన్ తాళ్గళై యెనక్కే. ౯.

అ॥ యానుమ్ - నేనును, నీతానే - నీకుశేషభూతుఁడను, ఆవదు - అనెడియర్థము, మెయ్యే - యథార్థమే. అరు - క్రూరమైన, నరగవైయుమ్ - నరకములును, నీయానాల్ - నీదియేయైనయెడల, వాన్ - పరమపదమందు, ఉయర్ - వర్ధిల్లుచున్న, ఇన్బమ్ - సుఖమును, ఎయ్దిలెన్ - పొందుటచేతనేమి, మత్తై - అంతకంటెవిలక్షణమైన, నరగమే - నరకమునే, ఎయ్దిలెన్ - పొందుటచేతనేమి (రెండుసమానములే), ఎనిలుమ్ - అనియున్నను, యానుమ్ - నేనును, నీతానాయ్ - నీకుశేషభూతుఁడనని, తెళిదోఱుమ్ - తెలిసికొనువప్పుడంతయు, నాన్ - నేను, నరగమ్ - నరకమును, అడైదల్ - పొందుటయందు, నన్నుమ్ - మిక్కిలి, అజ్ఞువన్ - భయపడుచున్నాను. వాన్ - పరమపదమందు, ఉయర్ - వర్ధిల్లుచున్న, ఇన్బమ్ - సుఖమును, మన్ని - కలవాఁడవై, వీత్తిరున్దాయ్ - వేంచేసియున్నవాఁడా! నిన్ తాళ్గళై - నీశ్రీపాదములను, ఎనక్కే - నాకు, అరుళ్ - కృపచేయుమా.

తా॥ ఓస్వామీ! నేనునీవాఁడనే; పరమపదమున్ను నరకమున్ను నీయొక్క విభూతులే. ఇందుకుసందేహము లేదు. నీవిభూతియైన పరమపదమందున్నను నరకమందున్నను నాకొకటియే. అయినను ఈసంసారమందున్నయెడల నీవు నాకు శేషియనెడిజ్ఞానమునశించును గాన నాకీసంసారమును దొలగించి పరమపదము నివ్వవలయునని. ౯.

తాళ్గళై యెనక్కే తలైత్తలై చ్చిఱప్ప త్తన్ద పేరుదవిక్కై మ్మాఱా*
తోళ్గళై యార త్తళువి యెన్నుయిరై యఱవిలై శెయ్దనన్ శోదీ*
తోళ్గళాయిరత్తాయ్ముడిగళాయిరత్తాయ్ తుణై మలర్ క్కణ్గళాయిరత్తాయ్*
తాళ్గళాయిరత్తాయ్పేర్గళాయిరత్తాయ్ తమియనేన్ పెరియవప్పనే. ౧౦.

అ॥ శోదీ - ఓ తేజస్స్వరూపుఁడా! తోళ్గళాయిరత్తాయ్ - వెయ్యిభుజములుగలవాఁడా! ముడిగళాయిరత్తాయ్ - వెయ్యిశిరస్సులుగలవాఁడా, తుణై - చేరియున్న, మలర్ - పుష్పములవలె నున్న, కణ్గళాయిరత్తాయ్ - వెయ్యినేత్రములుగలవాఁడా! తాళ్గళాయిరత్తాయ్ - వెయ్యితిరువడిశళ్లుగలవాఁడా! పేర్గళాయిరత్తాయ్ - వెయ్యితిరునామములుగలవాఁడా! తమియనేన్ - ఒంటరినైననాకు, పెరియవప్పనే - గొప్పఉపకారకుఁడవైనఓస్వామీ! తాళ్గళై - నీశ్రీపాదములను, ఎనక్కే - నాకే, తలైత్తలై - పైపైన, శిఱప్ప - పరిపూర్ణముగా, తన్ద - ఇచ్చిన, పేరుదవిక్కు - గొప్పఉపకారమునకు, కైమ్మాఱా - ప్రత్యుపకారముగా, ఎన్నుయిరై - నాయాత్మను, తోళ్గళై - భుజములను, ఆర - చక్కగా, తళువి - కౌగలించుకొని, అఱవిలైశెయ్దనన్ - నీకేయగునట్లుసమర్పించితిని.

తా॥ వెయ్యిహస్తపాదాది దివ్యావయవములనున్ను వెయ్యితిరునామములనున్ను గల ఓస్వామీ! నామనోరథప్రకారముగా నీతిరువడిశళ్ళను నాకిచ్చినఉపకారమునకు ప్రత్యుపకారముగా నాయాత్మను నీకుసమర్పించితినని. ౧౦.

‡‡ పెరియవప్పనై ప్పిరమనప్పనై యురుత్తిరనప్పనై *మునివర్
క్కురియవప్పనై యమరరప్పనై యులగుక్కోర్ తనియప్పన్ఱన్నై*
పెరియవణ్కురుగూర్ వణ్శడగోపన్ పేణినవాయిరత్తుళ్ళుమ్*
ఉరియశొల్ మాలై యివై యుమ్పత్తివఱ్ఱా లుయ్యలామ్తొణ్డీర్ నఙ్గట్కే.

అ॥ పెరియవప్పనై - గొప్పస్వామియు, పిరమనప్పనై - బ్రహ్మకుతండ్రియు, ఉరుత్తిరనప్పనై - రుద్రునిసృష్టించినవాఁడును, మునివర్కు - (సనకాది) ఋషులకు, ఉరియవప్పనై - సమీపించినస్వామియు, అమరరప్పనై - దేవతలకునిర్వాహకుఁడును, ఉలగుక్కు - లోకములకు, ఓర్తనియప్పన్ఱన్నై - ఒకఅద్వితీయ నాయకుఁడునునైన సర్వేశ్వరునివిషయమై, పెరియ - గొప్ప, వణ్ - సమ్పత్తుగల, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, వణ్ - ఉదారులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, పేణిన - ఆశపడిసాధించిన, ఆయిరత్తుళ్ళుమ్ - వెయ్యిపాశురములలోను, ఉరియ - తగునైన, శొల్మాలై - శబ్దసన్దర్భముగల, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములనెడి, ఇవఱ్ఱాల్ - వినిచే, తొణ్డీర్ - ఓభక్తులారా! నఙ్గట్కు - మనకు, ఉయ్యలామ్ - ఉజ్జీవించుటకగును.

తా॥ బ్రహ్మాది పిపీలికాంతమైన సమస్తవస్తువులకును స్వామియైన శ్రియఃపతివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీ పదిపాశురముల ననుసంధించి మనమందఱు ముజ్జీవింపవచ్చునని.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్,

జీయర్ తిరువడిగళే శరణమ్

---

## ౨-వ, తిరువాయ్‌మొఴి

---

అవతారిక :—సర్వజ్ఞుఁడైన సర్వేశ్వరుఁడు తమకింతయు ఫలమివ్వనందుకుఁ గారణమేమని యాలోచించి, తమకు సంసారమందాశ నివర్తించనందుచే నామనోరథము పూర్తికాలేదనితలంచి నాయందును నావస్తువులయందును నేను నిరాశుఁడనైతినని యన్యాపదేశముగా సాదించుచున్నారు

‡‡ నఙ్గళ్ వరివళై యాయఙ్గాళో నమ్ముడై యేదలర్ మున్బునాణి*
నుఙ్గట్కుయానొన్ఱురైక్కుమాత్తిరమ్ నోక్కుగిన్ఱేన్ ఎఙ్గుమ్ కాణమాట్టేన్*
శఙ్గమ్ శరిన్దన శాయిழన్దేన్ తడముల్లై పొన్నిఅమాయ్ త్తళర్న్దేన్*
వెఙ్గణ్ పఱవైయిన్ పాగన్ఎఙ్గోన్ వేఙ్గడవాణనై వేణ్డిచ్చెన్ఱే. ౧.

అ॥ వరి - సుందరమైన, వళై - కంకణముగల, నఙ్గళ్ - మనయొక్క, ఆయఙ్గాళో - ఓసఖియలారా! నమ్ముడై - మనయొక్క, ఏదలర్ - శత్రువులైనతల్లులయొక్క, మున్బు-ముందఱ, నాణి - (నాయవస్థనుజెప్పుటకు) సిగ్గుపడి, నుఙ్గట్కు - మీకు, యాన్ ఉరైక్కుమ్ - నేను చెప్పదగిన, ఒన్ఱుమాత్తిరమ్ - ఒకమాటను, నోక్కుగిన్ఱేన్ - విచారించుచున్నాను. ఎఙ్గుమ్-ఏవిధము చేతను, కాణమాట్టేన్ - తెలిసికొనకయున్నాను. వెమ్‌కణ్ - (శత్రువులమీద) క్రూరదృష్టిగల, పఱవైయిన్ - గరుత్మంతుని, పాగన్ - నడిపించుసారథియై, ఎమ్‌కోన్ - మనస్వామియైన, వేఙ్గడవాణనై - వేఙ్కటాచలపతిని, వేణ్డి - (సేవింప) ఆశపడి, శెన్ఱు-వెళ్ళి, శాయ్‌ఇழన్దేన్ - సౌందర్యమునుబోఁగొట్టుకొంటిని. శఙ్గమ్-కంకణములు, శరిన్దన - జారిపోయినవి. తడమ్-విశాలమైన, ముల్లై - స్తనము, పొన్‌నిఅమాయ్ - వివర్ణమై, తళర్న్దేన్ - శిథిలమగునట్లయితిని.

తా॥ ఓసఖియలారా! గరుడవాహనుఁడైన వేంకటనాయకుని సేవింపనాశపడి నాసౌందర్యమును బోఁగొట్టుకొనిననేను, మాతల్లిముందఱ నాయవస్థను సిగ్గుచేతఁజెప్పలేక మీకుజెప్పెదనని యెంతయాలోచించినను చెప్పఁజాలకయున్నానని. ౧.

వేణ్డిచ్చెన్ఱొన్ఱుపెఱుగిఱ్పారి లెన్నుడైత్తోழియర్ నుఙ్గట్కులుమ్*
ఈణ్డిదురైక్కుమ్బడియైయన్ఱో కాణ్గిన్ఱ లేనిడరాట్టియేన్నాన్*
కాణ్డగుతామరైక్కణ్ణన్‌కళ్వన్ విణ్ణవర్‌కోన్ నఙ్గళ్ కోనైక్కణ్డాల్*
ఈణ్డియశఙ్గుమ్‌నిఱైవుమ్‌కొళ్వాన్ ఒత్తనకాలముమ్ కిన్ఱనే. ౨.

అ॥ శెన్ఱు - వచ్చి, ఒన్ఱు - ఒకవరమును, వేణ్డి - యాచించి, పెఱుగిఱ్పారిల్ - పొందదగిన వాళ్లలో (ప్రధానులై), ఎన్నుడైత్తోழియర్ - నాసఖురాలైన, నుఙ్గట్కులుమ్ - మీకుగూడ, ఈణ్డు - ఇప్పుడు, ఇదు - ఈయవస్థను, ఉరైక్కుమ్‌పడియై - చెప్పెడివిధమును, ఇడరాట్టియేన్-

పావముగల, నాన్ - నేను, కాణ్గిన్ఱిలేన్ - చూడకయున్నాను. అన్దో - అయ్యో! కాణ్ తగు - చూడఁదగినదైన, తామరై - పద్మమువంటి, కణ్ణన్ - నేత్రముగలవాఁడును, కళ్వన్ - (నాగుణములను) అపహరించినవాఁడును, విణ్ణవర్ కోన్ - దేవతలకుస్వామియు, నఙ్గళ్ కోన్ - మాస్వామియునైన సర్వేశ్వరుని, కణ్డాల్ - చూచినయెడల, ఈణ్డియ - (వానివద్ద) చేరియున్న, శఙ్గమ్ - కంకణములనున్ను, నిఱైవుమ్ - గుణపూర్తినిన్ని, కొళ్వాన్ - తీసికొనుటకై, ఎత్తనై కాలమ్ - ఎంత కాలముగా, ఇళైక్కిన్ఱేన్ - వాడిపోవుచున్నాను.

తా॥ నన్ను మీరేది యాచించినను నివ్వఁదగిన స్నేహముగల ఓసఖియలారా! నేనెంతయాచించినను మీకివ్వఁదు చెప్పఁదగినమాట లేమియులేవు. నాగుణముల నపహరించిన సర్వేశ్వరుని జూచిన యెడల నాగుణములను దీసికొనివచ్చెదనని యెంతకాలము చూచినను నాకగుపడకయున్నాఁడని.

కాలమిళైక్కిలల్లాల్ వినైయేనానిళైక్కిన్ఱిలన్ కణ్డుకొణ్మిన్*
ఞాలమఱియప్పళిశుమన్దేన్ నన్నుదలీరినినాణిత్తాన్ఎన్*
నీలమలర్ నెడుఞ్జోదిశూழ்న్ద నీణ్డముగిల్ వణ్ణన్ కణ్ణన్ కొణ్డ*
కోలవళైయొడుమామైకొళ్వా నెత్తనై కాలముమ్ కూడచ్చెన్ఱే. 3.

అ॥ నీలమ్ - నల్లనై, మలర్ - వ్యాపించియున్న, నెడుఞ్జోది - గొప్ప తేజస్సుచే, శూழ்న్ద - చుట్టఁబడిన, నీణ్డముగిల్వణ్ణన్ - గొప్ప మేఘమువంటి తిరుమేనుగల, కణ్ణన్ - శ్రీకృష్ణుఁడు, కొణ్డ - అపహరించిన, కోలమ్ - సుందరమైన, వళైయొడు - కంకణములతోఁగూడ, మామై - సౌందర్యమును, కొళ్వాన్ - తీసికొనుటకై, ఎత్తనై కాలముమ్ - చిరకాలముగా, కూడచ్చెన్ఱు - వెంటతిరిగి, ఞాలమఱియ - భూమియంతయెఱుఁగునట్లు, పళి - అపవాదమును, శుమన్దేన్ - పొందితిని. నల్ నుదలీర్ - ఓసుందరముఖులారా! ఇని - ఇఁకమీఁద, నాణిత్తాన్ - సిగ్గుపడి, ఎన్ - ఏమిప్రయోజనము? కాలమ్ - కాలము, ఇళైక్కిలల్లాల్ - వెనుకతీయునేకాని, వినైయేన్ నాన్ - పాపియైన నేను, ఇళైక్కిన్ఱిలన్ - వెనుకతీయను. కణ్డుకొణ్మిన్ - చూడుఁడు.

తా॥ ఓసఖియలారా! నేను సర్వేశ్వరుని సేవించి మంచిధితిని బొందవలయునని వాని వెనుకతిరిగితిరిగి గొప్పఅపవాదమును సంపాదించుకొంటిని. ఇఁకమీఁదసిగ్గుపడి యేమి యుపయోగము లేదు కాలమున్నంతవఱకు నేనాసర్వేశ్వరుని వదలను జూడుఁడని. 3.

కూడచ్చెన్ఱేనినియెన్కొడుక్కేన్ కోల్వళై నెఞ్జత్తొడక్కమెల్లామ్*
పాడఱ్ఱొழிయవిழన్దువైగల్ పల్వళైయార్ మున్ పరిశழிన్దేన్*
మాడక్కొడిమదిళ్ తెన్కుళన్దై వణ్ కుడపాల్ నిన్ఱ మాయక్కూత్తన్*
ఆడల్ పఱవై యుయర్త్త వెల్ పోరాழிవలవనై యాదరిత్తే. ౪.

అ॥ మాడమ్ - మేడలను, కొడి - ధ్వజములను, మదిళ్ - ప్రాకారములనుగల, తెన్ - సుందరమైన, కుళన్దై - తిరుక్కుడన్దయందు, వణ్ - సుందరమైన, కుడపాల్ - పశ్చిమభాగమందు, నిన్ఱ - శయనించియున్నవాఁడును, మాయక్కూత్తన్ - ఆశ్చర్యకరమైనసుందరమైనగమనము గలవాఁడును, ఆడల్ - అందమైనగమనముగల, పఱవై - గరుత్మంతునిచేత, ఉయర్త్త - ఎత్త

పడినవాఁడును, పోర్ - యుద్ధమందు, వెల్ - జయమునుగలుగఁజేయుచున్న, ఆఴి - సుదర్శన మును, వలవన్ - దక్షిణహస్తమందుగలవాఁడునైన శ్రియఃపతిని, అదరిత్తు - కొనియాడి, కూడ చ్చెన్రేన్ - కూడసేవళ్ళితిని; కోల్ వళై - సుందరమైనకంకణము, నెఞ్జమ్ - మనస్సు, తుడక్కు మెల్లామ్ - ఇవిమొదలగన్నింటిని, పాడుఅన్ఱు - నాప్రక్కయందు లేకుండ, ఒఴియ - నశించు నట్లు, ఇఴన్దు - పోగొట్టుకొని, పైగల్ - ప్రతిదినమును, పల్ - అనేకవిధములైన, వళైయార్ మున్ - కంకణములుగలస్త్రీలముందఱ, పరిశు - స్వభావమును, అఴిన్దేన్ - పోగొట్టుకొంటిని; ఇని - ఇంకమీద, ఎన్కొడుక్కేన్ - దేనినియిచ్చెదను ?

తా॥ నేనుసర్వేశ్వరుని సేవింపవాళపడి మనస్సుమొదలగు సమస్తములను పోఁగొట్టు కొంటిని. ఇఁకమీఁద పోఁగొట్టుకొనఁదగినది నావద్దనేమియులేదని. ౪.

ఆఴివలవనై యాదరిప్పు మాఙ్గవన్ నమ్మిల్ వరవుమెల్లామ్*
తోఴియర్గాళ్ నమ్ముడైయమేతాన్ శొల్లువదోవిఙ్గరియదుతాన్*
ఊఴిదోఱూఴియొరువనాగ నన్గుణర్ వార్క్కుముణరలాగా*
శూఴలుడైయశుడర్కొళాది త్తొల్లైయఞ్జోదినినైక్కుఙ్గాలే. ౫.

అ॥ తోఴియర్గాళ్ - ఓసఖియలారా ! నినైక్కుఙ్గాల్ - విచారించినయెడల, నన్గు- చక్కగా, ఉణర్వార్క్కుమ్ - తెలిసికొనఁదగినవారికిని, ఊఴిదోఱూఴి - కాలమంతయు, (ధ్యానించినను), ఒరువనాగ - ఇట్టిస్వభావముగలవాఁడని, ఉణరలాగా - తెలిసికొనుటకసాధ్యుఁ డును, శూఴలుడై - మంచిఉపాయములుగలవాఁడును, శుడర్కొళ్ - తేజస్సుమొదలగు గుణ ములు గలవాఁడును, ఆది - జగత్కారణుఁడును, తొల్లై - అనాదియై, అమ్-సుందరమైన, శోది- తేజోమయ విగ్రహముగలవాఁడును, ఆఴివలవనై - సుదర్శనమును దక్షిణశ్రీహస్తమందుగలవాఁడు నైన శ్రియఃపతిని, ఆదరిప్పుమ్ - ఆశ్రయించుటయు, అఙ్గు - అప్పుడు, అవన్ - ఆశ్రియఃపతి, నమ్మిల్ - మనవద్ద, వరవుమ్ - వచ్చుటయు, ఎల్లామ్ - ఇవియన్నియు, నమ్ముడైయమేతాన్ - మనస్వాధీనమేనా ? ఇఙ్గు - ఈవిషయమందు, శొల్లువదోతాన్-చెప్పుటయైనా, అరిదు-కష్టము?

తా॥ ఎంతజ్ఞానాధికులకుఁగూడ ధ్యానించుటకశక్యమైన మహిమగల శ్రియఃపతినిమనమాశ్ర యించుటయు, వాఁడు మనలను గటాక్షించుటయు, అనాదిసిద్ధములుగాన వానినియిప్పుడు వదల శక్యముకాదు. ఏమియువిచారించక వానిని నిందించుట మీకుచితముకాదని. ౫.

తొల్లైయఞ్జోదినినైక్కుఙ్గా లెన్శొల్లళవన్ఱిమైయోర్తమక్కుమ్*
ఎల్లైయిలాదనకూఴ్ప్పుచ్చెయ్యు మత్తిఱమ్నిఱ్క వెమ్మామైకొణ్డాన్*
అల్లిమలర్త్తణ్డుఴాయుమ్తారా నార్క్కిడుగోవినిప్పూశల్శొల్లీర్*
వల్లివళవయల్శూఴ్కుడన్దై మామలర్క్కణ్వళర్గిన్ఱమాలే. ౬.

అ॥ నినైక్కుఙ్గాల్ - విచారించినయెడల, వల్లి - పుష్పలతలుగలతోటలచేతను, వళమ్ - సమృద్ధమైన, వయల్ - పొలములచేతను, శూఴ్ - చుట్టబడిన, కుడన్దై - తిరుక్కుడన్దయందు, మా - శ్లాఘ్యమైన, మలర్ - పుష్పమువంటి, కణ్ - నేత్రములు, వళర్గిన్ఱానే - మూసుకొని

(వ్యాపించి) యున్నవాఁడును, తొల్లై - అనాదియైన, అమ్ - సుందరమైన, శోది - తేజోమయ విగ్రహముగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, ఎన్ శొల్లళవన్ఱు - నామాటలలోనణిగినవాఁడుకాడు (అపరిచ్ఛిన్నుఁడు), ఇమైయోర్ తమక్కుమ్ - దేవతలకుఁగూడ, ఎల్లైయిలాదన-అంతములేని, కూఴ్ప్పు - సంశయములను, శెయ్యుమ్ - పుట్టించును. అత్తిఱమ్ నిఱ్క - ఆవిధములుండగా, ఎమ్మామై - మా సౌందర్యమును, కొణ్డాన్ - అపహరించెను. అల్లి - పుష్పముగల, మలర్-వికసించియున్న, తణ్ - చల్లనైన, తుఴాయ్ - తిరుత్తుఴాయినికూడ, తారాన్ - ఇవ్వడు. ఇని - ఇఁక మీద, ఆర్ క్కు - ఎవరియొక్క (ముందఱ), పురాశలిడుగో - (మాదుఃఖములను జెప్పి) అఱచెదను?

తా॥ తానెంతదుర్లభుఁడైనను నాకు తనయందాశనుబుట్టించి నాసౌందర్యము నపహరించి తనతిరుత్తుఴాయిమాలనుగూడ నాకివ్వక దుఃఖపెట్టుచున్న సర్వేశ్వరునివదలి మఱియొకరివద్దవెళ్ళి నాదుఃఖమును జెప్పుకొనుట నాకుచితముకాదని. ౬.

మాలరి కేశవన్ నారణన్ శీమాదవన్ కోవిన్దన్ వైగున్దనెన్ఱెన్ఱు*
ఓలమిడ వెన్నైప్పణ్ణివిట్టిట్టొన్ఱుముఱువుమ్ శువడుమ్ కాట్టాన్*
ఏలమలర్ క్కుఴల్ అన్నైమీర్ గాళ్ ఎన్నుడైత్తోழியర్ గాళ్ ఎన్ శెయ్ గేన్*
కాలమ్ పలశెన్ఱుమ్ కాణ్బదాణై యున్గళోడెఙ్గళిడై యిల్లైయే. ౭.

అ॥ మాల్ - (ఆశ్రిత) వ్యామోహముగలవాడు, అరి - పాపములనుహరించువాఁడు, కేశవన్ - సుందరమైన కేశపాశముగలవాఁడు, నారణన్ - సర్వశేషి, శీమాదవన్ - శ్రియఃపతి, కోవిన్దన్ - సులభుఁడు, ఎన్ఱెన్ఱు - అనిపలుమాఱుజెప్పి, ఓలమిడ - ఘోషించునట్లు, ఎన్నై - నన్ను, పణ్ణి - చేసి, విట్టు - విడిచి, ఇట్టు - పడవేసి, ఒన్ఱుమ్ - ఒకప్రకారముగా, ఉరువుమ్ - తిరుమేనునున్ను, శువడుమ్ - (ఒక) గురుతునున్ను, కాట్టాన్ - చూపించకయున్నాడు. ఏలమ్- ఏలకులవలె పరిమళించుచున్న, మలర్ - పుష్పముచేనలఙ్కరింపబడిన, కుఴల్ - కొప్పులుగల, అన్నైమీర్ గాళ్ - ఓతల్లులారా! ఎన్నుడైత్తోழியర్ గాళ్ - నాసఖియలారా! ఎన్ శెయ్ గేన్ - ఏమిచేసెదను? పలకాలమ్ - అనేకకాలములు, శెన్ఱుమ్ - గడచినను, కాణ్బదు - సేవించుట (తప్పదు), ఆణై - సత్యము, ఉఙ్గళోడు - మీతోఁగూడ, ఎఙ్గళిడై - మాకుసంబన్ధము, ఇల్లై - లేదు.

తా॥ ఓబంధువులారా! "సర్వేశ్వరునిగుణములయందు మగ్నమైయున్న నీవు వానిని జూచుటకష్టము. ఆయాశనువదలుము" అని మీరుచెప్పెడిమాటనువినను. నేనెంతకాలమైనను వానినిజూడకతప్పను. ఇఁక మీతో మాకేమియు సంబంధములేదు పొమ్ఁడియని. ౭.

ఇడైయిల్లై యాన్ వళర్త్త కిళిగాళ్ పూవైగళ్ గాళ్ కుయిల్ గాళ్ మయిల్ గాళ్*
ఉడైయనమ్మామైయుమ్ శఙ్గుమ్ నెఞ్జు మొన్ఱుమొழியవొట్టాదు కొణ్డాన్*
అడైయుమ్ వైగున్దముమ్ పాఱ్కడలు మఞ్జనవెఱ్పుమవై నణియ*
కడైయఱప్పాశఙ్గళ్ విట్టపిన్నై యన్ఱి యవనవై కాణ్ కొడానే. ౮.

అ॥ యాన్ వళర్త్త - నేనుపెంచిన, కిళిగాళ్ - ఓచిలుకలారా! పూవైగళ్ గాళ్ - ఓచిన్నచిలుకలారా! కుయిల్ గాళ్ - ఓకోకిలలారా! మయిల్ గాళ్ - ఓ నెమళులారా!

ఇడైయిల్లై - (నాతో మీకేమియు) సంబంధములేదు. నమ్మ్కడైయ - మాయొక్క, మామైయుమ్ - సౌందర్యమునున్ను, కళైయుమ్ - కంకణములనున్ను, నెఞ్జుమ్ - మనస్సునున్ను, ఒన్ఱుమొழியు - ఒకటియుతప్పక, ఒట్టాదు - కొంచెముగూడనుంచక, కొణ్డాన్ - అపహరించెను. అడైయుమ్ - (వాను) చేరియున్న, వైగున్దముమ్ - శ్రీవైకుణ్ఠమును, పాఱ్కడలుమ్ - క్షీరాబ్ధియు, అఞ్జన వెఱ్పుమ్ - అఞ్జనాచలమును (తిరుపతియు) నైన, అవై - అవి, నణియ - సమీపించియున్నవి. పాశజ్గళ్ - సంసారబన్ధము, నడైయుఱ - సవాసనముగా, విట్టపిన్నై యన్ఱి - విడిచినతరువాతనే గాని, అవన్ - అసర్వేశ్వరుఁడు, అవై - వానిని, కాణ్కొడాన్ - చూడనివ్వడు.

తా॥ ఓచెలులారా! సర్వేశ్వరుఁడు నావస్తువులనేమియునుంచక నామనస్సునుగూడ నపహరించెను; వాఁడు వేంచేసియున్న పరమపదము మొదలైన దివ్యదేశములు నాకనుభవింప సిద్ధములుగా నున్నవి. అయినను నాకితరవిషయములయందాశవదలిన తరువాత నివ్వవలయునని వాడు సఙ్కల్పించియున్నాడు. ఇఁక మాకుమీకు నేమియుసంబన్ధములేదు వెళ్ళుఁడియని. ౮.

కాణ్కొడుప్పానల్లనార్క్కుమ్తన్నై కైక్కొశెయప్పాలదోర్ మాయన్దన్నాల్*
మాణ్కుఱళ్కోలవడివుకాట్టి మణ్ణుమ్విణ్ణుమ్నిఱైయమలర్న్ద*
శేణ్శుడర్త్తోళ్గళ్పలతழைత్త తేవపిరాఱ్కెన్నిఱైయినోడు*
నాణ్కొడుత్తేనినియెన్కొడుక్కేన్ ఎన్నుడై నన్నుదల్నఙ్గైమీర్గాళ్. ౯.

అ॥ ఆర్క్కుమ్ - ఎంతజ్ఞానవంతులకును, తన్నై - తనను, కాణ్కొడుప్పానల్లన్ - చూడనివ్వడు, కైశెయ్ - చేతులచేఁజేయదగిన వ్యాపారములను, అప్పాలదు - అతిక్రమించినదై, ఓర్ - అద్వితీయమై, కోలమ్ - సుందరమైన, మాణ్కుఱళ్వడివు - వామనబ్రహ్మచారివేషమును, మాయమ్తన్నాల్ - వఞ్చనచేత, కాట్టి - చూపించి, మణ్ణుమ్ - భూలోకమున్ను, విణ్ణుమ్ - ఆకాశమున్ను, నిఱైయ - నిండునట్లు, వళర్న్ద - పెరిగినవాఁడై, శేణ్ - ఉన్నతములై, శుడర్ - ఉజ్జ్వలంబులైన, పలతోళ్గళ్ - అనేకభుజములను, తழைత్త - సంపూర్ణములు గాగలవాఁడైన, తేవపిరాఱ్కు - దేవాధిదేవునికి, ఎన్నిఱైయినోడు - నాగుణపూర్తితోఁగూడ, నాణ్ - లజ్జను, కొడుత్తేన్ - ఇచ్చితిని. ఎన్నుడై - నాబంధువులై, నల్నుదల్ - సుందగవదనములుగలవారైన, నఙ్గైమీర్గాళ్ - ఓస్త్రీలారా! ఇని - ఇఁకమీఁద, ఎన్కొడుక్కేన్ - దేనినియిచ్చెదను?

తా॥ ఓతల్లులారా! వామనావతారంబెత్తి వంచనచేత మహాబలివద్దనుండి భూమినితీసి దేవతలకిచ్చినప్పుడు పెరిగిన త్రివిక్రమావతార సౌందర్యమందుమగ్నురాలనై నాగుణములన్నింటిని బోఁగొట్టుకొంటిని. ఇఁకమీఁదఁబోఁగొట్టుకొనదగిన దేమియు లేదని. ౯.

ఎన్నుడై నన్నుదల్నఙ్గైమీర్గాళ్ యానినిచ్చెయ్వదెనన్నై ఞాన్నై*
నిన్నిడై యేనల్లేనెన్ఱునీఙ్గి నేమియుమ్శఙ్గుమిరుకైక్కొణ్డు*
పన్నెడుమ్శూழ்శుడర్ఞాయిఱ్ఱోడు పాన్మదియేన్దియోర్కోలనీల*
నన్నెడుమ్కున్ఱమ్వరువదొప్పాన్ నాణ్మలర్ప్పాదమడైన్దదువే. ౧౦.

అ॥ ఎన్నుడై - నాబంధువులైె, నల్ నుదల్ - సుందరవదనములుగల, నఙ్గైమీర్ గాళ్ - ఓ స్త్రీలారా! ఎన్ నెఞ్జు - నామనస్సు, నిన్ ఇడైయేన్ అల్లేన్ ఎన్ఱు - నీసమీపమందుండవలసినవాఁడను కానని, ఎన్నై నీఙ్గి - నన్నువదలి, నేమియుమ్ - సుదర్శనమునున్ను, శఙ్గుమ్ - శ్రీపాఞ్చజన్యమునున్ను, ఇరుకై - రెండుశ్రీహస్తములయందు, కొణ్డు - ధరించినవాఁడై, పల్ - అనేకములై, శుడుమ్ కూర్‌ఱ్ - బహుమారము వెళ్ళి వ్యాపించుచున్న, శుడర్ - కిరణములుగల, ఞాయిఱ్ఱోడు - సూర్యునితోఁగూడ, పాల్ - పాలవలె తెల్లనైయున్న, మది - చంద్రుని, ఏన్ది - ధరించి, ఓర్ - అద్వితీయమై, కోలమ్ - సుందరమై, నీలమ్ - శ్యామమై, నల్ నెడుమ్ - మిక్కిలియున్నతమైన, కున్ఱమ్ - పర్వతము, వరువదొప్పాన్ - వచ్చునట్లున్న సర్వేశ్వరునియొక్క, నాళ్ - అప్పుడు వికసించిన, మలర్ - పద్మమువలెనున్న, పాదమ్ - తిరువడికళ్ళను, అడైన్దదు - పొందినది. యాన్ - నేను, ఇని - ఇఁకమీద, ఎన్ శెయ్వదు - ఏమిచేసెదను?

తా॥ ఓతల్లులారా! చన్ద్రసూర్యులను ధరించిన నీలపర్వతమువలె శఙ్ఖచక్రధరుఁడై విలసిల్లుచున్న సర్వేశ్వరుని సేవించి ఇఁకనీవద్దనుండనని నన్నువదలి నామనస్సు వానితిరువడికళ్ళయందు పోయిచేరినది. గాన ఇప్పుడు మీమాటవినుటకు నుపాయము లేకయున్నానని. ౧౦.

** పాదమడైవదన్ పాశత్తాలే మఱ్ఱవన్ పాశఙ్గళ్ ముఱ్ఱవిట్టు*
కోదిల్ పుగழ్ క్కణ్ణన్ తన్నడిమేల్ వణ్ కురుగూర్ చ్చడగోపన్ శొన్న*
తీదిలన్దాదియోరాయిరత్తుళ్ ఇవైయుమోర్ పత్తిశైయొడుమ్ వల్లార్*
ఆదుమోర్ తీదిలరాగి యిఙ్గుమఙ్గుమెల్లామమైవార్గళ్ తామే. ౧౧.

అ॥ పాదమ్ - శ్రీపాదములను, అడైవదన్ - పొందవలయునని, పాశత్తాలే - ఆశచేత, మఱ్ఱ - తక్కిన, వన్ - క్రూరములైన, పాశఙ్గళ్ - సంగములను, ముఱ్ఱ - సవాసనముగా, విట్టు - వదలి, కోదిల్ - అసారములేని, పుగழ் - కీర్తిగల, కణ్ణన్ తన్ - శ్రీకృష్ణునియొక్క, అడిమేల్ - శ్రీపాదములవిషయమై, వణ్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొన్న - సాధించిన, తీదుఇల్ - దోషములేనివై, అన్దాది - అన్తాదిరూపములై, ఓర్ - అద్వితీయములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఓర్ - విలక్షణములైన, ఇవైపత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, ఆదు - ఏవిధమైన, ఓర్ తీదుమ్ - ఒకదోషమును, ఇలరాగి - లేనివారై, ఇఙ్గుమ్ - ఈలోకమందును, అఙ్గుమ్ - పరలోకమందును, ఎల్లామ్ అమైవార్గళ్ - పూర్ణులైయుందురు.

తా॥ సంసారమునువదలి భగవత్పరులైయున్న నమ్మాళ్వార్లు సర్వేశ్వరునివిషయమై ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు ఇహపరములయందు నొకకొఱతయు లేక పూర్ణులైయుందురని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౩ - వ, తిరువాయ్మొழி.

---

అవతారిక:—నిత్యముక్తులచే మఙ్గళాశాసనముజేయఁబడినవాఁడై పరమపదమందు వేంచేసి యున్న సర్వేశ్వరుఁడిచ్చట యవతారకాలమందు వేంచేసి యున్నప్పుడు వానిసౌకుమార్యమునకు మఙ్గళాశాసనముజేయఁదగినవారెవ్వరు లేరేయని చింతించి, ఇచ్చటకూడవారితోఁగూడ నిత్యముక్తులు వచ్చియున్నారని యనుసంధించి నిశ్చింతులైయగుచున్నారు.

‡ అఙ్గుమిఙ్గుమ్ వానవర్ దానవర్ * యావరుమ్
ఎఙ్గుమినైయెన్ఱున్నై యఱియగిలాదలఱ్ఱి *
అఙ్గమ్ శేరుమ్ పూమగళ్ మణ్మగళాయ్మగళ్ *
శఙ్గుశక్కరక్కైయవనెన్బర్ శరణమే. ౧.

అ॥ అఙ్గుమ్ - ఊర్ధ్వలోకములయందును, ఇఙ్గుమ్ - భూలోకమందును, ఎఙ్గుమ్ - తలిమపాతాళాదిలోకములయందును, వానవర్ - దేవతలును, దానవర్ - రాక్షసులును, యావరుమ్ - తక్కినమనుష్యాదులును, ఉన్నై - నిన్ను, ఇనైయెన్ఱు - ఇట్టిసౌకుమార్యముగలవాఁడు అని, అఱియగిలాదు - తెలిసికొనక, అలఱ్ఱి - (తమరక్షణమునకుపయోగియైననీయొక్కజ్ఞానశక్త్యాదిగుణములను) చెప్పి, పూమగళ్ - శ్రీదేవియు, మణ్మగళ్ - భూదేవియు, ఆయ్మగళ్ - నీళాదేవియు, శేరుమ్ - చేరియున్న, అఙ్గమ్ - తిరుమేనుగలవాఁడును, శఙ్గుశక్కరమ్ - శఙ్ఖచక్రములను, కైయవన్ - శ్రీహస్తమందుగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, శరణమ్ - రక్షకుఁడు, ఎన్బర్ - అనిచెప్పుదురు.

తా॥ ఓస్వామీ! దేవమనుష్యాదులందరును తమతమయభీష్టమును నెరవేర్చుకొనుటయందాసక్తులై, సర్వేశ్వరుఁడు మనరక్షణకుఁదగిన గుణములుగలవాఁడు; అచ్చటనే శ్రీభూనీళాదేవులు పురుషకారభూతులైయున్నారు; విరోధులను బోఁగొట్టుటకు శఙ్ఖచక్రములున్నవి; గానవాఁడే మనకు రక్షకుఁడని చెప్పుదురేగాని నీసౌకుమార్యమునకు మంగళాశాసనముజేయువారెవరులేరని.

శరణమాగియ నాన్మఱై నూల్గళుమ్శారాదే *
మరణమ్తోఱ్ఱమ్ వాన్పిణిమూప్పొడివైమాయ్త్తోమ్ *
కరణపల్పడై పఱ్ఱఅవోడుమ్కనలాழி *
అరణత్తిన్ పడైయేన్దియ ఈశఱ్కాళాయే. ౨.

అ॥ శరణమాగియ - (ఐశ్వర్యాదులకు) ఉపాయములనుపదేశించుచున్న, నాల్మఱై - నాలుగువేదములనెడి, నూల్గళుమ్ - శాస్త్రములయందును (ప్రతిపాదింపఁబడిన ఐశ్వర్యాదులను), శారాదే - పరిగ్రహింపక, కరణమ్ - ఉపకరణములుగలవై, పల్ - అనేకములైన, పడై - (శత్రు) సేనలు, పఱ్ఱఅ - నిశ్శేషముగా, ఓడుమ్ - పఱుగెత్తునట్లు, కనల్ - జ్వాలగొట్టుచున్న, అరణ్ - (ఆశ్రిత) రక్షకమైన, ఆழி - సుదర్శనమనెడి, తిణ్పడై - దృఢమైనఆయుధమును, ఏన్దియ - ధరించిన, ఈశఱ్కు - సర్వేశ్వరునికి, ఆళాయ్ - దాసులమై, మరణమ్ -

తా॥ ఓస్వామీ ! ప్రళయకాలమందు సకలజగత్తులనారగించి వటదళమందు చిన్నబిడ్డవై పవ్వళించిన నీసాహసమునుదలంచి భయపడుచున్న నాకొకక్షణమును నొకయుగముగా తోచు చున్నదని. ౩,

కొడియార్ మాడ క్కోళూరగత్తుమ్ పుళింగుడియుమ్*
మడియాదిన్నే నీతుయిల్ మేవిమగిళ్న్దదుతాన్ *
అడియారల్లల్ తవిర్త్తవశైవో వస్త్తేల్ *ఇ
ప్పడితాన్నీణ్ణుతావియ వశైవో పణియాయే. ౪.

అ॥ కొడి - ధ్వజములచేత, ఆర్ - నిండియున్న, మాడమ్ - గృహములుగల, కోళూరగత్తుమ్ - తిరుక్కోళూరందును, పుళింగుడియుమ్-తిరుప్పుళింగుడియందును, మడియాదు-చలింపక, ఇన్నే - ఇదేవిధముగా, నీ - నీవు, తుయిల్ మేవి - నిదురపోయి, మగిళ్న్దదుతాన్ - సంతోషించినది, అడియార్ - దాసులయొక్క, అల్లల్ - దుఃఖములను, తవిర్త్త - పోగొట్టిన, అశైవో - ఆయాసముచేతనా ? అన్ట్రేల్ - లేక, ఇప్పడితాన్ - ఈభూమిని, నీణ్డు - పెరిగి, తావియ - కొలిచిన, అశైవో - ఆయాసముచేతనా ? పణియాయ్ - చెప్పుము.

తా॥ ఓశ్రియఃపతీ ! నీవుతిరుక్కోళూరునందును, తిరుప్పుళింగుడియందును పవ్వళించినది, నీకు రావణాదిసంహారముచేగలిగిన శ్రమచేతనా ? లేకత్రివిక్రమావతారమందులోకములను గొలిచిన శ్రమచేతనా ? చెప్పుమని. ౪.

పణియావమరర్ పణివుమ్పణ్బుమ్తామేయామ్*
అణియారాళియుమ్ శఙ్గుమేన్దుమవర్ కాణ్మిన్*
తణియావెన్నోయులగిల్ తవిర్ప్పాన్*తిరునీల
మణియార్ మేనియోడెన్మనమ్శూళ్వరువారే. ౫.

అ॥ పణియా - ఇతరదేవతలనాశ్రయించని, అమరర్ - నిత్యసూరులయొక్క, పణివుమ్ - ఆశ్రయణమునకును, పణ్బుమ్ - జ్ఞానాదిగుణములకును, తామేయామ్ - తామేవిషయమైనవారై, అణిఆర్ - సౌందర్యముచేపూర్ణమైన, ఆళియుమ్ - సుదర్శనమును, శఙ్గుమ్ - శ్రీపాంచజన్యమును, ఏన్దుమ్ - ధరించిన, అవర్ కాణ్మిన్ - వారేసుమీ, తణియా - నాశములేనిదై, వెమ్ - క్రూరమైన, నోయ్ - అవిద్యాదివ్యాధులను, తవిర్ప్పాన్ - తీర్చుటకై, తిరుఅర్ - సౌందర్యపూర్ణమై, నీలమణి - నీలరత్నమువలెనున్న, మేనియోడు - తిరుమేనుతోఁగూడ, ఎన్ మనమ్ - నామనస్సు, శూళ - భ్రమించునట్లు, ఉలగిల్ - ఈలోకమందు, వరువార్ - అవతరింతురు.

తా॥ నిత్యసూరులచే మఙ్గళాశాసనముజేయపడుచు శఙ్ఖచక్రాది దివ్యాయుధధరుఁడై పరమపదమందు వేంచేసియున్న సర్వేశ్వరుఁడు, మనుష్యులకజ్ఞానాదులను బోఁగొట్టుటకై శత్రుభూయిష్ఠమైన భూలోకమందవతరించినదానిని దలంచి నామనస్సు మిక్కిలి భయపడుచున్నదని. ౫.

వరువార్ శెల్వార్ వణ్పరిశార త్తిరున్ద*ఎన్
తిరువాళ్ మార్వ త్తెన్నై తిఱమ్శొల్లార్ శెయ్వదెన్*
ఉరువార్ శక్కరమ్ శఙ్గుశుమన్దిఙ్గుమ్మోడు*
ఒరుపాడుళల్వా నోరడియానుముళనేన్తే. ౬.

అ॥ వరువార్ - వచ్చుచున్నవారును, శెల్వార్ - పోవుచున్నవారునైన ఓజనులారా! వణ్ - సుందరమైన, పరికారత్తు - తిరుప్పరికారమందు, ఇరున్ద - వేంచేసియున్న, ఎన్ - నాకు స్వామినియైన, తిరు - శ్రీదేవి, వాழ் - నిత్యవాసముజేయుచున్న, మార్వఱ్కు - వక్షస్థలము గలసర్వేశ్వరునికి, ఉరు - సౌందర్యముచే, ఆర్ - పూర్ణమైన, శక్కరమ్ - సుదర్శనమునున్న, శఙ్గు - పాంచజన్యమునున్న, శుమన్దు - ధరించుకొని, ఇఙ్గు - ఈలోకమందు, ఉమ్మోడు - మీతోఁగూడ, ఒరుపాడు - ఒకపార్శ్వమందు, ఉழల్వాన్ - నిత్యముగాసంచరించువాఁడైన, ఓరడియానుమ్ - ఒకదానుఁడును, ఉళన్ - ఉన్నాడు, ఎన్ఱు - అని, ఎన్ తిఱమ్ - నావిధమును, శొల్లార్ - చెప్పకపోతిరి, ఎన్ శెయ్వేదు - ఏమిచేసెదను?

తా॥ తిరునగరికిని తిరువణ్ పరికారమునకును సంచరించుచున్న ఓమనుజులారా! తిరువణ్ పరికారమందువేంచేసియున్న శ్రియఃపతివద్దకెళ్ళి, నీకు సకలవిధకైఙ్కర్యముజేయుచు నీపార్శ్వమందెల్లప్పుడునుండువా రాழ்వార్లొకరున్నారని చెప్పకపోతిరి. దీనికి నేనేమిచెసెదనని. ౬.

ఎన్నైయొన్ఱు యున్నరార్ కోల త్తిరున్దడిక్కీழ்*
నిన్ఱయాட్చెయ్య నీకొణ్డరుళనినైప్పదుతాన్*
కున్ఱేழ் పారేழ் శూழ் కడల్ ఞాలమ్ముழு వేழுమ్*
నిన్ఱతావియ నీళ్కழలాழித్తిరుమాలే. ౭.

అ॥ ఏழ் కున్ఱు - సప్తకులాచలములుగలదియు, ఏழ் పార్ - సప్తద్వీపములుగలదియు, ఏழ் కడల్ - సప్తసముద్రములచే, శూழ் - చుట్టబడినదియునైన, ఞాలమ్ - భూమిని, ముழு- సంపూర్ణముగా, నిన్ఱే - నిలిచియే, తావియ - కొలిచిన, నీళ్ కழల్ - పొడువైనతిరువడికళ్ళను, ఆழி - శ్రీసుదర్శనమునున్నగల, తిరుమాలే - ఓశ్రియఃపతీ! ఎన్నై - నన్ను, ఉన్-నీయొక్క, ఏర్ ఆర్ - సౌందర్యముచేబూర్ణమైన, కోలమ్ - తిరువాభరణములచే నలఙ్కరింపఁబడినదియు, తిరున్ద - (స్వాభావికమైన) సౌందర్యముగలదియునైన, అడిక్కీழ் - శ్రీపాదములక్రింద, నిన్ఱు - స్థిరముగానుండి, ఆళ్ శెయ్య - కైఙ్కర్యముజేయునట్లు, నీ - నీవు, కొణ్డరుళ - అఙ్గీకరించుటకు, నినైప్పదుతాన్ - సఙ్కల్పించుట, ఎన్ఱు - ఎప్పుడో.

తా॥ త్రివిక్రమావతారంబెత్తి లోకములనుగొలిచిన ఓశ్రియఃపతీ! నీతిరువడికళ్ళయందు కైంకర్యముఁజేయునట్లు నన్నెప్పుడు స్వీకరించెదవో తెలియలేదని. ౭.

తిరుమాల్నాన్ముగన్ శెఞ్జడైయానెన్ఱివర్గళ్*ఎమ్
పెరుమాన్తన్మైయై యారఱిగిఱ్పార్ పేశియో*
ఒరుమాముదల్వా వూழிప్పిరానెన్నైయాళుడై*
కరుమామేనియనెన్ప నాన్ కాదల్కలక్కవే. ౮.

అ॥ తిరుమాల్ - ఓశ్రియఃపతీ! నాన్ముగన్ - బ్రహ్మ, శెఞ్జడైయాన్ - ఎఱ్ఱనిజటనుధరించినరుద్రుఁడు, ఎన్ఱుఇవర్గళ్ - అనిప్రసిద్ధులైనవీరు, ఎమ్పెరుమాన్-సర్వేశ్వరుఁడవైననీయొక్క, తన్మైయై - సౌకుమార్యాది స్వభావములను, అఱిగిఱ్పార్ - తెలిసికొనఁదగినవారెవరు! కాదల్-

అళ, ఎన్ - నామనన్నుకు, కలక్క - వ్యాకులముజేయగా, ఒరు - విలక్షణుండై, నా - ప్రధానుండైన, ముదల్వా - కారణభూతుండా! ఊழி - కాలము మొదలగుసకలపదార్థములకును, పిరాన్ - స్వామియైనవాండా! ఎన్నై - నన్ను, ఆళుడై - దాసుని గాజేసికొనినవాండా! కరు - శ్యామమై, మా - శ్లాఘ్యమైన, మేనియన్ - తిరుమేనుగలవాండా! ఎన్బన్ - అనిచెప్పెదను. పేశియెన్ - ఇట్లుచెప్పి ప్రయోజనమేమి?

తా॥ ఓ శ్రియఃపతీ! బ్రహ్మరుద్రాదిదేవత లెవ్వరునుగూడ నీమహిమ నెఱుంగరు. నేనుగూడ నీగుణములయందు ప్రీతిచే స్వార్థపరుండనై నీతిరునామములను జెప్పితిని గాని నీసౌకుమార్యమును జూచి దానికిందగునట్లు మఙ్గళాశాసనము జేయక పోతినని. ౯.

కలక్కమిల్లా నల్ తవముని వర్ కరై కణ్డోర్ *
తుళక్కమిల్లా వానవ రెల్లామ్ తొழுవార్ గళ్ *
మలక్కమెయ్ద మాకడల్ దన్నైక్కడైన్దానై *
ఉలక్కనామ్ పుగழ்గిఱ్పు దెన్ శెయ్వదురై యీరే. ౧౦.

అ॥ కలక్కమిల్లా - (సంసారమందు) భ్రమలేనివారై, నల్ తవమ్ - మంచితపస్సుగలవారైన, మునివర్ - సనకాదిఋషులును, కరై కణ్డోర్ - సంసారపారమునుజూచిన ముక్తులును, తుళక్కమ్ ఇల్లా - చలనములేని, వానవర్ - నిత్యసూరులును, ఎల్లామ్ - వీరందరును, తొழுవార్ గళ్ - (వానిని) ఆశ్రయించి మఙ్గళాశాసనము జేయదగినవారై యున్నారు. మా - గొప్ప, కడల్ తన్నై - సముద్రమును, మలక్కమెయ్ద - క్షోభముకలుగునట్లు, కడైన్దానై - చిలికినవానిని, నామ్ - మనము, ఉలక్క - సంపూర్ణముగా, పుగழ்కిఱ్పదు - స్తోత్రముజేయుట, ఎన్ శెయ్వదు - ఏమిచేసినట్లగును? ఉరై యీర్ - చెప్పుఁడు.

తా॥ నిత్యులును ముక్తులును సనకాదులును నైన మహాప్రాజ్ఞులందరు శ్రియఃపతికి మఙ్గళాశాసనముఁజేయ సిద్ధమైయుండగా, అల్పజ్ఞులమైన మనస్తోత్రముచే నేమియు ప్రయోజనము లేదు. వారిమఙ్గళాశాసనముచేతనే సకలదృష్టి దోషములును నివర్తించునని. ౧౦.

౹౹ ఉరై యా వెన్నోయ్ తవిర వరుళ్ నీళ్ ముడియానై *
వరై యార్ మాడ మన్ను కురుగూర్ చ్చడగోపన్ *
ఉరై యేయ్ శొల్ తొడై యోరాయిరత్తుళిప్పత్తుమ్ *
నిరై యేవల్లార్ నీకులగత్తుప్పిఱవారే. ౧౧.

అ॥ ఉరై యా - వాచామగోచరమై, వెమ్ నోయ్ - (తమకన్నభిమతమనెడి) కూరమైన వ్యాధి, తవిర - నివర్తించునట్లు, అరుళ్ - కృపఁజేసిన, నీళ్ ముడియానై - దీర్ఘమైనకిరీటముగల సర్వేశ్వరునివిషయమై, వరై - పర్వతములువలెనున్న, ఆర్ - సమృద్ధములైన, మాడమ్ - గృహములు, మన్ను - స్థిరములైయున్న, కురుగూర్ - తిరునగరికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లయొక్క, ఉరై - శ్రీసూక్తిరూపమై, ఏయ్ - అనురూపమైన, శొల్ తొడై - శబ్దసన్దర్భరూపమైన, ఓర్ ఆయిరత్తుళ్ - విలక్షణములైన వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశు

రములను, నిరైయే - సక్రమముగా, వల్లార్ - అభ్యసింపఁదగినవారు, నీడు-విశాలమైన, ఉలగత్తు - ఈలోకమందు, పిఱవార్ - జన్మించరు.

తా॥ సర్వేశ్వరునియొక్క సౌకుమార్యమునకేమి చెరుపువచ్చునోయని భయపడిన తమ భయము నివర్తించునట్లుకటాక్షించిన శ్రియఃపతివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపది పాశురముల నభ్యసించువారు తిరిగి సంసారమందు జన్మించక మోక్షమును బొందుదురని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౪ - వ, తిరువాయ్మొழி.

అవతారిక:—సర్వేశ్వరునియొక్క సౌకుమార్యాదులకేమి చెరుపువచ్చునోయని భయపడిన యాళ్వార్లకు తిరిగి యాభయము రాకుండునట్లు తనశౌర్యాదిగుణములనున్న, ఆగుణములకుమంగళాశాసనముజేయదగిన మూడువేలు శ్రీవైష్ణవులనున్న తిరుచ్చెంగున్రూరనెడి దివ్యదేశమందు వేంచేసియుండి యాళ్వార్లకు గనుపఱచగా వానినిసేవించియా సౌందర్యమననుభవించుచున్నారు.

** వార్కడావరువియానైమామలైయిన్ మరుప్పిణైక్కువడిఉత్తురుట్టి*
ఊర్కొళ్తిణ్పాగనుయిర్శెగుత్తరజ్గిన్మల్లరైక్కొన్రుశూழ்పరణ్మేల్*
పోర్కడావరశర్పుఱక్కిడమాడమీమిశైక్కఞ్జనైత్తగర్త్త*
శీర్కొళ్శిత్తాయన్తిరుచ్చెంగున్రూరిల్ తిరుచ్చిత్తాఱెజ్గళ్శెల్శార్వే. ౧.

అ॥ వార్ - కారుచున్న, కడా - మదజలమనెడి, అరువి - కొండకాలవలుగల, ఆనై - ఏనుఁగనెడి, మా - గొప్ప, మలైయిన్ - పర్వతముయొక్క, మరుప్పు - దన్తములనెడి, ఇణై - రెండు, కువడు - శిఖరములను, ఇఱుత్తు - భగ్నముజేసి, ఉరుట్టి - దొర్లించి, ఊర్కొళ్ - (పడిపోయినయేనుఁగునుగూడ తనసామర్థ్యముచే) నడిపించుచున్న, తిణ్ - సమర్థుఁడైన, పాగన్ - మావటివానియొక్క, ఉయిర్ - ప్రాణములను, శెగుత్తు - నశింపఁజేసి, అరజ్గిల్ - చత్వరమందు, మల్లరై - చాణూరముష్టికులనెడిమల్లులను, కొన్రు - చంపి, శూழ் - చుట్టునున్న, పరణ్మేల్ - మంచములమీఁదనున్న, పోర్కడా-యుద్ధములనునడిపించుచున్న (రణవీరులైన), అరశర్-రాజులు, పుఱక్కిడ - వెనుకతీయునట్లు, మాడమ్ - మేడయొక్క, మీమిశై - పైననున్న, కఞ్జనై - కంసుని, తగర్త్త - చంపినవాఁడును, శీర్కొళ్ - కల్యాణగుణములుగలవాఁడును, శిఱుఆయన్ - చిన్నగోపాలుఁడునైన శ్రీకృష్ణుడువేంచేసియున్న, తిరుచ్చెంగున్రూరిల్ - తిరుచ్చెంగున్రూరులోనున్న, తిరుచ్చిత్తాఱు - తిరుచ్చిత్తాఱనెడిపేరుగలనది, ఎజ్గళ్ - మాకు, శెల్ - పొయిపొందదగిన, శార్వు - ఉపాయము.

తా॥ కువలయాపీడ ముష్టికారిష్టచాణూరాదులనున్న మేడమీఁదకూర్చునున్నకంసునినిన్ని జంపి ఇప్పుడు తిరుచ్చెంగున్రూరనెడి దివ్యదేశమందలి తిరుచ్చిత్తాఱనెడి నదీతీరమందు వేంచేసియున్న శ్రీకృష్ణుఁడేమాకురక్షకుఁడని. ౧,

ఎజ్గళ్ శెల్ శార్వు యాముడై యముద మిమైయవరప్ప నెన్నప్పన్*
పొజ్గుమూవులగుమ్ పడైత్తళిత్త [illegible] పొరున్దుమూవురువ నెమ్మరువన్*
శెజ్గయలుగళుమ్ తేమ్బణై పుడై శూழ் తిరుచ్చెజ్గున్ఱూర్ త్తిరుచ్చిఱ్ఱాఱ్ఱు
అజ్గమర్ గిన్ఱ *ఆదియానల్లాల్ యావర్ మఱ్ఱెన్నమర్ తుణైయే. ౧.

అ॥ ఎజ్గళ్ - మాకు, శెల్ శార్వు - పొందదగిన ఉపాయమును, యాముడై - మాయొక్క, అముదమ్ - అమృతమును, ఇమైయవర్ - దేవతలకు, అప్పన్ - స్వామియు, ఎన్నప్పన్ - నాస్వామియు, పొజ్గు - సమృద్ధమైన, మూవులగుమ్ - మూడులోకములనున్ను, పడైత్తు - సృజించి, అళిత్తు - రక్షించి, అళిక్కుమ్ - సంహరించుచున్నవాడును, పొరున్దుమ్ - ఈవ్యాపారములకు దగియున్న, మూవురువన్ - మూడుస్వరూపములు గలవాడును, ఎమ్అరువన్ - మాకంతర్యామియు, శెమ్ - ఎఱ్ఱని, కయల్ - మత్స్యములు, ఉగళుమ్ - ఆనన్దించుచున్నదియు, తేమ్ - తేనెగల, పణైపుడై - కొలనలచే, శూழ் - చుట్టబడినదియునైన, తిరుచ్చెజ్గున్ఱూర్ - తిరుచ్చెజ్గున్ఱూరందలి, తిరుచ్చిఱ్ఱాఱ్ఱు - తిరుచ్చిఱ్ఱాఱనెడి, అజ్గు - ఆదేశమందు, అమర్గిన్ఱ - అమరి వేంచేసియున్న, ఆదియానల్లాల్ - కారణభూతుడునైన సర్వేశ్వరునితప్ప, ఎన్ - నాకు, అమర్ - అనురూపమైన, తుణై - సహాయము, మఱ్ఱు యావర్ - మఱియెవరు?

తా॥ జగత్సృష్టిస్థితి సంహారకుడై, పరమభోగ్యుడై, నాకురక్షకుడై, అతిరమణీయంబైన తిరుచ్చిఱ్ఱాఱులో వేంచేసియున్న సర్వేశ్వరుడే నాకు పరమప్రాప్యము. మఱియొకరుకారని.

ఎన్నమర్ పెరుమానిమైయవర్ పెరుమా నిరునిలమిడన్దవెమ్బెరుమాన్*
మున్నైవల్వినైగళ్ ముழுదుడన్ మాళ వెన్నైయాళ్ గిన్ఱవెమ్బెరుమాన్*
తెన్ తిశైక్కణికొళ్ తిరుచ్చెజ్గున్ఱూరిల్ తిరుచ్చిఱ్ఱాఱ్ఱజ్గరై మీపాల్
నిన్ఱవెమ్బెరుమాన్ *అడియల్లాల్ శరణ్ నినైప్పిలుమ్ పిఱిదిల్లై యెనక్కే. ౨.

అ॥ ఎన్ - నాకు, అమర్ - అనురూపమైన, పెరుమాన్ - స్వామియు, ఇమైయవర్ - దేవతలకు, పెరుమాన్ - స్వామియు, ఇరు - విశాలమైన, నిలమ్ - భూమిని, ఇడన్ద - విడతీసిన, ఎమ్బెరుమాన్ - నాథుడును, మున్నై - అనాదియై, వల్ - క్రూరములైన, వినైగళ్ - పాపములు, ముழுదు - అన్నియు, ఉడన్ - వెంటనే, మాళ - నశించునట్లు, ఎన్నైయాళ్ గిన్ఱ ఎమ్బెరుమాన్ - నన్నేలినస్వామియు, తెన్ తిశైక్కు - దక్షిణదిక్కునకు, అణికొళ్ - అలఙ్కారముగానున్న, తిరుచ్చెజ్గున్ఱూరిల్ - తిరుచ్చెజ్గున్ఱూరందలి, తిరుచ్చిఱ్ఱాఱ్ఱజ్గరై మీపాల్ - తిరుచ్చిఱ్ఱాఱనెడినదియొక్క తీరమునకు పశ్చిమభాగమందు, నిన్ఱ - వేంచేసియున్న, ఎమ్బెరుమాన్ - స్వామియునైన సర్వేశ్వరునియొక్క, అడియల్లాల్ - శ్రీపాదములుతప్ప, ఎనక్కు - నాకు, నినైప్పిలుమ్ - మనోరథమందుకూడ, పిఱిదు - వేఱు, శరణ్ - ఉపాయము, ఇల్లై - లేదు.

తా॥ వరాహావతారంబెత్తి భూమిని విడతీసి రక్షించియు నాపాపములను బోగొట్టి నన్నేలినవాడునై తిరుచ్చెజ్గున్ఱూరులో వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదములతప్ప నాకు వేఱొక ఉపాయము లేదని. ౨.

పిఱిదినా లెనక్కు ప్పెరియమూవులగుమ్నిఱైయ ప్పేరురువమాయ్నిమిర్న్ద*
కుఱియమాణెమ్మాన్ కుఱై కడల్కడైన్ద కోలమాణిక్కమెన్నమ్మాన్*
శెఱికుఱై వాఴై కముగుతెఙ్గెఙ్గుమ్ శూఴ్ తిరుచ్చెఙ్గున్ఱూర్ త్తిరుచ్చిఱ్ఱా
ఱఱియ* మెయ్మ్మైయేనిన్ఱ వెమ్బెరుమా నడియిణైయల్లదోరరణే. ౪.

అ॥ పెరియ - విశాలమైన, మూవులగుమ్ - మూడులోకములును, నిఱైయ - నిండునట్లు, పేర్ ఉరువమాగి - గొప్పతిరుమేనుగలవాఁడై, నిమిర్న్ద - పెరిగిన, కుఱియమాణ్ - వామనబ్రహ్మచారియైన, ఎమ్మాన్ - స్వామియు, కుఱై - ఘోషించుచున్న, కడల్ - సముద్రమును, కడైన్ద - చిలికినవాఁడును, కోలమ్ - సుందరమైన, మాణిక్కమ్ - రత్నమువంటికాన్తిగలవాఁడునైన, ఎన్నమ్మాన్ - నాస్వామియు, శెఱి - సమృద్ధమైన, కుఱై - గెలలుగల, వాఴై - అరటిచెట్లును, కముగు - పోఁకచెట్లును, తెఙ్గు - కొబ్బరచెట్లును, (వీనియొక్క) అణి - పఙ్క్తులచే, శూఴ్ - చుట్టఁబడిన, తిరుచ్చెఙ్గున్ఱూరిల్ - తిరుచ్చెఙ్గున్ఱూరందలి, తిరుచ్చిఱ్ఱాఱు - తిరుచ్చిఱ్ఱాఱనెడి నదియొక్క తీరమందు నివసించుచున్నవాఁడు. అఱియ - (భక్తులు సర్వేశ్వరుఁడని) తెలిసికొనునట్లు, మెయ్మ్మైయే - యథావత్తుగా, నిన్ఱ - వేంచేసియున్న, ఎమ్బెరుమాన్ - స్వామియునైన శ్రియఃపతియొక్క, అడియిణైయల్లదు - శ్రీపాదద్వన్ద్వములుతప్ప, ఎనక్కు - నాకు, పిఱిదుఒన్ఱు - వేఱొక, అరణ్ - రక్షకము, ఇల్లై - లేదు.

తా॥ వామనావతారమందు త్రివిక్రముఁడై పెరిగి యనుష్ఠించిన దివ్యచేష్టితములనున్ను, సముద్రమథనవ్యాపారమునున్ను నాకుఁగనపఱచినన్ను దాసునిగాఁజేసికొనినవాఁడై, అనేక ఫలవృక్షములచె సమృద్ధమైన తిరుచ్చెఙ్గున్ఱూరులోనున్న వారందఱును సేవించునట్లు వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదము తప్ప నాకువేఱుపాయములేదని. ౪

అల్లదోరరణుమవనిల్ వేఱిల్లై యదుపొరుళాగిలుమ్*అవనై
యల్లదెన్నావియమర్న్దణైగిల్లా దాదలాలవనుఱైగిన్ఱ*
నల్లనాన్మఱైయోర్ వేళ్వియుళ్ మడుత్త నఱుమ్బుగై విశుమ్బొళిమఱైక్కుమ్*
నల్లనీళ్ మాడ త్తిరుచ్చెఙ్గున్ఱూరిల్ తిరుచ్చిఱ్ఱాఱెనక్కునల్లరణే. ౫.

అ॥ అల్లదు - తిరుచ్చెఙ్గున్ఱూరుకాని, ఓరరణుమ్ - ఒకదివ్యదేశముకూడ, అవనిల్ వేఱిల్లై - ఆసర్వేశ్వరునివిడిచియుండదు. అదుపొరుళాగిలుమ్ - అమాట సత్యార్థమైనను, అవనైయల్లదు - తిరుచ్చెఙ్గున్ఱూరులో వేంచేసియున్న సర్వేశ్వరునితప్ప, ఎన్నావి - నాయాత్మ - అమర్న్దు - అమరి, అణైగిల్లాదు - (మఱియొకదివ్యదేశమును) పొందదు. ఆదలాల్ - గాన, అవన్ - ఆసర్వేశ్వరుఁడు, ఉఱైగిన్ఱ - నిత్యవాసముజేయునట్టిదియు, నల్ల - అనన్యప్రయోజనులైన, నాన్మఱైయోర్ - నాలుగు వేదములువచ్చిన శ్రీవైష్ణవులయొక్క, వేళ్వియుళ్ - యాగమందు, మడుత్త - కలిగిన, నఱుమ్ - పరిమళముగల, పుగై - ధూమము, విశుమ్బు - ఆకాశమందు, ఒళి - సూర్యాదితేజస్సులను, మఱైక్కుమ్ - కప్పునట్టిదియు, నల్ల - సుందరములై, నీళ్ - ఉన్నతములైన, మాడమ్ - మేడలుగలదియునైన, తిరుచ్చెఙ్గున్ఱూరిల్ - తిరుచ్చెఙ్గున్ఱూరందలి, తిరుచ్చిఱ్ఱాఱు - తిరుచ్చిఱ్ఱాఱనెడి దివ్యదేశము, ఎనక్కు - నాకు, నల్లరణ్ - నిర్భయమైనప్రాప్యదేశము.

తా॥ ఇతర దివ్యదేశములయందు సర్వేశ్వరుఁడు వేంచేసియున్నను సామనస్యం తిరుచ్చిఱ్ఱాఱ అనెడి దివ్యదేశమందు వేంచేసియున్నసర్వేశ్వరుని వదలి మఱియొక్కచోటికి వెళ్ళదుగాన, అనేకమైన శ్రీవైష్ణవులు యాగములుచేయుచున్న యాదివ్యదేశమే నాకు పరమప్రాప్యమని. ౫.

ఎనక్కునల్లరణై యెనదారుయిరై యిమైయవర్ తన్దైతాయ్ తన్నై*
తనక్కుమ్ తన్ తన్మైయఱివరియానై త్తడఙ్గడల్ పళ్ళియమ్మానై *
మనక్కొళ్ శీర్ మూవాయిరవర్ వణ్ శివనుమయనుమ్ తానుమొప్పార్ వాழ்*
కనక్కొళ్ తిణ్మాడ త్తిరుచ్చెఙ్గున్ఱూరిల్ తిరుచ్చిఱ్ఱాఱదనుళ్ కణ్డేనే. ౬

అ॥ ఎనక్కు - నాకు, నల్లరణై - మంచియుపాయమును, ఎనదు - నాకు, ఆరుయిరై - మంచిప్రాణభూతుఁడును, ఇమైయవర్ - నిత్యసూరులకు, తన్దైతాయ్ తన్నై - తండ్రితల్లియైన వాఁడును, తనక్కుమ్ - తనకును, తన్ తన్మై - తనమహిమను, అఱివరియానై - తెలిసికొనుటకశక్యుఁడును, తడమ్ - విశాలమైన, కడల్ - సముద్రమందు, పళ్ళి - పవ్వళించిన, అమ్మానై - స్వామియైన సర్వేశ్వరుని, మనమ్ కొళ్ - (ఆసర్వేశ్వరుని) హృదయమందు చుకొనిన, శీర్ - భగవద్గుణములు గలవారును, వణ్ - జ్ఞానాధికుఁడైన, శివనుమ్ - రుద్రునితోడను, అయనుమ్ - బ్రహ్మతోడను, తానుమ్ - తనతోడను (సర్వేశ్వరునితోడను), ఒప్పార్ - సమానులైన (వారివలెజగత్సృష్టిస్థితి సంహారములను జేయుటకు సమర్థులైన), మూవాయిరవర్ - మూడువేలుశ్రీవైష్ణవులు, వాழ் - వాసముజేయుచున్నదియు, కనమ్ కొళ్ - నిబిడములై, తిణ్ - స్థిరములైయుండునదియునైన, మాడమ్ - గృహములుగలదియునైన, తిరుచ్చెఙ్గున్ఱూరిల్ - తిరుచ్చెఙ్గున్ఱూరందలి, తిరుచ్చిఱ్ఱాఱ అదనుళ్ - తిరుచ్చిఱ్ఱాఱ అనెడి దివ్యదేశమందు, కణ్డేన్ - సేవించితిని.

తా॥ నాకును నిత్యసూరులకును సకలవిధబంధువై సర్వజ్ఞుఁడైన తనకుఁగూడ తెలిసికొనుట కశక్యమై యపరిచ్ఛిన్నమైన మహిమగలసర్వేశ్వరుని భాగవతోత్తములైన మూడువేలు శ్రీవైష్ణవులు నిత్యవాసముజేయుచున్న తిరుచ్చిఱ్ఱాఱ అనెడి దివ్యదేశమందు సేవించితినని. ౬.

తిరుచ్చెఙ్గున్ఱూరిల్ తిరుచ్చిఱ్ఱాఱదనుళ్ కణ్డ వత్తిరువడియెన్నుమ్*
తిరుచ్చెయ్య కమలక్కణ్ణుమ్ శెవ్వాయుమ్ శెవ్వడియుమ్ శెయ్య కైయుమ్*
తిరుచ్చెయ్య కమలవున్దియుమ్ శెయ్య కమలమార్వుమ్ శెయ్య వుడైయుమ్*
తిరుచ్చెయ్య ముడియుమారముమ్ పడైయుమ్ తిగழ என్ శిన్దైయుళానే. ౭.

అ॥ తిరుచ్చెఙ్గున్ఱూరిల్ - తిరుచ్చెఙ్గున్ఱూరందలి, తిరుచ్చిఱ్ఱాఱ అదనుళ్ - తిరుచ్చిఱ్ఱాఱ అనెడి దివ్యదేశమందు, కణ్డ - (నేను) సేవించిన, అత్తిరువడి - ఆస్వామి, శెయ్య - ఎఱ్ఱనైన, కమలమ్ - తామరసపుష్పమువంటి, తిరుక్కణ్ణుమ్ - సుందర నేత్రములును, శెమ్ - ఎఱ్ఱని, వాయుమ్ - అధరమును, శె - ఎఱ్ఱని, అడియుమ్ - శ్రీపాదములును, శెయ్య - ఎఱ్ఱనైన, కైయుమ్ - శ్రీహస్తములును, శెయ్య - ఎఱ్ఱని, కమలమ్ - తామరసపుష్పముగల, తిరువున్దియుమ్ - తిరునాభియు, కమలమ్ - తామరసపుష్పమువలె, శెయ్య - ఎఱ్ఱనైన, మార్వుమ్ - వక్షస్థలమును, శెయ్య - ఎఱ్ఱని, ఉడైయుమ్ - పీతాంబరమును, శెయ్య - ఎఱ్ఱని, తిరుముడియుమ్ - అందమైనకిరీటమును, ఆరముమ్ -

ష్యులకంబె (శ్రేష్ఠులయిన యిన్ద్రాదులకును మేలైన, పిరమన్ - బ్రహ్మకునంతర్యామియైనవాఁడు, అవనే - ఆసర్వేశ్వరుఁడే, శివప్పిరాన్ - రుద్రునికినంతర్యామి. ఇవై - (బ్రహ్మరుద్రులయొక్క) నామము, పుక్కు - ప్రవేశించి, అవనే - ఆసర్వేశ్వరుఁడే, ఓర్ ఉరువుమ్ - ఒకవస్తువునున్ను, ఒழிవిల్లై - విడువకుండ (అన్నిటికన్తర్యామియైనవాఁడు). యావైయుమ్ - సకలచేతనాచేతనములకును, తానే - తానేయంతర్యామియైనవాఁడు. పుగழ்వ్వైల్లై - (ఇది) స్తోత్రముకాదు. - ౯.

తా॥ సచ్ఛాస్త్రప్రవర్తకులై, జ్ఞానానుష్ఠానసంపన్నులై, భగవదారాధనతత్పరులై, విలక్షణులై ప్రసిద్ధులైన శ్రీవైష్ణవులు నిత్యవాసముజేయుచున్న తిరుచ్చిఱ్ఱారు అనెడి దివ్యదేశమందు వేంచేసియున్న సర్వేశ్వరుఁడే జగత్సృష్టిసంహారకారకుఁడు; బ్రహ్మరుద్రాది సమస్తచేతనాచేతనములకు నంతర్యామియైస్వామియైయుండు పరాత్పరుఁడు; ఇదియర్థవాదముకాదు యథార్థమేయని.

అమర్న్ద నాదనై యవరవరాగి యవర్క్కరుళ్ అరుళుమమ్మానై *
అమర్న్దతణ్ పణ్ణైత్తిరుచ్చెఙ్గున్నూరిల్ తిరుచ్చిఱ్ఱాఱ్ ఱఙ్గరైయానై *
అమర్న్దశీర్ మూవాయిరవర్ వేదియర్గళ్ తమ్పది యవనితేవర్ వాழ்వు*
అమర్న్దమాయోనై ముక్కణమ్మానై నాన్ముగనై యమర్న్దేనే. ౧౦.

అ॥ అమర్న్ద - అనురూపమైన, నాదనై - స్వామియు, అవరవర్ - ఆయాయాచకులవరై, ఆగి - అయినవాఁడై (తననుయాచించినవారు తనవద్దనుండి ఫలమునుబొంది సన్తోషించునట్లు తాను వారు కోరినఫలమునిచ్చి మనమిచ్చితిమికదాయని సన్తోషించినవాఁడై), అవర్క్కు - వారికి, అరుళ్ - అనుగ్రహమును (ఫలమును), అరుళుమమ్మానై - కృపచేయుస్వామియు, అమర్న్ద - సమృద్ధమైయున్న, తణ్ - చల్లనైన, పణ్ణైవమ్ - కొలనులుగల, తిరుచ్చెఙ్గున్నూరిల్ - తిరుచ్చెఙ్గన్నూరనెడి, తిరుచ్చిఱ్ఱాఱ్ ఱఙ్గరైయానై - తిరుచ్చిఱ్ఱారనెడి నదీతీరమందున్న దివ్యదేశమును వాసస్థానముగాఁగలవాఁడును, అమర్న్ద-అనురూపమైన, శీర్-ఆత్మగుణములుగల, మూవాయిరవర్ వేదియర్గళ్ తమ్ - మూఁడువేలు వైదికబ్రాహ్మణోత్తములకు, పది - వాసస్థానమైనది అవనితేవర్ - భూసురులైన శ్రీవైష్ణవులకు, వాழ்వు - వాసస్థానమునైన (తిరుచ్చెఙ్గున్నూరులో) అమర్న్ద - అమరికతో వేంచేసియున్న, మాయోనై - ఆశ్చర్యభూతుఁడును, ముక్కణ్ అమ్మానై - త్రినేత్రుఁడైనరుద్రుని కంతర్యామియు, నాన్ముగనై - బ్రహ్మకంతర్యామియునైన సర్వేశ్వరుని, అమర్న్దేన్ - పొందితిని.

తా॥ ఆత్మగుణసంపన్నులైన మూఁడువేలువైదిక శ్రీవైష్ణవులు నిత్యవాసముజేయుచున్న తిరుచ్చెఙ్గున్నూరులో యాచకులయొక్క మనోరథమును నెఱవేర్చుచు వేంచేసియున్న బ్రహ్మరుద్రాదిసకల దేవతలకు నంతరాత్మయైన సర్వేశ్వరుని నేను భజించితినని. ౧౦

⁂ తేనైనన్నాలైక్కన్నలై యముదై త్తిరున్దలగుణవమ్మానై *
వాననాన్ముగనై మలర్న్దతణ్ కొప్పూழ் మలర్మిశై ప్పడైత్తమాయోనై *
కోనై వణ్కురుకూర్ వణ్ శడగోపన్ శొన్నవాయిరత్తుళిప్పత్తుమ్*
వానిన్మీదేఱ్ఱి యరుళ్ శెయ్దుముడిక్కుమ్ పిఱవిమామాయక్కూత్తినైయే.

అ॥ తేనై - తేనెవంటివాఁడును, నల్ పాలై - మంచిపాలువంటివాఁడును, కన్నలై - చెరుకువంటివాఁడును, అముదై - అమృతమువంటివాఁడును, తిరుమ్బగు - వ్యవస్థితములైయున్న లోకములను, ఉణ్డ - (ప్రళయకాలమందు) మ్రింగిన, అమ్మానై - స్వామియు; మలర్న్ద - వికసించియున్న, తణ్ - చల్లనైన, తొప్పూళ్ మలర్ మిశై - నాభికమలముమీఁద, వాన్ - ఊర్ధ్వలోకమందున్న, నాన్ముగనై - చతుర్ముఖుని, పడైత్త - సృజించిన, మాయోనై - ఆశ్చర్యభూతుఁడునైన, కోనై - సర్వేశ్వరునివిషయమై, వణ్ - నిరతిశయసంపత్తుగల, కురుగూర్ - కురుకాపురికి స్వామియై, వణ్ - ఉదారులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొన్న - సాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, వానిన్ మీదు - పరమపదమందు, ఏఱ్ఱి - ఎక్కించి, అరుళ్ శెయ్దు - భగవత్కటాక్షమును గలుగఁజేసి, పిఱవి - సంసారమనెడి, మామాయమ్ - గొప్పఆశ్చర్యకరమైన, కూత్తినై - నాటకమును, ముడిక్కుమ్ - నశింపఁ

తా॥ నిరతిశయభోగ్యుఁడైన సర్వేశ్వరునివిషయమై నమ్మాళ్వార్లుప్రసాదించిన యీపది పాశురములే తన నధ్యయనము జేయువారికి సంసారమును బోగొట్టి భగవత్కటాక్షమును గలుగ జేసి మోక్షసామ్రాజ్యమునిచ్చునని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౫ - వ తిరువాయ్మొழி.

అవతారిక :— ఈతిరువాయ్మొழிలో, శ్రియఃపతియొక్క దివ్యావయవసౌన్దర్యమును సేవింపనాశపడి, అది నెరవేరనందున మిక్కిలి యార్తులై, ఓశ్రియఃపతీ! నీవీవిధముగా నా ముఁదఱవచ్చి సేవసాదింపవలయునని ప్రార్థించుచున్నారు.

✠ మాయక్కూత్తా వామనా విநైయేన్ కణ్ణా కణ్ కై కాల్*
తూయ శెయ్య మలర్గళా శోది చ్చెవ్వాయ్ ముగిழ் దా*
శాయల్ శామ త్తిరుమేని తణ్బాశడైయా* తామరై నీళ్
వాశత్తడమ్బోల్వరువానే యొరునాళ్ కాణవారాయే* ౧.

అ॥ మాయమ్ - ఆశ్చర్యకరంబులై, కూత్తా - మనోహరంబులైన దివ్యచేష్టితములుగల, వామనా - ఓవామనుఁడా! విநైయేన్ - పాపముగలవాకు, కణ్ణా - నేత్రమువంటివాఁడా! కణ్ - నేత్రమును, కై - శ్రీహస్తమును, కాల్ - శ్రీపాదమును, తూయ - దోషములేనివై, శెయ్య - సుందరములైయున్న, మలర్గళా - పుష్పములుగానున్న, శోది - తేజస్సుగల, శెమ్ - ఎఱ్ఱని, వాయ్ - అధరము, ముగిழ் దా - మొగ్గలుగానున్న, శాయల్ - కాన్తిగలదై, శామమ్ - శ్యామమైన, తిరుమేని - దివ్యవిగ్రహము, తణ్ - చల్లనై, పాశడైయా - పచ్చనివర్ణముగలఆకులుగానున్న (కలవాఁడై), తామరై - తామరపుష్పములుగలదై, నీళ్ - గొప్పదై, వాశమ్ -

పరిమళముగలదైన, తడమ్పోల్ - తటాకమువలె, వరువానే - వచ్చుచున్నవాఁడా! ఒరునాళ్ - ఒకదినము, కాణ - సేవించునట్లు, వారాయ్ - వేంచేయుమా.

తా॥ అత్యాశ్చర్యకరంబులై యతిమనోహరంబులైన దివ్యచేష్టితములుగల ఓస్వామీ! తామరసపుష్పమువలెనున్న నేత్రాదులతోను, మొగ్గవలెనున్న అధరముతోను పచ్చనియాకువలెనున్న తిరుమేనుతోనుగూడ, తామరసతటాకమువలెవచ్చి నాకొక దినమైనను సేవసాదింపుమాయని.

కాణవారాయెన్రెన్రు కణ్ణుమ్వాయుమ్తువర్న్దు*అడియేన్
నాణినన్నాట్టలమన్దా లిరఙ్గియొరునాళ్నీయన్దో*
కాణవారాయ్ కరునాయిఱుదిక్కుమ్ కరుమామాణిక్క
నాళ్నన్మలై పోల్*శుడర్చ్చోదిముడిశేర్ శెన్నియమ్మానే. ౨.

అ॥ కరు - శ్యామవర్ణముగల, నాయిఱు - సూర్యుఁడు, ఉదిక్కుమ్ - ఉదయమగుచున్న, మా - శ్లాఘ్యమై, నాళ్నల్ - నవీనమై, కరుమాణిక్కమ్ - నీలరత్నమయమైన, మలైపోల్ - పర్వతమువలెనున్న, శుడర్శోది - గొప్పతేజస్సుగల, ముడి - కిరీటముతో, శేర్ - చేరియున్న, శెన్ని - శిరస్సుగల, అమ్మానే - ఓస్వామీ! కాణవారాయ్ - (నేను) సేవించునట్లు వేంచేయుమా, ఎన్రెన్రు - అని పలుమాఱుచెప్పి, కణ్ణుమ్ - (చూచిన) నేత్రములును, వాయుమ్ - (పిలిచిన) నోఱును, తువర్న్దు - ఎండిపోయి, నాణి - (నీవురానందున) సిగ్గుపడి, నల్నాడు - మంచిదైన యీలోకమందు, అడియేన్ - దాసుఁడనైననేను, అలమన్దాల్ - తడుమాడినప్పటికిన్ని, ఒరునాళ్ - ఒకదినమైనను, ఇరఙ్గి - కృపజేసి, నీ - నీవు, కాణవారాయ్ - సేవించునట్లురాకపోతివి. అన్దో - అయ్యో.

తా॥ నీలమాణిక్యమయ పర్వతమువంటి తిరుమేనునున్ను, ఆ పర్వతశిఖరమం దుదించిన సూర్యునివలె నత్యుజ్జ్వలమైన కిరీటమునున్నుగల ఓస్వామీ! నిన్ను సేవింపవలయునని చుట్టుతిరిగితిరిగి చూచియు పిలిచియు, నా నేత్రములును నోఱు నెండిపోయినవి. నేనింత యవస్థపడుచున్నను నీ వొకమారైనను దయజేసి సేవసాదించకపోతివి. నా భాగ్యహీనత నేమని చెప్పెదనని. ౨.

ముడిశేర్ శెన్నియమ్మా నిన్ మొయ్పూమ్తామత్తణ్డుழాయ్*
కడిశేర్ కణ్ణిప్పెరుమానే యెన్రెన్రేఙ్గియழுదక్కాల్*
పడిశేర్మకరక్కుழைగళుమ్ పవళవాయుమ్నాల్తోళుమ్*
తుడిశేరిడైయుమమైన్దదోర్ తూనీర్ముగిల్పోల్తోన్రాయే. ౩.

అ॥ ముడి - కిరీటముతో, శేర్ - చేరియున్న, శెన్ని - శిరస్సులుగల, అమ్మా - ఓస్వామీ! నిన్ - నీకు (తగినదై), మొయ్ - దట్టమైకట్టియున్నదై, పూ - సుందరమై, తణ్ - చల్లనై, కడిశేర్ - పరిమళముగలదై, తామమ్ - మిక్కిలికాన్తిగలదైన, తుழாయ్కణ్ణి - తిరుత్తుழாయి మాలగల, పెరుమానే - సర్వాధికుఁడా! ఎన్రెన్రు - అని పలుమాఱుచెప్పి, అழுదక్కాల్ - ఏడిచినయెడల, పడి - తిరుమేనుతో, శేర్ - చేరియున్న, మకరక్కుழைగళుమ్ - మకరకుణ్డలములును, పవళమ్ - పగడమువంటి, వాయుమ్ - అధరమును, నాల్తోళుమ్ - నాల్గుభుజములును, తుడి

శేర్ - గుడుగుడుపతో సమానమైన, ఇడైయుమ్ - మధ్యమును, ఆమైన్దదు -(వీనితో) చేరియున్న, తూ - నిర్మలమై, నీర్ - జలముతో నిండిన, ముగిల్ పోల్ - మేఘమువలె, తోన్ఱాయ్ - సేవ సాధింపవలెను.

తా॥ ఓ శ్రియఃపతీ! నిన్ను సేవింపవలయునని నేను మిక్కిలి యాశించు చున్నానుగాన, అతిసుందరమైన, కిరీట వనమాలాధారివై మిక్కిలి యందములైయున్న దివ్యావయవములతో గూడ వచ్చి కాళమేఘమువలె నాకు సేవసాదించి నాయార్తినిబోగొట్టుమాయని. ౩.

తూనీర్ముగిల్పోల్తోన్ఱుమ్ నిన్శుడర్కొళ్ వడివుమ్కనివాయుమ్*
తేనీర్కమలక్కణ్గళుమ్ వన్దెన్నెఞ్జినైనిఱైన్దవా*
మానీర్వెళ్ళిమలైదన్మేల్ వణ్కార్నీలముగిల్పోల*
తూనీర్కడలుళ్తుయిల్వానే యెన్దాయ్శొల్లమాట్టేనే. ౪.

అ॥ మా - గొప్ప, నీర్ - జలమధ్యమందున్న, వెళ్ళిమలైతన్మేల్ - వెండికొండమీద సంచరించుచున్న, వణ్ - సుందరమై, కార్ - వర్షాకాలమందలి, నీలముగిల్పోల్-నీలమేఘము వలె, తూ - పరిశుద్ధమైన, నీర్ - జలముగల, కడలుళ్ - సముద్రమందు, తుయిల్వానే-(ఆదిశేషుని మీద) నిదురపోవుచున్న, ఎన్దాయ్ - ఓ నాస్వామీ! తూ - నిర్మలమైన, నీర్ - జలము చేపూర్ణమైన, ముగిల్పోల్ - మేఘమువలె, తోన్ఱుమ్-ప్రకాశించుచున్న, నిన్-నీయొక్క, శుడర్కొళ్-తేజస్సుగల, వడివుమ్ - తిరుమేనును, కని - పండువలెనున్న, వాయుమ్ - అధరమును, తేన్నీర్-తేనెరూపమైనజలముగల, కమలమ్ - పద్మమువంటి, కణ్గళుమ్ - నేత్రములును, వన్దు - వచ్చి, ఎన్నెఞ్జినై - నామనస్సునందు, నిఱైన్దవా - నిండియున్న విధమును, శొల్లమాట్టేన్ - చెప్పఁజాలను.

తా॥ క్షీరాబ్ధియొక్క మధ్యమందు వెండికొండవలె తెల్లనైయున్న ఆదిశేషునిమీఁద వర్షాకాలమేఘమువలె శ్యామవిగ్రహుఁడవై పవ్వళించియున్న ఓస్వామీ! నీయొక్క దివ్యావయవములు నామనస్సునందువచ్చి చేసెడిబాధను నేను చెప్పఁజాలనని. ౪

శొల్లమాట్టేనడియేన్ ఉన్తుళఙ్గుశోది తిరుప్పాదమ్*
ఎల్లైయిల్శీరిళఞాయి ఇరణ్డుపోలెన్నుళ్ళవా*
అల్లలెన్నుమిరుళ్శేర్ద ఉపాయమెన్నే ఆழிశూழ்*
మల్లైఞాలముழுదుణ్డ మానీర్కొణ్డల్వణ్ణనే. ౫.

అ॥ ఆழி - సముద్రముచే, శూழ் - చుట్టబడిన, మల్లల్ - విశాలమైన, ఞాలమ్-భూమిని, ముழுదు - సమ్పూర్ణముగా, ఉణ్డ - ఆరగించినవాఁడును, మా - నిండియున్న, నీర్-జలముగల, కొణ్డల్ - మేఘమువంటి, వణ్ణనే - కాన్తిగలవాఁడునైన ఓస్వామీ! ఉన్ - నీయొక్క, తుళఙ్గు-ప్రకాశించుచున్న, శోది - తేజస్సుగల, తిరుప్పాదమ్ - తిరువడికళు, ఎల్లైయిల్ - అవధిలేని, శీర్-సౌందర్యముగల, ఇరణ్డు - రెండు, ఇళఞాయిఱుపోల్ - బాలసూర్యులవలె, ఎన్నుళ్ళవా - నా మనస్సునందున్న విధమును, అడియేన్ - దాసుఁడనైన నేను, శొల్లమాట్టేన్ - చెప్పఁజాలను. అల్లల్ ఎన్నుమ్ - దుఃఖమని చెప్పబడుచున్న (అజ్ఞానమనెడి), ఇరుళ్ - చీకటిని, శేర్దఱ్కు - చేరుటకు, ఉపాయమ్ - ఉపాయమును, ఎన్నే - ఏది?

తా॥ ఓ నీలమేఘశ్యామలుఁడా! బాలసూర్యునివలె దేదీప్యమానమైన నీయొక్క శ్రీపాదము నాహృదయమందుండి నన్ను మిక్కిలి బాధించుచున్నది. నాకు సేవసాదింప నీకిష్టములేనియెడల నిన్ను మఱచిపోవునట్లైనను ఒకఉపాయము చెప్పుమాయని. ౫.

కొణ్డల్వణ్ణా కుడక్కూత్తా వినైయేన్ కణ్ణా కణ్ణా ఎన్
అణ్డవాణా వెన్ఱెన్నై యాళక్కూప్పిట్టళైత్తక్కాల్
విణ్ణన్మేల్ తాన్ మణ్మేల్ తాన్ విరినీర్ కడల్ తాన్ మఱ్ఱుత్తాన్
తొణ్డనేన్ ఉన్ కళల్ కాణ వొరునాళ్ వన్దు తోన్ఱాయే. ౬.

అ॥ కొణ్డల్ వణ్ణా - మేఘమువంటికాన్తిగలవాఁడా! కుడక్కూత్తా - కుమ్భనృత్యముజేసినవాఁడా! వినైయేన్ - పాపియైనవాకు, కణ్ణా - నేత్రమువలెనున్న, కణ్ణా - శ్రీకృష్ణుడా! ఎన్ - నన్నురక్షించుటకై, అణ్డవాణా - అండాధిపతియైనవాఁడా! ఎన్ఱు - అనిచెప్పి, ఎన్నై - నన్ను, ఆళ - దాస్యమఱచుకొనుటకై, కూప్పిట్టు - అఱచి, అళైత్తక్కాల్ - పిలిచినయెడల, విణ్ తన్ మేల్ తాన్ - పరమపదమందైనను, మణ్ మేల్ తాన్ - భూలోకమందైనను, విరి - విశాలమైన, నీర్ - జలముగల, కడల్ తాన్ - క్షీరాబ్ధియందైనను, మఱ్ఱుత్తాన్ - వేఱువిధము (నరసింహావతారమెత్తినవిధము) చేతనైనను, తొణ్డనేన్ - చపలుఁడనైనసేను, ఉన్ కళల్ కాణ - నీ తిరువడికళ్ళను సేవించునట్లు, ఒరునాళ్ - ఒకదినము, వన్దుతోన్ఱాయ్ - వచ్చిసేవసాదింపుమా.

తా॥ ఓస్వామీ! నీసౌందర్యమును సేవింపవలయునని యాశించుచున్న నామనోరథము పూరించునట్లు ఏదో ఒకచోటవచ్చి నాకు సేవసాదించి నన్ను కృతార్థునిగాఁజేయుమాయని. ౬.

వన్దుతోన్ఱాయన్ఱే లున్వైయమ్ తాయమలరడిక్కీళ్
మున్దివన్దుయాన్ నిఱ్ప ముగప్పేకూవిప్పణికొళ్ళాయ్
శెన్దణ్ కమలక్కణ్ కై కాల్ శివన్దవాయోర్ కరునాయిఱు
అన్దమిల్లాక్కదిర్ పరప్పి యలర్న్దదొక్కుమమ్మానే. ౭.

అ॥ తణ్ - చల్లనైన, శెమ్ తామరై - ఎఱ్ఱతామరపువ్వువంటి, కణ్ - నేత్రములనున్న, కై - హస్తములనున్న, కాల్ - పాదములనున్న, శివన్దవాయ్ - ఎఱ్ఱని యధరమునున్నగల, ఓర్ కరునాయిఱు - ఒకనల్లనిసూర్యుఁడు, అన్దమిల్లా - అవధిలేని, కదిర్ - కిరణములను, పరప్పి - వ్యాపింపఁజేసి, అలర్న్దదొక్కుమ్ - వికసించునట్లున్న, అమ్మానే - ఓస్వామీ! వన్దు - వచ్చి, తోన్ఱాయ్ - సేవసాదింపుమా, అన్ఱేల్ - అట్లుసఙ్కల్పములేనియెడల, వైయమ్ - భూమిని, తాయ - కొలిచిన, మలర్ - పుష్పమువంటి, ఉన్నడిక్కీళ్ - నీశ్రీపాదములక్రింద, యాన్ - సేను, మున్దివన్దు - ముందఱవచ్చి, నిఱ్ప - నిలుచునట్లు, ముగప్పే - నీయెదుట, కూవి - పిలిచి, పణికొళ్ళాయ్ - కైఙ్కర్యమును స్వీకరింపుమా.

తా॥ అతిసుందరంబులైన దివ్యావయవములుగలవాఁడవై సూర్యునివలె వెలుగుచున్న ఓ స్వామీ! నీవు నాముందఱవచ్చి సేవసాదింపవలెను. అట్లు నీకు తిరువుళ్ళములేనియెడల నీవు వేంచేసియున్నచోటికి నన్నైనను పిలుచుకొని నాచేత కైఙ్కర్యముఁ జేయించుకొనుమాయని. ౭

ఒక్కుమమ్మానురువమె న్ఱుళ్ళమ్కుழைన్దునాణాళుమ్*
తొక్కమేగప్పల్కుழாజ్గళ్ కాణున్దోఱుమ్తొలైవన్నాన్*
తక్కవైవర్తమక్కాయ్ యన్ఱిరైమ్బదిన్మర్తాళ్శాయ*
పుక్కనల్తేర్త్తనిప్పాగా వారాయిదువోపొరుత్తమే. ౮.

అ॥ అమ్మాన్ - స్వామియైననీయొక్క, ఉరువమ్ - తిరుమేనులో, ఒక్కుమ్ - సమానము గానుండును, ఎన్ఱు - అని, ఎన్ఉళ్ళమ్ - నామనస్సు, నాణాళుమ్ - ప్రతిదినమును, తొక్క - గుంపుగాజేరిన, మేగమ్ - మేఘములయొక్క, పల్ - అనేకములైన, కుழாజ్గళ్ - సమూహములను, కాణున్దోఱుమ్ - చూచినప్పుడంత, నాన్ - నేను, తొలైవన్ - క్లేశించుచున్నాను. తక్క - మంచిగుణముగల, ఐవర్తమక్కాయ్ - పఞ్చపాణ్డవులయందు పక్షపాతముగలవాఁడై అన్ఱు - ఆ భారతసమయమందు, ఈరైమ్బదిన్మర్ - దుర్యోధనాదులునూఱుగురు, తాళ్శాయ - సమూలముగానశించునట్లు, పుక్క - (యుద్ధము) ప్రవేశించిన, నల్తేర్ - శ్లాఘ్యమైనరథమునకు, తనిప్పాగా - అద్వితీయ సారథియైనవాఁడా! వారాయ్ - వేంచేయకుండనున్నావు. ఇదువో - ఇదియా, పొరుత్తమ్ - స్నేహము?

తా॥ పాణ్డవులమీద పక్షపాతముచే దుర్యోధనాదులను జంపిన ఓ ఆశ్రితవత్సలుఁడా! నీతిరుమేనువలెనున్న మేఘములను జూచినప్పుడంత నిన్ను దలంచి మిక్కిలిదుఃఖించుచున్నాను; నీవా రాకపోతివి; నీతో స్నేహముచేసినదానికి యిదియే నాకుఫలమని. ౮.

ఇదువోపొరుత్తమ్మిన్నాழிప్పడైయా యేఱుమిరుమ్శిఱైప్పుళ్*
అదువేకొడియావుయర్త్తానే యెన్ఱెన్ఱేజ్గియழுదక్కాల్*
ఎదువేయాగక్కరుదుజ్గొలిమ్మాఙ్ఞాలమ్పొఱైతీర్ప్పాన్*
మదువార్శోలైయుత్తరమదురైప్పిఱన్దమాయనే. ౯.

అ॥ మిన్ - ప్రకాశించుచున్న, ఆழி - సుదర్శనమును, పడైయాయ్ - ఆయుధముగాగలవాఁడా! ఏఱుమ్ - వాహనముగానున్న, ఇరుమ్శిఱై - విశాలమైనఱెక్కలుగల, పుళ్ అదువే - ఆ గరుత్మంతునియే, కొడియా - ధ్వజముగా, ఉయర్త్తానే - ఎత్తినవాఁడా! ఇదువోపొరుత్తమ్ - ఇదియాస్నేహము? ఎన్ఱెన్ఱు - అని పలుమాఱు చెప్పి, ఏజ్గి - ఎక్కిక్కి, అழுదక్కాల్ - ఏడిచినయెడల, ఇమ్మాఙ్ఞాలమ్ - ఈగొప్పభూమియొక్క, పొఱై - భారమును, తీర్ప్పాన్ - తీర్చుటకై, మదు - తేనె, వార్ - ప్రవహించుచున్న, శోలై - తోపులుగల, ఉత్తరమదురై - ఉత్తరమండలి మధురానగరమందు, పిఱన్ద - అవతరించిన, మాయన్ - ఆశ్చర్యభూతుఁడైన శ్రీకృష్ణుడు, ఎదువేయాగ - ఏమని, కరుదుజ్గొల్ - తలంచునో?

తా॥ ఓ గరుడవాహనుఁడా! ఓ గరుడధ్వజుఁడా! అని నేను పలుమాఱు చెప్పి యేడ్చినను, జగద్రక్షణార్థమై వచ్చి యవతరించిన శ్రీకృష్ణుఁడు నావిషయమై యేమి చేయవలయునని తలంచియున్నాడో తెలియలేదని. ౯.

పిఱన్దమాయాపారదమ్పొరుదమాయా నీయిన్నే*
శిఱన్దకాల్తీనీర్వాన్ మణ్పిఱవుమాయపెరుమానే*

కఱన్దపాలుళ్ నెయ్యేపోల్ ఇవత్ఱుళ్ ఎఙ్గుమ్ కణ్డుకొళ్ *
ఇఱన్దునిన్ఱ పెరుమాయా ఉన్నై యెఙ్గేకాణ్గేనే. ౧౦.

అ॥ పిఱన్ద - రామకృష్ణాద్యవతారములనెత్తిన, మాయా - ఆశ్చర్యభూతుఁడా! పారదమ్ - భారతయుద్ధమందు, పొరుద - యుద్ధముచేసిన, మాయా - ఆశ్చర్యభూతుఁడా! నీ_నీవు, ఇన్నే - ఇట్లు సులభుఁడవైయున్నను, శిఱన్ద - శ్లాఘ్యమైన (బలముగల), కాల్ - వాయు, తీ - అగ్ని, నీర్ - జలము, వాన్ - ఆకాశము, మణ్ - భూమి, (వీనికిన్ని), పిఱవుమ్ - తక్కినపదార్థములన్నింటికిని, ఆయ - అంతరాత్మయైన, పెరుమానే_గొప్పవాఁడా, కఱన్దపాలుళ్_పిండినపాలులో నున్న, నెయ్యేపోల్ - నెయ్యివలె, ఇవత్ఱుళ్ - ఈవస్తువులయందు, ఎఙ్గుమ్ - అంతట, కణ్డు కొళ్ - చూచుటకు, ఇఱన్దునిన్ఱ - అవతల (దృష్టికగోచరుఁడవై) ఉన్న, పెరుమాయా, - గొప్ప ఆశ్చర్యశక్తిగలవాఁడా! ఉన్నై - నిన్ను, ఎఙ్గేకాణ్గేన్ - ఎచ్చటనేవించెదను.

తా॥ ఓ శ్రియఃపతీ! నీవుసాధుపరిత్రాణార్థమై యవతరించిన యవతారములన్నియు గడచిపోయినవి. అప్పుడు నేను పుట్టకపోతిని. ఇప్పుడు నీవు సకలపదార్థముల యందంతరాత్మవై యున్నను నాకంటికగుపడకనున్నావు. ఇఁక నిన్నెప్పుడు నేను సేవించెదనని. ౧౦.

‡‡ ఎఙ్గేకాణ్గేనీన్దుழாయమ్మాన్దన్నై యానెన్ఱెన్ఱు *
అఙ్గేతాழ்న్దశొల్లాల్ అన్దణ్కురుగూర్చ్చడగోపన్ *
శెఙ్గేழ்శొన్నవాయిరత్తుళ్ ఇవైయుమ్పత్తుమ్వల్లార్గళ్ *
ఇఙ్గేకాణవిప్పిఱప్పేమగిழ்వర్ ఎల్లియుమ్కాలైయే. ౧౧.

అ॥ ఈన్ - భోగ్యమైన, తుழாయ్ - తిరుత్తుழாయిమాలగల, అమ్మాన్దన్నై - సర్వేశ్వరుని, ఎఙ్గే - ఎచ్చట, కాణ్గేన్ - సేవించెదను, ఎన్ఱెన్ఱు - అనిపలుమాఱుచెప్పి, అఙ్గే - ఆభోగ్యతయందు, తాழ்న్ద - ప్రవణములైన, శొల్లాల్ - శబ్దములచే, అమ్ - సుందరమై, తణ్ - చల్లనైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లు, శెఙ్గేழ் - మంచి ప్రకారముచే, శొన్న, - సాధించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవైయుమ్ పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్గళ్ - అభ్యసించువారు, ఇఙ్గే - ఈలోకమందే, ఇప్పిఱప్పే - ఈజన్మమందే, ఎల్లియుమ్కాలైయుమ్ - రేయింబగళ్ళు, కాణ - (భగవద్గుణములను) అనుభవించి, మగిழ்వర్ - ఆనన్దించుదురు.

తా॥ శ్రియఃపతియొక్క భోగ్యతయందతిప్రావణ్యముగల నమ్మాழ்వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు ఈభూలోకమందీజన్మమందే నిరతిశయానందము ననుభవింతురని. ౧౧.

ఆ ழ்వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

—•—

## ౮-వ, తిరువాయ్మొழி

అవతారిక:—ఆళ్వార్లు మిక్కిలి యార్తులై యుండగా, ఈయార్తి కొంచెము తగ్గినతరువాత వారితో సంశ్లేషింపవలయునని సర్వేశ్వరుఁడు సంకల్పించి పరమపదమునుండి మెల్లగా వచ్చి తిరుక్కడిత్తానములో వేంచేసియున్నాఁడని వర్ణించుచున్నారు.

※ ఎల్లియుమ్ కాలైయుమ్ తన్నై నినైన్దెழ*
నల్లవరుళ్ గళ్ నమక్కే తన్దరుళ్ శెయ్వాన్*
అల్లియ న్దణ్ణన్దుழాయ్ ముడి యప్పనూర్*
శెల్వర్ గళ్ వాழுమ్ తిరుక్కడిత్తానమే. ౧.

అ॥ ఎల్లియుమ్ కాలైయుమ్ - రాత్రింబగళ్ళు, తన్నై - తనను, నినైన్దు - ధ్యానించి, ఎழ - ఉజ్జీవించునట్లు, నల్ల - మంచిదైన (నిర్హేతుకములైన), అరుళ్ గళ్ - కృపలను, నమక్కే - మనకే, తన్దు - ఇచ్చి, అరుళ్ శెయ్వాన్ - (ఎల్లప్పుడును) కృపజేయువాఁడును, అల్లి - పుష్పముగలదై, అమ్ - సుందరమై, తణ్ణమ్ - చల్లనైన, తుழாయ్ - తిరుత్తుழாయిని, ముడి - కిరీటమందుగలవాఁడునైన, అప్పన్ - సర్వేశ్వరుఁడు (నిత్యవాసముజేయుచున్న), ఊర్ - దివ్యదేశము, శెల్వర్ గళ్ - (భగవత్కైంకర్యమనెడి) సంపత్తుగల శ్రీవైష్ణవులు, వాழுమ్ - నివసించుచున్న, తిరుక్కడిత్తానమ్ - తిరుక్కడిత్తానమనెడి దివ్యదేశము.

తా॥ నాయార్తినిదీర్చువాఁడు సర్వేశ్వరుఁడే వాఁడిప్పుడు నానిమిత్తమై తిరుక్కడిత్తానములో వేంచేసియున్నాఁడని. ౧.

తిరుక్కడిత్తానము మెన్నుడైచ్చిన్దైయుమ్*
ఒరుక్కడుత్తుళ్ళే యుఱైయుమ్బిరాన్ కణ్డీర్*
శెరుక్కడుత్తన్ఱు తిగైత్తవరక్కరై*
ఉరుక్కెడవాళిపొழிన్ద వొరువనే. ౨.

అ॥ అన్ఱు - ఆరావణయుద్ధమందు, శెరుక్కడుత్తు - గర్వించి, తిగైత్త - మతిభ్రష్టులైన, అరక్కరై - రాక్షసులయొక్క, ఉరు - శరీరము, కెడ - నశించునట్లు, వాళి - బాణములను, పొழிన్ద - వర్షించిన, ఒరువన్ కణ్డీర్ - ఏకవీరుఁడేసుమీ, తిరుక్కడిత్తానముమ్ - తిరుక్కడిత్తానమును, ఎన్నుడై - నాయొక్క, శిన్దైయుమ్ - మనస్సును, ఒరుక్కడుత్తు. ఒకప్పుడేవ్యాపించి, ఉళ్ళే - వానిలోపల, ఉఱైయుమ్ - వాసముజేయుచున్న, పిరాన్ - ఉపకారకుఁడు.

తా॥ రామావతారమం దసురులనుజంపినట్లు నాయొక్క సకలపాపములను బోఁగొట్టి తిరుక్కడిత్తానమందున్నవాఁడు ఇప్పుడు నాహృదయమందు వాసముజేయుచున్నాఁడని. ౨.

ఒరువరిరువరోర్ మూవరెననిన్ఱు*
ఉరువుకరన్దుళ్ళుந்தోఱుమ్ తిత్తిప్పాన్*
తిరువమర్ మార్వన్ తిరుక్కడిత్తానత్తై*
మరువియుఱైగిన్ఱ మాయప్పిరానే. 3.

అ॥ ఒరువర్ - ఒకరు, ఇరువర్ - ఇద్దరు, మూవర్ - ముగ్గురు, ఎన - అనునట్లు, నిన్ఱు - (రాక్షసులకు గనుపడునట్లు) ఉండి, ఒర్ - అద్వితీయమైన, ఉరువు - తిరుమేనును, కరన్దు - (వారి) కంటికగుపడకుండ చేసి, (లంకానగరమందలి మూలబలయుద్ధమందు రాక్షసులమీద బాణములను ప్రయోగించినవాఁడును,) తిరు - శ్రీదేవి, అమర్ - వేంచేసియున్న, మార్వన్ - వక్షస్థలముగల వాఁడును, తిరుక్కడిత్తానత్తై - తిరుక్కడిత్తానమందు, మరువి - అమరియుండి, ఉఱైగిన్ఱ - వాసముజేయుచున్న, మాయప్పిరాన్ - ఆశ్చర్యభూతుఁడునైన సర్వేశ్వరుఁడు, ఉళ్ళున్దోఱుమ్ - తలంచినప్పుడంత, తిత్తిప్పాన్ - మధురముగా (ప్రియముగా) నున్నాడు.

తా॥ మూలబలముతో యుద్ధముజేయునప్పుడు రాక్షసులకు కొంతకాల మొకరుగాను కొంతకాలమిద్దరుగాను కొంతకాలమనేక శ్రీరాములున్నారనునట్లును కొంతకాలమేమియు కనుపడక తానంతర్ధానమైయుండియు రాక్షసులను జంపిన సర్వేశ్వరుఁడు శ్రీదేవితోగూడ తిరుక్కడిత్తానమందు వేంచేసియుండి, నేను ధ్యానించినప్పుడంత నాకు మిక్కిలి యానన్దమును గలుగ జేయుచున్నాడని. 3.

మాయప్పిరా నెనవల్వినై మాయ్న్దఱ*
నేశత్తినాల్ నెఞ్జమ్ నాడుకుడికొణ్డాన్*
తేశత్తమరర్ తిరుక్కడిత్తానత్తై*
వాళప్పొఴిల్ మన్ను కోయిల్కొణ్డానే. ౪.

అ॥ తేశమ్ - తేజస్సుగల, అమరర్ - నిత్యసూరులకు (ప్రాప్యమై), వాళమ్ - పరిమళించుచున్న, పొఴిల్ - తోటలు, మన్ను - అమరియున్న, తిరుక్కడిత్తానత్తై - తిరుక్కడిత్తానమును, కోయిల్కొణ్డాన్ - వాసస్థానముగా స్వీకరించిన, మాయప్పిరాన్ - ఆశ్చర్యభూతుఁడైన సర్వేశ్వరుఁడు, ఎనవల్వినై - నాచెడ్డకర్మములు, మాయ్న్దఱ - నశించిపోవునట్లు, నేశత్తినాల్ - స్నేహముచే, నెఞ్జమ్ - (నా) మనస్సనెడి, నాడు - దేశమును, కుడికొణ్డాన్ - వాసస్థానముగాజేసికొనెను.

తా॥ నిత్యసూరిసేవ్యంబైన తిరుక్కడిత్తానమందు సర్వేశ్వరుఁడు ముందు వచ్చి ప్రవేశించి, ఇప్పుడు నామనస్సునే వాసస్థానముగా స్వీకరించెనని. ౪.

కోయిల్కొణ్డాన్ఱన్ తిరుక్కడిత్తానత్తై*
కోయిల్కొణ్డా నదనోడుమెన్నెఞ్జగమ్*
కోయిల్కొళ్ తెయ్వమెల్లామ్తొఴ* వైగున్దమ్
కోయిల్కొణ్డ కుడక్కూత్తవమ్మానే. ౫.

అ॥ కోయిల్కొళ్ - కోవిలలుగల, తెయ్వమెల్లామ్ - (అనన్తగరుడ విష్వక్సేనాది) నిత్యసూరులందరు, తొఴ - ఆశ్రయించునట్లు, వైగున్దమ్ - శ్రీవైకుణ్ఠమును, కోయిల్కొణ్డ - వాసస్థానముగాస్వీకరించినవాఁడును, కుడక్కూత్తవమ్మాన్ - కుమ్భనృత్యముజేసినవాఁడునైన సర్వేశ్వరుఁడు, తిరుక్కడిత్తానత్తై - తిరుక్కడిత్తానమును, తన్ కోయిల్కొణ్డాన్ - తనకు వాసస్థానముగా

స్వీకరించెను. అదనోడుమ్ - అతిరుక్కడిత్తానముతోఁగూడ, ఎన్ నెఞ్జగమ్ - నామనస్సును, కోయిల్ కొణ్డాన్ - వాసస్థానము గా స్వీకరించెను.

తా॥ నిత్యసూరులాశ్రయించుటకై శ్రీవైకుణ్ఠమందు వేంచేసియుండి నన్ను బరిగ్రహించుటకై తిరుక్కడిత్తానమందు వేంచేసిన సర్వేశ్వరుఁడిప్పుడు నాహృదయమందుఁబ్రవేశించినాఁడని. ౫.

కూత్త వమ్మాన్ కొడియేనిడర్ ముற்றుమ్*
మాయ్త్త వమ్మాన్ మదుసూదవమ్మానుఱై*
పూత్తపొழிల్ తణ్ తిరుక్కడిత్తానత్తై*
ఏత్త నిల్లా కుఱిక్కొణ్మినిడరే. ౬.

అ॥ కూత్త - మనోహరమైన దివ్యచేష్టితములుగల, అమ్మాన్ - స్వామియు, కొడియేన్ - పాపినైయైననాయొక్క, ఇడర్ ముற்றுమ్ - (భగవద్విశ్లేష) దుఃఖమును, మాయ్త్త - నశింపఁజేసిన, అమ్మాన్ - స్వామియు, మదుసూదన్ - మధువనెడి రాక్షసునిజంపిన, అమ్మాన్-స్వామియునైన సర్వేశ్వరుఁడు, ఉఱై - నిత్యవాసముజేయుచున్నదియు, పూత్త-పుష్పించిన, పొழிల్ - తోటలుగలదియు, తణ్ - చల్లనైనదియునైన, తిరుక్కడిత్తానత్తై - తిరుక్కడిత్తానమును, ఏత్త-స్తోత్రముజేయగా, ఇడర్ - దుఃఖములు, నిల్లా - నిలువవు. కుఱిక్కొణ్మిన్ - (దీనిని) మనస్సునందుఁచుఁడి.

తా॥ ఓచేతనులారా! ఆశ్రితవిరోధులను నశింపఁజేయుచున్న సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరుక్కడిత్తానమును మీరు స్తోత్రముజేసితిరేని మీపాపములన్నియు నశించునని. ౬.

కొణ్మినిడర్ కెడ వుళ్ళత్తుక్కోవిన్దన్*
మణ్ విణ్ ముழுదుమళన్ద వొణ్ తామరై*
మణ్ణవర్ తామ్ తొழுదేత్త వానవర్ తామ్ వన్దు*
నణ్ణుతిరుక్కడిత్తాననగరే. ౭.

అ॥ మణ్ - భూమినిన్ని, విణ్ - ఆకాశమునున్న, ముழுదుమ్ - సంపూర్ణముగా, అళన్ద - కొలిచిన, కోవిన్దన్ - గోవిందునియొక్క, ఒణ్ - సుందరమైన, తామరై - శ్రీపాదపద్మమును, మణ్ణవర్ తామ్ - భూలోకమందున్నవారు, తొழு - ఆశ్రయించునట్టిదియు, వానవర్ తామ్ - నిత్యసూరులును, వన్దు - వచ్చి, నణ్ణుమ్ - ఆశ్రయించునట్టిదియునైన, తిరుక్కడిత్తాననగరై - తిరుక్కడిత్తానమనెడి దివ్యదేశమును, ఇడర్ - దుఃఖమంతయు, కెడ - నశించునట్లు, ఉళ్ళత్తు - హృదయమందు, కొణ్మిన్ - ఉంచుఁడి.

తా॥ ఓచేతనులారా! ఉభయవిభూతియువచ్చి తనశ్రీపాదముల నాశ్రయించునట్లు సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరుక్కడిత్తానమునుదలంచినమాత్రముచేత నీసమస్తపాపములునశించునని.

తాననగర్ గళ్ తలై చ్చిఱన్దెఙ్గుమ్*
వానిన్నిలమ్ కడల్ ముற்றుమెమ్మాయఱ్కే*
ఆనవిడత్తుమెన్నెఞ్జుమ్ తిరుక్కడి
త్తాననగరుమ్* తనతాయప్పదియే. ౮.

అ॥ వాన్ - పరమపదము, ఇన్నిలమ్ - ఈభూలోకము, కడల్ - క్షీరాబ్ధి, ఎల్లామ్ - ఇవన్ని దేశములయందున్న, పదిగళ్ - దివ్యదేశములు, ముత్తుమ్ - అన్నియు, తలైచ్చిఱన్ద - శ్లాఘ్యములైన, తానమ్ - వాసస్థానములై, ఆనవిడత్తుమ్-అయియున్నను, ఎన్ నెఞ్జుమ్ - నామన స్సునున్ను, తిరుక్కడిత్తాననగరుమ్ - తిరుక్కడిత్తానమనెడి దివ్యదేశమునున్ను, తన్ - తనకు, తాయమ్ - దాయభాగమందులంభించిన, పది - స్థానము(గా తలంచియున్నాడు).

తా॥ తాను వేంచేసియున్న దివ్యదేశము లనేకములున్నప్పటికిన్ని సర్వేశ్వరుఁడు నా మనస్సునున్ను తిరుక్కడిత్తానమునునే మిక్కిలి యాశించుచున్నాడని. ౮.

తాయప్పదిగళ్ తలైచ్చిఱన్దెఙ్గుమ్*
మాయత్తినాల్ మన్ని వీత్తిరున్దానుఱై*
తేశ తమరర్ తిరుక్కడిత్తానత్తుళ్*
ఆయర్కడిపతి యఱ్పుదన్ తానే. ౯.

అ॥ తలైచ్చిఱన్ద - మిక్కిలిశ్లాఘ్యములై, తాయమ్-అనాదిసిద్ధములైయున్న, పదిగళ్ - దివ్యదేశములు, ఎఙ్గుమ్ - అన్నింటిలోను, ఉఱై - నిత్యవాసము జేయుచున్నవాఁడును, ఆయర్కడిపతి - గోపలకునాయకుఁడునునైన, అఱ్పుదన్ తాన్ - ఆశ్చర్యభూతుఁడు, తేశమ్ - తేజస్సుగల, అమరర్ - నిత్యసూరులకు (ప్రాప్యస్థానమైన), తిరుక్కడిత్తానత్తుళ్ - తిరుక్కడిత్తానమందు, మాయత్తినాల్ - సఙ్కల్పముచే, మన్ని - అమరికతో, వీత్తిరున్దాన్ - వేంచేసియున్నాఁడు.

తా॥ అన్ని దివ్యదేశములును సర్వేశ్వరునికి యనాదిసిద్ధములైయున్నప్పుడికిన్ని, నన్నఙ్గీకరించుట కనుకూలమైనదని తిరుక్కడిత్తానమును మిక్కిలి యాదరించినాఁడని. ౯.

అఱ్పుదన్ నారాయణ నరివామనన్*
నిఱ్పదు మేవియిరుప్ప దెన్నెఞ్జగమ్*
నఱ్పుగழ் వేదియర్ నాన్మఱై నిన్ఱదిర్*
కఱ్పగచ్చోలై త్తిరుక్కడిత్తానమే. ౧౦.

అ॥ నల్ పుగழ் -మంచికీర్తిగల, వేదియర్ - వైదికశ్రీవైష్ణవులచే నధ్యయనము చేయబడిన, నాల్ మఱై - నాల్గువేదములు, నిన్ఱు - ఎల్లప్పుడునునుండి, అదిర్ - ఘోషించుచున్నదియు, కఱ్పగచ్చోలై-కల్పవృక్షములయొక్క తోపులుగలదియునైన, తిరుక్కడిత్తానత్తు-తిరుక్కడిత్తానమందు వేంచేసియున్నవాఁడును, అరి-(ఆశ్రితులపాపమును) పోగొట్టువాఁడును, వామనన్-వామనావతారమెత్తినవాఁడును, అఱ్పుదన్ - ఆశ్చర్యభూతుఁడునైన, నారాయణన్ - శ్రీమన్నారాయణుఁడు, నిఱ్పదుమ్ - నిలుచుటయు, మేవియిరుప్పదుమ్ - అమరివేంచేసియుండుటయు, ఎన్నెఞ్జగమ్ - నామనస్సనంయు.

తా॥ సర్వశేషియైన శ్రీమన్నారాయణుఁడు ఇదివఱలో తిరుక్కడిత్తానమందు వేంచేసియుండి ఇప్పుఁడు నామనస్సనందే నత్యాదరముతో వేంచేసియున్నాఁడని. ౧౦.

‡‡ శోలై త్తిరుక్కడిత్తాన త్తుఱై తిరు
మాలై *మదిళ్ కురుగూర్ చ్చడగోపన్ శొల్*
పాలోడముదన్న వాయిర త్తిప్పత్తుమ్*
మేలై వైగున్ద త్తిరుత్తుమ్వియన్దే. ౧౧.

అ॥ శోలై - తోటలచేచుట్టబడిన, తిరుక్కడిత్తానత్తు - తిరుక్కడిత్తానమందు, ఉఱై - నిత్యవాసముచేయుచున్న, తిరుమాలై - శ్రియఃపతివిషయమై, మదిళ్ - ప్రాకారములుగల, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్-పాడిందిన, పాలోడు-పాలులోగలిసిన, అముదన్న - అమృతమువలెనున్న, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, (ఇయన్దు) - (తననునుసంధించువారివిషయమై) సంతోషించి, మేలై - శ్రేష్ఠమైన, వైగున్దత్తు - శ్రీవైకుణ్ఠమందు, ఇరుత్తుమ్ - స్థాపించిరక్షించును.

తా॥ తిరుక్కడిత్తానమందు వేంచేసియున్న శ్రియఃపతివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన మధురమైన యీపదిపాశురముల నభ్యసించువారు, శ్రీవైకుణ్ఠమును బొందుదురని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్

జీయర్ తిరువడిగళే శరణమ్

౭ - వ, తిరువాయ్మొழి.

---

అవతారిక:—ఈతిరువాయ్మొழిలో, ఆళ్వార్లయొక్క ఆర్తితీరునట్లు వారితో సర్వేశ్వరుఁడు సంశ్లేషించగా, ఇది స్వప్నమో లేక చిత్తభ్రమమోయని సందేహించి, తరువాత ఇది యథార్థమేయనినిశ్చయించి ప్రీతిపరవశులై యగుచున్నారు:

‡‡ ఇరుత్తుమ్వియన్దెన్నై త్తన్పొన్నడిక్కీழ్*
అరుత్తిత్తెన్నెత్తోర్ పలనాళ్ఱ్ఱత్తేఱ్కు*
పొరుత్తముడై వామనన్ఱాన్ పుగున్దు*ఎన్ఱన్
కరుత్తైయుఱ వీఱ్ఱిరున్దాన్ కణ్డుకొణ్డే. ౧.

అ॥ ఎన్నై - నన్ను, తన్ - తనయొక్క, పొన్ - అందమైన, అడిక్కీழ్ - శ్రీపాదములక్రింద, వియన్దు - సంతోషపడి, ఇరుత్తుమ్ - ఉంచును (అని), అరుత్తిత్తు - ప్రార్థించి, ఎన్నెత్తోర్ పలనాళ్ - అనేక కాలములు, అఴైత్తేఱ్కు - పిలిచినవానివిషయమై, పొరుత్తముడై - స్నేహముగల, వామనన్ - వామనుఁడు, తాన్ - తానే, పుగున్దు - ప్రవేశించి, ఎన్ఱన్-నాయొక్క, కరుత్తై - మనోరథమును, ఉఱ - పొంది (నేనాళ్వార్ల నట్లుల్ప ప్రకారముండవలసిన వాఁడవని సంకల్పించి), కణ్డుకొణ్డు - (నన్ను) కటాక్షించుచు, వీఱ్ఱిరున్దాన్ - వేంచేసియున్నాఁడు.

తా॥ "ఓ శ్రియఃపతీ! నన్ను నీశ్రీపాదములక్రింద చేర్చుకొనవలయు"నని నేను ప్రార్థింప సర్వేశ్వరుఁడు నాప్రార్థనను స్వీకరించి ఉక్కిలియాడరముతో నాయునన్నులో వేంచేసియున్నాఁడని

ఇరున్దార్ కణ్డుకొణ్డెన దేழை నెఞ్జాళుమ్*
తిరున్దాదవోరైవరై త్తేయ్న్దఅఱమన్ని*
పెరున్దాళ్ కళిఱ్ఱుక్కరుళ్ శెయ్ద పెరుమాన్*
తరున్దానరుళ్ తాన్ ఇనియానఱియేనే. ౨.

అ॥ ఎనదు - నాయొక్క, ఏழை - చపలమైన, నెఞ్జు - మనస్సును, ఆళుమ్ - స్వాధీనము చేసికొనినవై, తిరున్దాద - అణగనివియునై, ఓర్ - క్రూరములైన, ఐవరై - పంచేంద్రియములును, తేయ్న్దు - క్షీణించి, అఱ - నశించునట్లు, కణ్డుకొణ్డు - కటాక్షించుచు, మన్ని - అమరికతో, ఇరున్దాన్ - (నామనస్సులో) ఉన్నాడు; పెరున్దాళ్ - గొప్పపాదములుగల, కళిఱ్ఱుక్కు - (శ్రీగజేన్ద్రాళ్వార్లకు, అరుళ్ శెయ్ద - కృపచేసిన, పెరుమాన్ - సర్వేశ్వరుడు, తాన్ - తాను, తరుమ్ - (గజేన్ద్రునికి) ఇచ్చెడి, అరుళ్ తాన్ - అనుగ్రహమును, ఇని - ఇంకమీద, యాన్ - నేను, అఱియేన్ - (ఒకగొప్పదిగా) తలంచను.

తా॥ సర్వేశ్వరుడు నాపంచేంద్రియములయొక్క దుర్వ్యాపారములను బోగొట్టి నన్ను గ్రహించి నామనస్సులో వేంచేసియున్న దానికంటె గజేంద్రాళ్వార్ల విషయమై మును పు చేసిన యనుగ్రహ మెంతగొప్పది కాదని. ౨

అరుళ్ తాన్ ఇని యానఱియేన్ అవనెన్నుళ్*
ఇరుళ్ తాన్ అఱ వీఱ్ఱిరున్దాన్ ఇదువల్లాల్*
పొరుళ్ తాన్ ఎనిల్ మూవులగుమ్ పొరుళల్ల*
మరుళ్ తానీదో తూమదుమాయమయక్కే. ౩.

అ॥ అరుళ్ తాన్ - (మునుపు చేసిన) అనుగ్రహమును కూడ, ఇని - ఇప్పుడు, యాన్ - నేను, అఱియేన్ - (గొప్పదిగా) ఎంచను. (ఏలననగా), అవన్ - ఆసర్వేశ్వరుడు, ఎన్నుళ్ - నాహృదయమందున్న, ఇరుళ్ తాన్ - అజ్ఞానమును, అఱ - నశించునట్లు, వీఱ్ఱిరున్దాన్ - వేంచేసియున్నాడు ఇదువల్లాల్ - ఇదిగాక, పొరుళ్ తాన్ ఎనిల్ - (సర్వేశ్వరునికింతకంటె మేలైన) పురుషార్థము కలదాయని విచారించినయెడల, మూవులగుమ్ - మూడులోకములును, పొరుళల్ల - (వానికి) పురుషార్థముకాదు. ఈదు తాన్ - ఇది, మరుళో - (నాయొక్క) భ్రమమో? మాయమ్ - ఆశ్చర్యకరంబులైన, మయక్కు - భ్రామక వ్యాపారములచే, మయక్కే - (వాడు) భ్రమింపజేసెనో?

తా॥ సర్వేశ్వరుడు తనకుసమస్త పురుషార్థములకంటె నిదియే మేలైనదనితలంచి నాయజ్ఞానములను బోగొట్టి నామనస్సులోనే వేంచేసియున్నాడు. నాకునింతకంటె గొప్పపురుషార్థము లేదు. (అనికొంచెము యోచించి) నాయందు వానికింత యనుగ్రహముండ్డేయుట్ల యసంభావితము గాన నిదిస్వప్నముగా నేనే భ్రమించియుండవచ్చునని. ౩.

మాయమయక్కుమయక్కాన్ ఎన్నై వఞ్జిత్తు*
ఆయనమరర్ క్కరియేత్తెన దమ్మాన్*
తూయశుడర్ చ్చోది తనదెన్నుళ్ వైత్తాన్*
తేశమ్ తిగழுమ్ తన్ తిరువరుళ్ శెయ్దే. ౪.

అ॥ అమరర్ క్కు - నిత్యసూరులకు, అరియేఱు - సింహశ్రేష్ఠమై, అయన్ - శ్రీకృష్ణుఁడైన, ఎన్ దమ్మాన్ - నాస్వామి, తేశమ్ తిగழும் - దేశమంతయు, ప్రసిద్ధమగునట్లు, తన్ - తనయొక్క, తిరుఅరుళ్ - నిర్హేతుకకృపను, శెయ్‌దు - చేసి, తనదు - తనయొక్క, తూయ - నిర్మలమై, శుడర్ - ఉజ్జ్వలమైన, శోది - తేజోమయదివ్యవిగ్రహమును, ఎన్నుళ్ - నాహృదయమందు, వైత్తాన్ - ఉంచెను. ఎన్నై - నన్ను, వఞ్జిత్తు - వంచనచేసి, మాయమ్ - ఆశ్చర్యకరంబులైన భ్రామకవ్యాపారములచే, మయక్కాన్ - భ్రమింపఁజేయఁడు.

తా॥ సర్వేశ్వరుఁడు లోకమంతయు ప్రసిద్ధమగునట్లు నామనస్సులోనే యథార్థముగా వేంచేసియున్నాఁడేగాని యిది భ్రమకాదని. ४.

తిగழும்తణ్ తిరువరుళ్ శెయ్ దులగత్తార్
పుగழும்పుగழ் తానదుకాట్టి త్తన్దెన్నుళ్
తిగழும்మణిక్కున్ఱమొన్ఱే యొత్తునిన్ఱాన్
పుగழும்పుగழ் మత్తెనక్కుమోర్ పొరుళే. ౫.

అ॥ తిగழும் - ప్రకాశించుచున్న, తన్ తిరువరుళ్ - తననిర్హేతుకకృపను, శెయ్‌దు - చేసి, ఉలగత్తార్ - లోకమందున్నవారు, పుగழும் - కొనియాడెడి, అదుపుగழ் - ఆకొనియాడుటను, తాన్ - తాను, కాట్టిత్తన్దు - చూపించి, ఎన్నుళ్ - నాహృదయమందు, తిగழும் - ప్రకాశించుచున్న, ఒన్ఱు - ఒక, మణిక్కున్ఱమొత్తు - మాణిక్యపర్వతముతో సమానుఁడై, నిన్ఱాన్ - ఉన్నాఁడు. ఎనక్కు - నాకు, మత్తు - వేఱైన, పుగழும்పుగழ் - కొనియాడెడి కొనియాడుట, ఓర్ పొరుళే - ఒకపురుషార్థము (అని తలంపవచ్చునా?)

తా॥ నావిషయమై సర్వేశ్వరుఁడెంత ఉపకారముజేసినాఁడని లోకమంతయుఁ గొనియాడునట్లు నాహృదయమందత్యాదరముతో వేంచేసియున్న కీర్తికంటెవానికిమఱియొకగొప్పకీర్తిలేదని

పొరుళ్ మత్తెనక్కుమోర్ పొరుళ్ తన్నిల్ శీర్ క్క
త్తరుమేల్ పిన్నైయార్ క్కవన్ తన్నైక్కొడుక్కుమ్
కరుమాణిక్కక్కున్ఱత్తుత్ తామరై పోల్
తిరుమార్ బుకాల్ కణ్ కై శెవ్వాయున్దియానే. ౬.

అ॥ కరుమాణిక్కక్కున్ఱత్తు - నీలమాణిక్యమయపర్వతముమీఁద నున్న, తామరై పోల్ - తామరపుష్పములవలె శోభిల్లుచున్న, తిరుమార్వు - శ్రీదేవీనివాసస్థానమైన వక్షస్థలమును, కాల్ - శ్రీపాదము, కణ్ - నేత్రము, కై - శ్రీహస్తము, శెమ్ - ఎఱ్ఱని, వాయ్ - అధరము, ఉన్దియాన్ - తిరునాభి వీనినిగల సర్వేశ్వరుఁడు, మత్తు - వేఱైన, పొరుళ్ తన్నిల్ - పురుషార్థములలో, ఎనక్కు - నాకు, ఓర్ - ఒక, శీర్ క్క - శ్లాఘ్యమైన, పొరుళ్ - పురుషార్థమును, తరుమేల్ - ఇచ్చినయెడల, పిన్నై - మఱియు, అవన్ తన్నై - వానిని, యార్ క్కు - ఎవరికి, కొడుక్కుమ్ - ఇచ్చును?

తా॥ అర్థ్యార్థులకు మఱియొక పురుషార్థమునిచ్చితినేని నన్ను పురుషార్థముగా స్వీకరించు వారెవరు లేరు గాన వీరికే నన్నిచ్చెదనని తలంచి సర్వేశ్వరుఁడు నాయందు మిక్కిలి యాదరముతో తనదివ్యస్వరూపమును సాక్షాత్కరించినాడని. ౬.

శెవ్వాయ్ యున్ఱి వెళ్ పల్ శుడర్ క్కుழై తన్నొడుమ్*
ఎవ్వాయ్చ్చుడరుమ్ తమ్మిల్ మున్ వళాయ్క్కొళ్ళ*
శెవ్వాయ్ముఱువలోడు ఎనదుళ్ళత్తిరున్ద*
అవ్వాయన్ఱి యానఱియేన్ మత్తరుళే. ౭.

అ॥ శెమ్ - ఎఱ్ఱని, వాయ్ - అధరము, ఉన్ఱి - సాక్షి, వెళ్ - తెల్లని, పల్ - దంతములు, శుడర్ - ఉజ్జ్వలమైన, కుழై - మకరకుండలము, తన్నొడుమ్ - వీనితోఁగూడ, ఎవ్వాయ్ - సమస్తావయవములయొక్క, శుడరుమ్ - కాన్తియు, తమ్మిల్ - తమలో, మున్ను - (ఒకదానికంటె నొకటి) ముందుగావచ్చి, వళాయ్క్కొళ్ళ - (నన్ను) చుట్టుకొనగా, శెమ్వాయ్ - ఎఱ్ఱని యధరముమీఁద విలసిల్లుచున్న, ముఱువలోడు - మన్దహాసముతోఁగూడ, ఎనదుళ్ళత్తు - నాహృదయమందు, ఇరున్ద - వేంచేసియున్న, అవ్వాయన్ఱి - ఆవిధమును తప్ప, యాన్ - నేను, మత్తు అరుళ్ - వేఱొకవిధమును, అఱియేన్ - ఎఱుఁగను

తా॥ అత్యద్భుతమైన తనదివ్యావయవ సౌందర్యముతోఁగూడ సుందరమందహాసము జేయుచు నాహృదయమందు వేంచేసియున్న విధమునుతప్ప నేను మఱియొకదానిని స్మరించనని. ౭.

అఱియేన్ మత్తరుళ్ ఎన్నై యాళుమ్ పిరానార్*
వెఱిదే యరుళ్ శెయ్వర్ శెయ్వార్ గట్కుగన్దు*
శిఱియేనుడై చ్చిన్దైయుళ్ మూవులగుమ్* తన్
నెఱియావయిత్తిల్ కొణ్డు నిన్ఱొழிన్దారే. ౮.

అ॥ మత్తు అరుళ్ - వేఱు ఉపకారమును, అఱియేన్ - ఎఱుఁగను. ఎన్నై - నన్ను, ఆళుమ్ - దాస్యముఁజేయుచుకొనిన, పిరానార్ - స్వామి, శెయ్వార్గట్కు - తనచేతనంగీకరింపఁదగిన వారికి, ఉగన్దు - సన్తోషించి, వెఱిదే - నిర్హేతుకముగానే, అరుళ్ శెయ్వర్ - కృపఁజేయును. మూవులగుమ్ - మూఁడులోకములను, నెఱియా - ఒక ఉపద్రవమును రాకుండునట్లు, తన్ వయిత్తిల్ కొణ్డు - తనయుదరమందుంచుకొని, శిఱియేనుడై - అల్పుఁడునైననాయొక్క, శిన్దైయుళ్ - హృదయమందు, నిన్ఱొழிన్దార్ - వేంచేసియుండెను.

తా॥ సర్వేశ్వరుఁడు మూఁడులోకములను తనయుదరమందుంచుకొని నాహృదయమందు వేంచేసియున్నాడు. దానికిఁ గారణము వానియొక్క నిర్హేతుక కృపయేయని. ౮.

వయిత్తిల్ కొణ్డు నిన్ఱొழிన్దారుమ్ యవరుమ్*
వయిత్తిల్ కొణ్డు నిన్ఱొరుమూవులగుమ్* తమ్
వయిత్తిల్ కొణ్డు నిన్ఱ వణ్ణమ్ నిన్ఱమాలై*
వయిత్తిల్ కొణ్డు మన్నువరే లెమాదియాలే.

అ॥ వయిత్ర్ త్రిల్ కొణ్డు నిణ్ణ్ట్రివారమ్ - (లోకములను) తనయుదరమందుంచుకొని రక్షించునట్లు రక్షించు క్షత్రియాదులనున్ను, యువరుమ్ - వారికంటె శ్రేష్ఠులైన బ్రహ్మాదులనున్ను, వయిత్ర్ త్రిల్ కొణ్డు-(వానినిగూడ) తనగర్భమందుంచుకొని, ఒరు-అద్వితీయమైన, మూవులగుమ్ - త్రైలోక్యమునున్ను, వయిత్ర్ త్రిల్ కొణ్డు - తనయుదరమందుంచుకొని, నిణ్ణ వణ్ణమ్ - మున్దున్న విధముగా (నిర్వికారుడై), నిన్ఱ - వేంచేసియున్న, మాలై - సర్వేశ్వరుని, మదియాలే - సమ్మతి చేత, వయిత్ర్ త్రిల్ కొణ్డు - హృదయమందు స్వీకరించి, మన్న - అమరియుండునట్లు, వైత్తేన్ - ఉంచుకొంటిని.

తా॥ త్రైలోక్యములోఁగూడ సర్వేశ్వరుఁడువచ్చి నామనస్సునందు వేంచేసియుండుటకుఁ గారణమేమనగా, వాడు నామనస్సులో ప్రవేశించునప్పుడు నేను నిషేధించక యుండడమని. ౯.

వైత్తేన్మదియాలెనదుళ్ళత్తగత్తే*
ఎయ్‌త్తేయొழிవేనల్లే నెన్ఱుమెప్పోదుమ్*
మొయ్‌త్తేయ్‌తిరై మోదుతణ్పాఱ్కడలుళాల్*
పైత్తేయ్‌శుడర్‌ప్పామ్బణై నమ్బరనై యే. ౧౦

అ॥ ఏయ్ - (వానిమార్దవమునకు) తగినైన, తిరై - అలలు, మొయ్‌త్తు - నిరన్తరముగా, మోదు - కొట్టుచున్న, తణ్ - చల్లనైన, పాఱ్కడలుళ్ - క్షీరాబ్ధియందు, పైత్తు - విశాలములైన ఫణములు గలవారును, ఏయ్ - (తిరుమేనుకు) తగునైన (సౌకుమార్యముగల) వారును, శుడర్ - తేజస్సుగలవారునైన, పామ్బు - ఆదిశేషుని, అణై - శయ్యగాగల, నమ్బరనై - మన స్వామిని, ఎనదు - నాయొక్క, ఉళ్ళత్తగత్తే - హృదయములోపల, మదియాల్ - అనుమతిచేత, వైత్తేన్ - ఉంచితిని. ఎన్ఱుమ్ - సర్వకాలములయందును, ఎప్పోదుమ్ - సర్వదేశములయందును, ఎయ్‌త్తేయొழிవేనల్లేన్ - విశ్లేషించి దుఃఖపడను.

తా॥ క్షీరాబ్ధియందలి యనన్తశాయియైన సర్వేశ్వరుని నాహృదయమందుంచుకొంటిని. ఇఁక వానినెడబాసి క్లేశమననుభవించనని. ౧౦

‡‡ శుడర్‌ప్పామ్బణై నమ్బరనై త్తిరుమాలై*
అడిచ్చేర్వగై వణ్కురుగూర్చ్చడగోపన్*
ముడిప్పాన్ శొన్న వాయిరత్తిప్పత్తుమ్‌శన్మమ్
విడత్తేయ్‌న్దఱనోక్కుమ్ తన్‌కణ్గళ్‌శివన్దే. ౧౧.

అ॥ శుడర్ - తేజస్సుగల, పామ్బు - ఆదిశేషుని, అణై - శయ్యగాగల, నమ్బరనై - మన స్వామియొక్క, అడి - శ్రీపాదములను, శేర్వగై - చేరునట్లు, ముడిప్పాన్ - (సంసారమును) పోగొట్టుటకై, వణ్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికి స్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొన్న - సాధించిన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈ పది పాశురములును, శన్మమ్ - జన్మము, అఱ తేయ్‌న్దు - నిర్మూలించి, విడ - నశించునట్లు, తన్ కణ్గళ్ - తన నేత్రములు, [illegible]

తా॥ శ్రియఃపతియొక్క శ్రీపాదములను జేరునట్లును సంసారము నశించునట్లును నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీ పదిపాశురములు సంసారమునకు వినాశకములగును (ఈ పాశురములననుసంధించువారికి సంసారమునశించునని). ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

---

౮ - ౮, తిరువాయ్మొழி.

---

అవతారిక :— ఈ తిరువాయ్మొழிలో, నామహిమనున్న తమనైచ్యమునున్ననుసంధించి నన్ను బొందుటకు విరక్తులగుదురో యేమోయని సర్వేశ్వరుఁడాలోచించి, మీరొక్క, దివ్యాత్మస్వరూపము నాకు కౌస్తుభాదులవలె మిక్కిలి శ్లాఘ్యమై భోగ్యమైయుండునని యాళ్వార్లకుఁ గనుపఱచగా యట్టి తమస్వరూపము ననుభవించుచున్నారు.

౹౹ కణ్గళ్ శివన్దుపెరియవాయ్ వాయుమ్శివన్దుకనిన్దు* ఉళ్ళే
వెణ్పలిలగుశుడరిలగు విలగుమగరకుణ్డలత్తన్*
కొణ్డల్వణ్ణన్ శుడర్ముడియన్ నాన్గుతోళన్ కునిశార్ఙ్గన్*
ఒణ్ శఙ్గదై వాళాழிయాన్ ఒరువనడియేనుళ్ళానే. ౧.

అ॥ శివన్దు - ఎఱ్ఱనై, పెరియవాయ్ - విశాలములైయున్న, కణ్గళ్ - నేత్రములనున్న, శివన్దు - ఎఱ్ఱనై, కనిన్దు - పండియున్న (పండువలెనున్న), వాయుమ్ - అధరమునున్ను, ఉళ్ళే - లోపల, ఇలగు - (వ్యాపించి) ప్రకాశించుచున్న, శుడర్ - కాన్తిగల, వెణ్పల్ - తెల్లనిదంతములనున్ను, ఇలగు - ప్రకాశించుచు, విలగు - చలించుచున్న, మకరకుణ్డలత్తన్ - మకరకుండలములనున్ను గలవాఁడును, కొణ్డల్ - మేఘమువంటి, వణ్ణన్ - కాన్తిగలవాఁడును, శుడర్ - ఉజ్జ్వలమైన, ముడియన్ - కిరీటముగలవాఁడును, నాన్గుతోళన్ - నాల్గుభుజములుగలవాఁడును, కుని - వంగియున్న, శార్ఙ్గన్ - శార్ఙ్గమనెడి ధనుస్సుగలవాఁడును, ఒణ్ - సుందరమైన, శఙ్గు - శ్రీపాఞ్చజన్యమునున్ను, కదై - గదనున్ను, వాళ్ - నన్దకమునున్ను, ఆழிయాన్ - సుదర్శనమునున్ను గలవాఁడును, ఒరువన్ - అద్వితీయుఁడునైన శ్రియఃపతి, అడియేన్ - దాసునియొక్క, ఉళ్ళాన్ - హృదయమందు క్షేమంచేసియున్నాడు.

తా॥ సర్వేశ్వరుఁడు, పద్మనేత్రుఁడై కాళమేఘశ్యాముఁడై చతుర్భుజుఁడై శఙ్ఖచక్రాది దివ్యాయుధోపేతుఁడై నాహృదయమందు నివసించుచున్నాఁడని. ౧.

అడియేనుళ్ళానుడలుళ్ళాన్ అణ్డత్తగత్తాన్ పుఱత్తుళ్ళాన్*
పడియేయిదువెన్ఱురైక్కలామ్బడియనల్లన్ పరమ్బరన్*
కడిశేర్ నాన్ఱత్తుళ్ళాలై యిన్బత్తున్బక్కழிనేర్మై*
ఒడియాయిన్బప్పెరుమైయోన్ ఉణర్విలుమ్బరొరువనే. ౨.

అ॥ అణ్ణత్తు అగత్తాన్ - అండాంతర్వర్తులైన సకలపదార్థములకంతర్యామియు, పుఱత్తు ఉళ్ళాన్ - అండబహిర్భూతములైన మహదాదులకంతర్యామియు, ఇదువేఱడి - ఇదియే (సర్వేశ్వరునికి) సమానమైనది, ఎన్నలామ్ - అని చెప్పదగిన, పడియనల్లన్ - ఉపమానములేనివాఁడును, పరమ్పరన్ - పరాత్పరుఁడును, కడివార్ తీమ్ - శ్లాఘ్యమైన పరిమళముయొక్కయు, అలై యఱ్ - తేనెయొక్కయు ననుభవముచె గలిగినదియు, తున్పమిల్ కళ్ళి - (అల్పత్వాస్థిరత్వాది) దోషములులేనిదియునైన, ఇన్పమ్ - సుఖముయొక్క, తేర్మ్ - సారాంశములో, తేఱ్ - ఒప్పియున్న, ఒడియా - విచ్ఛేదములేని (నిత్యమైన), ఇన్పమ్ పెరుమైయోన్ - నిరతిశయానందముగల వాఁడును, ఉణర్విల్ - జ్ఞానమందు, ఉమ్పర్ - మేలైనవాఁడును, ఒరువన్ - అద్వితీయుఁడునైన శ్రియఃపతి, అడియేన్ - దాసునియొక్క, ఉళ్ళాన్ - హృదయమందున్నాడు. ఉడలుళ్ళాన్ - (నా) శరీరమందునున్నాడు.

తా॥ సర్వగతుఁడై నిరుపమానుఁడై పరాత్పరుఁడైన సర్వేశ్వరుఁడు నిరతిశయానందయుతుఁడై నాహృదయమందును అతినీచమైన శరీరమందునుగూడ వాసముజేయుచున్నాడని. ౨

ఉణర్విలుమ్పరొరువనై యవనదరుళాలుఱఱ్పొరుట్టు*ఎన్
ఉణర్విను ళ్ళేయిరుత్తినే నదువుమవనదిన్నరుళే*
ఉణర్వుముయిరుముడమ్పుమ్ మత్తులప్పిలనవుమ్పళుదేయామ్*
ఉణర్ వైప్పెఱవూర్ న్దిఱవేఱి యానుమ్ తానాయొழிన్దానే. 3.

అ॥ ఉణర్విల్ - జ్ఞానమందున్న, (జ్ఞానాధికులైన), ఉమ్పర్ - నిత్యసూరులకు నిర్వాహకుఁడై, ఒరువనై - అద్వితీయుఁడైన శ్రియఃపతిని, అవనదు - ఆశ్రియఃపతియొక్క, అరుళాల్ - కృపచేత, ఉఱఱ్పొరుట్టు - పొందుటకై, ఎన్ ఉణర్విను ళ్ళే - నాజ్ఞానమందు, ఇరుత్తినేన్ - స్థాపించితిని. అదువుమ్ - అట్లుస్థాపించడముగూడ, అవనదు - ఆశ్రియఃపతియొక్క, ఇన్ అరుళే - నిర్హేతుకకృపయే. ఉణర్వుమ్ (సంసారవిషయమైన) జ్ఞానమును, ఉయిరుమ్ - ప్రాణమును, ఉడమ్పుమ్ - శరీరమును, మత్తు - ఇంతకంటెవేఱైన ఉలప్పిలనవుమ్ - లెక్కలేని మహదాది తత్త్వములును, పళుదే - హేయములు, ఆమ్ - అనెడి, ఉణర్వై - జ్ఞానమును, పెఱ - పొందునట్లు, ఊర్న్ద - నడిపించి, ఇఱవేఱి - ఇటులనే కడవఱకు నెరవేర్చి, యానుమ్ - నేనును, తానాయొழிన్దాన్ - తానేయాయెను (నాకుతానేయంతర్యామియనెడి జ్ఞానమును గలుగఁజేసెను).

తా॥ సర్వేశ్వరుఁడు నిర్హేతుక కటాక్షముచే దనయందు నాకాశనుగలుగఁజేసి నాతోసంశ్లేషించి శరీరాదులయందు వైరాగ్యమును గలుగఁజేసి, తనకనన్యార్హశేషమైన నాయాత్మస్వరూపమునున్న నాకుఁగనుపఱచెనని. 3.

యానుమ్ తానాయొழிన్దానై యాదుమ్ యవర్క్కుమ్ మున్నోనై*
తానుమ్ శివనుమ్ పిరమనుమాగి ప్పణైత్త తనిముదలై*
తేనుమ్ పాలుమ్ కన్నలుమ్ అముదుమాగిత్తిత్తిత్తు*ఎన్
ఊనిలుయిరిలుణర్విల్ నిన్ఱవొన్ఱైయుణర్ న్దేనే. ౪.

అ॥ యాదుమ్ - అచేతనములకును, యవర్క్కుమ్ - చేతనులకును, మున్నోనాయ్ - పూర్వమందున్న కారణభూతుఁడును, తానుమ్ - విష్ణువైనతానును, శివనుమ్ - రుద్రుఁడును, పిరమనుమ్ - బ్రహ్మయు, ఆగి - ఈమువ్గురి స్వరూపుఁడై (బ్రహ్మరుద్రులనుసృజించియు వారినదుమ తాను విష్ణువై యుండియు), పయన్ద - (లోకములను) సృజించిన, తనిముదల్వన్ - అద్వితీయ కారణుఁడును, తేనుమ్ - తేనెవలెను, పాలుమ్ - పాలువలెను, అముదుమాగి - అమృతమువలెను, తిత్తిత్తు - (సర్వేశ్వరునికి) తీయగా (భోగ్యముగా) నుండి, ఎన్ ఊనిల్ - నాశరీరమందును, ఉయిరిల్ - ప్రాణమందును, ఉణర్విల్ - జ్ఞానమందును, నిన్ఱ - వ్యాపించియున్న, ఒన్ఱై - అద్వితీయమైన నాయాత్మను శరీరముగాగలవాఁడును, యానుమ్ - నేనును, తానాయ్ ఒழிన్దానై - తనకుశేషభూతుఁడనెడి జ్ఞానమునుగలుగజేసినవాఁడునైన శ్రియఃపతిని, ఉణర్న్దేన్ - ఎఱింగితిని.

తా॥ సకల జగత్స్రష్టయైన సర్వేశ్వరుఁడు, నేను తనకు శేషభూతుఁడనెడి జ్ఞానమును నాకు గలుగజేసినదియేగాక నాయాత్మస్వరూపము తనకత్యన్తభోగ్యమైయున్నదనియు దెలియజేసెనని.

నిన్ఱ ఒన్ఱై యుణర్న్దేను క్కదనుళ్ నేర్మై యదు విదువెన్ఱు*
ఒన్ఱుమొరువర్క్కుణరలాగా దుణర్న్దుమేలుమ్ కాణ్బరిదు*
శెన్ఱుశెన్ఱుపరమ్బరమాయ్ యాదుమిన్ఱిత్తేయ్న్దఱ్ఱు*
నన్ఱుతీదెన్ఱఱివరిదాయ్ నన్ఱాయ్ ఞానమ్ కడన్దదే ౫.

అ॥ నిన్ఱ - (నిత్యమై) ఉన్న, ఒన్ఱై - విలక్షణమైన యాత్మవస్తువును, ఉణర్న్దేనుక్కు - పరిశీలించిననాకు (తెలిసిన), అదనుళ్ - ఆయాత్మయొక్క, నేర్మై - వైలక్షణ్యము, ఒన్ఱుమ్ - కొంచెముగూడ, ఒరువర్క్కు - ఎవ్వరికిని, ఉణరలాగాదు - తెలిసికొనుటకు సాధ్యముకాదు. ఉణర్న్దుమ్ - తెలిసికొనినను, మేలుమ్ - మఱియు, కాణ్బరిదు - (ఆయాత్మను) సాక్షాత్కరింప శక్యముకాదు. (ఆయాత్మ), పరమ్బరమాయ్ - పరమ్పరగా, శెన్ఱుశెన్ఱు - పోయిపోయి, (అన్నమయ ప్రాణమయ మనోమయములను క్రమముగాబరిశీలించి దానిపైవెళ్ళి), యాదుమ్ ఇన్ఱి - (ప్రకృతి సంబంధము) ఏమియులేనిదై, తేయ్న్దు అఱ్ఱు - (ప్రకృతిసంబంధమును) సవాసనముగావదలి, నన్ఱు తీదు ఎన్ఱు - (ప్రాకృతవిషయమువలె) మంచిదనియు చెడ్డదనియు, అఱివు అరిదాయ్ - తెలిసికొనుటశక్యమై, నన్ఱాయ్ - విలక్షణమై, ఞానమ్ - చక్షురాదులచే గలిగినజ్ఞానములకు, కడన్దదు - అవిషయమైయుండును.

తా॥ భగవదనుగ్రహముచే నేనెఱింగిన జీవాత్మస్వరూపము మఱియొకరికిఁ దెలిసికొనుటకు శక్యముకాదు. అట్లు తెలిసికొనినను దేహాదివిలక్షణమై ప్రకృతిసంబంధశూన్యమై యింద్రియాతీతమైన దానిని జూచుటకు శక్యముకాదని. ౫.

నన్ఱాయ్ ఞానమ్ కడన్దుపోయ్ నల్లిన్దిరియమెల్లామీర్త్తు*
ఒన్ఱాయ్ క్కిడన్దవరుమ్ పెరుమ్బాழ் ఉలప్పిలదనై యుణర్న్దుణర్న్దు*
శెన్ఱాఙ్గిన్బత్తున్బఙ్గళ్ శెఱ్ఱుక్కళైన్దు పశైయఱ్ఱాల్*
అన్ఱేయప్పోదే వీడదువే వీడువీడామే. ౬.

అ॥ ఞానమ్ - శబ్దాది విషయములను, కడన్దుపోయ్ - దాటిపోయి, నల్ - (విషయముల యందు పురుషుని దీసికొనిపోదగిన) సామర్థ్యముగల, ఇన్దిరియమ్ ఎల్లామ్ - ఇన్ద్రియములనన్నింటిని, ఈర్త్తు - వశపరచి (జయించి), ఒన్ఱాయ్క్కిడన్ద - (ఆత్మతో) ఏకీభవించి యున్నదై, అరుమ్ - విడుచుటకశక్యమై, పెరుమ్ - అపరిచ్ఛిన్నమై, ఉలప్పిల్ - నాశములేనిదై యున్న, పాழదనై - ప్రకృతియనెడి తత్త్వమును, ఉణర్న్దుణర్న్దు - చక్కగావిచారించి, నన్ఱాయ్ - చక్కగా (దానివాశించక), అద్గుం - ఆయాత్మస్వరూపమందు, శెన్ఱు - వెళ్ళి, ఇన్బమ్ తున్బమ్ - సుఖదుఃఖములను, శెఱ్ఱుక్కళైన్దు - సవాసనముగావదలి, పశైయఱ్ఱాల్ - ఆసక్తినశించిన యెడల, అన్ఱే - అదినమందే, అప్పోదే - అక్షణమందే, వీడు - సంసారమోక్షముకలుగును. అదువే - అదియే, వీడు - కైవల్యరూప మోక్షమగును. వీడామ్ - (అదియుగొందరికి) పురుషార్థమగును.

తా॥ యోగశాస్త్రమందు ప్రతిపాదించినరీతిగా జితేన్ద్రియుండైయుండి దేహాదులయొక్క స్వభావములను జక్కగానాలోచించి సుఖదుఃఖములను వదలి యీ దేహాదులయందు నిరాశరైన యెడల నప్పుడాయాత్మతత్త్వమును సాక్షాత్కరింపవచ్చును. దానినే కైవల్యమనెడి మోక్షమని జెప్పుదురని. ౯.

అదువేవీడువీడుపేఱ్ఱిన్బన్దానుమదుతేఱి*
ఎదువేతానుమ్పఱ్ఱిన్ఱి యాదుమిలిగళాగిఱ్కిల్*
అదువేవీడువీడుపేఱ్ఱిన్బన్దానుమదుతేఱాదు*
ఎదువేవీడేదిన్బమెన్ఱెయ్త్తారెయ్త్తారెయ్త్తారే. ౧౦.

అ॥ అదువే - ఆయాత్మానుభవమే, వీడు - (కైవల్యమనెడి) మోక్షము, వీడుపేఱు - ఆ మోక్షముచేబొందదగిన, ఇన్బమ్తానుమ్ - ఆనన్దమును, అదు - అదియే, తేఱి - (ఇట్లు) చక్కగా తెలిసికొని, ఎదువేతానుమ్ - అన్నివస్తువులలోను, పఱ్ఱిన్ఱి - సంబంధములేక, యాదుమ్ - రుచివాసనలన్నింటిని, ఇలిగళాగిఱ్కిల్ - సమూలముగావిడిచినయెడల, అదువే - ఆ యాత్మప్రాప్తియే, వీడు - మోక్షము, వీడుపేఱు - మోక్షముచేబొందదగిన, ఇన్బమ్తానుమ్ - సుఖమును, అదు - ఆయాత్మానుభవమే, తేఱాదు - అనిఇట్లుతెలిసికొనక, వీడు - మోక్షము, ఎదు - ఏది? ఇన్బమ్ - మోక్షసుఖము, ఎదు - ఏది, ఎన్ఱు - అని, ఎయ్త్తార్ - చిత్త దౌర్బల్యముగలవారు (తెలిసికోనివారు), ఎయ్త్తారెయ్త్తారే - ఎల్లప్పుడును దుఃఖపడుదురు.

తా॥ యోగశాస్త్రమందుజెప్పినట్టు జితేన్ద్రియుండైయుండి యోగాభ్యాసముజేసి కైవల్యమనెడి మోక్షమునుబొందక నందులోసంశయించువారు ఎప్పుడును సంసారులై క్లేశపడుదురని.

ఎయ్త్తారెయ్త్తారెయ్త్తారెన్ఱిల్లత్తారుమ్పుఱత్తారుమ్
మొయ్త్తు*ఆఙ్గలఱిముయఙ్గత్తామ్పోగుమ్బోదు*ఉన్మత్తర్పోల్
పిత్తేయేఱి యనురాగమ్పొழியుమ్బోదు*ఎమ్పెమ్మానో
డొత్తేశెన్ఱఙ్గుళ్ళమ్కూడక్కూడిఱ్ఱాగిల్ నల్లుఱైప్పే. ౧౧.

అ॥ ఎయ్త్తార్ ఎయ్త్తార్ ఎయ్త్తార్ఎన్ఱు - చచ్చెను చచ్చెను చచ్చెనని, ఇల్లత్తారుమ్- ఇంటివారును, పుఱత్తారుమ్ - బైటనున్న బంధువులును, మొయ్త్తు - చుట్టుకొని, అజ్గు - ఆ యవస్థయందు, అలఱి - భయంకరముగా నఱచి, మయజ్గ - కట్టుకొనగా, తామ్ - తాము (చచ్చువారు), పోగుమ్పోదు - (శరీరమునువదలి) పోవునప్పుడు, ఉన్మత్తర్పోల్ - పిచ్చివారు వలె, పిత్తేఱి - భ్రమించి, అనురాగమ్ - (పుత్రాదులయందు) ప్రీతి, పొழிయుమ్పోదు - వృద్ధి బొందెడికాలమందు, ఎమ్పెమ్మానోడు - మనస్వామియైన శ్రియఃపతితో, ఒత్తు-సమానమైయుండు నని (శ్రియఃపతివలె జ్ఞానానందస్వరూపుఁడై పరిశుద్ధుఁడైయుండునని), అజ్గు-ఆ జీవాత్మను, కీన్ఱు- ధ్యానించి, ఉళ్ళమ్ - మనస్సు, కూడకూడిల్ ఆగిల్ - అనుసంధించుటకనుకూలమైనయెడల, నల్ - మంచి, ఉఱైప్పు - సిద్ధియగును.

తా॥ ఎంతజితేంద్రియుఁడయినను చచ్చునప్పుడు బంధువులందరు వచ్చి వానిని కట్టుకొని యేడవగా నప్పుడు మతిభ్రష్టుఁడై పుత్రాదుల నాశించియుండును. అట్లుకాకుండ, నాయాత్మ స్వరూపము సర్వేశ్వరునికి శేషమై వానివలె పరిశుద్ధమైయుండునని యంతిమస్మృతి చేసినయెడల వాఁడే మోక్షమునుబొందును. అన్తిమస్మృతిలేనియెడల చిరకాలము చేసిన యోగాభ్యాస మంతయు వ్యర్థమగునని. ౯.

కూడిల్ ఆగిల్ నల్లుఱైప్పు కూడామైయైక్కూడినాల్*
ఆడల్ పఱవై యుయర్కొడి యెమ్మాయనావదదువదువే*
వీడై ప్పణ్ణియొరుపరిశే ఎదిర్వుమ్నిగழ்వుమ్కழிవుమాయ్*
ఓడి త్తిరియుమ్ యోగిగళు ముళరుమిల్లై యల్లరే. ౧౦.

అ॥ కూడిల్ ఆగిల్ - అన్తిమస్మృతికలిగినయెడల, నల్లుఱైప్పు - మంచిఫలసిద్ధియగును. కూడామైయై - అసంభవమైన (గగనకుసుమాదులను), కూడినాల్ - లభించినయెడల, అదు - ఆయాత్మవస్తు, ఆడల్ - నృత్యముజేయుచున్న, పఱవై - గరుత్మంతునిధ్వజముగా, ఉయర్ - పైకెత్తిన, ఎమ్మాయనావదు - మనయాశ్చర్యచేష్టితుఁడైన సర్వేశ్వరుఁడగుట (సంభవించును). (గాన), అదు - ఆయాత్మవస్తు, అదువే - ఆ జీవాత్మయైయ్యేయుండును, ఒరుపరిశు - (తమబుద్ధికి తోఁచినట్లు) ఒకవిధముగా, వీడై - మోక్షమును, పణ్ణి - కల్పించి, ఎదిర్వుమ్ - భవిష్యత్కాల ములయందును, నిగழ்వుమ్ - వర్తమానకాలములయందును, కழிవుమ్ - భూతకాలములయందును, ఆయ్ - ఉన్నవారై, ఓడి - తడవాడుచు, తిరియుమ్ - సఞ్చరించుచున్న, యోగిగళుమ్-యోగు లును, ఉళరుమ్ - ఉన్నారు; ఇల్లైయల్లరే - లేకపోలేదు.

తా॥ తత్వజ్ఞానము గలిగినతరువాత జీవుఁడే బ్రహ్మస్వరూపుఁడగుచుండగా జీవుఁడు చచ్చునప్పుడు తనకంటె విలక్షణుఁడైన పరమాత్మతో సమానముగా తననుస్మరింపవలయునని చెప్పుట యసజ్గతము అనిచెప్పరాదు. జీవబ్రహ్మములకు భేదము స్వాభావికము గనుక ఆరెండింటి కిని యభేదము చెప్పుట కుందేళ్ళకు కొమ్ములు మొలిచినవనియు గాడిద గుఱ్ఱమైనదనియు చెప్పెడు మాటలువలె యసంబద్ధమైయుండును. గాన జీవబ్రహ్మముల కభేదముచెప్పుచు తిరుగుచున్న శాస్త్రులయొక్క యసత్యమాటలు నమ్మదగినవికావని ౧౦.

ఉళరుమిల్లైయల్లరా యుళరాయిల్లైయాగియే*
ఉళరెమ్మొరువరవర్వ న్దెన్నుళ్ళత్తుళ్ళేయుఱై గిన్ఱార్*
వళరుమ్పిఱై యుమ్ తేయ్పిఱై యుమ్పోల వశై వుమాక్కై యుమ్*
వళరుమ్శుడరుమిరుళుమ్పోల్ తెరుళుమ్మరుళుమ్మాయ్త్తోమే. ౧౦.

అ॥ ఇల్లైయల్లరాయ్ - (ఆశ్రితులకు) లేనివారు కానివారై, ఉళరుమ్ - ఉన్నవారును, ఇల్లైయాగియే - (అభక్తులకు) లేనివారైయ్యే, ఉళరాయ్ - ఉన్నవారును, ఎమ్ - మనకుస్వామియూనై, ఒరువర్ - అద్వితీయులునైన శ్రియఃపతి, ఉళర్ - ఉన్నారు. అవర్వన్దు - వారు వచ్చి, ఎన్ఉళ్ళత్తుళ్ళే - నాహృదయమందు, ఉఱైగిన్ఱార్ - నిత్యవాసము జేయుచున్నారు వళరుమ్ - వృద్ధిబొందుచున్న, పిఱైపోల్ - చన్ద్రికళవలెనున్న, ఆక్కై యుమ్-(శరీరముయొక్క), వృద్ధినిన్ని, తేయ్పిఱైయుమ్పోల-క్షీణించుచున్న చన్ద్రికళవలెనున్న, అశైవుమ్-నాశమునున్ను, వళరుమ్-వృద్ధిపొందుచున్న, శుడరుమ్పోల్ - తేజస్సువలెనున్న, తెరుళుమ్ - శబ్దాదివిషయిక జ్ఞానములనున్ను, ఇరుళుమ్పోల్ - చీకటిని వలెనున్న, మరుళుమ్ - అజ్ఞానమునున్ను, మాయ్త్తోమ్- [illegible]

తా॥ దుర్మతమందు ప్రవేశింపకుండ నన్ను వశపఱచుకొని నాహృదయమందు సర్వేశ్వరుఁడు నిత్యవాసముజేయుచున్నాడు గాన నేను నాయొక్క శరీరముచేతను మనస్సుచేతను వచ్చెడి సకల దుఃఖములను బోగొట్టుకొంటినని. ౧౦.

‡‡ తెరుళుమ్మరుళుమ్మాయ్త్తు త్తన్ తిరున్దశెమ్పొఱ్కళ్ళులడిక్కీళ్*
అరుళియిరుత్తుమమ్మానా మయనామ్శివనామ్*తిరుమాలాల్
అరుళప్పట్టశడగోప నోరాయిరత్తుళిప్పత్తాల్*
అరుళియడిక్కీళిరుత్తుమ్ నమ్మణ్ణల్కరుమాణిక్కమే. ౧౧.

అ॥ తెరుళుమ్ - (సంసార) జ్ఞానమునున్ను, మరుళుమ్ - అజ్ఞానమునున్ను, మాయ్త్తు - పోగొట్టి, తిరున్ద - ఆశ్రితులను మఱియొకతివద్దపోనివ్వనిదై, శెమ్ - సుందరమైె, పొన్-స్పృహణీయమై, కళ్ళల్ - ఆభరణముగలదైన, అడిక్కీళ్ - శ్రీపాదముక్రింద, అరుళి - కృపజేసి, ఇరుత్తుమ్ - స్థాపించుకొనుచున్న, అమ్మానామ్ - స్వామియూ, అయనామ్ - బ్రహ్మకంతర్యామియు, శివనామ్ - రుద్రునికంతర్యామియునైన, తిరుమాలాల్ - శ్రియఃపతిచేత, అరుళప్పట్ట - కృపజేయబడిన, శడగోపన్ - నమ్మాళ్వార్లుపాదించిన, ఓర్-అద్వితీయంబులైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోజేరిన, ఇప్పత్తాల్ - ఈపదిపాశురములచే, కరుమాణిక్కమ్ - నీలమాణిక్యమువంటి కాన్తిగల, నమ్అణ్ణల్ - మనస్వామి, అరుళి - కృపజేసి, అడిక్కీళ్ - శ్రీపాదములక్రింద, ఇరుత్తుమ్ - ఉంచును.

తా॥ భగవత్కటాక్షపాత్రులైన నమ్మాళ్వార్లుపాదించిన ఈ పదిపాశురముల నభ్యసించువారిని శ్రియఃపతి కటాక్షించి తనశ్రీపాదమందు జేర్చుకొని యుజ్జీవింపఁజేయునని. ౧౧

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౯ - వ, తిరువాయ్మొఴి.

అవతారిక:— ఇట్లుభగవచ్ఛేషత్వము ననుసంధించిన నమ్మాళ్వార్ల అప్రీతిచేత తనస్వరూపమును మఱచి ఒకపిరాట్టి యవస్థనుబొంది తనయవస్థ నన్యాపదేశముగా సాధించుచున్నారు.

‡‡ కరుమాణిక్కమలై మేల్ మణిత్తడన్దామరై క్కాడుగళ్ పోల్*
తిరుమార్వువాయ్కణ్ కై యున్దికా లుడై యాడైగళ్ శెయ్యపిరాన్*
తిరుమాలెమ్మాన్ శెழునీర్వయల్ కుట్టనాట్టుత్తిరుప్పులియూర్*
అరుమాయన్ పేరన్ఱిప్పేచ్చిల ళన్నైమీరిదఱ్కెన్ శెయ్గేనో. ౧.

అ॥ కరుమాణిక్కమలై మేల్ - నీలరత్నమయమైన పర్వతమందలి, మణి - శ్లాఘ్యమైన, తడమ్ - తటాకమందున్న, తామరైక్కాడుగళ్ పోల్ - పద్మవనమువలెనున్న, తిరుమార్వు - శ్రీవత్సస్థలము, వాయ్ - అధరము, కణ్ - నేత్రము, కై - శ్రీహస్తము, ఉన్ది - నాభి, కాల్ - శ్రీపాదము, శెయ్య - ఎఱ్ఱనైన, ఉడైయాడైగళ్ - పీతామ్బరము (వీనిని) గలవాఁడును, పిరాన్ - ఉపకారకుఁడును, తిరుమాల్ - శ్రియఃపతియు, ఎమ్మాన్ - నాకుస్వామియు, శెழு - సమృద్ధమైన, నీర్ - జలముచేనిండిన, వయల్ - పొలములుగల, కుట్టనాడు - కుట్టనాడనెడి దేశములో, నున్న, తిరుప్పులియూర్ - తిరుప్పులియూరనెడి దివ్యదేశమందు వేంచేసియుండువాఁడును, అరు- (అభక్తులకు) దుర్లభుఁడును, మాయన్ - ఆశ్చర్యభూతుఁడునైన సర్వేశ్వరునియొక్క, పేరన్ఱి - తిరునామముతప్ప, పేచ్చిలళ్ - వేఱుమాటచెప్పదు. అన్నైమీర్ - ఓతల్లులారా! ఇదఱ్కు - దీనికి, ఎన్ శెయ్గేన్ - ఏమిచేసెదనని.

తా॥ ఓతల్లులారా ! తామరసపుష్పములవలెనున్న హస్తపాదాది దివ్యావయవములనున్న శ్యామమైన తిరుమేనును గలవాఁడై తిరుప్పులియూరులో వేంచేసియున్న శ్రియఃపతియొక్క సౌందర్యము ననుభవించి వానితిరునామములనే యెల్లప్పుడును చెప్పుచున్నదని. ౧.

అన్నైమీరిదఱ్కెన్ శెయ్గే నణిమేరువిన్ మీదులవుమ్*
తున్నుశూழ్ శుడర్ ఞాయిఱు మన్ఱియుమ్పల్ శుడర్గళుమ్పోల్*
మిన్నునీణ్ముడియారమ్ పల్కలన్తానుడై యెమ్పెరుమాన్*
పున్నైయమ్పొழిల్ శూழ் తిరుప్పులియూర్ పుగழுమివళే. ౨.

అ॥ అణి - సుందరమైన, మేరువిన్ మీదు - మేరుపర్వతముమీద, ఉలవుమ్ - సంచరించుచున్న, తున్ను - దట్టమై, శూழ் - వ్యాపించియున్న, శుడర్ - తేజస్సుగల, ఞాయిఱుమ్ పోల్ - సూర్యునివలెనున్న, అన్ఱియుమ్ - ఇంకనున్న, పల్ - అనేకములైన, శుడర్గళుమ్పోల్ - (నక్షత్రాది) తేజస్సులవలెనున్న, మిన్ను - ప్రకాశించుచున్న, నీళ్ - దీర్ఘమైన! ముడి - కిరీటమునున్న, ఆరమ్ - హారమునున్న, పల్ - ఇంకననేకములైయున్న, కలన్ తాన్ ఉడై - ఆభరణములనున్నగల, ఎమ్పెరుమాన్ - సర్వేశ్వరుఁడు వేంచేసియున్న, అమ్ - సుందరమైన, పున్నైప్పొழిల్ - పున్నతోటలచే, శూழ் - చుట్టబడిగ, తిరుప్పులియూర్ - తిరుప్పు

అ॥ అగమ్ - (నా) హృదయమందు, శేర్ - అమరియున్న, నరశిఙ్గమదాగి - నరసింహ స్వరూపముగలవాఁడై, ఓర్ - కఠినమైన, అగమ్ - (హిరణ్యాసురునియొక్క) శరీరమును, వళ్ - తీక్ష్ణమైన, ఉగిరాల్ - నఖము చేత, పిళన్దాన్ - చీల్చినవాఁడు, ఉఱై - నిత్యవాసము శేయుచున్న, మాగమ్ - పరమాకాశమందున్న, వైగున్దమ్ - శ్రీవైకుణ్ఠమును, కాణ్బదఱ్కు - చూచుటకు, ఎన్ మనమ్ - నామనస్సు, ఇరాప్పగల్ - రాత్రింబగళ్ళు, ఇన్ఱి - ఎడతెగక, ఏగమ్ - ఏకరీతిగా, ఎణ్ణుమ్ - ధ్యానించును.

తా॥ నరసింహావతారమెత్తి హిరణ్యుని సంహరించిన శ్రీమన్నారాయణుఁడు వేంచేసియున్న శ్రీవైకుణ్ఠమును నామనస్సు సేవింప నాశించుచున్నదని. ౭.

ఇన్ఱిప్పోగ విరువినైయుమ్ కెడుత్తు*
ఒన్ఱియాక్కైప్పుగామై యుయ్యక్కొళ్వాన్*
నిన్ఱవేఙ్గడమ్ నీణిలత్తుళ్ళదు*
శెన్ఱుతేవర్‌గళ్ కైతొழுవార్‌గళే. ౮.

అ॥ ఇరువినైయుమ్ - పుణ్యపాపములురెండింటిని, ఇన్ఱిప్పోగ - సమూలముగాపోవునట్లు, కెడుత్తు - నశింపఁజేసి, ఒన్ఱి - (ఆత్మతో) ఏకీభవించియున్న, ఆక్కై - ప్రకృతిసంబంధమైన శరీరములయందు, పుగామై - ప్రవేశించకుండునట్లు, ఉయ్యక్కొళ్వాన్ - ఉజ్జీవింపశేయుచున్న శ్రియఃపతి, నిన్ఱ - వేంచేసియున్న, వేఙ్గడమ్ - వేఙ్కటాచలము, నీళ్ నిలత్తు - శ్లాఘ్యమైన భూమియందు, ఉళ్ళదు - ఉన్నది. శెన్ఱు - అచ్చటవెళ్ళి, కైతొழுవార్‌గళ్ - ఆశ్రయించువారు, తేవర్‌గళ్ - మంచిభాగ్యవంతులు.

తా॥ కర్మాధీనమైన ప్రకృతిసంబంధమునువదలి శ్రీవైకుణ్ఠమందువెళ్ళి సేవింబఁదగిన శ్రీమన్నారాయణుఁడు భూలోకమందే తిరుమలయందు వేంచేసియుండగానచ్చటపోయి యాశ్రయించుటయే గొప్పభాగ్యమని ౮.

తొழுదుమామలర్ నీర్ శుడర్ తూబఙ్గొణ్డు*
ఎழுదుమెన్నుమిదు మిగైయాదలిల్*
పழுదిల్ తొల్ పుగழ் పామ్బణైప్పళ్ళియాయ్*
తழுవుమాఱఱియే నునతాళ్‌గళే. ౯.

అ॥ మా - శ్లాఘ్యమైన, మలర్ - పుష్పము, నీర్ - తీర్థము, శుడర్ - దీపము, తూబమ్ - ధూపము, (వీనిని) కొణ్డు - సంపాదించుకొని, తొழுదు - ఆశ్రయించి, ఎழுదుమ్ - ఉజ్జీవించెదము, ఎన్నుమిదు - అనితలఁచుట, మిగై - (నీచుభిసంధిచేత) అధికమైయున్నది, ఆదలిల్ - గాన, పழுదుఇల్ - (దురారాధ్యుఁడని) అపవాదములేనివాఁడవును, తొల్ పుగழ் - అనాదియైన కీర్తిగలవాఁడవును, పామ్బుఅణై - ఆదిశేషుఁడనెడిపడకమీఁద, పళ్ళియాయ్ - పవ్వళించినవాఁడవు నైన, ఉన - నీయొక్క, తాళ్‌గళ్ - తిరువడికళ్ళను, తழுవుమాఱు - సంశ్లేషించువిధమును, అఱియేన్ - ఎఱుఁగను.

తా॥ పుష్పాదులచే నిన్నర్చించెదననితలంచినప్పుడే మాయందుమిక్కిలి ప్రీతిజేయుచున్న నీసౌశీల్యము ననుసంధించి పరవశుఁడనై నీకు నేనేమియుఁజేయఁజాలక యున్నానని. ౯.

తాళ్తామరై యా నునదున్దియాన్*
వాళ్కొళ్నీళ్ మழுవాళి యున్నాగత్తాన్*
ఆళరాయ్త్తొழுవారు మమరర్గళ్*
నాళుమెన్పుగழ்గో వునశీలమే. ౧౦.

అ॥ తాళ్ - ప్రశస్తమైనతూడుగల, తామరైయాన్ - కమలమందుబుట్టినబ్రహ్మ, ఉనదు - నీయొక్క, ఉన్దియాన్ - నాభియందువాసముజేయుచున్నాడు. వాళ్కొళ్ - తేజస్సుగల, నీళ్ - పొడుగైన, మழுవుఆళి - గొడ్డలిగలరుద్రుఁడు, ఉన్అగత్తాన్ - నీతిరుమేనుయందు నివసించు చున్నాడు. ఆళరాయ్ - దాసులై, తొழுవారుమ్ - పరిచర్యజేయువారును, అమరర్గళ్ - దేవతలు, ఉనశీలమ్ - నీయొక్కసత్స్వభావమును, నాళుమ్ - ఎంతకాలముచెప్పినను, ఎన్పుగழ்గో - ఏమనిస్తోత్రముజేసెదను?

తా॥ అజుఁడనియు ఈశ్వరుఁడనియు దురభిమానములుగల బ్రహ్మరుద్రులును తక్కిన దేవతలునుగూడ నిన్నాశ్రయించి నీకుపరిచర్యజేయుచుండగానీసౌశీల్యమును నేనేమనివర్ణించెదనని.

‡‡ శీలమెల్లై యిలా నడిమేల్*అణి
కోలనీళ్ కురుగూర్చ్చడగోపన్*శొల్
మాలై యాయిరత్తు ళ్ళివై పత్తినిన్
పాలర్*వైగున్దమేఱుదల్ పాన్మైయే. ౧౧.

అ॥ శీలమెల్లైయిలాన్ - అవధిలేనిసత్స్వభావముగల శ్రియఃపతియొక్క, అడిమేల్ - తిరువడికళ్ళమీద, అణి - సమర్పింపఁబడినదై, నీళ్కోలమ్ - గొప్పసౌందర్యముగల, కురుగూర్ తిరునగరికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ்వార్లయొక్క, శొల్మాలై - శ్రీసూక్తిమాలారూపమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇవైపత్తినిన్ - ఈపదిపాశురములయొక్క, పాలర్ - సమీపమందున్నవారు (సంబంధముగలవారు), వైగున్దమ్ - శ్రీవైకుణ్ఠమును, ఏఱుదల్ - పొందుట, పాన్మై - స్వభావము.

తా॥ శ్రియఃపతియొక్క సౌశీల్యగుణవిషయమై నమ్మాழ்వార్లుప్రసాదించినయీపదిపాశురములతో కొంతమాత్రము సంబంధమున్నప్పటికిన్ని వారందరును మోక్షమును బొందుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౪ - వ, తిరువాయ్మొழி.

అవతారిక:—శీలాధికుఁడైన శ్రియఃపతిని సేవింపనాశించియుండగా నప్పుడు హృదయ సేవసాదించిన సర్వేశ్వరుని కల్యాణగుణములననుభవించి సన్తోషించుచున్నారు.

‡‡ మైయార్ కరుజ్గణ్ణి కమలమలర్ మేల్
శెయ్యాళ్ *తిరుమార్విల్ శేర్ తిరుమాలే*
వెయ్యార్ శుడరాழி శురిశజ్గమేన్దుమ్
కైయా *ఉన్నై క్కాణ క్కరుదుమెన్ కణ్ణే. ౧.

అ॥ మైఆర్ - అంజనముచేతలంకరింపఁబడిన, కరు - నల్లనైన, కణ్ణి - నేత్రములుగలదై, కమలమలర్ మేల్ - తామరసపుష్పముమీద వాసముఁజేయుచున్నదై, శెయ్యాళ్ - సుందరియైన శ్రీదేవి, తిరుమార్విల్ - వక్షస్థలమందు, శేర్ - నిత్యవాసముజేయుచున్న, తిరుమాలే - ఓశ్రియఃపతీ! వెయ్యార్ - అత్యుష్ణమైన, శుడర్ - తేజస్సుగల, ఆழி - సుదర్శనమునున్ను, శురి - గీతలుగల, శజ్గమ్ - పాంచజన్యమునున్ను, ఏన్దుమ్ - ధరించుచున్న, కైయా - శ్రీహస్తముగలవాఁడా! ఉన్నై - నిన్ను, కాణ - సేవించుటకై, ఎన్ కణ్ - నా నేత్రము, కరుదుమ్ - ఆశపడుచున్నది

తా॥ ఓశ్రియఃపతీ! శ్రీదేవివాసంచేసియున్న వక్షస్థలమునున్ను, సుదర్శనపాంచజన్యములను ధరించిన నీశ్రీహస్తమునున్ను నానేత్రము సేవింప నాశించుచున్నదని ౧.

కణ్ణేయున్నై క్కాణక్కరుది *ఎన్నెఞ్జమ్
ఎణ్ణేకొణ్డశిన్దయదాయ్ నిన్ఱియమ్బుమ్*
విణ్ణోర్ మునివర్క్కెన్ఱుమ్ కాణ్బరియాయై*
నణ్ణాదొழியేనెన్ఱు నానழైప్పనే. ౨.

అ॥ కణ్ణే - (నాకు) నేత్రమైనవాఁడా! ఉన్నై - నిన్ను, కాణ - సేవింప, కరుది - ఆశపడి, ఎన్ నెఞ్జమ్ - నామనస్సు, ఎణ్ణేకొణ్డ - అనేకసంఖ్యలుగల (అసంఖ్యేయములైన), శిన్దైయదాయ్ - మనోరథములుగలదై, నిన్ఱు - నిరన్తరముగానుండి, ఇయమ్బుమ్ - ఘోషించును. నాన్ - నేను, విణ్ణోర్ - బ్రహ్మాదులకును, మునివర్క్కు - సనకాదిఋషులకును, కాణ్బరియాయై - చూచుటకశక్యుఁడవైన నిన్ను, నణ్ణాదుఒழியేన్ - పొందకతీరను, ఎన్ఱు - అని, అழைప్పన్ - పిలుచుచున్నాను.

తా॥ ఓశ్రియఃపతీ! నామనస్సు నిన్ను సేవింపవలయునని యనేకవిధముగా మనోరథించుచున్నది. నేనును నిన్ను సేవింపకతీరనని దృఢాధ్యవసాయముగలవాఁడనై యున్నానని. ౨.

అழைక్కిన్ఱ వడినాయేన్ నాయ్కూழை వాలాల్*
కుழைక్కిన్ఱదుపోల వెన్నుళ్ళమ్కుழைయుమ్*
మழைక్కన్ఱు కున్ఱమెదుత్తానిరై కాత్తాయ్*
పిழைక్కిన్ఱదరుళెన్ఱు పేదుఱువనే. 3.

అ॥ అழைక్కిన్ఱ - (నిన్ను) పిలుచుచున్నవాఁడనై, నాయేన్ - నీచుఁడనై, అడి - దాసుఁడనైన, ఎన్ - నాయొక్క, ఉళ్ళమ్ - హృదయము, నాయ్ - కుక్క, కూழைవాలాల్ - (తన) చిన్నతోఁకచే, కుழைక్కిన్ఱదుపోల - తనయభిప్రాయమును దెలుపునట్లు, కుழைయుమ్ - శిథిలమగుచున్నది. అన్ఱు - అప్పుడు, మழைక్కు - ఇన్ద్రుఁడు వర్షించినవర్షముకొఱకై, కున్ఱమెదుత్తు - గోవర్ధనమునెత్తి, ఆనిరై - గోసమూహములను, కాత్తాన్ - రక్షించిన శ్రీకృష్ణునియొక్క, అరుళ్ - అనుగ్రహము, పిழைక్కిన్ఱదుఎన్ఱు - తప్పిపోవునేయని, పేదుఱువన్ - వ్యాకులపడుచున్నాను.

తా॥ ఓస్వామీ! తోకలేని కుక్క తోకనాడించి యజమానునికి దనయభిప్రాయము నెట్లు దెలుపఁజాలదో? అటులనే నాదుఃఖమును నేను దెలుపఁజాలనివాఁడనై ఆశ్రితరక్షకుఁడవైన నీవు నన్ను గటాక్షించకపోయెదవోయని భయపడుచున్నానని. ౩.

ఉఱువదిదువె న్ఱునక్కాట్పట్టు*నిన్నణ్
పెఱువదెదుకొలెన్ఱు పేదై యేన్నెఞ్జమ్*
మఱుగల్ శెయ్యుమ్ వానవర్ తానవర్క్కెన్ఱుమ్*
అఱివదఱియ వరియాయవమ్మానే. ౪.

అ॥ వానవర్ - దేవతలకును, తానవర్క్కు - అసురులకును, ఎన్ఱుమ్ - ఎల్లప్పుడును, అఱివదు - తెలిసికొనుటకు, అరియ - దుర్లభమైన, అరియాయ - నరసింహరూపియైన, అమ్మానే - ఓస్వామీ! ఇదు - ఈశేషత్వము, ఉఱువదు - తగుమైనది, ఎన్ఱు - అని, ఉనక్కు - నీకు, ఆళ్ పట్టు - దాసుఁడనై, నిన్నణ్ - నీవద్ద, పెఱువదు - పొందదగినది, ఎదుకొల్ ఎన్ఱు - ఏదైయుండు నని, పేదై యేన్ - అకించనుఁడనైన నాయొక్క, నెఞ్జమ్ - హృదయము, మఱుగల్ శెయ్యుమ్ - వ్యాకులమైయున్నది.

తా॥ ఓశ్రియఃపతీ! దేవాదులకును దుర్లభుఁడవైన నీవు నీదాసుఁడనైన నాకుఁగూడ దుర్లభుఁడవైయ్యెదవోయని నామనస్సు భ్రమించుచున్నదని. ౪.

అరియాయవమ్మానై యమరర్పిరానై*
పెరియానై ప్పిరమనై మున్పడైత్తానై*
వరివాళరవినణై ప్పళ్ళికొళ్ గిన్ఱ*
కరియాన కழల్ కాణ క్కరుదుమ్కరుత్తే. ౫.

అ॥ అమ్మానై - సర్వేశ్వరుఁడును, అమరర్ - నిత్యసూరులకు, పిరానై - ఉపకారకుఁడును, పెరియానై - అపరిచ్ఛిన్నమహిమగలవాఁడును, మున్ - మునుపు, పిరమనై - బ్రహ్మను, పడైత్తానై - సృజించినవాఁడును, అరియాయ - నరసింహావతారమెత్తిన వాఁడును, వరి - సౌందర్యమునున్న, వాళ్ - తేజస్సునున్నగల, అరవు - ఆదిశేషుఁడనెడి, అణై - శయ్యమీఁద, పళ్ళికొళ్ గిన్ఱ - పవ్వళించియున్న, కరియాన్ - శ్యామవిగ్రహుఁడునైన శ్రియఃపతియొక్క, కழల్ - తిరువడికళ్ళను, కాణ - సేవింపవలయునని, కరుత్తు - మనస్సు, కరుదుమ్ - మనోరథించుచున్నది.

తా॥ ఓశ్రియఃపతీ! గొప్పమహిమగలవాఁడవై యాశ్రితుల కత్యన్తసులభుఁడవైన నిన్ను సేవింప నామనస్సు మిక్కిలి త్వరించుచున్నదని. ౫.

కరుత్తేయునై క్కాణక్కరుది*ఎన్నెఞ్జ
త్తిరుత్తాగవిరుత్తినేన్ తేవర్గళెల్లామ్
విరుత్తా*వ్ఱళ్ళుమ్శుడర్ చ్చోదియుయర
త్తొరుత్తా*ఉనై యుళ్ళు మెన్నుళ్ళముగన్దే. ౬.

అ॥ కరుత్తే - మనోబలమునిచ్చువాఁడా! ఉనై - నిన్ను, కాణ - సేవింప, కరుది - ఆశించి, ఎన్ నెఞ్జత్తు - నాహృదయమందు, ఇరుత్తాగ - స్థిరముగా, ఇరుత్తినేన్ - స్థాపించితిని.

తేవర్ గట్కెల్లామ్ - నిత్యసూరులందరికిని, ఒరుత్తా - గొప్పవాఁడా! విళఙ్గుమ్ - ప్రకాశించుచున్నదై, కుడర్ - కాన్తిగలదై, శోది - తేజోమయమై, ఉయరత్తు - ఉన్నతమందున్నదైన పరమపదమందు వేంచేసియున్న, ఒరుత్తా - అద్వితీయుఁడా! ఎన్ ఉళ్ళమ్ - నామనస్సు, ఉన్నై - నిన్ను, ఉగన్దు - సన్తోషించి, ఉళ్ళుమ్ - ధ్యానించును.

తా॥ నిత్యసూరి నిర్వాహకుఁడవై పరమపదమందు వేంచేసియున్న ఓస్వామీ! నిన్ను నామనస్సులో స్థిరముగానుంచుకొని యనుభవించుచు నానన్దించుచున్నానని. ౬.

ఉగన్దేయున్నై యుళ్ళుమెన్నుళ్ళత్తు*అగమ్బాల్
అగన్దానమర్న్దే యిడఙ్గొణ్డవమలా*
మిగుమ్ తానవన్ మార్వగల మిరుకూఱా
నగన్దాయ్*నరశిఙ్గమదాయవురువే. ౭.

అ॥ ఉగన్దు - సన్తోషించి, ఉన్నై - నిన్ను, ఉళ్ళుమ్ - ధ్యానించుచున్న, ఎన్ ఉళ్ళత్తు - నాహృదయముయొక్క, అగమ్బాల్ అగన్దాన్ - లోలోపల, అమర్న్దు - అమరికతో, ఇడమ్ కొణ్డ - విశాలముగా వేంచేసియున్న, అమలా - పరిశుద్ధుఁడా! మిగుమ్ - వర్ధిల్లుచున్న, తానవన్ - హిరణ్యాసురునియొక్క, అగలమ్ - విశాలమైన, మార్వు - వక్షస్థలమును, ఇరుకూఱా - రెండుభాగములుగా చీల్చిన, నగమ్ తాయ్ - నఖములుగల, నరశిఙ్గమదాయ - నరసింహమైన, ఉరువే - రూపముగలవాఁడా! (నిన్ను ధ్యానించితిని).

తా॥ ఓస్వామీ! ఆశ్రితసులభుఁడవైన నీవు నాహృదయమం దంతట వ్యాపించి వేంచేసియుండి నన్నానన్దింపించుచున్నావని. ౭.

ఉరువాగియ వాఱుశమయఙ్గట్కెల్లామ్*
పొరువాగినిన్ఱా నవనెల్లాప్పొరుట్కుమ్*
అరువాగియవాదియై త్తేవర్ గట్కెల్లామ్*
కరువాగియ కణ్ణనై క్కణ్డుకొణ్డేనే. ౮.

అ॥ ఉరువాగియ - (పరిశీలించనప్పుడు) ఒకశాస్త్రమువలెనున్న, ఆఱుశమయఙ్గట్కెల్లామ్ - జైనబౌద్ధాది షణ్మతములచేతను, పొరువాగినిన్ఱానవన్ - అవిచాల్యముగానున్నవాఁడు, ఎల్లాప్పొరుట్కుమ్ - సమస్తవస్తువులకును, అరువాగియ - అంతరాత్మయైన, ఆదియై - ప్రధానుఁడును, తేవర్ గట్కెల్లామ్ - దేవతలందరికిని, కరువాగియ - కారణభూతుఁడునైన, కణ్ణనై - శ్రీకృష్ణుని, కణ్డుకొణ్డేన్ - సేవించితిని.

తా॥ సకలపదార్థములకు నన్తర్యామియై, బ్రహ్మాదులకుఁ గారణభూతుఁడై, కుదృష్టుల కప్రకంప్యుఁడైన శ్రియఃపతిని నేను సేవించితినని. ౮.

కణ్డుకొణ్డెన్ కణ్ణిణై యారక్కళిత్తు*
పణ్డైవినై యాయిన పఱ్ఱోడఱుత్తు*
తొణ్డర్ క్కముదుణ్ణ చ్చొన్మాలైగళ్ శొన్నేన్*
అణ్డత్తమరర్ పెరుమా నడియేనే.

అ॥ ఎన్ కణ్ణిణై - నా నయనద్వన్ద్వము, ఆర - పూర్ణమగునట్లు, కణ్డుకొణ్డు - సేవించి, కళిత్తు - సన్తోషించి, పణ్డై - అనాదియైయున్న, విన్నైయాయిన - కర్మములనన్నింటిని, పఱ్ఱోడు - సవాసనముగా, అఱుత్తు - ఛేదించి, అణ్డత్తు - అణ్డమునకును, అమరర్ - నిత్యసూరుల కును, పెరుమాన్ - స్వామియైన శ్రియఃపతికి, అడియేన్ - దాసుడనైన నేను, తొణ్డర్కట్కు - శ్రీవైష్ణవులకు, అముదుఉణ్ణ - (భగవదనుభవమనెడి) అమృతపానముజేయునట్లు, శొల్ మాలైగళ్ - శబ్దసందర్భరూపమైన తిరువాయ్మొழిని, శొన్నేన్ - చెప్పితిని.

తా॥ శ్రియఃపతిని సంపూర్ణముగా యథామనోరథమనుభవించి శ్రీవైష్ణవులందరు నట్లనుభ వించి సన్తోషించునట్లు తిరువాయ్మొழిని జేసితినని. ౯.

అడియానివనె న్ఱెనక్కారరుళ్ శెయ్యుమ్
నెడియానై *నిఱైపుగழ్ అఞ్జిఱైప్పుళ్ళిన్
కొడియానై *కున్ఱామలులగమళన్ద
అడియానై *అడైన్దడియేనుయ్న్దవాఱే. ౧౦.

అ॥ ఇవన్ - ఇతఁడు, అడియాన్ - దాసుఁడు, ఎన్ఱు - అని, ఎనక్కు - నావిషయమై, ఆర్ అరుళ్ - పూర్ణానుగ్రహమును, శెయ్యుమ్ - చేయుచున్న, నెడియానై - గొప్పవాఁడును, నిఱైపుగழ் - పరిపూర్ణమైనకీర్తిగలవాఁడును, అమ్ - సుందరమైన, శిఱై - ఱెక్కలుగల, పుళ్ళిన్ - గరుత్మంతుని, కొడియానై - ధ్వజముగాగలవాఁడును, కున్ఱామల్ - సఙ్కోచములేక (యోగ్యాయోగ్యనిరూపణముజేయక), ఉలగమ్ - లోకములను, అళన్ద - కొలిచిన, అడియానై - తిరువడిగలవాఁడునైన శ్రియఃపతిని, అడియేన్ - దాసుఁడనైన నేను, అడైన్దు - పొంది, ఉయ్న్ద వాఱు - ఉజ్జీవించినవిధము.

తా॥ నన్ను తనదాసునిగా నెంచి నాయందు పూర్ణానుగ్రహముజేసిన గరుడధ్వజుని యాశ్రయించి కృతార్థుఁడనైతినని. ౧౦.

ఆఱామదయానై యడర్త్తవన్ఱన్నై*
శేఱార్ వయల్ తెన్ కురుగూర్చ్చడగోపన్*
నూఱేశొన్న వోరాయిరత్తుళిప్పత్తుమ్*
ఏఱే తరుమ్ వానవర్ తమిన్నుయిర్క్కే. ౧౧.

అ॥ ఆఱా - ఎడతెగని, మదమ్ - మదజలముగల, యానై - కువలయాపీడమును, అడర్త్తవన్ తన్నై - చంపిన శ్రియఃపతివిషయమై, శేఱు - బురదప్రదేశములచే, ఆర్ - పూర్ణమైన, వయల్ - పొలములుగల, తెన్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికినాథులైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, నూఱేశొన్న - నూఱునూఱుగాపాడించిన, ఓర్ - అద్వితీయమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, వానవర్ తమ్ - నిత్యసూరుల యొక్క, ఇన్ - సరసమైన, ఉయిర్క్కు - హృదయమునకు, ఏఱు - ప్రహారమును (భగవదనుభవ జనితశైథిల్యమును), తరుమ్ - ఇచ్చును

తా॥ నమ్మాழ்వార్లు ప్రసాదించిన సర్వేశ్వరునివిషయమైన యీ పది పాశురములను భోగ్యతా విశేషముచే నిత్యసూరులహృదయమును, కరిగించుననీ. ౧౧.

ఆழ்వార్ తిరు పడిగళే శరణమ్
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౫ - ౬, తిరువాయ్మొழி.

అవతారిక :—ఇట్లు సర్వేశ్వరుని గుణములను మానసముగా ననుభవించిన ఆழ்వార్లు ప్రత్యక్షముగా ననుభవింప వాంఛపడి దానినిలభించక ఖిన్నులై యుండగా నప్పుడు సర్వేశ్వరునికి స్మారకములైన కొన్నివస్తువులను జూచి స్మృతికివచ్చిన వానిగుణాదుల ననుసంధించి మిక్కిలి యార్తులై పాడెంచుచున్నారు.

ఇన్నుయిర్ చ్చేవలుమ్నీరుమ్ కూవిక్కొణ్డిజ్ఞత్తనై *
ఎన్నుయిర్నోవమిழற్ఱేల్ మిన్ కుయిల్ పేడైగాళ్ *
ఎన్నుయిర్క్కణ్ణపిరానై నీర్ వరక్కూవుగిలీర్ *
ఎన్నుయిర్ కూవిక్కొడుప్పార్క్కుమ్ ఇత్తనై వేణ్డుమో. ౧.

అ॥ కుయిల్ పేడైగాళ్ - ఓఆడుకోకిలములారా! ఇన్ ఉయిర్ - (మీకు) మంచి ప్రాణమైయున్న, శేవలుమ్ - మొగపక్షియు, నీరుమ్ - మీరును, కూవిక్కొణ్డు - శబ్దించుచు, ఇఙ్గు - ఇచ్చట, ఎన్ ఉయిర్ నోవ - నాప్రాణముబాధపడునట్లు, ఎత్తనైమిழற్ఱేల్ మిన్ - మిక్కిలి రతికూజితముజేయవలదు. ఎన్ ఉయిర్ - నాప్రాణనాథుండైన, కణ్ణపిరానై - శ్రీకృష్ణుని, నీర్ - మీరు, వరక్కూవుగిలీర్ - వచ్చునట్లుపిలువకనున్నారు. ఎన్నుయిర్ - నాప్రాణమును, కూవి - అపహరించి, కొడుప్పార్క్కు - వానికిచ్చువారికి, ఇత్తనై వేణ్డుమో - ఇంతవలసినదా?

తా॥ ఓకోకిలములారా! మీరుభర్తతో సంశ్లేషించి జేయుచున్న రతికూజితము నన్ను మిక్కిలి బాధపెట్టుచున్నది. నన్ను నాప్రాణనాథునితో జేర్చక చంపుట మీకుయుక్తముకాదని.

ఇత్తనై వేణ్డువదన్నో అన్ఱిల్ పేడైగాళ్ *
ఎత్తనై నీరుమ్ నుమ్ శేవలుమ్కరైన్దేఙ్గుదిర్ *
విత్తగన్ గోవిన్దన్ మెయ్యనల్లనొరువర్క్కుమ్ *
అత్తనై యామిని యెన్నుయిర వన్కైయదే. ౨.

అ॥ అన్ఱిల్ పేడైగాళ్ - ఓ ఆడుక్రౌంచపక్షులారా! నీరుమ్ - మీరును, నుమ్ శేవలుమ్ - మీ మొగపక్షులును, ఎత్తనై - ఎంతకాలము, కరైన్దు - (సంశ్లేషసుఖముచే) కరిగి, ఏఙ్గుదిర్ - అనక్షరముగా శబ్దించుచున్నారు? ఇత్తనైవేణ్డువదన్ఱు - (నన్ను బాధించుటకు) ఇంతవలసినదిలేదు. అన్దో - అయ్యో! విత్తగన్ - ఆశ్చర్యభూతుండైన, గోవిన్దన్ - శ్రీకృష్ణుడు, ఒరువర్క్కుమ్ - ఒకరికిని, మెయ్యనల్లన్ - సత్యమైనవాడుకాడు, ఎన్ ఉయిర్ - నాప్రాణము, ఇని - ఇకమీద, అవన్ కైయదే యామిత్తనై - వానిచేతులో దొఱకుకొనినదైనది.

తా॥ ఓక్రౌంచపక్షులారా! మీరు భర్తతో సంశ్లేషించి మిక్కిలియానందముచే శబ్దించుట నాకు గొప్ప బాధకరమైయున్నది. నాయల్పప్రాణమును జంపుటకై మీరింతగొప్పప్రయత్నము జేయవలదు. నాప్రాణమునపహరించిన శ్రీకృష్ణుని మీరుసత్యసంధుఁడని నమ్మవలదు సుమీయని. ౨.

అవఱ్ఱైయదేయెనదారుయి రన్ఱిల్ పేడైగాళ్*
ఎవమ్శొల్లి నీర్ కుడైన్దాడుదిర్ పుడైశూழ்వే*
తవమ్శెయ్దిల్లా వినైయాట్టియేనుయిరిఙ్గుణ్డో*
ఎవమ్శొల్లినిఱ్ఱుమ్ నుమ్మేఙ్గుకూక్కురల్ కేట్టుమే. ౩.

అ॥ అన్ఱిల్ పేడైగాళ్ - ఓ ఆడుక్రౌంచపక్షులారా! ఎనదు - నాయొక్క, ఆర్ ఉయిర్ - పూర్ణప్రాణము, అవన్ కైయదు - వానివశమైనది. నీర్ - మీరు, కుడైన్దు - (సంశ్లేష సుఖమందు) అవగాహించి, ఎవమ్శొల్లి - ఏమేమోమాటలనుజెప్పి, పుడైశూழ் - చుట్టుప్రక్కన, ఆడుదిర్ - సంచరించుచున్నారు. తవమ్శెయ్దిల్లా - పుణ్యముజేయని. వినైయాట్టియేన్ - పాపిష్ఠురాలైననాయొక్క, ఉయిర్ - ప్రాణము, ఇఙ్గుణ్డో - ఇచ్చట (నావద్ద) నున్నదో? (లేదు). నుమ్ - మీయొక్క - ఏఙ్గు - అనక్షరమైన, కూక్కురల్ - శబ్దమును, కేట్టుమ్ - వినినతరువాత, ఎవమ్శొల్లి - ఏకారణమునుజెప్పి, నిఱ్ఱుమ్ - ధరించియుందుము.

తా॥ ఓ క్రౌంచపక్షులారా! మీరుభర్తతో సంశ్లేషించి శబ్దించగా దానినివిని సహింపక నాప్రాణము సర్వేశ్వరునివద్దపోయినది. ఇఁక మీరుబాధించుటకు నాప్రాణమిచ్చటలేదని. ౩.

కూక్కురల్ కేట్టుమ్ నఙ్కణ్ణన్ మాయన్ వెళిప్పడాన్*
మేల్ కిళైకొళ్ళేల్ మిన్ నీరుమ్ శేవలుమ్కోழிగాళ్*
వాక్కుమ్మననుమ్ కరుమముమ్నమక్కాఙ్గదే*
ఆక్కైయుమావియు మన్దరమ్నిన్ఱுழలుమే. ౪.

అ॥ కోழிగాళ్ - ఓమయూరములారా! కూక్కురల్ కేట్టుమ్ - (మీ) ధ్వనినివినియు, నమ్ - మనవాఁడనిచెప్పతగిన, మాయన్ - ఆశ్చర్యభూతుఁడైన, కణ్ణన్ - శ్రీకృష్ణుఁడు, వెళిప్పడాన్ - బయలుదేరకున్నాడు. నీరుమ్ - మీరును, శేవలుమ్ - మీమొగపక్షియు, మేల్ - అధికముగా, కిళై - శబ్దమును, కొళ్ళేల్ మిన్ - చేయవలదు. నమక్కు - మాకు, మనముమ్వాక్కుమ్ కరుమముమ్ - మనోవాక్కాయములు, అఙ్గదు - వానివద్దచేరినవి. ఆక్కైయుమ్ - శరీరమును, ఆవియుమ్ - ప్రాణమును, అన్దరమ్నిన్ఱు - నడుమనుండి, ఉழలుమ్ - బాధపడుచున్నవి.

తా॥ ఓమయూరములారా! నామనోవాక్కాయములు సర్వేశ్వరునివద్ద వెళ్ళిపోయినవి. శరీరప్రాణములేనిచ్చటనున్నవి మీరుఅధికముగాధ్వనిజేసి వానినిబాధబెట్టవలదని. ౪.

అన్దరమ్నిన్ఱుழల్గిన్ఱ యానుడైప్పూవైగాళ్*
నుమ్తిఱత్తేదుమిడైయిల్లై కుழఱేల్ మినో*
ఇన్దిరఞాలఙ్గళ్ కాట్టి యివ్వేழுలగుమ్కొణ్డ*
నమ్తిరుమార్బన్ నమ్మావియుణ్ణనణ్ణినాన్. ౫.

అ॥ అనరమ్‌నిన్తు - నడుమనుండి, ఉழఱ్ఱిన్ఱ - వ్యర్థవ్యాపారముచేయుచున్న, యానుడై ప్పూవైగాళ్ - నాచిలుకలారా ! నుమ్‌క్కిఱ్తు - మీకు, ఏదుమిడైయిల్లై - (నన్ను బాధించుటకు) ఏమియుఅవకాశములేదు కుழఱేల్‌మిన్ - (మీరు) అనక్షరముగాశబ్దింపవలదు. ఇన్దిర ఞాలఙ్గళ్ - ఇన్ద్రజాలములను (తనయొక్క సౌందర్యసౌశీల్యాదిమాయలను), కాట్టి - చూపించి, ఇవ్వేழులగుమ్ - ఈసప్తలోకములను, కొణ్డ - స్వాధీనపఱచుకొనిన (మోహపెట్టిన), నమ్‌తిరుమార్బన్ - శ్రీదేవినివక్షస్థలమందుగల మన శ్రియఃపతి, నమ్‌ఆవి - మన ప్రాణమును, ఉణ్ణ - నశింపజేయుటకు, నన్గుఎణ్ణినాన్ - మంచియుపాయమునాలోచించెను.

తా॥ ఓచిలుకలారా ! సర్వేశ్వరుఁడే నన్ను జంపయత్నించియున్నాడు. ఇఁక మీరు నన్ను బాధించుట నిష్ప్రయోజనమని. ౫.

నన్గెణ్ణినాన్ వళర్‌త్త శిఱుకిళిప్పైదలే*
ఇన్‌కురల్‌నీమిழఱ్ఱ లెన్నారుయిర్ క్కాకుత్తన్*
నిన్ శెయ్యవాయొక్కుమ్‌వాయన్ కణ్ణన్ కైకాలినన్*
నిన్‌పశుమ్‌శామనిఱత్తన్ కూట్టుణ్డునీఙ్గినాన్. ౬.

అ॥ ఎన్ - నాకు, ఆరుయిర్ - సంపూర్ణప్రాణభూతుఁడును, నిన్ - నీయొక్క, శెయ్య - ఎఱ్ఱనైన, వాయ్‌ఒక్కుమ్ - అధరముతోసమానమైన, వాయన్ - అధరముగలవాఁడును, కణ్ణన్ - నీనేత్రమువంటినేత్రముగలవాఁడును, కైకాలినన్ - నీచేతులుకాళ్ళువంటిహస్తపాదములు గలవాఁడును, నిన్ - నీయొక్క, పశుమ్ - చల్లనై, శామమ్ - శ్యామమైన, నిఱత్తన్ - కాన్తిగలవాఁడునైన, కాకుత్తన్ - శ్రీరాముఁడు, కూట్టుణ్డు - (నాతో) సంశ్లేషించి, నీఙ్గినాన్ - (ఇప్పుడునన్ను) విడిచిపోయెను. నన్గుఎణ్ణి - ఆపత్కాలమందు నాకుసహాయముజేయుదువనితలంచి, నాన్‌వళర్‌త్త - నేనుపెంచిన, పైదల్ - జ్ఞానములేని, శిఱుకిళియే - ఓచిన్నచిలుకా ! నీ - నీవు, ఇన్‌కురల్ - మధురమైనకంఠధ్వనిచే, మిழఱ్ఱేల్ - సరసమైనఅర్థోక్తులను చెప్పవలదు.

తా॥ ఓచిన్నచిలుకా! నీవాపత్కాలమున కొఱగదవని నిన్ను పెంచితిని. ఇట్లుండగా, సుందరావయవములుగల శ్రియఃపతిని విశ్లేషించి బాధపడుచున్ననన్ను వానితిరునామములను జెప్పి మతియును బాధించుచున్నావు. అట్లుచేయవలదు, కొంచెమూరకనుండుమాయని. ౭.

కూట్టుణ్డునీఙ్గియ కోలత్తామరై క్కణ్ శెవ్వాయ్*
వాట్టమిలెన్ కరుమాణిక్కమ్ కణ్ణన్ మాయనోల్*
కోట్టియవిల్లొడు మిన్నుమేగక్కుழாఙ్గళ్ గాళ్*
కాట్టేల్మిన్ నుమ్మురు ఎన్నుయిర్ క్కదుకాలనే. ౮.

అ॥ కూట్టుణ్డు - (నాతో) సంశ్లేషించి, నీఙ్గియ - విశ్లేషించినవాఁడై, కోలమ్ - సుందరమై, తామరై - పద్మమువంటి, కణ్ - నేత్రమునున్ను, శెవ్ - ఎఱ్ఱని, వాయ్ - అధరమునున్నుగలవాఁడై, వాట్టమిల్ - మాసిపోకుండనున్న, కరుమాణిక్కమ్ - నీలమాణిక్యమువంటివాఁడై, మాయన్ - ఆశ్చర్యభూతుఁడైన, ఎన్‌కణ్ణన్పోల్ - నాశ్రీకృష్ణునివలెనున్న, కోట్టియ - వంగియున్న, విల్లొడు -

ధనుస్సుతోఁగూడ, మిన్నుమ్ - మెఱుచుచున్న, మేగఙ్గళ్ గాళ్ - ఓ మేఘసమూహము లారా! నుమ్మురు - మీరూపములను, కాట్టేల్ మిన్ - చూపించవలదు. అదు - అరూపము, ఎన్నుయిర్ క్కు - నాప్రాణమునకు, కాలన్ - మృత్యువై యున్నది.

తా॥ ఓ మేఘములారా! శ్రీకృష్ణుని విశ్లేషించి బాధపడుచున్న నాకు వానితిరుమేనువలెనున్న మీరూపము మిక్కిలి బాధకరంబై యున్నదిగాన మీరూపమును నాకుఁగనుపఱచవలదు నుమీయని.

ఉయిర్ క్కదు కాలనె న్ఱుమ్మై యాయిర న్దేఱ్కు నీర్
కుయిల్ పైదల్ గాళ్ కణ్ణన్నామమే కుழఱిక్కొన్ఱీర్
తయిర్ ప్పழమ్ శోఱ్ఱొడు పాలడిశిలుమ్ తన్దు శోల్
పయిఱ్ఱియ నల్వళమూట్టినీర్ పణ్బుడై యీరే. ౮.

అ॥ పైదల్ కుయిల్ గాళ్ - జ్ఞానములేని ఓ కోకిలములారా! ఉయిర్ క్కు - నాప్రాణమునకు, అదు - ఆభగవన్నామము, కాలన్ - మృత్యువై యున్నది (గాన దానిని చెప్పవలదు), ఎన్ఱు - అని, నాన్ - నేను, ఉమ్మై - మిమ్ములను, ఇరన్దేఱ్కు - యాచించిననాకు, నీర్ - మీరు, కణ్ణన్ నామమే - శ్రీకృష్ణుని తిరునామములనే, కుழఱి - చెప్పి, కొన్ఱీర్ - చంపితిరి. తయిర్ - పెరుగుతోఁగలిపిన, పழమ్ శోఱ్ఱొడు - సద్దియున్నయుతోఁగూడ, పాల్ - పాలుతోఁగలిపిన, అడిశిలుమ్ - ప్రసాదమును, తన్దు - ఇచ్చి, శోల్ - తిరునామములను, పయిఱ్ఱియ - అభ్యసింపించినదానికి, నల్ వళమ్ - మంచిప్రత్యుపకారమును, ఊట్టినీర్ - అనుభవింపఁజేసితిరి. పణ్బు ఉడైయీర్ - మంచిస్వభావముగలవారై తిరి (నిర్దయులై తిరి).

తా॥ ఓ కోకిలములారా! శ్రీకృష్ణుని తిరునామములు నాకుమిక్కిలిబాధకరంబులై యున్నవిగాన నావద్దచెప్పవలదని నేనుయాచించినప్పటికిన్ని వానినే చెప్పి నన్ను జంపుచున్నారు. నిన్ను పెంచినదానికి నాకుమంచి యుపకారముజేసితిరని. ౮.

పణ్బుడై వణ్డొడుతుమ్బిగాళ్ పణ్మిழఱ్ఱేల్ మిన్
పుణ్పురై వేల్ కొడు కుత్తాలొక్కుమ్ నుమ్మిన్ కురల్
తణ్పెరునీర్ త్తడన్దామరై మలర్న్దాలొక్కుమ్
కణ్పెరుఙ్కణ్ణన్ నమ్మావియుణ్డెழనణ్ణినా౯. ౯.

అ॥ పణ్బుడై - గానసౌష్ఠవముగల (చక్కగాపాడుచున్న), వణ్డొడు - తుమ్మెదలతోఁగూడుకొనియున్న, తుమ్బిగాళ్ - ఓచిన్నతుమ్మెదలారా! పణ్ మిழఱ్ఱేల్ మిన్ - (మీరు) గానముజేయవలదు. నుమ్ ఇన్ కురల్ - మీమధురధ్వని, పుణ్ పురై - వ్రణములోపల, వేల్ కొడు - ఈటిచేత, కుత్తాలొక్కుమ్ - పొడిచినట్లున్నది. తణ్ - చల్లనై, పెరు - నిండియున్న, నీర్ - జలముగల, తడమ్ - తటాకమందు, తామరై మలర్న్దాలొక్కుమ్ - తామరసపుష్పము వికసించినట్లువలెనున్న, పెరుమ్ కణ్ - విశాలమైననేత్రములుగల, కణ్ణన్ - శ్రీకృష్ణుఁడు, నమ్ ఆవి - మనప్రాణమును, ఉణ్డు - అపహరించుకొని, ఎழనణ్ణినాన్ - విశ్లేషించెను.

తా॥ ఓ తుమ్మెదలారా! శ్రీకృష్ణుఁడు నాతో సంశ్లేషించి నాప్రాణమునపహరించుకొని నన్ను విడిచిపోయెను. ఇప్పుడుమీగానము నాకు పుంటిలోపొడిచినట్లున్నది. మీరిప్పుడుపాడవలదని.

ఎఴనణ్ణినాముమ్ నమ్వాననాడనోడొన్ఱినోమ్*
పఴననన్నారై క్కుఴాఙ్గళ్ గాళ్ పయిన్ఱెన్నిని*
ఇఴై నల్లవాక్కైయుమ్ పైయవేపుయక్కఱ్ఱదు*
తఴై నల్లవిన్బమ్ తలైప్పెయ్ దెఙ్గుమ్తఴైక్కవే. ౧౦.

అ॥ పఴనమ్ - కొలనలయందు, (సంచరించుచున్న), నల్ - సామర్థ్యముగల, నారై క్కుఴాఙ్గళ్ గాళ్ - ఓసారసపక్షులారా! నాముమ్ - మేమును, ఎఴనణ్ణి - పోయినవాని తిరువడికళ్ళను బొందవలయునని యుద్యోగించిన, నమ్వాననాడనోడు - మనకు ప్రాప్యమైన పరమపదమందు వేంచేసియున్న శ్రియఃపతితో, ఒన్ఱినోమ్ - కలిసిపోతిమి. ఇని - ఇఁకమీఁద, పయిన్ఱెన్ - గుంపుగాజేరి యోచించి యేమిప్రయోజనము? ఇఴైనల్ల - ఆభరణమువలె విలక్షణమైన, ఆక్కైయుమ్ - శరీరమును, పైయవే - క్రమముగా, పుయక్కఱ్ఱదు - పోవుటకు యత్నించినది. ఎఙ్గుమ్ - సమస్తదేశమును, తఴై - సమృద్ధమైన, నల్లఇన్బమ్ - మంచిసుఖమును, తలైప్పెయ్దు - పొంది, తఴైక్క - సమృద్ధమైయుండుఁగాక.

తా॥ ఓసారసపక్షులారా! న జంపుటకు మీరు గుంపుజేరియోచించి యేమియు నుపయోగములేదు. నేను ముందుగానే శిథిలుఁడనై సర్వేశ్వరుని తిరువడికళ్ళయందు లీనమైతిని. నా శరీరమును పోవసిద్ధమైయున్నది. లోకమంతయు నావలెబాధపడకుండ సుఖముగానుండుగాకయని.

‡‡ ఇన్బన్దలైప్పెయ్ దెఙ్గుమ్తఴైత్త పల్లూఴిక్కు*
తన్పుగఴేత్తత్తనక్కరుళ్ శెయ్దమాయనై*
తెన్ కురుగూర్చ్చడగోపన్ శొల్లాయిరత్తుళ్ళివై*
ఒన్బదోడొన్ఱుక్కుమ్ మూవులగుమురుగుమే. ౧౧.

అ॥ ఎఙ్గుమ్ - అంతట, తఴైత్త - సమృద్ధమైయున్న, ఇన్బమ్ - సుఖమును, తలైప్పెయ్దు - పొంది, పల్లూఴిక్కు - చిరకాలము, తన్పుగఴ్ - తనకల్యాణగుణములను, ఏత్త - స్తుతించునట్లు, తనక్కు - తనకు, అరుళ్ శెయ్ద - కృపజేసిన, మాయనై - ఆశ్చర్యభూతుఁడైన శ్రియఃపతివిషయమై, తెన్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికి స్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్ - సాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోచేరిన, ఇవై - ఈ, ఒన్బదోడు - తొమ్మిదిపాశురములతోఁగూడ, ఒన్ఱుక్కుమ్ - ఒకపాశురమునకును (ఈతిరువాయ్మొఴియందలి మొదటి తొమ్మిదిపాశురములనున్ను అంతకంటె మిక్కిలి దుఃఖముచేసాదించిన పదియవ పాశురమునున్ను అనుసంధించినయెడల), మూవులగుమ్ - మూడులోకములును, ఉరుగుమ్ - (ప్రేమచేత), కరుగును.

తా॥ తన కల్యాణగుణములననుసంధించునట్లు తమకనుగ్రహజేసిన శ్రియఃపతి విషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారి మనస్సు ప్రేమచేగరుగునని. ౧౧.

ఆ ళ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౬-వ, తిరువాయ్మొழி

అవతారిక:—ఇట్లు బాధపడుచున్న దశయందు సర్వేశ్వరుఁడు పూర్వము తనతో సంశ్లేషించిన సంశ్లేషమును దలంచి విశ్లేషదుఃఖమును వదలి యానన్దభరితులై పాడించుచున్నారు.

‡‡ ఉరుగుమాల్ నెఞ్జ ముయిరిన్ పరమన్ఱి*
పెరుగుమాల్ వేట్కైయు మెన్ శెయ్ గేన్ తొణ్డనేన్*
తెరువెల్లామ్ కావికమழ் తిరుక్కాట్కరై *
మరువియమాయన్ఱన్ మాయమ్ నినైదొఱే.                ౧.

అ॥ తెరువెల్లామ్ - పతివీధులయందును, కావి - నల్లకలువపుష్పము, కమழ் - పరిమళించుచున్న, తిరుక్కాట్కరై - తిరుక్కాట్కరై యనెడు దివ్యదేశమందు, మరువియ - అమరివేంచేసియున్న, మాయన్ తన్ - ఆశ్చర్యభూతుఁడైన శ్రియఃపతియొక్క, మాయమ్ - ఆశ్చర్యచేష్టితములను, నినైదొఱుమ్ - తలంచినప్పుడంత, నెఞ్జమ్ - మనస్సు, ఉరుగుమాల్ - కరుగుచున్నది ఉయిరిన్ పరమన్ఱి - ఆత్మకుసహింపకూడనట్లు, వేట్కైయుమ్ - అభినివేశమును, పెరుగుమ్ - పెరుగుచున్నది. తొణ్డనేన్ - చపలుఁడనైననేను, ఎన్ శెయ్ గేన్ - ఏమిచేసెదను? ఆల్ - ఆశ్చర్యము.

తా॥ తిరుక్కాట్కరై యందు వేంచేసియున్న శ్రియఃపతియొక్క దివ్యచేష్టితములనుదలంచి నామనస్సు ప్రేమచే శిథిలమై యుండలేక వానియందు మిక్కిలి వ్యామోహముగలదైయున్నదని.

నినైదొఱుమ్ శొల్లుమ్ తొఱుమ్ నెఞ్జిడిన్దుగుమ్*
వినైకొళ్ శీర్ పాడిలుమ్ వేమెనదారుయిర్*
శునైకొళ్ పూఞ్జోలై తెన్ కాట్కరై యెన్నప్పా*
నినైగిలేన్ నాన్ ఉనక్కాట్చెయ్యుమ్ నీర్మైయే.                ౨.

అ॥ శునైకొళ్ - తటాకములుగల, పూఞ్జోలై - పూవులతోటలచే చుట్టబడిన, తెన్ - సుందరమైన, కాట్కరై - తిరుక్కాట్కరైయందు వేంచేసియున్న, ఎన్నప్పా - ఓనాస్వామీ! వినైకొళ్ - పాపములను హరించుచున్న, శీర్ - (నీయొక్క) కల్యాణగుణములను, నినైదొఱుమ్ - తలంచినప్పుడెల్లను, శొల్లుమ్ తొఱుమ్ - అనుసంధించునప్పుడెల్లను, నెఞ్జు - మనస్సు, ఇడిన్దు - శిథిలమై, ఉగుమ్ - కరుగుచున్నది. పాడిలుమ్ - గానముజేసినను, ఎనదు - నాయొక్క. ఆరుయిర్ - సంపూర్ణమైన ఆత్మ, వేమ్ - (గాఢతరయముచే) పరితపించుచున్నది. నాన్ - నేను, ఉనక్కు - నీకు, ఆట్చెయ్యుమ్ - కైంకర్యము జేయుచున్న, నీర్మై - ప్రకారమును, (నీవు నాకు కైంకర్యముజేయుచున్న ప్రకారమునని పాడింపవలసినదానిని యట్లు చెప్పలేక నీవిధముగా పాడించుచున్నారు), నినైగిలేన్ - తలంచుటకు సమర్థుఁడనైయున్నాను.

తా॥ తిరుక్కాట్కరైయందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నీగుణములననుసంధించినప్పుడును తలంచినప్పుడును నామనస్సు ప్రేమచే గరుగుచున్నది. నాయాత్మ నిన్ననుభవింపవలయునని పరితపించుచున్నది. నీవు నాయందుఁజేసిన సౌశీల్యమును తలంచి యుండజాలనని.                ౨.

నీర్మైయాల్ నెఞ్జమ్ వఞ్జిత్తుప్పుగున్దు*ఎన్నై
ఈర్మైశెయ్దెన్నుయిరాయ్ ఎన్నుయిరుణ్డాన్*
శీర్మల్గు శోలై తెన్ కాట్కరై యెన్నప్పన్*
కార్ముగిల్వణ్ణన్ తన్ కళ్వమఱిగిలేన్. ౩.

అ॥ నెఞ్జమ్ - (నా) మనస్సును, వఞ్జిత్తు - వఞ్చనచేసి, పుగున్దు - ప్రవేశించి, నీర్మైయాల్ - సౌశీల్యముచే, ఎన్నై - నన్ను, ఈర్మైశెయ్దు - ఆర్ద్రచిత్తుఁడనైజేసి, ఎన్నుయిరాయ్ - నాకంతరాత్మయైయుండి, ఎన్నుయిర్ - నాయాత్మను, ఉణ్డాన్ - అనుభవించెను. శీర్మల్గు - మిక్కిలి సౌందర్యముగల, శోలై - తోపులచే జుట్టబడిన, తెన్ - స్పృహణీయమైన, కాట్కరై - తిరుక్కాట్కరైయందు వేంచేసియున్న, ఎన్నప్పన్ - నాస్వామియై, కార్ముగిల్ - నల్లని మేఘమువంటి, వణ్ణన్ తన్ - వర్ణముగలవాఁడైన శ్రియఃపతియొక్క, కళ్వమ్ - వంచకవ్యాపారములను, అఱిగిలేన్ - ఎఱుఁగలేను.

తా॥ నీవు నాకు కైఙ్కర్యము జేయవలయునని జెప్పి వంచనజేసి నామనస్సులోఁ బ్రవేశించి నాకు కైఙ్కర్యముజేయుచు నన్ననుభవించుచున్న సర్వేశ్వరుని మాయలను యథార్థమనియు అయథార్థమనియు తెలిసికొనఁజాలనని. ౩.

అఱిగిలేన్ తన్నుళ్ అనైత్తులగుమ్ నిఱ్క*
నెఱిమైయాల్ తానుమ్ అవఱ్ఱుళ్ నిఱ్కుమ్ పిరాన్*
వెఱికమళ్ శోలై తెన్ కాట్కరై యెన్నప్పన్*
శిఱియవెన్నారుయిరుణ్డ తిరువరుళే. ౪.

అ॥ తన్నుళ్ - తనసంకల్పమందు, అనైత్తులగుమ్ - సమస్తలోకమును, నిఱ్క - ఉండగా నెఱిమైయాల్ - శేషశేషిభావసంబన్ధముచేత, తానుమ్ - తానును, అవఱ్ఱుళ్ - ఆపదార్థములయందు, నిఱ్కుమ్ - అంతరాత్మయైయున్న, పిరాన్ - ఉపకారకుఁడును, వెఱికమళ్ - పరిమళము కొట్టుచున్న, శోలై - తోటలుగల, తెన్ - సుందరమైన, కాట్కరై - కాట్కరైయందు వేంచేసియున్నవాఁడునైన, ఎన్ అప్పన్ - నాస్వామి, శిఱియ - క్షుద్రమైన, ఎన్ - నాయొక్క, ఆరుయిర్ - ఆత్మను, ఉణ్డ - అనుభవించిన, తిరువరుళ్ - వ్యామోహమును (సౌశీల్యమును), అఱిగిలేన్ - తెలిసికొనలేను.

తా॥ తాను సర్వస్వామియై యెల్లరను తనకు శేషభూతులుగా జేసికొనియున్న సర్వేశ్వరుఁడు అతిక్షుద్రుఁడనైన నాయందింత వ్యామోహము జేయుటకుఁ గారణము నెఱుఁగలేనని ౪.

తిరువరుళ్ శెయ్బవన్ పోల ఎన్నుళ్ పుగున్దు*
ఉరువముమారుయిరుమ్ ఉడనే యుణ్డాన్*
తిరువళర్ శోలై తెన్ కాట్కరై యెన్నప్పన్*
కరువళర్ మేని నమ్ కణ్ణన్ కళ్వఙ్గళే. ౫.

అ॥ తిరువరుళ్ - అనుగ్రహమును, శెయ్బవన్ పోల - చేయువానివలె, ఎన్నుళ్ - నాహృదయమందు, పుగున్దు - ప్రవేశించి, ఉరువముమ్ - నాశరీరమును, ఆరుయిరుమ్ - ఆత్మను,

ఉడనే - ఒకప్పుడే, ఉణ్డాన్ - అనుభవించెను. తిరువళర్ - సౌందర్యమువర్ధిల్లుచున్న, శోలై - తోఁపులుగల, తెన్ - స్పృహణీయమైన, కాట్కరై - తిరుక్కాట్కరైయందు వేంచేసియున్న, ఎన్నప్పన్ - నాస్వామియు, కరువళర్ - శ్యామమైన, మేని - తిరుమేనుగలవాఁడునైన, నమ్ కణ్ణన్ - మన కృష్ణునియొక్క, కళ్వఙ్గళ్ - మాయలు (ఈవిధంబులైయున్నవి).

తా॥ నేను చేసెడి కైఙ్కర్యమును స్వీకరించువానివలె నాయందుఁబ్రవేశించి నాశరీరమును న్నాత్మనున్ను చక్కఁగాననుభవించెను. నాయందిట్లువ్యామోహము జేయుటయు త్యాశ్చర్యమని.

ఎన్ కణ్ణన్ కళ్వ మెనక్కుచ్చెమ్మాయ్నిఱ్కుమ్*
అఙ్ఙనుణ్డ వెన్నారుయిర్ కోదిదు*
పున్ కణ్మైయెయ్ది ప్పులమ్బియిరాప్పగల్*
ఎన్ కణ్ణనెన్ఱవన్ కాట్కరై యేత్తుమే. ౬

అ॥ ఎన్ కణ్ణన్ - నాశ్రీకృష్ణునియొక్క, కళ్వమ్-కపటవ్యాపారములు, ఎనక్కు - నాకు, శెమ్మాయ్నిఱ్కుమ్ - యథార్థమువలెతోఁచుచున్నవి. అఙ్ఙన్ - అతిచపలుఁడైనవాఁడు, ఉణ్డ- అనుభవించుటచే, కోదు - అసారమైన, ఎన్నారుయిరిదు - ఈనాయాత్మ, పున్ కణ్మై - దైన్యమును, ఎయ్ది - పొంది, ఎన్ కణ్ణనెన్ఱు - నాకుభవ్యుఁడైన శ్రీకృష్ణుఁడాయని, ఇరాప్పగల్ - రేయింబగళ్ళు, పులమ్బి - ఘోషించి, అవన్ కాట్కరై - వాఁడు వేంచేపియున్న తిరుక్కాట్కరై యనెడుదివ్యదేశమును, ఏత్తుమ్ - స్తుతించుచున్నది.

తా॥ సర్వేశ్వరుని కపటవ్యాపారములు నాకిప్పుడు యథార్థములవలె తోఁచుచున్నవిగాన నేను వానిని నిషేధించలేను. వాఁడనుభవించి యసారమైయున్న నాయాత్మ తిరిగియు వానిదివ్య దేశమునే స్తుతించుచున్నదని. ౬.

కాట్కరై యేత్తు మదనుళ్ కణ్ణావెన్నుమ్*
వేట్కైనోయ్కూర నినైన్దుకరైన్దుగుమ్*
ఆట్కొళ్వానొ త్తెన్నుయిరుణ్డమాయనాల్*
కోట్పట్ట వెన్నారుయిర్ కోళుణ్డే. ౭.

అ॥ ఆట్కొళ్వానొత్తు - నన్నుదాస్యపఱచుకొనువానివలె (ప్రవేశించి), ఎన్నుయిర్ - నాయాత్మను, ఉణ్డ - అనుభవించిన, మాయనాల్ - వంచకుఁడైన శ్రీకృష్ణునిచే, కోళుణ్డే - అపహరింపఁబడినదయ్యో, కోట్పట్టదు - అపహరించునప్పుడు కొంచెము మిగిలినట్లు వలెనున్న, ఎన్నారుయిర్ - నాయాత్మ, కాట్కరై - తిరుక్కాట్కరైయనెడు దివ్యదేశమును, ఏత్తుమ్ - స్తోత్రముజేయును. అదనుళ్ - ఆదివ్యదేశమందు వేంచేపియుండు, కణ్ణా - నాకుభవ్యమైనవాఁడా! ఎన్నుమ్ - అనిపిలుచును. వేట్కై - అభినివేశమనెడి, నోయ్-వ్యాధి, కూర - అధికమగునట్లు, నినైన్దు - ధ్యానించి, కరైన్దు - శిథిలమై, ఉగుమ్ - కరుగును.

తా॥ నాకైఙ్కర్యమును స్వీకరించువానివలె ముందఱ నాహృదయమందుఁబ్రవేశించి తరువాత నన్ననుభవించియు నన్ననుభవించని వానివలెనున్న సర్వేశ్వరునినే స్తుతించి వానిగుణములను ధ్యానించి నాయాత్మ కరుగుచున్నదని. ౭.

కోళుణ్డానన్ఱివన్దెన్నుయిర్ తానుణ్డాన్*
నాళునాళ్ వన్దెన్నై ముఱ్ఱవుమ్ తానుణ్డాన్*
కాళనీర్ మేగ త్తెన్ కాట్కరై యెన్నప్పఱ్కు*
ఆళన్ఱేపట్టదెన్నారుయిర్ పట్టదే. ౮.

అ॥ కోళుణ్డానన్ఱివన్దు - నాయొక్క ఉపకారమును స్వీకరించక నేవచ్చి, ఎన్నుయిర్ - నాయాత్మను, తాన్ - తాను, ఉణ్డాన్ - అనుభవించెను, నాళునాళ్ వన్దు - ప్రతిదినమువచ్చి, ఎన్నై - నన్ను, ముఱ్ఱవుమ్ - సంపూర్ణముగా, తాన్ - తాను, ఉణ్డాన్ - అనుభవించెను, కార్ - నల్లనై, నీర్ - జలముగలదైన, మేగమ్ - మేఘమువలెనున్నవాఁడును, తెన్ - సుందరమైన, కాట్కరై - తిరుక్కాట్కరైయందు వేంచేసియున్నవాఁడునైన, ఎన్నప్పఱ్కు - నాస్వామికి, ఆళ్ పట్టదన్ఱే - దాసుఁడనైగదాయైతిని. ఎనదుయిర్ పట్టదు - నాయాత్మపడిన బాధను (నేనేమని చెప్పెదనని.

తా॥ సర్వేశ్వరుఁడు నిత్యముగానన్ననుభవించుచున్నప్పటికిన్ని తృప్తిఁజెందక తిరిగితిరిగి యనుభవించుచున్న వాని సౌశీల్యము నన్ను మిక్కిలి బాధించుచున్నదని. ౮.

ఆరుయిర్ పట్టదెనదుయిర్ పట్టదు*
పేరిదఴ్ త్తామరై క్కణ్ కనివాయదోర్*
కారెఴిల్ మేగ త్తెన్ కాట్కరై కోయిల్ కొళ్*
శీరెఴిల్ నాల్ తడన్తోళ్ తెయ్వవారిక్కే. ౯.

అ॥ పేర్ ఇదఴ్ - పెద్దదళముగల, తామరై - తామరసపుష్పమువంటి, కణ్ - నేత్రమును, కని - స్నిగ్ధమైయున్న, వాయదు - అధరమునుగలవాఁడును, ఓర్ - ఒక, కార్ - నల్లనైన, ఎఴిల్ - సౌందర్యముగల, మేగమ్ - మేఘమువంటివాఁడును, తెన్ - సుందరమైన, కాట్కరై - తిరుక్కాట్కరైయనెడుదివ్యదేశమును, కోయిల్ కొళ్ - వాసస్థానముగాగలవాఁడును, శీర్ ఎఴిల్ - వీరశ్రీనిన్ని సౌందర్యమునున్నుగలవాఁడును, నాల్ - నాలుగైన, తడమ్ - విశాలమైన, తోళ్ - భుజములుగలవాఁడును, తెయ్వమ్ - దేవతలకు, వారిక్కు - ఉత్పత్తిస్థానమైనసముద్రమువంటివాఁడునైన సర్వేశ్వరునివిషయమై, ఎనదుయిర్ పట్టదు - నాయాత్మపడుచున్నబాధను, ఆరుయిర్ పట్టదు - ఎవరియాత్మ పడుచున్నది.

తా॥ పద్మనేత్రుఁడును చతుర్భుజుఁడును నీలమేఘశ్యాముఁడునైన సర్వేశ్వరుని కల్యాణగుణవిషయమై నేనుపడుచున్నబాధను మఱియెవరును పడలేదని. ౯.

వారిక్కొణ్డున్నై విఴుఙ్గువన్ కాణిలెన్ఱు*
ఆర్వుఱ్ఱ వెన్నైయొఴియ వెన్నిల్ మున్నమ్
పారిత్తు*తా నెన్నై ముఱ్ఱప్పరుగినాన్*
కారొక్కుమ్ కాట్కరై యప్పన్ కడియనే. ౧౦.

అ॥ ఉన్నైక్కాణిల్ - నిన్నుజూచినయెడల, వారిక్కొణ్డు - (సకలకైఙ్కర్యములను) పోగుచేసికొని, విఴుఙ్గువన్ ఎన్ఱు - కబళీకరించియనుభవించెదనని, ఆర్వుఱ్ఱ - అభినివేశముగల,

ఎన్నైయొழிయ - నాకంటెనధికమై, ఎన్నిల్ మున్నమ్ - నాకంటెముందుగానే, పారిత్తు - ఆశించుకొని, తాన్ - తాను, ఎన్నై - నన్ను, ముழு - సంపూర్ణముగా, పరుగినాన్ - అనుభవించుచున్నాడు. కారొక్కుమ్ - మేఘమువలె నుదారుఁడై, కాట్కరైయప్పన్ - తిరుక్కాట్కరైయందు వేంచేసియున్నస్వామి, కడియన్ - మిక్కిలిత్వరకలవాఁడైయున్నాడు.

తా॥ సర్వేశ్వరుని నూచినప్పుడేవారికి సమస్తవిధకైంకర్యము శేయవలయునని యాశించుచున్న నాకంటెముందుగానే నాకంటె నధికము గానన్ననుభవింపసర్వేశ్వరుఁ డాశించుచున్నాడని.

** కడియనాయ్ కణ్ణనై కొన్దపిరాన్ఱన్నై*
కొడిమదిళ్ తెన్ కురుగూర్ చ్చడగోపన్ శొల్*
వడివమ్మైయాయిరత్తిప్పత్తినాల్ శన్మమ్
ముడివెయ్‌ది*నాశఙ్గణ్డీర్ గళెఙ్గానలే. ౧౧.

అ॥ కడియనాయ్ - కోపముగలవాఁడై, కణ్ణనై - కంసుని, కొన్ద - చంపిన, పిరాన్ తన్నై - శ్రీకృష్ణునివిషయమై, కొడి - ధ్వజముగల, మదిళ్ - ప్రాకారములచేఁజుట్టబడి, తెన్ - సుందరమైయున్న, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్ - సాదించిన, వడివమ్మై - అందమైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తినాల్ - ఈ పది పాశురములచేత, ఎమ్శన్మమ్ - మాజన్మము, ముడివెయ్‌ది - నశించి, కానల్ - ఎండమావువలెనున్న సంసారమును, నాశఙ్గణ్డీర్‌గళ్ - నశించునుసుమీ.

తా॥ శ్రియఃపతివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన, యీ పదిపాశురముల నభ్యసించు వారికి జన్మమును తత్కారణమైనసంసారమును నశించుననని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౭ - వ, తిరువాయ్మొழி.

అవతారిక :— ఈ తిరువాయ్మొழிలో సర్వేశ్వరుని గుణానుభవముకంటె వానిసౌందర్యమును ప్రత్యక్షముగా సేవింపనాశించి నమ్మాళ్వార్లువానివద్ద పక్షులను దూతలైపంపించుచున్నారు.

** ఎఙ్గానలగణ్డివా యిరై తేర్ న్దిఙ్గినిదమరుమ్*
శెఙ్గాలమడనారాయ్ తిరుమూழிక్కళత్తుఱైయుమ్*
కొఙ్గార్ పూన్దుழாయ్ముడి యెఙ్గుడక్కూత్తర్ క్కెన్దూదాయ్*
నుఙ్గాల్ గళెన్దలై మేల్ కెழுమీరోనుమరోడే. ౧.

అ॥ ఎమ్ - మనయొక్క, కానలగమ్ - సముద్రతీరమందలి తోపులనడుమనున్న, కళ్ళి వాయ్ - ఉప్పుకడియందు, ఇరై తేర్న్దు - అహారమువెదకికొని, ఇఙ్గు - ఇచ్చట, ఇనిదు - సుఖముగా, అమరుమ్ - ఉన్న, శెమ్కాల - ఎఱ్ఱనిపాదముగల, మడమ్ - భవ్యమైన, నారాయ్ - ఓ సారసపక్షీ ! తిరుమూళిక్కళత్తు - తిరుమూళిక్కళమనెడు దివ్యదేశమందు, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్నవాఁడును, కొఙ్గుఅర్ - తేనెగల, పూ - సుందరమైన, తుళాయ్ - తిరుత్తుళాయ్‌మాలను, ముడి - కిరీటమందుగలవాఁడును, ఎమ్కుడక్కూత్తఱ్కు - కుంభనృత్యము జేసినవాఁడునైన మనస్వామికి, ఎన్తూదాయ్ - నాదూతివై (వెళ్ళి), నుమరోడే - నీబంధువులతోఁగూడ, నుమ్కాల్‌గళ్ - మీపాదములను, ఎన్తలై మేల్ - నాశిరస్సుమీఁద, కొళ్ళుమీర్ - ఉంచుడి.

తా॥ ఓ సారసపక్షీ ! తిరుమూళిక్కళమందు వేంచేసియున్న శ్రియఃపతివద్దవెళ్ళి నా బాధనుజెప్పివచ్చి దానికి ప్రత్యుపకారముగా నీపాదము లను నాశిరస్సుమీఁదనుంచవలయునని ౧.

నుమరోడుమ్పిరియాదే నీరుమ్నుమ్ శేవలుమాయ్*
అమర్ కాదల్ కురుగినఙ్గాళ్ అణిమూళిక్కళత్తుఱైయుమ్*
ఎమరాలుమ్పళిప్పుణ్డిఙ్గు ఆఱ్కాల్ తమ్మాల్ ఇళిప్పుణ్డు*
తమరోడఙ్గుఱైవార్క్కు త్తక్కిలమే కేళీరే. ౨.

అ॥ నుమరోడుమ్ - మీబంధువులతోడను, పిరియాదే - ఎడబాయక, నీరుమ్ - మీరును, నుమ్ శేవలుమాయ్ - మీ మొగపక్షియు, అమర్ కాదల్ - నిరంతరమైన ప్రీతిగలవారై యున్న, కురుగినఙ్గాళ్ - ఓ నీరుకోడులారా ! ఎమరాలుమ్ - మాబంధువులచేతను, పళిప్పుణ్డు - అపవాదమునొందియు, అణి - సుందరమైన, మూళిక్కళత్తు - తిరుమూళిక్కళమందు, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్న, తమ్మాల్ - తమచేత, ఇళిప్పుణ్డు - ఉపేక్షింపఁబడియు, ఇఙ్గెన్ - ఇచ్చటనుండుటచే నేమిప్రయోజనము ? అఙ్గు - అచ్చట, తమరోడు - తమభక్తులతోఁగూడ, ఉఱైవార్క్కు - సంశ్లేషించియుండువారికి, తక్కిలమే - (మేము) తగుమైనవారుకామా ? కేళీర్‌గళ్ - (అని) అడుగుఁడి.

తా॥ ఓ నీరుకోడులారా ! సర్వేశ్వరుఁడు నన్ను విడిచిపెట్టిపోయెను ; మావారందరు వానిని పూశించినానని నన్నునిందెంచుచున్నారు. ఇఁక నాకిచ్చటనుండుటమంచిదికాదు గాన మీరు వానివద్దవెళ్ళి, మీగోష్ఠికియాపె యయోగ్యురాలాయని యొకమాటయడుగుఁడని. ౨.

తక్కిలమే కేళీర్‌గళ్ తడమ్పునల్‌వాయిరై తేరుమ్*
కొక్కినఙ్గాళ్ కురుగినఙ్గాళ్ కుళిర్ మూళిక్కళత్తుఱైయుమ్*
శెక్కమల త్తలర్ పోలుమ్ కణ్ కై కాల్ శెఙ్గనివాయ్*
అక్కమల త్తిలై పోలుమ్ తిరుమేనియడిగళుక్కే. 3.

అ॥ తడమ్ - తటాకమందలి, పునల్ వాయ్ - జలమందు, ఇరై తేరుమ్ - అహారమువెదకుచున్న, కొక్కినఙ్గాళ్ - ఓ కొంగపక్షులారా ! కురుగినఙ్గాళ్ - ఓ నీరుకోడులారా ! కుళిర్ - చల్లనైన, మూళిక్కళత్తు - తిరుమూళిక్కళమందు, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్నవాఁడును, శెక్కమలత్తు - ఎఱ్ఱతామరయొక్క, అలర్ పోలుమ్ - పుష్పమువలెనున్న, కణ్ - నేత్ర

ములు, కై - శ్రీహస్తములు, కాల్ - శ్రీపాదములు, శెమ్‌కని - ఎఱ్ఱనిపండువలెనున్న, వాయ్ - అధరము, అక్కమలత్తు - ఆ తామరయొక్క, ఇలై పోలుమ్ - ఆకువలెనున్న, తిరుమేని - దివ్య విగ్రహము (వీనినిగల), అడిగళుక్కు - స్వామియునైన శ్రియఃపతికి, తక్కులమే - తగినవారము కామాయని, కేళీర్‌గళ్ - అడుగుడు

తా॥ ఓ కొంగపక్షులారా ! మీరు తిరుమూழிక్కళమందు వేంచేసియున్న శ్రియఃపతివద్ద వెళ్ళి, ఈపెను నీకెందుకు సేవసాదించవు ? నీ దివ్యావయవసౌందర్యమును సేవించుట కీపెకుయోగ్యత లేదాయేమని యొకమాటయడుగుడని. 3.

తిరుమేనియడిగళుక్కు తీవినైయేన్ విడుతూదాయ్*
తిరుమూழிక్కళమెన్నుమ్ శెழுనగర్ వాయణిముగిల్‌గాళ్*
తిరుమేనియవర్‌క్కరుళీర్ ఎన్ఱక్కాల్* ఉమ్మై త్తన్
తిరుమేనియొళియగఱ్ఱి తెళివిశుమ్బు కడియుమే. ౪.

అ॥ అణి - అందమైన, ముగిల్‌గాళ్ - ఓ మేఘములారా ! తిరుమూழிక్కళమెన్నుమ్ - తిరుమూழிక్కళమనెడు తిరునామముగల, శెழுనగర్ వాయ్ - సుందరమైన దివ్యదేశమందు వేంచేసియున్నవాడును, తిరుమేని - దివ్యవిగ్రహమునుగనుపఱచి, అడిగళుక్కు - లోకులను వశీకరించుకొని స్వామియైనవాడునైన శ్రియఃపతికి, తీవినైయేన్ - చెడ్డపాపముగలనాచేత, విడుతూదాయ్ - పంపబడినదూతలైవెళ్ళి, తిరుమేని - నీతిరుమేనును, అవర్‌క్కు - ఆయాழ்వార్లకు, అరుళీర్ - ఇవ్వుము, ఎన్ఱక్కాల్ - అనిచెప్పినయెడల, ఉమ్మై - మిమ్ములను, తన్ తిరుమేని - మీశరీరములయందున్న, ఒళి - కాన్తిని, అగఱ్ఱి - పోఁగొట్టి, తెళివిశుమ్బు - నిర్మలమైన ఆకాశమందుండి, కడియుమే - వెళ్లకొట్టునా ?

తా॥ ఓ మేఘములారా ! మీరు తిరుమూழிక్కళమందు వేంచేసియున్నస్వామివద్దకెళ్ళి, "ఆழ்వార్లకు నీతిరుమేనును సంశ్లేషించునటివ్వుము" అనిచెప్పుడు. ఇంతమాత్రము చెప్పినందున మిమ్ములను దేహకాన్తినిబోఁగొట్టి యాకాశమందుండి వెళ్లకొట్టడని ౪.

తెళివిశుమ్బుకడిదోడి త్తీవళైత్తుమిన్నిలగుమ్*
ఒళిముగిల్‌గాళ్ తిరుమూழிక్కళత్తుఱైయుమొణ్‌శుడర్‌క్కు*
తెళివిశుమ్బుతిరునాడా త్తీవినైయేన్ మనత్తుఱైయుమ్*
తుళివార్‌కళ్‌కుழలార్‌క్కు ఎన్‌తూదురైత్తల్ శెప్పుమినే. ౫.

అ॥ తెళివిశుమ్బు - నిర్మలమైనయాకాశమందు, కడిదు - శీఘ్రముగా, ఓడి - సంచరించి, తీవళైత్తు - అగ్నిచక్రమువలె, మిన్ ఇలగుమ్ - మెఱుపులచేఁప్రకాశించుచున్న, ఒళిముగిల్‌గాళ్ - ఓ సుందరమేఘములారా ! తిరుమూழிక్కళత్తు - తిరుమూழிక్కళమందు, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయువాఁడును, ఒణ్‌శుడర్‌క్కు - సుందరమైనకాన్తిగలవాఁడును, తెళివిశుమ్బు - నిర్మలాకాశమైనపరమపదమును, తిరునాడా - విభూతిగాగలవాఁడును, తీవినైయేన్ - పాపియైననాయొక్క, మనత్తుఉఱైయుమ్ - హృదయమందు నిత్యవాసముజేయువాఁడును, తుళి - బిందువులు, వార్ - ప్రవహించుచున్న, కళ్ - తేనెగల, కుழలార్‌క్కు - శిఖాబంధముగలవాఁడునైన శ్రియఃపతికి, ఎన్ తూదురైత్తల్ - నాదూతవాక్యమును, శెప్పుమిన్గళ్ - చెప్పుఁడు.

తా॥ ఓ మేఘములారా! మీరేమియుసందేహింపవలదు. వాఁడు నాహృదయమందు మిక్కిలియాసక్తిగలవాఁడై ప్రవేశించి వాసముజేయువాఁడుగావ మీమాటనుతప్పక నంగీకరించును, వెళ్ళి చెప్పుఁడని. ౫.

తూదురై త్తల్ శెప్పుమిన్గళ్ తూమొழிవాయ్వణ్డినఙ్గాళ్*
పోదిరై త్తుమదునుగరుమ్ పొழிల్ మూழிక్కళత్తుఱైయుమ్*
మాదరై త్తమ్మార్విగత్తే వైత్తార్క్కెన్ వాయ్మాఱ్ఱమ్*
తూదురై త్తల్ శెప్పుదిరేల్ శుడర్వళై యుమ్కలై యుమే. ౬.

తా॥ తూ - మధురమైన, మొழி - మాటలను, వాయ్ - ముఖమందుగల, వణ్డినఙ్గాళ్ - ఓ తుమ్మెదల సమూహములారా! పోదు - పుష్పములయందు, ఇరైత్తు - శబ్దించుచు, మదు - మకరన్దమును, నుగరుమ్ - పానముజేయఁదగిన, పొழிల్ - తోటలుగల, మూழிక్కళత్తు - తిరుమూழிక్కళమందు, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయుచున్నవాఁడును, మాదరై - శ్రీదేవిని, తన్ - తనయొక్క, మార్విగత్తే - వక్షస్థలమందే, వైత్తార్క్కు - ఉంచుకొనినవాఁడునైన శ్రియఃపతికి, ఎన్వాయ్మాఱ్ఱమ్ - నాపాళురమైన, తూదురైత్తల్ - దూతవాక్యమును, శెప్పుదిరేల్ - చెప్పితిరేని, శుడర్ - ఉజ్జ్వలమైన, వళైయుమ్ - (జారిపోయిన) కంకణములనున్ను, కలైయుమ్ - వస్త్రములనున్ను, శెప్పుమిన్గళ్ - చెప్పుఁడు.

తా॥ ఓతుమ్మెదలారా! తిరుమూழிక్కళమందు పిరాట్టితోఁగూడవేంచేసియున్న శ్రియఃపతికి "నీవిరహముచేత నా పూర్వోక్తకంకణములును వస్త్రములునుజారిపోయిన" వని చెప్పుఁడని.

శుడర్వళై యుమ్కలై యుమ్కొణ్డరువినై యేన్ తోళ్తుఱన్ద*
పడర్పుగழ்ాన్ తిరుమూழிక్కళత్తుఱై యుమ్పఙ్గయక్కణ్*
శుడర్పవళవాయనై క్కణ్డొరునాళోర్ తూయ్మాఱ్ఱమ్*
పడర్పొழிల్ వాయ్క్కురుగినఙ్గాళ్ ఎనక్కొన్ఱుపణియీరే. ౭.

అ॥ పడర్ - విశాలమైన, పొழிల్వాయ్ - తోటలయందు సంచరించుచున్న, కురుగినఙ్గాళ్ - ఓ నీరుకోడులారా! శుడర్ - ఉజ్జ్వలమైన, వళైయుమ్-కంకణమును, కలైయుమ్ - వస్త్రమును, కొణ్డు - అపహరించి, అరువినైయేన్ - క్రూరమైనపాపముగలవాయొక్క, తోళ్ - భుజములతో, తుఱన్ద - విశ్లేషించినవాఁడును, పడర్ - అంతటవ్యాప్తమైన, పుగழ்ాన్ - కీర్తిగలవాఁడును, తిరుమూழிక్కళత్తు - తిరుమూழிక్కళమందు, ఉఱైయుమ్ - నిత్యవాసముజేయువాఁడును, పఙ్గయమ్ - పద్మమువంటి, కణ్ - నేత్రములుగలవాఁడును, శుడర్ - ఉజ్జ్వలమైన, పవళమ్ - పగడమువంటి, వాయనై - అధరముగలవాఁడునైనశ్రియఃపతిని, కణ్డు - చూచి, ఎనక్కు - నానిమిత్తమై, ఒరునాళ్ - ఒకదినము, ఓర్ - విలక్షణమై, తూయ్ - మధురమైన, ఒన్ఱు మాఱ్ఱమ్ - ఒకమాటను, పణియీర్ - చెప్పుఁడు.

తా॥ ఓనీరుకోడులారా! తనకభిమతమైనవాయొక్క కంకణవస్త్రాదుల నపహరించుకొని వాతో విశ్లేషించి తిరుమూழிక్కళమందువెళ్ళి వేంచేసియున్న సుందరాంగునిజూచి, "నన్నిట్లు చేయవచ్చునా" యని యొకమాట నానిమిత్తమైయడుగుఁడని. ౭.

ఎనక్కొన్ఱు పణియీర్గళ్ ఇరుమ్బొழிల్ వాయిరై తేర్న్దు*
మనక్కిన్బమ్పడ మేవుమ్ పణ్డినఙ్గాళ్ తుమ్బిగాళ్*
కనక్కొళ్ తిణ్ మదిళ్ పుడై శూழ் తిరుమూழிక్కళత్తుఱై యుమ్*
పునక్కొళ్ కాయామేని పూన్దుழాయ్ముడియార్క్కే. ౮.

అ॥ ఇరుమ్ - విశాలమైన, పొழிల్ వాయ్ - తోటలయందు, ఇరై తేర్న్దు - ఆహారము వెదకికొని, మనక్కు - మనస్సుకు, ఇన్బమ్పడ - సుఖముకలుగునట్లు, మేవుమ్ - సంశ్లేషించుచున్న, పణ్డినఙ్గాళ్ - ఓతుమ్మెదలారా! తుమ్బిగాళ్ - ఓచిన్నతుమ్మెదలారా! కనక్కొళ్ - దట్టమై, తిణ్ - దృఢమైయున్న, మదిళ్ - ప్రాకారములచే, పుడై - చుట్టును, శూழ் - చుట్టబడిన, తిరుమూழிక్కళత్తు - తిరుమూழிక్కళమందు, ఉఱైయుమ్ - నిత్యవాసము చేయుచున్నవాఁడును, పునక్కొళ్ - స్వస్థానమందున్న, కాయా - కెల్లుపుష్పవంటి, మేని - తిరుమేనుగలవాఁడును, పూన్దుழాయ్ - సుందరమైన తిరుత్తుழాయ్మాలను, ముడియార్క్కు - కిరీటమందుగలవాఁడునైన సర్వేశ్వరునికి, ఎనక్కు - నానిమిత్తమై, ఒన్ఱుపణియీర్గళ్ - ఒకమాటచెప్పుఁడు.

తా॥ ఓతుమ్మెదలారా! దట్టమైన ప్రాకారముగల తిరుమూழிక్కళమందు వేంచేసియున్న సర్వేశ్వరునివద్దకెళ్ళి నేనిట్లు బాధపడుచున్నానని నానిమిత్తమైయొకమాట చెప్పుఁడని ౮.

పూన్దుழాయ్ముడియార్క్కు పొన్నాழிకై యారుక్కు*
ఏన్దునీరిళఙ్కురుగే తిరుమూழிక్కళత్తారుక్కు*
ఏన్దుపూణ్ ములై పయన్దెన్నిణై మలర్క్కణ్ణీర్ తదుమ్బ*
తామ్తమ్మైక్కొణ్డగల్దల్ తగవన్ఱెన్ఱురై యీరే. ౯.

అ॥ ఏన్దు - (నిన్నుమునుగకుండపైకెత్తి) ధరించుచున్న, నీర్ - జలమందు సంచరించుచున్న, ఇళఙ్కురుగే - ఓచిన్ననీరుకోడీ! పూ - అందమైన, తుழాయ్-తిరుత్తుழాయిమాలచే నలంకరింపఁబడిన, ముడియార్క్కు - కిరీటముగలవాఁడును, పొన్ - స్పృహణీయమైన, ఆழி - సుదర్శనమును, కైయారుక్కు - శ్రీహస్తమందుగలవాఁడును, తిరుమూழிక్కళత్తారుక్కు - తిరుమూழிక్కళమందు వేంచేసియున్నవాఁడునైన సర్వేశ్వరునికి, పూణ్ - ఆభరణములను, ఏన్దు - ధరించుచున్న, ములై - స్తనము, పయన్దు - వివర్ణమై, ఇణైమలర్ - చేరియున్న రెండుపుష్పము వలెనున్న, ఎన్కణ్ - నానేత్రములయందు, నీర్తదుమ్బ - నీళ్ళునిండునట్లు, తామ్ - తాము, తమ్మైక్కొణ్డు అగల్దల్ - తమ విగ్రహమును దీసికొనిపోవుట, తగవన్ఱు - దయాగుణమునకు తగుమైనదికాదు, ఎన్ఱు - అని, ఉరైయీర్ - చెప్పుము.

తా॥ ఓచిన్న నీరుకోడీ! నీవు తిరుమూழிక్కళమందు వేంచేసియున్నశ్రియఃపతివద్దకెళ్ళి, నాయవయవములు వివర్ణమై దుఃఖించునట్లు నన్నిట్లు విశ్లేషించుట నీకుచితముకాదు. ఇట్లు చేసినయెడల నీవు నిర్దయుండవని చెప్పబడుదువని చెప్పుమని. ౯.

తగవన్ఱెన్ఱురై యీర్గళ్ తడమ్బునల్ వాయిరై తేర్న్దు*
మిగవిన్బమ్పడ మేవుమ్ మెన్నడై యవన్నఙ్గాళ్*

మిగమేని మెలివెయ్ది మేగలై యుమీడబ్రీన్ను*ఎన్
అగమేని యొழிయామే తిరుమూழிక్కళత్తార్క్కే. ౧౦.

అ॥ తడమ్ - విశాలమైన, పునల్ వాయ్-జలముమీఁద, ఇరై తేర్న్దు - ఆహారమువెదకుచు, మిగఇన్బమ్పడ - మిక్కిలిసుఖముకలుగునట్లు, మేవుమ్ - అమరియున్న, మెల్ నడైయ - మంద గమనముగల, అన్నఙ్గాళ్ -ఓహంసపక్షులారా! మేని - శరీరము, మిగ-మిక్కిలి, మెలివెయ్ది - కృశించి, మేగలైయుమ్ - మొలనూలును, ఈడబ్రీన్ను - జారిపోయి, ఎన్అగమేని - నాలోపల నున్న (ఆత్మ) స్వరూపము, ఒழிయామే - నశించుటకుముందే, తిరుమూழிక్కళత్తార్క్కు - తిరుమూழிక్కళమందు వేంచేసియున్న సర్వేశ్వరునికి, తగవన్తు-యుక్తముకాదని, ఉరైయీర్ గళ్ - చెప్పుడు.

తా॥ ఓహంసపక్షులారా! నాశరీరము మిక్కిలి కృశించి నాయాభరణములన్నియు జారిపోయినవి. ఇఁకనా ప్రాణముపోవుటకుముందైనను మీరువెళ్ళి తిరుమూழிక్కళమందు వేంచేసియున్న శ్రియఃపతికి, " ఇట్లు బాధపెట్టుట నీకు యుక్తముకాదని " చెప్పుఁడని. ౧౦.

‡‡ ఒழிవిన్ఱి త్తిరుమూழிక్కళత్తుఱైయుమొణ్ శుడరై*
ఒழிవిల్లావణిమழలై క్కిళిమొழிయాళలర్ శ్రీయశోల్*
వழுవిల్లావణ్ కురుకూర్ చ్చడగోపన్ వాయ్న్దురైత్త*
అழிవిల్లావాయిరత్తిప్పత్తుమ్ నోయఱుక్కుమే. ౧౧.

అ॥ ఒழிవిన్ఱి - ఎడబాయక (నిరంతరముగా), తిరుమూழிక్కళత్తు - తిరుమూழிక్కళ మందు, ఉఱైయుమ్ - నిత్యవాసముచేయుచున్న, ఒణ్ శుడరై - అందమైన తేజస్సుగల శ్రియః పతివిషయమై, ఒழிవిల్లా - (వానిని) విశ్లేషించని, అణి - సుందరమైన, మழలై - ముగ్ధమాట లుగల, కిళి - చిలకయొక్క, మొழிయాళ్ - మాటలువంటిమాటలుగల పిరాట్టి, అలర్ శ్రీయ - విశ్లేషదుఃఖముచేసాదించిన, శోల్ - శ్రీసూక్తులను, వழுవిల్లా - (పిరాట్టియొక్క గుణములయందు) న్యూనతలేనివారై, వణ్ కురుకూర్-సుందరమైన కురుకాపురికిస్వామియైన, శడగోపన్- నమ్మాళ్వార్లు, వాయ్న్దు - సమీపించి (భావబంధముగలవారై), ఉరైత్త - సాదించినవై, అழி విల్లా - అభ్యసించినవారి హృదయమును విడువనివై, ఆయిరత్తు - వెయ్యిపాశురములలోచేరినవైన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములును, నోయ్ - భగవద్విశ్లేషమనెడువ్యాధిని, అఱుక్కుమ్ - పోఁగొట్టును.

తా॥ తిరుమూழிక్కళమందు వేంచేసియున్న సర్వేశ్వరునివిషయమై పిరాట్టి సాదించిన శ్రీసూక్తులను ప్రతిపాదించెడియీపదిపాశురముల నభ్యసించువారు భగవద్విశ్లేషమును బొందరని.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౮ - వ, తిరువాయ్మొఴి.

అవతారిక:— ఈతిరువాయ్మొఴిలో, పంపించిన దూతలచ్చటికివెళ్ళి సర్వేశ్వరునికి తనయవస్థనుజెప్పి తిరిగివచ్చుటకుముందే అత్యభినివేశముగలవారై నమ్మాళ్వార్లు అంతలో తిరునావాయనెడు దివ్యదేశమందు వేంచేసియున్న శ్రియఃపతిని సేవించి నేనెప్పుడు కైంకర్యము చేసెదనో యనిసాదించుచున్నారు.

‡‡ అఱుక్కుమ్వినై యాయిన వాగత్తవనై *
నిఱుత్తుమ్మనత్తొన్ఱియ శిన్దైయినార్క్కు *
వెఱిత్తణ్మలర్చ్చోలైగళ్శూఴ్ తిరునావాయ్ *
కుఱుక్కుమ్వగై యుణ్డుకొలో కొడియేఱ్కే. ౧.

అ॥ అగత్తు - హృదయమందు, అవనై - ఆసర్వేశ్వరుని, నిఱుత్తుమ్ - ఉంచవలయుననెడి, మనత్తు - అధ్యవసాయమందు, ఒన్ఱియ - ఉద్యోగించిన, శిన్దైయినార్క్కు - మనోరథముగలవారి యొక్క, వినైయాయిన - పాపములైనవన్నింటిని, అఱుక్కుమ్ - పోఁగొట్టునదియు, వెఱి - పరిమళముగల, తణ్ - చల్లనైన, మలర్ - పుష్పములుగల, శోలైగళ్ - తోఁపులచే, శూఴ్ - చుట్టుబడినదియునైన, తిరునావాయ్ - తిరునావాయనెడుదివ్యదేశమును, కొడియేఱ్కు - పాపముగలనాకు, కుఱుక్కుమ్వగై - పొందుటకుపాయము, ఉణ్డుకొలో - కలదా ?

తా॥ సర్వేశ్వరుని హృదయమందుంచుకొనినవారికి భగవత్ప్రాప్తివిరోధుల నన్నింటిని పోఁగొట్టెడి తిరునావాయిని బొందుటకు నాకుపాయమేమైనకలదాయని. ౧.

కొడియేరిడై క్కోగనగత్తవళ్ కేళ్వన్ *
వడివేల్తడఙ్గణ్ మడప్పిన్నై మణాళన్ *
నెడియానుఱై శోలైగళ్శూఴ్ తిరునావాయ్ *
అడియేననుగప్పెఱునాళ్ ఎవైకొలో. ౨.

అ॥ కొడి - తీఁగవలె, ఏర్ - సుందరమైన, ఇడై - నడుముగలదై, కోగనగత్తవళ్ - కమలవాసినియైనపిరాట్టికి, కేళ్వన్ - వల్లభుఁడును, వడి - తీక్ష్ణమైన, వేల్ - ఆయుధమువలె నున్న, తడమ్ - విశాలమైన, కణ్ - నేత్రములనున్న, మడమ్ - ఆత్మగుణములనున్నగల, పిన్నై - నప్పిన్నపిరాట్టికి, మణాళన్ - వల్లభుఁడును, నెడియాన్ - అపరిచ్ఛిన్నమహిమగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, ఉఱై - నిత్యవాసముచేయుచున్న, శోలైగళ్ శూఴ్ - తోఁపులచేఁజుట్టఁబడిన, తిరునావాయ్ - తిరునావాయిని, అడియేన్ - దాసుఁడనైననేను, అణుగప్పెఱుమ్నాళ్ - పొందదగినదినములు, ఎవైకొలో - ఏదో ?

తా॥ సర్వేశ్వరుఁడు శ్రీభూనీళాదేవీసమేతుఁడై వేంచేసియున్నతిరునావాయిని నేనెన్నడు పొందెదనోయని. ౨.

ఎవైకొలణుగప్పెఱునాళ్ ఎన్ఱెప్పోదుమ్ *
కవైయిల్మనమిన్ఱి క్కణ్ణీర్గళ్కలుழ్వన్ *

నవై యిల్ తిరునారణ౯్ శేర్ తిరునావాయ్*
అవై యుళ్ పుగలావ దోర్ నాళఱియేనే. 3.

అ॥ అణుగప్పెఱుమ్ నాళ్ - (తిరునావాయిని) పొందదగిననదినములు, ఎవైకొల్ - ఏవో? ఎన్రు - అని, ఎప్పోదుమ్ - ఎల్లప్పుడును, కవైయిల్ మనమిన్రి - మఱియొకవిషయమందు పోలగిన మనస్సులేనివాఁడనై (ఏకాగ్రచిత్తుఁడనై), కణ్ణీర్ గళ్ - బాష్పములు, కలుళ్వన్ - ప్రవహింపచునట్లుండెదను. నవై ఇల్ - (దుర్లభత్వమనెడి) దోషములేని, తిరునారణన్ - శ్రీమన్నారాయణుఁడు, శేర్ - వాసముచేయుచున్న, తిరునావాయ్ - తిరునావాయందలి, అవైయుళ్ - అగోష్ఠిలో, పుగలావదు - ప్రవేశించుటకు, ఓర్ నాళ్ - ఒకదినమును, అఱియేన్ - ఎఱుఁగకయున్నాను.

తా॥ ఏకాగ్రచిత్తుఁడనై కన్నీళ్ళుప్రవహింపఁజేయుచు దుఃఖించుచున్న నేను శ్రీమన్నారాయణుఁడువేంచేసియున్న తిరునావాయందలి శ్రీవైష్ణవగోష్ఠిలో నెప్పుడు ప్రవేశించెదనోయని.

నాళేలఱియే నెనక్కుళ్ళన*నానుమ్
మీళావడిమైప్పణి శెయ్యప్పుగున్దేన్*
నీళార్ మలర్చ్చోలైగళ్ శూళ్ తిరునావాయ్*
వాళేయ్తడఙ్గణ్ మడప్పిన్నై మణాళా. ౪.

అ॥ నీళ్ - పొడువై, ఆర్ - చుట్టువ్యాపించి, మలర్ - పుష్పములుగల, శోలైగళ్ - తోటలచే, శూళ్ - చుట్టబడిన, తిరునావాయ్ - తిరునావాయందు వేంచేసియున్నవాఁడు, వాళ్ ఏయ్ - మత్స్యముతోఁబోలిన, తడమ్ - విశాలమైన, కణ్ - నేత్రములనున్న, మడమ్ - గుణపూర్తిని గల, పిన్నై - నప్పిన్నపిరాట్టికి, మణాళా - వల్లభుఁడునైన ఓస్వామీ! నానుమ్ - నేనును, మీళా - ఎడతెగక, అడిమైప్పణి - దాస్యకృత్యము, శెయ్య - చేయుటకు, పుగున్దేన్ - అన్వయించితిని (అందునిమిత్తమై), ఎనక్కు - నాకు, ఉళ్ళన - ఏర్పడియున్న, నాళ్ - దినమును, అఱియేన్ - ఎఱుఁగను.

తా॥ సర్వేశ్వరునికి సకలవిధకైఙ్కర్యమును జేయుటకు సిద్ధమైయున్న నేను, నప్పిన్నపిరాట్టితోఁగూడ వేంచేసియున్న వానికెప్పుడు కైఙ్కర్యముచేసెదనో తెలియలేదని. ౪.

మణాళన్ మలర్ మఙ్గైక్కుమ్ మణ్ మడన్దైక్కుమ్*
కణ్ణాళ నులగత్తుయిర్ తేవర్గట్కెల్లామ్*
విణ్ణాళన్ విరుమ్బియుఱైయుమ్ తిరునావాయ్*
కణ్ణారక్కళిక్కిన్రదిఙ్గెన్రుకొల్ కణ్డే. ౫.

అ॥ మలర్ మఙ్గైక్కుమ్ - కమలవాసినియైన పిరాట్టికిని, మణ్ మడన్దైక్కుమ్ - భూదేవికిని, మణాళన్ - వల్లభుఁడును, ఉలగత్తు - లోకమందలి, ఉయిర్ - ప్రాణులకును, తేవర్గట్కెల్లామ్ - దేవతలందరికిని, కణ్ణాళన్ - నిర్వాహకుఁడును, విణ్ణాళన్ - శ్రీవైకుణ్ఠనాథుఁడునైన సర్వేశ్వరుఁడు, విరుమ్బి - ఆశపడి, ఉఱైయుమ్ - నిత్యవాసముచేయుచున్న, తిరునావాయ్ - తిరునావాయిని, కణ్ణార - నేత్రములునిండునట్లు, కణ్డు - సేవించి, ఇఙ్గు - ఇచ్చట, కళిక్కిన్రదు - అనన్దించుట, ఎన్రుకొలో - ఎప్పుడో?

తా॥ ఉభయవిభూతినాయకుఁడై శ్రీభూదేవీవల్లభుఁడైయున్న సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరునావాయిని నేనెప్పుడు కన్నార సేవించి యానందించెదనోయని. ౫.

కణ్ణేకళిక్కున్ఱ దెన్ఱుకొల్ కణ్గళ్*
తొణ్డేయునక్కాయొழி న్దేన్ తురిశిన్ఱి*
వణ్డార్ మలర్చ్చోలైగళ్ శూழ் తిరునావాయ్*
కొణ్డేయుఱైగిన్ఱ వెజ్కోవలర్ కోవే. ౬.

అ॥ వణ్డు - తుమ్మెదలచే, ఆర్ - పూర్ణమైన, మలర్ - పుష్పములుగల, శోలైగళ్ - తోపులచే, శూழ் - చుట్టబడిన, తిరునావాయ్ - తిరునావాయిని, కొణ్డు - ఆదరించుకొని, ఉఱైగిన్ఱ - వాసముజేయుచున్న, ఎజ్కోవలర్ కోవే-మాకుసుగోపులకును స్వామియైనవాఁడా! తురిశిన్ఱి - విషయాన్తరసంబన్ధములేక, ఉనక్కే - నీకే, తొణ్డాయొழிన్దేన్ - దాసుఁడనైతిని. కణ్గళ్ - నానేత్రములు, ఇఙ్గు - ఇచ్చట, కణ్డే-నిరన్తరముగా సేవించి, కళిక్కున్ఱదు - సన్తోషించుట, ఎన్ఱుకొల్ - ఎప్పుడో?

తా॥ తిరునావాయందు నిత్యవాసముజేయుచున్న ఓ శ్రీకృష్ణుఁడా! నీకనన్యదాసుఁడనైన నేను నిన్నెప్పుడుకన్నార సేవించి సన్తోషించెదనోయని. ౬.

కోవాగియమావలియై నిలఙ్కొణ్డాయ్*
తేవాశురమ్ శెఱ్ఱవనే తిరుమాలే*
నావాయుఱైగిన్ఱ వెన్నారణనమ్బీ*
ఆవావడియా నివనెన్ఱరుళాయే. ౭.

అ॥ కోవాగియ - రాజైయున్న, మావలియై - మహాబలిని (యాచించి), నిలమ్ - భూమిని, కొణ్డాయ్ - పరిగ్రహించినవాఁడవును, తేవాశురమ్ - దేవాసురయుద్ధమందు (శత్రువులను), శెఱ్ఱవనే - చంపినవాఁడవును, నావాయ్ - తిరునావాయందు, ఉఱైగిన్ఱ - వాసముజేయుచున్నవాఁడవును, ఎన్ - నాస్వామియు, నారణన్ - సర్వాన్తర్యామియు, నమ్బీ - పూర్ణుఁడవునైన, తిరుమాలే - ఓ శ్రియఃపతీ! ఆఆ - అయ్యోఅయ్యో! ఇవన్ - ఈయాళ్వార్లు, అడియాన్ ఎన్ఱు - మనదాసులుఅని, అరుళాయ్ - కృపజేయుము.

తా॥ ఆశ్రితరక్షణార్థమై తిరునావాయందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నన్ననన్యగతికుఁడనితలంచి యనుగ్రహింపుమాయని. ౭.

అరుళాదొழிవా యరుళ్ శెయ్దు*అడియేనై
ప్పొరుళాక్కి యున్పొన్నడిక్కీழ் ప్పుగవైప్పాయ్*
మరుళేయిన్ఱి యున్నైయెన్నెఞ్జత్తిరుత్తుమ్*
తెరుళేతరు తెన్దిరునావాయెన్ దేవే. ౮.

అ॥ అరుళాదొழிవాయ్ - నీవుకృపజేయకపోయినపుడు, అరుళ్ శెయ్దు - కృపఁజేసి, అడియేనై - దానుని, పొరుళాక్కి - ఒకవస్తువుగాజేసి, ఉన్ - నీయొక్క, పొన్ - స్పృహ

తీయనైన, అడిక్కీழ் - శ్రీపాదముల క్రింద, పుగవైప్పాయ్ - ప్రవేశింపించియుంచినను సరె, తేన్ - సుందరమైన, తిరునావాయ్ - తిరునావాయందు వేంచేసియున్న, ఎన్ తేనే - నాస్వామీ! మరువేయిన్ఱి - అజ్ఞానములేక, ఉన్నై - నిన్ను, ఎన్ నెఞ్జత్తు - నాహృదయమందు, ఇరుత్తుమ్ - ఉంచదగిన, తెరుళే - జ్ఞానమునే, తరు - ఇవ్వుము.

తా॥ తిరునావాయందు వేంచేసియున్న ఓ స్వామీ! నీవు కృపచేసి నన్ను నీ శ్రీపాదములయందు చేర్చుకొనినను సరే; అట్లుగటాక్షించక పోయినను సరె; పరంతు - నిన్నెల్లప్పుడును నా మనస్సులోనుంచుకొనునట్టుమాత్ర మనుగ్రహము చేయుమా యని. ౮.

తేవర్ మునివర్క్కెన్ఱుమ్ కాణ్డఱ్కరియన్*
మూవర్ ముదల్వ నొరుమూవులగాళి*
తేవన్ విరుమ్బియుఱైయుమ్ తిరునావాయ్*
యావరణుగప్పెఱువా రినియన్దో. ౯.

అ॥ తేవర్ మునివర్క్కు - దేవతలకును ఋషులకును, ఎన్ఱుమ్ - ఏకాలమందును, కాణ్డఱ్కు - సేవించుటకు, అరియన్ - దుర్లభుఁడును, మూవర్ - బ్రహ్మరుద్రేన్ద్రులు ముగ్గురికిని, ముదల్వన్ - కారణభూతుఁడును, ఒరు - అద్వితీయమైన, మూవులగు - త్రిలోకములనున్న, ఆళి - పరిపాలించువాఁడునైన, తేవన్ - సర్వేశ్వరుఁడు, విరుమ్బి - ఆశపడి, ఉఱైయుమ్ - వాసముచేయుచున్న, తిరునావాయ్ - తిరునావాయిని, ఇని - ఇఁకమీఁద, అణుగప్పెఱువార్ యావర్ - పొందదగినవారెవరో? అన్దో - అయ్యో!

తా॥ దేవాధిదేవుఁడైన శ్రియఃపతి వేంచేసియున్న తిరునావాయిని చేసుకొందక నే పోతిని; ఇఁకమీద నాదివ్యదేశమును బొందదగిన భాగ్యవంతులెవరోయని. ౯.

అన్దోవణుగప్పెఱునా ళెన్ఱెప్పోదుమ్*
శిన్దైకలఙ్గి త్తిరుమాలెన్ఱఴైప్పన్*
కొన్దార్ మలర్చ్చోలైగళ్ శూழ் తిరునావాయ్*
వన్దేయుఱైగిన్ఱ వెమ్మామణివణ్ణా. ౧౦.

అ॥ కొన్దుఆర్ - గుచ్ఛముగానున్న, మలర్ - పుష్పములుగల, శోలైగళ్ - తోపులచే, శూழ் - చుట్టబడిన, తిరునావాయ్ - తిరునావాయందు, వన్దు - (పరమపదమునుంచి) వచ్చి, ఉఱైగిన్ఱ - వాసముచేయుచున్న, ఎమ్మామణివణ్ణా - శ్లాఘ్యమైన నీలరత్నమువంటి కాన్తిగల ఓ నాస్వామీ! అన్దో - అయ్యో! అణుగప్పెఱునాళ్ - (నిన్ను) పొందదగినదినము (ఏదో), ఎన్ఱు - అని, ఎప్పోదుమ్ - ఎల్లప్పుడును, శిన్దైకలఙ్గి - మనోవ్యాకులపడి, తిరుమాల్ ఎన్ఱు - ఓ శ్రియఃపతీ! యని, అఴైప్పన్ - పిలిచెదను.

తా॥ ఆశ్రితరక్షణార్థమై తిరునావాయందువచ్చి వేంచేసియున్న ఓస్వామీ! నిన్ను నేనెప్పుడు పొందెదనోయని చింతించుచు వ్యాకులపడి నిన్నునే పిలుచుచున్నానని. ౧౦.

- వణ్ణమ్మణిమాడ నన్నావాయుళ్ళానై*
తిణ్ణమ్మదిళ్ తెన్కురుగూర్చ్చడగోపన్*

పణ్ణార్ తమిழ் ఆయిరత్తిప్పత్తుమ్ వల్లార్*
మణ్ణాణ్డు మణమ్ కమழ்వర్ మల్లిగై యే. ౧౧.

అ॥ వణ్ణమ్ - నానావర్ణమైన, మణి - రత్నములు చెక్కిన, మాడమ్ - గృహములుగల, నల్ - సుందరమైన, నావాయ్ - తిరునావాయందు, ఉఱైవానై - వేంచేసియున్న శ్రియఃపతి విషయమై, తిణ్ - దృఢమై, అమ్ - సుందరమై, మదిళ్ - ప్రాకారములుగల, తెన్ - స్పృహణీయమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాழ్వార్లు (పాడించిన), పణ్ ఆర్ - గానము చేబూర్ణమై, తమిழ் - ద్రావిడరూపమైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో జేరిన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, వల్లార్ - అభ్యసించువారు, మణ్ - భూలోకమందు, ఆణ్డు - శ్రీవైష్ణవసంపత్తు ననుభవించి, మల్లిగై మణమ్ - మల్లియొక్క పరిమళము మొదలగు సమస్తగంధములను, కమழ్వర్ - అనుభవింతురు.

తా॥ తిరునావాయందు వేంచేసియున్న శ్రియఃపతి విషయమై నమ్మాழ్వార్లు ప్రసాదించిన యీ పదిపాశురముల నభ్యసించువారు ఇహలోకమందున్నపఱకు భాగవతోత్తములై యుండి తిరువాత సర్వగంధుఁడైన సర్వేశ్వరుని మోక్షమందనుభవింతురని. ౧౧.

ఆழ్వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్

---

## ౯ - వ, తిరువాయ్మొழி.

అవతారిక :— ఈ తిరువాయ్మొழிలో, సర్వేశ్వరుని బొందవలయునని గొప్పత్వరాతిశయముగల నమ్మాழ్వార్లు భగవత్ప్రాప్తిసూచకమైన చిహ్నములనుజూచి, గోకులమందు గోవులనుమేపి సాయంకాలము శ్రీకృష్ణుఁడువచ్చుచున్నప్పుడు దానికి సూచకమైన చిహ్నముల నెఱింగి గోపికలు బాధపడుచు చెప్పుచున్న విధముగా పాడించుచున్నారు.

మల్లిగై కమழ் తెన్ఱలీరుమాలో వణ్కుఱిఞ్జియిశై తవరుమాలో*
శెల్ కదిర్మాలైయుమ్ మయక్కుమాలో శెక్కర్ నన్మేగఙ్గళ్ శిదైక్కుమాలో*
అల్లియన్దామరైక్కణ్ణనెమ్మా నాయర్ గళేఱరియే ఎమ్మాయో*
పుల్లియెమ్మై గళుమ్ తోళుమ్ కొణ్డు పుగలిడమత్ గిలమ్ తమియమాలో. ౧.

అ॥ మల్లిగై కమழ் - మల్లీపుష్పముయొక్క పరిమళముగల, తెన్ఱల్ - మలయమారుతము, ఈరుమ్ - (నన్ను) బద్దలుచేయుచున్నది. వణ్ - అందమైన, కుఱిఞ్జి - కుఱిఞ్జియనెడి, ఇశై - రాగము, తవరుమ్ - తుంచుచున్నది. శెల్ - అస్తమించుచున్న, కదిర్ - సూర్యునిగల, మాలైయుమ్ - సన్ధ్యాకాలమును, మయక్కుమ్ - భ్రమింపఁజేయుచున్నది. శెక్కర్ - ఎఱ్ఱనివర్ణముగల, నల్ - దర్శనీయమైన, మేగఙ్గళ్ - మేఘములు, శిదైక్కుమ్ - కోయుచున్నవి. అల్లి - వికసించుచున్న, అమ్ - అందమైన, తామరై - పద్మమువంటి, కణ్ణన్ - నేత్రములగల

వాఁడును, ఎమ్మాన్ - మాస్వామియు, ఆయన్ గళ్ ఏఱు - గోపశ్రేష్ఠుఁడును, అరియేఱు - సింహశ్రేష్ఠమువలె మరింపుగలవాఁడును, ఎమ్మాయోన్ - మన ఆశ్చర్యభూతుఁడునైన సర్వేశ్వరుఁడు, పుల్లియ - సంశ్లేషించిన, ములైగళుమ్ - స్తనములను, తోళుమ్ - భుజములను, కొణ్డు - తీసికొని పోయి, తమియమ్ - ఒంటరిగానున్నమనము, పుగలిడమ్ - ప్రవేశింపఁదగిన స్థానమును, అఱిగిలమ్ - ఎఱుఁగలేము.

తా॥ మలయమారుతమును సంధ్యాకాలమును అప్పుడున్న ఎఱ్ఱని మేఘమును శ్రీకృష్ణుని కుఱింజిరాగమును నన్ను మిక్కిలి బాధించుచున్నవి. సర్వేశ్వరుఁడు సంశ్లేషించిన నా స్తనములును భుజములును నొకప్రక్క బాధించుచున్నవి. ఈభాధనుతీర్చుకొనుటకై నేనెచ్చటికిపోవుదునని. ౧.

పుగలిడమఱిగిలమ్తమియమాలో పులమ్బుమణితెన్ఱలాప్పలాలో*
పగలడుమాలైవణ్శాన్దమాలో పఞ్జమమ్ముల్లైతణ్వాడైయాలో*
అగలిడమ్పడైత్తిడన్దుణ్డుమిழ்న్దళన్దెఙ్గుమళిక్కిన్ఱ వాయన్మాయోన్*
ఇగలిడత్తసురర్గళ్కూఱ్ఱమ్వారాన్ ఇనియిరున్దెన్నుయిర్కాక్కుమాఱెన్. ౨.

అ॥ తమియమ్ - సహాయములేనిమనము, పుగలిడమ్ - రక్షకస్థానమును, అఱిగిలమ్ - ఎఱుఁగలేము. పులమ్బుమ - శబ్దించుచున్న, మణి - ఘంటను, తెన్ఱల్ - మలయమారుతమును, ఆమ్బల్ - వేణునాదమును, పగల్ - దినమును, అడు - నశింపఁజేయుచున్న, మాలై - సంధ్యాకాలమును, వణ్ - సుందరమైన, శాన్దమ్ - చన్దనమును, పఞ్జమమ్ - పంచమమనెడిరాగమును, ముల్లై - మల్లపుష్పమును, తణ్ - చల్లని, వాడై - ఉత్తరవాయువును, (నన్నుబాధించుచున్నవి). అగలిడమ్ - విశాలమైనభూమిని, పడైత్తు - సృజించి, ఇడన్దు - విడతీసి, ఉణ్డు - ఆరగించి, ఉమిழ்న్దు - క్రక్కి, అళన్దు - కొలిచి, ఎఙ్గుమ్ - సమస్తవిధములచేతను, అళిక్కిన్ఱ - రక్షించుచున్న, ఆయన్ - కృష్ణావతారమెత్తిన జగత్కారణుఁడును, మాయోన్ - ఆశ్చర్యచేష్టితములుగలవాఁడును, ఇగలిడత్తు - యుద్ధమందు, అసురర్గళ్ - అసురులకు, కూఱ్ఱమ్ - మృత్యువునైన శ్రియఃపతి, వారాన్ - రాడు. ఇని ఇరున్దు, ఈవస్తువులసమీపమందుండి - కాక్కుమాఱు-రక్షించువిధము, ఎన్ - ఏమి?

తా॥ వృషభముల మెడలయందుకట్టిన ఘంటాఘోషము, మలయమారుతము, వేణునాదము, వస్తువులకనుబడనిసంధ్యాకాలము, చన్దనము, మల్లపుష్పము, ఉత్తరవాతము, ఇవన్నియునన్ను మిక్కిలిబాధించుచున్నవి. ఈసమయమందుగూడ జగద్రక్షకుఁడు రాకపోయెను; ఇఁక నేను జీవించువిధము నెఱుఁగలేనని. ౨.

ఇనియిరున్దెన్నుయిర్కాక్కుమాఱెన్ ఇణైములైనముగనుణ్ణిడైనుడఙ్గ*
తునియిరుమ్కలవిశెయ్దాగమ్తోయ్న్దు తుఱన్దెమ్మైయిట్టగల్కణ్ణన్కళ్వన్*
తనియిళమ్శిఙ్గమెమ్మాయన్వారాన్ తామరైక్కణ్ణుమ్శెవ్వాయుమ్*నీల
ప్పనియిరుమ్కుழల్గళుమ్నాన్గుతోళుమ్ పావియేన్మనత్తేనిన్ఱీరుమాలో. 3.

అ॥ ఇణైములై - చేరియున్నస్తనములు, నముగ - (కాఠిన్యముపోయి) మృదువగునట్లును, నుణ్ ఇడై - సూక్ష్మమైనమధ్యము, నుడఙ్గ - వణుగునట్లును, తుని - విశ్లేషకాలమందు దుఃఖజనకములై, ఇరుమ్ - అనేకవిధములైన, కలవి - సంశ్లేషమును, శెయ్దు - చేసి, ఆగమ్ - (నా)

శరీరమందు, తోయ్న్దు - ఏకీభవించియుండి, ఎమ్మైత్తుఱన్దు - (తరువాత) మమ్ములనువిశ్లేషించి, ఇట్లు - (ఇచ్చట) పడవేసి, అగల్ కణ్ణన్ - దూరముగాపోయిన శ్రీకృష్ణుఁడును, కళ్వన్ - వంచకుఁడును, తని - అద్వితీయుఁడైన, ఇళమ్ శిఙ్గమ్ - మంచివయస్సుగలసింహమువంటివాఁడును, ఎమ్మాయన్ - నాయందువ్యామోహముగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, వారాన్ - రాడు. తామరైక్కణ్ణుమ్ - పద్మనేత్రమును, శెవ్వాయుమ్ - ఎఱ్ఱనియధరమును, నీలమ్ - శ్యామమై, పని - చల్లనై, ఇరుమ్ - విశాలమైన, కుழల్ గళుమ్ - కేశపాశములును, నాన్గుతోళుమ్ - నాల్గుభుజములును, పావియేన్ - పాపముగలనాయొక్క, మనత్తు - హృదయమందు, నిన్ఱు - ఉండి, ఈరుమ్ - బద్ధలుచేయుచున్నవి. ఇనియిరున్దు - ఇఁకనుండి, ఎన్నుయిర్ - నాప్రాణమును, కాక్కుమా ఱెన్ - రక్షించువిధమేమి ?

తా॥ సర్వేశ్వరుఁడు నాతోమునుపు చక్కగాసంశ్లేషించి తరువాత నన్నిచ్చటవిడిచిపెట్టిపోయి తిరిగియురాకనే యున్నాఁడు. చన్ద్రకుసుమాదులనుచూడలేక నేను కన్నుమూసుకొనిన రెఁడల వానిదివ్యావయవములు లోపలభాసించి మిక్కిలిబాధించుచున్నవి. ఇఁక నేనుబ్రతుకెడి విధము తోఁచలేదని. 3.

పావియేన్ మనత్తేనిన్ఱీరుమాలో వాడై తణ్ వాడై వెవ్వాడైయాలో*
మేవుతణ్మదియమ్ వెమ్మదియమాలో మెన్మలర్ప్పళ్ళి వెమ్బళ్ళియాలో*
తూవియమ్పుళ్ళుడై త్తెయ్వవణ్ణుతుదైన్ద వెమ్ పెణ్మైయమ్పూవిదాలో*
ఆవియిన్ పరమల్ల వగైగళాలో యాముడై నెఞ్జముమ్ తుణైయన్ఱాలో. ౪

అ॥ వాడై-ఉత్తరపుగాలి, పావియేన్ - పాపముగలనాయొక్క, మనత్తునిన్ఱు - మనస్సులోనుండి, ఈరుమ్ - ఒద్దలుజేయుచున్నది. తణ్ వాడై - చల్లనియుత్తరపుగాలి, వెవ్వాడై - మండుచున్నఉత్తరపుగాలియైనది. మేవు - ఆశఁబడఁదగిన, తణ్ మదియమ్ - చల్లనిచన్ద్రుఁడును, వెమ్మదియమ్ - వేడిమిగలచన్ద్రుఁడాయెను. మెల్ - మృదువైన, మలర్ పళ్ళి - పుష్పశయ్య, వెమ్పళ్ళి - ఉష్ణముగలపడకయాయెను. అమ్ - సుందరమైన, తూవి - ఱెక్కలుగల, పుళ్ - గరుత్మంతుని, ఉడై - వాహనముగాగల, తెయ్వమ్ - పరదేవతయనెడి, వణ్ణు - తుమ్మెదచేత, తుదైన్ద - మర్దింపఁబడిన, ఎమ్ పెణ్మై - మాస్త్రీత్వ (స్తనాదులుగలమాశరీర) మనెడి, అమ్పూ - సుందరమైపుష్పము, ఇదు - ఈవిధముగానైనది. వగైగళ్ - బాధకవస్తువులవ్యాపారములు, ఆవియిన్ పరమల్ల - నాయాత్మయందణగకుండనున్నవి. యాముడై - మాయొక్క, నెఞ్జముమ్ - మనస్సును, తుణైయన్ఱు - సహాయముకాకపోయెను.

తా॥ చల్లనియుత్తరపుగాలి చన్ద్రుఁడు పుష్పశయ్యమొదలైనవి నాకుమిక్కిలిబాధకరంబులైయున్నవి. సర్వేశ్వరుఁడుసంశ్లేషించి విడిచిపోయినశరీరమిట్లు శిథిలమైనది. ఈసమయమందు మాకుమనస్సుగూడ సహాయముకాకపోయినదని. ౪.

యాముడై నెఞ్జముమ్ తుణైయన్ఱాలో ఆపుగుమాలైయుమాగిన్ఱాలో*
యాముడై యాయన్ఱన్ మనమ్ కల్లాలో అవనుడై తీఙ్గుழలీరుమాలో*

యాముడై త్తుణై యెన్ను న్తోழிమారు మెమ్మిన్ను న్నవనుక్కు మాయ్వరాలో*
యాముడై యారుయిర్ కాక్కు మారెవ్ నవనుడై యరుళ్ పెఱువ్వోదరిదే. ౫.

అ॥ యాముడై నెఞ్జముమ్ - మామనస్సును, తుణై యన్ఱు - సహాయముకాకపోయెను. ఆ - ఆవులు, పుగుమ్ - (తమతమస్థానములయందు) ప్రవేశింపఁదగిన, మాలైయుమ్ - సంధ్యాకాలమును, అగిన్ఱు - ఆయెను. యాముడై ఆయన్ అవన్ - మన శ్రీకృష్ణునియొక్క, మనమ్-మనస్సు, కల్-పాషాణమువలె కఠినమైయుండెను. అవనుడై - వానియొక్క, తీ - మధురమైన, కుழల్ - వేణునాదము, ఈరుమ్ - బద్ధులుజేయుచున్నది. యాముడై-మనకు, తుణై యెన్ను మ్ - సహాయభూతులని తలంచదగిన, తోழிమారుమ్ - సఖియలును, ఎమ్మిన్ మున్ - మనకంటెముందలనే, అవనుక్కు - వానికొఱకై (వాడువచ్చి నాకొదగలేదని), మాయ్వార్ - మోహింతురు. అవనుడై-వానియొక్క, అరుళ్ - అనుగ్రహమును, పెఱువ్వోదు - పొందుట, అరిదు - దుర్లభమైయున్నది. యాముడై-మనయొక్క, ఆరుయిర్ - ప్రాణమును, కాక్కుమా అన్ - రక్షించువిధమేది?

తా॥ సంధ్యాకాలమైనది; కఠినహృదయుఁడైన శ్రీకృష్ణుఁడురాలేదు. వాని వేణునాదము నన్ను బాధించుచున్నది. నాసఖియలు నాయవస్థనుజూచి నాకంటెనధికముగా దుఃఖించుచున్నారు. వాఁడనుగ్రహించువఱకు నేను జీవించియుండడ మశక్యమని. ౫.

అవనుడై యరుళ్ పెఱువ్వోదరిదా లవ్వరుళల్లనవరుళుమల్ల*
అవనరుళ్ పెఱుమళవావినిల్లా దడుపగల్ మాలై యుమ్ నెఞ్జుమ్ కాణేన్*
శివనొడుపిరమన్ వణ్ తిరుమడన్దై శేర్ తిరువాగ మెమ్మావియీరుమ్*
ఎవమినిప్పుగుమిడ మెవమ్ శెయ్ గేనో ఆరుక్కెన్ శొల్లుగేనన్నై మీర్ గాళ్. ౬.

అ॥ అవనుడై - వానియొక్క, అరుళ్ పెఱువ్వోదు - అనుగ్రహమును బొందుట, అరిదు - దుర్లభము. అవ్వరుళల్లన - వానియనుగ్రహముకాని బంధువులమాటలు, అరుళుమల్ల - జీవనహేతువులుకావు. అవనరుళ్ - వానియనుగ్రహమును, పెఱుమళవు - బొందువఱకు, ఆవి - ప్రాణము, నిల్లాదు - నిలవదు. పగల్ - దినమును, అడుమ్ - నశింపఁజేయుచున్న, మాలైయుమ్ - సంధ్యాకాలమునున్ను, నెఞ్జుమ్ - మనస్సునున్ను, కాణేన్ - చూడకనున్నాను. శివనొడు - రుద్రునితోఁగూడ, పిరమన్ - బ్రహ్మ, వణ్-కల్యాణగుణములుగల తిరుమడన్దై - శ్రీదేవి (వీరు) శేర - చేరియున్న, తిరు - సౌశీల్యసమృద్ధిగల, ఆగమ్ - తిరుమేను, ఎమ్మావి - మాప్రాణములను, ఈరుమ్- బద్ధులుచేయుచున్నది. ఇని - ఇఁకమీఁద, పుగుమిడమ్-రక్షకము, ఎవన్-ఏది? ఎవమ్ శెయ్ గేనో-ఏమిచేసెదను? అన్నైమీర్ గాళ్ - ఓతల్లులారా! ఆరుక్కు - ఎవరికి, ఎన్ శొల్లుగేన్ - ఏమి చెప్పెదను?

తా॥ ఓతల్లులారా! వాఁడిదివఱకు నన్ననుగ్రహించలేదు. ఎప్పుడో ననుగ్రహించిన యొడల నదివఱకు నాప్రాణముండదు. అదితప్ప వేఱొకటినాకుపట్టదు. బ్రహ్మరుద్రాదులకును శ్రీదేవికి నాశ్రయమైనవానితిరుమేనుయొక్క సౌశీల్యము నన్ను మిక్కిలిబాధించుచున్నది. ఇఁక నేనేమి చేసెదనని. ౬.

ఆరుక్కెన్ శొల్లుగేనన్నైమీర్ గా ళారుయిరళవన్ఱు కూర్ తణ్వాడై*
కారొక్కుమేనినఙ్గణ్ణ కళ్వమ్ కవర్న్దవ త్తనినెఞ్జమవనణగ్గదే*

శీరుల్ఙవగిల్పుగై యాழ்నరమ్బు పఞ్జమమ్తణ్పశుమ్శాన్దణైన్దు*
పోరుల్ఙవాడై తణ్ మల్లిగై ప్పూ ప్పుదుమణముగన్దుకొణ్డెతియుమాలో. ౭.

అ॥ కార్కొణ్ణ్ - మేఘముతో సమానమైన, మేని - తిరుమేనుగల, నమ్కణ్ణన్ - మన శ్రీకృష్ణునియొక్క, కళ్వమ్ - కృత్రిమవ్యాపారములచే, కవర్న్ద - అపహరింపఁబడిన, అత్తని - నెఞ్జమ్ - అట్టినామనస్సు, అనఙ్గదు - వానివద్దపోయిచేరినది. శీర్ ఉల్ఙ - పరిమళముగల, అగిల్ పుగై - దేవదారుధూమము, యాழ் నరమ్బు - వీణాతంత్రియందుగలిగినధ్వని, పఞ్జమమ్ - పంచమస్వరము, తణ్ - చల్లనై, పశుమ్ - మంచివర్ణముగల, శాన్దు - చన్దనము (వీనితో), అణైన్దు - సంశ్లేషించి, పోరుల్ఙ - యుద్ధమునకు సన్నద్ధమైన, వాడై - ఉత్తరపుగాలి, తణ్ - చల్లనైన, మల్లిగైప్పూ - మల్లీపుష్పముయొక్క, పుదుమణమ్ - నవీనమైనపరిమళమును, ముగన్దుకొణ్డు - పోగుచేసియెత్తుకొనివచ్చి, ఎతియుమ్ - వినుచున్నది. ఇక్కూర్ - ఇంతక్రూరమైన, తణ్ వాడై - చల్లనియుత్తరపుగాలి, ఆవియిరళవన్ఱు - నాయాత్మగుండఱుగునట్టిదికాదు; అన్నై మీర్ గాళ్ - ఓతల్లులారా! ఆరుక్కు - ఎవరికి, ఎన్ శొల్లుగేన్ - ఏమిచెప్పెదను ?

తా॥ ఓతల్లులారా! వీణావేణునాదములును అగరుధూపమును చన్దనపుష్పములును ఉత్తరపుగాలియు నన్ను మిక్కిలిబాధించుచున్నవి. నాయవస్థనిట్టిదని యితరులకు జెప్పఁజాలనని. ౭.

పుదుమణముగన్దుకొణ్డెతియుమాలో పొఙ్గిళవాడై పున్ శెక్కరాలో*
అదుమణన్దగన్దనమ్కణ్ణన్ కళ్వమ్ కణ్ణనిఱ్కొడిదినియదనిలుమ్బర్*
మదుమణమల్లిగై మన్దకోవై వణ్పశుమ్శాన్దినిల్ పఞ్జమమ్వైత్తు*
అదుమణన్దిన్నరుళాయ్చ్చియర్క్కే యూదుమత్తీఙ్గుழ ల్క్కేయుయ్యేన్ నాన్.

అ॥ పొఙ్గు - వర్ధిల్లుచున్న, ఇళవాడై - మందమారుతము, పుదుమణమ్ - నవీనగంధమును, ముగన్దుకొణ్డు - తీసికొనివచ్చి, ఎతియుమ్ - వినుచున్నది. శెక్కర్ - సంధ్యారాగము, పున్ - కొంచమైయున్నది. అదు - అట్లు, మణన్దు - సంశ్లేషించి, అగన్ఱ - విశ్లేషించిన, నమ్కణ్ణన్ - మన శ్రీకృష్ణునియొక్క, కళ్వమ్ - వంచకవ్యాపారము, కణ్ణనిల్ - శ్రీకృష్ణునికంటె, కొడిదు - క్రూరమైయున్నది. ఇని - ఇఁకను, అదనిలుమ్బర్ - దానిపైన, మదు - తేనెనున్ను, మణమ్ - పరిమళమునున్నుగల, మల్లిగై - మల్లీపుష్పముచే, మన్దమ్ - దట్టమైన, కోవై - మాల, వణ్ - విలక్షణమై, పశుమ్ - మంచివర్ణముగల, శాన్దినిల్ - చన్దనము వీనికంటె, (బాధకమైన), పఞ్జమమ్వైత్తు - పంచమస్వరమందుంచి, అదుమణన్దు - అట్లుసంశ్లేషించుటకై, ఇన్ అరుళ్ - చక్కనియనుగ్రహమునకు విషయమైన, ఆయ్చ్చియర్క్కే - గొపికలకొఱకైయ్యే, ఊదుమ్ - ఊదుచున్న, అత్తీఙ్గుழల్క్కే - ఆమధురమైనవేణునాదమునకే, నాన్ - నేను, ఉయ్యేన్ - జీవించను.

తా॥ మంచిపరిమళముగలమందమారుతమును శ్రీకృష్ణచేష్టితములును మల్లీమాలను చన్దనమును శ్రీకృష్ణునివేణునాదమును ఇవన్నియు ఒకటిమీఁదనొకటివచ్చి నన్నుబాధించుచున్నవని ౮.

ఊదుమత్తీఙ్గుழల్క్కేయుయ్యేన్ నా నదుమొழிన్దిడై యిడైత్తన్ శెయ్కోల*
తూదుశెయ్కణ్గళ్ కొణ్డొన్ఱుపేశి త్తూమొழிయిశైగళ్ కొణ్డొన్ఱునోక్కి*

పేదుఱుముగమ్ శెయ్దునొన్దునొన్దు పేదై నెఞ్జఱవఱప్పాడుమ్పాట్టై*
యాదుమొన్ఱఱిగిలమమ్మవమ్మ మాలైయుమ్వన్దుమాయన్వారాన్. ౯.

అ॥ ఇడైయిడై - నడుమనడుమ, అదు - ఆ రసోక్తులను, మొழిన్దు - చెప్పి, ఊదుమ్ - ఊదుచున్న, అత్తీఙ్గుழలుక్కే - అట్టిమధురమైనవేణునాదమునకే, నాన్ - నేను, ఉయ్యేన్ - జీవించను. తన్ శెయ్ - తానేచేసికొనిన, కోలమ్ - అలఙ్కారముగలవాడై, తూదు శెయ్ - దౌత్యముజేయుచున్న (అభిప్రాయమునుదెలుపుచున్న), కణ్గళ్ కొణ్డు - నేత్రములచే, ఒన్ఱుపేశి - ఒకఅభిప్రాయమును దలిపి, తూ - స్వచ్ఛమైన, మొழి - సూక్తులతోఁగూడిన, ఇశైగళ్ కొణ్డు - గానము చేత, ఒన్ఱు - ఒక అభిప్రాయమును, నోక్కి - కటాక్షించి, పేదుఱు - బాధించుట, ముగమ్ శెయ్దు - ముఖమందు దోచునట్లుజేసి, నొన్దునొన్దు - మిక్కిలిబాధపడి, పేదై - బాలులైన స్త్రీలయొక్క, నెఞ్జు - మనస్సులోఁగలిగిన, అఱవు - ప్రేమ రోషము, అఱ - నశించునట్లు, పాడుమ్ - పాడుచున్న, పాట్టై - గానమును, యాదుమొన్ఱు - ఏవిధముచేతను, అఱిగిలమ్ - ఎఱుఁగలేము. అమ్మ అమ్మ - అమ్మమ్మా! మాలైయుమ్వన్దదు - సాయఙ్కాలమువచ్చినది. మాయన్ వారాన్ - ఆశ్చర్యభూతుఁడైన శ్రీకృష్ణుఁడు రాకనున్నాడు.

తా॥ వేణునాదముజేయునప్పుడు నడుమనడుమ కొన్నిపరిహాసోక్తులను జెప్పియు, నేత్రములచే కొన్నియభిప్రాయమును జూపియు, ఈవేణునాదముచే గోపికలెంత దుఃఖపడుదురో యనిచింతించి యాదుఃఖము తనముఖమందుదోచునట్లు ముఖమునుజేసికొనియు జేసినవేణునాదమునువిని నేనుసహించ లేను. సంధ్యాకాలమువచ్చియు వాఁడురాక నేయున్నాడని. ౯.

మాలైయుమ్వన్దుమాయన్వారాన్ మామణిపులమ్బవల్లేఱణైన్దు*
కోలనన్నాగుగళుగళుమాలో కొడియనకుழల్ గళుమ్కుழఱుమాలో*
వాలొళివళర్ ముల్లై కరుముగై గళ్ మల్లిగైయలమ్బివణ్డాలుమాలో*
వేలైయుమ్విశుమ్బిల్ విణ్డలఱుమాలో ఎన్శొల్లియుయ్వనిఙ్గవనై ప్పిరిన్దే. ౧౦.

అ॥ మాలైయుమ్వన్దదు - సాయఙ్కాలమునువచ్చినది. మాయన్ వారాన్ - శ్రీకృష్ణుఁడు రాలేదు. మామణి - గొప్పఘంట, పులమ్బ - శబ్దించునట్లు, వల్ - బలిష్ఠమైన, ఏఱు - వృషభముచే, అణైన్ద - సంశ్లేషింపఁబడినవియు, కోలమ్ - దర్శనీయమైనవియు, నల్ - శ్లాఘ్యములునైన, నాగుగళ్ - ఆవులు, ఉగళుమ్ - సంచరించుచున్నవి. కుழల్ గళుమ్ - వేణువులును, కొడియన - క్రూరముగ, కుழఱుమ్ - ధ్వనించుచున్నవి. వాల్ - తెల్లని, ఒళి - కాన్తి, వళర్ - వర్ధిల్లుచున్న, ముల్లై - ముల్లపుష్పములయందును, కరుముగై - నల్లకలువలయందును, మల్లిగైగళ్ - మల్లీపుష్పములయందును, అలమ్బి - అవగాహించి, వణ్డు - తుమ్మెదలు, ఆలుమ్ - శబ్దించుచున్నవి. వేలైయుమ్ - సముద్రమును, విశుమ్బిల్ - ఆకాశమందు, విణ్డు - ముక్తకంఠమై, అలఱుమ్ - ఘోషించుచున్నది. ఇఙ్గు - ఈయవస్థయందు, అవనైవిట్టు - వానినివిడిచి, ఎన్ శొల్లి - ఏమాటలను జెప్పి, ఉయ్వన్ - జీవించెదను.

తా॥ శ్రీకృష్ణుఁడు రాదగినసంధ్యాకాలము వచ్చినను వాఁడు రాలేదు. ఆవులును వృషభములతోఁగూడ పెద్దఘంటలసాడించుచు వచ్చుచున్నవి. ఆవులనుబిలిచెడి వేణునాదము వినఁబడుచున్నది. తుమ్మెదలు పుష్పముమీఁదపడి ఝూంకారమును చేయుచున్నవి సముద్రము ఘోషించుచున్నది. ఇప్పుడు వానిని వదలియుండలేనని. ౧౦.

అవనై విట్టగన్ఱుయిరాఱ్ఱగిల్లా అణియిழై యాయ్చ్చియర్ మాలై ప్పూశల్*
అవనై విట్టగల్వదఱ్కే యిరఙ్గి యణికురుగూర్చ్చఠగోపన్ మాఱన్*
అవనియుణ్డుమిழ் న్దవన్ మేలురైత్త వాయిరత్తుళ్ళివై పత్తుఙ్కొణ్డు*
అవనియుళలఱ్ఱి నిన్ఱుయ్మిన్ తొణ్డీర్ అచ్చొన్నమాలై నణిత్తొழுదే ౧౧.

అ॥ అవనైవిట్టుఅగన్ఱు - ఆశ్రీకృష్ణునివదలి, ఉయిరాఱ్ఱగిల్లాద - ప్రాణధారణముజేయఁజాలనివారై, అణియిழై - సుందరమైన భూషణముగలవారైన, ఆయ్చ్చియర్ - గోపికలు, మాలై - సాయంకాలమందు, పూశల్ - చెప్పినవిధమును, అవనైవిట్టు అగల్వదఱ్కు - ఆశ్రీకృష్ణునివిశ్లేషనిమిత్తమై, ఇరఙ్గి - బాధపడి, అణి - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, మాఱన్ - మాఱనబడెడి తిరునామముగల, శఠగోపన్ - నమ్మాழ్వార్లు, అవని-భూమిని, ఉణ్డు- మ్రింగి, ఉమిழ் న్దవన్ మేల్ - క్రక్కిన సర్వేశ్వరుని విషయమై, ఉరైత్త - సాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోజేరిన, ఇవైపత్తుఙ్కొణ్డు - ఈపదిపాశురముల నధ్యయనముజేసి, అవనియుళ్ - భూలోకమందు, నిన్ఱు - గుంపుగానుండి, అలఱ్ఱి - ఘోషించి, తొణ్డీర్ - ఓ భాగవతులారా! అచ్చొన్నమాలై - అట్లుచెప్పబడిన సర్వేశ్వరుని, నణిత్తొழுదు - నిరంతరముగా నాశ్రయించి, ఉయ్మిన్ - ఉజ్జీవించుఁడి.

తా॥ కృష్ణవిశ్లేషమును సహించని గోపికలుచెప్పినవిధముగా శ్రీకృష్ణవిరహమును సహించని నమ్మాழ்వార్లుసాదించిన ఈపదిపాశురములనభ్యసించువారు సుఖముగాసర్వేశ్వరుని బొందుదురని.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

## ౧౦ - వ, తిరువాయ్మొழி.

అవతారిక :—ఆழ்వార్లు భగవద్విశ్లేషమును సహించలేక బాధపడుచుండగా, సర్వేశ్వరుఁడువచ్చి మీకు శీఘ్రములోనే యీ శరీరావసానమందు మోక్షమిచ్చెదనని సాదింప, దానిచేత సత్యసన్తుష్టులై, సంసారులనుగురించి మీరు తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న శ్రియఃపతి విషయమై భక్తిజేసి యుజ్జీవించుఁడి, అందుకుశక్తిలేనియెడల ప్రపత్తిజేయుఁడి, దానికిని శక్తిలేనివారు ఈ పదిపాశురముల ననుసంధించుఁడియని యుపదేశించుచున్నారు.

మాలై నణ్ణి త్తొழுదెழுమినో విన కెడ*
కాలై మాలై కమలమలరిట్టునీర్*
వేలై మోదుమ్మదిళ్ శూழ் తిరుక్కణ్ణపురత్తు*
ఆలిన్ మేలాలమర్న్దా నడియిణైగళే. ౧.

అ॥ వేలై - సముద్రముయొక్క-అలలు, మోదుమ్ - కొట్టుచున్న, మదిళ్ -ప్రాకారముచే, శూழ - చుట్టఁబడిన, తిరుక్కణ్ణపురత్తు - తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్నవాఁడును, ఆలిన్ మేల్ - వటదళముమీద, అమర్న్దాన్ - (ప్రళయకాలమందు) పవ్వళించినవాఁడునైన శ్రియఃపతి యొక్క, అడియిణైగళ్ - శ్రీపాదద్వన్ద్వములను, నీర్ - మీరు, మాలై - వ్యామోహమును (భక్తిని), నణ్ణి -పొంది, వినై కెడ - ప్రతిభంధకములు నశించునట్లు, కాలైమాలై -అహోరాత్రము, కమలమలర్ - తామరసపుష్పమును, ఇట్టు - సమర్పించి, తొழுదు - ఆశ్రయించి, ఎழுమిన్ - ఉజ్జీవించుడి.

తా॥ ఓ చేతనులారా ! తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదములను భక్తియుక్తులై యాశ్రయించి యుజ్జీవించుడియని ౧.

కళ్ళవిழுమ్మలరిట్టు నీరిఱైఞ్జుమిన్*
నళ్ళిశేరుమ్వయల్ శూழ் కిడఙ్గిన్పుడై *
వెళ్ళియేయ్న్దమదిళ్ శూழ் తిరుక్కణ్ణపురమ్
ఉళ్ళి*నాళుమ్తొழுదెழுమినో తొణ్డరే. ౨.

అ॥ తొణ్డర్ - ఓ భక్తులారా ! నీర్ - మీరు, కళ్ అవిழுమ్ - తేనెకారుచున్న, మలర్ - పుష్పములను, ఇట్టు - సమర్పించి, ఇఱైఞ్జుమిన్ - ఆశ్రయించుడి నళ్ళి-ఎండ్రకాయ, శేరుమ్ - చేరియున్న, వయల్ - పొలములచే, శూழ் - చుట్టపడిన, కిడఙ్గిన్ - అగడతయొక్క, పుడై - సమీపమందు, వెళ్ళియేయ్న్ద - వెండిచేత నిర్మింపఁబడిన, మదిళ్ - ప్రాకారములచే, శూழ் - చుట్టపడిన, తిరుక్కణ్ణపురమ్ - తిరుక్కణ్ణపురమును, నాళుమ్ - ప్రతిదినమును, ఉళ్ళి- అనుసంధించి, తొழுదు - ఆశ్రయించి, ఎழுమిన్ - ఉజ్జీవించుడి.

తా॥ ఓ భక్తులారా ! జలముచేనిండియున్న అగడతలచేతను రజతమయప్రాకారములచే తను రక్షింపఁబడిన తిరుక్కణ్ణపురమునను సంధించి యారాధించి యుజ్జీవించుడియని. ౨.

తొణ్డర్ నున్దమ్తుయర్ పోగ నీరేగమాయ్*
విణ్డువాడామలరిట్టు నీరిఱైఞ్జుమిన్*
వణ్డుపాడుమ్పొழிల్ శూழ் తిరుక్కణ్ణపుర
త్తణ్డవాణన్*అమరర్ పెరుమానైయే. ౩.

అ॥ తొణ్డర్ - ఓ భక్తులారా ! నీర్ - మీరు, నున్దమ్ - మీయొక్క, తుయర్ - దుఃఖము, పోగ - నశించునట్లు, నీర్ - మీరు, ఏగమాయ్ - ఏకీభవించి, వణ్డు - తుమ్మెదలు, పాడుమ్ - గానముజేయుచున్న, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టబడిన, తిరుక్కణ్ణపురత్తు-

తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్నవాఁడును, అణ్డవాణన్ - బ్రహ్మాణ్డమునకధిపతియు, అమరర్ - నిత్యసూరులకు, పెరుమానై - స్వామియునైన శ్రియఃపతిని, విణ్డు - వికసించుచున్న, వాడా - వాడని, మలర్ - పుష్పములను, ఇట్టు - సమర్పించి, ఇఱైఞ్జుమిన్ - ఆశ్రయించుడి.

తా॥ ఓ భాగవతులారా! ఉభయవిభూతినాయకుఁడై తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న శ్రియఃపతిని మీరందరు నేకీభవించి యాశ్రయించి యారాధించి యుజ్జీవించుడియని. 3.

మానై నోక్కి మడప్పిన్నై తన్ కేళ్వనై *
తేనై వాడామలరిట్టు నీరిఱైఞ్జుమిన్ *
వానై యున్దుమదిళ్ శూழ் తిరుక్కణ్ణపురమ్ *
తానయన్ద పెరుమాన్ శరణాగుమే. ౪.

అ॥ మాన్ - లేడి, నై - (ఓడిపోయి) సిగ్గుపడునట్లున్న, నోక్కి - చూపుగలదియు, మడమ్ - స్త్రీత్వపూర్తిగలదియునైన, పిన్నై తన్ - నప్పిన్నపిరాట్టికి, కేళ్వనై - వల్లభుఁడై, తేనై - భోగ్యభూతుఁడైన శ్రియఃపతిని, వాడామలర్ - వాడనిపుష్పములను, ఇట్టు - సమర్పించి, నీర్ - మీరు, ఇఱైఞ్జుమిన్ - ఆశ్రయించుడి. వానై - ఆకాశమును, ఉన్దు - త్రోయుచున్న, (మిక్కిలి యున్నతమైన), మదిళ్ - ప్రాకారములచే, శూழ் - చుట్టబడిన, తిరుక్కణ్ణపురమ్ - తిరుక్కణ్ణపురమును, తానయన్ద - తానేయాశపడిన, పెరుమాన్ - సర్వేశ్వరుఁడు, శరణాగుమ్ - రక్షకుఁడగును.

తా॥ ఓ భక్తులారా! మీరు నప్పిన్నపిరాట్టిని పురుషకారముగా జేసికొని సర్వేశ్వరుని యాశ్రయించుడి. మీకు వాఁడు తప్పక రక్షకుఁడగునని. ౪.

శరణమాగుమ్ తనతాళడైన్దార్క్కెల్లామ్ *
మరణమానాల్ వైగున్దమ్ కొడుక్కుమ్పిరాన్ *
అరణమైన్ద మదిళ్ శూழ் తిరుక్కణ్ణపుర
త్తరణియాళన్ * తనదన్బర్క్కన్బాగుమే. ౫.

అ॥ తనతాళ్ - తనశ్రీపాదమును, అడైన్దార్క్కెల్లామ్ - (ఉపాయమునితలంచి) పొందిన వారందరికిని, శరణమాగుమ్ - రక్షకుఁడును, మరణమానాల్ - మృతిపొందినయెడల, వైగున్దమ్ కొడుక్కుమ్ - మోక్షమునిచ్చువాఁడును, పిరాన్ - ఉపకారకుఁడును, అరణ్ అమైన్ద - రక్షణార్థమైనిర్మింపఁబడిన, మదిళ్ - ప్రాకారములచే, శూழ் - చుట్టబడిన, తిరుక్కణ్ణపురత్తు - తిరుక్కణ్ణపురమందు, తరణియాళన్ - సంసారులను రక్షించుటకై వేంచేసియున్నవాఁడునైన శ్రియఃపతి, తనదన్బర్క్కు - తనయందు ప్రీతిగలవారి విషయమై, అన్బాగుమ్ - ప్రీతిగలవాఁడగును.

తా॥ తనశ్రీపాదములనే యుపాయముగా నాశ్రయించినవారికి ఆశరీరావసానమందే మోక్షమిచ్చువాఁడై తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న శ్రియఃపతి తనభక్తులను మిక్కిలి ప్రీతితో రక్షించునని. ౫.

అన్బనాగుమ్ తనతాళడైన్దార్క్కెల్లామ్ *
శెమ్బొనాగత్తవుణనుడల్ కీణ్డవన్ *

నన్పొనేయ్న్దమదిళ్ శూழ் తిరుక్కణ్ణపుర
త్తన్బన్* నాళుమ్తనమెయ్యర్కు మెయ్యనే. ౬.

అ॥ తనతాళ్ - తన శ్రీపాదములను, అడైన్దార్క్కెల్లామ్ - (ఉపాయముగా) పొందిన వారందరివిషయమై, అన్బనాగుమ్ - ప్రీతిజేయువాఁడును, శెమ్ - ఎఱ్ఱని, పొన్ - బంగారము వలెనున్న, ఆగత్తు - శరీరముగల, అవుణన్ - హిరణ్యాసురునియొక్క, ఉడల్ - శరీరమును, కీణ్డవన్ - చీల్చినవాఁడును, నన్ పొన్ - మంచిబంగారముచే, ఏయ్న్ద - నిర్మింపఁబడిన, మదిళ్ - ప్రాకారముచే, శూழ் - చుట్టబడిన, తిరుక్కణ్ణపురత్తు - తిరుక్కణ్ణపురమందు. అన్బన్ - ఆదరముతో వేంచేసియున్న వాఁడునైన శ్రియఃపతి, తన్ మెయ్యర్కు - తనయందు పారమార్థిక బుద్ధిగలవారికి (అనన్యప్రయోజనులకు), నాళుమ్ - ప్రతిదినమును, మెయ్యన్ - పరమార్థబుద్ధిగల వాఁడైయుండును.

తా॥ ఆశ్రితవ్యామోహముగలవాఁడై హిరణ్యాసురుని సంహరించి తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న శ్రియఃపతి అనన్యప్రయోజనులై తన నాశ్రయించినవారిని యనన్యప్రయోజనముగా రక్షించుననని. ౬.

మెయ్యనాగుమ్ విరుమ్బిత్తొழுవార్క్కెల్లామ్*
పొయ్యనాగుమ్ పుఱమేతొழுవార్క్కెల్లామ్*
శెయ్యిల్వాళై యుగళుమ్ తిరుక్కణ్ణపుర
త్తైయన్*ఆగత్తణై ప్పార్గట్కణియనే. ౭.

అ॥ విరుమ్బి - ఆశపడి, తొழுవార్క్కెల్లామ్ - (అనన్యప్రయోజనులై) ఆశ్రయించువారందరికి, మెయ్యనాగుమ్ - యథార్థముగా సేవసాధించును. పుఱమే - ప్రయోజనాన్తరముల నుద్దేశించి, తొழுవార్క్కెల్లామ్ - ఆశ్రయించువారందరికిని, పొయ్యనాగుమ్ - తనస్వరూపమును ప్రకాశింపఁజేయఁడు. శెయ్యిల్ - పొలములయందు, వాళై - మత్స్యములు, ఉగళుమ్ - ఎగురుచున్న, తిరుక్కణ్ణపురత్తు - తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న, ఐయన్ - పరమబంధువైన శ్రియఃపతి, ఆగత్తు - హృదయమందు, అణైప్పార్గట్కు - ధ్యానించువారికి, అణియన్ - సులభుఁడైయుండును.

తా॥ తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న శ్రియఃపతి, ధనాదిప్రయోజనాంతరములను తనవద్ద కోరినవారి కాఫలములనిచ్చియు వారికిదుర్లభుఁడై, అనన్యప్రయోజనులై యాశ్రయించిన వారి కత్యన్తసులభుఁడై యుండుననని. ౭.

అణియనాగుమ్ తనతాళడైన్దార్క్కెల్లామ్*
పిణియుమ్శారా పిఱవికెడుత్తాళుమ్*
మణిపొనేయ్న్దమదిళ్ శూழ் తిరుక్కణ్ణపురమ్
పణిమిన్*నాళుమ్పరమేట్టితన్ పాదమే. ౮.

అ॥ మణి - రత్నములచేతను, పొన్ - బంగారముచేతను, ఏయ్న్ద - నిర్మింపఁడిన, మదిళ్ - ప్రాకారములచే, శూழ் - చుట్టబడిన, తిరుక్కణ్ణపురమ్-తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న, పరమేట్టితన్ - శ్రీవైకుణ్ఠనాథునియొక్క, పాదమ్ - తిరువడికళ్ళను, నాళుమ్ - ప్రతిదినమును, పణిమిన్ - ఆశ్రయించుడి, తనతాళ్ - తనశ్రీపాదమును, అడైన్దార్క్కెల్లామ్ - పొందినవారందరికిని, అణియనాగుమ్ - సులభుఁడైయుండును. పిణియుమ్ - వ్యాధులును, శారా - నశించును. పిఱవి - జన్మమును, కెడుత్తు - పోఁగొట్ట, ఆళుమ్ - పరిపాలించును.

తా॥ తిరుక్కణ్ణపురమందు వేంచేసియున్న శ్రియఃపతిని యాశ్రయించినగొడల వాఁడే సకలదుఃఖములనున్ను సంసారమునున్ను బోఁగొట్టునని. ౮.

పాదనాళుమ్ పణియ త్తణియుమ్పిణి*
ఏదమ్శారా వెనక్కేలినియెన్కుఱై*
వేదనావర్విరుమ్బుమ్ తిరుక్కణ్ణపుర
త్తాదియానై* అడైన్దార్క్కల్లలిల్లైయే. ౯.

అ॥ పాదమ్ - శ్రీపాదమును, నాళుమ్ - ప్రతిదినమును, పణియ - ఆశ్రయింపగా, పిణి - (అనాదిగైన) పాపములు, తణియుమ్-నశించును. ఏదమ్-ఉత్తరాఘములు, శారా - శేషించవు. ఇని - ఇఁకమీద, ఎనక్కు - నాకు, ఎన్కుఱై - ఏమికొఱతకలదు. వేదనావర్ - వేదములను నాలికయందుగల శ్రీవైష్ణవులు, విరుమ్బుమ్ - ఆశపడుచున్న, తిరుక్కణ్ణపురత్తు - తిరుక్కణ్ణపురమందువేంచేసియున్న, ఆదియానై - జగత్కారణుఁడైన శ్రియఃపతిని, అడైన్దార్క్కు - ఆశ్రయించినవారికి, అల్లల్ - దుఃఖము, ఇల్లై - లేదు.

తా॥ తన శ్రీపాదములనాశ్రయించినవారందరికిని సకలపాపములను బోఁగొట్టెడి శ్రియఃపతిని తిరుక్కణ్ణపురమందాశ్రయించి నేను కృతార్థుఁడనైతినని. ౯.

ఇల్లైయల్ల లెనక్కేలినియెన్కుఱై*
అల్లిమాద రమరుమ్తిరుమార్బినన్*
కల్లిలేయ్న్దమదిళ్శూழ் తిరుక్కణ్ణపురమ్
శొల్ల*నాళుమ్తుయర్పాడుశారావే. ౧౦.

అ॥ అల్లి - కమలవాసినియైన, మాదర్ - పిరాట్టి, అమరుమ్ - నిత్యవాసముచేయుచున్న, తిరుమార్బినన్ - సుందరమైనవక్షస్థలముగలవాఁడు వేంచేసియున్నదియు, కల్లిలేయ్న్ద - రాళ్ళచేగట్టబడిన, మదిళ్-ప్రాకారములచే, శూழ்-చుట్టబడినదియునైన, తిరుక్కణ్ణపురమ్-తిరుక్కణ్ణ-పురమును, శొల్ల - అనుసంధించునప్పుడే, నాళుమ్ - ప్రతిదినమును, తుయర్ - దుఃఖము, పాడు - ప్రక్కనుగూడ, శారా - చేరవు. ఎనక్కు - నాకు, అల్లల్ - దుఃఖము, ఇల్లై - లేదు. ఇని - ఇఁకను, ఎన్కుఱై - ఏమికొఱతకలదు.

తా॥ శ్రియఃపతివిషయమై భక్తిప్రపత్తులు జేయుటకసమర్థులైనవారువాఁడు వేంచేసియున్న తిరుక్కణ్ణపురముయొక్క తిరునామమునమసంధించినయెడల వారికి సకలదుఃఖమును నశించునని.

** పాదుశారావిన్నై పఱ్ఱఱవేణ్డువీర్*
మాడనీడు కురుగూర్ చ్చడగోపన్* శొల్
పాడలానతమిఴ్ ఆయిరత్తుళిప్పత్తుమ్
పాడియాడి* పణిమినవన్ తాళ్ గళే. ౧౧.

అ॥ విన్నై - దుఃఖములు, పాదుశారా - ప్రక్కనచేరకుండునట్లు, పఱ్ఱఱవేణ్డువీర్ - సమూలముగానశింపఁజేయఁదలంచితిరేని, మాడమ్ - మేడలచే, నీడు - ఉన్నతమైన, కురుగూర్ - తిరునగరికిస్వామియైన, శడగోపన్ - నమ్మాఴ్వార్లు, శొల్ - సాదించిన, పాడలాన - గానరూపమై, తమిఴ్ - ద్రావిడరూపమైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, పాడి - గానముజేసి, ఆడి - నృత్యముజేసి, అవన్ తాళ్ గళ్ - ఆశ్రియఃపతియొక్క శ్రీపాదములను, పణిమిన్ - ఆశ్రయించుడి.

తా॥ ఓచేతనులారా! మీపాపములను నివాసనముగా బోఁగొట్టుకొనుటకు తలంచిన యెడల నమ్మాఴ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురములను భక్తితోననుసంధించి శ్రియఃపతి యొక్క శ్రీపాదములనాశ్రయించుడియని. ౧౧.

ఆఴ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్.

౯—వ పది, సంపూర్ణము.

ఇది వఱకు తిరువాయ్మొఴులు ౯౦-కి పాశురములు ౯౯౨.



## ౧౦-వ, పత్తు, ౧-వ, తిరువాయ్మొழி

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, ఆழ்వార్లు, శ్రీవైకుణ్ఠమునకు శీఘ్రములో సేవించేయనిశ్చయించి, మధ్యనున్న అవిద్యాది విరోధులకు భయపడినవారై సహాయభూతు లెవరగుదురని యాలోచించి, కాళమేఘమువంటి సర్వేశ్వరుఁడే సహాయభూతుఁడని నిశ్చయించుచున్నారు.—

తాళతామరై త్తడమణివయల్ తిరుమోగూర్*
నాళుమేవినన్నమర్న్దునిన్ఱ అశురరై త్తగర్క్కుమ్*
తోళునాన్గుడై చ్చురికుழల్ కమలక్కణ్ కనివాయ్*
కాళమేగత్తైయన్ఱి మత్తొన్ఱిలమ్ కదియే. ౧.

అ॥ తాళ - ప్రశస్తమైననాళములుగల, తామరై - తామరపుష్పము, తడమ్-తటాకమును, అణి - అలఙ్కరించుచున్న, వయల్ - పొలముచేఁజుట్టఁబడిన, తిరుమోగూర్-తిరుమోగూరనెడు దివ్యదేశమందు, నాళుమ్ - ప్రతిదినమును, మేవి - ఆశపడి, నన్నుఅమర్న్దునిన్ఱు - చక్కఁగా నమరికతో వేంచేసియున్నవాఁడును, అశురరై - అసురులను, తగర్క్కుమ్ - చూర్ణముజేయువాఁడును, నాన్గుతోళ్ ఉడై - నాల్గుభుజములను, శురి - ముడిగల, కుழల్ - కేశములను, కమలక్కణ్ - పద్మమువంటి నేత్రమును, కని - స్నిగ్ధమైన, వాయ్-అధరమును గల, కాళమేగత్తైయన్ఱి - కాళమేఘమువంటి సర్వేశ్వరునితప్ప, మత్తొన్ఱుకది - వేఱొకఉపాయమును, ఇలమ్ - కలవారముకాము.

తా॥ మరణమనెడి మహాభయమునకు, తిరుమోగూరులో వేంచేసియున్న సుందరమైన దివ్యావయవముగల కాళమేఘముకంటె వేఱుసహాయము లేనందున వానినేయాశ్రయించుచున్నానని.

ఇలఙ్గదిమత్తొన్ఱెమ్మక్కు మీన్ తణ్తుழாయిన్*
అలఙ్గలఙ్గణ్ణి యాయిరమ్పేరుడై యమ్మాన్*
నలఙ్గొళ్ నాన్మఱై వాణర్గళ్ వాழ் తిరుమోగూర్*
నలఙ్గழలవనడినిழల్ తడమన్ఱియామే. ౨.

అ॥ ఈన్ - ప్రసవించుచున్నపుష్పముగల, తణ్-చల్లనైన, తుழாయిన్-తిరుత్తుழாయియొక్క, అలఙ్గల్ - చలించుచున్న, అమ్ - సుందరమైన, కణ్ణి - మాలను, ఆయిరమ్పేర్ఉడై - వెయ్యితిరునామములనుగల, అమ్మాన్ - స్వామియు, నలమ్కొళ్ - దయాగుణముగలవారై, నాన్మఱై - నాలువేదములను, వాణర్గళ్ - నిర్వాహకులైన శ్రీవైష్ణవులు, వాழ் -నిత్యవాసము జేయుచున్న, తిరుమోగూర్ - తిరుమోగూరులో వేంచేసియున్నవాఁడును, నలమ్కழలవన్ - మంచి (ఆశ్రితదోషమునుజూడని) తిరువడిగలవాఁడునునైన సర్వేశ్వరునియొక్క, అడినిழల్ - పాదచ్ఛాయయనెడి, తడమన్ఱి - తటాకముకాని, మత్తొన్ఱు - మఱియొక్కదానిని, యామ్- మనము, ఎమ్మైక్కుమ్ - సమస్తజన్మములయందును, కదియిలమ్-ఉపాయముగాగలవారముకాము.

తా॥ నిరతిశయభోగ్యమైన సౌందర్యమును, అనుసంధించి యుజ్జీవింపఁదగిన తిరునామములను గలవాఁడై తిరుమోగూరులో వేంచేసియున్న సర్వేశ్వరుని శ్రీపాదచ్ఛాయతప్ప మనకు వేఱొకప్రాప్యము లేదని. ౨.

అన్ఱియాముయొరుపుగలిడమిలమెన్ఱెన్ఱలఱ్ఱి*
నిన్ఱునాన్ముగన్ అరనోడు తేవర్గళ్ నాడ*
వెన్ఱిమూవులగళిత్తుళల్వాన్ తిరుమోగూర్*
నన్ఱునామినినణుగుదుమ్ నమదిడర్కెడవే. ౩.

అ॥ అన్ఱి - నిన్నుతప్ప, యామ్ - మేము, ఒరుపుగలిడమ్ - వేఱొకఉపాయమును, ఇలమ్ - కలవారము కాము, ఎన్ఱెన్ఱలఱ్ఱి - అనిపలుమాఱుఘోషించి, నిన్ఱు - (అనన్యప్రయోజనుల వలె) నిలిచి, నాన్ముగన్ అరనోడు - బ్రహ్మరుద్రులతోఁగూడ, తేవర్గళ్ - దేవతలు, నాడ - ఆశ్రయించుటకై, వెన్ఱు - (వారివిరోధులను) జయించి, ఇమ్మూవులగు - ఈమూడులోకములను, అళిత్తు - రక్షించి, ఉళల్వాన్ - సంచరించుచున్న సర్వేశ్వరునియొక్క, తిరుమోగూర్ - తిరుమోగూరును, నామ్ - మనము, నమదుఇడర్కెడ - మనవిరోధులునశించునట్లు, నన్ఱునణుగుదుమ్ - చక్కగానాశ్రయించెదము.

తా॥ సర్వరక్షకుఁడైన సర్వేశ్వరుఁడు క్షేమం చేసియున్న తిరుమోగూరును మనదుఃఖములు నశించుటకై మన మనన్యప్రయోజనులై యాశ్రయించెదమని. ౩.

ఇడర్కెడవెమ్మైప్పోన్దళియాయెన్ఱేత్తి*
శుడర్కొళ్శోదియై త్తేవరుమ్మునివరుమ్తొడర*
పడర్కొళ్పామ్బణై ప్పళ్ళికొళ్వాన్తిరుమోగూర్*
ఇడర్కెడవడిపరవుదుమ్ తొణ్డీర్వమ్మినే. ౪.

అ॥ ఇడర్కెడ - మాదుఃఖములు నశించునట్లు, పోన్దు - క్షేమంచేసి, ఎమ్మై - మనలను, అళియాయ్ - రక్షించుము, ఎన్ఱేత్తి - అనిపలుమాఱు స్తోత్రముఁజేసి, శుడర్కొళ్ - ఉజ్జ్వలమై, శోది - తేజోమయమైన విగ్రహముగల తనను, తేవరుమ్ - దేవతలును, మునివరుమ్ - ఋషులును, తొడర - ఆశ్రయించునట్లు, తిరుమోగూర్ - తిరుమోగూరందు, పడర్కొళ్ - విశాలమైన ఫణములుగల, పామ్బు - ఆదిశేషుఁడనెడి, అణై - శయ్యమీఁద, పళ్ళికొళ్వాన్ - పవ్వళించువానియొక్క, అడి - శ్రీపాదములను, తొణ్డీర్ - ఓభక్తులారా! ఇడర్కెడ - మనదుఃఖము నశించునట్లు, పరవుదుమ్ - స్తోత్రముజేసెదము; వమ్మిన్ - రండు.

తా॥ ఓశ్రీవైష్ణవులారా! మనసమస్తదుఃఖములును నశించునట్లు తిరుమోగూరులో క్షేమంచేసియున్న శ్రియఃపతిని యాశ్రయించి మన ముజ్జీవించెదము రండుమని. ౪.

తొణ్డీర్వమ్మిన్ నమ్శుడరొళియొరుతనిముదల్వన్*
అణ్డమూవులగళన్దవన్ అణితిరుమోగూర్*
ఎణ్డిశైయుమీఱిలశరుమ్బుదు పెరుమ్శెన్నెల్వాళైయ*
కొణ్డుకోయిలైవలమ్శెయ్ దిఙ్గాడుదుమ్కూత్తే. ౫.

అ॥ నమ్ - మనకు ప్రాప్యుఁడై, శుడర్ఒళి-మిక్కిలితేజోమయమైన తిరుమేనుగలవాఁడై, ఒరుతనిముదల్వన్-ఉపాదానకారణమునునిమిత్తకారణమునైనవాఁడై, అణ్డమ్-బ్రహ్మాణ్డమందున్న,

మూవులగు - మూడులోకములను, అళన్దవన్ - కొలిచినవాఁడైన సర్వేశ్వరుఁడు, అణి - శ్లాఘ్య మైన, తిరుమోగూర్ - తిరుమోగూరంఁదు, ఎణ్ తిశైయుమ్ - ఎనిమిది దిక్కులయందును, ఈన్-పండుచున్న, కరుమ్బొడు - చెరుకులతోఁగూడ, పెరుమ్ శెన్నెల్ - గొప్పఎఱ్ఱధాన్యములు, విళై యు-పండునట్లు, కొణ్డ - తనకువాసస్థానముగాస్వీకరించిన, కోయిలై - కోవిలను, వలమ్ శెయ్దు - ప్రదక్షిణముఁజేసి, ఇఙ్గు - ఈలోకమందు, కూత్తాడుదుమ్ - నృత్యముజేసెదము; తొణ్డీర్ - ఓ భక్తులారా! వమ్మిన్ - రండు.

తా॥ ఓ శ్రీవైష్ణవులారా! సకలజగత్కారణుఁడైన సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరుమోగూరందలి దివ్యమందిరమును ఏ సమాశ్రయించి యనుభవింౘెదము రండుమని. ౫.

కూత్తన్ కోవలన్ కుదఱ్ఱువల్ల శురర్ గళ్ కూఱ్ఱమ్*
ఏత్తుమ్ నఙ్గట్కుమ్ అమరర్ క్కుమ్ మునివర్ క్కుమిన్బన్*
వాయ్ త్త తణ్ పழை వழவయల్ శూழ் తిరుమోగూర్
ఆత్తన్* తామరై యడియన్ఱి మఱ్ఱిలమరణే ౬.

అ॥ కూత్తన్ - రంభనృత్యముజేయువాఁడును, కోవలన్ - గోపాలుఁడును, కుదఱ్ఱు-ఉన్మత్తులై, వల్ - బలిష్ఠులైన, అశురర్ గళ్ - అసురులకు, కూఱ్ఱమ్ - మృత్యువైనవాఁడును, ఏత్తుమ్ - స్తోత్రముజేయుచున్న, నఙ్గట్కుమ్ - మనకును, అమరర్ క్కుమ్ - నిత్యసూరులకును, మునివర్ క్కుమ్ - ఋషులకును, ఇన్బన్ - భోగ్యభూతుఁడును, వాయ్ త్త - సమృద్ధమై, తణ్ - చల్లనైన, పழை - కొలనలచేతనున్న వழమ్ - పండియున్న, వయల్ - పొలములచేతనున్న, శూழ் - చుట్టఁబడిన, తిరుమోగూర్ - తిరుమోగూరందువేంచేసియున్న, ఆత్తన్ - ఆప్తతముఁడునైన సర్వేశ్వరునియొక్క, తామరై యడియన్ఱి - శ్రీపాదపద్మములనుదక్క, మఱ్ఱు అరణ్ - వేఱురక్షకమును, ఇలమ్ - కలవారముకాము.

తా॥ సకలసంపత్సమృద్ధమైన తిరుమోగూరులో వేంచేసియున్న ఆప్తతముఁడైన సర్వేశ్వరునియొక్క తిరువడికళ్ళుతప్ప మనకు వేఱొక రక్షకములేదని. ౬.

మఱ్ఱిలమరణ్ వాన్ పెరుమ్బాழ் తనిముదలా*
శుఱ్ఱు నీర్ పడై త్తదన్వழிత్తొన్ఱ్మునిముదలా*
ముఱ్ఱుమ్ తేవరోడులగు శెయ్ వాన్ తిరుమోగూర్*
శుఱ్ఱి నామ్ వలమ్ శెయ్య నమ్ తుయర్ కెడుమ్ కడిదే. ౭.

అ॥ వాన్ - అపరిచ్ఛిన్నమై, పెరుమ్ - గొప్పదై, తని - అద్వితీయమైన, పాழ் ముదలా - మూలప్రకృతి మొదలుగా, శుఱ్ఱుమ్ - అణ్డమునకుచుట్టునున్న, నీర్ - మహాజలమును, పడైత్తు - సృజించి, అదన్ వழி - ఆమార్గంబున, తొల్ - అనాదియై, ముని - మననశీలుఁడైన బ్రహ్మను, ముదలా - మొదలుగాగల, ముఱ్ఱుమ్ తేవరోడు - సమస్తదేవతలతోఁగూడ, ఉలగు - లోకములను, శెయ్వాన్ - సృజించెడి సర్వేశ్వరుడు వేంచేసియున్న, తిరుమోగూర్ - తిరుమోగూరును, నామ్ - మనము, శుఱ్ఱి వలమ్ శెయ్య - చుట్టుప్రదక్షిణముఁజేయగా, కడిదే - శీఘ్రములోనే, నమ్ తుయర్ - మదుఃఖము, కెడుమ్ - నశించును.

తా॥ బ్రహ్మాది సకలచరాచరాత్మకమైన జగత్తును సృజించి రక్షించిన శ్రియఃపతియొక్క తిరుమోగూరును ప్రదక్షిణముజేయగా సకలదుఃఖములును నశించుననిని. ౭.

తుయర్ కెడుమ్ కడిదడై న్దువన్దడియవర్ తొழுమిన్ *
ఉయర్ కొళ్ శోలై యొణ్ తడమణి యొళి తిరుమోగూర్ *
పెయర్ గళాయిరముడైయ వల్లరక్కర్ పుక్కழுన్ద *
తయరదన్ పెత్ప మరదగమణిత్తడత్తినైయే. ౨.

అ॥ ఉయర్ కొళ్ - ఉన్నతమైన, శోలై - తోపులనున్ను, ఒణ్ - సుందరమైన, తడమ్ - తటాకములనున్ను, అణి - అలఙ్కారముగాగల, ఒళి - ఉజ్జ్వలమైన, తిరుమోగూర్ - తిరుమోగూరులో వేంచేసియున్నవాఁడును, ఆయిరమ్ పెయర్ గళుడైయ - (యజ్ఞశత్రు బ్రహ్మశత్రు అని యీ విధములైన) అనేక నామములుగల, వల్ - బలిష్ఠులైన, అరక్కర్ - రాక్షసులు, పుక్కు - ప్రవేశించి, అழுన్ద - మునుగునట్లు, తయరదన్ పెత్ప - దశరథచక్రవర్తికన్నిన, మరదగమణి త్తడత్తినై - మరతకమణివలె నతిసుందరమైన తటాకమువంటివాఁడునైన శ్రీరాముని, అడియవర్ - ఓ భక్తులారా! వన్దడైన్దు - వచ్చిసమీపించి, తొழுమిన్ - ఆశ్రయించుడి. కడిదు - శీఘ్రముగానే, తుయర్ - దుఃఖము, కెడుమ్ - నశించును.

తా॥ ఓ భక్తులారా! తిరుమోగూరులో వేంచేసియున్న శత్రుసంహారకుఁడైన దాశరథిని యాశ్రయించితిరేని మీయొక్క పాపములన్నియు తత్క్షణమందే నశించుననిని ౮.

మణి త్తడత్తడిమలర్ క్కణ్గళ్ పవళచ్చెవ్వాయ్ *
అణిక్కొళ్ నాల్ తడన్దోళ్ తెయ్వమశురరై యెత్తుమ్ *
తుణిక్కుమ్ వల్లరట్టనుఱై పొழிల్ తిరుమోగూర్ *
నణిత్తునమ్ముడైనల్లరణ్ నాముడైన్దనమే. ౯.

అ॥ మణి - నిర్మలమైన, తడత్తు - తటాకమువలె చల్లనైన, అడి - శ్రీపాదములనున్ను, మలర్ కణ్గళ్ - పద్మనేత్రములనున్ను, పవళమ్ - పగడమువలె, శెమ్ - ఎఱ్ఱనైన, వాయ్ - అధరమునున్ను, అణిక్కొళ్ - అలఙ్కారమైయున్న, తడమ్ - విశాలమైన, నాల్ తోళ్ - నాలుగుభుజములనున్నగల, తెయ్వమ్ - దేవతయైనవాఁడును, అశురరై - అసురులను, ఎత్తుమ్ - ఎల్లప్పుడును, తుణిక్కుమ్ - తునకలుగాజేయుచున్న, వల్లరట్టన్ - బలిష్ఠుఁడునైన సర్వేశ్వరుఁడు, ఉఱై - నిత్యవాసముజేయుచున్నదియు, పొழிల్ - తోటలుగలదియునైన, తిరుమోగూర్ - తిరుమోగూరనెడి, నమ్ముడై - మనయొక్క, నల్లరణ్ - మంచిరక్షకదేశము, నణిత్తు - సమీపించినది. నామ్ - మనము, అడైన్దనమ్ - (దానిని) పొందితిమి.

తా॥ నిరతిశయదివ్యావయవసౌందర్యముగల సర్వేశ్వరుఁడు వేంచేసియున్న మనకు రక్షకమైన తిరుమోగూరును మనము పొందితిమని. ౯.

నాముడైన్దనల్లరణ్ నమక్కెన్ఱునల్లవరర్ *
తీమనత్తరక్కర్ తిఱలழிత్తవనిడమ్ *

కామరూపమ్కొణ్డెழுన్దళిప్పాన్ తిరుమోగూర్*
నామమేనవిన్ఱెణ్ణుమిన్ ఏత్తుమిన్ నమర్గాళ్. ౧౦.

అ॥ నమక్కు - మనరక్షణార్థమై, నామ్అడైన్ద - మనమాశ్రయించిన, నల్లరణ్ - మంచి రక్షకస్థానము, ఎన్ఱు - అని, నల్ అమరర్ - ఉపాయము నెఱింగిన దేవతలు, తీమైశెయ్యుమ్ - బాధబెట్టుచున్న, వల్ అశురరై - బలిష్ఠులైన అసురులకు, అఞ్జి - భయపడి, శెన్ఱుఅడైన్దాల్ - పోయియాశ్రయించుటచేత, కామరూపమ్కొణ్డు - అనురూపమైన మోహనావతారంబెత్తి, ఎழுన్దు - బయలుదేరి, అళిప్పాన్ - (ఆదేవతలును) రక్షించిన సర్వేశ్వరుఁడు వేంచేసియున్న, తిరుమోగూర్ - తిరుమోగూరనెడి దివ్యదేశముయొక్క, నామమే - తిరునామములనే, నమర్గాళ్ - ఓ మనబంధువులారా! నవిన్ఱు - చెప్పి, ఎణ్ణుమిన్ - ధ్యానించుడి, ఏత్తుమిన్ - స్తుతించుడి.

తా॥ ఓ బంధువులారా! దేవతలు, అసురులచేత నమృతముకొఱకై బాధింపఁబడి తిరుమోగూరికి వచ్చి ప్రపత్తిజేయగా నప్పుడు మోహనావతారమెత్తి యసురులనుమోహంబెట్టి దేవతలను రక్షించిన శ్రియఃపతియొక్క తిరుమోగూరి తిరునామముల ననుసంధించి స్తుతించుడియని. ౧౦.

ఏత్తుమిన్ నమర్గాళెన్ఱు తాన్ కుడమాడు
కూత్తనై *కురుగూర్చ్చడగోపన్ కుఱ్ఱేవల్గళ్*
వాయ్త్తవాయిరత్తుళ్ళివై వణ్తిరుమోగూర్క్కు*
ఈత్తపత్తివై యేత్తవల్లార్క్కిడర్ కెడుమే. ౧౧.

అ॥ నమర్గాళ్ - ఓ బంధువులారా! ఏత్తుమిన్ - స్తుతించుడి; ఎన్ఱు - అనియుపదేశించి, తాన్ - తాను, కుడమాడుకూత్తనై - కుంభనృత్యముజేసిన సర్వేశ్వరునివిషయమై, కురుగూర్చ్చడగోపన్ - కురుకాపురికి స్వామియైన నిమ్మాழ்వ్వార్లుసాయించిన, కుఱ్ఱేవల్గళ్ - అంతరంగకైంకర్యరూపమై, వాయ్త్త - అనురూపమైన, ఇవై ఆయిరత్తుళ్ - ఈవెయ్యిపాశురములలో, వణ్ - సుందరమైన, తిరుమోగూర్క్కు - తిరుమోగూరికి, ఈత్త - సమర్పించిన, ఇవైపత్తు - ఈపదిపాశురములను, ఏత్తవల్లార్క్కు - స్తోత్రముఁజేయువారికి, ఇడర్కెడుమ్ - శరీరావసానకాలమందున్న దుఃఖములు నశించును.

తా॥ తిరుమోగూర్విషయమై నమ్మాழ்వార్లుప్రసాదించిన ఈపదిపాశురములనభ్యసించువారికిమోక్షవిరోధులైన సకలప్రతిబంధకములును కాళమేఘముయొక్క సహాయముచే నశించునని.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౨ - వ, తిరువాయ్మొழி.

---

అవతారిక :—ఈ తిరువాయ్మొழிలో, పరమపదమందుపోయి చేయఁదగిన సకలవిధకైంకర్యములనున్ను, తిరువనన్తపురమందు తిరువనన్దాழ்వానమీఁదఁ బవ్వళించియున్న పద్మనాభుని విషయమందుఁ జేయవలయునని ప్రార్థించుచున్నారు.

కెడుమిడరాయవెల్లామ్ కేశవావెన్న * నాళుమ్
కొడువినై శెయ్యుమ్ కూర్ట్రిన్ తమర్గళుమ్ కుఱుగగిల్లార్ *
విడముడై యరవిల్ పళ్ళి విరుమ్బినాన్ శురుమ్బలర్ట్రుమ్ *
తడముడై వయ లనన్దపురనగర్ ప్పుగుదుమిన్ట్రే ౧.

అ॥ కేశవాఎన్న - కేశవా! అని చెప్పగా, ఇడరాయవెల్లామ్-దుఃఖములన్నియు, కెడుమ్-నశించును. నాళుమ్ - ప్రతిదినమును, కొడువినై - క్రూరకర్మములను, శెయ్యుమ్ - చేయుచున్న, కూర్ట్రిన్ తమర్గళుమ్ - యమునియొక్క-దూతలును, కుఱుగగిల్లార్ - దగ్గఱ రారు. విడముడై - విషముగల, అరవిల్ - ఆదిశేషునిమీఁద, పళ్ళివిరుమ్బినాన్ - పవ్వళింపఁగోరినట్టి పద్మనాభుఁడు నిత్యవాసముఁజేయుచున్నదియు, శురుమ్బు - తుమ్మెదలు, అలర్ట్రుమ్-ఝుంకరించుచున్న, తడమ్ఉడై - తటాకములుగలదియునైన అనన్దపురనగర్ - తిరువనన్తపురమనెడి మహానగరమును, ఇన్ట్రే - ఇప్పుడే, పుగుదుమ్ - ప్రవేశించుడి

తా॥ ఓ భక్తులారా! కేశవుని తిరునామము ననుసంధించినప్పుడే సకలపాపములును నశించును, యమదూతలు బాధించరు, గాన మీరువెళ్ళి, పద్మనాభుఁడనన్తశాయియై పవ్వళించియున్న తిరువనన్తపురమును శీఘ్రముగానే ప్రవేశించుడీయని. ౧.

ఇన్ట్రుపోయ్ప్పుగుదిరాగి లెల్లా మెయుమేదమ్శారా *
కున్ట్రునేర్ మాడమాడే కురున్దుశేర్ శెరున్దిపున్నై *
మన్ట్రలర్ పొழிల్ లనన్దపురనగర్ మాయన్నామమ్ *
ఒన్ట్రుమోరాయిరమా ముళ్ళువార్క్కు-మ్బరూరే. ౨.

అ॥ ఇన్ట్రుపోయ్ - ఇప్పుడువెళ్ళి, పుగుదిరాగిల్ - ప్రవేశించినయెడల, ఎల్లామెయుమ్ - ఎల్లప్పుడును, ఏదమ్ - దుఃఖము, శారా - సమీపించదు కున్ట్రునేర్ - పర్వతముబోలిన, మాడమ్-గృహములుగలదై, మాడే - వానిప్రక్కన, శేర్ - చేరియున్న, కురున్దు - బండిగురుగింజవృక్షములనన్ను, శెరున్ది - శెరున్దివృక్షములనున్ను, పున్నై - పున్నవృక్షములనున్నుగలవియు, మన్ట్రు-పరిమళము, అలర్ - వ్యాపించుచున్నవియునైన, పొழிల్ - తోటలుగలదైన, అనన్దపురనగర్ - తిరువనన్తపురమందు వేంచేసియున్న, మాయన్ - ఆశ్చర్యభూతుఁడైన సర్వేశ్వరునియొక్క, ఒన్ట్రు నామమ్ - ఒకతిరునామమను, ఓర్ఆయిరమామ్ - ఒకసహస్రవిధమై రక్షించును. ఉళ్ళువార్క్కు - (ఆతిరునామమును) అనుసంధించువారికి, ఉమ్బరూర్ - పరమపదమే (ప్రాప్యమగును).

తా॥ ఓ భాగవతులారా! పద్మనాభుఁడు వేంచేసియున్న తిరువనన్తపురమును ప్రవేశించినయెడల సకలపాపములును నశించును. వానియొక్క యొకతిరునామము ననుసంధించినను మీయొక్క సకలవిరోధులును నశించునని. ౨.

ఊరుమ్పుట్కొడియుమఃదే యులగెల్లాముణ్డుమిழ்న్దాన్ *
శేరుమ్తణ్ణనన్దపురమ్ శిక్కెనప్పుగుదిరాగిల్ *
తీరుమ్నోయ్వినైగళెల్లామ్ తిణ్ణనామఱియచ్చొన్నోమ్ *
పేరుమోరాయిరత్తుళ్ ఒన్ట్రునీర్ పేశుమినే. ౩.

అ॥ పుళ్ - గరుత్మంతుని, ఊరుమ్ - (వాహనముగా) నడిపించును. కొడియుమ్ - ధ్వజమును, అప్పదే - అగత్మంతుడే. ఉలగెల్లామ్ - లోకములనన్నిటిని, ఉణ్డు - మ్రింగి, ఉమిழ்న్దాన్ - క్రక్కినవాఁడు, శేరుమ్ - చేరియున్న, తణ్ - చల్లనైన, అనన్దపురమ్ - తిరువనన్తపురమును, శిక్కెన - అనన్యప్రయోజనులై, పుగుదిరాగిల్ - ప్రవేశించితిరేని, నోయ్ - దుఃఖములును, విన్నైగళెల్లామ్ - పాపములన్నియు, తీరుమ్ - నశించును. నామ్ - మేము, అతియ - (మీరు) ఎఱుఁగునట్లు, తిణ్ణమ్ - దృఢముగా, శొన్నోమ్ - చెప్పితిమి. పేరుమ్ఓరాయిరత్తుళ్ - ఒక వెయ్యితిరునామములలో, ఒన్ఱు - ఏదోవొకదానిని, పేశుమిన్ - చెప్పుఁడు.

తా॥ ఓశ్రీవైష్ణవులారా! మీరు తిరువనన్తపురమునుప్రవేశించినప్పుడే మీయొక్క సకల ప్రతిబంధకములును నశించును. వానియొక్క తిరునామమును జెప్పి వానిగుణములననుభవింపుడియని.

పేశుమిన్ కూశమిన్ఱి ప్పెరియనీర్ వేలై శూழ்న్దు*
వాశమేకమழுమ్ శోలై వయులణియనన్దపురమ్*
నేశమ్ శెయ్దుఱైగిన్ఱానై నెఱిమైయాల్ మలర్ గళ్ తూవి*
పూశనై శెయ్గిన్ఱార్ గళ్ పుణ్ణియమ్ శెయ్దవాఱే. ౪.

అ॥ పెరియ - గొప్ప, నీర్ - జలముగల, వేలై - సముద్రముచే, శూழ்న్దు - చుట్టబడి, వాశమేకమழுమ్ - పరిమళముకొట్టుచున్న, శోలై - తోపులుగల, వయల్ - పొలములచేత, అణి - అలఙ్కరింపఁబడిన, అనన్దపురమ్ - తిరువనన్తపురమందు, నేశమ్ శెయ్దు - ఆశపడి, ఉఱైగిన్ఱానై - నిత్యవాసముఁజేయుచున్న సర్వేశ్వరుని, నెఱిమైయాల్ - అనన్యప్రయోజనమై, మలర్ గళ్ - పుష్పములను, తూవి - సమర్పించి, పూశనై - తిరువారాధనమును, శెయ్గిన్ఱార్ గళ్ - చేయువారు, పుణ్ణియమ్ శెయ్దవాఱు - పుణ్యముజేసినవిధమును, కూశమిన్ఱి - సఙ్కోచములేక, పేశుమిన్ - చెప్పుఁడు

తా॥ ఓచేతనులారా! తిరువనన్తపురమందు బవ్వళించిన పద్మనాభుని యారాధించుచున్న భాగ్యవంతులయొక్క మహాభాగ్యమును చెప్పుఁడని. ౪.

పుణ్ణియమ్ శెయ్దు నల్లపునలొడుమలర్ గళ్ తూవి*
ఎణ్ణుమినెన్దైనామమ్ ఇప్పిఱవియప్పుఱుక్కుమప్పాల్*
తిణ్ణనామఱియచ్చొన్నోమ్ శెఱిపొழிలనన్దపురత్తు*
అణ్ణలార్ కమలపాదమ్ అణుగువారమరరావార్. ౫.

అ॥ పుణ్ణియమ్ శెయ్దు - (భక్తిరూపమైన) భాగ్యముఁజేసి, నల్లపునలొడు-మంచితీర్థముతోఁగూడ, మలర్ గళ్ - పుష్పములను, తూవి - సమర్పించి, ఎన్దై - నాస్వామియొక్క, నామమ్- తిరునామములను, ఎణ్ణుమిన్ - ధ్యానించుడి. ఇప్పిఱవి-ఈజన్మములను, అఱుక్కుమ్-ఛేదించును. అప్పాల్ - దానిపైన, శెఱి - నిబిడమైన, పొழிల్ - తోటలుగల, అనన్దపురత్తు - తిరువనన్తపురమందు వేంచేసియున్న, అణ్ణలార్ - స్వామియొక్క, కమలపాదమ్ - శ్రీపాదపద్మములను, అణుగువార్ - ఆశ్రయించువారు, అమరరావార్ - నిత్యసూరులగుదురు. నామ్ - మేము, తిణ్ణమ్ - (ఈయర్థమును) దృఢముగా, అఱియచ్చొన్నోమ్ - ఎఱుఁగునట్లుచెప్పితిమి.

తా॥ తిరువనన్తపురమందు బవ్వళించిన యనన్తపద్మనాభుని భక్తితో నారాధించి యాశ్రయించినవారు సకలపాపములును నశించి మోక్షమును జేరుదురు. దీనిని యథార్థమని నమ్ముడని.

అమరరాయ్ త్తిరిగిన్ఱార్ గట్కాది శేరనన్దపురత్తు*
అమరర్ కోనర్చ్చిక్కి న్ఱజ్ఞగప్పణి శెయ్యవర్ విణ్ణోర్*
నమర్గళో శొల్లక్కేణ్మిన్ నాముమ్ పోయ్ నణుగవేణ్డుమ్*
కుమరనార్ తాదై తున్బమ్ తుడైత్త గోవిన్దనారే. ౬.

అ॥ కుమరనార్ - కుమారస్వామికి, తాదై - తండ్రియైన రుద్రునియొక్క, తున్బమ్ - (బ్రహ్మహత్యారూప)దుఃఖమును, తుడైత్త-పోఁగొట్టిన, గోవిన్దనార్-శ్రీకృష్ణుఁడును, అమరరాయ్-దేవతలై, తిరిగిన్ఱార్ గట్కు-తిరుగుచున్న బ్రహ్మాదులకు, ఆది-కారణభూతుఁడునైన సర్వేశ్వరుఁడు, శేర్ - పవ్వళించిన, అనన్దపురత్తు - తిరువనన్తపురమందు, అమరర్ కోన్ - నిత్యసూరులకుస్వామియైన విష్వక్సేనులు, అర్చిక్కిన్ఱు-ఆరాధించుచున్నారు. అజ్ఞు-ఆతిరువారాధనమందు, విణ్ణోర్ - నిత్యసూరులు, అగప్పణి శెయ్యవర్-అంతరఙ్గపరిచర్యజేయుదురు. నమర్గళో-ఓమనబంధువులారా! శొల్లక్కేణ్మిన్ - (నేను) చెప్పెడుమాటనువినుఁడు. నాముమ్ - మనమును, పోయ్ - పోయి, నణుగవేణ్డుమ్ - (వారిస్థానమును) పొందవలెను.

తా॥ ఓశ్రీవైష్ణవులారా! విష్వక్సేనులు మొదలగు నిత్యసూరులుఁగూడ తిరువనన్తపురమందు వచ్చి కైఙ్కర్యముజేయుచున్నారుగాన మనకు తిరువనన్తపురమే పరమప్రాప్యమని. ౬.

తుడైత్తగోవిన్దనారే యులగుయిర్ తేవుమ్మట్ఱుమ్*
పడైత్తవెమ్బరమమూర్త్తి పామ్బణైప్పళ్ళికొణ్డాన్*
మడైత్తలై వాళై పాయుమ్ వయలణియనన్దపురమ్*
కడైత్తలై శీయ్క్కప్పెట్ఱాల్ కడువినై కళైయలామే. ౭.

అ॥ ఉలగు - లోకములనున్ను, తేవుమ్ - దేవతలనున్ను, మట్ఱుమ్ - ఇఁకనున్న, ఉయిర్ - ప్రాణులనున్ను, తుడైత్త - సంహరించిన, గోవిన్దనారే - శ్రీకృష్ణుఁడును, పడైత్త - (వానిని) సృజించిన, ఎమ్బరమమూర్త్తి - మనసర్వశేషియు, పామ్బణై - తిరువనన్తాళ్వాన నెడుపడకమీఁద, పళ్ళికొణ్డాన్ - పవ్వళించినవాఁడునైన సర్వేశ్వరుఁడు వేంచేసియున్నదియు, మడైత్తలై - నీళ్ళుపారుచున్న ప్రదేశములయందు, వాళై-మత్స్యములు, పాయుమ్ ఎగురుచున్న, వయల్ - పొలములను, అణి-అలఙ్కారముగాగలదియునైన, అనన్దపురమ్ - తిరువనన్తపురముయొక్క, కడైత్తలై - ముంగిళ్ళప్రదేశములయందు, శీయ్క్కప్పెట్ఱాల్ - సంమార్జనముజేయుదగిన భాగ్యము జేసినయెడల, కడువినై-చెడ్డదుఃఖములను, కళైయలామ్ - పోఁగొట్టవచ్చును.

తా॥ సర్వేశ్వరుఁడు పవ్వళించిన తిరువనన్తపురమందు కైఙ్కర్యము జేసినయెడల, ఇతర దివ్యదేశములయందు కైఙ్కర్యముజేయలేదనెడి దుఃఖములన్నియు నశించునని. ౭.

కడువినై కళైయలాగుమ్ కామనై ప్పయన్దకాళై*
ఇడవగై కొణ్డదెన్బ రెళిలణియనన్దపురమ్*

పడముడై యరవిల్ పళ్ళి పయిన్ఱవన్ పాదమ్ కాణ*
నడమినో నమర్ గళుళ్ళీర్ నాముమక్కఱియచ్చొన్నోమ్. ౮.

అ॥ కడువినై - క్రూరపాపములను, కళైయలాగుమ్ - పోఁగొట్టవచ్చును. కామనై - మన్మథుని, పయన్ద-పుట్టించిన, కాళై-యౌవనవంతుఁడైన శ్రీకృష్ణుఁడు, ఎழிల్-సౌందర్యమును, అణి - అలఙ్కారముగాగల, అనన్దపురమ్ - తిరువనన్తపురమును, ఇడవగై - వాసస్థానముగా, కొణ్డదు - స్వీకరించెను, ఎన్బర్ - అని చెప్పుదురు. పడముడై - ఫణములుగల, అరవిల్ - ఆదిశేషునిమీఁద, పళ్ళిపయిన్ఱవన్ ఆదరముతోఁబవ్వళించినవానియొక్క, పాదమ్ - తిరువడికళ్ళను, కాణ - సేవించుటకై, నమర్ గళుళ్ళీర్ - ఓమనబంధువులారా! నడమినో-వెళ్ళుఁడి. (ఈమాటను) నామ్ - మేము, ఉమక్కు - మీకు, అఱియ - తెలియునట్లు, శొన్నోమ్ - చెప్పితిమి.

తా॥ ఓఅనుకూలులారా! తిరువనన్తపురమం దాదిశేషునిమీఁద బవ్వళించిన పద్మనాభుని శ్రీపాదములను సేవింపవెళ్ళుఁడు. మీయొక్కసకలదుఃఖములును నశించును. ఈమాటను దృఢముగా నమ్ముఁడని. ౮.

నాముమక్కఱియచ్చొన్న నాళ్ గళుమ్ నణియవాన*
శేమనన్గుడైత్తుక్కణ్డీర్ శెఱిపొழிలనన్దపురమ్*
తూబనల్ విరై మలర్ గళ్ తువళఱవాయ్న్దుకొణ్డు*
వామననడిక్కెన్ఱేత్త మాయ్న్దఱుమ్ వినైగళ్ తామే. ౯.

అ॥ నామ్ - మేము, ఉమక్కు - మీకు, అఱియ - తెలియునట్లు, శొన్న - చెప్పిన, నాళ్ గళుమ్ - దినములును, నణియవాన - సమీపించినవి. శెఱి - నిబిడమైన, పొழிల్ - తోటలుగల, అనన్దపురమ్ - తిరువనన్తపురము, నన్గు-మంచి, శేమమ్ - క్షేమమును, ఉడైత్తుక్కణ్డీర్ - కలదినుమీ! తూబమ్ - ధూపమును, నల్ - మంచి, విరై - పరిమళముగల, మలర్ గళ్ - పుష్పములను, తువళఱ - దోషములేనట్లు, ఆయ్న్దుకొణ్డు - పరిశోధించియెత్తుకొని, వామననడిక్కెన్ఱు - (ఇవి) శ్రీవామనుని శ్రీపాదములకనిసఙ్కల్పించి, ఏత్త - స్తోత్రముజేయగా, వినైగళ్ - కైఙ్కర్యవిరోధులు, తామే - స్వయముగానే, మాయ్న్దఱుమ్ - నశించిపోవును.

తా॥ ఓ బంధువులారా! సాకిప్పుడు కాలము సమీపించినది. ఇఁకమీఁదమీకు తత్త్వము నుపదేశించువారెవరునులేరు. గాన మీరు శీఘ్రముగానే తిరువనన్తపురమునకువెళ్ళి కైఙ్కర్యము జేయుడి. మీప్రతిబంధకములన్నియు నశించునని. ౯

మాయ్న్దఱుమ్ వినైగళ్ తామే మాదవావెన్న*నాళుమ్
ఏయ్న్దపొన్ మదిళనన్దపురనగరెన్ఱైక్కెన్ఱు*
శాన్దొడువిళక్కమ్ తూబమ్ తామరై మలర్ గళ్ నల్ల*
ఆయ్న్దుకొణ్డేత్తవల్లార్ అన్దిమిల్ పుగழினారే. ౧౦.

అ॥ మాదవా ఎన్న - శ్రియఃపతీ! అని చెప్పినప్పుడే, వినైగళ్ - పాపములు, తామే - స్వయముగానే, మాయ్న్దఱుమ్ - నశించును. ఏయ్న్ద - అనురూపమైన, పొన్ మదిళ్ - సువర్ణ

ప్రాకారముగల, అనన్దపురనగర్ - తిరువనన్తపురమందు బన్వళించిన, ఎన్దైక్కు ఎన్ఱు - మాస్వామికి యని యుద్దేశించి, నల్లనాన్దొడు - మంచిచన్దనముతోఁగూడ, విళక్కుమ్ - దీపమునున్ను, తూబమ్ - ధూపమునున్ను, తామరై మలర్ గళ్ - తామరసపుష్పములనున్ను, నాళుమ్ - ప్రతిదినమును, అయ్న్దుకొణ్డు - పరిశోధించియెత్తుకొని, ఏత్తవల్లార్ - స్తోత్రముచేయఁదగినవారు, అన్దమిల్ - అవధిలేని, పుగழ்సార్ - కీర్త్యతిప్రసిద్ధిగలవారగుదురు.

తా॥ స్వర్ణప్రాకారముచే జుట్టబడిన తిరువనన్తపురమందు వేంచేసియున్న శ్రియఃపతిని పుష్పాద్యుపకరణములను సమ్పాదించుకొని వెళ్ళి యాశ్రయించినవారు గొప్పకీర్తిగలవారగుదురని

‡‡ అన్దమిల్ పుగழ்అనన్దపురనగరాదిదన్నై*
కొన్దలర్ పొழிల్ కురుగూర్ మాఱన్ శొల్లాయిరత్తుళ్*
ఐన్దినోడైన్దుమ్వల్లార్ అణైవర్ పోయమరులగిల్*
పైన్దొడిమడన్దైయర్ దమ్ వేయ్మరుతోళిణైయే. ౧౧.

అ॥ అన్దమిల్ - అవధిలేని, పుగழ் - కీర్తిగలవాఁడై, అనన్దపురనగర్ - తిరువనన్తపురమందుబన్వళించినవాఁడై, ఆదితన్నై - జగత్కారణుఁడైన శ్రియఃపతివిషయమై, కొన్దు - పుష్పములు, అలర్ - వికసించుచున్న, పొழிల్ - తోటలుగల, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, మాఱన్ - నమ్మాழ்వార్లు, శొల్ - సాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో, ఐన్దినోడైన్దుమ్ - అయిదుపాశురములతోఁజేరిన అయిదుపాశురములను (పదిపాశురములను) వల్లార్ - అభ్యసించువారు, పోయ్ - వెళ్ళి, అమరులగిల్ - శ్రీవైకుణ్ఠమందు, పై - సుందరములైన, తొడి - హస్తాభరణములుగల, మడన్దైయర్ తమ్ - అప్సరస్త్రీలయొక్క, వేయ్మరు - వెదురువలె విలక్షణమైన, తోళిణై - భుజములచేజేయబడిన బ్రహ్మాలఙ్కారములను, అణైవర్ - పొందుదురు.

తా॥ తిరువనన్తపురమందు బన్వళించిన యనన్తపద్మనాభునివిషయమై నమ్మాழ்వార్లుప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు శ్రీవైకుణ్ఠవాసులచే నారాధింపఁబడుదురని. ౧౧.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్.

---

3. వ, తిరువాయ్మొழி.

అవతారిక:- ఈతిరువాయ్మొழிలో, తాముద్దేశించినట్లు తిరువనన్తపురమందు కైఙ్కర్యము లభించనందున, తమ ప్రకృతిసంబన్ధమునున్ను, ఈశ్వరస్వాతన్త్ర్యమునున్ను దలంచి తగినశక్తియు తమకులేదనియాలోచించి గొప్పవిషాదమునొందినవారై తమయవస్థను ఒకపిరాట్టి వాక్యముచే నన్యాపదేశముగా సాదించుచున్నారు.

‡‡ వేయ్మరుతోళిణై మెలియుమాలో మెలివుమెన్ తనిమైయుమ్ యాదుమ్ నోక్కా*
కామరుకుయిల్ గళుమ్ కూవుమాలో కణమయిలవై కలన్దాలుమాలో*

ఆమరువిననిరై మేయ్క్కనీపోక్కొరుపగలాయిరమూఴియాలో*
తామరై క్కణ్గళ్ కొణ్డీర్ దియాలో తగవిలై తగవిలై యేనీకణ్ణా. ౧.

అ॥ వేయ్మరు - వెదురుబోలిన, తోళిణై - భుజములురెండును, మెలియుమ్ - వాడిపోవుచున్నవి. ఎన్ - నాయొక్క, మెలివుమ్ - శైథిల్యమునున్న, తనిమైయుమ్ - విశ్లేషమునున్న, యాదుమ్ - దేనినిన్ని, నోక్కా - చూడకుండ, కామరు - పరస్పరమనురాగముగల, కుయిల్గళుమ్ - కోకిలములును, కూవుమ్ - కేకలువేయుచున్నవి; కణమ్ - గుంపుగానున్న, మయిలవై - నెమలిలు, కలన్దు - ఒకటితోనొకటికలిసి, ఆలుమ్ - నృత్యముఁజేయుచున్నవి; మరువు - (నీయందు) స్నేహముగల, ఇనమ్ - గుంపుగానున్న, ఆనిరై - గోసమూహములను, మేయ్క్క - మేపుటకు, నీ - నీవు, పోక్కు - పోవుచున్న, ఒరుపగల్ - ఒకదినము, ఆయిరమూఴి - వెయ్యియుగములుగానున్నది; తామరై - పద్మమువంటి, కణ్గళ్కొణ్డు - నేత్రములతోఁజూచి, ఈర్ది - బాధించుచున్నావు; కణ్ణా - శ్రీకృష్ణుడా! నీ - నీవు, తగవిలైతగవిలై - దయగలవాఁడవుకావు దయగలవాఁడవుకావు.

తా॥ ఓ శ్రీకృష్ణుడా! నీవిఁకమీఁద యావులను మేపుటకు వెళ్ళినయెడల నీవు తిరిగివచ్చి చేరువఱకు నాకిచ్చట వునిక మిక్కిలి కష్టతరముగానుండును; ఇప్పుడే కోకిల మయూరాదులు శబ్దించుచు నన్ను బాధించుచున్నవి. ఈయవస్థలోగూడ విడిచి వెళ్ళుచున్నావు గావ నీవు మిక్కిలి నిర్దయుండవని. ౧.

తగవిలై తగవిలై యేనీకణ్ణా తడములై పుణర్దోఱుమ్పుణర్చ్చిక్కారా*
శుగవెళ్ళమ్విశుమ్బిఱన్దఱివై మూఴ్క్క చ్చూఴ్న్దదుకనవెననీఙ్గియాఙ్గే*
అగవుయిరగమగన్దోఱుముళ్ పుక్కావియిన్ పరమల్ల వేట్కైయన్దో*
మిగమిగ ఇనియున్నై ప్పిరివై యామాల్ వీవనిన్ పశునిరై మేయ్క్కప్పోక్కే. ౨.

అ॥ కణ్ణా - ఓ శ్రీకృష్ణుఁడా! నీ - నీవు, తగవిలైతగవిలై - మిక్కిలి నిర్దయుండవు. తడమ్ - విశాలమైన, ములై - స్తనములను, పుణర్తోఱుమ్ - సంశ్లేషించినప్పుడెల్ల, పుణర్చ్చిక్కు - సంశ్లేషమునకు, ఆరా - లోపడని (మిక్కిలియతిశయించిన), శుగవెళ్ళమ్ - సుఖప్రవాహము, విశుమ్బిఱన్దు - ఆకాశమునతిక్రమించి (అపరిచ్ఛిన్నమై), అఱివైమూఴ్క్క - బుద్ధి చెడునట్లు, శూఴ్న్దు - వ్యాపించి (అప్పుడే), అదు - ఆసుఖము, కనవెన - స్వప్నమువలె, నీఙ్గి - నశించి, ఆఙ్గే - ఆయవస్థయందు, ఉయిరగమ్ - ప్రాణమునకాధారమైన, అగమగన్దోఱుమ్ - లోలోపల, వేట్కై - అభినివేశము, ఉళ్పుక్కు - ప్రవేశించి, ఆవియిన్ పరమల్ల - ఆత్మకసహ్యమైయున్నది. అన్దో - అయ్యో! మిగమిగ - పలుమాఱు, ఉన్నై - నిన్ను, పిరివైయామ్ - విశ్లేషించునట్లున్న, నిన్ - నీయొక్క, పశునిరై మేయ్క్కప్పోక్కు - ఆవులను మేపుటకై వెళ్ళడము, వీవ - నశించుగాక.

తా॥ ఓ శ్రీకృష్ణుడా! నీవు సంశ్లేషించినప్పుడు కలిగిన గొప్పయానన్దముగూడ, నీ విశ్లేషమును దలంచినప్పుడు స్వప్నమువలె నత్యల్పమై తోఁచుచున్నది. అంతలో, నీయందున్న ప్రేమ నన్ను మిక్కిలి బాధించుచున్నది. ఇఁకమీఁదనైనను నీవు ఆవులను మేప వెళ్ళవలదని. ౨.

వీవన్నీ పశునిరై మేయ్ క్కప్పోక్కు వెవ్వుయిర్ క్కొణ్డెనదావివేమాల్*
యావరుమ్ తుణై యిల్లై యానిరు న్దున్నఞ్జనమేనియై యాట్టమ్ కాణేన్ *
పోవదన్ఱొరుపగల్ నీయగన్ఱాల్ పొరుకయల్ కణ్ణిణై నీరుమ్ నిల్లా*
శావదివ్వాయ్ క్కులత్తాయ్ చ్చియోమాయ్ ప్పిఱన్ద వి త్తొళ్ళుత్తైయో న్ఱనిమైతానే.

అ॥ నిన్ పశునిరై మేయ్ క్కప్పోక్కు - (నీవు) నీయావులను మేపుటకు వెళ్ళినయెడల, వీవన్ - (నేను) నశించెదను; ఎనదావి - నాయాత్మ, వెవ్వుయిర్ క్కొణ్డు - వేడి వేడిగా నిట్టూర్పు విడుచుచు, వేమ్ - దగ్ధమగుచున్నది. తుణై - సహాయము, యావరుమిల్లై - ఎవ్వరులేరు. యాన్ - నేను, ఇరున్దు - బ్రతికియుండి, అఞ్జనమేనియై - శ్యామమైనతిరుమేనును (కల), ఉన్ - నీయొక్క, ఆట్టమ్ - సఞ్చారమును, కాణేన్ - చూడకనున్నాను ; నీ అగన్ఱాల్ - నీవు విశ్లేషించినయెడల, ఒరుపగల్ - ఒకయొకదినము (కూడ), పోవదన్ఱు - పోకుండ (పెరుగుచు) నున్నది. పొరు - యుద్ధముజేయుచున్న, కయల్ - మత్స్యములువలెనున్న, కణ్ణిణై - రెండునేత్రముల యందు, నీరుమ్ నిల్లా - నీళ్ళు నిలువకుండ ధారధారగా కారుచున్నవి. ఆయ్ క్కులత్తు - గొల్లకులమందు, ఆయ్ చ్చియోమాయ్ ప్పిఱన్ద - గోపికలై పుట్టిన, తొళ్ళుత్తైయోమ్ - భాగ్యములేని మేమనుభవించుచున్న, ఇత్తనిమైతానే - ఈవిశ్లేషమే, శావదు - మరణప్రాయము గానున్నది.

తా॥ నీవు నాయందాశలేక నన్ను వదలి యావులను మేపుటకు వెళ్ళినయెడల నిన్ను జూడక నేనొకక్షణమాత్రములో ప్రాణమును విడిచెదను. గోపికలై పుట్టిన మాకు నీతో విశ్లేషించుట మరణప్రాయము గానున్నదని. ౩.

తొళ్ళుత్తైయో న్ఱనిమైయుమ్ తుణై పిరిన్దార్ తుయరముమ్ నినైగిలై గోవిన్దా* నిన్
తొళ్ళుత్తనిల్ పశుక్కళై యేవిరుమ్బి తుఱన్దెమ్మై యిట్టవై మేయ్ క్కప్పోది*
పళ్ళుత్తనల్ల ముదినిన్ శాఱ్ఱువెళ్ళమ్ పావియేన్ మనమగత్తోఱుముళ్ పుక్కు ప్పాయ్ న్ద*
నిన్ శెఙ్గనివాయిన్ కళ్ళ్వప్పణిమొళి నినైదొఱుమావి వేమాల్. ౪.

అ॥ గోవిన్దా - ఓగోవిందా! తొళ్ళుత్తైయోమ్ - (మృదుస్వభావముగల) దాసులమైన మేమనుభవించుచున్న, తనిమైయుమ్ - విశ్లేషమునున్ను, తుణై - (విలక్షణుఁడవై) సహాయభూతుఁడవైననిన్ను, పిరిన్దార్ - విశ్లేషించిన మేమనుభవించుచున్న, తుయరముమ్ - వ్యసనమునున్ను, నినైకిలై - తలంచకనున్నావు. నిన్ - నీయొక్క, తొళ్ళుత్తనిల్ - పశువులపాకయందున్న, పశుక్కళై - ఆవులను, విరుమ్బి - ఆశపడి, ఎమ్మై - మమ్ములను, తుఱన్దు - విడిచి, ఇట్టు - పడవేసి, అవై - ఆయావులను, మేయ్ క్క - మేపుటకై, పోది - పోతివి. పళ్ళుత్త - పరిపక్వమైన, నల్లముదిన్ - మంచియమృతముయొక్క, ఇన్ - మధురమైన, శాఱ్ఱువెళ్ళమ్ - రసప్రవాహమువలెనున్న, నిన్ - నీయొక్క, శెఙ్గని - ఎఱ్ఱపండువలెనున్న, వాయ్ - అధరమునుంచిబుట్టిన, కళ్ళ్వమ్ - కృత్రిమమైన, పణిమొళి - సైచ్యోక్తులను, నినైతొఱుమ్ - తలంచినప్పుడంత, పావియేన్ - ప్రతిబంధకముగలనాయొక్క, మనమగత్తోఱుమ్ - మనస్సుయొక్క లోపలంతయు, ఉళ్ పుక్కు - ప్రవేశించి, ప్పాయ్ న్ద - స్థిరపడుచగా, ఆవి - నాప్రాణము, వేమ్ - పరితపించుచున్నది.

తా॥ ఓ శ్రీకృష్ణుఁడా! మా యొక్క ప్రావణ్యమునున్ను, మీ యొక్క వైలక్షణ్యమునున్ను జూడక మమ్ములను విడిచిపెట్టి గోరక్షణమం దాసక్తిగలవాఁడవై వెళ్ళుచున్నప్పుడు మాతో కొన్ని నైచ్యమాటలు చెప్పితివి. ఆమధురవాక్కులు మామనస్సులోనుండి మిక్కిలి బాధించుచున్నవని.

పణిమొఴినినై దొఱుమావివేమాల్ పగల్‌నిరై మేయ్‌క్కియపోయకణ్ణా*
పిణియవిఴ్ మల్లిగై వాడై తూవ ప్పెరుమదమాలై యుమ్‌వన్దిన్ఱాలో*
మణిమిగుమార్విల్ ముల్లైప్పో దెన్వనములై కమఴ్విత్తున్‌వాయముదమ్‌తన్దు*
అణిమిగుతామరైక్కైయైయన్దో అడిచ్చియోమ్‌తలైమిశై నీయణియాయ్. ౫.

అ॥ పణిమొఴి - (నీవు చెప్పిన) ఆశ్వాసకరమైనమాటను, నినైతొఱుమ్ - తలంచినప్పుడంత, ఆవి వేమ్ - నాయాత్మ దగ్ధమగుచున్నది. పగల్ - దినమందు, నిరై మేయ్‌క్కియ - ఆవులను మేఁపుటకై, పోయ - పోయిన, కణ్ణా - ఓ శ్రీకృష్ణుఁడా! పిణి - మొగ్గలు, అవిఴ్ - వికసించుచున్న, మల్లిగై - మల్లీపుష్పమును స్పృశించివచ్చిన, వాడై - ఉత్తరపుగాలి, తూవ - వినుచుండగా, పెరుమదమ్ - గొప్పమదముగల, మాలైయుమ్ - సాయంకాలమును, వన్దిన్ఱు - వచ్చినది. మణి - కౌస్తుభము, మిగు - శోభిల్లుచున్న, మార్వినిల్ - వక్షస్థలమందున్న, ముల్లైప్పోదు - ముల్లపుష్పము, ఎన్‌వనములై - నాయొక్క సుందర స్తనమును, కమఴ్విత్తు - పరిమళింపఁజేసి, ఉన్‌వాయముదమ్ - నీయొక్క వాగమృతమును, తన్దు - ఇచ్చి, అణిమిగు - అలఙ్కారముచే సున్దరమైన, తామరై - పద్మమువంటి, కైయై - శ్రీహస్తమును, అడిచ్చియోమ్‌తలైమిశై - దాసులమైన మా శిరస్సుమీఁద, నీఅణియాయ్ - నీవు ఉంచవలెను. అన్దో - అయ్యో!

తా॥ ఓ శ్రీకృష్ణుఁడా! నీవు ఆవులను మేఁపుటకువెళ్ళితివి; నన్ను సంధ్యాకాలమున్ను ఉత్తరపుగాలియున్ను వచ్చి మిక్కిలి బాధించుచున్నవి. గాన, నీవు నన్ను కౌగలించుకొని నాశిరస్సుమీఁద నీశ్రీహస్తమునుంచి యాశ్వాసము చేయుమాయని. ౫.

అడిచ్చియోమ్‌తలైమిశైనీయణియా యాఴియఙ్కణ్ణాఉన్‌కోలప్పాదమ్*
పిడిత్తదునడువునక్కరైయరుమ్పల రదునిఱ్కవెమ్‌పెణ్మైయాఱ్ఱోమ్*
వడిత్తడఙ్కణ్ణిణై నీరుమ్‌నిల్లా మనముమ్‌నిల్లావెమక్కదుదన్నాలే*
వెడివుఙ్ఙ్‌పశునిరై మేయ్‌క్కప్పోక్కు వేమెమదుయిరఴల్ మెఴుగిలుక్కే. ౬.

అ॥ ఆఴి - సముద్రమువలెగంభీరమై, అమ్ - సుందరమైన, కణ్ణా - నేత్రములుగల ఓ శ్రీకృష్ణుఁడా! అడిచ్చియోమ్ - దాసులమైనమాయొక్క, తలైమిశై - శిరస్సుమీఁద, నీ - నీవు, అణియాయ్ - (శ్రీహస్తమును) ఉంచవలెను. నడువు - మధ్యమార్గంబున, ఉన్ - నీయొక్క, కోలమ్ - సుందరమైన, పాదమ్ - తిరువడికళ్ళను, పిడిత్తదు - పట్టుకొనుటకై, అరివైయరుమ్ - యౌవనములుగలస్త్రీలు, ఉనక్కు - నీకు, పలర్ - అనేకులున్నారు. అదునిఱ్క - అదియుండగా, ఎమ్‌పెణ్మై - మాస్త్రీత్వమును (ధరించి), ఆఱ్ఱోమ్ - సహించియుండలేము. వడి - తీక్ష్ణమై, తడమ్ - విశాలమైన, కణ్ణిణై - రెండునేత్రములయందు, నీరుమ్ - నీళ్ళును, నిల్లా - అడ్డులేక ప్రవహించుచున్నవి. మనముమ్ - మనస్సును, నిల్లా - స్థిరముగానుండలేదు. అదుతన్నాలే -

గనుక, నిన్ - నీయొక్క, పశునిరై - గోసమూహములను, మేయ్క్క - మేపుటకై, పోక్కు - పోవుట, ఎమక్కు - మాకు, వెడివ్వు - విశాలము గానున్నది. ఎనదుయిర్ - మాయాత్మ, అழల్ - నిప్పువద్దనున్న, మెழுగిల్ - మైనమువలె, ఉక్కు - కరిగి, వేమ్ - దగ్ధమగుచున్నది.

తా॥ ఓ శ్రీకృష్ణుండా! నీవెచ్చటికి వెళ్ళినను నీకువలసిన గోపికలనేకులున్నారు గాన నీకే మియు తక్కువలేదు. మేము నిన్ను విడిచియుండలేము. నీయొక్క విశ్లేషము మాసకష్టమై యున్నదని. ౬.

వేమెమదుయిరழల్ మెழுగిలుక్కు వెళ్వళై మేగలై కழన్ఱువీழ*
తూమలర్ క్కణ్ణిణై ముత్తమ్ శోర తుణై ములై పయన్దెనతోళ్ గళ్ వాడ*
మామణివణ్ణా వుఙ్గళ్ శెఙ్గమలవణ్ణ మెన్ మలరడినోవనీపోయ్*
ఆమగిழ்న్దుగన్దవై మేయ్ క్కిన్ఱున్నోడు అశురర్ గళ్ తలై ప్పెయ్యిలెవఙ్గొలాఙ్గే.

అ॥ వెళ్ వళై - తెల్లకంకణములును, మేగలై - మొలనూలును, కழన్ఱువీழ - జారిపడు నట్లును, తూ - స్వచ్ఛమైన, మలర్ - తామరపుష్పమువంటి, కణ్ణిణై - రెండు నేత్రములయందు, ముత్తమ్ - బాష్పబిందువులు, శోర - ప్రవహించునట్లును, తుణై ములై - చేరియున్న స్తనములు, పయన్దు - వివర్ణములై, ఎనతోళ్ గళ్ - నాభుజములు, వాడ - వాడిపోవునట్లును, మామణి - నీలరత్నమువంటి, వణ్ణా - కాన్తిగలవాడా! శెమ్ కమలమ్-ఎఱ్ఱతామరసపుష్పమువలె, వణ్ణమ్-సుందరమై, మెన్ మలర్ - మృదువైనపుష్పమువలె సుకుమారమైన, ఉన్ అడి - నీ శ్రీపాదము, నోవ - నొచ్చునట్లు, నీపోయ్ - నీవువెళ్ళి, ఆ - ఆవులను, మగిழ்న్దు - ఆశపడి, ఉగన్దు - ఆద రించి, అవై మేయ్ క్కిన్ఱు - ఆయావులను మేపుచున్నసమయమందు, ఉన్నోడు - నీతోఁగూడ, అశురర్ గళ్ - అసురులు, తలై ప్పెయ్యిల్ - యుద్ధమునకు తటస్థించినయెడల, ఎవఙ్గొల్ - ఏమ గునో (అని), ఎనదుయిర్ - మాయాత్మ, అழల్ మెழுగిల్ - అగ్నిసమీపమందున్న మైనము వలె, ఉక్కు - కరిగి, వేమ్ - దగ్ధమగుచున్నది.

తా॥ మేమిట్టియవస్థలోనున్నప్పుడు నీవావులను మేపుటకువెళ్ళగా వచ్చటనీతోఁగూడ రాక్షసులు యుద్ధమునకువచ్చినయెడల యేమియుపద్రవము కలుగునోయని మేము మిక్కిలి భయ పడుచున్నామని. ౭.

అశురర్ గళ్ తలై ప్పెయ్యిలెవఙ్గొలాఙ్గెన్ఱాழுమెన్నారుయిరాఙ్ పిన్ పోగేల్*
కశిగై యుమ్ వెక్కై యుముళ్ కలన్దు కలవియుమ్ నలియుమెన్ కై కழிయేల్*
వశి శెయ్యుఙ్ తామరై క్కణ్ణుమ్ వాయుమ్ కై గళుమ్ పీదగవుడై యుమ్ కాట్టి*
ఒశి శెయ్ నుణ్ణిడై యిళవాయ్ చ్చియర్ నీయుగక్కు నల్లవరొడుముழிతరాయే. ౮.

అ॥ అశురర్ గళ్ - అసురులు, తలై ప్పెయ్యిల్ - యుద్ధమునకుతటస్థించినయెడల, ఎవ ఙ్గొలాఙ్గెన్ఱు - ఏమగునోయని, ఎన్నారుయిర్ - నాయాత్మ, అழுమ్ - మగ్నమై క్లేశించు చున్నది. (గనుక), ఆన్ పిన్ పోగేల్ - (నీవు) గోవులవెనుక వెళ్ళవలదు. కశిగైయుమ్ -(నీయందు) స్నేహమును, వెక్కైయుమ్ - అభినివేశమును, కలవియుమ్ - (నీ) సంశ్లేషమును, ఉళ్ కలన్దు - లోపల ప్రవేశించి, నలియుమ్ - బాధించుచున్నవి. (గాన) ఎన్ కై కழிయేల్ - నన్నువదలివెళ్ళ

వలదు. వళిశెయ్ - వశీకరించుచున్న, తామరై - పద్మమువంటి, ఉన్ కణ్ణుమ్ - నీనేత్రమునున్న, వాయుమ్ - అధరమునున్న, కైగళుమ్ - శ్రీహస్తములనున్న, పీదగవుడైయుమ్ - పీతామ్బరమునున్న, కాట్టి - చూపించి, ఒళిశెయ్ - కైతిల్యముగలవారై, నుణ్ - సూక్ష్మమైన, ఇడై - నడుముగల, ఇళవాయ్చ్చియర్ - యౌవనముగల గోపికలైన, నీ ఉగక్కుమ్-నీవాశపడుచున్న, నల్లవరోడుమ్ - విలక్షణులైనస్త్రీలతోఁగూడ, ఉళితరాయ్ - సఞ్చరించుమా.

తా॥ ఓశ్రీకృష్ణుఁడా! నీవు వెళ్ళినయెడల నిన్నసురులేమి చేయుదురోయని భయపడుచున్నాను. నీవచ్చటికివెళ్ళి గోపికలతో విహరింప యిచ్ఛించినయెడల వారితోఁగూడ మాయుందఱనే విహరించుమాయని. ౮.

ఉగక్కునల్లవరోడుముళితన్దున్ఱన్ తిరువుళ్ళమిడర్కెడున్దోఱుమ్*నాఙ్గళ్
వియక్కవిన్బుఱుదుమెమ్బెణ్మైయాఱ్ఱోమెమ్బెరుమాన్పశుమేయ్క్కప్పోగేల్
మిగప్పలవశురర్గళ్వేణ్డురువఙ్కొణ్డు నిన్ఱుళితరువర్కఞ్జనేవ*
అగప్పడిలవరోడుమ్నిన్నోడాఙ్గే యవత్తఙ్గళ్విళైయుమెన్శొఱ్కొళన్దో. ౯.

అ॥ ఉగక్కుమ్ - నీవాశించుచున్న, నల్లవరోడుమ్ - విలక్షణులైనస్త్రీలతోఁగూడ, ఉళితన్దు - సంచరించి, ఉన్ఱన్ - నీయొక్క, తిరువుళ్ళమ్ - హృదయమందున్న, ఇడర్-(అభిమతాలాభముచేఁగలిగిన) వ్యసనము, కెడున్దోఱుమ్ - నశించునప్పుడంత, నాఙ్గళ్ - మేము, వియక్క - మిక్కిలి, ఇన్బుఱుదుమ్-సన్తోషించెదము. ఎమ్బెణ్మై - (నీసన్తోషమునకు విరోధియైన) మాస్త్రీత్వమును, ఆఱ్ఱోమ్-సహించలేము. ఎమ్బెరుమాన్ - ఓస్వామీ! పశుమేయ్క్క - ఆవులను మేపుటకు, పోగేల్-పోవవలదు. పలఅశురర్ - అనేకరాక్షసులు, కఞ్జనేవ-కంసునిచే ప్రేరేపింపఁబడినవారై, వేణ్డు - ఇష్టమైన, ఉరువమ్ - రూపములను, కొణ్డు - పరిగ్రహించి, మిగ - మిక్కిలి, నిన్ఱుళితరువర్ - నీముందఱనుండి సంచరించెదరు. అగప్పడిల్ - (వారిచేతికి) దొఱుకుకొనినయెడల, అవరోడుమ్ - వారితోడను, నిన్నోడు - నీతోడను, అఙ్గే - అచ్చట, అవత్తఙ్గళ్ - కపటయుద్ధములు. విళైయుమ్ - కలుగును. ఎన్శొల్ - నామాటను, కొళ్ - పరిగ్రహింపుము, అన్దో - అయ్యో!

తా॥ ఓస్వామీ! మేము సుఖించడమునకంటె గోపికలతోఁగూడ విహరించి నీవు సుఖించడమే మాకు సన్తోషకరముగానుండునుగాన నీవు రాక్షసభూయిష్ఠమైన దేశమందువెళ్ళకుండ మాయుందఱనే వారితోఁగూడ విహరింపుమాయని. ౯.

అవత్తఙ్గళ్విళైయుమెన్శొఱ్కొళన్దో అశురర్గళ్ వఙ్కైయర్కఞ్జనేవ*
తవత్తవర్మఱుగనిన్ఱుళితరువర్ తనిమైయుమ్పెరిదునక్కిరామనై యుమ్*
ఉవర్త్తలై యుదఙ్తిరిగిలై యు మెన్ఱెన్ఱూడుఱవెన్నుడైయావివేమాల్*
తివత్తిలుమ్పశునిరై మేయ్ప్పువత్తి శెఙ్గనివాయెఙ్గళాయర్తేవే. ౧౦.

అ॥ శెమ్ - ఎఱ్ఱనై, కని - స్నిగ్ధమైయున్న, వాయ్ - అధరముగల, ఎఙ్గళ్ ఆయర్ తేవు - మాగోపలకు స్వామియైనవాఁడా! వఙ్కైయర్ - బలిష్ఠములైనచేతులుగల, అశురర్ -

అసురులను, కఞ్జన్ - కంసుఁడు, ఏవ - ప్రేరేపింప, తవత్తవర్ - తపోనిష్ఠులైన ఋషులు, మఱుగనిన్ఱు - మనోవ్యాకులముగలవారైయుండి, ఉఴితరువర్ - సంచరించెదరు. ఉనక్కు - నీకు, తనిమైయుమ్ - ఒంటరిగాపోవడము, పెరిదు - అధికముగానున్నది. ఇరామనైయుమ్ - బలరామునిగూడ, ఉవర్త్తలై - (సహాయముగాకొంచి) మనస్సుకలిసియుండనివాఁడనై, ఉడన్ తిరిగిలైయుమ్ - (వారితోఁగూడ) సంచరించకనున్నావు. అవత్తజ్గళ్ - కపటయుద్ధములు, విళైయుమ్ - సంభవించును, ఎన్ఱెన్ఱు - అనితలంచి, ఎన్నుడైయావి - నాయాత్మ, ఊడుఱు - లోపల తగులుసట్లు, వేమ్ - దగ్ధమగుచున్నది. అన్ధో - అయ్యో! ఎన్శొల్ - నామాటను, కొళ్ - వినుము. తివత్తిలుమ్ - పరమపదవాసమునకంటె, పశునిరై మేయ్ప్పు-గోసమూహమును రక్షించడమును, ఉవత్తి - సంతోషించితివి.

తా॥ బలిష్ఠులైన రాక్షసులు కంసునిచేఁబంపఁబడినవారై సంచరించుచున్న వనమందు బలరాముఁడుగూడ లేక ఒంటరిగాసంచరించుచున్న నిన్ను దలంచినామనస్సు మిక్కిలి భయపడుచున్నదని. ౧౦.

‡‡ శెజ్గనివాయెజ్గళాయర్ తేవత్తిరువడితిరువడిమేల్ * పొరునల్
శజ్గణితుఱైవన్ వణ్ తెన్ కురుగూర్ వణ్ శడగోపన్ శొల్లాయిరత్తుళ్ *
మజ్గైయరాయ్చ్చియరాయ్న్దమాలై యవనోడుమ్పిరివదర్కిరజ్గి * తైయల్
అజ్గవన్ పశునిరై మేయ్ప్పొఴిప్పానురైత్తన ఇవైయుమ్పత్తవన్ శీర్ కార్వే.

అ॥ శెమ్కని - ఎఱ్ఱపండువలెనున్న, వాయ్-అధరముగల, ఎజ్గళాయర్ తేవు-మాగోపలకు దేవతయైన, అవనోడు - ఆశ్రీకృష్ణునితో, పిరివదఱ్కు - విశ్లేషించుటకు, ఇరజ్గి - భయపడి, మజ్గైయర్ - యువతులైన, ఆయ్చ్చియర్ - గోపికలు, ఆయ్న్ద - పరిశీలించిచెప్పిన, మాలై - పాశురములను, అజ్గు - అచ్చట, అవన్ - ఆశ్రీకృష్ణునియొక్క, పశునిరై మేయ్ప్పు - గోసమూహములను మేపుటకై వెళ్ళుడమును, ఒఴిప్పాన్ - అడ్డగించుటకై, తైయల్ - (ఒక) గోపిక, ఉరైత్తన - చెప్పినసూక్తిని, అత్తిరువడి - ఆశ్రీకృష్ణస్వామియొక్క, తిరువడిమేల్ - శ్రీపాదముల విషయముపై, పొరునల్-తామ్రపర్ణీనదియొక్క, శజ్గుఅణి-శంఖములచే నలంకరింపఁబడిన, తుఱైవన్ - తీరమందు వేంచేసియున్నవారును, వణ్ - సమృద్ధమై, తెన్ - సుందరమైన, కురుగూర్ - కురుకాపురికిస్వామియు, వణ్ - ఉదారులునైన, శడగోపన్-నమ్మాఴ్వార్లు, శొల్-పాడించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇవైయుమ్పత్తు - ఈపదిపాశురములును, అవన్ శీర్ - (వెనుకపాడించిన) ఆతిరువాయ్మొఴిలతోఁగూడ, కార్వ్వ - ఒప్పగును (అన్ని తిరువాయ్మొఴిలయొక్క ఫలమును ఈయొక్క తిరువాయ్మొఴియేయిచ్చును).

తా॥ ఆవులనుమేపుటకు వెళ్ళవలదని గోపికలుచెప్పిన మాటలను గుంపులో వాఁడు వినసందున యామాటలను ఏకాన్తమందొకగోపిక చెప్పినపాశురములను సర్వేశ్వరునివిషయమై నమ్మాఴ్వార్లు పాడించిన యీపదిపాశురములే సమస్త తిరువాయ్మొఴిలయొక్కఫలమునునిచ్చునని.

ఆఴ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్



## ౪ - వ, తిరువాయ్మొఴి.

అవతారిక:— ఈతిరువాయ్మొఴిలో, "వీడుమిన్ - పత్తుడై" అనెడి తిరువాయ్మొఴులలో సాధించినభక్తి ఫలోన్ముఖమయినదని సాధించి, "ఉయర్వఱ" అనెడి తిరువాయ్మొఴిలో తమకుపాయముగా సాధించిన ప్రపత్తిస్వరూపమును సాధించుచున్నారు.

‡‡ శార్వతవనెఱిక్కు త్తామోదరన్ తాళ్గళ్*
కార్మేగవణ్ణన్ కమలనయనత్తన్*
నీర్వానమ్మణ్ణెరికాలాయ్ నిన్ఱ నేమియాన్*
పేర్వానవర్గళ్ పిదత్తుమ్ పెరుమైయనే. ౧.

అ॥ కార్మేగమ్ - కాళమేఘమువంటి, వణ్ణన్ - కాన్తిగలవాఁడును, కమలనయనత్తన్ - పద్మమువంటి నేత్రములుగలవాఁడును, నీర్ - జలమునకును, వానమ్ - ఆకాశమునకును, మణ్ - భూమికిని, ఎరి - అగ్నికిని, కాల్ - వాయువునకును, ఆయ్నిన్ఱ - అంతరాత్మయై యున్నవాఁడును, నేమియాన్ - సుదర్శనముగలవాఁడును, పేర్ - గొప్పవారైన, వానవర్గళ్ - నిత్యసూరులు, పిదత్తుమ్ - స్తోత్రముచేయుచున్న, పెరుమైయన్ - మహిమగలవాఁడునునైన, తామోదరన్ - దామోదరునియొక్క, తాళ్గళ్ - శ్రీపాదములు, తవనెఱిక్కు - భక్తిమార్గమునకు, శార్వు - ప్రాప్యముగానుండును.

తా॥ ఉభయవిభూతియుక్తుఁడై యాశ్రితసులభుఁడైన శ్రియఃపతియొక్క శ్రీపాదములే భక్తియోగలభ్యములని. ౧.

పెరుమైయనే వానత్తిమైయోర్క్కుమ్* కాణ్డ
ఱ్కరుమైయనే యాగత్తణైయాదార్క్కు* ఎన్ఱుమ్
తిరుమెయ్యుఱైగిన్ఱ శెఙ్గణ్మాల్* నాళుమ్
ఇరుమైవినై కడిన్దిఙ్గెన్నై యాళ్గిన్ఱానే. ౨.

అ॥ వానత్తు - ఊర్ధ్వలోకమందున్న, ఇమైయోర్క్కుమ్ - దేవతలకును, పెరుమైయన్ - గొప్పవాఁడును, ఆగత్తు - హృదయమందు, అణైయాదార్క్కు - ఉంచుకొననివారికి, కాణ్డఱ్కు - చూచుటకు, అరుమైయన్ - దుర్లభుఁడును, ఎన్ఱుమ్ - సర్వకాలమందును, తిరు - శ్రీదేవి, మెయ్ - తిరుమేనునయందు, ఉఱైగిన్ఱ - నిత్యవాసముచేయుచున్నవాఁడును, శెమ్కణ్ - ఎఱ్ఱనినేత్రములుగలవాఁడునైన, మాల్ - సర్వేశ్వరుఁడు, ఇరుమైవినై - (పుణ్యపాపములనెడి) రెండుకర్మములను, కడిన్దు - పోఁగొట్టి, ఎన్నై - నన్ను, ఆళ్గిన్ఱాన్ - పరిపాలించుచున్నాఁడు.

తా॥ సర్వేశ్వరుఁడై శ్రియఃపతియైయున్న గొప్పవాఁడే తనసౌలభ్యముచే నావిరోధులను పోఁగొట్టి నన్నిహలోకమందే పరిపాలించుచున్నాఁడని. ౨.

ఆళ్గిన్ఱానాఴియా నారాల్కుఱ్ఱైప్పుడైయమ్*
మాళ్గిన్ఱదిల్లై ప్పిఱవిత్తుయర్ కడిన్దోమ్*

వాళ్ కణ్డైయొణ్ కణ్ మడప్పిన్నైదన్ కేళ్వన్*
తాళ్ కణ్డుకొణ్డెన్ తలై మేల్ పునైన్దేనే. - ౩.

అ॥ ఆఴియాన్ - చక్రధరుఁడైన సర్వేశ్వరుఁడు, అళ్ గిన్షాన్ - (నన్ను) పరిపాలించుచున్నాడు. పిఱవిత్తుయర్ - సంసారదుఃఖమును, కడిన్దోమ్ - పోఁగొట్టితిమి. మీళ్ గిన్షదిల్లై - (ఆదుఃఖము) మఱియు తిరగదు. ఆరాల్ - ఎవరిచేత, కుఱైవుడైయమ్ - కొఱతగలవారము? (ఒకకొఱతయుగలవారముకాము). వాళ్ - తేజస్సు గల, కణ్డై - మత్స్యమువలె, ఒణ్ - సుందరమైన, కణ్ - నేత్రముగలదైన, మడమ్ - ఆత్మగుణములుగలదైన, పిన్నైతన్ - నప్పిన్న పిరాట్టికి, కేళ్వన్ - వల్లభుఁడైన శ్రియఃపతియొక్క, తాళ్ - శ్రీపాదములను, కణ్డుకొణ్డు - సేవించి, ఎన్ తలై మేల్ - నాశిరస్సుమీఁద, పునైన్దేన్ - ధరించితిని.

తా॥ నాసంసారమును మఱలకుండ పోఁగొట్టి, నప్పిన్నపిరాట్టికి వల్లభుఁడైన సర్వేశ్వరుని యొక్క శ్రీపాదములను నాశిరోభూషణముగాధరించితినని. ౩

తలై మేల్ పునైన్దేన్ శరణఙ్గళ్* ఆలిన్
ఇలై మేల్ తుయిన్ద ఎమ్మిఱైయోర్ వణఙ్గ*
మలై మేల్ తాన్ నిన్ఱు ఎన్ మనత్తుళ్ ఇరున్దానై*
నిలై పేర్క్కలాగామై నిచ్చిత్తిరున్దేనే. ౪.

అ॥ శరణఙ్గళ్ - (వాని) శ్రీపాదములను, తలై మేల్ - (నా) శిరస్సుమీఁద, పునైన్దేన్ - ధరించితిని. ఆలినిలై మేల్ - వటదళముమీఁద, తుయిన్దాన్ - నిద్రించువాఁడును, ఇమ్మైయోర్ - నిత్యసూరులు, వణఙ్గ - ఆశ్రయించునట్లు, మలై మేల్ - వేంకటాచలముమీద, తాన్ - తాను, నిన్ఱు - వేంచేసియుండి, ఎన్ మనత్తుళ్ - నాహృదయమందు, ఇరున్దానై - నిత్యవాసముజేయుచున్నవాఁడునైన శ్రియఃపతియొక్క, నిలై - (నాహృదయమందున్న) స్థైర్యమును, పేర్క్కలా గామై - చలింపకుండనున్నదానిని, నిచ్చిత్తు-నిశ్చయించి, ఇరున్దేన్-కృతకృత్యుఁడనైయుంటిని.

తా॥ సర్వేశ్వరుఁడు ఎవ్వరిచేతను చలింపఁబడనివాఁడై నాహృదయమునఁదు స్థిరముగానున్నాడని నిశ్చయించి కృతార్థుఁడనైతినని. ౪.

నిచ్చిత్తిరున్దేన్ ఎన్నెఞ్జమ్ కళియామై*
కైచ్చక్కరత్తణ్ణల్ కళ్వమ్ పెరిదుడైయన్*
మెచ్చప్పడాన్ పిఱర్క్కు మెయ్ పోలుమ్ పొయ్ వల్లన్*
నచ్చప్పడుమ్ నమక్కు నాగత్తణైయానే. ౫.

అ॥ ఎన్ నెఞ్జమ్ - నామనస్సును, కళియామై - విశ్లేషించని స్వభావమును, నిచ్చిత్తిరున్దేన్ - (సర్వేశ్వరునికి) నిశ్చయించితిని. శక్కరమ్ - సుదర్శనమును, కై - శ్రీహస్తమందుగల, అణ్ణల్ - స్వామియు, కళ్వమ్ పెరిదుడైయన్-గొప్పవంచనస్వభావము గలవాఁడును, పిఱర్క్కు - అనాశ్రితులకు, మెచ్చప్పడాన్ - స్తోత్రముచేయబడని వాఁడును, మెయ్ పోలుమ్ -

(అభక్తులకు) సత్యముజేయువానివలెనుండి, పొయ్వల్లన్ - అసత్యముజేయువాఁడును, నాగత్తణై యాన్ - ఆదిశేషుని పడగ గాగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, నమక్కు - మనకు, నచ్చప్పడుమ్ - ఆశపడదగినవాఁడగును.

తా॥ సర్వేశ్వరుఁడు నాహృదయమందు స్థిరముగానుండి నాకుఁజేయఁదలంచిన యుపకారము మఱియెవ్వరికిని దెలిసికొన శక్యముకాదని. ౫.

నాగత్తణైయానై నాడోఱుమ్ఞానత్తాల్ *
అగత్తణైప్పార్క్కరుళ్ శెయ్యుమమ్మానై *
మాగత్తిళమదియమ్ శేరుమ్శడైయానై *
పాగత్తువైత్తాన్ఱన పాదమ్పణిన్దేనే. ౬.

అ॥ నాగమ్ - ఆదిశేషుని, అణైయానై - పడకగాగలవాఁడును, నాళ్తోఱుమ్ - ప్రతిదినమును, ఞానత్తాల్ - భక్తిచేత, అగత్తు - హృదయమందు, అణైప్పార్క్కు - ఉంచుకొనువారికి, అరుళ్ శెయ్యుమ్ - కృపజేయుచున్న, అమ్మానై - స్వామియు, మాగత్తు - గొప్పఆకాశముందున్న, ఇళమదియమ్ - బాలచంద్రుఁడు, శేరుమ్ - చేరియున్న, శడైయానై - జటగలరుద్రుని, పాగత్తు - (తనతిరుమేనుయందు) ఒకభాగమందు, వైత్తాన్తన్ - ఉంచుకొనినవాఁడునైన సర్వేశ్వరునియొక్క, పాదమ్ - శ్రీపాదములను, పణిన్దేన్ - ఆశ్రయించితిని.

తా॥ ప్రయోజనాన్తరపరులనుగూడ ననన్యప్రయోజనులనువలె తనతిరుమేనుయందుంచుకొని రక్షించువాఁడును భక్తానుగ్రహతత్పరుఁడునైన శేషశాయిని యాశ్రయించితినని. ౬.

పణిన్నెఞ్జేనాళుమ్ పరమపరమ్బరనై *
పిణియొన్ఱుమ్శారా పిఱవికెడుత్తాళుమ్ *
మణినిన్ఱశోది మదుశూదనెన్నమ్మాన్ *
అణినిన్ఱశెమ్పొన్ నడలాழிయానే. ౭.

అ॥ మణినిన్ఱశోది - నీలరత్నమువంటి కాన్తిగలవాఁడును, మదుశూదన్ - మధువనాడి రాక్షసుని జంపినవాఁడును, ఎన్నమ్మాన్ - నాస్వామియు, అణినిన్ఱ - అలఙ్కారముగానున్నదై, శెమ్పొన్ - పచ్చనిస్వర్ణమువలె స్పృహణీయమై, అడల్ - యుద్ధోన్ముఖమైన, ఆழிయాన్ - సుదర్శనమునుగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, పిఱవి - సంసారమును, కెడుత్తు - నశింపఁజేసి, ఆళుమ్ - (నన్ను) పరిపాలించును. పిణియొన్ఱుమ్ - సంసారదుఃఖమొకటియు, శారా - చేరవు; నెఞ్జే - ఓమనసా! పరమపరమ్బరనై - సర్వోత్కృష్టుఁడైన సర్వేశ్వరుని, నాళుమ్ - ప్రతిదినమును, పణి - ఆశ్రయింపుము.

తా॥ ఓమనసా! మనవిరోధులను బోఁగొట్టి దాస్యమునిచుకొనిన సర్వేశ్వరుని ప్రతిదినము నాశ్రయించి యుజ్జీవింపుమాయని. ౭.

ఆழிయానాழி యమరర్క్కుమప్పాలాన్ *
ఊழிయానూழிపడైత్తాన్ నిరైమేయ్త్తాన్ *

వాழியన్దోళాల్ వరై యెడుత్తాన్ పాదజ్గళ్*
వాழியెన్నెఞ్జే, మఱవాదువాழ் కణ్డాయ్. ౮.

అ॥ ఆழియాన్ - సుదర్శనముగలవాఁడును, ఆழி - గంభీరస్వభావముగల, అమరర్క్కుమ్ - నిత్యసూరులకును, అప్పాలాన్ - మేలైనమహిమగలవాఁడును, ఊழியాన్ - ప్రళయకాలమందుగూడ నుండువాఁడును, ఊழிపడైత్తాన్ - కాలము మొదలగు సకలపదార్థములనుసృజించువాఁడును, నిరై మేయ్త్తాన్ - గోసమూహములను మేపినవాఁడును, పాழி - బలముగల, అమ్ - సుందరమైన, తోళాల్ - భుజముచేత, వరై - గోవర్ధనగిరిని, ఎడుత్తాన్ - ఎత్తినవాఁడునైనసర్వేశ్వరునియొక్క, పాదజ్గళ్ - తిరువడికళ్ళను, ఎన్ నెఞ్జే - ఓనామనసా ! మఱవాదు - మఱువకుఁడ, వాழ் కణ్డాయ్-నిత్యానుభవము జేయుము. వాழி-ఈయనుభవము నిత్యముగానుండు గాక.

తా॥ ఓమనసా ! సకలచేతనాచేతనములను సృజించి వానియాపత్తులనుబోఁగొట్టి రక్షించువాఁడైన సర్వేశ్వరుని శ్రీపాదములను మఱువకుండ నాశ్రయించి యుజ్జీవింపుమాయని. ౮.

కణ్డేన్ కమలమలర్ప్పాదమ్ కాణ్డలుమే*
విణ్డేయొழிన్ద వినైయాయిన వెల్లామ్*
తొణ్డేశెయ్ దెన్ఱుమ్ తొழுదు వழிయొழுగ*
పణ్డేపరమన్ పణిత్త పణివగైయే. ౯.

అ॥ తొణ్డేశెయ్దు - (తనవిషయమై) భక్తిజేసి, ఎన్ఱుమ్ - ఎల్లప్పుఁడును, తొழுదు - ఆశ్రయించి, వழிయొழுగ - ఆదేమార్గముగానడుచునట్లు, పణ్డే - ముందుగానే, పరమన్ - సర్వేశ్వరుఁడు, పణిత్త - పాదించిన, పణివగైయే - చరమశ్లోకార్థప్రకారముగా, కమలమలర్ - తామరసపుష్పమువంటి, పాదమ్ - తిరువడికళ్ళను, కణ్డేన్ - సేవించితిని. కాణ్డలుమే - చూచినప్పుడే, వినైయాయినవెల్లామ్ - సకలదుఃఖములును, విణ్డేయొழிన్ద - విడిచిపోయినవి.

తా॥ తనయందు భక్తిచేసి తననాశ్రయించి యుజ్జీవించునట్లు ముందు తానేకృపజేసిన చరమశ్లోకార్థప్రకారముగా వానియనుగ్రహముచేత వానిశ్రీపాదములను సేవించి సకలపాపములను బోఁగొట్టుకొంటిమని. ౯.

వగైయాల్ మనమొన్ఱి మాదవనై *నాళుమ్
పుగైయాల్ విళక్కాల్ పుదుమలరాల్ నీరాల్*
తిశైదోఱుమమరర్గళ్ శెన్ఱిఱైఞ్జనిన్ఱ*
తగైయాన్ శరణమ్ తమర్గట్కోర్పఱ్ఱే. ౧౦

అ॥ వగైయాల్ - శాస్త్రోక్తప్రకారముగా, మనమ్ - మనస్సును, ఒన్ఱి - ఏకాగ్రముగాఁజేసి, మాదవనై - శ్రియఃపతియైనతనను, నాళుమ్ - ప్రతిదినమును, పుదు - నవీనమైన, పుగైయాల్ - ధూపముచేతను, విళక్కాల్ - దీపముచేతను, మలరాల్ - పుష్పముచేతను, నీరాల్ - తీర్థముచేతను, తిశైతోఱుమ్ - ప్రతిదిక్కులయందును, అమరర్గళ్ - దేవతలు, శెన్ఱు - సమీపించి, ఇఱైఞ్జ-ఆశ్రయించునట్లు, నిన్ఱ - సేంచేసియున్న, తగైయాన్-స్వభావముగలశ్రియఃపతియొక్క, శరణమ్ - శ్రీపాదము, తమర్గట్కు - భక్తులకు, ఓర్ - అద్వితీయమైన, పఱ్ఱు - ప్రాప్యము.

తా॥ ప్రయోజనాన్తరపరులకును సాధనాన్తరపరులకును ప్రపన్నులకును శ్రియఃపతియే పరమప్రాప్యమని. ౧౦.

పర్ఱెన్ఱుపర్ఱి ప్పరమపరమ్పరనై *
మల్ తిణ్ణోళ్ మాలై వழுదివళనాడన్ *
శొల్ తొడై యన్దాది యోరాయిరత్తుళిప్పత్తుమ్ *
కల్ పార్కు ఓర్పర్ఱాగుమ్ కణ్ణన్ కழலిణైయే. ౧౧.

అ॥ పరమపరమ్పరనై - పరాత్పరుఁడును, మల్ - మల్లయుద్ధమందు, తిణ్ - బలిష్ఠమైన, తోళ్ - భుజములుగలవాఁడునైన, మాలై - సర్వేశ్వరుని, పర్ఱెన్ఱు - ప్రాప్యమని, పర్ఱి - ఆశ్రయించి, వழுదివళనాడన్ - వழுదివళనాడ నెడిదేశమునకు స్వామియైననమ్మాழ்వార్లు, శొల్ - సాదించిన, తొడై - శబ్దసందర్భరూపమైన, అన్దాది - అన్తాదియైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, కల్ పార్కు - అభ్యసించినవారికి, కణ్ణన్ కழలిణై - శ్రీకృష్ణునియొక్క శ్రీపాదములు, ఓర్ పర్ఱాగుమ్ - అద్వితీయమైన ప్రాప్యముగా నుండును.

తా॥ సర్వేశ్వరుని ప్రాప్యప్రాపకములుగా నాశ్రయించిన నమ్మాழ்వార్లు ప్రసాదించిన ఈ పదిపాశురముల నభ్యసించువారికి శ్రీకృష్ణునియొక్క తిరువడిగళు అత్యన్తసులభముగానుండును.

ఆழ்వార్ తిరువడిగళే శరణమ్

జీయర్ తిరువడిగళే శరణమ్

## ౫ - వ, తిరువాయ్మొழி.

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, భక్తులకుచేయదగిన కృత్యమునుపదేశించుచున్నారు.

కణ్ణన్ కழலిణై * నణ్ణుమ్మనముడైయీర్ *
ఎణ్ణుమ్ తిరునామమ్ * తిణ్ణమ్ నారణమే. ౧.

అ॥ కణ్ణన్ - శ్రీకృష్ణునియొక్క, కழலిణై - శ్రీపాదద్వన్ద్వమును, నణ్ణుమ్ - పొందదగిన, మనముడైయీర్ - మనస్సుగల భక్తులారా! ఎణ్ణుమ్ -(మీరు) అనుసంధింపదగిన, తిరునామమ్ - తిరునామము, నారణమే - నారాయణ అనెడియదియే. తిణ్ణమ్ - నిశ్చయము.

తా॥ భగవద్భక్తు లనుసంధింపదగిన తిరునామము తిరుమన్త్రమేయని. ౧.

నారణనెమ్మాన్ * పారణఙ్గాళన్ *
వారణమ్ తొలైత్త * కారణన్ తానే. ౨.

అ॥ ఎమ్మాన్ - నాస్వామియును, పారణఙ్గాళన్ - భూదేవికి వల్లభుఁడును, వారణమ్ - కువలయాపీడమును, తొలైత్త - చంపినవాఁడును, కారణన్ తానే - జగత్కారణుఁడునైనవాఁడు, నారణన్ - శ్రీమన్నారాయణుఁడే.

తా॥ శ్రీమన్నారాయణుఁడే ఉభయవిభూతి యుక్తుఁడు, విరోధులను బోఁగొట్టువాఁడు సకలజగత్కారణుఁడని. ౨.

తానేయులగెల్లామ్*తానేపడైత్తిడన్దు*
తానేయుణ్ణుమిழన్దు*తానేయాళ్వానే. ౩.

అ॥ తానే - తానే, పడైత్తు - (లోకములను) సృజించి, ఇడన్దు - విడతీసి, తానే-తానే, ఉణ్డు - మ్రింగి, ఉమిழన్దు - క్రక్కి, తానే - తానే, ఆళ్వాన్ - పరిపాలించువాఁడు, తానే - తానే, ఉలగెల్లామ్ - లోకములను శరీరిగా నిర్వహించుచున్న శ్రీమన్నారాయణుఁడు.

తా॥ లోకమున కేవిధమైన యాపత్తును రాకుండరక్షించి నిర్వహించువాఁడును శ్రీమన్నారాయణుఁడేయని. ౩.

ఆళ్వానాழీనీర్*కోళ్వాయరవణై యాన్*
తాళ్వాయ్మలరిట్టు*నాళ్వాయ్నాడీరే. ౪.

అ॥ ఆழీనీర్ - మహాసముద్రజలమందు, కోళ్ - బలమునున్న, వాయ్-(స్తోత్రముచేయ దగిన) ముఖములనున్నగల, అరవు అణైయాన్ - ఆదిశేషునిమీద పవ్వళించినవాఁడై, ఆళ్వాన్ - (జగత్తును) పరిపాలించువానియొక్క, తాళ్ వాయ్ - తిరువడికళ్ళయందు, మలర్ - పుష్పములను, ఇట్టు - సమర్పించి, నాళ్ వాయ్ - ప్రతిదినమును, నాడీర్ - ఆశ్రయించుడి.

తా॥ ప్రళయార్ణవమందు శేషశాయియై పవ్వళించియుండి లోకములను రక్షించిన శ్రీమన్నారాయణునియొక్క శ్రీపాదములను పుష్పాదులచే పూజించి యాశ్రయించుడియని. ౪.

నాడీర్నాడోఱుమ్*వాడామలర్కొణ్డు*
పాడీరవన్నామమ్*వీడేపెఱలామే. ౫.

అ॥ నాడోఱుమ్ - ప్రతిదినమును, వాడామలర్కొణ్డు - వాడని పుష్పమును సంపాదించుకొని, నాడీర్ - (వానిని) ఆశ్రయించుడి. అవన్ - ఆ శ్రీమన్నారాయణునియొక్క, నామమ్- తిరునామములను, పాడీర్ - గానముచేయుఁడు. వీడు-మోక్షమును, పెఱలామ్ - పొందవచ్చును.

తా॥ వాని తిరునామముల ననుసంధించుచు పుష్పాదులచే వాని శ్రీపాదముల నర్చించి యాశ్రయించినయెడల మోక్షమును బొందవచ్చునని. ౫.

మేయాన్వేఙ్గడమ్*కాయామలర్వణ్ణన్*
పేయార్ములై యుణ్డ*వాయాన్మాదవనే. ౬.

అ॥ కాయామలర్ - కల్లుపుష్పమువంటి, వణ్ణన్ - కాన్తిగలవాఁడును, పేయార్ - పూతనయొక్క, ములై - స్తన్యమును, ఉణ్డ - ఆరగించిన, వాయాన్ - నోఱుగలవాఁడునైన, మాదవన్ - శ్రియఃపతి, వేఙ్గడమ్ - తిరుమలయందు, మేయాన్ - నిత్యవాసముచేయుచున్నాఁడు.

తా॥ శ్యామవిగ్రహుఁడైన శ్రియఃపతి మనమాశ్రయించుట కర్హుడై స్తనులభుఁడై వేంకటాద్రియందు వేంచేసియున్నాఁడని. ౬.

మాదవనెన్ఱెన్ఱు*ఓదవల్లీరేల్
తీదొన్ఱుమడైయా*ఏదమ్శారావే. ౭.

అ॥ మాదవన్ - (ఆనారాయణుఁడు) శ్రీదేవికి వల్లభుఁడు, ఎన్ఱెన్ఱు - అని నిరంతరముగా, ఓదవల్లీరేల్ - అనుసంధింపశక్తులైతిరేని, తీదొన్ఱుమ్ - ప్రాచీనపాపమొక్కటియు, అడైయా - చేరదు. (నశించును). ఏదమ్ - ఉత్తరపాపము, శారా - స్పృశించదు.

తా॥ ఓభక్తులారా ! మీరుద్వయానుసంధానము జేసినయెడల మీకు పూర్వోత్తరపాపము లన్నియు నశించునని. ౭.

శారావేదఙ్గళ్*నీరార్ముగిల్వణ్ణన్*
పేరారోదువార్* ఆరారమరరే. ౮.

అ॥ ఏదఙ్గళ్ - పాపములు, శారా - చేరవు. నీరార్ - జలముచేఁబూర్ణమైన, ముగిల్ - మేఘమువంటి, వణ్ణన్ - కాన్తిగల శ్రీయఃపతియొక్క, పేర్ - తిరునామములను, ఓదువార్ ఆర్ - అనుసంధించువారెవరో ? ఆరార్ - వారేజన్మమెత్తి యేవృత్తము నాచరించినప్పటికిన్ని, అమరర్ - నిత్యసూరులగుదురు.

తా॥ ఈమన్త్రము ననుసంధించువారేజాతియందు పుట్టినను ఏకృత్యముల నాచరించినను ఈమంత్ర ప్రభావముచే నిత్యసూరులగుదురని. ౮.

అమరర్కట్కరియానై*తమర్గట్కెళియానై*
అమరత్తొழువార్గట్కు*అమరావినైగళే. ౯.

అ॥ అమరర్కట్కు - బ్రహ్మాదులకు, అరియానై - పొందుటకశక్యుఁడును, తమర్గట్కు - భక్తులకు, ఎళియానై - సులభుఁడునైనవానిని, అమర - అనన్యప్రయోజనులై యమరియుండి, తొழువార్గట్కు - ఆశ్రయించువారికి వినైగళ్ - ప్రతిబంధకములు, అమరా - స్పృశించవు.

తా॥ ప్రయోజనాన్తరపరులకు దుర్లభుఁడైన శ్రియఃపతిని యనన్యప్రయోజనులు సులభముగా నాశ్రయింపవచ్చునని. ౯.

వినైవల్లిరుళెన్నుమ్*మునైగళ్వెరుவிప్పోమ్*
శునైనన్మలరిట్టు*నినైమిన్నెడియానే. ౧౦.

అ॥ వినై - కర్మములు, వల్ ఇరుళ్ - క్రూరమైన యజ్ఞానము, ఎన్నుమ్ - అని చెప్పఁబడు చున్న యివిమొదలైన వాసనాదులయొక్క, మునైగళ్ - సమూహములు, వెరువిప్పోమ్ - భయపడి నశించును. శునై - జలయందున్న, నన్మలర్ - మంచిపుష్పములను, ఇట్టు - సమర్పించి, నెడియాన్ - గొప్పఉపకారశీలుఁడైన శ్రియఃపతిని, నినైమిన్ - ధ్యానించుడి.

తా॥ కైఙ్కర్యప్రతిబంధకములైన యజ్ఞానాదులన్నియు నశించుటకై మంచిపుష్పాదులచే వానినే యర్చించి యాశ్రయించుడియని. ౧౦.

⁂ నెడియానరుళ్శూడుమ్*పడియానశడగోపన్*
నొడియాయిరత్తిప్పత్తు*అడియార్క్కరుళ్పేఱే. ౧౧.

అ॥ నెడియాన్ - సర్వేశ్వరునియొక్క, అరుళ్ - కృపను, శూడుమ్ - ధరించడమును, వడియాన్ - స్వభావముగాగల, శడగోపన్ - నమ్మాళ్వార్లయొక్క, నొడి - శ్రీసూక్తియైన, ఆయిరత్తు - వెయ్యిపాశురములలో, ఇప్పత్తు - ఈపదిపాశురములు, అడియార్కు - భక్తులకు, అరుళ్ - అనుగ్రహమనెడి, పేఱు - పురుషార్థమును (కలుగజేయును)

తా॥ ఈపదిపాశురముల ననుసంధించువారు నమ్మాళ్వార్లవలె భగవత్కృపా పాత్రులగుదురని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

జీయర్ తిరువడిగళే శరణమ్

## ౬ - వ, తిరువాయ్మొழி.

---

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, తమనియమనప్రకారము సర్వేశ్వరుఁడు తమను పరమపదమునకు దీసికొనిపోవుటకు త్వరపడుచున్నాడనియు, తాముపొందినఫలముయొక్క గౌరవమునున్ను తమమనస్సుతో సాదించుచున్నారు.

‡‡ అరుళ్ పెఱువారడియార్ద మ్మడియనేఱ్కు* ఆழிయాన్
అరుళ్ తరువానమైగిన్ఱా నదునమదువిదివగైయే*
ఇరుళ్ తరుమాஞాలత్తు ళినిప్పిఱవియాన్ వేణ్డేన్*
మరుళొழிనీమడనెఞ్జే వాట్టాఱ్ఱానడివణఙ్గే. ౧.

అ॥ అరుళ్ - (భగవత్) కృపను, పెఱువార్ - పొందదగిన, అడియార్తమ్ - భాగవతులకు, అడియనేఱ్కు - దాసుండనైననాకు, ఆழிయాన్ - చక్రధరుఁడు, అరుళ్ తరువాన్ - కృపజేయుటకై, అమైగిన్ఱాన్ - ఉద్యోగించుచున్నాడు. అదు - అదియు, నమదువిదివగైయే - మననియమనప్రకారమే చేయుచున్నాడు. ఇరుళ్ తరుమ్ - అజ్ఞానమునుగలుగజేయుచున్న, మా - గొప్ప, ஞాలత్తుళ్ - భూలోకమందు, ఇని - ఇఁకమీఁద, పిఱవి - జన్మమును, యాన్ - నేను, వేణ్డేన్ - అపేక్షించను. మడమ్ - పట్టుదలగల, నెఞ్జే - ఓమనసా! మరుళ్ - (తిరువాఱన్ విళనువిడిచి పరమపదమునకువెళ్ళనియెడి) అజ్ఞానమును, ఒழி - విడువుము. నీ - నీవు, వాట్టాఱ్ఱాన్ - తిరువాట్టాఱులో వేంచేసియున్నవానియొక్క, అడి - శ్రీపాదములను, వణఙ్గు - ఆశ్రయింపుము.

తా॥ ఓమనసా! సర్వేశ్వరుఁడు నామనోరథప్రకారముగానే నన్ను స్వీకరింప సిద్ధమయినాడు. ఇఁక నీయొక్క పట్టునువిడిచి ఈసంసారమందుతిరిగి జన్మించకుండ తిరువాట్టాఱులో వేంచేసియున్న వాని తిరువడికళు నాశ్రయింపుమని. ౧.

వాట్టాఱ్ఱానడివణఙ్గి మాஞాలప్పిఱప్పఱుప్పాన్*
కేట్టాయేమడనెఞ్జే కేశవనెమ్బెరుమానై*
పాట్టాయపలపాడి ప్పழவినైగళ్ పఱ్ఱఱుత్తు*
నాట్టారోడియల్వొழிన్దు నారణనై నణ్ణినమే. ౨.

అ॥ మాఞాలమ్ - గొప్పభూమియందు, పిఱప్పు - జన్మమును, అఱుప్పాన్ - పోఁగొట్టుటకై, వాట్టాఱ్ఱాన్ - తిరువాట్టాఱులో వేంచేసియున్నవానియొక్క, అడి - శ్రీపాదమును, వణఙ్గి - ఆశ్రయించి, కేశవన్ - కేశవుఁడనెడి, ఎమ్బెరుమానై - నాస్వామిని, పలపాట్టాయ - అనేకపాశురరూపములైన తిరువాయ్మొழிలచే, పాడి - స్తోత్రముజేసి, పఴ్ఙ్వినైగళ్ - అనాదికర్మములను, పఱ్ఱఱుత్తు - సవాసనముగాఁబోఁగొట్టి, నాట్టాగోడు - లౌకికులతో, ఇయల్వు - సహవాసమును, ఒழிన్దు - విడిచి, నారణనై - శ్రీమన్నారాయణుని, నణ్ణినమ్ - పొందితిమి. మడమ్ - విధేయమైన, నెఞ్జే - ఓమనసా! కేట్టాయే - ఈమాటలను వింటివా.

తా॥ ఓమనసా! తనయనుభవమునకు విరోధియైన మనసంసారమునున్ను ప్రాచీనపాపములనున్ను పామరులసహవాసమునున్ను బోఁగొట్టి తనను స్తోత్రముజేసి యాశ్రయించునట్లు వాఁడు మనయందుఁజేసిన ఉపకారమును దెలిసికొనుమాయని. ౨.

నణ్ణినమ్నారాయణనై నామఙ్గళ్ పలశొల్లి*
మణ్ణులగిల్ వళమ్మిక్క వాట్టాఱ్ఱాన్ వన్దిన్ఱు*
విణ్ణులగమ్ తరువానాయ్ విరైగిన్ఱాన్ విధివగైయే*
ఎణ్ణినవా ఱాగా విక్కరుమఙ్గళెన్నెఞ్జే. ౩.

అ॥ ఎన్ నెఞ్జే - ఓనామనసా! పలనామఙ్గళ్ - అనేకతిరునామములను, శొల్లి - చెప్పి, నారాయణనై - శ్రీమన్నారాయణుని, నణ్ణినమ్ - పొందితిమి. మణ్ణులగిల్ - భూలోకమందు, వళమ్మిక్క - గొప్పసంపత్తుగల, వాట్టాఱ్ఱాన్ - తిరువాట్టాఱులో వేంచేసియున్నవాఁడు, వన్దు - వచ్చి, ఇన్ఱు - ఇప్పుడు, విణ్ణులగమ్ - పరమపదమును, విధివగైయే - (మన) నియమనప్రకారముగా, తరువానాయ్ - ఇచ్చుటకై, విరైగిన్ఱాన్ - త్వరపడుచున్నాఁడు. ఇక్కరుమఙ్గళ్ - ఈకార్యములు, ఎణ్ణినవాఱాగా - తలంచినట్లుమాత్రమేకాదు.

తా॥ ఓమనసా! ఒక కార్యముకొఱకై యొకనిని యాశ్రయించినయెడల కార్యమయ్యేవఱకు వానిని యాశ్రయించవలసియుండును. అట్లుకాకుండ మనము సర్వేశ్వరుని యొకప్పుడాశ్రయించినప్పుడే వాఁడుమనకు పరమపదము నిచ్చుటకు సిద్ధమైయున్నాడని. ౩.

ఎన్నెఞ్జత్తుళ్ళిరున్దిఙ్గిరున్దమిழ் నూలివై మొழிన్దు*
వన్నెఞ్జత్తిరణియనై మార్విడన్దవాట్టాఱ్ఱాన్*
మన్నఞ్జప్పారదత్తు ప్పాణ్డవర్క్కాప్పడైతొట్టాన్*
నన్నెఞ్జేనమ్బెరుమాన్ నమక్కరుళ్ తాన్ శెయ్వానే. ౪.

అ॥ నన్నెఞ్జే - ఓ మంచిమనసా! వన్ నెఞ్జత్తు - క్రూరహృదయుఁడైన, ఇరణియనై - హిరణ్యాసురునియొక్క, మార్వు - వక్షస్థలమును, ఇడన్ద - చీల్చినవాఁడును, వాట్టాఱ్ఱాన్ - తిరువాట్టాఱందు వేంచేసియున్నవాఁడును, మన్ - రాజులు, అఞ్జ - భయపడునట్లు, పారదత్తు - భారతయుద్ధమందు, పాణ్డవర్క్కా - పంచపాండవులకొఱకై, పడై - ఆయుధమును, తొట్టాన్ - ఎత్తినవాఁడును, నమ్బెరుమాన్ - మనస్వామియునైన సర్వేశ్వరుఁడు, ఎన్ నెఞ్జత్తు -

నాహృదయమందు, ఉళ్ళిగన్దు - లోపలనుండి, ఇఙ్గు - ఈలోకమందు, ఇరున్ - శ్లాఘ్యమై, తమిழ் - ద్రావిడరూపమై, నూల్ - శాస్త్రమైన, ఇవై - ఈతిరువాయ్మొழிని, మొழிన్దు - ప్రవర్తింపఁజేసి, నమక్కు - మనస్కు, అరుళ్ - కృపను, తాన్ శెయ్వానే - తానే చేయుచున్నాడు

తా॥ ఆశ్రితులకొఱకై హిరణ్యాసురునిజంపియు, భారతయుద్ధమం దాయుధమెత్తనని చేసిన తనప్రతిజ్ఞనుగూడవదలి గూయుధమెత్తియు, నాహృదయమందుండి తిరువాయ్మొழிని ప్రవర్తింపఁజేసియుఁ భక్తులను రక్షించువాఁడు మనయొక్క సకలాభీష్టమును బూర్తిజేయునని. ౪.

వానేఱవழிతన్ద వాట్టాற்றాన్ పణివగైయే*
నానేఱప్పెఱుగిన్ఱేన్ నరగత్తైనగునెఞ్జే*
తేనేఱుమలర్ త్తుழாయ్ తిగழ் పాదన్ శెழுమ్పఱవై*
తానేఱిత్తిరివాన తాళిణై యెన్ తలైమేలే.

అ॥ వాన్ ఏఱ - పరమపదమును బొందుటకు, వழி - అర్చిరాదిమార్గమును, తన్ద - ఇచ్చిన, వాట్టాற்றాన్ - తిరువాట్టాఱందు వేంచేసియున్నవాఁడు (సాదించిన), పణివగైయే - (పరమశ్లోకరూపమైన) శ్రీసూక్తి ప్రకారము, నాన్ - నేను, ఏఱప్పెఱుగిన్ఱేన్ - పొందఁదగినవాఁడనైతిని. నెఞ్జే - ఓమనసా! నరగత్తై - నరకమును, నగు - పరిహసింపుము. తేన్ - తేనె, ఏఱు - ప్రవహించుచున్న, మలర్ - పుష్పములుగల, తుழாయ్ - తిరుత్తుழாయి, తిగழ் - ప్రకాశించుచున్న, పాదన్ - తిరువడికలుగలవాఁడును, శెழுమ్ - సుందరమైన, పఱవై - గరుత్మంతుని, తాన్ - తాను, ఏఱిత్తిరివాన్ - ఎక్కి సంచరించువాఁడునైన శ్రియఃపతియొక్క, తాళిణై - శ్రీపాదద్వన్ద్వము, ఎన్ తలైమేల్ - నాశిరస్సుమీఁద నేయున్నది.

తా॥ ఓమనసా! సర్వేశ్వరుఁడు పరమపదమునకు మార్గమై యేర్పఱచిన యర్చిరాదిమార్గముగా పరమపదమును బొందసిద్ధమైతిని. వాఁడును నన్ను విషయీకరించి నాశిరస్సుమీఁద తన శ్రీపాదములనుంచెను. ఇఁక నరకమును నీవుజయించితివని. ౫.

తలైమేలతాళిణైగళ్ తామరైక్కణ్ ఎన్నమ్మాన్*
నిలైపేరాన్ ఎన్నెఞ్జత్తెప్పొழுదుమ్ ఎమ్పెరుమాన్*
మలైమాడత్తరవణైమేల్ వాట్టాற்றాన్ మదమిక్క*
కొలైయానై మరుప్పొశిత్తాన్ కழల్గళ్ కుఱుగినమే. ౬.

అ॥ తాళిణైగళ్ - (వానియొక్క) శ్రీపాదద్వన్ద్వములు, తలైమేల (నా) శిరస్సుమీఁదనున్నవి. తామరైక్కణ్ - పద్మనేత్రుఁడైన, ఎన్నమ్మాన్ - నాస్వామి, ఎన్ నెఞ్జత్తు - నాహృదయమందుండి, ఎప్పొழுదుమ్ - ఎప్పుడును, నిలైపేరాన్ - చలించఁడు. మలై - పర్వతమువంటి, మాడమ్ - మేడలుగల, వాట్టాఱు - తిరువాట్టాఱందు, అరవణైమేలాన్ - ఆదిశేషునిమీఁదఁ బవ్వళించినవాఁడును, మదమ్మిక్క - గొప్పమదముగల, కొలై - చంపుటకువచ్చిన, యానై - కువలయాపీడముయొక్క, మరుప్పు - దంతములను, ఒశిత్తాన్ - విఱిచినవాఁడునైన, ఎమ్పెరుమాన్ - స్వామియొక్క, కుఱై - ఛేదించుచున్న, కழల్గళ్ - శ్రీపాదములను, కుఱుగినమ్ - సమీపించితిమి.

తా॥ తిరువాట్టాఱులో వేంచేసియుండి నన్ను సర్వప్రకారముచేత విడువకుండ స్వీకరించుచున్న సర్వేశ్వరునియొక్క శ్రీపాదములను బొందితిమని. ౭.

కుఱై కழల్ గళ్ కుఱుగినమ్ నమ్బోవిన్దన్ కుడికొణ్డాన్*
తిరై కుழువుకడల్ పుడై శూழ் తెన్నాట్టు త్తిలదమున్న*
వరై కుழువుమణిమాడ వాట్టాత్ర్రాన్ మలరడిమేల్*
విరై కుழువునఱున్దుళవమ్ మెయ్నిన్ఱు కమழுమే. ౭.

అ॥ కుఱై - (ఆభరణములచే) శబ్దించుచున్న, కழల్ గళ్ - పాదపడికళ్ళను, కుఱుగినమ్ - సమీపించితిమి. నమ్కోవిన్దన్ - మన శ్రీకృష్ణుడు, కుడికొణ్డాన్ - (నాహృదయమును) వాసస్థానముగా స్వీకరించెను. తిరై - అలలయొక్క, కుழువు - సమూహముగల, కడల్ - సముద్రముచే, పుడై - ప్రక్కలయందు, శూழ் - చుట్టబడినదియు, తెన్ నాడు - దక్షిణదేశమునకు, తిలదమన్న - తిలకమువలెనున్నదియు, వరై - పర్వతములయొక్క, కుழువు - సమూహమువలెనున్న, మణిమాడమ్ - రత్నమయమైన గృహములుగలదియునైన, వాట్టాత్ర్రాన్ - తిరువాట్టాఱులో వేంచేసియున్నవానియొక్క, మలర్ - పుష్పమువంటి, అడిమేల్ - శ్రీపాదములమీద సమర్పింపబడిన, విరై కుழువు - మిక్కిలి పరిమళించుచున్న, నఱున్ తుళవమ్ - మంచితిరుత్తుழாయి, మెయ్ నిన్ఱు - నాశరీరమునుండి, కమழுమ్ - పరిమళించుచున్నది

తా॥ అతిసుందరమైన తిరువాట్టాఱులో వేంచేసియున్న సర్వేశ్వరుడు నామనస్సులో వేంచేసియున్నాడు దానికి నిదర్శనము, వానితిరువడికళమీదనున్న తిరుత్తుழாయి నాశరీరమంత పరిమళించుచున్నదని. ౭.

మెయ్న్నిన్ఱుకమழ் తుళవ విరై యేఱుతిరుముడియన్*
కైన్నిన్ఱశక్కరత్తన్ కరుదుమిడమ్ పొరుదుపునల్*
మైన్నిన్ఱ వరై పోలుమ్ తిరువురువ వాట్టాత్ర్రాఱ్కు*
ఎన్నన్ఱి శెయ్దేనా వెన్నెఞ్జిల్ తిగழ்వదువే. ౮.

అ॥ మెయ్నిన్ఱు - దివ్యవిగ్రహమంతటనుండి, కమழ் - పరిమళించుచున్న, తుళవమ్ - తిరుత్తుழாయియొక్క, విరై - పరిమళము, ఏఱు - వ్యాపించియున్న, తిరుముడియన్ - కిరీటముగలవాడును, కరుదుమిడమ్ - సఙ్కల్పించిన చోటికివెళ్ళి, పొరుదు - యుద్ధముజేసి, కైనిన్ఱ - (తిరిగివచ్చి) శ్రీహస్తమందున్న, శక్కరత్తన్ - సుదర్శనముగలవాడును, పునల్ - (సముద్ర) జలమువలెనున్న, మై - కాటుకవలెనున్న, నిన్ఱవరై పోలుమ్ - నిలిచియున్న పర్వతమువలెనున్న, తిరువురువ - తిరుమేనుగలవాడునై, వాట్టాత్ర్రాఱ్కు - తిరువాట్టాఱందు బవ్వళించినవానికి, ఎన్నన్ఱి - ఏమియుపకారము, శెయ్దేనా - చేసినానని, ఎన్నెఞ్జిల్ - నామనస్సునందు, తిగழ்వదు - ఉజ్జ్వలుడై వేంచేసియుండుట ?

తా॥ తిరువాట్టాఱులో విలక్షణుడై వేంచేసియున్న మిక్కిలినులభుడైన సర్వేశ్వరునికి నే నేమియుపకారము జేయకపోయినప్పటికిన్ని నాహృదయమందత్యుజ్జ్వలుడై వేంచేసియున్నాడని.

తిగழ்గిన్ఱ తిరుమార్బిల్ తిరుమఙ్గైతన్నోడుమ్*
తిగழ்గిన్ఱ తిరుమాలార్ శేర్విడమ్ తణ్ వాట్టాఱు*

పుగழ்నిన్ఱ పుళ్ళూర్ది పోరరక్కర్ కులఙ్గెడుత్తాన్*
ఇగழ்విన్ఱి యెన్నెఞ్జత్తెప్పొழுదుమ్పిరియానే. ౯.

అ॥ తిగழ்గిన్ఱ - ప్రకాశించుచున్న, తిరుమార్బిల్ - వక్షస్థలమందు (వేంచేసియున్న), తిరుమఙ్గైతన్నొడుమ్ - పెరియపిరాట్టితోఁగూడ, తిగழ்గిన్ఱ - ప్రకాశించుచున్న, తిరువాలార్ - శ్రియఃపతి, శేర్విడమ్ - నిత్యవాసముచేయుచున్న స్థానము, తణ్ - చల్లనైన, వాట్టాఱు - తిరువాట్టాఱనెడి దివ్యదేశము, పుగழ்నిన్ఱ - గొప్పకీర్తిగల, పుళ్ - గరుత్మంతుడు, ఊర్ది - (వానికి) వాహనము, పోర్ - యుద్ధమునకువచ్చిన, అరక్కర్ - రాక్షసులయొక్క, కులమ్ - వంశమును, కెడుత్తాన్ - నశింపఁజేసిన శ్రియఃపతి, ఎన్నెఞ్జత్తు - నామనస్సునందు, ఇగழ்విన్ఱి - అనాదరములేక, ఎప్పొழுదుమ్ - ఎల్లప్పుడును, పిరియాన్ - ఎడబాయకనున్నాడు.

తా॥ శ్రియఃపతియై, గరుడవాహనుఁడై, అసురసంహారకుఁడై, ఇట్టిగొప్పవాఁడైన సర్వేశ్వరుఁడు నామనస్సునందెల్లప్పుడును మిక్కిలి వ్యామోహముగలవాఁడై - వాసముచేయుచున్నాడని.

పిరియాదాట్చెయ్యెన్ఱు పిఱప్పఱుత్తాళఱక్కొణ్డాన్*
అరియాగియిరణియనై యాగఙ్గీణ్డానన్ఱు*
పెరియార్క్కాట్పట్టక్కాల్ పెఱాదపయన్ పెఱుమాఱు*
వరివాళ్వాయరవణైమేల్ వాట్టాఱ్ఱాన్ కాట్టిననే. ౧౦.

అ॥ పిరియాదు - ఎడబాయక, ఆళ్ శెయ్ - కైంకర్యముజేయుము, ఎన్ఱు - అనిచెప్పి, పిఱప్పు - జన్మమును, అఱుత్తు - ఛేదించి, అఱ - మిక్కిలి, ఆళ్ కొణ్డాన్ - దాస్యపఱచుకొనెను అన్ఱు - అప్పుడు, అరియాగి - నరసింహమై, ఇరణియనై - హిరణ్యాసురునియొక్క, ఆగమ్ - శరీరమును, కీణ్డాన్ - చీల్చినవాఁడును, వరి - గీతలనున్న, వాళ్ - కాన్తినిన్ని, వాయ్ - (అనేక) ముఖములనున్నగల, అరవణైమేల్ - తిరువనన్తాழ்వాననెడి శయ్యమీఁద, వాట్టాఱ్ఱాన్ - తిరువాట్టాఱులో పవ్వళించియుండువాఁడునైన సర్వేశ్వరుఁడు, పెరియార్క్కు - గొప్పవారికి, ఆట్పట్టక్కాల్ - దాసుఁడైనయెడల, పెఱాద - పొందదగని, పయన్ - పురుషార్థమును, పెఱుమాఱు - పొందెడివిధమును, కాట్టినన్ - చూపించెను.

తా॥ మహాపురుషులనుబొందినయెడల ఆశ్రితుల గుణాగుణములనుజూడక ఎంతగొప్పపురుషార్థమునుగూడ వారిచ్చెదరనియెడి యర్థమును తిఱువాట్టాఱులో వేంచేసియున్న సర్వేశ్వరుఁడు నావిషయమై ప్రకాశింపఁజేసెనని. ౧౦.

✣ కాట్టిత్తన్కనైకழల్గళ్ కడునరగమ్పుగలొழித్త*
వాట్టాఱ్ఱెమ్పెరుమానై వళఙ్గురుగూర్చ్చడగోపన్*
పాట్టాయతమిழ்మాలై యాయిరత్తుళిప్పత్తుమ్
కేట్టు*ఆరార్వానవర్గళ్ శెవిక్కినియశెఞ్జొల్లే. ౧౧.

అ॥ తన్ - తనయొక్క, కనై - శబ్దించుచున్న, కழల్గళ్ - తిరువడికళ్ళను, కాట్టి - చూపించి, కడునరగమ్ - క్రూరసంసారమందు, పుగల్ - ప్రవేశించడమును, ఒழித్త - పోఁగొ

ట్టినవాఁడును, పాట్టాఱు - తిరువాట్టాఱులో వేంచేసియున్న వాఁడునైన, ఎమ్బెరుమానై - సర్వే
శ్వరునివిషయమై, వళమ్ - సమృద్ధమైన, కురుగూర్ - తిరునగరికిస్వామియైన, శడగోపన్ - నమ్మా
ழ்వార్లు, పాట్టాయ - పాశురరూపములుగాసాదించిన, తమిழ்మాలై - ద్రావిడశబ్దసన్దర్భ
రూపములైన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలో జేరిన, శెవిక్కినియ - శ్రోత్రమునకు మధుర
మైన, శెమ్శొల్ - కాపట్యములేని శ్రీసూక్తియైన, ఇప్పత్తుమ్ - ఈపదిపాశురములను, వానవర్
గళ్ - నిత్యసూరులు, కేట్టు - విని, ఆరార్ - (చాలునని) తృప్తిఁజెందరు.(పైపైనయాశపడుదురు).

తా॥ తిరువాట్టాఱులో వేంచేసియున్న సర్వేశ్వరునివిషయమై నమ్మాழ்వార్లుసాదించిన
యీ పదిపాశురములనఁగని నిత్యసూరులుగూడ మిక్కిలి యానన్దమునుబొందుదురని. ౧౧.

ఆ ழ్వా ర్ తి రు వ డి గ ళే శ ర ణ మ్

జీయర్ తిరువడిగళే శరణమ్.

## ౭ - వ, తిరువాయ్మొழி.

అవతారిక :— ఈ తిరువాయ్మొழிలో, సర్వేశ్వరుఁడు తమను ఈ విగ్రహముతోఁగూడ
పరమపదమునకు దీసికొనిపోవలయునని యత్నింప, ఈహేయశరీరము నచ్చటికితీసికొని పోకూడ
దని యాழ்వార్లు యాచింపగా నప్పు డాప్రార్థనను సఫలముగాజేసినాడని వానియొక్క ఆశ్రిత
పారతన్త్ర్యమునుజూచి యాశ్చర్యపడుచున్నారు.

✣✣ శెఞ్జొల్కవిగాళుయిర్ కాత్తాట్చెయ్మిన్ తిరుమాలిరుఞ్జోలై *
వఞ్జక్కళ్వన్ మామాయన్ మాయక్కవియాయ్వన్దు *ఎన్
నెఞ్జముముయిరుముళ్ కలన్దు నిన్‌్ఱారఱియావణ్ణమ్ *ఎన్
నెఞ్జముముయిరుమవై యుణ్డు తానేయాగినిఱైన్దానే. ౧.

అ॥ తిరుమాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయనెడి దివ్యదేశమందు వేంచేసియుండువాఁ
డును, వఞ్జక్కళ్వన్ - వంచనచేత (భక్తులయొక్క సర్వస్వమునున్న) అపహరించువాఁడును, మా
మాయన్ - గొప్పఆశ్చర్యకరమైన గుణములుగలవాఁడునైన సర్వేశ్వరుఁడు, మాయక్కవియాయ్ -
కృత్రిమకవియై, (తిరువాయ్మొழிని చెప్పించవలయునని వ్యాజముచేత), వన్దు - వచ్చి, ఎన్నెఞ్జ
ళ్ళుమ్ - నామనస్సునందును, ఉయిరుళ్ళుమ్ - ఆత్మయందును, కలన్దు - కలిసియుండి, నిన్‌్ఱార్ -
ప్రక్కలయందున్న శ్రీదేవి మొదలైనవారికిని, అఱియావణ్ణమ్ - తెలియకుండ, అవై - అ, ఎన్ని
ఞ్జుమ్ఉయిరుమ్ - నామనస్సునున్ను ఆత్మనున్ను, ఉణ్డు - అనుభవించి, తానేయాగి - తానే
నాకభిమానియై, నిఱైన్దాన్ - పూర్ణుఁడయినాడు. శెమ్ - సున్దరమైన (స్వయంప్రయోజనమైన),
శొల్ - శబ్దములచేత, కవిగాళ్ - కవిత్వముఁజెప్పదగినవారా! ఉయిర్ కాత్తు - (మీ) ఆత్మను
(వానిచేతులోనగుపడకుండ)రక్షించి,ఆట్చెయ్మిన్ - కైఙ్కర్యముజేయుఁడి(కవిత్వముచెప్పుఁడు)

తా॥ ఓకవీశ్వరులారా! సర్వేశ్వరుఁడునాచేత తిరువాయ్మొழிని బ్రవర్తింపఁజేయవలయు
నని కపటముచేత నామనస్సులో బ్రవేశించి, ప్రక్కనున్నవారికిఁగూడ నిట్లుచేసినాడని తెలియ

కుండ నన్ను చక్కగా ననుభవించి పరిపూర్ణుఁడయినాఁడు గాన మీరును వానియొక్క శౌశీల్యాది గుణములయం దగుపడకుండనుండి మంగళాశాసనము జేయుఁడని. ౧.

తానేయాగినిఱైన్దెల్లావులగుముయిరుమ్ తానేయాయ్*
తానేయానెన్బానాగి త్తన్నై త్తానేతుదిత్తు* ఎనక్కు
త్తేనేపాలేకన్నలేయముదే తిరుమాలిరుఞ్జోలై*
క్కోనేయాగినిన్ఱొழிన్దా నెన్నైముற்றుముయిరుణ్డే. ౨.

అ॥ ఎన్నై - నాయొక్క, ఉయిర్ - ఆత్మను, ముற்றుమ్ - సంపూర్ణముగా, ఉణ్డు - అనుభవించి, తానేయాగి - ప్రధానుఁడై, నిఱైన్దు - పరిపూర్ణుఁడైనవాఁడును, ఎల్లావులగుమ్ - సకలలోకములకును, ఉయిరుమ్ - ప్రాణులకును, తానేయ్యాయ్ - తానేనిర్వాహకుఁడయినవాఁడును, యానెన్బాన్ - నేనుఅనెడిబుద్ధికివిషయమైన వస్తువును, తానేయాగి - తానేయయినవాఁడును (నన్నుపకరణముగాగలవాఁడును) తన్నై - తనను, తానే - తానే, తుదిత్తు - స్తోత్రము జేసికొనినవాఁడును, ఎనక్కు - నాకు, తేనే - తేనెవలెనున్న, పాలే - పాలవలెనున్న, కన్నలే - శర్కరవలెనున్న, అముదే - అమృతమువలెనున్న నిరతిశయభోగ్యుఁడునైన సర్వేశ్వరుఁడు, తిరుమాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలకు, కోనేయాగి - స్వామియై, నిన్ఱొழிన్దాన్ - వేంచేసియున్నాఁడు.

తా॥ సర్వేశ్వరుఁడు నన్నువిషయీకరించిన తరువాతనే సకలలోకాధీశుఁడై పూర్ణుఁడై, నాకు నిరతిశయభోగ్యభూతుఁడై, తిరుమాలిరుఞ్జోలలో కృతకృత్యుఁడై వేంచేసియున్నాఁడని. ౨.

ఎన్నైముற்றுముయిరుణ్డే మాయవాక్కైయిదనుళ్ పుక్కు*
ఎన్నైముற்றுమ్ తానేయాయ్ నిన్ఱమాయవమ్మాన్ శేర్*
తెన్నన్ తిరుమాలిరుఞ్జోలై త్తిశైకైకూప్పిచ్చేర్న్దయాన్*
ఇన్నమ్పోవేనేకొలో ఎన్గొలమ్మాన్ తిరువరుళే. 3

అ॥ ఎన్నై - నాయొక్క, ఉయిర్ - ఆత్మను, ముற்றుమ్ ఉణ్డు - సంపూర్ణముగాననుభవించి, ఎన - నాయొక్క, మాయమ్ - అతిహేయమైన, ఆక్కై యిదనుళ్ - ఈశరీరమందు, పుక్కు - ప్రవేశించి, ఎన్నై - నాకును, ముற்றుమ్ - నావస్తువులన్నిఁటికిన్ని, తానేయాయ్ - తానేనిర్వాహకుఁడై, నిన్ఱ - ఉన్న, మాయమ్ - ఆశ్చర్యభూతుఁడైన, అమ్మాన్ - సర్వేశ్వరుఁడు, శేర్ - వాసముజేయుచున్నదియు, తెన్ - దక్షిణమందున్నదియు, నన్ - శ్లాఘ్యమైనదియునైన, తిరుమాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయనెడిదివ్యదేశమున్న, తిశై - దిక్కును, కైకూప్పి - అంజలిజేసి, శేర్న్దయాన్ - (పరమప్రాప్యముగా) పొందిననేను, ఇన్నమ్ - వానినివదలి మఱియొకదేశమునకు, పోవేనేకొలో - పోయెదనా? అమ్మాన్ - సర్వేశ్వరునియొక్క, తిరువరుళ్ - ఔదార్యము, ఎన్గొల్ - ఏవిధమైయున్నది (అవధిలేకుండనున్నది).

తా॥ నాయందును నాశరీరమందును తక్కిననావస్తువులయందును మిక్కిలివ్యామోహము గలవాఁడై నాకుసకలవిధకైఙ్కర్యములనిచ్చియు తృప్తిఁజెందనివాఁడైయున్న మహోదారుఁడైన

సర్వేశ్వరుఁడును, వాఁడుకొంచేసియున్న తిరుమాలిరుఞ్జోలయనెడి దివ్యదేశమును, అడియున్న దిక్కును నాకుపరమప్రాప్యమైయుండగా నేను మఱిరొకదానిని యాశ్రయించనని. ౩.

ఎన్గొలమ్మాన్ తిరువరుళ్గళ్ ఉలగుముయిరున్దానేయాయ్*
నన్నెన్నుడలమ్ కై విడాన్ ఞాలత్తూడేనడన్దుళక్కి*
తెన్గోళ్ తిశైక్కు త్తిలదమాయ్నిన్ఱ తిరుమాలిఞ్జోలై *
నఙ్గళ్ కున్ఱమ్ కై విడాన్ నణ్ణావశురర్ నలియవే. ౪.

అ॥ ఉలగుమ్ - లోకములకును, ఉయిరుమ్ - ప్రాణులకును, తానేయాయ్ - తానే స్వామియైయుండి, ఞాలత్తూడే - భూమియందంతట, నడన్దుళక్కి - సంచరించితిరిగి, నణ్ణా - ఆశపడని, అశురర్ - అసురులు, నలియ - నశించునట్లును, తెన్గోళ్ - దక్షిణమనెడిపేరుగల, తిశైక్కు - దిక్కునకు, తిలదమాయ్నిన్ఱ - తిలకమువలెనున్న, తిరుమాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయనెడి, నఙ్గళ్ కున్ఱమ్ - మనకనుభవయోగ్యమైనపర్వతమును, కైవిడాన్ - వదలకనున్నాఁడు. నన్గు - ప్రాప్యమనితలంచి, ఎన్ ఉడలమ్ - నాశరీరమును, కైవిడాన్ - వదలకనున్నాఁడు. అమ్మాన్ - సర్వేశ్వరునియొక్క, తిరువరుళ్గళ్ - వ్యామోహము, ఎన్గొల్ - ఏమి నిరవధికమైయున్నది !

తా॥ సకలలోకనాథుఁడై పరిపూర్ణుఁడైన సర్వేశ్వరుఁడు నాయందు మిక్కిలి వ్యామోహముగలవాఁడై నన్ను పరిగ్రహించుటకై తిరుమాలిరుఞ్జోలను సాధనముగాఁజేసికొనియచ్చట గొప్ప ప్రీతితో వేంచేసియున్నాఁడని. ౪.

నణ్ణావశురర్ నలివెయ్ద నల్లవమరర్ పొలివెయ్ద*
ఎణ్ణాదనగళెణ్ణుమ్ నన్మునివరిన్బమ్ తలై చ్చిఅప్ప*
పణ్ణార్ పాడలిన్ కవిగళ్ యానాయ్ త్తన్నై త్తాన్ పాడి*
తెన్నా వెన్ను మెన్నమ్మాన్ తిరుమాలిరుఞ్జోలైయానే. ౫.

అ॥ నణ్ణా - (తనను) ఆశించని, అశురర్ - అసురు..., నలివెయ్ద - నశించినట్లును, నల్ల - అనుకూలులైన, అమరర్ - దేవతలు, పొలివెయ్ద - వృద్ధిఁబొందునట్లును, ఎణ్ణాదనగళ్ - (ఇతరులు) తలంచని (ఉభయవిభూతికంటెనధికములైన) సంపత్తులను, ఎణ్ణుమ్ - (సర్వేశ్వరునికిఁ గావలయునని) ఆశించుచున్న, నల్ - భక్తిమంతులైన, మునివర్ - ఋషులు, ఇన్బమ్ తలై చ్చి అప్ప - ఆనన్దభరితులగునట్లును, పణ్ అర్ - గానముచేపూర్ణములై, పాడల్ - పాశురరూపములై, ఇన్ - మధురములైన, కవిగళ్ - కవిత్వములను (తిరువాయ్మొழிలను), యానాయ్ - నన్ను ఉపకరణముగాఁగలవాఁడై, తన్నై - తనను, తాన్ - తానే, పాడి - స్తోత్రముజేసి, తిరుమాలిరుఞ్జోలైయాన్ - తిరుమాలిరుఞ్జోలలో వేంచేసియున్న, ఎన్నమ్మాన్ - నాస్వామి, తెన్నా తెన్నుమ్ - (అతిరువాయ్మొழிలను) గానముఁజేయును.

తా॥ ప్రతికూలులు విని మండిపోవునట్లును అనుకూలును సన్తోషించునట్లును మధురమైన తిరువాయ్మొழிని నాచేతఁజేయించి దానియందు గొప్పప్రీతిగలవాఁడైయున్నాఁడని. ౫.

తిరుమాలిరుఞ్జోలై యానేయాగి చ్చెழுమూవులగుమ్*తన్
ఒరుమావయిత్తినుళ్వైత్తు ఊழிయూழிత్తలై యళిక్కుమ్*
తిరుమాలెన్నైయాళుమాల్ శివనుమ్పిరమనుమ్కాణాదు*
అరుమాలెయ్ది యడిపరవ అరుళై యీన్దవమ్మానే. ౬.

అ॥ శివనుమ్ - రుద్రుఁడును, పిరమనుమ్ - బ్రహ్మయు, కాణాదు - సేవింపక, అరుమ్ - (ఇతరులకు) దుర్లభమైన (మిక్కిలియధికమైన), మాల్ - భక్తిని, ఎయ్ది - పొందినవారై, అడి - శ్రీపాదములను, పరవ - స్తోత్రముఁజేయఁగా, అరుళైయీన్ద - వారివారియభీష్టములనిచ్చిన, అమ్మాన్ - స్వామియు, శెழுమ్ - సమృద్ధమైన, మూవులగుమ్ - మూఁడులోకములనున్ను, తన్ - తనయొక్క, ఒరు - అద్వితీయమై, మా - చిన్నదైన, వయిత్తినుళ్ - ఉదరమందు, వైత్తు - ఉంచి, ఊழிయూழி - ప్రతికల్పములయందును, తలై - స్వయంప్రయోజనముగా, అళిక్కుమ్ - రక్షించువాఁడునైన, తిరుమాల్ - శ్రియఃపతి, తిరుమాలిరుఞ్జోలైయానేయాగి - తిరుమాలిరుఞ్జోలలో వేంచేసియున్నవాఁడై, ఎన్నై - నన్ను, ఆళుమ్ - పరిపాలించుటయందు, మాల్ - వ్యామోహముగలవాఁడైయున్నాఁడు.

తా॥ బ్రహ్మరుద్రాదులు స్తోత్రముఁజేయఁగా వారియభీష్టమును బూరించియు ప్రళయకాలమందు సకలలోకములను తనయుదరమందుంచుకొని రక్షించియు తిరుమాలిరుఞ్జోలయందు వేంచేసియుండి నన్ను మిక్కిలి యాదరించుచున్నాఁడని. ౬.

అరుళై యీయెన్నమ్మానే యెన్నుమ్ముక్కణమ్మానుమ్*
తెరుళ్కొళ్ పిరమనమ్మానుమ్ తేవర్కోనుమ్తేవరుమ్*
ఇరుళ్గళ్ కడియుమ్మునివరు మేత్తుమమ్మాన్తిరుమలై*
మరుళ్గళ్ కడియుమ్మణిమలై తిరుమాలిరుఞ్జోలైమలైయే. ౭.

అ॥ ఎన్నమ్మానే - ఓనాస్వామీ! అరుళైఈ - కృపఁజేయుము, ఎన్నుమ్ - అని చెప్పుచున్న, ముక్కణమ్మానుమ్ - త్రినేత్రుఁడును, తెరుళ్కొళ్ - జ్ఞానాధికుఁడైన, పిరమనమ్మానుమ్ - బ్రహ్మదేవుఁడును, తేవర్కోనుమ్ - దేవేంద్రుఁడును, తేవరుమ్ - దేవతలును, ఇరుళ్గళ్ - అజ్ఞానాన్ధకారమును, కడియుమ్ - (ధర్మశాస్త్రములనుజేసి) పోఁగొట్టుచున్న, మునివరుమ్ - ఋషులును, ఏత్తుమ్ - స్తోత్రముజేయుచున్న, అమ్మాన్ - స్వామినివాసస్థానమైన, తిరుమలై - తిరుమలయని చెప్పఁబడుచున్నదియు, మరుళ్గళ్ - అవిద్యాదులను, కడియుమ్-పోఁగొట్టుచున్నదియు, మణి - శ్లాఘ్యమైనదియునైన, మలై - పర్వతము, తిరుమాలిరుఞ్జోలైమలైయే - తిరుమాలిరుఞ్జోలయనెడి పర్వతమే.

తా॥ బ్రహ్మరుద్రేన్ద్రాదులందఱు శ్రియఃపతియొక్క యనుగ్రహమునుగోరి స్తోత్రముజేయుచున్న సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరుమాలిరుఞ్జోలయనెడిదివ్యదేశమే మనకు ప్రాప్యమని.

‡‡ తిరుమాలిరుఞ్జోలైమలైయే తిరుప్పాఱ్కడలేయెన్తలైయే*
తిరుమాలవైగున్దమే తణ్తిరువేఙ్గడమేయెనదుడలే*

అరుమాయమాయత్తెనదుయిరే మనమేవాక్కే కరుమమే*
ఒరుమానోడియుమ్పిరియా నెన్నాన్ముదల్వనొరువనే. ౮.

అ॥ తిరుమాలిరుఞ్జోలైమలైయే - తిరుమాలిరుఞ్జోలయనెడు పర్వతమునున్ను, తిరుప్పాఱ్కడలే - క్షీరాబ్ధినిన్ని, ఎన్తలైయే - (వానితోపాటి) నాశిరస్సునున్ను, తిరుమాల్ - శ్రియఃపతియైనతాను వేంచేసియున్న, వైగున్దమే - పరమపదమునున్ను, తణ్ - చల్లనైన, తిరువేఙ్గడమే - వేంకటాచలమునున్ను, ఎనదుడలే - (వానితోపాటి) నాశరీరమునున్ను, అరు - (త్యజింపుటకు) అశక్యమై, మా - గొప్పదైన, మాయత్తు - ప్రకృతితోఁగూడుకొనియున్న, ఎనదుఉయిరే - నాయాత్మనున్ను, మనమే - మనస్సునున్ను, వాక్కే - వాక్కునున్ను, కరుమమే - క్రియలనున్ను, ఒరుమానోడియుమ్ - ఒకక్షణైకదేశమును, పిరియాన్ - ఎడబాయకనున్నాడు. ఎన్నాన్ముదల్వన్ - నన్నుబొందుటకై కాలము మొదలగు సకలపదార్థములకుఁ గారణమైనవాఁడు, ఒరువనే - ఉన్నవిధము అత్యాశ్చర్యకరముగానున్నది.

తా॥ తిరుమాలిరుఞ్జోల మొదలగు దివ్యదేశములయందుఁజేసిన యభినివేశము నిప్పుడు నాయవయవములయందుఁ జేసి యొకక్షణముగూడ నన్ను వదలకయున్నాడు. ఇదియత్యాశ్చర్యకరముగానున్నదని. ౮.

ఊళ్ముదల్వనొరువనేయెన్ను మొరువనులగెల్లామ్*
ఊళ్దోఱుమ్తన్నుళ్ళే పడైత్తుక్కాత్తుక్కెడుత్తుళలుమ్*
ఆళ్వణ్ణనెన్నమ్మాన్ నన్దణ్ తిరుమాలిరుఞ్జోలై*
వాళ్మనమే కైవిడేలుడలుముయిరుమ్మఙ్గవొట్టే. ౯.

అ॥ ఊళ్ - కాలను మొదలగు సకలపదార్థములకును, ముదల్వన్ ఒరువనే - కారణభూతుఁడైనయద్వితీయుఁడు, ఎన్నుమ్ - అనిచెప్పఁబడుచున్న, ఒరువన్ - అద్వితీయుఁడును, ఊళ్దోఱుమ్ - ప్రతికల్పములయందును, ఉలగెల్లామ్ - లోకములనన్నింటిని, తన్నుళ్ళే - తన సఙ్కల్పముచేత, పడైత్తు - సృజించి, కాత్తు - రక్షించి, కెడుత్తు - సంహరించి, ఉళలుమ్ - తిరుగుచున్నవాఁడును, ఆళ్వణ్ణన్ - సముద్రమువలె గంభీరస్వభావుఁడును, ఎన్నమ్మాన్ - నాస్వామియునైన సర్వేశ్వరునియొక్క, అ - సుందరమై, తణ్ - చల్లనైన, తిరుమాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలను, మనమే - ఓమనసా! కైవిడేల్ - విడువకుండ నాశ్రయించుము. ఉడలుమ్ - శరీరమును, ఉయిరుమ్ - ప్రాణాదులును, మఙ్గ - నశించునట్లు, ఒట్టు - సంమతించుము, వాళ్ - నీకుమంగళముగాక.

తా॥ ఓమనసా! మనయొక్క సకలసంపత్తుకును గారణమై, జగత్సృష్టిస్థితిసంహారకర్తయైన శ్రియఃపతికి వాసస్థానమైన తిరుమాలిరుఞ్జోలను నీవువదలకుండ నాశ్రయించుమాయని. ౯.

మఙ్గవొట్టున్మామాయై తిరుమాలిరుఞ్జోలై మేయ*
నఙ్గళ్కోనేయానేనీయాగి యెన్నైయళిత్తానే*
పొఙ్గైమ్పులనుమ్పొఱియైన్దుమ్ కరుమేన్దిరియమైమ్బూదమ్*
ఇఙ్గివ్వుయిరేయ్పిరగిరుది మానాఙ్గారమనఙ్గళే. ౧౦.

అ॥ తిరుమాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయందు, మేయ - నిత్యవాసము జేయుచున్న వాఁడును, నఙ్గళ్ కోనే - మనకు స్వామియు, యానేనీయాగి - నన్ను రక్షించవలయునని యాయభిప్రాయమును నీవేకలవాఁడై, ఎన్నై - నన్ను, అళిత్తానే - రక్షించినవాఁడవైన ఓస్వామీ! పొఙ్గు - వర్ధిల్లుచున్న, ఐమ్పులనుమ్ - శబ్దాదివిషయములనున్ను, పొతియొన్దుమ్ - అయిదుజ్ఞానేన్ద్రియములనున్ను, కరుమేన్దిరియమ్ - కర్మేన్ద్రియములన్ను, ఐమ్పూదమ్-పంచభూతములనున్ను, ఇఙ్గు - ఈసంసారమందు, ఇవ్వుయిరేయ్ - ఈజీవాత్మతోఁగలిసియున్న, పిరగిరుది-ప్రకృతినిన్ని, మాన్ - మహత్తత్వమునున్ను, అఙ్గారమ్ - అహఙ్కారతత్వమునున్ను, మనఙ్గళ్ - మనస్సులనున్ను, ఉన్ మాయై - (అయిన) నీయొక్క ఆశ్చర్యకరమైన ప్రకృతి ప్రాకృతములను, మఙ్గవొట్టు - నశింపఁజేయుము.

తా॥ నన్ను రక్షించుటకై తిరుమాలిరుఞ్జోలయందు వేంచేసియున్న ఓస్వామీ! నాయొక్క శరీరేన్ద్రియవిషయాదులనన్నిఁటిని నశింపఁజేసి నన్నురక్షించుమూయని. ౧౦.

¶¶ మానాఙ్గారమనఙ్గెడ ఐవర్ వన్కైయర్ మఙ్గ*
తానాఙ్గారమాయ్ప్పుక్కు త్తానేతానేయానానై *
తేనాఙ్గారప్పొழிల్ కురుగూర్ చ్చడగోపన్ శొల్లాయిరత్తుళ్ *
మానాఙ్గారత్తివై పత్తుమ్ తిరుమాలిరుఞ్జోలై మలైక్కే. ౧౧.

అ॥ మానాఙ్గారమనమ్ - మహదహఙ్కారమనస్సులు, కెడ-నశించునట్లును, వన్కైయర్ - బలిష్ఠులైన, ఐవర్ - పంచేన్ద్రియములు, మఙ్గ - నశించునట్లును, తానఙ్గారమాయ్ - తానేయభిమానియై, పుక్కు - (నాయందు) ప్రవేశించి, తానేతానేయానానై - నాకును నావస్తువులకును తానేయభిమానియైన సర్వేశ్వరునివిషయమై, తేనాఙ్గారమ్ - తుమ్మెదలయొక్క సన్తోషముగల (తుమ్మెదలుసన్తోషించుచున్న), పొழிల్ - తోటలుగల, కురుగూర్ - కురుకాపురికిస్వామియైన, శడగోపన్ - నమ్మాళ్వార్లు, శొల్ - సాదించిన, ఆయిరత్తుళ్ - వెయ్యిపాశురములలోఁజేరిన, తిరుమాలిరుఞ్జోలైమలైక్కే-తిరుమాలిరుఞ్జోలమలవిషయమైన, ఇవై పత్తుమ్-ఈపదిపాశురములును, మానాఙ్గారత్తు-మహదహఙ్కారాదినిరసనార్థమై సాదింపబడినవి.

తా॥ నమ్మాళ్వార్లు తమయొక్క ప్రకృతిసంబంధములు నశించుటకై తిరుమాలిరుఞ్జోల విషయమై యీతిరువాయ్మొழிనిసాదించిరని. ౧౧.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.
జీయర్ తిరువడిగళే శరణమ్.

---

## ౧౦ - వ, తిరువాయ్మొழி.

---

అవతారిక:— ఈతిరువాయ్మొழிలో, నాకు, నీయందద్వేషాభిముఖ్యాది పరమభక్తివఱకు నీవుకలుగఁజేయుటకుఁ గారణమేమని యాళ్వార్లు సర్వేశ్వరుని యడుగగా, దానికేమియుఁగారణము చెప్పలేక సర్వేశ్వరుఁడుండెను; దానినిజూచి నిర్హేతుకముగానన్నంగీకరించినాఁడని వాని యొక్క కృపాగుణమును మున్నై పొగడుచున్నారు.

‡‡ తిరుమాలిరుఞ్జోలై మలై యెన్రేనెన్న*
తిరుమాల్వన్దెన్నె ఞ్జునిఱైయప్పుగున్దాన్*
కురుమామణియున్దుపునల్ పొన్ని తెన్పాల్*
తిరుమాల్ శెన్ఱుశేర్విడమ్ తెన్ తిరుప్పేరే. ౧.

అ॥ తిరుమాలిరుఞ్జోలైమలైయెన్రేనెన్న - తిరుమాలిరుఞ్జోలైమలై యని చెప్పినప్పుడే, తిరుమాల్ - శ్రియఃపతి, వన్దు - వచ్చి, ఎన్నెఞ్జు - నామనస్సు, నిఱైయ - నిండునట్లు, పుగున్దాన్ - ప్రవేశించెను. తిరుమాల్ - శ్రియఃపతి, శెన్ఱు - వెళ్ళి, శేర్విడమ్ - వాసముచేయుచున్న స్థానము, కురు - శ్లాఘ్యమై, మా - సుందరమైన, మణి - రత్నములను, ఉన్దు - త్రోయుచున్న, పునల్ - జలముగల, పొన్ని - కావేరియొక్క, తెన్పాల్ - దక్షిణతీరమందున్న, తెన్తిరుప్పేర్ - తెన్ తిరుప్పేరనెడిదివ్యదేశము.

తా॥ నేను తిరుమాలిరుఞ్జోలయని చెప్పినప్పుడే సర్వేశ్వరుఁడు నిరతిశయభోగ్యమైన తిరుప్పేరనువదలి నాహృదయమందుఁ బ్రవేశించెనని. ౧.

పేరేయుఱైగిన్ఱపిరా నిన్ఱువన్దు*
పేరేనెన్ఱెన్నెఞ్జు నిఱైయప్పుగున్దాన్*
కార్యేழ్ కడలేழ் మలైయేழులగుణ్డుమ్*
ఆరావయిఱ్ఱానై యడఙ్గప్పిడిత్తేనే. ౨.

అ॥ పేరే - తిరుప్పేరయందు, ఉఱైగిన్ఱ - నిత్యవాసముచేయుచున్న, పిరాన్ - సర్వేశ్వరుఁడు, ఇన్ఱువన్దు - ఇప్పుడువచ్చి, పేరేనెన్ఱు - ఇఁకనీస్థానమును వదలనని చెప్పి, ఎన్నెఞ్జం - నామనస్సునందు, నిఱైయ - పరిపూర్ణముగా, పుగున్దాన్ - ప్రవేశించెను. కార్యేழ் - సప్తమేఘములను, కడలేழ் - సప్తసాగరములను, మలైయేழ் - సప్తకులాచలములనున్నగల, ఉలగు - లోకములను, ఉణ్డుమ్ - మ్రింగియు, ఆరావయిఱ్ఱానై - పూర్ణముకానియుదరము గలవానిని, అడఙ్గ - (వాఁడు నాయందుఁ బ్రవేశించి) పూర్ణుఁడగునట్లు, పిడిత్తేన్ - ఆశ్రయించి యనుభవించితిని. (వానియొక్కకుక్షికి పూర్ణపాత్రమైతిని).

తా॥ తాను సర్వేశ్వరుఁడైయుండియు నిదివఱకు నన్నులభించనందున యపూర్ణుఁడైయుండి యిప్పుడు నామనస్సులో బ్రవేశించి పూర్ణుఁడయినాడని. ౨.

పిడిత్తేన్ పిఱవికెడుత్తేన్ పిణిశార్యేన్*
మడిత్తేన్ మనైవాழ்క్కైయుళ్ నిఱ్పదోర్మాయైయై*
కొడిక్కోపురమాడఙ్గళ్ శూழ் తిరుప్పేరాన్*
అడిచ్చేర్వదెనక్కెళిదాయినవాఱే. ౩.

అ॥ కొడి - ధ్వజములుగల, కోపురమ్ - గోపురములచేతను, మాడఙ్గళ్ - మేడలచేతను, శూழ் - చుట్టబడిన, తిరుప్పేరాన్ - తిరుప్పేరయందు వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క, అడి - శ్రీపాదములను, శేర్వదు - పొందుట, ఎనక్కు - నాకు, ఎళిదాయినవాఱు - సులభమైన

ప్రకారము (అత్యాశ్చర్యము). (అదేమనగా), పిడిత్తేన్ - (నేనువానిని) ఆశ్రయించితిని; -పిఱవి-సంసారమును, కడుత్తేన్ - పోఁగొట్టితిని, పిణి - వ్యాధులను, శారేన్ - పొందను మత్తై వాழ్ క్కైయుళ్ - సంసారమందు, నిఱ్పదు - నివసించుటకుఁగారణమైన, ఓర్ మాయైయై - గొప్పప్రకృతిని, ముడిత్తేన్ - నివర్తింపఁజేసితిని.

తా॥ నేనాశ్రయించి నాయొక్క సకలదుఃఖములను బోఁగొట్టుకొనునట్లు సర్వేశ్వరుని యొక్క తిరువడికళు సాకల్యముగనులభమైనదని. 3.

ఎళిదాయినవాఱెన్ఱెన్ కణ్గళ్ కళిప్ప*
కళిదాగియశిన్దైయనాయ్ క్కళిక్కిన్ఱేన్*
కిళితావియశోలైగళ్ శూழ் తిరుప్పేరాన్*
తెళిదాగియ శేణ్ విశుమ్బుతరువానే. ౪.

అ॥ ఎళిదాయినవాఱెన్ఱు - ఇట్లుసులభమైనదిః దాయని, ఎన్ కణ్గళ్ - నా నేత్రములు, కళిప్ప - సన్తోషించగా, కళిదాగియ - సన్తోషముగల, శిన్దైయనాయ్ - మనస్సుగలవాఁడనై, కళిక్కిన్ఱేన్ - ఆనన్దించుచున్నాను. కిళితావియ - చిలకలుసంచరించుచున్న, శోలైగళ్ - తోపులచే, శూழ் - వ్యాప్తమైన, తిరుప్పేరాన్ - తిరుప్పేరయందు వేంచేసియున్నవాఁడు, తెళిదాగియ - ప్రకాశించుచున్న, శేణ్ విశుమ్బు - ఉత్తమమైనపరమపదమును, తరువాన్ - ఇచ్చును.

తా॥ నాకు పరమపదమునిచ్చుటకు స్థిరమైయున్న సర్వేశ్వరునియొక్క సౌశీల్యమును జూచి నేనును నానేత్రాదులును మిక్కిలి సన్తోషించితిమని. ౪

వానేతరువాన్ ఎనక్కాయెన్నోడొట్టి*
ఊనేయ్ కురమ్బై యిదనుళ్ పుగున్దు*ఇన్ఱు
తానేతడుమాఱ్ఱవినైగళ్ తవిర్ త్తాన్*
తేనేయ్ పొழிల్ తెన్ తిరుప్పేర్ నగరానే. ౫.

అ॥ తేనేయ్ - తేనెచేతఁబూర్ణమైన, పొழிల్ - తోటలుగల, తెన్ - సుందరమైన, తిరుప్పేర్ నగరాన్ - తిరుప్పేరయందు వేంచేసియున్నవాఁడు, ఎనక్కు - నాకు, వానేతరువానాయ్ - పరమపదమునివ్వవలయునని సఙ్కల్పించి, ఎన్నోడు - నాతో, ఒట్టి - ప్రతిజ్ఞచేసి, ఊనేయ్ - మాంసమయమైన, కురమ్బైయిదనుళ్ - ఈ శరీరమందు, ఇన్ఱు - ఇప్పుడు, తానే - స్వయముగానే, పుగున్దు - ప్రవేశించి, తడుమాఱ్ఱమ్ - అల్లాడించుచున్న, వినైగళ్ - పుణ్యపాపములను, తవిర్ త్తాన్ - పోఁగొట్టెను.

తా॥ తిరుప్పేరయందు వేంచేసియున్నవాఁడు "నీకు శ్రీవైకుణ్ఠమిచ్చెదనని" నాముందఱ ప్రతిజ్ఞజేసి నావిరోధులనుగూడ బోఁగొట్టెనని. ౫.

తిరుప్పేర్ నగరాన్ తిరుమాలిరుఞ్జోలై*
పొరుప్పేయుఱైగిన్ఱపిరాన్ ఇన్ఱువన్దు*
ఇరుప్పేన ఎన్నెఞ్జునిఱైయప్పుగున్దాన్*
విరుప్పేపెఱ్ఱముదమ్మున్డుకళిత్తేనే. ౬.

అ॥ తిరుప్పేర్ నగరాన్ - తిరుప్పేరెయనెడి దివ్యనగరమందు వాసముజేయువాఁడును, తిరుమాలిరుఞ్జోలై - తిరుమాలిరుఞ్జోలయనెడి, పొరుప్పే - పర్వతమందు, ఉఱైకిన్ఱ - వాసము జేయువాఁడునైన, పిరాన్ - సర్వేశ్వరుఁడు, ఇన్ఱువన్దు - ఇప్పుడువచ్చి, ఇరుప్పేనెన్ఱు - (ఇచ్చట) వాసముజేసెదనని, (సఙ్కల్పించి), ఎన్నెఞ్జు - నామనస్సులో, నిఱైయ - పూర్ణముగా, పుగున్దాన్ - ప్రవేశించెను. విరుప్పెశెయ్దు - (వానియుక్క) ప్రీతినిబొంది, అముదమున్దు - (గుణానుభవమనెడి) అమృతమునుభుజించి, కళిత్తేన్ - సన్తోషించితిని.

తా॥ తిరుప్పేర్, తిరుమాలిరుఞ్జోల మొదల గనేకదివ్యదేశములుండగా వానినివదలి నాహృదయమందుఁ బ్రవేశించిన సర్వేశ్వరుని సౌశీల్యమునుజూచి మిక్కిలి సన్తోషించుచున్నానని. ౬.

ఉణ్డుకళిత్తేఱ్కుమ్బరెన్ కుఱై *మేలై
త్తొణ్డుగళిత్తన్దితొழுమ్ శొల్లుప్పెఱ్ఱేన్ *
వణ్డుకళిక్కుమ్పొழிల్ శూழ் తిరుప్పేరాన్ *
కణ్డుకళిప్ప క్కణ్ణుళ్ నిన్ఱగలానే ౭.

అ॥ వణ్డు - తుమ్మెదలు, కళిక్కుమ్ - ఆనన్దించుచున్న, పొழிల్ - తోటలచే, శూழ் - చుట్టఁబడిన, తిరుప్పేరాన్ - తిరుప్పేరయందు నివసించువాఁడు, కణ్డు - (నేను) సేవించి, కళిప్ప - సన్తోషించునట్లు, కణ్ణుళ్ నిన్ఱు - నేత్రమందుండి, అగలాన్ - పోకుండనున్నాడు. ఉణ్డు - అనుభవించి, కళిత్తేఱ్కు - సన్తోషించిననాకు, ఉమ్బర్ - ఇఁకమీఁద, ఎన్ కుఱై - ఏమికొఱతపంభవించును ? మేలైత్తొణ్డు - మేలైనదాస్యము, ఉగళిత్తు - అధికమై, అన్ది - అంతమందు, తొழுమ్ - ఆశ్రయించు (చెప్పు) దగిన, శొల్లు - (నమఃఅనెడి) శబ్దమును, పెఱ్ఱేన్ - (చెప్పుటకు) లభించితిని

తా॥ సర్వేశ్వరుఁడు నానేత్రమందుండి సేవసాదించగా ననుభవించిన నాకిఁకమీఁదనేకొఱతయులేదు. నేను కృతార్థుఁడనైతినని. ౭.

కణ్ణుళ్ నిన్ఱగలాన్ కరుత్తిన్కణ్ పెరియన్ *
ఎణ్ణిల్ నుణ్ పొరుళ్ ఏழிశైయిన్ శువై తానే **
వణ్ణనన్మణిమాడఙ్గళ్ శూழ் తిరుప్పేరాన్ *
తిణ్ణమెన్ మనత్తు ప్పుగున్దాన్ శెఱిన్దిన్దే. ౮.

అ॥ కణ్ణుళ్ నిన్ఱు - నేత్రమందుండి, అగలాన్ - కదలఁడు. కరుత్తిన్కణ్ - (నాకుపరమపద మివ్వవలయుననెడి) అభిప్రాయమందు, పెరియన్ - గొప్పవాఁడు, ఎణ్ణిన్ - (స్వయత్నముచే) తలంచినయెడల, నుణ్ పొరుళ్ - అతిసూక్ష్మముగా, (అగోచరముగా) నుండును. తానే - స్వయము, ఏழிశైయిన్ శువై - సప్తస్వరములయొక్క మాధుర్యమువలె భోగ్యభూతుఁడైయుండును. వణ్ణమ్ - నానావర్ణముగల, నన్ మణి - శ్లాఘ్యమైనమణులచే నిర్మింపఁబడిన, మాడఙ్గళ్ - గృహములచే, శూழ் - వ్యాప్తమైన, తిరుప్పేరాన్ - తిరుప్పేరయందు వేంచేసియుండువాఁడు, ఎన్ మనత్తు - నాహృదయమందు, ఇన్ఱు - ఇప్పుడు, శెఱిన్దు - స్నేహముగలవాఁడై, పుగున్దాన్ - ప్రవేశించెను, తిణ్ణమ్ - నిశ్చయము.

